# శ్రీ శివమహాపురాణము - ①



# శివానుభూతి

డాక్టర్. ముదిగొండ శివప్రసాద్ ఎం.ఎ., పి.హెచ్.డి.

బ్రహ్మశ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారు రచించిన "శ్రీ శివమహాపురాణము" అను తెలుగు వచనగ్రంథము మిక్కిలి ప్రశస్తమైనది. సంస్కృత సాహిత్యములో దీనికి ఎంతో ప్రాధాన్యమున్నది. ఈ శివమహాపురాణము సంస్కృతములో వేదవ్యాసుడు రచించినట్టిది. దానిని ఆంధ్రీకరించిన శ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారి పాండిత్యము కూడా అంతటిదే. నిరంతర ఈశ్వరార్చన కళాశీలతతో అసంఖ్యాక శిష్యగణ పరివేష్ఠితుడై శైవధర్మ ప్రచారార్థము దేశ సంచారము నిరంతరము సాగించెడి శ్రీ నిర్మల శంకరశాస్త్రి అయ్యవారు సాక్షాత్తు శివస్వరూపులు. నేడు మనకు వారి బ్రాహ్మీమయ మూర్తిత్వము మనకీ కృతిలో కనబడుతున్నది.

అష్టాదశపురాణములు : ప్రాచీనకాలములో వేదమొకటే ఉండెడిది. దానిని వర్గీకరించి చతుర్వేద విభాగము నేర్పరచినవాడు కృష్ణద్వైపాయనుడు. అట్లే ప్రాచీన కాలములో పురాణ మొక్కటియే ఉండెడిది. వానిని వర్గీకరించి అష్టాదశ మహాపురాణములుగా విశ్లేషించిన పుణ్యపురుషుడు వేదవ్యాసుడే. మత్స్యపురాణము, మార్కండేయ పురాణము, భాగవత పురాణము, భవిష్యత్పురాణము, బ్రహ్మాండ పురాణము, బ్రాహ్మపురాణము, బ్రహ్మపురాణము, వైవర్తపురాణము, వామన పురాణము, వాయువ్య పురాణము, వైష్ణవపురాణము, వారాహపురాణము అగ్ని పురాణము, నారదపురాణము, పద్మపురాణము, లింగపురాణము, గరుడపురాణము, కూర్మపురాణము, స్కాందపురాణము అనునవి అష్టాదశ పురాణములు. ఇవికాక పదునెనిమిది ఉపపురాణములు కూడ కలవు. అవి ఉశన, కపిల, కాళి, సనత్కుమార, శంభు, సౌర, దౌర్వాస, నందీయ, నారసింహ, నారదీయ, పారాశర, అంగీరస సంహిత, భృగు సంహిత, మారీచ, మానవ వాశిష్ఠ, లింగ, వారుణ పురాణములు అనునవి, అష్టాదశ ఉప పురాణములు. ఈ పురాణములన్నిటిని మనము శ్రద్ధతో పరిశీలించినచో మనకు ఒక విషయము సుస్పష్టము కాగలదు. ఇందు శివ పారమ్యముగల పురాణముల సంఖ్య ఎక్కువ. వాని తర్వాతనే విష్ణు పురాణములు. మిగిలిన ఎనిమిదిలోను వైష్ణవ శాక్తేయాది పురాణములన్నియును కలవు.

శైవము, వేద ప్రతిపాదిత ధర్మము : వేదోపనిషత్తులలో నిరూపింపబడిన పరమ పురుషుడు శివుడు. ఇతడే రుద్రుడనియు, ఈశానుడనియు, లింగస్వరూపుడనియు ఆయా సందర్భములలో చెప్పబడినది. 'శివఏవకేవలః' అని శ్వేతాశ్వతర ఉపనిషత్తు ప్రతిపాదించుచున్నది. శివుడు మాత్రమే పరదైవమనియును ఆతడొక్కడే కలడనియును ఈ మంత్రమున కర్థము.

"యదాతమస్తన్న దివా నరాత్రి ర్నసన్న చాసచ్ఛివ ఏవ కేవలః" అనునది వేదవచనము. సృష్టికి పూర్వము సత్తుకాని, అసత్తుకాని లేదనియును కేవలము శివు డొక్కడే కలడనియును ఈ మంత్రమున కర్థము.

"ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళం ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవై నమోనమః, ఈశాన స్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధి పతిర్బ్రహ్మా శివోమే అస్తు సదా శివోం అను మొదలుగా గల శ్రుతిసంచయము పరబ్రహ్మముగను, నమస్కారాధిపతిగను శివుని నుతించి తృప్తినంది యుండెను.

"ఏకో రుద్రో నద్వితీయాయ తస్థే విశ్వాధికో రుద్రోమహర్షిః 'శివ ఏకో ధ్యేయః' అను మంత్రోప నిషదాదికములగు వాక్యములు రుద్రుని విశ్వాధికునిగ అద్వైతునిగను, ధ్యానయోగ్యునిగ ననేక విధముల ప్రశంసింపుచున్నవి. రుద్రశబ్దార్థమును శివతత్వసుధానిధి ఇట్లు పరిష్కరించినది. 'రుచ్ఛబ్దేన చ సంసార దుఃఖం ద్రావయతి ప్రభుః । రుద్రఇ త్యుచ్యతే వేదైవేద వేదాంత వేదిభిః । రుద్ర ఏవ శివః ప్రోక్తః, రుద్రఏవ సదాశివః, రుద్రఏవ పరంజ్యోతి రుద్రోవా ఏష వాక్యతః !" సంసార దుఃఖమును హరించునాతడు రుద్రుడగుచున్నాడు. ఆతడే పరంజ్యోతియగు శివుడగుచున్నాడని చెప్పుచున్నారు.

శివసంకల్పమస్తు : ఇట్లే యజుర్వేదము పరమేశ్వరుని, పరమ శివుని ప్రస్తుతించుచూ, జీవులకు శివసంకల్పమును ప్రసాదింపవలెనని వక్కాణించినది.

"యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదుసుప్తస్య తథై వైతి
దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మేమనః శివసంకల్పమస్తు.

ఓ దయానిధీ! నీ కృపచేత నా మనస్సు జాగ్రదవస్థలో కడు దవ్వు ప్రసరించుచు దివ్యగుణ యుక్తమై యుండును. నిద్రించు నపుడు నా మనస్సు సుషుప్తిని పొందును. స్వప్నమందు దూరముగా పోయినట్లు వ్యవహరించుచు ప్రకాశకములకు, ప్రకాశకమై ఉన్నది. అట్టి నా మనస్సు శివసంకల్పము, తన కొఱకును, ఇతరుల కొరకును కల్యాణమును సంకల్పించునది అగును గాక. అనగా ఎవరికినీ ఎన్నడును హాని చేయుట కిచ్ఛగింపకుండునుగాక.

"యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞేకృణ్వంతి విదదేషు ధీరాః
యదపూర్వం యక్షమాతః ప్రజానాం తన్మేమనః శివసంకల్పమస్తు"

ఓ సర్వాంతర్యామీ! కర్మమొనర్చు ధర్మయుక్తులగు విద్వాంసులు యజ్ఞమునందును, యుద్ధాదులందును, దేని మూలమున పనిచేయుచున్నారో, ఏది అపూర్వ సామర్థ్యముతో కూడి, పూజనీయమై ప్రజల లోపల నుండునో, అట్టి నా మనస్సు ధర్మము చేయ నిచ్ఛతో కూడి అధర్మమును సర్వధా వదిలి పెట్టును కాక.

"యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతి రంత రమృతం ప్రజాసు
యస్మాన్నఋతే కించన కర్మ క్రియతే తన్మేమనః శివ సంకల్పమస్తు ॥

ఏది ఉత్కృష్ట జ్ఞానమో ఏది యితరులకు చైతన్యము నిచ్చు నిశ్చయాత్మక వృత్తియో ఏది ప్రజలయందు ప్రకాశ యుక్తముగను, నాశరహితముగను ఉండునో, ఏది లేక యెవ్వడు ఏ కార్యమును చేయజాలడో ఆ నా మనస్సు శుద్ధ గుణములను గోరి దుష్టగుణములనుండి దూరముగా నుండు గాక.

"యేనేదం భూతం, భువనం భవిష్యత్పరిగృహీత మమృతేన సర్వం
యేన యజ్ఞస్త్రాయతే సప్తహోతా తన్మే మనః శివస కల్పమస్తు"

ఓ జగదీశ్వరా యోగులందరును దేని మూలమున నీ భూత, భవిష్యద్వర్తమాన వ్యవహారములను అన్నింటినీ తెలియుచున్నారో, ఏది నాశరహితమై జీవాత్మను పరమాత్మతో గూర్చి అన్ని విధముల త్రికాలజ్ఞునిగ చేయుచున్నదో, దేనియందు జ్ఞానక్రియ యున్నదో, దేనియందు పంచ జ్ఞానేంద్రియములు బుద్ధియు ఆత్మతో గూడి యుండునో, యోగరూప యజ్ఞము దేనిచే వర్ధిల్లునో, ఆ నా మనస్సు యోగ విజ్ఞాన యుక్తమై అవిద్యాది క్లేశములనుండి దూరమగును గాక !

"యస్మిన్నృచః సామ యజూగ్ంషి యస్మి న్ప్రతిష్ఠితా రథనా భావి
యస్మిం శ్చిత్తగ్ం సర్వమోతం ప్రజానాం తన్మేమనః శివసంకల్పమస్తు !"

ఓ పరమ విద్వాంసుడవగు పరమేశ్వరా! చక్ర మధ్యమందు అడ్డముగా ఆకులు కూడి యుండినట్లు ఏ నా మనస్సునందు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము ప్రతిష్ఠితములగుచుండునో, దేనియందు సర్వజ్ఞుడను, సర్వవ్యాపకుడును, ప్రజలకు సాక్షియునగు చిత్తచైతన్యుడు విదితుడగునో ఆ నా మనస్సు అవిద్యను బోగొట్టుకొని సదా విద్యా ప్రియమగును గాక.

"సుషారథరశ్వానివ యన్మ సుష్యాన్నే పియలే భిశుభిర్వాజితన ఇవ,
హృత్ప్రతిష్ఠం యదజిరం జనిషం తన్మే మనః శివసంకల్పమస్తు"

ఓ సర్వనియంతవగు ఈశ్వరా! గుర్రములను పగ్గములచేత సారథిత్రిప్పునట్లు ఏది మనుష్యుల నటు నిటను త్రిప్పుచున్నదో ఏది హృదయము నందుండి గలి అత్యంత వేగములు కలిగి ఉండునో ఆ నా మనస్సు సమస్తేంద్రియములను, అధర్మాచరణమునుండి నిరోధించి ధర్మపథముందు సర్వదా నడిపించునట్లు కృపచేయుము.

అగ్నేనయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవవయునాని విద్వాన్
యుయోధ్య స్మజ్జుహు రాణమేనో భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ'

సుఖము నిచ్చువాడవై, స్వప్రకాశ స్వరూపుడవై సర్వజ్ఞుడవగు నో పరమాత్మా ! నీవు మమ్ములను శ్రేష్ఠమార్గమునందు నడిపి సంపూర్ణ ప్రజ్ఞానము నందజేయుము. కుటిల పాపాచరణ మార్గము నుండి మమ్ము దూరము చేయుము. మేము నమ్రతా పూర్వకముగా మిమ్ము స్తుతించు చున్నారము. మమ్ము పవిత్రులను చేయుము.

"మానో మహాంతముత మానో అర్భకం మాన ముక్షంత ముతమాన ఉక్షతం
మానోవధీః పితరం మోత మాతరం మానః ప్రియా స్తన్వోరుద్రరీరిషః"

ఓ రుద్రా ! దుఃఖరూపమగు పాప ఫలములనిచ్చి దుష్టులను నేడ్పించు పరమేశ్వరా ! నీవు మాయందలి చిన్న పెద్దలను, గర్భమును, తలిదండ్రులను, ప్రియులను, బంధువర్గమును, శరీరములను చంపుటకు మమ్ము ప్రేరేపింపకుము. నీ దండమునకు పాత్రులము కాకుండునట్టి మార్గముల మమ్ము నడుపుము.

ఈ విధముగా వేదము శివపారమ్యమును, శివభక్తిని ప్రతిపాదించి ప్రచారము చేసినది.

శైవము – ప్రాచీనత : చారిత్రకముగ పరిశీలించి చూచినను పురాతత్వశాస్త్రవేత్తల పరిశోధనల ననుసరించి విశ్లేషించి చూచినను శైవమే అత్యంత ప్రాచీన మతమని నిర్ధారించ బడినది. భారత దేశములోని మొహంజోదారో, హారప్పా, లోథాల్ మొదలయిన ప్రాంతములలోని భూగర్భ పరిశోధనలలో వెలువడిన పశుపతి నాథుని విగ్రహములు, శివలింగములు శైవముయొక్క ప్రాచీనతను వెల్లడించుచున్నవి. అమెరికాలోని మాయన్ నాగరికతలో బయల్పడినది కూడా శివపూజయే. క్రీస్తుకు పూర్వము కొన్నివేల సంవత్సరములకు ముందే ప్రపంచ వ్యాప్తముగా శివోపాసన జరుగుచుండెడిది. ఈజిప్టులోని నైలునదీ తీరములో శివపూజ చేసెడివారు. ఈ నైలునదికి ప్రాచీన నామము నీలానది. అచటి దైవము పేరు "ఇసిస్". ఇది ఈశ్వర శబ్ధ వికృతి. అచటి నరులకు యూఫ్రటిస్, టైగ్రిస్ అని పేర్లు. వీని ప్రాచీన నామము ఉపరతీశ, త్రిగిరీశ నదులు. ఈ నదీతీరములో నాగరికతవు పేరు మెసపొటేనియన్ నాగరికత. అచట ప్రజల ఉపాస్య దైవము శివుడే.

మక్కాలోని మక్కేశ్వర లింగమును ఆ దేశస్థులు ఖర్జూరపు ఆకులతో పూజించెడివారు. ఈ కారణము చేత ఆ దైవమునకు ఖర్జూరేశ్వరుడు అని కూడా పేరు. ఇట్లే కంపూచియా ఇండోనేషియా, చైనా తూర్పుతీర ద్వీపములయిన సుమిత్ర, జావా, బోర్నియో బర్మా (బ్రహ్మదేశ్) మొదలయిన సమస్త ప్రాంతములలోను వేలాది సంవత్సరములకు పూర్వమే శివపూజ సాగుచున్నట్లు నేటికిని అచటి శివాలయములు, త్రవ్వకములు, సాక్ష్యమిచ్చుచున్నవి.

**జ్యోతిర్లింగములు :** భారతదేశము అనాదిగా శైవమే ప్రధాన మతమని చెప్పియుంటిమి. కాశ్మీరమునుండి, కన్యాకుమారివరకు, అటకము నుండి కటకము వరకు లింగపూజ సాగుచుండెడిది. అనాదిగా భారత దేశములోని ఏకాత్మతను ప్రతిపాదించుచు మొత్తము దేశమును పన్నెండు జ్యోతిర్లింగములు పరచుకొనియున్నవి అవి :- (1) సోమనాధము (2) మల్లికార్జునము (3) మహాకాళము (4) ఓంకారము (5) వైద్యనాధము (6) భీమశంకరలింగము (7) రామేశలింగము (8) నాగేశలింగము (9) విశ్వేశలింగము (10) త్ర్యంబకలింగము (11) కేదారలింగము (12) ఘుశ్మేశలింగము.

ఈ జ్యోతిర్లింగముల యొక్క ఉపలింగముల యొక్క వివరములు నిర్మల శంకర శాస్త్రిగారి ఆరాధ్యులవారిచే అనువదింపబడిన ఈ మహాగ్రంథములో 587 పుటనుండి సుదీర్ఘముగా 662 పుటవరకు అత్యంత సుందరముగా వర్ణింపబడి ఉన్నవి.

**ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము :**

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాధంచ – శ్రీశైలే మల్లిఖార్జునం
ఉజ్జయిన్యాం మహాకాల – మోంకారే పరమేశ్వరం
కేదారం హిమవత్పృష్ఠే – ఢాకిన్యాం భీమశంకరం.
వారణస్యాంచ విశ్వేశం – త్ర్యంబకం గౌతమీ తటే
వైద్యనాథం చితా భూమౌ – నాగేశం దారుకావనే
సేతు బంధేన రామేశం – ఘుశ్మేశం చ శివాలయే.

**ఫలశ్రుతి :**

ద్వాదశైతాని నామాని – ప్రాతరుత్థాయ యఃపఠేత్ ।
సర్వపాపవినిర్ముక్తః సర్వసిద్ధి ఫలం లభేత్ ।
యం, యం కామ మపేక్ష్యచ పఠిష్యంతి నరోత్తమాః
ప్రాప్స్యంతి కామం తం తంహి పరత్రేహ మునీశ్వరాః ॥

(శివశ్రీ నిర్మల శంకర శాస్త్రి కృత శ్రీ శివమహాపురాణము తెలుగు వచనము కోటిరుద్ర సంహితలో ప్రథమాధ్యాయములో ఉదాహృతం 593 పుట)

**ప్రాచీన శైవశాఖలు :** అనాదిగా భారత దేశములోని శైవము దశవిధ భేదములతో ప్రవర్తిల్లినది. వీనిని మరల వింగడించి అయిదు ప్రధాన శైవములుగా శాస్త్రవేత్తలు నిరూపించి ఉన్నారు. అవి (1) అ. శుద్ధశైవము (ఆ) కాశ్మీర శైవము (2) ద్రావిడ శైవము (3) మిశ్రమ శైవము (4) సామాన్య శైవము (5) వీరశైవము.

"శైవము చతుర్విధం ప్రోక్తం
సమాసాచ్ఛృణు షణ్ముఖ
సామాన్యం మిశ్రమం చైవ
శుద్ధం వీరం యథాక్రమం"
(వాతూలాగమము)

**శుద్ధశైవము :** ఇందు పశుపతులు, కాపాలికులు, కాలముఖులు, గోరక్షకనాధులు, రాసేశ్వరులు అను ప్రధాన భేదములు కలవు. క్రీ॥శ॥ పదకొండవ శతాబ్దము నాటికి పాశుపతము ఉత్తరమున రాజస్థానమునుండి దక్షిణమున మైసూరు వరకును, తూర్పున ఆంధ్ర తీరము వరకును వ్యాపించినట్లు కనబడుచున్నది. కాలాముఖులు గుంటూరు ప్రాంతమున ఉన్నట్లు ఆధారము లున్నవి. మిగిలిన వారు ఉత్తర భారత దేశము నందున్నారు. వీరికి అగమ కలాపము నిర్బంధమే కాని లింగధారణ మాత్రము నిర్బంధము లేదు.

**కాశ్మీర శైవము :** దూర్వాసుని ముగ్గురు కొడుకులలో మొదటి యిద్దరి చేత ఇది వ్యాప్తిలోనికి వచ్చినది. వారు త్ర్యంబక అమర్ధకులు. దక్షిణ భారత దేశములో దీని వ్యాప్తి ఎక్కువ కనబడదు. దీని గూర్చి ఆగమములలో ప్రసక్తి కలదు.

**ద్రావిడ శైవము :** దుర్వాసుని మూడవ కొడుకు దీనిని వ్యాప్తి చేసినట్లు తెలియుచున్నది. బౌద్ధ జైన మతములను ఖండించి వాని వ్యాప్తి ఆరికట్టిన వానిలో ద్రావిడ శైవము ప్రధానమైనది. రాధాకృష్ణ పండితుడు, పోప్ పండితుడు, సుబ్రహ్మణ్యం పిళ్లె పండితుడు మొదలగు వారు ద్రావిడ శైవమే అత్యంత ప్రాచీన మయినదని అంగీకరించుచున్నారు. మొదట శైవాగమము లన్నియును తమిళములోనే కలవనియును, ప్రళయములో పోయినవి పోగా మిగిలినవి సంస్కృతము లోనికి అనువదింప బడినవనియు వీరి ప్రతిపాదన.

**మిశ్ర శైవము :** హిందువులలో అధిక భాగము మిశ్రశైవులు. వీరు అన్ని దైవములను ఆరాధించెదరు కాని శివుని మీద ప్రేమ ఎక్కువ. భస్మధారణ, శివారాధనతో పాటు పంచాయతనక పూజ జరుపుదురు. పంచాయతనములలో మధ్య శివుని ఉంచెదరు. వారి పూజా ప్రణాళిక ఇట్లుండును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| శం | : శంకరుడు | నా | | ర |
| నా | : నారాయణుడు | | శం | |
| ర | : రవి | దే | | గ |
| గ | : గణపతి | | | |
| దే | : దేవి | | | |

**సామాన్య శైవము :** వీరు శివుని పరమ దైవముగా అంగీకరించెదరు కాని ఆగమవిహితమయిన సమస్త ఆచారములను అనుసరించరు. లింగధారణము ఉండదు.

**వీర శైవము :** బసవేశ్వరునితోనే వీరశైవము ప్రారంభమయినట్లు చెప్పబడుచున్నది. కాని బసవేశ్వరుడు చెప్పిన పద్ధతిలో చెప్పనప్పటికీ దీని ప్రసక్తి ప్రాచీనమయిన వాతూల వీరాగములలో గలదు. దేహములోని అయిదు ప్రదేశములలో (జటాజూటము, కంఠము ఇత్యాదులు) ఒక చోట లింగధారణ చేయవలెను. నిత్యము లింగమును హస్తములో ఉంచుకొని పూజ చేయవలెను. శివ నివేదన కాని పదార్థము పరిహార్యము. దీక్షాసంస్కారము వీరశైవులకు ముఖ్యమయినది. వర్ణాశ్రమ ధర్మములను వీరు పాటించరు. వేదములు కాక

ఆగమములే ప్రామాణ్యములు. బసవనిచే ఉద్ధారితమైన ఈ శైవమును జంగమ శైవము లేదా వీరశైవమను పేర్లతో వ్యవహరించుచున్నారు.

ఇట్లు శైవము అనేక అవాంతర భేదములతో అనాదిగా విలసిల్లుతూ వచ్చినది.

శ్రౌత శైవము : దీనినే ఆరాధ్యశైవమనియు, పాశుపత శైవమనియును పిలుచుచున్నారు. వర్ణాశ్రమ వ్యవస్థను అంగీకరించుచూ, వేదప్రామాణ్యమును స్వీకరించుచూ, ఆగమములను కూడా అనుసరించుచూ లింగధారణావిధిని గ్రహించినవారు ఆరాధ్యశైవులు. అనాదిగ ఈ శైవమతమును శ్రీకంఠాచార్యుడను నామాంతరము కల నీలకంఠ శివాచార్యులు మొదలయిన జగద్గురువులు ప్రతిపాదించి పోషించిరి. శక్తివిశిష్ట శివాద్వైత పరమగు శ్రీకంఠ భాష్యమును నీలకంఠ శివాచార్యులే రచించిరి. ఈ శైవమతము ద్వాదశారాధ్యులతో విశ్వవిఖ్యాత మయినది. అత్యంత ప్రాచీన కాలములో, ఆయా యుగములో శైవమును వీరు వ్యాప్తి చేసినట్లు చెప్పబడుచున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| 1. వీర | ఏకాక్షర | ఏకవక్త్ర | రేణుక | రేవణసిద్ధ |
| 2. నంది | ద్వ్యక్షర | ద్వివక్త్ర | దారుక | మరుళసిద్ధ |
| 3. భృగు | త్ర్యక్షర | త్రివక్త్ర | గజకర్ణ | ఏకోరామ |
| 4. వృష | చతురక్షర | చతుర్వక్త్ర | ఘంటాకర్ణ | పండితారాధ్య |
| 5. స్కంధ | పంచాక్షర | పంచవక్త్ర | విశ్వకర్ణ | విశ్వారాధ్య |

శైవ సిద్ధాంతము : శైవసిద్ధాంతము ఇట్టిదట్టిదని చెప్పుటకు వలను పడదని పండితులు నుడువుచున్నారు. శివాగమములందు "పతిః, పాశః, పశుశ్చేతి, పదార్థ త్రితయంమంతం" అని ద్వైతమే సిద్ధాంతము చేయబడి ఉన్నది. పతి అనగా శివుడు. పాశ మనగా బంధము. అది ప్రకృతి. పశువనగా జీవుడు. దీనిని బట్టి శ్రీమల్లికార్జున పండితారాధ్యులవారు తమ శివతత్వ సారమునందును శ్రీహరదత్తాచార్యులవారు శ్రుతిసూక్తి మాలయందును అద్వైతమును ఖండించి ద్వైతమునే సిద్ధాంతము చేసి ఉన్నారు.

క॥ తనకంటె వేరె ఈశ్వరు
డన లేదని పలుకునట్టి అద్వైత విమూ
ఢునకును లోకాయతునకు
వినగా భేదమ్ము గలదె విష్ణువరేణ్యా !

క॥ అద్వైతైక స్థితి నీ
యద్వైతమకాన ఈశ్వరా ద్వైతమున
ర్వాద్వైత మనగ వేరు జ
గద్వి పరీతమగు తత్త్వగతి కలదె శివా !

(శివతత్వసారము – శ్రీమల్లికార్జున పండితారాధ్యకృతము)

దీనిని బట్టి ప్రాచీన శైవాచార్యులు ద్వైతమును సమ్మతించినట్లు స్పష్టమగుచున్నది.

ఇట్లుగాక శివపారమ్యమును బోధించెడి కొన్ని పురాణములలో అద్వైతము కనబడుచున్నది. ప్రభులింగలీల మొదలయిన గ్రంథములు ఇందుల కుదాహరణములు. దీనిని బట్టి ప్రాచీన శైవాచార్యులలో కొందరు అనుభవా ద్వైతము నందభిరుచి కలిగి ఉన్నారని చెప్పవలసి ఉన్నది.

కాగా శ్రీ శ్రీకంఠశివాచార్య నామాంతరు లయిన నీలకంఠ శివాచార్యులవవారు తమ బ్రహ్మసూత్ర భాష్యమునందు "విశిష్టాద్వైతం సాధయిష్యామః" అని విశిష్టాద్వైతమును నిరూపించి ఉన్నారు. దీనిని బట్టి శైవులలో విశిష్టాద్వైత సిద్ధాంతమును కూడా ప్రాచీనులు అభిమానించినట్లు స్పష్టము.

ఇది ఇట్లుండగా ఆధునిక యుగములో శైవ మతమునకు అత్యంత ప్రామాణికులయిన మహా మహోపాధ్యాయ శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు ఆరాధ్యశైవుల సిద్ధాంతము శివాద్వైతమే యని స్పష్టీకరించియున్నారు. వారి దృష్టిలో మల్లికార్జున పండితుడు ప్రతిపాదించినదియును శివాద్వైతమేనని వివరణము.

ప్రశ్నోత్తర రూపములో వారు తమ సిద్ధాంతము నిట్లు ప్రతిపాదించినారు.

ప్రశ్న : శివాద్వైతమని పేరేల పెట్టవలెను? కేవల మద్వైతమనిన చాలదా?

ఉత్తరము : చాలదు. అది ఏలన, శుద్ధాద్వైతము శ్రీ మల్లికార్జున పండిత శ్రీ హరదత్తాదులచే ఖండించబడి ఉన్నది. కాన అది శైవుల సిద్ధాంతము కాదు. కావున శైవాద్వైతమే శైవుల సిద్ధాంతమని అంగీకరించవలయు.

ప్రశ్న : ప్రభు లింగలీల యందును, మరి కొన్ని శైవమత గ్రంథముల యందును శుద్ధాద్వైతము నిరూపింపబడి ఉండగా అది శైవుల సిద్ధాంత మెట్లు గాదు?

ఉత్తరము : శైవమత గ్రంథములందున చెప్పబడినది శివాద్వైతమే, అట్లుకాక కొన్నిచోట్ల శుద్ధాద్వైత సిద్ధాంతము ప్రతిపాదింపబడి యున్నను అది శైవ పూర్వాచార్యులచే ఖండింపబడి ఉన్నది గాన శైవుల సిద్ధాంతమని అంగీకరింపకూడదు.

ప్రశ్న : శైవమత గ్రంథములందు కొన్నిచోట్ల శుద్ధాద్వైతమును నిబంధించినవారును శైవ పూర్వాచార్యులే గాన వీరియందు విశ్వాసముంచి శుద్ధాద్వైతమును ఏల గ్రహించ కూడదు?

ఉత్తరము : శుద్ధాద్వైతమును కొన్ని గ్రంథముల యందు శైవ పూర్వాచార్యులే నిబంధించి యుందురుగాక. అయిననూ శైవమత ప్రతిష్ఠాపనా పరమాచార్యులగు శ్రీ నీలకంఠాచార్య, శ్రీ హరదత్తాచార్య శ్రీ మల్లికార్జున పండిత ప్రభృతులు శుద్ధాద్వైతమును నిరాకరించి యున్నప్పుడు దానిని స్వసిద్ధాంతముగా గ్రహించకూడదు.

ప్రశ్న : శుద్ధాద్వైతమును నిరూపించినవారే శైవమత ప్రతిష్ఠాపకులని ఏల గ్రహించకూడదు?

ఉత్తరము : శుద్ధాద్వైతమును నిరూపించినవారు మధ్యకాలికులు. శివ పురాణములలో కొన్నిటియందు శుద్ధాద్వైతము కలదని దానినే నమ్మి వారు తమ గ్రంథములయందు చెప్పియుండ వచ్చును. అట్లుకాక అద్వైత బోధ లోకమంతయు నిండి సర్వమతస్థులను ఆవరించి యున్నది గాన మధ్య కాలికులు కొందరు అద్వైతానుభవమున ఆసక్తిగలవారై యుండి అద్దానిని తమ గ్రంథములయందు చేర్చినను చేర్చియుండ వచ్చును. అంతమాత్రమున వీరి వాక్యములనే నమ్మి శైవమత మూలాచార్యులు చేసిన సిద్ధాంతమును త్రోసివేయ నగునా? కూడదు.

ప్రశ్న : అట్లని వీరి గ్రంథముల ప్రమాణములుగా నెట్లు తీసుకొనవచ్చును?

ఉత్తరము : కడమ యంశముల యందు ప్రమాణములుగా బాగుగా గ్రహించవచ్చును.

ప్రశ్న : అది ఎట్లు? ఇది అర్థ జరతీ న్యాయము కాదా?

ఉత్తరము : అది ఎట్లనిన అపస్తంబుడు, అశ్వలాయనుడు మొదలగు ఋషులందరు ద్వైతమును సిద్ధాంతము చేసి, అద్వైతమును ఖండించి యున్నారు. అయినను అద్వైత మతస్థులు ద్వైత సిద్ధాంతాంశమున వారి గ్రంథముల యందు ప్రామాణ్యబుద్ధి లేకున్నను కర్మములను చెప్పు తక్కిన అంశములయందు ప్రామాణ్యబుద్ధి లేకుండునెడ బ్రాహ్మణ్యమునకే హాని వచ్చునని యెంచి ఆ అంశమున పరమ ప్రామాణ్య బుద్ధి నుంచియే యున్నారు. అట్లే మధ్యకాలికులు చేసిన శైవమత గ్రంథముల యందును శుద్ధాద్వైతమును నిరూపించిన చోట అప్రామాణ్యంబును కడమ అంశములందు పరమ ప్రామాణ్యంబును నుంచిన ఏమి బాధకము? ఏమియు బాధకము లేదు.

ప్రశ్న : ద్వైతా ద్వైతమే శైవుల సిద్ధాంతమని ఏల గ్రహించ కూడదు?

ఉత్తరము : పూర్వాచార్యులట్లు తెలిపి యుండిన బాగుగ గ్రహింపవచ్చును. పూర్వాచార్యులే గ్రంథము నందును ద్వైతా ద్వైతమును సిద్ధాంతము చేసి యుండలేదు. ద్వైతా ద్వైతము శైవుల సిద్ధాంత మనియు చెప్పియుండలేదు. కావున ద్వైతా ద్వైతము శైవుల సిద్ధాంతము కాదు.

ప్రశ్న : అదియేమి? శ్రీపతి పండితస్వాములవారు శ్రీకర భాష్యమున ద్వైతా ద్వైతమును సిద్ధాంతముచేసి యుండిరి కాదా?

ఉత్తరము : శ్రీకర భాష్యమున ద్వైతా ద్వైతము కలదన్నమాట నిజమే అయిననూ ఆ భాష్యము పేరుగాని దాని యందగు ద్వైతా ద్వైత సిద్ధాంతము పేరు కాని పూర్వచార్యులలో ఒక్కరిచేనైన ఒక్కచోనైన ఉదాహరింపబడి యుండని కారణమునను, దోష భూయిష్టమును బట్టియు, అనభ్యస్తమగు శైలిని బట్టియు ఆ భాష్యము కేవలము నవీనమని నిరూపింపబడియున్నది. కాన దానిలోనిదగు ద్వైతా ద్వైత సిద్ధాంతము శైవుల సిద్ధాంత మనుట సమంజసము గాదు. శైవ సంఘమునకు కీర్తిదాయకంబును కాదు.

ప్రశ్న : శైవుల సిద్ధాంతము శివాద్వైతమని మాత్రము పూర్వీకులలో నెవ్వరు చెప్పిరి? క్రొత్తగ మీరిప్పుడు పేరుపెట్టిన ఎవ్వరంగీకరింతురు?

ఉత్తరము : శైవుల సిద్ధాంతమునకు శివాద్వైతమను పేరు మేము పెట్టినది కాదు. సిద్ధాంత శిఖామణి మా మాదల వీరభద్ర సుధీ రచితమయిన హైయంగవీన వ్యాఖ్యానమునందు శ్లో ॥ శివాగమై శ్శివాద్వైత రసాస్వైకైః పారమార్థః । కథ్యం శివసిద్ధాంత తంత్రం షట్స్థల నిర్ణయం ॥ అని కలదు.

శ్లో ॥ శివాద్వైత పరిజ్ఞాన పరమానంద బోధితం. ౬ పర

ఇది మొదలుగా శైవ సిద్ధాంత గ్రంథములయందు శైవుల సిద్ధాంతము శివాద్వైతమని వ్యవహరింపబడి యున్నది. దానింబట్టి ప్రాచీనులు శివాద్వైత కల్పలతిక ఈ మొదలగు గ్రంథములయందు శైవుల సిద్ధాంతము శివాద్వైతమని నిర్ణయించి యున్నారు. దానింబట్టి మధ్యకాలికులును, విద్వత్కవీంద్రులనైన శ్రీ ములుగుపావ యారాధ్యుల వారును "పరమ శివాద్వైత పండితుండ" అని వ్రాసికొని యున్నారు. కావున శైవుల సిద్ధాంతము శివాద్వైతమనుట పూర్వాచార్యుల సమ్మతమే.

(శ్రీ మహామహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు - శైవమత ప్రకాశిక - బహుధాన్య నామ సంవత్సర చైత్రవైశాఖమాసములు 6 - 9 పుటలు.)

శక్తివిశిష్టాద్వైతము : శైవసిద్ధాంతము శక్తి విశిష్ట శివాద్వైతమేనని ప్రాచీన శివాచార్యులు నిర్ణయించియున్నారు. శ్రీకాళహస్తి దీక్షితులు తమ కృతిలో ఈ విషయమును స్పష్టీకరించియున్నారు. (1) విశిష్టశివాద్వైతము (2) విశేషాద్వైతము (3) శక్తివిశిష్టశివాద్వైతము (4) శివాద్వైతము అని పేర్లు గలవు. మహాపశుపత ధర్మబద్ధమైన ఈ సిద్ధాంతము ఇట్లు చెప్పబడినది.

"నిఖిల సంసార దోషరహితమై మాంగళ్య గుణాధార భూతమైనదియే బ్రహ్మము. అట్టి బ్రహ్మమే జగమునకు నిమిత్తోపాదాన కారణములగును. సూక్ష్మ చిద చిత్తులతో కూడిన బ్రహ్మము కారణంబును, స్థూల చిద చిత్తులతో కూడిన బ్రహ్మము కార్యంబునగును. పరాశక్తిచేత చేతనా చేతనమయిన ప్రపంచమయి యున్నది. అట్టి పరాశక్తి కలిగిన పరమేశ్వరు డొక్కడే యుండుననునది విశిష్టాద్వైత మనబడుచున్నది. నీలకంఠుని సూత్రభాష్యమునందలి భక్త్యాధిపత్య అధికరణమున "చిదచిత్ప్రపంచ విశిష్ట శ్శివ ఏవ అద్వితీయః కారణం కార్యంచ భవతీతి విశిష్ట శివాద్వైతం" అను దానిని బట్టియు అవంతర వివక్షితమగు విశిష్టా ద్వైతమను వాక్య హానిని గూర్చిన పూర్వ పక్షమునెడ నొనర్చిన సిద్ధాంతమును బట్టియు విశిష్ట శివాద్వైతమనినను, విశిష్టాద్వైతమనిన నొక్కటిగనే నిశ్చితమగుచున్నది. "నిరస్త సమస్త కళంకం నిఖిల మాంగళ్య గుణాధార భూతం బ్రహ్మ ఏవ జగతోఽభిన్న నిమిత్తో పాదాన కారణం సూక్ష్మ చిదచిద్వి శిష్టం బ్రహ్మ కారణం స్థూల చిదచిద్విశిష్టం బ్రహ్మ కార్యం ఇదంహి జగత్ పరమేశితుః శరీరం, ఏవం చిదచిత్ప్రపంచక పరశక్తి విశిష్టా ద్వితీయ వైభవః పరమేశ్వరః"

(1)జగత్తు (2) జీవుడు (3) ఈశ్వరుడు; ఈ సిద్ధాంతములో (1) పాశము (2) పశువు (3) పశుపతి అని వ్యవహరింపబడుదురు. శక్త్యాది చపృధివ్యంతం శివతత్వ సముద్భవం - మాయాంతు ప్రకృతిం వింద్యాన్మాయినంతు మహేశ్వరం - శివేన నవినాశక్తిః - ఉమా సహాయం పరమేశ్వరం - పరాశక్తి మిత్రం" మొదలగు శాస్త్ర వచనముల శక్తి విశిష్టాద్వైత వైభవ ప్రకటనకు నిర్దుష్టములగు రచనలుగా యున్నవి. అగ్నియందు దాహక శక్తివలె శివుని యందు అణగియుండి తదాజ్ఞ ననుసరించి చిదచిదాత్మకముగ పరిణామ మొందెడి ప్రపంచ శక్తితో కూడి శివుడొక్కడే యుండెను. తదుపాసనాలబ్ధ జ్ఞానులగు జీవులు భ్రమర కీటక న్యాయమున జీవభావనివృత్తి ద్వారా పరమేశ్వరునితో సామీప్య సాయుజ్యములనొంది నాతనితో కలసి సర్వ భోగముల ననుభవించు చుందురు. శివజీవులు వేరు వేరుగ ఉన్ననూ "సోశ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విపశ్చితేతి" "భోగమాత్ర సామ్యలింగాచ్చ", శివునితో సర్వజీవులు అనుభవింపు చుందురనుటకు ముక్తికి భోగమాత్ర సామ్యమే నిర్ణయమగుటను జీవు డాతని సామీప్య సాయుజ్యములు కలవాడై ఆనంద మొందుచూ పునరావృత్తి లేనివాడై ఉండును. సాయుజ్యమున, సహయుంజ్ఞ ఇతి సయుజో యజుర్యోగే యితి ధాతో సత్సూ దిశేషేత్యాది నాక్విన్" తయోర్భావఃసాయుజ్యం అను వ్యుత్పత్తిని బట్టి కూడ నున్నవారను అర్థ మేర్పడుచున్నది. శివ సిద్ధాంత దీపికయందు 'అణవము, కార్మికము - మాయాయము - బైందవము రోధశక్తి అను అయిదు పాశములనుండి ముక్తుడై పరమేశ్వరుని వలె సర్వజ్ఞత్వము, నిత్యతృప్తత్వము, అనాది సిద్ధ బోధిత్వము, స్వతంత్రత్వము, అలుప్త శక్తిత్వము అనంత శక్తి యుక్తత్వమను షడ్గుణైశ్వర్యములతో కూడి పరమ శివుని సామీప్యమును సాయుజ్యమును ముక్తుడొందుననియు పంచకృత్యాది కారముల పరమేశ్వరుడే జీవకోటి ననుగ్రహించుననియు వచింపబడినది. "నిరంతరం శివోహమితి భావనాస్ర వాహేణ శిథిలిత పాశతయావగత పశుభావ ఉపాసకశ్శివ ఏవ భవతి ।" అను నీలకంఠ వచనము ఉపాసకుడు శివోహంభావనయా ఉపాసనము చేయవలయునని విధించుచున్నది. కానజీవ బ్రహ్మైక్యపదము ఉపాసనా పరముగా ఉండవలెను. లింగైక్యమనుట శివాద్వైతమను దాని యందును సంభావితమగుచున్నది.

శ్రీ శివమహాపురాణము : శైవసిద్ధాంత ప్రతిపాదితమైన ఈ శివమహాపురాణము విద్యేశ్వర సంహిత, రుద్రసంహిత, శతరుద్రసంహిత, కోటిరుద్రసంహిత, ఉమాసంహిత, కైలాస సంహిత, వాయవీయ సంహిత అను సప్త సంహితలతో కూడిన గ్రంథము. ఇందు శివభక్తి ప్రబోధాత్మకమగు లెక్క లేనన్ని కథలు కలవు. వానితో బాటు శివుని 88 అవతారములను వివరముగా వర్ణించిన విశేషములు గలవు. ద్వాదశ జ్యోతిర్లింగములను గూర్చియు, వాని మహిమలను గూర్చియు ఈ పురాణములో విస్తరింపబడి యున్నది. ఈ విషయములే కాక సృష్టిస్థితిలయముల స్వరూపము (కాస్మాలజీ) దేహోత్పత్తి, స్థితివినాశములు ఇత్యాది ప్రకృతి సంబంధమయిన శాస్త్ర రహస్యములు వివరించబడినవి. గురు లింగ జంగమ మాహాత్మ్యము, శాంభవీ దీక్షావివరములు, శివ పంచాక్షరీ ప్రాశస్త్యము ఇత్యాది విషయములు విపులీకరించబడియున్నవి. వీనితో పాటు అసంఖ్యాక తాత్విక విషయములు శాస్త్ర విషయములు ఆయా సందర్భముల ననుసరించి విస్తరింపబడి యున్నాయి.

పురాణము కథా ప్రధానమయినది. అందు ఇతివృత్తమునకు ప్రాధాన్య మెక్కువ. రసవంతమయినప్పటికినీ అలంకార రచన గౌణము. ఈ కారణము చేత శివమహాపురాణము పండితులనక, పామరులనక, బాలురనక, వృద్ధులనక అబాల గోపాలమునకును చవులూరించెడి మధుర కథా సంహితగా రూపొందించినది.

ఒక విధముగా పరిశీలించి చూచినచో మన పురాణములే మన చరిత్రలు. అత్యుక్తులను, అల్పోక్తులను తొలిగించినచో అష్టాదశ పురాణముల నాధారముగా చేసుకొని ప్రాచీన భరతదేశ చరిత్రను సమగ్రముగా నిర్మింప వచ్చును. అట్టి ప్రయత్నము లోగడ కొందరు చేసిరి.

పౌరాణిక గాథలు సంకేత ప్రధానమైనవి. లింగము, అర్ధనారీశ్వరత్వము, కామదహనము, దక్షాధ్వర ధ్వంసము, నటరాజ విశ్వతాండవము ఇత్యాది సమస్త విషయములును కొన్ని భావములకు సంకేతములు. ఈ సంకేత శాస్త్రము మన దేశములో లుప్తమైనది. శ్రీ శివ మహాపురాణముతో పాటు సమస్త పురాణములకును సంకేతశాస్త్ర పరమైన వ్యాఖ్యానము చెప్పుటకు మరొక నిర్మల శంకర శాస్త్రి అరాధ్యులవంటి ఉద్దండ పండితుల అవశ్యక మెంతేని ఉన్నది.

అనువాద విధానము : బ్రహ్మశ్రీ నిర్మల శంకరశాస్త్రి అయ్యవారు సంస్కృతాంధ్ర భాషలను అపోసన బట్టిన కుంభ సంభవులు. వారి పాండిత్య మెంతటి తీవ్రమైనదో, అనువాద విధాన మంతటి సరళమైనది. ఐతిహాసిక సారళ్యమును (ఎపిక్ సింప్లిసిటీ) వారు తమ రచనా విధానములో పాటించిరి. భాష సరళగ్రాంధికము. క్రియా రూపములే గ్రాంధికముకాని భాష వ్యావహారికమునకు అత్యంత సన్నిహితముగా నున్నది. రుద్ర సంహితలో శివ కళ్యాణ ఘట్టమును అష్టత్రింశాధ్యాయములో విశ్వకర్మ పార్వతీ పరమేశ్వరుల వివాహమునకై 'కళ్యాణ మండపము'ను రచించెడి సందర్భములో శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారి వచన రచన ఉదాహరణ ప్రాయముగా చూచినచో గ్రంథమంతయును ఎంతటి సరళముగా, సుమధుర సుందరముగా రసస్ఫూర్తిలో అనువదించినారో మనకు సువ్యక్తము కాగలదు.

"పర్వతాధిపతియగు హిమవంతుడు ఆనందపరిపూర్ణుడై తన నగరము నంతయు శోభాయమాన మొనర్చెను. ఘంటాపథములన్నియు పన్నీరుతో చల్లబడినవి. ప్రతి ద్వారమునందును అరటి ద్వారములు కట్టబడి యుండెను. ముంగిళ్లయందు పట్టుదారములకు మామిడి యిగురులు తగిలింపబడినవి. నలు దిశలయందు జాజిపువ్వుల మాలికలు తోరణము లమర్చబడియుండెను. గర్గమహాముని అనుమతిని పురమును ప్రస్తావగోగ్యముగా మంగళమయం బొనర్చెను.

విశ్వకర్మను రప్పించి పదివేల యోజనముల వెడల్పును, నిడివియుగల మండపమును రచింప జేసెను. అందు శుభ ప్రవేశములకై స్ఫటిక మయములగు వేదికలును; ఆశ్చర్య కరములయిన దృశ్యములును, స్థిరములు చరముల తగు మనోహర వస్తువులును నిర్మింపబడి యుండెను. మరియు నందు జలమెద్దియో, స్థలమెద్దియో తెలియరాకుండెను. ఒకా నొకచో కృత్రిమ సింహములు ప్రత్యక్షసింహములవలె కన్పట్టు చుండెను.

"హిమవంతుడు పంపిన శుభ పత్రికను స్వీకరించి పత్రిక నిచ్చిన వారిని సత్కరించియు, మహాదేవుడు నిందు సంతసంబున అట్టహాసము చేసియు పెండ్లి పత్రికను బాగుగా చదువుకొనెను:

అట్టితతి మునులు తాము సమర్పించిన పత్రికను పరాత్పరుడు పరిగ్రహించి వివాహము నంగీకరించినందున తమ భాగ్యమును మెచ్చుకొనుచు నిజ నివాసమునకు జనినవారు.

అంత శివుడు స్మరింపగా నారదుడేతెంచి ప్రణమిల్లి కర్తవ్యము నాదేశింపుమని ప్రార్థింపగా శంకరు డిట్లు మాటలాడెను.

నారదా! నా భక్తులలో శ్రేష్ఠుడవని భావించి చెప్పుచున్నాను. వినుము! పార్వతీదేవి నీ యుపదేశమును పొంది నన్ను భర్తగా బడయవలయునని తపించిన యంశము నీకు తెలిసినదే కదా! ఆమెకు నేను ప్రసన్నుడనై వర మొసంగితిని. భక్తికి వశుడనై సప్తర్షులచే లగ్న సుముహూర్తమును కూడా నిర్ణయింప చేసితిని. లౌకిక రీతిననుసరించి వివాహ మహోత్సవమును ఆచరింప చేయుదును. ఈ వేళనుండి ఏడవ దినముననే సుముహూర్తము." (శ్రీ శివమహాపురాణము శివవిజ్ఞాన సర్వస్వమను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములో ముప్పది ఎనిమిదవ, ముప్పది తొమ్మిదవ అధ్యాయములు 281 – 283 పుటలు).

గ్రంథమంతయును ఇట్లే ఆపాత మధురమయిన శైలితో కళ్యాణ సుందరముగా సాగినది. ఆంధ్రానువాదమునకు శివశ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు పెట్టిన నామము శివవిజ్ఞాన సర్వస్వమని, (ఎన్‌సైక్లోపేడియా) శైవధర్మమునకు సంబంధించిన సమస్త విషయములతో కూడిన సహస్రాధిక సంఖ్యగల ఈ మహాగ్రంథము శైవవిజ్ఞాన సర్వస్వమనుట, అత్యుక్తి కాదు. సహజోక్తియే. మరొక్క మాట చెప్పి ఈ పీఠికను ముగింతును. దేశములో ఎందరు వ్యాపారస్థులు లేరు? ఎందరు గ్రంథ ప్రచురణకర్తలు లేరు? కాని సాహిత్యోద్ధరణ కొరకై వావిళ్ళవారు జన్మించినారా యన్నట్లు శైవధర్మోద్ధరణకు తోడ్పడెడి గ్రంథ ముద్రణము కొరకై శ్రీ పబ్బా శంకరయ్యగారు అవతరించినారా – అనిపించును. ఆయన మహాభక్తుడు. ఈ గ్రంథమును రచింపించుటయు, ముద్రించియు, ప్రచారములోనికి తెచ్చుటయు వారి శివపూజలో నొక భాగమేనని చెప్పవచ్చును. కావున ఈశ్వరుడు గ్రంథకర్తకు ప్రచురణ కర్తకు పఠితులైన భక్తమహాశయులకును ఆయురారోగ్య ఐశ్వర్యముల నొసంగవలయునని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

శివశరణుడు

డాక్టర్. ముదిగొండ శివప్రసాద్
ఎం.ఎ., పి.హెచ్.డి.
రీడర్, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

2-2-647/132 B, " (శ్రీవిద్య) "
సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ,
హైదరాబాదు – 13.

* రెండవ ముద్రణ రీత్యా పుటలు యొక్క సంఖ్యలు మారినవి. కావున విషయసూచికను అనుసరించగలరు.

# ప్రవేశకము

కళాప్రపూర్ణ

డాక్టర్. దివాకర్ల వేంకటావధాని యం.ఏ.(ఆనర్సు) పి.హెచ్.డి.

శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారు రచించిన ఆంధ్రవచన శివమహాపురాణము నందందు పరమాదరముతో పఠించి ఆనందించితిని. శ్రీ ఆరాధ్యులవారు శైవవాఙ్మయ సాగర కుంభ సంభవులు; బహుగ్రంథ రచయితలు, పండిత ప్రకాండులు, కవి పుంగవులు, ఆరాధ్య శబ్దమున కన్వర్థత్వము కల్పించిన పూజనీయులు. ఇంక నీ గ్రంథ రచనమును ప్రేరేచినవారు శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారును కీ॥శే॥ నీలరాజయ్య శ్రేష్ఠిగారును. శ్రీ రాజయ్య శ్రేష్ఠిగారిని నేనెఱుగను. వారు తాము ప్రేరేచిన గ్రంథము ముద్రణ రూపము నొందక ముందే శివసాయుజ్యము నొందియుండిరి. అందుచే ముద్రణ భారమంతయు శ్రీ శంకరయ్య శ్రేష్ఠిగారే వహింపవలసి వచ్చినది. కాని వారు దీని నొక భారముగా భావింపరు. వారి దైవ బ్రాహ్మణ భక్తియు - అందును శివభక్తియు నపారములు. ఆ భక్తి ప్రేరకముగా వారు అధ్యాత్మిక భక్తి పూరిత గ్రంథముల నెన్నింటినో ముద్రించి "స్వయంతీర్ణః పరాం స్తారయతి" ను సూక్తికి పాత్రులు కాజాలిరి. వారి భక్తి సంపదయే వారికి మనఃశాంతియు ఆయురారోగ్యైశ్వర్యములను సమకూర్చునని నా విశ్వాసము. భక్తుల యోగ క్షేమములను భగవంతుడే వహించుననుటకు పెక్కు నిదర్శనము లున్నవి.

అష్టాదశ మహాపురాణములు జగత్ప్రసిద్ధములు. పురాణ సంఖ్యను పెంచిన వారుకూడ కొందఱు కలరు. కాని అష్టాదశ సంఖ్యయే బహు పండితాంగీకారము నొందినది. "మద్వయం భద్వయం చైవ" అను దేవీ భాగవత ప్రోక్త శ్లోకమున శివపురాణమును సూచించు నక్షరము లేదు. వచతుష్టయముచే విష్ణువాయు వరాహ వామన పురాణములు సూచింపబడుచున్నవి. స్కాందపురాణము శివపురాణమును నాల్గవ పురాణముగను బ్రహ్మాండ పురాణమునకు బదులు వాయవ్య పురాణమును పదునెనిమిదవ పురాణముగను తెల్పినది. మత్స్య పురాణము నందలి

యత్రతద్వాయవీయం స్యాద్రుద్ర మాహాత్మ్య సంయుతమ్
చతుర్వింశ సహస్రాణి పురాణం శైవముచ్యతే

అను శ్లోకము వలన వాయు పురాణము రుద్రమాహాత్మ్య సంయుతమనియు, 24 వేల శ్లోకము లందున్నవనియు, అది శైవ పురాణమని చెప్పబడుచున్నదనియు తెలియుచున్నది. కొన్ని ప్రతులందు "ఇతి వాయు పురాణం శివాపరాహ్వయం సమాప్త" మ్మను వాక్యము కనవచ్చుచున్నది. దీనిని బట్టి కొందఱు పండితులు వాయు శివపురాణము లభిన్నములని నిశ్చయించిరి. భాగవతము "బ్రాహ్మంపాద్మం వైష్ణవం శైవం లైంగం చ గారుడ" మ్మని వాయు పురాణమును పేర్కొనక శైవపురాణమునే పేర్కొనుచున్నది. ఇది మహాపురాణములలో నాల్గవది.

పురాణ శబ్దమున కనేక నిర్వచనములున్నవి. పురాభవ మితి పురాణం - పురాపి నవం పురాణం - పురా అనక్తి ఇతి పురాణం - పురానీయతే ఇతి పురాణమ్ అనునవి అందు ముఖ్యములైనవి. ఛాందోగ్యోపనిషత్తు

ఇతిహాస పురాణము పంచమ వేదమని తెలుపుచున్నది. ఎవడు నాల్గు వేదములను చదివియు పురాణములను పఠింపడో అతడు విద్వాంసుడును విచక్షణుడు కాడని వాయు పురాణము తెల్పుచున్నది. దేవీ భాగవతమున పరమేశ్వరునకు శ్రుతి స్మృతులు రెండు నేత్రములనియు పురాణము హృదయమనియు చెప్పబడినది.

పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్
అనంతరం చ వక్త్రేభ్యః వేదా స్తస్య వినిర్గతాః

అని నారదీయ పురాణము తెల్పుచున్నది. పురాణముల ప్రాశస్త్యమును విశదీకరించుటకు పై నిదర్శనములు చాలును. పురాణ శబ్దమే వాని ప్రాచీనతను తెల్పుచున్నది. వేదభాష ప్రాచీనమగుటచే జనులకు దురవగాహమైనప్పుడు తత్ప్రతిపాదిత ధర్మనీతి తత్త్వములను కథోపాఖ్యానముల ద్వారా వివరించుటకై వ్యాసుడు లౌకిక సంస్కృతమున పురాణములను భారతమును రచించెనని చెప్పుదురు. "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అను కూర్మ పురాణ వచనము దీనిని బలపఱుచుచున్నది.

కొందఱు పురాణములను త్రిగుణములను బట్టి మూడు విధములుగా విభజించిరి. పద్మపురాణ మొక్కొక్క గణమున కాఱేసి చొప్పున పదునెనిమిదింటిని సమముగా విభజించినది. అందు శైవము తామసము. స్కాందపురాణము "అష్టాదశ పురాణేషు దశభిర్గీయతే శివః" అని పది పురాణములు శివస్తుతి పరములని చెప్పుచున్నది. కొందఱు బ్రహ్మ సూర్యాగ్ని శివ విష్ణు పరములని పురాణములను పంచ విధములుగా విభజించిరి. కొందఱు విషయమును బట్టి పురాణముల నాఱు విధములుగా విభజించిరి. ఈ విభజనమున శివపురాణము మత ప్రాధాన్యమును వివక్షించు వానిలో చేరును.

శివపురాణము విద్యేశ్వర సంహిత (2000 శ్లోకములు) రుద్రసంహిత (12680) శతరుద్రసంహిత (1120) కోటిరుద్రసంహిత (1120) ఉమాసంహిత (1860) కైలాససంహిత (4000) వాయవీయ సంహిత అని ఆఱు సంహితలుగను, 457 అధ్యాయములుగను విభజింపబడినది. పురాణమునకు చెప్పబడిన సర్గప్రతి సర్గ వంశ మన్వంతర వంశాను చరితములను పంచ లక్షణములు నిందు కలవు. శైవమతమునకు సంబంధించిన సర్వవిషయములును ఇందు ప్రపంచింపబడినవి. విద్యేశ్వర సంహితలో లింగార్చన ప్రాముఖ్యము, పంచాక్షరీ జప విధానము, ప్రణవ పంచాక్షరీ మహిమ, పార్థివపూజా విధానము, రుద్రాక్ష శివనామ మహిమ, భస్మ మాహాత్మ్యము వివరింపబడినవి. రుద్ర సంహిత చాల పెద్దది, పురాణమున అర్ధాధిక భాగమదియే. ఇందు సృష్టి ప్రళయాది వర్ణనములు, సంధ్యాకృత శివస్తోత్రము, దుర్గాస్తోత్రము, దేవతాకృత శివస్తోత్రము, దక్షాధ్వర ధ్వంసము, శివపార్వతీ వివాహము, కుమార జననము, తారకాసురసంహారము, గణపతి జననాదికము, త్రిపురాసుర సంహారము, జలంధర శంఖచూడుల వృత్తాంతములు, అంధకాసుర వృత్తాంతము. బాణాసుర వృత్తాంతము మున్నగు విషయములు కలవు. ఈ సంహిత యందలి పార్వతీ ఖండము నుండియే మహాకవి కాళిదాసు వస్తువును గ్రహించి కుమార సంభవమును రచించెను. ఇందలి ఋతువర్ణనములు కావ్యోచితములై హృద్యములుగా నున్నవి. శత రుద్ర సంహిత శివుని అవతార విశేషముల వర్ణించుచున్నది. కోటి రుద్ర సంహిత జ్యోతిర్లింగములను, శివలింగ స్వరూపమును, శివసహస్ర నామములను, శివరాత్రివ్రతోద్యాపనమును విశదీకరించుచున్నది. పాతకోప పాతక నిరూపణము, వివిధ దానములమహిమ, నరక పాతాళ లోక జంబూద్వీపాదుల వర్ణనము, స్త్రీ స్వభావము, వేదవ్యాస వృత్తాంతము, ఉమాప్రాదుర్భావము మున్నగునవి.

ఉమాసంహిత యందలి ముఖ్య విషయములు. కైలాస సంహితలో సన్యాస స్వీకారానుష్ఠానవిధానములు, వాయవీయ సంహితలో శివాద్వైత సిద్ధాంత వివరణము, ఉపమన్యుచరిత్ర, నిత్యనైమిత్తిక కర్మల స్వరూపము, శివమహాస్తోత్రము, మున్నగునవి కలవు. దక్షాధ్వర ధ్వంస వృత్తాంత మిందు పునరుక్తమైనది. ఈ విధముగా నీ పురాణము నందలి షట్సంహితులయందును గల విషయ విస్తృతిని గమనించిన నిదియొక విజ్ఞాన కోశమువలె కన్పించును. శైవమతావలంబులును అన్యులును కూడ గమనింపవలసిన విశేషము లిందెన్నో కలవు.

అయా పురాణము లాయా దైవములు పారమ్యమును ప్రకటించునట్లే శివపురాణము శివుని పారమ్యమును ప్రకటించును. "భగవంతు డెవరు? ముక్తి యనగా నేమి? ముముక్షువులు వహింపవలసిన దీక్ష యెట్టిది? సాధన సంపత్తి యెట్టిది?" మున్నగు ప్రశ్నల కిందు శివపరముగా సమాధానములు చెప్పబడినవి. త్రిమూర్తులకు మూల పురుషుడు శివుడే యనినియు, పరాశక్తి శివాజ్ఞావర్తినియగు శివసహధర్మచారిణి యనియు, శివేతర దైవములను గొల్చువారు కూడ నాయా దైవముల లోకములకేగి చివరికి శివసాయుజ్యము నొందుదురనియు నిందు తెల్పబడినది. సకామముగ దైవముల నర్చించు వారు కూడ శివునే యర్చించినచో ఫలప్రాప్తి నొందుదురు. శివాపచార మొనరించు వారిని శివుడే క్షమించును. అభీష్ట ప్రదములగు మంత్రములు, స్తోత్రములు నిందనేకములు పేర్కొనబడినవి. గాయత్రీ మంత్రము నందలి భర్గుడు శివుడని భావించినచో ఆతడు సూర్యునిలో నుండి ఆ మంత్రమును జపించు వారి బుద్ధులను ప్రేరేచునను నర్థము వచ్చును.

శివపురాణ మహిమ అనిర్వాచ్యమైనది. దానిని పఠించినను వినినను మానవుడు శివపద ప్రాప్తి నొందును. శ్రీ ఆరాధ్యుల వారారంభమున శివపురాణ మహిమను చక్కగా వివరించిరి. ఆ మహిమను సూచించుటకు చెప్పబడిన దేవరాజు, బిందుగుడు, గుణనిధి మున్నగు వారి కథలు అతిలోక మహత్త్వముతో కూడినవయ్యును అత్యంత రమణీయములుగా నున్నవి. శివపురాణము నెప్పుడెట్లు పఠించి వాంఛితార్థప్రాప్తి నొందవచ్చునో కూడ వారు వివరించిరి. శివపురాణము పద్యరూపమున ననువదింపబడినది. కాని పద్యముల నర్థము చేసికొనగల కాలము పోయినది. పద్యకావ్యముల పఠించువారి సంఖ్యయు సన్నగిల్లినది. అందుచే శ్రీ ఆరాధ్యులవారు శివమహిమను సామాన్యులకు కూడ నందించి వారికి నిశ్శ్రేయస లాభము కలిగించుటకై ఆ మహాపురాణమును వచనమున వెలయించి యుండిరి.

శ్రీ ఆరాధ్యులవారు పండిత ప్రకాండులయ్యు సామాన్యులను దృష్టిలో నుంచుకొని సులభమైన వచన శైలితో రచన సాగించిరి. వారి శైలి వ్యావహారికమునకు సన్నిహితమైన లలిత గ్రాంధికము. అచ్చటచ్చట వ్యావహారిక ప్రయోగములును కలవు. అవి పఠితలను దృష్టిలో నుంచుకొని ప్రయోగింపబడినవి. వారి రచన ధారాళమై, మూలానుగుణమై, సులభమయ్యు శక్తిమంతమై, సర్వజన సుబోధమై యలరారుచున్నది. ఇంత పెద్ద గ్రంథము వ్రాయుటకు దైవికమైన ప్రేరణయు, శక్తియు కావలయును. ఆ రెండును వారికి కలవు. శివుడు శంకరుడు. ఆతని అనుగ్రహము మోక్ష సాధనము. దాని నందఱికిని కలిగించుటకై వారీ గ్రంథము రచించిరి. ఈ రోజులలో పెద్ద గ్రంథములను ముద్రించుట కొంచె మించుమించుగా దుష్కరము. మహా భక్తి ప్రేరితులై శ్రీ శంకరయ్య గారాపని కావించిరి. రచయితగారికిని ప్రకాశకులకును భక్త సంఘము పక్షమున నా ధన్యవాదములు.

ఇట్లు

**దివాకర్ల వేంకటావధాని**

ఓం

శ్రీ శివాభ్యాం నమః

# ప్రకాశకుల మనవి

వేదములు ధర్మ శాస్త్రాది స్మృతులు ఆ సర్వేశ్వరునకు రెండు కన్నులైతె పురాణములు ఆయన హృదయము. భారతావనిలో వైదిక మతావలంబులై భగవదారాధన మొనరించు ఆస్తికమహాశయులకు కొదువలేదు. వారిలో కొందరు శివు నారాధించగా మరికొందరు విష్ణువు నారాధించుచున్నారు. మరి కొందరు పరాశక్తియగు దేవీమాత నుపాసించుచున్నారు. ఆయా దేవతల నారాధించువారికి తా నారాధించెడి దేవునిపై నిశ్చలమగు భక్తి భావమును పెంపొందించుట యందు పురాణములు గొప్ప పాత్ర వహించు ననుటలో సందియ మిసుమంతయు లేదు. దానిని దృష్టియందుంచుకొని, మేమిదివరలో శ్రీమద్రామాయణము, శ్రీ మహాభారతము, శ్రీమద్భాగవతము, శ్రీ శివభక్త విజయము, శ్రీ శివపూజా సర్వస్వము, ఆదిపాండురంగ భక్తవిజయము మొదలగు బృహద్గ్రంధములను శ్రీ శివ, శ్రీరామ, శ్రీవిష్ణు, శ్రీలలితా, కాళికా, పార్వతీశభృతుల సహస్ర నామములను పూజా విధానములతోను శ్రీశివ, శ్రీవిష్ణు, శ్రీ దేవీ స్తోత్ర రత్నాకరములను బృహత్ స్తోత్ర రత్నాకరములను ప్రచురించి ఆంధ్ర సోదరుల కందించియున్నాము. వారు మాకిచ్చిన ప్రోత్సాహముతో ఉత్తేజితులమై ఇప్పుడు "శ్రీ శివ మహాపురాణము" అను బృహద్గ్రంధమును ప్రచురించి మీ ముందుంచుచున్నాము. శివ భక్తులకు ఈ గ్రంథము గొప్ప వరప్రసాదము వంటిది. అందుకే గ్రంథ రచయితలు లోకారాధ్య, శివశ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు ఈ యుద్గ్రంధమును "శ్రీ శివ విజ్ఞాన సర్వస్వము" అనికూడ అన్నారు.

పురాణ గ్రంథములను ప్రచురించునప్పుడు ఆ గ్రంధ రచయితలను ఎన్నుకొనుట మహాశ్రమతో కూడిన కార్యము రచయిత మంచి విద్వాంసుడగుటయే కాక పురాణమును రహస్యార్ధ విశేషభావములతో అధ్యయన మొనరించి అనుభవించినవారై యుండుట చాల అవసరము. అప్పుడే భగవాన్ వ్యాస మహర్షి హృదయమును తెలుసుకొని దానిని సామాన్యుల కర్ధమగు నటుల విపులీకరించును. అందువలననే మేము ఈ శ్రీ శివ మహాపురాణమును వచనరూపమున సామాన్యుల కర్ధమగునట్లుగా అనువదించుటకు శివశ్రీ లోకారాధ్య నిర్మల శంకరశాస్త్రిగారిని ఎన్నుకోవటము జరిగినది. శ్రీ శంకరశాస్త్రిగారు స్వచ్ఛమైన శైవులు గొప్ప విద్వాంసులే కాక శైవాగమ, శైవ సంప్రదాయ సాహిత్యములందు నిష్ణాతులు శ్రుతి, స్మృతి, పురాణాదులను క్షుణ్ణముగా అధ్యయన మొనర్చిన దిట్ట. అందులకే ఆయనకు 24 వేల శ్లోకములతో 457 అధ్యాయములతో నొప్పు ఈ శివ పురాణమును సులభమైన తెనుగు భాషలో ననువదించుటకు దాదాపు ఎనిమిది సంవత్సరాల కాలము పట్టినది. అనగా ఎవరో వ్రాసినదానిని ముందుంచుకొని మరొక పుస్తకమును సిద్ధమొనర్చుటయో, లేక చేతికి వచ్చిన దేదో వ్రాసి ఐనది అనుపించుకొనుటవంటిది కాదు. ఏ మాత్రము బద్ధకించక శ్రీ శివ మహా పురాణానువాదమునకు న్యాయము చేకూర్చినారు. ఇంతకుముందు బ్ర॥ శ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు రచించిన పద్యరూప శ్రీ శివ పురాణము ముందు వెనుకల తారుమారుతో నున్నను ప్రసిద్ధిగాంచి పండితుల మన్నన లందుకొనినది. ఐతే ఇప్పుడు మేము ప్రచురించిన వచనరూప శ్రీ శివ మహాపురాణము అటు పండితులను ఇటు పామరకోటిని కూడ అలరింపజేయు నను నమ్మకము మా కున్నది. దీనికి యథా తథము (తారుమారు లేక) అనువదింపఁ బడిన ఇందలి విషయముఁదగు రామణీయకతయే తార్కాణము. దీనిని నిర్ణయించి తీర్పు నివ్వవలసినది. ఆంధ్ర పాఠక లోకము.

అపారమైన కృషి యొనర్చి, మా యందుండు అభిమానముతో ఈ సద్గ్రంథమును రచించి ఇచ్చిన లోకారాధ్య శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారికి హృదయపూర్వక కృతజ్ఞతలతో పాటు మా నమోవాకములు.

అందువలననే వీరికి "శైవవాఙ్మయార్ణవ" "శ్రీకంఠ విద్యాభూషణ" "సంస్కృత సాహిత్య రత్న" "నీలకంఠ భాష్యార్థవాధ్యక్ష" "ప్రవచనకేసరి" ఇత్యాది బిరుదములు - పండిత - ప్రకాండులచే నొసఁగఁబడినవి. ఇవి అతిశయోక్తులు కావని ఈ శివ మహాపురాణ ఆంధ్ర వచనానువాదము ధృవీకరించుచున్నయది.

శ్రీవారు ఇతఃపూర్వము నీలకంఠీయ బ్రహ్మసూత్ర భాష్యాదుల ననువదించి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారి యామోద ముద్రను పొందిరి.

ఇతః పూర్వము మేము ప్రచురించిన వైదిక, పౌరాణిక, ఆధ్యాత్మిక గ్రంథముల పై చూపిన ఆదరమునే ఈ శ్రీ శివ మహాపురాణము పైనను కూడ చూపవలయునని యావదాంధ్ర అస్తిక పాఠకలోకమును ప్రార్థించుచున్నాము. వెల విషయములో సాధ్యమైనంత వరకు తక్కువగా నుంచుటకు ప్రయత్నించితిమి. ఐతే నేటి ముద్రణావసర వస్తు సముదాయముల వెలలు, కాగితము వెలలు ఇప్పుడుంచిన వెలకన్న ఏమాత్రము తగ్గించుటకు, వీలు కలుగ నీయలేదు. సహృదయులగు పాఠకులు గమనింప ప్రార్థన. ఐతే ఈ యుద్గ్రంథము రాయలు సైజులో దాదాపు 1100 పుటలు కలిగి, క్యాలికోబైండుతో సుందరమగు పంచరంగుల ముఖచిత్రముగల జాకెటుతోడను నున్నందువలన కొనువారికి ఏమాత్రము భారము కాజాలదనియే మా భావన.

శైవ సాహిత్య ప్రచారకులు సుప్రసిద్ధ విద్వత్కవులు, డాక్టర్. ముదిగొండ శివప్రసాద్ ఎం.ఎ.పి.హెచ్.డి గారును, ఆత్మీయులు, అమృత హృదయులు ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారును యుద్గ్రంథమును సమీక్షించి పీఠికను సమకూర్చియు తమ అమూల్యములగు అభిప్రాయముల నొసగిరి. వారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములు.

ఇందులో ముద్రారాక్షసములు చాలా దొర్లినట్టు కన్పట్టు చున్నవి. యిది మా ప్రెస్సులో చేయబడలేదు. అనేక కారణముల వలన మేము చేయలేనందుకు చింతిల్లు చున్నాము. యితర ప్రెస్సులో పని జరిగినచోటు అక్షర జ్ఞానము లేక కొంతమంది పని వారలచే యాపని జరిగినది. కొన్ని తప్పులు దిద్దినను వేయక పోవటము కూడ జరిగినది. దీనికి చదువరులు మమ్ములను మన్నించి తప్పులు దిద్దుకొన గలరు. యిందులో తప్పుఒప్పుల పట్టిక చేర్చినాము. యిదికూడ సరియైనది అని చెప్పలేని స్థితిలో యున్నది. మాకు తెలిపిన మలి ముద్రణమున సరిచేయగలమని విన్నవించుకొనుచున్నాము.

## రెండవముద్రణకు ప్రకాశకుల మనవి

మొదటి ముద్రణ ప్రచురించి దాదాపు 20 సంవత్సరములు గడిచినవి. 20 సంవత్సరముల తరువాత రెండవ ముద్రణకు రావడం ఎంతో సంతోషము కలిగినది. మొదటి ముద్రణలో అక్షరములు చాల చిన్నగా ఉండి చదువుటకు చాల ఇబ్బందిగా ఉన్నదని తెలుపుటయు, షుమారు 1100 పుటలు కలిగిఉన్నందున చాలా లావుగా ఉన్నదనియు వృద్ధులు ఇంతభారము వహించలేరని ఎంతోమంది తెలుపుట వలన మలిముద్రణలో అక్షరములు కొంతపెద్దగా ఉండునట్టు D.T.P. చేసితిమి. రెండుభాగములుగా ప్రచురించినాము. చేతికి వీలుగా ఉండునట్లు రెండు భాగములుగా ఉన్నవి. సాధ్యమైనంత వరకు తప్పులులేకుండ చూచినాము. తప్పులు కనబడిన తెలుపగలరు. మలిముద్రణలో సరిదిద్దగలము. భక్తితో పారాయణము చేసి ముక్తిని పొందగలరు. బహుమతిగా దీనిని ఒసంగి ప్రతి జీవి చైతన్యమునకు తోడ్పడగలరు.

ఇట్లు

ప్రకాశకులు

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# ఉపోద్ఘాతము

నిర్మల శంకరశాస్త్రి

శివుడే అష్టాదశమహాపురాణములకు పదునెనిమిది ఉపపురాణములకు శివాగమములకును మొదటికర్తయై సృష్ట్యారంభమున బ్రహ్మదేవున కుపదేశించెననియు ఆ పిదప చతుర్ముఖుఁడు సద్యోజాతాది పంచబ్రహ్మలను ప్రార్థించి వారి యనుగ్రహమున శతకోటిశ్లోకాత్మకమగు ఒకేఒక మహాపురాణమును మునులకు ప్రబోధించెననియు బ్రహ్మముఖము నుండి పురాణము బయల్పడిన తరువాత నాలుగువేదము లావిర్భవించినవనియు మహాభారతమున శాంతిపర్వము నందు వ్రాయబడినది.

ఇందువలన పురాణప్రణేత - శివుఁడనియు, పురాణప్రవక్త - బ్రహ్మదేవుఁడనియు విశదమైనది. శతకోటిశ్లోకభరితమగు మహాపురాణమును కలియుగములో అల్పాయుష్కులు అల్పమేధస్కులునగు మానవులు (స్త్రీపురుషులు) సమగ్రముగ పఠింపఁజాలరని విష్ణుభగవానుఁడు గుర్తించి వేదవ్యాసరూపమున పదునెనిమిది విభాగములుగ నాలుగులక్షల శ్లోకములలో సంగ్రహించెనని మత్స్యమహాపురాణమునందు ప్రతిపాదింపఁబడినది.

శ్లో॥ అష్టాదశపురాణానాం - దశభిః కథ్యతే శివః ॥

నాలుగులక్షల శ్లోకాలుగల పదునెనిమిది (18) మహాపురాణములలో మూడు లక్షల శ్లోకాలు గల పది మహాపురాణముల యందు శివుఁడు ప్రతిపాదింపఁబడినవాడు. మిగత ఎనిమిది మహాపురాణములలో దేవీ విష్ణు బ్రహ్మ సూర్య అగ్న్యాదులు వర్ణింపఁబడిరి.

పురాణములన్నియు పరస్పరవిరుద్ధార్థకములు గాక ఏకార్థకములగుననియు అష్టాదశవిద్యలలో పురాణములు చేరినవగుటచే అప్రమాణములగు ననుటకు ఎంతమాత్రము వీలులేదనియు పురాణములు - సంహితలనఁ బఱఁగుననియు కూర్మమహాపురాణమునందు కలదు.

శ్లో॥ ఇతిహాసపురాణాభ్యాం - వేదం సముపబృంహయేత్ ॥

ఇతిహాసములయందలి సందర్భములతో పురాణములలోని ప్రతిపాదనములతో వేదార్థమును నిరూపింపవలెను గాన త్రిపురసంహార నృసింహావతార ప్రబోధాది వైదికగాథలను శివమహాపురాణాది ప్రసంగములతో సమర్థించుట సమంజసమగును.

"పురాణం హృదయం స్మృతమ్"

శ్రుతిస్మృతులు నేత్రములనియు పురాణము హృదయమనియు పరమేశ్వరుఁడు తన విరాట్స్వరూప సందర్భమున వక్కాణించెను.

పురాణములను పాటింపక వేదవాక్యములకు అర్థముఁజెప్పు మహామహులు - అల్పశ్రుతులు గాన అట్టివారిఁ జూచి "తనకు వీరు అపార్థములతో మోసగింతు"రని వేదము (వేద పురుషుఁడు) భయపడును.

అష్టాదశమహాపురాణములలో శివమహాపురాణము నాలుగవది. ఇందు 24 వేల శ్లోకములు (457) అధ్యాయములు నుండుటచే ఇద్ది విష్ణుభాగవతముకన్న విస్తృతమైనదని తేటపడును.

వేదవ్యాసుఁడు - విష్ణుభగవానుఁడగుటచే 18 మహాపురాణములను శతకోటిశ్లోకాత్మక మహాపురాణము ననుసరించి నిరూపింపగా వేదవ్యాసతనయుఁడగు శుకమహాముని - తద్భిన్నముగ శ్రీమద్భాగవతమును రచింపవలసినవాడయ్యెను.

"శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" ఇత్యాదివాక్యమున శ్రోతవ్యుఁడు శివుఁడనియు శివప్రతిపాదకములగు వేదాంత వాక్యములు పరిగ్రహింపఁబడి మననమును చేయవలెననియు చరమకర్తవ్యము శివధ్యానమనియు ఈ శివమహాపురాణమునందలి కైలాస సంహిత యందు బాగుగా వ్రాయఁబడినది.

సర్పదంశమరణదుర్గతి రాకుండుటకు భాగవత శ్రవణము ఉపయుక్తమైనదనియు మునిశాపావధి - సప్తదినములగుటచే - భాగవతశ్రవణము సప్తాహ్నికమయ్యెననియు వివేకము.

అష్టాదశపురాణరచనానంతరము భాగవతమును చిత్తవిశ్రాంతికై వేదవ్యాసుఁడు (లేక శుకముని) రచించెనని భాగవతమునందే కలదు గాన భాగవతము అర్వాచీనమై కలియుగమున బహుళ ప్రచారము నందియున్నది.

శివమహాపురాణము "షట్కులీనమునులు - భగవంతుఁడెవరు? ముక్తియెట్లు చేకూరును? ముముక్షువులు ఎట్టి దీక్షఁబరిగ్రహింపవలెను? సాధనసంపత్తి యెట్టిది? ఇత్యాది ప్రశ్నింప - పితామహుడు శివుఁడే భగవంతుఁడు, అర్చిరాదిమార్గమున శివపదముఁబ్రవేశించిన వారికే జన్మరాహిత్యము (ముక్తి) సమకూరును. పాశుపతదీక్షితులై భస్మరుద్రాక్షలను ధరించి శివపంచాక్షరీమహామంత్రమును జపించుచు శివలింగము నర్చించువారే ముముక్షువులగుదురు. శమదమాదులు వైరాగ్యము మొదలగునవి సాధనములు. ఇత్యాది సమాధానములు వాయవీయ సంహితయందు పూర్వోత్తరభాగములలో వ్రాయఁబడినందున" పాక్షికముగాక సర్వాస్తికజన మూర్ధన్యముగ విరాజిల్లుచున్నయది.

ఇందు - బ్రహ్మవిష్ణురుద్రులు - త్రిగుణాత్మకులై సృష్టిస్థితిలయములఁజేయువారనియు ఆ యా సమయములలో వీరిలో ఒక్కొక్కరు భగవంతులుగా చెప్పఁబడినను ముమ్మూర్తులకు మూలపురుషుఁడు శివుఁడేనని చెప్పుటకు "బ్రహ్మవిష్ణురుద్రేంద్రాః సంప్రసూయంతే" ఇత్యాది అథర్వశిఖోపనిషద్వాక్యము తదితర వేదాంత వాక్యములును ఆధారములనియు బాగుగా నిరూపింపఁబడినది.

భస్మాసుర వరప్రదానము, బాణాసుర శ్రీహరుల యుద్ధము, అంబరీషదుర్వాస సమావేశము. మోహినీయవతారముగ్ధత్వము, మొదలగు సందర్భములను శివాపకర్షపరములుగ భాగవతాదిగ్రంథములయందు శివద్వేషులు చూపెట్టినందుకు తగు సమాధానములు ఇందు వ్రాయబడినవి.

సదాశివునివలన మహేశ్వరుఁడు, మహేశ్వరునివలన రుద్రుఁడు, రుద్రునివలన విష్ణువు, విష్ణువువలన బ్రహ్మదేవుఁడు నొక్కొక్కరు సహస్రాంశముగ జన్మింతురనియు త్రిమూర్తిజననియగు పరాశక్తి - పరశివునకు సహచారిణియై శివాజ్ఞావశవర్తినియనియు తథాపి దేవిని విష్ణువును బ్రహ్మను ఆ యా పర్వకాలములయందు యథావిధిగా శైవులు పూజింపవలెననియు కేవలము ఆ యా శివేతరదేవతల నారాధించువారు గూడ ఆ యా దేవతాలోకములకుఁజని కొంతకాలమునకు శివసాయుజ్యము నొందుదురనియు మరియెన్నో ఉపయుక్తాంశములను లోకకల్యాణము నాశించి విశదీకరించిన శివమహాపురాణము - ఆంధ్రత్వ మాంధ్రభాషా చ - నాల్పస్యతపసఃఫలమ్" అన్నట్లు భావిభాగ్యోదయ సూచకమనవచ్చును.

అందరికి భోగమోక్షములు కావలెను. అందుకు స్వేచ్ఛావిహారము నరికట్టుట దుఃసాధ్యముగాన జ్ఞానాజ్ఞాన క్రియమాణములగు దురితములు ఫలజనకములు కాకుండా సంచితపాపములు నశించుటకు ప్రారబ్ధసుఖ దుఃఖముల ననుభవింప నోర్పు గలిగి యుండుటకును తగు సాధనము - పాశుపతదీక్షాస్వీకారమగును. భస్మరుద్రాక్ష ధారణము, భస్మరుద్రాక్ష శివమంత్ర ధారణము భస్మరుద్రాక్ష శివలింగధారణమునను ముప్విధములు గల పాశుపతము ఆస్తిక జనులందరికి పరిగ్రాహ్యమునని యిందు నిర్ణయింపఁబడినది.

కామ్యముగనైన శివునే పూజింపవలెను. శివవ్రతములనే చేయవలెను. పరివార దేవతలతో బ్రహ్మావిష్ణ్వాదులను ముఖ్యులుగ భావింపవలెను అని కూడ శివపురాణమున గాననగును. కాశీక్షేత్రమునందు మరణించువారి కుడిచెవిలో ప్రణవఘటితమగు శివపంచాక్షరీమహామంత్రమునే ఉపదేశింతునని శంకరుఁడు పార్వతీదేవికి చెప్పినట్లు కైలాస సంహితయందు గలదు.

సన్న్యాసస్వీకారవిధి; సన్న్యాసుల నిత్యఅనుష్ఠానము; యతిమరణానంతరము కర్తవ్యమగు అపరకర్మ; పాపపుణ్య నిరూపణము; స్వర్గనరకగతులు; శివలింగ ప్రాదుర్భావము; సురాసురవిజయకారణము; శక్తిశివుల లీలావిలాసచమత్కారము; సతీవివాహము; పార్వతీకల్యాణము; కుమారగణేశజననము; గణేశవివాహము నారదగర్వభంగము; విష్ణుమాయా మహిమ; శివుని శతావతారములు; ద్వాదశజ్యోతిర్లింగ మాహాత్మ్యము; దేవీయవతారములు; శివుని రాక్షససంహారము; యోగాచార్యనిరూపణము; శ్రీకృష్ణుని తపశ్చర్య; ఉపమన్యుమహర్షి మొదలగు భక్తుల కథలు; పుత్రసంతానప్రాప్త్యుపాయములు; అన్నదమ్ముల విభాగములో న్యాయాన్యాయములు; ప్రమాదమున సంభవించు శివాపచారములను శివుఁడే క్షమించుట; పంచావరణ శివపూజావిధానము; పంచావరణ శివస్తోత్రము, మధ్యమధ్య అభీష్టసాధకములగు శివమంత్రములు; సూర్యచంద్రవంశములు; మన్వంతరకీర్తనము; బ్రహ్మవిష్ణురుద్రమహేశ్వరుల కాలనిర్ణయము; అపమృత్యువులను జయించి దీర్ఘాయురారోగ్యభాగ్యములను పొందునుపాయములు; వేదవ్యాసజననము; మంత్రస్వీకారవిధి; గురుమహిమ; శిష్యలక్షణములు; అబ్బబ్బ! ఎన్నెన్నో మంచి విషయములు ఇతర పురాణములయందు లేనివి. ఈ (మన) శివమహాపురాణమునందు గలవు. సంస్కృతభాష ఆంధ్రభాషయు సరిగారానివారు, సంస్కృతాంధ్ర పద్య శివపురాణములఁజదివినను సమగ్రముగ మనస్సునకు హత్తునట్లు అవ్వాని యంశములను పరిగ్రహింపఁజాలనివారును ఈ తెలుగు మాటల పొత్తమును చదువవలెను. వేదవ్యాసాశయావిరుద్ధముగ ఉపనిషత్ సూత్రగీతలయందలి విషయముల నుదాహరించుచు వ్రాయఁబడిన ఈ పురాణమును శ్రీ పబ్బాశంకరయ్యశ్రేష్ఠిగారిచే వ్యయప్రయాసములను భరించి ఆత్మీయులను మెప్పించియు నిర్దుష్టముగా సర్వాంగసుందరముగా నచ్చువేయించబడిన ఈ పురాణరాజమును బుద్ధిమంతులు జిజ్ఞాసువులు సందిగ్ధచిత్తులు పరిశోధకులు మూర్తిపూజకులు నిరాకారోపాసకులు పురాణప్రామాణ్యవిశ్వాసము తగ్గినవారు భక్తిశ్రద్ధలను పెంపొందించుకొను సదభిప్రాయము గలవవారు నీ అపూర్వ అద్వితీయగ్రంథమును "అబ్బా! ఇంతవెలయా?" అని వెనుకంజవేయక తీసికొని ఆమూలాగ్రము ముమ్మారు చదివి తెలియనిచోట పెద్దలనడిగియు సంతృప్తిఁ బడసినవారై తరింతురుగాక!

ఇఁక శివమహాపురాణము అను జ్ఞానపురుషుని మహిమను ఇంచుకంత వివరించి ఈ యుపోద్ఘాతమును విరమింతును.

ఐతే ఇందుగల ముఖ్యాంశమును ఇంట నుల్లేఖింప మరచితిని. ఈ మఱుపు - మానవ సహజమని సహృదయులంగీకరింతురు గదా!

బ్రాహ్మణక్షత్రియవైశ్యులు - ద్విజులనంబడుదురు.

"జన్మనా జాయతే శూద్రః - కర్మణా జయతే ద్విజః" అను వచనముంబట్టి మానవులందరు - జన్మించుటతోడనే శూద్రులుగను ఉపనయనకర్మచే ద్విజులుగను పరిగణింపంబడుదురు గదా! అట్టితతి ద్విజులెవరు? శూద్రులెవరు? అను ప్రశ్నకు సమాధానము ఇందు చక్కగా నిరూపింపంబడినది.

శుక్ - దుఃఖము (కర్తవ్యము బోధపడనందున కలుగు ఆవేదన) సంభవించుటచే అటునిటు ద్రావతి - పరిగెత్తును గాన ప్రతిమానవుండును జన్మతో శూద్రుండనియు (శూద్రజాతీయుండు కాడనియు) వేదోక్త సంస్కారము చే రెండవపర్యాయము జన్మించును గాన ద్విజుండనంబఱంగుననియు ద్విజులుమాత్రము శివపంచాక్షరీ మహామంత్ర స్వీకారమునకన్న ముందు గాయత్రీమహామంత్రమును జపించవలెననియు జపముయొక్క పూర్వోత్తరాంగముల నవశ్యమాచరింపవలెననియు ఇందు వ్రాయంబడినది.

గాయత్రీమహామంత్రము శక్తిస్వరూపము కాగా తదర్థము శివుండగుననే వివేకము. "సూర్యునిమించిన తేజస్సుగల భర్గుడు (పరమేశ్వరుండు) సూర్యునిలో నుండువాడై మా బుద్ధులను సన్మార్గమువైపు ప్రేరేపించును గాన నట్టి పరమాత్మ నుపాసించుచున్నాము" అను నర్థముగల గాయత్రీమంత్రమును సదాశివస్వరూపిణిగా ధ్యానింపనివారికి ఆ చంద్రతారార్కము మహానరక నివాసము సంఘటించునని శివమహాపురాణము విశదీకరించినది.

## శివపురాణమహిమ

శ్లో॥ పఠనా చ్ఛ్రవణా దస్య - భక్తిమా న్నరసత్తమః ।
సద్యః శివపద ప్రాప్తిం - లభతే సర్వసాధనాత్ ॥ 13;

స్కాందమహాపురాణము-మహిమాధ్యాయము 1,

శివమహాపురాణమును చదువుటవలనను వినుటంజేశియు భక్తిగల మానవోత్తముండు - సమస్తమును సాధించినవాడై - ఈ జన్మాంతమునందే శివపదము (మోక్షము) ను పొందును.

శివపురాణపఠనము - మానవులకు కల్పవృక్షమువంటిదై ఇహపరభోగముల నొసంగునది. ఐతే ఇది - శివనామ సంకీర్తనముతో కూడియుండునేని - తత్కాలముననే అరిష్టములను నివారించి అభీష్టములను సిద్ధింపం జేయును. ఇద్దాని నామూలాగ్రముగ పఠించువారు - జీవన్ముక్తులని చెప్పవచ్చును.

ప్రతిదినము ఒక పుటగాని ఒక వాక్యమునుగాని చదువుచుండినయెడల దినక్రమముగ ఏతత్పఠనమునందు, ఇందు చెపంబడిన శివారాధనమునందు నభిరుచి - పెంపొందుచుండును. ఈ తెలుగుపొత్తము నెవరో చదువుచుండగా వినుటకంటె - తన కంఠోక్తిగా పఠించుట - అధిక శ్రేయస్సు నొదవంజేయును. అంత్యకాలమున ఇద్దానిని వినినయెడల - శివుండు ప్రసన్నుండై కరుణాకటాక్షముతో పునరావృత్తిరహిత శాశ్వతశివసాయుజ్యము ననుగ్రహించును.

ఇద్దానిని చదువుటచే శివుఁడేగాక బ్రహ్మవిష్ణ్వాద్యమరులందరు సమస్త సత్పురుషులును సంతసింతురు. కావుననే శివారాధనమువలన జగమంతయు తృప్తిపడునని ఇందు వేదవ్యాసుఁడు వ్రాసెను. శివపురాణపఠనము - భగవద్గీతాపారాయణమువలె జ్ఞానయజ్ఞ మనఁబఱఁగును. మరియు సంతానములేనివారికి పుత్రప్రదము, గర్భధారణమును గర్భస్రావముగల తరుణులకు స్థిరపఱచునదియు, గొడ్రాలునకు త్వరలో సంతానము నొసఁగునదియు, రోగులకు ఆరోగ్యమును కలిగించునదియునై యున్నది.

ఐతే ఒక్క పర్యాయము ఈ గ్రంథమును పఠించిన తరువాత పద్మమహాపురాణాంతర్గతమగు శివగీతను పారాయణముఁజేయవలెను. ఇందు - రుద్రసంహిత - మిగుల ముఖ్యమగునది. ఇరువదినాలుగువేల శ్లోకములు ఈ పురాణమునందుండుటచే చతుర్వింశత్యక్షరములు గల గాయత్రీమంత్రమును (అక్షరమునకు ఒక వేయి శ్లోకములచొప్పున) వివరించునదీ మహాపురాణమనియు, షడక్షరీమహామంత్రమును కలియుగమున అక్షరమునకు నాలుగులక్షలు (మొత్తం ఇరువదినాలుగులక్షలు) జపించినచో నొక పురశ్చరణమగునని ఇందే వ్రాయఁబడినందున ఈ మహాపురాణము - షడక్షరీ మహామంత్రమును (అక్షరమునకు నాలుగువేల సంఖ్యతో) ప్రతిపాదించుచున్నదనియు తెలియవలెను.

ఒక పర్యాయము చదివినపిమ్మట లఘురుద్రాభిషేకమును శివసహస్రనామార్చనను గావించి పదునొకండు (11) శైవబ్రాహ్మణులకు భోజనము నిడి దక్షిణాతాంబూలముల నొసఁగవలెను.

పూర్వము దేవరాజు అను బ్రాహ్మణుడు - స్నానసంధ్యారహితుఁడై తన కుటుంబము నాదరింపక వేశ్యాలోలుడైయుండ నొకప్పుడు దైవయోగమున ప్రతిష్ఠానపురమునందు శివాలయములో జ్వరపీడితుఁడై శివమహాపురాణమును వినవలసివచ్చెను. అంత్యకాలమున నిద్దానిని వినుటచే పాపరహితుఁడై మరణించి యమయాతనల నొందక శాశ్వతశివలోకనివాసము గలవాడయ్యెను. ఇక్కథ-స్కాంథ మహాపురాణమునందు గలదు. ఇంతియేగాక బిందుగుఁడను బ్రాహ్మణుఁడు వేశ్యాలంపటుడై ధర్మపత్నిని నిరాకరించి మద్యముఁ ద్రాగుచు జూదమునాడు చుండెను. ఆతని భార్యయగు చంచుల - కొన్నాళ్లు శీలమును కాపాడుకొనెను. కాని యౌవనకామవేగము నోర్చుకొనఁజాలక రహస్యముగ వ్యభిచరించుచుండెను. బిందుగుఁడు - కాలవశమున మరణించి యమబాధల ననుభవించి భూలోకమున వింధ్యపర్వతారణ్యమున పిశాచమై పడియుండెను. బిందుగపత్ని యగు చంచుల - ముసలితనమున గోకర్ణమహాక్షేత్రమునకు వెడలి యందలి పుణ్యతీర్థోదకములఁ గ్రుంకులిడినదై మహాబలేశ్వరుని మందిరమున ఒకానొక పండితప్రకాండుఁడు వక్కాణించు పురాణము నాలకించి వైరాగ్యము గలదయ్యెను. ఆ పిమ్మట నా పౌరాణికవతంసు నాశ్రయించి శివమహాపురాణమును సమగ్రముగ వినుటయేగాక భస్మరుద్రాక్ష ధారిణియై శివమంత్రజపముచే ప్రారబ్ధాంతమున అనాయాసముగ మరణించినదై కైలాసముఁజేరెను.

కైలాసములో నొకనాడు చంచుల పార్వతీదేవిని దర్శించి ప్రణమిల్లినదై తన భర్త జాడ నడిగెను. ఆతడు పిశాచమై వింధ్యాద్రియందున్నవాడని అమ్మవారు చెప్పగా అతని యుద్ధార మెట్లగునని చంచుల - అమ్మను యాచింప నా జగజ్జనని కరుణించి తుంబురుగంధర్వుని రప్పించి వింధ్యాటవికేగి బిందుగుని బంధించి శివపురాణమును వినిపించుమని యాదేశించెను.

అప్పుడా గంధర్వాగ్రేసరుఁడట్లే గావింప - బిందుఁగుడు - పిశాచజన్మను విడనాడి దివ్యదేహధారియై మహాకైలాసముఁజేరినవాడై పార్వతీపరమేశ్వరులను దర్శించి నమస్కరించియు పార్వతీపరిచారికయగు చంచులతో కల్పకోటిశతంబుల కాలము దివ్యసుఖముల ననుభవించి శివసాయుజ్యము నందెను.

ఇదియు లక్షశ్లోకాత్మక స్కాందమహాపురాణమునందు శివపురాణమాహాత్మ్య ప్రతిపాదక అధ్యాయములలో ఐదవ అధ్యాయమునందు వ్యాసభగవానునిచే నిరూపింపఁబడినది.

"శివవిజ్ఞానసర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాదాత్మకమగు శివమహాపురాణమును పఠించు విధానము ఎట్లనఁగా?

వైశాఖ జ్యేష్ఠశ్రావణ కార్తిక మాఘ ఫాల్గునమాసములలో గురుశుక్రమౌఢ్యములేనట్టి శుభనక్షత్ర శుభవాసరములయందు ప్రాతఃకాలమున విషఘడియలులేని శుభతారాచంద్రబలము గల శుభహోరలయందు శివమహాపురాణపఠనమును ప్రారంభింపవలెను. ప్రతిదినము ఉదయము స్నానసంధ్యల నాచరించి శివమంత్రమును జపించియు శివుని పూజించిగాని శివునిపటము ముందు అగరువత్తిని వెలిగించిగాని గణపతిని ప్రార్థించి "శాంతం పద్మాసనస్థం" ఇత్యాది శివ శ్లోకములను పఠించియు శివమహాపురాణమును తన ముందు పీఠముపై నునిచి పంచోపచారముల నర్చించి "ప్రతిదినము ఇంత" యను నిర్బంధము నేర్పరచుకొని ప్రశాంతముగా నెమ్మదిగా ఈ గ్రంథమును చదువవలెను.

ఇద్దాని ప్రారంభమునకు జన్మనక్షత్రము ముఖ్యమని గమనించుట - మంచిది.

ఇట్లు పఠించినయెడల - శివవిజ్ఞానము - అనఁగా? శివప్రియములగు భస్మరుద్రాక్ష ధారణాది సదాచారము అలవడుటయేగాక శివుని గురించి పరోక్ష విజ్ఞానము కలిగి శివధర్మానుష్ఠాన బలమున దేహాంతమున శివ సాక్షాత్కారము సంభవించునుగాన ఏతత్పఠనము - ఇతరగ్రంథపఠనముకన్న కడుంగడు శ్రేయోదాయకమని తేటపడుచున్నయది.

ఈ తెలుగు పొత్తమును గూడ చదివి ఇందలి విషయమును గుర్తింపఁజాలనివారు అనఁగా? చదువు బాగుగా రానివారు ఇంటివారిలో నెవరైన యోగ్యులు చదువుచుండగా మనస్సు నిలిపి వినినయెడల - అట్టివారికిని శ్రేయోదాయకమగు గాదే!

ఆలమతి విష్ణ రేణ.

ఇఁక అనువాద ప్రాబల్యమును గురించి అనువాద ప్రోత్సాహకుల నుద్దేశించియు అనువాద స్వరూపమును గురించియు కొంత ముచ్చటించి చదువరుల మనంబులను రంజిలఁజేయుదును.

అవధరింపుఁడు !

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# అనువాద ప్రాబల్యము

ఇరువది నాలుగువేల శ్లోకములతో ఏడుసంహితలతోడను 457 అధ్యాయములతో వ్యాసప్రోక్తము అష్టాదశమహాపురాణములలో నాలుగవదియు నగు శివమహాపురాణమును గద్యము నందనువదింతునని కలలో కూడ ననుకొనలేదు. ఇందు విద్యేశ్వరసంహిత 2000, రుద్రసంహిత 12680, శతరుద్రసంహిత 1120, కోటిరుద్రసంహిత 1120, ఉమాసంహిత 1840, కైలాససంహిత 1240, వాయవీయ సంహిత 4000 శ్లోకములు గలిగియున్నవి. విద్యేశ్వరసంహిత మొదలుకొని కైలాససంహితవరకు శివమహాపురాణమును చదివినవారికే వాయవీయసంహితయందలి శివవిజ్ఞానసర్వస్వముఁదగు పఠన (శ్రవణ) అధికారము సంఘటించు నని వాయవీయసంహిత – పూర్వభాగమునందు ప్రథమాధ్యాయమున గాననగును.

ఈ యనువాదమును సుమారు 30 వత్సరముల క్రితము శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారు కీ.శే॥ నీలరాజయ్యగారు ప్రేరేపించియుండిరి. అప్పుడు అబ్బో! ఇది నాకు సాధ్యమగునాయని భయపడితిని. పురాణములలో వ్యాసఘట్టములు నాబోటి యల్పజ్ఞులకు అర్థముకానని తోచినది. అందులో తేటతెలుగున సుబోధముగ వ్రాయుఁడని శ్రేష్ఠిగారి యాదేశము. ఎటులో నొకటుల ప్రమాణ గ్రంథముల నూతఁగా గొని ప్రారంభించి మధ్యమధ్య నిరుత్సాహపడుచునే ముందుకు సాగితిని.

ఇది యంతయు శ్రీ రాజరాజేశ్వర స్వరూపుఁడగు దక్షిణామూర్తి – శ్రీ శంకరయ్య శ్రేష్ఠిగారి శుద్ధచిత్తమునఁ బ్రవేశించి ప్రేరేపించుటతో నుపస్థితమైనదని భావింతును.

దాదాపు ఎనిమిది సంవత్సరముల కాలములో పురాకృతఫలితముగ తటస్థించిన ఆత్మీయవియోగము ఎట్టి ధీరులనైన కలతఁజెందించు సంఘటనయైనను మదిఁగల కార్యదీక్షతో సముద్రములాంటి శివమహాపురాణము నీ విధముగ 54 నుండి 62 సం॥ వయస్సు వరకు తెనిగించితిని.

ఐతే నా యీ అనువాదమున అందచందాలు తగ్గినవేమో యనుటకు ఉభయ భాషాప్రవీణులు – సాహసించకపోరు.

అచ్చతెనుగు మాటలు కొఱవడియుండుటచే ఈ యనువాదము గ్రాంధిక భాషలో నడువలేదనిపించును. అచ్చం గ్రాంధికభాషను వాడాలంటే పామరులకు తెలియదంటారు. పండితులకా? అనువాదమే యవసరములేదు. కేవలం గ్రామ్యభాషను వ్రాసినచో అనువాదము ప్రామాణికము కాదని తోచెడిని. క్లిష్టముగాక గ్రామ్యముగాక నుండు భాషలో వ్రాసిన బాగుండునని తలచి పండితసమ్మతముగ పామరగ్రాహ్యముగ గ్రంథము అనువదింపఁబడినది.

# శ్రేష్ఠిగారి పరిచయము

ఇక శ్రేష్ఠిగారా? జగమెరిగిన ప్రఖ్యాతమహాపురుషులనుట అతిశయోక్తికాదు. ఎందుకంటారా? ఆసేతుహిమాచలము పవిత్ర క్షేత్రములయందు సహస్రఘటాభిషేకములను వైదిక సద్బ్రాహ్మణుల సస్వరస్ఫుటోచ్చారిత వేదమంత్ర విధానముగ గావించిన పుణ్యాత్ములు.

సంతతి సంపదయు గలిగినను వినయవిధేయతలు గల మహావ్యక్తి; ఈతని గుణగణమును వదాన్యతను దేవబ్రాహ్మణభక్తిని సంతత విద్వత్సత్కారమును మితహిత సంభాషణమును వ్యవహారదక్షతను మందస్మిత వదనారవిందమును గమనించినవారు తప్పక ధన్యులగుదురు.

మతవైషమ్యముగల కోవిదులు నీతనిచెంత సామరస్యముతో నుండుట వింతలో వింతగా తోచును. దీనికంతటికి కారణము శ్రేష్ఠిగారి శ్రీమంతమని కొందరు భావింతురు. కోటీశ్వరులైనను ఈతనివలె సర్వజనప్రియముగ ప్రవర్తింపఁజాలరనియు మహాపండితులు గూడ ఈతని యందనురాగము కలిగియుండుటకు కారణము ఈతని సుకృతమేననియు భావించువారిలో నేనగ్రగణ్యుఁడను.

శ్లో॥ అత్యుత్కటైః పుణ్యపాపై - రిహైవ ఫల ముచ్యతే ॥

పుణ్యము అతిశయించినను పాపము పెరిగినను ఈ జన్మయందే ఫలించును. అన్నట్లు బాల్యమున వీరెంత కష్టపడిరో యౌవనవార్ధకములయందు అంత సుఖపడుచున్నారంటే వీరి పుణ్యప్రభావమేయని చెప్పవచ్చును.

ఇంతవైభవముండియు నిరాడంబరముగ ప్రవర్తించు విశాలహృదయులగు శ్రేష్ఠిగారి జీవితవిశేషములను వ్రాయుటకు నా బోంట్లు చాలుదురా?

శివభక్తి శ్రేష్ఠిగారికి కొంగుబంగారమువంటిది. ప్రమాణగ్రంధములను స్తోత్రములను పాఠ్యపుస్తకములను లాభనష్టములను పాటింపక స్వకీయమహాముద్రాక్షరశాలయందు ముద్రించుచు సరసమూల్యమునకు విక్రయించుటలో వీరికి వీరే సాటి.

అదేమిటో ఎట్టి పుస్తకమైనను వీరిచే ముద్రింపఁబడునెడ మార్కెటునందు వడివడిగా విక్రయము అగును. దీనికి కారణము చిత్తశుద్ధియా? పట్టుదలయా? దైవవిశ్వాసమా? చెప్పుడు! అన్నియు కూడి శ్రేష్ఠిగారియందు నివాసము నేర్పరచుకొనినవని నేనంటాను.

పబ్బావంశ సుధాకరుఁడగు శంకరయ్య శ్రేష్ఠిగారు - ఎంత ధనార్జనపరులో అంత నుదారులు; వీరు ముట్టినది బంగారమగుచున్నదని తోటివైశ్యులు అసహనముతో గ్రంధముద్రణ వ్యాపారమును చేయుచున్నారు కాని క్రయవిక్రయసామంజస్యమునను సక్రమ ధనలాభమునందునను వెనుకఁబడుటచే వీరి సౌభాగ్యము అద్వితీయమని తేటపడును.

శ్రేష్ఠిగారు తమకుగాని తమవారికిగాని శరీరస్వాస్థ్యము తప్పినపుడు ముందు మందుకై పరుగెత్తక శ్రోత్రియులద్వారా రుద్రాభిషేకాది దైవవిధానముల నవలంబించుట - సమకాలికులకు విస్మయ జనకంబగును. ఐనను శ్రేష్ఠిగారి దైవ నిష్ఠ దినదిన ప్రవర్ధమానముగ విలసిల్లుచున్నయది.

శ్రేష్ఠిగారి కుమారులు శ్రేష్ఠిగారివలె వ్యవహారదక్షులై పుస్తకవ్యాపారమును సాగించుచున్నను తండ్రిగారి యాశయములను సమర్థించుచు వారిదైవకార్యములకు సర్వాత్మనా తోడుపడుచుందురు. ఇద్ది నగ్నసత్యమైన విషయము.

కుమారుల వివాహములయందు మనుమరాలి పాణిగ్రహణమునందును తదితర శుభకార్యముల యందును శ్రేష్ఠిగారిచే సత్కరింపఁబడని పండితుఁడు జంటనగరాలలోను తెలంగాణ ఆంధ్రులయందును లేడని చెప్పవచ్చును.

శ్రేష్ఠిగారు మాటలాడునపుడు బాగుగ ఆలోచించి ఎదుటివారి మనస్సు కనిపెట్టుచుందురు. మరియు సమయోచిత సంభాషణము శ్రేష్ఠిగారి జన్మహక్కు కావచ్చును. ఎవరో సమర్థులు మేధావులు శ్రేష్ఠిగారిని మెప్పింతుమని వచ్చి వారిచే నిరుత్తరులుగా చేయఁబడి తమ తొందరపాటు నవగాహనఁజేసికొని స్నేహానురాగములతో వెళ్లుచుండుటచే శ్రేష్ఠిగారి లోకజ్ఞాన సంపూర్ణత ఎంతటిదో నిర్ణయింపవచ్చును.

శ్లో॥ శుచినాం శ్రీమతాం గేహే - యోగ భ్రష్టో ఽభిజాయతే;

గీత.

యోగ భ్రష్టుఁడు - అనఁగా పూర్వజన్మమున శివధ్యానయోగమును పూర్తిగా చేయనివాడు ఇప్పుడు సదాచారసంపన్నులగు బ్రహ్మశ్రీమంతుల యింటియందు జన్మించు నను గీతా వాక్యమునసరించి మన పబ్బాశంకరయ్య యోగభ్రష్టుఁడని నిరూపింపవచ్చును.

ఐతే ఈతఁడు పూర్వము ఎట్టి యోగమునభ్యసించెనను ఆకాంక్ష కలుగకమానదు. సారస్వతయోగము అనఁగా వాఙ్మయమును పుస్తకరూపముగ ప్రకటించు యోగము నభ్యసించి అట్టిదానిని పరిపూర్ణమొనర్చుటకు పబ్బాయను సద్వంశమునందు జన్మింపవలసివచ్చెనని సహృదయులు సరసముగ వక్కాణింపవచ్చును.

యోగభ్రష్టులకు పునర్జన్మ లేదని భగవానుని యుపదేశము. శ్రేష్ఠిగారును జన్మరాహిత్యమునకై ఈ రామాగ్రంధాలయమును ముద్రణాలయమును నడిపించుచున్నారను నా మాట మీరు అవునంటారా? కాదంటారా?

జన్మరాహిత్యమునకై జ్ఞానము పరమసాధనమని ప్రామాణికులందరు నంగీకరింతురు. అట్టిజ్ఞానము పరోక్షమనియు అపరోక్షమనియు రెండువిధములు; అపరోక్ష (ప్రత్యక్ష) జ్ఞానమునకు పరోక్షజ్ఞానమవసరము. పరోక్షజ్ఞానము వేదశాస్త్రగురు ప్రబోధమువలన కలుగును. ఆచార్యుఁడు వేదశాస్త్రపురాణములను

బోధించుటకు గ్రంథములు కావలెను. అట్టి గ్రంథములు అముద్రితములైనచో అందుబాటులో నుండ జాలవు. అముద్రితముల నచ్చువేయించుటకు నుత్తమాధికారులే తగియుందురు. స్వయముగా విజ్ఞానముకలిగి కోవిదుల చేయూతచే పరిశీలన దృక్పథమున గంథములను సర్వాంగసుందరములుగను నిర్దుష్టములుగను దేవుని వివిధరూపముల ఛాయాచిత్రములతో భక్తిశ్రద్ధలు చెలరేగునట్లు ప్రచురించుచు సుసమయమున చదువరుల కందఁజేయువారే ఉత్తమాధికారులనఁబడుదురు.

విజ్ఞానమును మఱుగు పఱచుకొని విద్య నేరికిని తెలుపకుండువారు ఎంతటి విద్వాంసులైనను ఉత్తమాధికారులు కాజాలరను అభిప్రాయము దృఢపడుచున్నకొలది శ్రీ శ్రేష్ఠిగారు మూలమూలలనున్న నాబోటి కూపస్థమండూకములను కనిపెట్టి ఎట్టి అర్హతలేని ధ్రువునిఁజేరిన శ్రీ మహావిష్ణువువలెను మార్కండేయుని చిరంజీవు నొనర్చిన మహాదేవుని వలెను పార్థుని కరుణించిన అమరేశ్వరునివలెను స్వయముగా సమీపించి గ్రంథరచనకై పురికొలిపిన మహానుభావులు.

శ్రీవీరభద్రస్తోత్రము పూజావిధానము మొదలగు సంకలనమును నాతో వ్రాయించి ముద్రింపించుటయే గాక నా చిన్నచిన్న రచనలైన పార్థివలింగస్తోత్రాదులను తమగ్రంథములలో చేర్చుకొని ప్రచురించిరి. శాస్త్రపండితులనేగాక వేదవిదులను కవులను శిల్పులను రచయితలను వక్తలను విలేఖరులను జ్యోతిష్కులను నిష్పక్షపాతముగ సత్కరించు శ్రీశ్రేష్ఠిగారు అపర భోజరాజులనియు ద్వితీయ శ్రీకృష్ణదేవరాయలనియు చెప్పుట ముమ్మాటికి సమంజసము కాకుండునా?

రామగ్రంథాలయమనక "రామా" అని దీర్ఘమెందులకు అని నాలో నేను తర్కించుకొని లలితా సహస్రనామములోని "రామా" అను నామధేయము ననుసరించి రామాభవనమనియు రామాబుక్‌డిపో అనియు రామాముద్రణాలయ మనియు వ్యవహరించుట యుక్తమైనదని సమాధానమును చెప్పుకుంటిని. ఇదియే శ్రేష్ఠిగారి యభిప్రాయము కావచ్చును. శ్రేష్ఠిగారు చేయు ప్రతిపనియు మాటలాడు ప్రతిమాటయు సంకల్పించు ప్రతిప్రణాళికయు బాగుగా సాధక బాధకముల పరిశీలనముతో కొనసాగుచుండును. అందువలననే వారు సిద్ధసంకల్పులని సజ్జనులు నుడువుచుందురు.

విశాలకుటుంబము కలిగియు కార్మికుల ననేకులను పోషించుచుండియు ధర్మకార్యములను నిర్వహించుచున్నారంటే శ్రేష్ఠిగారిలోని ఆత్మబలము త్యాగశక్తియు ఎంతటివో శేముషీవిశేషమండితులగు పండితాఖండులులు దండిగా నాలోచింపవలయును.

వివిధ భక్తిజ్ఞానవైరాగ్య ప్రబోధక గ్రంథ ప్రకాశనముతో పరులకు పరోక్షజ్ఞానమును కలిగించిన శ్రేష్ఠిగారు స్వయముగా అంతకుమించిన విజ్ఞానము కలవారని తేటపడును.

శ్రీ పబ్బాశంకరుఁడు – బాల్యమున విద్యాభ్యాసముఁజేసి శ్రుతపాండిత్యమును సంపాదించినవాడగుటచే పరోక్షజ్ఞానము సహజముగా కలిగి తద్ద్వారా ప్రత్యక్షజ్ఞానము నలవఱచుకొను నుద్దేశమున భక్తిమార్గము

నవలంబించి పరమేశ్వరుని అభిషేకపూజాపస్తోత్రాది వివిధ రూపముల నారాధించుచున్నవాడు. ఇట్టిభక్తియే అపరోక్షజ్ఞానముగ పరిణమించునని శాస్త్రవిదుల సిద్ధాంతము.

అపరోక్షజ్ఞానమనఁగా? ఈశ్వరసాక్షాత్కారమని కొందరు స్వస్వరూపజ్ఞానమని మరికొందరు దేహాత్మభ్రమనివృత్తియని కొందరును చెప్పుదురు. "పరంజ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" "ఉపాసకుఁడైన ఉత్తమజీవుఁడు పరమేశ్వరుని పొంది నిజరూపము నావిష్కరించుకొని శివానందము ననుభవించును" అను శ్రుతి ననుసరించి పరమేశ్వర ప్రాప్తికి సాధనమగు ఈశ్వరసాక్షాత్కారము సంపూర్ణ అపరోక్షజ్ఞానము కాదనియు పరమేశ్వరు నాశ్రయించిన తరువాతనే సంపూర్ణశివజ్ఞానము కలుగుటఁజేశి జీవుఁడు నిజరూపవ్యక్తి యగునని సర్వమతసామరస్యవాదులు నిరూపించుచుందురు.

ఐతే ఇట్టి సామరస్యవాదమే మనశ్రేష్ఠిగారికి సమ్మతమగుటఁజేశి సమావేశములలో సర్వమతపండితులను రప్పించి వారిలోని వైదుషీకళ కనుగుణముగా సత్కరించుట యలవాటైనది.

ఇట్టి సద్గుణములు మిక్కుటముగ కలిగి సత్కార్యములచే భగవదారాధనము నొనర్చి శ్రేష్ఠిపుంగవులు తమ జన్మసార్థకతను సమకూర్చుకొనుచు కుమారులకు మార్గదర్శకులుగ నున్నవారు. శ్రేష్ఠిగారి కుమారులందరును గుణవంతులు ధీమంతులు వినయవిధేయతలతో శోభిల్లు ధార్మికభావనఁగలవారుగను, కోడండ్రు సాధ్వీమణులై అత్తమామల అడుగు జాడలలో నడచు ఉత్తమఇల్లాండ్రుగను, మనుమలు మనుమరాండ్రును విద్యావినయసంపన్నులుగను వీరి సాధ్వీమణి – జానకీదేవివలె నుత్తమగృహిణిగను ప్రవర్తించుచుండుటఁజూట శ్రేష్ఠిగారి పూర్వపుణ్యము పుంజీభూతమై ప్రారబ్ధముగ పరిణమించినట్లు స్ఫురించును.

ఎంతవరకు మానవునికీర్తి విలసిల్లుచుండునో అంతవరకు స్వర్గాదిపుణ్యలోకనివాసము లభించునని మహాభారతము చెప్పుచుండుటచే శ్రేష్ఠిగారు అధిక కీర్తినార్జించుటయందు నేమరుపాటులేక నుందురనియు "అతిపుణ్యం సమాచరేత్" అను బ్రహ్మోత్తరఖండవచనము ననుసరించి యమిత పుణ్యమును మూట కట్టుకొనుచున్నారనియు నిర్ణయింపవచ్చును.

ఐతే ఇట్టి కీర్తిపుణ్యముల ఖనియగు శ్రేష్ఠిగారివంశము – దీర్ఘాయుష్మంతులు బుద్ధిమంతులు గుణవంతులు దైవబ్రాహ్మణభక్తికలవారు త్రికరణశుద్ధిగ విజ్ఞానము నార్జించి దేశసేవఁ జేయువారు నగు పుత్రులతోడను పౌత్రులతోడను ఆచంద్రతారార్కము విలసిల్లుగాక!

శ్రేష్ఠిగారు దీర్ఘాయురారోగ్యభాగ్యములతో తులఁదూగుచు ఇతోఽధిక సద్గ్రంథప్రకాశనముఁజేయుచు కలకాలము మనుదురు గాక!

శ్రేష్ఠిగారి ధర్మపత్ని దీర్ఘసుమంగళియై తనకుంటుంబమును జగన్మాతవలె కనిపెట్టుకొని చిరకాలము జీవించుగాక!

శ్రేష్ఠిగారి పుస్తకప్రకాశనాత్మక విజ్ఞానప్రచారవ్యవహారము దినదినాభివృద్ధమై యోగక్షేమములతో నిరంతరము కొనసాగుగాక!

శ్రేష్ఠిగారు అనన్యసామాన్యపుణ్యకార్యముల ద్వారా సదాశివు నారాధించుచు "మానవసేవయే మాధవసేవ" అను నానుడి ననుసరించి పరోపకారపారీణులగుదురు గాక!

శ్రీశ్రేష్ఠిగారు కోరుటతోడనే అంగీకరించి త్వరలో ఈ పొత్తమును ముద్రించి సకాలమున అందఁ జేసినందులకు శ్రీ కరుణశ్రీ ప్రింటర్సు వారికి శ్రీ శ్రేష్ఠిగారికి నేను ధన్యవాదముల నొసఁగుచున్నాము.

సర్వేజనాః సుఖినో భవంతు.
ప్రాణిషు సద్భావనా సిద్ధిరస్తు.
లోకకల్యాణ ప్రాప్తి రస్తు.
నిరంతరం భక్తిజ్ఞాన ప్రచారసిద్ధి రస్తు.
సర్వేషాం స్వసంప్రదాయసమాచరణ సిద్ధిరస్తు.

హర హర మహాదేవ.

**నిర్మల శంకరశాస్త్రి**



# విషయసూచిక

| విషయము | పుట సంఖ్య |
|---|---|



ఓమ్
శ్రీ మహాగణాధిపతయే నమః
శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః
శ్రీ మహా సరస్వత్యై నమః

# శ్రీ శివ మహాపురాణము

## శ్రీ విద్యేశ్వర సంహిత

### ప్రథమాధ్యాయము

మంగళా చరణ శ్లోకము:

ఆద్యంత మంగళ మజాత సమాన భావ
మార్యం త మీశ మజరామర మాత్మదేవమ్ ।
పంచాననం ప్రబల పంచ వినోదశీలం
సంభావయే మనసి శంకర మంచికేశమ్ ॥

అర్థము – పార్వతీపతియగు శంకరుని హృదయమునందు భావించుచున్నాను. ఎందుకనగా? శంకరుడు – త్రిమూర్తులలో రుద్రుడనంబఱగుటయే గాక సృష్టికిమున్ను ప్రళయాంతమునను మంగళస్వరూపము కలిగియుండువాడు లేక సృష్టిస్థితిలయ సమయత్రయమునందును భక్తులకు శుభము నొసంగువాడును ఇందువలననే "నతత్సమ శ్చాభ్యధికశ్చదృశ్యతే" అను శ్రుతి ననుసరించి సమానుం డుగాని అధికుడు గాని లేనివాడును నిఖిల సురాసుర గంధర్వ కిన్నర మానవులచే పూజింపఁబడువాడును లోకవేదముల యందు ప్రసిద్ధుడును ముసలితనము మరణము లేనివాడును (అనగా మృత్యుంజయుడై భక్తుల అపమృత్యువులను తొలగించువాడని భావము.) పంచభూతములలో కర్మజ్ఞానేంద్రియములలో అంతఃకరణమునందును నివసించువాడే గాక జీవాత్మలయందు నివసించువాడును తన శరీరమగు చిచ్ఛక్తియందు ప్రకాశించువాడును సద్యోజాతాది పంచముఖములతో అనాదిసిద్ధములైన సృష్టిస్థితిలయ తిరోధాన అనుగ్రహములనంబడు పంచకృత్యములను వినోదముగా గావించు స్వభావము గలవాడునై యున్నవాడు.

శ్లో॥ వ్యాసం వశిష్ఠనప్తారం - శక్తేః పౌత్రమకల్మషం ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥

అర్థము - వశిష్ఠమహర్షికి మునిమనుమడు, శక్తి యొక్క మనుమడును, పరాశర మహర్షిదగు కుమారుఁడును శుకమహర్షితండ్రియు తపోనిధియునగు వ్యాసమహర్షిని నమస్కరించుచున్నాను.

## సరస్వతీ ప్రార్థనము

శ్లో॥ శారదాం నీరజాస్యాం శ్రీ - కరాంఘ్రిద్వయ పూజితామ్ ।
నారదాది మునిజ్ఞాన - కరీం వాణీం విధే ర్భజే ॥

కమలము వంటి ముఖము కలదియు, శ్రీకరములైన రెండు చరణములయందు పూజింపబడునదియు; నారదుఁడు మున్నగు మహర్షులకు జ్ఞానమునుపదేశించునదియు బ్రహ్మదేవుని వాణీస్వరూపిణియు నగు శారదా (సరస్వతీ) దేవిని ప్రార్థించుచున్నాను.

## శ్రీ దక్షిణా మూర్తి ప్రార్థనము

శ్లో॥ సర్వలోక గురుం వందే - విద్యానాథం సుదైవతం
దక్షిణామూర్తి మీశానం - వటచ్ఛాయా సమాశ్రితమ్ ॥

పదునెనిమిది విద్యల దొరయు ప్రసన్నదైవమును లోకములయందంతట నివసించు సుధీమణుల ఆచార్యుడును కైలాసముపై వటవృక్షము క్రింద సమాసీనుఁడును సమస్త చరాచరశాసకుండు నగు దక్షిణామూర్తిని మ్రొక్కులిడుచున్నాను.

## శ్రీ నీలకంఠ శివాచార్య ప్రార్థనము

శ్లో॥ నీలకంఠ గురుం వందే - బ్రహ్మసూత్రార్థ కోవిదం
విశ్వేశ్వరసుతం సర్వ - మంగళాపతి మగ్రజమ్ ।
గౌతమీతీరవిభ్రాజత్ - కాళేశ్వర నివాసినం
ప్రస్థానత్రయకర్తారం - గౌతమం శైవ పుంగవమ్ ॥

వ్యాసమహర్షికృత బ్రహ్మసూత్రముల యథార్థమును విశదపఱచువాడునుగోదావరీ తీరమున విలసిల్లు కాళేశ్వరక్షేత్రమునందు నివసించువాడును, విశ్వేశ్వరారాధ్యులవారి కుమారుడును సర్వమంగళయను సాధ్వీమతల్లికి ప్రాణనాథుడును ఉపనిషద్గీతా బ్రహ్మ సూత్రముల భాష్యములను రచించినవాడును శ్రీమదాద్య శంకరాచార్యులవారి కంటె సుమారు వేయివత్సరముల ముందు జన్మించిన వాడును గౌతమసగోత్ర సంజాతుఁడును శైవాచార్యులలో ప్రముఖులునగు శ్రీ మన్నీలకంఠ భగవత్పాదుల వారి నభివాదించుచున్నాను.

## స్వగోత్ర ఋషివందనము

శ్లో॥ గౌతమాఖ్యం మునిం వందే - స్వగో త్రాదిమ మన్వహం ।
అంగీరసమునిం శైవ - మాయాస్యం వేదపారగమ్ ॥

గ్రంధకర్తగారి గోత్రమునందలి ఆదిపురుషుడైన గౌతమ మహర్షిని శివభక్తాగ్రేసరుడగు అంగీరస మహర్షిని వేదవేదాంగవిదుడగు ఆయాస్యమహర్షిని నమస్కరించుచున్నాను.

## స్వవంశ మూలపురుషుని వందనము

శ్లో॥ ఆచార్యం ఫాలనేత్రాంకం - త్రిలోకీ గురు మద్భుతం ।
వందే శైవాఖిలారాధ్యం - మల్లికార్జున పండితమ్ ॥

ద్వాదశశైవాచార్యులలో ప్రముఖులును నొసట మూడవకంటి గుర్తుగల వారును అనన్య సాధ్యములగు మహిమలను చూపెట్టిన వారును స్వర్గమర్త్య పాతాళముల యందలి సజ్జనులకు శాంభవదీక్షాగురువులును శైవప్రముఖులందరిచే సత్కరింపఁబడినవారు నగు మల్లికార్జున పండితారాధ్యుల వారికి శరణములను సమర్పించుచున్నాను.

## స్వ శాంభవ దీక్షా గురు వంధనము

శ్లో॥ ఆరాధ్యం సోమలింగాఖ్యం - శరణం ప్రార్థయే సదా ।
యత్కృపావశతః పుంసః - మోక్షమార్గో విరాజతే ॥

శ్రీ శ్రీ మల్లికార్జునపండితారాధ్య వంశీయులు, శమదమాది సంపన్నుడైన ముముక్షువునకు శాంభవదీక్ష ననుగ్రహించి అర్చిరాది మోక్షమార్గమును కనిపెట్టు యోగ్యత నాపాదించు వారు ఓరుగల్లునందలి శివకళానిలయములో నివసించువారు పుత్రపౌత్రాదికుటుంబ బాహుళ్యము గలవారు నగు శ్రీ శ్రీ కొడిమేల భోగ సోమలింగమూర్తి ఆరాధ్యులవారి చరణములకు త్రికాలములయందు మ్రొక్కులిడుచున్నాను.

## అధ్యాపక గురు వందనము

శ్లో॥ నృసింహాచార్య విదుషం - నాథమాచార్య మాదరాత్ ।
విఠ్ఠలం విప్రవర్యంచ - లక్ష్మణం శాస్త్రిణం భజే ॥

సంస్కృత సాహిత్యము నొనగూర్చిన శ్రీ ఆచి వేంకటనృసింహాచార్యులవారిని తర్క వ్యాకరణములను ప్రబోధించిన శ్రీ నాథాచార్యులవారిని వేదమునభ్యసింపఁజేసిన శ్రీ గాడిచెర్ల విఠోబగారిని పూర్వోత్తర మీమాంసా శాస్త్రముల నధిగమింపఁజేశిన ఆత్రేయ శ్రీ లక్ష్మణశాస్త్రి వరేణ్యులవారిని మిగత వాద్యాగురువుల నందరిని నమస్కరించుచున్నాను.

శ్లో॥ శైవవాఙ్మయ విజ్ఞాన - కారకౌ విద్వదుత్తమౌ ।
ఆరాధ్యౌ నాగలింగేశ - వీరేశౌవ ప్రణమామ్యహం ॥

ప్రస్థానత్రయము మున్నగు శైవవాఙ్మయముఁదగు విజ్ఞానమును కలుగఁజేశినవారును పండితప్రకాండులును శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రి అను ఆరాధ్యవతంసులను ఆరాధింతును.





## స్వపితృ వందనము

శ్లో॥ పితరం రామనాథాఖ్యం - భుక్తిముక్తి సుఖప్రదం ।
పితామహ మహం వందే - పాంబేశం ప్రపితామహమ్ ॥

"సుకృతీగతాయుః" అన్నట్లు నలుబదియారువత్సరముల జీవితములోనే వేదవేదాంగముల నభ్యసించి ఇహపరసాధనసామర్థ్యముతో అద్వితీయమగు బ్రహ్మాస్త్రమును నెరవేర్చియు శిష్యుల అజ్ఞాన అవివేకములను పారద్రోలు సత్త్వబోధములనుగావించుచు యోగమున తమ ప్రాణములను లింగైక్యమొనర్చిన శ్రీ రామనాథారాధ్యులు అను జనకుని పాపేశ్వరాఖ్యులగుపితామహుని
అంబేశ్వరనామధేయులగు ప్రపితామహుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ అన్నపూర్ణా మహం వందే - మాతరం చాగ్రజం కిల ।
విద్యా వివాహ కర్తార - మంబేశం లోక విశ్రుతమ్ ॥

అన్నపూర్ణాంబయను మాతృదేవతను, బాల్యమున పితృవియోగమును మఱపించు పోషణమును విద్యాభ్యాసమును వివాహమును ఒనగూర్చినవారును కాశీరామేశ్వరాది పుణ్య క్షేత్రములయందు ఆంధ్రమహారాష్ట్ర ప్రముఖ గ్రామములలోను యజ్ఞయాగాది సత్కార్యముల నొనర్చుటఁజేసి ప్రఖ్యాతిగడించినవారును అగ్రజులునగు అంబయారాధ్యుల వారిని భావించుచున్నాను.

## స్వకీయ సంగ్రహము

శ్లో॥ సుందరీ విమలా నాథః - విశ్వనాథాగ్రజో బుధః ।
అస్తి యస్యసుతా సర్వ - మంగళాఖ్యా గుణాన్వితా ॥

సోఽహం జాతో పింగళాబ్దే - శ్రావణే కృష్ణ పక్షకే ।
ద్వాదశ్యాం భౌమావారే చ - సాయం గేహే పితుః శుభే ॥

నిర్మలాయాం సోమ పేఠౌ - బంధుజాలం సునందయన్ ।
శివాజ్ఞయా శైవలోక - సేవార్థై శివపూజకః ॥

సుందరి, విమల, అను సౌభాగ్యవతులు పత్నులుగాను విశ్వనాథము అను ఆరాధ్యుడు సోదరుడుగాను సర్వమంగళ యను సుగుణఖని ఏకైకపుత్రికగాను శ్రీ పింగళనామ సంవత్సర శ్రావణ కృ॥ ద్వాదశి మంగళవారము సాయంత్రము ఆంధ్రప్రదేశమున ఆదిలాబాదు జిల్లాలోని తాలూకా నిర్మలయందు సోమవారంపేటలోని తండ్రిగారి యింటియందు శుభముహూర్తమున శైవలోకమును సేవించుటకు శివునారాధించుటకును ఆప్త బంధువులందరు సంతోషించుచుండగా జన్మించినవాడను, మరియు శివాజ్ఞననుసరించి వదాన్యవతంసులు, సద్గుణనిధులు, వైశ్యశిఖామణులు, విద్యాపోషకులు, విద్వజ్జన మనోరంజకులు, పబ్బాన్వయ వారిధి రాకాసుధాకరులునగు శ్రీ (పబ్బా ) శంకరయ్యశ్రేష్ఠిగారిచే ప్రేరితుడనై "శివ విజ్ఞాన సర్వస్వము" అను తెలుగు తాత్పర్యమును వ్రాయుచున్నాడను.

# ఉపక్రమము (విద్యేశ్వర సంహిత)

ధర్మక్షేత్రము సత్పురుషసంకలితము గంగాయమునా సంగమము బ్రహ్మలోకమునకు మార్గము పరమపవిత్రంబునగు ప్రయాగక్షేత్రమునందు సత్యవ్రతపరాయణులు సహృదయులు గొప్పమహిమ గలవారు శివానుగ్రహమను మహాభాగ్యము కలవారునగు ఋషులు మహాయాగమును చేయుచుండిరి. అట్టితరి వేదవ్యాసుల వారి శిష్యుండగు సూతమహర్షి - మహాయాగములో పాలుగొనిన మునులను చూడగోరి యరుదెంచగా పౌరాణికోత్తముండగు సూతమహర్షిని గాంచి ముదితాంతఃకరణులై సుప్రసన్నమనంబున గౌరవించి వినయముతో చేతులుజోడించి సూతుని వర్ణించుచు దిగువవిధము ప్రశ్నించిరి.

సర్వజ్ఞుడైన రోమహర్షణుడా? మా భాగ్యవశమున నీవు వ్యాసుల వారి వలన సమస్త పురాణవిద్యఁ బరిగ్రహించినాడవు కావున శ్రేష్ఠములైన రత్నములకు సముద్రమువలె పరమేశ్వరుని ఆశ్చర్యకర లీలలతో నిండియుండు కథాప్రసంగములకు నిలయమగు వాడవు.

భూతము వర్తమానము భవిష్యత్తు నందలి వస్తువులలో నీకు తెలియని దొక్కటియు త్రిలోకియందు లేదని చెప్పవచ్చును. అస్మత్సుకృతబలమునఁ జేశి యిచ్చోటికి వచ్చిన వాడవు కావున ఎద్దియే నొక శ్రేయస్సు నొనఁగూర్పక వెళ్ళవలదు. ఈ వరకు శుభములు అశుభములునగు సమాచారములను వినియుంటిమి గాని సంతృప్తులము కాసులేదు. ఇంకనేదో వినవలెనని కుతూహలము కలుగుచున్నది. ఐతే ఒక్కటియే వినదగినదై యున్నది. అద్ది రహస్యమైనను మా యందు దయ గలవాడవేని వక్కాణింపుము.

ఘోరమైన కలియుగము ఏర్పడినపుడు మానవులు - తఱచుగా పుణ్యముల నాచరింపకుండుటయు దురాచారములను నడచుటయు సత్యమును పరిపాలింప కుండుటయు పరనిందాపరులగుటయు పరద్రవ్యముల నభిలషించుటయు ఇతరులను బాధించుటయు దేహమే ఆత్మయని భావించుటయు తెలివితక్కువ గలవారుగా నుండుటయు దేవుఁడు పరలోకము లేదనుటయే గాక వేదశాస్త్రపురాణేతిహాసములు కల్పితములనుటయు పశువుల వలె వివేక విజ్ఞాన రహితులై సంచరించుటయు తల్లిదండ్రులను ద్వేషించుటయు స్త్రీవశీభూతులగుటయు కామకింకరులగుటయు సంభవించును.

ఇంతియేగాక బ్రాహ్మణులు - తమ వర్ణధర్మమును విడనాడుదురు. లోభమను మొసలిచే కరువం బడినవారై డబ్బుగడించుటకు చదువుకొందురు మదమోహింతులై ఇతరులను మోసగింతురు. త్రికాల సంధ్యావందనము లేనివారై వేదార్థజ్ఞానశూన్యులై దయాదాక్షిణ్య వర్జితులై పండితమ్మన్యులుగాను తమ ఆచారమును పుణ్యవ్రతముల నాచరింపని వారుగాను వ్యవసాయతత్పరులుగాను క్రూరస్వభావులుగాను మలినమైనమనస్సు గలవారుగా నుందురు.

ఇక క్షత్రియులైతేనో స్వధర్మమును విసర్జించి దుష్టసహవాసముతో వ్యభిచారము మున్నగు కలుషితముల నాచరించుచు శౌర్యము యుద్ధప్రీతియు లేనివారై రణరంగమునుండి పారిపోవుచు దొంగతనముతో జీవించుచు శూద్రసదృశులై కామకింకరులై శస్త్రాస్త్రవిద్యల నభ్యసింపక గోవులను బ్రాహ్మణులను పోషింపనివారై శరణాగత రక్షణము నందసమర్థులై కామినియను వేటగానికి మృగములం బోలె లొంగుచుందురు. మఱియు ప్రజలను కాపాడుటయను సద్ధర్మము నాచరింపక భోగలాలసులై జనులను పీడించుచు జీవహింసాపరాయణులై దుర్మార్గులుగా నుందురు.

వైశ్యులు – ఉపనయనాది సంస్కారహీనులై స్వధర్మమును పరిహరించి కుత్సితమైన మార్గమునందు సంచరిరంచుచు తమ సంపాదనయందలి ఆసక్తిచే తూచుటయందు హెచ్చు తగ్గులు చేయువారుగాను గురువులయందు దేవతలయందు బ్రాహ్మణులయందును భక్తిలేని వారై దుష్టబుద్ధితో బ్రాహ్మణులకు భోజనము నిడక తామును పూర్తిగా అనుభవింపక ధనము కూడబెట్టువారుగాను భిక్షువులకు పిడికిలితో నొసగువారు గాను జారిణీస్త్రీలయందనురాగము గలవారుగాను కల్మషహృదయము గలవారుగాను లోభముచేతను మోహముననను వివేకముందప్పువారుగాను ఇష్టాపూర్తాది సుకృతముల నాచరింపనివారుగా నుందురు.

అలాగుననే శూద్రులలోకొందరు బ్రాహ్మణాచారములనుగావించుచుందురు. ఉద్రేకమును కలిగించు వేషములం దాల్చువారై మూఢబుద్ధిగలవారుగాను స్వధర్మమును త్యజించువారు గాను తపస్సుల నాచరించుచు బ్రాహ్మణుల ప్రభావమును తగ్గించువారుగాను శిశువులను బాధించువారుగాను మహామంత్రములను గురూపదేశము లేకయే ఉచ్చరించువారుగాను శాలగ్రామ శిల మొదలగు వానిని పూజించుచు హవనమును చేయువారుగాను బ్రాహ్మణులను నిందించుచు లోకవేద విరుద్ధముగా ప్రవర్తించువారు గాను కపటస్వభావముతో ధనము నార్జించుచు నింద్య కర్మల నాచరించువారుగాను విద్యనభ్యసించి వివాదముఁ జేయువారుగాను అఖ్యానములను వక్కాణించుచు ఉపాసనాపద్ధతులఁ బ్రబోధించు వారుగాను ధర్మమును మఱుగుపఱచుచు మంచిరాజులవలె కన్పట్టువారై డాంబిక ఆచారపరులై గొప్పదానముల నాచరించుచు మిక్కిలి మదము గలవారై తమను ప్రభువులుగా భావించుచు బ్రాహ్మణాదులను తమ సేవకులుగా నొనర్చువారుగాను వర్ణసంకరకారకులై క్రూరస్వభావముతో గొప్ప అహంకారముతో చాతుర్వర్ణ్యధర్మమును లోపింపఁజేయువారై తామే శ్రేష్ఠకుల సంజాతులమని ఇతర వర్ణస్థుల నవమానించువారుగాను తమకు అధికారములేని సుకృతములను గావించువారుగా నుందురు.

ఇంక కలియుగములో వనితలు – తఱచుగా భర్తలనవమానింతురు. అత్తమామలను ద్వేషింతురు. భయములేనివారై ప్రవర్తింతురు. మన్మథవికార విహ్వలలై కుత్సితములైన హావభావములతో విటులఁ గలియుచుందురు. తమ స్వాములకు విముఖురాండ్రై యుందురు.

కుమారులైతేనో మాతాపితరులయందు ఆదరబుద్ధి లేనివారై దుష్టబుద్ధితో అజ్ఞానమును పెంపొందించు విద్యల నభ్యసించుచుందురు. ఎల్లకాలము అనారోగ్యముతోడను వ్యాధుల తోడను బాధపడుచుందురు.

ఇట్టివారందరికిని ఈ లోకమునందు పరలోకములోను సుఖము సమకూరుటఎట్లు? అని మా మనస్సు చింతాక్రాంత మగుచున్నయది. పరోపకారముతో సమానమగు ధర్మము మరి యొకటి లేదుగదా! ఏతాదృశుల పాపములను పరిహరించు లఘుఉపాయమును సర్వవిధ సిద్ధాంతములను కనుగొనిన నీవు కరుణతో మాకు ప్రస్తుతము వక్కాణింపుము!

మహానుభావులైన మున్నులప్రశ్న నాకర్ణించిన సూతమహర్షి – మనస్సుతో శంకరుని స్మరించి చెప్పఁదొడగెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ప్రథమాధ్యాయము.

# ద్వితీయాధ్యాయము

## (శివపురాణ శ్రేష్ఠత్వము)

సాధువులైన ఋషులారా? మూడు లోకములకు హితము నొనగూర్చు విషయమును గురించి బాగుగా ప్రశ్నించితిరి. నా విద్యాగురువగు వేదవ్యాసుని స్మరించి మీ యందలి స్నేహమున నే చెప్పు నంశమును ఆసక్తితో వినుడు!

సమస్త ఉపనిషదముల సారసర్వస్వంబును పాపపటలములంబోగొట్టునదియు ఇహపర లోకములలో సుఖము నిచ్చునదియు కలియుగమున సంభవించు కల్మషములను తొలగించునదియు పరాత్పరుడైన సదాశివుని దివ్యలీలా చరిత్రమును గానముం జేయునదియు ధర్మార్థ కామమోక్ష ఫలముల నొసగునదియు సర్వోత్తమంబునగు శివమహా పురాణ మొండు కలదు. ఇద్దానిఁ జదివినను వినినను తప్పక సద్గతి లభించును. ఐతే ఈ శివమహా పురాణము లోకమున ప్రచ్ఛారములోనికి వచ్చువరకే బ్రహ్మ హత్యాది మహా పాతకములు విజృంభించును. మరియు కలిమహోత్పాతములు నిర్భయముగా వ్యాపించును. అంతవరకే శాస్త్రములన్నియు వివాదాస్పదములుగా నుండును. మహాత్ములకు గూడ శివుని స్వరూపము బోధపడకుండును. క్రూరులైన యమదూతలు ఎట్టిభయము లేనివారై భూలోకమున సంచరింతురు. ఇతర పురాణములన్నియు అంతవరకే ఆర్భాటము చేయుచుండును. పుణ్యతీర్థములన్నియు కలహ భాజనములగును. మంత్రములన్నియు వివాదాస్పదములగును. పుణ్యక్షేత్రములందంతటను జనులు పోట్లాడుచుందురు. సమస్తపీఠములు నిఖిలదానములు అఖిలదేవతలును సిద్ధాంతములన్నియు సందిగ్ధ వాతావరణములో నెలకొనియుండును.

ఇట్టి శివమహాపురాణమును సమగ్రముగ పఠించుట వలనను పౌరాణిక పండితుని వలన వినుటఁ జేశియు సమకూరు మహాఫలమును చెప్పనలవికాదు. ఐనను శివపురాణ శ్రవణ పఠనాది మహిమను నా శక్తి కొలది చెప్పుచున్నాను. పుణ్యాత్ములగు మీరు మనఃపూర్వకముగా వినుఁడు! పూర్వము వ్యాసమహర్షి ఇట్లే చెప్పియుండెను.

శివమహాపురాణములోని శ్లోకమును గాని శ్లోకార్థమును గాని నిత్యము భక్తితో పఠించు వారు జీవన్ముక్తులని చెప్పవచ్చును. ఇద్దానిని పూజించువారికి దినదినము అశ్వమేధ యాగఫలము సమకూరును. ఒకానొకఁడు సాధారణ శబ్దములతో నిండియున్నదని మాత్రము భావించి శివపురాణమును వినినను పాపరహితుండగును. ఇద్దానిని సమీపించి నమస్కరించువారు సర్వదేవతా పూజాఫలము నొందుదురు. శివమహా పురాణమును సమగ్రముగా వ్రాసి శివభక్తులకు సమర్పించువారికి – శాస్త్రములయందు వేదములయందును దుర్లభముగా చెప్పఁబడిన మహాఫలము అనఁగా శాశ్వత శివసాయుజ్యము చేకూరును. చతుర్దశినాడు ఉపవసించి శివభక్త సమావేశమునందు శివపురాణ ప్రవచనముఁ జేయువాడు పూజ్యతముండని చెప్పవచ్చును. ఇందలి ప్రతి అక్షరము వేదగాయత్రీ పురశ్చర్యాఫలము నొసగునది. ప్రతి చతుర్దశిని ఉపవాసముతో రాత్రి జాగరణఁజేయుచు శివపురాణమును చదివినను వినినను కురుక్షేత్రాది పుణ్యతీర్థముల యందు సూర్యగ్రహణము సంభవించినపుడు తన తులాభారముతో ఏర్పడు ధనమును





వ్యాసతుల్యులగు బ్రాహ్మణులకు అనేక పర్యాయములు సమర్పించిన మహాఫలము సంప్రాప్తమగును. ఇందెంత మాత్రము సంశయము లేదు. అహర్నిశములు గానముఁజేయువారి పవిత్రసందేశమును దేవతలు నిరీక్షింతురు. నిత్యము తప్పకుండా చదువువారు వినువారును గావించు పుణ్యము కోట గుణితం బగును. ఇందలి రుద్రసంహితను సమాహిత మనస్కుడై పఠించువాడు బ్రహ్మఘ్నుడైనను మూడు దినములలోనే నిర్ముక్త పాపుండగును. భైరవుని మూర్తి ముందు ప్రత్యహము మూడు తడవలు రుద్రసంహితను మౌనముతో పారాయణముఁజేయువారు కామితముల నన్నిటినిఁ బడయుదురు. వటవృక్షమునకు గాని బిల్వవృక్షమునకు గాని ప్రదక్షిణములఁజేయుచు రుద్రసంహితను చదువువారు వినువారును బ్రహ్మహత్యాది పాపములనుండి విడిబడుదురు. ఇందలి కైలాస సంహిత – రుద్రసంహితకంటెను శ్రేష్ఠమై ప్రణవార్థమును ప్రకాశించు నదగుటచే బ్రహ్మ స్వరూపిణి యనఁబఱగుచున్నయది.

కైలాస సంహితామహిమను పూర్తిగా శంకరుఁడే గుర్తెరుగును. వ్యాసుఁడు సగము తెలిసినవాడు. నేను నాలుగవ భాగము కనుగొనినవాడను. ఐతే కైలాస సంహితఁజదివి గ్రహించిన వారు తక్షణముననే చిత్తశుద్ధి గలవారగుదురు. ఇఁక రుద్రసంహితచే నశింపని పాపము లోకమున గానరాదు. శివుఁడు ఉపనిషత్సముద్రమును మథించి జనింపఁజేసిన రుద్రసంహిత అను అమృతమును కుమార స్వామికి నొసగెను. ఇట్టి అమృతముఁగ్రోలువాడు నమరుండగును. బ్రహ్మహత్యాది పాపముల నిష్కృతికై నిత్యము నెల వరకు రుద్రసంహితను చదువవలెను. లేదా వినవలెను. దుష్టదానములఁబరిగ్రహించుట, దుష్టభోజనము, దుష్టసంభాషణము మున్నగు పాపములను రుద్రసంహిత నొకమారు పఠించినచో తొలగింపవచ్చును. శివాలయమున బిల్వవనమందును రుద్రసంహితా పారాయణముఁజేయువారికి సమకూరు ఫలము చెప్పనలవిగానిది. రుద్రసంహితఁజదువుచు శ్రాద్ధమున బ్రాహ్మణులకు భోజనము నిడువాని పితురులందరు శివలోకమునకు వెళ్లుదురు. చతుర్దశినాడు నిరాహారముగా బిల్వమూలము నందు రుద్రసంహితఁ జదువువాడు దేవతలచే పూజింపఁబడును. ఇందు ఇతర సంహితలన్నియు కామ్యఫలప్రదంబులేను. తథాపి ఈ రెండు సంహితలు శివలీలను శివవిజ్ఞానమును తెలుపుచున్నవి కావున ముఖ్యంబులని భావింపవలెను.

శ్లో॥ తదిదం శైవ మాఖ్యాతం – పురాణం వేదసమ్మితం ।
నిర్మితం తచ్ఛివేనైవ – ప్రథమం బ్రహ్మసమ్మితం ॥

వేదతుల్యమైన శివమహా పురాణమును శివుఁడే ప్రప్రథమముగా రచించినందున ఇయ్యది బ్రహ్మ సదృశంబని తెలియవలెను. లక్ష శ్లోకాత్మకము ద్వాదశ సంహితా విలసితంబునగు శివమహాపురాణమును వ్యాసమహర్షి – ఇరువదినాలుగు వేల శ్లోకములలో ఏడు సంహితలతో సంగ్రహించెను.

వస్తుతః పురాణమనునది సృష్ట్యాదియందు శతకోటిప్రమాణముగా ఒక్కటి గానే యుండెను. ఇట్లు శివుఁడు శాసించెను. తరువాత ద్వాపరయుగమున వేదవ్యాసుఁడు మహాపురాణమును పదునెనిమిది విభాగములుగా విభజించి నాలుగు లక్షల శ్లోకములలో సంగ్రహించెను. శివపురాణమున – విద్యేశ్వర, రుద్ర, శతరుద్ర, కోటిరుద్ర, ఉమా, కైలాస, వాయవీయాఖ్యలతో సప్త సంహితలు విరాజిల్లుచున్నవి. ఇయ్యది సర్వోత్తమమైన పదవి నొసగునదై బ్రహ్మతుల్యముగా భావింపఁబడుచున్నది ఇద్దానిని పూర్తిగా

పఠించువాడు జీవన్ముక్తుడగును. శ్రుతులు స్మృతులు పురాణములు ఇతిహాసములు ఆగమములు నూర్లకొలదియైనను ఈ శివమహాపురాణముఁదగు మహిమలో ఒకానొక స్వల్పభాగముతో గూడ సరిపడవు.

శ్లో॥ శైవం పురాణ మమలం శివకీర్తితం తత్
వ్యాసేన శైవ ప్రవణేన చ సంగృహీతమ్ ।
సంక్షేపతః సకలజీవ గుణోపకారం
తాపత్రయఘ్న మతులం శివదం సతాం హి ॥

శివునిచే కీర్తింపఁబడినదనియు దోషములు లేనిదియు నగు శివపురాణమును శైవులకు విధేయుండైన వ్యాసుఁడు సంగ్రహించెను. ఇట్టిది - దేవగంధర్వ మానవాది సకల ప్రాణులకు మంచి గుణములను కలుగఁజేయుటలో ఉపకరించును. మఱియు ఆధ్యాత్మిక అధిభౌతిక అధిదైవికములనఁబడు తాపత్రయమును పోగొట్టును. ఇద్దానితో సమానమగు పురాణము లేదు. సత్పురుషులకు మోక్షము నొసగును.

ఇందు కపటము లేనిదియు వేదాంత విజ్ఞానముతో నిండినదియు నగు ముఖ్య ధర్మము ప్రతిపాదింపఁబడినది. అసూయ ఈర్ష్య మున్నగు దుర్గుణములు లేనట్టి జ్ఞానులు ఉపాసించు వస్తువుగలది శివపురాణము; పరమాత్మయగు శివుని సమీపింపఁజేయు శివపంచాక్షరీ మహా మంత్రము మున్నగువాని విధానమును ప్రభావమును శివపురాణము తెలుపును. మఱియు మోక్షావహమే గాక ధర్మార్థకామములను త్రివర్గము సిద్ధించు మార్గములను ప్రకాశింపఁజేయును.

ఈ పురాణతిలకము శివుని సర్వోత్తమునిగా ప్రతిపాదించుటఁజేసి సత్పురాణ మనఁబఱగుచు వేదాంతములయందు వేదములయందును నిరూపింపఁబడిన పరమాత్మకోటివారిచే కీర్తింపఁబడునది. ఇట్టి అద్వితీయగ్రంధమును భక్తిశ్రద్ధలతో పఠించినవారు శివప్రియులగుటయే గాక అంత్యకాలమున శివసాయుజ్యము నొందుదురు.

ఇయ్యది "శివజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ద్వితీయాధ్యాయము.

## తృతీయాధ్యాయము

**(శివపురాణ ప్రారంభము, శివుఁడు చతుర్థపురుషుఁడనుట)**

సూతులవారు ఇట్లు చెప్పగా విని ఋషిప్రవరులు - వేదాంత సారసర్వస్వంబగు అద్భుతమైన పురాణమును వినిపింపుడని ప్రశ్నింపగా సూతుఁడు సంతోషిత స్వాంతరంగుడై శంకరుని పదే పదే స్మరించుచు బాగుగా వక్కాణింపఁదొడఁగెను.

ఋషులారా! నిరామయుండైన శివునిఁబ్రార్థించి వేదసారంబగు శివపురాణము నాలకింపుడు! భక్తి జ్ఞానవైరాగ్యము లిందు లెస్సగా పేర్కొనఁబడినవి. శివుని కనుగొనుటకు వేదాంతములను విచారింపనలవిగానివారు ఇందుమూలముగా గుర్తెరుగఁజాలుదురు.





సృష్ట్యాదినుండి అనేక కల్పములు గడువగా ప్రస్తుతంబగు శ్వేతవరాహకల్పము ప్రవర్తించినపుడు ఇద్ది పరము ఇద్ది కాదు అని ఒండొరులు తగవులాడి నిష్కర్షగానక సకలజగన్నిర్మాణ రక్షుండగు చతుర్ముఖుని చెంతకు షట్కులీనమునులు వెళ్లి ప్రాంజలులై వినయగర్భితములగు స్తోత్రములతో ప్రార్థించి – విధాతా! సర్వకారణ కారణుండు సర్వజగత్కర్తయు పరపూరుషుండు నెవడో వక్కాణింపుమని ప్రశ్నించిరి.

అట్టితఱి బ్రహ్మదేవుండు – తన కమలాసనమునుండి లేచి రెండుచేతులు జోడించి యిట్లు చెప్పుచుండెను.

శ్లో॥ యతో వాచో నివర్తంతే - అప్రాప్య మనసా సహ;
యస్మా త్సర్వమిదం బ్రహ్మా - విష్ణురుద్రేంద్ర పూర్వకమ్ ॥
సహ భూతేంద్రియైః సర్వైః - ప్రథమం సంప్రసూయతే;
ఏష దేవో మహాదేవః - సర్వజ్ఞో జగదీశ్వరః ॥
రుద్రో హరి ర్హరశ్చై వ - తథాఽన్యేచ సురేశ్వరాః;
భక్త్యా పరమయా తస్య - నిత్యం దర్శన కాంక్షిణః ॥

వాక్కులు మనస్సుతో గూడ బయలుదేరి పరమేశ్వరుని కనుగొనంజాలక మఱలి వచ్చును. బ్రహ్మవిష్ణురుద్ర మహేశ్వరులు సమస్తప్రపంచంబు పంచ మహాభూతములు ఇంద్రియములన్నియు ఎవనివలన ప్రథమము జన్మించుచున్నవో అట్టి దేవుండే మహాదేవుడనంబఱంగి సర్వజ్ఞుండు విశ్వనాథుండునై యున్నవాడు. బ్రహ్మవిష్ణురుద్రమహేశ్వరులు తదితరులగు ఇంద్రాద్యమరులును అనన్యభక్తులై పరమేశ్వరుని సాక్షాత్కారమును నిత్యము కోరుచున్నవారు. అనఁగా సదాశివపరబ్రహ్మమే బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర రూపములతో సృష్టిస్థితిలయ తిరోభావములను చేయువాడు. అవసరమున్నపుడు అవ్వారి ప్రార్థనను గమనించి సదాశివుండు దర్శనమిచ్చుచుండునని భావము.

ఇట్టి సదాశివుండు – ఏకాంతభక్తి గలవారికి మాత్రము ప్రత్యక్షమగువాడు కాని మరి యొకవిధముగా సాక్షాత్కరించువాడు కాడు. వేయేల శివభక్తి తోడనే మానవుండు విముక్తుండగును.

మొదట శివుని సాధారణ అనుగ్రహము వలన శివునియందు భక్తి కలుగును. భక్తి వలననే శివుని సంపూర్ణానుగ్రహము సంభవించును. ఇద్ది బీజాంకుర న్యాయముంబోలినదై యుండును. కావున మీరు శివానుగ్రహము కొరకు భూలోకమున వేయివత్సరములు దీర్ఘసత్రమును గావింపుడు!

యజ్ఞేశ్వరుడైన సదాశివుని యనుగ్రహమువలననే వేదోక్తములగు బ్రహ్మవిద్యలందగు సారమైన సాధ్యసాధనజ్ఞానము సమకూరును.

ఋషులు ఈ విధముగా ప్రశ్నించిరి.

సాధ్యములగు వానిలో ముఖ్యమైన దెద్ది? సాధనము ఎట్టిది? సాధకుండెట్టివాడు? యథార్థముగా ఇవ్వానింగూర్చి చెప్పుము!

బ్రహ్మదేవుండు చెప్పుచున్నవాడు.

శివపదప్రాప్తియే సాధ్యశ్రేష్ఠ మనఁబఅగును. శివారాధనమే అందుకు సాధనమగును. శివానుగ్రహము వలన శమదమాదిసంపత్తి మొదలగు యోగ్యత గలవాడే సాధకుఁడని చెప్పఁబడును.

వేదోక్తము స్వవర్ణాశ్రమోచితము నగు కర్మ నీశ్వరార్పణ బుద్ధితో నాచరించుచు శివారాధనఁజేయు సాధకుఁడు పరమేశ్వరుని నిత్యనివాస విరాజమానంబగు మహాకైలాసము నొందును.

ఏయేవిధము శివభక్తి ప్రబలుచుండునో ఆయావిధము శివానుగ్రహ పాత్రుండగును. శ్రవణకీర్తన మననములనునవి సాధనముఖ్యంబులగును. శ్రవణమనఁగా? పరమేశ్వరుని దివ్యలీలా విలాసములను చెవులారా వినుచుండుట యగును. కీర్తన మనఁగా? శివుని-శంభు, మహాదేవ, ఈశ్వర, చంద్రశేఖరాధి నామధేయములను-వాక్కుతో నుచ్చరించుట యగును. సదాశివుని సచ్చిదానందమయత్వాది సంపన్నమగు దివ్యరూపమును మనస్సుతో స్మరించుట- మనన మనబడును.

లోకమున నేత్రముతో ప్రత్యక్షముగా చూచినదాని విషయమున ప్రాణివర్గము ప్రవర్తించును. ప్రత్యక్షముగానిదానిఁగూర్చి వినవలెనని కుతూహల పడుచుండును. కావున మొదట గురుముఖమునుండి పరమేశ్వరుని గురించి జిజ్ఞాసువు వినవలెను. అటుపిమ్మట సుధీమంతుఁడు కీర్తనమును మననమును ఆచరింపవలెను. సాధకుఁడు శ్రవణకీర్తన మననములను క్రమముగా సాధించినయెడల శివయోగము సిద్ధించును.

శివయోగసిద్ధివలన సర్వాంగ గతములైన వ్యాధులు సర్వవిధ ఇంద్రియ సుఖవాసనలును లోపించును. శివయోగము నభ్యసించునపుడు సాధకునకు కష్టముగా నుండును. ప్రారంభమునను చివరను శివయోగము శ్రేయస్కర మగునట్టిదై బ్రహ్మానందము నొనఁగూర్చునది.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో తృతీయాధ్యాయము.

## చతుర్థాధ్యాయము

### ( శ్రవణ కీర్తన మనన వివరము )

మునులు - మననము కీర్తనము శ్రవణంబు నెట్టివో సవిస్తరముగా చెప్పుమని ప్రశ్నింపగా బ్రహ్మదేవుడు అవ్వానిని ఇట్లు నిరూపించెను.

శివుని పూజించుటను శివమంత్రముల జపించుటను శివుని కల్యాణగుణములను మరియు త్రిపురసంహారాది లీలావిలాసములను శివనామములను గురించి రాగద్వేషాది రహితమైన పవిత్రమనంబున ఉపనిషత్తులతో యుక్తి సహముగా సమర్థించుకొనుట లేక సమర్థించుటయు మననమనఁబడును. ఇట్టి మననమును యథాసాధ్యము ఎల్లకాలము గావింపవలెను. కాని ఇయ్యది ఈశ్వరానుగ్రహలభ్యమై సాధనములన్నిటి యందు ముఖ్యమనఁబఅగుచున్నయది.

ఇcక కీర్తనము – శంకరుని దుష్టశిక్షణాది ప్రతాపమును కల్యాణ గుణములను చంద్ర శేఖరత్వ నీలకంఠత్వ గంగాధరత్వ అర్ధనారీశ్వరత్వాది దివ్యరూపములను సతీ పార్వతీ పాణిగ్రహణాది శుభవిలాసములను శ్రుతుల రూపముగాను సంగీతములయందును స్ఫుటమైన భాషయందు రసవత్తరముగా నభివర్ణించుట యగును.

ఏదేనొక నిమిత్తముగా శివపరమైన శబ్దము శివపరత్వమును ప్రతిపాదించు సందర్భము తటస్థించినచో అట్టి విషయమును యువకుcడు యువతీ విలాసములను వలె ఆసక్తితో వినుట–శ్రవణ మనcబడును.

శ్రవణ కీర్తన మననములలో మొదటిశ్రవణము సత్పురుష సాంగత్యమువలన సంభవించును. శ్రవణము సిద్ధించుతతి కీర్తనము ధృవపడుచుండును. కీర్తనము దినదినాభివృద్ధ మగుతతి సర్వోత్తమంబైన మననము సిద్ధించును.

ఇమ్మూడును శంకరుని అనుగ్రహదృష్టి ప్రసరించుటవలననే సాధకునకు బాగుగా నెరవేరునని సారాంశము.

సూతుcడు మరల చెప్పcదొడగెను.

మునులారా? మీకు పురావృత్తము నొకదానిని వినిపింతును.

నా గురువైన పారాశరమహర్షి – సరస్వతీ నదీతీరమున తపించుచుండగా సూర్యసంకాశమైన విమానములో పయనించుచున్న సనత్కుమార మహర్షి కనcబడెను. అప్పుడు వ్యాసుcడు – సనత్కుమారుని అర్ఘ్యముతో సత్కరించి దేవయోగ్యమైన ఆసనమునందు కూర్చుండcజేయగా సనత్కుమారుcడు – గంభీరముగా దిగువవిధము వాక్రుచ్చెను.

సత్యమైన వస్తువును ధ్యానించుము! అట్టి వస్తువు శివుcడేను. నీయట్టివాడు శివుని సాక్షాత్కరించుకొనవలెను. ఐతే ఏకాకిగా నిచట తపస్సు ఎందుకు చేయుచున్నావు? అప్పుడు వ్యాసుcడిట్లు విన్నవించెను. సనత్కుమార మహర్షీ! నీ యనుగ్రహమువలన ధర్మార్థ కామమోక్ష మార్గములను వైదికముగా అనేకరీతులుగాను లోకమున నెలకొల్పితిని. అందరికి గురువునగు నాకే ముక్తి సాధనమైన జ్ఞానము కలుగనందున మోక్షార్థము తపస్సు చేయుచున్నాను. ఇట్లగుటకు కారణమెద్దియో తెలియుట లేదు.

అట్టితతి సనత్కుమారుcడు – వ్యాసుని ప్రార్థన నాలకించి శ్రవణకీర్తన మననంబులే వేదసమ్మతములైన ముక్తి సాధనములనియు పూర్వము నేనుగూడ నీ విధముగానే సంభ్రాంతుడనై మందర పర్వతమునందు తపంబు నొనర్చుచుండగా శివాజ్ఞావశమున సర్వసాక్షియు దయాసముద్రుండును గణేశ్వరుcడును భగవానుడు నగు నందికేశ్వరుcడు తారసిల్లెను.

అట్టితతి నాయందనురాగముకలవాడై శ్రవణకీర్తన మననములు వేదసమ్మతములనియు ఉత్తమములగు ముక్తిసాధనములనియు ఇట్టి సాధనత్రయము నవలంబించినవాడు శివానుగ్రహమువలన





తప్పక ముక్తుండగుననియు ఇవ్విధము శివుఁడే నాకు చెప్పెననియు నీవు గూడ శ్రవణాది సాధన సంపన్నుడవు కమ్మనియు నందికేశ్వరుఁడు వాక్రుచ్చెనని సనత్కుమారుఁడు ఉపదేశించి తన యనుచరులతో స్వవిమానము నందు బ్రహ్మలోకమునకు వెళ్లినవాడని వ్యాసుడు చెప్పగా వినియున్నాను.

అప్పుడు శౌనకాది మహర్షులు దిగువవిధము ప్రశ్నించిరి.

శ్రవణాదిత్రితయము ముక్తి సాధనంబని సెలవిచ్చితిరి. కాని కలియుగములో మానవులు అల్పాయుష్మంతులగుటఁజేశి కొద్దికాలములో మోక్షావహంబగు సులభసాధన మెద్దియేని యున్నచో విశదీకరింపుడు!

సూతుడిట్లు చెప్పినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో చతుర్థాధ్యాయము.

## పంచమాధ్యాయము

### (లింగార్చన ప్రాముఖ్యము)

శ్రవణాది సాధనత్రికము ఉత్తమంబని చెప్పితిని. అందుకు మీరు విఘ్నములను శంకించి ప్రశ్నించితిరి కావున సర్వోత్తరంబగు మరియొక సాధనము లింగార్చనమగును. పరమాత్మను శివలింగముగా భావించి శివలింగమును భక్తి శ్రద్ధలతో కరపీఠమునందు గాని పుణ్యక్షేత్రములయందు గాని ఒకానొక మందిరమునందు గాని స్వగృహమున పీఠమునందుగాని నిత్యము పూజింపవలెను. ధ్యాన ఆవాహన ఆసన పాద్య అర్ఘ్య ఆచమనీయ అభిషేక వస్త్ర భస్మ గంధ అక్షత పుష్పబిల్వ ధూప దీప నైవేద్య తాంబూల మహానీరాజన మంత్రపుష్ప నమస్కార ప్రార్థనములను సదుపచారములను సమర్పింపవలెను. అవకాశము కలదేని ఛత్ర చామర తాళవృంత దర్పణ ఘంటా శంఖ గీత నృత్య ప్రదక్షిణలు మున్నగు రాజోపచారములతో శివు నారాధింపవలెను. ఇట్లు యావజ్జీవము ఆచరించినయెడల శివానుగ్రహము ప్రసరించుటఁజేసి ముక్తుఁడగును. పూర్వికులగు మహానుభావులెందరో శివలింగార్చనము వలననే జన్మరాహిత్యము నొందినవారు. ఐతే శివుని - లింగమునందును మూర్తియందును పూజింపవచ్చును. ఇతర దేవతాగణములన్నియు మూర్తియందుమాత్రము పూజింపబడుచుండును. శివుఁడొక్కడే నిరాకారుండగుటఁ జేశి నిష్కళుఁడనఁబఱగుచు సాకారుఁడగుట వలన సకలుండై విరాజిల్లుచున్నవాడు. అనఁగా నిష్కళత్వము సకలత్వంబు రెండును శివునకే ఒప్పారుచున్నవి. నిష్కళమనఁగా నిరాకారము, అద్దియే శివలింగ మనఁ బఱగుచున్నయది. సకళమనఁగా సాకారము, ఇద్దియే చంద్రశేఖరత్వాదులతో కూడిన దివ్యమంగళ విగ్రహంబగును. శివుఁడు పరబ్రహ్మంబనుటకు ఈ నిష్కళత్వ సకళత్వంబులే నిదర్శనములు. శివేతర దేవతలు పరబ్రహ్మముకారు కావుననే అవ్వారికి నిష్కళత్వము సంభవింపదు. మఱియు వారు మూర్తియందు మాత్రము పూజింపఁబడుదురు. ఇవ్విషయమునే పూర్వము నందికేశ్వరుడు సనత్కుమారునకు తెలిపియున్నవాడు. శివుని లింగస్వరూపము మూర్తియు వేదాది సకల ప్రమాణసమ్మతములై లోకములయందంతటను సుప్రసిద్ధములైనవి.

పూర్వకల్పమునందు ఒకప్పుడు బ్రహ్మవిష్ణువులు కలహింపగా వారిరువురికి జ్ఞానము నుదయింపజేయుటకై శివుఁడు ఎట్టి అవయవ విభాగములేనట్టి అనఁగా నిష్కళంబగు స్తంభముగా నావిర్భవించెను. అద్దియే శివలింగముగా పరిణమించినది. ఇతర దేవతామూర్తులను పూజించుటవలన ఆయా భోగములు సంప్రాప్తంబులగును. శివలింగార్చనమువలన భోగమోక్షములు రెండును సమకూరును.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పంచమాధ్యాయము

## షష్ఠాధ్యాయము

### (బ్రహ్మ విష్ణు కలహము)

**నందికేశ్వరుఁడిట్లు వక్కాణించెను:**

పూర్వకాలమున నొకప్పుడు నారాయణు - తన యనుచరులతో సేవింపఁబడుచు దైవవశమున శేషశయనమునందు నిద్రించుచుండగా లోకపితామహుండగు బ్రహ్మదేవుఁడు సహజముగా నచటి కరుదెంచి సర్వసుందరుడైన నారాయణుని గాంచి యిట్లు ప్రశ్నించెను.

ఓయీ? నీవు గర్వించి ముందున్న నన్నుగూడ చూడకుండా మొనగానివలె పడుకొనియున్నావు. నీ వెవండవు? ఇప్పటికైనను వివేకము గలిగి మెలకువఁజెందుము! నీ ప్రభువగు నన్ను గాంచుము! ఎవఁడైతే అహంకారపూరితుడై తనచెంత కరుదెంచిన మహనీయుని గౌరవింపడో అట్టి ద్రోహికి గొప్ప ప్రాయశ్చిత్తము విధింపఁబడుచున్నయది.

ఏతాదృశంబగు బ్రహ్మవాక్యము నాకర్ణించి మహావిష్ణువు క్రుద్ధుడై లోలోన క్రోధము నణచుకొని పరమశాంతునివలె నటించుచు నాయనా బ్రహ్మదేవా? నీకు స్వాగతమగుగాక! రమ్ము! పీఠమునందు కూర్చుండుమనియు నీ ముఖము ఎందుకో వెలవెలపోయినది. నీ చూపులును వ్యత్యాసములుగా నున్నవనియు బ్రహ్మదేవు నూఱడించుచుండెను. ఇట్టి సందర్భము "అంతస్తమో బహిఃసత్వః" అను నారాయణుని నైజ లక్షణమునకు నిదర్శనంబని గ్రహింపవలెను.

బ్రహ్మ-వత్సా ! విష్ణో ! కాలవేగము ననుసరించి గొప్ప అభిమానము నిన్నావరించినది. ఐతే నేనెవడనో తెలియునా? చరాచర ప్రపంచమునకు పితామహుడనగుటయే గాక నిన్ను కాపాడువాడను గూడ నేనేయని గ్రహింపుము! విష్ణువు - నాయనా! ఈ జగమంతయు నన్నాశ్రయించియున్నది. చోరునివలె ప్రభువునని భావించుచున్నావు. నా నాభికమలము నుండి.. జనించినందున నాకు కుమారుడవగుదువు. ఇట్టి నన్ను నీ వెరుంగక వ్యర్థముగా మాటలాడుచున్నావు.

ఇవ్విధము నేనే శ్రేష్ఠుడను నేనే వరేణ్యుడనని పరస్పరము వాదించుకొనుచున్న బ్రహ్మ విష్ణువులకు యుద్ధము అనివార్యమయ్యెను.

అమరులగు హంసవాహన పక్షివాహనులు-ఒండొరులను హింసించు నుద్దేశముతో పోరాటమును ప్రారంభించిరి. అట్టితఱి దేవతలు విమానముల నధిష్ఠించి విధి విష్ణువుల యుద్ధమును చూడగోరి





ఆకసమున కరుదెంచిరి. మరియు వారిపై పుష్పవర్షములను కురిపించుచుండిరి. అంత నారాయణుఁడు కోపగించి బ్రహ్మవక్షఃస్థలమునందు సహింపరాని బాణముల ననేకములను అస్త్రములను ప్రయోగించెను. అందుకు చతుర్ముఖుండు నుద్రేకపూరితుడై విష్ణువుపై అగ్నిసన్నిభములగు బాణములను అనేక అస్త్రములను వేసినవాడు.

ఇట్లు వారిరువురి పోరాటము చూపరులకు ఆశ్చర్యముగా నుండెను. ఇట్టి యుద్ధమును దేవతలు గాంచుచు మిగుల ప్రశంసించుచుండిరి. అంత విష్ణువు అత్యంత క్రోధావిష్టుడై నిట్టూర్పులను విడచుచు కొంతవరకు ఆలోచించి బ్రహ్మదేవునిపై మాహేశ్వరాస్త్రమును ప్రయోగింపగా బ్రహ్మయు మిగుల ఆవేశముఁజెంది విశ్వమునంతయు కదిలించునట్లు కనఁబడునట్టి ఘోరమైన పాశుపతాస్త్రమును విష్ణువుపై విడనాడెను.

పాశుపతము-సూర్యకోటి ప్రకాశమానంబై సహస్రముఖములు గలిగి తీక్ష్ణమైన వాయువు వీచుటకు నిదానమగుకతన భయంకరముగా నుండినది. అట్లే మహేశ్వరాస్త్రంబును గానంబడుచుండినది.

ఇట్టి అపూర్వ సన్నివేశమును గమనించి "లోకమున రాజకీయ ఉపద్రవము సంఘటించినపుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యాది ప్రజలు ఆక్రందనము చేయునట్లు" భయసంభ్రాతులై దేవతలు దిగువవిధము పరమేశ్వరుని ప్రార్థించిరి.

శ్లో॥ సృష్టిః స్థితిశ్చ సంహార - స్తిరోభావోఽ ప్యనుగ్రహః ।
యస్మాత్ప్రవర్తతే తస్మై - బ్రహ్మణే చ త్రిశూలినే ॥

సృష్టి స్థితి లయములు తిరోభావము అనఁగా ప్రళయమున జీవులను తన గర్భములో దాచియుంచుట, అనుగ్రహము-అనఁగా భక్తుల సంకటములను తీర్చుచు యవ్వారి విహిత కామితముల నీడేర్చుచు చివరకు మోక్షము నొసఁగుట; ఇట్టి పంచకృత్యములను నెరవేర్చుచు త్రిశూలధారియు చంద్రశేఖరంబు గంగాధరంబు నీలకంఠంబు నగు లీలావిగ్రహముఁ దాల్చు పరమశివునకు నమస్కారము.

మఱియు

శ్లో॥ అశక్య మన్యైర్యదనుగ్రహం వినా-
తృణక్షయోఽ ప్యత్ర యదృచ్ఛయా క్వచిత్ ॥

శివానుగ్రహము లేనిది ఎంతటివారైన నీప్రపంచమున స్వేచ్ఛగా గడ్డిపఱకను గూడ కదల్పజాలరు కావున సమస్త కార్యములను నిర్వహించుటకు శివానుగ్రహమే నిదానమని తెలియవలెను.

ఇవ్విధము దేవతలు భయభ్రాంతులై శివుని నివాసమును తలపోయుచు చంద్రశేఖరుఁడు నివసించు కైలాస శిఖరమును సమీపించి ప్రణవాకారముగా నుండు పరమపదమునకు మ్రొక్కులిడి అందు ప్రవేశించిరి.

అచట నా శివపురమునందు ఒకానొక సభాస్థలమున మణిపీఠమునందు దేవదేవుండైన శంకరుఁడు జగదంబికతో సుఖాసీనుడై యుండెను. మఱియు నాశివమూర్తి-ఎడమకాలు కుడితొడపై కుడికాలు ఎడమతొడపై నుండునట్లు అవ్వానిపై తన హస్తకమలముల నెలకొలిపి సర్వలక్షణలక్షితుండై స్వకీయ గణంబులతో కూడుకొనియుండెను.

అట్టితతి అనన్య భక్తిసంభరితలు శివలీలావిశేషములను కనుగొనిన వారునగు దేవతావనితలు వింజామరలతో వీచుచుండిరి. వేదములు మూర్తిమంతములై శివునా వేనోళ్ళ కొనియాడుచుండినవి. ఇట్టి ఉల్లాస సమయమున భక్తుల ననుగ్రహించు శివుని దూరముననే గాంచి యమరులు శివదర్శన సంతోషాతిశయమున కన్నీరు గారుచుండ సాష్టాంగ ప్రణామంబులను సమర్పించుచుండిరి.

పశుపతి యవ్వారల నవలోకించి స్వగణంబులతో చెంతకు రప్పించి తన శుభవీక్షణములతో బృందారకుల నానందింపఁజేయుచు మధురము మంగళ ప్రదంబునగు వాక్యమును వాక్రుచ్చెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ"మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో షష్ఠాధ్యాయము.**

## సప్తమాధ్యాయము

### (శివవాక్యము - బ్రహ్మవిష్ణువులను శివుఁడనుగ్రహించుటయు)

నాయనలారా? మీకు సేమంబే గదా! నా శాసనము ననుసరించి చరాచరప్రాణులు దేవతాగణంబును తమతమ కర్తవ్యములను నెరవేర్చుచున్నారా! లేదా? బ్రహ్మవిష్ణువులు కలహించుకొనిన యుదంతమీవరకే తెలుసుకుంటివి. ప్రస్తుతము మీ ముఖవైఖరితో మరల నొకమారు చెప్పినట్లయ్యెను. ఇట్లు ఉమామహేశ్వరుఁడు చిరునగవుతో మధురముగా సంభాషించుచు దేవతల నానందడోలికల నూగులాడించి అదేసమయమున పంకజాసన పంకజాక్షుల రణరంగమునకు ముందు వెళ్ళవలసినదిగా రుద్రగణంబుల కాజ్ఞాపించెను. అంత బహువిధ వాద్యములను మ్రోగించుచు గణాధిపతులు సన్నద్ధులై పరమేశ్వరుని ప్రయాణమును సూచించుచుండిరి. అట్టితతి పంచమండలములు కలదియు మొదటినుండి కొసవరకు ప్రణవాకారముగా నుండునదియు శుభావహంబునగు రథమునందు కుమారులతో మహేశ్వరుండాసీనుండయ్యెను. ఇంద్రాదిదేవతలు పరమేశ్వరుని వెనువెనుకఁజనుచుండిరి.

వింజామరలచేతను చిత్రవిచిత్రధ్వజములతోడను పుష్పవర్షంబులను సంగీతముల వలనను నృత్యములచేతను సత్కరింపబడుచు అమ్మవారిని వెంటనిడుకొని అయ్యవారు పోరాటముచోటునకు బయలుదేరిరి.

అట్లు రణరంగమును సమీపించి ప్రమథగణంబుల ఆర్భాటమును దేవతల సందడిని వాద్యముల మ్రోతనంతయు శాంతింపఁజేశి ఆకసమునందు మహేశ్వరుఁడు దాగియుండెను.

విష్ణువు మహేశ్వరాస్త్రమును బ్రహ్మ పాశుపతాస్త్రమును ప్రయోగించినందున అస్త్రద్వయము పోరాడుచు ముల్లోకములను కాల్చునట్లుండెను. అట్టితతి ఇఁక నుపేక్షించుట పాడికాదనుకొని నిష్కళుండగు శంకరుఁడు–వారిరువురి మధ్య గొప్పజ్వాలాస్తంభమై చూపరులకు భయము గొలుపునట్లు ఆవిర్భవించినవాడై లోకమునంతయు సంహరింపఁజాలు రెండస్త్రములు జ్వాలా స్తంభములో లీనమైన కతన ఇది యెట్టి అద్భుతంబని ప్రేక్షకులు వాపోవుచుండ స్తంభము ఇంద్రియాతీతంబై అగ్నిరూపముగా నుండుటచే ఇద్దాని పై భాగమును క్రింది భాగమును మనము కనుగొనవలెనని వీరాభిమానముగల విధికేశవులు





నిశ్చయించుకొనిరి. ఐతే మనముభయులము కూడి ఒకేదెసకు వెళ్లునెడ కార్యసిద్ధి కానేరదని భావించి నారాయణుఁడు వరాహస్వరూపముతో స్తంభముఁదగు చివరి భాగమును బ్రహ్మదేవుఁడు హంసస్వరూపముతో స్తంభముఁదగు అగ్రభాగమును కనుగొనుటకు వెడలిరి.

శ్లో॥ భిత్వాపాతాళ నిలయం - గత్వా దూరతరం హరిః ।
నాపశ్యత్తస్యసంస్థానం - స్తంభస్యానలవర్చసః ॥

అగ్నివలె మండుచున్న నా స్తంభముయొక్క చివరిభాగమును నారాయణుఁడు పాతాళలోకములను భేదించి మిగుల దూరముఁజనినను గాంచడయ్యెను. అంత చేయునది లేక అలసినవాడై మొదటి యుద్ధతలమున కరుదెంచెను.

పైపైన ఆకసమునఁజనుచు స్తంభాగ్రము నవలోకింపనెంచు చతుర్ముఖునకు దైవవశమున నొక కేతకీపుష్పముపైనుండి జారిపడుచున్నట్లు గానంబడెను. అప్పుడా పుష్పము అత్యంత సుగంధముగలదై నిగనిగలాడుచు పెక్కు ఏండ్లనుండి క్రిందికి వచ్చుచున్నట్లుండెను. ఐతే బ్రహ్మవిష్ణువుల అజ్ఞానవిలసితమైన యుద్ధకృత్యమున కచ్చెరువొంది పరమేశ్వరుఁడు పరిహసించి తన శిరంబును కదిలింపగా భక్తులు సమర్పించిన కేతకీపుష్పము శివశిరోభాగము నుండి జారిపడినది.

అంత బ్రహ్మదేవుఁడు-ఓ పుష్పమా? నిన్నెవరు తలదాల్చిరి. ఎటనుండి వచ్చుచున్నావు? అప్రమేయమైన ఈ స్తంభముఁదగు అగ్రభాగమునుండి బయలుదేరి అంతమును చూడగోరుచున్నావా? నేనీ హంసరూపముతో స్తంభాగ్రమును చూడఁజాలను గాన నీవుగూడ ఇద్దానియంతమును చూచుటయందు ఆశనొదులుకొనుము! అందువలన నీవిప్పుడొక మేలు చేయవలెను. విష్ణువును గురించి "ఈతడు స్తంభాగ్రము నవలోకించినాడు. ఇందుకు సాక్షిని నేనేనని నీవు వక్కాణింపవలసి యుండునని కేతకీపుష్పమును ఒప్పించెను. ఇద్ది నొకవిధముగా విహితంబేయనియు ఆపత్కాలమున అబద్ధమాడుట ప్రశస్తంబగుననియు చతుర్ముఖుఁడు కేతకీ పుష్పంబును భావించిరి.

అంత రణరంగమున కరుదెంచి విధాత-బడలికఁజెంది నిరుత్సాహముగా నున్నట్టి హరినవలోకించి సంతోషాతిశయమున గంతులువేయుచు "విష్ణో ! స్తంభాగ్రమును గాంచితిని, ఇందుకు సాక్షి కేతకీ పుష్పంబని చెప్పగా కేతకీ పుష్పంబు నటులే యనెను. శ్రీహరి-బ్రహ్మ వాక్యమును విశ్వసించి బ్రహ్మదేవుని షోడశోపచారములతో పూజించి సత్కరించెను.

అట్టితతి బ్రహ్మగావించిన యపచారమును సహింపలేక దుష్టశిక్షణ శిష్టరక్షణ తత్పరుఁడైన భగవానుడు-అగ్ని స్తంభమునుండి ఒకానొక దివ్యమూర్తిగా నావిర్భవించెను. అంత నారాయణుఁడు శివుని పాదకమలముల కభివాదముఁజేశి "పరమేశ్వరా! ప్రస్తుతము మమ్మావహించిన స్వాధికారమదము నీ లీలావిలాసంబనియే భావింతుము. ఆద్యంత రహితమైన నీ స్వరూపము నభినివేశముతో విమర్శించుట మా బోంట్లకు పాడిగాదు. కరుణాసముద్రుడవు కావున మాయపరాధమును మన్నింపుము" అని ప్రార్థించెను.

శివుడు విష్ణు ప్రార్థననాలకించి "నాయనా? సర్వోన్నతమగు అధికారము నాశించియు అనృతము లాడకుంటివి గావున నీయందు ప్రసన్నుడను. ఇతఃపరము దేవమానవ సమస్త జగమున నాతో

సమానముగా క్షేత్రములు పూజామహోత్సవాదులున్ను నీకు నెరవేర్పబడుచుండును. ఇట్లు దివిషదులు గాంచుచుండగా శివుఁడు సంతుష్టాంతరంగుడై వారికి స్వసామ్యమును ప్రసాదించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో సప్తమాధ్యాయము.

## అష్టమాధ్యాయము

### (బ్రహ్మను భైరవుఁడు దండించుట)

అంత సాంబశివుడు - బ్రహ్మాగర్వము నణచు నుద్దేశముతో అద్భుతాకారుండగు భైరవుఁడను మహాపురుషుని పుట్టింపగా నా భైరవుఁడు శివునిముంగిట నిలచి సాష్టాంగ ప్రమాణంబులిడి "ప్రభో! శంకరా! ఏమిచేయవలయునో శీఘ్రముగా నాజ్ఞాపింపు" దని వేడుకొనెను. అప్పుడు శివుఁడు - నాయనా ! భైరవా ! లోకములకు ఆద్యదైవతంబుగు నీ విధాతను తీక్ష్ణమైన ఖడ్గధారతో పూజింపుమనగా భైరవుఁడు ఒక చేతితో బ్రహ్మవెంట్రుకలను పట్టుకొని గర్వముతో అసత్యము లాడిన ఐదవశిరంబును ఛేదించి బ్రహ్మనుగూడ హతమార్పఁజూచుచుండగా విధియు వస్త్రాలంకారములను కంఠహారమును ఉత్తరీయమును విసర్జించి భైరవుని పాదములయందు గాలిచే నూగులాడుచున్న అరటిస్తంభమువలె వణకుచు శరణాగతుండయ్యెను. అంతలో బ్రహ్మఁజూడగోరి కేశవుఁడరుదెంచి బ్రహ్మయందు దయగలవాడై శివుని పాదకమలద్వంద్వమును తన కన్నీటితో నభిషేకించి బద్ధాంజలియై చిన్న పిల్లవానివలె మధురముగా నిట్లు విన్నవించెను.

పరమేశ్వరా! ఈ బ్రహ్మదేవునకు పూర్వము నీవే సృష్టికర్తృత్వమును ప్రసాదించియుంటివి. కావున ప్రస్తుత మీతని ననుగ్రహింపుము.

అంత శివుఁడు విష్ణుప్రార్థనమునఁజేశి సమస్తదేవతాగణములు చూచుచుండగా బ్రహ్మను సంహరింపవలదని భైరవుని నివారించెను.

విగత పంచమశిరస్కుండైన బ్రహ్మనుగూర్చి "నీవు శఠుడవై లోకగౌరవమును సంపాదింపనెంచి కపటముగా ప్రవర్తించితివి కావున క్షేత్రములుగాని ఉత్సవములుగాని ప్రాణులు పూజించుట గాని నీకు ఉండఁజాలవు. అని శివుఁడు వచింపగా బ్రహ్మయు స్వామీ! నాయందు ప్రసన్నుడవు కమ్ము! నీ విభూతులు (లీలలు) ఏరికిఁ దెలియరానివి.

నా పంచమ శిరంబును విడిపించుట శ్రేయస్కరంబనియే భావించెదను. భక్తుల యపరాధములను సహించువాడవు, దీనబాంధవుడు, జగత్కారణంబు, మేరుపర్వతమును ధనుస్సుగా ధరించినవాడవునగు. నీకు నమస్కారంబని మిన్నకుండెను.

పరమేశ్వరుఁడు "జగద్విధాత ఉపేక్షించినచో జగమంతయు అరాజకమై అకాలమున నశించును. కావున వత్సా! బ్రహ్మదేవా! జగత్సృష్టికార్య భారమును నీవే వహింపుము. నీకు అన్యదుర్లభమైన వరమొండు ప్రసాదించుచున్నాను. వైదిక కర్మలయందు యజ్ఞయాగములయందు నీవే గురుస్వరూపముగా

పూజింపఁబడుదువు. నిన్ను నిరాకరించినచో యజ్ఞయాగాది సమస్తవైదిక కర్మలు నిష్ఫలఁబులగును" అని వచించెను.

అంత కేతకీ పుష్పమును "నీవు దుష్టబుద్ధిఁ బ్రదర్శించి కూటసాక్ష్యము నొనర్చితివి గావున ఇప్పటినుండి నా యారాధనముల్లో ఉపయోగింపకుందువు గాక! నాకును నీ పుష్పము నందనురాగము జనింపకుండు గాక!" అని శివుడు శాసింపగా దేవతలందరును కేతకీ పుష్పమును శివసన్నిధానము నుండియు తమ చెంత నుండియు తొలగించిరి.

అప్పుడు కేతకము-పరమేశ్వరా ! నీకు మ్రొక్కులిడుచున్నాను. భవదీయ శాసనంబున నా జన్మ వ్యర్థంబే కావున నాయపరాధమును మన్నించి సఫలము జేయవేయనియు తెలిసి గాని తెలియకగాని చేశిన పాపము నిన్ను స్మరించినంతమాత్రమున నశించుచుండ నీవే ప్రత్యక్షమగునపుడు నాబోంట్లాచరించిన మిథ్యాదోషము అంతరింపకుండునా? అనియు ప్రార్థింప శివుఁడు సంతసించి "నిన్ను పూర్తిగా తొలగింపలేదు. నాభక్తులు నిన్ను ధరింతురు గావున నీజన్మ సార్థకంబనియే భావింపుము! పై కప్పురూపముగా నాకు ఉపయోగింతువు అని కేతనము నునుగ్రహించెను.

ఇవ్విధము మహేశ్వరుఁడు కేతకీ పుష్పమును విధిమాధవుల ననుగ్రహించి అమరు లందరు పొగడుచుండగా నా సభాస్థలిని ప్రకాశించుచుండెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో అష్టమాధ్యాయము.**

## నవమాధ్యాయము

### (అమరులు శివప్రసాదమును పరిగ్రహించుట, శివరాత్రిమహాత్మ్యము)

అంత విధిమాధవులు దోసిలిఁజోడించి దక్షిణవామ భాగములయందు నిలచి ప్రణామంబులిడి సదాశివుని సకుటుంబముగా నొక సమున్నతపీఠమునందాసీనుఁగావించి లోకారాధ్యుడైన శివుని పాదకమలములను పౌరుషములగు వస్తువులతో నారాధించిరి. పౌరుషమనగా? చిరకాలముండునది. ప్రాకృతము స్వల్పకాలస్థితమగునది. హారములను అందెలను కేయూరములను కిరీటమును మణికుండలములను యజ్ఞోపవీతమును ఉత్తరీయమును పట్టుధోవతిని పుష్పమాలికను ఉంగరములను నానావిధ పరిమళపుష్పములను కర్పూరతాంబూలమును శ్రీగంధమును సుగంధద్రవ్యములను ధూపదీపములను శ్వేతచ్ఛత్రమును వింజామరలను ధ్వజచామరములను వాఙ్మానసంబుల నతిక్రమించు వైభవముగల అనేక దివ్య ఉపచారములను పశుతుల్యులగు జీవులకందరానివియు పతికిఁదగునవియునగు పవిత్రవస్తువులను శివునకు సమర్పించిరి.

అట్టితతి మహాకారుణికుడైన భగవానుడు-ఇంద్రాద్యమరులకు లోకత్రయమునుండి నరుదెంచిన నిజభక్తులకు స్వపాదసమర్పితముల నొక్కొక్కటి ప్రసాదముగా నొసగుచుండెను. శివప్రసాదమును పరిగ్రహించు భక్తుల కోలాహలము మిన్నుముట్టుచుండ ప్రసన్నుడైన శంకరుఁడు సస్మితముగా





వినయవిధేయులగు హరిబ్రహ్మల నుద్దేశించి శివభక్తిని పెంపొందించు నుద్దేశముతో దిగువ విధము వక్కాణించెను.

ఈ మహాదినమున మీరుభయులొనర్చిన పూజనము వలన సంతసించితిని. అందువలన ఇద్ది మహాశివరాత్రి యనఁబఱగుచు నాకు అత్యంతప్రియమైనది. ఈనాడు శివలింగమును గాని శివమూర్తినిగాని భక్తితో పూజించిన పురుషోత్తముఁడు జగత్సృష్టిరక్షణాది మహాకృత్యములను గావించినవాడగును.

**శ్లో॥ శివరాత్ర మహోరాత్రం - నిరాహారో జితేంద్రియః**
**అర్చయేద్వా యథాన్యాయం - యథాబల మవంచకః ॥**
**యత్ఫలం మమపూజాయాం - వర్షమేకం నిరంతరం**
**తత్ఫలం లభతే సద్యః - శివరాత్రౌ మదర్చనాత్ ॥**

మహాశివరాత్రినాడు రేయింబవలు ఉపవసించి ఇంద్రియములను వశపఱచుకొని విధి విధానముగా ఎట్టి శక్తి లోపము లేకుండా త్రికరణశుద్ధిగా శివునిఁ బూజించువాడు ఒక్క సంవత్సరకాలము ప్రతిదినము శివునారాధించినందువలన కలుగు ఫలమును తత్కాలముననే పొందవచ్చును.

పున్నమరేడు సముద్రమునువలె మహాశివరాత్రిసమయము శివధర్మమును పెంపొందించును. మహాశివరాత్రినాడు-శివప్రతిష్ఠ, శివకల్యాణము మున్నగు మహోత్సవములు మిక్కిలి శుభప్రదములు.

హరిబ్రహ్మలారా! ఇంతకుమున్ను స్తంభాకారాముగా నావిర్భవించిన దినము - మార్గశీర్ష మాసమున ఆర్ద్రానక్షత్రయుక్తంబని తెలియుడు ! ఈనాడు ఉమామహేశ్వరులను గాని శివలింగమును గాని దర్శించు నుత్తముఁడు కుమారస్వామికన్న ప్రియుండగును. దర్శనమునకే ఇట్టి ఫలముండగా అర్చనముఁదగు ఫలము ఏతన్మాత్రమని చెప్పనలవిగాదు.

ఈ యుద్ధరంగమున లింగరూపముతో నావిర్భవించి విజృంభించితిని కావున నియ్యది లింగస్థాన మనఁబడును. ఆద్యంతములులేని అనలస్తంభము అణుమాత్రమై భక్తులు దర్శించుటకు పూజించుటకు కనువుగా లింగస్వరూపము కాగలదు. ఇద్ది భుక్తిముక్తుల రెంటిని ప్రసాదించును. ఇద్దానిని చూచినను పూజించినను ప్రాణులు జన్మరాహిత్యము నొందుదురు. అగ్ని పర్వతముఁబోలినదై శివలింగ మిచట నుద్భవించినదికావున నియ్యది అరుణాచలమను సంజ్ఞతో జగత్ప్రసిద్ధిఁగాంచును.

అరుణాచలము గొప్ప తీర్థముగాను క్షేత్రముగాను పరిణమించును. ఇఁట నివసించువారు మరణించువారును ముక్తులగుదురు. శివక్షేత్రములలో నియ్యది మహత్తరము. ఇచట రథోత్సవము మున్నగు శుభముల నాచరించుటవలన దానహోమజపముల వలనను సుకృతము కోటిగుణంబగును. ఇఁట శివస్మరణ మాత్రమున కృతార్థులగుదురు. ఇచటి అరుణాచలేశ్వరుని పూజించినవారికి సాలోక్యాది ముక్తులు-కరతలామలకంబులగును. భక్తులందరును అరుణాచలమునందు మహేశ్వరు నారాధించి యభీష్టములఁ బడయుదురుగాక!

ఇవ్విధము హరిని బ్రహ్మదేవు ననుగ్రహించి శంకరుఁడవ్వారల యుద్ధములో నిహతులైన బ్రహ్మవిష్ణుగణంబులను తన యమృతధారఁదగు శక్తితో జీవింపజేశి విధికేశవుల యవివేకమును వైరమును

పోనాడఁదలచినవాడై "సకలము నిష్కళంబునగు రూపద్వయము నాకే చెల్లును. ఇతరులకు వర్తింపవుగాన ఈశ్వరుడను నేనే యగుదును. మొదట స్తంభరూపముగా నిష్కళుడనై తరువాత కరచరణాద్యవయవరూపముతో సకళుండనైతిని. మీయిరువురిలో ఏరికిని బ్రహ్మత్వము సిద్ధింపదు. కావున ఈశత్వాభిమానమును విడనాడి నన్నుదైవముగా భావించుచు కర్తవ్యములను నిర్వర్తింపుడు! లోకమున ఏరికైనను నాయనుగ్రహములేనిది కార్యము సిద్ధింపదు. ఇఁక నిగూఢమైన బ్రహ్మతత్త్వమును చెప్పుచున్నాను.

బ్రహ్మతత్వమును నిర్ణయించుటకు గురువాక్యము నిగమాగమాది ప్రమాణంబులును నిదానములగును. నేనే పరబ్రహ్మమును; అనుగ్రహము మున్నగునవి నా కర్తవ్యములు. గొప్పవాడనగుట వలన వ్యాపించుటఁజేసియు బ్రహ్మమునగుచున్నాను. సర్వత్ర సమముగా నుండుటవలన ఆత్మయనఁ బడుదును. మదితరులందరును ప్రకృతిబద్ధులగుటచే అనాత్మలనఁబఱగి జీవులగుచున్నారు. అనుగ్రహాది పంచకృత్యములు నా యందు నిత్యములైయుండును. ఇవ్వానిలోనేదే నితరుఁడు గావించినచో అద్ది తాత్కాలికము మాత్రమగును. మొదట నా యందు బ్రహ్మబుద్ధిఁ గలుఁగజేయుటకు ఎట్టివిభాగములేని లింగముగా గోచరించితిని. అట్టి లింగమునుండి సకళరూపముతో నావిర్భవించుట–మీ యిరువురి అహంభావమును తొలగించుటకే యని తెలియవలెను. లింగమునకు నాకును భేదము లేదు గావున లింగ స్వరూపమును నిత్యము ఆరాధింపుడు! నిజముగా నేనొకచో పరిచ్ఛిన్నముగా నుండువాడను కాను కాని లింగము ప్రతిష్ఠింపఁబడుచోట నేను తప్పక నివసింతును.

శ్లో॥ మత్సామ్య మేకలింగస్య - స్థాపనే ఫలమీరితం ।
ద్వితీయే స్థాపితే లింగే - మదైక్యం ఫలమేవహి ॥

ఒక్క శివలింగమును ప్రతిష్ఠించినచో శివునితో సమానముగా కైలాసమున నివసించును. రెండు లింగములను ప్రతిష్ఠించిన వారు శివసాయుజ్యమును అనఁగా మహాకైలాసమున శివానందము ననుభవింతురు. లింగ ప్రతిష్ఠయే ముఖ్యమైనది. శివమూర్తి ప్రతిష్ఠ గౌణంబగును. శివలింగము లభింపని పక్షమున శివమూర్తిని ప్రతిష్ఠించినను అద్ది శివక్షేత్రంబేయగును" అని యుపదేశించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నవమాధ్యాయము.

## దశమాధ్యాయము

**(శివుఁడు బ్రహ్మవిష్ణువులకు పంచకృత్యములను ప్రణవపంచాక్షరి నుపదేశించి యంతర్ధాన మగుట)**

సృష్టిమున్నగు పంచకృత్యముల లక్షణమును విశదీకరింపుడని హరిబ్రహ్మలు విన్నవింపగా మహేశ్వరుఁడిట్లు చెప్పఁదొడగెను.

నా కర్తవ్యములను గుర్తెరుగుట సులభము కాదు. మీ యందలి అనుగ్రహము వలన చెప్పుచున్నాను. వినుఁడు!

సంసారము విస్తరించుట - సృష్టియనఁబడును. సంసారము (ప్రపంచము) ను క్రమబద్ధముగా కాపాడుట - స్థితియనఁబడును. అట్టి ప్రపంచమునకు గల స్థూలరూపమును విడగొట్టి సూక్ష్మరూపముగలదిగా నొనర్చుట - సంహారమనఁదగును. సూక్ష్మరూపమగు ప్రపంచమును పునః సృష్టి వరకు రక్షించుట - తిరోభావ మనఁబడును. ప్రపంచమున గల జీవులు శివునుపాసించునెడల యవ్వారలను బంధవిముక్తులఁ జేయుట - అనుగ్రహమనఁబఱగును. సృష్ట్యాదికృత్యచతుష్టయము ప్రపంచముఁ జెందినవి. ఐదవదగు అనుగ్రహము కేవలము శివానుగ్రహ సాధ్యంబు ॥

భూమినుండి సర్వంబు నుద్భవించును. నీటితో అంతయు పెరుగును. తేజస్సు సమస్తమును హరించును. వాయువు వలన మఱుగుపడును. ఆకసమున నిజరూపము అనఁగా శివస్వరూపము కలదగును. ఇట్టి పంచకృత్యములను నిర్వహించుటకు నలుదెసలయందు నాలుగు ముఖములు, అవ్వాని నడుమ ఐదవముఖంబును నాకు ఒప్పారుచుండును. విధి విష్ణువులారా? మీరిరువురు పూర్వకాలమున గొప్పతపంబాచరించి నా యనుగ్రహము వలన సృష్టికార్యము నొకరు, స్థితికార్యమును మరియొకరు సంపాదించితిరి. అటులే రుద్రుఁడు సంహార కృత్యమును మహేశ్వరుఁడు తిరోభావకృత్యమును సంపాదించిరి. ఇఁక పంచమంబగు అనుగ్రహమును నేనుదక్క నితరులెవ్వరును గావింపఁజాలరు. ఐతే మీరుభయులు పూర్వకృత్యమును విస్మరించితిరి. రుద్రమహేశ్వరులు మాత్రము విస్మరింప లేదు గావున వారిరువురికి రూపమునందును వేషమునందును వాహనము నందును ఆసనమునందును ఆయుధములు మున్నగు వాని యందును నాతో సమానత్వము ప్రసాదింపబడినది. ఒకప్పుడు నన్ను ధ్యానించుటను విరమించినందున మీకిట్టి యవివేక మాపాదించినది. నన్ను ధ్యానించునెడల రుద్రమహేశ్వరులకువలె మీకును ఇట్టి యజ్ఞానము కలుగఁజాలదు. అందువలన నాయందు ఎల్లకాలము నిష్ఠయుండుటకై మదీయంబైన ప్రణవపంచాక్షరీ మహామంత్రమును పరిగ్రహించి జపింపుడు! ఇద్దానికి నాకును వాచ్యవాచక సంబంధము కలదు. ప్రణవము - శివ శక్తుల రెంటిని బోధించును. ప్రణవము నుండి పంచాక్షరమావిర్భవించినది. పంచాక్షరినుండి త్రిపాద్గాయత్రీమంత్రము జనించినది. గాయత్రీమంత్రమునుండి సమస్తవేదము; వేదమునుండి మంత్రకోటులును అవిర్భవించినవి. ఆయా మంత్రములను జపించుటవలన నిర్దిష్టములైన అభీష్టములు సిద్ధించును. ప్రణవపంచాక్షరీ మహామంత్ర జపము వలన సర్వాభీష్టములు నెరవేరుటయేగాక భోగమోక్షంబులును సమకూరును. ఇతరమంత్రములన్నియు భోగమును మాత్రము కలుగుజేయునవి. ఇట్లు వివరించి శివుఁడు బ్రహ్మవిష్ణువుల నుత్తరదిశాభిముఖముగా కూర్చుండజేసి యవ్వారి శిరంబులపై తన అమృతహస్తము నుంచి దక్షిణకర్ణముల యందు ప్రణవముతో కూడిన శివపంచాక్షరీ మహామంత్రమునుపదేశించెను. అంత బ్రహ్మవిష్ణువులు మూడుపర్యాయములుచ్చరించి మంత్రముఁబరిగ్రహించి యంత్రతంత్రములను గూడ కనుగొని శిష్యులైనందున గురుదక్షిణగా ఆత్మసమర్పణమును గావించిరి. మఱియు బద్ధాంజలులై సన్నిధానమున వినమ్రులై జగద్గురువగు సదాశివు ననేకవిధముల కొనియాడిరి.

అంత భగవానుడు - సంగ్రహముగా తత్త్వస్వరూపమును ప్రణవపంచాక్షరీ లక్షణమును వక్కాణించెను. ఇద్దానిని జపించుటఁజేశి సుస్థిరమైన జ్ఞానము అలవడును. ఆర్ద్రానక్షత్రమున చతుర్దశీతిథియందు శివపంచాక్షరీ జపము అనంతఫలము నొసగునది. శివమూర్తిని పూజించుట కన్న





శివలింగారాధనమే శ్రేష్ఠంబని తెలుసుకొని శివలింగమును వైదికవిధానముగా స్వహస్తములతో ప్రతిష్ఠించుట కడుంగడు శ్రేయస్కరమగును. అట్టియవకాశము లేనివారు గురుబ్రాహ్మణ ద్వారా శివలింగమును ప్రతిష్ఠింపవచ్చును. ప్రతిష్ఠిత శివలింగమును నిత్యము షోడశోపచారములఁ బూజించువారికి శివపదము సులభంబగును.

ఇవ్విధముగా నుపదేశించి శివుఁడంతర్ధానముఁ జెందినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో దశమాధ్యాయము.

## ఏకాదశాధ్యాయము

### (శివలింగ పూజన దాన ప్రకారములు ప్రణవపంచాక్షరీ జపవిధానము)

సూతుఁడు చెప్పఁదొడగెను:

మునులారా! మీ శ్రేయస్సుకొరకు చెప్పుచున్నాను. సావధానముగా వినుఁడు! అనుకూలమైన శుభసమయమున పుణ్యతీర్థముఁదగు తీరమునందు తన యభిలషితము ననుసరించి శివలింగమును ప్రతిష్ఠింపవలెను. కాని యచ్చోటు నిత్యపూజనము జరుగునదిగా నుండఁదగినది. పృథివీసంబంధమగు లింగమునుగాని తేజోమయమును గాని ప్రతిష్ఠింపవలెను. కల్పములో చెప్పఁబడిన సమస్త లక్షణములుగల లింగము తత్కాలముననే పూజాఫలము నొసగును. ఇననిందొక విశేషము గలదు. చరలింగము చిన్నదిగాను స్థిర లింగము పెద్దదిగాను పీఠముతో కూడినదై యుండవలెను. లింగపీఠము – మండలాకారముగానైనను నలుచదరముగానైనను త్రికోణముగానైనను మంచముకోడివలె నడుమ సన్నముగా నుండినచో మహాఫలప్రదంబగును.

స్థావరము విషయమై మృత్తిక, శిల, లోహము, మున్నగు వానిలో నెద్దానితో లింగము చేయించబడునో అద్దానితోడనే పీఠమును చేయించుట శ్రేయస్కరంబగును.

చరలింగము విషయమై లింగము పీఠంబు నొక్కటిగా నుండవలెను. ఒక్క బాణలింగమునకు దక్క ఇతర లింగములకు పై నియమము వర్తించును. కర్తయొక్క పండ్రెండ్రు అంగుళముల కొలతతో లింగప్రమాణము ఉత్తమంబగునది. అంతకు తక్కువయైనచో ఫలము స్వల్పంబగును. ద్వాదశాంగుళములకన్న నధికంబగునెడ దోషమేమియు లేదు. కర్త ముముక్షువగునెడ చరలింగము నేకాంగుళప్రమాణముగా పరిగ్రహించి పూజింపవచ్చును.

శివలింగ ప్రతిష్ఠఁజేయువారు మొదట గోపురముతో కూడిన, మందిరమును అచ్చటచ్చట దేవతాగణంబులుండునట్లు శిల్పులతో కట్టించి అందు దర్పణముతో సమానముగా ప్రకాశించునదియు దృఢమైనదియు మనోహరంబునగు గర్భగృహమును నిర్మింపజేయవలెను. గర్భగృహముఁదగు ద్వారమును నవరత్నములతో నలంకరింపవలెను. నీలము, రక్తము, వైడూర్యము, శ్యామము, మరకతము, ముత్యము,





పగడము, గోమేదము, వజ్రంబు ననునవి నవరత్నములనంబడును. లింగ ప్రతిష్ఠార్థము గర్భగృహమున వేదికను నిర్మించి వేదిక యందలి గుంటలో నవరత్నములను వేయవలెను. శివలింగమును ప్రతిష్ఠించుతతి సద్యోజాతాదిపంచ బ్రహ్మ మంత్రములతో శివలింగమును పూజించుటయేగాక హవనము నాచరించి శంకరుని పరివారమును గూడ నారాధించి ఆచార్యుని సత్కరించి బంధువులను అప్తులను సన్మానింపవలసియుండును. యాచకులకు దరిద్రులకు అన్నవస్త్రాదుల నొసగవలెను. ఇట్లు చరాచర జీవులను యథాశక్తి సంతసింపఁజేశి నవరత్నములతో సువర్ణముతోడను నింపఁబడిన గుంటయందు సద్యోజాతాది మంత్రముల నుచ్చరించుచు పరమేశ్వరుని ప్రార్థించి మంగళవాద్యములు మ్రోగుచుండగా ప్రణవమహామంత్రమును పఠించుచు శివలింగమును ప్రతిష్ఠించి నెలకొలుపవలెను.

మఱియు లింగమును పీఠమును స్థిరముగా నుండునట్లు సిమెంటు మున్నగువానితో బంధింపఁ జేయఁవలెను. ఇవ్విధముగానే శివమూర్తిని గర్భాలయము ముందు ఉత్సవములకొరకు శివపంచాక్షరీమంత్రముతో ప్రతిష్ఠింపవచ్చును.

లింగము స్థావరంబనియు జంగమంబనియు రెండు విధములు కలదని మరియొక విభాగము. పర్వతములు వృక్షములు మున్నగునవి స్థావరలింగములనఁబఱుగును. కృమికీటాదికములు జంగమ లింగంబులరఁదగినవి. స్థావరములను సేవించుట జంగమము లను సంతృప్తిఁబఱచుటయు అయా కామ్యములు సిద్ధించుటకై శివారాధనంబగుచున్నయది.

శ్లో॥ పీఠ మంబామయం సర్వం - శివలింగంచ చిన్మయమ్ ॥

శివలింగముఁదగు పీఠమంతయు అమ్మవారనియు లింగము శివుండనియు గుర్తెరుఁగవలెను. కైలాసములో శంకరుఁడు తన తొడపై పార్వతీదేవి నెట్లు కూర్చుండఁజేసి యుండునో అట్లు శివలింగము పీఠముతో కూడి మందిరమున నెలకొనియుండును.

సుప్రతిష్ఠితమైన శివలింగమును నిత్యము యథాశక్తి పూజించుట కడుంగడు సమంజసము. అథవా చరలింగమును నిత్యము షోడశోపచారములతో పూజింపవలెను. అభిషేకము నైవేద్యము నమస్కారంబు ముఖ్యములగును. మనుష్యప్రతిష్ఠితమును గాని ఋషిప్రతిష్ఠితమునుగాని దేవతాప్రతిష్ఠితమును గాని స్వయంభూలింగమును గాని నిత్యము పూజించుటకు వలయు ఉపచారములను సమర్పించి ప్రదక్షిణా నమస్కారములను మాత్రము గావించువారు క్రమముగా శివపదముఁబొందుదురు. ప్రతిదినము తప్పకుండా శివాలయమునకు వెళ్ళి శివదర్శనమును చేయుదుమని నియమము నవలంబించుటయు శ్రేయస్కరమని భావింపవలెను.

చరలింగమును మట్టితో గాని బెల్లముతోగాని వెన్నతోగాని పిండి మున్నగువానితో గాని నిర్మించి నిత్యము పూజింపవలెను.

శ్లో॥ అంగుష్ఠాదా వపి తథా - పూజా మిచ్ఛంతి కేచన,
లింగకర్మణి సర్వత్ర - నిషేధోఽస్తిన కర్హిచిత్ ॥





కొందరు మహానుభావులు - వామకరతలమునందు అనఁగా అంగుష్ఠముఁదగు మూలమున స్ఫటికాదినిర్మిత సూక్ష్మశివలింగమును శివాగమరీతిగా నారాధించుచున్నవారు. ఐతే శివపూజనమునకై వామహస్తము పనికిరాదని శంకింపరాదు. ఎందుకనగా? మంత్రపూతమై విహితంబునగు ప్రతి స్థలమునందును శివలింగమును పూజింపవచ్చును. ఇందుకు ఎట్టి నిషేధంబును శాస్త్రములయందు చెప్పఁబడలేదు.

శివుఁడు సాధకుల పరిశ్రమ ననుసరించి ఫలము నొసఁగువాడు. ఒకవేళ నిట్టి యవకాశము లేనివారు శివభక్తునకు శివలింగమును శ్రద్ధతో దానముఁజేయవలెను. శివలింగముఁదగు మూల్యమునైన సమర్పింపవలెను. ప్రణవమును నిత్యము పదివేలు జపింపవలెను. ప్రాతః సాయం సంధ్యలయందు సహస్రమునైన జపింపవలెను. జపకాలమున ఓంకారము మకారాంతముగా నుచ్ఛరింపఁబడునేని మనః శుద్ధిని ప్రసాదించును. సమాధియందు అనఁగా శివధ్యానమువేళ మానసికముగాను సర్వకాలములయందు ఉపాంశువుగాను ప్రణవమును జపింపవలసియుండును.

శ్లో॥ **అథ పంచాక్షరం నిత్యం - జపే దయుత మాదరాత్ ।**
**సంధ్యయోశ్చ సహస్రంవా - జ్ఞేయం శివపదప్రదమ్ ॥**

ఇఁక ప్రణవముతో కూడిన శివపంచాక్షరీ మహామంత్రమును ప్రతిదినము ఆసక్తితో పదివేలు జపింపవలెను. అథవా ప్రాతఃసాయంకాలములయందు ఒక్కొక్క సహస్రమైనను జపించినచో శివపదము చేకూరునని తెలియవలెను. బ్రాహ్మణులకు ఇయ్యది మొదట ప్రణవముతో కూడియుండిననే శ్రేయస్కరంబగును. ఐతే ఏరికైనను సఫలము కావలెనన్నచో సత్యచరిత్రుడైన విజ్ఞానముగల బ్రాహ్మణగురువు నుండి ఇద్దానిని దీక్షాయుక్తముగా గ్రహింపవలసియుండును. కుంభస్నానము, మంత్రదీక్ష, మాతృకాన్యాసంబు నను నవి మంత్రోపదేశ గ్రహణాంగములగును.

శివ పంచాక్షరీ మహామంత్రము - బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకు నమః పదము మొదటిదిగాను తదితరులకు చివరిదిగాను గ్రాహ్యంబు; ఇద్దానిని ఐదుకోట్లు జపించినవాడు సదాశివునితో సమానుఁ డగును. ఒక్కకోటి జపమువలన బ్రహ్మపదము, రెండుకోట్లు జపించుటఁజేశి విష్ణుపదంబు, మూడుకోట్ల జపమున రుద్రపదము, నాలుగుకోట్లు జపించుటచే మహేశ్వర పదంబు సంప్రాప్తములగును. నిత్యము వేయి చొప్పున వేయిదినములలో అనఁగా రెండు వత్సరముల పదునొకండు నెలల పది దినములయందు జపించినచో పదిలక్షలగును. ఇవ్విధము జపించునపుడు ప్రతిదినము ఒక్క శైవబ్రాహ్మణునకు భోజనము నొసగవలెను. ఇట్లు చేయుట వలన అభీష్టము తప్పక సిద్ధించును. గాయత్రీమంత్రమును నిత్యము అష్టోత్తర సహస్రము (౧౦౦౮) జపించు వారికి శివుఁడు సంతసించి కైలాస నివాసము నొసగును. అటులే వేదమంత్రములను సూక్తములను నియమముగా పఠింపవలెను. ప్రణవ పంచాక్షరీ మహా మంత్రమును గాని ఇతర మహామంత్రములను అక్షరలక్షగా జపించినచో పురశ్చరణంబగును. ఐతే మహామంత్రములన్నిటిని ప్రణవముగాని ప్రణవముతో కూడిన శివపంచాక్షరీ మహామంత్రమే కాని రోచకమై మరణాంతమువరకు తప్పనిసరిగా నిత్యసహస్ర సంఖ్యగా జపనీయంబగునేని శివాజ్ఞావశమున సర్వాభీష్టములు సమకూరుటయే గాక శాశ్వత శివసాయుజ్యంబును సిద్ధించును.

శివానుగ్రహముఁగోరువారు - శివాలయ సమీపమున పుష్పఫలవృక్షములను నెలకొల్పి శివాలయమును శుభ్రపఱచుచు శివకార్యములకు చేయూతనొసగుచుండవలెను. మఱియు శివక్షేత్రము యందు నివసింపవలెను. జీవిత కాలము మొత్తము శివక్షేత్ర నివాసము జ్ఞానులకు అజ్ఞానులకును పశుపక్ష్యాదులకును తరుగుల్మలతాదులకును భుక్తి ముక్తులఁబ్రసాదించును. పుణ్యక్షేత్రమునందు గల కూప పుష్కరాదులన్నియు శివగంగలగునని భావించి అందు స్నానమాచరించి దానము జపము అనువానిగావించుట శ్రేయస్కరంబగును. శివక్షేత్రము నందు మరణమువరకు నివసింపజాలనివారు - ఒక్క సంవత్సరమైనను ఒక్క నెలయైనను పదిదినములైనను సప్తాహంబైనను పంచఘ్రంబులైనను త్రిరాత్రంబైనను దినద్వయంబైనను ఏకరాత్రంబైనను నివసింపవలెను. ఐతే భక్తులు తమ తమ వర్ణాశ్రమముల ననుసరించి శివారాధనజేయుచుండవలెను. కామ్యోపాసనజేయువారు ఆయా కామితముల నవశ్యము బడయుదురు. నిష్కామమనగా శివునుపాసించునెడ కైవల్యము లభించును. శివారాధనము - ప్రాతర్మధ్యాహ్నసాయాహ్నాది కాలములయందుకన్న నిశీథకాలమున విశేషఫలప్రదంబగును. కలియుగమున విశేషించి కర్మరూపమైన శివారాధనమే ఫలము నొసగునది. శివారాధకుడు సత్ప్రవర్తనగలవాడై పాపభీరువగునేని యథోక్తఫలము నొందజాలును.

ఇవ్విధము సూతమహర్షి చెప్పగా - స్త్రీలను పురుషులను తరింపఁజేయు శివక్షేత్రములను పేర్కొనుండని శౌనకాది మహర్షులు ప్రశ్నించినవారైరి.

అట్టితఱి-ఋషులారా? శ్రద్ధతో నాలకింపుడు! అని సూతుఁడు ప్రవచించెను.

ఇయ్యది "శివవిజ్ఞానసర్వస్వ"మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఏకాదశాధ్యాయము.

## ద్వాదశాధ్యాయము

### (శివక్షేత్రవర్ణనము పాపపుణ్య పరామర్శ)

శివక్షేత్రము భుక్తిముక్తి ప్రదంబు.

ఏబదియోజనముల వైశాల్యము గలదియు పర్వతములతో అరణ్యములతో కూడినదియు నగు భూమి - శివాజ్ఞావశమున ప్రపంచమును మోయుచున్నది. భక్తులకు మోక్షము నొసగుటకు భూలోకమున ఆ యా స్థలములయందు శివుఁడు క్షేత్రముల నేర్పరచెను.

ఋషులు నివసించి అనుష్ఠానములఁ జేయుటవలనను దేవతలు అభినందించుటఁజేశియు క్షేత్రములు వెలసినవి. కొన్ని క్షేత్రములెట్టి నిమిత్తము లేకయే స్వయంభువులైనవి. పుణ్యతీర్థమునందును పుణ్యక్షేత్రమునందును స్నానదానజపాదికము నవశ్య మాచరింపవలెను. ఒకవేళచేయనిచో రోగములను బీదతనమును మూగతనము మున్నగు ఇడుములఁజెందుదురు. స్వయంభూస్థానములయందు నివసించి భారతదేశమున మరణించువాడు - మరల మానవుడయ్యే జన్మించును. క్షేత్రమునందు నివసించువారు





ఎట్టి పాపమును చేయరాదు. ఏదోనొక ఉపాయము నవలంబించి మానవుఁడు పుణ్యక్షేత్రమునందు నివాసమును గావింపవలెను.

సముద్రతీరమునందును నదీతీరమునందును అనేక పుణ్యక్షేత్రములు కలవు. సరస్వతీనదియు హిమాలయమునుండి బయలువెడలిన గంగానదియు ఎన్నఁదగినవి. గంగా నదీతీరమున కాశి మొదలగు పుణ్యక్షేత్రములు పెక్కు గలవు. నర్మదామహానది యందు స్నానము నాచరించి దానముఁజేయుట వలన విష్ణులోకము లభించును. శోణభద్రమనబడు నదమునందు స్నానమునుపవాసమును చేశినచో వినాయకుని పదములో నివసింతురు.

బ్రహ్మహత్యాపాపమును గోహత్యాపాపమును నివారించు గోదావరీనది - శివలోకనివాసమును ప్రసాదించునట్టిది. కృష్ణవేణియందు స్నానాదానాదికము పాపములన్నిటిని పోగొట్టుటయే గాక వైకుంఠనివాసము నొసగునది. తుంగభద్రానది బ్రహ్మలోకప్రాప్తిని కలుఁగజేయును. బ్రహ్మలోకమునుండి మానవలోకమునకు వచ్చువారు సువర్ణముఖరీనదీతీరమున మానవులై జన్మింతురు. పంపానదియు శ్వేతనదియు ప్రశంసింపఁదగినవి. సరస్వతీ తీరమునందును శ్వేత మున్నగు నదుల తీరములయందును నివసించు వారు ఇంద్రలోకముఁబొందుదురు. సహ్యాపర్వతమునుండి పుట్టినదియు సర్వాభీష్టప్రదాయినియు నగు కావేరీ మహానదిఁదగు తీరములయందు నివసించువారు స్వర్గమును బ్రహ్మ విష్ణుపదమును పొందుదురు. శివక్షేత్రములు-అభీష్టములను నెరవేర్చుటయేగాక శివలోకము నొసగునవి. మేషరాశి యందు బృహస్పతియు సూర్యుఁడును నివసింపగా నైమిషారణ్యమున బదిరీ క్షేత్రమునందును స్నానమును పూజనాదికము నాచరించినచో బ్రహ్మలోకము ప్రాప్తించును. సింహరాశియందు కర్కరాశియందును రవియుండగా సింధునదియందు స్నానము శ్రేయస్కరం బగును. కేదారక్షేత్రమున రేతఃకుండమునందలి ఉదకమును త్రాగుటయు అచటి మందాకిని యందు స్నానము నాచరించుటయు జ్ఞానమును కలుఁగజేయును. సింహరాశియందు బృహస్పతి యుండగా సింహమాసమునందు గోదావరిలో స్నానముఁజేయుట శివలోకప్రదంబగునని శివుఁడు వక్కాణించెను. బృహస్పతి - కన్యాగతుండైనపుడు రవి కన్యయందుండగా యమునానది యందును శోణనదమునందును స్నానమును చేశినవారికి ధర్మలోకమున విఘ్నేశ్వర లోకమునను మహాభోగము సంప్రాప్తంబగును. రవి గురులు తులారాశియందుండగా కావేరి యందు స్నానమును గావించినచో సర్వాభీష్టములు సిద్ధించునని విష్ణువు చెప్పెను. వృశ్చికమున రవిగురులు నివసింపగా నర్మదాస్నానము విష్ణులోకము నొసగును. ధనస్సునందు బృహస్పతి సూర్యులు నివసింపగా సువర్ణముఖరీనదియందు స్నానదానాదికముఁ జేయుటవలన శివలోకము లభించుననియు మకరగతులై రవిగురువులుండుతతి గంగాస్నానము శివలోక నివాస ప్రదంబనియు శివలోక ప్రాప్తికి మున్ను బ్రహ్మవిష్ణులోకములయందు నివసింతురనియు బ్రహ్మదేవుఁడు వాక్రుచ్చెను.

మాఘమాసమున కుంభరాశియందు సూర్యుఁడుండగా గంగానదియందు స్నానము శ్రాద్ధము పిండప్రదానము తిలోదకప్రదానము అనువాని నాచరించుటవలన మాతృవంశము నందలి పితరులు పితృవంశమునందలి పితరులు ఉద్ధరింపబడుదురు. మీనరాశియందు గురువు రవియు నుండగా కృష్ణవేణియందు స్నానాదికము మిగుల శుభము నొనగూర్చునది.

గంగానదినైనను యమునానదినైనను ఆశ్రయించి నివసించు మహానుభావులు తత్కాలమున ప్రమాదమున జేయు పాపములు నశించును. తామ్రపర్ణీనదీ వేగవతీనదియు బ్రహ్మలోకప్రదములు. పుణ్యక్షేత్రమునందు నివసించువారు సదాచారముతోడను మంచివృత్తి వలనను సద్భావనచేతను భూతదయగలవారై యుండవలెను. అట్లు నివసింపనిచో క్షేత్ర నివాస ఫలము సమకూరదు.

పుణ్యక్షేత్రమున చేయఁబడు పుణ్యము స్వల్పంబైనను నానావిధములుగా పెంపొందును. అటులే పాపంబును గొప్పదగును జీవనమునకై అవశముగా చేయఁబడు పాపము పుణ్యముతో క్షీణించును. క్షేత్రకృతపుణ్యము – కాయిక వాచిక మానసిక పాపములను బోకార్చును. మానసిక పాపము వజ్రలేపంబై కల్పకల్పాంతరముల ననువర్తించును. అట్టిది శివధ్యానముతోడనే నశించును. శివమంత్రజపమున వాచికపాపము అంతరించును. ఉపవాసాది.కాయశోషణము వలన శారీరక పాపము పటాపంచలగును. ధనసంబంధముగా చేయఁబడిన పాపము దానమువలననే నశించును. ఒకప్పుడు పాపము పెరుగుచున్నచో పుణ్యము పూర్వకృతముగాని సద్యః కృతముగాని నశించును.

భీజాంశమనియు వృద్ధ్యంశమనియు భోగాంశమనియు పుణ్య పాపములందగు విభాగములు కలవు. బీజాంశము జ్ఞానముతో నశించును. అభివృద్ధిఁజెందుచున్న పుణ్యముతో పాపవృద్ధ్యంశము అంతరించును. అనుభవముతోడనే పుణ్యపాప భోగాంశము నశించును. బీజాంశము వృద్ధ్యంశంబును నశించునెడ శేషము భోగముగా పరిణమించును.

**శ్లో॥ దేవానాం పూజయా చైవ - బ్రాహ్మణానాంచ దానతః ।**
**తపోఽధిక్యాచ్చ కాలేన - భోగః సహ్యో భవేన్నృణామ్ ॥**

పాపభోగము – దేవతలను ముఖ్యముగా సర్వదేవాత్మకుండైన శివుని పూజించుట వలనను బ్రహ్మనిష్ఠులగు మహేశ్వరులకు గోభూహిరణ్యాది దానముల నాచరించుటవలనను శివపంచాక్షరీ మహామంత్రాది జపరూపమైన తపస్సువలనను మానవులకు సహింప శక్యంబగును.

కావున సుఖము నభిలాషించువాడు పాపమును బొత్తుగా చేయకయే జీవింపవలెను.

*ఇయ్యది "శివజ్ఞాన సర్వస్వ"మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ద్వాదశాధ్యాయము.*

## త్రయోదశాధ్యాయము

### (సదాచారవర్ణనము)

తెలివిగల మానవుని పుణ్యలోకములను జయింపఁజేయునదియు నరకముల నతిక్రమింపఁ జేయునదియు నగు సదాచారమును వివరింపుడని శౌనకాది మహర్షులు ప్రశ్నింప సూతుండు చెప్పఁ దొడఁగెను.

బ్రాహ్మణుఁడు సదాచార సంపన్నుఁడై వేదశాస్త్రములఁజదివి వైదికాచారమును నడచినచో విప్రుడనఁబఅగును. క్షత్రియుఁడు కొద్ది ఆచారము గలవాడై కించిన్మాత్రము వేద శాస్త్రములను గుర్తెరిగి

రాజసేవకుఁడుగా నుండును. వైశ్యుఁడు స్వల్పమైన సదాచారముఁబ్రవర్తించుచు కృషివాణిజ్యముల నవలంబించును. బ్రాహ్మణుఁడు స్వయముగా భూమిదున్నిన యెడల శూద్ర బ్రాహ్మణుఁడగును. మరియు ఇతరుల కలిమి నోర్చుకొనక పరద్రోహముఁ జేయుచున్నచో చండాల బ్రాహ్మణుండగును. భూమిని పరిపాలించువాడు మాత్రము రాజనఁబఱగును. తదితరులందరును క్షత్రియులనంబడుదురు. ధాన్యము మున్నగు వస్తువులను కొనువాడు అమ్మువాడు మాత్రము వైశ్యుఁడు. ఇతరులందరును వణిజులు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు అండగా నుండువాడు శూద్రుడు. భూమిఁదున్నువాడు వృషలుఁడు. ఇతరులందరును దస్యులనంబడుదురు.

ప్రతివారును ఉషః కాలమున లేచి ఇష్టదేవతలను ప్రార్థించి తనకుగల ఆదాయ వ్యయములను పరిశీలించుకొనవలెను. ధర్మార్థములను గురించి చింతింపలెను. తన ఆయుష్యమును గురించియు పాపమును భాగ్యమునుద్దేశించియు అనారోగ్యమును శరీరపాటవమును స్తోమతను గురించియు విచారింపవలెను.

తరువాత శౌచమును దంతధావనమును గావించి స్నానము నొనర్చి శుభ్రమైన వస్త్రమును ఉత్తరీయమును పరిగ్రహించి జాబాలోపనిషదమునందలి మంత్రములతో భస్మను త్రిపుండ్రములుగా ధరింపవలెను. స్నానానంతరము విభూతిఁధరింపకుండుట నరకప్రదమగును. భస్మధారణానంతరము సంధ్యావందనమున గాయత్రీ మంత్రము నష్టోత్తరశతము జపింపవలెను. స్వగృహమునఁగాని దేవాలయమునందుగాని ప్రణవాదిమంత్రానుష్ఠానము ప్రశస్తంబైనది. స్వప్రకాశులైన బ్రహ్మవిష్ణు మహేశ్వరుల నుపాసించుచున్నామనియు సర్వదేవాత్మకుండైన శివుఁడు జ్ఞానకర్మేంద్రియ మనోవృత్తులను బుద్ధిని భోగమోక్షప్రదములైన ధర్మజ్ఞాన (ఉపాసనఁములయందును) నెలకొలుపు గాత యనియు మంత్రార్థమును భావించుచు గాయత్రిఁజపింపవలెను. ఒకవేళ మంత్రార్థమును భావింపఁజాలనిచో బ్రాహ్మణ్యమునకై మాత్రము కేవలము మంత్రమునే జపింపవచ్చును.

వస్తుతః బ్రాహ్మణపుంగవుడు నిత్యము ప్రాతఃకాలమున గాయత్రీ మంత్రమును సహస్రము జపించుట ఉత్తమంబగును. ఇట్లు మంత్రార్థమును భావించుచు మంత్రమును జపించినచో బ్రహ్మ ప్రాప్తి నిశ్చయముగా సమకూరును. ప్రతి మహామంత్రమును సహస్రము జపించుట బ్రహ్మప్రాపకము; శతము జపించుట స్వర్గప్రదము ఇతరసంఖ్య – ఆత్మ రక్షణావహము;

కనీసము లక్షసంఖ్యఁగాయత్రిఁజపింపనివాడు వైదికకార్యములకు అనర్హుడు. ద్వాదశలక్షసంఖ్యఁ గాయత్రీమహామంత్రమును జపించు బ్రాహ్మణుడు–పరిపూర్ణుండగును. డెబ్బదివత్సరముల ప్రాయముదనుక గృహస్థుడై తరువాత సన్న్యసింపవలెను. యతి–నిత్యము ప్రణవమును పండ్రెండువేలు జపింపవలెను. కోర్కెలుగలవాడు ధర్మాదర్థములను పెంపొందించు ప్రయత్నమును చేయుచుండవలెను. ముక్తికాముఁ డగునేని బ్రహ్మజ్ఞానమును అనఁగా శివారాధనము నభ్యసింపవలెను.

ధర్మము నాచరించుటవలన అర్థము సిద్ధించును. అర్థసిద్ధిచే సుఖభోగము సంప్రాప్తమగును. ధర్మార్జితమైన అర్థమువలన కలుగు భోగమున వైరాగ్యము సంభవించును. అధర్మార్జితార్థ భోగమున సంసారమునందు అనురాగము పెరుగుచుండును.

ధర్మము-ద్రవ్యముతో చేయఁదగినదనియు, దేహముతో నిర్వర్తింపఁదగినదనియు రెండు విధములు; యజ్ఞయాగాది సుకృతములు ద్రవ్యధర్మములనియు, పుణ్యతీర్థ స్నానాది కర్మలు దేహధర్మములనియు వివేకము. ధర్మముతో ధనము చేకూరును. తపస్సువలన దివ్య రూపము ఏర్పడును. నిష్కామకర్మయోగి-చిత్తశుద్ధి గలవాడగును. చిత్తశుద్ధిచే జ్ఞానము (శివారాధన బుద్ధిదార్ఢ్యము) అలవడును.

కృత త్రేతా ద్వాపరములయందు తపస్సు సఫలమగుచుండెడిది. కలియుగమున మాత్రము ద్రవ్యధర్మము సిద్ధించును.

**శ్లో॥ కృతే ధ్యానాత్ జ్ఞానసిద్ధి - స్త్రేతాయాం తపసా తథా ।**
**ద్వాపరే యజనాత్ జ్ఞానం - ప్రతిమాపూజయా కలౌ ॥**

ముఖ్యముగా విచారించినచో కృతయుగమున శివధ్యానమువలన శివజ్ఞానము కలుగుననియు, త్రేతాయుగమున తపస్సువలన శివానుగ్రహము సమకూరుననియు, ద్వాపరయుగమున యజ్ఞమువలన చిత్తశుద్ధి యేర్పడుననియు, కలియుగమునందు శివలింగమును పూజించుట వలనను విఘ్నేశ కుమార విష్ణు శ్రీరామ శ్రీకృష్ణాది విగ్రహముల నారాధించుటవలనను విజ్ఞానము పరిపూర్ణంబగుననియు విదిత మగుచున్నయది.

పుణ్యము గాని పాపముగాని ఎట్టిది చేయబడునో అట్టి ఫలమే సమకూరును. ద్రవ్యముతోడను శరీరమువలనను పుణ్యపాపముల హెచ్చు తగ్గులు తెలియుచుండును. ఇతరులను హింసించుటయే అధర్మము, పరులను సుఖపెట్టుటయే ధర్మము; అధర్మము వలన దుఃఖము, ధర్మము వలన సుఖంబును చేకూరును. కావున భోగమోక్షములు సిద్ధించుటకు ధర్మమునే ఆచరింపవలెను.

నలుగురు గల కుటుంబముతో కూడియుండు బ్రాహ్మణునకు నూరువత్సరముల కాలమ్ము జీవనాధారము నొసగిన వానికి బ్రహ్మలోక నివాసము లభించును. క్షత్రియుఁడు సహస్రబ్రాహ్మణకుటుంబములను పోషించినచో ఇంద్రలోకమును పొందును. పదివేల బ్రాహ్మణ కుటుంబములను రక్షించునెడ బ్రహ్మలోకముఁ బ్రవేశించును. ఏ యే దేవతనుద్దేశించి దానముఁజేయుదురో ఆయా దేవతఁజెందిన లోకములో నివసింతురు. దరిద్రుఁడు తపంబునాచరింప వలెను. పుణ్యతీర్థమున చేయఁబడు తపస్సువలన అక్షయ సుఖము సమకూరును.

బ్రాహ్మణుడు మంచివారిచ్చు దానములను తీసికొనుచు విహితములైన యజ్ఞయాగాది సత్కారములను చేయించుటవలనను దీనుఁడు కాకుండా పరిశుభ్రముగా నుండుటవలనను మిక్కిలి ఆయాసము కాకుండునట్లు డబ్బు గడింపవలెను. క్షత్రియుఁడు బాహుబలమున వైశ్యుఁడు కృషిగోరక్షణ దానములవలన ద్రవ్యమును సమృద్ధిగా పొందవలెను. అందరికిని గురుకటాక్షమువలననే జ్ఞానము కలుగుటయేగాక మోక్షంబును సిద్ధించును. మోక్షమువలన నిజరూపము బయటపడుటయేగాక శివానంద సమ్యక్‌భోగము సంభవించును. ఇదియంతయు సత్పురుష సహవాసమువలననే సంఘటించును. ఆయా సమయములయందు ఫలించు ధాన్యములను ఫలములను బ్రాహ్మణులకు మొదట యథాశక్తి సమర్పింపవలెను. పానీయ జలము నెల్లకాలము నొసగవలెను. ఆకలి శమించుటకు అన్నము నిడవలెను. అన్నము-క్షేత్రమనియు ధాన్యమనియు ఆమాన్నమనియు పక్వాన్నమనియు నాలుగు విధములు.

దాతయొక్క అన్నము నెంతకాలము అనుభవించునో అంతకాలము ప్రతి గ్రహీత గావించిన పుణ్యములో సగము భాగము దాతకు చెందును. ప్రతిగ్రహములో గల దోషమును తపస్సువలనను దానమువలనను పోగొట్టుకొనవలెను. అట్లు చేయనిచో రౌరవ నరకప్రాప్తి యగును.

తాను సంపాదించిన డబ్బు - ధర్మమునకు అభివృద్ధికి భోగమునకు మూడు విధములుగా విభజింపవలెను. ధర్మాంశమువలన నిత్య నైమిత్తిక కామ్యములైన విహితకర్మల నాచరింపవలెను. వృద్ధ్యంశమున ధనమును పెంచవలెను. భోగాంశముచే హితము మితము పవిత్రంబునగు భోగము ననుభవింపవలెను. వ్యవసాయమున పదియవ భాగమును, వడ్డీవ్యాపారమున ఆరవభాగమును, శుద్ధప్రతిగ్రహమున నాలుగవ భాగమును, అకస్మిక ధనప్రాప్తిని సగము భాగమును దానముఁజేయవలెను. దుష్టదానములఁబరిగ్రహించినదంతయు సముద్రమున పడవేయవలెను. ఆత్మభోగసమృద్ధిఁగోరువాడు సద్బ్రాహ్మణుల నాహ్వానించి దానముఁజేయవలెను. యాచకులు అడిగినది తన శక్తికొలది సమర్పింపవలెను. శక్తియున్నను అడిగినదాని నీయనిచో జన్మాంతరమున ఋణపడును. బుద్ధిమంతుఁడు పరదోషములను వెలిబుచ్చరాదు. వినినదియు చూచినదియు ద్వేషముతో చెప్పఁగూడదు. ప్రాణులందరి హృదయములను వేధించు వాక్యము నుచ్చరింపరాదు. ఐశ్వర్యము చేకూరుటకు రెండు సంధ్యలయందు అగ్ని కార్యము నొనర్పవలెను. అశక్తుఁడు ఒక్కకాలమందైనను హవనముఁజేయవలెను. అథవా ప్రాతఃసాయంసంధ్యల యందు గాయత్రీజపమును సూర్యోపస్థానమును తప్పనిసరిగా గావింపవలెను.

అర్థార్థియగువాడు ఇట్లు ప్రవర్తింపవలెను. బ్రహ్మయజ్ఞపరులు, నిత్యము దేవతలను అథవా సర్వదేవతా సార్వభౌముఁడైన శివునారాధించువారు, అగ్న్యుపాసనఁజేయువారు, గురువులను సత్కరించువారు, బ్రాహ్మణులను సంతృప్తిఁబఱచువారు నందరును ఉత్తమలోకముల నాశ్రయించి సుఖింతురు. మరియు శివలింగారాధనఁగూర్చియు శివక్షేత్రముల నుద్దేశించియు ప్రబోధముకలుగుటకు గ్రంథముల ముద్రింపించుటయు, విద్యార్థులకు విద్యాభ్యాస సౌకర్యముల నేర్పరచుటయు, కాశీ రామేశ్వర గోకర్ణాది మహాక్షేత్రములయందుగల యాత్రా ప్రతిబంధములను తొలగించుటయు, ఆయా క్షేత్రములయందలి పురోహితులనుసత్కరించుటయు, శివ విష్ణ్వాది మందిరములలో అభిషేక పాత్రాదుల నొసగి నిత్యపూజలు జరిపించుటయు, జీర్ణ మందిరముల నుద్ధరించుటయు, విద్వద్బ్రాహ్మణులకు జీవనవృత్తిని కల్పించుటయు, ధర్మ ప్రచారము చేయుటయు, అధర్మము నెదుర్కొనుటయు, వర్ణాశ్రమసదాచారమును సామాన్య ప్రజలకు వివరించుటయు, ఆత్మాభిమానమున వంశకులాచారములను పాటించుటయు, దేశకాల పాత్రానుసారముగా ప్రవర్తించుటయు, మనోవాక్కాయములు పరిశుద్ధములుగా ఈశ్వరాభి ముఖములగునట్లు ప్రవర్తించుటయు, సత్యదయాదాక్షిణ్యాది సద్గుణములను విడనాడకుండుటయు, న్యాయముగా డబ్బు సంపాదించుటయు కలియుగములో మానవులకు ముఖ్య కర్తవ్యములు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో త్రయోదశాధ్యాయము

# చతుర్దశాధ్యాయము

## (అగ్నియజ్ఞాది వర్ణనము)

అగ్ని యజ్ఞమును, దేవయజ్ఞమును, బ్రహ్మ యజ్ఞమును, గురుపూజనమును, బ్రాహ్మణ తృప్తి గురించియు వివరింపుడని ఋషులు ప్రశ్నింపగా సూతమహర్షి చెప్పఁదొడగెను.

అగ్నియందు హవనముచేయఁబడినచో అగ్నియజ్ఞము కాదగును. బ్రహ్మచారులు సమిధ నగ్నియందు ఔపాసనమువరకు వ్రేల్చవలసి యుండును. అగ్ని నాత్మారోపణఁజేసుకొనినవారు వానప్రస్థు సన్న్యాసులును హితము మితము పవిత్రంబు నగు ఆహారమును తమ తమ విహితకాలములయంద భుజించునెడ అద్దియు అగ్నియజ్ఞమగును. ఇంద్రాదిదేవతల నుద్దేశించి గావింపఁబడు హవనము దేవయ మనఁబడును. వేదాధ్యయనము - బ్రహ్మయజ్ఞము కాదగును. అగ్నియందు గాక నితరములయంద దేవతల నారాధించు విధానమును చెప్పుచున్నాను.

శ్లో॥ ఆదిసృష్టౌ మహాదేవః - సర్వజ్ఞః కరుణాకరః,
సర్వలోకోపకారార్థం - వారాన్ కల్పితవాన్ ప్రభుః ॥
సంసారవైద్యః సర్వజ్ఞః - సర్వభేషజభేషజమ్ ॥

సర్వజ్ఞుఁడు, కరుణాసముద్రుఁడు, సంసారమనుమహారోగము నుశమింపఁజేయువాడు ఔషధములన్నిటికి నౌషధమగువాడు, సమస్తమునకు చెందిన విశేషములను గుర్తెరిగినవాడునగు మహాదేవు డు జనులందరి యుపకారార్థము ఏడువారముల నేర్పరచెను.

ఆదిత్య సోమ మంగళ బుధ గురు శుక్ర శనైశ్చర వారములలో ఆయా దేవతలను పూజించునె ఆరోగ్యమును సంపదలను రోగశాంతిని శరీరపుష్టిని ఆయుష్యమును భోగమును అపమృత్యునివారణమున పొందవచ్చును.

ఇతర దేవతలను పూజించిన ఫలముఁగూడ శివుడే ప్రసాదించును. మంత్రజపము, హోమము దానము, తపస్సు, స్థండిలమున గాని ప్రతిమయందు గాని అగ్నియందు గాని సద్బ్రాహ్మణునియంద గాని ఆరాధించుటయు అను ఐదు విధములు కలదై పూజన మొప్పారునది. ఇందు పూర్వపూర్వమునక ఉత్తరోత్తరము పూజనమున శ్రేష్ఠంబగును.

నేత్రబాధతగ్గుటకు, శిరోరోగము శాంతించుటకు, కుష్ఠువ్యాధి శమించుటకును సూర్యుని పూజిం బ్రాహ్మణులకు భోజనము నిడవలెను. ప్రారబ్ధము ప్రబలమై త్వరలో ఫలితము కలుగకుండునెడ మూడ వత్సరములవరకు పూర్యాదుల నారాధింపవలెను.

ఆదిత్యాది వారములయందు, తిథినక్షత్ర యోగములయందు, తదితర సమయముల యంద నిత్యంబును దేవతలను పూజించునెడను, స్నానదాన జప హోమ బ్రాహ్మణభోజనములను గావించునెడను శివుఁడే సూర్యాదిరూపమున భక్తులకు ఫలితము నొసఁగువాడు.





ఐతే, ఆరాధనలో గల తారతమ్యముఁబట్టి ఫలితము లభించును. ఆదిత్యాదిదేవతలను శుభకార్య ప్రారంభమునను, అశుభము గడచిన తరువాతను, జన్మనక్షత్రములయందును గృహస్థుఁడు ఆరాధింపవలెను.

దరిద్రులు తపస్సుతో దేవతలఁబూజింపవలెను. శ్రీమంతులు ధనముతో నారాధింపవలెను.

ఇవ్విధము చేయునెడ దేవలోకములలో అనేక సుఖముల ననుభవించి మానవలోకమున ఉత్తముడై జన్మించును.

విత్తముగలవాడు - ఆతపతప్తులు విశ్రమించుటకు వృక్షచ్ఛాయను గాని ధర్మశాలను గాని ఏర్పరుపవలెను. దప్పిఁగొనినవారు మంచినీరు త్రాగుటకు జలాశయమును కల్పింపవలెను. బీదవాడైన బ్రాహ్మణకుమారుని ఉపనయనము నాచరింపవలెను. ధర్మమును పెంపొందించుకొనవలెను. ఇట్లు చేయుచున్నచో నానావిధభోగములు సంప్రాప్తములగుటయే గాక పుణ్యము పరిపక్వమగు సమయమున జ్ఞానము కలవాడై ముక్తుఁడగును.

ఈ అధ్యాయమును చదివినవారు విన్నవారు వినిపించినవారును దేవయజ్ఞఫలమును పొందుదురు.

ఇయ్యది "శివజ్ఞాన సర్వస్వ" మను శాంతరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో చతుర్దశాధ్యాయము

## పంచదశాధ్యాయము

### (దేవయజ్ఞాదులకు దేశకాలపాత్ర విచారణము)

సర్వార్థ విదుడవైన సూతుడా? దేవయజ్ఞాదులకు వలయు దేశకాల పాత్రములను విశదీకరింపుమని శౌనకాది మహర్షులు ప్రశ్నించిరి.

సూతుడు - దేవయజ్ఞాదికర్మల విషయమై పరిశుభ్రమైన గృహము - సమముగా ఫలము నొసగును. గోశాల - అద్దానికన్న పదిరెట్లు ఫలప్రదము. ఒకానొక జలాశయముఁదగు తీరము - అంతకంటె పదిరెట్లును; బిల్వ తులసీ అశ్వత్థ వృక్షముల మూలప్రదేశము ఇంక పదిరెట్లును; అద్దానికన్న దేవాలయము దశగుణంబును పుణ్యతీర్థతీరము నదీతీరము పుణ్య నదీతీరము గంగానదీతీరము అనునవి ఒకదానికన్న మరియొకటి పదిరెట్లును ఫలప్రదంబులగును.

గంగ, గోదావరి, కావేరి, తామ్రపర్ణిక, సింధువు, సరయు, నర్మద, అనునవి సప్తగంగలనఁబడును. ఇవ్వానికన్న సముద్రతీరము, అంతకంటె పర్వతాగ్రము, పదిరెట్లు ఫలము నొసగునవి. మనస్సు నిలుచుచోట - అన్నిటికన్న శ్రేష్ఠము.

యజ్ఞదానాది సత్కార్యములు - కృతయుగమున పూర్ణఫలప్రదములగును. త్రేతాయుగమున మూడుభాగములును ద్వాపరయుగమున రెండుభాగములును కలియుగమున నొక్క భాగంబును ఫలించును.





కలియుగము సగము గడచినపుడు నాలుగవ భాగములో సగము మాత్రము సుకృతములు ఫలప్రదంబులగును.

చిత్తశుద్ధిగల పురుషునకు మంచిదినము సమఫలప్రదంబగును. రవిసంక్రాంతియు, విషువంబును, అయనంబును, మకరసంక్రాంతియు, చంద్రగ్రహణంబును, సూర్య గ్రహణంబు ననునవి ఒక్కొక్క దానికన్న మరియొకటి పదిరెట్లు గుణంబు నిచ్చును. జగచ్చక్షువగు సూర్యునికి విషము సంబంధించుటయే గ్రహణ మనఁబడును. అద్దానివలన జగము పీడింపఁబడును. అట్టిదోషము తొలగుటకై స్నాన దాన జపములు నాచరింపవలెను. విషశాంతికగు సమయ మగుటచే గ్రహణము పుణ్యప్రదంబని చెప్పఁబడును.

జన్మనక్షత్రము తటస్థించుటయు ఒకానొక వ్రతముఁదగు చివరి సమయంబును సూర్యగ్రహణముతో సమానంబగును. మహనీయులతో సమావేశమగుతతి కోటి సూర్యగ్రహణముల పుణ్యకాలమని గుర్తెరుగవలెను. తపోనిష్ఠగలవారు, జ్ఞాననిష్ఠాసంపన్నులు, శివయోగులు సన్న్యాసులున్ను పాపములను బోకార్చువారై పూజాపాత్రులగుదురు.

గాయత్రీ మహామంత్రము నిరువదినాలుగు లక్షలు జపించిన బ్రాహ్మణుఁడు - సంపూర్ణ ఫలభోగప్రదుడై పూజనీయుండగువాడు. పతనమునుండి రక్షించును గావున పాత్రమనంబడును. దాతను పాతకమునుండి తప్పించువాగుటఁజేశియు పాత్రమగును. పాతకమునుండి గాయకుని కాపాడును గావున గాయత్రి యనఁబడును.

లోకమున ధనములేనివాడు ఇతరునకు ధనము నొసగఁజాలడు. డబ్బుగలవాడే పరునకు సహకరింపఁజాలును. అటులే స్వయముగా పరిశుద్ధుడైనవాడు ఇతరులను పవిత్రులఁజేయగలడు. గాయత్రీజపముచే శుద్ధిఁబడసినవాడే శుద్ధబ్రాహ్మణుడనంబడును. అందువలన దానమునందు, జపమునందు, హోమమునందు, పూజనమునందును, సర్వపుణ్యకర్మలయందును సద్బ్రాహ్మణుడే అధికారము కలిగియుండును. ఇట్టి బ్రాహ్మణునకే దానము నొసగవలెను. ఇట్టివాడే దాతను రక్షించును. ఆకలిఁగొనిన పురుషుఁడుగాని స్త్రీగాని భోజన ప్రదానమునకు పాత్రులగుదురు.

శ్రేష్ఠుడైన బ్రాహ్మణు నాహ్వానించి అతనికి వలయు వాక్సహాయమును ఆర్థికసహాయమును గావించుట - స్వాభీష్టప్రదంబగును. యాచకునికి ఇష్టమైన వస్తువును సమర్పించుట నిండు ఫలితము నొసగును. యాచించిన పిమ్మట చేయఁబడు దానము - అర్ధఫలంబు నిచ్చును. తనకు పరిచర్యఁజేయువానికి గావించిన దానము - నాలుగవ భాగము మాత్రము ఫలము నొసగును.

బ్రాహ్మణపుంగవులారా? దీనుఁడై బ్రాహ్మణుఁడుగా నుండువానికి సమర్పింపఁబడిన ద్రవ్యము - భూర్లోకమున పదివత్సరములు సుఖభోగము నొసగును. వేదవిదుడైన బ్రాహ్మణునకు గావింప బడిన దానము - స్వర్గమున దశవర్షభోగమును కలుగఁజేయును. గాయత్రీ మంత్రమును జపించుబ్రాహ్మణునకు సమర్పింపబడినది పదివత్సరములు సుఖభోగము నొసగును. విష్ణుభక్తుడైన విప్రునకు చేయఁబడిన దానము వైకుంఠనివాసమును ప్రసాదించును. శివభక్తుడగు మహేశ్వరునకు నొసఁగబడిన ద్రవ్యము కైలాసభోగము నను(గహించును. ఆ యా పుణ్యలోకములయందు సుఖించుటకై దైవభక్తిగల బ్రాహ్మణులందరికి దానము నాచరింపవలెను.

బ్రాహ్మణునకు పది యంగములు గల అన్నదానమును ఆదివారము నొనర్చినచో పరజన్మమునందు పదివత్సరములు ఆరోగ్యము గలిగియుండును. ఆదరించుటయు, పిలచుటయు, స్నాన సౌకర్యముఁ జేయుటయు, పాదసేవనంబును, వస్త్రములను సమర్పించుటయు, శ్రీ గంధము మొదలగు వాని నలఁదుటయు, మంచినెయ్యి అప్పడాలు షడ్రసంబైన భోజనము నొసగుటయు, తాంబూలదక్షిణల నిచ్చుటయు, ఎదురుగా వెళ్ళుటయు, కొంత దవ్వు అనుసరించుటయు, అనునవి అన్నదానముఁదగు పది యంగములు. విద్యలఁగోరు వారు బ్రహ్మబుద్ధితో బాలురకు భోజనము నొసగవలెను. పుత్రసంతానము నుపేక్షించువారు విష్ణుభావనతో యువకులకు అన్నదానముఁజేయవలెను. శివజ్ఞానార్థులు – శివభావనఁజేశి ముదుసలి వారికి అహారము నిడవలెను. బుద్ధిబలము నపేక్షించు వారు సరస్వతీభావనతో బాలికలకు, భోగములఁ గోరువారు లక్ష్మీబుద్ధితో తరుణులకు, ఆత్మశక్తి నభిలషించువారు పార్వతీభావనతో వృద్ధురాండ్రకు అన్నదానం బొనర్పవలెను.

శిలోంఛవృత్తితోడను విద్యార్థులు సమర్పించు గురుదక్షిణలతోడను సంపాదించు ద్రవ్యము శుద్ధమనఁబడును. ఇద్దియే దాన సంపూర్ణఫలము నొసగునది. మంచి ప్రతిగ్రహము వలన సంపాదింపబడినది – మధ్యమంబగును. వ్యవసాయము వలనను వ్యవహారము వలనను సంపాదించు ధనము – అధమము; ఐతే – క్షత్రియులకు శౌర్యమువలన సంపాదింపబడినది శ్రేష్ఠము. వైశ్యులకు వర్తకమువలన లభించినది ఉత్తమంబు; శూద్రులకు పరిశ్రమచే పొందఁబడునది విహితంబగును. ధర్మబద్ధలైన స్త్రీలకు తలల్లిదండ్రులవలనను భర్తలవలనను లభించిన ద్రవ్యము విహితంబగును.

గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యము, నెయ్యి, నూతనవస్త్రములు, ధాన్యము, గుడము, వెండి, లవణము, కూష్మాండము అను వానిని సమర్పించుటయు, కన్యాదానంబును ముఖ్యములు.

ఆవును తీసికొనిన వానికి గోమయము ఉపయోగించును కావున ధనధాన్యముల నాశ్రయించి యుండు దోషములు; గోమూత్రముపయోగించును కావున జలతైలాది గత దోషములును గోప్రదాతకు శమించును. అవు పాలు పెరుగు నెయ్యి అనువాని వలన కాయిక వాచిక మానసిక దురితములు నశించుటయే గాక క్షీరదధ్యాదికము సమృద్ధంబగును.

ఇహపరలోకములయందు ప్రతిష్ఠకై భూదానము ఉపయోగించును. తిలదానము శరీరపుష్టి నిచ్చుటయే గాక అపమృత్యువులను హరించును. జఠరాగ్ని – ప్రదీప్తముగా (అనఁగా జీర్ణశక్తి) పెంపొందుటకు సువర్ణదానము సాధకంబగును. ఘృతదానము శరీరపుష్టిని, వస్త్రదానము దీర్ఘాయుష్యమును, ధాన్యదానము అన్నసమృద్ధిని, గుడదానము మధురాహారమును, రజత (వెండి) దానము రేతోఽభివృద్ధిని, లవణదానము ఆరురసములు గల భోజనమును, కూష్మాండదానము సర్వారిష్టశాంతిని ప్రసాదించును. కన్యాదానమైనతేనో జీవన మున్నంతవరకు భోగముల నొసగును. ఆ యా ఋతువుల యందు ఫలించుఫలములను మినుములు పెసలు మొదలగు ధాన్యములను కూరగాయలను అవాలు మిరియాలు మున్నగు శాకోపకరణములను దానముఁజేయుట శ్రేయస్కరము.

శ్రోత్రాది ఇంద్రియములను శబ్దాది భోగములతో తృప్తిఁబఱచుటయు మానవులకు అవశ్య కర్తవ్యము.





గురుముఖమున వేదశాస్త్రముల నభ్యసించి చేయఁబడు యజ్ఞదానాది పుణ్యకర్మలకు ఫలము ఇహపరలోకములయందు తప్పక ఫలించునని భావించుట – ఆస్తిక్యమనఁబడును. బంధుభయమువలనఁ గాని రాజభయమువలనఁగాని కలుగు ఆస్తిక్యము – కనిష్ఠమగును. అకించనుడైన దరిద్రుఁడు స్తోత్రములతోడను శరీరపరిశ్రమ వలనను శివునారాధింపవలెను.

ఏదోనొక రీతిగా కొద్దిగాని మిక్కిలిగాని శివార్పణబుద్ధి నాచరించు సుకృతము సుఖప్రదంబగును. తపస్సుదానము అనునవి ముఖ్యాతిముఖ్యములు. స్వవర్ణాశ్రమాచార ప్రయుక్తముగా అతిథులకు అభ్యాగతులకును ఆశ్రయమిచ్చుట గృహస్థుని ధర్మంబగును. ఇట్లు గావించినచో దేవతలందరును సంతసింతురు. మఱియు భోగంబులన్నియు సమకూరును. ఈ లోకమునందు పరలోకమునందును ఉత్తమజన్మముచేకూరును. మోక్షఫలంబు సంప్రాప్తమగును.

ఈ యధ్యాయమును పట్టుదలతో చదివినను వినినను ధర్మబుద్ధి ధృడపడుటయే గాక శివోపాసనదార్ఢ్యము సంభవించును.

**ఇయ్యది - "శివవిజ్ఞానసర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో పంచ దశాధ్యాయము.**

## షోడశాధ్యాయము

### (పార్థివపూజావిధానము, తత్ఫలంబు)

సర్వాభీష్టముల ననుగ్రహించు పార్థివ లింగపూజనముఁగురించి చెప్పుడని ఋషులు ప్రశ్నించగా సూతుఁడు ప్రవచించెను.

మీరడిగినది – సర్వార్థముల నిచ్చుటయే గాక సద్యస్కాలము దుఃఖము నుపశమింపఁజేయును. అపమృత్యువును హరించును. కాలమృత్యువును గూడ భయపెట్టును. కళత్రపుత్రాదులను ధనధాన్యములను తత్కాలముననే ప్రసాదించు పార్థివ పూజనము అన్నవస్త్రాదులఁగూడ కలుగఁజేయును. ఇందు పురుషులకు స్త్రీలకు నధికారము గలదు. నదినుండి గాని తటాకము నుండిగాని కూపమునుండిగాని నీటిలోని మట్టిఁగ్రైకొని అందు శ్రీ గంధచూర్ణమును పాలు కలిపి హస్తముతో ప్రతిమను అంగప్రత్యంగములతో ఆయుధములతోడను పద్మాసనమందు కూర్చున్నట్లు నిర్మింపవలెను. విఘ్నేశ్వరుని యొక్కయు సూర్యుని యొక్కయు విష్ణువు యొక్కయు అమ్మవారి యొక్కయు పార్థివ విగ్రహములను పార్థివ శివలింగమును షోడశోపచారములతో పూజింపవలెను.

**శ్లో॥ పుష్పేణ ప్రోక్షణం కుర్యా - దభిషేకం సమంత్రకం ॥**

పార్థివ మూర్తులకు పార్థివ శివలింగమునకు నభిషేకమును మంత్రముల నుచ్చరించుచు పుష్పప్రోక్షణముగా చేయవలెను. వరి అన్నమును నైవేద్యముగా సమర్పింపవలెను. గృహమున మానెడు, మనుష్యప్రతిష్ఠిత లింగమునకు మూడుమానికలు, దేవతాప్రతిష్ఠితములకు తొమ్మిది మానికలు, స్వయంభూలింగమునకు పదియైదు మానికలు, వరిఅన్నమును నివేదించుట సమంజసంబగును.





శ్లో॥ అభిషేకా దాత్మశుద్ధిః - గంధా త్పుణ్య మవాప్యతే ।
ఆయుస్తుష్టిశ్చ నైవేద్యా - ద్ధూ పా దర్థ మవాప్యతే ॥
దీపాత్ జ్ఞాన మవాప్నోతి - తాంబూలా ద్భోగ మాప్నుయాత్ ।
తస్మాత్స్నానాదికం షట్కం - ప్రయత్నేన ప్రసాధయేత్ ॥
నమస్కారో జపశ్చైవ - సర్వాభీష్టప్రదా వుభౌ ।
పూజాంతే చ సదా కార్యౌ - భోగమోక్షార్థిభి ర్నరైః ॥

శంకరునకు నభిషేకముఁజేయుటవలన మనఃశుద్ధియగును. గంధమును సమర్పించుటచే సుకృతము పెంపొందును. నైవేద్యము నిడుటచే దీర్ఘాయుష్యము చేకూరును. మనస్సు సమాధానపడును. ధూపము నాఘ్రూపించుటఁజేశి ధనము సమృద్ధంబగును. దీపమును ప్రదర్శించుటచే బుద్ధిబలము సమకూరును. తాంబూలము నొసగుటచే సుఖభోగము ఉపస్థితంబగును. కావున అభిషేకము మున్నగు ఆరు ఉపచారములను ప్రయత్నించియైనను సమర్పింపవలెను. భోగమోక్షముల నభిలషించు మానవులు శివపూజాంతమునందు సర్వాభీష్టప్రదములగు నమస్కార జపములను నిత్యము ఆచరింపవలసియుండును.

శ్రావణ భాద్రపద మాసములయందు శుక్రవారంబునను చతుర్థియందును శతభిషక్ నక్షత్రమునను ధనుర్మాసమునందును మొత్తము నూరుదినములుగాని సహస్రఘస్రంబులుగాని విఘ్నేశ్వరుని పూజించుట వలన ఈ లోకముననే కోరికలన్నియు ఫలించును. దేవతలయందు అగ్నియందును శ్రద్ధాభక్తులు కలిగియుండువారికి సత్పుత్రుఁడు లభించుటయేగాక నభీష్టంబులును సిద్ధించును. పాపములన్నియు శమించును. సర్వకర్మలకును ఉదయమునుండి ఉదయము వరకు వారము నంగీకరింపవలెను.

ఇద్దానితో స్వాభీష్టఫలము ప్రాప్తించును కావున పూజ యనఁబడును. నిత్యనైమిత్తిక కర్మలు కొంతకాలమునకు ఫలప్రదములగును. కామ్యకర్మను యథావిధిగా నాచరించునెడ తత్కాలముననే ఫలము సంప్రాప్తమగును. కృష్ణచతుర్థినాడు ప్రతిమాసము గణపతిని పూజించుట వలన దురితములన్నియు దూరమగును.

ప్రతిద్వాదశిని విష్ణుమూర్తి నారాధించుట–సంపత్కరమగును. కర్కాటక మాసమున సోమవారము నను, నవమినాడును, మృగశీర్ష నక్షత్రమునందును, అమ్మవారిని పూజించు నెడ ఐశ్వర్యము భోగము లన్నియు సమకూరును. దేవీపూజనమునకు ఆశ్వయుజశుక్ల నవమి ముఖ్యమైనది. ఆదిత్యవారమునను శుక్లకృష్ణ చతుర్దశులయందును ఆర్ద్రానక్షత్రమునందును శివుని పూజించుట–అత్యంత శ్రేయస్కరము. మాఘకృష్ణచతుర్దశి–మహాశివరాత్రినాడు శివారాధనముఁ గావించుటవలన అపమృత్యువులు తొలగుటయే గాక ఆయుష్యము పెంపొందును. మఱియు ఆరోగ్యాది సర్వాభీష్టంబులును సిద్ధించును. జ్యేష్ఠమాసమున మార్గశీర్షమాసమునను షోడశోపచారములతో శివునిఁబూజించునెడ భోగమోక్షములు సమకూరును. కార్తిక మాసమున దేవతారాధనము దానము తపస్సు హోమము జపము నక్త భోజనాది నియమంబును ముఖ్యములగును. మరియు బ్రాహ్మణులకు భోజనము నొసగుటయు శ్రేయస్కరము; కార్తికమున శివారాధనముఁజేయుటవలన వ్యాధులన్నియు హరించును. భూతప్రేతపిశాచాది బాధలును శమించును. కార్తిక రవివారములయందు సూర్యునిఁబూజించుటవల్లనను నూనెఁదడిపిన వత్తులను దానముఁజేయుట





వలనను కుష్ఠాదిరోగములు తొలగును. కరక్కాయ మిరియాలు నూతన వస్త్రములు పాలు మున్నగువానిని దానముఁజేయుటవలనను ఒకానొక బ్రాహ్మణ కుమారునకు ధర్మార్థము ఉపనయనమును గావించుట వలనను క్షయరోగము నశించును. దీపదానమువలనను ఆవాలనొసఁగుటవలనను అపస్మారము క్షీణించును. కృత్తికానక్షత్రముతో కూడిన సోమవారములయందు శివునిఁబూజించుట-గొప్పదారిద్ర్యమును పోగొట్టుటయేగాక సర్వవిధమైన సంపదను స్థిరపఱచును. ఇల్లు పొలము ఇంటికివలయు వస్తువులు మొదలగువానిని దానముఁజేయుట వలన సుప్రతిష్ఠితుఁడగును. కృత్తికాసహితమంగళవారములలో కుమారస్వామి నారాధించుట చేతను-దీపమును గంటను దానము నొనర్చుటవలనను త్వరలో వాక్సిద్ధి కలుగును. కృత్తికా బుధవారములయందు నారాయణుని సేవించుటయు దధ్యోదన (పెరుగు అన్నము) దానంబును సత్సంతానమును కలుగఁజేయును. కృత్తికా గురువారములలో బ్రహ్మదేవునిఁబూజించుట చేతను తేనె బంగారము నెయ్యి దానము చేయుటవలనను సుఖసౌభాగ్యభోగములు పెంపొందును. కృత్తికాశుక్రవారములయందు గణపతిని పూజించినను సుగంధ పుష్పముల నొసగినను అన్నదానమువలనను మేలి వస్తువులు సమకూరుటయేగాక సంతతిలేని స్త్రీ పుత్రవతియగును. ఐతే ఆమె బంగారము వెండి దానముఁజేయవలసియుండును. కృత్తికా శనివారములయందు దిక్పాలకులను దిగ్గజములను నాగదేవతలను పాపహరులగు శివ కేశవులను బ్రహ్మదేవుని ధన్వంతరిని అశ్వినీ దేవతలను పూజించుటచే రోగములు అపమృత్యువు తొలగుటయేగాక తత్కాలముననే ఆరోగ్యము సమకూరును.

ఉప్పు, మంచినూనె మినుములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, నీరు, ఇనుము మొదలగువానిని ద్రవపదార్థములను కఠిన వస్తువుల నొసగుటవలన స్వర్గప్రాప్తి యగునుఁ. ధనుర్మాసమున తెల్లవారు ఝామున శివుని విష్ణ్వాది దేవతలను పూజించుటవలనను వరి అన్నము దానముఁజేయుటవలనను అభీష్టములన్నియు సిద్ధించును. మార్గశీర్షమాసమున అన్నదనానము గావించువారు-పాపక్షయమును ఆరోగ్యమును ధర్మవృద్ధిని వేదార్థమును బాగుగా గుర్తెరుగుటను సదనుష్ఠానమును ఇహపరమహాభోగములను శాశ్వతముగా శివోపాసనాదార్ఢ్యమును వేదాంతజ్ఞానసిద్ధిని పొందుదురు.

ఇఁక శివపంచాక్షరీ మహామంత్రమును నిత్యము-నియమిత కాలములయందు జపించుటచే విశుద్ధజ్ఞానము కలవాడగును. మహానైవేద్యమును శివునకే సమర్పింపవలెను. మహా నైవేద్యము- జన్మ నైవేద్యమనఁబడును. జన్మనిరూపకుఁడగు శివునకు జన్మనైవేద్యమును సమర్పించుటచే జన్మనివృత్తియగును.

చరాచరమంతయు బిందునాదాత్మకమై యున్నది.

శ్లో॥ బిందుః శక్తిః శివో నాదః - శివశక్త్యాత్మకం జగత్ ॥

బిందువు శక్తియు నాదము శివుఁడు నగుటచే ప్రపంచము శివశక్త్యాత్మకం బనఁబఱగును. బిందువు నాదము నాధారముగా జేసికొనియున్నది. జగము బిందువు నవలంబించియున్నది. బిందునాదములు రెండును జగమున కాధారములు. సమస్తము బిందునాదయుతంబగునేని సకలీకరణమగును. సకలీకరణముచే జగమంతయు ఆవిర్భవించును.





శ్లో॥ బిందునాదాత్మకం లింగం - జగత్కారణ ముచ్యతే ॥

శివలింగము - బిందునాదాత్మకమై జగమునకు కారణముగా చెప్పబడుచున్నయది. ఐతే బిందునాదములు శక్తిశివులుగావున లింగము శివశక్త్యాత్మకమగుచున్నయది. అందువలన అనఁగా బిందునాదముల వలననే జన్మపరంపర ఏర్పడునుగావున జన్మనివృత్తికై శివలింగమును నిత్యము భక్తిశ్రద్ధలతో నభిషేకాది విధానమున పూజింపవలెను. బిందు స్వరూపిణియైన దేవి తల్లియనియు, నాదస్వరూపుడైన శివుఁడు తండ్రియనియు భావించి మాతాపితృ స్వరూపంబగు శివలింగము నారాధింపవలెను. లోకమున తల్లిదండ్రులనువచరించు కొమరునిపై యవ్వారి కృపావిశేషముండునట్లు శివలింగమును పూజించుటఁ జేశి పరమేశ్వరుఁడు పూజకునకు స్వగతమైన ఐశ్వర్యమును ప్రసాదించును కావున శివానందము లభించుటకు అజన్మాంతము నిత్యము శివలింగమును పూజింపవలెను.

పుట్టుచు సంసారపాశములతో బంధింపఁబడు ఆత్మ -జీవుఁడనంబడును. ఇట్టి పాశములను తొలగించుకొని జన్మరాహిత్యము నొందుటకు శివలింగము నారాధింపవలెను. భం = అనఁగా అభివృద్ధిని గః = అనఁగా పొందును గావున భగమనంబడును. ఇద్దియే ప్రకృతియగును. ఇట్టి భగశబ్దితమగు ప్రకృతి తన యధీనురాలుగా కలవాడు భగవంతుడనఁబడును. మహాదేవుఁడొక్కడే భగవానుఁడనఁ బఱగును. కావున మహాదేవుని పూర్ణస్వరూపమగు శివలింగమును తప్పక పూజింపవలెను.

భగవానుడగువాడే భోగముల నొసగువాడు. శివోపాసకుఁడైన పురుషుని శివుని పొందించును గావున లింగమనఁబడును. ఇవ్విధము ఆదివారమునాడు శివారాధనము ప్రశంసింపఁబడినది. గోమయము, గోమూత్రము, ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి అను పంచగవ్యములను ప్రాయశ్చిత్తముగా పుచ్చుకొని పాలు, పెరుగు, తేనె, నెయ్యి, పంచదార, అను పంచామృతములతో ఇక్షురసముతోడను శివు నభిషేకింపవలెను. ఆవుపాలతో చేయఁబడిన పరమాన్నమును నైవేద్యముగా సమర్పింపవలెను. ఐతే ఇదియంతయు ప్రణవముతోనే నెరవేరవలసియుండును.

ప్రణవమునకు శివలింగమునకును సామ్యము కలదనియు అందు ఆరు విభాగములు కలవనియు తెలియనగును. అకారము ఆచారలింగమనియు, చరలింగమనియు, ఉకారము గురులింగమనియు, మకారము శివలింగమనియు, బిందువు చరలింగమనియు, నాదము ప్రసాదలింగమనియు, ప్రణవము మహాలింగమనియు వివేకము.

ఇంతియేగాక అకారము గురులింగమనియు, ఉకారము చరలింగమనియు, మకారము ప్రతిష్ఠితయంత్రలింగమనియు, బిందులింగమనియు నాదలింగమనియు, మొత్తము ప్రణవము ధ్వనిలింగమనియు గ్రహింపవచ్చును.

ఇఁట శివాగమముల ననుసరించి ఆచారాది షడ్లింగములను గుర్తించుటయే విహితంబగును.

కావుననే

శ్లో॥ షడ్ లింగ పూజయా నిత్యం - జీవన్ముక్తో న సంశయః ॥

శాంభవదీక్షితుఁడై ప్రతిదినము షడ్లింగములను అనఁగా తదాత్మకమగు శివలింగమును వామకరతలమున ప్రణవపంచాక్షరితో నిత్యము పూజించు మానవుఁడు జీవన్ముక్తుఁడగుననియు తదితరులు – ప్రతిష్ఠిత శివలింగమును షడ్లింగాత్మకముగా భావించుచు ప్రతిదినమారాధించి శివప్రియులు కాదగుననియు శివమహాపురాణము నొక్కి వక్కాణించినది.

మహానైవేద్యమనఁగా? తేనె, నెయ్యి, పంద్రెండు మానికల బియ్యం పంద్రెండు దొన్నెల పెసరపప్పు ద్వాదశ విధములైన కూరగాయలు, ఘృతపక్వములగు పిండివంటలు, కుడుములు, పెరుగు, పాలు పంద్రెండు టెంకాయలు, పదిరెండు పూగీఫలములు, ముప్పదియారు తమల పాకులు, పచ్చకర్పూరము యొక్కయు నఖమను గంధద్రవ్యము యొక్కయు చూర్ణము. చెంగలువ మొదలగు ఐదు సుగంధద్రవ్యములు, తాంబూలంబు ననువాని సమర్పణము అని తెలియవలెను. ఇట్టి మహానైవేద్యమును శివునకు సమర్పించి బ్రాహ్మణాది వర్ణక్రమముగా భక్తులకు పంచిపెట్టవలెను. ఇట్లు మహానైవేద్యము నిడుటఁజేసి భూలోకమున రాష్ట్రపతిగా జన్మించును. వేయి మహానైవేద్యములను సమర్పించువారు సత్యలోకమున పూర్ణాయుష్యము గలవారై సుఖింతురు. ముప్పదివేల పర్యాయములు మహానైవేద్యమును సమర్పించుట వలన సత్యలోకాతీతంబగు వైకుంఠము నంది జన్మరాహిత్యము గలవాడగును. ముప్పదియారు వేల తడవలు సమర్పింపఁబడు మహానైవేద్యమునే జన్మనైవేద్యమని వ్యవహరింతురు. కార్తిక మాసమున పుణ్యదినమునందు సంక్రాంతియందును వ్యతీపాతయందును జన్మనక్షత్రనంనదును పౌర్ణమాస్యాదులయందును ప్రతి వార్షిక జన్మదినమునందును మహానైవేద్యమును సమర్పింపవలెను.

రుద్రాక్షలను ధరించుట, విభూతిఁదాల్చుటయు, శివపంచాక్షరీ మంత్రమును జపించుటయు శివలింగమును పూజించుటయు అను నాలుగుభాగములతో సంపూర్ణ శివభక్తుండగును. శివభక్తియు శివపూజయు మానవుల జన్మబంధమును తొలగించును.

**శ్లో॥ శివలింగంచ భక్తంచ – పూజ్య మోక్షం లభేన్నరః ॥**

ఉత్తమ మానవుఁడు శివలింగమును పూజించుటయే గాక శివభక్తునిఁగూడ సేవించినచో మోక్షము నొందును. అనఁగా పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యము గలవాడగునని భావము.

ఇయ్యధ్యాయమును శ్రద్ధతో చదివినవానికి విన్నవానికిని శివభక్తి – సుదృఢమై దినదిన ప్రవర్ధమానంబగును.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ"మను తాంతలీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో షోడశాధ్యాయము**





## సప్తదశాధ్యాయము

### (ప్రణవపంచాక్షరీ మహిమ)

షడ్లింగాత్మకమగు ప్రణవము యొక్కయు పంచాక్షరి యొక్కయు శివభక్తుల యొక్కయు మహిమను వివరింపుడని శౌనకాది మహర్షులు ప్రశ్నింపగా సూతమహర్షి వక్కాణించుచుండెను.

తపోధనులైన మీ ప్రశ్నకు సంపూర్ణసమాధానమును మహాదేవుఁడొక్కండే ఈయఁజాలును. ఐనను శివానుగ్రహమువలన నా తెలిసినంతవరకు ప్రణవాది మహిమను చెప్పుచున్నాను. శివుఁడు మనను రక్షించుగాక!

ప్ర - నవ - ప్రణవము; ప్ర అనఁగా ప్రకృతివలన జనించిన సంసారము, అయ్యది సముద్రము వంటిది; ఇట్టి సంసారసముద్రము దాటుటకు నావలలో శ్రేష్ఠమైనదియు నూతన మైనదియు నగు నౌక - ప్రణవమగును. ప్ర = న = వ = ప్రాకృతప్రపంచము మీకు ఎన్నటికిని శాశ్వతము గాదనియు ప్రణవ శబ్దార్థముగా గ్రహింపనగును. సాధకులైన మిమ్ము అవశ్యము మోక్షముఁ జెందించుననియు, తన్నుజపించు యోగులకు పూజించువారికిని కర్మలన్నిటిని తొలగించి శుద్ధమైన దివ్యజ్ఞానము నావిర్భవింపఁజేయుననియు ప్రణవ శబ్దార్థములు.

ప్రణవము-సూక్ష్మమనియు స్థూలమనియు రెండువిధములు. సూక్ష్మము ఒకే అక్షరము గలది; స్థూలము ఐదక్షరములు గలది; సూక్ష్మప్రణవమున ఐదక్షరములు అవ్యక్తములుగా నుండును. స్థూలప్రణవమున నక్షరపంచకము వ్యక్తమగుచుండును. జీవన్ముక్తునకు సర్వశ్రేష్టమైన సూక్ష్మప్రణవమే విహితంబు; మంత్రము నుచ్చరించుచు మంత్రార్థము ననుసంధింప వలసియుండును. ఇట్లుదేహాంతమగు వరకు జపించినచో శివుని పొందును. ఇద్ది నిశ్చయము. కేవలము అనఁగా అర్థానుసంధానము లేకుండా ప్రణవమును జపించినను కాలాంతరమున యోగముగలవాడగును. ముప్పదియారు కోట్లు ప్రణవమును జపించినచో ఈ జన్మయందే శివయోగము సిద్ధించును.

ప్రణవమును - వేదప్రారంభమున శివకేశవాది వందనమునను సంధ్యాకాలములయందు వ్యాహృతుల ప్రారంభమునను మంత్రాదియందునుచ్చరించుట కడుంగడు శ్రేయస్కరము.

గృహస్థులై శమదమాదిసంపత్తి గలిగి శివునుపాసించువారికిని స్థూలప్రణవము శివపంచాక్షరీ మహామంత్రము విహితంబగుచున్నయది. శివపంచాక్షరీ మంత్రముచే శివునుపాసించుటయే శివయోగమనంబడును. ఇట్టి శివయోగముగల మహానుభావులు-ముప్విధములుందురు.

క్రియాయోగి లక్షణము - ధనసమృద్ధి మున్నగు వైభవమును శివునకుపయోగించుచు హస్తాదినిర్వర్త్యములగు నమస్కారాది క్రియలు అనఁగా అభిషేకజలానయనము పుష్పాపచయము ప్రదక్షిణలు శివారాధనమునకుపయోగించు గంధాది ఉపకరణములను సేకరించుకొనుటయు అనువాని నాచరించుచు నిత్యము శివునిఁబూజించుటయగును. తపోయోగి లక్షణము - మితాహారము, బాహ్యేంద్రియములను

వశవరచుకొనుటయు, పరద్రోహము మున్నగు దుర్గుణములు లేకుండుటయు నియమిత సమయమున శివునారాధించుటయు నగును.

జపయోగి లక్షణము - పైన చెప్పిన లక్షణములేగాక చిత్తశుద్ధి కలిగియుండుటయు అన్నితెఱంగులైన కోర్కెలు విడననాడుటయు, ఎల్లకాలము శివమంత్రమును జపించుటయు శమదమాది సంపత్తియు నగును.

ఇట్టి శివయోగులు తటస్థించినపుడు అవ్వారిని షోడశోపచారములతో పూజించు వారు సాలోక్యము మొదలగు క్రమముగా శివసాయుజ్యము నొందుదురు. తపస్సుచేయువానికి జపము ముఖ్యంబై తపస్సులో ప్రమాదమున సంభవించు నపచారములను బోకార్చునదగును.

శ్లో॥ శివనామ నమఃపూర్వం - చతుర్థ్యాం పంచత త్వకం
స్థూలప్రణవరూపం హి - శివపంచాక్షరం ద్విజాః ॥
పంచాక్షరజపేనైవ - సర్వసిద్ధిం లభేన్నరః
ప్రణవే నాదిసంయుక్తం - సదా పంచాక్షరం జపేత్ ॥

నమఃపదము ముందుగా కలిగి చతుర్థ్యంతమైన శివశబ్దముతో కూడినది- స్థూల ప్రణవమనియు శివపంచాక్షరియనియు మహేశ్వరులు గుర్తించుచున్నవారు.

శాంభవదీక్షితుడు - ప్రణవముతో కూడిన పంచాక్షరిని జపించుటతోడనే ఇహపర కామ్యములం బడయుటయే గాక శివజ్ఞానము కలవాడగును.

వంశ పరంపరాగతుండగు సద్గురువు వలన నుపదేశమునొంది సుఖనివాసము గల మంచి ప్రదేశమునందు శుక్లపక్షమున యోగ్యతిథివార నక్షత్రముల యందు శివపంచాక్షరీ జపమును ప్రారంభించి కృష్ణచతుర్దశి వరకు ముగింపవలెను. మాఘమాసము భాద్రపద మాసంబు విహితకాలములలో నుత్తమంబులు. ఐతే మితమైన ఏకభుక్తముతో మౌనముఁదాల్చి ఇంద్రియములను నియమించియు తన శరీరమును కాపాడుకొనుచు తల్లిదండ్రులను సేవించుచు నిత్యము విహితసమయమున పంచాక్షరిని జపించవలెను. అథవా ప్రతిదినము వేయిసంఖ్య మాత్రము జపించువాడు శుద్ధుండగును. లేనిచో మంత్రమునకు గురువునకును ఋణపడియుండును.

శివస్మరణఁజేయుచు పంచాక్షరిని ఐదులక్షలు జపింపవలెను. జపించునపుడు పద్మాసనమునందు కూర్చుండువానిగాను, భక్తులకు శ్రేయస్సును నిఃశ్రేయస్సు నొసగు వానిగాను గంగను చంద్రకళను ధరించినవానిగాను, ఎడమతొడయందు కూర్చున్న దేవితోడను, ప్రమథగణములతోడను, ప్రకాశించువాని గాను, మృగమును టంకమును వరదముద్రను అభయముద్రను కరములఁదాల్చినవానిగాను, నిరంతరము భక్తుల ననుగ్రహించు వానిగాను సదాశివుని స్మరించి, జపమునకుముందు హృదయమునందుగాని సూర్యమండలమునందుగాని మానసికముగా పూజించి, తూర్పుదెస కభిముఖముగా సదాచారముతో (అనఁగా మడికట్టుకొని) శివపంచాక్షరీ విద్యను ప్రతిదినము పండ్రెండువేలు జపింపవలెను. జపస్థలము - మనోహరముగాను పరిశుభ్రముగా నుండవలెను. జాపకుఁడు - జితేంద్రియుఁడగుటయేగాక

నిర్మలమనస్కుఁడును కావలసియుండును. ఇట్లు కృష్ణచతుర్దశివరకు జపించి ఆనాడు ప్రాతఃకాలమున నిత్యకృత్యములను నెరవేర్చుకొని ఒకానొక గురువరేణ్యుని సాంబమూర్తిగాను శివభక్తిసంభరిత హృదయులైన బ్రాహ్మణోత్తములను సపత్నీకులను ఈశాన తత్పురుష అఘోర వామదేవ సద్యోజాతమూర్తులుగాను వరించి పూజాసంభారముల సేకరించుకొని శివపూజనమును యథావిధిగా నాచరించి ఆవునెయ్యితో పదునొకండు పర్యాయములుగాని నూట నొక్కమారు గాని వేయి నొక్కతడవుగాని స్వయముగా లేక మహేశ్వరులతో స్థండిలమునందుగాని కుండమునందుగాని హవనముఁజేయవలెను. తరువాత శివాత్మకుఁడగు గురువరేణ్యునకు రెండు ఆవులను లేక తత్ప్రత్యామ్నాయ ధనమును నూతన వస్త్రాలంకారములతో గూడ సమర్పించి ఐదుగురు బ్రాహ్మణవతసులకు యథోచితముగా దక్షిణల నొసగవలెను. ఈ సందర్భమున మహేశ్వర పాదోదకముతో తాను శిరఃస్నానమును గావించుటవలన ముప్పదియారు కోట్ల పుణ్యతీర్థముల యందు జలకమాడిన ఫలితమును పొందువాడగును. గురు దంపతులు శక్తి శివస్వరూపులనియు గురుపుత్రాదులు శివసన్నిహిత వీరభద్రకుమార గణేశాది తుల్యులనియు భావించి పరమాన్నముతో గూడ దశాంగమైన అన్నమును సమర్పించి రుద్రాక్షములను తాంబూలములనొసగవలెను. ఆ పిమ్మట బలిదాన మాచరించి యథాశక్తి బ్రాహ్మణాది ప్రజల కన్నదానముఁ గావించి శివునిఁ బ్రార్థించి శివచరణారవిందములయందు సుకృతజపమును నివేదింపవలెను.

ఇయ్యది పురశ్చరణము. ఇట్లు చేశినచో సాధకుఁడు మంత్రము కలవాడగును. ఇఁక రెండవతూరి ఐదులక్షలు జపించినచో సకలవిధదురితములు నశించును. ఇవ్విధము అతలలోకము మొదలుకొని సత్యలోకమువరకు గల పదునాలుగు లోకములను జయించుటకు పదునాలుగు పురశ్చరణముల నొనర్పవలసియుండును. పుశ్చరణములన్నియు పూర్తికాక మునుపు మరణించినయెడల పుణ్యలోకముల యందు సుఖము ననుభవించి భూలోకమున జన్మించి మంత్రమును జపించువాడగును. ఇఁకపదునేడవ పురశ్చరణమున చతుర్ముఖుని సమీపించును. పదునెనిమిదవ పురశ్చరణమున బ్రహ్మదేవునితో సమానమగు రూపముగలవాడగును. మొత్తము నూరులక్షలు అనఁగా నొక్కకోటి జపించినచో బ్రహ్మసమానుండగును.

ఇట్లు కార్యబ్రహ్మదేవునితో సాయుజ్యము నొంది ప్రళయము వరకు బ్రహ్మలోకమున నానావిధభోగముల ననుభవించును. మఱియు కల్పాంతరమునందు బ్రహ్మమానసపుత్రుడై జన్మించి తపోనిష్ఠగలవాడై క్రమముగా శివసాయుజ్యము నొందును. పాతాళము మొదలుకొని సత్యలోకమువరకు గల పదునాలుగు బ్రహ్మలోకములు పంచీకృతములగు పృథివ్యాదిభూతములచే నిర్మింపబడినవి. సత్యలోకము తరువాత క్షమాలోకమువరకు గల పదునాలుగు విష్ణులోకములనఁబడును. క్షమాలోకమునందు వైకుంఠప్రదేశమున కార్యవిష్ణువు - కార్యలక్ష్మి దేవితో శేషశయ్యాగతుండై నివసించుచుండును. ఆపైన శుచిలోకమువరకు ఇరువది యెనిమిది లోకములు రుద్రదేవునివి; శుచిలోకమునందు కైలాస మణిమంటపమున సర్వభూత హృదయ నివాసియగు శంకరుఁడు విరాజిల్లుచుండును. అటుపిమ్మట నహింసాలోకమువరకు ఏబదియారు లోకములు మహేశ్వరునివి. అహింసాలోకమున జ్ఞానకైలాసమను పట్టణమునందు మహేశ్వరుఁడు - ప్రళయగత జీవులనందరిని తన చెంత కాపాడుచుండును. అనఁగా తిరోధానముఁ జేయుచుండునని భావము. తదనంతరము కాలచక్రంబును కాలాతీతుఁడు నుందురు. అచ్చట కాలచక్రేశ్వరుఁడు శివాధిష్ఠితుడై యుండును. ఈతఁడు మహిషరూపముఁదాల్చి ప్రాణులను





కాలముతో ననుసంధింపఁజేయును. అసత్యము, అశుచి, హింస, నిర్దయ ననునవి నాలుగు పాదము గాను నాస్తిక్యము ఐశ్వర్యముగాను దుష్టసహవాసముగలదిగాను వేదబాహ్యధ్వనిగలదిగాను క్రోధమ చెలికాడుగాను నలుపువన్నెగలదిగాను మహిషము నివసించుచుండును. ఇంతవరకు మహేశ్వరు అధికారము అని తెలియవలెను. తత్సమీపముననే కర్మభోగలోకము. అద్దానిపై జ్ఞానభోగప్రదేశంబు అద్దాని చేరువను, కర్మమాయాలోకము, తదూర్ధ్వము జ్ఞానమాయాలోకంబును తదనంతర నిత్యభోగలోకంబును తత్సమీపముననే అనిత్యభోగలోకంబును నెలకొల్పఁబడినవి. ఇట్లు కొంత దు జనిన తరువాత నిష్కామశివపూజనము నాచరించువారిలోకము కనఁబడును. తత్సమీపమున శివే దేవతారాధకులు నివసించుచుందురు. శివునొకనినే సర్వాత్మకునిగాను సర్వాతీతునిగానుభావిం పూజించినవారు సకలాతీతపదమునందు విరాజిల్లు చుందురు. తత్సమీపమున జీవకోటియు అద్దాని శివకోటియు ఆపైన బిందుస్వరూపంబును నాదరూపంబును నెలకొనియుండును. ఇంతవర మహాలింగముఁదగు వేదిక యని గుర్తెరుఁగవలెను. ఇది యంతయు కాలచక్రముఁజెందియుండు సత్యము అహింస ధర్మము దయ మొదలగు సద్గుణములు కలిగి శివునారాధించువారు కాలచక్ర నతిక్రమింతురు. అద్దానిపై బ్రహ్మచర్యస్వరూపము గల ధర్మాత్మకమైన వృషభము సత్యము ము నాలుగు పాదములుగలదిగాను క్షమ - కొమ్ములుగాను శాంతి - చెవులుగాను వేదధ్వనిగలదిగా ఆస్తిక్యము నేత్రములుగాను గురుభక్తి - మనస్సుగాను విరాజిల్లుచు కాలాతీతునిచే నధిష్ఠింపఁబడి యుండు బ్రహ్మవిష్ణురుద్రులకు దివారాత్రి విభాగముగా ఆయుష్యముఁదగు అవధి గుర్తింపబడును. తదనంతర దివారాత్రి విభాగముగాని జన్మమరణాదులుగాని లేకున్నవి. అటుపిమ్మట కారణబ్రహ్మదేవుని పదునా లోకంబులును తదనంతరము కారణవిష్ణువుఁడగు లోకములు పదునాలుగును, అవ్వానిపై కారణరుద్ర ఇరువదియెనిమిది లోకంబులును మరియు కారణమహేశ్వరుని ఏబదియారు లోకంబులు విరాజిల్లుచుండును.

ఇవ్వాని నన్నిటి నతిక్రమించి చనునెడ శివలోకము గోచరంబగును. శివలోకమున ఐ నావరణములు కలిగిన జ్ఞానకైలాసమునందు పంచమండలములతో కూడినదియు పంచ బ్రహ్మకళల నిండియుండునదియు ఆదిశక్తి సమన్వితంబునగు ఆదిలింగము అలరారుచుండును.

ఇద్దియే పరమాత్మయగు శివునికి ఆలయంబగునది. పరమేశ్వరుఁడు పరాశక్తితో శివాలయమ ఆదిలింగమునందు నివసించుచు సృష్టి స్థితి లయ తిరోభావ అనుగ్రహములను పంచకృత్యముల నెరవేర్చుచు సచ్చిదానందవిగ్రహుఁడై ధ్యానధర్మము నవలంబించి సదా అనుగ్రహతత్పరుఁడై సమాధియం సుఖాసీనుఁడై స్వాత్మారాముడుగా నివసించుచుండును.

ఇట్టి మహాపురుషోత్తముని దర్శనమును నిష్కామకర్మయోగముతోడను ధ్యానయోగము తోడ క్రమముగా సాధింపవలెను. అట్టి క్రమంబెట్టిదఁగా? నిత్యనైమిత్తికాదికర్మల నీశ్వరార్పణబుద్ధి నాచరించుటఁజేసి శివప్రీతికరకర్మలయందు అనఁగా శివోపాసనమునందభిరుచిగలవాడగును. క్రియ రూపమైన శివోపాసనవలన అనఁగా పుష్పాదుల శివునిఁ బూజించుట వలనను శివారామస్థాపన శివ సంచారాదుల వలనను శివజ్ఞానము చేకూరును. శివ దర్శనముగల వారందరునుముక్తు లగుదురని సిద్ధాంతము. ఇందెంతమాత్రము సందియము లేదు.





ఇందుకు శ్రుతిప్రమాణము -

"యదాచర్మవదాకాశం - వేష్టయిష్యంతిమానుషాః,
తదా శివ మవిజ్ఞాయ - దుఃఖస్యాంతో భవిష్యతి"

శ్రుత్యర్థము - ఆకసమును తోలువలె చుట్టఁగలుగుదురేని శివుని గుర్తెరుగకుండా దుఃఖాంతమును అనఁగా మోక్షమును పొందగలుగుదురని భావము.

ముక్తియనఁగా? నిజరూపముతో తనలోతాను సంతృప్తుడైయుండుట యగును. ఐతే ఇట్టి నిజరూపమును ఏర్పడుటకు ముందు శివప్రాప్తి కావలసియుండును. కర్మయోగమునందు తపోయోగమునను జపయోగమునందును జ్ఞానయోగమునను ధ్యానయోగమునందును క్రమముగా సిద్ధుఁడగునెడల శివుని దర్శనముఁదగు భాగ్యము గలవాడై స్వాత్మారాముఁడగును. సూర్యభగవానుఁడు తన కిరణములఁదగు ప్రసారము వలన అపవిత్రత్వమును పారద్రోలునట్లు కృపాపరిపూర్ణుడైన శంకరుఁడు భక్తుల అజ్ఞానమునుపోనాడును. అజ్ఞానము పూర్తిగా తొలగిననాడు శివజ్ఞానము ప్రకాశించును.

శివజ్ఞానమున స్వస్వరూపావిర్భావము గలవాడై తనయందు తాను రమించుచు ఆనంద డోలికలయందు విహరించుచు కృతకృత్యుండగును.

ప్రసంగవశమున లోకములను వివరించి ప్రస్తుతంబగు పంచాక్షరిఁ గూర్చి సూతులవారు చెప్పుచున్నారు.

రెండవ కోటిసంఖ్య శివపంచాక్షరిఁ జపించినచో బ్రహ్మదేవుఁడగును. మూడవకోటిఁ జపించిన యెడల విష్ణుమూర్తియగును. నాలుగవ కోటిఁబంచాక్షరిఁ జపించినచో రుద్రుండగును. ఐదవకోటి సంఖ్యఁజపించునెడల మహేశ్వరుండగును. ఆరవకోటిజఁపించుట వలన శివలోకాది యగు కాల చక్రమును పొందును. బ్రహ్మ విష్ణురుద్రమహేశ్వర సదాశివ చక్రముల నొక్కొక్కకోటిఁదగు జపమున నతిక్రమించును ఇట్లు అవిచ్ఛిన్ననిష్ఠతో నూటయైదుకోట్లు శివపంచాక్షరీ మహామంత్రమును జపించునెడ - ఐదునావరణముల వెలుపలనుండు శివలోకమును పొందు వాడగును. శివలోకము చెంత ఒకానొక దివ్యనది ప్రవహించుటయు ఇద్దాని తీరమున శివలోక మహాద్వారమునందు నందికేశ్వరుఁడు నివసించుటయు గ్రహింపదగినవి. ఐదునావరణములు - సద్యోజాత వామదేవ అఘోర తత్పురుష ఈశానులను పంచబ్రహ్మలచే నధిష్ఠింపఁబడియుండును. తరువాత పంచమండపములుండును. ప్రథమమండపమున ధ్యాన ధర్ముండగు బలినాథుఁడును, ద్వితీయ మండపమున చంద్రశేఖరుఁడును, తృతీయ మండపమున సోమస్కందుడును చతుర్థ మంపమున పరమ శివుని నృత్య వినోదంబును, పంచమమండపమున ఆదిశక్తియు విరాజిల్లుచుండును. అటుపిమ్మట గర్భగృహము గోచరించును. ఇద్దియే లింగస్థాన మనఁబడును. గర్భగృహద్వారము నందు నందికేశ్వరుఁడు శివపంచాక్షరీ మహామంత్రమును జపించుచు శివదర్శనమును నిరంతరము చేయుచుండును. నందికేశ్వరుని యనంతరము శివవైభవము ఇట్టిదని ఎవరును చెప్పజాలరు. కనుగొనఁజాలరు. ఇట్లు గురుపరంపరచేతను నందికేశ్వరునిచేతను ప్రభోధింపఁబడిన శివపద విషయమును సంగ్రహముగా చెప్పనాడను. ఇఁక మీదట





శివుఁడే గుర్తెరుగుననియు సాధకులకు స్వసంవేద్యంబనియు శివానుగ్రహమువలననే శివలోకవైభవ తెలియుననియు అన్యథాకాజాలదనియు ఆస్తికశిఖామణులైన శైవులు వాక్రుచ్చుచున్నవారు. ఇవ్విధ శివనిష్ఠగలవారు జితేంద్రియులై క్రమముగా ముక్తులగుదురనియు భావము.

తదితరులైన సాధారణ మానవుల నుద్దేశించి జపవిధానమును తెలుపుచున్నాను, వినుండు సూతమహర్షి - చెప్పఁదొడగెను.

వంశపరంపరాగతుండైన సద్గురువు వలన నుపదేశముబొంది బ్రాహ్మణులు - నమస్కార ఆదిగాగల శివపంచాక్షరీ మహామంత్రము నైదులక్షలు జపింపవలెను. బ్రాహ్మణేతరులు నమోఽంతము జపించుట శ్రేయస్కరము. స్త్రీలు - తమ స్త్రీత్వము మరల రాకుండుటకై ఐదు లక్షలు జపించు పురుషులై జన్మించి క్రమముగా ముక్తులగుదురు. క్షత్రియుడు ఐదులక్షలు జపించునెడ క్షత్రియత్వము రాకుండ జేసికొనును. మరియు నైదులక్షలు జపించునెడ బ్రాహ్మణుఁడై జన్మించి క్రమముగా మంత్రసిద్ధి బడసి ముక్తుండగును. వైశ్యుఁడు వైశ్యత్వాపనోదనార్థము ఐదులక్షలు జపించవలెను. రెండవ ఐదులక్షలు జపించునెడ మంత్ర క్షత్రియుఁడై మూడవసారి ఐదులక్షలు జపించునెడ మంత్ర క్షత్రియత్వము పోగొట్టు కొనును. నాలుగవ పర్యాయము ఐదులక్షలు జపించునెడ మంత్రబ్రాహ్మణుడనబడగు శూద్రుండైతేనో ఇరువదియైదు లక్షలు నమోఽంతముగా పంచాక్షరిని జపించునెడ పరిశుద్ధుండగుట గాక రెండవ జన్మమున బ్రాహ్మణుడై జన్మించును. వేయేల? స్త్రీ గాని పురుషుడు గాని బ్రాహ్మణు గాని తదితరుఁడు గాని నమోఽంతముగా గాని నమః పూర్వకముగా గాని సంకట సమయమున సర్వ జపింపవచ్చును. స్త్రీలకు ఆచార్యుఁడు వారి యోగ్యత ననుసరించి నమః పూర్వకముగానైన నమోఽంతముగానైనను మంత్రము నుపదేశింపవలెను.

మంత్రసాధకుఁడు ఐదులక్షల జపఁముదగు పురశ్చరణముకాగానే శివప్రీత్యర్థము శంకరున రుద్రాభిషేకమునొనర్చి మహానైవేద్యమును సమర్పించి శివభక్తులకు భోజనము నిడవలసియుండును శివభక్తునిఁ బూజించుట వలన శివుఁడు మిగుల సంతసించును. శివునకు శివభక్తునకు నెట్టిభేద లేదు ఎట్లనఁగా? శివభక్తుడు - శివస్వరూపమైన పంచాక్షరీ మహామంత్రమును నిరంతర ధరించువాడగుటఁజేశి శివుఁడేయగును. శివభక్తుని శరీరము నందు శివుఁడాసక్తితో నివసించు అనఁగా ఇష్టప్రాణభావలింగరూపమున విలసిల్లుచుండునని భావము. శివభక్తులు ఆచరించు సత్కర్మలన్ని వైదికంబులనియే గ్రహింపవలెను.

శ్లో॥ యావద్యావచ్ఛివ మంత్రం - యేనజప్తం భవేత్ క్రమాత్ ।
తావద్వై శివసాన్నిధ్యం - తస్మిన్ దేహే న సంశయః ॥

శివపంచాక్షరీ మహామంత్రమును నెంతెంత జపించుచుండునో అంతంత నా శరీరము శివుఁడు సమీపించి నివసించుచుండును. ఇందెంతమాత్రము సంశయము లేదు. శివభక్తునిభార్య దేవీస్వరూపమని భావింపవలెను. ఎందుకనఁగా? ఆమెయు శబ్దాత్మనా దేవీరూపమగు శివమంత్రము జపించునదియే గదా!

అందువలననే తాను శబ్దస్వరూపుడై అనఁగా మంత్రమునుచ్చరించుచు అర్థస్వరూపుడగు శివు బూజింపవలసియుండును. తాను శివస్వరూపుడై అనఁగా మంత్రార్థమును భావించుచు అమ్మవా

నర్చింపవచ్చును. జగదంబను శివమూర్తిని శివలింగమును మాయా బీజముతో నారాధింపనగును. శివలింగములో శివశక్తులు రెండు ఇమిడి యున్నను పూజా సమయమున శివలింగమును శివునిగానే భావింపవలసియుండును. శివునిc బూజించునపుడు తనను శక్తిరూపముగను భావింపవచ్చును. దేవినర్చించుతతి తనను శివునిగా తలపోయ నగును. శివలింగము నాదస్వరూపంబనియు దేవీమూర్తి – బిందు స్వరూపంబనియు ఇందు శివలింగము ముఖ్యస్థానము నలంకరించుననియు వివేకము. శివభక్తులు శివస్వరూపులనియు శివమంత్ర స్వరూపులనియు భావించి యవ్వారిని షోడశోపచారములతో పూజించువారికి నభీష్టములు సిద్ధించును.

శ్లో॥ యేన శుశ్రూషణాద్యైశ్చ - శివభక్తస్య లింగినః ।
ఆనందం జనయే ద్విద్వాన్ - శివః ప్రీతతరో భవేత్ ॥

ఇష్టలింగధారియగు శివభక్తుని అనcగా ఆరాధ్యుని సేవించుచు అనేక సదుపచారములతో నాతనికి ఆనందమును కలిగించు శివోపాసకునియందు శంకరుcడు – అత్యంత ప్రసన్నుండగును.

సపత్నీకులగు శివభక్తులను తాను తన భార్యతో గూడ పూజించి యవ్వారికి ధనమునందును శరీరమునందును మంత్రమునందును భావనయందు నెట్టిలోపమును రానీయక భోజనతాంబూల ధనధాన్యవస్త్రగృహాదులను సమర్పించి శివభక్తదంపతులను పార్వతీ పరమేశ్వరులని భావించువారు జన్మరాహిత్యము నొందుదురు. ఐతే పూజింపcబడు శివభక్తులు – ఐదుగురైనను పదుగురైనను నూరుగురైననుండవలెను. శివభక్తుని శరీరమున పాదముల నుండి నాభివరకు బ్రహ్మభాగంబనియు కంఠమువరకు విష్ణుభాగంబనియు ముఖము శివలింగంబనియు గుర్తెరుగవలెను.

అగ్ని దాహము మొదలగు వాని వలన చనిపోయినవారిని గురించియు మృతులై అగ్ని సంస్కారము మున్నగునవి లేనివారిని గురించియు ఆదిపితయగు శివుని, ఆదిమాతయగు అమ్మవారిని శివభక్తులనున్ను పూజించునెడ చనిపోయినవారు పితృలోకముజెంది క్రమముగా ముక్తులగుదురు.

ఐతే శివభక్తులలో క్రియాయోగులు పదుగురి కన్న తపోయోగియొక్కండే శ్రేష్ఠుడగును. తపోయోగులు నూరుగురి కంటె నధికుcడు జపయోగియగును. జపయోగుల వేయిసంఖ్య నతిక్రమించువాడు శివజ్ఞానియేను; లక్షసంఖ్యాక శివజ్ఞానులకన్న శివధ్యానయోగి మిన్నయగును. శివధ్యానయోగులు కోటిసంఖ్యాకులైనను శివసమాధియోగికి సరిదూగc జాలరు. ఇవ్వారిలో ఇట్లు తరతమ భావముండుటc జేశి సాధకుcడు ఎట్టివారిని పూజించునో అట్టి ఫలమునే పొందునని తెలియవలెను.

అందువలన శివభక్తుని మహిమ ఇంతింతయని యేరికిని చెప్పనలవిగాదు. వేద సమ్మతము అర్థవంతమునగు నీయధ్యాయముcజదివిన బ్రాహ్మణోత్తముcడు తప్పక శివజ్ఞానము గలవాడై దేహాంతమున శివునితో గూడ నానందించును.

*ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో సప్తదశాధ్యాయము*





# అష్టాదశాధ్యాయము

## (బంధమోక్ష స్వరూపము, శివలింగ మాహాత్మ్యము)

ఋషులిట్లు ప్రశ్నించిరి.

సర్వార్థ విదుడవైన సూతమహర్షీ! బంధమన నెట్టిదో మోక్షమననేమిటో వివరింపుడు!

సూతుఁడు చెప్పదొడగెను.

ప్రకృతి, బుద్ధి, త్రిగుణాత్మకమైన అహంకారము, పృథివ్యాదిపంచభూతములందగు సూక్ష్మాంశములై తన్మాత్రలు నను ఎనిమిదిటితో నేర్పడునదియే బంధమనఁదగును. ఇట్టి బంధమున కట్టుబడిన జీవా – బద్ధుడనంబడును. బంధమువలన విడిబడినవాడు ముక్తుడనఁబఱగును. ప్రకృతిమున్నగు నెనిమిదిటి వశపఱచుకొనుటయే మోక్షమనఁబడును. శరీరము ప్రకృత్యాద్యష్టకమునుండి పుట్టునట్టిది. దేహమువల నిర్వర్తింపఁబడునది కర్మము; కర్మ వలన సంగము ఏర్పడును. ఇట్లు పునఃపునఃజన్మకర్మలు సంభవిం చుండును. స్థూలమనియు సూక్ష్మమనియు కారణమనియు శరీరము మూడువిధము; స్థూలశరీరము ప్రపంచకార్యములు నెరవేర్పఁబడును. సూక్ష్మశరీరము జ్ఞానకర్మేంద్రియభోగము నొసగునది. కార శరీరము ఆత్మానుభవమును కలుగఁజేయును. జీవులు తాము చేశిన సుకృత దుష్కృతముల ననుసరిం సుఖదుఃఖముల ననుభవించుచుందురు. కావున కర్మరజ్జువుచే కట్టఁబడిన జీవుఁడు స్థూల సూ కారణ శరీరత్రయకృతములగు కర్మలవశమున మాటిమాటికి సంసారమునందు చక్రమునందు వ తిరుగుచుండును. ప్రకృత్యాదులు మహాచక్రమనియు శివుఁడు ప్రకృత్యతీతుండనియు తెలుసుకొని చ భ్రమణముతొలగుటకు చక్రనిర్మాతయగు శివునిఁబూజింపవలెను.

బాలుఁడు జలముఁద్రాగి క్రక్కునట్లు శివుఁడు ప్రకృత్యాదులను విస్తరింపఁజేసి ప్రళయకాలము తనలో దాచుకొనును.

శ్లో॥ శివస్త థా ప్రకృత్యాది - వశీకృత్యాధితిష్ఠతి ।
సర్వం వశీకృతం యస్మాత్ - తస్మాచ్ఛివ ఇతి స్మృతః ॥
శివ ఏవహి సర్వజ్ఞః - పరిపూర్ణశ్చ నిస్పృహః ॥

ప్రకృతి మొదలగువానిని తన యధీనములుగా నధిష్ఠించి సమస్తంబును వశపఱచుకొనువాడ శివుఁడనఁబడును. శివుఁడే సర్వజ్ఞుఁడును పరిపూర్ణుఁడును ఎట్టియపేక్షలు లేని వాడున్ను.

మహేశ్వరుని మానస ఐశ్వర్యము – సర్వజ్ఞతయనియు, తృప్తి యనియు, అనాది బోధంబనియు స్వతంత్రతయనియు, నిత్యములోపింపని శక్తియనియు, అనంతశక్తియనియు ఆరువిధములుగ నుండును.

ఇట్టి అద్వితీయవైభవము గల శివుని యనుగ్రహము ప్రసరించుతఱి ప్రకృత్యాదుల స్వాధీనములగుచుండును. శివప్రసాదము లభించుటకు శివునే ఆరాధింపవలసియుండును. వస్తు నిస్పృహుఁడు పరిపూర్ణుఁడునగు శివునకు ఎట్టిపూజనములు సమర్పణములు నవసరము లేదు. కా శివు నుద్దేశించి చేయఁబడు పుణ్యము – శివప్రసాదము నావహించును. శరీరము తోడను వాక్కువలన





మనస్సుచేతను ధనమునను శివలింగమునందు మూర్తియందు శివ భక్తునియందును శివు నారాధింపవలెను. వస్తుతః శివుఁడు - ప్రకృత్యతీతుండైనను తనను పూజించు సాధకుని విషయమై తప్పక ప్రసన్నుండగును. కర్మమొదలగునవి శివప్రసాదము వలన వశవర్తులగును. ఇట్లు దేహాదులున్ను స్వాధీనములైనచో దేహాంతమున శివలోక నివాసము లభించును. ఇద్దియే సాలోక్యముక్తి యనఁబఱగును. పంచతన్మాత్రలు వశవర్తులగుచో శంకరుని సామీప్యము చేకూరును. శివుని మహాప్రసాదము లభించునెడ - బుద్ధి వశవర్తి యగుటయే గాక త్రిశూలాది ఆయుధములు మున్నగువానితోడను దుష్టసంహార శిష్టరక్షణాది క్రియల వలనను శివుని సారూప్యము సమకూరును. మఱల నొకపర్యాయము మహాప్రసాదము ప్రసరించినచో ప్రకృతి లొంగుటయే గాక సర్వజ్ఞత్వాది గుణములఁదగు శివుని ఐశ్వర్యము లభించుటయను శివసాయుజ్యముక్తి సంభవించును.

శివలింగమును ధరించి నిత్యము పూజించుటఁజేశి క్రమముగా ముక్తుండగను. అందు వలన ముఖ్యముగా శివప్రసాదము తనయందు ప్రసరించుటకై శివక్రియాదులతో శివు నారాధింపవలసియుండును.

శివునికోసము పుష్పఫలవృక్షములను నాటుటయు, శివారాధనకై పుష్పబిల్వములను గంధాక్షతా ద్యుపచారములను సేకరించుకొనుటయు, శివపూజాపాత్రములను శుభ్రపరచుకొనుటయు, శివాలయ సమ్మార్జనాదులున్ను శివక్రియలనఁదగును. శివప్రీత్యర్థము నక్తవ్రత ఏకభుక్తాదుల నొనర్చుట శివతపంబనఁ బడును. శివమంత్రమును విహితసమయములయందు జపించుట శివజప మనఁబఱగును. శివలీలా గర్భితచరిత్రల నాకర్ణించుటయు శివప్రతిపాదక గ్రంథములను వ్రాయుటయు చదువుటయు శివతత్త్వమును ప్రమాణైకార్థముగా నిర్ణయించుకొనుటయు శివజ్ఞాన మనఁబడును శివుని ఉమాసహాయుని గాను త్రిలోచనునిగాను నీలకంఠునిగాను ప్రశాంతునిగాను భూతయోనిగాను సమస్తసాక్షిగాను తమోఽతీతుని గాను చంద్రశేఖరత్వాది విశిష్టునిగాను తన హృదయకమలములో చింతించుట శివధ్యాన మనఁబడును. ఇవ్వానిని క్రమక్రమముగా అభ్యసించుచుండవలెను. మఱియు ప్రతిదినము రాత్రి నిద్రించువరకు జీవితములో మరణమువరకును శివచింతనముతో కాలముఁగడుపవలెను.

చరలింగములయందు రసలింగము శ్రేష్ఠంబై బ్రాహ్మణులకు సర్వాభీష్టప్రదంబగును. బాణలింగము క్షత్రియులకు మహాసామ్రాజ్యము నొసగును. సువర్ణలింగము వైశ్యులకు గొప్ప కలిమిఁగలుగఁజేయును. శిలాలింగము శూద్రులకు మిగుల పవిత్రత్వము నొనఁగూర్చును. స్ఫటికలింగము బాణలింగము నందరికిని కోర్కెల నొదవఁజేయునని తెలియవలెను. తమ తమ విహితలింగములు లభింపని పక్షమున నొరులకోసము చెప్పఁబడిన లింగములను తాము పూజింపవచ్చును.

ముత్తైదువలకు పార్థివలింగము, వితంతువులకు స్ఫటికలింగంబును శ్రేష్ఠములు. ఐతే స్త్రీలు ఎట్టివారైనను బాల్యయౌవన వార్ధకములయందు స్ఫటికలింగమును పూజించుట శ్రేయస్కరమగుచున్నయది. కేవలము సంసారలంపటుడగువాడు పీఠమునందు శివలింగము నభిషేకించి శాల్యన్నమును సమర్పించి పూజాంతమున సంపుటమునంధు దేవతామందిరములో నునుపవలెను.

శ్లో॥ కరపూజా నివృత్తానాం - స్వభోజ్యంతు నివేదయేత్ ।
నివృత్తానాం పరం సూక్ష్మం - లింగమేవ విశిష్యతే ॥





నిషిద్ధకామ్యకర్మలనుండి నివృత్తులగు శాంభవదీక్షితులు సూక్ష్మము గురుప్రదత్తంబునగు శివలింగమును వామహస్తకరతలముబూజించి తాము స్వీకరించు ఆహారమును తత్కాలముననే నివేదింపవలెను.

శ్లో॥ పూజాం కృత్వాతు తల్లింగం - శిరసా ధారయేత్సదా ॥ 57

శివపూజను ముగించి యట్టి శివలింగమును శిరస్సునందు గాని కంఠమునందు గాని భుజముపై గాని యెల్లకాలము ధరింపవలెను.

వరిధాన్యములు నువ్వులు వస్త్రములు పర్యుషితములు మున్నగునవి భస్మతో పరిశుద్ధములగును. వైదిక హోమాంతమున భస్మను ధరించునెడల సుకృతము స్వాత్మారోపితంబగును.

రాజు ప్రజలనుండి తనరాష్ట్రమున పంటలలోని సారమును కరముగా గ్రహించునట్లు జఠరాగ్ని - భక్ష్యాదులను జీర్ణింపఁజేసి తత్సారముతో స్వదేహమును బలపఱచునట్లును ప్రపంచనిర్మాతయగు సదాశివుఁడు - ప్రళయమున చరాచరమును దహించి తత్సారమును భస్మగా పరిగ్రహించుచున్నవాడు. మరియు భస్మోద్ధూళనవ్యాజమున జగత్సారమును తనయందారోపించుచున్నవాడు.

శివుఁడు నిత్యనూతనంబగు తన దివ్యశరీరమునందు ప్రవేశించినవాడై ఆకాశసారమును వెంట్రుకలుగాను వాయుసారమును ముఖముగాను అగ్నిసారమును హృదయముగాను ఉదకసారమును నడుముగాను భూసారమును మోకాళ్లుగాను బ్రహ్మవిష్ణురుద్రుల సారమును భస్మత్రిపుండ్రములుగాను సూర్యచంద్రసారమును లలాటతిలకముగాను ఇవ్విధంబుననే తదితరాంగముల నన్నిటి నేర్పరచుకొనియున్నవాడు. ఈతని నెవరును లొంగదీయువారు లేరు కావుననే శివుఁడనఁబడుచున్నవాడు.

శ్లో॥ శం నిత్యం సుఖ మానంద - మికారః పురుషః స్మృతః ।
వకారః శక్తిరమృతం - మేళనం శివ ఉచ్యతే ॥

శ్=ఇ=వ; శ్ అనఁగా శం అని గ్రహింపవలెను. శం=నిత్యమైన సుఖము, ఆనందము, ఇ=సాధకుఁడగు పురుషుఁడు; వ=అమృతశక్తి; ఇవ్వానిని అనఁగా పురుషుని నిత్య సుఖమును ఆనందమును ప్రసాదించ నమృతశక్తితో కూర్చువాడు - శివుఁడనఁబఱగును. శివశబ్దసంఘటితమైన పంచాక్షరిని జపించువారికి శివుఁడు తప్పక మోక్షము నొసగునని భావము.

అందు వలన తాను భస్మోద్ధూళన త్రిపుండ్రధారణాదులతో శివవేషమును ధరించి శివారాధనమును గావింపవలసియుండును. పగలుగాని రాత్రిగాని స్త్రీగాని పురుషుఁడుగాని పూజా సమయమున భస్మను తడిపి మూడురేఖలుగా ధరించి చేయు శివపూజయే పరిపూర్ణంబగును. భస్మరుద్రాక్ష శివలింగములను ధరించి శివమంత్రమును జపించుచు శివు నారాధించువాడు అత్యా శ్రమియనియు శివాశ్రమియనియు పేర్కొనఁబడును. నిరంతరము శివవ్రతములయందు అనఁగా శాంభవదీక్షాంగములయందు ఆసక్తియు ఆచరణయు కలిగియుండు నిరాభారిశైవులకు జాతాశౌచమృతాశౌచంబులును లేవని కొందరి యభిప్రాయము.





భస్మరుద్రాక్ష మంత్రములఁబరిగ్రహించుటకు శివలింగధారణమనకును వలయు సద్గురువుఁదగు శబ్దార్థమును – ప్రాకృతగుణములను తద్వికారములఁగూడ పోగొట్టువాడని తెలియవలెను. గుణాతీతుండైన పరశివుఁడు గురురూపమున నేతెంచి శిష్యునకు శివజ్ఞానము నుపదేశించువాడు.

భక్తి శ్రద్ధా విశ్వాసములు గల శిష్యులకు గురువే పరమదైవము గావున గురుశరీరమును శివస్వరూపముగా భావించి పూజింపవలెను. మనోవాక్కాయములతో గురువుగారికి శుశ్రూషఁ జేయవలసియుండును. గురువుగారు ఆదేశించిన యంశమున శక్యంబైన నశక్యంబైనను ప్రాణధనముల వెచ్చించియు శిష్యుఁడు ఆచరింపవలసియుండును. అందువలననే శాసింపఁదగినవాడు శిష్యుడుగా పేర్కొనంబడుచున్నవాడు. యోగ్యుడైన శిష్యుఁడు శరీరార్థప్రాణములను గురువునకు సమర్పించి తత్ప్రసాదముగా స్వార్జితము ననుభవించుచు ఆహారాదులను గురువుగారి యనుజ్ఞఁబడసియే స్వీకరింపవలసి యుండును. కర్ణయోనియందు జిహ్వాలింగముచే మంత్రశుక్లము విడువబడుటఁజేశి శిష్యుఁడు గురువునకు జ్ఞానపుత్రుఁడగును గావున జ్ఞానజనకుండగు గురువుగారి నవశ్యము పూజింపవలసియుండును. జనకుఁడు సంసారసముద్రమున పుత్రుని నిమగ్నుఁజేయును. శివతత్త్వబోధకుఁడగు గురువు – శిష్యు నుద్ధరించును కావున నుభయుల తారతమ్యమునెఱిఁగి జనకునికన్న నధికముగా గురువుగారిని సంభావింపవలెను. గురువుగారికి పాదసేవనము తా సంపాదించిన ధనమును విశేషించి సమర్పించుటయు స్నానమును చేయించుటయు మంచిభోజనము నొసగుటయు శిష్యునకు పరమకర్తవ్యములనియు గురుపూజనమే శివపూజనంబగుననియు గురువుగారి ప్రసాదము ఆత్మశుద్ధికరంబనియు గురువుగారి యనుమతిలేనిదంతయు దొంగసొమ్మనియు తెలియవలెను. వంశపరంపరాగతుండగు గురువుకడ నుపదేశముఁబొందినను అతనికన్న విశేషముగా శివజ్ఞానమును గుర్తెరిగిన మహానుభావుఁడు తటస్థించినయెడల నట్టి మహాపురుషుని గౌరవించుటలో ఇసుమంతయు దోసము లేదు.

ఐతే ప్రతి శుభకార్యమునకు విఘ్నములు మెండు కావున మొదట విఘ్నేశ్వరుని పూజించి తా జేయ దలచిన సత్కృత్యమును సాంగముగా సఫలముగా నొనర్చుకొనవలసి యుండును.

ప్రతిమానవునకు ప్రారబ్ధము ననుసరించి ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక ఉపద్రవములు సంభవించుచుండును. గావున వత్సరమున కొకతూరి బుద్ధిమంతుఁడు పెద్దల యనుమతి ననుసరించి శాంతియజ్ఞమును గావింపవలెను.

జ్వరాదివ్యాధులు ఆధ్యాత్మికములనియు; పిశాచపీడనము, పుట్టపొడమూట, ఉడుము సర్పము దుర్మార్గులు మున్నగునవి యింటిలో ప్రవేశించుటయు, వృక్షములు, స్త్రీలు, గోవులు, ఆ సమయమున ప్రసవించుటయనునది భావిదుఃఖమును సూచించునవగుటఁజేశి ఆధిభౌతికములనియు; కలరా మున్నగు దేశోపద్రవములు, జన్మనక్షత్రము నందు జన్మరాశియందును సంక్రాంతి గ్రహయోగంబు, దుఃస్వప్నము, శునకము చండాలురు పతితులు ననువానిఁదాకి దేవాలయాది ప్రదేశములకు వెళ్లుటయు అనునవి ఆధిదైవికములనియు భావింపవపలెను. ఇట్టి దోషములు శాంతించుటకు చేయఁదగిన శాంతియజ్ఞముఁ దగు విధానమును చెప్పుచున్నాడను.

దేవాలయమునందు గాని గోశాలయందు గాని యజ్ఞవాటిక యందు గాని స్వగృహము నందుగాని ఉన్నత ప్రదేశమున ద్విహస్తప్రమాణంబగు స్థలము నలంకరించి ఒక్కడు మోయునంత ధాన్యమును పఱచి యందు నెనిమిది దిశలయందు నెనిమిది కమలములను మధ్య నొక్క కమలమును వ్రాసి గుగ్గిలముతో పొగవేయఁబడినదియు తంతువేష్టితంబునగు కలశమును నడుమనుంచవలెను. అటులే ఎనిమిది దిశలయందు ఎనిమిది కలశములను నెలకొలుపవలెను. నీలమణి మొదలగు రత్నములను తామరకాడలు మామిడికొమ్మలు దర్భలు అనువానిని మంత్రపూతమైన కలశముల యందుంచవలెను. మధ్యకలశముపై సువర్ణ విష్ణుప్రతిమను అష్టకలశములపై ఇంద్రాద్యష్టదిక్పాలకుల సువర్ణప్రతిమలను ఆవాహనాద్యుప చారములతో పూజింపవలెను. ఏతదర్థము అభిజ్ఞుడైన సపత్నీకుఁడగు ఆచార్యుని ఎనమండ్రు ఋత్విజులను వరించి యవ్వారితో నొక్కొక్క దేవతయొక్క మంత్రము నష్టోత్తరశతసంఖ్యఁ జపింప జేయవలెను.

జపాంతమున మధ్యకలశమునకు పడమటి దిసయందు కోటిసంఖ్యఁగాని లక్షపర్యాయములు గాని సహస్రంబుగాని నూటయెనిమిది తడవలుగాని ఆ యా మంత్రములతో హోమమును చేయించవలెను. ఇట్టి శాంతియజ్ఞమును ఒక్కదినముగాని తొమ్మిది ఘస్రంబులుగాని నలుబది యహంబులుగాని దేశకాలానుసారముగా నొనర్పవలసియుండును. హోమమునందు సమిధలు అన్నము ఘృతంబుననును ముఖ్యములు. అరిష్టశాంతికై శమీహోమమును జీవనసరళికై పాలాశ హోమము నాచరింపవలెను. దిక్పాలక విష్ణునామధేయములను చతుర్థ్యంతముగాను నమఃపూర్వకముగా నుచ్చరించుచు అథవా ఆ యా దేవతల మంత్రములఁజదువుచు హవనమును చేయవలెను. మొదట పుణ్యాహవాచనమును చేయించి మంత్రపూతజలప్రోక్షణము నంతటఁగావింప వలసియుండును. చివరకు ఆహుతిసంఖ్యతో బ్రాహ్మణులకు ఆచార్య ఋత్విజులకును షడ్రసోపేతమైన హవిష్యాన్నమును సమర్పించి నవగ్రహహోమంబు నాచరించియు ఆచార్యాదులకు వస్త్రగోభూహిరణ్యాదులను దక్షిణాతాంబూలముల నొసగి ఉపనీతులైన బ్రాహ్మణ బాలురకు గృహస్థులకు వానప్రస్థులకు కన్యలకు సువాసినులకు వితంతువులకు యథోచిత దానంబుల నొసగి దశదానముల నాచరించి పూజాసంభారమునంతయు ఆచార్యునకు సమర్పింపవలెను.

ఉత్పాతములకు జనక్షయరోగంబులకు నానావిధ దుఃఖంబులకు నధికారి యమధర్మరాజు కావున నాతని ప్రీత్యర్థము కాలపురుషుని దాన మొనర్పవలసియుండును.

యథాశక్తి సువర్ణముతో అనఁగా తులమునకు తక్కువ గాకుండా కాలపురుషుని విగ్రహమును పాశాంకుశధరముగా చేయించి పూజించి దక్షిణతోగూడ బ్రాహ్మణునకు దానమొసగవలసియుండును. దీర్ఘాయుష్యమునకై తిలదానమ్ము రోగశాంతికొరకు ఘృతదానంబును ప్రశస్తములు. కలవాడు సహస్రబ్రాహ్మణ భోజనమును చేయవలెను. లేనివాడు నూర్గురను భుజింపఁజేయవలెను. అతి దరిద్రుఁడు యథాశక్తి అన్నదానమ్మును గావింపవలెను. భూతప్రేతపిశాచాదిబాధలు తొలగుటకై భైరవుని పూజింపవలసియుండును.

శాంతియజ్ఞమును ముగించుతతి శంకరునకు మహారుద్రాభిషేకమునుచేసి మహానైవేద్యమును సమర్పించి బ్రాహ్మణాదిచాతుర్వర్ణ్యప్రజలకు భోజనము నొసగవలసి యుండును. ఇవ్విధంబైన

శాంతియజ్ఞము. ఇద్దానిని ప్రతివత్సరము ఫాల్గునమాసమున యథావిధిగావించినచో తప్పక సకలారిష్టములు శమించును. గొప్ప ఉత్పాతములు సంభవించునెడ తచ్ఛాంతికై భైరవారాధనమవసరము. గొప్పవ్యాధి యేర్పడినప్పుడు - వ్యాధి తగ్గినతరువాత శాంతియజ్ఞమును చేయుదునని సంకల్పింపవలెను. ఇట్లు చేయఁజాలని దరిద్రుఁడు దీపదానంనబునైన గావింపవలెను. అదియు వలనుపడదేని యత్కించిద్దానము నాచరింపవలెను. అదియు నశక్యంబగునెడ సూర్యునకు సూర్యమంత్రముతో నష్టోత్తరశతముగాని వేయిగాని పదివేలుగాని లక్షగాని కోటిగాని నమస్కారములఁజేయవలెను. దేవతలందరును నమస్కారరూపమైన యజ్ఞముతో సంతసింతురు.

ఇఁక రుద్రాభిషేకంబును సర్వారిష్టప్రశామకంబు నిద్దాని నాచరించినపుడు శివునకు నైవేద్యమునిడి తాంబూలమును సమర్పించి ప్రదక్షిణంబులను అష్టోత్తరశతంబైనను వేయిగాని స్వయముగా చేయవలెను. లక్ష సంఖ్యను కోటిసంఖ్యను ప్రదక్షిణములు నితరులతో చేయించవచ్చును. శివప్రదక్షిణములతో పాతకమంతయు క్షణములో నశించును. దుఃఖమూలమైన వ్యాధికి మూలంబగు పాతకమును ధర్మముతోడనే పోగొట్టుకొననగును. శివునుద్దేశించి చేయఁబడు ధర్మమైతేనో సద్యస్కాలమున పాపశాంతినొనగూర్చును. శివ ధర్మములలో శివప్రదక్షిణము ప్రముఖస్థానమలంకరించియున్నది. ప్రదక్షిణనమస్కారములు రెండును శివున కత్యంత ప్రియములైనవి. షోడశోపచారములఁజేశిన పూజన్నము ప్రదక్షిణ నమస్కారములతో పూర్ణమై ఫలప్రదంబగును. ప్రదక్షిణములతో నశింపని పాపము భూతలమునఁ గానరాదు.

శివారాధనముఁగావించువాడు-సత్యము, అహింస, క్షమ, శాంతి, దయ, దాక్షిణ్యము ఔదార్యము మున్నగు గుణముల నలవఱచుకొని మౌనముగా నుండవలెను. శివక్రియలను శివతపంబును శివజపమును శివజ్ఞానమును శివధ్యానము నొక్కొక్కటిగా నభ్యసింపవలెను.

శ్రీమంతము, ఆరోగ్యము, దేహదార్ఢ్యము, అజ్ఞానరాహిత్యము, జ్ఞానప్రాప్తియు, శివసాన్నిధ్యము నను నవి శివక్రియాదుల ఫలములని తెలియవలెను. శివభక్తుఁడు దేశకాలముల ననుసరించియు దేహారోగ్యమును కాపాడుకొనుచు శక్తికిమించకుండా పదుగురుమెచ్చునట్లు శాస్త్రీయ విధానముగా శివక్రియాదుల నాచరింపవలెను. న్యాయముగా గడించినడబ్బుతో శివ క్షేత్రమునందు జీవహింసాదుల నొనర్పనివాడై అతిఆయాసము కలుగకుండునట్లు ప్రాజ్ఞుడు నివసింపవలెను.

శివపంచాక్షరీ మంత్రపూతములైన అన్నోదకములు ప్రశస్తంబులనియు దరిద్రునికి భిక్షాన్నము శ్రేష్ఠంబనియు అందును శివభక్తులనుండి రాబడిన భిక్షాన్నము శివభక్తిని పెంపొందించుననియు తెలియవలెను. ఏదేనొక యుపాయమున ఏదేనొకచోట శుద్ధాన్నమును భుజించుచు మితముగా సంభాషించుచు తాఁజేయు శివానుష్ఠానరహస్యమును ప్రకాశింపఁజేయఁగూడదు. శివభక్తులకుమాత్రము వారడుగకున్నను శివమహిమను చాటి చెప్పవలెను. శివమంత్ర రహస్యమును శివుఁడే యెరుఁగును. ఇతరుఁడు కనుగొనఁ జాలడు. ప్రతిష్ఠితశివలింగము నాశ్రయించి నివసించువాడు శివుఁడగును. చరలింగము నారాధించువాడు కాలక్రమమున ముక్తుఁడగును.

మహర్షులారా? వ్యాసమహర్షి పూర్వము నాకు చెప్పినవిధముగా ఉత్తమ సాధ్యసాధనముల నంత వివరించితిని. మీకు శుభమగుగాక! శివభక్తి వర్ధిల్లుగాక! ఈ యధ్యాయముఁజదివినవారు విన్నవారు శివానుగ్రహపాత్రులై శివజ్ఞానము కలవారగుదురని సూతుఁడు వక్కాణించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో అష్టాదశాధ్యాయము.

## ఏకోనవింశాధ్యాయము

### (పార్థివ లింగపూజన మాహాత్మ్యము-భస్మప్రకారాభిధానముమ్ము)

సూతుడా! చిరంజీవివికమ్ము! శివభక్తిసంపత్తితో ధన్యుడవైతివి. సత్ఫలము నొస శివలింగమహిమను చక్కగా చెప్పియున్నావు. ప్రస్తుతము సర్వోత్కృష్టంబగు పార్థివలింగమాహాత్మ్యము వ్యాసులవారివలన తెలుసుకొనిన విధముగా వక్కాణింపుమని ప్రశ్నింపగా సూతుఁడు చెప్పఁదొడగెను.

ఋషులారా? మీరందరు భక్తిశ్రద్ధలతో పార్థివశివలింగవైభవము నాకర్ణింపుడు! ఈవరకు చెప్ప బడిన శివలింగములలో పార్థివ లింగము ఉత్తమంబైనది. ఇద్దానిని పూజించుట వలన పెక మహానుభావులు అభీష్టసిద్ధిఁబడసినవారు. విష్ణుమూర్తి, బ్రహ్మదేవుఁడును దక్ష ప్రజాపతి మొదలగువారు దేవతలు రాక్షసులును గంధర్వులు నాగజాతివారు ఇతరభక్తులందరును పార్థివలింగముల నారాధిం తమకోర్కెలను ఫలింపఁజేసికొనినారు.

శ్లో॥ కృతే రత్నమయం లింగం - త్రేతాయాం హేమసంభవం
ద్వాపరే పారదం శ్రేష్ఠం - పార్థివం తు కలౌయుగే ॥

కృతయుగమున రత్నలింగము, త్రేతాయుగమున సువర్ణలింగంబును ద్వాపరయుగము పాదరసలింగబును కలియుగంబున పార్థివలింగంబును శ్రేష్ఠములు. మహేశ్వరుని అష్టమూర్తుల పృథివిఁజెందిన స్వరూపము ఇతరులచే పూజింపఁబడనిదగుటఁజేశి వరేణ్యమై గొప్పఫలమునిచ్చు దేవతలందరిలో పెద్దవాడు పూజనీయుఁడునగు మహేశ్వరునివలెను నదులన్నిటిని శ్రేష్ఠమైన గంగానదివలె సర్వమంత్రములయందు ప్రణవపంచాక్షరివలెను వర్ణములనన్నిటిని బ్రాహ్మణునివలెను పుణ్యపత్తనముల కాశీపట్టణమువలెను వ్రతములలో శివరాత్రివ్రతమువలెను దేవీమూర్తులలో ఆదిశక్తివలె శివలింగములన్నిటియందు పార్థివ లింగము శ్రేష్ఠంబై పూజనీయంబగుచున్నయది.

ఇట్టిమహత్తర ఫలప్రదంబగు పార్థివలింగారాధనము నుపేక్షించి యితరదేవతలను పూజించు అట్టి పూజనము స్నానదానాదులును స్వల్పఫలప్రదంబులగును. పార్థివారాధనము ధన్యతనాపాదించు ఆయుష్యమును పెంచును. సంతృప్తినొదవఁజేయును. శరీరపుష్టి నావహించును. సంపద ప్రసాదించును. సర్వకామార్థసిద్ధిదంబగు పార్థివలింగార్చనను ప్రతి మానవుఁడు భక్తిశ్రద్ధాసమన్వి గావింపవలెను. రమ్యవేదికతోగూడిన పార్థివలింగమును నిర్మించి భక్తితో పూజించునెడ ఈ జన్మయం





ధనధాన్యసువర్ణాదిసమృద్ధి కలవాడై అంత్య కాలమున శివస్వరూపుండగును. సకామముగా పూజించు భక్తుఁడు కైలాసములోననేక వత్సరములు నివసించి రాజైపుట్టును. నిష్కామముగా నారాధించువాడు శివలోకముఁజెంది సాయుజ్యముక్తుండగును. బ్రాహ్మణుడై పార్థివలింగము నర్చింపనిచో దారుణనరక దుఃఖముల ననుభవించును. ఏదేనొకరీతిగా పార్థివలింగము రమ్యముగా నుండునట్లు నిర్మించవలెను. పంచసూత్ర విచారము ఇందు అవసరములేదు. పార్థివలింగము నఖండముగానే చేయవలెను. ద్విఖండమును చేయకూడదు. అటులే రత్నలింగమును సువర్ణలింగమును పాదరసలింగమును స్ఫటిక లింగమును. పుష్పరాగలింగము నఖండముగా నొనర్పవలసియుండును. అనఁగా ప్రాణవట్టమువేరు పిండము వేరుకూడదని భావము. పీఠముపై నర్చింపబడుచరలింగము అఖండముగాను ప్రతిష్ఠితలింగము ద్విఖండముగా నుండవలెను. లింగవేదిక మహావిద్యయనియు లింగము మహాదేవుఁడనియు భావింపవలెను. మందిరప్రతిష్ఠితలింగము అఖండము అనఁగా ప్రాణవట్టము వేరు పిండమువేరుగా జతపరచబడినది గాక నఖండముగా నుండుదానిని పూజించుటయు, పిండమువేరు ప్రాణవట్టము వేరుగాను జతపరుపఁ బడిన చరలింగము నర్చించుటయు నిష్ఫలంబులగును.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పందొమ్మిదవ యధ్యాయము

## వింశాధ్యాయము

### (పార్థివపూజన విధానము)

వేదాధికారము గలవారు శాస్త్రోక్త విధానమున పార్థివలింగముల నర్చించుట భుక్తి ముక్తిప్రదంబగును. స్నానానంతరము భస్మరుద్రాక్షములను ధరించి శివస్మరణపూర్వకముగా సంధ్యావందనాది నిత్యకర్మలను ముగించి సంపూర్ణఫలప్రాప్తికై పరాభక్తితో పార్థివలింగమును పూజింపవలెను. నదీతీరమునందు గాని చెరువుగట్టునందుగాని పర్వతముపైగాని అడవియందు గాని శివాలయమునఁగాని పరిశుభ్రప్రదేశమునందు గాని పార్థివలింగము నారాధించుట ప్రశంసనీయంబగును.

పరిశుద్ధస్థలమునుండి పుట్టమన్నుఁదీసుకొని అందుభస్మము శ్రీగంధమును కలిపి మంచిచోటున జలముతో పిండాకారముగా నొనర్చి లింగమును వేదికతో నిర్మించి విధివిధానముగా పూజింపవలెను. శివపంచాక్షరీమంత్రము నుచ్చరించుచు పూజాద్రవ్యములపై జలమును చల్లవలెను. "భూరసి" అను మంత్రముతో స్థలశుద్ధిని "అపోఽస్మాన్"అను మంత్రమున జల సంస్కారమును "నమస్తేరుద్ర" అను మంత్రమున ఫాటికాబంధనమును "నమఃశంభవే" అను మంత్రమున పంచామృత ప్రోక్షణంబును "నమోనీలగ్రీవాయ" అను మంత్రమున ప్రతిష్ఠాపనమును "ఏతత్తే రుద్రాయ" అను మంత్రముతో ఆసన సమర్పణమును "మానోమహాంతం" అను మంత్రమువలన ఆవాహనమును "యాతేరుద్ర" అను మంత్రముతో నుపదేశనంబును "యామిషుం" అను మంత్రమున న్యాసంబును "అధ్యవోచత్" అను మంత్రమున నధివాసమును "అసౌజీవ" అను మంత్రమున దేవతాన్యాసంబును "అసాయోఽవసర్పతి" అను మంత్రమున నుపసర్పణంబును "నమోఽస్తు నీలగ్రీవాయ" అను మంత్రమున పాద్యసమర్పణంబును





రుద్రగాయత్రితో నర్ఘ్యసమర్పణంబును త్ర్యంబకమంత్రమున ఆచమన సమర్పణంబును గావింపవలెను. "పయఃపృథివ్యాం" అను మంత్రమున క్షీరస్నానంబు "దధిక్రావణ్ణో" అను మంత్రమున దధీస్నానంబు "ఘృతం ఘృతయావ" అను మంత్రమున ఘృతస్నానమును "మధువాతా" అనుమంత్రమున మధుస్నానంబు "స్వాదుఃపవస్వ" అను మంత్రమున శర్కరాస్నానంబు నాచరింపఁజేయవలెను. తరువాత "దేవస్యత్వా" అను మంత్రముతో నభిషేకము ననఁగా పుష్పముతో మార్జనమును చేయవలెను. "మానస్తోకే" అను మంత్రమున ధోవతిని "నమోధృష్ణవే" అను మంత్రమున నుత్తరీయంబు "యాతేహేతిః" ఇత్యాది మంత్ర చతుష్టయమున కార్పాసవస్త్రంబును సమర్పింపవలెను.

"అగ్నిరితిభస్మ" అను మంత్రమున విభూతిని, "నమఃశ్వభ్యః" అను మంత్రమున శ్రీగంధమును "నమస్తక్షభ్యః" అను మంత్రముతో నక్షతలను "నమఃపార్యాయ" అను మంత్రముతో పుష్పములను "నమః పర్ణ్యాయ" అను మంత్రమున బిల్వపత్రములను "నమఃకపర్దినే" అను మంత్రమున సాంబ్రాణిధూపమును "నమాఆశవే" అను మంత్రమున దీపమును "నమోజేష్ఠాయ" అను మంత్రమున శర్కరాదినైవేద్యమును "త్ర్యంబకం" అను మంత్రమున పునరాచమనమును "ఇమారుద్రాయ" ఇత్యాది మంత్రమున ఫలమును "నమోవాత్యాయచ" ఇత్యాది మంత్రమున సమస్తంబును పార్థివలింగేశ్వరునకు సమర్పింపవలెను.

"మనోమాహాంతం" "మానస్తోకే" అను మంత్రద్వయముతో నేకాదశరుద్రులకు పదునొకండు నక్షతలు సమర్పింపవలెను. "హిరణ్యగర్భ" అను మంత్రమున దక్షిణను "నమఆశవే" అను మంత్రమున నీరాజనమును "ఇమారుద్రాయ" అను మంత్రముతో పుష్పాంజలిని (మంత్రపుష్పమును) "మానోమహాంతం" అను మంత్రమున ప్రదక్షిణంబు "మానస్తోకే" అను మంత్రమున సాష్టాంగ ప్రణామమును సమర్పింపవలెను "ఏషతే" అను మంత్రమున శివముద్రను, "యతోయత" అను మంత్రమున నభయముద్రను త్ర్యంబక మంత్రమున జ్ఞానముద్రను "నమఃసేన" అను మంత్రమున మహాముద్రను "నమోగోభ్యః" అను మంత్రమున ధేనుముద్రను ప్రదర్శింపవలెను. పిమ్మట శివమంత్రమును శతరుద్రీయమును జపించి పంచాంగపాఠము నొనర్చియు "దేవాగాతు" అను మంత్రము నుచ్చరించుచు పార్థివ లింగము నుదకమున విసర్జింపవలెను ఇద్దివిస్తారముగా చెప్పఁబడినవైదిక పూజావిధానము. ఇఁక సంగ్రహముగాచెప్పెదను. వినుఁడు!

సద్యోజాత మంత్రమున మృత్తికను తీసుకొని వామదేవమంత్రమున జలముఁదడిపి అఘోర మంత్రమున పార్థివలింగమును నిర్మించి తత్పురుషమంత్రమున ఆహ్వానమును గావించి ప్రాణవట్టముతో గూడిన లింగము నీశానమంత్రముతో వేదికయందు స్థాపించి మిగత షోడశోపచార పూజావిధాన మంతయు గురుప్రదత్తమైన శివపంచాక్షరీ మంత్రముతోడ నాచరింపవలసియుండును. అథవా "భవాయ భవనాశాయ - మహాదేవాయధీమహి, ఉగ్రాయ ఉగ్రనాశాయ శర్వాయశశిమౌళినే" అను మంత్రము బలుకుచు ఎట్టి అక్రమము సంభవింపకుండా భక్తిశ్రద్ధలతో పార్థివలింగార్చనమును చేయవలెను.

వైదికమంత్రములు రానివారు - ఓం హరాయనమః, ఓం మహేశ్వరాయ నమః, ఓం శంభవే నమః, ఓం శూలపాణయేనమః, ఓం పినాకధృతేనమః, ఓం శివాయ నమః, ఓం పశుపతయే నమః, ఓం మహాదేవాయనమః - అను నెనిమిది నామమంత్రములతో మృదాహరణము మొదలుకొని విసర్జనము వరకు గావింపవచ్చును.

ఐతే మొదట అనఁగా పూజాప్రారంభమున షడక్షరీమంత్రముతో షడంగన్యాసముఁజేసికొని దిగువశ్లోకములతో శివధ్యానమును చేయవలసియుండును.

శ్లో॥ కైలాస పీఠాసన మధ్యసంస్థం - భక్తైః సనందాదిభి రర్చ్యమానం
భక్తార్తిదావానల (ఇప్రమేయం) మప్రమేయం - ధ్యాయే
ద్యుమాఽఽలింగిత విశ్వభూషణమ్ ॥

శ్లో॥ ధ్యాయే నిత్యం మహేశం రజతగిరినిభం చారుచంద్రావతంసం
రత్నాకల్పోజ్జ్వలాంగం పరశు మృగవరాభీతిహస్తం ప్రసన్నమ్ ।
పద్మాసీనం సమంతాత్ స్తుత మమరగణై ర్వ్యాఘ్రకృత్తిం వసానం
విశ్వాద్యం విశ్వబీజం (వంద్యం) నిఖిలభయహరం పంచవక్త్రం త్రినేత్రమ్ ॥

పార్వతీదేవితో కలసిమెలసియుండు శంకరుఁడు – బ్రహ్మాండముతో మహోన్నతమై పీఠమనఁ దగు కైలాసగిరియందు అనుత్తమ శిఖరమున మణిమయస్తంభాది విరాజితంబగు నొకానొక దివ్యసౌధమున రత్నఖచిత సింహాసన మధ్యయందాసీనుఁడై నందికేశ్వర భృంగీశ్వర సనకసనందనాది భక్తులతో సేవింపఁ బడుచు ఆత్మారాముడై యుండియు భక్తులు ఎచ్చోట నుండియైన నార్తనాదముఁజేసినచో నవ్వారి యిడుములఁబాపుట యందప్రమత్తుండగు వాడనియు విశ్వమునకు భూషణమువంటి వాడనియు చింతింపవలెను. మఱియు మహేశ్వరుఁడు – వెండికొండతో సరిదూగు వేసముగలవాడై మనోహర చంద్రకళను శిరోభూషణముగా ధరించినవాడనియు, రత్నాలంకారములచే ప్రకాశించు దివ్యదేహముగలవాడనియు గొడ్డలి, జింక, వరదము, అభదయము, అనువానిని నాలుగు చేతులఁ దాల్చినవాడనియు సర్వదా ప్రసన్నుఁడనియు, పద్మాసనముపై కూర్చుండువాడై నలుదిసలయందు నమరులచే కీర్తింపబఁడువాడనియు, వ్యాఘ్రచర్మను ధోవతిగా కట్టుకొనువాడనియు, చరాచరప్రపంచమునకంటె మున్నుండువాడనియు సమస్త ప్రాణులకు ఆదిపితయనియు బుద్ధిమజ్జీవులందరిచే మ్రొక్కఁబడువాడనియు భక్తులు భక్తేతరులును సమయానుకూలముగా ప్రార్థించునెడ నవ్వారి నానావిధ భయములను తీసివేయువానియు ఐదు ముఖములు, ముకుళిత పుండరీకసదృశంబగు ఫాలనేత్రంబును, వికసితపంకజములఁబోలిన కనుదోయి గలవాడనియు ధ్యానింపవలెను. ధ్యానానంతరము పార్థివలింగమును పూజించి పంచాక్షరీమంత్రమును 108 పర్యాయములు రుద్రాక్షమాలతో జపింపవలసి యుండును.

తరువాత అనేకవిధ శివస్తోత్రములను రుద్రాధ్యాయమును పఠింపవలెను. పిమ్మట దోసిలి నక్షతపుష్పములఁబరిగ్రహించి దిగువవిధముగా శంకరుని ప్రార్థించవలెను.

"పరమేశ్వరా! నీవాఁడను, నీయందే నా ప్రాణములను చిత్తము నెల్లకాలము నిలిపియున్నాను, కరుణా సముద్రుడవగు నీవు నాయందు ప్రసన్నుడవు కమ్ము! తెలిసిగాని తెలియకగాని చేయఁబడిన జపపూజాదికమంతయు నీ యనుగ్రహమున సఫలంబగు గావుత! నేను గొప్ప పాపాత్ముడను. నీవైతేనో అతిపావనుండవు. ఇట్లు గమనించి నీ యిష్టప్రకారము గావింపుము!





శ్రుతిస్మృతీతిహాస పురాణములు అనేక మతసిద్ధాంతంబులును ఋషులున్ను నీ తత్త్వము యథార్థము గుర్తెరుగఁజాలరు. ఇఁక నేనెంతవాడను. అన్నివిధములను నీవాడనైతిని,కావున నన్ను రక్షించు భారము నీయదియేను."

ఇవ్విధము విన్నవించి సాక్షతపుష్పములను శంకరునిపై నుంచవలెను. విధియుక్తమై సాష్టాంగనమస్కారమును చేయవలెను. తరువాత ప్రదక్షిణమును గావించి మఱల ననేక స్తోత్రము పఠించి యొక్కతడవ పెద్దగొంతుతో పరమేశ్వరుని స్మరించి వినమితశిరస్కుడై మ్రొక్కవలెను. విజ్ఞ నాచరించి విసర్జనమును గావింపవలెను.

మునిశార్దూలులారా! పార్థివలింగార్చనముఁదగు వైదిక పౌరాణిక విధానములను నా తెలిసినం నివేదించితిని. పార్థివలింగార్చనము – భుక్తిముక్తుల నొసగుటయేగాక తత్కాలమున శివునందు అనన్యభక్తి కలుఁగజేయును. ఈ యధ్యాయము చదువువారికి వినువారికిని పాపములను హరిం ఆయురారోగ్యకీర్తులను పుత్రపౌత్రాది సుఖమును తదితర సర్వాభీష్టములను సిద్ధింపజేయునని సూతమహ వాక్రుచ్చెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో వింశాధ్యాయము

## ఏకవింశాధ్యాయము

### (కామనానురోధముగా పూజనమున శిలింగసంఖ్యఁ జెప్పుట)

**మహర్షులు ప్రశ్నించగా సూతుఁడు పలుకుచుండెను.**

మానవుని కృతకృత్యుఁజేయు ప్రార్థివలింగమును పూజింపక నితర దేవత నారాధించునెడ నయ్య యల్పఫలప్రదంబగుటయే గాక తాజేశిన దానధర్మాదిపుణ్యమంతయు నిరుపయోగఁబగును.

విద్యాభివృద్ధిఁగోరువాడు సహస్రప్రార్థివలింగములను పూజించునెడ నిశ్చయము కృతవిద్యుండగును. శ్రీమంతము నభిలషించునెడ నైదువందల ప్రార్థివ లింగముల నర్చింపవలెను పుత్రసంతానము నపేక్షించువాడు పదునైదువందల లింగములను, ముముక్షువు కోటి లింగములను భూకాముఁడు సహస్రలింగములను, మంచి మంచి వస్త్రములను దాల్పఁదలచువాడు ఐదునూ లింగములను, గొప్పవారిదయఁగోరువారు మూడువేల లింగములను కాశీరామేశ్వరాది పుణ్యతీర్థములను సేవింప నిచ్ఛగించువారు రెండువేల లింగములను సహృదయుడైన స్నేహితుఁబడయఁగోరువారు మూడువే లింగములను పగతుఱను లొంగదీయుటకు నష్టోత్తర శతలింగములను, కారాగారబంధనమునుండి విముక్తి నుద్దేశించినవారు పదునైదువందల లింగములను, ప్రభుత్వభయనివృత్తికై పంచశత లింగములను చోరభీతిమున్నగు సంకటములు తొలగుటకై శతద్వయలింగములను, భూతప్రేతపిశాచాదిబాధల శమించుటకు పంచశతలింగములను,"దారిద్ర్యము తొలగుటకు ఐదువేల లింగములను, సర్వకామావాప్తి గాను పదివేల పార్థివలింగములను పూజింపవలసియుండును.





ఇక నిత్యవిధి యెట్టిదనఁగా? ప్రతిదినము ఒక్క పార్థివలింగమును పూజించుట పాపములను హరించును. రెండు లింగముల నారాధించుట - చింతితమనోభీష్టముల నీడేర్చును. లింగత్రయార్చనంబు సర్వకామఫలప్రదంబగును.

మరియొకరీతిగా పార్థివలింగముల నర్చింపనగును. బుద్ధిమంతుఁడు - పదివేల పార్థివ శివలింగములను పూజించునెడ ఎట్టి భయము లేనివాడై రాజ గౌరవము గలవాడగును. కారాగృహము మున్నగు బంధములు తొలగుటకును దశసహస్ర లింగార్చనయే సాధనము. భూతప్రేతపిశాచాదిపీడలు నివారించుటకు నేడు వేల లింగములను పూజింపవలసియుండును. అపుత్రుఁడు నేబదియైదువేల లింగములను పుత్రికాకాముఁడు దశ సహస్ర లింగములను పూజింపవలెను. ఐహిక వాంఛారహితుడై దశసహస్ర లింగములను పూజించునెడ విష్ణుమూర్తి మొదలగు వారి ఐశ్వర్యమును లక్షలింగముల నర్చించునెడ కైలాస వైభమును పొందువాడగును.

శ్లో॥ **కోటి మేకాంతు లింగానాం - యః కరోతి నరో భువి,**
**శివ ఏవ భవేత్సోఽపి - నాత్రకార్యా విచారణా ॥**

కోటి పార్థివ లింగములను భక్తిశ్రద్ధలతో నారాధించు పురుషోత్తముఁడు ప్రారబ్ధాంతమున శివుఁడే యగును. అనఁగా పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యము నొందునని భావము. ఇద్ది యర్థవాదమనియు అతిశయోక్తి యనియు తర్కింపఁగూడదు.

పార్థివలింగార్చనము - కోటి యజ్ఞఫలంబొసంగును. లింగార్చనమును విడచికాలమును వృథా గడపువాడు - అధముఁడై గొప్పకీడునకుఁబాడియగును. సర్వవిధదానంబులు వివిధ వ్రతంబులు నానావిధతీర్థములు అనేకనియమంబులు నొకయెత్తు లింగార్చనంబొకయెత్తని గ్రహింపవలెను. కలియుగమున లింగార్చనమును మించిన మరియొక ముక్తిసాధనము లేదని శాస్త్రములు సిద్ధాంతములును నిర్ధారిరంచినవి. వేయేల ప్రతిదినము నియమముతో శివలింగముఁబూజించువాడు శివనామస్మరణ వశంబున ముక్తుండగును. ఉత్తమ మధ్యమ అధమ భేదములతో శివలింగము త్రివిధంబులు.

మనోహరమగు వేదిక (గద్దె) తో కూడినదియు నాలుగంగుళముల ఎత్తైనదియు ఉత్తమంబగును. అద్దానిలో సగము మధ్యమంబగును. తదర్థము అధమంబగును.

భక్తి శ్రద్ధాసమన్వితుఁడై నిత్యము అనేక లింగముల నర్చించువాడు మనోరథముల నన్నిటి నీడేర్చు కొనువాడగును. కామ్యకర్మలను విసర్జించి పరాభక్తితో నొక్కశివలింగమునే పూజింపవలెను. శివలింగము నర్చించినచో చరాచరమంతయు సంతృప్తిజెందును గావున సంసారసముద్రముఁ దాటుటకు లింగార్చనము దక్క మరియొండు సాధనము లేదు.

అజ్ఞానమను చీకటితో గ్రుడ్డివారును ఇంద్రియ సుఖంబులను మఱగిన వారు నెప్పుడైన నుద్ధరింపఁ బడవలెనని యుద్దేశించినచో లింగార్చనమునే గావింపవలసియుండును.

విష్ణుబ్రహ్మాదిదేవతలు మునులు యక్షులు రాక్షసులు గంధర్వులు చారుణులు సిద్ధులు దైతేయులు దానవులు ఆదిశేషాదినాగులు గరుత్మంతుడు మున్నగు పక్షులును ప్రజాపతులు మనువులు కిన్నరులు మానవులును లింగాత్మకుఁడగు శివుని బూజించి తమతమ యభీష్టములఁబడసినవారు.





మునులారా! పెక్కుచెప్పనేల? స్త్రీలకు గూడ లింగార్చనమునందధికారము గలదు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు వైదిక మార్గమున తనను పూజింపవలెననియు తదితరులు పౌరాణికవిధానమున నర్చింపవలెననియు భగవానుఁడగు శివుఁడు వాక్రుచ్చెను.

వేదోక్తమైన శివారాధనమునందు దధీచిగౌతమాదులచే శపింపఁబడిన బ్రాహ్మణాదులకు అస్త్రి కలుగకుండును. శ్రౌతము స్మార్తంబు ననురెండు విధానములే శివారాధన మార్గములలో ముఖ్యంబులు.

ఇట్లు నైవేద్యమువరకు శివారాధనముఁగావించి భూజలాగ్ని వాయ్వాకాశముల యొక్కయు సూర్యచంద్ర యజమానుల యొక్కయు నధిష్ఠాన దేవతలగు శర్వ భవ రుద్ర ఉగ్ర భీమ ఈశ్వర మహాదేవ పశుపతి మూర్తులను చందనాక్షతబిల్వములతో పూజింపవలెను. ఈశానుఁడు, నందికేశ్వరుఁడు, చండేశుఁడు, మహాకాలుఁడు భృంగీశ్వరుండు, వృషుఁడు, స్కందుఁడు, కపర్దీశుఁడు, సోముఁడు శుక్రుఁడు నను శివపరివారము నర్చించి యివ్వారిముందు వీరభద్రుని, వెనుక కీర్తిముఖునారాధింపవలెను. పిమ్మట నేకాదశరుద్రులఁబూజింపవలెను. అంత శివ పంచాక్షరీ మహామంత్రమును జపించి శత రుద్రీయముఁ బఠించి నానావిధస్తోత్రములఁజదివియు పంచాంగము నాలపింపవలెను. అటుపిమ్మట శివునకు ప్రదక్షిణంబుల నాచరించి నమస్కరించియు పూజిత పార్థివలింగము(ల)ను విసర్జింపవలసి యుండును. ఇద్ది శివపూజావిధానము.

ఐతే రాత్రివేళ నుత్తరదిశాభిముఖుఁడై దేవతాకార్యముల నొనర్పవలెను. ఇఁక శివార్చనమునైతేనో ఎల్లకాలము శుచియై (అనఁగా మడిధోవతిఁ గట్టుకొని) ఉదఙ్ముఖుండయ్యే గావింపవలసియుండును.

తూర్పుదిశ కభిముఖముగా కూర్చుండునెడ శంకరుని కెదురగును. దక్షిణదిశ కభిముఖముగా నాసీనుండగునెడ అమ్మవారి నివాసము నాక్రమించినవాడగును. పడమర కభిముఖముగా నుపవిష్టుండగునెడ శివుని పృష్ఠభాగంబగును కావున నుత్తరదిశాభిముఖ్యమే గ్రాహ్యంబని సారాంశము.

శ్లో॥ వినా భస్మత్రిపుండ్రేణ - వినా రుద్రాక్షమాలయా ।
బిల్వ పత్రం వినానైవ - పూజయేచ్ఛం కరంబుధః ॥

విజ్ఞానము గలవాడు విభూతిని నొసట మూడురేఖలుగా ధరింపనిది, రుద్రాక్షమాలను మెడఁ దాల్పనిదనియు మారేడు దళములను సేకరించుకొననిదియు, పరమేశ్వరుని పూజింపరాదు. అనఁగా శివారాధనోపచారములన్నిటిలో భస్మరుద్రాక్ష బిల్వములు అత్యంత ముఖ్యములని భావము.

ఒకవేళ ప్రయత్నించినను భస్మ లభింపనియెడల శుద్ధమృత్తికఁదడిపి మూడు రేఖలుగా లలాటమున ధరింపవచ్చును.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వము" అను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఏకవింశాధ్యాయము.





# ద్వావింశాధ్యాయము

## (శివనైవేద్య భక్షణ నిర్ణయము, బిల్వమహిమయు)

శివనైవేద్య స్వీకార నిర్ణయమును బిల్వమాహాత్మ్యమును చెప్పుడని శౌనకాదిమునులు ప్రశ్నింపగా సూతుఁడు చెప్పఁదొడఁగెను.

ఋషులారా! సావధానులై వినుఁడు! మీ యందఱి యనురాగముచే నా తెలిసిన దంతయు వక్కాణింతును. ఇట్టి సందర్భము నొనఁగూర్చిన మీరు శివభక్తి మెండుగా కలవారనియు ధన్యులనియు భావించుచున్నాను.

శివారాధనమే వ్రతముగా గల పరిశుద్ధాం తఃకరణుఁడు దృఢనిశ్చయము గలవాడై శివనైవేద్యము గ్రాహ్యము కాదను నంశమునే మనస్సులోనుండి తీసివేయవలెను. శివనైవేద్యమును చూచినంత మాత్రమున పాపములు పటాపంచలగును. మరియు భక్షించుటచే కోట్ల కొలది పుణ్యములు సంభవించును.

వేలకొలది యజ్ఞయాగముల నాచరింపవలసిన యవసరము లేదు. శివప్రసాదము ననుభవించినందువలననే శివసాయుజ్యము నొందువాడగును. శివనైవేద్యప్రచారము గల గృహము పావనమగును. ఇంకనెవరైనను శివనైవేద్యము నొసగినయెడల నద్దానిని నమ్రతతో స్వీకరించి శ్రద్ధతో భుజింపవలసియుండును. ఇట్టి ప్రసాదమును మరొకప్పుడు తీసికొనెద ననుకొనుటయు పాపహేతువగును. శివప్రసాదమును గ్రహింపవలెనని కోర్కె లేనివాడు పాపిష్ఠులలో గరిష్ఠుఁడై నరకయాతనల ననుభవించును.

చంద్రకాంతమణి నిర్మితంబు, బంగారము వెండి మున్నగువానితో చేయఁబడినదియు, నగు శివలింగముఁదగు ప్రసాదమును శాంభవదీక్షితుఁడు స్వీకరించుట శ్రేయస్కరంబగుటయే గాక మహాప్రసాదంబని భావించి సర్వవిధలింగముల యొక్కయు నివేదితమును శివదీక్షగల ప్రతిభక్తుఁడును స్వీకరింపవలెనని శాస్త్రములు నొక్కి చెప్పుచున్నవి.

ఇఁక నితర దీక్షలఁబరిగ్రహించినవారు - శాలగ్రామశిలవలన నిర్మింపబడిన శివలింగముల యొక్కయు పాదరసలింగముల యొక్కయు శిలాలింగముల యొక్కయు సువర్ణ రజతలింగములయొక్కయు దేవతాప్రతిష్ఠితంబులు సిద్ధ ప్రతిష్ఠితంబులు కాశ్మీరదేశోద్భవంబులు స్ఫటికనిర్మితంబులు రత్నకృతంబులు నగు శివలింగముల యొక్కయు సమస్తజ్యోతిర్లింగముల యొక్కయు నివేదితప్రసాదము - చాంద్రాయణసమంబని భావించి స్వీకరింపవలసియుండును.

బ్రహ్మహంతకుఁడైనను శివనిర్మాల్యమును ధరించునెడ తత్కాలముననే పవిత్రుండగును. మరియు శివనైవేద్యమును భక్షించినచో సమస్త పాపములు నశించును. చండీశ్వరుని యధికారము గల శివలింగములఁదగు ప్రసాదమును మాత్రము భుజింపరాదు.

నర్మదాబాణలింగములయందు లోహనిర్మితలింగములయందును సిద్ధలింగముల యందును స్వయంభూలింగములయందును సర్వవిధ విగ్రహములయందును చండీశ్వరుని యధికారము లేదు.




విధివిధానముగా శివునభిషేకించిన తీర్థమును ముమ్మారు స్వీకరించినయెడల మనోవాక్కాయకృత త్రివిధపాపంబులు నదేక్షణంబున నంతరించును. మునిపుంగవులారా! ఇఁట నొకవిశేషము గలదు. శివలింగముపై సమర్పింపఁబడిన ఫలపుష్పాదులు గాక సువర్ణరజతముద్రాదులు మిక్కిలి పవిత్రంబులని మదిఁదలచి యవ్వానిని పరిగ్రహింపరాదు. నివేదితముల యొక్కయు శివనిర్మాల్యము యొక్కయు శివద్రవ్యము యొక్కయు గ్రాహ్యాగ్రాహ్యవిచారమును సంగ్రహముగా చెప్పినవాడను.

**ఇఁక బిల్వమహిమను నుడివెదను. సావధానులై ఆకర్ణింపుడు!**

బిల్వవృక్షము – శంకరస్వరూపంబని దేవతలు వర్ణించుచుందురు. బిల్వముఁదగు మహిమను పూర్తిగా తెలియనలవిగాదు. పదునాలుగు లోకములయందలి పుణ్యతీర్థములన్నియు బిల్వమూలమునందు నివసించును. బిల్వవృక్షముఁదగు మూలప్రదేశమునందు లింగస్వరూపశివుని పూజించు పుణ్యాత్ముఁడు శివలోకముఁజెందును. బిల్వమూల జలములతో స్నానముఁజేయువాడు గంగాగోదావరీ ప్రభృతి సర్వతీర్థములయందు గ్రుంకులిడిన సుకృతముఁబొంది పావనుఁడగును. మారేడు చెట్టు పాదుయందు గల నీటిఁజూచి వేల్పులమేటి మిగుల సంతసించును. గంధపుష్పాదులతో బిల్వమూలము నారాధించువాని వంశము పెంపొందుచుండును. బిల్వ వృక్షముచుట్టును దీపముల పంక్తి నేర్పరచువాడు శివతత్త్వజ్ఞానము గలవాడై ముక్తుండగును.

ఒకవేళ పత్రిచెట్టుచెంతకుఁజన నవకాశము లేనివారు కొంగ్రొత్తగా ఇగురించిన మారేడుకొమ్మ దీసుకొని యొకచో నెలకొలిపి పూజించినను పాపములన్నియు తొలగును. బిల్వమూలమునందొక మహేశ్వరునికి భోజనము నొసగునెడ నట్టిపుణ్యాత్ముడు కోటిజనమునకు అన్నదానముఁజేసిన ఫలము నొందును. ఇఁట క్షీరాన్నమును మంచినెయ్యితో శివభక్తునకు సమర్పించువాడు దరిద్రుఁడై జన్మింపడు.

బిల్వమహిమ యిట్టిది. ఇఁక శివలింగార్చనము – సర్వసామాన్యులకు ప్రత్యేక దీక్ష గలవారికి రెండువిధములగుచున్నయది. సామాన్యులు పీఠమునందు శివలింగమును పూజించి యభీష్టముల నన్నిటిని బడయవచ్చును. ఐతే పీఠార్చనము సర్వంబు పాత్రలతోడనే చెల్లును. రుద్రాభిషేకానంతరము గంధాద్యుపచారములను వరిఅన్నమును మహానివేదనగా సమర్పింపవలెను. పూజాంతమున శివలింగమును ప్రత్యేకస్థలమున అనఁగా దేవగృహమునందు పరి శుభ్రమైన పళ్లెరమునందుంచవలెను.

శాంభవదీక్షితులైతేనో సూక్ష్మశివలింగమును కరతలమున విభూతిమున్నగు నుపచారములఁబూజించి తాముభుజించు ఆహారమును నివేదించి యట్టి శివస్వరూపము నుత్తమాంగమున నెల్లకాలము ధరింపవలసియుండును.

"వ్రత మేత త్పాశుపతం, తత్సమాచరే న్ముముక్షు రపునర్భవాయ"ఇత్యాద్యనేక శ్రుతిజాతంబు ఇందుకు ప్రమాణంబని తెలియవలెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వము" అను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ద్వావింశాధ్యాయము.**





# త్రయోవింశాధ్యాయము

## (రుద్రాక్షమహిమ, శివనామమహిమయు)

వేదవ్యాసశిష్యుఁడవు మహాభాగుడవు నగు నో సూతమహర్షీ! నీకు నమస్కారమగుగావుత! భస్మరుద్రాక్షల మహిమను శివనామ ప్రాశస్త్యముఁగూర్చియు మా మానసములు సంతసించునట్లు ప్రబోధింపుమని శౌనకాదిమునులు ప్రశ్నింపగా సూతుఁడు నుడువుచుండెను.

లోకహితము నొనగూర్చు నంశమును గురించి ప్రశ్నించిన మీ యందరికిని కులీనత్వము మహాధన్యత్వంబును కనంబడుటయేగాక శివుఁడే పరమదైవమును సద్భావన పొదుకొని యున్నట్లు గుర్తెరిగితిని.

శివు ననన్యభక్తి నుపాసించువారు - చరితార్థులనియు వారి వంశమంతయు ఉద్ధరింపఁబడినదనియు మరియు శివభక్తుల దేహధారణము సఫలంబనియు తెలియవలెను.

శ్లో॥ శివనామ ముఖే యస్య - సదా శివశివేతిచ,
పాపాని నస్పృశంత్యేవ - ఖదిరాంగారకం యథా ॥

ఎవని ముఖము నందెల్లకాలము శివశివ యను నామము స్మరింపఁబడునో నవ్వానిని చంద్రనిప్పును వలె పాపములు స్పృశింపకుండును. అనఁగా భక్తుఁడు శివనామము నుచ్చరించుచుండినచో పాపబుద్ధియు నివారించునని భావము. కేవలము "శివ" "శివ" అనుటకంటె "శ్రీ శివాయ నమః" అని పలుకుటలో విశేషఫలము కలదు. అట్టివాని ముఖము పావన తీర్థమనఁబఱగును. శివనామస్మరణము గల వదనముఁ జూచినవానికి తీర్థస్నానఫలము సమకూరును.

భస్మరుద్రాక్షలను ధరించి శివనామమును స్మరించుచున్న మహానుభావుని దర్శించిన వారికి త్రివేణీస్నానఫలంబు సంప్రాప్తంబగును. ఇద్దానిని విశ్వసింపనివాడు పాపబుద్ధి గలవాడనియే నిశ్చయింప వలెను. నొసట విభూతిఁదాల్పనివాడు, కంఠమున రుద్రాక్షమాలను ధరింపని వాడును శివనామమును నోటఁబలుకనివాడు నధముండగును.

శివనామము-గంగానదియనియు, విభూతి-యమునానదియనియు, రుద్రాక్షము - సరస్వతీనది యనియు గుర్తెరుగవలెను. బ్రహ్మావిష్ణ్వాది దేవతలు నీ మూటిని ధరించుచున్నవారు.

ఇవ్వాని మహిమను మహేశ్వరుఁడే పూర్తిగా తెలియఁజాలును. శివనామము అను దావాగ్నికి మహాపాతకములను పర్వతములు భస్మీపటలములగును. ఇద్ది ముమ్మాటికి నిజము. పాపములవలన కలుగు దుఃఖములన్నియు శివనామస్మరణముతోడనే దూరమగును. శివనామ జపమునందాసక్తి గల మానవుఁడే వైదికుఁడనియు పుణ్యాత్ముఁడనియు ధన్యుఁడనియు పండితుండనియు తెలియవలెను.

పూర్వకృతపుణ్యములు ఫలించు సమయముననే శివనామ జపమునందు విశ్వాస మంకురించును. శివనామముతో సమసిపోవు పాపములు లోకమున నుండఁజాలవు. బ్రహ్మహత్యాది మహాపాపములు





గూడ శివనామస్మరణమువలన నశించును. సంసార సముద్రముఁదాటుటకు వలయు నౌ శివనామంబేయగును. అప్పుడే సంసారమూలహేతువులు పటాపంచలగును. దురితమహారణ్యముల శివనామము కుఠారము (గొడ్డలి) వంటిదగును. పాపదావాగ్ని సంతప్తులకు శివనామామృత పేయంబగును. శివయను నామధేయ మయ్యేవే అమృతంపు ధారలఁదడిసినవారు సంసార దవాగ్నియం దగులుకొన్నను సామాన్యులవలె దుఃఖింపరు. కోటిజన్మార్జితపుణ్యబలమున శివనామజపాసక్తి కలిగె యవ్వారికి మోక్షము హఠాత్తుగా చేకూరును. ఇట్టి సద్భక్తి – అనేక జన్మములలో తపంబు నాచరించినవా కలుగునది.

శ్లో॥ యస్యాసాధారణీ శంభు - నామ్ని భక్తి రఖండితా,
తస్యైవ మోక్షః సులభో - నాన్య స్యేతి మతిర్మమ ॥

శివనామమునందు తైలధారవలె నవిచ్ఛిన్న పరంపరతో నేకాంతభక్తి కలిగియుండు వానికే మోక్ష సులభము, ఇతరులకు లేదని భావము. అనఁగా ఇతరదేవతలను పూజించుచు నవ్వారి నామముల స్మరించువారికి పాపశాంతియు కామ్యసిద్ధి మాత్రంబు నేర్పడునని సారాంశము.

శివనామజప ప్రారంభమునకు మున్ను చేయఁబడిన నఘములన్నియు శివనామము జపించుటతోడనే నశించును. ఇందెంతమాత్రము సందియము లేదు. వనమున దావాగ్ని వృక్షములన్నియు భస్మమైనట్లు శివనామము – సంచిత ఆగామి దురితములఁ బోకార్చును. సంసార భయంకరమైనది. ఇట్టిదైనను భస్మపూతాంగుడై రుద్రాక్షధారియై శివనామమును జపించువా జన్మాంతముననే (సంసారము) తొలగును. వేయేల? శివనామముచే పోగొట్టఁబడు పాపము మానవమాత్రుఁడు చేయఁజాలడు.

పూర్వము ఇంద్రద్యుమ్నుండను మహారాజు గొప్ప గొప్ప పాపములఁజేసియు శివనామ స్మరణము జేసి సద్గతినొందినవాడు. అటులే ఒకానొక విప్రాంగన ......... నానావిధ దురితముల నాచరించి శివనామ ప్రభావమున కైలాసము నలంకరించెను. శివనామమహిమ నివ్విధము నుడివితిని. ఇ సర్వపావనపావనంబగు భస్మందగు సామర్థ్యము నాలకింపుడు!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వమను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో త్రయోవింశాధ్యాయము





# చతుర్వింశాధ్యాయము

## (భస్మమాహాత్మ్యము)

సకల శుభముల నొసఁగు భస్మ - రెండు విధములు. అద్దాని తెఱఁగు పేర్కొను చున్నవాడను. సావధానముగా నాలకింపుడు!

మహాభస్మయనియు స్వల్పభస్మయనియు ద్వివిధంబుగా నుండు విభూతిశ్రౌత మనియు స్మార్తమనియు లౌకికంబనియు మూడు తెఱఁగులయ్యెను. ద్విజులు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు) మంత్రముల నుచ్చరించుచు భస్మను ధరింపవలెను. ఇతరులు శివనామమును స్మరించుచు విభూతిరేఖలఁదాల్పవచ్చును. త్రిపుండ్రములుగా ధరింపఁబడు విభూతికి కాల్చబడిన ఆవుపేడ ద్రవ్యంబగును. ఇద్దియే ఆగ్నేయ భస్మయనంబడుచున్నయది. నిత్యాగ్ని హోత్రముఁదగు విభూతినైనను తదితరయజ్ఞముల విభూతినైనను మూడురేఖలుగా ధరింపవచ్చును.

జాబాలోపనిషద్గతములైన అగ్నిరిత్యాది సప్తమంత్రములతో సజలమైన భస్మను ధరింపవలెను. అన్ని వర్ణములవారు సమస్త ఆశ్రమములవారును సమంత్రకముగా నైనను అమంత్రకముగానైనను ఉద్ధూళనమును త్రిపుండ్రధారణమును చేసికొనవచ్చును. ముముక్షువగు వాడు ఉద్ధూళనమును త్రిపుండ్రధారణమును చేసికొనవచ్చును. ముముక్షువగువాడు ఉద్ధూళనమును త్రిపుండ్రధారణమును ప్రమాదమునఁగూడ విడువగూడదు.

మహేశ్వరుఁడు, విష్ణుమూర్తి బ్రహ్మదేవుఁడు పార్వతీ లక్ష్మీసరస్వతులు, తదీతరఇంద్రాది దేవతలందరును దేవర్షులు, బ్రహ్మర్షులు, సనకసనందనాది సిద్ధులు, సాధ్యులు, కిన్నరకింపురుషాదు లందరును. బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రులు, సంకరజాతివారు నుద్ధూళనమును త్రిపుండ్రధారణమును గావించుచున్నవారు. ఇవ్విధము శివపురాణము నొక్కి చెప్పుచున్న నుద్ధూళనత్రిపుండ్రధారణములఁజేయని వారికి వర్ణాశ్రమాచార ప్రయుక్తమగు స్వధర్మము సిద్ధింపదు. కోట్లకొలది జన్మలయందును సంసారమునుండి విముక్తిచేకూరదు. శతకోటి కల్పములకైనను శివతత్త్వజ్ఞానము కలుగఁజాలదు. భస్మధారణరహితులు మహాపాపులని శాస్త్రములుద్ఘోషించుచున్నవి. అట్టివారు చేయు వ్రతోపవాసాది పుణ్యములు విపరీతఫలము నొసగునవి. గొప్ప గొప్ప దురితముల నాచరించినవారికే శివద్వేషముగలవారికే ఉద్ధూళనము నందును త్రిపుండ్రధారణమునందు సేవగింపు కలుగును.

ఐతే ప్రతిదినము శివాగ్నికార్యము నొనర్చి "త్రియాయుషం" అను మంత్రముతో భస్మఁగైకొని ధరించునతడు పాపములన్నిటినుండి విడుదల యగును. తెలుపైన విభూతిని మూడుకాలములయందు ధరించునెడల ననాదికాలమునుండి ప్రవర్తించుచున్న దివ్యలోకముల నొందును. భస్మస్నానమును చేయనిది షడక్షరీ మహామంత్రమును జపింపఁగూడదు. విధి విధానముగా విభూతిఁదాల్చి జపమును చేయవలసియుండును.

భూతదయ లేనివాడు, నీచుఁడు మనోవాక్కాయ దోషములు గలవాడు సూర్యోదయ సమయమ్మున నిద్రించువాడు, తెలిసి తప్పుచుండు మూర్ఖుఁడు, వర్ణాశ్రమాచార పరిభ్రష్టుఁడుననువారు నివసించు ప్రదేశ – ఒకవేళవారు – విభూతిని ధరించునెడల – పుణ్యతీర్థముల తోడను యజ్ఞయాగాది సత్కార్యములతో విరాజిల్లునదిగా భావింపఁబడును. భస్మధారకుని దేవతలు రాక్షసులును పూజింతురు. కేవల భస్మధారణమేగాక శివోపాసనము గలదేని యట్టివాడు చరించు ప్రదేశములు – పుణ్యక్షేత్రంబులగు

శ్లో॥ బహునాఽత్ర కిముక్తేన - ధార్యం భస్మ సదా బుధై:
లింగార్చనం సదా కార్యం - జప్యో మంత్రః షడక్షరః ॥

వేయేల? బుద్ధిమంతులు నిత్యము విభూతిఁదాల్పవలెను. శివలింగము నారాధింపవలెను. షడ మహామంత్రమును జపింపవలెను.

(ప్రణవముతో కూడిన శివపంచాక్షరిని షడక్షరియందురు. ఓంకారములేనిది పంచా యనంబడును.)

భస్మధారిని దండించువారు చండాలబీజమునుండి జన్మించినవారని తెలియునది. బ్రాహ్మ క్షత్రియులు మానస్తోకమంత్రముతోడను, వైశ్యులు – త్ర్యంబక మంత్రముతోడను, శూద్రులు వితంతుస్త్రీల పంచాక్షరీ మంత్రముతోడను భస్మధారణముఁజేయవలసియుండును.

బ్రహ్మచారి – త్ర్యంబక మంత్రమువలనను, గృహస్థుఁడు – పంచబ్రహ్మమంత్రముల తోడ వానప్రస్థుఁడు – అఘోరమంత్రమునను, సన్న్యాసి – ప్రణవమునను విభూతిరేఖలను మేనఁదాల్పవ యుండును.

అత్యాశ్రమియై శాంభవదీక్షితుండైన శివయోగి – యెల్లప్పుడు ఈశాన మంత్రముతో భస్మ ధరింపవలెను. ఎవరును భస్మధారణమును మానగూడదని శివుఁడు శాసించుచున్నవాడు. భస్మస్నానమ తనువునందు నిలచు భస్మకణములన్నియు శివలింగములనియే భావింపవలెను. తెలిసిగాని తెలియ గాని ధరింపఁబడు భస్మ–యగ్నివలె పావనంబగును.

భస్మను ధరింపనిది రుద్రాక్షలను వేసికొననిది యొక్క నీటిచుక్కనైనను త్రాగరాదు. కణమాత్ర అన్నఁబును పరిగ్రహింపగూడదు. ఒకవేళనట్లు చేసినయెడల గాయత్రీ జపముతో శుద్ధియగును. యత ప్రణవజపమున పునీతులగుదురు. భస్మత్రిపుండ్రములను నిందించువారు శివుని నిందించువారే యగుదు భస్మను ధరించువారు శివలింగమును వహించు వారనియే తెలియవలెను.

శ్లో॥ ధిగ్భస్మరహితం ఫాలం - ధిగ్గ్రామ మశివాలయం,
ధిగనీశార్చనం జన్మ - ధిగ్విద్యా మశివాశ్రయామ్ ॥

భస్మ లేనట్టినొసలు ద్రష్టవ్యము కాదు. శివాలయములేని గ్రామము నివసింపఁదగినది కా ఈశ్వరారాధనములేని జన్మము వ్యర్థము. శివజ్ఞానములేని యుపాసన సిద్ధింపదు.

మూడులోకములకు నాధారంబగు మహేశ్వరుని, భస్మత్రిపుండ్రధారకుఁడగు మహేశ్వ నిందించువారిని చూచుటయే దోషంబగుననియు అట్టివారు శ్రుతిరుద్రసూక్తములను జపించు

పరిశుద్ధులగుదురనియు భస్మరుద్రాక్ష శివలింగములను తూలనాడువారు నిర్భాగ్యులనియు తెలియవలెను. భస్మరుద్రాక్ష శివమంత్రలింగధారణాత్మకమగు శివయజ్ఞము నందు తాంత్రికుడు నూర్ధ్వపుండ్రధరుఁడు తప్తచక్రాంకితుఁడు నధికారము లేనివారు కాని బృహజ్జాబాలోపనిషదము - శివయజ్ఞమును గురించి యనేకులను ప్రోత్సహించుచున్నది. కావున దైవభక్తి గల ప్రతిమానవుఁడును భస్మరుద్రాక్షాదులను ధరించుట యందు ప్రవృత్తుఁడు కావలసియుండును. మనము బుద్ధిమంతుల మగుదుమేని విభూతిగల నొసట చందనాదుల నలఁదికొనవలదు. ఒకవేళ శ్రీగ్రంధాదులను స్వీకరించునుద్దేశము ఉన్నయెడల భస్మతో కలిపియే ధరింపవలెను.

సువాసినులు (ముత్తైదువలు) భస్మను మూడురేఖలుగా నొసట (వెంట్రుకలవరకు) ధరించి కుంకుమబొట్టు పెట్టుకొనవలెను. బ్రాహ్మణాది ద్విజులును వితంతువులును అటులే అన్ని ఆశ్రమముల వారును సకల పాపనిర్మూలనము అపవర్గ ఫలప్రదంబు నగు భస్మను ధరించియే తీరవలెను.

స్త్రీహత్య; గోహత్య; వీరహత్య; అశ్వహత్య; పరద్రవ్యాపహరణము; పరస్త్రీ గమనము; పరనింద; ఇతరులభూమి నపహరించుట; అకారణముగా నొరులను బాధించుట: పంటలనెత్తి కొనిపోవుట; తోటలఁ బాడుజేయుట; ఇండ్లుకాల్చుట మున్నగు దుష్కృత్యములున్ను; ఆవు, బంగారము, గేదె, నువ్వులు, గొంగడి, వస్త్రములు, అన్నము, ధాన్యము, జలము మున్నగు వానిని నీచులనుండి పరిగ్రహించుటయు; జాలరి వనితలను వేశ్యా స్త్రీలను చండాలతరుణులను శూద్రరమణులను నాట్యకత్తెలను రజస్వలలను పెండ్లికాని కన్యకలను విధవలను పొందుటయు; మాంసము తోలు రసవస్తువులు ఉప్పు అను వానిని అమ్ముటయు; కొండెములు చెప్పుటయు; కపటముగా మాట్లాడుటయు; తప్పుడు సాక్ష్యము, అబద్ధమాడుట; అనునవి మొదలగు వివిధ అసంఖ్యాక పాపములు - పూర్వజన్మములయందు చేయఁబడినవైనను ఈ జన్మలో పొఱపాటున సంభవించినవైనను భస్మత్రిపుండ్రములను ధరించుటఁజేసి తత్కాలముననే నశించును.

లోకమునఁగల సప్తకోటి మహామంత్రములు-శివపంచాక్షరిని పురస్కరించుకొనియే యుండునవి. కోట్లకొలది తదితరమంత్రములు శివోపాసన దార్ఢ్యము నాపాదించునవియేను; ఇంకను ఆ యా దేవతల మంత్రములన్నియు ఆ యా కోర్కెలఁదీర్చునవైనను భస్మ రుద్రాక్షాంకితునకు స్వాధీనములగును. భస్మరేఖలు గలవాడు - తన వంశమున వేయిమంది పూర్వీకులను వేయిమంది తరువాతివారి నధోలోకమునుండి యుద్ధరించును. భస్మధారియగువాడు దీర్ఘవ్యాధులు లేనివాడై సంపూర్ణముగా జీవించి అనాయాస మరణము నొంధును.

శ్రాద్ధమునందు యజ్ఞమునందు జపమునందు హోమమునందు వైశ్వదేవమునందు దేవతాపూజనము నందును భస్మత్రిపుండ్రములఁ దాల్చువాడు అపమృత్యువులను తొలగించుకొనును.

జలస్నానము మేనుమైలను మాత్రము పోగొట్టును - భస్మస్నానమైతేనో బాహ్యాభ్యంతర శుచిత్వము నొదవఁజేయును. మంత్రస్నానమున పాపములు హరించును. ఉపాసనయను పరిశ్రమమునఁజేసి శివసాయుజ్యము చేకూరును.

భస్మధారణములేని దాన జప ధ్యానములు సిద్ధింపవు. వానప్రస్థులు కన్యకలు అదీక్షితులును మధ్యాహ్నమునకు ముందు తడిపినభస్మను తరువాత పొడిభస్మను ధరింప వలసి యుండును. భస్మరుద్రాక్షలులేని జన్మము నిరుపయోగంబగునది.

తలకాయ, నొసలు, చెవులు, కన్నులు, ముక్కు, నోరు, మెడ, రెండుచేతులు మోచేతు చేతిమణికట్టులు, హృదయము, రెండుప్రక్కలు, బొడ్డు, నడుము, తొడలు, చీలమండలు, మోకా పిక్కలు, పాదములు, అను ముప్పదిరెండు స్థానములు – భస్మధారణమునకు ఉత్తమంబులు: శిరస్సు, లలాటము, చెంపలు, కంఠము, భుజములు, మోచేతులు, మణికట్టులు హృదయము, నా పార్శ్వద్వయము, వెన్ను, అను పదునారు చోట్లు మధ్యమంబులు; లలాటము, చెవులు, భుజము హృదయము, గుహ్యము, నాభి, అను నెనిమిది భస్మధారణమునకు విహితస్థానములగుచున్నయవి.

ఇంతియే గాక మస్తకము, బాహువులు, హృదయము, నాభిఁ యను పంచస్థానములు స సాధారణముగా భస్మ ధరింపఁదగినవి. దేశకాలప్రాంతములననుసరించి భస్మను ధరింప వ యుండును. ఉద్ధూళనము త్రిపుండ్రములనైతే తప్పక ధరింపవలెను.

భస్మధారణప్రయుక్త మంత్రములను తద్దేవతలను స్మరింపజాలనివారు "ఓన్నమఃశివాయ" అను శివునిస్మరించుచు భస్మనుధరింపవలెను.

ఇద్ది భస్మమాహాత్మ్యము; రహస్యమైనను శివభక్తా వతంసులగు మీకు చెప్పినవాడనైతిని.

**ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో చతుర్వింశాధ్యాయము.**

## పంచవింశాధ్యాయము

### (రుద్రాక్షాది మాహాత్మ్యము)

మహాప్రాజ్ఞుడవు గొప్పబుద్ధిగలవాడవు శివస్వరూపుఁడవు నగు నో శౌనక మహర్షీ! ఋషులా రుద్రాక్షమహిమను సంగ్రహముగా నాలకింపుఁడని సూతుఁడు చెప్పఁదొడగెను.

శివప్రియతమము పరమపావనంబునగు రుద్రాక్షమును చూచినను తాకినను అద్దానితో జపమ జేశినను పాపములన్నియు హరించును. పరమాత్మయగు శివుఁడు – లోకోపకారార్థమై పార్వతీదే రుద్రాక్షమహిమను వక్కాణించియుండెను.

పార్వతీ! నీయందలి యనురాగమువలనను భక్తులకు హితముఁగూర్ప నుద్దేశించియు చెప్ప బడు రుద్రాక్షమహిమను శ్రద్ధగా నాకర్ణింపుము! వేలకొలది దివ్యవత్సరములు నేను తపస్సుచేయు నొకప్పుడు కనులుతెరవగా నా నేత్రద్వయమునుండి రాలిన జలబిందువులు భూమియందు రుద్రాక్షవృక్షములయ్యెను. భక్తానుగ్రహతత్పరుఁడనై రుద్రాక్షములను చాతుర్వర్ణ్యముఁదగు భక్తుల నొసగితిని. శివప్రియములగు రుద్రాక్షములు – గౌడదేశము నందును మధురాక్షేత్రమున అయోధ్యాపురియందును లంకాపట్టణముననను మలయ పర్వతమునందును సహ్యాద్రియందు కాశీక్షేత్రముననను తదితరపుణ్య ప్రదేశములయందును సహింపనలవిగాని యిడుములను తొలగించున నుద్భవించినవి. రేగిపండంత రుద్రాక్షములు – సుఖసౌభాగ్యములను పెంపొందించును. ఉసిరికా

లంతవి యరిష్టముల నన్నిటిని తొలగించునట్టివి. గురిగింజలంతవి – మనోరథ ఫలముల నన్నిటనిని సాధించునట్టివి. ఎంతెంత చిన్నవియో అంతంత ఫలప్రదములగును. ఒకదానికన్న రెండవది పదిరెట్లు గుణమునిచ్చును. అందువలన దురితములన్ని యొకేపర్యాయము నశింపవలెనన్నచో రుద్రాక్షములనే యథోక్తముగా ధరింపవలసి యుండును. జపమునకు రుద్రాక్షమాలికయే ప్రశస్తంబైనది.

సమానములు, నునుపైనవి, గట్టివి, స్థూలములు, కంటకములతో కూడినవియు నగు రుద్రాక్షములు శుభంకరములై భుక్తి ముక్తి ప్రదములగునవి పురుగులుతొలచినవియు, పగిలినవియు విరిగినవియు కంటకములు లేనివియు వ్రణములతో కూడినవియు గుండ్రగా లేనివియు నగు షడ్విధరుద్రాక్షములను ధరింపఁగూడదు. జపింపఁగూడదు.

తనంతటతాను చేసికొనిన ద్వారముగల రుద్రాక్షము శ్రేష్ఠంబు; పురుషప్రయత్నముతే చేయఁ బడిన ఛిద్రముగలది మధ్యమంబు; రుద్రాక్షలను పదునొండు వందలు ధరించునెడ రుద్రస్వరూపుండగును. అట్టిఫలము నేరికిని చెప్పశక్యముకాదు. 580 శిరోమకుటముగాను 360 రుద్రాక్షములను మూడువరుసలు యజ్ఞోపవీతము గాను ధరింపవలెను. శిఖయందు మూటిని చెవులయందు ఆరేసి రుద్రరాక్షములను అటులే కంఠమున నూటనొక రుద్రాక్షములను భుజములపై మోచేతులయందు మణికట్టులయందును ఆరేసి రుద్రాక్షముల నుపవీతమునందు రుద్రాక్షత్రయమును కటియందు నైదిటిని శివభక్తి రతాత్ములు ధరింపవలసియుండును. ఇట్లు ధరించి ఆసనమున కూర్చుండు తతి యట్టి మహాపురుషుని సందర్శించి శివుఁడని భావించిన వారి పాపములు పటాపంచలగును. ఇఁక కొద్దిభేదముతో సహస్రరుద్రాక్షములైనను ధరింపవచ్చును. శిఖ ౧; శిరస్సు ౩౦; కంఠము ౫౦; బాహువులు ౩౨; మణికట్టులు ౨౪; మూపులురెండు ౫౦౦; మాలిక ౧౦౮; ఉపవీతము ౨౫౫.

మూడవ ప్రకారంబు నాలకింపుడు! శిఖయందొక్కటియు, మస్తకమున నలుబదియు కంఠప్రదేశమున ముప్పదిరెండును ఛాతియందు నూటనెనిమిదియు, చెవులపై నొక్కొక్కటియు బాహువులయందు పండ్రెండును, హస్తములయందు పదునారు పదునారును ధరించువాడు శైవప్రవరుండనియు అట్టివానిని. శివునివలె నమస్కరింపవలెననియు తెలియవలెను. శిరస్సునందీశాన మంత్రముతోడను, చెవులయందు తత్పురుషమంత్రముతోడను కంఠమున హృదయమునందు నఘోరమంత్రముతోడను హస్తముల యందఘోరబీజమంత్రముతోడను ఉదరమున వామదేవ మంత్రముననుు, పదునైదు రుద్రాక్షములు గల మాలిక నొక్కదానిని గాని మూటిని గాని ఐదిటిని గాని యేడిటిని గాని. పంచబ్రహ్మమంత్రములతో ధరింపవలసియుండును.

అథవా మూలమంత్రమగు పంచాక్షరితో రుద్రాక్షముల నన్నిటిఁదాల్పవచ్చును. భస్మ రుద్రాక్షధారులై శివు నారాధించువారు మద్యమాంసములను వెల్లుల్లి, నీరుల్లి, మునఁగకాయ, విరిగికాయ, మున్నగు నిషిద్ధవస్తువులఁదినఁగూడదు. బ్రాహ్మణులకు తెల్లని రుద్రాక్షలు ప్రశస్తంబులు, క్షత్రియులకు ఎరుపువన్నెగలవి శుభప్రదములు. వైశ్యులు – పసుపువన్నెగలవానిఁ దాల్పవలెను. శూద్రులు నలుపైన రుద్రాక్షలను ధరింపవలెను. బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ సన్న్యాసులు తప్పనిసరిగా రుద్రాక్షలను వేసికొనవలెను. అనేక పుణ్యబలమున లభ్యమానంబులగు రుద్రాక్షల నొకవేళ నిర్లక్ష్యముతో ధరింపకుండునెడ నట్టివారికి సమస్తనరక దుఃఖములు సంభవించును. రుద్రాక్షము సూక్ష్మంబుగా నుండుట





శ్రేయస్కరము. చణకప్రమాణము సర్వసాధారణముగా నుపయుక్తంబగునది. ఇద్ది శివలింగస్వరూపము భావింపవలెను. భస్మ త్రిపుండ్రధారులు రుద్రాక్షధారులు జడలఁదాల్చువారును యమలోకమునకు వెళ్లువా గారు.

చివరకు నొక్క రుద్రాక్షమునైన శిరసావహించుచు నొసట భస్మరేఖలఁదాల్చుచును పంచాక్షరి జపించు సాధువులు లోకారాధ్యులగుదు రనుటలో సందియము లేదు.

ఎవని తనువునందు రుద్రాక్షము లేదో ఫాలప్రదేశమున భస్మత్రిపుండ్రములు గానరావో ముఖమునందు పంచాక్షరి యుచ్చరింపఁబడదో నట్టివానిని తనలోకమునకు తీసికొని రండనియు భస్మరుద్రాక్షధారుల ప్రభావమును బాగుగా కనిపెట్టి యవ్వారిని సత్కరింపవలెను గాని యమలోకమునకు తీసుకొని రాగూడదనియు యమధర్మరాజు తన దూతలకు అజ్ఞాపింపగా వారు నటులే ప్రవర్తించుచుందురు గావున నో మహాదేవీ! రుద్రరాక్షము వరమపావనంబైనదనియు రుద్రాక్షధారి దుష్టుండైనను మత్ప్రియుండగుననియు తెలియవలెను.

కనీసము హస్తమునగాని భుజమునందుగాని శిరస్సునందుగాని ఒకేఒక రుద్రాక్షముఁ దాల్చువాడు – ఎట్టివారికైన నవధ్యుండై రుద్రునివలె నంతటను నిర్భయముగా సంచరింపఁ జాలును. రుద్రాక్షములతో మంత్రమును జపించునెడ కోటిరెట్లు అధికఫలంబు, ఇఁక నవ్వానిని ధరించునెడల దశకోటి గుణముగ సుకృతంబు లభించును. రుద్రాక్షము మేననుండు నంతవరకు అపమృత్యువులు కలుగఁజాలవు భస్మత్రిపుండ్రములను రుద్రాక్షలను ధరించి మృత్యుంజయ మంత్రమును జపించువానిని గాంచినంత శివదర్శనఫలము సమకూరును.

విష్ణుభక్తులు దేవీభక్తులును తదితర దైవభక్తులందరును రుద్రాక్షలఁదాల్చవచ్చును. శివభక్తుడైన విశేషించి ధరింపవలసియుండును.

రుద్రాక్షములు పలుతెఱఁగులుండును. అందు ఏకముఖము – భుక్తిముక్తి ప్రదం బగుటయే గాక నసేకశుభముల నొనఁగూర్చునది. అద్దానిని చూచినయెడల బ్రహ్మ హత్యా పాపము నివారించును పూజించినచో లక్ష్మీదేవి దూరముగాదు. ఉపద్రవములు తొలగును. కోర్కెలన్నియు ఫలించును రెండుముఖములు గల రుద్రాక్షము – గోహత్యాపాపమును హరించును. అభీష్టములను నెరవేర్చును త్రివక్త్ర రుద్రాక్షమును పూజించినను ధరించినను సాధింపఁదగిన సత్కార్యములన్నియు సర్వదా సిద్ధించుచుండును. అభ్యసింపఁబడిన విద్యలన్నియు రాణించును. చతుర్ముఖ రుద్రాక్షము – బ్రహ్మస్వరూపమై దర్శనమునను స్పర్శనమునను ధర్మార్థ కామ మోక్ష యోగ్యత నాపాదించుటయేగాక నరహత్యాపాపమును బోకార్చును. పంచవక్త్రము – కాలాగ్ని రుద్రస్వరూపమై చతుర్విధముక్తి నొసగుటయేగాక జీవితకాలమున నభిలషితములనన్నిటి నొనఁగూర్చును. మరియు అగమ్యా గమన అభక్ష్యభక్షణాది పాపములను నశింపఁజేయును. ఆరుముఖములుగల రుద్రాక్షము కార్తికేయస్వరూపమై దక్షిణభుజమునఁ దాల్చుటవలన బ్రహ్మహత్యాది దురితములను పోగొట్టును. సప్తవక్త్రము మన్మథ స్వరూపంబై ధరించుటవలన దారిద్ర్యమునుతొలగించును. అష్టవక్త్ర రుద్రాక్షము – అష్టవసుస్వరూపము భైరవ స్వరూపంబును; అద్దానిని ధరించుటఁజేసి పూర్ణాయుష్యము గలవాడగుటయే గాక దేహాంతమున శివసాయుజ్యము నొందును. నవవక్త్రము భైరవస్వరూపంబు, కపిలముని స్వరూపంబు నవదుర్గ

స్వరూపంబును; వామహస్తమున నద్దానిని ధరించినచో శివసమాన వైభవము కలవాడగును. దశముఖము విష్ణుస్వరూపంబు నద్దానిఁదాల్చువాడు స్వాభీష్టజాతమును ఫలింపఁజేసికొనును. ఏకాదశముఖము - ఏకాదశరుద్రాత్మకంబు, నిద్దానిని ధరించుటఁజేశి సర్వత్ర విజయము చేకూరును. ద్వాదశాదిత్యస్వరూపంబగు ద్వాదశముఖ రుద్రాక్షమును వెంట్రుకల కొప్పునందు ధరించు వాడు సూర్యసన్నిభుండగును. పదిమూడు ముఖములు గల రుద్రాక్షము - విశ్వేదేవతాత్మకమై సౌభాగ్య సౌమంగల్యముల నొనఁగూర్చును. పదునాలుగు ముఖములు గల రుద్రాక్షమైతేనో పరశివస్వరూపంబు. నిద్దానిని శిరసునందిడుకొనినచో పాపములన్నియు పటాపంచలగును.

క్రమముగా నివ్వానిని ధరించు మంత్రములు - ఓం హ్రీం నమః, ఓం నమః, క్లీం నమః, ఓం హ్రీం నమః, ఓం హ్రీం నమః, ఓం హ్రీం హుం నమః, ఓం హుం నమః, ఓం హుం నమః, ఓం హ్రీం హుం నమ, ఓం హ్రీం నమః, ఓం హ్రీం హుం నమః, ఓం క్రాం క్షాం రౌం నమః, ఓం హ్రీం నమః, ఓం నమః.

మంత్రములను పఠింపకుండా రుద్రాక్షములను ధరించు మానవుడు - దర్గతుల పాలగును. భూతప్రేతపిశాచములు, ఢాకినీ శాకినీ శక్తులు, ఇతర ఘాతుకజంతువులు, మంత్ర ప్రయోగాదులును రుద్రాక్షధారిని గాంచి దూరములగును. పరమశివుఁడు, మహావిష్ణువు, జగదంబయు, గణాధ్యక్షుఁడును, సూర్యదేవుఁడు, ఇతర దేవతలందరును రుద్రాక్షధారిఁజూడగానే ప్రసన్నులగుదురు. అందువలన రుద్రాక్షలఁదగు మహిమను బాగుగా గుర్తెరిగి సమంత్రకముగా భక్తులు తప్పక ధరింపవలసియుండును.

ఇవ్విధము సదాశివుఁడు - భుక్తిముక్తిప్రదంబైన భస్మ రుద్రాక్ష మాహాత్మ్యమును నుడివెను. భస్మరుద్రాక్షధారనులుభయులును శివునకు నత్యంతప్రియులగుదురు. భస్మరుద్రాక్ష ధారియై పంచాక్షరీ మంత్రమును జపించువాడు సంపూర్ణముగా శివభక్తుడు కాదగును.

**శ్లో॥ వినా భస్మత్రిపుండ్రేణ - వినా రుద్రాక్షమాలయా,**
**పూజితోఽపి మహాదేవో - నాభీష్ట ఫలదాకయః ॥**

భస్మమునొసట మూడురేఖలుగా ధరింపనిది, రుద్రాక్షమాలను కంఠమున దాల్పనిది శంకరుని పూజించినను భక్తుని వాంఛలు నెరవేరజాలవు కావున భస్మరుద్రాక్షములను ధరించియే పరమేశ్వరు నారాధించుట శ్రేయస్కరమని తెలియవలెను.

సర్వకామ సమృద్ధిఁగలుగఁజేయు భస్మరుద్రాక్ష ప్రభావమును మీ ప్రశ్ననను సరించి వక్కాణించితిని. శుభప్రదమైన నిద్దానిని భక్తితో వినినవానికిని కామితంబులన్ని యీడేరును. అట్టివాడు జీవితమున్నంతవరకు సర్వవిధసుఖంబులనుభవించుటయేగాక పుత్ర పౌత్రాది వంశవృద్ధిగలవాడై ముక్తుడై శివప్రియుండగును.

మునీశ్వరులారా! ఇది విద్యేశ్వర సంహిత; శివశాసనమునను సరించి వినువారికి కల్యాణము నొనగూర్చునదై శివజ్ఞానమును ప్రసాదించును. అని సూతుఁడు విరమించినవాడు.

**ఇయ్యది శివమహాపురాణమునందు మొదటిదగు సాధ్యసాధనఖండమనఁ దగిన**
**"శివ విద్యేశ్వర సంహితలో విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ**
**ఆంధ్రానువాద ప్రవచనముతో పంచ వింశాధ్యాయము, సర్వంబు సమాప్తంబు.**





# రుద్ర సంహిత

## సృష్టి ఖండము

## ప్రథమాధ్యాయము

(శక్తి విశిష్ట శివుని గురించి ప్రశ్న)

ప్రార్థన

శ్లో॥ విశ్వోద్భవ స్థితిలయాదిషు హేతుమేకం
గౌరీపతిం విదితతత్త్వ మనంతకీర్తిమ్ ।
మాయాఽఽశ్రయం విగతమాయ మచింత్యరూపం
బోధస్వరూప మమలం హి శివం నమామి ॥

ప్రపంచము పుట్టుటకు మనుటకు గిట్టుటకు భద్రముగా నుండుటకు ముక్తమగుటకు నేకైక కారణమగువాడు, గౌరీపతియు, భక్తులకు సాక్షాత్కరించువాడును, అవధిలేని కీర్తి గలవాడును, మాయక అనcగా ఇచ్ఛాజ్ఞాన క్రియాస్వరూపిణియగు శక్తికి ఆశ్రయమగు వాడును, మాయాబంధములేనివాడ నవాఙ్మానసగోచరుండగుటచే నూహింపనలవిగాని స్వరూపము గలవాడును అణవ మాయిక కార్మిక మలములు లేని వాడును, జ్ఞాన స్వరూపుcడునగు శివుని నే నమస్కరించుచున్నాను.

శ్లో॥ వందే శివం తం ప్రకృతే రనాదిం ప్రశాంత మేకం పురుషోత్తమంహి
స్వమాయయా కృత్స్నమిదంహి సృష్ట్వా - నభోవదంత ర్బహి రాస్థితోయః ॥

ప్రకృతిని మించినవాడును, ఆది మధ్యాంతరహితుcడును, సమస్తదోషకళంకములు బొత్తిగా లేనివాడును, తనతో సమానుcడగు రెండవవాడు లేనివాడును, పురుషునికన్న నధికుండును, తన శక్తి వశమున జగమునంతయు సృష్టించి యందు ఆకసమువలె నంతర్బహిస్సులందు నిండియుండువాడును లోకవేదప్రసిద్ధుcడునగు శివునకు నభివాదముcజేయుచున్నాను.

శ్లో॥ వందేఽంతరస్థం నిజగూఢరూపం - శివం స్వతః స్రష్టు మిదం విచష్టే ।
జగంతి నిత్యం పరితో భ్రమంతి - యత్సన్నిధౌ చుంబకలోహవత్తమ్ ॥

నిగమాగమ రహస్యము, హృదయగతము, నగు శివస్వరూపమును ధ్యానించుచున్నాను. కూటస్థముగా నిద్దాని నవలంబించి ప్రకృతిపురుషులు బ్రహ్మాండమును నిర్మించుచున్నవారు. అనcగా శివసంకల్పమాత్రమున ప్రపంచము తనంతటతానే విస్తరించునని భావము.

శ్లో॥ జగతః పితరం శంభుం - జగతో మాతరం శివామ్ ।
తత్పుత్రంచ గణాధీశం - నత్వైత ద్వర్ణయామహే ॥

ప్రపంచమునకు జననీజనకులైన పార్వతీశంకరులను అవ్వారి తనయుండగు వినాయకుని నమస్కరించి యీ రుద్రసంహితను వక్కాణించువారము.

## ఉపక్రమము

ఒకప్పుడు నైమిషారణ్యనివాసులగు శౌనకాది మహర్షులు నిండు భక్తితో సూతమహర్షిని దిగువ విధము ప్రశ్నించిరి.

సాధ్యసాధనఖండమనఁదగు విద్యేశ్వరసంహితను భక్తవత్సలుడైన శివునికి ప్రియములగు భస్మరుద్రాక్షధారణానదులతో కూడినదిగా వినిపించితిరి. ధన్యులమైతిమికాని నీ ముఖాంభోజమునుండి వెలువడు జ్ఞానామృతమును గ్రోలి తృప్తిఁజెందని వారమై మరియొక శైవాంశము నాకర్ణింపవలెనని కుతూహలము కలిగియుంటిమి. వ్యాసులవారి యనుగ్రహమున సమస్తమును తెలిసికొని నీ జన్మ – సార్థకముఁజేసికొనినవాడవు. ప్రాజ్ఞుడా! సర్వోత్తమంబైన శివస్వరూపమును గౌరీశంకరుల దివ్యచరిత్రంబులను విశదీకరింపుము!

మహేశ్వరుడు సగుణుఁడు నిర్గుణుఁడు నగుట యెట్లు? శివతత్త్వపరిజ్ఞానము మేమందరము కలిగియుండవలెనని కోరుచున్నాము. సృష్టికిమున్ను పరమేశ్వరుఁడెట్టి స్వరూపము గలవాడు? సృష్టిలో శివుఁడెట్లు విహరించును?

ప్రళయమున సదాశివుఁడెట్టివాడు? లోకశంకరుఁడైన మహేశ్వరుఁడు ఎవ్విధము ప్రసన్నుఁ డగును? ప్రసన్నుడై ఏలాంటి సత్ఫలములను భక్తులకు తదితరులకు నొసగును? దయానిధియగు శంకరుఁడు తత్కాలముననే ప్రసన్నుండగుననియు, భక్తుల యిడుములను చూడఁజాలడనియు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురును శివాంశమువలన జన్మించినవారనియు అవ్వారిలో మహేశుఁడు శివుని పూర్ణాంశము గలవాడై రెండవశివుఁడుగా పేర్కొనఁబడుచున్నాడనియు, వినియున్నాము. అట్టి మహేశ్వరుని యావిర్భావమున విశేషించి తచ్చరిత్రమును ఆదిశక్తి యావిర్భావమును గౌరీశంకరుల కల్యాణమహోత్సవమును ఉమామహేశ్వరుల దాంపత్య జీవనమును అటులే నవ్వారి శుభలీలలను తదితరమునంతయు వివరింపుమని శౌనకాదులు ప్రశ్నింపగా సూతుఁడు శివుని పాదకమలములను స్మరించి చెప్పనారంభించెను.

ఋషులారా? మీరడిగినది సమంజసంబు; సదాశివుని పావనచరితమునందు మిగుల ఆసక్తి జనించుటచే ధన్యులగుచున్నారు. మీకేగాక ప్రపంచమున పురుషులకు స్త్రీలకు నియ్యది పరమపావనంబగునది. మరియు ప్రశ్నించువారిని చెప్పువారిని వినువారిని గంగోదకమువలె పునీతులఁ జేయును.

ద్విజమాత్రుండెవఁడును మహేశ్వరుని దివ్యచరితము నందు విరక్తిఁబొందజాలడు. ఒకవేళ నట్టి విరాగము కలిగినచో వాడు అధముండే యగును. రాగద్వేషాది రహితులై శమదమాదిసంపత్తిగల మహానుభావులు శివచరితమును గానముఁజేయుచు మోక్షసామ్రాజ్య పట్టభద్రులగుచున్నారు. శంకరుని దివ్యలీలలు వినినకొలది వినవలె ననిపించును. మనస్సు నానందపఱచును. సర్వాభీష్టముల నీడేర్చును.

మీరు ప్రశ్నించినట్లుగానే శివ సంకల్పము ననుసరించి నారాయణుఁడు ప్రేరేపింపగా నారదమహర్షి – తనతండ్రియగు బ్రహ్మదేవు నొకప్పుడడిగియుండెను. అంత శివభక్తుండైన చతుర్ముఖుడు ప్రసన్న

మానసుండై తన కుమారుని సంతసింపఁజేయుచు పార్వతీశంకర విలాసముతో కూడిన దివ్య చరిత్రమును వక్కాణింప నారంభించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వము" అను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములతో ప్రథమాధ్యాయము.

## ద్వితీయాధ్యాయము

### (నారద తపోభంగమునకు ఇంద్రుఁడు మన్మథుని పంపుట)

ఒకానొక సమయమున మునిసత్తముఁడగు నారదుఁడు – వినయము గలవాడై తపంబు తలపెట్టి యెల్లకాలము చెంత ప్రవహించు గంగానది గల పరమశోభనమైన హిమాలయ పర్వతగుహకు చేరువగా నానావిధసౌకర్యములు గల నొక ఆశ్రమము నందు చిరకాలము తపంబు గావించుచుండెను. దృఢమైన పద్మాసనమునందు శుద్ధమైన అంతఃకరణముతో మౌనమును వహించి ప్రాణాయామము నాచరించి "సో஽హం" జ్ఞానము గలవాడై శివానుసంధానమును చేయుచుండెను.

ఇట్లు చేయఁబడు నారదుని తపంబు గాంచి దేవేంద్రుఁడు – ఈ నారదుఁడు నా స్వర్గ రాజ్యము నపహరించుటకే తపించుచున్నాడని – భావించి తపోవిఘ్నముఁజేయఁదలచి తన చిత్తములో మన్మథుని స్మరింపగా నాతడు వేగమే ఇంద్రుని సన్నిధానమునకు నేతెంచెను. అంత స్వార్థపరుఁడైన అమరాధిపతి – మన్మథుని సంబోధించుచు దిగువవిధము వ్రాక్కుచ్చెను.

మిత్రుడా! గొప్పవీరుడవు. నిరంతరము నాకు మేలు చేయువాడవు. నాకిప్పుడొక సహకారము నీ వలన కావలెను. స్నేహముతో నాలకింపుము! నీ బలము నాశ్రయించియే పూర్వము అనేక తాపసుల తపోగర్వమును పారద్రోలితివి. వేయేల! చెలికాడా! నీ యనుగ్రహము వలననే నా స్వర్గరాజ్యము ఇతరులకు సంక్రమింపకుండా నెలకొనియున్నదని చెప్పవచ్చును.

శ్లో॥ హిమశైల గుహాయాం హి - మునిస్తపతి నారదః ,
మనసోద్దిశ్య విశ్వేశం - మహాసంయమవాన్ దృఢః ॥

నారదమహర్షి – హిమవత్పర్వతముఁజెందిన యొకానొక గుహయందు విశ్వేశ్వరుని మనస్సునందిడుకొని గొప్ప నిగ్రహము కలవాడై గట్టి పట్టుదలతో తపించుచున్నవాడు. ఐతే తపస్సు సిద్ధించినపుడు నా రాజ్యము నధిష్ఠింప గలడేమోయని అనుమానించుచున్నందున నీవు ఈ వేళనే అచటికివెళ్లి తపోవిఘ్నము నాచరింపవలెనని కోరుచున్నాను.

ఇట్లు మహేంద్రునిచే, ఆజ్ఞాపింపఁబడిన మన్మథుఁడు – గర్వవశమున నారదుఁడు తపించు స్థలమునకు వసంతుని తోడ్కొని వెళ్లి తన విలాసము నంతయు చూపెట్టెను. వసంతుఁడును నానావిధ ప్రభావముఁగనపఱచెను. ఐనను మహేశ్వరుని యనుగ్రహమునఁజేశి నారదుని హృదయము, వికారము నొందలేదు. కాముని గర్వము అణగినది. పూర్వము ఇదే చోటున శంకరుఁడు తపస్సు చేశియుండుటచే





నిచటనే మునితపో విఘాతకుఁడగు మన్మథుఁడు శంకరుని ఫాలాగ్నిచే దహింపఁబడుటవలనను మన్మథుని ప్రభావము వ్యర్థమైనది. మరియు శివానుగ్రహము నారదునియందు ప్రసరించుటయు మన్మథవికారము కలుగకుండుటకు కారణంబని తెలియవలెను.

కామదహనానంతరము తన భర్తను గోలుపోయిన రతీదేవి ప్రార్థింపగా ముందు నొకానొక సమయమున నీ పతి జీవించుననియు నే తపంబాచరించినచోట నెప్పుడును మన్మథుని బాణములు ఉపయోగింపవనియు శంకరుఁడు శాసించియుండెను. ఇట్టి శివశాసనమువలన మన్మథుఁడు వితథమనోరథుండై మహేంద్రుని చెంతఁజని జరిగినదంతయు విన్నవించి స్వకీయనివాసమునకుఁజనెను.

దేవేంద్రుఁడు శివమాయాప్రభావమున మోహితుడై పూర్వవృత్తాంతమును గురుతెఱుగనివాడగుటచే నారదుని సామర్థ్యమనుకొని యాతనిని ప్రశంసించెను. ఇంద్రుఁడే కాదు లోకమున ప్రాణులందరును శివమాయామహిమను తెలిసికొనఁజాలరు. ఆత్మార్పణముఁజేసిన భక్తుఁడు మాత్రము కనుగొనఁజాలును. ఇట్టి మాయయే చరాచరము నంతయు మోహింపఁజేయుచున్నయది.

అట్లు కొంతకాలము నారదుఁడు తపించి తన తపస్సు పూర్ణంబైనదని విరమించినవాడు. కాముని జయించుట తనదే యనుకొని గర్వితుఁడై శివమాయాప్రభావమున విజ్ఞానమునంతయు గోలుపోయెను.

శ్లో॥ ధన్యా ధన్యా మహామాయా - శాంభవీ మునిసత్తమాః ।
తద్గతిం నహి పశ్యంతి - విష్ణు బ్రహ్మాదయోఽపి హి ॥ 28

శంకరుని మహామాయ మిగుల సమర్థంబగునది. ఋషులారా? ఏమని చెప్పవలెను? బ్రహ్మవిష్ణువులు మొదలగువారే శివమాయావిలాసమును బాగుగా గురుతెఱుగకుందురు. అట్టి మాయవలన మోహితుండై నారదుఁడు కైలాసమునకు వెళ్లి శంకరునికి నభివాదనముఁజేశి-తాను స్మరంజయుడననియు స్వతంత్రుడననియు మహాత్ముడననియు లోలోన భావించుచు తన తపోవిజయవృత్తాంతమును సగర్వముగా నివేదించెను.

నాయనా? నారదా? నాకు చెప్పినట్లుగా నేరికిని వక్కాణింపకుము! విశేషించి నారాయణునికైతే ఈషణ్మాత్రము చెప్పవలదు. ఒకవేళ హరి పదేపదే నిన్నడిగినను చెప్పరాదు. అతిరహస్యము నీ తపోవృత్తాంతంబని భావింపుము. నాకు ప్రియతమ భక్తుఁడవని యింతగా తెలుపవలసివచ్చినదని శంకరుఁడు వచింపగా నారదుఁడు మాయామోహవశమున శివభాషితమును హితముగా తలంపనివాడై కర్మగతి - గొప్ప విజ్ఞానులకు ననివార్య మగుటఁజేసి బ్రహ్మలోకముఁజని బ్రహ్మదేవుని నమస్కరించి నిజవృత్తాంతమును చెప్పియుండెను.

ఇదియే శాంభవీమాయ యనియు శివేచ్ఛయనియు పేర్కొనంబడుచున్నయది. అంత చతుర్ముఖుఁ డద్దాని నంత యాలకించి శివపాదాంబుజముల నొకతూరి స్మరించి కామవిజయ కారణమును గురుతెఱిగినవాడగుటచే శంకరునివలె తానును నారదుని స్వతపో విజయకథనము నుండి నివారించెను.

పిమ్మట నారదుఁడు - సహజముగా జ్ఞానిసత్తముండైనను దైవవశమున మదగర్వదూషితుఁడై వైకుంఠముఁజేరునపుడు ముందుగానే నారాయణుఁడు గాంచి స్వపీఠమునుండి లేచినవాడై ఎదురేగి

నారదుని కౌగలించుకొని యొకపరి శంకరుని పాదకంజములను స్మరించియు తన యాసనమున కూర్చుండఁజేశి దిగువవిధము సంభాషించెను.

నాయనా! ఎక్కడినుండి వచ్చుచున్నావు? ఎందుకేతెంచితివి? ఎటులైనను ధన్యుడవేను. నీ రాకవలన నేను పవిత్రుఁడనైతిని. ఇట్లు కేశవుని వాక్యము నాలకించి పూర్వాధీక గర్వము గలవాఁ నేనేగొప్పవాడనను అహంభావముతో తన తపోవృత్తాంతము నంతయు నారదుఁడు వచింపగా శివపాదాంబుజస్మరణవశమున నారాయణుఁడు నారదుని తపోవిజయమునకు గల కారణమును కనుగొని శైవులలో నగ్రగణ్యుఁడైన కతన రెండుచేతులు జోడించి నతమస్తకుఁడై "శివుఁడు నా యంతర్యామి" యను దృఢభావనతో శంకరుని క్రింది విధము ప్రార్థించెను.

శ్లో॥ దేవదేవ మహాదేవ - ప్రసీద పరమేశ్వర ।
ధన్యస్త్వం శివ ధన్యా తే - మాయా సర్వవిమోహినీ ॥ 48

దేవతలలో దేవుఁడైన మహాదేవుఁడా? పరమేశ్వరా! అనుగ్రహింపుము! సమస్తంబును చేయుటకు చేయకుండుటకు మరియొకవిధముగా చేయుటకును సమర్థుండవు. బ్రహ్మాదులగు మమ్మందరను మోహింపఁజేయు నీ మాయయు కడు సమర్థంబైనది.

ఇత్యాది శివస్తోత్రమును గావించి తన పుండరీకాక్షములను ముకుళించుకొని క్షణకాలము పరమాత్మయగు శివుని ధ్యానించి శంకరుని చేష్టితము నంతయు తెలిసికొని "తపోనిధీవగు నీకు ధన్యుడవు. ఎవనికి త్రికరణశుద్ధంబగు శివభక్తి లేకుండునో అట్టివానికే సమస్త దుఃఖముల నొసగునట్టి కామమోహాది వికారములు సంభవించును. నీవైతేనో నైష్ఠిక బ్రహ్మచారివి; జ్ఞానవైరాగ్యసంపన్నుఁడవు; జన్మమొదలుకొని యెట్టి వికారములు లేనివాడవు, కావున నీకు కామవికార మెట్లు కలుగును?" అని నారదుని ప్రశంసింపగా నారదుఁడు నారాయణుని హృదయమున నభినందించి అట్టహాసమును చేయుచు "నీ యనుగ్రహ ముండవలెను కాని నా ముందు కాముఁడెంతటివాడు? అని మాత్రము వక్కాణించి యటనుండి యథేచ్ఛముగా పయనించిన వాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ద్వితీయాధ్యాయము.

# తృతీయాధ్యాయము

## (నారదమహర్షి - కన్యాస్వయంవరమునకు వెళ్లి యచట నవమానింప(బడుట)

సూతుఁడు వక్కాణించుచున్నవాడు.

నారదుఁడట్లు తన యిష్టము వచ్చినట్లు చనుచుండ - మాయావిశారదుండైన విష్ణువు - శివసంకల్పము ననుసరించి మార్గమధ్యమున శతయోజన విస్తీర్ణంబు, అద్భుతము, సుమనోహరము, నానావస్తువిరాజితము, స్త్రీలు పురుషులు విహరించునదియు వైకుంఠ వైభవమును మించిన వికాసము గలదియు, హృదయరంజకంబు నగు ఒకానొక నగరమును నిర్మింపఁజేశినవాడు. అందు శీలనిధి యను మహారాజు గొప్ప ఐశ్వర్యము గలవాడై తన కుమార్తెఁదగు స్వయంవర మహోత్సవమును చేయుచుండెను. అట్టి స్వయంవరములో పాలుగొనుటకు నలుదిసలనుండి రాజనందను లనేకులు వస్త్రాలంకారభూషితులై యేతెంచినవారు. అట్టి అపూర్వ పత్తనమును నారదుఁడవలోకించి మోహముఁ జెంది నగరములో ప్రవేశించి స్వయంవర స్థలమునకు వెళ్లగా శీలనిధి యను రాజన్యుఁడు రత్నసింహాసనమునందు నారదుని కూర్చుండఁజేశి షోడశోపచారములతో పూజించి శ్రీమతి యనంబడు తన కన్యకను నారదుని పాదముల చెంత సాగిలఁబడఁజేసెను. అట్టితతి నారదుఁడు రాజకన్యఁదగు రూపలావణ్యములను గాంచి విస్మితుండై రతీదేవితో సమానురాలైన ఈ కన్యక ఎవరని ప్రశ్నింపగా శీలనిధి "ఈమె నా కుమార్తె" యని కృతాంజలియై విన్నవించి ప్రస్తుతము వరు నన్వేషింప స్వయంవరమున కియ్యకొని యున్నదనియు శ్రీమతిఁదగు భాగ్యమును జాతకవిశేషములను ఎట్టి వరుని పొందునది చెప్పుడనియు నారదుని ప్రశ్నించెను. అంత నారదుఁడు మహారాజా! నీ కుమార్తె మంచి లక్షణములన్నియు గొప్ప భాగ్యంబును కలదై లక్ష్మీదేవివలె గుణవంతురాలగుటయే గాక వీరుడును సర్వవ్యాపకుఁడు నేరికిని లొంగనివాడును మన్మథుని జయించినవాడును దేవతాసార్వభౌముఁడు నగు సర్వేశ్వరుని భర్తగా బడయగలదని శీలనిధి రాజునకుఁజెప్పి శివమాయా ప్రభావ వశమున కామమోహితుడై యటనుండి బయలుదేరి మార్గమధ్యమున - స్వయంవరమున నీ కన్యక నెట్లు పొందఁగలుగుదునని చింతించుచు లోకములో పురుషుల సౌందర్యముఁబట్టి యవ్వారిని స్త్రీలు వరింతురని తలచి సుందరాకారుఁడగు విష్ణుదేవుని స్వరూపమును పరిగ్రహింప నిచ్చగించి స్మరబాణ ప్రపీడితుడగుటఁజేశి వెనుకముందు విచారింపక వైకుంఠమునకుఁజని హృషీకేశుని నమస్కరించి "రహస్యముగా నీతో మాటలాడ వలసియున్నదని" తెలిపి అటులే యని యంగీకరించిన కేశవునికి దిగువవిధము విన్నవించెను.

శీలనిధి యను మహారాజు - నీ భక్తుండు కలడు. ఆతడు - విశాలనయనములు కలదియు రూపలావణ్య సంపన్నయు నగు శ్రీమతి యను తన కుమార్తెకు స్వయంవరమును తలపెట్టియున్నవాడు. అట్టి స్వయంవరమున జగన్మోహినియు అతిలోకసుందరియు నగు శ్రీమతిని నేను వివాహ మాడఁ గోరుచున్నాను. ఇందుకు నీ రూపమును ప్రసాదింతు వేని యామెను పొందగలుగుదును. నీ రూపమే లేకున్నచో ఆమె నన్ను వరింపఁజాలదు. నీ సేవకుఁడను ప్రియుడను కావున నన్ననుగ్రహింపుమని ప్రార్థించినంత హరి యొకపరి హసించి శంకరుని విలాసమిది యని భావించి కారుణ్యముతో నిట్లు వక్కాణించెను.



రోగార్తునకు వైద్యశిఖామణి వలె నాకు మిక్కిలి ప్రియుఁడవు గావున యథేష్ట స్థలమునకు వెళ్లుము నీకు ప్రియమును చేకూర్తును. అంత నారాయణుఁడు నారదునికి వానరముఖమును మిగత స్వరూపము నను గ్రహించి యంతర్ధానముఁజెందినవాడు. ఇట్లు నారదుఁడు హరిరూపమును గలిగితిని గదా యని లోలోన మురియుచు తన్ను కృతార్థునిగా భావించుచుండెను. కాని శ్రీహరి గావించు మోసమును కనుగొనఁజాలకుండెను. పిమ్మట మహర్షి రాజరాజులచే సామంతులచే నిండియున్న స్వయంవర సభలో నొకానొక పీఠముపై నాసీనుఁడై "రాజకన్యక నన్నే వరించు" నని నిశ్చయించుకొను ఇట్టి నారదుని రెండు తెఱంగులు గల రూపము నెవరును గుర్తింపకుండిరి. ఇంతలో శివాజ్ఞావశమున రుద్రగణము లిరువురు బ్రాహ్మణరూపధారులై మునికి నిరువంకలఁగూర్చుండి నారదుని వికృతముఖమును గురించి ముచ్చటించుచు ఈ నారదుని శరీరము కంఠమువరకు విష్ణువుదైనను ముఖము వానర వదనమును బోలినదనియు రాజకన్యక నీతడు కామాతురుడై వ్యర్థముగా నభిలషించుచున్నవాడని పరిహసించుచుండిరి. ఐన నవ్వారి మాటలఁబరికింపక మోహవశమున శ్రీమతిని గురించి తలపోయుచుండెను.

ఇంతలో నంతఃపురమునుండి శ్రీమతి – చెలికత్తెలు వెంట వచ్చుచుండ సువర్ణపుష్పమాలిక హస్తమునందిడుకొని స్వయంవర సభలోని కేతెంచి లక్ష్మీదేవివలె ప్రకాశించుచు సభనంతయు సంచరించు తన యింపైన వరు నన్వేషించుచుండెను.

అట్టితతి వానరముఖుండైన నారదుని గాంచి కోపగించుకొని యాతనిపైనుండి చూపుమరల్చు యటనుండి వేగమే తొలగినదై స్వాభీష్టవరుని పొందఁజాలక లోనికి వెళ్లి తత్తఱ పాటుఁజెందుచుండె ఇంతలో శ్రీహరి – మహారాజవేషమున నటకేతెంచగా నచటివారందరు నా కపటవేషధారిని తెలిసికొన జాలకుండిరి. కేవలము శ్రీమతి యతని నవలోకించి ప్రసన్న వదనాంబుజయై సువర్ణమాలిక కంఠమునందు సమర్పించినందున శ్రీమతిని తోడ్కొని వైకుంఠమునకు నారాయణుఁడు వెళ్లినవాడయ్యె రాజకుమారులందరును శ్రీమతిని గురించి హతాశులై తమతమ నివాసములకు జనిరి. నారదమునియైతే మిగుల వగచుచు మన్మథావస్థ ననుభవించుచుండెను.

నారదా? నీవు వ్యర్థముగా కామాతురుడవై శ్రీమతిఁబడయఁగోరితివి. ఒకతూరి నీ ముఖ నద్దమున చూచుకొనుమని రుద్రగణములు వచించినందున ఆదర్శమునందు తన ముఖము నవలోకించి వానరముఖంబని తెలిసికొని మోహమునఁజేసి రుద్రగణములారా? మీరు బ్రాహ్మణవేషమున నన్ను పరిహసించితిరి గావున బ్రాహ్మణ బీజమున రాక్షసులై జన్మింతురు గావుత! అని శపింపగా నవ్వారు ఇది యంతయు శివేచ్ఛావిలసితం – బని తలపోయుచు మునికేమియు బదులు చెప్పక కైలాసమునకు వెళ్లినవారైరి.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను తాంకలీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో తృతీయాధ్యాయము.**

# చతుర్థాధ్యాయము

## (నారదుఁడు వైకుంఠమునకుఁజని విష్ణువును శపించుట)

శివేచ్ఛాబలమున నారదమహర్షి - ప్రబుద్ధుఁడు గాక నసహ్యమైన క్రోధముఁజెంది వైకుంఠమునకుఁ జని మండుచున్న అగ్ని హోత్రమువలె నుగ్రుడఁగుచు దుర్భాషణములతో నిట్లు ప్రవచించెను.

అరె? నారాయణా? గొప్ప దుష్టబుద్ధి గలవాడవు. కపటివి, ప్రపంచము నంతయు మోహింపఁ జేయుమోసగాడవు. ఇతరుల కుతూహలము నోర్చువాడవు కావు. మలినచిత్తమున మాయప్రభావమును చూపెట్టుచుందువు. ఇంతియే గాక పూర్వము మోహినీరూపముఁదాల్చి రాక్షసులను వంచించి దేవతల కమృతంబు నిడలేదా? శంకరుడే విషమును త్రాగకుండినచో నీ మాయయంతయు మట్టి పాలయ్యేడిది. నీ నడత యంతయు కపటముతో నిండియుండును, మంచి స్వభావము కలవాడవు కాదు. పరమేశ్వరుఁడు నిన్ను స్వతంత్రునిగా ఎందుకు పెట్టించెనో బోధపడుట లేదు. పరమాత్మయగు శివుఁడు నీకు తన ప్రభావమును ప్రసాదించుట పాడిగాదని తోచెడిని. అందువలననే సర్వోత్తముండగు సదాశివుఁడు నీ కపటగతి నంతయు కనుగొని బ్రాహ్మణుఁడే సర్వాధికుండని స్వప్రోక్త నిగమాగమాది ప్రమాణముల ననుసరించి చెప్పవలసి వచ్చెను. నేనును నీ కపటకృత్యము నెరింగినవాడ నగుటచే శివానుగ్రహబలమున నిన్ను శిక్షించుచున్నాను. ఇకముందెప్పుడు నిట్టి దుష్కార్యము నాచరింపకుండునట్లు శాసింతును. ఇంతవరకు నెవఁడును నిన్ను శాసింపలేదు కావుననే ఎట్టి భయము లేనివాడవై యుంటివి. ఇప్పుడు స్వకృతకర్మఫలము ననుభవింతువు. ఒకానొక సుందరి కొరకు నన్ను ఏరూపముతో మోసగించితివో అట్టి రూపముతోడనే మానవుడవై జన్మింతువు గాత! వానరముఖము నొసగితివి. కావున నా వానరులే నీకు సహకరింతురు గాత!

మానవజన్మము భార్యావియోగ దుఃఖము ననుభవించుచు సామాన్యమానవుని వలె ప్రవర్తింతువు గాత!

ఇవ్విధము నారదుఁడు శపించినంత శ్రీపతి - శాంభవీమాయను ప్రశంసించుచు శాపమును పరిగ్రహింపవలసినవాడయ్యెను. తరువాత పరమేశ్వరుఁడు - అంతవరకు నారదునిపై ఆవహింపఁ జేశిన మాయాశక్తిని తొలగించినందున నాతడు పూర్వమువలె సుబుద్ధి గలవాడై విస్మితుండగుచు తెలివిఁ దెచ్చుకొని పశ్చాత్తాపముఁజెందుచు తనను తాను నిందించుకొనెను. మరియు శివుని మాయామహిమను కొనియాడెను. వైష్ణవప్రవరుఁడగు నారదుఁడు - విష్ణువుఁదగు పాదములపై సాగిలపడి - దుష్టబుద్ధి గలవాడనై నీకొసగిన శాపంబును రిత్తఁజేయుము! నా దురుక్తులను మన్నించుము! గొప్ప దురితము నాచరించినవాడ నగుటచే నరకములఁబొందుదును. ఇట్టి దోషములన్నియు తొలగుటకై చేయవలసిన ఉపాయ మెద్దియో నాదేశింపుడు! అని ప్రార్థించి మరల నొకసారి విష్ణుపాదములకు సాష్టాంగములను సమర్పించెను. ఇట్లు పశ్చాత్తాపముఁజెంది ప్రసన్నుండైన నారదుని తన చరణములపై నుండి లేపి మునివరా! నా భక్తులలో నగ్రేసరుండ వనుటలో సందియ మిసుమంతయు లేదు. నీకు ఎట్టి నరకంబును సమకూరదు. సదాశివుఁడు మేలొనఁగూర్చు గాత! ఐతే కామవిజయమువలన కలిగిన మదముచే



మోహితుడవై శివుని వాక్యమును ధిక్కరించితివి. గావున సకలకర్మ ఫలప్రదాతయగు నా మహాదేవుడు నీకిట్టి ఫలము నొసగినవాడు. సమస్తంబును శివేచ్ఛావశముననే జరిగినదని నిశ్చయబుద్ధి కలి శంకరభగవానుడు భక్తుల గర్వమును తత్కాలముననే పోగొట్టునని భావింపుము! మరియు శివుడు పరబ్రహ్మమనియు పరమాత్మయనియు సచ్చిదానంద ఘనుండనియు ప్రాకృత గుణములు వికారంబులు లేనివాడనియు సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించినవాడనియు వస్తుతఃస్వకీయయగు మాయ నధిష్ఠి రజస్సత్త్వతమోగుణములను పురస్కరించుకొని బ్రహ్మ విష్ణు -రుద్రస్వరూపములు గలవాడగుననియు మూలతత్త్వమున శివుడుగాను పరమాత్మగాను మహేశ్వరుడుగాను పరబ్రహ్మముగాను అవ్యయుడుగా అనంతుడుగాను మహాదేవుడుగాను పేర్కొనంబడుననియు ఆతని శుశ్రూషవలననే బ్రహ్మదేవుడు సృష్టి నేను పాలనమును రుద్రరూపమున తానే సంహారమును చేయుచున్నామనియు స్వయముగా సర్వసాక్షి మాయావిశిష్టుడై స్వతంత్రుడై లీలావిహారపరాయణుడై భక్తుల ననుగ్రహించువాడనియు తెలిసికొనుమ

ఇక సుఖప్రదంబును సర్వపాపాపహంబును భుక్తి ముక్తి ప్రదంబు నగు మంచి ఉపాయము వక్కాణించుచున్నాను వినుమని నారాయణుడు చెప్పదొడగెను. నీలోని సంశయమునంతయు తొలగించుకొని శంకరుని సచ్చరితమును గానముజేయుచు అనన్యభక్తితో శివాష్టోత్తరశతనామ స్తోత్రము పఠింతువేని నీ తప్పులన్నియు సమసిపోవును. నారదా? నీ యందలి యనురాగముచే ఇందలి రహస్యము నుడువుచున్నాను. అవధరింపుము? ఇందుకై నీవు దుఃఖింపవలసిన యవసరము లేదు. నిజము విచారించినచో నీవేమియు గావింపలేదనియే చెప్పవచ్చును. శంకరుడే తన యిష్టానుసార గతమునంతయు నొనర్చినవాడు. నీ విజ్ఞానము నంతయు నపహరించి నీ ద్వారా నాకు శాపము నిప్పి స్వమహిమను లోకమున చాటినవాడు. నాకు శివునితో సమానుడైన ప్రభువుగాని అప్పుడుగా మరియొకడు లేకున్నవాడు. అన్ని వేళలయందు వలయు సామర్థ్యము నాతడే ప్రసాదించుచుండు ఆతనినే శరణుబొందుము! ఆతనినే ప్రార్థింపుము! ఆతని కీర్తనే గానముజేయుము! ఆతనినే నిరంతరు పూజింపుము! శంకరుడు – కాలకాలుండనియు మృత్యుంజయుడనియు భక్తోద్ధారపరాయణుడని భావింపుము!

శ్లో॥ కాయేన మనసా వాచా - యః శంకర ముపైతి భోః ।
స పండిత ఇతి జ్ఞేయః - సజీవన్ముక్త ఉచ్యతే ॥ ౪౪

మనోవాక్కాయములతో శివుని సేవించువాడే పండితుడనియు జీవన్ముక్తుడని పేర్కొనంబడును. అనగా? మనస్సున శివధ్యానమును వాక్కుతో శివనామోచ్చారణమును శరీరమునకు జెందిన హస్తాదులచే శివారాధనము నొనర్చుటయే జీవితసాఫల్యంబని తెలియవలెను.

శ్లో॥ శివేతి నామ-దావాగ్నే - ర్మహాపాతక పర్వతాః ।
భస్మీభవంత్యనాయాసా - త్సత్యం సత్యం న సంశయః ॥ ౪౫

"శివ" యను నామధేయము – మహాపాపములకు పర్వతములకు దావాగ్ని వంటిది. అనగా శివ శివ యని స్మరించు వారి సకలదోషములు సమసిపోవును. ఇద్ది ముమ్మాటికి నిజమ ఇందెంతమాత్రము సంశయము లేదని భావము.





లోకములో నానావిధ దుఃఖములు పాపములవలననే కలుగుచుండును. అట్టి దురితములన్నియు ఒకే పర్యాయము తొలగవలెనని భావించువారు శివారాధనమునే చేయవలసియుండును. త్రికరణశుద్ధిగా శివభక్తి లేనివాడు గావించు పుణ్యములు నిరర్థకంబులగును. అట్టివాడు వేదబాహ్యుండనియే తెలియవలెను. పూర్వకృతములైన అనేకవిధ సుకృతములు ఫలించు సమయముననే త్రిపురాంతకుఁడైన శంకరుని పూజించుటయందు నిశ్చలమైన నిష్ఠ కలుగును. సంసార సముద్రములో మునిఁగినవారు శివనామమను ఓడను దొరికించుకొని తఱింపనగును. సంసారమును తెచ్చి పెట్టు సంకల్పములు పెద్ద వృక్షములవంటివి. శివనామము అవ్వానిని ఛేదించుటకు అకుంఠితమైన గొడ్డలివంటిది. పాపదవాగ్నియందు చిక్కుకొనినవారు శివనామామృతముఁగ్రోల వలెను. ఐతే సంసారము దావాగ్నివంటిదని తెలిసియు అందు భ్రమప్రమాదముల వశమున సంచరించు వారి బాధలన్నియు శివనామామృత ధారాభిషేకమున మటుమాయ మగును. ఇంతగా ప్రబోధించుచున్నను శంకరునిపై భక్తి కలుగకుండుటకు రాగద్వేషాదులే కారణములని తెలియుము! ఒకవేళ భాగ్యవశమున శివభక్తి యంకురించినచో నట్టివారికి అకస్మికముగా మోక్షము సంభవించును. అనంతకోటి జన్మలలో అచరించిన తపస్సునకు ఫలము – భవానీ ప్రాణవల్లభునియందు భక్తియేను;

శ్లో॥ జాతాఽపి శంకరే భక్తి - రన్య సాధారణీ వృథా ।
పరం త్వవ్యభిచారేణ - శివభక్తి రపేక్షితా ॥ 57

ఇట్టి శివభక్తి – పూర్వపుణ్యబలమున నేర్పడినను ఇతరదేవతలతో శివుఁడు సమానుఁడను భావముతో కూడియున్నచో నిరర్థకంబగును. కావున శివుడు సమానాధికరహితుఁడని భావించుచు సేవించుట యను అఖండిత భక్తి కావలసియున్నది. ఎవనికి పరమేశ్వరునిపై అసాధారణ భక్తి – ఎట్టి వ్యభిచారము లేకుండా – అనఁగా ఒకప్పుడు బ్రహ్మవిష్ణ్వాదులవలె శివుఁడు నొకదేవతయనిగూడ మదిఁదలఁపక శివుఁడే పరాత్పరుండనియు సర్వోత్తముండనియు భావము దృఢపడునో అట్టివాడే ముక్తుండగును. అవధిలేని పాపముల నాచరించియు మహేశ్వరుని శరణుఁబొందినయెడల నట్టివాడును తరించును.

ప్రతిదినము భస్మను ధరించి శివుని పూజింపవలెను. సమస్తవేద సారసర్వస్వము శివారాధనమే యగును. నారదా? ఇప్పటినుండియైనను సాంబసదాశివుని నిత్యము సేవింపుము! పాదములు మొదలుకొని శిరస్సువరకు భస్మ మనుద్ధూళనముఁజేసికొని షడక్షరీ మహామంత్రమును జపించుము! శివప్రియములైన రుద్రాక్షములను శరీరమున కంఠాదిప్రదేశములయందు సమంత్రకముగా ధరింపుము! విరామసమయములయందు శివకథలనే వినుచుండుము! శివచరితములనే చెప్పుచుండుము! శివభక్తులను మిగుల శ్రమపడియైనను వారు తటస్థించిన ప్రతి సమయములో సత్కరించుము! ఎట్టి ప్రమాదముఁ జెందక నెల్లకాలము శివుఁడే శరణ్యుఁడని భావింపుము! ఇందుకు "శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వ మన్యత్ పరిత్యజ్య" ఇత్యాది శ్రుతి వాక్యము ప్రమాణము. ఇట్లు ప్రవర్తించు భక్తశిఖామణికి శివారాధనమునందే నిరంతరము దివ్యమైన అనందము కలుగుచుండును. స్ఫుటముగా కనఁబడు శివచరణ సరోజములను తొమ్మునందుంచుకొని శివక్షేత్రములను సంచరించుచు పరమాత్మయగు శంకరుని మహిమ నవలోకించుచు శివున కత్యంతప్రియమైన అనందకానన మనఁబడు కాశీక్షేత్రమునకు వెళ్లుము!





అచట విశ్వేశ్వరుని నమస్కరించి భక్తితో పూజింపుము! అనేక శివస్తోత్రములతో విశ్వనాథుని ప్రార్థింతువేని నిష్కల్మషుడ వగుదువు! అటుపిమ్మట బ్రహ్మలోకమున కేతెంచి నీ జనకుండగు బ్రహ్మదేవుని నమస్కరించి వినయ విధేయతలతో సంతుష్టాంతరంగముతోడను శంకరుని మహిమను గురించి ప్రశ్నించుము!

అతి తటి శివభక్తాగ్రేసరుడగు చతుర్ముఖుడు భావాతిరేకమున శివమహిమను శత సహస్రనామస్తోత్రమును నీకు నుపదేశించును. వేయేల? మునివార్య? ఇంతవరకు నీవు నా భక్తుడవైనను ఇకముందు శివపరాయణుడవై శివుని సేవించుచు ముక్తుండవగుదువు గాత! శంకరుండు నీకు శుభము నొనగూర్చు గాత!

ఇవ్విధము నారదునకు శ్రీహరి బోధించి యంతర్హితుండయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో చతుర్థాధ్యాయము.

## పంచమాధ్యాయము

### (నారదుఁడు కాశీక్షేత్రమునకు వెళ్లుట)

నారాయణుని యుపదేశము ననుసరించి నారదుఁడు భూలోకమున శివక్షేత్రముల యందు శివలింగములను సందర్శించుచుండగా శివగణము లేతెంచి - నీకు మున్ను స్వయంవరమున నపకరించిన వారము మేమేయనియు నిజముగా బ్రాహ్మణులము కామనియు శివగణముల మనియు చెప్పి మాకొసగిన శాపమునకు పరిహారము ననుగ్రహింపుమని ప్రార్థింపగా నారదుఁడు - సత్పురుషులచే నభినందింపఁ బడు శివగణములారా? నా యపరాధమును మన్నింపుడు! ఒకానొక మునివరుని బీజమున నుద్భవించి బలపరాక్రమ సంపన్నులై మహావైభవము ననుభవించుచు శివభక్తులలై జితేంద్రియులై శివేతరుఁడైన గొప్ప దేవుని వలన మరణముఁ బొందుదురు! కాని జీవితకాలమున రాక్షసభావమును కలిగియుందురు - అని వచింప శివగణములు సంతుష్టాంతరంగులై తమ నివాసమునకుఁజనిరి.

నారదుఁడట్లు శివక్షేత్రముల సంచరించుచు - సర్వక్షేత్రోన్నతంబు, శివప్రియంబు, శివానందప్రదంబు శివస్వరూపంబు నగు కాశీక్షేత్రమున కేగి కృతార్థుఁడనని భావించి కాశీనాథుఁడగు విశ్వనాథ జ్యోతిర్లింగమును దర్శించి సద్యః పరనిర్వృతి గలవాడై పరమప్రీతిఁ బూజించెను. కొంతకాలము వారాణసిని నివసించి బయలుదేరునపుడు కాశీక్షేత్రమునకు మ్రొక్కుచు వర్ణించుచు భక్తి పరవశుఁడై మాటిమాటికి స్మరించుచుండెను.

ఇవ్విధము శివాసక్త మానసుఁడగు విశేషించి శివతత్త్వమును తెలియఁగోరి బ్రహ్మలోకమునకు వెళ్లి యట చతుర్ముఖునకు నభివాదముఁజేసి పలుతెఱఁగులఁబ్రార్థించి దిగువ విధము ప్రశ్నించెను.

జగమునకు పితామహుఁడవు, బ్రహ్మస్వరూపమును కనుగొనినవాడవు. పూర్వము యనుగ్రహమున ఉత్తమమైన విష్ణుమాహాత్మ్యమును భక్తిజ్ఞాన తపోమార్గములను దానపద్ధతిని తీర్థమహిమ





వినియున్నాను. కాని శివతత్త్వపరిజ్ఞానము కలుగలేదు. శివపూజా విధానంబును తెలియదు. పలు విధములుగా విలసిల్లు శివచరిత్రంబు విదితము కానులేదు. శివమాయా మోహితుడనై ఇన్నాళ్లు శివతత్త్వజిజ్ఞాస లేకుంటిని.

శంకరుఁడు సృష్టిస్థితిలయముల యందెట్టివాడు? తదనంతర మెవ్విధముగా నుండును? ఎట్లు ప్రసన్నుండగును? సంతుష్టుడై భక్తులకు తదితరులకు నెట్టి ఫలముల నొసగును? మరియు మహేశ్వరుఁడు శీఘ్రప్రసన్నుండగుననియు, దయామయుఁడై భక్తుల కష్టములను సహింపఁడనియు బ్రహ్మావిష్ణు మహేశ్వరులు శివుని యంశమువలన నావిర్భవించినవారనియు అందు మహేశ్వరుఁడు శివుని పూర్ణాంశము గలవాడనియు శివుఁడు స్వయముగా సర్వాతీతుండనియు వినియున్నాను. ఇందు మహేశ్వరుని యావిర్భావమును ఆదిశక్తి-సతీపార్వత్యాది రూపమున నావిర్భవించిన యంశమును గౌరీశంకర వివాహమును అవ్వారి గృహస్థధర్మ నిర్వహణమును తదితర శివలీలలను కుమారజన్మను ఇత్యాదిసమస్తంబును వక్కాణింపుమని ప్రశ్నించి యీ వరకు ననేకులు చెప్పగా విన్నను సంతృప్తి కలుగనందున నిన్ను శరణముగా పొందియున్నాను. నా యందు దయఁజేయుమని నారదుఁడు వేడుకొనఁగా విధాత దిగువవిధము చెప్పఁదొడఁగెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పంచమాధ్యాయము.

## షష్ఠాధ్యాయము

### (మహాప్రళయ స్వరూపవర్ణన - విష్ణూత్పత్తియు)

లోకమునకు హితము నొనగూర్చు నుద్దేశముతో నీ వడిగిన విషయము ప్రశంసింపఁదగినదై యున్నది. ఇద్దానిని విన్నవారికి నిరిష్టములన్నియు నశించును.

శ్లో॥ శివతత్త్వం మయా నైవ - విష్ణునాపి యథార్థతః ।
జ్ఞాతంచ పరమం రూప - మద్భుతంచ పరేణ వ ॥ 3

నేను గాని విష్ణుమూర్తి గాని శివత్త్వమును అనఁగా శివుని సచ్చిదానంద మయ స్వరూపమును పూర్తిగా గుర్తెరుగఁజాలము. అట్టి శివతత్త్వము మనోవాచామగోచర మగుటఁజేసియద్భుతంబనవచ్చును.

మహాప్రళయమున చరాచర ప్రాణులు నశించినపుడు సూర్యచంద్ర నక్షత్ర గ్రహములు లేకుండెడివి. దివారాత్రి విభాగంబు శూన్యమయ్యెను. పృథివీ జల తేజోవాయు ఆకాశములు శబ్దస్పర్శాది తన్మాత్రలును దశదిశలును అంతరించినందున సూచీభేద్యమగు గాఢాంధకారము మాత్రముండెడిది. ఈ గాఢాంధకారమే మహాప్రకృతి యనఁదగును. ఇందుకు "యదాతమః" అను శ్రుతియే తార్కాణము. అట్టితతి యోగులచే నిరంతరము హృదయాకాశమున చూడఁబడు పరమాత్మ ప్రాకృత నామరూప గుణములు లేనివాడై స్థూలత్వ కృశత్వాది వర్జితుండై సత్యస్వరూపుడై జ్ఞానాత్మకుండై అనంతుఁడై స్వప్రకాశుఁడై పరానందమయుఁడై విరాజిల్లుచుండెను. ఈతఁడే శివుఁడని వాఙ్మయము ఘోషించుచున్నయది.



ఇట్టి శివుఁడు సృష్టి నుద్దేశించి ఒకానొక దివ్యమూర్తిని కల్పించి యాతనికి సదాశివుఁడను నామధేయము నేర్పరచెను. అంత సదాశివుఁడు తన నెడబాయక సహకరించు శక్తితో కూడినవాడయ్యెను. అద్దియే అంబిక యనియు ప్రకృతి యనియు మాయ యనియు ప్రధాన మనియు సకలేశ్వరి యనియు త్రిదేవజనని యనియు నిత్యయనియు మూలకారణంబనియు పేర్కొనంబడుచున్నయది.

ఎనిమిది భుజములు శోభాయమాన ముఖంబును కలిగి కోటిచంద్ర ప్రకాశముతో అనేక ఆభరణముల తోడను నానావిధ విలాసముల తోడను పెక్కు ఆయుధములను ధరించి వికసిత పుండరీకసదృశ నేత్రములతో నంబికాదేవి యావిర్భవించెను. సదాశివుఁడు పరపురుషుఁడుగను శీర్షమున గంగను ధరించువాడుగను ఫాలప్రదేశమున చంద్రరేఖయు ముకుళిత పుండరీక సన్నిభంబగు తృతీయ నేత్రంబును వికసిత కమలసదృశ నేత్రయుగళంబును ఐదు ముఖములు పది చేతులు ప్రసన్నహృదయంబు కలవాడుగను త్రిశూలధారిగను కర్పూరమువలె తెల్లనివాడుగను భస్మోద్ధూళిత విగ్రహుడుగను ప్రకాశించుచుండెను.

అంత సదాశివుఁడు–తేజోమయుండగుటచే గాఢాంధకారమును పారద్రోలి శక్తితో సమరసీభావము జెంది యానందించుటకు శివలోక మనఁబడు ఒకానొక దివ్యక్షేత్రమును నిర్మించినవాడయ్యెను. అద్దియే సర్వోన్నతంబగు కాశీక్షేత్రమనంబఱగుచున్నయది. మరియు ప్రళయ కాలమునందును అంబికా సదాశివులచే విడువఁబడదు గావున నవిముక్తంబనఁబఱగును. శక్తి శివులకు నానందము నొదవఁజేయుటచే నియ్యది ఆనందవనంబని పేర్కొనంబడును.

ఇట్టి ఆనందవనమున అంబికా సదాశివులు విహరించుచు నొక సమయమున నొకానొక మహాపురుషుని పుట్టించి యాతనికి సృష్టిభారము నంతయు కైవసముఁజేసి కాశీమృతులకు స్వోపాసకులకు నమృతత్వమును ప్రసాదింతుమని సంకల్పించి చింతలనెడు తరంగములతో డోలాయమానంబు సత్త్వగుణరత్నంబు తమోగుణగ్రాహంబు రజోగుణ విద్రుమంబు నగు చిత్తసముద్రమును మథించి వామభాగమున నమృత ప్రవాహమును ప్రసరింపఁజేసిరి.

అంత త్రైలోక్యసుందరుఁడు, శాంతస్వభావుఁడు, సత్త్వగుణాభినివేశముగల వాడును, గాంభీర్య సాగరుడును, క్షమాసంపన్నుఁడును, ఇంద్రనీలసమాన శరీరకాంతి గలవాడును, పుండరీకాక్షుఁడును సువర్ణాభరణధారియు, పీతాంబర ధరుండును, ప్రచండ దోర్దండ యుగళుఁడును, అపరాజితుఁడునగు పురుషుఁడుద్భవించి "పరమేశ్వరా? నా నామధేయముల ననుగ్రహించి కర్తవ్యము నాదేశింపుడని ప్రార్థించెను.

శంకరుఁడా మాటలు విని చిరునగవుతో మేఘ గంభీరస్వరముతో దిగువవిధము వక్కాణించెను

జగమునంతయు వ్యాపించియుందువు గావున విష్ణువను నామధేయము ముఖ్యముగా నీకు చెల్లును మరియు భక్తులకు సుఖముల నొనగూర్చు ఇతర నామధేయము లెన్నియో నెలకొనును.' కార్యసాధనములలో ముఖ్యమగు తపస్సు నాచరించుమని చెప్పి నిఃశ్వాసరూపమున వేదరాశినంతయు ననుగ్రహించెను. తరువాత సదాశివుఁడు తన లోకముతో గూడ నంతర్ధానముఁజెందగా నచ్యుతుఁడు శివునకు నమస్కారము సమర్పించి పంద్రెండ్రు వేల దివ్య వత్సరములు తపించినను శంకరుఁడు ప్రసన్నుఁడు గాడయ్యెను

అందువలన విష్ణువు ఇక నేనేమి చేయవలెనని చింతించుచుండగా సందేహము తొలగుటకై మరల తపించుమని ఆకాశదివ్యవాణి వినిపించెను. అంత నారాయణుఁడు చిరకాలము శివధ్యానమును చేయుచు తపస్సు నాచరించుచు ధ్యానమును విరమించి ఇదేమిటని ఆశ్చర్యపడుచుండగా – చాలకాలము తపించుట యను పరిశ్రమఁజేసియు శివమాయా ప్రభావముననను తన దేహమునుండి నానా జలధారలు బయలుదేరి శూన్యప్రదేశము నంతయు ముంచివేసినవి. ఇట్టి జలము బహురూపమై తాకినంత మాత్రమున పాపములఁ బోకార్చునదై యుండెను. అట్టితఱి విష్ణువు అలసియుండుటచే తన శరీరమునుండి యుద్భవించిన ఉదకమునందే శివమాయామోహితుఁడై పెక్కువేళ పరుండియుండుటచే నారాయణుఁడనఁబఱఁగెను. ఆసమయమున పురుషుఁడు దక్క వేరొండు లేకుండెను. ఇంతలో ప్రకృతినుండి సత్త్వరజస్తమోగుణములు, అహంకారము, తన్మాత్రలు, పంచభూతంబులును, జ్ఞానకర్మేంద్రియములు నను ఇరువదినాలుగు తత్త్వములు ఉదయించినవి. పురుషుఁడు దక్క నితరములన్నియు జడములనియే తెలియవలెను. ఇట్టి చతుర్వింశతి తత్త్వములను స్వాధీనపరచుకొని శివేచ్ఛావశంవదుడై శివరూపంబగు నుదకమునందు నారాయణుఁడు నిద్రించుచున్నవాడు.

నరః అనఁగా రుద్రుఁడు, నరునిచే పుట్టింపబడిన ఉదకములు నారములనంబడును. నారములు అయనము (స్థానము) గా గలవాడు నారాయణుఁడని నిర్వచనము.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో షష్ఠాధ్యాయము.**

## సప్తమాధ్యాయము

### (బ్రహ్మవిష్ణువులు తమ ప్రమాదములను గుర్తించుట)

ఇవ్విధము నారాయణుఁడు శయనించుచుండ నాతని నాభినుండి యొకానొక కమలము ఆవిర్భవించెను. అద్ది అవధిలేని కాడ గలదై కొండగోగువలె ప్రకాశించుచుండెను. మరియు అనంతయోజనముల వెడల్పును అపరిమేయ ఔన్నత్యంబును కలిగి కోటిసూర్యప్రతీకాశమూ తత్త్వసంపన్నమై సుందరంబై మనోహరంబై దర్శనీయముగాను అత్యద్భుతముగా నుండెను. ఇది యిట్లుండఁగా పరమేశ్వరుఁడు పూర్వమువలె యత్నించి దక్షిణాంగమునుండి బ్రహ్మదేవుని పుట్టించి విష్ణునాభికమలము నందు పడవేసియుండెను. అట్టితఱి విధాత – చతుర్ముఖుండై రక్తవర్ణుఁడు గాను నొసట భస్మత్రిపుండ్రములు కడుపులో బంగారము గలవాడుగా నుండెను. ఈ సృష్టిక్రమ మంతయు శివేచ్ఛావశముననే సంభవించు నను నంశమును మరువరాదు. అప్పుడు పితామహుఁడు – కమలము దక్క నితరమును తెలియనివాడై జ్ఞానదౌర్బల్యమున తన జనకుని గుర్తురుఁగజాలకుండెను.

"నేనెవఁడను? ఎక్కడినుండి వచ్చితిని? కర్తవ్య మెద్ది? ఎవనికి కుమారుడనై జన్మించితిని? ప్రస్తుతము నన్నెవడు పుట్టించెను?" అని బ్రహ్మదేవుఁడు విచారించి ఈ కమలముఁదగు జాడఁదెలిసి కొందునని నిర్ణయించుకొని కమలనాళములో ప్రవేశించి నూరువత్సరములు పయనించినను కమలముఁ దగు మూలమును గానడయ్యెను. కమలముఁదగు నాళము క్రింది భాగమునుండి పైభాగమున కతెంచి





చూడగా కమల ముఖము గానరాదయ్యెను. ఇట్లు నాళము నందే మరి నూరు వత్సరములు గడిచినన్ని అట్టితతి తపించుమని దివ్యవాణి యుపదేశింపగా పండ్రెండు వత్సరములు విధి తపించినందున చతుర్భుజుండు కమలలోచనుండు భగవానుండునగు విష్ణువు ప్రత్యక్షము కాగా బ్రహ్మదేవుండు ఆ దివ్యసుందరరూపమును గాంచుచు లోలోన విస్మయమును ఆనందము ననుభవించుచు శివమాయ ప్రభావమున తన జనకుడని తెలియక విష్ణువును సమీపించి దృఢమైన కరతాడనముతో నీవెవండవని యడుగగా నంత నారాయణుండు మేలుకొని "నాయనా? బ్రహ్మదేవా? స్వస్థచిత్తుడవు కమ్ము! ఎట్టి భయముంజెందవలదు! నీకు వలయు కోర్కెలనన్నిటి నీడేర్తునని ప్రబోధించెను.

శంఖచక్ర గదా పద్మధరుండు ఘనశ్యాములుడు ప్రసన్నవదనాంబుజుడు కోటి కందర్ప సంకాశుండు నగు కేశవుండట్లు ప్రబోధించినను పెడచెవిని పెట్టి బ్రహ్మయిట్లు భాషించెను.

బ్రహ్మ – వత్సా! వత్సా! అని బీరములు పలుకుచున్నావు! గురువు శిష్యునివలె నన్ను భావించు చున్నావా? ప్రకృతిని ప్రవర్తింప జేయువాడనై జగములను పుట్టించువాడను సనాతనుడను విశ్వాత్మకుడను స్వయంభువును పితామహుడను పరమేష్ఠిని సర్వోత్తముడను నేనే గదా!

విష్ణువు – చతుర్ముఖా? జగములను సృజించుటకు నేనే నా నాభికమలముల నుండి నిన్ను పుట్టించితిని. సర్వవ్యాపకుడననియు విశ్వకర్తననియు నన్ను గుర్తెరుగకున్నావు. ఇందు నీ యపరాధమేమియు లేదు. అంతయు నా మాయావిలాసమని తెలియుము! కర్తృత్వము హర్తృత్వము భర్తృత్వంబును నాయవియేను; నాతో సమానుడైన ప్రభువు లేడు. నేనే పరబ్రహ్మమును; పరతత్త్వమును; పరంజ్యోతిని; పరమాత్మను; ఇప్పుడు చూచుచున్నది ఈవరకు చూచినదియు వినినదియు సమస్తంబును నా విభూతి యనియే తెలియుము! చతుర్వింశతి తత్త్వములను నేనే కల్పించితిని. బ్రహ్మ – నారాయణా! ఎందుకిట్లు ప్రలపింతువు! నా ముందు నీ వెవండవు? నీ వాక్యము అనర్థహేతువని తెలియకున్నావు నిజముగా నీవు ప్రభువు కావు, ఒకానొక మహాపురుషుండు నీకు కర్తగా నుండియుండును.

ఇట్లు రజోగుణదూషితులై బ్రహ్మవిష్ణువులు కలహించుకొని ప్రళయార్ణవ మధ్యమున ఘోర సంగ్రామము నొనర్పగా నవ్వారి పోరు నుపశమింప నీశ్వరుండు లింగాకారమున నావిర్భవించినవాడు

లింగస్వరూపము – వెలకొలది మంటలతో వెలుగొందునదియు నూర్లకొలది ప్రళయాగ్నులతో సమాన మగునదియు క్షయవృద్ధులు లేనిదియు ఆదిమధ్యాంత వర్జితంబు అనౌపమ్యంబు ననిర్దేశ్యంబు నవ్యక్తంబు విశ్వకారణంబునై యుండెను.

అట్టితతి విధికేశవులు హంసవరాహ రూపములందాల్చి లింగముందగు ఆద్యంతములను కనుగొన ప్రయత్నించి విఫలులై పూర్వస్థానమున కేతెంచి విగతమత్సరులై మన మిరువురమును పరాత్పరులము కామని నిగర్వనిర్మలచిత్తము గలవారై మహేశ్వరుని పలువిధముల నుతించి శతవర్షముల కాలము శివనమస్కారములను సమర్పించి మదమోహముల వలన సంభవించిన మా యపరాధమును మన్నింపుము దేవా! యని విన్నవించినవారైరి.

ఇయ్యది "శివరహస్య సర్వస్వ" మను తాంతరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో సప్తమాధ్యాయము.

# అష్టమాధ్యాయము

## (శబ్దబ్రహ్మస్వరూపవర్ణనము)

ఇవ్విధము బ్రహ్మవిష్ణువులు విస్మయముతో ప్రార్థించుచు దర్శనమును కోరుచుండగా దీనబంధువు సర్వాధీశ్వరుఁడును గర్వాపహర్తయునగు శంకరుఁడు ప్రసన్నుండయ్యెను. అట్టి తఱి ఓంకారనాదము సుస్పష్టమగుచుండగా ఇదేమిటని విష్ణువు సముత్సాహముతో పరికించు చుండెను. ఆద్యమైన ఆకారము లింగముఁదగు దక్షిణదిశయందును ఉకారము ఉత్తరదిశయందును మకారము లింగమధ్యమునందును చివరన నోంకారనాదంబును పొడగట్టుచుండెను. మరియు ఆకారము సూర్యమండలమువలెను ఉకారము అగ్నివలెను మకారము చంద్రమండలము వలెను ప్రకాశించుచుండినవి. అవ్వానిపై సత్యస్వరూపము ఆనందాత్మకంబు అమృతంబు వేద వేద్యంబు విశ్వాత్మకంబునగు శివతత్త్వము స్ఫురించుచుండెను. "యో వేదాదౌ స్వరః ప్రోక్తః- వేదాంతే చ ప్రతిష్ఠితఃతస్య ప్రకృతిలీనస్య – యః పరః స మహేశ్వర" అను శ్రుతియే ఇందుకు ప్రమాణము.

ఆ శుభ దివ్య సమయమున ఒకానొక ఋషి సాక్షాత్కరించి – మహాదేవుఁడు – శబ్దబ్రహ్మ తనువనియు పరబ్రహ్మంబనియు చింతారహితుండనియు మనోవాగతీతుండనియు, అమృతుండనియు సచ్చిదానంద స్వరూపుడనియు పరమకారణుఁడనియు ఓంకారవాచ్యుండనియు బ్రహ్మ విష్ణువులకు బోధించుచుండెను. మఱియు అకార ఉకార మకారములనుండి బ్రహ్మ విష్ణుమహేశ్వరులు ఆవిర్భవించి సృష్టిస్థితిలయముల నొనర్చుచున్నారు. మకారము బీజియనియు ఆకారము బీజమనియు ఉకారము యోనియనియు నాదము అనుసంధానమనియు తెలియవలెను. బీజియగు రుద్రుఁడు నాదస్వరూపుడగు మహేశ్వరునిచే ప్రేరేపింపఁ బడి బీజంబగు ఆకారమును యోనియగు విష్ణువునందు విసర్జించెను. అంత సువర్ణమయమైన బ్రహ్మాండము ఉద్భవించి దివ్యవర్షసహస్రము జలమునందు పరిపక్వమై రెండు వ్రక్కలయ్యెను. అందు పైభాగము ఊర్ధ్వలోకములుగను క్రిందిభాగము పృథివ్యాదిలోకములుగను పరిణమించెను. ఇట్లు యజుస్సులు ఋక్కులు సామంబులును "ఓమ్" "ఓమ్" అని విశదీకరించుచుండగా నారాయణుఁడు పంకజాసనుఁడును పలువిధముల మహేశ్వరుని ప్రార్థించుచుండిరి. ఇంతలో నొక దివ్యరూపము – ఐదుముఖములు పదిచేతులు గౌరకర్పూరవర్ణంబును కలిగి నానావిధ కాంతులతోడను అనేక అలంకారములతోడను గొప్ప ఉదార స్వభావముతోడను మిగుల పరాక్రమముతోడను మహాపురుషుఁడుగా గోచరింప విధివిష్ణువులు సంతుష్టులై యవలోకించుచుండగా పరమేశ్వరుఁడు దివ్యశబ్దమయ స్వరూపము గలవాడై చిరునగవుఁజెందుచుండెను.

అకారము శిరస్సుగాను ఆకారము లలాటముగాను ఇకారము కుడికన్నుగాను ఈ కారము ఎడమకన్నుగాను ఉకారము కుడిచెవిగాను ఊకారము ఎడమచెవిగాను ఋకార ౠకారములు దక్షిణవామకపోలములుగాను కారములు నాసాపుటములుగాను ఏకార ఐకారములు పై క్రింది పెదవులుగాను ఓంకార ఔకారములు పలువరుసలుగాను అం అః అనునవి దౌడలుగాను క ఖ గ ఘ ఙలు ఐదు కుడిచేతులుగాను చ ఛ జ ఝ ఞలు ఐదు ఎడమ చేతులుగాను ట ఠ డ ఢ ణ, త థ ద ధ నలు పాదద్వయము గాను పకారము కడుపుగాను ఫ బ లు పార్శ్వ ద్వయముగాను భకారము స్కంధము

(మూపు) గాను మకారము హృదయము గాను య ర ల వ శ ష స లు సప్తధాతువులుగాను హకారము నాభిగాను క్షకారము ఘ్రాణముగాను కన్పట్టు ఉమాసహిత మహేశ్వరుని శబ్దబ్రహ్మ స్వరూపమును గాంచి విధివిష్ణువులు కృతార్థులైరి. మరియు పైన ఓంకార ప్రభవంబు కలాపంచకసంయుతంబు శుద్ధస్ఫటిక సంకాశంబు అష్టత్రింశదక్షరంబు నగు మంత్రము మేధస్సుగా గోచరించుచుండెను. ఇంకను గాయత్రి మహామంత్రము, త్రింశదక్షరమంత్రంబు, పంచవింశదక్షర మంత్రంబు ఏక షష్టివర్ణకమంత్రంబు మృత్యుంజయ మంత్రంబు, పంచాక్షరమహామంత్రంబు, చింతామణిమంత్రంబు, దక్షిణామూర్తి మంత్రంబు విశదపడగా నవ్వానిని పరిగ్రహించి నారాయణుఁడు జపించుచుండెను మరియు నా సదాశివుని ఈశాన తత్పురుష అఘోర వామదేవ సద్యోజాత మంత్రములందగు స్వరూపము గలవాని మహాభోగీంద్రభూషణుఁడై సర్వవ్యాపకుఁడై బ్రహ్మాధిపతియై సృష్టి స్థితిలయకారకుఁడై వరదుఁడై సాక్షాత్కరించి నాతనిని ప్రియములైన వాక్కులతో పంకజాక్షపంకజాసనులు వేడుకొనుచుండిరి.

"ఇయ్యది శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంతిలీయ ఆంధ్రానువాద ప్రవచనముతో అష్టమాధ్యాయము.

# నవమాధ్యాయము

## (శివతత్త్వ వర్ణనము)

విష్ణుబ్రహ్మకృతస్తోత్రము నాకర్ణించి శివుఁడు - పంచవదనుఁడుగాను త్రినేత్రుఁడుగాను ఫాలచంద్రుఁడు గాను జటాధరుండుగను గౌరవర్ణుఁడుగాను విశాలాక్షుఁడుగాను భస్మోద్ధూళిత విగ్రహుఁ డుగాను దశబాహువుగాను నీలకంఠుడుగాను సర్వవిధభూషణ భూషితుఁడు గాను సర్వాంగసుందరుఁ డుగాను భస్మత్రిపుండ్రాంకితమస్తకుఁడుగాను సాక్షాత్కరింపగా నా సాంబమూర్తికి మ్రొక్కుచు అనేకవిధస్తోత్రములతో విధివిష్ణువులు ప్రార్థించుచుండిరి.

అంత శంకరుఁడు తన నిట్టూర్పులద్వారా వేదములను కేశవున కొసఁగి వేదార్థ రహస్యమునంతయు బోధించెను. అటులే విధికి వేదంబుల నిడి యవ్వాని రహస్యమును తెలిపెను. అట్టితతి విష్ణు కృతాంజలియై బ్రహ్మతో గూడ మరియొకతూరి నమస్కరించి క్రింది విధము ప్రశ్నించెను.

మహాదేవా? ఎద్దానినాచరించినచో సంతోషింతువు? నిన్ను పూజించు విధానమెట్టిది? నిన్నెట్లు ధ్యానింపవలెను? భక్తులకు వశుండవగుట యెట్లు? ఇకముందు మేమిరువుర మేమి చేయవలెను ఎల్లకాలము మమ్ముశాసించువాడవు నీవేను: మా యందు దయఁదలచి తగు సమాధానమును చెప్పుమని విన్నవింపగా నా పరాత్పరుఁడు సుప్రసన్నుఁడై చెప్పఁదొడగెను.

సురసత్తములారా! మీ యిరువురి భక్తికి సంతసించితిని. నన్ను భావించినచో ఎట్టి భయంబును సమకూరదు. ప్రస్తుతము కనంబడు శివలింగమును సదా పూజింపడు! లింగ స్వరూపమునందర్చింప బడువాడనై భక్తుల మనోఽభీష్టముల నీడేర్చుచుందును. మీరు సంకటము సంభవించినపుడు లింగార్చనమును చేయుఁడు! నాయందు మీయుభయులకు దృఢభక్తి యేర్పడుగాత!





లోకములో నానావిధ దుఃఖములు పాపములవలననే కలుగుచుండును. అట్టి దురితములన్నియు ఒకే పర్యాయము తొలగవలెనని భావించువారు శివారాధనమునే చేయవలసియుండును. త్రికరణశుద్ధిగా శివభక్తి లేనివాడు గావించు పుణ్యములు నిరర్థకంబులగును. అట్టివాడు వేదబాహ్యుండనియే తెలియవలెను. పూర్వకృతములైన అనేకవిధ సుకృతములు ఫలించు సమయముననే త్రిపురాంతకుఁడైన శంకరుని పూజించుటయందు నిశ్చలమైన నిష్ఠ కలుగును. సంసార సముద్రములో మునిఁగినవారు శివనామమను ఓడను దొరికించుకొని తఱింపనగును. సంసారమును తెచ్చి పెట్టు సంకల్పములు పెద్ద వృక్షములవంటివి. శివనామము అవ్వానిని ఛేదించుటకు అకుంఠితమైన గొడ్డలివంటిది. పాపదవాగ్నియందు చిక్కుకొనినవారు శివనామామృతముఁగ్రోల వలెను. ఐతే సంసారము దావాగ్నివంటిదని తెలిసియు అందు భ్రమప్రమాదముల వశమున సంచరించు వారి బాధలన్నియు శివనామామృత ధారాభిషేకమున మటుమాయ మగును. ఇంతగా ప్రబోధించుచున్నను శంకరునిపై భక్తి కలుగకుండుటకు రాగద్వేషాదులే కారణములని తెలియుము! ఒకవేళ భాగ్యవశమున శివభక్తి యంకురించినచో నట్టివారికి అకస్మికముగా మోక్షము సంభవించును. అనంతకోటి జన్మలలో ఆచరించిన తపస్సునకు ఫలము – భవానీ ప్రాణవల్లభునియందు భక్తియేను;

శ్లో॥ జాతాఽపి శంకరే భక్తి - రన్య సాధారణీ వృథా ।
పరం త్వవ్యభిచారేణ - శివభక్తి రపేక్షితా ॥ 57

ఇట్టి శివభక్తి – పూర్వపుణ్యబలమున నేర్పడినను ఇతరదేవతలతో శివుఁడు సమానుఁడను భావముతో కూడియున్నచో నిరర్థకంబగును. కావున శివుడు సమానాధికరహితుఁడని భావించుచు సేవించుట యను అఖండిత భక్తి కావలసియున్నది. ఎవనికి పరమేశ్వరునిపై అసాధారణ భక్తి – ఎట్టి వ్యభిచారము లేకుండా – అనఁగా ఒకప్పుడు బ్రహ్మవిష్ణ్వాదులవలె శివుఁడు నొకదేవతయనిగూడ మదిఁదలఁపక శివుఁడే పరాత్పరుండనియు సర్వోత్తముండనియు భావము దృఢపడునో అట్టివాడే ముక్తుండగును. అవధిలేని పాపముల నాచరించియు మహేశ్వరుని శరణుఁబొందినయెడల నట్టివాడును తరించును.

ప్రతిదినము భస్మను ధరించి శివుని పూజింపవలెను. సమస్తవేద సారసర్వస్వము శివారాధనమే యగును. నారదా? ఇప్పటినుండియైనను సాంబసదాశివుని నిత్యము సేవింపుము! పాదములు మొదలుకొని శిరస్సువరకు భస్మ నుద్ధూళనముఁజేసికొని షడక్షరీ మహామంత్రమును జపించుము! శివప్రియములైన రుద్రాక్షములను శరీరమున కంఠాదిప్రదేశములయందు సమంత్రకముగా ధరింపుము! విరామసమయములయందు శివకథలనే వినుచుండుము! శివచరితములనే చెప్పుచుండుము! శివభక్తులను మిగుల శ్రమపడియైనను వారు తటస్థించిన ప్రతి సమయములో సత్కరించుము! ఎట్టి ప్రమాదముఁ జెందక నెల్లకాలము శివుఁడే శరణ్యుఁడని భావింపుము! ఇందుకు "శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వ మన్యత్ పరిత్యజ్య" ఇత్యాది శ్రుతి వాక్యము ప్రమాణము. ఇట్లు ప్రవర్తించు భక్తశిఖామణికి శివారాధనమునందే నిరంతరము దివ్యమైన ఆనందము కలుగుచుండును. స్ఫుటముగా కనఁబడు శివచరణ సరోజములను తొమ్మునందుంచుకొని శివక్షేత్రములను సంచరించుచు పరమాత్మయగు శంకరుని మహిమ నవలోకించుచు శివున కత్యంతప్రియమైన ఆనందకానన మనఁబడు కాశీక్షేత్రమునకు వెళ్లుము!



అచట విశ్వేశ్వరుని నమస్కరించి భక్తితో పూజింపుము! అనేక శివస్తోత్రములతో విశ్వనాథుని ప్రార్థింతువేని నిష్కల్మషుడ వగుదువు! అటుపిమ్మట బ్రహ్మలోకమున కేతెంచి నీ జనకుండగు బ్రహ్మదేవుని నమస్కరించి వినయ విధేయతలతో సంతుష్టాంతరంగముతోడను శంకరుని మహిమను గురించి ప్రశ్నించుము!

అతి తతి శివభక్తాగ్రేసరుండగు చతుర్ముఖుండు భావాతిరేకమున శివమహిమను శివ సహస్రనామస్తోత్రమును నీకు నుపదేశించును. వేయేల? మునివార్య? ఇంతవరకు నీవు నా భక్తుడవైనను ఇకముందు శివపరాయణుడవై శివుని సేవించుచు ముక్తుండవగుదువు గాత! శంకరుండు నీకు శుభము నొనగూర్చు గాత!

ఇవ్విధము నారదునకు శ్రీహరి బోధించి యంతర్హితుండయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో చతుర్థాధ్యాయము.

## పంచమాధ్యాయము

### (నారదుండు కాశీక్షేత్రమునకు వెళ్లుట)

నారాయణుని యుపదేశము ననుసరించి నారదుండు భూలోకమున శివక్షేత్రముల యందు శివలింగములను సందర్శించుచుండగా శివగణము లేతెంచి – నీకు మున్ను స్వయంవరమున నపకరించిన వారము మేమేయనియు నిజముగా బ్రాహ్మణులము కామనియు శివగణముల మనియు చెప్పి మాకొసగిన శాపమునకు పరిహారము ననుగ్రహింపుమని ప్రార్థింపగా నారదుండు – సత్పురుషులచే నభినందింపఁ బడు శివగణములారా? నా యపరాధమును మన్నింపుడు! ఒకానొక మునివరుని బీజమున నుద్భవించి బలపరాక్రమ సంపన్నులై మహావైభవము ననుభవించుచు శివభక్తులతై జితేంద్రియులై శివేతరుండైన గొప్ప దేవుని వలన మరణముఁ బొందుదురు! కాని జీవితకాలమున రాక్షసభావమును కలిగియుందురు – అని వచింప శివగణములు సంతుష్టాంతరంగులై తమ నివాసమునకుఁజనిరి.

నారదుండట్లు శివక్షేత్రముల సంచరించుచు – సర్వక్షేత్రోన్నతంబు; శివప్రియంబు, శివానందప్రదంబు శివస్వరూపంబు నగు కాశీక్షేత్రమున కేగి కృతార్థుండనని భావించి కాశీనాథుండగు విశ్వనాథ జ్యోతిర్లింగమును దర్శించి సద్యః పరనిర్వృతి గలవాడై పరమప్రీతిఁ బూజించెను. కొంతకాలము వారాణసీలో నివసించి బయలుదేరునపుడు కాశీక్షేత్రమునకు మ్రొక్కుచు వర్ణించుచు భక్తి పరవశుండై మాటిమాటికి స్మరించుచుండెను.

ఇవ్విధము శివాసక్త మానసుండగు విశేషించి శివతత్త్వమును తెలియఁగోరి బ్రహ్మలోకమునకు వెళ్లి యట చతుర్ముఖునకు నభివాదముఁజేసి పలుతెఱంగులఁబ్రార్థించి దిగువ విధము ప్రశ్నించెను.

జగమునకు పితామహుండవు, బ్రహ్మస్వరూపమును కనుగొనినవాడవు. పూర్వము యనుగ్రహమున ఉత్తమమైన విష్ణుమాహాత్మ్యమును భక్తిజ్ఞాన తపోమార్గములను దానపద్ధతిని తీర్థమహిమను





వినియున్నాను. కాని శివతత్త్వపరిజ్ఞానము కలుగలేదు. శివపూజా విధానంబును తెలియదు. పలు విధములుగా విలసిల్లు శివచరిత్రంబు విదితము కానులేదు. శివమాయా మోహితుడనై ఇన్నాళ్లు శివతత్త్వజిజ్ఞాస లేకుంటిని.

శంకరుఁడు సృష్టిస్థితిలయముల యందెట్టివాడు? తదనంతర మెవ్విధముగా నుండును? ఎట్లు ప్రసన్నుండగును? సంతుష్టుడై భక్తులకు తదితరులకు నెట్టి ఫలముల నొసగును? మరియు మహేశ్వరుఁడు శీఘ్రప్రసన్నుండగుననియు, దయామయుఁడై భక్తుల కష్టములను సహింపఁడనియు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు శివుని యంశమువలన నావిర్భవించినవారనియు అందు మహేశ్వరుఁడు శివుని పూర్ణాంశము గలవాడనియు శివుఁడు స్వయముగా సర్వాతీతుండనియు వినియున్నాను. ఇందు మహేశ్వరుని యావిర్భావమును ఆదిశక్తి–సతీపార్వత్యాది రూపమున నావిర్భవించిన యంశమును గౌరీశంకర వివాహమును అవ్వారి గృహస్థధర్మ నిర్వహణమును తదితర శివలీలలను కుమారజన్మను ఇత్యాదిసమస్తంబును వక్కాణింపుమని ప్రశ్నించి యీ వరకు ననేకులు చెప్పగా విన్నను సంతృప్తి కలుగనందున నిన్ను శరణముగా పొందియున్నాను. నా యందు దయఁజేయుమని నారదుఁడు వేడుకొనఁగా విధాత దిగువవిధము చెప్పఁదొడఁగెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పంచమాధ్యాయము.

## షష్ఠాధ్యాయము

### (మహాప్రళయ స్వరూపవర్ణన – విష్ణూత్పత్తిస్థితియు)

లోకమునకు హితము నొనగూర్చు నుద్దేశముతో నీ వడిగిన విషయము ప్రశంసింపఁదగినదై యున్నది. ఇద్దానిని విన్నవారికి నిరిష్టములన్నియు నశించును.

శ్లో॥ శివతత్త్వం మయా నైవ - విమనాపి యథార్థతః ।
జ్ఞాతంచ పరమం రూప - మద్భుతంచ పరేణ న ॥ 3

నేను గాని విష్ణుమూర్తి గాని శివత్త్వమును అనఁగా శివుని సచ్చిదానంద మయ స్వరూపమును పూర్తిగా గుర్తెరుగఁజాలము. అట్టి శివతత్త్వము మనోవాచామగోచర మగుటఁజేసియద్భుతంబనవచ్చును.

మహాప్రళయమున చరాచర ప్రాణులు నశించినపుడు సూర్యచంద్ర నక్షత్ర గ్రహములు లేకుండెడివి. దివారాత్రి విభాగంబు శూన్యమయ్యెను. పృథివీ జల తేజోవాయు ఆకాశములు శబ్దస్పర్శాది తన్మాత్రలును దశదిశలును అంతరించినందున సూచీభేద్యమగు గాఢాంధకారము మాత్రముఁడెడిది. ఈ గాఢాంధకారమే మహాప్రకృతి యనఁదగును. ఇందుకు "యదాతమః" అను శ్రుతియే తార్కాణము. అట్టితఱి యోగులచే నిరంతరము హృదయాకాశమున చూడఁబడు పరమాత్మ ప్రాకృత నామరూప గుణములు లేనివాడై స్థూలత్వ కృశత్వాది వర్జితుండై సత్యస్వరూపుడై జ్ఞానాత్మకుండై అనంతుఁడై స్వప్రకాశుఁడై పరానందమయుఁడై విరాజిల్లుచుండెను. ఈతఁడే శివుఁడని వాఙ్మయము ఘోషించుచున్నయది.

ఇట్టి శివుఁడు సృష్టి నుద్దేశించి ఒకానొక దివ్యమూర్తిని కల్పించి యాతనికి సదాశివుఁడను నామధేయము నేర్పరచెను. అంత సదాశివుఁడు తన నెడబాయక సహకరించు శక్తితో కూడినవాడయ్యెను. అద్దియే అంబిక యనియు ప్రకృతి యనియు మాయ యనియు ప్రధాన మనియు సకలేశ్వరి యనియు త్రిదేవజనని యనియు నిత్యయనియు మూలకారణంబనియు పేర్కొనంబడుచున్నయది.

ఎనిమిది భుజములు శోభాయమాన ముఖంబును కలిగి కోటిచంద్ర ప్రకాశముతో అనేక ఆభరణముల తోడను నానావిధ విలాసముల తోడను పెక్కు ఆయుధములను ధరించి వికసిత పుండరీకసదృశ నేత్రములతో నంబికాదేవి యావిర్భవించెను. సదాశివుఁడు పరపురుషుఁడుగను శీర్షమున గంగను ధరించువాడుగను ఫాలప్రదేశమున చంద్రరేఖయు ముకుళిత పుండరీక సన్నిభంబగు తృతీయ నేత్రంబును వికసిత కమలసదృశ నేత్రయుగళంబును ఐదు ముఖములు పది చేతులు ప్రసన్నహృదయంబు కలవాడుగను త్రిశూలధారిగను కర్పూరమువలె తెల్లనివాడుగను భస్మోద్ధూళిత విగ్రహుడుగను ప్రకాశించుచుండెను.

అంత సదాశివుఁడు–తేజోమయుండగుటచే గాఢాంధకారమును పారద్రోలి శక్తితో సమరసీభావము జెంది యానందించుటకు శివలోక మనఁబడు ఒకానొక దివ్యక్షేత్రమును నిర్మించినవాడయ్యెను. అద్దియే సర్వోన్నతంబగు కాశీక్షేత్రమనంబఱగుచున్నయది. మరియు ప్రళయ కాలమునందును అంబికా సదాశివులచే విడువఁబడదు గావున నవిముక్తంబనఁబఱగును. శక్తి శివులకు నానందము నొదవఁజేయుటచే నియ్యది ఆనందవనంబని పేర్కొనంబడును.

ఇట్టి ఆనందవనమున అంబికా సదాశివులు విహరించుచు నొక సమయమున నొకానొక మహాపురుషుని పుట్టించి యాతనికి సృష్టిభారము నంతయు కైవసముఁజేసి కాశీమృతులకు స్వోపాసకులకు నమృతత్వమును ప్రసాదింతుమని సంకల్పించి చింతలనెడు తరంగములతో డోలాయమానంబు సత్త్వగుణరత్నంబు తమోగుణగ్రాహంబు రజోగుణ విద్రుమంబు నగు చిత్తసముద్రమును మథించి వామభాగమున నమృత ప్రవాహమును ప్రసరింపఁజేసిరి.

అంత త్రైలోక్యసుందరుఁడు, శాంతస్వభావుఁడు, సత్త్వగుణాభినివేశముగల వాడును, గాంభీర్య సాగరుడును, క్షమాసంపన్నుఁడును, ఇంద్రనీలసమాన శరీరకాంతి గలవాడును, పుండరీకాక్షుఁడును సువర్ణాభరణధారియు, పీతాంబర ధరుండును, ప్రచండ దోర్దండ యుగళుఁడును, అపరాజితుఁడునగు పురుషుఁడుద్భవించి "పరమేశ్వరా? నా నామధేయముల ననుగ్రహించి కర్తవ్యము నాదేశింపుడ"ని ప్రార్థించెను.

శంకరుఁడా మాటలు విని చిరునగవుతో మేఘ గంభీరస్వరముతో దిగువవిధము వక్కాణించెను.

జగమునంతయు వ్యాపించియుందువు గావున విష్ణువను నామధేయము ముఖ్యముగా నీకు చెల్లును. మరియు భక్తులకు సుఖముల నొనగూర్చు ఇతర నామధేయము లెన్నియో నెలకొనును.' కార్యసాధనములలో ముఖ్యమగు తపస్సు నాచరించుమని చెప్పి నిఃశ్వాసరూపమున వేదరాశినంతయు ననుగ్రహించెను. తరువాత సదాశివుఁడు తన లోకముతో గూడ నంతర్ధానముఁజెందగా నచ్యుతుఁడు శివునకు నమస్కారమును సమర్పించి పండ్రెండు వేల దివ్య వత్సరములు తపించినను శంకరుఁడు ప్రసన్నుఁడు గాడయ్యెను.





అందువలన విష్ణువు ఇక నేనేమి చేయవలెనని చింతించుచుండగా సందేహము తొలగుటకై మరల తపించుమని ఆకాశదివ్యవాణి వినిపించెను. అంత నారాయణుఁడు చిరకాలము శివధ్యానమును చేయుచు తపస్సు నాచరించుచు ధ్యానమును విరమించి ఇదేమిటని ఆశ్చర్యపడుచుండగా – చాలకాలము తపించుట యను పరిశ్రమఁజేసియు శివమాయా ప్రభావముననను తన దేహమునుండి నానా జలధారలు బయలుదేరి శూన్యప్రదేశము నంతయు ముంచివేసినవి. ఇట్టి జలము బహురూపమై తాకినంత మాత్రమున పాపములఁ బోకార్చునదై యుండెను. అట్టితతి విష్ణువు అలసియుండుటచే తన శరీరమునుండి యుద్భవించిన ఉదకమునందే శివమాయామోహితుఁడై పెక్కువేళ పరుండియుండుటచే నారాయణుఁడనఁబఱఁగెను. ఆసమయమున పురుషుఁడు దక్క వేరొండు లేకుండెను. ఇంతలో ప్రకృతినుండి సత్త్వరజస్తమోగుణములు, అహంకారము, తన్మాత్రలు, పంచభూతంబులును, జ్ఞానకర్మేంద్రియములు నను ఇరువదినాలుగు తత్త్వములు ఉదయించినవి. పురుషుఁడు దక్క నితరములన్నియు జడములనియే తెలియవలెను. ఇట్టి చతుర్వింశతి తత్త్వములను స్వాధీనపరచుకొని శివేచ్ఛావశంవదుడై శివరూపంబగు నుదకమునందు నారాయణుఁడు నిద్రించుచున్నవాడు.

నరః అనఁగా రుద్రుఁడు, నరునిచే పుట్టింపబడిన ఉదకములు నారములనంబడును. నారములు అయనము (స్థానము) గా గలవాడు నారాయణుఁడని నిర్వచనము.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో షష్ఠాధ్యాయము.**

## సప్తమాధ్యాయము

### (బ్రహ్మవిష్ణువులు తమ ప్రమాదములను గుర్తించుట)

ఇవ్విధము నారాయణుఁడు శయనించుచుండ నాతని నాభినుండి యొకానొక కమలము ఆవిర్భవించెను. అద్ది అవధిలేని కాడ గలదై కొండగోగువలె ప్రకాశించుచుండెను. మరియు అనంతయోజనముల వెడల్పును అపరిమేయ ఔన్నత్యంబును కలిగి కోటిసూర్యప్రతీకాశమూ తత్త్వసంపన్నమై సుందరంబై మనోహరంబై దర్శనీయముగాను అత్యద్భుతముగా నుండెను. ఇది యిట్లుండగా పరమేశ్వరుఁడు పూర్వమువలె యత్నించి దక్షిణాంగమునుండి బ్రహ్మదేవుని పుట్టించి విష్ణునాభికమలము నందు పడవేసియుండెను. అట్టితతి విధాత – చతుర్ముఖుండై రక్తవర్ణుఁడు గాను నొసట భస్మత్రిపుండ్రములు కడుపులో బంగారము గలవాడుగా నుండెను. ఈ సృష్టిక్రమ మంతయు శివేచ్ఛావశముననే సంభవించు నను నంశమును మరువరాదు. అప్పుడు పితామహుఁడు – కమలము దక్క నితరమును తెలియనివాడై జ్ఞానదౌర్బల్యమున తన జనకుని గుర్తురుఁగజాలకుండెను.

"నేనెవఁడను? ఎక్కడినుండి వచ్చితిని? కర్తవ్య మెద్ది? ఎవనికి కుమారుడనై జన్మించితిని? ప్రస్తుతము నన్నెవడు పుట్టించెను?" అని బ్రహ్మదేవుఁడు విచారించి ఈ కమలముఁదగు జాడఁదెలిసి కొందునని నిర్ణయించుకొని కమలనాళములో ప్రవేశించి నూరువత్సరములు పయనించినను కమలముఁ దగు మూలమును గానడయ్యెను. కమలముఁదగు నాళము క్రింది భాగమునుండి పైభాగమున కతెంచి





చూడగా కమల ముఖము గానరాదయ్యెను. ఇట్లు నాళము నందే మరి నూరు వత్సరములు గడిచినవి. అట్టితఱి తపించుమని దివ్యవాణి యుపదేశింపగా పండ్రెండు వత్సరములు విధి తపించినందున చతుర్భుజుఁడు కమలలోచనుఁడు భగవానుఁడునగు విష్ణువు ప్రత్యక్షము కాగా బ్రహ్మదేవుఁడు ఆ దివ్యసుందరరూపమును గాంచుచు లోలోన విస్మయమును అనందము ననుభవించుచు శివమాయా ప్రభావమున తన జనకుఁడని తెలియక విష్ణువును సమీపించి దృఢమైన కరతాడనముతో నీవెవఁడవని యడుగగా నంత నారాయణుఁడు మేలుకొని "నాయనా? బ్రహ్మదేవా? స్వస్థచిత్తుడవు కమ్ము! ఎట్టి భయముఁజెందవలదు! నీకు వలయు కోర్కెలనన్నిటి నీడేర్తునని ప్రబోధించెను.

శంఖచక్ర గదా పద్మధరుఁడు ఘనశ్యామలుడు ప్రసన్నవదనాంబుజుడు కోటి కందర్ప సంకాశుఁడు నగు కేశవుఁడట్లు ప్రబోధించినను పెడచెవిని పెట్టి బ్రహ్మయిట్లు భాషించెను.

బ్రహ్మ – వత్సా! వత్సా! అని బీరములు పలుకుచున్నావు! గురువు శిష్యునివలె నన్ను భావించుచున్నావా? ప్రకృతిని ప్రవర్తింప జేయువాడనై జగములను పుట్టించువాడను సనాతనుడను విశ్వాత్మకుడను స్వయంభువును పితామహుడను పరమేష్ఠిని సర్వోత్తముడను నేనే గదా!

విష్ణువు – చతుర్ముఖా? జగములను సృజించుటకు నేనే నా నాభికమలముల నుండి నిన్ను పుట్టించితిని. సర్వవ్యాపకుడననియు విశ్వకర్తననియు నన్ను గుర్తెరుగకున్నావు. ఇందు నీ యపరాధమేమియు లేదు. అంతయు నా మాయావిలాసమని తెలియుము! కర్తృత్వము హర్తృత్వము భర్తృత్వంబును నాయవియేను; నాతో సమానుడైన ప్రభువు లేడు. నేనే పరబ్రహ్మమును; పరతత్త్వమును; పరంజ్యోతిని; పరమాత్మను; ఇప్పుడు చూచుచున్నది ఈవరకు చూచినదియు వినినదియు సమస్తంబును నా విభూతి యనియే తెలియుము! చతుర్వింశతి తత్త్వములను నేనే కల్పించితిని. బ్రహ్మ – నారాయణా? ఎందుకిట్లు ప్రలపింతువు! నా ముందు నీ వెవఁడవు? నీ వాక్యము అనర్థహేతువని తెలియకున్నావు. నిజముగా నీవు ప్రభువు కావు, ఒకానొక మహాపురుషుఁడు నీకు కర్తగా నుండియుండును.

ఇట్లు రజోగుణదూషితులై బ్రహ్మవిష్ణువులు కలహించుకొని ప్రళయార్ణవ మధ్యమున ఘోర సంగ్రామము నొనర్పగా నవ్వారి పోరు నుపశమింప నీశ్వరుఁడు లింగాకారమున నావిర్భవించినవాడు.

లింగస్వరూపము – వెలకొలది మంటలతో వెలుగొందునదియు నూర్లకొలది ప్రళయాగ్నులతో సమాన మగునదియు క్షయవృద్ధులు లేనిదియు ఆదిమధ్యాంత వర్జితంబు అనౌపమ్యంబు ననిర్దేశ్యంబు నవ్యక్తంబు విశ్వకారణంబునై యుండెను.

అట్టితఱి విధికేశవులు హంసవరాహ రూపములఁదాల్చి లింగముఁదగు ఆద్యంతములను కనుగొన ప్రయత్నించి విఫలులై పూర్వస్థానమున కేతెంచి విగతమత్సరులై మన మిరువురమును పరాత్పరులము కామని నిగర్వనిర్మలచిత్తము గలవారై మహేశ్వరుని పలువిధముల నుతించి శతవర్షముల కాలము శివనమస్కారములను సమర్పించి మదమోహముల వలన సంభవించిన మా యపరాధమును మన్నింపుము దేవా! యని విన్నవించినవారైరి.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో సప్తమాధ్యాయము.**

# అష్టమోధ్యాయము

## (శబ్దబ్రహ్మస్వరూపవర్ణనము)

ఇవ్విధము బ్రహ్మవిష్ణువులు విస్మయముతో ప్రార్థించుచు దర్శనమును కోరుచుండగా దీనబంధువు సర్వాధీశ్వరుఁడును గర్వాపహర్తయునగు శంకరుఁడు ప్రసన్నుండయ్యెను. అట్టి తఱి ఓంకారనాదము సుస్పష్టమగుచుండగా ఇదేమిటని విష్ణువు సముత్సాహముతో పరికించు చుండెను. ఆద్యమైన ఆకారము లింగముఁదగు దక్షిణదిశయందును ఉకారము ఉత్తరదిశయందును మకారము లింగమధ్యమునందును చివరన నోంకారనాదంబును పొడగట్టుచుండెను. మరియు అకారము సూర్యమండలమువలెను ఉకారము అగ్నివలెను మకారము చంద్రమండలము వలెను ప్రకాశించుచుండినవి. అవ్వానిపై సత్యస్వరూపము ఆనందాత్మకంబు అమృతంబు వేద వేద్యంబు విశ్వాత్మకంబునగు శివతత్త్వము స్ఫురించుచుండెను. "యో వేదాదౌ స్వరః ప్రోక్తః- వేదాంతే చ ప్రతిష్ఠితఃతస్య ప్రకృతిలీనస్య - యః పరః స మహేశ్వర" అను శ్రుతియే ఇందుకు ప్రమాణము.

ఆ శుభ దివ్య సమయమున ఒకానొక ఋషి సాక్షాత్కరించి - మహాదేవుఁడు - శబ్దబ్రహ్మ తనువనియు పరబ్రహ్మంబనియు చింతారహితుండనియు మనోవాగతీతుండనియు, అమృతుండనియు సచ్చిదానంద స్వరూపుడనియు పరమకారణుఁడనియు ఓంకారవాచ్యుండనియు బ్రహ్మ విష్ణువులకు బోధించుచుండెను. మఱియు అకార ఉకార మకారములనుండి బ్రహ్మ విష్ణుమహేశ్వరులు ఆవిర్భవించి సృష్టిస్థితిలయముల నొనర్చుచున్నారు. మకారము బీజియనియు ఆకారము బీజమనియు ఉకారము యోనియనియు నాదము అనుసంధానమనియు తెలియవలెను. బీజియగు రుద్రుఁడు నాదస్వరూపుడగు మహేశ్వరునిచే ప్రేరేపింపఁ బడి బీజంబగు ఆకారమును యోనియగు విష్ణువునందు విసర్జించెను. అంత సువర్ణమయమైన బ్రహ్మాండము ఉద్భవించి దివ్యవర్షసహస్రము జలమునందు పరిపక్వమై రెండు వ్రక్కలయ్యెను. అందు పైభాగము ఊర్ధ్వలోకములుగను క్రిందిభాగము పృథివ్యాదిలోకములుగను పరిణమించెను. ఇట్లు యజుస్సులు ఋక్కులు సామంబులును "ఓమ్" "ఓమ్" అని విశదీకరించుచుండగా నారాయణుఁడు పంకజాసనుఁడును పలువిధముల మహేశ్వరుని ప్రార్థించుచుండిరి. ఇంతలో నొక దివ్యరూపము - ఐదుముఖములు పదిచేతులు గౌరకర్పూరవర్ణంబును కలిగి నానావిధ కాంతులతోడను అనేక అలంకారములతోడను గొప్ప ఉదార స్వభావముతోడను మిగుల పరాక్రమముతోడను మహాపురుషుఁడుగా గోచరింప విధివిష్ణువులు సంతుష్టులై యవలోకించుచుండగా పరమేశ్వరుఁడు దివ్యశబ్దమయ స్వరూపము గలవాడై చిరునగవుఁజెందుచుండెను.

అకారము శిరస్సుగాను ఆకారము లలాటముగాను ఇకారము కుడికన్నుగాను ఈ కారము ఎడమకన్నుగాను ఉకారము కుడిచెవిగాను ఊకారము ఎడమచెవిగాను ఋకార ౠకారములు దక్షిణవామకపోలములుగాను కారములు నాసాపుటములుగాను ఏకార ఐకారములు పై క్రింది పెదవులుగాను ఓంకార ఔకారములు పలువరుసలుగాను అం అః అనునవి దౌడలుగాను క ఖ గ ఘ ఙలు ఐదు కుడిచేతులుగాను చ ఛ జ ఝ ఞలు ఐదు ఎడమ చేతులుగాను ట ఠ డ ఢ ణ, త థ ద ధ నలు పాదద్వయము గాను పకారము కడుపుగాను ఫ బ లు పార్శ్వ ద్వయముగాను భకారము స్కంధము

(మూపు) గాను మకారము హృదయము గాను య ర ల వ శ ష స లు సప్తధాతువులుగాను హకారము నాభిగాను క్షకారము ఘ్రాణముగాను కన్పట్టు ఉమాసహిత మహేశ్వరుని శబ్దబ్రహ్మ స్వరూపమును గాంచి విధివిష్ణువులు కృతార్థులైరి. మరియు పైన ఓంకార ప్రభవంబు కలాపంచకసంయుతంబు శుద్ధస్ఫటిక సంకాశంబు అష్టత్రింశదక్షరంబు నగు మంత్రము మేధస్సుగా గోచరించుచుండెను. ఇంకను గాయత్రి మహామంత్రము, త్రింశదక్షరమంత్రంబు, పంచవింశదక్షర మంత్రంబు ఏక షష్టివర్ణకమంత్రంబు, మృత్యుంజయ మంత్రంబు, పంచాక్షరమహామంత్రంబు, చింతామణిమంత్రంబు, దక్షిణామూర్తి మంత్రంబు విశదపడగా నవ్వానిని పరిగ్రహించి నారాయణుఁడు జపించుచుండెను మరియు నా సదాశివుడు ఈశాన తత్పురుష అఘోర వామదేవ సద్యోజాత మంత్రములందగు స్వరూపము గలవాఁడై మహాభోగీంద్రభూషణుఁడై సర్వవ్యాపకుఁడై బ్రహ్మాధిపతియై సృష్టి స్థితిలయకారకుఁడై వరదుఁడై సాక్షాత్కరింప నాతనిని ప్రియములైన వాక్కులతో పంకజాక్షపంకజాసనులు వేడుకొనుచుండిరి.

"ఇయ్యది శివవిజ్ఞాన సర్వస్వ" మను ఆంతరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో అష్టమాధ్యాయము.

## నవమాధ్యాయము

### (శివతత్త్వ వర్ణనము)

విష్ణుబ్రహ్మకృతస్తోత్రము నాకర్ణించి శివుఁడు - పంచవదనుఁడుగాను త్రినేత్రుఁడుగాను ఫాలచంద్రుఁడు గాను జటాధరుండుగను గౌరవర్ణుఁడుగాను విశాలాక్షుఁడుగాను భస్మోద్ధూళిత విగ్రహుఁడుగాను దశబాహువుగాను నీలకంఠుడుగాను సర్వవిధభూషణ భూషితుఁడు గాను సర్వాంగసుందరుఁడుగాను భస్మత్రిపుండ్రాంకితమస్తకుఁడుగాను సాక్షాత్కరింపగా నా సాంబమూర్తికి మ్రొక్కులిడి అనేకవిధస్తోత్రములతో విధివిష్ణువులు ప్రార్థించుచుండిరి.

అంత శంకరుఁడు తన నిట్టూర్పులద్వారా వేదములను కేశవున కొసఁగి వేదార్థ రహస్యమునంతయు బోధించెను. అటులే విధికి వేదంబుల నిడి యవ్వాని రహస్యమును తెలిపెను. అట్టితతి విష్ణువు కృతాంజలియై బ్రహ్మతో గూడ మరియొకతూరి నమస్కరించి క్రింది విధము ప్రశ్నించెను.

మహాదేవా? ఎద్దానినాచరించినచో సంతోషింతువు? నిన్ను పూజించు విధానమెట్టిది? నిన్నెట్లు ధ్యానింపవలెను? భక్తులకు వశుండవగుట యెట్లు? ఇకముందు మేమిరువుర మేమి చేయవలెను! ఎల్లకాలము మమ్ముశాసించువాడవు నీవేను: మా యందు దయఁదలచి తగు సమాధానమును చెప్పుమని విన్నవింపగా నా పరాత్పరుఁడు సుప్రసన్నుఁడై చెప్పఁదొడగెను.

సురసత్తములారా! మీ యిరువురి భక్తికి సంతసించితిని. నన్ను భావించినచో ఎట్టి భయంబును సమకూరదు. ప్రస్తుతము కనంబడు శివలింగమును సదా పూజింపడు! లింగ స్వరూపమునందర్చింపఁబడువాడనై భక్తుల మనోఽభీష్టముల నీడేర్చుచుందును. మీరు సంకటము సంభవించినపుడు లింగార్చనమును చేయుఁడు! నాయందు మీయుభయులకు దృఢభక్తి యేర్పడుగాత!





ఐతే శివలింగములలో శ్రేష్ఠమగు పార్థివలింగమును పూజించుట శ్రేయస్కరమని భావింపవలెను. బ్రహ్మదేవా? నీవు జగత్సృష్టిని చేయుమని యాజ్ఞాపించుచున్నాను. నాయనా విష్ణో! చరాచరప్రపంచము నంతయు కాపాడుచుండుము!

ఇంతియేగాక శివపూజావిధానమునంతయు ప్రభోధింపగా విష్ణువు - శంకరా? మా యందు సంపూర్ణకటాక్షమును ప్రసరింపఁజేసి యెల్లకాలము నీచరణపంకజములయందు దృఢభక్తియుండునట్లు ఆశీర్వదింపమనియు వస్తుతః నీవు ఎట్టిలంపటములేనివాడవైనను మాకు సహకరించుటకు నవతరించు మనియు నివేదించి శిరస్సునందంజలి నిడుకొని మ్రొక్కులిడెను.

అంత సదాశివుఁడు - ప్రళయస్థితి సర్గములకు నేనే కర్తననియు; పరమాత్మను నిర్వికారుండను సచ్చిదానంద స్వరూపుడను; ఐతే స్వయముగా గాక సృష్టిస్థితిలయముల నొనర్చుటకు బ్రహ్మవిష్ణు రుద్రస్వరూపములఁ దాల్చువాడను నేనే యనియు చెప్పినవాడై మీరు కోరిన విధముగా బ్రహ్మలలాటము నుండి రుద్రుడుగా నవతరింతుననియు రుద్రునికి నాకు నెట్టిబేధము లేదనియు రుద్రపూజావిధానమే నన్ను పూజించువిధానమగుననియు లోకములో నగ్నిసంబంధముచే జలమును స్పృశింపరానట్లు నా సంబధమువలన రుద్రుఁడు శివుఁడే యనియు వస్తుతః శివరుద్రులొకేరూపమనియు అద్దియే రెండు విధంబులయ్యెననియు అలంకార భేదమున్నను సువర్ణమొక్క టేయైనట్లు శివరుద్రులకు నామభేధము మాత్రంబనియు; మీరును నన్ను రుద్రుని యేక భావనతో నారాధింపుడనియు ముమ్మూర్తులకు మూలరూపము నేనే యనియు అద్దియే సత్యజ్ఞానానంతముగా ధ్యానింపఁదగినదనియు వాక్రుచ్చెను. ఐతే ఇఁటనొక గోప్యమును గమనింపుడు! మీరిరువురు ప్రకృతినుండి జన్మించినవారు; అవతరింపఁ బోవు రుద్రుఁడు మాత్రము ప్రకృతి జన్ముఁడు కాజాలడు; బ్రహ్మనొసటినుండి ఆవిర్భవించిన రుద్రుడు తమోగుణము నధిష్ఠించియుండును. వస్తుతః తామసుఁడు కాడు; ఉమయనఁబడు ఈ దేవీయే ప్రకృతియగును. ఇట్టి ప్రకృతిఁదగు రెండవరూపము సరస్వతియై బ్రహ్మదేవునికి సహధర్మచారిణియగును మరియొక రూపము లక్ష్మియై విష్ణుమూర్తి కర్థాంగియగును. అన్యరూపము కాళియై రుద్రునాశ్రయించును. లోకమునంతయు బ్రాహ్మణాది చతుర్వర్ణముల తోడను బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయముతోడను నిర్మించి వారికి వలయు సౌకర్యముల నేర్పరచియు జ్ఞానవిజ్ఞానసంపన్నులై సుఖముగా వర్తింపుడు! శివుఁడనగు నేను సత్త్వరజస్తమోగుణాతీతుడనై అనఁగా శుద్ధసత్త్వగుణసంపన్నుడనై ప్రకృతిపురుషుల నతిక్రమించువాడనై పరబ్రహ్మంబునై నిత్యుడనై అనంతుడనై పరిపూర్ణుడనై నిరంజనుడనై యుండువాడను.

**శ్లో॥ అంతస్తమో బహిఃసత్త్వ - స్త్రీజగత్పాలకో హరిః ।**
**అంతస్సత్త్వస్తమో బాహ్య - స్త్రీజగల్లయ కృద్ధరః ॥**
**అంతర్బహిరజశ్చైవ - త్రిజగ త్సృష్టికృ ద్విధిః ॥**

విష్ణుమూర్తి - లోన తమోగుణముకలవాడై వెలుపల సత్త్వగుణవంతుడై మూడు లోకములను కాపాడుచుండును. మహేశ్వరుఁడు - లోన సత్త్వగుణము కలవాడై బయట తమోగుణసంపన్నుడై ప్రళయమును చేయుచుండును. బ్రహ్మదేవుఁడు - లోన వెలుపలను రజోగుణము కలవాడై జగమును నిర్మించువాడు.

ఇంకను నారాయణా? అన్ని విధముల చతుర్ముఖుని రక్షించుచుండుము. త్రిలోకముల యం పూజనీయుడవగుదువు. శివుని పూర్ణావతారమగు రుద్రుని నీవును బ్రహ్మయు సేవింప వలసి యుండు

ఇవ్విధము వక్కాణించి బ్రహ్మవిష్ణువులనుద్దేశించి వెండియు పలుక నారంభించెను.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నవమాధ్యాయము.

## దశమాధ్యాయము

### (పరమ శివతత్త్వనిరూపణము)

మాధవా? ఎల్లపుడు లోకములన్నిటియందు గౌరవింపబడుదువు గాత! బ్రహ్మ నిర్మితంబ ప్రపంచమున కలుగు దుఃఖమును తొలగింప నుద్యుక్తుడవగుచుండుము! నీకు సంకట సంభవించినపుడు సహాయపడుచుందును. మిక్కిలి ఉద్ధతులైన నీ శత్రువులను సంహరించుచుండు అనేకవిధ అవతారములఁజెంది గొప్పకీర్తిఁ గడించుము! ప్రాణులను సన్మార్గులనుగా నొనర్చువాడవగుదు నీ చేతకాని పనినంతయు నేను సాధించుచుందును. భక్తుల ననుగ్రహించుచు దుష్టుల నిగ్రహించుచుండుము.

ఇటుల చెప్పుచు విష్ణుమూర్తిని తన హస్తముతో స్పృశించి యీ బ్రహ్మదేవునకు నన్నివేళల యం సర్వవిధములుగా సాహాయ్యమును గావింపుము! భక్తుల కోర్కెలనీడేర్చుచుండుము! సంకటసమయము నా శరీరమగు రుద్రుని భజింపుము! అని వక్కాణించెను.

ఇఁక నాయుష్యమును చెప్పుచున్నాను. వినుము!

నాల్గువేలయుగములు - బ్రహ్మదేవుని కొక్కదినంబగును. రాత్రియునంతియేనని తెలియవలెను. అ దినములు ముప్పదియగునెడ నొక మాసంబు, అట్టి మాసములు పండ్రెండ్రు గడచినచో నొక సంవత్సరం అట్టి వత్సరములు వంద యగునేని బ్రహ్మదేవుని జీవితము పూర్తియగును. బ్రహ్మదేవుని యొ సంవత్సరకాలము విష్ణుమూర్తికి నొక్కదినంబగును. ఈ విధము విష్ణుమూర్తికి నూరువత్సరము లాయుష్య చెప్పఁబడుచున్నయది. విష్ణువుఁదగు వర్షముతో రుద్రున కొక్కదినముగా నూరు వత్సరములు గడచిన రుద్రుఁడు నర స్వరూపముతో విరాజిల్లుచుండును. (ఇచ్చట నరుఁడనఁగా మానవుఁడని యర్థ కాదు. న రమత ఇతి నరః అను వ్యుత్పత్తిననుసరించి స్వాత్మారాముడై యుండునని భావము.)

(సృష్టికాలములో ఇట్టి నరునిచే సృజింపఁబడినవే నారములు అనఁగా ఉదకములగు నని నారములే ఆయనములుగా కలవాడు నారియణుఁడనియు వివేకము.)

ఇరువదియొక్కవేల ఆరువందల నిట్టూర్పుల కాలము అహోరాత్రంబగును. ఉచ్ఛ్వాసనిశ్వాసము లారిటితో నొక విఘడియయు అరువది విఘడియలతో నొకఘడియ అరువదిఘడియలతో నొక్కదినంబగును.





నిజముగా విచారించినచో ఉచ్ఛ్వాస నిశ్వాసములను పరిగణింప శక్యము కాదు. ఇదియంతయు సదాశివుని లీలావిలాసము కావుననే అతడు అక్షయుండని పేర్కొనంబడుచున్నవాడు.

ఇంక నీ విష్ణురూపమును జాగరూకుడవై కాపాడుకొనుమని శంకరుండు చెప్పగా మాధవుడు వినమ్రుడై (బ్రహ్మదేవునితో గూడ) దిగువ విధము విన్నవించెను. పరమేశ్వరా? నీవలననే సర్వవిధసామర్థ్యములంబడయంగలుగుచున్నాను కావున నీవే నాకు సదా ధ్యేయుండవు!

ఐతే ఇక ముందు నిన్ను ధ్యానించుటలో క్షణకాలమైనను విస్మృతి కలుగకుండునట్లనుగ్రహింపుము! నా భక్తుడై నిన్ను నిందించునెడ నట్టివానికి ఆచంద్రతార్కారము నరక నివాసము సంభవించుగాత! నీ భక్తుండును నాకత్యంతప్రియుండుకాగలడు! ఇట్లు తెలిసికొనిన వానికే మోక్షము కరతలామలకంబగును. నా దగు మహిమను నీ యనుగ్రహమున పెంపొందించుకొందును. కాని యెప్పుడైన నపచారము సంభవించునెడ క్షమింపుము!

అని నారాయణుండు విన్నవింపగా చంద్రశేఖరుడట్లే క్షమింతునని పలుకుచు బ్రహ్మ విష్ణువులను తన యమృతహస్తముతో తాకుచు అనేకవిధ ధర్మములనుపదేశించి యనేక వరముల నొసంగి యంతర్ధానముం జెందెను. అప్పటినుండి అనంగా సృష్ట్యాదినుండియు శివలింగ పూజావిధి యేర్పడుటయే గాక భక్తిముక్తిప్రదాయకుండగు శివుండు - లింగమునందు స్థిర నివాసమును చేయుచున్నవాడు.

లింగముందగు వేదిక - అనంగా ప్రాణవట్టము శక్తియనియు లింగముందగు పిండము సాక్షాత్తు మహేశ్వరుండనియు గుర్తెరుగవలెను. అద్దానియందే జగమంతయులీనమగును కావున లింగ మనంబడుచున్నయది.

శివలింగ సన్నిధానమున లింగోద్భవ వృత్తాంతమును పఠించువాడు ఆరుమాసములలో పరిశుద్ధుండగుననియు శివాలయమున ఏదేనొక పుణ్యకార్యము నాచరించు వాని పుణ్యము అగణితంబగుననియు తెలియవలెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదియవ యధ్యాయము.

# ఏకాదశాధ్యాయము

## (శివపూజా విధానము)

అంత శౌనకాది మహర్షులు - వ్యాసశిష్యుడైన నో సూతమహాభాగా? పరమ పావనంబ శివమహిమయందు అద్భుతంబైన లింగోత్పత్తి విధానంబు విని దుఃఖములను తొలగించుకొంటి పూర్వము నారదునికి బ్రహ్మదేవుఁడు చెప్పినవిధముగా శివపూజావిధానము నెఱిఁగించుమని ప్రశ్నింప సూతమహర్షి చెప్పఁదొడఁగెను.

మునులారా? మీరడిగినది రహస్యంబైనను సనత్కుమారుని వలన తెలిసికొని వేదవ్యాసుడు నా తెలిపినవిధంబుగా వక్కాణించుచున్నాను. ఇట్టిదానినే ఉపమన్యుమహర్షి శ్రీకృష్ణమూర్తికి ప్రబోధిం యుండెను.

లింగార్చనంబు వర్షశతమునకైనను చెప్పనలవి కాదు. కావున సంగ్రహముగా చెప్పుచున్నవాడ సనాతనము స్వచ్ఛము సుఖప్రదంబు నగు శివలింగమును పరాభక్తితో పూజింపవలెను. శివలింగార్చ జేయువారికి దరిద్రము తొలగును. రోగములు నశించును. దుఃఖములు సమయును, శత్రుబ దూరమగును. మనోవాక్కాయసంభవము పురాకృతమునగు పాపము శమించును. మరియ ఇహసుఖములన్నియు చేకూరుటయేగాక మోక్షంబును సంసిద్ధంబగును.

శ్లో॥ యా వై మానుష్య మాశ్రిత్య - చేచ్ఛే త్సంతానతః సుఖమ్ ।
తేన పూజ్యో మహాదేవః - సర్వకార్యార్థసాధకః ॥

మానవజన్మను పొంది పుత్రసంతానసుఖమును కోరునెడల - సర్వాభీష్టముల నొసగు మహాదేవ పూజింపవలెను.

బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులును తమ తమ కోర్కెలను సిద్ధింపఁజేసికొనుట శివుని పూజింపనగును.

ప్రతి దినము ప్రాతఃకాలమున మేలుకొని గురువుని శంకరుని పుణ్య తీర్థములను నారాయణు బ్రహ్మదేవుని ఇంద్రాది దేవతలను సనకసనందనాది మునులను నందీశ్వరాది శివభక్తులను స్మరిం విధియుక్తముగా శివస్తోత్రములను పఠింపవలెను. పిమ్మట దక్షిణదిశకుఁజని మలవిమోకముఁజేశి తరువా దంతధావనము నాచరించి చేరువనున్న నదీతటాకాదులయందు పుణ్య తీర్థముల యందైనను యథావి స్నానముఁజేశి భస్మత్రిపుండ్రములఁదాల్చియు ఏకాంతముగా పరిశుభ్ర స్థలమున సంధ్యావందన నాచరింపవలెను. తరువాత మనశ్చాంచల్యమును విడనాడి పూజా మందిరములో ప్రవేశిం పూజాపరికరములను చెంత నుంచుకొని సుఖాసనము నందుపవిష్టుడై మొదట ఆచమనమును సంకల్ప నాచరించి గణాధిపతిని ద్వార దిక్పాలకులను పూజించి శివునకు పీఠము నేర్పరుపవలెను. అథవా న పళ్లెరము నందైనను శివలింగమును నెలకొలిపి శంకరుని ఐదు ముఖములు దశభుజములు గలవానిగా త్రినేత్రునిగాను శుద్ధ స్ఫటిక సన్నిభునిగాను సర్వాభరణ సంయుక్తునిగాను వ్యాఘ్రచర్మోత్తరీయునిగా

ధ్యానించి శివునితో సమానమైన రూపము తనకు వచ్చినట్లు భావించి పాపమునంతయు దహించి వేయవలెను. తరువాత మూలమంత్రముతో కరాంగ న్యాసముఁగావించి నిర్మల హృదయుడై పాద్యార్ఘ్య ఆచమన పాత్రలను నెలకొలిపి వివిధములైన తొమ్మిది కలశముల నుంచి యవ్వాని యందు శుద్ధ జలమును పూరించి వట్టివేరు, శ్రీగంధము, అనువానిని పాద్యపాత్రోదకమునందు, జాజికాయ, పచ్చకర్పూరము, మల్లి ఊడలు, తమాలపత్రము అనువాని చూర్ణమును ఆచమన పాత్రయందును శ్రీగంధ చూర్ణము నన్నిటియందును వేయవలెను. శివుని సన్నిధానమున ధూపదీపసుగంధ ద్రవ్యముల సమర్చి అణిమాద్యష్టసిద్ధులను శివునికి పూర్వాది దిశలయందు నెలకొలిపి శివునకు ప్రణవముతో ఆసనమును కల్పించి సోమసూర్యాగ్నులను ధర్మాదులను పీఠము క్రింద నున్నట్లు క్రమముగా భావింపవలెను. అవ్యక్తము మున్నగువానిని నాలుగు దిశలయందు తలచి సోముని సమీపమున సత్త్వరజస్తమోగుణములను భావింపవలెను. తరువాత నందికేశ్వరుని పూజింపవలసియుండును. ఇఁక "సద్యోజాతం ప్రపద్యామి" అను మంత్రముతోడ శివున కావాహనమును వామదేవ మంత్రమున పీఠమునందుపవేశమును రుద్రగాయత్రితో సన్నిధానమును అఘోర మంత్రమున నిరోధంబును అనఁగా శివేతర క్షుద్రదేవతలను భూత ప్రేతపిశాచాదులను నిరోధించుటను ఈశాన మంత్రముతో పాద్య ఆచమనీయ అర్ఘ్యంబులను సమర్పింపవలెను. పిమ్మట శ్రీగంధోదకముతో పంచగవ్యములతోడ పవిత్రభాండములయందు వస్త్రపూతముగా నింపఁబడిన శుద్ధోదకముతోడను రుద్రాధ్యాయాదులను పఠించుచు అథవా వేద విదులగు బ్రాహ్మణోత్తములతో పఠింపఁజేయుచు ఏకోత్తర శతసహస్ర జలధారల నభిషేకింపవలెను. తరువాత శుద్ధ వైదిక భస్మ నలంది శ్రీగంధమునుశుభ్రాక్షతలను సమర్పించి కుశ పుష్పంబులను ఉత్తరేణులను జాజిపుష్పములను చంపకములను పాటల (కలిగొట్టు) పుష్పంబుల తెల్లగన్నేరులను మల్లెపువ్వులను కమలములను కలువలను వివిధ అపూర్వ పుష్పంబుల నర్చింప వలెను. అభిషేకించునపుడు రుద్ర సూక్త మృత్యుంజయాది మంత్రములను పఠించుటచే సకలారిష్టశాంతి యగును. పిమ్మట కోమల బిల్వదళములను ధూపదీపఅవసర నైవేద్యములను తాంబుల దక్షిణలను ఫలములను సమర్పింపవలెను. శివుఁడు – స్ఫటిక సన్నిభుండనియు నిష్కళుండనియు అక్షయుండనియు సర్వలోక కారణుండనియు లోకాత్మకుండనియు బ్రహ్మేంద్రో ప్రేంద్ర విష్ణ్వాదుల కగోచరుండనియు వేదవిదులచే వేదాంతులచేత నగమ్యుఁడుగా చెప్పఁబడుననియు ఆదిమధ్యాంత రహితుండనియు సర్వరోగవైద్యుండనియు లింగస్వరూపుండనియు భావింపవలెను.

తరువాత మంగళ నీరాజనమును మంత్రపుష్పమును నమస్కారములను సమర్పించి నానావిధ స్తోత్రములను అనేక మహామంత్రములను పఠించి యర్ఘ్యము నొసగి శివలింగముఁదగు పాదముల యందు పుష్పముల నర్పించి కృతాంజలియై హస్తమునందు పుష్పముల నిడికొని దిగువ విధము ప్రార్థింపవలెను.

శ్లో॥ అజ్ఞానా ద్యది వాజ్ఞానా - జ్జపపూజాదికం మయా
కృతం తదస్తు సఫలం - కృపయా తవ శంకర ॥ 74

శంకరా! తెలిసిగాని తెలియకగాని నేను చేసిన జపపూజాదిక మంతయు నీ యనుగ్రహమువలన సఫలమగు గావుత!





ఇట్లు ప్రార్థించి కొన్ని పుష్పములను సమర్పింపవలెను. తరువాత ప్రణిపాత పూర్వకము క్షమాపణమును వేడుకొని తానొనర్చిన దురితముల నొకమారు తలచుకొని పదేపదే ప్రార్థింపవలె సర్వవిధ భక్తిభావ సమన్వితుడై పరమేశ్వరా! ప్రారబ్దానుసారము సంఘటించు ప్రతి జన్మయందును యందు భక్తి నొసగుము! మరియొకడు రక్షకుఁడులేడు కావున నిన్నే శరణు పొందుచున్నాను. సర్వ ప్రదాతయగు దేవదేవు నిట్లు ఆరాధించి పరాభక్తితో కంఠరవముల శివనామధేయముల నుచ్చరించు తన పరివారముతో గూడ సంతోషాతిశయముఁ జెందవలెను. ఇట్టివారు మనోఽభీష్టఫలము నొందుట గాక యుక్తి యుక్తముగా మాటలాడు వారగుదురు. రోగమును దుఃఖంబును హృద్వేగంబును కృత్రి విఘాతంబులను కుటిల కృత్యంబులను విష ప్రయోగంబును అయా సమయములయందు తటస్థిం ఇక్కట్టులను పరమకారణుడైన శివుఁడు పోగొట్టును. శుభముల నొనఁగూర్చును. శుక్లపక్షమునంది చంద్రునివలె శివారాధకుని సద్గుణములన్నియు దినదినాభివృద్ధములగును. శివపూజా విధానము సంగ్రహముగా చెప్పినవాడను. ఇఁక నీ వడిగిన దానిని నా శక్తి కొలది వక్కాణింతును.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏకాదశాధ్యాయము.

## ద్వాదశాధ్యాయము

### (శివపూజా విధానమునందలి సారాసారములను నిరూపించుట)

శివపూజా విధానమునే బాగుగా మరల వివరింపుడని ప్రశ్నింపగా సూతుఁడు చెప్పనారంభించె

ఒకప్పుడు - బ్రహ్మదేవుఁడు ఋషులను దేవతలను రప్పించి "మీకు నిత్యసుఖము నందజే కలదేని మోక్షమును కోరునెడలను నాతో గూడ క్షీరసముద్రమునకు రండ"ని చెప్పగా వారందరు బయలుదే సర్వహితకారకుండగు మహావిష్ణువు నివసించు ప్రదేశమునకు వెళ్లిరి. అచ్చట జగన్నాథుండై జనార్దనుఁడు దర్శనము నీయగా కృతాంజలులరై నమస్కరించిరి.

అంత విష్ణువు - బ్రహ్మాది దేవతలారా? ఋషులారా? ఎందుకే తెంచితిరి? నేనేమి చేయవలె యడుగగా నమరులు - దుఃఖములన్నియు తొలగుటకై నిత్యము ఎవని సేవింప వలెనని వినమ్ర ప్రశ్నించిరి.

అట్టితతి నారాయణుఁడొక తూరి శివపదాంభోజములను స్మరించి చెప్పఁదొడగెను.

శ్లో॥ సేవ్యః సేవ్యః సదా దేవః - శంకరః సర్వదుఃఖహా ।
త్యాజ్యం తదర్చనం నైవ - కదాఽపి సుఖ మిచ్ఛుభిః ॥

"ప్రారబ్ధకర్మానుసారము సంసారములో సంభవించు ఇబ్బందుల నన్నిటిని పోగొట్టు శంకరుఁ అనఁగా శివలింగమే ఎల్లకాలము నియమిత సమయములయందు ఆరాధింపఁదగినది. ఇహపరసుఖము నిచ్ఛగించువారు ఎట్టి పరిస్థితులలోను శివపూజనమును మానరాదు." లింగమూర్తి యగు మహేశ్వరు విస్మరించి తారకాసురకుమారులు తమ బంధుపరివారములతో నశించినవారు.





దేవదానవులు, ఈ బ్రహ్మదేవుఁడు నేనును నిత్యము శివలింగము నర్చించుచున్నాము. ఏదేనొక కారణమున అనఁగా ఆర్తుఁడై కాని జిజ్ఞాసువై కాని అర్థార్థియై కాని జ్ఞానియై కాని శివలింగమును నిత్యము పూజింపవలెను.

జీవితములో ప్రతిదినము ఒక్క మహూర్తకాలమైనను అథవా క్షణకాలమైనను శివుని సేవింపకుండుటయే గొప్ప దోషమనియు మిక్కిలి గ్రుడ్డితనమనియు కడుంగడు మోహావేశమనియు మిగుల పొరపాటనియు తెలియవలెను.

శివభక్తి సంపన్నులు, శివాసక్తమానసులు, శివస్మరణతత్పరులు నెన్నటికిని దుఃఖముల పాలు కారు.

మనోహర భవనములను లావణ్యవతులు ఆభరణభూషితలు నగు తరుణులను తృప్తి కలుగువరకు ధనమును పుత్రపౌత్రాదిసంతతిని శరీరారోగ్యమును లోకాతీతగౌరవమును స్వర్గసుఖమును శివభక్తి పరంపరాఽభివృద్ధిని అంత్యకాలమున శివసాయుజ్యమును కోరువారు–పూర్వపుణ్యబలమున సదాశివు నారాధింతురు.

శ్లో॥ యోఽ ర్చయే చ్ఛివలింగం వై - నిత్యం భక్తిపరాయణః ।
తస్యవై సకలాసిద్ధి - ర్న స పా పైః ప్రయుజ్యతే ॥

ప్రతిదినము భక్తిశ్రద్ధలతో శివలింగమును షోడశోపచారములతో పూజించువానికి విహిత కామ్యములన్నియు సిద్ధించును. మరియు ఆగామిపాపములకు బాధ్యుఁడు కాజాలడు.

ఇట్లు విష్ణుప్రబోధముఁబడసి బ్రహ్మాది దేవతలు శివలింగముల నిప్పించుడని ప్రార్థింపగా విష్ణువు విశ్వకర్మచే పంచసూత్రఘటిత మనోహరశివలింగములను చేయించి వారి వారి అధికారానుగుణంబుగ నిప్పించెను.

ఇంద్రుడు పద్మరాగమణిమయంబును కుబేరుఁడు సువర్ణలింగమును యమధర్మరాజు పీతమణిమయంబును వరుణదేవుఁడు శ్యామలమణిమయంబును నారాయణుఁడు ఇంద్రనీలమణిమయంబును బ్రహ్మదేవుఁడు హేమలింగమును లక్ష్మీదేవి స్ఫటికలింగమును విశ్వేదేవతలు రజత లింగములను వసువులు ఇత్తడిఁదగు లింగములను అశ్వినీ దేవతలు పార్థివంబులను ఆదిత్యులు రాగిచే చేయఁబడిన లింగములను చంద్రుఁడు మౌక్తిక లింగమును సూర్యుఁడు వజ్రలింగమును ఋషులు మృణ్మయలింగములను ఋషిపత్నులు చందన లింగములను మయుఁడు పగడములఁదగు లింగమును సరస్వతీదేవి రత్నలింగంబును పరిగ్రహించి తమ యుత్తమాంగములఁ ధరించి విష్ణుమూర్తి చెప్పినవిధముగా పూజించిరి. పిమ్మట బ్రహ్మదేవుఁడు దేవతలును తమ నివాసములకుఁ జనినవారైరి.

అంత చతుర్ముఖుండు ఋషులకు దేవతలకు శివపూజావిధి నిట్లు వక్కాణించెను.

సర్వ ప్రాణులలో దుర్లభంబగు మానవజన్మమునొంది అందు శ్రేష్ఠమగు సత్కులములోను మరియు మిన్నయగు సదాచారసంపన్నమగు వంశమునందును పుట్టినవారు ఇట్టి జన్మ మరల రాదని భావించి





స్వర్ణాశ్రమ ప్రయుక్తమగు ధర్మమును శివప్రీత్యర్థమై ఆచరించుచుండవలెను. తన యధికారము ననుసరించి శ్రౌతస్మార్తకర్మల నొనర్చుచుండవలెను.

ఐతే నిట ముఖ్యవిషయ మొండు గమనింపపఁదగినదై యున్నది.

కర్మయజ్ఞములు వేయిటికన్న తపోయజ్ఞము అనఁగా నక్తవ్రత సోమవారవ్రత ఉపవాస శివక్షేత్రగమనాదికము మిన్నయగును. ఇట్టి తపోయజ్ఞములు వేయిచేయుట కంటెను శివపంచాక్షరి జపముఁదగు యజ్ఞము ప్రశస్తంబగునది. శివజ్ఞానము అనఁగా శివసాక్షాత్కారమునకై శివధ్యానమ్ము నాచరింపవలసియుండును. ధ్యానయజ్ఞరతునకు శివుఁడు సదా సన్నిహితుఁడై యుండును. శివునిధ్యానించువారికి ఎట్టి ప్రాయశ్చిత్తములును చెల్లనేరవు. ఇట్లు శివధ్యానముతో శివజ్ఞానము కలిగియుండువారు – కర్మ బంధములు లేక సుఖదుఃఖముల నతిక్రమించియుందురు. మరియు ధర్మమిది యధర్మమిద్ది యనిగాని జపనిర్బంధము గాని హవన ధ్యాన విధానములుగాని లేనివారై నిరంతరము శివోపాసనాసక్తచిత్తులై నిర్వికారముగ నుందురు.

శ్రేష్ఠమగు శివానందమును కలుఁగజేయునదియు అక్షరంబును నిష్కళంబును సర్వవ్యాపకంబు నగు శివలింగము అనఁగా భావలింగము శివయోగుల హృదయములయందు విరాజిల్లుచున్నయది. శివలింగము – బాహ్యమనియు అభ్యంతర మనియు రెండు తెఱఁగు లొప్పును. బాహ్యము స్థూలమనియు అభ్యంతరము సూక్ష్మమనియు తెలియవలెను.

స్వధర్మముగా భావించి స్థూలలింగార్చనమును గావింపవలసియుండును. ఆధ్యాత్మిక నిష్ఠగలవారు పూజించు సూక్ష్మలింగము పాశుపతదీక్షావిధానమున సద్గురువుకడ లభించువరకు స్థూలలింగము ననఁగా దేవాలయలింగమునుగాని సువర్ణ రజతాది నిర్మిత లింగమునుగాని ఆరాధింపవలసియుండును జ్ఞానులకు సూక్ష్మలింగమే ప్రశస్తంబైనది. అద్దియే ఇష్టప్రాణభావ మనఁబఱగుచున్నయది. వస్తుతః విచారించి చూచినచో సూక్ష్మస్థూల జగమంతయు శివమయంబేయగును. ఉదకములయందు నిర్లిప్తమగు కమలము శాంభవదీక్షితుఁడై శివునుపాసించువాడు. గృహస్థాశ్రమియైనను కర్మబద్ధుఁడు కాజాలడు. శివజ్ఞానము కలుగు వరకు మానవుఁడు కర్మమార్గమున శివునారాధింపవలెను. సూర్యుఁడొకడేయైనను జలాధారము మున్నగువానియందు ననేకులుగా కనపడునట్లు శివుఁడు నద్వితీయుఁడై నానావిధరూపములతో భాసిల్లుచుండును. ఎవని హృదయమునందు సకళుడైన పరమేశ్వరుడు ఇష్టలింగరూపమున విలసిల్లు చుండునో నవ్వానికి నానాదేవతావిగ్రహములతో నవసరములేదు. శివుఁడు ఇష్టప్రాణభావ లింగరూపమున విరాజిల్లుచుండునను విజ్ఞానము కలుగువరకే ప్రతిమల నారాధింపవలసియుండును. విగ్రహారాధన ఉన్నతపదము నందించును. మొదట విగ్రహము నారాధించియే శివలింగము నర్చింపవలసియుండును పరమాత్మ గొప్పవాడైన నొకానొక ప్రతిమ యందు భావించుట తప్పుకాదు. విగ్రహారాధనమే లేకుండిన గంధచందనపుష్పాదికము వ్యర్థంబగును. విజ్ఞానము కలుగువరకు విగ్రహమును పూజింపవలెను విగ్రహారాధనకు వలయు యోగ్యతకొరకు స్వవర్ణాశ్రమోచితకర్మ నాచరింపవలసియుండును పూజనదానాదులు లేనిది స్వకృతంబగు పాతకము నశింపదు. పాపము నశింపనంతవరకు జ్ఞానము సిద్ధింపదు. పాపము తొలగగానే సుకృతమంతయు ఫలించును. వస్త్రము మలినముగా నుండిన





ఐతే శివలింగములలో శ్రేష్ఠమగు పార్థివలింగమును పూజించుట శ్రేయస్కరమని భావింపవలెను. బ్రహ్మదేవా? నీవు జగత్సృష్టిని చేయుమని యాజ్ఞాపించుచున్నాను. నాయనా విష్ణో! చరాచరప్రపంచము నంతయు కాపాడుచుండుము!

ఇంతియేగాక శివపూజావిధానమునంతయు ప్రభోధింపగా విష్ణువు - శంకరా? మా యందు సంపూర్ణకటాక్షమును ప్రసరింపఁజేసి యెల్లకాలము నీచరణపంకజములయందు దృఢభక్తియుండునట్లు ఆశీర్వదింపమనియు వస్తుతః నీవు ఎట్టిలంపటములేనివాడవైనను మాకు సహకరింపుటకు నవతరించు మనియు నివేదించి శిరస్సునందంజలి నిడుకొని మ్రొక్కులిడెను.

అంత సదాశివుఁడు - ప్రళయస్థితి సర్గములకు నేనే కర్తననియు; పరమాత్మను నిర్వికారుండను సచ్చిదానంద స్వరూపుడను; ఐతే స్వయముగా గాక సృష్టిస్థితిలయముల నొనర్చుటకు బ్రహ్మవిష్ణు రుద్రస్వరూపములఁ దాల్చువాడను నేనే యనియు చెప్పినవాడై మీరు కోరిన విధముగా బ్రహ్మలలాటము నుండి రుద్రుడుగా నవతరింతునినియు రుద్రునికి నాకు నెట్టిబేధము లేదనియు రుద్రపూజావిధానమే నన్ను పూజించువిధానమగుననియు లోకములో నగ్నిసంబంధముచే జలమును స్పృశింపరానట్లు నా సంబధమువలన రుద్రుఁడు శివుఁడే యనియు వస్తుతః శివరుద్రులొకేరూపమనియు అద్దియే రెండు విధంబులయ్యెననియు అలంకార భేదమున్నను సువర్ణమొక్క టేయైనట్లు శివరుద్రులకు నామభేదము మాత్రంబనియు; మీరును నన్ను రుద్రుని యేక భావనతో నారాధింపుడనియు ముమ్మూర్తులకు మూలరూపము నేనే యనియు అద్దియే సత్యజ్ఞానానంతముగా ధ్యానింపఁదగినదనియు వాక్రుచ్చెను. ఐతే ఇఁటనొక గోప్యమును గమనింపుడు! మీరిరువురు ప్రకృతినుండి జన్మించినవారు; అవతరింపఁ బోవు రుద్రుఁడు మాత్రము ప్రకృతి జన్ముఁడు కాజాలడు; బ్రహ్మనొసటినుండి ఆవిర్భవించిన రుద్రుడు తమోగుణము నధిష్ఠించియుండును. వస్తుతః తామసుఁడు కాడు; ఉమయనఁబడు ఈ దేవీయే ప్రకృతియగును. ఇట్టి ప్రకృతిఁదగు రెండవరూపము సరస్వతియై బ్రహ్మదేవునికి సహధర్మచారిణియగును మరియొక రూపము లక్ష్మియై విష్ణుమూర్తి కర్ధాంగియగును. అన్యరూపము కాళియై రుద్రునాశ్రయించును. లోకమునంతయు బ్రాహ్మణాది చతుర్వర్ణముల తోడను బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయముతోడను నిర్మించి వారికి వలయు సౌకర్యముల నేర్పరచియు జ్ఞానవిజ్ఞానసంపన్నులై సుఖముగా వర్తింపుడు! శివుఁడనగు నేను సత్త్వరజస్తమోగుణాతీతుడనై అనఁగా శుద్ధసత్త్వగుణసంపన్నుడనై ప్రకృతిపురుషుల నతిక్రమించువాడనై పరబ్రహ్మంబునై నిత్యుడనై అనంతుడనై పరిపూర్ణుడనై నిరంజనుడనై యుండువాడను.

శ్లో॥ అంతస్తమో బహిఃసత్త్వ - స్త్రిజగత్పాలకో హరిః ।
అంతస్సత్త్వస్తమో బాహ్య - స్త్రిజగల్లయ కృద్ధరః ॥
అంతర్బహిరజశ్చైవ - త్రిజగ త్సృష్టికృ ద్విధిః ॥

విష్ణుమూర్తి - లోన తమోగుణముకలవాడై వెలుపల సత్త్వగుణవంతుడై మూడు లోకములను కాపాడుచుండును. మహేశ్వరుఁడు - లోన సత్త్వగుణము కలవాడై బయట తమోగుణసంపన్నుడై ప్రళయమును చేయుచుండును. బ్రహ్మదేవుఁడు - లోన వెలుపలను రజోగుణము కలవాడై జగమును నిర్మించువాడు.

ఇంకను నారాయణా? అన్ని విధముల చతుర్ముఖుని రక్షించుచుండుము. త్రిలోకముల యం పూజనీయుడవగుదువు. శివుని పూర్ణావతారమగు రుద్రుని నీవును బ్రహ్మయు సేవింప వలసి యుందు

ఇవ్విధము వక్కాణించి బ్రహ్మవిష్ణువులనుద్దేశించి వెండియు పలుక నారంభించెను.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నవమాధ్యాయము.

## దశమాధ్యాయము

### (పరమ శివతత్త్వనిరూపణము)

మాధవా? ఎల్లపుఁడు లోకములన్నిటియందు గౌరవింపబడుదువు గాత! బ్రహ్మ నిర్మితంబగ ప్రపంచమున కలుగు దుఃఖమును తొలగింప నుద్యుక్తుడవగుచుండుము! నీకు సంకట సంభవించినపుడు సహాయపడుచుందును. మిక్కిలి ఉద్ధతులైన నీ శత్రువులను సంహరించుచుందు అనేకవిధ అవతారములఁజెంది గొప్పకీర్తిఁ గడించుము! ప్రాణులను సన్మార్గులనుగా నొనర్చువాడవగుదు నీ చేతకాని పనినంతయు నేను సాధించుచుందును. భక్తుల ననుగ్రహించుచు దుష్టుల నిగ్రహించుచుండుము.

ఇటుల చెప్పుచు విష్ణుమూర్తిని తన హస్తముతో స్పృశించి యీ బ్రహ్మదేవునకు నన్నివేళల యం సర్వవిధములుగా సాహాయ్యమును గావింపుము! భక్తుల కోర్కెలనీడేర్చుచుండుము! సంకటసమయము నా శరీరమగు రుద్రుని భజింపుము! అని వక్కాణించెను.

ఇఁక నాయుష్యమును చెప్పుచున్నాను. వినుము!

నాల్గువేలయుగములు – బ్రహ్మదేవుని కొక్కదినంబగును. రాత్రియునంతియేనని తెలియవలెను. అట్టి దినములు ముప్పదియగునెడ నొక మాసంబు, అట్టి మాసములు పంద్రెండ్రు గడచినచో నొక సంవత్సరం అట్టి వత్సరములు వంద యగునేని బ్రహ్మదేవుని జీవితము పూర్తియగును. బ్రహ్మదేవుని యొక్క సంవత్సరకాలము విష్ణుమూర్తికి నొక్కదినంబగును. ఈ విధము విష్ణుమూర్తికి నూరువత్సరము లాయుష్యమ చెప్పఁబడుచున్నయది. విష్ణువుఁదగు వర్షముతో రుద్రున కొక్కదినముగా నూరు వత్సరములు గడచిన రుద్రుఁడు నర స్వరూపముతో విరాజిల్లుచుండును. (ఇచ్చట నరుఁడనఁగా మానవుఁడని యర్థమ కాదు. న రమత ఇతి నరః అను వ్యుత్పత్తిననుసరించి స్వాత్మారాముడై యుండునని భావము.)

(సృష్టికాలములో ఇట్టి నరునిచే సృజింపఁబడినవే నారములు అనఁగా ఉదకములగు నని నారములే ఆయనములుగా కలవాడు నారియణుఁడనియు వివేకము.)

ఇరువదియొక్కవేల ఆరువందల నిట్టూర్పుల కాలము అహోరాత్రంబగును.
ఉచ్ఛ్వాసనిశ్వాసము లారిటితో నొక విఘడియయు అరువది విఘడియలతో నొకఘడియయు అరువదిఘడియలతో నొక్కదినంబగును.





నిజముగా విచారించినచో ఉచ్ఛ్వాస నిశ్వాసములను పరిగణింప శక్యము కాదు. ఇదియంతయు సదాశివుని లీలావిలాసము కావుననే అతడు అక్షయుండని పేర్కొనంబడుచున్నవాడు.

ఇఁక నీ విష్ణురూపమును జాగరూకుడవై కాపాడుకొనుమని శంకరుఁడు చెప్పగా మాధవుడు వినమ్రుడై (బ్రహ్మదేవునితో గూడ) దిగువ విధము విన్నవించెను. పరమేశ్వరా? నీవలననే సర్వవిధసామర్థ్యములఁబడయఁగలుగుచున్నాను కావున నీవే నాకు సదా ధ్యేయుండవు!

ఐతే ఇక ముందు నిన్ను ధ్యానించుటలో క్షణకాలమైనను విస్మృతి కలుగకుండునట్లనుగ్రహింపుము! నా భక్తుడై నిన్ను నిందించునెడ నట్టివానికి ఆచంద్రతార్కారము నరక నివాసము సంభవించుగాత! నీ భక్తుఁడును నాకత్యంతప్రియుఁడుకాగలడు! ఇట్లు తెలిసికొనిన వానికే మోక్షము కరతలామలకంబగును. నా దగు మహిమను నీ యనుగ్రహమున పెంపొందించుకొందును. కాని యెప్పుడైన నపచారము సంభవించునెడ క్షమింపుము!

అని నారాయణుఁడు విన్నవింపగా చంద్రశేఖరుడట్లే క్షమింతునని పలుకుచు బ్రహ్మ విష్ణువులను తన యమృతహస్తముతో తాకుచు అనేకవిధ ధర్మములనుపదేశించి యనేక వరముల నొసఁగి యంతర్ధానముఁ జెందెను. అప్పటినుండి అనఁగా సృష్ట్యాదినుండియు శివలింగ పూజావిధి యేర్పడుటయే గాక భక్తిముక్తిప్రదాయకుండగు శివుఁడు - లింగమునందు స్థిర నివాసమును చేయుచున్నవాడు.

లింగముఁదగు వేదిక - అనఁగా ప్రాణవట్టము శక్తియనియు లింగముఁదగు పిండము సాక్షాత్తు మహేశ్వరుఁడనియు గుర్తెరుగవలెను. అద్దానియందే జగమంతయులీనమగును కావున లింగ మనంబడుచున్నయది.

శివలింగ సన్నిధానమున లింగోద్భవ వృత్తాంతమును పఠించువాడు ఆరుమాసములలో పరిశుద్ధుఁడగునవియు శివాలయమున ఏదేనొక పుణ్యకార్యము నాచరించు వాని పుణ్యము అగణితంబగుననియు తెలియవలెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదియవ యధ్యాయము.





# ఏకాదశాధ్యాయము

## (శివపూజా విధానము)

అంత శౌనకాది మహర్షులు - వ్యాసశిష్యుడైన నో సూతమహాభాగా? పరమ పావనం శివమహిమయందు అద్భుతంబైన లింగోత్పత్తి విధానంబు విని దుఃఖములను తొలగించుకొంటి పూర్వము నారదునికి బ్రహ్మదేవుఁడు చెప్పినవిధముగా శివపూజావిధానము నెఱిఁగించుమని ప్రశ్నిం సూతమహర్షి చెప్పఁదొడఁగెను.

మునులారా? మీరడిగినది రహస్యంబైనను సనత్కుమారుని వలన తెలిసికొని వేదవ్యాసుడు తెలిపినవిధంబుగా వక్కాణించుచున్నాను. ఇట్టిదానినే ఉపమన్యుమహర్షి శ్రీకృష్ణమూర్తికి ప్రబోధి యుండెను.

లింగార్చనంబు వర్షశతమునకైనను చెప్పనలవి కాదు. కావున సంగ్రహముగా చెప్పుచున్నవా సనాతనము స్వచ్ఛము సుఖప్రదంబు నగు శివలింగమును పరాభక్తితో పూజింపవలెను. శివలింగార్చ జేయువారికి దరిద్రము తొలగును. రోగములు నశించును. దుఃఖములు సమయును, శత్రు దూరమగును. మనోవాక్కాయసంభవము పురాకృతమునగు పాపము శమించును. మరి ఇహసుఖములన్నియు చేకూరుటయేగాక మోక్షంబును సంసిద్ధంబగును.

శ్లో॥ యా వై మానుష్య మాశ్రిత్య - చేచ్ఛే త్సంతానతః సుఖమ్ ।
తేన పూజ్యో మహాదేవః - సర్వకార్యార్థసాధకః ॥

మానవజన్మను పొంది పుత్రసంతానసుఖమును కోరునెడల - సర్వాభీష్టముల నొసగు మహాదే పూజింపవలెను.

బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులును తమ తమ కోర్కెలను సిద్ధింపఁజేసికొను శివుని పూజింపనగును.

ప్రతి దినము ప్రాతఃకాలమున మేలుకొని గురువుని శంకరుని పుణ్య తీర్థములను నారాయణ బ్రహ్మదేవుని ఇంద్రాది దేవతలను సనకసనందనాది మునులను నందీశ్వరాది శివభక్తులను స్మరి విధియుక్తముగా శివస్తోత్రములను పఠింపవలెను. పిమ్మట దక్షిణదిశకుఁజని మలవిమోకముఁజేశి తరు దంతధావనము నాచరించి చేరువనున్న నదీతటాకాదులయందు పుణ్య తీర్థముల యందైనను యథా స్నానముఁజేశి భస్మత్రిపుండ్రములఁదాల్చియు ఏకాంతముగా పరిశుభ్ర స్థలమున సంధ్యావంద నాచరింపవలెను. తరువాత మనశ్చాంచల్యమును విడనాడి పూజా మందిరములో ప్రవేశ పూజాపరికరములను చెంత నుంచుకొని సుఖాసనము నందుపవిష్టుడై మొదట ఆచమనమును సంకల్ప నాచరించి గణాధిపతిని ద్వార దిక్పాలకులను పూజించి శివునకు పీఠము నేర్పరుపవలెను. అథవా పళ్లెరము నందైనను శివలింగమును నెలకొలిపి శంకరుని ఐదు ముఖములు దశభుజములు గలవాని త్రినేత్రునిగాను శుద్ధ స్ఫటిక సన్నిభునిగాను సర్వాభరణ సంయుక్తునిగాను వ్యాఘ్రచర్మోత్తరీయుని

ధ్యానించి శివునితో సమానమైన రూపము తనకు వచ్చినట్లు భావించి పాపమునంతయు దహించి వేయవలెను. తరువాత మూలమంత్రముతో కరాంగ న్యాసముఁగావించి నిర్మల హృదయుడై పాద్యార్ఘ్య ఆచమన పాత్రలను నెలకొలిపి వివిధములైన తొమ్మిది కలశముల నుంచి యవ్వాని యందు శుద్ధ జలమును పూరించి వట్టివేరు, శ్రీగంధము, అనువానిని పాద్యపాత్రోదకమునందు, జాజికాయ, పచ్చకర్పూరము, మత్తి ఊడలు, తమాలపత్రము అనువాని చూర్ణమును ఆచమన పాత్రయందును శ్రీగంధ చూర్ణము నన్నిటియందును వేయవలెను. శివుని సన్నిధానమున ధూపదీపసుగంధ ద్రవ్యముల నమర్చి అణిమాద్యష్టసిద్ధులను శివునికి పూర్వాది దిశలయందు నెలకొలిపి శివునకు ప్రణవముతో ఆసనమును కల్పించి సోమసూర్యాగ్నులను ధర్మాదులను పీఠము క్రింద నున్నట్లు క్రమముగా భావింపవలెను. అవ్యక్తము మున్నగువానిని నాలుగు దిశలయందు తలచి సోముని సమీపమున సత్త్వరజస్తమోగుణములను భావింపవలెను. తరువాత నందికేశ్వరుని పూజింపవలసియుండును. ఇఁక "సద్యోజాతం ప్రపద్యామి" అను మంత్రముతోడ శివున కావాహనమును వామదేవ మంత్రమున పీఠమునందుపవేశమును రుద్రగాయత్రితో సన్నిధానమును అఘోర మంత్రమున నిరోధంబును అనఁగా శివేతర క్షుద్రదేవతలను భూత ప్రేతపిశాచాదులను నిరోధించుటను ఈశాన మంత్రముతో పాద్య ఆచమనీయ అర్ఘ్యంబులను సమర్పింపవలెను. పిమ్మట శ్రీగంధోదకముతో పంచగవ్యములతోడ పవిత్రభాండములయందు వస్త్రపూతముగా నింపఁబడిన శుద్ధోదకముతోడను రుద్రాధ్యాయాదులను పఠించుచు అథవా వేద విదులగు బ్రాహ్మణోత్తములతో పఠింపఁజేయుచు ఏకోత్తర శతసహస్ర జలధారల నభిషేకింపవలెను. తరువాత శుద్ధ వైదిక భస్మ నలఁది శ్రీగంధమునుశుభ్రాక్షతలను సమర్పించి కుశ పుష్పంబులను ఉత్తరేణులను జాజిపుష్పములను చంపకములను పాటల (కలిగొట్టు) పుష్పంబుల తెల్లగన్నేరులను మల్లెపువ్వులను కమలములను కలువలను వివిధ అపూర్వ పుష్పంబుల నర్చింప వలెను. అభిషేకించునపుడు రుద్ర సూక్త మృత్యుంజయాది మంత్రములను పఠించుటచే సకలారిష్టశాంతి యగును. పిమ్మట కోమల బిల్వదళములను ధూపదీపఅవసర నైవేద్యములను తాంబుల దక్షిణలను ఫలములను సమర్పింపవలెను. శివుఁడు – స్ఫటిక సన్నిభుండనియు నిష్కళుండనియు అక్షయుండనియు సర్వలోక కారణుండనియు లోకాత్మకుండనియు బ్రహ్మేంద్రో ప్రేంద్ర విష్ణ్వాదుల కగోచరుండనియు వేదవిదులచే వేదాంతులచేత నగమ్యుఁడుగా చెప్పఁబడుననియు ఆదిమధ్యాంత రహితుండనియు సర్వరోగవైద్యుండనియు లింగస్వరూపుండనియు భావింపవలెను.

తరువాత మంగళ నీరాజనమును మంత్రపుష్పమును నమస్కారములను సమర్పించి నానావిధ స్తోత్రములను అనేక మహామంత్రములను పఠించి యర్ఘ్యము నొసగి శివలింగముఁదగు పాదముల యందు పుష్పముల నర్పించి కృతాంజలియై హస్తమునందు పుష్పముల నిడికొని దిగువ విధము ప్రార్థింపవలెను.

శ్లో॥ అజ్ఞానా ద్యది వాజ్ఞానా - జ్జపపూజాదికం మయా
కృతం తదస్తు సఫలం - కృపయా తవ శంకర ॥ 74

శంకరా! తెలిసిగాని తెలియకగాని నేను చేసిన జపపూజాదిక మంతయు నీ యనుగ్రహమువలన సఫలమగు గావుత!

ఇట్లు ప్రార్థించి కొన్ని పుష్పములను సమర్పింపవలెను. తరువాత ప్రణిపాత పూర్వకము క్షమాపణమును వేడుకొని తానొనర్చిన దురితముల నొకమారు తలచుకొని పదేపదే ప్రార్థింపవలె సర్వవిధ భక్తిభావ సమన్వితుడై పరమేశ్వరా! ప్రారబ్దానుసారము సంఘటించు ప్రతి జన్మయందును యందు భక్తి నొసగుము! మరియొకఁడు రక్షకుఁడులేడు కావున నిన్నే శరణు పొందుచున్నాను. సర్వ ప్రదాతయగు దేవదేవు నిట్లు ఆరాధించి పరాభక్తితో కంఠరవముల శివనామధేయముల నుచ్చరించు తన పరివారముతో గూడ సంతోషాతిశయముఁ జెందవలెను. ఇట్టివారు మనోఽభీష్టఫలము నొందుట గాక యుక్తి యుక్తముగా మాటలాడు వారగుదురు. రోగమును దుఃఖంబును హృద్వేగంబును కృత్రి విఘాతంబులను కుటిల కృత్యంబులను విష ప్రయోగంబును ఆయా సమయములయందు తటస్థిం ఇక్కట్టులను పరమకారణుడైన శివుఁడు పోగొట్టును. శుభముల నొనఁగూర్చును. శుక్లపక్షమునం చంద్రునివలె శివారాధకుని సద్గుణములన్నియు దినదినాభివృద్ధములగును. శివపూజా విధానము సంగ్రహముగా చెప్పినవాడను. ఇఁక నీ వడిగిన దానిని నా శక్తి కొలది వక్కాణింతును.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఏకాదశాధ్యాయము.

## ద్వాదశాధ్యాయము

### (శివపూజా విధానమునగల సారాసారములను విరూపించుట)

శివపూజా విధానమునే బాగుగా మరల వివరింపుడని ప్రశ్నింపగా సూతుఁడు చెప్పనారంభించె

ఒకప్పుడు - బ్రహ్మదేవుఁడు ఋషులను దేవతలను రప్పించి "మీకు నిత్యసుఖము నందు కలదేని మోక్షమును కోరునెడలను నాతో గూడ క్షీరసముద్రమునకు రండ"ని చెప్పగా వారందరు బయలు సర్వహితకారకుండగు మహావిష్ణువు నివసించు ప్రదేశమునకు వెళ్లిరి. అచ్చట జగన్నాథుండ జనార్ధనుఁడు దర్శనము నీయగా కృతాంజలులరై నమస్కరించిరి.

అంత విష్ణువు - బ్రహ్మాది దేవతలారా? ఋషులారా? ఎందుకే తెంచితిరి? నేనేమి చేయవల యడుగగా నమరులు - దుఃఖములన్నియు తొలగుటకై నిత్యము ఎవని సేవింప వలెనని వినమ్ర ప్రశ్నించిరి.

అట్టితఱి నారాయణుఁడొక తూరి శివపదాంభోజములను స్మరించి చెప్పఁదొడగెను.

శ్లో॥ సేవ్యః సేవ్యః సదా దేవః - శంకరః సర్వదుఃఖహా ।
త్యాజ్యం తదర్చనం నైవ - కదాఽపి సుఖ మిచ్ఛుభిః ॥

"ప్రారబ్ధకర్మానుసారము సంసారములో సంభవించు ఇబ్బందుల నన్నిటిని పోగొట్టు శంకరు అనఁగా శివలింగమే ఎల్లకాలము నియమిత సమయములయందు ఆరాధింపఁదగినది. ఇహపరసుఖము నిచ్ఛగించువారు ఎట్టి పరిస్థితులలోను శివపూజనమును మానరాదు." లింగమూర్తి యగు మహేశ్వ విస్మరించి తారకాసురకుమారులు తమ బంధుపరివారములతో నశించినవారు.





దేవదానవులు, ఈ బ్రహ్మదేవుఁడు నేనును నిత్యము శివలింగము నర్చించుచున్నాము. ఏదేనొక కారణమున అనఁగా ఆర్తుఁడై కాని జిజ్ఞాసువై కాని అర్థార్థియై కాని జ్ఞానియై కాని శివలింగమును నిత్యము పూజింపవలెను.

జీవితములో ప్రతిదినము ఒక్క మహూర్తకాలమైనను అథవా క్షణకాలమైనను శివుని సేవింపకుండుటయే గొప్ప దోషమనియు మిక్కిలి గ్రుడ్డితనమనియు కడుంగడు మోహావేశమనియు మిగుల పొరపాటనియు తెలియవలెను.

శివభక్తి సంపన్నులు, శివాసక్తమానసులు, శివస్మరణతత్పరులు నెన్నటికిని దుఃఖముల పాలు కారు.

మనోహర భవనములను లావణ్యవతులు ఆభరణభూషితలు నగు తరుణులను తృప్తి కలుగువరకు ధనమును పుత్రపౌత్రాదిసంతతిని శరీరారోగ్యమును లోకాతీతగౌరవమును స్వర్గసుఖమును శివభక్తి పరంపరాఽభివృద్ధిని అంత్యకాలమున శివసాయుజ్యమును కోరువారు–పూర్వపుణ్యబలమున సదాశివు నారాధింతురు.

శ్లో॥ యోఽర్చయేచ్ఛివలింగం వై - నిత్యం భక్తిపరాయణః ।
తస్యవై సకలాసిద్ధి - ర్న స పాపైః ప్రయుజ్యతే ॥

ప్రతిదినము భక్తిశ్రద్ధలతో శివలింగమును షోడశోపచారములతో పూజించువానికి విహిత కామ్యములన్నియు సిద్ధించును. మరియు ఆగామిపాపములకు బాధ్యుఁడు కాజాలడు.

ఇట్లు విష్ణుప్రబోధముఁబడసి బ్రహ్మాది దేవతలు శివలింగముల నిప్పించుడని ప్రార్థింపగా విష్ణువు విశ్వకర్మచే పంచసూత్రఘటిత మనోహరశివలింగములను చేయించి వారి వారి అధికారానుగుణంబుగ నిప్పించెను.

ఇంద్రుడు పద్మరాగమణిమయంబును కుబేరుఁడు సువర్ణలింగమును యమధర్మరాజు పీతమణిమయంబును వరుణదేవుఁడు శ్యామలమణిమయంబును నారాయణుఁడు ఇంద్రనీలమణిమయంబును బ్రహ్మదేవుఁడు హేమలింగమును లక్ష్మీదేవి స్ఫటికలింగమును విశ్వేదేవతలు రజత లింగములను వసువులు ఇత్తడిఁదగు లింగములను అశ్వినీ దేవతలు పార్థివంబులను ఆదిత్యులు రాగిచే చేయఁబడిన లింగములను చంద్రుఁడు మౌక్తిక లింగమును సూర్యుఁడు వజ్రలింగమును ఋషులు మృణ్మయలింగములను ఋషిపత్నులు చందన లింగములను మయుఁడు పగడములఁదగు లింగమును సరస్వతీదేవి రత్నలింగంబును పరిగ్రహించి తమ యుత్తమాంగములఁ ధరించి విష్ణుమూర్తి చెప్పినవిధముగా పూజించిరి. పిమ్మట బ్రహ్మదేవుఁడు దేవతలును తమ నివాసములకుఁ జనినవారైరి.

అంత చతుర్ముఖుండు ఋషులకు దేవతలకు శివపూజావిధి నిట్లు వక్కాణించెను.

సర్వ ప్రాణులలో దుర్లభంబగు మానవజన్మమునొంది అందు శ్రేష్ఠమగు సత్కులములోను మరియు మిన్నయగు సదాచారసంపన్నమగు వంశమునందును పుట్టినవారు ఇట్టి జన్మ మరల రాదని భావించి





స్వర్ణాశ్రమ ప్రయుక్తమగు ధర్మమును శివప్రీత్యర్థమై ఆచరించుచుండవలెను. తన యధికారము ననుసరి శ్రౌతస్మార్తకర్మల నొనర్చుచుండవలెను.

ఐతే నిట ముఖ్యవిషయ మొండు గమనింపపఁదగినదై యున్నది.

కర్మయజ్ఞములు వేయిటికన్న తపోయజ్ఞము అనఁగా నక్తవ్రత సోమవారవ్రత ఉపవా శివక్షేత్రగమనాదికము మిన్నయగును. ఇట్టి తపోయజ్ఞములు వేయిచేయుట కంటెను శివపంచా జపముఁదగు యజ్ఞము ప్రశస్తంబగునది. శివజ్ఞానము అనఁగా శివసాక్షాత్కారమునకై శివధ్యాన నాచరింపవలసియుండును. ధ్యానయజ్ఞరతునకు శివుఁడు సదా సన్నిహితుఁడై యుండు శివునిధ్యానించువారికి ఎట్టి ప్రాయశ్చిత్తములును చెల్లనేరవు. ఇట్లు శివధ్యానముతో శివజ్ఞాన కలిగియుండువారు – కర్మ బంధములు లేక సుఖదుఃఖముల నతిక్రమించియుందురు. మరియు ధర్మ యధర్మమిద్ధి యనిగాని జపనిర్బంధము గాని హవన ధ్యాన విధానములుగాని లేనివారై నిరంతర శివోపాసనాసక్తచిత్తులై నిర్వికారముగ నుందురు.

శ్రేష్ఠమగు శివానందమును కలుఁగజేయునదియు అక్షరంబును నిష్కళంబును సర్వవ్యాపకం నగు శివలింగము అనఁగా భావలింగము శివయోగుల హృదయములయందు విరాజిల్లుచున్నయ శివలింగము – బాహ్యమనియు అభ్యంతర మనియు రెండు తెఱఁగు లొప్పును. బాహ్యము స్థూలమని అభ్యంతరము సూక్ష్మమనియు తెలియవలెను.

స్వధర్మముగా భావించి స్థూలలింగార్చనమును గావింపవలసియుండును. ఆధ్యాత్మిక నిష్ఠగలవా పూజించు సూక్ష్మలింగము పాశుపతదీక్షావిధానమున సద్గురువుకడ లభించువరకు స్థూలలింగ ననఁగా దేవాలయలింగమునుగాని సువర్ణ రజతాది నిర్మిత లింగమునుగాని ఆరాధింపవలసియుండు జ్ఞానులకు సూక్షలింగమే ప్రశస్తంబైనది. అద్దియే ఇష్టప్రాణభావ మనఁబఱగుచున్నయది. వస్తుతః విచారిం చూచినచో సూక్ష్మస్థూల జగమంతయు శివమయంబేయగును. ఉదకములయందు నిర్లిప్తమగు కమలము శాంభవదీక్షితుఁడై శివునుపాసించువాడు. గృహస్థాశ్రమియైనను కర్మబద్ధుఁడు కాజాలడు. శివజ్ఞాన కలుగు వరకు మానవుఁడు కర్మమార్గమున శివునారాధింపవలెను. సూర్యుఁడొకడేయైనను జలాధారము మున్నగువానియందు ననేకులుగా కనపడునట్లు శివుఁడు నద్వితీయుఁడై నానావిధరూపము భాసిల్లుచుండును. ఎవని హృదయమునందు సకళుడైన పరమేశ్వరుడు ఇష్టలింగరూపమున విలసి చుండునో నవ్వానికి నానాదేవతావిగ్రహములతో నవసరములేదు. శివుఁడు ఇష్టప్రాణభావ లింగరూపము విరాజిల్లుచుండునను విజ్ఞానము కలుగువరకే ప్రతిమల నారాధింపవలసియుండును. విగ్రహారాధన ఉన్నతపదము నందించును. మొదట విగ్రహము నారాధించియే శివలింగము నర్చింపవలసియుండు పరమాత్మ గొప్పవాడైన నొకానొక ప్రతిమ యందు భావించుట తప్పుకాదు. విగ్రహారాధనమే లేకుండి గంధచందనపుష్పాదికము వ్యర్థంబగును. విజ్ఞానము కలుగువరకు విగ్రహమును పూజింపవలె విగ్రహారాధనకు వలయు యోగ్యతకొరకు స్వవర్ణాశ్రమోచితకర్మ నాచరింపవలసియుండు పూజనదానాదులు లేనిది స్వకృతంబగు పాతకము నశింపదు. పాపము నశింపనంతవరకు జ్ఞాన సిద్ధింపదు. పాపము తొలగగానే సుకృతమంతయు ఫలించును. వస్త్రము మలినముగా నుండు

పీతరక్తాది వర్ణములు సరిగా కానరానట్లు దేవతారాధనముతో నిర్మల మగు దేహమునందు ఉపాసనా జన్యమైన శివజ్ఞానము సంభవించును. శివజ్ఞానము కలుగుటకు అనన్యమైన శివభక్తియే కారణము. శివో పాసనము దృఢపడుటకును ఏకాంతశివభక్తియే కారణమని తెలియవలెను.

ఇష్టదేవతారాధనాది పుణ్యము శివభక్తిని పెంపొందించును. సద్గురువు నా(శ్రయించుటచే సుకృతము నాచరించు నవకాశము లభించును. సత్పురుషుల సహవాసము సద్గురువుకడకు చేర్చును. సద్గురువు వలన శివపంచాక్షరీ మహామంత్రమును పరిగ్రహించి యవ్వారిని పూజించుటఁజేసి మంత్రమును జపించుటవలనను చిత్తశుద్ధి కలిగి శివజ్ఞానము స్ఫురించును. శివజ్ఞాన దార్ఢ్యమున భేదము తొలగును భేదభావన యంతరించినచో రాగద్వేషాది ద్వంద్వదుఃఖములు నివారించును. ద్వంద్వదుఃఖములు లేనివాడు శివస్వరూపుండనియే భావింపవలెను. ఇట్టి శివ స్వరూపుని దేవతలు ఋషులు ప్రశంసించుచుందురు. పుణ్యతీర్థములకంటెను దేవతావిగ్రహముల కన్నను పావనుండగు శివయోగి – దర్శనమువలననే భక్తులను తరింపఁజేయును. ఆదిత్య అంబికా విష్ణు గణనాథ మహేశ్వరులకు మూలమగు శివునొకనినే పూజించుటచే – మూలముఁదడిపినచో శాఖలన్నియు పరిపుష్టములగునట్లు – విష్ణ్వాది దేవతలందరును ప్రసన్నులగుదురు. కొమ్మలను తడిపినచో మూలము సంపుష్టము కానట్లు ఇతర దేవతారాధనవలన శివప్రసాదము కలుఁగ జాలదు.

అందువలన లోకశంకరుఁడగు మహాదేవుని పూజించుచు సర్వకామఫలములను బడయ వలెను. కాని యాతడు సర్వప్రాణిప్రియుఁడై యుండవలెను.

శ్లో॥ తస్మాచ్చ పూజయే ద్దేవం - శంకరం లోక శంకరమ్ ।
సర్వకామ ఫలావాప్త్యై - సర్వభూతహితే రతః ॥ ౮౬

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ద్వాదశాధ్యాయము.

## త్రయోదశాధ్యాయము

### (శివపూజా విధాన నిరూపణము)

కోర్కెలను సుఖముల నన్నిటిని ప్రసాదించు ఉత్తమ శివపూజావిధిని చెప్పుచున్నాను.

ప్రతిదినము బ్రాహ్మముహూర్తమున అనఁగా తెల్లవారుజామున మేలుకొని దోసిలిఁజోడించి వినమ్రశిరస్కుఁడై సాంబశివుని భక్తితో ప్రార్థింపవలెను.

శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ ! దేవేశ - ఉత్తిష్ఠ ! హృదయేశయ !
ఉత్తిష్ఠ త్వముమాకాంత - బ్రహ్మాండే మంగళం కురు ॥ 3

నా హృదయకమలములో నిద్రించు పార్వతీపతీ! మహాదేవా! లెమ్ము! మేలుకొని బ్రహ్మ సృష్టములగు పదునాలుగు లోకములయందు గల చేతనాచేతన ప్రాణులందరికి శుభము నొనఁగూర్చుము!





ధర్మ మెట్టిదో ధర్మము నాచరించుట యెట్లో తెలియదు. మరియు నధర్మ మెట్టిదో అధర్మమును తొలగుట యెట్లో నదియు తెలియదు. మహాదేవా! నీవు నా యంతఃకరణము నందుండి యె ప్రేరేపింతువో నట్లు చేయువాడను. ఇవ్విధము ప్రార్థించి గురువుగారి పవిత్ర చరణములను స్మరింపవలె

తరువాత శౌచ దంతధావనముల నాచరించి గంగా గోదావరీ ప్రముఖ పుణ్యనదుల యందు గా నదీతటాకాదులయందు గాని స్వగృహమునఁగాని స్నానముఁజేయవలెను.

ఆదివారమున శ్రాద్ధమునాడు సంక్రాంతియందు గ్రహణసమయమున పుణ్యతీర్థమునం మహాదానముఁజేయునపుడు ఉపవాసదినమున అశౌచమున నుష్ణోదకముతో స్నానము ప్రశస్తము కా పుణ్యతీర్థములయందు తదభిముఖుడై భక్తివిశ్వాసములతో నవగాహనముఁజేయవలెను. నిత్య మభ్యం స్నానముఁజేయునెడ గ్రహణమునాడు మాత్రము ఆవ నూనెను పరిగ్రహింపఁగూడదు. ఉత్తరాభిముఖు గాని పూర్వాభిముఖుడై గాని శుద్ధవస్త్రమును ధరించి జలకమాడవలసియుండును. తరువా దేవర్షిపితృతర్పణమునాచరించి ధౌత వస్త్రమును అనఁగా పట్టుధోవతిని గాని ధావళిగాని ధరించి పవి ప్రదేశమున మృగచర్మాది మృదుచిత్రాసనముపై నుపవిష్టుడై భస్మత్రిపుండ్రములఁదాల్చి రుద్రాక్షలను ధరించి స్వవర్ణాశ్రమోచితమైన సంధ్యావందనాది నిత్యకర్మ నాచరించి శివుని పూజింపవలెను.

మొదట పూజాస భారములను మహానైవేద్యమును చెంత నుంచుకొని మనశ్చాంచల్యమును విడనా ధైర్యముతో శివపూజనమును ప్రారంభించుచు గురువుగారిని స్మరించి యవ్వారి యనుజ్ఞఁబడసి ఎట్టి కోర్కెల ననుసంధింపక సంకల్పము నాచరించి పరివారముతో గూడిన శివుని పరాభక్తి పూజింపవలెను. శివపూజనమునకు ముందు గణపతిని కుమారస్వామితో గూడ షోడశోపచారముల పూజించి ప్రార్థింపవలెను. తరువాత మహోదరుఁడను ద్వారపాలకు నర్చించి చందన కుంకుమ ధూపదీ నైవేద్యాదులతో పార్వతీదేవి నారాధింపవలెను. పిమ్మట గృహమున రజతాది నిర్మిత శివలింగము లేనిచో పార్థివలింగమును నిర్మించి ప్రాణప్రతిష్ఠను భూతశుద్ధినాచరించి శివాలయమున పీఠమునం నిచియు దిక్పాలకులను పూజింపవలసియుండును. స్వగృహమున మాత్రము దిక్పాలకుల పూజింపనవసరము లేదు. శివలింగమునందే సర్వంబు కలదని భావింపవలెను.

మరల నొకపార్యయము ఆచమనముఁజేసి ప్రాణాయామము నాచరించి పద్మాసనస్థు అర్ఘపాత్రోదకముతో శివలింగమును శుభ్రపరుపవలెను. తరువాత నావాహనమును చేయవలెను.

కైలాసశిఖరమునందుండువాడును పార్వతీపతియు ఉత్తముఁడును క్షుత్పిపాసాది ప్రాకృతగుణము లేనివాడును సర్వజ్ఞత్వాది దివ్యకల్యాణగుణములు కలవాడును పంచవక్త్రుఁడును దశభుజుడును త్రినేత్రు డును వృషభధ్వజుఁడును కర్పూర గౌరుఁడును చంద్రశేఖరుఁడును జటాజూటధారియు వ్యాఘ్రచ నుత్తరీయముగా ధరించినవాడును గజచర్మను ధోవతిగా కట్టుకొనినవాడును వాసుకి మొదల సర్పరాజములచే నలంకరింపఁబడిన శరీరముగలవాడును పినాకము మున్నగు ఆయుధము దాల్చినవాడును అష్టసిద్ధులను ముంగిట తాండవ మాడించువాడును జయజయ శబ్దముల భక్తపుంగవులచే నారాధింపఁబడువాడును సహింపరాని తేజస్సున విశదముగా గుర్తింపఁబడనివాడు బ్రహ్మవిష్ణ్వాద్యమరులచే సేవింపఁబడువాడును సర్వవిధ ప్రాణులకు శరణ్యుఁడును ప్రసన్నుడై

ముఖకమలముగలవాడును వేదశాస్త్రములచే నభివర్ణింపఁబడువాడును భక్తవత్సలుఁడును ఆనంద ప్రచురుఁడు నగు శివునావాహనముఁజేయుచున్నానని యుచ్చరించి ఆసనమును పరికల్పింపవలెను.

ఐతే పూజాక్రమమునంతయు "శివాయ నమః" అనుమాదిరి చతుర్థ్యంత పదముల తోడనే గావింపవలసియుండును. పిమ్మట పాద్యము నర్ఘ్యము నాచమనమును సమర్పించి పంచామృతములతో స్నానము నాచరింపఁజేసి నిర్మలములు సుగంధ సమన్వితములు నగు నుదకములతో నభిషేకమును వైదిక మంత్రములతోడను శివస్తోత్రములతోడను సమర్పింపవలసియుండును. పిమ్మట నాచమనమును వస్త్రమును భస్మను శ్రీగంధమును తిలజవ గోధుమ మాషమిశ్రిత శుభ్రాక్షతలను శంఖపుష్పములను శతపత్రకమలములను కరవీర నందివర్ధన. ద్రోణ మల్లికాది పుష్పములను శివలింగమున నైదు ముఖములున్నట్లు భావించి యైదుముఖములకు సమర్పింపవలెను. భక్తవత్సలుడైన శంకరునకు తులసీపత్రములను విశేషించి బిల్వదళముల నొసగవలెను.

శ్లో॥ సర్వాభావే బిల్వపత్ర - మర్పణీయం శివాయ వై ।
బిల్వపత్రార్పణేనైవ - సర్వపూజా ప్రసిద్ధ్యతి ॥

నానావిధ పుష్పములు తులసీ పత్రాదులును లభింపకుండునెడ మారేడు దళములను మాత్రము శివునకు సమర్పించుటఁజేసి సర్వవిధ పుష్పపత్రపూజాఫలము సమకూరునని తెలియ వలెను. తరువాత సుగంధచూర్ణమును సువాసిత తైలమును అగరుధూపమును ఘృతదీపమును మఱియు

"రూపం దేహి యశో దేహి - దేహి భోగంచ శంకర !
భుక్తి ముక్తి ఫలం దేహి - గృహీత్వాఽర్ఘ్యం నమోఽస్తుతే "

అను మంత్రమును చదువుచు అర్ఘ్యము నొసగి వస్త్రముతో ముఖమార్జనముఁజేసి పలుతెఱఁగల పక్వాన్నములతో కూడిన నైవేద్యమును వెనువెంటనే అచమనమును కర్పూరము మొదలగు వానితో కూడిన తాంబూలమును సమర్పింపవలెను.

ఐదుపోగుల నెయ్యివత్తులతో మంగళ నీరాజనమును వెలిగించి శివుని పాదముల చెంత నాలుగు తడవలు, నాభిమండలమును రెండు పర్యాయములును, ముఖమున నొకమారును స్వరూపము మొత్తమునకు ఏడు మార్లును సమర్పించి శివధ్యానమును గావించి స్వకులగురువు ఉపదేశించిన శివమహా మంత్రమును యథాశక్తి జపింపవలెను. అనేక విధస్తోత్రములతో శివుని వేడుకొని మెలమెల్లగా ప్రదక్షిణముల నాచరించి సాష్టాంగ నమస్కారముఁజేసి పుష్పాంజలిఁఘటించి "తెలిసియో తెలియకయో నే చేసిన పూజాదికమంతయు నీ యనుగ్రహమున సఫలమగు గావుత! శంకరా! నీవాడను, నీయందే నా ప్రాణములను నెలకొలిపితిని, నీ చరణకమలములయందే నా యంతఃకరణమును స్థిరపరచితిని, ఇట్టివానిగా నన్ను గుర్తించి ప్రసన్నుడవుకమ్ము! నేలపై తొట్రుపడిన వారికి భూమియే ఆధారమగునట్లు నిన్నారాధించునపుడు ప్రమాదమున నేర్పడిన యపరాధములను మన్నించు శరణ్యుఁడవు నీవేను" ఇత్యాది విజ్ఞప్తి నాచరించి భక్తి భావాతిశయమున తన దోసిలియందలి పుష్పములను సమర్పించి మఱల నొకమారు నమస్కరించి "మహాదేవా? నీ పరివారముతోగూడ స్వస్థానమునకు కెళ్లుము! మఱల నేను పూజించునపుడు రావలయును

సుమా!" ఇట్లు ప్రార్థించి శంకరుఁడు తన హృదయములోనికి వెళ్లినట్లు భావించి జలమును విసర్జింపవలె విసర్జితోదకమును శిరమున చల్లుకొనవలెను.

ఇవ్విధము భుక్తి ముక్తి ప్రదంబగు శివపూజనమును చెప్పితిని. మఱియు నెద్ది వినెదరో ప్రశ్నింప సూతుఁడు విరమించెను.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో త్రయోదశాధ్యాయము.

## చతుర్దశాధ్యాయము

### (శివుని నానావిధపుష్పములతో పూజించుటచే కలుగు ఫలములు)

ఏ యే పుష్పములతో ఏ యే సంఖ్యను పూజించినచో ఎట్టి ఫలమును శివుఁడొసగు శౌనకాదిమునులు ప్రశ్నింపగా సూతమహర్షి - వక్కాణించుచుండెను.

ఋషులారా? పుష్పముల నర్పించువిధానమును చెప్పుచున్నాను. సావధానముగా విను ఇవ్విషయమునే నారదమహర్షికి బ్రహ్మదేవుఁడు తెలిపి యుండెను.

లక్ష్మీకాముఁడు కమలములతోడను బిల్వపత్రములతోడను శతపత్రములతోడను శంఖపుష్ప తోడను లక్ష సంఖ్యగా శివునర్చించినయెడల పాపములు పటాపంచలగుటయే గాక సంపన్నుఁడగు కమలములు ఇరువది యగునెడ నొక్కప్రస్థమగును. బిల్వదళములు వేయియగునేని శతపత్రము వేయియగునెడ నర్ధప్రస్థమగును. పదునారు పలములు ప్రస్థమనియు పది పలములు టంకమని తెలియునది. ఇట్టి కొలతను త్రాసుయందు తూచఁబడిన పుష్పములతో శివుని పూజింప వచ్చు నిష్కాముఁడై శివుని పుష్పముల నర్చించినచో ముక్తుఁడగును. రాజ్యమును కోరువాడు పై నాల్గిటిలో నొక పుష్పములతో పార్థివలింగములను పదికోట్లసంఖ్యను పూజించి శంకరుని ప్రసన్న చేసికొనవలసియుండును. శివలింగముపై పుష్పము నఖండాక్షతలను శ్రీగంధమును సమర్పి జలధారాభిషేకము నొనర్పవలెను. శివపంచాక్షరీ మహామంత్రము బిల్వదళంబు శంకరు నతిప్రియములైనవి శతపత్రకమలములుగాని శంఖపుష్పములుగాని పూజాముఖ్యములై ఇహ సుఖములనొసగునట్టివి. పిమ్మట ధూపదీపనైవేద్యములను అర్ఘ్యమును మంగళనీరాజనము ప్రదక్షిణలను నమస్కారములను క్షమాపణమునుగావించి విసర్జింప వలెను. ఇట్లు భక్తి నొనర్చినచో పరమేశ్వరుఁడు ప్రసన్నుడై ప్రభుత్వపదవి ననుగ్రహించును. సంఘప్రాముఖ్యము నపేక్షించువాడు నేబది కుసుమములతోడను కారాగృహ విమోచనముఁ గోరువాడు లక్షకుసుమముల శివునర్చింపవలసియుండు

వ్యాధిగ్రస్తుఁడును కన్యార్థియగువాడును విద్యాభివృద్ధిఁగోరువాడును వాక్శుద్ధిఁబడయఁదలచు నేబదివేల కుసుమంబుల శంకరు నారాధింపవలెను.





ఇంక శివదర్శనము నిచ్ఛగించువాడు నర్ధలక్షపుష్పములతో శివునర్చించుచు మృత్యుంజయ మహామంత్రము నైదులక్షలు జపింపవలెను. పదిలక్షలు జపించునెడ నవశ్యము శివదర్శనఫలము సమకూరును. అయుష్కాముఁడు దూర్వల తోడను, పుత్రకాముఁడు నుమ్మెత్త పుష్పములతోడను కీర్తికాముఁడు అగిసెపువ్వులతోడను, భుక్తిముక్తికాముఁడు తులసీదళములతోడను, ప్రతాపము నర్థించువాడు జిల్లేడుపువ్వులతోడను, చిన్న కలువలతోడను, శత్రువుల నోడించుటకు దాసనపువ్వులతోడను, రోగనిర్మోచనమునకై గన్నేరుపువ్వులతోడను, భూషణప్రాప్తికి మంకెనపువ్వులతోడను, వాహనలాభమునకై జాజిపుష్పములతోడను, విష్ణుప్రీతి నాశించువాడు నల్లయగిసెపుష్పములతోడను, ముక్తికాముఁడు శమీపత్రములతోడను ఉత్తమురాలైన భార్యను కోరువాడు మల్లికాపుష్పములతోడను, నిరంతరము స్వగృహనివాసము నిచ్ఛగించువాడు అడవిమొల్లలతోనైనను పెద్దగోరంట పుష్పములతోనైనను వస్త్రసమృద్ధికై కొండగోగు పుష్పములతోడను మనస్సు బాగుపడుటకై వావిలిపుష్పములతోడను సర్వకామా వాప్తికొరకు బిల్వదళములతోడను శివలింగమును పూజింపవలెను. ఉమ్మెత్తపుష్పములు-ఎర్రనికాడ గలవి శ్రేష్ఠములనియు ప్రతిపుష్పమును పత్రమును లక్ష సంఖ్యగా నర్పింపవలెననియు తెలియునది. చంపకము కేతకముదక్క నితరపుష్పములన్నియు శివప్రియంబులేను;

ఇంక ధ్యానములతో శివునర్చించు విధానమును చెప్పుచున్నాను. అవ్వాని ప్రమాణమును ఫలితంబు నాకర్ణింపుడు!

లక్ష తండులమును శివలింగమున కర్పించునెడల లక్ష్మీవృద్ధియగును. అయ్యవి యఖండితములుగా నుండవలెను. అరున్నర మానికల నారు తులముల తూకము గల బియ్యము లక్ష యగును.

మొదట రుద్రాభిషేకము మున్నగు నుపచారములను సమర్పించి శివలింగముపై నూతనవస్త్రము నునిచి లక్షఅక్షత తండులముల నొసగవలెను. తండలములపై గంధ పుష్పాదులతో కూడిన నారికేళమును నెలకొలిపి ధూపదీపనైవేద్యాదులను సమర్పించునెడలను యథాశక్తి ఆచార్యునకు దక్షిణ నొసగినచో సంపూర్ణఫలమును పొందవచ్చును. ఇట్టితతి పంద్రెండ్రు గురు సద్బ్రాహ్మణులకు భోజనము నొసగినచో లక్షఅక్షతార్చనము సాంగో పాంగమగును. పిమ్మట శివమంత్రమును నూట నెనిమిది పర్యాయములు జపింపవలసి యుండును.

లక్ష తిలలఁబూజించినచో మహాపాతకములు నశించును. పదునొకండు పలముల తూకముతో తిలలు (నువ్వులు) లక్షసంఖ్యాకములగును. పూజఅన్నదానాదిక మంతయు పూర్వోక్తమువలె చేయదగినది. లక్షయవల పూజయు సర్వసౌఖ్యప్రదంబు; ఎనిమిదిమానికలు మరియు సగము మానిక, ఆరుతులముల తూకముతో యవలు లక్షయగును. గోధుమలతో శంకరుని పూజించుట వలన సంతానము పెంపొందును. సగంతూము అనఁగా నెనిమిది మానికల గోధుమలు లక్షయగును. పెసలతో శివునారాధించుటయు సుఖావహంబు; ఏడున్నర మానికల ఆరుతులముల పెసలు లక్ష సంఖ్యాకములు; పదునొకండుగురు బ్రాహ్మణులకు భోజనము నొసగుటయు ఇందు ముఖ్యాంశమగును. లక్ష కొఱ్ఱలతో శివుని పూజించినయెడల ధర్మార్థకామములు సిద్ధించును. ఒక్కమానెడు కొఱ్ఱలు లక్ష యగును. ద్వాదశబ్రాహ్మణ భోజనము ఇట అని వార్యంబగుచున్నయది. లక్షవాలతో పూజించినచో శత్రువులు నశింతురు. అరువది తులముల అవాలు లక్షయని తెలియవలెను. లక్ష కందిపప్పు దళములతో శివుని పూజించినయెడల నానావిధభోగములు

సంప్రాప్తములగును. లక్ష మిరియాలతో శంకరు నర్చించునెడల పగవారందరును స్వాధీనులగుదు
పుష్పముల కొలతను తెలుపుచున్నాను. గమనింపుడు!

శంఖ పుష్పంబు లొకప్రస్థంబైన లక్షయగు. జాజిపుష్పములు మొల్లపూవులును పదియు
ప్రస్థంబైన లక్షయగును. రాజికాకుసుమంబులర్ధ ప్రస్థమైన లక్షయగును. ఇరువది ప్రస్థంబుల మ
లక్షయగును. కొండగోగులు దిరిసెనవిరులును మంకెన పువ్వులును పది ప్రస్థంబులైన నొక్క లక్షయగు

నువ్వుపువ్వులు పదియుఁదొమ్మిది ప్రస్థంబులైన లక్షయగును. ముప్పదియెనిమిది ప్రస్థం
గన్నేరు విరులు వావిలిపూవులును లక్ష యగును.

ఇత్యాది పుష్పముల శివునర్చించుట సర్వకామ్యములను సిద్ధింపఁజేయును కాని నిష్కా
పూజించునెడ ముక్తుండగును.

## అభిషేకఫల నిరూపణము

ఇఁక నభిషేకఫలమును జలధారాఫలమును చెప్పెదను. వినుము! భక్తిశ్రద్ధలతో విధివిధాన
శివునిఁ బూజించి జలధారాఽభిషేకము నొనర్ప వలసియుండును.

పదకొండుమారులు రుద్రాధ్యాయాది సూక్తములతో జ్వరప్రలాపశాంతికై జలధారాఽభిషే
నొనర్పవలెను. షడంగన్యాసములతో కూడిన మహామృత్యుంజయ మంత్రముతో పురుషసూక్తముతో
గాయత్రీమంత్రజపముతోడను ఓంకారాదులు నమోంతములు నగు శివనామములతోడను ఆగ
మంత్రములతోడను శివునభిషేకించిన సుఖము ప్రాప్తించుటయే గాక సంతానము కలుగు
అభిషేకజలమున స్వచ్ఛసుగంధద్రవ్యములను విభూతిని వేయవలెను.

సహస్ర మంత్రముల నుచ్చరించుచు శివునకు మంచినెయ్యిఁదగు ధారాభిషేకమును చేయు
స్వవంశము తప్పక విస్తరించును. ఇందెంతమాత్రము సంశయము లేదు. క్షీరాభిషేకము దుఃఖనాశక
శర్కరతో కూడిన పాలతో నభిషేకించుటఁ జేసి ప్రజ్ఞా (తెలివి) వృద్ధియగును. పదివేల మంత్రము
చదువుదనుక క్షీరముతో శివు నభిషేకింప వలసియుండును.

స్వగృహ కలహాది ఉపద్రవములు శమించుటకై ధారాభిషేకము అవశ్యకర్తవ్యమగు
తైలాభిషేకమున శత్రువులు తపింతురు. సుగంధతైలముతో నభిషేకించునెడ భోగము లన్ని
సమకూరును. ఆవనూనెతో నభిషేకించునెడ పగతురు నశింతురు. తేనెతో నభిషేకించు
కుబేరసమునిగావించును. చెరుకు రసముతో నభిషేకించునెడ....... సర్వవిధసంతృప్తి యొదవు
గంగాజలముతో ధారాభిషేకము నొనర్చునెడ భుక్తి ముక్తులు చేకూరును. ఇట్టి యభిషేకములను పది
సంఖ్యతో గావించి పదియు నొక్క మాహేశ్వర బ్రాహ్మణులకు భోజనము నొసగవలయును.

ఇట్టి శివారాధనము లోకమున సుప్రసిద్ధమై కోర్కెలన్నిటి నొనగూర్చునది. హితావహం
పార్వతీదేవితోడను కుమారస్వామితోడను శంకరుని యథావిధి పూజించువాడు భూలోకమున పుత్రపౌ
సుఖముఁబడసి యంతమున లోకోత్తర సుఖప్రదంబగు మహేశ్వరుని కైలాసముఁజేరి సూర్య

ప్రతీకాశంబులు సర్వత్ర సాధకుని యిష్టానుసారము సంచరించునవియు రుద్రకన్యలు పరివేష్టించి యుండునవియు నగు విమానములలో సంగీతవాద్యసమేతంబుగా విహరించుచు అక్కడినుండియే శివజ్ఞానము గలవాడై శివసాయుజ్యము నొందును.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో చతుర్దశాధ్యాయము.

## పంచదశాధ్యాయము

### (రుద్రావతార ఆవిర్భావము)

**సూతుండిట్లు చెప్పందొడంగెను:**

"పరమ పావనమగు శివకథను వినుపించుటచే ధన్యుడ వైతివి. అందు అద్భుతంబగు లింగోత్పత్తి నాకర్ణించితిని. శివలింగోద్భవమును వినినవారి దుఃఖము లన్నియు తొలగును. తరువాత జరిగిన శివుని మహిమతో కూడిన చరిత్రము ఎట్టిది? విశేషించి సృష్టిప్రకారంబును వక్కాణింపు"మని నారదుండు ప్రశ్నింపగా బ్రహ్మదేవుండు నుడువుచుండెను.

నాయనా? నారదా? నీవడిగిన యంశము సమంజసంబైనది. ఇంతకు పూర్వము నేను వినినట్లు శివచరితమును సంగ్రహముగా చెప్పుచున్నాను. లోగడ, లింగోద్భవ సందర్భమున శివుండు జ్యోతిఃస్తంభ రూపమున మాయిరువురిమధ్య ప్రత్యక్షమై హితమును ప్రబోధించి యంతర్హితుండు కాగా ఉభయులము మిగుల సంతృప్తింజెందితిమి. అట్టితతి నేను విష్ణుమూర్తియు హంస వరాహరూపములం దాల్చుటకు గల కారణమును తెలుపు చున్నాను. హంసస్వరూపము క్షీరనీరములను విభజించునట్లుశివతత్త్వమును పరామర్శింపం జాలునదనియు తథాపి తదర్థము వలయు వివేకము హంసకు చాలదనియు వరాహము అధోగతి కలదై శివ తత్త్వమూలమును కనుగొనుటకు ప్రయత్నింపం జాలుననియు లోకరక్షకుడైన హరి-వరాహరూపమును ధరించిన సమయ ప్రారంభము కలదగుటచే నీ కల్పమునకు శ్వేతవరాహ మను నామధేయ మేర్పడినదనియు తెలియవలెను.

ఇంక శివపదాంభోజమును స్మరించి సృష్టిక్రమమును విశదీకరించెదను. శివుండు ఆదేశించిన విధముగా నేను కొంతదనుక శివధ్యానమును చేయుచు ఆనంద - పరవశుడనై జగమును సృజింప నారంభించితిని.

ఇట్టితతి నారాయణుండు శివానుగ్రహవశమున నా చేయు సృష్టికి వలయు జ్ఞానము నుపదేశించి బ్రహ్మాండమునకు పొలిమేఱయగు వైకుంఠమున నివసించెను. పిమ్మట నేనుపూర్వ సృష్టమైన జలమునందు నంజలిని ఘటింపంజేయగా ఇరువది నాలుగు తత్త్వములు గల యొకానొక యండ ముద్భవించెను. అద్దియే విరాడ్రూపంబునని తెలియవలెను. అంత నేను సంశయ చిత్తుడనై విష్ణువును గురించి పదియురెండు వత్సరములు తపింపగా హరి సాక్షాత్కరించి యెద్ది కావలెనో చెప్పుమనియు శివానుగ్రహబలమున నంతయు





నొసగఁజాలుదుననియు ఆదేశింపగా నేను విష్ణో! ఈయండము జడముగా కన్పట్టుచున్నది. చైతన్య గలదానినిగా నొనర్పుమని ప్రార్థించితిని.

అంత విష్ణువు నా ప్రార్థన ననుసరించి యనంతరూపము గలవాడై అండములో ప్రవేశించె అనంతుడు - సహస్రశీర్షములు సహస్రనేత్రములు సహస్రపాదములు గలవాడుగా కన్పట్టుచుండె అందువలన నండము చేతనంబయ్యెను. అట్టివిరాట్పురుషుఁడు పాతాళము మొదలుకొని సప్తలోకము వ్యాపించి యుండెను.

ఇది యిట్లుండగా సదాశివుఁడు బ్రహ్మాండసీమయగు వైకుంఠముపైన ప్రకాశించు కైలాస నగరము నిజనివాసమునకై నిర్మించియుండెను. బ్రహ్మాండము నశించినను కైలాసము అంతరించునదికా ఇఁక నేను శివాజ్ఞ ననుసరించి సత్యలోకమునందు నివాసము నేర్పఱచుకుంటిని.

అంత నేను సృష్టిని మొదలిడగా అవిద్య మొదలగు తామస వస్తువులు పుట్టెను. తరువాత మనస్సు కుదుటపఱచుకొని స్థావరములగు పర్వతవృక్షాదులను పుట్టించితిని. ఇవియు తెలివిలేని వగుట మఱల శివుని ప్రార్థింపగా దుఃఖాఢ్యములైన తిర్యక్ ప్రాణులు జన్మించినవి. ఇవియు శ్రేష్ఠములు కా భావించి శివప్రార్థనను చేయగా ఊర్ధ్వస్రోతస్కులగు సాత్త్విక దేవతలు ఆవిర్భవించిరి. వీరును సృష్టిసాధకు గారని తలచి మహేశ్వరుని వేడగా అర్వాక్ స్రోతస్కులగు రాజసులైన మానవులు పుట్టిరి. అట్టితతి సృష్టి సాధకులని ఊఱటఁజెందితిని.

ఇవ్విధము పంచవిధ సృష్టి యేర్పడెను.

సర్గము అనగా సృష్టి - మహత్తత్త్వము, సూక్ష్మపంచ భూతములు, పంచీకృత పంచభూతము అనువాని నిర్మాణముగా ముప్పిధమగుచున్నయది. ఇద్దియే ప్రాకృత సృష్టి యనఁబఱగును. మొత్తముప్రా సృష్టి యష్టవిధము లగుచున్నయది. కౌమారసృష్టి - నవమంబగును. కౌమారసర్గము సనకసనందనానదులు సంభవించిరి. వీరే బ్రహ్మమానస పుత్రులనఁబడుదురు. మరియు నీ ఐదుగు మహావైరాగ్య సంపన్నులై యుండ, నవ్వారిని సృష్టికై ప్రేరేపింపగా విముఖులై శివధ్యానైకమానసులు నుండిరి. వారు నామాటను నిరాకరించినందున క్రోధముఁజెందిన నా నేత్రములనుండి అశ్రుబిందు రాలినవి. అంత నేనేమియు తోచక ప్రార్థింప విష్ణువు - ప్రత్యక్షమై శివుని గురించి తపస్సు చేయుమ చెప్పినందున కఠినమైన అనుష్ఠానము నాచరింపగా నా కనుబొమల మధ్య అవిముక్తమనఁబ నాసికామూలమునుండి మహేశ్వరుఁడు స్వపూర్ణాంశముతో అర్థనారీశ్వరుడై అవతరించెను. అట్టి స సర్వజ్ఞుఁడును సర్వకర్తయు నిత్యుఁడును తేజోరాశియు ఉమాపతియు నీలలోహిత రుద్రుండను నామధేయ గలవాడు నగు శంకరుని మహాభక్తితో నభివాదించి" అనేకవిధ ప్రజలను పుట్టించుమని ప్రార్థించితి

అప్పుడు నామాట విని రుద్రుఁడు తనతో సమానులైన పెక్కు రుద్ర గణములను పుట్టింప జన్మమృత్యు జరావిష్టులైన ప్రాణులను సృజింపుమని వేడితిని.

అంతకరుణానిధియగు మహాదేవుఁడు మందస్మిత వదనారవిందుడై "బ్రహ్మదేవా! జననమరణ భయము ముసలితనము కర్మబంధము దుఃఖభోగము మొదలగు వికారములు గల జనులను పుట్టిం





వాడనుకాను. ఐతే సంసార సాగరనిమగ్నులైన ప్రజలకు గురు స్వరూపముతో ప్రభోధముఁజేశి యుద్ధరించువాడను. నీవే అట్టివారిని పుట్టించుము! నేను అజ్ఞాపించు చున్నాను కావున ఇవ్విషయమై నీకు ఎట్టి మాయాబంధము ఏర్పడదు".

ఇట్లు సుశ్రీ సంపన్నుడగు నీలలోహిత భగవానుడు వక్కాణించి నేను చూచుచుండగానే తన గణములతో కూడ శీఘ్రముగా నంతర్ధానముఁజెందినవాడు.

**ఇయ్యది రుద్రసంహితా ప్రథమ ఖండమునందు "శివవిజ్ఞానసర్వస్వ" మనుశాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పంచదశాధ్యాయము.**

## షోడశాధ్యాయము

### (సృష్టి వర్ణనము)

**సూతుఁడు చెప్పఁదొడగెను:**

బ్రహ్మదేవుఁడు శబ్ద స్పర్శ రూప రస గంధములను సూక్ష్మ పంచ భూతములతో మేళవించి యవ్వాని వలన స్థూలములగు ఆకాశ వాయు వహ్నిజల భూముల నేర్పరచి పర్వతములను సముద్రములను వృక్షాదులను నిమిషములు మొదలుకొని యుగముల వరకు గల కాలభేదములను తదితర వివిధ ప్రాణులను పుట్టించి యంతటితో తృప్తిఁజెందక సాంబశివుని ధ్యానించి సృష్టిసాధకులను దిగువవిధము జన్మింప జేసినవాడు. తననేత్రముల నుండి మరీచిని హృదయనుండి భృగుమహర్షిని శిరంబునుండి యంగిరసుని వ్యానవాయువు నుండి పులహుని ఉదానము నుండి పులస్త్యుని సమాన వాయువునుండి వసిష్ఠుని అపానమునుండి క్రతువును శ్రోత్రములనుండి యత్రిమహర్షిని ప్రాణవాయువునుండి దక్షుని తొడనుండి నారద మహర్షిని నీడనుండి కర్దముని సంకల్పమునుండి ధర్మదేవతను మహాదేవుని యనుగ్రహమున పుట్టించి కృతార్థుండయ్యెను.

ఇట్లు బ్రహ్మమానస పుత్రుడైన ధర్ముడు మానవరూపము దాల్చి సాధకుల నాశ్రయించెను. మరియుబ్రహ్మదేవుని దగు శరీరావయవములనుండి దేవదానవాది కుమారులనేకులు జన్మించిరి. అంత శివప్రేరితుడై చతుర్ముఖుఁడు తనదేహమును సగముస్త్రీగాను సగము పురుషుడు గాను పరిణమింపఁ జేసెను. అమిథునము నుండి స్వాయంభువమనువు శతరూపయనంబడు యోగిని జన్మింపగా స్వాయంభువమనువు శతరూపను వివాహవిధానముతో పరిగ్రహించి ఆమెయందు మైథున విధానమున ప్రియవ్రతుని ఉత్తానపాదుని అకూతి దేవహూతి ప్రసూతి యనఁబడు పుత్రికాత్రయమును బడసెను. అంత మనువు ఆకూతిని రుచియను వానికి, దేవహూతినికర్దమునకు, ప్రసూతిని దక్షునకు సమర్పించెను.

అవ్వారిలో ప్రసూతికి కలిగిన సంతానముతో జగము వ్యాపింపఁబడినది. రుచికి నాకూతియందు యజ్ఞుఁడు దక్షిణయు జన్మించిరి. యజ్ఞునకు దక్షిణయందు పండ్రెండ్రుగురు పుత్రులు పుట్టిరి. కర్దమునకు దేవహూతియందు పెక్కురు కుమార్తెలు సంభవించిరి. దక్షునకు ప్రసూతియందు నిరువదినాలుగు పుత్రికలు జన్మింపగా నవ్వారిలో శ్రద్ధను లక్ష్మిని ధృతిని తృప్తిని పుష్టిని మేధను క్రియను బుద్ధిని లజ్జను వసువును





శాంతిని సిద్ధిని కీర్తిని పదముగ్గురును ధర్మున కొసగెను. ఇవ్వారికన్న చిన్నవారగు ఖ్యాతిని భృగు సతిని మహేశ్వరుఁడు సంభూతిని మరీచియు, స్మృతిని, అంగీరసుఁడును ప్రీతిని పులస్త్యుఁడును క్షమ సన్నతిని పులహుఁడును, క్రతువును అనురూప నత్రియు ఊర్జను వసిష్ఠుండును. స్వాహను వహ్ని స్వధను పితరులును పరిగ్రహించిరి.

ఇవ్వారిచే చరాచరంబగు త్రైలోక్యమంతయు వ్యాపింపఁబడెను. ఇట్లు వారి వారి పూర్వకర్మా సారముగా పార్వతీపతి యానతింబట్టియు ననంఖ్యాకజనులు జన్మించిన వారైరి. ఇఁక కల్పభేద ననుసరించి దక్షప్రజాపతికి నరువది పుత్రికలు జన్మించిరని చెప్పవచ్చును. అవ్వారిలో పదుగురిని ధర్మున ఇరువదియేడుగురిని చంద్రునకు, పదముగ్గురిని కశ్యపునకు నలుగురిని గరుత్మంతునకు భృగు అంగి కృశాశ్వులకు ఇద్దరిద్దరిని విధివిధానముగా దక్షుఁడొసగగా యవ్వారికి పుట్టిన సంతానము ప్రపంచమయ్యె కశ్యపుడు తన పదముగ్గురు భార్యలయందు కనిన సంతానము స్థావరమును జంగమమును వ్యాపించె శూన్య మెచ్చటను లేకుండెను. అట్టి సంతానములో దేవతలు ఋషులు దైత్యులు వృక్షములు పక్షు పర్వతములు తీగెలు నుండినవి. పాతాళము మొదలుకొని సత్యలోకమువరకు నవ్వారు నివాసము నేర్పరచుకొనిరి. ఇట్లు శివశాసనము ననుసరిరంచి బ్రహ్మదేవుఁడు సృష్టిజేసినవాడు.

సర్వసుఖంకరుడైన శంకరుఁడు సతియను దక్షకన్యకను పరిగ్రహింపఁదలచి తన త్రిశూలము అమెను రక్షించుచుండెను. లోక కల్యాణము కొరకై ఆవిర్భవించిన సతీదేవిని శంకరుఁడు పరిగ్రహిం భక్తుల నుద్ధరించు నుద్దేశముతో పెక్కు లీలలను ప్రదర్శించెను. వస్తుతః శివుఁడు - తన వామాంగమును నారాయణుని, దక్షిణాంగమునుండి, పంకజాసనుని, హృదయమునుండి మహేశ్వరుని పుట్టిం ముమ్మూర్తులుతానై యున్నవాడు. మఱియు బ్రహ్మ విష్ణుమహేశ్వరుల నిజరూపములను పేర్కొనుచున్నా వినుఁడు!

శ్లో॥ అంతస్తమో బహిఃసత్త్వో - విష్ణు, రుద్ర స్తథామతః ।
అంతఃసత్త్వస్తమోబాహ్యో - రజోఽహం సర్వథా మునే ॥ 39

విష్ణువు - అంతఃకరణములో తమోగుణము, వ్యవహారమున సత్త్వగుణంబును కలవాడని మహేశ్వరుఁడు - లోన సత్త్వగుణము వెలుపల తమోగుణంబును కలవాడనియు బ్రహ్మదేవుఁ అంతర్బహిస్సులందు రజోగుణము గలవాడనియు తెలియవలెను.

సరస్వతీదేవి రజఃస్వరూపిణియు, సతీదేవి సత్త్వస్వరూపిణియు లక్ష్మీదేవి తమః స్వరూపిణియ నగువారు. ఆదిశక్తి యిట్టి త్రిమూర్తులకు మూలమగునది. ఇఁక సతీదేవి శంకరునిచే పరిగ్రహింపబడి తన తండ్రిచేయు యజ్ఞమున స్వశరీరమును విసర్జించి మరల శరీరమును పరిగ్రహింపక నిజలోకమునకు జనినది. తరువాత దేవతలు ప్రార్థింపగా హిమాలయసుతయై ఘోరతపంబాచరించి మరల శంక నర్ధాంగి యయ్యెను.

కాళికయనియు చండికయనియు చాముండయనియు విజయ యనియు జయ యనియు జయం యనియు భద్రకాళి యనియు దుర్గ యనియు భగవతి యనియు కామేశ్వరి యనియు కామద యని





అంబయనియు మృడాని యనియు సర్వమంగళ యనియు ఇత్యాది నామధేయములు పార్వతీదేవికి విలసిల్లుచు భుక్తిముక్తి ప్రదములగుచున్నయవి; మరియు నీ పేరులు అమ్మవారి లీలాచరితముఁబట్టి యేర్పడినవని చెప్పవచ్చును. సత్త్వరజస్తమః స్వరూపులైన ముమ్మూర్తులు - తాదృశులైన ముగ్గురు దేవులునుకూడి ఉత్తమ కార్యంబగు సృష్టి నొనర్చినవారని సారాంశము.

ఇఁక శివలోకమునందు శివుఁడు ఆదిశక్తితో విహరించుచుండును. అతని పూర్ణావతారమే త్రిమూర్తులలోని మహేశ్వరుండని భావింపవపలసియున్నది. అట్టి మహేశ్వరుఁడే శాశ్వతమగు కైలాసపదమునందు నివాసము నేర్పరచుకొన్నవాడు. బ్రహ్మాండము సమసినను కైలాసమున కిసుమంతయు కీనాశము లేదు.

**ఇయ్యది రుద్రసంహిత యందు సృష్టి ఖండమున "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో షోడశాధ్యాయము.**

## సప్తదశాధ్యాయము

### (గుణనిధి చరితము)

భక్తవత్సలుడైన శంకరుఁడు కైలాసమున కెప్పుడు వెళ్లెను? మహనీయుఁడగు కుబేరునితో మైత్రి నెప్పుడు చేసెను? శివుని పూర్ణావతారమగు మహేశ్వరుఁడు కైలాసమున నెట్టిలీలలను గావించెను? ఇత్యాది శివచరితము నంతయు వినవలెనని నాకు మిగుల కుతూహలము కలదని నారదుఁడు ప్రశ్నింపగా బ్రహ్మదేవుఁడు చెప్పిన తెఱఁగున సూతమహర్షి వక్కాణించెను.

కుబేరుని పూర్వజన్మ వృత్తాంతము వినుఁడు!

కాంపిల్యనగరమున సోమయాజి వంశము నందు యజ్ఞదత్తుఁడను దీక్షితుఁడు యజ్ఞవిద్యయందారి తేరినవాడై వేదవేదాంగములను గుర్తెరెగి వేదాంత విజ్ఞానముతో రాజగౌరవమును పొందుచు ఉదారస్వభావము కీర్తియు అగ్ని శుశ్రూషణంబును వేదాధ్యయనంబును గలవాడై నివసించుచుండెను. అతనికి రూపసియు చంద్రబింబసమ వదనుండగు నొక కుమారుఁడు జన్మింపగా గుణనిధి యను నామకరణముఁ గావించి గర్భాష్టమప్రాయమున నుపనయనముఁ జేసినంత నాకుఱ్ఱవాడు విద్యలఁజదువుచు దుష్టసాంగత్యము అబ్బినందున జనకునకు తెలియకుండునట్లు జూదము నలవఱచుకొనెను మఱియు తల్లిచెంత డబ్బు తీసుకొనుచు జూదరులకు నొసగుచు నవ్వారితో మైత్రిని పెంపొందించుకొనెను. బ్రాహ్మణాచారమును విసర్జించి స్నానసంధ్యల నాచరింపక వేదశాస్త్రములను దేవబ్రాహ్మణులను నిందించుచుండెను. శ్రౌతస్మార్త కర్మలను విడనాడి భ్రష్టుండగుటచే సంగీత వాద్యవినోదంబులను నటపాఖండులు మున్నగువారి చెలిమితోడను ప్రొద్దుబుచ్చుచు తల్లి చెప్పినను తండ్రిచెంతకు వెళ్ళకుండెను.

దీక్షితుఁడు కార్యాంతరవ్యాపృతుడై యుండుటకతన ఎప్పుడో నొకప్పుడు కల్పించుకొని "దీక్షితాయని! గుణనిధి గృహమున నగుపడుచులేడు? ఎక్కడికి వెళ్ళినాడు? అని భార్య నడిగిన ప్రతిసమయమందును "ఇప్పుడే స్నానసంధ్యలను ముగించి వేదములఁజదివి దేవతలను పూజించి ఇద్దరు ముగ్గురు మిత్రులతో





కూడి పాఠశాలలకు వెళ్ళినాడు అని చెప్పుచు ఒక్కడే కుమారుండని తన భర్తను మోసగించుచుండెను. దీక్షితుడిది యంతయు తెలియనివాడగుటచే పదునారవ వత్సరమున కుమారునికి చూడాకర్మను గావించెను. ఇంతలో నొక బ్రాహ్మణుండు తన కుమార్తెనొసగుదునని వచింప యజ్ఞదత్తుండు గృహ్యోక్త విధానముచే వివాహముంగూడ నెరవేర్చినవాడయ్యెను.

ఇది యిట్లుండ గుణనిధితల్లి దయార్ద్రహృదయమై తన పుత్రుని కూర్చుండంజేశి దిగువ విధమున హితమును చెప్పుచుండెను.

"నాయనా! నీ తండ్రి – నీ చరిత్రము తెలిసినయెడల కోపోద్రిక్తుడై నిన్ను నాతో గూడ శిక్షించును. నీ తండ్రి యెదుట నీ నడువడిని తెలుపకుండ దాచుచున్నాను. సదాచారముచేతను సంపాదన తోడను నీ జనకుండు లోకారాధ్యుడై మెలగుచున్నవాడు. మంచి చదువు, ఉత్తములతో చెలిమియు బ్రాహ్మణులకు ధనము కావున సమాహిత మనస్కుండవై సదాచారమును ప్రవర్తించుము! నీ వంశము వారందరు. యోగ్యులైన శ్రోత్రియులై సాంగ వేదాధ్యయనముంజేశి యజ్ఞదీక్షలంగైకొనియు సోమయాగముల గావించినవారు, మరియు సుప్రసిద్ధులుగా నుండిరి. దుర్మార్గుల సహవాసమును విడనాడి మంచివారితో స్నేహమును చేయుచుండుము! సద్విద్యలయందు మనస్సు కలవాడవు కమ్ము! బ్రాహ్మణుల అచారముల నడువుము! కీర్తియందును కులమునందును శీలమునందును స్వరూపమునందును దీక్షితుల వారి ననుకరించుము! సద్వంశములో జన్మించి దర్వృత్తమునకు సిగ్గుజెందవలసినవాడవు. ఇప్పటికైనను చెడునడవడిని విసర్జింపుము! పందొమ్మిదియేండ్ల వయస్సుగలవాడవు; నీ భార్య పదునారుసంవత్సరములది సదాచరణము గల యీ గుణవంతురాలిని ప్రేమించుము! పితృభక్తి పరాయణుడవు కమ్ము! నీ మామయు గుణశీలములతో లోకమాన్యుడై యుండుటను గమనించియు సిగ్గుంజెందకున్నావు.

నాయనా! గుణనిధీ! నీ మేనమామలు గూడ విద్యాకులశీలములు కలవారు. వారైన నేమందురో యని భయపడకున్నావు. నీ తల్లి వంశము తండ్రివంశంబును పరమపవిత్రములైనవి. మరియు ప్రతియింటనుండు బ్రాహ్మణకుమారులు సదాచార సంపన్నులగుటను చూడుము! మన గృహమందున్న శిష్యులు నీ తండ్రియందు భయభక్తులు కలవారై ఎట్లు విద్యల నభ్యసించుచున్నారో గమనింపుము! మనను అదరించు ప్రభువు నీ నడువడిని గుర్తెరిగినచో నీ జనకునిపై కినుకపూని మాన్యములను తీసుకొనును. ఇంకను నీవు తెలియనివాడవని లోకులు తలచుచున్నారు. ఇవ్విధముగానే ఇకముందు ప్రవర్తించిన యెడల మన దీక్షితుల వారి గౌరవము గంగపాలగును. మఱియు నీ తండ్రిని నన్ను ప్రజలు నిందింతురు. తల్లి చరిత్రమును కుమారుని నడువడితో కనుగొనవచ్చును. నీ జనకుండును శ్రుతిస్మృతి ప్రయుక్త మార్గము ననుసరించుచు సుకృతమును నాచరించుచున్నవాడు. నేనును ఆ మహానుభావుని పాదకమలములయందు మనస్సును లీనమొనర్చినానని చెప్పుటకు మహేశ్వరుండే సాక్షియగును. ఋతుస్నానమునుచేసి దుర్మార్గుని ముఖమును తిలకింపలేదు. ఐనను బలవత్తరమైన దైవము నిన్ను ఈ విధముగా ఎందుకు పుట్టించినదో బోధపడుటలేదు.

ఇట్లు ప్రతి సమయమున జనని హితముం జెప్పుచున్నను దుర్వ్యసనములపాలైన గుణనిధి దుష్టమానసము గలవాడగుటచే పెడచెవినింబెట్టుచుండెను.





వేట, మద్యపానము, చాడీలు చెప్పుట, అబద్ధములాడుట, దొంగతనము, జూదము పరస్త్రీ సంగమము అను సప్తవ్యసనములలో చిక్కుకొనిన మానవుఁడు ఎంతటివాడైనను లోకమున తేరుకొనఁజాలడు.

గుణనిధి జూదరులకులోనై తనయింటి యందలి మంచి మంచి పాత్రలను మేలి వస్త్రములు మున్నగువాని నపహరించి యిచ్చుచుండెను. మరియు నొకనాడు రత్న ఖచితమగు తండ్రిగారి యుంగరమును గూడ జూదరులకు సమర్పించెను.

అంత దీక్షితుఁడు మార్గమున తన యుంగరమును జూదరి చేతివ్రేలున కుండుటను గాంచి "ఈ యుంగర మెక్కడిది? ఎవరు నీకిచ్చినా" రని పదేపదే నడుగగా "అయ్యా! నన్నెందుకు పలుమారులు ఆక్షేపింతువు? నీ కుమారుఁడిద్దానిని దొంగిలించి జూదమున పణముగా సమర్పించినవాడు. ఇంక నెన్నియో వస్తువులను జూదరులకు నొసగినాడు. మరియు నీ కుమారుని దిగంబరుగా నొనర్చి జూదరులు కట్టివేయుచున్నారు. నీ పుత్రునితో సమానుడైన జూదరి - ప్రస్తుతప్రపంచమున లేడని చెప్పవచ్చును. ఇట్టు అవినీతిపాలైన నీ కుమారుని గురించి యిన్నాళ్ళు తెలియకుంటివా?" అని యా జూదరి చెప్పగానే తలవంచుకొని శిరమును వస్త్రముతో చుట్టుకొని స్వగృహముఁజేరెను.

మహాపతివ్రత యనఁదగు తన భార్యను "దీక్షితాయనీ! ధూర్తుడగు కుమారుఁడెక్కడనున్నవాడు? ఇఁక వానితో నెట్టియవసరములేదు. నా యుంగరమును తలంటి పోసుకొనువేళ వ్రేలినుండి తీసికొనియుంటివి. అట్టి రత్నమయాంగుళయకమును నా కొసగుము" అని మందలింపగా నామె భయపడుచు "స్వామీ! మధ్యాహ్నసమయము అతిక్రమించును గావున స్నాన సంధ్యావందన దేవపూజాదుల నొనర్చి యతిథులతో కూడి తాము భుజింపుడు! అతిథులయందు తమకు ఆదరము మెండు. ఇప్పుడు శివపూజాసంభారముల నమర్చుటయందు వంటకములయందును వ్యగ్రురాలనై యున్నాను. తమ యుంగరము నెక్కడ పెట్టినానో జ్ఞాపకము లేదు" అని సమాధానముఁజెప్పినది.

అంత యజ్ఞదత్తుఁడు - దుర్మార్గుడైన కొమరుని కన్నదానా? నిత్యము సత్యమునే పలుకుచున్నావు. కుమారుఁడెక్కడ అని యడిగిన ప్రతివేళను "ఇప్పుడే బయటికి స్నేహితులతో వెళ్ళినాడు, ఇంతవరకు వేదము నభ్యసించియుండెను" అని చెప్పుచుండెడిదానవు. బంగారు గిండి, పట్టు శాలువ, పట్టు పీతాంబరము, కంచుపాత్రలు, తామ్రఘటము, నాగదంతముతో చేయఁబడిన సమున్నత పీఠము, చంద్రకాంతి నిభయు దీపహస్తయు అలంకృతయునగు సాలభంజిక (బొమ్మ) కనఁబడుటలేదు" అనియు "కులీనులారా? ఇఁక చెప్పునదేమియు లేదు. నిన్ను కోపించుటయు నిరుపయోగము. కులదూషకుఁ డగు కుమారుఁడు కలిగినందున సంతానము లేనివాడ నైతిని. అట్టివానితో సంబంధము లేదని తిలాంజలి నొసగెదను. లెమ్ము! ఉదకమును తెమ్ము! రెండవ భార్యను పరిగ్రహించియే భుజింతును" అనియు "లోకమున కులపాంసనుడగు కుమారుఁడు జన్మించుటకన్న పుత్రుఁడు లేకుండుటయే సమంజసంబగును. వంశము బాగుపడుటకై యొక్కని దూరమొనర్పవలెనని ధర్మము శాసించుచున్నది" అనియు వక్కాణించి మధ్యాహ్నస్నాతుడై నిత్యకృత్యములను గావించి యదేదినమున శుభ ముహూర్తమునందు ఒకానొక శ్రోత్రియుని కుమార్తెను పరిగ్రహించి విధివిధానముగా పాణిగ్రహణము నొనర్చుకొనెను.

***ఇయ్యది శ్రీ శివ మహాపురాణమున రుద్ర సంహితలో సృష్టిఖండమునందు***
***శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములతో సప్తదశాధ్యాయము.***





# రుద్రసంహిత

## సృష్టిఖండము

## అష్టాదశాధ్యాయము

### (గుణనిధి పద్ధతి వర్ణనము)

సూతుఁడు చెప్పఁదొడగెను:

గుణనిధి తన్నుగూర్చి జనకుఁడు ఆగ్రహించిన యుదంతమును గుర్తెరిగి స్వగృహమునకు వెళ్లకుం ఏదేనొక దిశకు పయనమై చనుచు నొకచోట చెట్టుక్రింద నిరుత్సాహముగా చతికిలఁబడి - ఎక్క వెళ్లుదును? ఏమి చేయుదును? విద్యల నభ్యసింపకుంటిని. ధనమును గడింపకుంటిని. తల్లిదండ్రుల దూరమైతిని. ధనముగలవాడు దేశాంతరమునకు వెళ్లినను సుఖపడును. కాని డబ్బునకు దొంగభయ మెండు. శ్రోత్రియ కుటుంబమున జన్మించియు దురభ్యాసముల పాలైతిని. బలవత్తరమై దైవము-ముందురానున్న అనుభవము ననుసరించి ప్రాణిని ప్రవర్తింపఁజేయును. భిక్షాటనము చేయవలెనన్నను పరిచయము గలవాడొక్కఁడును గానరాడు. నా దగ్గర డబ్బు ఇసుమంతయు లే ఇట్టితఱి నాకు శరణ్యం బెయ్యది? ప్రతిదినము సూర్యోదయమునకు ముందే నా తల్లి మిష్టాన్న నిడుచుండెడిది. అట్టి మాతృదేవతకు గూడ దూరమైతిని - అని విచారించుచుండగానే భానుఁడస్త జెందెను. ఇంతలోనొక మాహేశ్వరుఁడు - అనఁగా శివ భక్తాగ్రగణ్యుఁడు - గంధాక్ష పుష్పబిల్వధూపదీపాద్యు పచారములతోడను నానావిధ నైవేద్యములతోడను కాంపిల్యనగరమును బయలుదేరి శివాలయమునకు వెళ్లుచుండెను. ఆనాడు మాసశివరాత్రియగుటచే మాహేశ్వరుని బంధువు పెక్కురు అతని వెంట నుండిరి. శివాసక్తమానసుఁడై శివాలయములో ప్రవేశించి ప్రసన్న మనంబు ప్రదోషకాలమునందు యథోచితముగా శంకరుని పూజించెను. అంత గుణనిధి పక్వాన్నములపరిమళ నాఘ్రాణించి ఆకలిగొని యుండుటచే శివునికి సమర్పింపఁబడిన పదార్థముల నంతయు వీరు నిద్రిం యర్ధరాత్రి వేళ పరిగ్రహింతునని ఆశించి శివాలయ ద్వారమున వేచియుండి శివారాధనమును సమగ్రము తిలకించెను. భక్తులు పూజావసానమున నృత్యగీతాదులను నెరవేర్చి నిద్రింపగానే గుణనిధి శివాల గర్భగృహమునందు చొఱఁబడి పక్వాన్నములను సరిగా చూచుటకు దీపపు కాంతిని పెంపొంది గంపెడాసతో శివనైవేద్యములను పరిగ్రహించియు త్వరగా బయటికి వెళ్లుచుండ-నిద్రించుచున్న ఒకానొక తన పాదము తాకినందుచే నాతఁడు భయపడుచు ఎవఁడు ఎవండనియఱచుచు పట్టుకొనుడ యుద్ఘోషించెను. ఇంతలో రక్షకభటులేతెంచి పరుగెత్తుచున్న గుణనిధిని పట్టుకొని కొట్టగా నాత క్షణములోనే మరణించెను. ఐతే భావిపుణ్య వశమున శివనివేదితమును మాత్రము భక్షింపలే (ఇఁట శివనివేదితమును ప్రసాదముగా పరిగ్రహింపవచ్చును. కాని చౌర్యమున స్వీకరింపరా గమనింపవలెను) ఇదియు శివానుగ్రహమే యని భావింపవలసియున్నది.

అంత యమదూతలు పాశముద్గరహస్తులై గుణనిధిఁదగు సూక్ష్మశరీరమును బంధించి గొంపో నుద్యుక్తులగుచుండగా శివదూతలు దివ్యవిమానారూఢులై యేతెంచి గుణనిధిని కైలాసమునకు తీసుకొ





వెళ్లదలచినవారై "పరమధార్మికుండగు నీతని విడువుడు! ఈతని పాపపటలమంతయు పటాపంచలగుటచే శిక్షింపఁదగినవాడు కాడు." అని వచింప యమభటులచ్చెరువు నొంది శివగణములకు నమస్కరించి భయభీతులై దిగువవిధము విన్నవించిరి.

"ఈతడు స్నానసంధ్యలను విడనాడి సత్యము పరిశుభ్రత లేనివాడై జననీజనకుల మాటఁజవదాటుచు కులాచారమును నడువలేదు. ఇదియే గాక నీ దుష్టుడు శివాలయములో శివనిర్మాల్యమును దాటినవాడు. ఇద్ది ప్రత్యక్షముగా నిప్పుడే సంభవించినది. శివనిర్మాల్యమును భుజించువారు శివనిర్మాల్యము నతిక్రమించువారు శివనిర్మాల్యము నొసగువారు నొకవిధముగా నస్పృశ్యులనియే చెప్పవచ్చును. ప్రాణములు కంఠగతములైనను శివద్రవ్యము ననుభవింపరాదని శాస్త్రములు బోధించుచున్నయవి. ఐనను ధర్మాధర్మనిర్ణయమున మీరే మాకు ప్రమాణము. మీముందెంతవారము. ఒకవేళ ఈతనియెడ ధర్మలేశంబున్నయెడల వివరింపుడు! విందుము"

ఇట్లు యమకింకరుల విన్నపము నాలకించి **శివపారిషదులు** శివుని పాదకమలములను స్మరించి "సూక్ష్మధర్మములు మీ బోటి స్థూలదృష్టి గలవారికి తెలియనట్టివి. ఈ గుణనిధి గావించిన పుణ్యములను చెప్పెదము వినుడు! శివలింగశిరముపై పడుచున్న దీపపునీడను తన **ధోవతి అంచుచింపి చేయఁబడిన వత్తితో తొలగించినవాడు.** అవశముగా నైనను శివనామముల నాకర్ణించెను. మాహేశ్వరుడు గావించిన శివారాధనము నామూలాగ్ర మవలోకించెను. మాసశివరాత్రినాడు ఉపవసించినవాడు. ఇత్యాది సుకృతముల ననుసరించి మేమీతనిని కైలాసమునకు గొంపోవు వారము కైలాసమున కొన్ని వత్సరములు శివుని సేవించుచు మహా భోగముల ననుభవించిన పిదప ని పుణ్యాత్ముఁడు భూలోకమున కళింగరాజుగా జన్మించును. కావున మీరేమియు వివాదమును చేయకుండు! మనస్సు కుదుటపఱచుకొని మీ లోకమునకు వెళ్లుఁడు!" అని చెప్పగా యమదూతలు తమ లోకమునకు వెళ్లి శివదూతలు వచించిన దంతయు యమధర్మరాజునకు విన్నవించిరి.

అంత **శమనుఁడు** - భటులారా? వినుడు! భస్మను మూడురేఖలుగా ధరించిన వారిని విభూతి నుద్ధూళనముఁజేసుకొనినవారిని ఏదే నొక కారణమున శివునని వేషముఁదాల్చు వారిని రుద్రాక్షధారులను జటాధారులను జీవనమునకై శివవేషమును ధరించువారిని కపటమునగాని డాంబికముగగాని భస్మరుద్రాక్షలను ధరించువారిని నా లోకమునకు తీసుకొని రావలదు - అని శాసింపగా నవ్వారు అటులే యని యూరకుండిరి.

అవ్విధము యమదూతలచే విసర్జింపఁబడిన గుణనిధి - శివగణములతో కైలాసమునకుఁజని పార్వతీశంకరులను సేవించుచు నానావిధ సుఖముల ననుభవించి యరిందముఁడనుకళింగరాజునకు పుత్రుడై జన్మించెను.

దముఁడను పేరు గలవాడై శివసేవా పరాయణుఁడై బాల్యమున తోటిబాలురతో శివుని యందు భక్తిని చూపుచుండెను. అరిందముని తరువాత తాను రాజ్యాధిపతియై తన రాష్ట్రమంతటను శివధర్మములను వ్యాపింపఁజేసెను. శివాలయముల యందంతటను దీపారాధనము దక్క వేరొండు ధర్మమును గానకుండెను. ప్రతి గ్రామమున ప్రతి శివాలయమున నిరంతరము దీపము వెలుగుచుండ వలెనని గ్రామాధికారులను

రప్పించి శాసించెను. ఒకవేళ నా శాసనమునకు వ్యతిరేకము జరుగునెడ నవ్వారిని శిక్షింతునని దీపదానమువలన శివుఁడు సంతసించుననియు నా యానతిని ధిక్కరించు వారి శిరశ్ఛేదమును గావిం జేతుననియు చెప్పగా రాజభయమున ప్రజలు శివాలయము లన్నిటియందును అఖండదీపారాధనము గావించుచుండిరి. ఇవ్విధముగానే దముఁడు తన జీవితము నంతటను శివధర్మము నాచరించి వృద్ధ మరణించెను.

పూర్వజన్మమున చేలాంచలవర్తి కాకృత దీపవర్ధనమునఁజేశి మరుసటి జన్మమున రాజై శివాల దీపజ్యోతులను వెలిగించుట కతన మూడవ జన్మమున కుబేరుఁడై అలకానగర సామ్రా పట్టభద్రుండయ్యెను.

శ్లో॥ ఏవం ఫలతి కాలేన - శివేఽల్పమపి యత్కృతమ్ ।
ఇతి జ్ఞాత్వా శివే కార్యం - భజనం సుసుఖార్థిభిః ॥ 62

శివు నుద్దేశించి చేయఁబడు సుకృతము కొద్దిదైనను కాలాంతరమున తప్పక ఫలించు బుద్ధిమంతుఁడు భావించి యుత్తమసుఖమును బడయగోరి శివారాధనమునవశ్య మొనర్పవలసియుండు

ఋషులారా! శివాలయమున స్వార్థమునకై దీపమును పెంపొందించిన దీక్షిత కుమారుడెక్క ఉత్తరదిశ కధిపతియగు కుబేరుఁడెక్కడ? మానవుడై సాధించిన లోకోత్తర పదవిఁగూర్చి గమనింపు

ఏతాదృశ గుణనిధి చరితము శివప్రీతికరంబు సర్వాభీష్టప్రదంబునై వెలసినది. ఇఁక నట్టి కుబే డు శివునితో మైత్రి నెట్లు గావించెనో విశదీకరింతును. స్థిరచిత్తముతో నాలకింపుడు!

*ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వము" అను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో అష్టదశాధ్యాయము.*

## ఏకోనవింశాధ్యాయము

పాద్మకల్పమునందు బ్రహ్మదేవుని మానసపుత్రుడగు విశ్రవస్సునకు వైశ్రవుణుడను కుమారు కలిగియుండెను. అతడే అలకానగరము నధిష్ఠించినవాడు. మఱియు పాద్మకల్పము తరువాత మేఘవా కల్పమునందు సుదుః సహమైన తపంబు నాచరించెను. పూర్వజన్మమున తావెలిగించిన శివా దీపమునఁజేశి యిట్టి యుత్కృష్టజన్మము నందితి గదా యని శివభక్తి ప్రభావమును లోలోన గ్ర జ్ఞానప్రకాశినియగు కాశికా క్షేత్రమునకుఁజని యొకానొక దివ్యదీపమును నెలకొల్పెను.

తనయంతః కరణమును పరిశుభ్రపఱచి చిత్తమనెడు రత్నపు కాంతితో అనన్య భక్తియను తైలమ శివైక్యమను ప్రమిదయందు నింపి తపస్సనెడు అగ్నిచే రగుల్కొలిపి వివేకమను వత్తి వెలిగించెను. అపూర్వదీపమునకు కామక్రోధ లోభమోహాది మహావిఘ్నములను మిడుతపురుగుల యాఘాత లేకుండెడివి. ప్రాణాయామమునఁజేశి సుడిగాలి వీచకుండెను. నిర్మల వీక్షణమువలన మాలిన్య లేకుండెడిది. ఐతే కుబేరుఁడింత మాత్రమున నూఱటఁజెందక పవిత్రభాగీరధీ తీరమునందు శివలింగ స్థాపించి సద్భావకుసుమములతో నర్చించుచు పదిలక్షల వత్సరంబులు శివపంచాక్షరీ మహామంత్ర

ననుసంధించి తోలుబొక్కలు మిగులునట్లు శరీరము శుష్కించువరకు తపంబాచరింప కరుణార్ద్ర హృదయుఁడగు శంకరుఁడు విశాలాక్షీదేవితో ప్రత్యక్షమై "శివలింగమునందు తన హృదయమును పాదుకొలిపి స్థాణువువలె నిశ్చలముగా తనను ధ్యానించు" కుబేరుని గాంచి "నాయనా? నీకు వరముల నొసగుట కేతెంచి తిని, అడుగు" మని పలుకంరిరంపగా కుబేరుఁడు కనులుతెఱచి ఉదయించు వేయి సూర్యులతో సమానమగు ప్రకాశముగల మహాదేవుని చంద్రశేఖరుని ఉమాధవు నవలోకించెను. అంత శివుని తేజస్సుతో కనులు మిరుమిట్లు గొలుపగా నిమీలి తాక్షుఁడై శంకరా? నీ పాదకమలములను దర్శించు సామర్థ్యము నొసగుమని ప్రార్థించెను. మరియు సాక్షాత్తు నిన్ను చూచుటయే వరంబని వేడుకొనెను. ఇతరవరములు వలదనెను.

దేవదేవుఁడు కుబేరుని ప్రార్ధన నాలకించి తన అమృతహస్తముతో స్పృశించి నంత కుబేరుఁడు శివదర్శన సామర్థ్యముఁబడసి కన్నులు తెఱచి మొదట నుమాదేవినే చూచుచు ఈ సర్వాంగసుందరి యెట్టి తపమును గావించి శంభుని చెంత నున్నదోయనియు ఈమె నా కంటె నధికముగా తపించియుండుననియు ఆహా! సౌందర్యము; ఆహా! అనురాగము; ఆహా! సౌభాగ్యము, ఆహా! సంపద యనియు పలుమారు పలువరించుచు క్రూరదృష్టి గలవాడై యుండగా నాతని ఎడమ కన్ను వికారముఁ జెందుచుండెను. అంత నమ్మవారు - దుష్టతాపసుఁడు నన్నే క్రూరముగా దక్షిణనేత్రముతో గూడ గావించుచున్నవాడు. నా రూపప్రేమలను సౌభాగ్యసంపదలను సహింపకున్నవాడు, అని వచింపగా శంకరుఁడు - దేవీ! ఈతఁడు నీ కుమారతుల్యుఁడు; క్రూరముగా చూచుటలేదు. కాని తపోలక్ష్మిని పొగడుచున్నవాడు - అని దేవి నూఱడింపఁజేశి "నాయనా! కుబేరా! నీ తపంబునకు సంతసించితిని. వరముల నొసగుచున్నాను. నవవిధుల కధినాథుడ వగుదువు; గుహ్యకులకు యక్షులకు కిన్నరులకు కింపురుషులకు పుణ్యజనులకు నధిపతి వగుదువు; నా తోడ నెల్లకాలము మైత్రి యుండును. అలకానగరము నీకు రాజధానియగును. నీతో సఖ్యమును పెంపొందింప నలకానగర సమీపమున నివసింతును. నా చెంతనున్న దేవి నీకు తల్లివంటిది. ఈ జగదంబఁదగు పాదములపై వ్రాలుము!" అని కుబేరు ననుగ్రహించి "దేవీ! పుత్రసన్నిభుఁడగు నీతని కరుణింపు" మనఁగా అమ్మవారు 'నాయనా! శంకరుని యందు నీ భక్తి - నిర్మలమై దినదిన ప్రవర్ధమాన మగు గాక! స్ఫుటిత నేత్రము గోరోజన వర్ణముగలదై చూపరుల కందముగా కనఁబడు గాక! పరమేశ్వరుఁడు నీ కొసగిన వరములు త్వరలో ఫలించుగాక! నా రూపాదుల నసూయతో గాంచుటఁజేశి "కుబేరు"డను నామధేయము నీకు నిరంతరము విలసిల్లుగాక!" అని వరముల నొసగినదయ్యెను.

అంత నుమామహేశ్వరులు - కాశీక్షేత్రమున నివ్విధము కుబేరు ననుగ్రహించి యంతర్ధానముఁ జెందిరి. ఇట్లు ధనదుఁడు శంకరునితో మైత్రిని నెలకొలుపు కొనినవాడు. కుబేర రాజధానియగు అలకానగరముచెంతనే శంకరుని నివాసమగు కైలాసము విరాజిల్లుచున్నయది.

**ఇయ్యది శివమహాపురాణము నందలి రుద్రసంహితయందు సృష్టిఖండములో**
**"శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో ఏకోనవింశాధ్యాయము.**





# వింశాధ్యాయము

కుబేరుని తపో బలమున శివుఁడు కైలాసమున కేతెంచిన సందర్భమును వివరించుచున్నాను. నా సంపూర్ణాంశముతో బ్రహ్మలలాటమునుండి యావిర్భవించిన రుద్రుని రూపముతో కైలాసమునకు జనుదు, ననియు "రుద్రుఁడు హరి బ్రహ్మాదులతో సేవింపఁబడువాడనియు పరమాత్మయనియు" చింతించి రుద్రుఁడై నాద స్వరూపిణియగు తన డమరుకమును మ్రోగింపగా నా నాదము భువనభోంతరములయందు వ్యాపించుచు దేవ ఋషి గంధర్వాదులను భక్తుల నాహ్వానించునట్లు వినఁబడుచుండెను. అంత విష్ణు బ్రహ్మాది దేవతలు నారదాది మహర్షులు, మూర్తి మంతములైన నిగమాగమములు, సిద్ధులు, ప్రమథ గణములు భక్తులెల్లరును పరమేశ్వరుని సన్నిధానమునకు వచ్చుచుండిరి.

శంఖ కర్ణుఁడు కోటిగణములతోడను కేకరాక్షుఁడు దశకోటిగణములతోడను వికృతుఁడు నెనిమిదికోట్ల గణములతోడను విశాఖుఁడు అరువదినాలుగు కోట్ల గణముల తోడను పారియాత్రకుఁడు తొమ్మిదికోట్ల గణములతోడను సర్వాంతకుఁడు ఆరుకోట్ల గణములతోడను దుందుభుఁడు నెనిమిదికోట్ల గణములతోడను జాలంకుడు పండ్రెండ్రు కోట్ల గణములతోడను మదుఁడు ఏడు కోట్ల గణముల తోడను వికృతాననుఁడు సప్తకోటి గణముల తోడను కపాలి యైదు కోట్ల గణముల తోడను సందారకుఁడు ఆరు కోట్ల గణముల తోడను కందుకుఁడు కుండకుండును కోటికోటి గణముల తోడను విష్టంభుఁడు నెనిమిదికోట్ల గణముల తోడను చంద్రతాపనుఁడు నష్ట కోటి గణములతోడను మహాకేశుండు వేయికోట్ల గణముల తోడను కుండి పర్వతకుండును పన్నెండేసి కోట్ల గణములతోడను కాలుఁడు కాలకుండు మహాకాలుఁడును నూరేసి కోట్ల గణములతోడను అగ్నికుండు శతకోటి గణముల తోడను అభిముఖుఁడు కోటిగణములతోడను ఆదిత్యమూర్థుండు ధనావకుఁడును కోటికోటి గణములతోడను సన్నాహుండు కుమదుండును, నూరేసి కోట్లగణములతోడను అమోఘుండు కోకిలుండు సుమంత్రకుండును కోటి కోటి గణములతోడను కాకపాదుఁడు సంతానకుండు నరువదేసి కోట్ల గణముల తోడను మహాబలుండు మధుపింగుండు పింగలుండును తొమ్మిదేసికోట్ల గణములతోడను నీలుండు పూర్ణ భద్రుఁడును నవతినవతి (90) కోట్ల గణముల తోడను చతుర్వక్త్రుండు నేడుకోట్ల గణములతోడను కాష్ఠాగూఢుడు సుకేశుండు వృషభుండు నరువది నాలుగేసి కోట్ల గణముల తోడను చైత్రుండు నవకుశుండు నేడేసికోట్ల గణముల తోడను లోకాంతకుండు, దైత్యాంత కుండు భృంగియు రిటియు అశనియు భానుకుండు నరువది నాలుగేసి కోట్ల గణములతోడను గణాధీశుడైన నందీశ్వరుండు శతకోటి గణములతోడ నింక నితర గణాధిపతులు నసంఖ్యాకముగా శివ సన్నిధానమున కరుదెంచిరి.

అందరును వేయి చేతులు గలవారు, జటామకుట ధారులు, చంద్రశేఖరులు, నీలకంఠులు, త్రిలోచనులు, హార కుండల కేయూర ముకుటాదులతో నలంకరింపంబడినవారు, బహ్మేంద్ర విష్ణు సమానులు, అణిమాది గుణ సంపన్నులు, సూర్యకోటి ప్రతీకాశులుగా నుండిరి. ఇవ్విధము విష్ణుబ్రహ్మాద్యమరులు ప్రమథగణంబులు తదితరులందరును సాంజలులై వెంటరాగా శంకరుఁడు కైలాసమునకు వేంచేసినవాడు.

కుబేరుఁడు - పరమేశ్వరునకు స్వాగతముఁబలికి తన పరివారముతో గూడ సాంబశివుని నానా విధ సదుపచారములతో పూజించెను. విష్ణ్వాది దేవతలను, నందీశ్వరాది ప్రథమ గణములను

యథోచితముగా సత్కరించెను. అంత శంకరుఁడు కుబేరుని కౌగలించుకొని శిరముపై నాఘ్రాణించియు అలకానగర సన్నిధి నుద్యానవనమున స్వానుచరులతో గూడ నివసించి కైలాస పర్వతమున భక్తులకై నానావిధ సౌధముల నిర్మించుమని విశ్వకర్మ నాజ్ఞాపింప నాతఁడట్లే ననేక విధ సౌకర్యములు గల భవనములను నిర్మించినవాడు.

అంత నారాయణుని ప్రార్థన ననుసరించి పరమేశ్వరుఁడు సుముహూర్తము నందు స్వస్థానమగు కైలాసములో ప్రవేశించి స్ఫటికమణిమయ నిజ పదమునందు నివసించి ప్రసన్నుడై భక్తులందరిని సనాథులను గావించినవాడు. పిమ్మట విష్ణ్వాది దేవతలు ఋషులు సిద్ధులును సంతుష్టాంతరంగులై శివునికి పట్టాభిషేకమును గావించి స్వయోగ్యతాక్రమమున నానా విధ పారితోషికముల నొసఁగుచు శివుని బూజించుచుండిరి. గొప్ప వేడుకతో మంగళ నీరాజనములను సమర్పించిరి. పట్టాభిషిక్త శివునిపై పుష్ప వృష్టి కురిసినది. అప్సరసలు శివలీలా విలాసమును పాడుచు నాట్యముజేశిరి. జయ శబ్దము నమః శబ్దము మిన్ను ముట్టుచుండెను. సమాగతులందరును నవనవోన్మేష సముల్లాస వికసిత వదనారవిందులగుచుండగా శంకరుఁడు- దివ్య సింహాసన మందాసీనుఁడై విష్ణ్వాదులందరిరతో సేవింపఁ బడుచు విరాజిల్లి యుండెను. అంత దేవతలు మునులు సిద్ధులును వేరు వేరుగా శివుఁడే సర్వాధికుఁడను సదర్థము గల స్తోత్రములతో ప్రార్థించుచుండగా శివుఁడు సంతసించి వారి వారి మనోభీష్టము లీడేరునట్లు వరములు ప్రసాదించుచుండెను.

తరువాత హరిని పంకజాసనుని మణిపీఠములయందు కూర్చుండఁజేశి విష్ణు బ్రహ్మలారా? మీరిరువురును నాకు ప్రియతములు; సురోత్తములు, జగమును సృజించుటయు రక్షించుటయు మీ కర్తవ్యములు; మీ నివాసములకుఁజని సుఖముగా నుండుడు! కర్తవ్యముల నేమరకుఁడు! మీకు నిరంతరము శుభము నొనఁగూర్చువాడను. విశేషించి నా దృక్పథము మీయందే యుండును" అని శివుఁడు వక్కాణింపగా విధిహరులు తమ నెలవులకు వెళ్ళియుండిరి.

అట్టి తఱి కుబేరుని నుపవిష్టుని గావించి తత్కరమ ఁబట్టుకొని "మిత్రమా! నీయందలి యనురాగముచే కైలాసమునకు రావలసివచ్చినది. ఇఁక నీవు నిర్భయుడవై అలకానగరమునందు నివసింపుము! అవసరము పడినపుడు నీకు సహకరింతును." అని యుపదేశింప కుబేరుఁడు ప్రీతమానసుఁడై స్వనివాసమునకు పోయినవాడు.

పర్వతోత్తమమగు కైలాసమునందు గణములతో గూడ నివసించుచు ఆత్మారాముఁడై శివతాదాత్మ్యముతో నొకప్పుడు తనను తాను ధ్యానించుచుండెను. మరియొకప్పుడు శివ యోగము నభ్యసించుచుండెను. ఇంకనొక సమయమున గణములకు పూర్వ కల్ప సంవృత్త స్వలీలా చరితములను వినిపించుచుండెను. మరియొక తడవ కైలాస గుహలయందు గణములతో నాడుకొనుచుండెను.

ఇవ్విధము శివుఁడు రుద్ర స్వరూపుడై తన వెండికొండపై నానావిధ లీలల నాచరించుచు నపత్నీకుడైన కతన దక్ష ప్రజాపతికుమార్తెయగు సతీదేవిని వివాహమాడి లోకాచార పరాయణునివలె నా యాది శక్తితో విహరించుచు సుఖముగా నుండెను. ఇక్కథను చదివినవారు విన్నవారును భుక్తిముక్తి ఫలంబుల ననుభవింతురు.

*ఇయ్యది శివ మహాపురాణ రుద్రసంహితాంతర్గత సృష్టిఖండము వింశాధ్యాయముతో "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ప్రవచనములతోడను సమాప్తము.*





# 2. రుద్ర సంహిత

## 2. సతీఖండము

## ప్రథమాధ్యాయము

### (సతీ సంక్షిప్త చరితము)

శౌనకాది మహర్షులు - శివుని పూర్ణాంశ సంభవుఁడగు రుద్రుఁడు - హరి బ్రహ్మాది సేవ్యుడై కైలాసమున నివాసము నేర్పరచుకొని కుబేర మిత్రుఁడై నిర్వికారుడై యుండువాడు. ఇట్టివాడయ్యు హరిప్రార్థన ననుసరించి దక్ష ప్రజాపతి కుమార్తెయగు సతీదేవిని వివాహమాడి గృహస్థుడైనాడనియు అమ్మవారు మొదట దక్ష పుత్రిక యనియు పిమ్మట హిమవంతుని కుమార్తె యనియు వింటిమి. ఒకే శరీరముతో నిరువురికి కుమార్తె యగుట యెట్లు? సతిగాను పార్వతిగాను శివునే విధము పొందినది వివరింపుడని కోరుచున్నాను.

సూతుఁడు-ఋషులారా! మీరు నిండు ఆదరముతో ప్రశ్నించిన పవిత్ర కథను వినువారి జన్మ సఫలమగును. ఇందెంత మాత్రము సంశయములేదు.

పూర్వ మొకప్పుడు బ్రహ్మదేవుఁడు తన కుమార్తెయగు సంధ్యా దేవినిచూచి మోహించెను. అట్టితఱి శివుఁడు బ్రహ్మ సభ కేతెంచి బ్రహ్మదేవుని తదనుయాయులందరిని ధిక్కరింపగా నాతఁడు శివమాయా మోహితుఁడై శివునిపై నీర్ష్యఁబూని శివుఁడు మాయా మోహితుండగుటకు చేసిన ఉపాయములన్నియు వ్యర్థములైనవి. అంత హరిని స్మరింపగా నారాయణుఁడు సమీపించి బ్రహ్మదేవున కెన్నియో విధములుగా హితముఁజెప్పిన నాతడు వినండయ్యెను. మరియు బ్రహ్మదేవుడు శక్తి నారాధించి తన కుమారుఁడగు దక్ష ప్రజాపతికి వీరిణియందు కుమార్తెగా జన్మించుమని ప్రార్థింపగా నాది శక్తి దక్ష పుత్రికయై నుదుటు సహతపంబు నాచరించి శివుని భర్తగా బడసెను. శివుఁడు తన వివాహము నందు బ్రహ్మదేవుని మోహింపఁ జేసి స్వలీలా ప్రభావమును చూపెట్టెను. సర్వస్వతంత్రుడైన పరమేశ్వరుడు-సతీదేవితో కైలాసమునందు నానావిధ విహారముల నొనర్చియున్నవాడు.

అంత కొంత కాలమునకు దక్షునకు శివునితో వైర మేర్పడగా దక్షుఁడు ఒకానొక యజ్ఞము తలపెట్టి అందు పాలుగొనుటకు శివుని దక్క బ్రహ్మ విష్ణ్వాది దేవతలందరిని ఋషుల నాహ్వానించెను. తన గారాబు పట్టి యగు సతీ దేవిని గూడ నాహ్వానింపలేదు.

సతీ దేవి - తన్ను తండ్రి పిలువకున్నను - శివుని యానతిఁబడసి దక్షుని యజ్ఞవాటికకు నేతెంచి యజ్ఞమున రుద్రభాగమును గానక నందరిని మందలించియు స్వదేహమును విడనాడినది. అద్ది విని శివుఁడు క్రోధవశమున తన జడనుండి వీర భద్రుని పుట్టించి - యజ్ఞ గతులందరిని శిక్షించి దక్షుని మదము నణచి యజ్ఞ ధ్వంసమును చేయుమని శాసింపగా మహా బలపరాక్రమ సంపన్నుడైన వీరభద్రుఁడు - గణములద్వారా గొప్ప యుపద్రవములను గావించుటయేగాక దేవ ఋష్యాదులనందరిని శిక్షించి విష్ణు మూర్తి నోడించి దక్షుని తలకాయను నతికి యజ్ఞకుండములో పడవేసినవాడు. శివునికి





అగ్రహము వచ్చినచో రక్షించు వారు లేరని భావించి బ్రహ్మాదులు ప్రార్థింపగా శివుఁడు ప్రసన్నుడై యజ్ఞమును పూర్వము వలె కల్పించి శిక్షితులందరిని యథా పూర్వము బాగు పఱచియు దక్షుని బ్రతికించి యజ్ఞమును పరిపూర్ణము గావింపఁజేసినవాడు. విష్ణ్వాది మహానుభావులందరును యజ్ఞ వాటికయందు శివునారాధించిరి.

ఇఁక సతీ దేహము నుండి యుద్భవించిన జ్వాల (మంట) యొకానొక పర్వతముపై పడినందున సర్వకామ ఫల ప్రదయైన జ్వాలాముఖీ దేవి యచట వెలసినది. ఇప్పటికిని ఆయా కోర్కెలు సిద్ధించుటకై భక్తులు జ్వాలాముఖీ దేవిని పూజించుచుందురు. తరువాత సతీదేవి హిమవంతునికి కుమార్తెయై పార్వతి యనంబఱగుచు ఘోర తపంబు నాచరించి శివుని మెప్పించి పతిగా బడిసినది.

ఋషులారా! మీరు ప్రశ్నించిన యంశమును సంగ్రహముగా చెప్పినాడను. ఇద్దాని నాకర్ణించినవారు పాపములనుండి విడిబడుదురు. అని సూతుఁడు సతీ చరితమును సంక్షేపముగా వక్కాణించెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములతో ప్రథమాధ్యాయము.**

## ద్వితీయాధ్యాయము

### (కామ ప్రాదుర్భావము)

మునులు – సతీ చరితమును పార్వతీ వృత్తాంతమును విస్తారముగా చెప్పుడని ప్రశ్నింపగా సూతమహర్షి చెప్పఁదొడఁగెను.

పూర్వకాలము తన భక్తులలో అగ్రగణ్యుడైన విష్ణుమూర్తికి శివుఁడు ఇదే కథా సందర్భమును వక్కాణించినవాడు. విష్ణువు బ్రహ్మదేవునికి, అతడు నారద మహర్షికి నారద మహర్షికి నారదుఁడు వేద వ్యాసునకు ద్వైపాయనుఁడు నాకు చెప్పియున్నవారు.

శివుఁడు వస్తుతః నిరాకారుఁడై ఎట్టి వికారములు లేనివాడైనను శక్తి విశిష్టుఁడగుటఁజేశి యొకానొక దివ్య విగ్రహము గలవాడయ్యెను. అతడే సదాశివుఁడనఁబడును. సదాశివుని వామాంగమునుండి నారాయణుఁడు, దక్షిణాంగమునుండి బ్రహ్మదేవుఁడును హృదయమునుండి రుద్రుఁడు నావిర్భవించి రక్షణమును సృష్టిని ప్రళయమును చేయుచున్నవారు.

బ్రహ్మదేవుఁడు మరీచిమున్నగు వారిని పుట్టించిన పిమ్మట మునిమానసములను గూడ మోహింపఁజేయు సర్వాంగ సుందరిని తన మానసమునుండి జన్మింపఁజేశెను. ఆమెయే సంధ్య యని పేర్కొనఁబడినది. సంధ్యను బ్రహ్మయు, బ్రహ్మ మానస పుత్రులగు దక్షాదులు నవలోకించుచు చింతించుచుండగా బ్రహ్మ మానసమునుండి యొకానొక సుందర మనోహర పురుషుఁడావిర్భవించెను. అతడు బంగారు వన్నెకలవాడై బలసిన వక్షఃస్థలము, చక్కని ముక్కు, వర్తులమైన నడుము, పిక్కలు, నల్లని ముంగురులు, తీర్చిన కనుబొమలు, పూర్ణచంద్ర సదృశ ముఖంబును, కేశ పంక్తియు కలవాడై దిగ్గజముఁబోలుచు





బలిష్ఠుడై నీల వస్త్రధారియై రక్త వర్ణకములైన కరతలములు నేత్రాంచలములు పాదతలములు పెదవులు గలవాడుగా నుండెను. ఆ మహాపురుషుని నడుము సూక్ష్మముగాను దంతములు చక్కనివిగాను దేహ పరిమళము మదించిన గజముదగు మదముఁబోలినదిగాను నేత్రములు వికసించిన కమలములందగు దళములతో సమానములుగాను నాసికాగంధము పొగడ పువ్వుల సువాసన బోలినదిగాను కంఠము శంఖముఁ బోలినదిగాను విరాజిల్లుచుండెను. మరియు నాతఁడు మీనకేతువుగాను సమున్నత శరీరము గల వాడుగాను మకరవాహనుఁడుగాను పంచ పుష్పాయుధుఁడుగాను పుష్పములందగు ధనుస్సు దాల్చినవాడుగాను కన్నులకింపైన వాడుగాను తన కటాక్షములతో నేత్ర యుగళమును పరిభ్రమింప జేయువాడుగాను పరిమళముగల వాయు ప్రసారము గలవాడు గను శృంగార రస భరిత హృదయుండుగ నావిర్భవించినవాడు.

బ్రహ్మ పుత్రులైన దక్షాదులాతని నవలోకించి ఆశ్చర్య చకితులై తమ మనంబులను వికృతములు గావించుకొని చంచల చిత్తులై యుండ నా పురుషుఁడు బ్రహ్మ దేవుఁగాంచి నమస్కరించి వినయావనత కంధరుఁడై "దేవా! నా కర్తవ్య మెద్దియో గౌరవనీయమగు నా స్థాన మెద్దియో నాకు భార్య యెవరో యాదేశింపుడ"ని విన్నవింపగా విధాత-విస్మయా విష్ట చేతస్కుడైనక తన క్షణకాల మూరకుండి "ఈ లోకోత్తర స్వరూపముతో స్త్రీ పురుషులను మోహింపఁ జేయుటయే నీ కర్తవ్యము. నీ పుష్ప బాణ ప్రయోగములను దేవదానవమానవాది జీవులందరు నుల్లంఘింపఁజాలరు. వేయేల? త్రిమూర్తులము గూడ నీ ప్రభావమునకు లొంగువారము. ప్రచ్ఛన్న రూపముతో ప్రాణుల హృదయములలో ప్రవేశింతువు స్త్రీ పురుషుల సుఖమునకు కారకుడవై అనాది నుండి వచ్చుచున్న సృష్టిఁబ్రవర్తింప జేయుము! నీ పుష్ప బాణములకు పరి పుష్టమైన మనుస్సు లక్ష్యఁబగును. ఇఁక నీ నామధేయముల నీ నా కుమారులు నిర్దేశింప గలరు" అని వక్కాణించి స్వతనయుల ముఖముల నొకమారు చూచి పద్మాసనమునందు క్షణకాలము విశ్రమించెను.

**ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ద్వితీయాధ్యాయము.**

## తృతీయాధ్యాయము

### (కామశాపానుగ్రహము)

మరీచి ప్రముఖులైన బ్రహ్మమానస పుత్రులు ఆ పురుషునకుఁదగు నామధేయములను స్థానమును పత్ని నేర్పరచిరి.

బ్రహ్మదేవుని మానసమునుండి పుట్టగానే మమ్మందరను కలవర పెటట్టితివి గావున మన్మథుండను పేరుతో ప్రసిద్ధుడవగుదువు. లోకమున నీతో సమానుఁడు లేనందునను కామరూపుడ వగుటఁజేసియు కాముడని పేర్కొనంబడుదువు. మదింపఁజేయు వాడగుటచే మదనుఁడవనియు, దర్పము (గర్వము)తో కూడి జన్మించితివి కావున కందర్పుఁడవనియు పిలువబడుదువు! దేవతలందరిలో నీకు గల సామర్థ్యము

అద్వితీయమై యుండును. స్థానములన్నియు నీయవియేను, సర్వవ్యాపివగుదువు! ప్రజాపతులలో మొదటివాడు పురుషోత్తముఁడు నగు దక్షుఁడు నీకు తన కుమార్తెను భార్యగా సమర్పించును. ఇఁక నీ కన్యక బ్రహ్మదేవుఁడు బాగుగా ధ్యానించుటచే పుట్టినందువలన సంధ్యయని ప్రసిద్ధిఁగాంచ గలదు. అంత మన్మథుఁడు పుష్ప బాణములను పరిగ్రహించి "నాకు బ్రహ్మదేవుఁడొసగిన కర్తవ్యము నిచటనే ఋషుల ముందు ప్రయోగింతు"నని నిశ్చయించి వీరందరును నా కృత్యమునకు పాత్రులగుదురని భావించియు ధనుర్బాణముల ననుసంధించి ప్రయోగింపగా నచటి సభాసదులు బ్రహ్మదేవుండును మనో వికారము గలవారై ముందున్న సంధ్యను మోహముతో చూచుచుండిరి. సంధ్యయు తన మనంబు చంచలము కాగా కటాక్షములను ప్రసరింపఁజేయుచు శృంగార హావభావములను ప్రకటించుచుండెను. అంత మన్మథుఁడు తన కర్తవ్యము తప్పక నెరవేరునని నిశ్చయించుకొనెను. ఇది యిట్లుండగా ధర్మదేవత – ధర్మరక్షకుఁడైన శంకరుని దిగువ విధము ప్రార్థించెను.

శంకరా ! మహాదేవా ! సృష్టి స్థితి లయములకు నీవే కర్తవు ! ధర్మమును రక్షించు వాడవు! గుణాతీతుఁడవై శివుండనఁబఱగుదువు ! ప్రకృతి నతిక్రమించిన వాడవగుటచే తురీయుండనఁబడుదువు! నిర్వికారుండవు ! నానా విధ లీలలను చూపెట్టు వాడవు ! నా జనకుఁడైన బ్రహ్మదేవుఁడు సోదరులును పాపబుద్ధి గలగియున్నవారు కావున మమ్ము కాపాడుము!

ఇవ్విధము ధర్మదేవుని ప్రార్థన మాలకించి శంకరుఁడచటి కరుదెంచి ఆకాశమున విరాజిల్లుచు బ్రహ్మదేవుని దక్షాదులను మందలించుచు చిరునగవుతో "బ్రహ్మదేవా"! పుత్రికను చూచి నీకెట్లు మోహము కలిగినది? వేదమార్గ మిదియేనా? బుద్ధి మంతుఁడు తల్లిని తోబుట్టువును వదినెను కుమార్తెను కుత్సితమైన చూపుతో చూడరాదని తెలియకుంటివా? వేద మార్గమును మఱచితివా? ధైర్యము గలవాడవు; నీకే ఇట్టి చాంచల్యము కలుగుట యెట్లు? ఏకాంతమున శివధ్యానము జేయువారు నిరంతరము సూర్య మండలములో పరమాత్మను గాంచువారు నగు నీ దక్షాదులెట్లు కామా వృత మనస్కులైరి?

మంద బుద్ధియు అల్ప స్వభావుఁడునగు నీ కాముఁడు దేశకాల పాత్రములను గుర్తెరుగక తన బాణముల నెట్లు ప్రయోగించెను? ఎవని మనస్సు స్త్రీలకు లొంగునో అవ్వాని పాండిత్యము వ్యర్థంబగును. మరియు ధైర్యములోపించును" అని వచింపగా బ్రహ్మదేవుఁడు సిగ్గుఁజెందినవాడై చెమటచే తడసిన వాడై కామరూపిణియగు సంధ్యను పరిగ్రహింపఁదలచియు శివునివలన భయపడుచుండుటఁజేసి ఇంద్రియమనో వికారంబుల నణచుకొనెను. అంత బ్రహ్మ శరీరమునుండి బయలు వెడలిన చెమటవలన అగ్నిష్వాత్తులనఁ బడు పితృగణములు ఉద్భవించిరి. అవ్వారు వికసించిన కమలములఁబోలిన కన్నులు కలవారై కాటుకఁ బోలిన నల్లని శరీరముతోడను మిక్కిలి ఇంద్రియ నిగ్రహము తోడ నరువది నాలుగువేల సంఖ్యగా నుండిరి. అటులే నెనుబదియారు వేల బర్హిషదులను పితృ గణము లావిర్భవించినవారు. ఇఁక దక్షుని స్వేదము (చెమట) నుండి రతీదేవి యుద్భవించెను. ఆపె-మునులనుగూడ మోహింపఁజేయు నతి సుందర మనోహర స్వరూపముతో నలరారుచుండినది. మరీచి మొదలగు నారుగురు మాత్రము ఇంద్రియ వికారముఁ జెందక ప్రశాంతులుగా నుండిరి. క్రతువు వసిష్ఠుడు పులస్త్యుఁడు అంగీరసుఁడు అనువారి బీజములు ధూమము (పొగ) నందు పడగా క్రమముగా సోమపులు, సుకాలురు, ఆజ్యపులు, హవిష్మంతులు,





అను పితృగణములు ఉదయించినవారై పితృ కర్మలయందు సమర్పింపఁబడు కవ్యములను భుజించువారుగా నుండిరి. ఇట్టి కవ్యములను పితృ గణముల కందించువాడు అగ్ని దేవుండగును. ఇఁక సంధ్యా దేవి పరమేశ్వరుని కృపా దృష్టిచే వీక్షింపఁబడినందున ఎట్టి కల్మషము లేనిదై ధర్మ కర్మ పరాయణురాలై పితృగణంబులకు తల్లి యయ్యెను. ఇట్లు బ్రహ్మలోకము నావహించు అధర్మమును పోనాడి ధర్మదేవతను రక్షించి శంకరుఁడంతర్ధానముజెందగా బ్రహ్మదేవుఁడు శివభాషితమున లజ్జితుండగుటచే కనుబొమలు ముడిచి రోషతామ్రాక్షుఁడై - (మన్మథుఁడును శివునికి వెఱచి తన బాణములనుపసంహరింపగా-) శంకరునికి గొప్ప అపచారముఁగావించి యాతనని ఫాలనేత్రాగ్నిలో దహింపఁబడు నని మన్మథుని శపించెను. అంత కందర్పుఁడు భీతిల్లుచు బ్రహ్మ సమక్షమున కేతెంచి దక్షాది ప్రజాపతులు పితృగణంబులును వినుచుండగా వినయముతో నిట్లు ప్రార్థించెను.

దేవా! న్యాయ మార్గానుసారినై నిరపరాధినగు నన్నేల శపించితివి? నీవు చెప్పిన కర్తవ్యమునే చేసి చూచితిని. బ్రహ్మవిష్ణు మహేశ్వరులము గూడ నీ బాణములకు గుఱి యగుదుమని యాదేశించితివి. ఇందు నా తప్పేమిటి?

అంత విధాత-ఆత్మ సంయమనముతో "నా కుమార్తెయగు సంధ్య యందు మోహమును కలిగించితివి కావున శాపము నీయ వలసి వచ్చెను. ఐతే ప్రస్తుతము నా కోపము శాంతించినది. అందువలన చెప్పుచున్నాను. వినుము! హరుని నేత్రముఁదగు చిచ్చు నందు భస్మమైనను శంకరుఁడు పార్వతీ దేవిఁ దగు పాణిగ్రహణముఁ జేసిన శుభసమయమున ననుగ్రహించి నీకు శరీరమును ప్రసాదించును. అని మన్మథునకు వక్కాణించి మరీచ్యాది మానస పుత్రులు చూచుచుండగానే యంతర్ధానము జెందెను. వారును తమ నివాసములకుఁ జనిరి.

*ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో తృతీయాధ్యాయము.*

## చతుర్థాధ్యాయము

### (కామ వివాహము)

అవ్విధము శంకరుఁడు ప్రబోధించినందున బ్రహ్మాదులు జాగరూకులైన పిమ్మట దక్ష ప్రజాపతి-బ్రహ్మ వాక్యము ననుసరించి మన్మథుని - తన కుమార్తెయగు రతీ దేవిని భార్యగా స్వీకరించుమని కోరినందున కందర్పుఁడు మిగుల సంతసించి యథావిధిగా రతీ దేవిని వివాహమాడి పరిగ్రహించెను. రతీ దేవియు మన్మథుని ఛాయవలె ననుకరించుచు సహధర్మచారిణి యయ్యెను. వారుభయులును పరస్పరము గాఢానురాగము గలవారై విహరించుచు సుఖించు చుండిరి.

శ్లో॥ ఏతాదృశం రతీం నామ్నా - ప్రాలేయాద్రి సముద్భవామ్ ।
గంగా మివ మహాదేవో - జగ్రాహోత్ఫుల్లలోచన ః ॥





హిమాలయమునందు జన్మించిన గంగను మహాదేవుఁడువలె మన్మథుండు రతిని పరిగ్రహించి వికసించిన నేత్ర కమలములు గల వాడయ్యెను. అనగా సంతుష్టాంతరంగు డయ్యెనని భావము.

మఱియు అనురాగముతో సమీపించు లక్ష్మీదేవిని విష్ణుమూర్తి పరిగ్రహించినట్లు రతీదేవిని మన్మథుఁడనుభవించుచు బ్రహ్మశాపమును మఱచి మోహితుఁడై ప్రవర్తించుచుండెను. సంతోషాతిశయమున దక్ష ప్రజాపతిని పలుకరింపకుండెను. రతీ దేవియు మన్మథుని సంభోగ సుఖముల నోలలాడించుచుండెను. యోగపరాయణుఁడు బ్రహ్మ విద్యనువలె మన్మథుఁడు రతీదేవిని తన హృదయమున నత్తుకొని సంతోషించుచుండెను.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో చతుర్థాధ్యాయము.

## పంచమాధ్యాయము

### (సంధ్యా చరిత్రము)

సూతుఁడు చెప్పఁదొడఁగెను:

సంధ్యా చరితమును వినిన తరుణులందరును పతివ్రతలగుదురు. బ్రహ్మమానస పుత్రికయగు సంధ్య - కొంతకాలము తపస్సుచేసి పూర్వశరీరమును విడనాడి రెండవ దేహముతోడ నరుంధతి యయ్యెను. మేధాతిథియను మహర్షికి కూతురై బ్రహ్మవిష్ణు మహేశ్వరుల యనుమతి ననుసరించి నియమముతోడ ననుష్ఠానమును గావించి శంసిత వ్రతుండగు వసిష్ఠమహర్షిని పతిగా బడసియు సాధ్వీమణులలో అగ్రగణ్యురాలై వందనీయు రాలయ్యెను.

"నన్ను గాంచుటతోడనే బ్రహ్మదేవుఁడు మునులును చంచలమనస్కులగుటయు వారి నందరి నవలోకించి నేనును మోహపరవశురాల నగుటయు కారణములుగా ఇట్టి స్వరూపము సుకృత సాధనము కాదనిభావించి తపించెదనని నిశ్చయించుకొని సంధ్యాదేవి చంద్రభాగా నదీతీరమునందుండు చంద్రభాగ పర్వతమునకుఁజనిన వృత్తాంతమును బ్రహ్మదేవుఁడు గుర్తెరిగి - వేదవేదాంగపారగుఁడు జ్ఞానయోగియు నగు వశిష్ఠుని - దిగువ విధమాదేశించెను.

"కుమారా! మనస్వినియగు సంధ్యాదేవి - లోకమున నొక మర్యాదను నెలకొలుపఁదలచి చంద్రభాగమను కొండకు తపంబాచరింపఁ జనుచున్నది. కాని తపోవిధానము ఆమెకు తెలియదు. కావున నీవు రూపాంతరముతో వెళ్ళి సంధ్యకు తపోదీక్ష నొసగుము".

అని విధి వచించినంత వసిష్ఠుఁడు బయలుదేరి మానసముతో సమానమగు నొకానొక సరోవరము చెంత నుండు చంద్రభాగా తీరమునకు వెళ్ళిచూడగా నా సరోవరము సంధ్యాదేవితో "ప్రదోషకాలమున నుదయించు నక్షత్రములతో చంద్రునితో నాకసమువలె ప్రకాశించుచుండెను. అద్ది బృహల్లోహితమను పేరు గలదై ప్రసిద్ధిఁజెందియుండెను". అచ్చోటనే చంద్రభాగానది ప్రవహించుచు దక్షిణసముద్రమువైపునకు వెళ్ళుచుండెను.





అట్టి ప్రదేశమున చంద్రభాగపర్వతముపై విలసిల్లు బృహల్లోహిత సరోవరము చేరువ సంధ్యాదేవిని చూచుచు వసిష్ఠుఁడు దిగువ విధము ప్రశ్నించెను.

"అమ్మా! సంధ్యాదేవీ! ఇగ్గట్టునకేలవచ్చితివి; ఎవరి కుమార్తెవు? నీ కర్తవ్యమెద్ది? రహ కానిచో వినఁగోరుచున్నాను. పూర్ణచంద్రునితో సమానమగు నీ ముఖము పాలిపోయిన దెందు

మండుచున్న అగ్నివలె ప్రకాశించు నా మహానుభావుని సుభాషితమును విని లోలోన సంతసించెను. మఱియు మూర్తీభవించిన బ్రహ్మచర్యమువలె విరాజిల్లుచు జడదారిగా నుండు వసిష్ఠ సాష్టాంగప్రణామంబులను సమర్పించెను.

మహనీయా! తమను దర్శించినంతమాత్రమున నా మనస్సు ప్రసన్నమైనది. బ్రహ్మ సంధ్యాదేవిని, తపంబాచరించుటకు నిర్జనప్రదేశమున కేతెంచితిని. ఒకవేళ నేను యోగ్యురాలనగు తపోవిధానమును బోధించి దీక్షనొసగుడు! ఇంత వరకు అజ్ఞురాల నగుటచే మిగుల చింతించుచు

అంత వసిష్ఠమహర్షి – భక్త వత్సలుడైన శంకరుని మనస్సులో స్మరించి దిగువ విధము ప్రబోధి

శ్లో॥ **పరమం యో మహత్తేజః పరమం యో మహత్తపః ।**
**పరమః పరమారాధ్యః - శంభుర్మనసి ధార్యతామ్ ॥** 60

శ్లో॥ **ధర్మార్థకామ మోక్షాణాం - య ఏకస్త్వాది రణమ్ ।**
**తమేకం జగతా మాద్యం - భజస్వ పురుషోత్తమమ్ ॥** 61

ముఖ్యమైన గొప్ప తేజస్సు, ప్రధానమగు గొప్ప తపస్సు, ఉత్తమోత్తముఁడు, శ్రేష్ఠులచే నారా బడువాడు నగు శంకరుని మనస్సులో నిలుపుకొనుము! ధర్మార్థకామ మోక్షములకు ఏకైక కార ప్రకృతిపురుషులను మించినవాడు, లోకమున ప్రప్రథముఁడు నగు పరమేశ్వరుడుని సేవింపుము

"ఓన్నమః శంకరాయ" అను మంత్రమును జపించుము! స్నానమును శివపూజ తదితరనియమములను మౌనముతో నాచరింపుము! ఇట్లు తపించినయెడల బ్రహ్మ చర్యము ఫలిం సర్వాభీష్టంబులును నెరవేరును. ఇది ముమ్మాటికి నిజము! ఇందెంత మాత్రము సంశయము నేను చెప్పినట్లు శంకరుని హృదయములో భావింతువేని యాతడు ప్రసన్నుడై మనోభీష్టమును నీడేర్చును. ఇవ్విధము వశిష్టుఁడు ఉపవిష్టుడై సంధ్యకు తపోవిధానము నుపదేశించి యథోచి సంభాషించి యంతర్హితుండయ్యెను.

**ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో పంచమాధ్యాయము.**

## షష్ఠాధ్యాయము

### (సంధ్యాకృతశివస్తోత్రము, వరప్రాప్తియు)

వసిష్ఠ మహర్షి ప్రబోధించి వెళ్ళిన యనంతరము సంధ్యాదేవియు తపోవిధానమును గుర్తెరిగి సంతుష్టాంతరంగముతో బృహల్లోహిత సరోవరతీరము నందు శంకరమంత్రమును జపించుచు నాలుగుయుగములు తపించెను. అంత శంకరుఁడు ప్రసన్నుడై హృదయాకాశము నందు బాహ్యమునను (తన) దివ్య స్వరూపమును గానుపింపఁజేయగా సంధ్య ప్రసన్నముఖుఁడు ప్రశాంతుడునగు మహాదేవుని గాంచుచు పరమేశ్వరు నెట్లు స్తుతింతునని లోలోన గుందుచు కన్నులు మూసుకొనెను.

అంత నామెకు దివ్యనేత్రము దివ్యజ్ఞానము సంభవింపగా దిగువ విధము శివుని స్తుతింపసాగినది.

స్థూలము కానిదియు సూక్ష్మము కానిదియు ఉన్నతము కానిదియ నిరాకారంబును ఉపాసనాత్మక జ్ఞానముచే గమ్యంబును యోగులచే హృదయమున ధ్యానింపఁదగిన రూపము గలదియు లోకనిర్మాణ దక్షంబునగు శివతత్త్వమునకు నమస్కారము.

శర్వుఁడు శాంతుఁడు నిర్మలుఁడు నిర్వికారుఁడు కేవలజ్ఞానముచే గమ్యుఁడు కాని వాడు (అనఁగా కర్మసముచ్చిత జ్ఞానగమ్యుడని భావము) స్వయంప్రకాశమానుఁడు చిదాకాశమున విరాజిల్లువాడు అజ్ఞానమార్గమున కందనివాడు ప్రసన్నుఁడు నగు పరమాత్మకు నమస్కారము.

ఆదిశక్తితో కూడియుండియు నఖండైక స్వరూపము గలవాడు చిదానందుఁడు, నిత్యానంద స్వరూపుఁడు యథార్థమైన ఐశ్వర్యముతో ప్రత్యక్షమగువాడు, ఇహపరశ్రేయస్సులను ప్రసాదించువాడునగు శంకరునకు నమస్కారము.

పదునెనిమిది విద్యలయందు ప్రకటింపఁబడిన స్వరూపము గలవాడుగా భావింపఁదగినవాడు అథవా ముప్పదిరెండు బ్రహ్మవిద్యలలో భావింపఁదగిన శివరూపము గలవాడు ప్రకృతిపురుషుల కంటె భిన్నుఁడును శుద్ధ సత్త్వము నిజగుణముగా కలవాడు ధ్యానింపఁదగినవాడు ఆత్మస్వరూపుఁడును, నిఖిలవిద్యా సారంబును సంసారసముద్ర పారంబును పావనములకు పవిత్రుండునగు మహేశ్వరునకు నమస్కారము.

నిత్య శుద్ధ బుద్ధ స్వరూపుఁడు రత్నమణిమయ భూషణభూషితుఁడు నిర్మల కర్పూరగౌరుఁడు వరదముద్ర నభయముద్రను త్రిశూలమును ముండమును హస్తములతో ధరించువాడు స్వాత్మారాముఁడు నగు రుద్రునకు నమస్కారము.

ఆకాశము, భూమి, దిశలు, ఉదకము, తేజస్సు, కాలము, ప్రకృతి, పురుషుఁడును ఎవని రూపములగునో అట్టి అవ్యక్త రూపుడగు శంకరునకు నమస్కారము. బ్రహ్మదేవుఁడై సృష్టిఁజేయువానికి, విష్ణువై పరిపాలన మొనర్చువానికి, రుద్రుఁడై సంహారము గావించు వానికి, కారణకారణునకు, దివ్యము శాశ్వతము నగు జ్ఞానము నొసగువానికి, స్వర్గాదిపుణ్య లోకములయందులి వైభవమును కలుఁగజేయువానికి, ప్రకాశరూపునకు, పరాత్పరునకు నమస్కారము.





శివపదము అనఁగా మహాకైలాసమును మించిన స్థానము లేదనియు; సూర్య చంద్రులు, భూ దిశలు, మన్మధాదులును బహిర్ముఖులై పరమేశ్వరుని నాభిస్థలమున నుండువారనియు, శివ సర్వాతీతమగు దివ్యాంతరిక్షము నందు విరాజిల్లువాడనియు భావించి అట్టి శంకరుని నమస్కరించుచు

హరుఁడే పరమాత్మయనియు నానావిధ విద్యలనియు సత్తనియు బ్రహ్మాంబనియు నిఖిల నిర్మాణమునకు వలయు సంపూర్ణవిచారము గల వాడనియు అదిమధ్యాంత రహితుండని అవాఙ్మానసగోచరుండనియు భావించుచున్నాను.

బ్రహ్మాది దేవతలకు తపోధనులైన మునులకును చింతింప నలవి కాని రూపములు గల ప్రాకృతగుణరహిఁతుడునగు మహాదేవుని సర్వజ్ఞత్వాది దివ్యగుణములను వర్ణించుటకు అడుదాననగు శక్యంబగునా?

శ్లో॥ నమస్తుభ్యం మహేశాన - నమస్తుభ్యం తపోమయ ।
ప్రసీద! శంభో! దేవేశ - భూయో భూయో నమోస్తుతే ॥ 26

మహేశ్వరా! నీకు అభివాదన మగుగాక! తాపసారాధ్యా! నీకు వందనమునిడుచున్నా శంభో! దేవదేవా! అనుగ్రహించుము! నీకు పదేపదే నమస్కారమగుగాక!

ఇవ్విధము సంధ్యాదేవి యొనర్చిన స్తోత్రము నాకర్ణించి భక్తవత్సలుడైన శంకరుఁడు మిక్కిలి ప్రస డయ్యెను. అట్టితతి సంధ్యాదేవి యొడలు - నారచీరతోడను జింకతోలుతోడను పవిత్ర శిరస్సున ప్రకాశించు జడలతోడను కప్పఁబడి యుండెను. మంచుతో నావరింపఁబడిన కమలమువలె యామెముఖమును గాంచి శంకరుఁడు దయ గలవాడై "సంధ్యా! నీ తపస్సునకే గాక స్తోత్రము మిగుల సంతసించితిని. కావలసిన వరము నడుగుము! ఇచ్చెదను" అని వక్కాణింప నామె ఈ విధము వరముల నభిలషించెను.

దేవా! నేను పుట్టినపుడు బ్రహ్మాదులను మోహింపజేసిన పాపమునుండి విముక్తురా వరయోగ్యురాల నగుదునేని వరములను ప్రసాదింపుడు! లోకమున ప్రాణులు పుట్టుట తోడనే కాముక కాకుందురు గాక! ఇద్ది మొదటివరము మూడులోకములయందును ప్రసిద్ధురాలనై యుందును ఇద్ది రెండవ వరము నాకు కాగల భర్త - మిక్కిలి సహృదయుడై యుండుగాక ఇద్ది మూడవ వర నాభర్త దక్క నితరుడెవడును నన్ను మోహముతో చూచునెడల నట్టి పురుషుఁడు నపుంసకుఁడగు ఇద్ది నాలుగవ వరము.

అంత శంకరుఁడు - నీపాపము నశించినదనియు బ్రహ్మసభలో నీయందు నాకు కలిగిన అగ్రహ అంతరించిన దనియు తపించుట వలన పరిశుద్ధురాల వైతివనియు నీయడిగిన వరంబుల నొస ననియు బాల్యము కౌమారము యౌవనము వార్ధకము అను నాలుగు దశలు లోకమున ప్రాణు సంభవించు ననియు బాల్య కౌమారములు గడచిన తరువాత యౌవన - ప్రారంభమున కామ మోహము ఏర్పడు ననియు నీతపంబునకు మెచ్చి యిట్టి యేర్పాటు చేయుచున్నాననియు వక్కాణించెను.





మఱియు బ్రహ్మాండమునందు నీతో సమానురాలగు సాధ్వి యుండజాలదు. నీపాణిగ్రహణము నొనర్చినవాడు దక్క వేరొకఁడు నిన్ను కామదృష్టితో చూచునెడల నట్టివాడు తత్కాలముననే నపుంసకుండగును. నీభర్త నీతోగూడ నేడు కల్పాంతముల వరకుజీవించును ఇఁక నీవు పూర్వము సంకల్పించిన శరీర త్యాగమును మేదాతిథి యను మహర్షి గావించు ద్వాదశ వార్షిక యజ్ఞము నందలి యగ్నియందు త్వరలో గావింపుము! ఈపర్వతము చెంత చంద్రభాగానది తీరమునందు మేధాతిథీ యజ్ఞమును చేయుచున్నవాడు అచటికి నాయనుగ్రహమున గుప్తరూపముతో వెళ్ళి నీయభీష్ట పురుషుని వరునిగా మనస్సునందు భావించి యజ్ఞాగ్నియందు నీశరీరమును పరిత్యజింపుము! వెంటనే రెండవ రూపముతో నావిర్భవించి మేదాతిథి మహర్షికి కుమార్తెవై వెలయుదువు!

ఇఁకనీవు తపించు నపుడు గడచిన యుగచతుష్టయములో త్రేతాయుగము ప్రారంభించిన సమయమున దక్షప్రజాపతికి కలిగిన పుత్రికలలో నిరువదియేడుగురుకన్యకలను దక్షుఁడు చంద్రున కీయగా చంద్రుఁడు నవ్వారిని భార్యలుగా పరిగ్రహించియు రోహిణిదేవి నొక్కర్తునే ప్రేమించుచున్నందున దక్షుఁడు కోపించి చంద్రున కొసగిన శాపమును పరిహరింపఁజేయుటకు నీచెంతకు దేవతలురాగా నీవు నాయందు చిత్తమును నిలిపి తపించుచున్న కతంబున నవ్వారితో మాటలాడ కుంటివి. అట్టితఱి చేయునదిలేక బ్రహ్మదేవుఁడు చంద్ర శాపవిమోక్షార్థము చంద్రభాగానదిని నిర్మించి ప్రవహింపఁజేసినవాడు. ఇద్ది పరమ పవిత్ర ప్రదేశమని భావించి మేధాతిథి యచటికరుదెంచి జ్యోతిష్టోమ మను మహాయాగమును గావించుచున్నవాడు. మేధాతిథితో సమానుడైన తాపసుఁడు మరియొకఁడు ప్రపంచమున లేడని చెప్పవచ్చును. అతనియజ్ఞమునందు అగ్ని నిరంతరము ప్రజ్వలించుచున్నయది. అచ్చోటునకు వెళ్లుము! ఆలసింపకుము! అని శంకరుఁడు సంధ్యాదేవి కుపదేశించి యంతర్హితుండయ్యెను.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ"మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో షష్ఠాధ్యాయము.

## సప్తమాధ్యాయము

### (సంధ్య - అరుంధతియను పేరుగలదై వసిష్ఠుని వివాహమాడుట)

అవ్విధము శంకరునిచే ననుగ్రహింపఁబడిన సంధ్యాదేవి. మేధాతిథి యాశ్రమమునకు వెళ్లి యేరికిని గుర్తింపఁబడకుండా – పూర్వము బ్రహ్మచారియై తనకు తపోదీక్ష నొసగిన వసిష్ఠునిభర్తగా బడయుదునని మనుస్సునందిడుకొని యజ్ఞముఁదగు ప్రజ్వలితాగ్ని యందు సంతుష్టాంతరంగయై తన శరీరమును పరిత్యజించినది. అట్టితఱి ఆమెదేహము అతి పవిత్ర మగుటచే యాజ్ఞికులందరికి పురోడాశమునకు చెందిన పరిమళము వచ్చుచుండెను. ఇఁక నామె శుద్ధశరీరము వహ్నిమండలమునుండి సూర్యమండలముఁ బ్రవేశించెను. సూర్యుఁడట్టి తనువును రెండుగా విభజించి పితృదేవతా సంప్రీతి నుద్దేశించి తన రథము నందు నెలకొలువుకొనెను. అందు పూర్వభాగము ప్రాతఃసంధ్యగాను అపర భాగము సాయంసంధ్యగాను పరిణమించినవి. సూర్యోదయమునకు ముందు అరుణోదయమున దేవప్రీతికరమగు ప్రాతః సంధ్య యగును. సూర్యుఁడస్త మించునపుడు పితృప్రీతికరమగు సాయంసంధ్య యగును. ఇఁక నామె





ప్రాణములను శంకరుడు దివ్యశరీరమునందు ప్రవేశింపఁజేయగా మేధాతిథి చేయు యజ్ఞ ముగియునపుడు యజ్ఞ-కుండమునుండి కాచినబంగారపు వన్నెగల యొకా నొక కన్యకగా నుద్భవిం అంత మేధాతిథి - మహర్షుల సమ్మతిబడసి యాకన్యకను తనపుత్రికగా పరిగ్రహించిన వాడు. అరు యని నామకరణమును గావించెను. అందువలన శిష్యులతో సహ తానుసంతసించుచుండెను. ధ నెప్పుడు నేకారణము వలనను నివారింపదు గావున నరుంధతియని యామెకు పేరుపెట్టవలసి వ

మేధాతిథి యవ్విధము యజ్ఞమును ముగించి తనపుత్రికయగు అరుంధతిని గారవించుచు కా గడపుచుండెను. చంద్రభాగానదీ తీరమున తాపసారణ్యము నందు మేధాతిథి యాశ్రమములో అరు - దినదిన ప్రవర్ధమాన యగుచు నైదేండ్ల ప్రాయముననే తన సత్యశౌచాది యోగ్యగుణములతో నాశ్ర నంతయు పవిత్రముఁజేయు చుండెను.

అటుపిమ్మట యుక్తకాలమున

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు - బ్రహ్మమానస పుత్రుఁడగు వసిష్ఠమహర్షితో నరుంధతికి మే యాశ్రమమునందు యథావిధిగా వివాహమును జరిపించినవారు. ఆశుభ సమయమున సురలు మ అరుంధతీ వసిష్ఠుల వివాహమహోత్సవమునఁజేశి యానందించుచుండిరి. మరియు విష్ణుమహేశ్వరుల హస్తములనుండి బయల్పడిన నుదకముల వలన శిప్రమొదలగు పవిత్రనదుల నేర్పడి యుండినవి. అట్లు వసిష్ఠుని భర్తగా బడసి యరుంధతి యలరారుచు పతివ్రతా శిరోమణి నుత్తము రాలయ్యెను. మరియు నామె వసిష్ఠునితో సుఖముఁజెందుచు ప్రశంసనీయులైన కుమా కనినది. అవ్వారిలో ప్రధమ పుత్రుఁడు శక్తియనదగినవాడు. ఇద్దిసంధ్యా చరిత్రము. శివానుగ్ర వలన పరమ పావన మైనది ఇద్దానిని విను స్త్రీలు పురుషులు తమయభీష్టములఁబడయుదురు. ఇ మాత్రము సందియము లేదని సూతుఁడు శౌనకాది మహర్షులకు వక్కాణించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో సప్తమాధ్యాయము.

## అష్టమాధ్యాయము

### (వసంతస్వరూప వర్ణనము)

శౌనకాది మహర్షులారా! శివచరితము - సర్వపాపఘ్నమైనది; మంగళప్రద ఉత్తమంబునై శివభక్తిని పెంపొందించునది.

సంధ్య జన్మించినపుడు శివునిచే ప్రబోధింపఁబడిన బ్రహ్మదేవుఁడు - శివునియా ఈర్ష్యకలవాడై దక్షప్రజాపతి, రతీదేవి, మన్మథుఁడు మున్నగువారి చోటునకు శివమాయామోహితుడగుటఁజేశి దక్షాదులతో దిగువవిధము సంభాషించెను.

కుమారులారా? నా సంతాపము అంతరించుటకు నొక నుపాయము నాలోచిం శంకరుఁడు ఒకానొక లోకోత్తర రమణిని భార్యగా పరిగ్రహించు వరకు నా





శాంతింపదు. ఐనను నాయీ మనోరథము దుర్ఘటమనియే భావింతును. కాంతాసక్త చిత్తుడనై నంత మాత్రముననే నన్ను శంభుఁడు పరామర్శించెను. అట్టివాడు కాంతను పరిగ్రహించునా? ఈ ప్రపంచమున శివుని మనుస్సునందు పాదుకొనిన వనిత యెవరో తెలియకున్నది. అమె లభించెనేని శంకరుని యోగమార్గమునుండి తొలగించి మోహితుఁజేయును. శివుని మోహింపఁజేయుటకు మన్మథుఁడును సమర్థుడు కాజాలడు. యోగీశ్వరుఁడైన శివుఁడు రమణుల నామధేయముఁగూడ విననొల్లడు. లోకమున కొందరు విష్ణుమాయా బద్ధులగుదురు. మరికొందరు శివమాయామోహితులగుదురు. శంకరుఁడైతేనో ఏకాంతమున నితాంతవిరాగము కలవాడై సంసార విముఖుడుగా కన్పట్టుచున్నవాడు. అతడు చేయు సృష్టియు నట్టిదేను;

ఇట్లు నవ్వారితో వక్కాణించి రతీదేవితో కూడియున్న మన్మథునికి క్రిందివిధము స్వాభిప్రాయమును వివరించెను.

"నాయనా! మన్మథా! నామాట వినుము! లక్ష్మీనారాయణుల వలెను రోహిణీచంద్రుల వలెను మీరుభయులు పరస్పరానురాగ సంబద్ధులై యున్నవారు. కావున నీవు జగమునకు ధ్వజమువంటివాడ వగుటఁజేశి విశ్వకేతువనంబఁబగుదువు. జగత్కల్యాణమునకై శంకరుఁడు సుమనస్కుఁడై పత్నీపరిగ్రహమును చేయునట్లు ఆతనిని మోహింపఁజేయుము! నీవు దక్క నా మహాదేవుని మోహింపఁజేయువాడెవడును గానరాడు. నీ వలన పరమేశ్వరుఁడు గృహస్థుడగు నెడల నీకు శాపపరిహారంబు నేర్పడును. కావున తదర్థము యత్నించుము!"

అంత కందర్పుఁడు విధిభాషితము నంగీకరించుచు "దేవా? నేను శంకరుని మోహింపఁజేయుటకు నా మహానుభావుని వరించు వనిత యుండవలెను. కావున నట్టి తరుణిని సృష్టించుము! మరియు నాకు బాణములు కలవుగాని యస్త్రము లేకున్నది. అందుకు వలయు వస్త్రంబును నిర్మించి యొసగుము!"

ఇట్లు మన్మథుని యభిలషితము నాలకించి బ్రహ్మ చింతించుచుండగా నాతని నిట్టూర్పునుండి పుష్పసమన్వితుడైన వసంతుఁడు ప్రాదుర్భవించెను. ఎఱ్ఱని కమలముఁ బోలిన వన్నెకలవాడును వికసించిన పద్మములవంటి కన్నులు కలవాడును సంధ్యాకాలమున నుదయించిన పూర్ణచంద్రునివంటి ముఖము కలవాడును సునాసికుఁడును శార్ఙ్గధనుస్సువంటి పాదములుగలవాడును చుట్టుకొనిన నల్లని వెంట్రుకలు గలవాడును సంధ్యాకాల సూర్యునివలె ప్రకాశించువాడును రెండు కుండలములతో నలంకరింపఁ బడినవాడును మదగజముఁదగు నడతయు బలసిన పొడవులైన భుజంబులును శంఖమువంటి కంఠంబును విశాలవక్షఃస్థలంబును సుందర వదనంబును కలిగి సర్వాంగసుందరుడై సర్వసులక్షణ సంపన్నుడై దర్శనీయులలో శ్రేష్ఠం కామవర్ధనుఁడై సర్వమోహనుడై వసంతుఁడు కన్పట్టుచుండెను.

సర్వవిధపుష్పములకు ఆటపట్టువగు వసంతుఁడు ఇవ్విధము జన్మింపగా మిక్కిలి పరిమళముగల వాయువు వీచుచుండెను. వృక్షములన్నియు పుష్పించుచుండెను. కోకిలలు మధురముగా పంచమస్వరమును పాడుచుండినవి. కొలనులు–స్వచ్ఛమైన ఉదకము. వికసించిన కమలములున్ను గలవి యయ్యెను. అట్టి వసంతుని విధాత గాంచి మన్మథా? నీకీ వసంతుఁడు సర్వవిధ సౌకర్యముల నొనగూర్చును. అగ్నికి వాయువువలె నీతడు నీకు నెల్లకాలము మిత్రుఁడుగా నుండును. నీయునికిఁజేరువ నుండు సాధనము కావున నీతనికి వసంతుఁడను పేరు ప్రసిద్ధంబగును.





మరియు నీ వసంతుఁడు లోకరంజకుఁడై నిన్ననుసరించును. మలయమారుతము వస
ముందు పొడగట్టుచుండును. బిబ్బోకము మొదలగు శృంగారహావభావములు రతీ దేవికి సహకరి
ఇట్టి అనుపమ సాధనములతో వసంతుడు మొదలగువారితోడను రతీదేవిని వెంటనిడుకొనియు మ
మోహింపఁజేయుము! ఇఁక నేను శంకరుని మోహింపఁజేయుతరుణిఁగూర్చి విచారించెద" నని వ
మన్మథుఁడు సంతసించి బ్రహ్మదేవుని దక్షాదులను నమస్కరించియు పరమాత్మయగు శం
నివసించుపరమ ధామమునకు వెళ్లినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో అష్టమాధ్యాయము.

## నవమాధ్యాయము

### (కాముని ప్రభావము, మార గణములుదయించుటయు)

తన యనుచరులతో మన్మథుఁడు శివస్థానమునకు వెళ్ళిన పిమ్మట జరిగిన యుదంతము చె
నున్నది. చెప్పెదను. వినుఁడు!

మహావీరుఁడైన కందర్పుఁడు తన ప్రభావముతో ప్రాణులను మోహింపఁజేయుచు
వృక్షములన్నియు నొకప్పుడే వికసించినవి. మరియు రతీదేవి సహకారముతో అనేక విధ ప్రయత్న
గావించినందున జీవులందరు స్వాధీనులగుచుండిరి. ప్రమథ గణములతో కూడిన శంకరుఁడు మా
చలించలేదు. అంత తన యత్నములన్నియు కొనసాగలేదని మన్మథుడు విముఖుడై నిజనివాసమ
జనెను. పిమ్మట బ్రహ్మదేవుని చెంతకు వెళ్లి యుదాసీనుడై గర్వమును తొలగించుకొని యిట్లు విన్న

దేవా! యోగేశ్వరుఁడగు శంకరునిమోహింపఁజేయుటకు నేను సమర్థుడనుకాను. ఇతరు
నా మహాదేవుని మోహింపఁజేయఁజాలరు. నా మిత్రులతోడను రతీదేవితోడను నేను గా
యుపాయము లన్నియు వమ్మైనవి. శంకరుఁడు మోహితుఁడు కావలెనని సుగంధి శీతలవాయ
ప్రసరింపఁజేసితిని. తదితర సౌకర్యముల నొనగూర్చితిని. అందువలన నచటి ప్రాణులు పర
లైనవి కాని శంకరుఁడు మాత్రము సమాధిస్థుడై యెట్టి వికారముఁజెంద లేదు. తరువాత
హిమాలయమునకు వెళ్లగా నచ్చోటునకును వెళ్లి కర్తవ్యములను నిర్వహించితిని. పిమ్మట
పర్వతమునకు నాగకేసర ప్రదేశమునకు కైలాసమునకును పరమేశ్వరుఁడు వెళ్లగా నచ్చోటులకు
పోయితిని. ఐన నుపయోగము కానులేదు.

ఇఁక శంకరుఁడు సమాధి యోగమును చాలించినపుడు మయూరనృత్యాది వివిధ
కృత్యముల నుపయోగించితిని. ఐనను నా బాణమొక్కటియు ప్రయోగింప వలను కానులేదు.

వసంతుఁడును తన సామర్థ్యమును చూపెట్టినవాడు. ఏతాదృశదృశ్యముల నిమిత్తముగా ము
మోహించిరి. సామాన్యులు మోహించిరని వేరుగా చెప్పనవసరములేదు. కానా శంభుఁడు మ
వికారమును చెందలేదు. సమాధిని చాలించియున్న పరమేశ్వరుని ముందు మేమెవరము

లేకుంటిమి. మండుచున్న నిప్పుఁబోలిన కన్నులు గలిగియుండు మహేశ్వరుని సమక్షమున నిలువఁ జాలుధీరుఁడీ ప్రపంచమున లేడని చెప్పవచ్చును.

ఇట్టి మన్మథుని భాషితము నాలకించి బ్రహ్మదేవుఁడు వక్కాణింపఁదలచియు చింతావిష్టుడై యూరకుండెను. తరువాత మన్మథుని చేతగాని తనమును తలచుకొని విధి-విడచిన నిట్టూర్పులనుండి మారగణములు జనించెను. అయ్యవి గొప్ప బలము కలవై నాలుకలను కదలించుచు మిక్కిలి భయమును గొలుపుచుండినవి. పటహాది అసంఖ్యాక వాద్యములను మ్రోగించుచుండెను. మరియు "మారయ" "భేదయ" అని ఘోషించుచు చతురాననుని ముందు నిలువఁబడినవి. అట్టి తఱి మదనుఁడు మారగణములను వారించుచు బ్రహ్మదేవునితో నిట్లు సంభాషించెను.

ప్రపంచమును నిర్మించు పంకజాసనా! ఈ వీరు లెవ్వరు? చేయునదేమిటి? ఇవ్వారి నామధేయము లెట్టివి? ఇవ్వారి నిజ కృత్యములను నాయందు దయ గలవాడవై విశదీకరించుము!

అంత విధి-వీరు పుట్టుటతోడనే "మారయ" అని పలుమారు ఉచ్చరించిరి గావున వీరికి మారగణములను పేరు ప్రసిద్ధంబగు గాక! యథార్థమైన శివారాధనము దక్క నానావిధ కామ్య కర్మల నొనర్చువారికీ గణములు విఘ్నముల నొనగూర్చుదురు. నిన్ననుసరించుటయే వీరి ముఖ్యకర్తవ్యము. ఎల్లకాలము నీకు తోడ్పడుచుందురు. నీ బాణములకు గురియైన వారికి చిత్త భ్రాంతిని కలింతురు. జ్ఞానుల జ్ఞాన మార్గమునకు భంగము నాపాదింతురు-అని వచింపగా కాముఁడు - రతీదేవితోడ ననుచరుల తోడను ప్రసన్నుడై యుండెను. మారగణములు బ్రహ్మవచనమును విని కాముని పరివేష్టించియుండినవి.

అంత సురజ్యేష్ఠుఁడు - మారగణములతో హరుని మోహింపఁజేయుటకు మరల నొక పర్యాయము వెళ్లుమని శాసింపగా మన్మథుఁడు - ఆర్యా! శంకరుఁడు మోహితుండగుటకు చేయవలసిన దంతయు చేశితిని. ఐనను నీ యానతిని మీఱక వెళ్లుదునేని మహాదేవుఁడు నన్ను భస్మముచేయునేమో అని మనస్సు శంకించుచున్నయది. అని వక్కాణించి యవకాశముగా తన పరివారముతో శంకరుని చెంతకజని పూర్వాధికప్రభావమును చూపిన నా దేవదేవుఁడు ఇసుమంతయు మోహితుఁడు గాకుండెను. అప్పుడు మన్మథుడు ఖిన్నుడై బ్రహ్మదేవుని సమీపింపగా మారగణంబులును గర్వమును పోగొట్టుకొని యచ్చోటున కరుదెంచినవి. నిర్వికారుఁడైన శంకరుఁడు నా పూర్వపుణ్యవశమున శరీరమును కాల్పలేదు. ఇదియే మహాభాగ్యమని తలచెదనని కందర్పుఁడు వక్కాణించచి బ్రహ్మదేవునకు నమస్కరించియు కళత్రమిత్ర పరివారసమేతముగా నిజస్థానమున కేగెను.

***ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నవమాధ్యాయము.***





# దశమాధ్యాయము

శంకర చరిత్రమును వినిన కొలది మనుస్సు ఎట్టి వికారములు లేనిదగును. బ్రహ్మదేవుఁడు తన దురభిమానమును విసర్జించి యసంతృప్తిఁజెందుచు మదిలో గుందుచు - పరాయణుఁడు స్థిరచిత్తుఁడునగు శివుఁడెట్లు భార్యను పరిగ్రహించునా? అని విచారించుచు మనస్కుఁడు తనకు శరీరము బ్రసాదించినవాడు నగు హరిని స్మరించువాడై శుభప్రద స్తోత్రము ప్రార్థింపగా చతుర్భుజుఁడు పుండరీకాక్షుఁడు శంఖచక్రగదాపద్మధారియు పీతాంబరుఁడును శరీరుఁడు భక్త ప్రియుఁడునగు నారాయణుఁడు సాక్షాత్కరించెను.

శరణాగత రక్షణ బిరుదాంకితుండగు లక్ష్మీపతిని కనులార గాంచిన పరమేష్ఠి– బాష్పగద్గదస్వర భక్త్యతిశయమున మరల నొకమారు వేడుకొనెను. నిజభక్తుల యిడుములను తొలగించు విధికృతస్తోత్రము నాకర్ణించి సుప్రసన్నుడై క్రిందివిధము సంభాషించెను.

"బ్రహ్మదేవా! మహాప్రాజ్ఞుడవు; లోకస్రష్టవు; నన్ను స్మరించిన కారణంబెద్ది? స్తుతించిన వెందు నీకు కలిగిన సంకట మెట్టిదో? చెప్పుము! సందేహింపకుము! నిన్ను సంతసింపజేతు" నని వచి బ్రహ్మదేవుఁడు – రమానాథా? నా విన్నపము నాలకించి దుఃఖమును నివారించుము! శంకరు భార్యాలంపటుడు కావలెనని మన్మథుని సపరివారముగా నంపితిని. అవ్వారు గావించిన యుపాయము యుపయోగింపలేదు. మహేశ్వరుఁడిసు మంతయు మోహితుఁడు కానులేదు – అని విన్నవించె

అంత హరి విస్మితుడై శివతత్త్వమును గుర్తెరిగినవాడగుట చేతను సర్వజ్ఞుడగుట వలనను బ్రహ్మ యందలించుచు దిగువ విథము సంభాషించెను.

పితామహా! నీ కిట్టి బుద్ధి యేల కలిగినది? వృత్తాంతము నంతయు బాగుగా పరామ యథార్థమును వచింపు మనఁగా.....విధాత – నారాయణునితో – దేవా! నీ మాయ – ఎంతటివా మోహింపజేయును. జగమంతయు మాయాధీనమైయున్నది. జీవులనుభవించు సుఖదుఃఖాదిక మాయ ననుసరించియే సంభవించును. మరియు నీ మాయవలననే కుమార్తెఁజూచి మోహించి శంకరుఁడు – నా కుమారుడై నన్ను మందలించెనని మనస్సు బాధపడుచున్నది. ఐతే నా మహాసు భార్యను పరిగ్రహించునెడల నూఱట కలుగునని భావించి తదర్థము నిన్ను శరణుఁబొందితిని అని వచి నారాయణుఁడు మందస్మితముతో – నాయని పద్మజా! వేదములకు అగమములకును సమ్మత మాట చెప్పెదను.

లోకములను పుట్టించువాడవు. వేదములను చెప్పువాడవు. ఐనను నీ బుద్ధి కలుషితంబై కొద్దిగా మనంబును కుదుటపఱచుకొని వేదములు మున్నగు వాఙ్మయము విశదీకరించిన యంశ బాగుగా నవధరింపుము!

శ్లో॥ రుద్రం జానాసి దుర్బుద్ధే - హ్యనుతం పరమేశ్వరమ్ ॥

దుష్టబుద్ధి గలవాడవై శంకరుని నీ కుమారునిగా భావించుచున్నావు.

శ్లో॥ శంకరం సురసామాన్యం - మత్వాద్రోహం కరోషిహి ॥ 33

పరమేశ్వరుని దేవతలందరిలో నొక సామన్యునిగా తలచి యాతనికి కీడుజేతువా? నీకుగల మంచి బుద్ధి యంతరించినదా? వేదశాస్త్ర సమ్మతంబగు తత్త్వసిద్ధాంతము నాలకించి సుబుద్ధి కలవాడవు కమ్ము.

శ్లో॥ శివః సర్వస్యకర్తాహి - భర్తా హర్తా పరాత్పరః ।
పరబ్రహ్మ పరేశశ్చ - నిర్గుణో నిత్య ఏవచ ॥ 35

జగము నంతయు పుట్టించువాడు రక్షించువాడు హరించువాడును శివుండేను; మరియు పరబ్రహ్మము బ్రహ్మవిష్ణురుద్రాతీతుండును ఆకలిదప్పి మున్నగు ప్రాకృత గుణములు లేనివాడును నిత్యుండు నగువాడు శివుండేయని తెలియుము! ఇట్టి వాడని నిర్దేశింప వలను పడని వాడును, ఎట్టి వికారములు లేనివాడును, పరమాత్మయు, తనతో సమానమగు రెండవ వస్తువు లేనివాడును, తొట్రుపాటు లేనివాడును, అనంతుఁడును, సర్వజగన్నియామకుండును, సర్వవ్యాపకుండును, సత్త్వరజస్తమోగుణ సంబంధముగా విష్ణుబ్రహ్మరుద్రులరూపమున సృష్టిస్థితిలయముల నొనర్చువాడును, స్వాధీనమాయావిశిష్టుఁడును, ఎట్టి అపేక్షలులేనివాడును, సర్వజ్ఞత్వాదిసద్గుణ సంపన్నుఁడును, తనలో తానానందించువాడును, ఎట్టి వికల్పములు లేనివాడును, ద్వంద్వాతీతుఁడును, భక్తపరాధీనుఁడును, రమణీయ సుందర దివ్య విగ్రహము కలవాడును, యోగమార్గమును చూపెట్టుచు తానును, ఆత్మధ్యానయోగమునందుండు వాడును, శివద్రోహుల గర్వము నణచువాడును, ఎల్లకాలము దీనుల యందు దయ గలవాడును నగు శివుని నీ కుమారునిగా భావించుట యెట్లు పొసగును?

కావున నిట్టి దుర్భావనను విడనాడి సర్వాత్మనా శివుని శరణుబొందుము. ఆతడు సంతసించి నీకు మేలు నొనగూర్చును. ఒకవేళ శంకరుఁడు భార్యను తప్పక పరిగ్రహింపవలెనని నీవు దృఢముగా కోరునెడల శివుని స్మరించుచు జగదంబఁగూర్చి తపించుము! నీ యభిలషితమును మనస్సునందిడుకొని యమ్మవారిని ప్రార్థించుము! అందువలన నా మహాదేవి ప్రసన్నురాలై నీ యభీష్టమును నెరవేర్పఁగలదు మరియు లోకమున ఒకానొక మహాభాగునికి కుమార్తెగా నవతరించును. ఇందుకు దక్షునాజ్ఞాపింపుము. ఆతడు ఆదిశక్తిఁగూర్చి తపించి కృతార్థుఁడు కాగలడు.

శక్తిశివులు - భక్త పరాధీనులు, భక్తి జ్ఞానవైరాగ్యాదులతో నుపాసించువారికి బాగుగా తెలియు స్వరూపము గలవారు, స్వేచ్ఛావతారములతో విహరించువారు నని గుర్తెరుగుము" అని వచించిన దంతయు బ్రహ్మదేవుఁడు విని మిన్నకుండెను.

అంత విష్ణువు కొంత తడవు శివుని ధ్యానించి పూర్వస్మృతి గలవాడై పంకజాసనునకు దిగువ విధము మరికొంత ప్రబోధించెను.

"నాయనా! విధీ! శంకరుఁడు ఒకానొక దివ్య (సదాశివ) మూర్తిగలవాడై నన్ను నిన్ను పుట్టించి తన శక్తితో విహరింప నుద్దేశించి నీకు సృష్టికార్యమును నాకు రక్షణ కార్యమును నియోగింపగా మన మందుల కంగీకరించి శివుని యవతరింప వలసినదిగా ప్రార్థించిన యంశమును మరచితివా?

ఐనను శాంభవీమాయ - ఎట్టివారికైనఁ దెలియనలవికానిది; శివునిగుర్తెరిగిన వారే శాంభవీమాయ నర్థముఁజేసుకొనఁ గలుగుదురు.

అంత పరమేశ్వరుఁడు మన ప్రార్థనమును మన్నించి "విష్ణో నా నిజ రూపమునకు ప్రతినిధిగ రుద్రుడనై బ్రహ్మలలాటమునుండి యావిర్భవింతు"నని యాదేశించినపుడు. మఱియు నిట్లు వక్కాణించెను "త్రిమూర్తులును నా రూపమే, తథాపి రుద్రుఁడు నా పూర్ణస్వరూపమగువాడు. ఉమాదేవియు లక్ష్మీ వాణీరూపములతో నవతరించుటయే గాక పూర్ణాంశమగు సతీదేవిఁదగు రూపమున జన్మించి రుద్రపత్నికాగలదు, అని బోధించి శంకరుఁడు అంతర్ధానముఁజెందగా మనము సుఖముగా సృష్టి రక్షణ కార్యతత్పరులమై సుసమయమున భార్యలఁబరిగ్రహించితిమి. కైలాస నివాసియగు మహేశ్వరుఁడును సమయానుసారముగా పత్నిఁబడయగలడు. ఇందుకు నీవు శక్తి నారాధింపుము".

ఇట్లు ప్రశంసించి కమలనాభుఁడు వైకుంఠమున కేగగా బ్రహ్మదేవుఁడు నూఱటఁజెంది పూర్వపరితాపమును విడనాడియుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో దశమాధ్యాయము.

## ఏకాదశాధ్యాయము

### (దుర్గాస్తోత్రము, బ్రహ్మవరప్రాప్తియు)

అంత బ్రహ్మదేవుఁడు జగజ్జననియగు అమ్మవారిని దిగువవిధము స్తుతించెను. "విద్యయనియు అవిద్యయనియు శుద్ధ ప్రకృతియనియు పరబ్రహ్మస్వరూపిణి యనియు దర్గ యనియు శాంభవియనియు జగదంబయనియు సర్వవ్యాపినియనియు నిత్యయనియు నిరాలంబయనియు నిరాకులయనియు త్రిదేవజననియనియు స్థూలరూపిణియనియు సూక్ష్మస్వరూపిణియనియు రూపాతీతయనియు పేర్కొనంబడునో యాది శక్తీ! నీవే జ్ఞానస్వరూపిణివి; గొప్ప యానందము కలదానవు; ప్రసన్నురాలవై నా యభిలషితమును నెరవేర్పుము! నమస్కరించుచున్నాను." ఇట్లు బ్రహ్మకృతస్తోత్రము నాకర్ణించి చండికాదేవి ప్రత్యక్షమయ్యెను. అట్టితతి నా మహాదేవి నునుపైన కాటుకఁబోలిన వన్నె గలదై మనోహర రూపముతో నాలుగు భుజములు వరదముద్రయు కలిగి ముక్తామణిని కొప్పునందు దాల్చినదై సింహవాహనమున నాసీనయై శోభించుచుండెను మఱియు శరచ్చంద్రునిఁబోలిన వదనము స్వచ్ఛమైన చంద్రకళతో కూడిన ఫాలప్రదేశంబును నేత్రత్రయంబును కలిగి సర్వాంగసుందర రూపముతో కమలములఁ బోలిన పాదములఁ దగు నఖముల కాంతితోడను విరాజిల్లుచుండెను.

ఇట్టి యుమాదేవిని కమలాసనుఁడు గాంచి తలవంచియు బాగుగా మ్రొక్కులిడియు భక్తివి శయమునఁజేశి మరల నొకమారు దిగువవిధము నుతించినవాడు.

శ్లో॥ నమో నమస్తే జగతః ప్రవృత్తి - నివృత్తి రూపే స్థితిసర్గరూపే ।
చరాచరాణాం భవతీ సుశక్తిః - సనాతనీ సర్వవిమోహినీతి ॥

జగము సృష్టింపఁబడి ప్రవర్తించుటయు రక్షింపఁబడుటయు ప్రళయమున సూక్ష్మ స్వరూపమగుటయు నీ సాహచర్యము వలననే శివునిచే సంభవించుచున్నవి.

సంచరించు ప్రాణులకు స్థిరములుగా నుండు ప్రాణులకు నభివృద్ధిరూపమగు శక్తియు భక్తులుకాని వారి నందరిని మోహింపఁజేయుదానవు సనాతన స్వరూపిణివి నీవేను;

కేశవుని చెందియుండు లక్ష్మీదేవియు సమస్తప్రపంచమును మోయుచుండు భూమియు మూడు లోకములను పుట్టించు గిట్టించు మహేశ్వరియు త్రిగుణాతీత శక్తియు నీవేను;

యమ నియమాద్యంగములతో గూడిన యోగము నభ్యసించు వారి పవిత్ర హృదయము లలో ధ్యాననిష్ఠయందు సాక్షాత్కరించుదానవు; సంపూర్ణ ప్రకాశము పరిశుభ్రత మున్నగు విశేషములు గలదానవై సూర్యమండలాది నానావిధ ఆశ్రయములయందు చేయఁబడు నుపాసనను సిద్ధింపఁజేయుదానవు; కూటస్థుఁడు నవ్యక్తుఁడు ననంతుఁడు నగు పరమాత్మకు నొక విధమైన స్పందనమును (అనఁగా చలనమును) కలిగించుదానవు; త్రిగుణముల నవలంబించి వ్యక్తులందరి యందు నానావిధ వికారములను జనింపఁజేయుదానవు.

జగత్కల్యాణమునకై నిరంతరము శివునికి భార్యగా నుండుదానవు; నీకు నభివాదనము నొనర్చుచున్నాను.

ఇట్టి విధివిరచిత ప్రార్థనము నాలకించి లోకక్షేమము నాశించు జగదంబ సంతసించుచు ప్రాకృతజనవాక్యమున "ఎందుకు నన్ను వేడితివే, నేను సాక్షాత్కరించుటయే కార్యసిద్ధికి నిదానమని భావించి యడుగు" మని బ్రహ్మదేవు నాదేశింపగా నాతఁడు "నా యందు దయ గలదానవై నా కోర్కెనాలకింపుము! నీ పతియగు పరమేశ్వరుడు – నాలలాటమునుండి యావిర్భవించి రుద్రుడనఁబఱగుచు కైలాసమున నివసించుచున్నవాడు. ఏకాకియై తపంబు నాచరించుచున్నవాడు. భార్యఁబరిగ్రహింప నుద్యుక్తుడుగా కనంబడుటలేదు. అట్టి పురుషోత్తమని మోహింపఁజేయుము!

నీవు దక్క నే తరుణియు నాతని మోహింపఁజేయఁజాలదు. కావున నీవే దక్షునికి పుత్రికగా నవతరించి రుద్రపత్నివి కమ్ము! శంకరుఁడు కాంతను స్వీకరింపకున్నచో నే జేయు సృష్టి – శుభావహము కాజాలదు. అందువలన విశ్వశాంతి నపేక్షించి పరమేశ్వరుని గృహస్థునిగా నొనర్చుము! విష్ణుమూర్తి గాని లక్ష్మీదేవి గాని మన్మథుఁడు గాని నేను గాని హరుని ఏకాగ్రతను భంగపఱుపఁజాలము. అందుకు నీ వొక్కదానివే తగుదువు. దక్షుఁడును నిన్ను గురించి క్షీరసాగరముఁదగు నుత్తరతీరమునందు దృఢదీక్షతో తపించుచున్నవాడు" అని వచింప నమ్మవారు లోలోన నాశ్చర్యపడుచు – వేదములను ప్రవచించువాడైనను ప్రపంచమును నిర్మించువాడైన నీతనికి మిగుల నజ్ఞానము దాపురించినది. నిర్వికారుఁడగు నీశ్వరుని మోహింపఁజేయ దలపెట్టిన నీతని దురభిప్రాయమున కేమనవలయును? పరబ్రహ్మంబగు శివుఁడు – భక్తుల నుద్ధరించు నుద్దేశముతో పూర్ణాంశమున రుద్రుఁడై విరాజిల్లుచున్నాడు. అతడు సర్వ స్వతంత్రుఁడు; ఎవరికిని లొంగువాడు కాడు. నేనైతే ఆ మహానుభావుని సేవకురాలను; బ్రహ్మవిష్ణువులకు నధిపతియై పరమశివునితో సమానుడై మాయను తన వశము నందుంచుకొనినవాడు. ఐతే నీతనికి

వరంబు నొసగకుండినచో వేదనీతి – భ్రష్టంబగును ఇచ్చినచో సదాశివుఁడు కినుకఁజెందకుండవలెను. ఇట్టితతి చేయునదేమిటి? యని చింతించి యెట్టకేలకు శివుని స్మరించి యనుజ్ఞఁబడసియు "పంకజాసనా! నీ వడిగినదంతయు యథార్థంబేను; నేను దక్క శివుని మోహింపఁజేయువారు లేరు. పరమేశ్వరుని మోహింప జేయవలెనని నాలో గల తలంపు నీ ప్రార్థనముతో బలపడినది. శంకరుఁడు తానే మోహించి భార్యాపరిగ్రహణమును చేయునట్లు యత్నించెదను. లక్ష్మీదేవి విష్ణుమూర్తికి వలె శివునకు నేను సతీదేవినై వశవర్తిగానుందును. ఆతడును నన్ను ప్రేమించునట్లు శివానుగ్రహము నవలంబించి ప్రయత్నము జేయుదును" అని వక్కాణించి యాదిశక్తి శివలోకమునకుఁజనగా విధియు సత్యలోకమునకు వెళ్ళి తన కుమారులకు జరిగిన యుదంతము నంతయు చెప్పిన వాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఏకాదశాధ్యాయము.

## ద్వాదశాధ్యాయము

అంత దక్షప్రజాపతి తపంబు తెఱఁగును సూతమహర్షి చెప్పఁదొడగెను. బ్రహ్మదేవుని యనుమతిని దక్షుఁడు జగదంబను హృదయమున భావించుచు మూడువేల దివ్యవత్సరములు వాయువును మాత్రము పీల్చుచు నిరాహారుఁడై నీరుఁద్రాగుచు పర్ణములను భక్షించుచు బహువిధ నియమములతో నారాధింపగా నా యాదిశక్తి సాక్షాత్కరించెను.

ఆ సమయమున జగదంబాదేవి – సింహమునందాసీనయై కృష్ణవర్ణముతో నలరారుచుండినది. మరియు నాలుగు భుజములు మనోహరవదనారవిందము కలదై వరదాభయముద్రలను నల్లని కమలము ఖడ్గమును హస్తములఁదాల్చియుండినది అరక్తనేత్రములు కలదై ఇంపైన వెండ్రుకలను విడచి శోభించుచుండెను. ఇట్టి యమ్మవారిని దక్షుఁడు కనులారఁగాంచి

శ్లో॥ జగదంబ మహామాయే - జగదీశే మహేశ్వరి ।
కృపాం కృత్వా నమస్తేఽస్తు - దర్శితం స్వవపుర్మమ ॥ 13

"ప్రపంచమునకు జననివి, మహామాయవు, జగమును శాసించు మహేశ్వరివి, నా యందలి యనుగ్రహమున నీ దివ్యస్వరూపమును చూపెట్టితివి. భగవతీ! ప్రసన్నురాలవు కమ్ము! శివునెల్లకాలము నెడబాయకుండుదానవు; భక్తులకు వరముల నొసఁగుదానవు; జగమున నీ మాయకు లొంగనివారు లేరు. నీకు నమస్కార మగుగాక!"

అని నుతింపగా నా మహాశక్తి "దక్షా! నీకేమి కావలయునో వచింపు" మని ప్రశ్నించెను. అంత దక్షుఁడు "నా ప్రభువగు శివుఁడు రుద్రుఁడై యవతరించిన యంశము తమకును విదితంబే గదా! యవతారం బింతవరకును కానులేదు. నీవు దక్క నితరులెవరు నా మహేశ్వరుని మోహింపఁజేయ జాలరు. కావున నాకు కుమార్తెవై శంకరునకు భార్యవు కమ్ము! ఇదియే నా వరము. నీ ముందు యథార్థమును విన్నవించితిని. ఈ మనోరథము కేవలము స్వార్థము కాదు. లోకకల్యాణమునకై త్రిమూర్తుల యనుమతిని బ్రహ్మదేవునిచే ప్రేరేపింపఁబడి ఇట్లు విన్న ప్రార్థించితిని."





అని వేడుకొనఁగా జగదంబ - చిరునగవుతో శివుని స్మరించుచు "నాయనా! దక్షా నీభక్తికి సంతసించితిని గావున నీభార్యయందు నీకు పుత్రికనై యవతరింతును. హరునిభర్తగా బడయుటకు ప్రయత్నింతును. బ్రహ్మ విష్ణ్వాది సంసేవ్యుఁడు పరిపూర్ణుఁడు నిర్వికారుఁడునగు మహేశ్వరుని మరియొకవిధముగా మోహింప వలనుకాదు. నేను నిరంతరము అతని భక్తురాలనై ప్రతియవతారమందును భార్యగా నుండుదానను. కాని నాయందు నీకునాదరణము కలిగినపుడు నాశరీరమును పరిత్యజించి మరియిక స్వరూపము గలదానవై హరుననువర్తింతును" అని వక్కాణించి దక్షుఁడు చూచుచుండగానే యంతర్థానము జెందును.

దక్ష ప్రజాపతియు "నాకు కుమార్తె సంభవించు"నని సంతుష్టాంతరంగుఁడై నిజనివాసమునకుఁ జనినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వము" అను శాంకరీయ
ఆంధ్రానువాద ప్రవచనముతో ద్వాదశాధ్యాయము.

## త్రయోదశాధ్యాయము

### (దక్షప్రజాపతిసృష్టి, నారదునికిశాపము)

అంత దక్షప్రజాపతి - కొంతవరకు మానసికసృష్టి నొనర్చి యయ్యది పెంపొందకుండుటఁజేసి బ్రహ్మదేవుని విచారింపగా నాతడు "పంచజనుఁడను ప్రజాపతి యనుఁగు కుమార్తెయగు అసిక్నీదేవిని భార్యగా పరిగ్రహించి మైథున ధర్మమున సంతానమును కనఁగా నవ్వారిలో హర్యశ్వులనువారు పదివేలకుమారులు పితృభక్తిగలవారై వేదమార్గము ననుసరించుచుండగా "ప్రజాసృష్టిఁజేయు"డని దక్షునిచే ఆజ్ఞాపింపఁబడి ప్రతీచీదిశకు తపంబునకై వెళ్లినవారు. దివ్యసింధు సముద్రముల సంగమము చెంత నారాయణ సరోవరముఁదగు తీరమున నారదుఁడు శివసంకల్పము ననుసరించి యవ్వారి వద్దకివెళ్ళి శివజ్ఞానము నుపదేశింపగా దక్షపుత్రులు సృష్టిప్రవృత్తి నుండి నివృత్తులై శివాసక్తమానసము గలవారగుటఁ జేసి శివునుపాసించి శివ సాయుజ్యము నొందినవారు.

ఇట్టివృత్తాంతమును దక్షుఁడు తెలుసుకొని శివమాయా మోహితుడగుట కతన తన కుమారుల కొరకు మిగుల దుఃఖించెను. అట్టితరి బ్రహ్మదేవుఁడు దక్షుననేక విధముల నూఱడింపఁజేయుటచే దక్షుఁడు శాంతించి వీరిణి (అసిక్నియను నామాంతరము) యందు వేయి మంది కుమారులను కువలాశ్వులను వారిని పుట్టింపగా నవ్వారును నారదోపదేశమున సృష్టి పరాఙ్ముఖులై విరాగులై శివధ్యానముచే ముక్తులైరి. ఇద్దానిఁగూడ గుర్తెరిగిన దక్షుఁడు వగచి నారదునిగురించి కుపితుండై "దుష్టసాధువగు నో నారదా! త్రివిధ ఋణములతో నిర్ముక్తులు గాకుండా నాకుమారులకు కఠినుడవై నివృత్తి మార్గము నుపదేశించితివి. ప్రపంచములో ఏవ్యక్తియైనను దేవఋషి పితౄరుణములను తీర్పనిది మోక్షమును గోరి తల్లి దండ్రులను విసర్జించి గృహమునుండి వెళ్లునెడ నట్టివాడు భ్రష్టుండగును.





మరియు దయ సిగ్గు లేనివాడవై చిన్నవారి హృదయములను భేదించు స్వభావము గల నారాయణుని పార్షదులలో వ్యర్థముగా చేరియున్నావు. పలుమారులు నాకు కీడు నొనర్చితివి గా నీకు ఎప్పుడును స్థిరమైన నివాసము లేకుండుగాక! నిరంతరము లోకమున సంచరింతువుగాక! శపింపగా నారదమహర్షి – అంతయు ఈశ్వరేచ్ఛావిలసితంబని – తలచి దక్షశాపమ్మును పరిగ్రహిం ఇదియే మహానుభావుల యెడగల సహనమను అమూల్య సాధనంబని తెలియవలెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో త్రయోదశాధ్యాయము.

## చతుర్దశాధ్యాయము

### (సతీ జన్మ, బాల్య క్రీడయు)

ఇంతలో బ్రహ్మదేవుఁడు దక్షునొద్దికి వెళ్ళి యనేకవిధముల బుజ్జగింపగా నాతడు ప్రస కొన్నినాళ్ళకు స్వపత్నియందు నరువది పుత్రికలను పుట్టించి యవ్వారిని ధర్మాదులకు వివాహ నొసఁగిన తరువాత నాతనికి కుమారులు జన్మించిరి. అందువలన జగదంబను మనుస్సు నందు భక్తితో ప్రార్థింపగా నామె తానొసగిన వరమును సఫలము జేయుటకై దక్షునకు వీరిణియందు పు నావిర్భవింప నుండెను. అట్టితతి వీరిణి గర్భవతియై తనలో ఆదిశక్తి ప్రవేశించినందున ప్రకాశించుచు మహామంగళ స్వరూపిణిగా కన్పట్టుచుండెను. అంత దక్షుఁడు స్వకులోచితముగా సీమం మున్నగు వైదిక సంస్కారముల నొనర్చుచుండగా మహోత్సవము చెలరేగెను. బ్రాహ్మణులకు యథేచ్ఛ ధనము నొసగెను. విష్ణుమూర్తి మున్నగు దేవతలందరును అమ్మవారు అవతరింప నున్నదని స సంతసించి దక్షునింటి కేతెంచి బహువిధముల కొనియాడి తమ నివాసములకుఁ జనిరి.

ఇట్లు తొమ్మిది నెలలు గడిచిన యనంతరము పదియవ నెలయందు జగదంబ యావిర్భవిం అనఁగా జన్మించినది. ఆ సమయము చంద్రగ్రహ తారానుకూల సుముహూర్తముగాను సుఖప్రద నుండెను. మహాదేవి పుట్టగానే దక్షప్రజాపతి – సమాహిత మనస్కుడై "శివశక్తి నాయింట పు నన్ను ధన్యుఁజేసినది" యనిసంతృప్తి పడుచుండెను.

అట్టితతి పుష్పములు వర్షించినవి. మేఘములు మధురజలమును కురిపించినవి. దిశలన్ని స్వచ్ఛము లయ్యెను. ఆకసమున దేవతలు శుభవాద్యములను మ్రోగించిరి. సర్వంబును మం ప్రదమయ్యెను. అంత దక్షుఁడు తన కుమార్తెయగు ఆదిశక్తిని దర్శించి సత్యస్వరూపిణియగు జగద మమ్ము కరుణింపుము! మహామాయ యనియు యోగనిద్ర యనియు వేదవిదులచే పేర్కొనంబడు నమస్కారము.

రజఃసత్త్వతమోగుణ స్వరూపిణివై సృష్టిస్థితిలయములను ప్రవర్తింపఁజేయుచు గుణా త్రిదేవజననివిగా నుందువు.

శ్లో॥ యస్త్వాం విచింతయే ద్దేవి - విద్యావిద్యాత్మికాం పరామ్ ।
తస్య భుక్తిశ్చ ముక్తిశ్చ - సదా కరతలే స్థితా ॥ 34

విద్యగా నవిద్యగా నుండు నిన్ను పూజించి భావించువానికి ఇహపరసుఖములు నొదవుటయే గాక మోక్షంబును కరతలామలకంబగును. మరియు నిన్ను ప్రత్యక్షముగా గాంచు వారీజన్మయందే తప్పక సంసారబంధనిర్ముక్తులగుదురు. భవానియనియు అంబికయనియు జగన్మాతయనియు దుర్గయనియు ఇత్యాది నీ నామధేయములను స్మరించువారు సర్వకార్యములను సాధింతురు" అని నుతించిన వాడాయెను.

అంత శివ – దక్షుని స్తోత్రమునకు సంతసించి తనతల్లి వినకుండునట్లు "పూర్వము నీచేయారాధింపఁ బడితిని. గావున నిప్పుడిట్లు జన్మించితి" నని మాత్రము వక్కాణించి శిశు స్వరూపము నొంది జనని వద్ద నేడ్చుచుండెను. పిమ్మట దక్షునింట నుండు వనితలు దాసీలును రొదనమును విని యచటి కేతెంచి జగదంబను చూచియు మిగుల నభినంధించుచుండిరి. సంగీతము మంగళ వాద్య వాదనము నాట్యము మహోత్సవము గావింపఁబడెను. దక్షుఁడు విప్రులకు బీదలకును దానముల నొనర్చెను.

పిమ్మట విష్ణ్వాదిదేవతలు తమ యనుచరులతో మునులతో గూడ నేతెంచి గొప్ప వేడుకలఁ జేయుచు దక్ష పుత్రికయగు పరమేశ్వరిని దర్శించి వినయముతో నమస్కరించి శుభ ప్రదస్తోత్రములతో నభివర్ణించిరి. జయజయ శబ్దము నుచ్చరించుచు దక్ష దంపతులను ప్రశంసించిరి. అంత దక్షుఁడు సర్వ సమ్మతిని స్వపుత్రికకు "ఉమ" యను నామధేయమును నిర్దేశించెను. ఇంక ననేక శుభ నామధేయములు భక్తుల సంకటములను పోగొట్టునవై యలరారుచున్నవి. తరువాత దక్షుఁడు విష్ణుమూర్తికి బ్రహ్మదేవునకు ఇంద్రాది దేవతలకు ఋషులకును వందనములను సమర్పించి యభివర్ణించియు యథోచితముగా నవ్వారిని సత్కరించెను.

అంత విష్ణ్వాది దేవతాముని బృందములు దక్షు ననుమతిని తమ తమ నెలవులకు శక్తి శివులను స్మరించుచు వెళ్లినవారు. వీరిణి జగన్మాతను స్తన్య ప్రదానాదికముతో పోషించుచుండగా శుక్ల పక్ష చంద్రునివలె నుమాదేవి పెరుగుచుండినది. చంద్రునియందు పదునారు కళలవలె నామెయందు సద్గుణములన్ని యావహించినవి. చెలికత్తెల నడుమ నాడుకొనుచు నెల్లకాలము శంకరుని విగ్రహములనే అమ్మవారు వ్రాయుచుండెను. పాటలు పాడునపుడు స్మరాంతకుడైన హరుని లీలలనే గానము జేయుచుండెను. నిరంతరము శివమందిరములను లీలగా నిర్మించు నా గుణవతిఁదగు చేష్టితములను గాంచుచు వీరిణీ దక్షులు దినదిన ప్రవర్ధనానురాగముతో మిగుల సంతసించుచుండిరి.

**ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో చతుర్దశాధ్యాయము.**



# పంచ దశాధ్యాయము

## (నందావ్రతము - శివస్తుతియు)

ఒకప్పుడు బ్రహ్మదేవుఁడు నారదునితోగూడ దక్ష నివాసమునకుఁజని దక్ష పుత్రికయగు సతీదేవి నవలోకించి "అమ్మా! సతీ! నిన్నే ఎవడు కోరుచున్నాడో నీవు ఎవని నపేక్షించుచున్నావో అట్టి సర్వజ్ఞుడైన పరమేశ్వరుని భర్తగా బడయుము! అతడు నిన్ను దక్క నితర వనితను స్వీకరింపలేదు. ఇకముందును పరిగ్రహింపడు; అట్టి వాడే నీకు పతియగు గాక!" అని వచించి నిజధామమునకు నేగెను.

అంత దక్షుఁడిదియంతయు విని మదిలో సంతసించుచు తన కుమార్తె-సాక్షాత్ ఆది శక్తి యని భావించుచుండెను. ఇట్లు సతీదేవి-కాలక్రమమున యౌవనము నొందుచుండగా నా పుత్రికను శంకరునకు సమర్పించు సందర్భమున కవకాశమెట్లు లభించునని దక్షుఁడు విచారించుచుండెను. సతీదేవి దక్షుని మనోగతమును గుర్తెరిగి తల్లి చెంత కేతెంచి పరమేశ్వరు నారాధించుటకు ననుజ్ఞ నడిగి పితృ గృహమున శివునిఁ బూజించుచుండెను.

అశ్వయుజ మాసమున నందాతిది ప్రతి పద యందు భక్తితో శంకరు నర్చించి గుడోదనమును నివేదించెను. కార్తికమున చతుర్దశియందు భక్ష్యములను పాయసమును నైవేద్యముగా నిడి మహాదేవు నారాధించినది. మార్గ శీర్ష కృష్ణాష్టమిని జవలు నువ్వులతో కూడిన యన్నమును సమర్పించి హరునిఁ బూజించినది. పౌష శుక్ల సప్తమిని రాత్రి మేలుకొని మరునాడు ప్రాతః కాలమున శివునిఁబూజించి పులగమును నివేదించెను. మాఘ పౌర్ణమిని రాత్రి జాగరణముఁజేశి మరునాడు ఆర్ద్ర వస్త్రధారిణియై నదనీ తీరమున శంకరు నర్చించినది. ఫాల్గున బహుళ చతుర్దశిని రాత్రి జాగరణము నొనర్చి నాలుగు యామములయందు బిల్వ దళములతో మహేశ్వరు నారాధించినది. చైత్ర శుక్ల చతుర్దశిని మోదుగ పుష్పముల తోడను దవనములతోడ శంకరుని పూజించెను. వైశాఖ శుక్ల తృతీయనాడు నువ్వులతో చేయబడిన పదార్థములను యవాన్నమును శివునకు సమర్పించి ఆవు పాలు మున్నగు గవ్యములతోడనే యామాసము నంతయు గడిపినది. ఇఁక జ్యేష్ఠ మాసమున పున్నమినాడు రాత్రి బృహతీ పుష్పములతో శివునర్చించి నూతన వస్త్రములను సమర్పించి నిరాహారముగా నుండెను.

అషాఢ శుక్ల చతుర్దశియందు శివునిఁ బూజించి కృష్ణ వస్త్రములను సమర్పించెను. శ్రావణ శుక్లాష్టమిని చతుర్దశియందును యజ్ఞోపవీతమును నూతన వస్త్రమును దర్భలను శివునకు సమర్పించి పూజించెను. భాద్రపద బహుళత్రయోదశిని నానావిధపుష్పములతోడ శంకరు నర్చించి కదళీనారికేళాది ఫలములను సమర్పించియు చతుర్దశినాడు జలము మాత్రము స్వీకరించి తత్కాల సంభవములగు ధాన్యములను సమర్పించియు శివ పంచాక్షరీ మహా మంత్రమును జపించుచు సర్వకాలములయందు శివుని యందే చిత్తమును నెలకొలిపి యుండెను. ఇవ్విధము నందావ్రతమును గావించి అనన్య మనస్కురాలై శివుని ధ్యానించుచుండినది.





అట్టి తఱి విష్ణ్వాదిదేవతలు మునులు నచటికేతెంచి సతీదేవిఁదగు శివారాధనమును ఏకాగ్ర నిష్ఠ నవలోకించియు చేతులు జోడించి తలలువంచియు నా మహా శక్తికి మ్రొక్కు లిడి మిగుల మెచ్చుకొనియు కైలాసమునకుఁజని దిగువ విధము మహా దేవుని నుతించినవారు.

శ్లో॥ నమో భగవతే తుభ్యం - యత ఏతచ్చరాచరమ్ ।
పురుషాయ మహేశాయ - పరేశాయ మహాత్మనే ॥ 36

ఎవని వలన నీ చరాచర ప్రపంచ ముద్భవించునో అట్టి భగవానునకు, పరిపూర్ణుఁడగు మహేశ్వరునకు, ప్రకృతి పురుషులను నియమించు పరమాత్మకు నమస్కారము మరియు ఆది కారణుఁడు, చిద్రూపుఁడు, పరుఁడు, బ్రహ్మంబును నిర్వికారుండును ప్రకృతియు పురుషుఁడును జగమునంతయు తన యాశ్రయముచే ప్రకాశింపఁజేయువాడును. తనలో నీ చరాచరము నంతయు గాంచువాడును సఫల దర్శనము గలవాడును సాక్షియు సర్వాంతర్యామియు అనేక రూప ధారియు ఆత్మయు తపించువాడు నగు సదాశివుని శరణముగా వేడుచున్నాము.

అమరులు గాని ఋషులుగాని సిద్ధులుగాని తెలియ నలవిగాని నీ తత్త్వమును మరియొకఁడు కనుగొనఁజాలునా? లోకమున ఉత్తములైన సాధువులు సర్వ సంగ పరిత్యాగముతో నీ స్వరూపమును గుర్తెరుగవలెనని నిన్ను ధ్యానింతురు. మాయందరికి ప్రాప్యుడవు నీవేను, జగమున ఎట్టి లోపములు లేని వ్రతములను ఫలింపఁజేయువాడవు, వాస్తవముగా విచారించి చూడగా జన్మాది వికారములు నీకు లేనే లేవు. ఐన నవ్వానిని దయతో పరిగ్రహించుచున్నావు.

అద్భుత లీలలను ప్రదర్శించు పరాత్పరుడవు. మనో వాచా మగోచరుఁడవు, అణు స్వరూపుడవు, మహాకృతి గలవాడవు, అనంత శక్తులు గలవాడవు లోకాధినాథుడవు, సర్వవ్యాపకుఁడవు, ముక్తాత్మకు ముక్తి మార్గమును ప్రకాశింపఁ జేయువాడవు; నిర్వాణ సుఖసంపద నొసగువాడవు; జ్ఞానస్వరూపుడవు సమస్తజగమును శాసించువాడవునగు నీకు నభివాదనమగుగాక!

కర్మ సముచ్చిత జ్ఞానము (ఉపాసన)చే లభించువాడును కైవల్యపతియు భక్తులకు విహిత మనోరథముల నీడేర్చువాడును క్షేత్రజ్ఞుఁడును ఐహిక ఆముష్మిక సర్వ విధ జ్ఞానములను కలుగఁ జేయువాడును సర్వాధ్యక్షుఁడును మూల ప్రకృతియు త్రినేత్రుఁడును సర్వేంద్రియగుణములను గాంచువాడును కారణము లేనివాడునగు పశుపతికి వందనములను సమర్పించుచున్నవారము.

మూడు లోకములు పెంపొందుటకు కారకుడును మోక్ష స్వరూపుడును ముక్తి ప్రదాతయు శరణాగతుల నతి శీఘ్రము రక్షించువాడును వేదములకు ఆగమములకును నిధియు, భక్తులకు గుణములకు నవలంబనంబును త్రిగుణములను అరణిలో చిత్ అను అవిరిగా దాగియున్న వాడును కేవలము కర్మనేగాని జ్ఞానమునేగాని యవలంబించు మూఢులకు పొందనలవిగానివాడును కర్మతోగూడిన జ్ఞానముతో నుపాసించువారికి మాత్రము ప్రాప్యుఁడును, పశువును (జీవుని) పాశము (సంసారబంధము) నుండి విడిబడఁజేయువాడును స్వప్రకాశుఁడు నిత్యుఁడు శాశ్వత పరిజ్ఞాన పరిపూర్ణుఁడును ఎట్టి మనోవికారములు లేనివాడును ప్రత్యగాత్మయు గొప్పదగు స్వానందమున నిర్భరుఁడై యుండు ఐశ్వర్యము గలవాడు నగు



మహాదేవునకు ప్రణతుల మగుచున్నాము. మఱియు భక్తులు నిన్ను సేవించి ధర్మార్థకామ మోక్షము
బడయుచున్నవారు. అట్టి నీవు మాయందు కరుణ గలవాడవై ప్రసన్నుడవుకమ్ము! ఏకాంత భక్త
నిన్నారాధించుచున్న నేమియు కోరునారు కారు. కేవలము నీ చరితమునే గానముఁజేయుచుం
అక్షరుఁడు అవ్యక్తాకృతియు అధ్యాత్మయోగ గమ్యుఁడును. అతీంద్రియుఁడును ఎట్టి ఆధారము లేనివా
సర్వాధారుఁడును అనంతుడును ఆద్యుఁడును సూక్ష్మ స్వరూపుఁడునగు పరమశివునకు నమస్కారమగు

హరి మున్నగు నమరులు సకల ప్రాణులును నామరూప విభాగమున స్వకీయాంశములుగా
సృష్టింపఁబడిరి. సూర్యుని నుండి కిరణములు ప్రసరించునట్లు నీ సృష్టి యంతయు నీ వ
ప్రవర్తించుచున్నయది.

శ్లో॥ నత్వం దేవాఽసురో మర్త్యో - న తిర్యఙ్ నద్విజః ప్రభో ।
న స్త్రీ నషండో న పుమాన్ - కుర్యాః నదన న్న కించన ॥

నీవు నమరుఁడవు కావు! రాక్షసుడవు కావు! మానవుడవుకావు పశుపక్ష్యాదులును కావు!
గాని నపుంసకుఁడుగాని పురుషుడు కాని కావు! సత్తు నసత్తును నెప్పటికప్పుడు నూతనమ
కల్పించువాడవు కావు! అనఁగా నీ సదసదాత్మక ప్రపంచ సృష్టి ప్రవాహము - అనాది సిద్ధమైన
భావము. ఇవ్విధము దృశ్యమాన సమస్తంబును నిషేధింపగా మిగులునదిగా భాసించు తత్త్వమునే
విశ్వముఁదగు సృష్టి స్థితిలయముల నొనర్చుచున్నావు! యోగులు తమ యాత్మలో ధ్యానించు స్వరూప
నీయదియేను, నీ భావ వేగము నెంతటి వారైన నాపఁజాలరు. మహాకాళి మహాలక్ష్మి మహా సర
శక్తిత్రయ స్వరూపములు నీ యాశ్రయముననే లోకోపకారకములగుచున్నయవి. త్రయీమయు
ప్రపన్నులను కాపాడువాడవు! దుష్టములైన ఇంద్రియములఁదగు సుఖముల మఱిగినవారికి విదితు
వాడవుకావు! అర్చిరాది మార్గమున మాత్రము పొందబడువాడవు! అనన్య భక్తుల నవశ్యముద్ధరిం
వాడవు, వేదశాస్త్ర నిగూఢమగు ప్రతిభ గలవాడవు! నీ యనుగ్రహముగలవారే "శివోఽహం" భావ
నిన్నుపాసించి గుర్తెరుగుదురు. అనఁగా శాంభవదీక్షితులై లింగాంగ సామరస్యమున శివాగమ దీ
నిన్నారాధించి నీ సాయుజ్యము నొందుదురని భావము. వేయేల? నీ మహిమను వేనోళ్ల కొనియాడిన
పరిపూర్ణము కాదు. ఇత్యాది విశేషములుగల మహాప్రభువగు నిన్ను నమస్కరించి ప్రార్థించుచున్నా

ఇట్లు నారాయణాది దేవతలు మహాదేవుని స్తుతించి సమీచీన భక్తితో వినమ్రత శిరస్కులై శంక
మ్రోల నూరకుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ
ఆంధ్రానువాద ప్రవచనముతో పంచదశాధ్యాయము.

# షోడశాధ్యాయము

## (బ్రహ్మ విష్ణు కృత శివ ప్రార్థనము)

ఇట్టి స్తోత్రమును శివుడాలకించి ప్రసన్నుడై బ్రహ్మ విష్ణువులు దంపతులుగా వచ్చుటను గాంచి యవ్వారిని సస్మితముగా సంభాషించియు విధి కేశవులారా? దేవతలారా? మీరాకకు కారణంబేమిటి? అని యడుగగా బ్రహ్మ దేవుడు నారాయణునిచే ప్రేరేపింపబడి దిగువవిధము విన్నవించెను.

"కరుణాసాగరుడవైన శంకరా! ప్రత్యేకించి నీ కొరకే వచ్చిన వారము కొందరు రాక్షసులు హరిచే సంహరింపదగి యుందురు. మరికొందరు తమచే వధింపదగి యుందురు. ఇంక కొందరిని నేను నంత మొందింపవలసి యుండును. మరికొందరు నసురులు భవద్వీర్యసంజాతుడైన కుమారునిచే వధింపఁబడువారు నీ యనుగ్రహము వలననే ప్రాణులందరికిని సుఖము చేకూరును. ఐతే రాగద్వేష వివర్జితుడవై నీవు దయాపరిపూర్ణుడవై యుండునంతవరకు దుష్టశిక్షణమునకు నవకాశము లభింపదు. లోకమున తామసులైన రాక్షసుల ప్రభావముండు నంతదనుక సృష్టి స్థితిలయములు చక్కగా నెరవేరజాలవు. మహేశ్వరుడు-బ్రహ్మవిష్ణురుద్రస్వరూపములదాల్చి జగత్కార్యములను నెరవేర్చుచున్నవాడను నంశము-తాము మా యిరువురికి సహకరించినపుడే ధృవపడును. ఆది దంపతులైన శక్తిశివుల కుమారులమై యున్నవారము. అట్టి ముగ్గురిలో నేను విష్ణుమూర్తియు నీ యానతి ననుసరించి పత్నీపరిగ్రహణమును గావించి లోకకార్యముల నొనర్చుచున్నవారము. కావున నీవు లోకహితము కొరకు నొకానొక వనితా రత్నమును పరిగ్రహింపుము! ఇట్టి యంశమును నీవే పూర్వము మాకు చెప్పియుంటివి. నీవు గృహస్థుడవు కానిది మా కర్తవ్యములు సక్రమముగా నెరవేర్పబడవు. అందువలన ప్రపంచ క్షేమమునకు దోహదము నొదవజేయు రమణిని తప్పక చేబట్టుదువు. గాక! అని ప్రార్థించినంత శంకరుడు "బ్రహ్మ విష్ణువులారా? మిమ్ము చూచినకొలది నాకానందము పెంపొందుచుండును.

మీరు చెప్పినదియు ప్రశంసనీయంబై యున్నది. యోగీశ్వరుడని ప్రసిద్ధి గాంచిన నాకు వివాహము తగినదికాదు. నివృత్తి మార్గము ననుసరించి స్వాత్మారాముడై తన్నుతానవలోకించు నిర్వికారునకు కామినీ సంబంధ మనవసరముగాదా! అవాప్తసర్వకాముడనై శివానంద పరిపూర్ణుడనగు నాకు నింద్రియ సుఖ మెందులకు? లోకమున నల్పజ్ఞానము కలవాడే పరిపరివిధముల కామసుఖములను కోరుచుండును మరియు వివాహము పురుషునకు దృఢమైన గళబంధనముతో సమానంబగునది. కావున కాంతా సుఖమునందు నాకెంత మాత్రము ఆసక్తిలేదు. ఐనను మీ యిరువురి వాక్యమునందలి గౌరవముచే లోక కల్యాణార్థమై పాణిగ్రహణ మొనర్తును కాని యోగిని కామరూపిణియు నాతేజస్సును సహించునదియునగు రమణీమణి కావలెను. నేను యోగయుక్తుడ నైనపుడు ఆమె యోగయుక్తురాలుగను కామాసక్తుడ నగుతతి కామాసక్తురాలుగ నుండవలెను.

శ్లో॥ య మక్షరం వేదవిదో - నిగదంతి మనీషిణః ।
జ్యోతీరూపం శివం తంచ - చింతయిష్యే సనాతనమ్ ॥ ౧౦



అకర్ముడు జ్యోతీరూపుడు సనాతనుడునని వేదవేత్తలగు విద్వాంసులచే చెప్పబడు శివుని ధ్యాని చుందును. అట్టి శివధ్యానమునకు భంగము చేయరాదు. ఒకవేళ నట్టి విఘ్నము నాపాదించునెడ నా నాకు దూరమై నశించుగాక! మీ రిరువురు నేనును శివుని యంశమున జన్మించిన వారము కా నావలె మీరును శివధ్యానమును చేయుచుండవలెను. ఐతే నేను వివాహము తరువాతను శివధ్యా నేమరకుందును మరియు నాకు కాబోవు భార్య నా వాక్యమునందు విశ్వాసము కలిగియుండ వలె అట్టి వనితా రత్నము నొనగూర్పుడు! అని వక్కాణింపగా బ్రహ్మవిష్ణువులు సంతసించి "ఉమా లోకకార్యమును సాధింపనెంచి లక్ష్మీసరస్వతీ రూపముల దాల్చుటయేగాక దక్షపుత్రికయై సతి బఱగుచు నీవే భర్తవు కావలెనని దృఢవ్రతురాలై తపించుచున్నయది. కావున నామెయందనుగ్ర కలవాడవై వరము నొసగుటకు వెళ్లుము! ఇవ్విధము సతీదేవిని పరిగ్రహించి మమ్ము ధన్యు జేయవలెనని యభిప్రాయపడుచున్నాము" అని విన్నవించియు దేవతలతోడను మునులతోడను స్వ నివాసములకు జనిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ
ఆంధ్రానువాద ప్రవచనముతో షోడశాధ్యాయము.

## సప్తదశాధ్యాయము

### (సతీ వర లాభము)

బ్రహ్మవిష్ణ్వాది దేవతల ప్రార్థనము నంగీకరించి శంకరుఁడు సతీ పరిగ్రహణము నుద్యుక్తుడగుచుండగా సతీదేవి - యింకను శివుఁడు ప్రసన్నుఁడు కాడేలయని తత్తఱపాటుఁ జెంది పూర్వాధికముగా శివునారాధింపఁదలచినదై ఆశ్వయుజ మాసమున శుక్ల పక్షమునందు అష్టమి నుపవసి భక్తితో పూజించి నవమినాడు ఉదయము శివధ్యానమగ్నురాలై యుండెను. అట్టి తతి మహేశ్వరుఁ సతీదేవి ముందు ప్రత్యక్షమయ్యెను.

సర్వాంగ సుందరుఁడు గాను ధవళ వర్ణము మూడు కన్నులు చంద్ర రేఖావిలసిత ఫాల ప్రదేశం ప్రసన్న హృదయము నీల గళము నాలుగు చేతులును కలిగి త్రిశూలమును బ్రహ్మ శిరంబను వరదాభయముద్రలఁదాల్చినవాడుగాను భస్మోద్ధూళితుడుగా హిమవత్పుత్రికయగు గంగను జడ నిలిపినవాడుగాను గొప్ప లావణ్యముఁదగు నిధిగాను కోటి చంద్రకాంతి గల ముఖముతోడను మన్మథ సమాన రూపముతోడను స్త్రీ ప్రియమైన అకారముతోడను కన్పట్టు పరమేశ్వరు నవలో సతీదేవి సిగ్గుచే తల వంచినదై మహాదేవుని చరణములపై వ్రాలగా శంకరుఁడు లోలోన నా మహా భార్యగా నభిలషించుచున్నను దిగువ విధము వక్కాణించెను.

"దక్షనందిని! నీ వ్రతమునకు సంతసించితిని. ఏమి కావలయునో కోరుము! ఇచ్చెదను."

అంత సతీదేవి స్వమనోగతమును చెప్పఁజాలక మధన పడుచుండగా భక్త వత్సలుడు-వర మడుగు వరమడుగుము! అని పదే పదే హెచ్చరించినందున తన సిగ్గు కప్పి పుచ్చి "నీ యిష్టమైన వర నొసగు" మని ప్రార్థింపగా శంకరుఁడు "నాకు భార్యవుకమ్మని" యనుగ్రహించెను. ఇద్దాని నాక





సతీదేవి-మనో భీష్ట మీడేరినదని లోలోన యానందించుచు తన నపేక్షించియుండు శంకరుని గమనించి కామోద్దీపకములగు శృంగార చేష్టలను ప్రదర్శించెను. అంత నిరువురి హృదయములలో ఆనంద రస ముప్పతిల్లుచుండినది.

"దేవాది దేవా నా తండ్రిగారి ముందు వివాహ విధానముతో నన్ను పరిగ్రహించుడని" సతీదేవి కోరగా శంకరుఁడు మరియొకతూరి యామె ననురాగముతో చూచి అట్లే యగుగాక యని వక్కాణించెను. పిమ్మట సతీదేవి పశుపతి యాజ్ఞఁబడసి మాతాపితృ సన్నిధికిఁజనినది. శంకరుఁడును సతీవియోగమును భరింపఁజాలక కైలాసము కడు దూరమని భావించి హిమాలయ శిఖరమున శివధ్యానముఁజేయుటకు వెళ్లినవాడు. అంత కొంత కాలమునకు పరమేశ్వరుఁడు స్మరింపగా బ్రహ్మదేవుడుఁ సరస్వతితో గూడ నేతెంచి కనుపడెను. అంత "చతుర్ముఖా! ప్రస్తుతము పరిణయ విషయమై స్వార్థపరుడనైతిని. దాక్షాయణి నందావ్రతములో నన్నారాధించినందున సంతసించి "నిన్ను భార్యగా పరిగ్రహింతు"నని వరము నొసగితిని. ఐతే దక్షునిద్వారా పరిణయము కావలెనని యామెకోరినది. అట్లేయంగీకరించితిని కావున సర్వవిద్యావిశారదుడవగు నీవువెళ్లి దక్షుని మెప్పించి శీఘ్రముగా సతీదేవిని నా కిప్పించుము!" అని శంకరుఁడు వచింపగా బ్రహ్మదేవుఁడు "పరమేశ్వరా! తాము సెలవిచ్చిన యంశము దేవతలందరికిని చెందియున్నది. నేను నారాయణుఁడు ఇంద్రాదిదేవతలును స్వార్థపరులమయ్యే మిమ్ము ప్రార్థించినవారము. ఇందుకు దక్షప్రజాపతి యెట్టి యభ్యంతరమును చెప్పఁజాలడు. నేను నాతనికి చెప్పెదను" అని వాక్రుచ్చి యతివేగముగా దక్ష గృహమునకుఁ జనినవాడు.

ఇఁక సతీదేవి – తాను గావించిన వ్రతనియమములు ఫలించినందున సంతుష్టాంత రంగయై చెలికత్తెద్వారా వరప్రాప్తి మున్నగు శుభసమాచారమును దక్షప్రజాపతికి నివేదించెను సతీదేవిఁదగు మాతాపితరులు స్వపుత్రికావృత్తాంతమును గుర్తెరిగి సంతోషాతిశయమునఁజేశి బ్రాహ్మణులకు బీదలకును నానావిధదానముల నొనర్చిరి. వీరిణి – సతీదేవిని కౌగలించుకొని శిరస్సునందాఘ్రాణించియు మిగులమెచ్చుకొనినది. ఇట్లు కొంతకాలము గడచిన తరువాత "శంకరునకు నా కుమార్తెను సమర్పించుట యెట్లు? మహాదేవుఁడు ప్రత్యక్షమై వెళ్లినవాడు మరల నెట్లిక్కడకి వచ్చును? ఒకవేళ నేనెవరినైన నీశ్వరుని కడకు పంపుదునేని యాతడు మన్నింపకున్నచో నా ప్రార్థనము వ్యర్థంబగును. లేదా? నాకుమార్తె పూజించినట్లు నేను శంకరు నారాధింపవలెనా? సతీదేవిఁదగు భక్తితోడనే యాతడు స్వయముగా నా పుత్రికనర్థించునా?" అని దక్షుఁడు మనస్సులో విచారించుచుండగానే పితామహుఁడచటికరుదెంచె. అంత సరస్వతీసమేతుడైన బ్రహ్మదేవునిఁ గాంచి నమస్కరించి యాగమునకారణంబడుగగా బ్రహ్మదేవుఁడు "శంకరునానతి నేనిటకు వచ్చితిని. సతీశంకరుల దాంపత్యమునకు సమయమాసన్నమైనది. ప్రస్తుతతము నీ కుమార్తెయందే మనస్సు గలవాడై మహేశ్వరుఁడు వివాహమునకై హిమాలయమున నిరీక్షించుచున్నవాడు. కావున నాతనిని నీ నివాసమునకు గొనివత్తును. జాగుసేయక కన్యాదానము నొనరింపుము!" అని వచించినంత దక్షుఁడు స్వపత్నీసమేతముగా ఆనందాబుధి నోలలాడినట్లు నమృతధారలఁగ్రోలినట్లును సంతోషించి సతీ వివాహసన్నద్ధమానసుడై యుండెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో సప్తదశాధ్యాయము.**



# అష్టాదశాధ్యాయము

## (సతీశివ వివాహము)

సూతుఁడు చెప్పఁదొడగెను.

అంత బ్రహ్మదేవుఁడు ప్రసన్నమనస్కుడై హిమాలయముపై వేంచేసియున్న పరమేశ్వరుని సన్నిధికిఁ జని ప్రణమిల్లి శుభముహూర్తమున తాము అరుదెంచినయెడల నా కుమార్తెను సమర్పింతునని దక్షుఁడు పలికినాడని చెప్పగా శంకరుఁడు ఇద్దియేను సమయమనియు నారదుని మరీచ్యాదులను రప్పించు మనియు తెలిపినందున చతుర్ముఖుఁడవ్వారిని స్మరింపగా నారదాదులచ్చోటున కేతెంచిరి. అంత శివుఁడు శైవపుంగవుఁడగు హరిని జ్ఞాపకము చేయఁగా నాతఁడును లక్ష్మీ సమేతుడై తన పరివారముతో గరుత్మంతుని యధిష్ఠించి వచ్చినవాడు.

శ్లో॥ అథ చైత్రసితే పక్షే - నక్షత్రే భగదైవతే
త్రయోదశ్యాం దినే భానౌ - నిర్గచ్ఛత్స మహేశ్వరః ॥ ౨౦

చైత్ర శుక్ల పక్షమున త్రయోదశీతిథిని రవివాసరమునందు సూర్యదేవతాకమైన పూర్వఫల్గుని నక్షత్రమున మహేశ్వరుఁడు - నందివాహనారూఢుడై బ్రహ్మవిష్ణు ఇంద్రాది దేవగణములతోడను ప్రమథగణములతోడను, దక్షసదనమునకు వెళ్ళుచుండగా గొప్ప వేడుకగా నుండెను. మరియు శివునకు గజవ్యాఘ్రచర్మలు చీనాంబరములయ్యెను జడలు - శృంగార నీలాలకములుగాను చంద్రరేఖ - ఫాలపట్టము గాను, నాగములు - మణికంకణహారములుగాను పరిణమించెను. అవ్విధము శంకరుఁడు వేంచేయగా దక్షప్రజాపతి - నిజపరివారముతో నెదురేగి శివునకు నర్ఘ్యపాద్యాదుల నొసగి విష్ణ్వాదులను యథోచితముగా సత్కరించియు పీఠములపై నాసీనులఁగావించెను.

ఒకానొక ముఖ్యమణి పీఠముపై శంకరుని కూర్చుండఁజేశి దక్షుడు సమాహిత మనస్కుడై విధివిధానముగా పూజించెను. అంత దక్షుఁడు ప్రార్థింపగా బ్రహ్మదేవుఁడు వివాహవిధానమును జరిపింప శుభముహూర్తమున గ్రహబలముతో కూడిన శుభలగ్నమునందు దక్షుఁడు సతీదేవిని శంకరునికి సమర్పించెను.

శంకరుఁడును - హర్షాతిశయమున సతీదేవిఁదగు పాణిగ్రహణమొనర్చెను. దాక్షాయణీ మహేశ్వరులు నూతన దంపతులై విరాజిల్లుచుండగా బ్రహ్మవిష్ణ్వాది దేవతలు మునులు ప్రేక్షకులందరును భక్తితో నమస్కరించిరి. నానావిధస్తోత్రములను పఠించిరి. నృత్య గానమహోత్సవము నెరవేర్పఁబడినది.

అట్టితతి సురముని కిన్నరకింపురుష గంధర్వాదులును మానవ పశుపక్ష్యాదులును నానంద పరవశులగుచుండిరి. దక్షుఁడును హరునకు కన్యాదానమును గావించి ధన్యుడనైతినని లోలోలన మురియు చుండెను. వేయేల? సతీశివులు ప్రసన్నులై యుండుటఁజేశి లోకమంతయు మంగళాస్పదంబయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నష్టాదశాధ్యాయము.





# ఏకోనవింశాధ్యాయము

## (శివలీలా వర్ణనము)

దక్షు డవ్విధము వివాహవిధిని కన్యాదానము నొనరించి బ్రాహ్మణులకు బహుళ ధనము నొసగినవాడు. అంత గరుడధ్వజుఁడు లక్ష్మీదేవితో కూడ నంజలిని ఘటించి "మహాదేవా? జగమునకు నీవు జనకుఁడవు సతీదేవి జననియగును. లీలగా నవతరించిన మీరిరువురును దుష్టశిక్షణమునకై శిష్టరక్షణమునకును పాటుబడువారని శ్రుతివక్కాణించుచున్నయది. మనోహరమైన వన్నెగల సతీదేవితో నీవు పూర్వాధికముగా శోభించుచున్నావు! ఇఁకముందు దేవమానవాదులందరిని కాపాడుచుండుము! మరియు నీ సతీదేవిని మోహముతో గాంచు వానిని వధింపుము!" అని విన్నవనింపగా శంకరుఁడుహర్షించి మాధవవాక్యము నంగీకరించెను. పిమ్మట నారాయణుఁడు నిజస్థానమునకేతెంచి సతీశంకరుల యశోగానముఁ జేయుచుండెను.

అంత బ్రహ్మదేవుఁడు – గృహ్యోక్తవిధిని వివాహహవనమును చేయించి యగ్ని ప్రదక్షిణమునకు పురికొలుపగా నా యాది దంపతులు వీతిహోత్రుని ప్రదక్షిణములు చేయుచుండిరి. అట్టితతి మంగళగీతములు కర్ణపేయములగుచుండెను. వాద్యములు మ్రోగుచుండెను. నృత్యములొనర్పఁ బడుచుండెను. ప్రాణులందరు నఖండానందాంబుధి నోలలాడుచుండిరి.

ఇట్టి సంతోషసమయమున శాంభవీమాయా ప్రభావమున బ్రహ్మదేవుఁడు – పూర్వము శంకరుని కపటముగా మోహింపఁజేయవలెనని తలపెట్టియుండుటచే – ప్రస్తుతము తానే అట్టి వికారముఁ జెందుచుండెను.

శ్లో॥ ఇచ్ఛే త్పరాపకారం యః - సత స్త్యైవ భవే ధ్రువమ్,
ఇతి మత్వాఽపకారం నో - కుర్యా దన్యస్య పూరుషః॥ 16

అనవసరముగా నితరునకు నపకారముఁ జేయువానికే నట్టికీడు చేకూరును. ఇద్ది ముమ్మాటికి నిశ్చయమని గుర్తెరిగి బుద్ధిబంతుడెవరికి నపకారము నొనర్పగూడదు సతీశివులు అగ్ని ప్రదక్షిణముఁ జేయుచుండగా సతీదేవిఁ పదగు చరణములు – చీరయంచులోనుండి కనఁబడి నందున బ్రహ్మదేవుఁడు మోహితుఁడై సతీశరీరావయవముల నవలోకించుచు కామాతి శయమునఁ జేసిసతీముఖములను చూడగోరెను.

సతీదేవి లజ్జావనితయైనందున ముఖము గానరామి నగ్నియందు తడికట్టెలను పడవేసి ఘృతమును కొద్దిగా వేయుచు పొగఁబారునట్లు గావించియుండుటఁజేసి మహేశ్వరుఁడు లౌకికగతిని తన హస్తములతో కన్నులు మూసుకొనెను. అప్పుడు బ్రహ్మదేవుఁడు సతీ ముఖమును కనులారగాంచి యంతరంగము సముత్సుక మగుచుండగా కామార్తుడై ఇంద్రియ వికారముఁజెందుచు మాటిమాటికి నామె ముఖమును చూచుచుండుటవలన రేతస్సు చతుర్బిందుమితముగా స్ఖలితమయ్యెను. అద్ది చూపరులకు మాత్రము మంచుకొండవలెనుండెను. అట్టి పరిస్థితియేరికిని తెలియఁగూడదని బ్రహ్మదేవుఁడు స్వవీర్యమును కప్పిపుచ్చుచుండెను. సర్వజ్ఞుడైన శంకరుఁడు దివ్యనేత్రములతో నిద్దానినంతయు కనుగొని "పాపబుద్ధి



గల చతుర్ముఖా? ప్రపంచమున జరుగునదంతయు నాకు విదితమగుచుండును. సతీదేవినిదగు వదనారవిందమును నీవు మోహముతో గాంచుటచే యిట్టి గతి పట్టినది. సృష్టికర్తవయ్యు నింద్రియ నిగ్రహము లేనివాడవైతివి. చరాచర ప్రాణులలో నంతర్యామిగా నుండువాడ" నని వచించి విష్ణువాక్యమును స్మరించియు త్రిశూలముతో బ్రహ్మను వధింప నుద్యుక్తుడయ్యెను.

అట్టితఱి మరీచ్యాది ప్రజాపతులు హాహాకారముఁ జేయుచు తల్లడిల్లుచుండిరి. కోపాగ్ని ప్రజ్వలితుడైన శంకరుని యమరులు ప్రార్థించుచుండిరి. "మహాదేవా? శరణాగతవత్సలా? మాయందు దయగలవాడవై బ్రహ్మదేవుని రక్షింపుము! సతీదేవి జగన్మాతగాను నీవు జగత్పతిగాను విలసిల్లుచున్నవారు హరిబ్రహ్మదులందరును మీ యందు భక్తిలేనివారని మాయచే మోహింపఁజేయుదువు."

దక్షప్రజాపతియు శంకరుని ముందు నేతెంచి వలదువలదని నివారించుచుండెను. అంత శంకరుఁడు "సతీదేవిని మోహబుద్ధితో నవలోకించు వానిని సంహరింతు"నని ప్రతిజ్ఞఁజేసితిని కావున బ్రహ్మదేవు వధింపక తప్పదని వచింపగా సురముని గంధర్వాదులందరును ఖిన్నులై భయపడసాగిరి.

పిమ్మట మహేశ్వరుని సమీపించి ప్రణతుడైన నారాయణుఁడు వడిగా ముందు కేగియు "దేవా! బ్రహ్మదేవుఁడు నిన్ను శరణుఁబొందినవాడు. శరణాగత రక్షకుడవు! నీ యానతి వలననే నేను లోకరక్షకుడనైతిని. ఈతడు జగత్సృష్టికర్తయైనాడు. ఇట్టి లోకోపకారకుని నీ భక్తుని చంపవలదు! మరియు నీతడే నీ సతీదేవి నీకు భార్యయగునట్లు నుపాయము నేర్పరచినవాడు. మరియొక సృష్టికర్తను పుట్టించు సామర్థ్యము గలవాడవైనను బ్రహ్మదేవుని నీ రెండవ ప్రాణముగా భావించి మన్నింపుము! నేనును నీకు నతి సన్నిహితుడను. మనము ముగ్గురము కూడియే జగత్కార్యములను నిర్వహించువారము. నీ ప్రతిజ్ఞ - లోకకంటకులగు దుర్మార్గులయందు నిర్వహింపఁబడుగాక! దివ్యాంతరిక్షమునందు స్వయంప్రకాశమానము కూటస్థము అవ్యక్తము అనంతంబు నిత్యంబు నగు జ్యోతియే శివరూపమున భక్తులకు గానవచ్చును. అట్టి శివుఁడవు నీవేకదా! మేమిరువురము నీ యంశ సంభూతులము గాదే" అని ప్రార్థింప మహాదేవుఁడు ప్రసన్నుడై త్రిశూలమును దింపి బ్రహ్మదేవుని కాపాడెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏకోనవింశాధ్యాయము.**

## వింశాధ్యాయము

### (సతీవివాహ మహోత్సవము)

భక్త పరాధీనుఁడగు శంకరుఁడు - చతుర్ముఖుని సంహరించుటను విరమించుకొని నందున నందరును భయరహితులై చేతులు జోడించి తలలు వంచియు శంకరు ననేక విధములుగా స్తుతించిరి. జయజయధ్వానములను గావించిరి. అట్టితఱి నిదియే మంచి యదను అని భావించి బ్రహ్మదేవుఁడు స్వాపరాధ క్షమాపణమ్మునకై మహేశ్వరుని పలువిధముల వేడుకొనగా శంకరుఁడు ప్రసన్నుఁడై యచట వారందరు వినునట్లు బ్రహ్మదేవునకు "చతుర్ముఖా! నీ యపరాధమును మన్నించితిని. నీ హస్తముతో నీ





తలకాయను ముట్టుకొనుము" అని వచింప బ్రహ్మయు నట్లు గావించి శంకరునకు నమస్కరించెను. అంత బ్రహ్మశిరముపై నందివాహనారూఢ శివరూపము ఏర్పడగా ఇంద్రాది దేవతలు చూచుచున్నందున సిగ్గుచే విధి తలవంచుకొని పాపప్రాయశ్చిత్తమును సెలవీయు మనఁగా శంకరుఁడు "ఈ రూపముతోడనే నన్నారాధించుచు తపంబు నొనర్పుము! రుద్రశిరస్కుడవని జగత్ప్రసిద్ధిఁగాంతువు! పుణ్యాత్ములగు ద్విజుల సత్క్రియలను సాధించువాడవగుదువు! మానవరూపమున భూలోకమున సంచరించుము. అట్టి సమయమున నిన్ను గాంచినవారు "ఇదియేమిట"ని ప్రశ్నించి నీ వలన వృత్తాంతమును వినుకొలది నీ దురితము అంతరించుచుండును. లోకములో నపహాస్యము పాలగుటయే నీకు ప్రాయశ్చిత్తమగును. ఇఁక నీ వీర్యమువలన ప్రళయంకర మేఘములు నాలుగు నుద్భవించు"నని వాక్రుచ్చునంతలోనే సంవర్తకము, ఆవర్తకము, పుష్కరము, ద్రోణము, అను మేఘములావిర్భవించి గర్జించుచు వర్షధారలఁ గురిపించుచు శివాజ్ఞావశమున నాకసమునందు వ్యాపించియుండినవి.

తరువాత బ్రహ్మదేవుఁడు శివానుమతిని వివాహవిధానమును పూర్తిఁగావింపగా దేవతలు సతీశంకరులపై దివ్యపుష్పములను కురిపించిరి. మంగళవాద్యములు మ్రోగుటయే గాక శివచరితము గానముఁజేయఁబడుచుండెను. వైదికులు శివపారమ్య వాదములను నిరూపించుచుండిరి. రంభాద్యప్సరసలు నాట్యమాడుచుండిరి. అమరనారీబృందమునకు గొప్ప వేడుకగా నుండినది.

అట్టితతి సుప్రసన్నుడై యుండు శివుఁడు "బ్రహ్మదేవా? అస్మద్వివాహ విధానమును పూర్తిగా నెరవేర్చితివి గావున నిందు నీవు ఆచార్యుడవని చెప్పవచ్చును. అందుకు వివాహ దక్షిణ నెద్ది యొసగవలెనో చెప్పు" మనినంత చతుర్ముఖుఁడు వినమ్రుఁడై "శంకరా! భక్తవశంకరా! నా యందనుగ్రహము కలదేని యిచ్చోట నీ వివాహవేదికయందు నీ కల్యాణ రూపముతో నివసింపుము! ఇట్టి నీ చెంతనే యాశ్రమము నేర్పరచుకొని తపంబు గావింతును. చైత్రశుక్లత్రయోదశిని పూర్వఫల్గునీ నక్షత్రయుక్త భానువారమున నిచ్చోట నిన్ను గాంచువారు తత్కాలముననే పాపనిర్ముక్తులగుటయే గాక సుకృతములను పెంపొందించు కొందురుగాక! అట్టివారి వ్యాధులన్నియు నశించుగాక!

శ్లో॥ యా నారీ దుర్భగా వంధ్యా - కాణా రూపవివర్జితా ।
సాఽపి త్వద్దర్శనా దేవ - నిర్దోషా సంభవే ద్ధ్రువమ్ ॥ 40

దురదృష్టము గలదియు గొడ్రాలును ఏకాక్షియు కురూపవతియు నిన్ను దర్శించు నెడల పూర్వకృత పాపములను పోగొట్టుకొని సౌభాగ్యవతియు సంతాన సంపన్నయు సౌందర్యవిరాజితయు నగుదురు గాక!" అని ప్రార్థింప శంకరుఁడు సంతసించి యట్లేయగు గాక యని బ్రహ్మ ననుగ్రహించినవాడు. అంత బ్రహ్మవాక్యము ననుసరించి మహేశ్వరుఁడు సతీసమేతుఁడై వివాహవేదికయందు స్వాంశీభూత కల్యాణ విగ్రహముతో విరాజిల్లెను.

అంత శంకరుఁడు సతీదేవిని తోడ్కొని వెళ్ల నుద్యుక్తుడగుచుండగా దక్షుఁడు వినయావనత కంధరుడై మహేశ్వరుని వేడుచుండెను. విష్ణ్వాది దేవతలును మునులును గణములును నమస్కరించి జయశబ్దము నుచ్చరించిరి. అప్పుడు దక్షు ననుమతిని సతీదేవితో గూడ వృషభముపై నధిష్ఠించి శంకరుఁడు హిమాలయ శిఖరమునకు బయలుదేరెను. సతీదేవి శంకరు నాశ్రయించి చంద్రునిచెంత మేఘపంక్తివలె విరాజిల్లు



చుండెను. అట్టి దివ్య దంపతుల మనోహర దృశ్యమును విష్ణ్వాదిదేవతలు మరీచ్యాది మహర్షులు దక్షప్రజాపతియు చూచుచుమిగుల నాశ్చర్య చకితులగుచుండిరి తదితరులు నిశ్చేషులగుచుండిరి. కొందరు శివచరితమును సుస్వరముగా పాడుచుండిరి. మరికొందరు వీణామృదంగాది వాద్యములను మ్రోగించుచుండిరి. శివుని విడనాడఁజాలక నందరును శివుని వెంటఁజనుచుండిరి. మార్గమధ్యమున శంకరుఁడు– దక్షప్రజాపతికి ననురాగ వచనములతో వీడ్కోలు నిచ్చెను. విష్ణ్వాదులకు ననుమతి నొసగ నవ్వారు నింకను సతీశంకరుల ననుసరించుచుండిరి. అవ్విధము హిమాలయ శిఖరమును శంకరుఁడు చేరుకొని యవ్వారి నందరిని సత్కరించియు నిజనివాసములకు వెళ్లుడని సెలవిచ్చెను.

ఇఁక నీశ్వరుఁడు హిమాలయ ప్రాంతములయందు కొంతకాలము సతీదేవితో గూడ నివసించి పరమధామమగు కైలాసమునకు పయనమై యట సుఖముగా నుండెను.

స్వాయంభువ మన్వంతరమునందు సంభవించిన నందివాహనుని వివాహ శుభసమాచారము నంతయు చెప్పితిని.

ఇద్దానిని లోకమున వివాహసమయమున యజ్ఞప్రారంభమునను శంకరుని పూజించి వినువారి కల్యాణము నిర్విఘ్నమగుటయే గాక నితర పుణ్యకార్యములును నిరాటంకముగా సిద్ధించును. కన్యక యాలకించునెడ నచిరకాలముననే సౌభాగ్యవతి యగును పతివ్రత వినునెడల పుత్రసంతానవతి యగును.

అని సూతుఁడు శౌనకాది మహర్షులకు నుపదేశించినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను వ్యాంకటీయ ఆంధ్రానువాద ప్రవచనముతో వింశాధ్యాయము.

## ఏకవింశాధ్యాయము

### (సతీశివ విహారము)

"సర్వజ్ఞుడైన శంకరుని చరితమును సతీవివాహముతో గూడ వినిపించితివి. అద్ది శ్రోత యవివేకమును పోనాడి విజ్ఞానమును కలుగఁజేయుచు శుభముల నొసగునని భావించుచున్నాము. తరువాత సతీశివుల లీలావిలాసచరిత మెవ్విధము జరిగినదో మా యందు దయగల వాడవై వక్కాణింపు" మని శౌనకాది మహర్షులు ప్రశ్నింపగా సూతమహర్షి చెప్పఁదొడఁగెను.

శివలీలాఽను వర్ణమున మీచే నేను ప్రేరేపింపఁబడుటయు భాగ్యయోగమని తలచును శంకరుఁడు తన గణములతో కైలాసముఁజేరి యతిప్రియమైన నందినుండి డిగ్గి సతీదేవితో గూడ నిజమందిరముఁబ్రవేశించి "నేను స్మరించినపుడు మాత్రము మీరు మావద్దకి రావలయు" నని నంద్యాదుల నాజ్ఞాపింపగా నవ్వారు కైలాసమునందలి పలుచోట్లకు వెళ్ళియుండిరి.

ఇఁక నీశ్వరుఁడు కైలాసగిరి గుహయందు సతీదేవితో రహస్యక్రీడల నొర్చుచు నొకప్పుడు వన్యపుష్పముల మాలిక నొనఁగూర్చుకొని సతీదేవిఁదగు కంఠము నలంకరించుచుండెను. మరియొకప్పుడు

సతీదేవి తన ముఖము నద్దమున చూచుకొనుచుండగా శంకరుఁడు నామె వెనువెనుక నుండి స్వవదనము నవలోకించుచుండెను. ఒకతఱి సతీదేవిఁదగు కర్ణకుండలములను తీయుచు పెట్టుచుండును. మరియొక తూరి స్వభావసిద్ధముగా రక్తవర్ణముగల సతీదేవిఁదగు చరణములను ఫాలాగ్ని జ్వాలాలేశాతిలేశమున నతిశయరక్తిమ గలవానిగా నొనర్చును. మరియు హెచ్చుగా చెప్పవలసిన యంశమును గూడ సతీదేవి - చెవిలో రహస్యమువలె చెప్పుచు నామె ముఖముఁదగు లావణ్యసుధను గ్రోలుచుండును. ఒకప్పుడు దూరమువెళ్ళినట్లు నటించి యెద్దియో ఆలోచించుచున్న సతీదేవిఁదగు కన్నులు మూయుచుండును. మరియొక్కప్పుడు తాను దాగి హఠాత్తుగా నామెను కౌగలించుకొనుచుండున్నందున సతీదేవి చకితురాలగుచుండెడిది. మరియు సువర్ణకమలపు మొగ్గలవలె నుండు నామెస్తనములకు కస్తూరి పూయుచుండును. మరియొక్కప్పుడు సతీవక్షోజములపై నుండి ముక్తాహారమును తీసి మరల తానే వేయుచుండెను. సందికడియములను కంకణముల నుంగరములను సతీదేవినుండి తానే తీయుచు మరల నా యా స్థానములంయందు నెలకొలుపుచుండెను. ఒకప్పుడు నీ వన్నెతొసమమగు వన్నెగల సఖి వచ్చుచున్నది చూడుమని చెప్పుచు సతీదేవి చూచునపుడు ఆమె నెత్తైన చన్నులఁగావించుచుండును. మరియొక తూరి మన్మథ భావావేశమున ప్రియురాలి చెంతకేతెంచి నానావిధ శృంగార చేష్టితములను గావించుచుండును. మరియు మనోహర కమలములను పుష్పములను గొనితెచ్చి యామె నొడలునందు సింగారించును.

ఇవ్విధము భక్తవత్సలుడైన శంకరుఁడు పర్వతముఁదగు పొదరిండ్లలో రమ్యస్థలముల యందును సతీదేవితో విహరించుచు నామె లేనిది యెచ్చోటికిని వెళ్ళకుండెను. సతీదేవిని విడనాడి యొక్క క్షణమైనను స్వాస్థ్యమును పొందకుండెను. సతీదేవితోడనే కాలముఁగడుపుచునడెను. సతీదేవియే సర్వస్వ మని భావించెను.

పర్వతరాజమగు కైలాసమున కొంతకాలము విహరించి సతీదేవిని తోడ్కొని హిమాలయమునకుఁ జని మన్మథుని స్మరింపగా నాతడు వసంతుని సహాయమున నచటి వృక్షములను తీగెలను పుష్పింపఁ జేసెను. జలాశయములయందు కమలములు వికసించెను. పద్మములపై తుమ్మెదలు వ్రాలుచు పూదేనెలఁ గ్రోలుచుండెను. మలయమారుతము పరిమళము గలదై వీచుచుండెను. సంధ్యాకాలమునందలి చంద్రునివలె పలాశములు ప్రకాశించెను. పుష్పములు కామాస్త్రములుగా కన్పట్టుచుండెను. పంకజములు ప్రాణులను సంతసింపఁజేయుచుండెను. బంగారువన్నెగల పుష్పములతో నాగకేసర వృక్షములు మనోజ్ఞములైన మామిడి చెట్లును శంకర సన్నిధానమున విరాజిల్లుచుండినవి. అవంగవల్లియు తన సుగంధముతో కాముకుల మనంబులను రంజిలఁజేయుచుండెను. ఉదకములు స్వచ్ఛములుగానుండెను. అట్టితఱి జితేంద్రియులగు మునుల మనంబులును చలించుచుండెను. శంకరుఁడిట్టి వసంతోత్సవ సమయమును పురస్కరించుకొని గిరిశ్రేష్ఠమగు హిమాలయమున నదీతీరములయందును నికుంజములయందును సతీదేవితో బహుకాలము విహరించినవాడు. శంకరుని మనోగతమున కనువగునట్లు సతీదేవి మెదలుచుండెను. సంభోగసుఖమున నామె శంకరుని దేహములో ప్రవేశించినట్లును తన పతిలోగల ఆనందరసమును త్రాగుచున్నట్లును తన్మయురాలగుచుండెను. శంకరుఁడును దివ్యమందారపుష్పమాలికలతో సతీదేవినిమాటిమాటికి నలంకరించుచు నానావిధ నర్మవచనములతోడను



విలాసవీక్షణములతోడను మందస్మితములతోడను నట్టిహాసములతోడను తన ప్రభావమునంతయు కన బఱచుచుండెను. ఒకప్పుడు చంద్రునివంటి సతీ ముఖముఁగగు నధరామృతపానమున మత్తుడై పలుతెఱఁ గులఁబ్రవర్తించుచుండెను. త్రాళ్ళచే బంధింపఁబడిన మత్తగజమువలె నుద్రిక్తుడై సతీదేవిఁదగు వక్త్రాంబుజముపై తన ముఖము నునుచుచు నామె సౌందర్యవిలాస విభ్రమములకు పరవశుడై యితరము నెఱుఁగకుండెను.

ఇట్లు హిమగిరికుంజములయందు తత్ప్రాంతభాగముల యందును ప్రతిదినము దాక్షాయణితో మహేశ్వరుఁడు సుఖభోగములఁ దేలుచుండగా దేవతామానంబున నిరువదియైదు వత్సరములు గడచినవి.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏకవింశాధ్యాయము.

## ద్వావింశాధ్యాయము

### (వర్షాకాల వర్ణనము)

అంత శంకరుఁడు హిమాలయమునుండి కైలాసమునకు రాగా నొకసమయమున సతీదేవి-తన పతిని గురించి దిగువ విధము పలికెను.

"ప్రాణానాథా! మిక్కిలి సహింపనలవిఁగాని వర్షాకాలము సంప్రాప్తించినది. పలువన్నెలుగల మేఘములు ఆకాశమున గర్జించుచు దిగంతములను ధ్వనింపఁజేయుచున్నవి. ప్రచండ వాయువులు నుదకబిందువులఁగైకొని యతివేగముగా వీచుచు హృదయమును కదిలించుచున్నవి మేఘములు హెచ్చుగా నుఱుముచు మెఱపులతో జడివానగురిపించుచుండగా ఎవని మనస్సు తత్తరపాటుఁజెందదు? సూర్యుఁడు కనుపించుటలేదు. రాత్రివేళయందు చంద్రుఁడును మేఘములఁదాగియుండును. వియోగము గల దంపతులకు దుఃఖప్రదమగు సందర్భము - అనఁగా పగలే రాత్రిగా నున్నయది. మేఘములు వాయుప్రేరితములై గొప్పగా నఱచుచు పలుచోట్ల తిరుగాడుచు ప్రాణుల శిరములపై పడునేమోయనిపించుచున్నది. మహా వృక్షములు వాతాహతములై యాకసమున కెగురుచున్నావోయన్నట్లు భయపడువారిని బాధించుచున్నవి. నునుపైన నల్లని కాటుకవలెనుండు మేఘసముదాయమును తెల్లకొక్కెరలు అనుసరించుచు యమునానదిఁదగు బురుగవలె నగుపడుచున్నవి గృహముల ముంగిళుల యందునుసస్యములంకురించుచుండగా గ్రామేతరస్థలముల యందు పైరులుదయించునని వేరుగా చెప్పనవసరములేదు. మేఘములు నవలోకింప నువ్విళులూరుచుండును. చాతకపక్షులు మేఘముల కెదురుగాచనుచున్నవి. వడగండ్లతో మేఘములు మయూరములను చాతకముల నాచ్ఛాదించుచు నొ యొంటిపైనను పడుచున్నవవి. ఇట్టి విషమ సమయమున కాకములు చకోరపక్షులును నీడముల నేర్పరచుకొనుచున్నవి. మనకు నొక నివాసములేనందున మిగుల గుందుచున్నాను. మరియు భయత్రస్తురాల నగుచున్నాను. కైలాసముపైగాని హిమాలయమున గాని కాశీనగరిని భూమిపై యెచ్చోటఁ గాని నొక్కగృహమును నిర్మింపఁజేయుము! దేవా! నీకుమ్రొక్కెదను".

ఇవ్విధము సతీదేవి సంభాషింపగా శంకరుఁడు శిరోమకుటాయమునమగు చంద్రుని కిరణముల ననుకరించు చిరునగవుతో "ప్రాణేశ్వరీ నీ యిష్టమైన స్థలమును తెలుపుము! అచ్చోటికి మేఘములుగాని ప్రచండవాయువు గాని రాజాలవు. విద్యుత్పాతము నుండఁజాలదు. హిమవత్పర్వతముఁదగు నడుమువరకే మేఘములు సంచరించును. కైలాసమునకు క్రింది భాగమునందు మాత్రము మబ్బులు తిరుగాడును. ఇఁకమేరుపర్వతముపై వలాహకములు జంబూమూలము నాశ్రయించియుండును. ఇఁక హిమాలయమున నీ విలాసములను బంగారు పక్షులు మధురశబ్దములతో గానముఁజేయుచుండును. సిద్ధాంగనలు వేడుకతో నీకు పరిచర్యలఁ జేయుచు స్వేచ్ఛావిహారమున కనువుగా నీ కనుసన్నలఁ బ్రర్తించుచు ఫలాదికము నొసగుచుందురు. గిరికన్యకలు నాగకన్యకలు ఫణీంద్రకన్యకలు నీ యడుగుజాడలఁ దిరుగాడుచు తోడుగా నుందురు. అమర నారీమణులు అసమానలావణ్యముగల నీ రూపమును నీ సుందర వదనారవిందమును గాంచుచు తమ రూపముల యందు గుణములయందును తిరస్కారమును వహింతురు. పర్వతరాజమహిషియగు మేనకాదేవి రూపగుణములతో మూడులోకములయందు ప్రఖ్యాతురాలైనను నీ మనంబున కామోదమును చేకూర్చుచుండును. మరియు హిమాలయమున విచిత్ర కోకిలాలాపములు వినఁబడును. పొదరిండ్లు అనేకము లుండును. ఎల్లప్పుడు వసంతకాలమే కన్పట్టును. కొలనులు చల్లని తియ్యని నీరుగలవై కమలములతో శోభించుచుండును. లేతపచ్చికబయ్యళ్ళు గల వృక్షములు కల్పవృక్షములఁబోలె మనస్సున కింపుగా నుండును. తాపసులుమహేశ్వరులును నివసించు తత్ప్రదేశముల యందు క్రూరమృగములు ప్రశాంతములై యుండును. దేవతలు సంచరింతురు. నానావిధ మృగములు తిరుగాడును. స్ఫటిక ప్రదేశములును స్వర్ణశిలాతలములును రజతశిఖరములు మానసము మున్నగు సరోవరములును విలసిల్లుచుండును. అందు రత్ననాళములు గల సువర్ణకమలములు వికసించుచుండును.

మరియు శిశుమారములు తాబేలులు మొసలులు నసంఖ్యాకములుగా నివసించును. మనోహరనీలోత్పలములు గల సరోవరముల తీరములయందు పరిమళముగల పుష్పములు మొదలుగునవి కన్పట్టుచుండెను. సారసపక్షులు చక్రాంగపక్షులును భ్రమరములును కామ కింకరులై కామోద్దీపనముగా మధురశబ్దములఁ గూయుచుండును.

ఇఁక మేరు పర్వతముపై ఇంద్ర కుబేర యమవరుణ అగ్నినిరుతి మారుత ఈశానుల పట్టణము లొక్కొక్క శిఖరమునందు విరాజిల్లుచుండును. రంభామేనకాద్యప్సరసలు నట నివసింతురు. వేయేల? మందార పారిజాతాది కల్పవృక్షములతో నుండు నందనవనంబును కామధేనువు ఇత్యాది స్వర్గమంతయు విలసిల్లును మరియు నింద్రాణీదేవి నిత్యము నీకు తోడు నీడగా సపర్యలఁజేయును.

ఇంతియే గాక భక్తపుంగవుల కాలవాలము పర్వతశ్రేష్ఠంబు నగు కైలాసమున నివసింతువా? అట కుబేరుని యలకానగరము, గంగాప్రవాహంబు, గోచరించును. గుహలలో వీర్యమాహేశ్వరుఁడు. కొండచరియలయందు రుద్రకన్యలు నివసింతురు. కైలాసము పూర్ణచంద్రునితో సమానముగా శోభించునది నూర్లకొలది జలాశయంబులును, సాత్త్విక మృగంబులును కలిగి మేరుపర్వతమును మించినదై యుండును. ఇవ్వానిలో నీకు రుచించిన ప్రదేశమును కోరుకొనుము. వడిగ నిన్నచ్చోటికి తీసుకునివెళ్లెద"నని వచింపగా సతీదేవి "ప్రభో! హిమాలయము నందే నీతోగూడ కొంతకాలము వసింతును. జాగుసేయక వసతి నేర్పరచుము," అనవుఁడు శంకరుఁడు సంతసించి హిమాలయశిఖరమునకు సతీదేవిని తోడ్కొని వెళ్ళినవాడు.



అట్టి హిమాలయశిఖరమునకు పక్షులు పోజాలకుండెను. అట సిద్ధాంగనలు సంచరించుచుండిరి. కమలవనములుగల కొలనులు గోచరించుచుండెను. మరియు నద్ది రత్నఖచితంబై బాలసూర్యునివలె ప్రకాశించుచుండెను. స్ఫటిక వేదికలు విచిత్రపుష్పిత వృక్షంబులును చక్రవాకాది పక్షులమధుర కూజితంబులును విద్యాధరీకిన్నరీ గణవిహారంబులును పర్వతవనితామణులయొక్కయు కన్యకలయొక్కయు మధురాలాపంబులును వీణామృదంగాద్ధి వాద్యములతోగూడిన నవ్వరసల నాట్యంబులు నా శిఖరమునందు గాన వచ్చుచుండెను. హిమవంతుని రాజధానీ నగరము చేరువనుండు నచ్చోట సతీదేవితో శంకరుఁడు దివ్యదశ సహస్రవర్షంబుల కాలము విహరించుచు మధ్యమధ్య మేరుశిఖరమునకు నానాద్వీపములకు నుద్యానవనములకును వెళ్లుచు మరల నచ్చోటికే వచ్చుచుండెను. భక్తులు గావించు సపర్యల యందుగాని యజ్ఞయాగాది వైదికకార్యముల పైగాని స్వాత్మానందమునఁగాని సతీదేవియందువలె తత్కాలము అనురాగమును చూపకుండెను. ఇట్లు అన్యోన్యానురాగముతో ఒండొరుల ముఖములను గాంచుచు శృంగారహావభావములతో కాళీశివులు ప్రవర్తించినవారైరి.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో ద్వావింశాధ్యాయము.**

## త్రయోవింశాధ్యాయము

### (భక్తి ప్రభావము)

ఇట్లు శంకరునితో సతీదేవి విహరించి సంతృప్తిఁజెందియు వైరాగ్యము కలదై ఒకనాడు ఏకాంతమున శివునకు నమస్కరించి వినయముతో "కరుణాసాగరా! శంకరా! దీనుల నుద్ధరించు వాడవు, యోగీశ్వరుఁడవు; పరమ పూరుషుడవు; రజఃసత్త్వతమోగుణముల నతిక్రమించి యుండువాడవు, ప్రాకృత గుణరహితుడవు; సర్వజ్ఞత్వాది గుణసంపన్నుడవు; సాక్షిమాత్రుడవు; నిర్వికారివి; ఇట్టినిన్ను స్వామిగా బడసిన నాభాగ్య మేమని చెప్పుదును? ఐతేప్రస్తుతము నామనస్సు - ప్రాపంచిక సుఖములనుండి తొలగిన దైనందున పరతత్త్వమును తెలియఁగోరు చున్నాను. పరతత్త్వజ్ఞానము సంసార సముద్రమునుండి తరింపఁజేయునట్టిది; కావున నట్టి విజ్ఞానమును నాయందు దయగల వాడవై ప్రబోధింపు"మని ప్రశ్నించెను.

అంతస్వేచ్ఛా విధృత లీలావిగ్రహుఁడగు శంకరుడు "దాక్షాయణీ! విజ్ఞానము చేతనే అనఁగా నుపాసన తోడనే "నాహంబ్రహ్మ" "నేను బ్రహ్మమును కాను" అను శుద్ధభావనకలవాడై పర (శివ)తత్త్వమును గుర్తెరుగవలయును. కేవలము ఉపాసన - కఠినతను మైనది. అందుకు తోడుభక్తి యుండవలెను. ఉపాసకునికి భక్తి తల్లివంటిది. భక్తి గలవాడు భుక్తిముక్తుల రెంటిఁబడయగలడు. ఇట్టిభక్తి నాయనుగ్రహము వలననే కలుగును.

**శ్లో॥ కోటిజన్మార్జితైః పుణ్యైః - శివే భక్తిః ప్రజాయతే ॥**

(శివగీత) కోటిజన్మములయందు ఫలాపేక్షారహితముగా గావింపఁబడిన పుణ్యముల బలమున శివునియందు కలిగిన భక్తి - శివానుగ్రహమున ననన్యభక్తిగా పరిణమించును.

శ్లో॥ భక్తౌ జ్ఞానే నభేదోహి - తత్కర్తుః సర్వదా సుఖం ।
విజ్ఞానం నభవత్యేవ - సతి! భక్తి విరోధిన? ॥ ౧౮

ఓసతీ!

భక్తికిని జ్ఞానమునకు భేదము లేదు కాని కేవలము జ్ఞానము నాశ్రయించిన వానికి ఇహపర సుఖములు చేకూరవు. ఐతేభక్తితో శివునుపాసించు వానికి నైహికసుఖములు అనుషంగికములుగా సమకూరుచు పరమపురుషార్థమగు మోక్షసుఖంబును సంప్రాప్తంబగును. భక్తిరహితుడగు వానికి విజ్ఞానము అనఁగా పరతత్త్వ సాక్షాత్కారము సంభవింపదు. నేను ఎల్లకాలము భక్తుల ననుగ్రహించువాడను. భక్తులు జాతిహీనులైనను నీచులైన నవ్వారి గృహముల లోనికి వెళ్ళి యభీష్టములను నెరవేర్చు చుందును.

అట్టిభక్తి యనేకవిధములు గలదైయున్నను ముఖ్యముగా తొమ్మిది యంగములు కలదై యున్నది.

శ్లో॥ శ్రవణం కీర్తనంచైవ - స్మరణం సేవనం తథా ।
దాస్యం తథాఽర్చనం దేవి! - వందనం మమ సర్వదా ॥ ౨౨
సఖ్య మాత్మార్పణం చేతి - నవాంగాని విదు ర్బుధాః ॥ ౨౩

శ్రవణము, కీర్తనము, స్మరణము, సేవనము, దాస్యము, అర్చనము, వందనము, సఖ్యము, ఆత్మార్పణంబు నని యవ్వాని నామథేయములు నొప్పారుచున్నవి.

శివుని లీలలను చరిత్రమును ముఖవచనము మొదలగువానితో నభినందించుచు నొకచో స్థిరముగా కూర్చుండి వినుట – శ్రవణమనఁబడును. శివుని యావిర్భావమును సృష్ట్యాదికృత్యములను హృదయమున పరిశీలించుచు ప్రేమతో హెచ్చుగా నుచ్చరించుట–కీర్తన మనఁదగును. శివుని సర్వవ్యాపకునిగా సుదృఢముగా భావించి యెల్లకాలము లోకమున నిర్భయుడైయుండుట స్మరణ మనఁబఱగును. అరుణోదయము మొదలుకొని విహిత సమయములయందు అనఁగా సూర్యోదయ సంగవ మధ్యాహ్న ప్రదోష నిశీథములయందు వాక్కుతో స్తుతించుటయు హస్తములతో శివునిఁబూజించుటయు పాదములతో శివక్షేత్రములకుఁశివాలయములకు జనుట సేవ్యము కాదగును. సేవనుండైన శివునకు ప్రియముగా విధివిహితముగాను చిత్త ప్రసాదముతో ప్రవర్తించుట – దాస్యమని భావింపఁబడును. విహిత సమయములలో పాద్యము మొదలగు షోడశోపచారములను శివునకు యథాశక్తి సమర్పించుట – అర్చనమని చెప్పఁబడును. మంత్రముల నుచ్చరించుచు శివుని ధ్యానించుచును మనోవాక్కాయ శుద్ధిగా నెనిమిది యంగములు (ఛాతి, తలకాయ, కన్నులు, మనుస్సు, వాక్కు, పాదములు, హస్తములు, చెవులు భూమికి తాకునట్లు శివునకు మ్రొక్కులిడుట వందనంబగునని వేదవిదులు చెప్పుదురు. శుభమునుగాని యశుభమునుగాని సమస్తంబును నామేలుకొరకే శివుఁడు నొనగూర్చుచున్నవాడను నమ్మకమే సఖ్యమగునని యేకాంత భక్తుల యాశయము. దేహేంద్రియాదులు నావి కావని హృద్గతముగా భావించుచు శరీర పోషణాదులకై మిగుల ప్రయాసపడకుండుట – ఆత్మసమర్పణం బగును.

ఇట్టి తొమ్మిది తెఱఁగుల నుండు భక్తి – నాకు ప్రియంబై భుక్తిని ముక్తి నొసగునది. భక్తికి నుపాంగములు – బిల్వమును పుష్పములను సేకరించుట మొదలగునవి యెన్నియో కలవు. సాంగో



పాంగమగు భక్తి - సర్వోత్త మంబగుటయేగాక జ్ఞానవైరాగ్యములను కలిగించును. మరియు ము యనఁబడురాణికి సేవకురాలగును. భక్తిగల మానవుడు పుణ్యకర్మల యన్నిటిఁదగు ఫలమును పొందుట గాక నీతో సమానముగ మత్ప్రియుండగును. మూడు లోకముల యందును నాలుగు యుగము యందును భక్తితో సమానమైన సాధనము మరియొందు లేదు. కలియుగము నందైతేనో నిద్ధా ప్రత్యేకత గలదు. జ్ఞాన వైరాగ్యములు కలియుగమున ముదుసలి రూపముగలవై యుపయోగింప కుండు భక్తి మాత్రము అట్టిదికాదు. సర్వయుగములయందు విశేషించి కలియుగమున (భక్తియోగము)-ప్రత్య ఫలము నిచ్చునట్టిది: భక్తి ప్రభావమున నేను భక్తుల యధీనుడ నగుదును.

శ్లో॥ యోభక్తి మాన్ పుమాన్ లోకే - సదాఽహం తత్సహాయకృత్ ।
విఘ్నహర్తా రిపుస్తస్య - దండ్యో నాత్రచ సంశయః ॥ ౪౧

భక్తి గలపురుషున కెల్లకాలము సహాయపడుచుందును. అట్టి భక్తునకు విఘ్నములను కలిగించు శత్రువు శిక్షింపఁబడును. ఇందెంతమాత్రము సందేహము లేదు. కావున భక్తుల కొరకై నేనొకప్పు ఫాలనేత్రాగ్నితో యమధర్మరాజును కాల్చితిని. మరియొకప్పుడు త్రిశూలమును చేతంబూని సూర్యు మదమణచితిని. భక్తివశుడనై రావణాసురుని వరము - లతో ననుగ్రహించితిని. విపరీత బుద్ధిగ వేదవ్యాసుని శిక్షించి కాశీక్షేత్రమునుండి నందికేశ్వరునితో వెడల గొట్టించితిని. వేయేల? భక్త పరాధీను యవ్వారి మనఃకాంక్షితముల నీడేర్చుచుందును. అందువలన భక్తిజ్ఞాన వైరాగ్యములలో భక్తియే పర సులభమగు ముక్తి సాధనం బగునని తెలియుము!"

అనివక్కాణింప సతీదేవి మిగుల సంతసించి శంకరునకు నమస్కరించినదై భక్తిని సమర్థిం శివాగమాది ధర్మశాస్త్రములను గురించియు మంత్రయంత్రములను గురించియు తన్మాహాత్మ్యము గురించియు, ప్రశ్నించి తగుసమాధానములఁబడసినదయ్యెను. మరియు శంకరుఁడు వర్ణా ధర్మములను భక్తుల మహిమలను రాజధర్మములను పుత్రధర్మములను స్త్రీధర్మములను వైద్యశాస్త్రము జ్యోతిః శాస్త్రమును సాముద్రికశాస్త్రమును తదితర శాస్త్రములను సతీదేవికి దయగలవాడై లోకోపకారార్థ ప్రబోధించినవాడు.

ఇట్లు అఖండసచ్చిదానంద శివతత్త్వము - పుంస్త్రీ రూపమున సతీ మహేశ్వరాత్మకంబై కైల హిమాలయాది రమ్యస్థలములయందు విహరించి విశ్రాంతిఁజెందియుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో త్రయోవింశాధ్యాయము.





# చతుర్వింశాధ్యాయము

## (దక్షప్రజాపతికి శివునకు విరోధకారణము)

సూతుండు చెప్పందొడగెను

శౌనకాది మహర్షులారా? పూర్వకాలంబొక విచిత్రమైన సంఘటనము నెరవేరినది. అద్దాని నాకర్ణింపుడు! ప్రయాగక్షేత్రమున మునులు పెక్కురుకూడి చేయుచున్న యజ్ఞమునకు సనకసనందనాది సిద్ధులు దేవర్షులు, మరీచ్యాది ప్రజాపతులు, మూర్తిమంతములైన నిగమాగములతోడ బ్రహ్మదేవుండును కర్మయోగులును రాగా నట మహోత్సవము గానంబడు చుండెను. జిజ్ఞానువులందరును కర్మజ్ఞానవాదములతో ప్రసంగించుచుండిరి. అట్టితతి త్రిలోకీహితకరుడగు శంకరుండు భవానీదేవితోడను ప్రమథగణముల తోడను నచటికి వేంచేయగా బ్రహ్మాదులందరును లేచినవారై ప్రణమిల్లి భక్తితో ప్రార్థించియు శంకరు ననుమతిని సంతుష్టాంతరంగులై తమ తమ పీఠములపై కూర్చుండిరి. మరియు శివదర్శనభాగ్య మీనాటికి నబ్బెగదాయని తమదైవమును కొనియాడుచుండిరి. తరువాత ప్రజాపతిశ్రేష్ఠుండగు దక్షుండు స్వేచ్ఛగా ప్రయాగ యాగమునకుంజని బ్రహ్మదేవునకు నమస్కరించి యొకానొక పీఠమునందాసీనుం డయ్యెను. - అంత సభాసదులందరును దక్షునకు నంజలిఘటించి నుతించిరి. మహేశ్వరుండు మాత్రము తనపీఠముపై సుస్థిరముగా నాసీనుడై యెట్టి యాదరమును చూపనందున తత్త్వ - బహిర్ముఖుం డైన దక్షప్రజాపతి - స్వాభిమానవశమున క్రుద్ధుడై మహా ప్రభువగు శంకరునిగురించి సభ్యులందరు వినుచుండగా దిగువవిధము ప్రలాపములంబలికెను.

దేవదానవులు విప్రవరులు ఋషులు తదితరులందరును నాకు మ్రొక్కుచుండగా భూత ప్రేత పిశాచ గణములతో కూడియుండు నీ బుద్ధిమంతుండు - దుర్జనునివలె నన్ను సత్కరింపుడెందులకు? శ్మశానవాసియై దిగంబరుండుగా నుండు నీతనిని శపించుచున్నాను. ఇట్లు నతిదుష్టుడైన దక్షుండు ప్రలపించి "ఈరుద్రుండు వర్ణధర్మ బహిష్కృతుడై యజ్ఞములో పాలుగొనకుండుగాక! దేవతలతో సమానముగా హవిర్భాగమీతనికి జెందకుండుగాక!

ఇట్టి దక్షప్రలాపములను భృగ్వాది మహర్షులు విని దక్షుండు దుష్టస్వభావము కలవాడని తూలనాడుచుండిరి. అంత నందికేశ్వరుడు - మిక్కిలి కోపోద్రిక్తుడై దక్షుని క్రింది విధము మందలించెను.

మూడులలో నగ్రేసరుడవైన దక్షా! మహేశ్వరుని యజ్ఞబాహ్యునిగా శపించితివెట్లు ? లోకమున యజ్ఞములన్నియు శివుని స్మరించినంత మాత్రమున సఫలము లగుటయేగాక తీర్థంబులును పవిత్రంబు లగును. అట్టి శివుని బ్రాహ్మణచాపల్యమున వ్యర్థముగా శపించితివి; ప్రపంచమున పుట్టించువాడును కాపాడువాడును గిట్టించువాడునగు శంకరుని నెవ్విధము శపించితివి? బ్రాహ్మణాధముడవు;

ఇట్లు నందికేశ్వరునిచే నిందింపంబడిన దక్షుండు "రుద్రగణములారా? మీరందరును వేదమార్గమును పరిత్యజించి మహర్షుల సంప్రదాయమునకు దూరముందురుగాక! శిష్టాచార బహిష్కృతులై జటాభస్మధారులై పరిభ్రమింతురుగాక"! అని శపింపగా నందికేశ్వరుండు ఎక్కువ కోపముతో "శఠుడవైనదక్షా! శివతత్త్వమును గుర్తెరుగంజాలని వాడవై శివకింకరులను గూడ శపించితివి. ఇంట శివునియందు నిష్ఠలేని నీయట్టి బ్రాహ్మణాధములను శపించుచున్నాను.





శ్లో॥ వేదవాదరతా యూయం - వేదతత్త్వ బహిర్ముఖా: ।
భవంతు సతతం విప్రా: - నాన్యదస్తీతి వాదిన: ॥ 33

మీరు వేదమునందు చెప్పఁబడిన కేవలకర్మవాదమునం దాసక్తిగలవారై నిఖిల వేదములచే ప్రతిపాదింపఁబడు శివతత్త్వమును గుర్తెరుగ నుద్యుక్తులు కాకుందురుగాక వైదిక కర్మకంటె మించినది మరియొకటి లేదని భావించుచు కామ్యబుద్ధితో స్వర్గసుఖముల నాశించి క్రోధ లోభ మదములు గలవారై అభిజాత్యము (ఆత్మగౌరవము) ను విడనాడి యాచకులై చరింతురుగాక! వేదమార్గమును ముందుపెట్టుకొని శూద్రులతో యజ్ఞములను చేయించుచు ఎల్లకాలము దానములను పరిగ్రహించుచు దరిద్రులై యుందురుగాక! ఇందులో కొందరు దుష్టదానములను స్వీకరించుచు నరకముల ఁబొందుదురుగాక! మరికొందరు బ్రహ్మరాక్షసులై జన్మింతురుగాక!

మరియు

శ్లో॥ య: శివం సురసామాన్య - ముద్దిశ్య పరమేశ్వరమ్ ।
ద్రుహ్యత్యయం దుష్టమతి - స్తత్త్వతో విముఖో భవేత్ ॥ 34

శంకరుఁడు బ్రహ్మ విష్ణ్వాది దేవతలను మించినవాడు కాడనియు దేవతలలో నొక సామాన్య దేవుడనియు భావించి ద్వేషించునట్టి దుష్టబుద్ధి గలవాడు – తత్త్వజ్ఞానము లేని వాడగును. మరియు మీరు కపటధర్మముల నాచరించుచు గ్రామ్యసుఖములఁగోరి భవనముల యందు నివసించుచు వేదవాదమున కర్మతంత్రమును మాత్రము ప్రచారము చేయుదురుగాక! ఇఁకనీదక్షుఁడు సంతోషిత స్వాంతము లేనివాడై యాత్మోద్ధరణ మార్గమును విడనాడి పశుతుల్యుడై నిష్ఫలమైన కేవలకర్మనిష్ఠతో జీవితము నవినీతిపాలు జేసుకొని త్వరలో మేకపోతు ముఖము గలవాడగుగాక!

ఇట్లు బ్రాహ్మణులను దక్షుని నందికేశ్వరుఁడు శపింపగా బ్రహ్మదేవుఁడును దక్ష ప్రజాపతియు పలువిధముల గర్హించెను. అంత శంకరుఁడు "నందికేశ్వరా? నన్ను శపింపఁబడిన వానిగా భావించి బ్రహ్మకులము నెందులకు శపించితివి? వేదము మంత్రాక్షరమయంబగునట్టిది సూక్తములతో నిండినట్టిదియు, సూక్తములతో మంత్రములతోడను ప్రతిపాదింపఁబడు పరమాత్మయందు నిష్ఠగల మహానుభావులను శపింపఁగూడదు. ఎట్టిసమర్థుండైనను దుష్టబుద్ధితో వేదములను వేదవిదులను శపింపరాదు. యజ్ఞంబును యజ్ఞాంగములును యజ్ఞమునందాసక్తి కలవాడును యజ్ఞబాహ్యుడను నేనే యని గుర్తెరిగినవారు దక్షునివలె వృథా ప్రలాపములఁబలుకరు ఈదక్షుఁడెవడు? నీవెవఁడవు? భృగుమహర్షి మొదలగు ఈసభాసదులెవరు? యథార్థమును విచారించి చూడగా సర్వస్వరూపుడను నేనే యని విదితంబగును. ప్రశాంతుడవుకమ్ము! అని వచింపగా నందికేశ్వరుఁడు సమాహిత మనస్కుఁడయ్యెను. పిమ్మట తన గణములతో గూడ శివుఁడు కైలాసమునకుఁజనెను ఇఁక దక్షుఁడానాటినుండి శివద్రోహమును మనస్సునందిడు కొని స్వనివాసమునకు వెళ్ళియు శంకరునియందు అసక్తిలేనివాడై శివభక్తులను నిందించుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో చతుర్వింశాధ్యాయము.





# పంచవింశాధ్యాయము

## (దక్షయజ్ఞ ప్రారంభము)

ఒకప్పుఁడు దక్షప్రజాపతి - యజ్ఞదీక్షఁగైకొని దేవర్షులను మహర్షులను దేవతల నాహ్వానింపగా నవ్వారందరును శివబహిర్ముఖుడైన దక్షుఁడు చేయు యజ్ఞమునకు వెళ్ళ కూడదని భావింపక శివమాయామోహికులై జన్నముఁదగు చోటున కరుదెంచిరి. అగస్త్యుడు, కశ్యపుడు, అత్రిమహర్షియు, వామదేవుఁడు భృగుమహర్షియు, ధధీచియు వేదవ్యాసుఁడు భరద్వాజుఁడు గౌతముడు, పైలమహర్షియు, పరాశరుఁడు గర్గమహర్షియు, భార్గవుఁడు, కకుభుఁడు శుక్రాచార్యుఁడు సుమంతుమహర్షియు త్రికుఁడు కంకుఁడు, వైశంపాయనుఁడున్ను తదితరమునులున్ను తమతమ భార్యలతో పుత్రులతోఁడను జనుదెంచిరి మరియు ప్రధాన దేవతా గణంబులు సామాన్య దేవతలును లోకపాలురును బ్రహ్మదేవుఁడు స్వపత్నీపరివారయుతుఁడై మూర్తిమంతములైన వేదములతోఁడను నారాయణుఁడు తన పరివారముతో గూడ దక్షునిచే నాహ్వానింపఁబడి యరుదెంచినవారు. అంత దక్ష ప్రజాపతి వారివారికి తగినట్లు విశ్వకర్మచే మనోహరభవనములను నిర్మింపఁజేసి వసతుల నేర్పరచెను.

ఇవ్విధము కనఖల హరిద్వారము దగ్గర క్షేత్రము నందు జరుపఁబడు యజ్ఞమున భృగ్వాది మహర్షులు ఋత్విజులుగా నుండిరి. వేదమార్గమును ప్రవర్తింపఁజేయుటకు కమల సంభవుఁడును, యజ్ఞాధిష్ఠాతగా కేశవుఁడును దిక్పాలకులందరు తమతమ ఆయుధములను ధరించి యజ్ఞ రక్షకులుగాను, యజ్ఞము ప్రత్యక్షమూర్తిగాను కనంబడుచుండిరి. అగ్నిహోత్రుఁడు నా హుతులను స్వీకరించుటకు సహస్రముఖములతో ప్రజ్వలించుచుండెను.

దక్ష యజ్ఞమునందు ఎనుబదియెనిమిది (88) వేల ఋత్విజులును అరువది నాలుగు (64) వేల నుద్గాతలును అధ్వర్యులును హోతలును ప్రవర్తించుచుండిరి. సప్తర్షులు గాథల (వేదములోని చరిత్రలఁను గానముఁజేయుచుండిరి మరియు గంధర్వులను విద్యాధరులను సిద్ధులను ఆదిత్యులను నాగదేవతలకు బ్రాహ్మణులను రాజర్షులను రాజమంత్రులను వసువులు మున్నగు గణదేవతలను యజ్ఞకర్తయగు దక్షుఁడు ఆహ్వానించెను.

దక్షుఁడు దీక్షాయుక్తుడైవేడుకతో శుభముల నన్నిటిని గావించియు యజ్ఞవేదికయందు భార్యతో గూడ శోభించుచుండెను. కాని చెడు విచారము గలవాడగుటఁ జేసి శంకరుఁడు - తల పుఱ్ఱెలం దాల్చువాడని తలచి పిలువకుండెను. తన కుమార్తెయు అట్టివాని భార్యయని భావించి సతీదేవి నాహ్వానింపలేదు. ఇట్టి యజ్ఞము జరుగుచుండగా ఋత్విజులు మున్నగు వారందరు తమ తమ కార్యములయందు నిమగ్నులగుచుండిరి. అట్టితఱి ధధీచిమహర్షి - సర్వేశ్వరుఁడగు శంకరుఁడు రాకుండుటను గాంచి మిగుల విచారపడియు దిగువ విధము వక్కాణించెను.

దేవర్షి ముఖ్యులారా? దక్షా? దేవవరేణ్యులు, మునులు, లోకపాలురు, తదితరులందరు నీ యజ్ఞమునకు వచ్చినను శంకరుఁడు లేనిది యజ్ఞము శోభించుట లేదు.



శ్లో॥ యేనైవ సర్వాణ్యపి మంగళాని - భవంతి శంసంతి మహావిపశ్చితః।
సో౽సౌ నదృష్టో౽త్ర పుమాన్ పురాణో - వృషధ్వజో నీలగళః పరేశః॥

ఎవని సన్నిధి వలన సమస్త కార్యములు మంగళప్రదంబులగునని విజ్ఞానులైన గొప్పవారు పలుకుదురో అట్టి పురాణపురుషుఁడు వృషభధ్వజుఁడు నీలకంఠుఁడు బ్రహ్మ విష్ణ్వాదులను మించినవాఁడగు శంకరుఁడిచట కనబడుటలేదు. మరియు అమంగళములైనను ఏమహానుభావుని సంబంధము వలన శుభములగునో అట్టి సర్వ మంగళాధిపతి యీ జన్నమునకు రాలేదెందులకు? కావున నో దక్షా బ్రహ్మదేవునితో గాని విష్ణుమూర్తితో గాని దేవేంద్రునితో గాని లోకపాలురతో గాని సిద్ధులను మునులను వెంటనిడి త్వరలో శివుని పిలిపించుము! లేదా మీరందరును కైలాసమునకుఁజని దాక్షాయణితో గూడ మహేశ్వరుని తీసుకొని రండు! సాంబశివుఁడిటకు వచ్చినచోఁ నిదియంతయు పవిత్రంబగును. శివుని స్మరించినంత మాత్రమున మనము ఆచరించు పుణ్యము సంపూర్ణంబగునని తెలియుము! ఒకవేళ శంకరు నాహ్వానింపనిచో నీ యాగము పరిపూర్ణము కాజాలదు.

ధధీచిసంభాషణము నాలకించిన దక్షుఁడు క్రోధతామ్రాక్షుఁడై గర్వముతో అవివేకము తోడను పరిహసించుచు "దేవతలందరికి మూలస్వరూపుడైన నారాయణుఁడు లోకపితామహుండైన బ్రహ్మదేవుండును వేదములు వేదాంతములు వివిధములైన ఆగమములును దేవేంద్రుఁడును సురగణంబులును యజ్ఞమునకు రాదగినట్టి వేదవేదార్థతత్త్వజ్ఞులును ప్రశాంత స్వభావులందరును రాగా రుద్రునితో నెట్టి ప్రయోజనము? పూర్వము బ్రహ్మదేవుఁడు చెప్పినందున నాతనికి నాకుమార్తె నొసగితిని కాని యాతనియందు నెట్టి విశేషము కనబడుటలేదు. కులీనుఁడు కాడు. తల్లిదండ్రులులేరు. భూతప్రేతపిశాచములతో తిరుగాడును ఆతని నెవరును సులభముగా నాశ్రయింపఁజాలరు. కావున నట్టి రుద్రుని యీ పవిత్ర కార్యమునకు పిలువకుంటిని ధధీచీ! మరల నీ విషయము నుగ్గడింపకుము. మీరందరు నా యజ్ఞమును సఫలముగా ముగింపజేయుడు!" అని వచింపగా ధధీచి మహర్షి "దక్షా! నీవుచేయునది యజ్ఞము కాదు. శివుని నిరాకరించి నందున నీ వినాశము త్వరలోనే కాగలదు" అని సమాధానముఁజెప్పి తానొకఁడే యజ్ఞవాటిక నుండి నిజాశ్రమమునకుఁ జనినవాడు. అటులే శివభక్తులైన అగస్త్యాది మహానుభావులందరును దక్షునకు దక్షయజ్ఞమునకును శాప బొసంగి తమ తమ నెలవులకు నేగిరి. అంత శివద్రోహియగు దక్షుఁడు పరిహసించుచు "శివప్రియులైన ధధీచ్యాదులు నీ యజ్ఞ ప్రదేశమునుండి వెడలిరి గావున నియ్యది పూర్వము కంటెచు శుభప్రదమైనదని భావింపుడు! దేవర్షులారా? ఇంకొక యథార్థమును చెప్పుచున్నాను. మూఢబుద్ధికలవారు మిథ్యావాదపరులు వేదబాహ్యులు దురాచారులు యజ్ఞమున పాలుగొనగూడదు. ఇక నిటనున్న మీరందరు విష్ణుపరాయణు లగుటఁజేశి వేదమార్గ ప్రవర్తకులై నాయజ్ఞమును సఫలముఁ జేయుఁడని" ప్రార్థించెను.

ఇట్టి దక్ష వాక్యము నాకర్ణించి విష్ణ్వాది దేవతలు మునులును శివమాయామోహితులై యజ్ఞ కార్యములను నిర్వహించుచుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పంచవింశాధ్యాయము.





# షట్త్రింశాధ్యాయము

## (సతీదేవి - దక్షయజ్ఞమునకు వెళ్ళుట)

కనఖలక్షేత్రమునందు దక్ష ప్రజాపతి యజ్ఞము నొనర్చుచుండగా సతీదేవి కైలాస పర్వతముపై మేలుకట్టుతో కూడిన విలాస భవనమునందు సఖురాండ్రతో కూడి పలుతెఱంగల వినోదములఁజరుపు చుండెను. అట్టితఱి చంద్రుఁడు రోహిణీదేవిఁదోడ్కొని దక్షుని యజ్ఞమునకుఁ జనుచుండెను. అంత సతీదేవి గాంచి తన చెలికత్తెయగు విజయతో విచారింపఁజేయగా చంద్రుఁడు దక్షయజ్ఞముఁదగు సమాచారము నంతయు వివరించి యటకు వెళ్లుచున్నానని చెప్పిన యుదంతమును విజయ సతీదేవికి తెలిపెను. అప్పుడు "దక్షుడు నా తండ్రి; వీరిణి నా తల్లి; వీరిరువురికిని ప్రియమైన కుమార్తెను గదా! నన్ను ఎకందులకాహ్వానింపలేదు. ఇద్దాని కారణమును సర్వాంతర్యామి యగు శంకర ప్రభువు నడుగుదు" నని నిశ్చయించుకొని వేగమే శంకరుని సన్నిధికి నేతెంచి శివునిచే గారవింపఁబడి శివాంకము నందాసీనయై "దేవా! మజ్జనకుఁడైన దక్షుఁడు యజ్ఞమును చేయుచున్నవాడు. అందు దేవతలు ఋషులు పాలుగొనినవారు. కావున నీ వెందులకు దక్షయజ్ఞమునకు బయలు దేరుచులేవో తెలియుట లేదు. అప్తబంధువులతో కూడియుండుట సహృదయుల ధర్మము గదా! అందువలన నన్ను వెంట నిడుకొని యిప్పుడే జన్నమునకు వెళ్లుటకు సంసిద్ధుడవు కమ్ము!" అని ప్రార్థింప శంకరుఁడు దేవి కిట్లనియె.

"సతీ! నీ తండ్రి నన్ను ద్వేషించువాడు; అట్టి యజ్ఞములో పాలుగొనిన దేవర్షులందరు నవివేకమూఢులై ప్రవర్తించుచున్నవారు మరియు ఆహ్వానము లేకుండా పరగృహములకు వెళ్ళువారు మరణమును మించిన యవమానమును పొందుదురు. అట్టివాడు దేవేంద్రుఁడైనను చులకన యగును. కావున నట్టి ప్రయాణము అనర్ధకంబని తెలియుము! అందువలన నీవుగాని నేనుగాని దక్షయజ్ఞమునకు వెళ్ళగూడదని యదార్ధముగా గ్రహింపుము!

లోకమున తనవారు ఆడిన చెడుమాటలకు కలుగు బాధ - పగవారివల్లను కలుగఁ జాలదు. సద్గుణములెన్నియున్నను వివేక విజ్ఞానములులోపించిన దుర్మార్గులు గొప్పవారి ప్రభావమును గుర్తెరుఁడ జాలరు.

అంత సతీదేవి శంకరభాషితమునకు లోలోన నుద్రేకముగలదై "సర్వేశ్వరా! నీ సన్నిధి వలన యజ్ఞము సఫల మగునని తెలియఁజాలక నా తండ్రి నిన్నుపిలువ లేదు. కావున నచటివారందరు చూచుచుండగా దక్షుని యుద్దేశమును తెలియఁగోరుచున్నాను. అందుకు నీవేళనే దక్షయజ్ఞవాటికకు బయలుదేరుదును. అనుజ్ఞ నిమ్మని" వేడుకొనఁగా శంకరుఁడు "దేవీ! అవశ్యముగా వెళ్ళవలెనని నీ యిష్టమున్నయెడల నందికేశ్వరునిపై నధిష్ఠించి రాజోపచారములతో బయలుదేరుము!" అని యాజ్ఞాపించెను.

అంత సతీదేవి యలంకరిరంచుకొని సఖురాండ్రతో గూడ జనకుని యజ్ఞవాటికకు బయలుదేరినది. అట్టితఱి నామె ఛత్రచామరాదులతో మేలివస్త్రములతోడను రత్నాభరణములతోడను విరాజిల్లుచుండినది. సతీదేవి వెంట నరువదివేల రుద్రగణములు పయనించినవి. అవ్విధము దక్షయజ్ఞ స్థలమును సతీదేవి

చేరుకొనఁగా ప్రమథగణము లచ్చోట సతీశివుల లీలావిలాసచరిత్రమును గానముఁ జేయుచుండిరి మరియు యజ్ఞవాటిక యందలి నారికేళోదకముల నుత్సాహముతో త్రాగుచుండిరి. మరియు జగద ప్రయాణించుచుండగా మూడు లోకముల యందు గొప్ప సంతోషముగా నుండెను.

*ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఇరువదియారవ అధ్యాయము.*

## సప్తవింశాధ్యాయము

దాక్షాయణి దేవి – సురాసుర మునీంద్రులచే నిండియున్న దక్ష సదనమునకు జని మహాద్వార చెంత నందికేశ్వరునిపైనుండి డిగ్గి తానొకతయే లోనికి వెళ్ళగా దక్షపత్ని యగు అసిక్నీదేవి, తోబుట్టు నాపెను సముచితముగా నాదరించిరి. కాని దక్షుఁడు మాత్ర మా సతీదేవిని చూచియు చూడ నట్లుండె తదితరులందరును దక్షునకు వెఱచి పలుకరింపకుండిరి. అంత సతీదేవి – జననీజనకులకు నమస్కరి యజ్ఞ సందర్భమును గాంచుచుండెను. అందు విష్ణుమూర్తి మున్నగు దేవతలకు హవిర్భాగము లేర్పడుట శంకరునకు హవిర్భాగము లేకుండుటయు గానంబడుచున్నందున సంతప్తహృదయయై దక్షుని సమీపి "చరాచరప్రపంచము నంతయు పవిత్రముఁజేయు శంభు నెందులకు పిలువకుంటివి? శంకరు యజ్ఞమనియు యజ్ఞాంగమనియు యజ్ఞవిదులలో మిన్నయనియు యజ్ఞకర్తయనియు యజ్ఞదక్షిణ యని శంకరుని స్మరించినంత మాత్రమున సర్వంబును పావనంబగుననియు అతడు లేకుం చేయబడునదంతయు యపవిత్రంబగుననియు తెలియకుంటివా? మరియు శంకరుని సామాన్య దేవ భావించి యాతనిఁజేరదీయకుంటివా? ప్రస్తుతము నీ బుద్ధి విపరీతమైనది! కావున నథముండ చెప్పవచ్చును.

శ్లో॥ విష్ణుబ్రహ్మాదయో దేవా – యం సంసేవ్య మహేశ్వరం ।
ప్రాప్తాః స్వపదవీం సర్వే – తం నజానాసి రే హరమ్ ॥ ౧౪

నారాయణుఁడు బ్రహ్మదేవుఁడు మొదలగు నమరులు మహేశ్వరు నారాధించియే తమ వైకుంఠాదిపదవులఁ బొంద గలిగిరి. అట్టి శంకరుని గుర్తెరుగకున్నావు! మరియు నీ విష్ణుబ్రహ్మా మునులును తమ ప్రభువైన శంకరుఁడు లేనట్టి యజ్ఞమున కేలవచ్చినారు?" అని దక్షుని మందలి కేశవుఁడు మున్నగువారిని గురించి యిట్లనియె.

నారాయణా! నీవు మహాదేవుని తత్త్వముఁ దెలియనివాడవా? శ్రుతులాతడే సగుణుడని నిర్గుణుఁడనియు వచింపుచున్నవి గదా! మున్ను ఎన్నియోమారులు నానావిధ స్వరూపములతో ని శిక్షించిన నింకను సుబుద్ధి కలుగదయ్యెను. కేవలము హవిర్భాగము నాశించి యిందు పాలుగొం

బ్రహ్మదేవా! పూర్వము నైదుముఖములు గలవాడవై గర్వించితివి గాన నిన్ను చతుర్ముఖ శంకరుఁడు గావించిన యంశమును మఱచితివా? దేవేంద్రా! ఒకప్పుడు మహాదేవుఁడు తన క్రోధా నీ వజ్రాయుధమును దహించినయుదంతమును విస్మరించితివా? అమరులారా? శంకరుని సామర్థ్య

పేక్షించితిరా? అత్రి వసిష్ఠాదిమహర్షులారా? మీరెందు కిచ్చోటి కేతెంచితిరి? పూర్వకాలము దారువనమున మహేశ్వరుఁడు భిక్షుకుఁడై సంచరించి ఋషులందరి కర్మవాదమును ఖండింపలేదా? వేదములు వేదాంగములు శాస్త్రములన్నియు మూర్తీభవించి శివరహితమైన యజ్ఞమునకు వచ్చుటఁజూడ నాశ్చర్యముగా నున్నయది యథార్థముగా విచారింప వేదాంతవేద్యుఁడైన మహేశ్వరుని స్వరూపమును సామాన్యులైన మీ బోంట్లు కనుగొనఁజాలరనియే చెప్పవచ్చును.

బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు భృగ్వాది మహర్షులును సతీభాషితమును విని యేమియు సమాధానము జెప్పఁజాలక మిన్న కుండిరి. అంత దక్షుఁడు – తన కూతురాడిన మాటలకు నలుకఁజెంది చుఱుకైన చూపుతో చూచుచు "సతీ ! పలుమాటలేల? నీతో నెట్టి ప్రయోజనంబు లేదిచట; వెళ్ళితే వెళ్ళుము! ఉంటే ఉండుము! ఎందుకిటకు వచ్చినావు? నీ భర్త – యమంగళుఁడు గావున నాతని నెవరును గమనింపరు మరియు నీ పతి – కులీనుఁడు కాదు. వేద ధర్మములకు కట్టుబడి యుండనివాడు. భూతప్రేతపిశాచాదులాతని వెంట నంటియుండును. అందువలన నాతనిని యజ్ఞార్థము పిలువలేదు. యజ్ఞమనఁగా? దేవతలు ఋషులు పాలుగొనునది కదా! నేను బ్రహ్మదేవుని మాటవినిమందబుద్ధి గలవాడనై వినయ వివేకములు లేనట్టి రుద్రునకు నిన్ను ఎందుకు సమర్పించితి నని బాధపడుచున్నాను. కావున శాంతించుము! వచ్చిన దానవు నూరటఁజెంది నా యజ్ఞములో హవిర్భాగమును పరిగ్రహింపుము!" అని వచింపగా మూడులోకముల వారి మన్ననల నందుకొను సతీదేవి – తన జనకుఁడు శివనిందను చేయుటను గమనించినదై పట్టరాని యావేశముతో లోలోన గుందుచుండెను. మరియు నిట్టితఱి నా భర్త యగు పరమేశ్వరునకు ముఖమెట్లు చూపెట్టుదును? ఒకవేళ నతికష్టముగా శంకరుని సమీపించినను అతడు అడిగినదానికి నుత్తరంబేమని యిత్తును? అని విచారించి చెడుబుద్ధి గల దక్ష ప్రజాపతికి జగదంబ యిట్లనియెను.

శ్లో॥ యో నిందతి మహాదేవం - నింద్యమానం శృణోతివా,
తావుభౌ నరకం యాతః - యావచ్చంద్ర దివాకరౌ ॥ ౩౮

శివుని నిందించువాడు శివనిందను వినువాడు నిద్దరును సూర్యచంద్రులుండునంత వరకు నరకముఁ బొందుదురు. మరియు సమర్థుండగునేని శివనిందకుని నాలుకను ఛేదింపవలెను. అశక్తుండగుచో చెవులు మూసుకొని యటనుండి వెడలవలెను. ఇట్లుచేశిననే గాని శివనిందా శ్రవణదోషము తొలగదు. (అనఁగా పైవిధముల నాచరించు వారికే శివనిందాశ్రవణదోషము తొలగునని భావము.) ఇవ్విధము శ్రుతికోవిదులు చెప్పుచున్నారు గాన జనకా? శివనిందను చెవులార విన్నట్టి యీ దేహమెందులకు? అగ్నిఁ బ్రవేశింతును గాక! మరియు శంకరుఁడు తనకు చెప్పిన సుభాషితమును స్మరించుచు దక్షుని గురించియు బ్రహ్మవిష్ణ్వాదులను గురించియు మునులఁ గురించియు సతీదేవి – "నాయనా! దక్షా! శివుని తూలనాడితివి కావున పశ్చాత్తాపముఁ జెందుదువు! ఇకముందు జీవితమున గొప్ప దుఃఖము ననుభవింతువు! తరువాత నరకయాతనకు గురియగుదువు! లోకమున ప్రియుఁడుగాని యప్రియుండుగాని లేనట్టి శంకరునకు నీవొక్కడివే విరోధివి; నీచులు గొప్పవారినెప్పుడును ద్వేషించుచుందురు. మహాత్ముల పాదకమలములఁదగు ధూళితో తమ యవివేకమును పోగొట్టుకొనిన వారు ప్రమాదమున నైనను సత్పురుషులను నిందింపరు.

మఱియు

శ్లో॥ శివేతి ద్వ్యక్షరం యస్య - నృణాం నామ గిరేరితం ।
సకృత్ప్రసంగా త్సకల - మఘ మాశు నిహంతి తత్ ॥ ౪౨

దేవమానవులలో నెవడైన బుద్ధి మంతుఁడు ప్రసంగవశమున నొక్క పర్యాయము "శివ" అను రెండక్షరములఁబలుకు నెడల నట్టివాని దురిత మంతయు నంతరించును. లోకపావనుండనియు ఎట్టివారును శివశాసనము నతిక్రమింపఁజాలరనియు సర్వేశ్వరుండనియు కీర్తింపబడు శివుని ద్వేషించు నీవు నశుభములను కొని తెచ్చుకొనుచున్నావు; ఇంకను జనకా! నా యంతిమ సందేశమును స్థిరమతి నాకర్ణింపుము! యోగులు భోగులును శివుని పాదారవిందములను తమ మనోభృంగములతో నాఘ్రాణించుచుందురనియు బ్రహ్మానందా స్వాదలోలురందరిచే సర్వాంతర్యామిగా బ్రహ్మరసముఁ గ్రోలఁ జేయువాడుగాను శివుఁడు భావింపబడువాడనియు అర్థార్థుల యభీష్టములను వడిగానొసగువాడనియు తెలియుము! విజ్ఞానమూఢుడవై సమస్త జగద్బాంధవుని ద్వేషించుచున్నావు! నీవుదక్క నితరులెవరును శివుని యమంగళునిగా గుర్తింపజాలరు. శ్మశానమున జడలను విప్పారి కపాలములఁదాల్చి యుండు శివుఁడు కరుణామయుండని కనుగొని యా దేవదేవుని నిర్మాల్యమగు విభూతిని పుష్పములను బిల్వమును బ్రహ్మాదిదేవతలు సనకాదిసిద్ధులు భక్తులందరును తలఁదాల్చుచుందురు. ప్రవృత్తమనియు నివృత్తమనియు వేదమునందు రెండుతెఱఁగులు గల ధర్మమును జిజ్ఞాసువులు ఈశ్వర ప్రీత్యర్థము నడచుచుందురు. ఇట్టి ధర్మము పరమాత్మను బద్ధునిఁ జేయఁజాలదు. అస్మదాదులు అవలంబించు ఉత్తమస్థానములు నీకు లభింపకుండుగాక! యజ్ఞశాలయందలి ఆహుతులు ధూమమార్గమున ప్రసరించి క్షీణించుగాక! కావున జనకా! ఇప్పటికిని మించినదేమియులేదు. ఎల్లకాలము అవధూతలతో సేవింపఁబడు శంకరునిపై పగ బూనకుము! దురభిమానమును దూరమొనర్పుము! దుష్టవిచారమును మనస్సునరానీయకుము. వేయేల? అన్నివిధముల ననర్హుడవైతివి గాన నీ వలన నుద్భవించిన నీ దేహము నొల్లను లోకమున మంచివారిని నిందించువారితో చెలిమి కూడనప్పుడు ఉత్తమోత్తముఁడైన సదాశివు నసహ్యించుకొను నీతో సంబంధము కూడదని వేరుగా చెప్పనేల? ఒకవేళ నేనిట్లే కైలాసమునకుఁ జనినచో "దాక్షాయణి" యని విభుఁడు పిలిచినపుడు నాకెంతయో పరితాపము కలుగును. దేవతలారా? ఋషులారా? మీరీ యజ్ఞములో పాలుగొనుట సర్వదా అనుచితంబైనది. శివనిందాప్రియులగు మీయందరికి త్వరలోనే శాస్తి జరుగుగాక!

ఇంత మాత్రము వచించి సతీదేవి ప్రాణవల్లభుఁడగు శివుని తన హృదయము నందిడుకొని తదేకధ్యానతత్పరయై యుండెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో సప్తవింశాధ్యాయము.**

# అష్టవింశాధ్యాయము

## (సతీదేహ త్యాగము)

శివధ్యాన తత్పరయగు సతీదేవి సుఖాసీనయై శుద్ధజలము నాచమనముంజేసి పరిశుభ్రవస్త్రముం గప్పుకొనియు కనులు మూసికొని శంకరుని స్మరించుచు యోగమార్గరీతిని ప్రాణాపానవాయువులను సమానములుగా నినర్చి నాభిచక్రము నుండి యుదానమును లేవదీసి హృదయము నందునెలకొలిపి యటనుండి కంఠముద్వారా భ్రూమధ్యస్థానమునకు గొంపోయి యాత్మజ్యోతిఃబ్రకాశింపఁజేయుచు యోగాగ్నిని తన శరీరమునుదహింపగా నద్ది భస్మమయ్యెను. అట్టితతి యామె తన యంతఃకరణమున శివుని చరణ కమలమునే స్మరించుచుండెను. అట్టి దృశ్యమును భూచరులు ఖేచరులందరును గాంచుచు హాహాకారముంజేయుచుండిరి. ఎవడో దుర్మార్గుఁడగు సతీదేవినలకఁజెందించి ప్రాణత్యాగమును చేయించినాడనియు, గౌరవనీయురాలగు శంకరపత్ని - తనపతి యనాదరణమును చూడలేక దేహత్యాగము నొనర్చిన దనియు, దక్షప్రజాపతి శివుని యున్నతి నోర్వజాలనందున గొప్ప యపకీర్తిపాలగుననియు, తన ఔరసపుత్రికయని విచారింపక శంకరుని యందలి ద్వేషముచే సతీదేవిని చంపుకొని నందున మహానరకదుఃఖముల ననుభవించుననియు, లోకులు పలుకుచుండగా ప్రమథగణములు నుద్రేకముం జెంది హాహాకారములంజేయుచు దక్షయజ్ఞముంగూర్చి ధిక్కారములఁ బలుకుచు నెలుగెత్తియఱచుచు తమ తమ వాద్యములను మ్రోగించుచుండిరి. మరియు సతీదేవి భస్మమగుటను చూడఁజాలక పరితాపమున కొందరు తమ అవయవములను ఛేదించుకొనిరి. మరికొందరు తీక్ష్ణఖడ్గధారలచే శీర్షంబులను ఖండించుకొనిరి. ఇవ్విధము అంతరింపగా మిగిలిన గణములు క్రోధావేశమున దక్షుఁదునుమాడుటకు నుద్యమింప భృగుమహర్షి - దక్షిణాగ్ని యందు యజుస్సులతో హవనముచేసి పుట్టించిన ఋభువులను వారికి ప్రమద గణములకును ఘోరమైన పోరాటము జరిగెను. అంత శివగణములు కొంతవరకు పోరాడి యటనుండి బయలుదేరినవి. అట్టి సందర్భమును గమనించుచు ఇంద్రాదిలోకపాలురు ఋషులు తదితరులందరును మిన్నకుండిరి. అవ్వారిలో కొందరు విష్ణువును యజ్ఞేశ్వరునిగా భావించుచు యజ్ఞవిఘ్నములను నివారించుమని ప్రార్థించుచుండిరి. ఎటులైన నీ జన్నము కొనసాగదని విష్ణ్వాది దేవతలు తమ తమ మనంబుల యందు నిశ్చయించు కొనుచుండిరి. శివద్రోహియు బ్రహ్మ బంధువునగు దక్షుని యజ్ఞము ఇవ్విధముగా భగ్నమగుట నెవరు నివారింపగలరు? అంతయు శివేచ్ఛాధీనము గదాయని సూతుఁడు వక్కాణించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వు" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో అష్టావింశాధ్యాయము.





# ఏకోనత్రింశాధ్యాయము

## (దక్షుని గురించి ఆకాశవాణి చెప్పుట)

అట్టితఱి బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు వినుచుండగా ఆకాశవాణి అనఁగా పరమేశ్వరుని యథార్థవాక్యము దక్షునిగురించి దిగువ విధము వక్కాణించినది.

దురాచార పరాయణా దక్షా! అనర్ధకరంబగు కార్యము నొనర్చుచున్నావు; శివభక్తాగ్రేసరుఁడగు దధీచి మహాముని చెప్పిన సదుపదేశమును పెడచెవిఁబెట్టితివి. అతఁడు నిన్ను శపించి వెళ్ళినప్పుడైనను మేలుకొనకుంటివి. అటుపిమ్మట నీ కుమార్తె నవమానించితివి. జ్ఞానహీనుడవై సతీశివులను గానకుంటివి నీ యహంభావము నిరుపయోగమైనది. సతీదేవిని సామాన్యురాలినిగా భావించితివో ఏమో; అపె సత్పురుషులచే నారాధింపఁబడుచు సర్వపాపఫలముల నొసగునది; మరియు నామె శంకరుని యర్ధాంగియై త్రిలోకజననియై భక్తులకు సకల సౌభాగ్యములను ప్రసాదించునది; ప్రతిదినము సతీదేవిని పూజించినవారికి సంసార భయము దూరమగుటయేగాక మనోభీష్టములన్నియు ఫలించును. అన్ని తెఱఁగుల బాధలు శమించును. ఇంక నా యాదిశక్తి నారాధించినవారికి కీర్తియు సంపదయు చేకూరును. భుక్తి ముక్తులొదవును. ఆమెయే జగమును సృష్టించునది; కాపాడునది; కల్పాంతమున సమస్తంబును సంహరించునది; ఆమెయే మాయ యనఁబడును. విష్ణుమూర్తిని బ్రహ్మదేవుని ఇంద్రచంద్రవహ్ని సూర్యదేవాదులను పుట్టించు ఆదిశక్తియామెయేను; తపోధర్మదానాది పుణ్య ఫలముల ననుగ్రహించునదియు దుష్టులను సంహరించునదియు; శంభుశక్తియు నగు సతీదేవిని భార్యగా బడసిన మహాదేవునికి యజ్ఞభాగమును మూఢుడవై సమర్పింపకుంటివి.

శ్లో॥ శంభుర్హి పరమేశానః - సర్వస్వామీ పరాత్పరః ।
విష్ణుబ్రహ్మాది సంసేవ్యః - సర్వకల్యాణకారకః ॥ ౧౫

శంకరుఁడు గొప్ప శాసకుండనియు సర్వాధికారియనియు పరాత్పరుఁడనియు విష్ణుబ్రహ్మాదులాతనిని సేవింతురనియు శుభముల నన్నిటి నొనగూర్చుననియు తెలియుము! శంకరుని దర్శనమును కోరియే సిద్ధులు తపించుచున్నావారు. యోగులు యోగము నభ్యసించుచున్నవారు. శంకరుని దర్శనమువలనే అనంతములైన ధనధాన్యములు సమకూరుటయే గాక యజ్ఞయాగాదులు సిద్ధించును. మరియు మహాఫలంబగు మోక్షంబును చేకూరును. శివుఁడే జగన్నిర్మాణదక్షుండనియు పదునెనిమిదివిద్యల కధిపతియనియు సర్వమంగళుండనియు తెలియఁజాలక నాతని శక్తియగు సతీదేవిని సత్కరింపకుంటివి గాన నీ యజ్ఞమునకు వినాశము తప్పదు. పూజనీయురాలగు జగన్మాతనాదరింప కుండుటచేత యమంగళము త్వరలో సంభవించును. ఆదిశేషుఁడు తన వేయి శిరస్సులతో ఆదిశక్తిదగు పాదధూళిని ప్రతిదినము మోయుచున్నవాడు ఎవనిపాదపద్మముల నారాధించి విష్ణువు జగద్రక్షకుండయ్యెనో బ్రహ్మదేవుఁడు సృష్టికర్తయయ్యెనో అట్టివాని ప్రియురాలు సతీదేవియని తెలియుము! ఇంద్రాది లోకపాలురును శంకరుని చరణకమలములను పూజించియే తమ తమ పదవులను పొందగలిగిరి. జగజ్జనకుడగు

శంకరుని జగజ్జననియగు ఆదిశక్తిని సన్మానింపని నీకు శ్రేయస్సెక్కడిది? నీకు దౌర్భాగ్య మావహించినది. సంకటములురానున్నవి. శంకరు నారాధింపక శుభము నొనగూర్చుకొందునను నీ గర్వము అంతరించు సమయమాసన్నమైనది. శంకరుని విరోధించు నీకు నీ దేవతలలో నెవఁడు సహరించునో చూడవలసియున్నది. ఒకవేళ దేవత లెవరేని సహాయపడునో నట్టివారునిప్పునందు మిడుతలవలె నశింతురు. నీ ముఖము దహింపఁబడుగాక! యజ్ఞము ధ్వంస మగుగాక! నీ సహాయకులందరును నష్టపడుదురు గాక! దేవతలారా? మీ నివాసములకు చనుఁడు! ఒకవేళ నీ యజ్ఞమంటపమునుండి వెళ్ళకుండినచో మరణింతురు! మునులారా? నాగదేవతలారా? వెళ్ళుడు! నారాయణా? ఈ యజ్ఞవాటికను విడువుము! ఒకవేళ వెళ్ళకుండినయెడల నీకు కీడు తప్పదు.

ఇవ్విధము యజ్ఞాగతుల నందరి నుద్దేశించి ఆకాశవాణి ప్రవచించి విరమించినది. అట్టి ఆకాశవాణి నాకర్ణించిన దేవతలు మునులును విస్మితచిత్తులై విచారనిమగ్నులైరి.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏకోనత్రింశాధ్యాయము.**

## త్రింశాధ్యాయము

### (వీరభద్రుఁడు జన్మించుట)

భృగు మహర్షి గావించిన మంత్రహవనముఁదగు బలమున పరుగిడిన శివగణములలో కొందరు కైలాసమునకుఁజని శివుని సమీపించి ప్రణమిల్లియు "దేవదేవా శరణాగతులము, మమ్ము రక్షింపుము! గర్వాహంకార పూరితుండగు దక్షుఁడు – నిర్జరులు చూచుచుండగా సతీదేవి నాదరింపలేదు. మరియు యజ్ఞమున హవిర్భాగమును నీ కొసగకుండుటయే గాక పలువిధముల నిన్ను తూలనాడినవాడు. కావున సతీదేవి కోపించి తన శరీరము నగ్ని యందు పరిత్యజించినది. అద్దానఁజేశి పదివేల రుద్రగణంబులు తత్కాలముననే ప్రాణములను గోలుపోయినవి. మరి కొందరు నాయుధములతో నవయవములను ఛేదించుకొనిరి. మేమైతేనో కఠినచిత్తుల మగుటచే ప్రాణములను నిలుపుకొని యింతవరకు రాగలిగితిమి" అనవుఁడు మహాదేవుఁడు గతమునంతయు బాగుగా గుర్తెరుగఁదలచి నారదుని స్మరింపగా దివ్యదర్శనుండగు నా దేవర్షి వేగమే నేతెంచి మోకరిల్లెను. అంత శంకరుఁడు దక్షయజ్ఞముఁదగు వృత్తాంతము నడుగగా నారదుఁడు జరిగినదంతయు చెప్పినందున మహేశ్వరుండతిక్రుద్ధుఁడై లోక సంహారముఁజేయునో యన్నట్లు నుండిపడుచు తన జడ నొకదానిని పెఱికి కైలాసపర్వతముపై చఱచెను. అట్టి జడ – రెండుతునకలై మహాప్రళయముఁదగు భయమును గొలుపు గొప్ప ధ్వనిఁజేయుచుండెను. జడఁదగు మొదటిభాగమునుండి మిగుల జడియఁజేయు గణాధీశ్వరుఁడును రెండవభాగమునుండి భూతకోటి సమావృతయైన మహాకాళి యుద్భవించెను.





శ్లో॥ స్వ భూమిం విశ్వతో వృత్వా - చాత్యతిష్ఠ ద్దశాంగులమ్ ।
ప్రళయానలసంకాశః - ప్రోన్నతో దోఃసహస్ర వాన్ ॥ 33

ఆ మహాపురుషుఁడు భూమి మొదలుకొని ఆకసము వరకు వ్యాపించి దశాంగుళ పరిమాణముగా శేషించియుండెను. ప్రళయాగ్నివలె ప్రకాశించుచుండెను. వేయిచేతులతో ఎత్తైనవాడుగా నుండెను. మరియు నీశ్వరుని కోపముందగు నిట్టూర్పువలన సన్నిపాతము మున్నగు నూట పదమూడు తెఱఁగుల జ్వరములు నుద్భవించెను. జ్వరములన్నియు మూర్తీభవించి సమస్తంబును దహించునా యన్నట్లు గన్పట్టుచుండెను. తరువాత గణాధీశ్వరుండగు వీరభద్రుఁడు పరమేశ్వరునకు ప్రణమిల్లి కృతాంజలియై దిగువ విధము మాటలాడెను.

"సూర్యచంద్రాగ్నులు నేత్రములుగా కలిగిన మహేశ్వరా? నేనేమిచేయవలెనో త్వరగా నాజ్ఞాపింపుము! సముద్రములను శోషింపజేయవలెనా? పర్వతములను క్షణకాలముననే చూర్ణింపవలెనా? అథవా బ్రహ్మాండమును భస్మముఁజేదునా? దేవతలను మునులను శిక్షించుదునా? ప్రాణులందరి నిట్టూర్పులను హరింపవలెనా? అందరినొకేమారు హింసిపవలెనా? నీ యనుగ్రహమునఁజేశి నాకసాధ్య మెద్దియులేదు. పరాక్రమములో నాతోసరిఁదూగువాడు లేడని చెప్పవచ్చును. నీవు నిర్దేశించిన కార్యమును తప్పక సాధింతును. నీ యానతి ననుసరించి సామాన్యుఁడును సంసారసముద్రము నతిక్రమింపజేయఁజాలును. నేనైతే నీ విధేయుడను కావున గొప్ప సంకటమునుగూడ తొలగింపఁజాలుదును. నీవు ఆదేశించిన గడ్డి పఱకయైనను ఘనకార్యము నొనర్పఁజాలును. సంకల్పమాత్రమున సర్వంబు నొనగూర్పఁజాలుదును. ఐనను నేను నీకు ప్రేష్యునిగా నావిర్భవించుటయు నీ యనుగ్రహమునఁదగును. నాశక్తి సామర్థ్యమంతయు నీ కృపావిశేషమని భావించుచున్నాను. నీ యాజ్ఞ లేనది యెవఁడును తృణమును గూడ కదల్పజాలఁడు. దేవతలందరు నీకు విధేయులైనను నేనుమోకరిల్లి వేడుచున్నాను. శరణాగతుడనగుచున్నాను. కుడిదెసనుండు నవయవములు కదలుచున్నందున విజయము సమకూరునని చెప్పఁగలుగుదును. సంతోషము ఉత్సాహము పొంగిపొరలుచున్నవి. నీ పాదపద్మమునందు నా మనస్సునిలచినది. శుభ పరంపర పదేపదే పొడగట్టుచున్నయది. శోభనాస్పదుండవైన నీయందు దృఢభక్తి గలవానికే విజయము మంగళంబును సమకూరును".

ఇట్టి వీరభద్ర భాషితము నాకర్ణించి శంకరుఁడు సంతసించి వీరభద్రా! జయించుము" అని యాశీర్వదించుచు "నాయనా? వీరభద్రా! నా మాటఁజవదాటకఁ బరిపాటించుము! బ్రహ్మపుత్రుండగు దక్షుఁడు నా యందు విరోధముఁబూని యజ్ఞనవశమున కడుగర్వము గలవాడై చేయుచున్న యాగమును ధ్వంస మొనర్పుము!

దేవతలు గాని గంధర్వులు గాని యక్షులు గాని విష్ణుమూర్తిగాని బ్రహ్మదేవుడు గాని దేవేంద్రుడు గాని యమధర్మరాజు గాని యట నెవరున్న నవ్వారి నందరిని దండించుము! దధీచిమహాముని చెప్పిన సద్వాక్యమును పెడచెవినిఁబెట్టి యుండువారి నందరిని ముఖ్యముగా నిన్నెదిరించువారిని కాల్చివేయుము! నన్ను ద్వేషించు దుర్మార్గులను వారివారి భార్యలతోడను పరివారముతోడను దనుమాడుము! విష్ణు దేవతలు మున్నగువారు నిన్నుగాంచి కపటస్తోత్రములతో ప్రార్థించినను మన్నింపకుము! దక్షప్రజాపతి





మొదలగు వారిని గూడ సబాంధవముగా దహించుము! ఇట్లు వీరవిహారముంగావించి వినోదముగా నమృతపానముంజేయుము!

కాల కాలుండు వేదధర్మరక్షకుండు నగు పరమేశ్వరుండు పైవిధము వీరభద్రునాజ్ఞాపించెనని శౌనకాదిమహర్షులకు సూతుండు వచించినవాడయ్యెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో త్రింశాధ్యాయము.**

## ఏకత్రింశాధ్యాయము

### (వీరభద్రుండు దక్షుని యజ్ఞమునకు బయలుదేరుట)

మహేశ్వరుని సంభాషితమును విని వీర భద్రుండు సంతుష్టాంతరంగుడై నమస్కరించి శివాజ్ఞను శిరసావహించి దక్షయజ్ఞధ్వంసమునకై బయలుదేరెను. ప్రళయాగ్ని జ్వాలలను వెడలగ్రక్కు రుద్రగణంబులను కోట్లకొలది శంకరుండు వీరభద్రుని వెంటంబంపు చుండెను.

**శ్లో॥ గణైః సమేతః కిలతైర్మహాత్మా సవీరభద్రో హరవేషభూషణః ।**
**సహస్ర బాహు ర్భుజ గాధిపాఢ్యే - యయౌ రథస్థః ప్రబలో ఽతిభీకరః ॥**

సహస్రహస్తములు శంకరుని వేషము అలంకారములున్ను కలిగి సర్పరాజములను ధరించి రథము నధిష్ఠించియు నతిభయంకరస్వరూపముతో ప్రమథగణములను వెంటనిడుకొని వీరభద్రస్వామి ప్రయాణించెను. వీరభద్రుని రథము మిక్కిలి వెడల్పు పొడవును గలదై పదివేల సింహములతో వహింపం బడు చుండెను. బలవంతములైన మరికొన్ని సింహములు వ్యాఘ్రములు వేలకొలది గజములు పార్శ్వ రక్షకములుగా నుండినవి. అట్టితతి కల్పవృక్షములు వీరభద్రునిపై పుష్పములను కురిపించినవి. శివగణములు వివిధస్తోత్రములతో ప్రశంసించుచుండిరి. వీరభద్రపత్నియగు భద్రకాళికా దేవి – కాళి, కాత్యాయని, ఈశాని, చాముండ, ముండమర్దిని, మహాకాళి, భద్ర, త్వరిత, వైష్ణవి, అనంబడు నవదుర్గలతోడను భూతగణంబులతోడను దక్షయజ్ఞమునకు వీరభద్ర సహచారిణిగా చనుచుండెను.

అప్పుడు విజయసూచకముగా దుందుభులు మ్రోగింపంబడుచుండెను. శంఖములు పూరింపం బడుచుండెను. తదితర నానావిధవాద్యముల ధ్వని వినంబడుచుండెను. ఇట్లు వీరభద్రుని ప్రయాణము నందు పలురకములగు శుభశకునములుప్పతిల్లినవి, కావున నద్ది విహితంబేయని భావింపవలెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏకత్రింశాధ్యాయము.**





# ద్వాత్రింశాధ్యాయము

## (దక్షుని యజ్ఞ వాటిక యందు దుఃశకునములు కనఁబడుట)

వీరభద్రుఁడు భద్రకాళియు రుద్రగణములతో భూతగణములతోడను కైలాసము నుండి ఖనకలక్షేత్రము (హరద్వారము) నకు చనుచుండగా యజ్ఞధ్వంస సూచకములగు నుత్పాతములు చెడుచిహ్నంబులును దక్షయజ్ఞమునందు కనంబడుచుండెను. దక్షుని ఎడమ కన్ను వామభుజము తొడయు కదలుచుండెను. మరియు భూకంపము సంభవించెను. అట్టితతి దక్షుఁడు మధ్యాహ్నమున నక్షత్రములను గాంచుచుండెను. దిసలు మైలపట్టినవి. భానుఁడు చిత్రవర్ణము గలవాడగుటయే గాక వేలకొలది పరివేషము (గాలిగుడు) లతో చుట్టఁబడియుండెను. అగ్నివలె మండిపడు నక్షత్రములు ఆకాశమునుండి పడుచుండినవి మరియు నక్షత్రములు క్రిందిముఖముగలవై వంకరగా నడచుచుండినవి. గద్దలు వేలకొలది నుదయించి దక్షుని తలకాయను ముట్టుటయే గాక తమ రెక్కలతో యాగమండపమునంతయు కప్పుచుండినవి. నక్కలు కూయుచుండెను. తెల్లనితేళ్ళతో కూడిన కొఱవుల వంటి మంటలు యాగస్థలమును వ్యాపించుచుండెను. ధూళితో కూడిన సుడిగాలి వీచుచుండెను. మిణుత పురుగులు పెనుగాలితో కొట్టుకొని వచ్చుచుండెను. ఎట్టకేలకు దక్షుని యజ్ఞముఁదగు విశాల మండపమును ప్రచండవాయువులు పైకి గొంపోయెను. దక్ష ప్రజాపతి మున్నగువారు నిర్నిమిత్తముగానే నెత్తురుఁగ్రక్కుచుండిరి. మరియు నెముకలతో కూడిన మాంసపుతునకలు దక్షాదుల వదనములనుండి బయల్పడుచుండెను. గాలిలోని దీపములవలె నవ్వారందరును వణకుచుండిరి. ఖడ్గధారలచే కొట్టఁబడినవారివలె నందరును వగచుచుండిరి.

రాత్రివేళలందు కమలములు మంచుచే కప్పఁబడినట్లు దక్షాదుల నేత్రములు కన్నీళ్ళతో నిండుచుండెను. రక్తవర్షము కురియుటయేగాక దిశలు చీకటిఁగమ్మియుండినవి. మరియు నప్పుడే దశదిశలయందు మంటలు చెలరేగుచుండెను. ఇవ్విధములగు అరిష్టము లనేకములు పొడసూపుచుండగా నారాయణుఁడు మొదలగు నమరులు వెఱగందుచు మూర్ఛితులై నదీవేగమునకు తాళలేని వృక్షములవలె హోహతులమైతి మనుచు నేలపైకూలుచుండిరి.

వధింపబడిన క్రూరసర్పములవలె నవ్వారు కొంతకాలము పరుండి కందుకము (బంతు) లవలె మఱల లేచుచుండిరి. మరియు నవ్వారు బాగుగా నఱచుచు అడు లకుముకి పిట్టలవలె నేడ్చుచుండిరి. తాబేళ్లవలె నేలపై పొర్లాడుచుండిరి. ఇంతలో నాకాశవాణి దేవతలఁ గురించియు దక్షునుద్దేశించియు "దక్షా! పాపబుద్ధి గలవాడవు; మూఢులలో గొప్పవాడవు, నీ జన్మ వ్యర్థమైనది. నీ యజ్ఞవాటిక యందు గల దేవతలకు నీకును శంకరునివలన మహాదుఃఖము సంభవించును. ఇందెంతమాత్రము సంశయము లేదు" అని వాక్రుచ్చినందున దక్షుఁడు సురలును భయపడసాగిరి. అంత దక్షుఁడు గడ గడ వడకుచు లక్ష్మీపతియగు వైకుంఠుని సమీపించి దీనవదనుడై "రక్షించు" మని బ్రతిమాలు చుండెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ద్వాత్రింశాధ్యాయము.**





## త్రయస్త్రింశాధ్యాయము

### (విష్ణు వాక్యాది సందర్భము)

దక్షుఁడు భయముతో తత్తఱపాటుఁజెందుచు నారాయణుని చరణములపై వ్రాలగా నాతఁడు దయతో దక్షుని లేపినవాడై చెడుతలంపుగల దక్షుని మనోభావమునకు విచారపడుచు లోలోన శివుని స్మరించి దిగువవిధము వక్కాణించెను.

దక్షా నీకు మేలు నొనగూర్చు మాటఁజెప్పుచున్నాను. అద్ది మహామంత్రమువలె ఇహపరసుఖముల నొసగునది. శంకరుఁడు సకలాధీశ్వరుఁడనియు పరమాత్మయనియు గుర్తెరుగనివాడవై యజ్ఞమున కాహ్వానింపకుంటివి.

శ్లో॥ ఈశ్వరావజ్ఞయా సర్వం - కార్యం భవతి సర్వథా ।
విఫలం కేవలం నైవ - విపత్తిశ్చ పదే పదే ॥

శంకరుని తిరస్కరించుటచే ప్రతిపని నిష్ఫలంబగుటయే గాక మాటి మాటికి సంకటములు సంభవించును. మరియు

శ్లో॥ అపూజ్యా యత్ర పూజ్యంతే - పూజనీయో నపూజ్యతే ।
త్రీణి తత్ర భవిష్యంతి - దారిద్ర్యం మరణం భయమ్ ॥

సత్కరింపఁదగనివారిని బహూకరించుటవలనను పూజింపఁదగిన మహాపురుషుని సంభావింప కుండుట చేతను దరిద్రము భీతియు అకాలమరణంబునను మూడుకష్టములు అనివార్యముగా సంభవించును.

అందువలన నందివాహనుండగు మహేశ్వరుని సత్కరింపవలసి యుండెను. కాని ప్రస్తుతము అట్టి యోగము తప్పినందున మనకు మహాభయము తటస్థించినది. ఐతే నేనుగాని ఈబ్రహ్మాదులుగాని యీ మహోపద్రవమును తప్పింపఁజాలము. ఇద్దాని కంతటికిని నీయవినీతియే కారణమని తెలియుము!

దక్షుఁడిట్లు విష్ణువాక్యము నాకర్ణించి చిన్నవోయిన మొగముతో నేలపై చతికిలఁబడినవాడు. ఇంతలో వీరభద్రస్వామి తన సైన్యపరివారముతో సమీపమున కరుదెంచెను. రుద్రగణములలో కొందరు వెనుకనుండియు మరికొందరు పైనుండియు యజ్ఞవాటికలో చొఱఁబడి దశదిశలఁజుట్టుముట్టిరి. మహావీరులైన రుద్రగణములు సింహనాదముఁజేయుచు మూడులోకములను ప్రతిధ్వనింపఁజేయుచుండిరి. ఆకాశము పరాగము తోడను దిశలు చీకటి తోడను నిండియుండెను. సప్తద్వీపములతో కూడ పృథివి కంపించుచుండెను. సముద్రములు ఉప్పొంగెను. పర్వతములు కదలుచుండినవి. అరణ్యములు చిందరవందర యగుచుండెను. ఇట్టి కోలాహలమును గమనించి దేవతలు మున్నగువారు నచ్చెరువు నొందుచు భయభ్రాంతులగుచుండిరి. అప్పుడు చేయునదిలేక దక్షుఁడు నెత్తురుఁగ్రక్కు ముఖముతో మరల నొకతూరి లోకరక్షకుఁడగు విష్ణుభగవానునికి ప్రపన్నుడై సాష్టాంగప్రణామంబు లిడుచు వేడుకొనసాగెను.





మాధవా! నీబలముననే యజ్ఞమును ప్రారంభించితిని. సత్కార్యము సిద్ధించుటకు నీ యాలంబనముగదా! మరియు కర్మసాక్షివి, యజ్ఞరక్షకుండవు; ధర్మమును కాపాడువాడవు; వేదప్రవర్తకుండవు బ్రహ్మకులమును యజ్ఞమును నన్ను రక్షించుము!

అని ప్రార్థింపగా పద్మనాభుఁడు "దక్షా! యజ్ఞమును తన్మూలమగు ధర్మమును రక్షింతున ప్రతిజ్ఞ నాయదియేను, కాని ప్రస్తుతము ధర్మము నుల్లంఘించి ప్రవర్తించితివిగాన నిప్పటికైనను చెడుతలం పును మానుకొనుము! శంకరుని కోపధాటికి నిలుచు వాడెవ్వఁడు నిచ్చోటలేడు. ఈపరిస్థితిలో నిన్ను రక్షించుట యేరికి సమ్మతముకాదు?

శ్లో॥ కింకర్మ కొమకర్మేతి - తన్న పశ్యతి దుర్మతిః ।
సమర్థం కేవలం కర్మ - నభవిష్యతి సర్వదా ॥ ౨౯

కలుషితబుద్ధిగలవాడు – కర్మయెట్టిది? జ్ఞానమెట్టిది? అను పరిశీలనమునే గావింపఁజాలడు జ్ఞానము (శివుఁడే కర్మఫలదాత యనుభావన) లేనికర్మము స్వయముగా నెప్పుడును ఫలప్రదము కాజాలదు ఎద్దిసఫలంబగునో నద్దియే సమీచీనకర్మ యని తెలియుము! పరమేశ్వరుఁడు దక్క నితరుఁడెవ్వడు కర్మఫలము నొసగువాడుకాడు. శమదమాది గుణసంపన్నుడై శివుని యందలి భక్తిచే శివునియం నెలకొలుపఁబడిన మనస్సు గలవానికి శివుఁడు సుకృత ఫలమును ప్రసాదించును.

శ్లో॥ కేవలం జ్ఞాన మాశ్రిత్య - నిరీశ్వరపరా నరాః ।
నిరయం తేచ గచ్ఛంతి - కల్పకోటి శతాని చ ॥ ౩౦

కర్మను పరిత్యజించి జ్ఞానమొక్కదానినే యవలంబించి తామే బ్రహ్మమునను భావముతో ఈశ్వరుఁడు లేడని వాదించువారు శతకోటి కల్పముల వరకు నరకములో నివసింతురు.

కేవలము కర్మనే ఆచరించువారు ననేక జన్మలలో కర్మపాశములతో బంధింపఁబడుచు చివరకు నరకములనే పొందుదురు. అనఁగా కర్మసముచ్చితజ్ఞాన (ఉపాసన) మున శివునారాధించు శాంభవదీక్షితు ఎట్టి దుఃఖముల పాలుగాక పునరావృత్తి రహిత శివసాయుజ్యము నొంది శాశ్వత శివానందానుభవము గలవారగుదురని భావము.

రుద్రకోపాగ్నిఁబుట్టిన వీరభద్రుఁడు మననందరిని శిక్షించుటకు వచ్చుచున్నవాడు. ఈతని చేయనలవిగాని దెద్దియులేదు. ఇచటివారి నందరిని దునుమాడియే ప్రశాంతుండగును. కావున దక్షా! మహాదేవుని యభిమతమును పాటింపక నిందు పాలుగొని నందులకు నీతో గూడ నేను నిడుములపాలు కావలసివచ్చెను. శివాజ్ఞను మీరుటఁజేశి యొక విధముగా శివద్రోహి నైనికతన యుపద్రవమును తొలగింప నాకునుఁ సామర్థ్యము లేదు. మరియు శివద్రోహులకు భూత భవిష్య ద్వర్తమాన కాలముల యందును సుఖము విశ్రాంతియు లభింపకుండును. నాయొద్ద సుదర్శనము మున్నదని భావింతునేమో, అద్దానిఁగుర్చి వివరించుచున్నాను, వినుము!

శ్లో॥ సుదర్శ నాభిధం చక్ర - మేతస్మి న్న లగిష్యతి ।
శైవం చక్ర మిదం యస్మా - దశైవలయ కారణమ్ ॥ ౩౫





ఈ వీరభద్ర స్వామియందు నాసుదర్శన చక్రము ఉపయోగింపదు. ఎందుకనగా? పూర్వము సహస్రకమలములచే నారాధించినపుడు శివసంకల్పవశమున తక్కువపడిన నొక్క కమలమునకు బదులుగా నేత్రకమలమును సమర్పించు నాయందు శివుఁడనుగ్రహము గలవాడై తన పాదాంగుష్ఠమునుండి వెలికితీసి యిచ్చిన దగుటచే సుదర్శనచక్రము శైవమని భావింపవలెను. అందువలన నిద్ది శివద్రోహులను మాత్రము చెండాడునదని తెలియుము! ఒకవేళ వీరభద్రుఁడిచ్చోటికి రాకున్న నీ సుదర్శనచక్రమే నిచ్చటివారిని సంహరించి శంకరుని సన్నిధానమునకు ఁజనవలసి యుండెను. ఇదిముమ్మాటికి నిక్కంబు; శివశాసనము నతిక్రమించియున్న నన్ను సహింప కుండు నీ చక్రము శివకృపావిశేషమునఁజేసి నాయొద్ద నిప్పటికిని యుండుట నొక భాగ్యమనియే భావింతును. ఐనను ఇఁకముందు నీ సుదర్శనము మంటలతో చెలరేగుచు నాచెంత నుండక కైలాసమునకు వెళ్ళును. ఇఁక నీ వీరభద్రస్వామి మితిమీరిన క్రోధముగలవాడై యున్నందున మనమిప్పుడాతనిని పూజించినను ప్రసన్నుడుకాడు. ఆహా! ఏమి చెప్పవలెను? అకాలప్రళయ మాసన్నమైనదనియే తెలియుము! దక్షా! నీకును మాకును వినాశము తటస్థించినది. ప్రస్తుతము మనను కాపాడువాడు గానరాడు వస్తుతః – శివుని ద్వేషించువారిని రక్షించువాడు లోకమున నెవడుండును? శివద్రోహులు, శరీరములను విడచినను అనఁగా మరణించినను పలువిధములగు యమయాతనల ననుభవించుట తప్పదు. అట్టి యమబాధల నోర్చుకొనరాదు. యముడుగూడ శివద్రోహులను గాంచి మహోదగ్రుడై కాచిన నూనెకడ వలయందు పడవేయించును. దధీచిమున్నగు మహామహులు నీ యజ్ఞమును శపించి వెళ్ళగానే నేనును వైకుంఠమునకు వెళ్ళఁదలచితినిగాని నీవంటి దుష్టులసహవాసము ఁదగువ్యసనము వలన పోజాలనందుల కెంతయు మది గుందుచున్నాను. ఇప్పటికి నెచ్చోటికైన వెళ్ళుదమనినచో శంభుని కుమారుఁడగు వీరభద్రుఁడు తన శస్త్రాస్త్రములలో మమ్మాకర్షించును. శ్రీవీరభద్రస్వామి ప్రయోగించు ఆయుధములన్నియు స్వర్గమునందును భూలోకమునను పాతాళములోను ప్రపంచమంతట నుపయోగించునట్టివి. రుద్రగణములకు నిట్టిసామర్థ్యమే కలదు. పూర్వము బ్రహ్మదేవుని పంచమశిరంబును తన నఖాగ్రముచే పెరికివేశిన కాలభైరవుని మహిమ – జ్ఞాపకములో నున్నదా? కావున శివునియొక్కయు శివగణములయొక్కయు ప్రభావాతిశయమును గమనించినవారు నీవలెను నీపరివారమువలెను ప్రవర్తింపరు. ఇట్లు నారాయణుఁడు వక్కాణించి లోలోన వెఱగందుచు దీనవదనుడై మిన్నకుండెను. ఇంతలో వీరభద్రుఁడు యజ్ఞమండపమున ఁబ్రవేశించెను. వీరభద్రసైన్యంబును లోనఁజొచ్చెను. ఇంద్రాది దేవతలు నిశ్చేష్టులైయుండిరి.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పదిమూడవ యధ్యాయము.**

# చతుస్త్రింశాధ్యాయము

## (విష్ణు వీరభద్ర సంవాదము)

అట్టితఱి దేవేంద్రుఁడు కొంతతడవు ఆలోచించి దక్షయజ్ఞమును కాపాడ వలెనని యమరులతో కూడ యుద్ధమునకు సన్నద్ధుడై యైరావతగజము నధిష్ఠించెను. అగ్నిదేవుఁడు మేకపోతు పైనను యమధర్మరాజు ఎనుబోతుపైనను, నిఋృతి - భూతముపైనను, వరుణుఁడు మొసలిపైనను వాయువు మృగముపైనను కుబేరుఁడు పుష్పకముపైనను తదితరులైన యక్షులు చారణులు గుహ్యకులును తమతమ వాహనముల నధిష్ఠించిరి. అవ్వారి ప్రయత్నమును గమనించి దక్షప్రజాపతి "మీయందరి బలము నవలంబించియే నే నీ జన్నమును ప్రారంభించితిని. ఇట్టి సత్కర్మను సిద్ధింపఁజేయు భారము మీయదియేను" అని వచింప నింద్రాదులు త్వరపడుచు వీరభద్రగణములతో పోరాడుటకు బయలుదేరిరి.

శివమాయా ప్రభావమునఁజేశి దేవతలు శివభక్తిని గోలుపోయి రుద్రగణములతో ఘోరముగా పోరాడు చుండిరి. శంఖములు పూరింపఁబడెను. దుందుభి మొదలగు వాద్యములు మ్రోగింపఁ బడుచుండెను. దేవతలు వాద్యధ్వనుల నాకర్ణించుచు నుద్రేకముతో తమాయుధములతో శివకింకరులను కొట్టుచుండిరి. భృగుమహర్షి గావించిన మంత్రోచ్చాటనమునకు పరాజితులగుచున్న రుద్రగణములను గమనించి వీరభద్రుఁడు -- భూతప్రేతపిశాచములను వెంటనిడుకొని రణరంగమున కేతెంచి తన త్రిశూలముతో నమరులను పడగొట్టుచుండెను. గణములు ముందుకువచ్చి యక్షులను సాధ్యులను గుహ్యకులను చారణులను శూలాఘాతములతో దండించుచుండిరి. ఇట్టియుద్ధాటోపమునకుతాళలేక దేవతలు పరుగిడుచు స్వర్గమునకు ఁజనిరి. లోకపాలురు మాత్రము ధైర్యముతో యుద్ధస్థలమున నున్నవారై విజయమునుగురించి బృహస్పతిని ప్రశ్నింపగా నాతఁడిట్లనియెను.

ఇంద్రాదిదేవతలారా? విష్ణుమూర్తి మున్ను చెప్పినదంతయు నిజమైనదని తెలియుడు!

యజ్ఞయాగాది సుకృతముల ఫలము నొసగు యజ్ఞేశ్వరుఁడొక డున్నాడని భావింపవలెను. భక్తితో కర్మనాచరించువానిని శివుఁడాశ్రయించియే యుండును.

కాని యెవఁడు తానేకర్తనని యహంకరించునో నట్టివానిని పరమాత్మ చేరకుండును. మంత్రములుగాని ఓషధులుగాని ప్రయోగములుగాని లౌకికయుక్తులుగాని యజ్ఞయాగాది సత్క్రియలుగాని వేదములుగాని పూర్వమీమాంసగాని వేదాంతములుగాని ఇతరశాస్త్రములుగాని పరమేశ్వరుని తెలుసుకొనుటకు పర్యాప్తములు కావని కోవిదులు చెప్పుచుందురు. మహేశ్వరుని స్వప్రతిభతో కనుగొనరాదు. నిఖిలవేదవేదాంగ పరిజ్ఞానమాత్రమున శివజ్ఞానము కలుగదు. అనన్యశరణముగా ఏకాంత భక్తులకే సదాశివుఁడు గమ్యుండగును. ఇదియే శ్రుతిసారము.

శ్లో॥ శాంత్యా చ పరయా దృష్ట్యా - సర్వథా నిర్వికారయా ।
తదనుగ్రహతో నూనం - జ్ఞాతవ్యోహి సదాశివః ॥ ౨౮

శాంతస్వభావము, ఇంద్రియ నిగ్రహము, రాగద్వేషాది వికారములు లేనట్టి పరాదృష్టి అనఁగా శాంభవదీక్షా పురస్సరముగా ఇష్టప్రాణభావాత్మకుఁడగు పరశివునుపాసించుటయు అనువానితోడను

శివానుగ్రహమువలనను శివస్వరూపము గోచరమగును. అనఁగా పైలక్షణములు కలవానియందు శివానుగ్రహము తప్పక ప్రసరించునని భావము.

దేవేంద్రా! నీకు నొక్క ముఖ్యాంశమును చెప్పుచున్నాను. వినుము! మూర్ఖుడవై లోకపాలురను తోడ్కొని దక్షయజ్ఞమున కేతెంచినావు. ఇప్పుడు నీపరాక్రమ మెంతమాత్ర ముపయోగింపదు. ఈ రుద్రగణములైతేనో అనివార్య ఆవేశమున యజ్ఞమును ధ్వంసముఁజేయుటకు వచ్చినవారు. అద్దితప్పక నెరవేరును. కావున నిట్టితఱి మీయుపాయము లేవియు కొనసాగవు. నేను చెప్పినది సత్యమని విశ్వసింపుడు!

ఇవ్విధము సురాచార్యుఁడు సంభాషింప నింద్రాదిదేవతలు విని చేయునదిలేక చింతాక్రాంతులై యుండిరి. అంత వీరభద్రుఁడు లోకపాలురనుగాంచి "మీరందరును తెలివితక్కువ వారై ఆహుతుల నాశించి యిచ్చోటికి వచ్చినవారు గదా! నాయొద్దకు రండు! ఒక్కొక్కరికి నేను ఆహుతులను సమర్పించెదను." అని వచించి తీక్ష్ణములైన బాణములతో నవ్వారిని కొట్టుచుండెను. వీరభద్రుని తాడనములను సహింపనేరక నింద్రాది దిక్పాలురు దశదిశలకు పారిపోయిరి.

అంత నీయజ్ఞమును రక్షింపుమని ఋషులు ప్రార్థింపగా నారాయణుఁడు వీరభద్రస్వామితో కదనముఁ జేయఁదలచి యజ్ఞవాటిక నుండి బయలువెడలి సన్నద్ధుడగు చుండెను. వీరభద్రుఁడది గాంచి "యముఁడు పాపాత్మునివలెను సింహము గజమునువలెను" క్రూరముగా విష్ణువుఁజూచుచు "కేశవా! మహాదేవుని శాసనముఁజవదాటి యిందెట్లు ప్రవేశించితివి? నేనే సర్వేశ్వరుఁడను గర్వము నిన్నావహించినది గాబోలు; నీవెట్టివాడవో ముందు విచారించుకొనుము! జగమున నిన్ను రక్షించువాడెవడో తెలియకుంటివా? దక్షుని యజ్ఞమును కాపాడుదునని యిచ్చోటికేతెంచితివేమో; సతీదేవి గావించిన దేహత్యాగమును గమనింపకుంటివా? దధీచి మహర్షి సంభాషించిన ప్రసంగమును పెడచెవిఁబెట్టితివా? నీవును దక్షుఁ డొసగు నాహుతుల నపేక్షించి యున్నావని తోచెడిని. నేనే అట్టియాహుతుల నిచ్చెదను. రమ్ము! ఈ త్రిశూలముతో నీఱొమ్ముఁజీల్చెదను. ఇట్టితఱి నిన్నెవడు కాపాడునో చూచెదనుగాక! నిన్ను యుద్ధమున పడఁద్రోసి నేలపై పొరలింతును. శంకరుని మహిమ నెరుఁగనివానివలె నాతో పోరుడుటకు తలపడితివిగదా!" అని వచింపగా పద్మనాభుఁడు చిరునగవుతో నిండు ఆదరమున వీరభద్రుని కిట్లు విన్నవించుకొనియెను.

వీరభద్రా! నన్ను శివద్రోహిగా భావింపకుము! శంకరునారాధించు వాడను. దక్షుఁడు మున్ను ప్రార్థించినందున నీ యజ్ఞమునకు రావలసివచ్చినది. ఐతే నీతఁడు తత్త్వజ్ఞానశూన్యుడై కేవలము కర్మనిష్ఠతో జన్నము సేయమొదలిడినాడని తెలిసియు నాభక్తుడగుటచే వచ్చితిని. నేను నీతో యుద్ధముఁజేయనిది యిటనుండి వెళ్ళనని ప్రతిజ్ఞఁబూనితిని. కావున కరుణించి నాతో పోరాడుము! తరువాత కానున్నది యగును. అంత వీరభద్రుఁడు ప్రసన్నుడై మాధవా! నీవలె నేనును శంకరకింకరుడనై శివాజ్ఞనిచ్చోటి కేతెంచితిననఁగా విష్ణువు – నీబాణములతో కప్పఁబడి నిజనివాసమునకుఁజనుదును గాక – యని ప్రార్థించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పదినాలుగవ యధ్యాయము.





# పంచత్రింశోధ్యాయము

## (వీరభద్రుఁడు విష్ణువుతో యుద్ధముఁజేసి దక్షయజ్ఞమును ధ్వంసి మొనర్చుట)

మహాబలపరాక్రమ సంపన్నుడగు వీరభద్రుఁడు – శంకరుని స్మరించి పరమాస్త్రములఁగ్రహించి సింహనాద మొనర్చెను. విష్ణువు – పాంచజన్య శంఖమును పూరింపగా నద్దాని నాకర్ణించి యింద్రాది దేవతలు మరలివచ్చి యుద్ధమునకు తలపడుచుండిరి. రుద్రగణములకు దిక్పాలురకును ఘోరమైన ద్వంద్వయుద్ధము జరుగుచుండెను. ఇంద్రుఁడు నందికేశ్వరునితోడను అగ్నిదేవుఁడు అశ్మయనువానితోడను కుబేరుఁడు కూష్మాండపతితోడను పోరాడుచుండిరి. అట్టి పోరాటమున నింద్రుఁడు వజ్రాయుధముతో నందినికొట్టగా నంది త్రిశూలముతో నింద్రుని వక్షస్సునపొడచెను. అగ్ని–శక్తి యనెడు ఆయుధముతో అశ్మయనువానిని దండింపగా నతఁడును త్రిశూలమున నగ్నిని దండించెను. యమునితో మహాలోకు డను గణాధిపతి – శివుని ప్రార్థించి ఘోర యుద్ధమును గావించెను. చండుఁడు నిఋృతితో భయంకరముగా పోరాడుచుండెను. ముండుడు వరుణుని తోడను భృంగి వాయువుతోడను పోరాడుచుండిరి. భైరవుఁడు యోగినీచక్రమునండగా తీసుకొని దేవతల నందరిని పడగొట్టి నెత్తురు త్రాగుచుండెను. క్షేత్రపాలుర దేవతా శరీరములను భక్షించుచుండిరి.

ఇఁక మహాప్రభావముగల నారాయణుండు చక్రమును క్షేత్రపాలునిపై ప్రయోగింప నయ్యది నాతనిపై పడకమునుపే వీరభద్రుఁడు చక్రమును పట్టుకొని మ్రింగగా విష్ణువు వీరభద్రుని ముఖములోనుండి చక్రమును పరిగ్రహించెను. పిమ్మట హరి – నానావిధ ఆయుధములతో తన పరాక్రమము జూపెట్టుచుండగా భైరవుఁడు మున్నగువారు పలువిధములైన అస్త్రములను ప్రయోగించుచు విష్ణువుతో పోరాడుచుండిరి. తరువాత మధుసూదనుఁడు వీరభద్రునితో తలపడి క్రోధమూర్ఛితుడై సుదర్శనచక్రము తనయొద్దనున్నదిగదా యను ధైర్యముతో పోరాడుచుండెను. ఇట్లు వీరభద్రవిష్ణువులకు ఘోర యుద్ధము చూపరులకు గగుర్పాటు లొదవునట్లు జరుగుచుండెను.

అంత యోగబలమున నారాయణుని దివ్యదేహమునుండి శంఖచక్రగదాధారులగు విష్ణుగణములు అసంఖ్యాతములుగా నుద్భవించి తనపైకిరాగా వీరభద్రుఁడు శివునిఁబ్రార్థించి నవ్వారినందరి నొక్కక్షణమున త్రిశూలజ్వాలలతో ధహించెను. మరియు నదేత్రిశూలముతో నారాయణుని యురమున కొట్టెను.

శ్లో॥ తేన ఘాతేన సహసా – విహతః పురుషోత్తమః ।
పపాతచ తదా భూ మౌ – విసంజ్ఞోఽ భూన్మునే హరిః ॥ 3

వీరభద్రుని త్రిశూలాఘాతముతో పురుషులలో నుత్తముఁడగు నారాయణుడు నేలఁబడితెలివి దప్పినవాడు. అంత నాతని శరీరమునుండి త్రైలోక్యదాహకము వీరభీకరము ప్రళయాగ్నిసన్నిభంబగు నొక తేజస్సుదయించినది. (అద్ది నిరర్థకమై సముద్రమునఁ బ్రవేశించినది). నారాయణుఁడు కొంతతడవునకులేచి వీరభద్రునిపై చక్రమును ప్రయోగింపగా నాతఁడద్దానిని స్తంభింపఁజేసినవాడు.





శ్లో॥ మునే! శంభోః ప్రభావాత్తు - మాయేశస్య మహాప్రభోః ।
న చచాల హరేశ్చక్రం - కరస్థం స్తంభితం ధ్రువమ్ ॥ ౩౭

ప్రభువులకు ప్రభువును మాయయనఁబడు ఆదిశక్తికి నాథుఁడు నగు శంకరుని మహిమఁజేసి హరి ప్రయోగించు చక్ర మాతని చేతియందు నట్లే నిలచినది. ఇది ముమ్మాటికీ సత్యము. వీరభద్రుఁడు విష్ణువుతో సంభాషించుచు నిశ్చలమగు పర్వతమును వలె నాతనిని నిలిపివేశినవాడు. వైదికమంత్రోచ్చారణ ప్రభావమున మాత్రము నారాయణుని కరస్తంభనము తొలగినందున నాతడు శార్ఙమనెడు ధనస్సును కేలఁదాల్చి బాణత్రయమును ప్రయోగింపగా వీరభద్రుఁడా శార్ఙమును మూడు తునకలఁ జేశినవాడు.

శ్లో॥ అథ విష్ణుర్మహావాణ్యా - బోధితస్తం మహాగణమ్ ।
అసహ్య వర్చసం జ్ఞాత్వా - హ్యంతర్ధాతుం మనోదధే ॥ ౪౧

అంత సర్వాంతర్యామియగు శంకరుఁడు "వీరభద్రుని జయింప నెవరితఅముకాద"ను నంతర్వాణితో తన్ను బోధించినందున యుద్ధమును విరమించి యటనుండి నారాయణుఁడు వైకుంఠమునకు నేగినవాడు. సతీదేవి యొనరించిన దేహత్యాగమును మదిఁదలచుచు సర్వేశ్వరుఁడు సర్వతంత్ర స్వతంత్రుఁడునగు శివుని దివ్య మహిమను కొనియాడుచును సురముని గంధర్వాదులందరును తమ తమ లోకములకుఁ జనిరి. బ్రహ్మదేవుఁడును తన కుమారుఁడగు దక్షుని యవివేకమునకు వగచుచుండెను. ఇంతలో మృగరూపమున పరుగిడుచున్న యజ్ఞము నాకసమున వీరభద్రుఁడు బంధించి యద్దాని తల నతికెను. ఇంకను యజ్ఞమును విడుచవజాలని ధర్మదేవతను కశ్యపప్రజాపతిని అరిష్టనేమిని ఆంగీరసమునిని కృశాశ్వుని దత్తమహర్షిని పట్టుకొని యవ్వారి తలలపై తన్నెను. సరస్వతీదేవియొక్కయు అదితి యొక్కయు నాసాగ్ర (ముక్కుకొన) మును ఛేదించెను. మరియు యజ్ఞవాటిక యందు నలుదిశలఁజూచుచు భృగుమహర్షిని చేరదీసి యాతని యురముపై కాలునిడి (యాతని) కనుబొమలను పెరికివేసెను. చండుడు – పూర్వము శంకరు నాక్షేపించినపుడు పలువరుసఁజూపుచు పరిహసించిన సూర్యుని దంతముల నూడఁబెరికెను. నందికేశ్వరుఁడు – పూర్వము దక్షుఁడు శంకరుని తూలనాడునపుడు కనుసైగలఁజేశిన భృగుని నేత్రములను ఛేదించెను. స్వాహాదేవియు స్వధాదేవియు దక్షిణయు మంత్రములు, తంత్రములును పరామర్శింపఁ బడెను. రుద్రగణములు యజ్ఞాగ్నులఁ జల్లార్చుచుండిరి. యజ్ఞశాలయందు దాగియున్న దక్షునిఁ బట్టుకొని వీరభద్రుఁడాతని శిరమును తనగోటితో తెగనతికి యగ్నికుండమునందు పడవేసెను. అప్పుడు వీరభద్రస్వామి త్రిశూలమును చేతఁద్రిప్పుచు నట్టహాసముఁ జేయుచుండెను. వీరసంపదతో విరాజిల్లు వీరభద్రునిపై నందిమొదలగు గణములపైనను దివ్యపుష్పవృష్టి కురిసినది. వాయువులు మందములుగా సుగంధములుగా సుఖప్రదములుగా వీచుచుండినవి. అదే సమయమున దేవతలు దుందుభులను మ్రోగించుచుండిరి. కటిక చీకటిఁబారద్రోలిన సూర్యుని వలె వీరభద్రుఁడు కృతార్థుడై కైలాసమునకు పయనించెను. శంకరుఁడట్టి వీరభద్రు నవలోకించి వీరగణాధ్యక్షునిగా పట్టాభిషిక్తు నొనర్చఁజేసినవాడు.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వము" అను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పదియైదవ యధ్యాయము.**





# ముప్పదియారవ అధ్యాయము

## (క్షువ దధీచి వివాదము)

శంకరుని స్వరూపమును గుర్తెరిగియు నారాయణుఁడు శివరహితమైన దక్షయజ్ఞమున వెళ్ళినవాడెందులకు? అని శౌనకాదిమునులు ప్రశ్నింపగా సూతుఁడు చెప్పదొడఁగెను.

మున్ను దధీచిశాపము వలన మహావిష్ణువు – జ్ఞానముఁగోలుపోయి నందున నిజపరివారము గూడ దక్షుని యజ్ఞమున పాలుగొనినవాడు. దధీచిమహర్షి శాపమునకు గతంబేమనిన?

క్షువుండను గొప్ప పరాక్రమముగల రాజన్యుఁడు – మునీంద్రుడైన దధీచిమహర్షితో చెలిమి జేసియుండెను. అట్లు కొంతకాలము గడువగా ప్రసంగవశమున వారిరువురికి గొప్ప యనర్థకంబ వివాదము సంఘటించెను. వేదవిదుండు శివభక్తాగ్రేసరుఁడునగు దధీచిమహర్షి – బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో విప్రుండే శ్రేష్ఠుండనియు, క్షువుఁడు రాజ్యశ్రీ మదగర్వితుఁడై ఎనమండుగురు లోకపాల నంశములతో నుదయించు క్షత్రియుఁడు వర్ణాశ్రమాధిపతిగా సర్వశ్రేష్ఠుఁడనియు వాదించుకొనిరి. అ నెంతకును విననందున దధీచిమహర్షి – యాత్మ గౌరవమును కాపాడదలచి యెడమ పిడికిలితో క్షువు నెత్తిపై కొట్టెను. అందువలన క్షువుఁడు కోపోద్రిక్తుడై వజ్రాయుధముతో దధీచిని కొట్టగా నాతఁడు క్రిందఁబడుచు శుక్రాచార్యుని స్మరించెను. అంత శుక్రాచార్యుఁడేతెంచి సంజీవినీవిద్య నుపయోగిం దధీచిని బ్రతికించెను. శివభక్తులలో మిన్నయగు శుక్రాచార్యుఁడు దధీచికి దిగువ విధము మృత్యుంజయమ నుపదేశించినవాడు.

"త్ర్యంబకం యజామహే - సుగంధిం పుష్టివర్ధనమ్'
ఉర్వారుక మివ బంధనా - న్మృత్యో ర్ముక్షీయ మాऽమృతాత్"

త్రయంబకం = అనఁగా మూడులోకములకు జనకుండును, మరియు మూడు గుణముల ప్రవర్తింపఁజేయువాడును, మూడు మండలముల కధీశ్వరుఁడును, తత్త్వత్రయమునకు వహ్నిత్రయమున స్వర్గత్రయమునకు దేవత్రయమునకు త్రివిధంబైన సమస్తంబునకు మూలమగువాడును; సుగంధిం = ప్రాణులందరియందును మూడుగుణములలోను ఇంద్రియములయందును దేవతలలో ప్రమథగణములలోను "పుష్పమునందు పరిమళము వలె" వ్యాపించిన వాడును; పుష్టివర్ధనం = విష్ణువున బ్రహ్మదేవునకు మునులకు ప్రకృతికిని పురుషునకును తమ తమ కర్తవ్యములను నెరవేర్చు పుష్టిని నిరంత మొసగువాడును అమృతుఁడు నగు శివుని తపస్సుచేతను కర్మచేతను రుద్రాధ్యాయాదివేదాభ్యాసముతో శివయోగముచేతను ధ్యానముచేత నారాధించుచున్నాము. అట్టి రుద్రుఁడు – దోసకాయను తొడి నుండి వలెనన్ను మృత్యువునుండి తప్పించుగాత! అమృతము అనఁగా మోక్షమునుండి దూరము చేయకుండుగాత!

ఇద్ది మృతసంజీవినీమంత్రము సర్వోత్తమంబై నియమముతో శివుని స్మరించి జపించువా యరిష్టములను తొలగించును. జపించి తద్దశాంశము హవనము నాచరించి నీరు మాత్రము పానీయము గ్రహించుచు శివధ్యానముఁ గావించిన వారికి ఎట్టి మృత్యుభయంబు నుండఁజాలదు.

అంగన్యాస కరన్యాసములను గావించి దిగ్బంధ మొనరించి దిగువ విధము ధ్యానించి మృత్యుంజయ మహామంత్రమును కనీసము లక్షపర్యాయములు జపింపవలెను.

**ధ్యానశ్లోకము - హస్తాంభోజయుగస్థకుంభయుగళా - దుర్ధృత్య తోయం శిరః ।**
**సించంతం కరయో ద్యుగేన దధతం - స్వాంకే సకుంభౌకరౌ ।**
**అక్షస్రజ్మృగహస్త మంబుజగతం - మూర్ధస్థ చంద్రస్రవత్ ।**
**పీయూషార్ద్రతనుం భజే సగిరిజం - త్ర్యక్షంచమృత్యుంజయమ్ ॥**

కమలముల వంటి హస్తముల నాలుగింటి యందున్న రెండుకలశములతో జలమును పరిగ్రహించి శిరస్సుఁదడుపువాడును, పెద్దకడవలతో కూడినకరములను తన తొడలయందు నిలుపువాడును రుద్రాక్షమాలికను మృగమును రెండుచేతులఁ బట్టుకొనువాడును కమలముపై కూర్చుండువాడును తలపైనుండు చంద్రుని నుండి కారుచున్న నమృతముతో తడసిన దేహము గలవాడును పార్వతీదేవితో కూడియుండువాడును మూడు కన్నులు గలవాడునగు మృత్యుంజయుని భావించుచున్నాను.

ఇవ్విధము శుక్రాచార్యుఁడు దధీచికి నుపదేశించి శంకరుని స్మరించుచు నిజనివాసమున కరుగగా దధీచియు శివుని స్మరించుచు తపస్సునకై యరణ్యంబున కేగెను. అచ్చోట సుస్నాతుడై భస్మరుద్రాక్షలం ధరించి మహామృత్యుంజయ మంత్రమును జపించుచు పార్థివలింగము నారాధింపగా శంకరుఁడు ప్రసన్నుడై వరమునుకోరుమనెను. అంత దధీచి పరమేశ్వరుని దివ్యరూపమును కనులార గాంచుచు సాష్టాంగము నిడి బద్ధాంజలియై వజ్రమయములగు దివ్యరూపమును కనులార గాంచుచు సాష్టాంగము నిడి బద్ధాంజలియై వజ్రమయములగు బొక్కలు కలిగియుండుటను ఎవరిచేతను వధింపఁబడకుండుటను దీనుడు కాకుండటను అనుగ్రహింపు మనఁగా శంకరుఁడు "తథాఽస్తు" అని దధీచికి వరముల నొసగి యంతర్ధానముఁ జెందినవాడు.

దధీచి మహర్షి - శివుని వలన వరత్రయముఁబడసి క్షువుని నివాసమునకుఁజని సమీపించి యాతని శిరముపై పాదమూలముతో తన్నగా క్షువుఁడు కోపించి దధీచిఁదగు వక్షస్సున వజ్రాయుధముతో కొట్టెను. అంత దధీచికి వజ్రాయుధముతో ఎట్టి బాధయు కానందున ధాతకుమారుడైన క్షువుఁడు మిగుల నాశ్చర్యపడుచు నటనుండి బయలుదేరి యరణ్యమున కేగి యుపేంద్రు నారాధింపగా విష్ణువు ప్రత్యక్షమై ఏమికావలయునో కోరుమనెను. అంత క్షువుఁడు "ధర్మవేత్తయు విద్యావినయసంపన్నుండునగు దధీచియను బ్రాహ్మణునితో మొదట సఖ్యమేర్పడి తరువాత వివాదము సంభవించినందున నన్ను సభలో కాలుతో తన్నినవాడు. మృత్యుంజయు నారాధించి వరములఁబడసినవాడు. ఆతని జయించు నుపాయంబు ననుగ్రహించు" మని వేడుకొనఁగా నారాయణుఁడు ... మహేశ్వరుని ప్రభావమును శివభక్తుల ప్రాభవంబును మదిలో తలచుచు "రాజా! బ్రాహ్మణుల కెచ్చోట నెట్టి భయంబును కలుగదని భావింపుము! విశేషించి మాహేశ్వరుల కిసుమంతయు జడియనవసరములేదు. ఐతే నీవు నా భక్తుడవగుటచే నీ పక్షమునుండి దధీచితో పోరాడవలసివచ్చినది. కావున నాకు పరాజయంబగుటయే గాక ముందు రాబోవు దక్షయజ్ఞములో వీరభద్రునిచే వధింపఁబడుటయు శివానుగ్రహమువలన పునర్జీవితుడ నగుటయు ననివార్యంబులగును. ఇందుకు దధీచి శాపమే కారణమని తెలిలియుము! శివారాధన మెన్నటికిని

విఫలము కాజాలదు. ఐనను దధీచి నోడించుటకు యధాశక్తి ప్రయత్నింతు" నని వాక్రుచ్చెను. అంత క్షువుండును నారాయణు నాశ్రయించి దధీచిపరాజయమునకై వేచియుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పదియారవ అధ్యాయము.

## ముప్పదియేడవ అధ్యాయము

### (విష్ణు దధీచియుద్ధ వర్ణనము)

భక్తవత్సలుండైన విష్ణుభగవానుఁడు క్షువునకు హితముఁజేయఁగోరి దధీచి మహర్షి యాశ్రమమునకు విప్రరూపముతో వెడలి దధీచికి ప్రణమిల్లి "శివారాధన తత్పరుడవై యజేయుడవగు నో మహర్షీ! ఒక వర మడుగుదు నొసగుదువా? యని ప్రశ్నింపగా దధీచి "బ్రాహ్మణా! నీవు నిజముగా హరివి! మాయారూపమున నన్ను వంచింపఁదలచితివి, శివానుగ్రహము వలన నాకు భూత భవిష్యద్వర్తమాన కాలత్రయజ్ఞాన మలవడినది. నీవు మాయా బ్రాహ్మణ రూపమును విడనాడుము! దుర్మార్గుఁడగు క్షువుఁడు నిన్నుపూజించి యుండును. నిజరూపమును పరిగ్రహింపుము! శివుని స్మరింపుము! శివపూజనాసక్తుడ నగు నాకు నెద్దాని వలన నైన కీడు సంభవించునెడ నట్టి యంశమును వివరింపుము! ఐతే శివానుగ్రహబలమున నాకుమాత్రము దేవదానవాది ప్రపంచములో ఎట్టి యపాయంబు లేదని భావింపుము!" అని వచింప నారాయణుఁడు దధీచీ! శివుని భావించుచున్నందున నెప్పుడు నెట్టి భయము నీకు లేదని నేను నంగీకరింతును మరియు సర్వజ్ఞుడవని చెప్పవచ్చును. కాని నా సాహచర్యమునఁజేసి క్షువునకు మాత్రము భయపడుదునని ఒక్కపర్యాయము పలుకు" మనఁగా దధీచి "నారాయణా! ఎన్ని పర్యాయములు చెప్పవలెను? భయపడను. భయపడను. శివుఁడెల్లకాలము నాకు నండగా నుండు"నని బదులు చెప్పెను.

అంత విష్ణువు కోపించి సుదర్శనచక్రమును దధీచిపై ప్రయోగింప లేవనెత్తగా నయ్యది స్తంభించెను. క్షువుడిదియంతయు పరికించుచుండెను.

"కేశవా! ఈ సుదర్శనమును మున్ను నీవు సహస్రకమలములతో శివునారాధించి సంపాదించుకుంటివిగదా! అట్టి శివదత్తమైన చక్రము శివభక్తుడనగు నా యందు ఎంతమాత్రము ఉపయోగింపదని యెరుఁగకుంటివా?" అని దధీచి పలుకగా వైకుంఠుఁడు మరింతయు క్రుద్ధుడై తన యస్త్రముల నన్నిటిని దధీచిపై ప్రయోగింప నుద్యుక్తుండయ్యెను. ఆ యస్త్రములన్నియు విఫలములు కాగా ఇంద్రాదిదేవతలు మూఢులై విష్ణువునకు తోడుగా తమ తమ ఆయుధములను దధీచిపై వేయుచుండిరి. అవి యన్నియు వ్యర్థములు కాగా దధీచిమహర్షి - దర్భముడిని మృత్యుంజయమంత్రముతో మంత్రింప నయ్యది త్రిశూలంబై బృందారకుల నందరిని దహించునట్లుండెను. నారాయణ దేవేంద్రాదులు ప్రయోగించిన యస్త్రములన్నియు త్రిశూలమునకు వినమ్రములగుచుండెను. అట్టితతి దేవతలు భయపడుచు దశదిశలకు పారఁజొచ్చిరి. ఒక్క హరియే వెఱగందుచు కొంత తడవాలోచించి తనతో సరితూగు





విష్ణుగణములను కోట్లకొలది పుట్టింపగా నా విష్ణుగణములు తనపైకి పోరాటమునకు వచ్చుచున్నట్లు గమనించి దధీచిమహర్షి యవ్వారిని త్రిశూలజ్వాలలతో కాల్చివేసినవాడు. అప్పుడు చేయునదిలేక కేశవుఁడు దధీచి నాశ్చర్యచకితుంగావింపదలచి విశ్వరూపమును చూపెట్టెను. అందు వేలకొలది దేవతాది ప్రాణులు, కోట్లకొలది గణములు భూతంబులును దధీచికి కన్పట్టుచుండెను. అంత దధీచి "నారాయణా! మాయాప్రభావము నీకే కలదనుకుంటివా? నేనును శివవానుగ్రహబలమున విశ్వరూపమును ప్రదర్శింతును. నీ విశ్వరూపమున కనఁబడు రూపములన్నియు ప్రతిబింబములేగదా! ఇcక నా విశ్వరూపమున యదార్ధమగు ప్రపంచమును గాంచగలుగుదువు!

శ్లో॥ మయి పశ్య జగత్సర్వం - త్వయా యుక్త మతంద్రితః ।
బ్రహ్మాణంచ తథారుద్రం - దివ్యాం దృష్టిం దదామితే ॥

నాయందు నీతోగూడిన జగము నంతయు చూడుము! అటులే బ్రహ్మదేవుని రుద్రుని గాంచుము! అందుకు వలయు దివ్యదృష్టిని నీ కొసగుచున్నాను. అని చూపెట్టిన దధీచిఁదగు విశ్వరూపము నవలోకించియు విశ్రాంతిఁజెందనివాడై పూర్వాధిక కోపమున యుద్ధముఁజేయ నుంకించుచు నిశ్చేష్టుడగుచుండెను. దేవతలును విష్ణుపక్షమునుండి కోలాహలముఁజేయుచు స్తబ్దులగుచుండిరి. అట్టి విషమపరిస్థితిని గమనించి క్షువుఁడు నారాయణుఁని యుద్ధమునుండి మరలించెను. అంత బ్రహ్మదేవుఁడేతెంచి శాంతి వచనములను పలుకగా శ్రీహరి శాంతించి వినమ్రుడై దధీచికి మ్రొక్కులిడెను. మరియు క్షువుండును దీనుఁడై చేతులు జోడించియు "మునిశార్దులా! దధీచీ? ప్రసన్నుడవు కమ్ము! నాయపరాధనమును మన్నింపు" మని ప్రార్థింపగా తపోనిధియు శివభక్తశిఖామణియు నగు దధీచిమహర్షి శాంతించి క్షువుని చేరదీసెను. తరువాత నమరులకు నారాయణునకును "మీరందరు రుద్రకోపాగ్నిచే దహింపఁ బడుదురు గాక, అని దధీచి మహర్షి శాపం బొసంగెను. మరియు "దేవతలచే తను రాజులచేతను ద్విజులందరిచేతను బ్రాహ్మణులే పూజింపదగినవారు గావున నవ్వారే సర్వశ్రేష్టులగుదురు" అని హెచ్చుగా లోకమున సందేశము నిడియు నిజాశ్రమమునకుఁ జనినవనాడు క్షువుండును దధీచికి నమస్కరించి తన నివాసమునకు వెళ్ళెను, విష్ణుమూర్తియు దేవతలందరితో కూడ తన లోకమున కేగెను. అచ్చోట స్థానేశ్వర మను తీర్థమొప్పారుచున్నయది. స్థానేశ్వరమునకుఁజని యచటి మహాదేవు - నారాధించినవాడు• శివసాయుజ్యము నొందును. ఇట్లు క్షువదధీచి సంవాదము ప్రవర్తించినది. క్షువుని కారణముగా దధీచియొసగిన శాపమునఁజేసి బ్రహ్మవిష్ణ్వాది దేవతలు దక్షుని యజ్ఞములో పాలుగొనవలసినవారైరి. ఇట్టి క్షువదధీచి సంవాదమును నిత్యము కీర్తించు మహాపురుషుఁడు సర్వవిధ అపమృత్యువులను తొలగించుకొని దేహాంతమున శివసాయుజ్య నిలయమగు మహాకైలాసమును పొంది శాశ్వతశివానందము ననుభవించువాడగునని సూతుఁడు చెప్పగా శౌనకాది మహర్షులువిని సంతసించిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పదియేడవ యధ్యాయము.





# అష్టత్రింశాధ్యాయము

## (బ్రహ్మాది దేవతలు కైలాసమును వెళ్ళి శివుని దర్శించుట)

శైవతత్త్వమును గురించి బాగుగా వివరించు మహానుభావుడవు; నీవు వర్ణించిన శివలీలా చరిత్ర అద్భుతముగా నున్నయది. దక్షయజ్ఞమును నశింపఁజేసి వీరభద్రుఁడు కైలాసమునకుఁ జనిన తరువాత జరిగిన వృత్తాంతమెద్దియో వక్కాణింపు మని శౌనకాది మునులు ప్రశ్నింపగా సూతమహర్షి చెప్పఁదొడఁగెను.

దేవతలు ఋషులు ప్రమథ గణములచే పరాజితులై బ్రహ్మలోకమునకు దక్షయజ్ఞవాటికనుండి వెడలి యచట స్వయంభువునకు నమస్కరించి స్తోత్రములతో ప్రార్థించియు తమ యిడుములను పూర్తిగా నివేదించిరి. అంత బ్రహ్మదేవుఁడు వారి యాక్రందనమంతయు విని పుత్రుండగు దక్షునకు కలిగిన పరాభవమునకు వగచుచు కొంతతడవు ఆలోచించి ఏమియు తోచనందున నారాయణుని నివాసమునకు దేవతలతోడను మునులతోడను వెడలి "రమానాథా! నిన్ను శరణుబొందుచున్నాము. దక్షుఁడెట్లు జీవించునో యజ్ఞము పరిపూర్ణమగుట నెట్లో అట్టి యుపాయము నేర్పరచు" మని ప్రార్థింపగా విష్ణువు స్వాంతర్యామియగు శివుని స్మరించి దిగువ విధము వాక్రుచ్చెను.

దివ్య ప్రభావము గలవారి విషయమై యపరాధముఁ గావించినవారికి క్షేమమెన్నటికిని కలుగదు. ప్రస్తుతము పరమేశ్వరుండైన శివుని గురించి దేవతలు మునులు నపచారము నొనర్చినవారు. శివుని నిరాకరించి యజ్ఞభాగములను పరిగ్రహించుటయే గొప్ప యపచారమని భావింపుడు! పరమేశ్వరుని పాదకమలములను స్పృశించి క్షమాభిక్షనడుగుటఁదక్క వేరొండు నుపాయము గానరాదు. ఏదేవుఁడు కోపించినచో జగమంతయు నశించునో అట్టి మహాదేవుని యనుగ్రహమును సంపాదింతుమేని దక్షప్రజాపతి మున్నగు ప్రపంచమునంతయు జీవింపఁజేశిన వార మగుదుము. దక్షుఁడు మును నానావిధ దుర్భాషణములతో శంకరుని హృదయమును వేధించియున్నవాడు.

అట్టి మహేశ్వరుని ప్రస్తుతము పలువిధములఁ బ్రార్థింపవలసియున్నది. నిజముగా విచారించిన యెడల

శ్లో॥ నాహం నత్వం సురా శ్చాన్యే - మునయోఽపి త నూభృతః ।
యస్య తత్త్వం ప్రమాణంచ - న విదుర్బల వీర్యయోః ॥

ఎవని సత్తువను ప్రభావమును స్వరూపమును కొలతను దేవతలుగాని మునులుగాని ఇతరులైన శరీరధారులుగాని చివరకు నీవునేనును కనుగొనఁజాలమో అట్టి స్వతంత్రుఁడు పరమాత్మయు నగు శివుని స్వాధీనపరచుకొందు ననుకొనువాడే మూఢచిత్తుండగును. మీ యందరివలె నేనును దక్షయజ్ఞమునకు పాలునిగొనందున నపరాధినైతిని. కావున మనమందరము కూడి శివాలయము అనఁగా కైలాసమునకు వెళ్లుదము".





ఇట్లు నారాయణుఁడు దేవతాముని సమేతుఁడై కైలాసపర్వతమునకు బయలుదేరిన వాఁడయ్యెను. వైకుంఠమునుండి కైలాసము కొన్ని కోట్లయోజనముల దూరమున్నందున మార్గ క్రమముగా శంకరుని నివాసములలో ముఖ్యంబైన రజతాద్రిఁజేరుచుండెను.

కైలాసము – ప్రభువునకు మిక్కిలి ప్రియమైనదియు, కిన్నెరకింపురుషాదులు తిరుగాడునదియు, అప్సరసలు విహరించునదియు, శివయోగసిద్ధులు సేవించునదియు, అనేక విధ మణులతో నిండిన శిఖరములతో శోభించునదియు గైరికాదిధాతువులచే విచిత్రంబైనదియు, దివ్య మందార పారిజాతాది కల్పవృక్షములచేతను తీగెలచేతను నిండియున్నదియు, పలువిధములగు శరభాదిమృగములు సంచరించు నదియు పలుతెఱఁగుల పక్షులు కూయునదియు అనేకవిధ గంగాది జలప్రవాహముల చెంత సిద్ధ వనితలు తమ ప్రియులతో విహరించునదియు పెక్కుగుహలు కొండచరియలును కలదియు, తదితర వృక్షజాతి విశేషములతో నొప్పారునదియు వ్యాఘ్రములు మొదలగు జంతువులు తమ క్రూరస్వభావమును విడనాడి ప్రవర్తించునదియు అన్ని విధములైన కాంతులు గలదియు చూపరులకు నపరిమితానందమును విస్మయమును కలుగఁజేయునదియు పుణ్యతరము దివ్యంబు నగు విష్ణుపదము (ఆకాశము) నందు నుదయించిన సర్వపావనంబగు గంగానదితో వ్యాపింపఁబడినదియునై విరాజిల్లుచుండెను. ఇట్టి కైలాసమును బ్రహ్మావిష్ణ్వాదులు మునీశ్వరులును గాంచి యచ్చెరువు నందుచుండిరి. అద్దాని చేరువను శంకరుని సఖుండగు కుబేరుని సర్వాంగ సుందరంబగు అలకానగరము కన్పట్టుచుండెను. అలకానగర సమీపమున నానావిధవృక్షములతో నలరారు సౌగంధికమను వనమొండు గోచరించుచుండెను. సౌగంధిక వనబాహ్యమున నంద, అలకనంద, యను పావన నదులు ప్రవహించును. దేవతావనితలు తమ ప్రియులతో రతిశ్రమంబు పోనాడదలచి యీ నదులయందు జలకంబు లాడి విహరించుచుందురు. దేవతలు అట్లు అలకానగరముఁదాటి సౌగంధిక వనములో ప్రవేశించుసరికి శంకర నివాసమగు వటవృక్షమ్ము దృగ్గోచర మగుచుండెను. కదలని కాంతి గలదియు చిగిరించిన కొమ్మలు గలదియు శతయోజనముల ఎత్తైనదియు కైలాసముఁదగు అడుగు భాగముదక్క పైభాగమంతగా వైశాల్యము కలదియు పక్షుల నీడములు లేనట్టిదియు ఎట్టి బాధలు లేనిదియు గొప్ప పుణ్యముల రాశి గలవారికే కనఁబడునదియు మిక్కిలి మనోహరమైనదియు అతిపావనంబును పరమేశ్వరుని నిజరూపధ్యాన యోగముఁదగు ముఖ్య స్థలము గలదియు భూసంబంధములగు వికారములు అనఁగా చదలు కోగులు భూతప్రేతపిశాచాద్యు పద్రవములు లేనిదియు శాంభవ – దీక్షితులై శివునుపాసించు శివయోగులు సేవింపఁదగినదియు విరజానదీ తీరగత వైకుంఠమునకన్న నుత్కృష్టంబైనదియు ముముక్షుశరణంబు, మహాయోగమయంబు నగునా వటవృక్షముఁ దగు మూలమున దర్భాసనము నధిష్ఠించియుండు శివుని (దక్షిణామూర్తిని) విష్ణ్వాద్యమరులు దర్శించు చుండిరి. అట్టి తతి యోగీశ్వరుండగు సదాశివుడు శివభక్తితత్పరులు, సిద్ధులలో నగ్రగణ్యులును ప్రసన్నచిత్తులు జితేంద్రియులు నగు బ్రహ్మమానసపుత్రులగు సనకసనందనాదులచే సేవింపబడుచుండెను. మరియు, గుహ్యక కిన్నరకింపురుషాదులతో శివసఖుండైన కుబేరుడు నూడిగములఁజేయుచుండెను. తాపసులకు నభీష్టములను ప్రసాదించు సద్రూపము గల విశ్వమునకు ఏకైక ఆప్తబాంధవుఁడును భస్మరుద్రాక్షాదులచే విరాజిల్లువాడును ముఖ్యముగా నారదునకు నుత్తమమైన పాశుపతజ్ఞానము నుపదేశించు వాడును తదితర భక్తులు వినునట్లు శివజ్ఞానప్రసంగము నొనర్చువాడు నగు దక్షిణామూర్తిదైవము



కుడితొడయందు ఎడమ చరణమును ఎడమతొడమపై కుడిచరణమును నెలకొలిపి బాహువులయందు ముంజేతులయందును రుద్రాక్షల దాల్చియు జ్ఞానముద్రతో నలరారుచుండెను. "జీవుడా! శరీరమగుదువు; ఐనను నీలోన నున్నవానిగా నన్ను తెలలియకుంటివి; ఎప్పుడు కల్యాణ దేశికునివలన శాంభవ దీక్షగైకొని యిష్టప్రాణభావలింగాత్మకుడనగు నన్నుపాసించుచు స్వాంతర్యామిగా కనుగొందువో నప్పుడే మృత్యుముఖమునుండి అనగా సంసార బంధమునుండి విడిబడుదువు" అను నర్థము ఆ దేవదేవుని జ్ఞానముద్రలో స్ఫురించుచుండెను.

ఇట్టి మహేశ్వరుని దివ్యవిగ్రహమును కనులార గాంచుచు బ్రహ్మ విష్ణ్వాదిబృందారకులు వినమ్రులై సాష్టాంగప్రణామంబులను సమర్పింపగా శివుండు ప్రత్యభినందన పురస్సరముగా నవ్వారి నందరిని సత్కరించెను. అంత సురసిద్ధ గణమహర్షులు పునఃప్రణామము నాచరింపగా నారాయణుండు సర్వదేవతా సముదాయంబును శివుని గురించి సంభాషణము నిట్లు ప్రారంభించినవారు.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున ముప్పది యెనిమిదవ అధ్యాయము.**

## ఏకోనచత్వాంశాధ్యాయము

### (దేవతలు శివుని స్తుతించుట)

విష్ణుమూర్తి మున్నగు నమరులు దిగువవిధము శంకరుని ప్రార్థించిరి.

శ్లో॥ దేవదేవ మహాదేవ - లౌకికాచారకృత్ప్రభో ।
బ్రహ్మత్వా మీశ్వరం శంభుం - జానీమః కృపయాతవ ॥

బ్రహ్మవిష్ణ్వాది దేవతలకు దేవుండవు గొప్పదైన ఆత్మైశ్వర్యమునందు ప్రకాశించువాడవు ప్రాకృతజనుల ప్రవర్తనము ననుసరించువాడవు నగునో పరమేశ్వరా! నిన్ను భక్తులకు సుఖము నొదవంజేయువానిగాను సర్వవ్యాపకంబైన పరబ్రహ్మముగాను జగచ్ఛాసకుండైన మహేశ్వరునిగాను నీ యనుగ్రహమువలననే భావించుచున్నాము. పురుషులనందరిని మోహింపంజేయునదియు ఏరికిని తెలియ నలవి కానిదియు అన్నిటికన్నమిన్నయు నగు నీ మాయతో మమ్మెందుకు మోహింపంజేయుచున్నావు? ప్రపంచమునకు యోని బీజంబులగు ప్రకృతి పురుషుల నతిక్రమించి మనోవాచా మగోచరుడవై యుందువు! స్వరూపంబగు శివశక్తితో వివరించుచు స్వతంత్రముగానే విశ్వమును నిర్మింతువు; రక్షింతువు; భక్షింతువు; సాలెపురుగు తనలోని దారములచే పటమును సిద్ధపరచునట్లు మరల నా దారముల నాకర్షించునట్లును నీ సృష్టిస్థితిలయములు నొప్పారుచుండును.

వేదధర్మ బవగతమగుటకు దక్షునిద్వారా యజ్ఞము నేర్పరచినవాడవు నీవేను; నీవే వేదమర్యాదలను కల్పించితివి. అట్టి నియమములనే నైష్ఠికులైన వైదిక శిఖామణులు ఆచరించుచున్నవారు నిన్నాశ్రయించి శుభకర్మల నాచరించువారికి సుఖమును ప్రసాదింతువు; నిన్ను నిరాకరించుటయే గాక నశుభక్రియల





నొనర్చువారికి దుఃఖము సంభవించును. కొంత శివపరముగాను మరికొంత స్వపరముగా కర్మలఁ జేయువారికి కలుగు ఫలము సుఖదుఃఖ సమ్మిశ్రముగా నుండును. సుకృతములన్నిటి ఫలముల నొసగువాడవు నీవే గదా! పుణ్య కర్మలన్నియు యశస్కరములైనట్టివి. అట్టి సత్కర్మలకు నీవేయధిపతి వని శ్రుతులు వక్కాణించుచున్నవి.

ఈశ్వరుఁడు సర్వాంతర్యామి యగునను విశ్వాసము సడలినవారు సంకుచిత మనస్కులై కేవలము కర్మయే ఫలించునని భావించి దుష్టచిత్తముతో నితరుల మర్మస్థానములను వేధించుచు పరోత్కర్షను సహింపని మూఢస్వభావులై యొరులననవసరముగా బాధించుచుందురు. అట్టి దేవద్రోహులకు నీ వలన శిక్షణము జరుగుగాక! పరమేశ్వరా! కరుణించుము!

సంసారరోగమును హరించు రుద్రునకు మనోవాగ్వికారములు లేనట్టి శాంతునకు సమస్త ప్రపంచముగా పరిణమించు బ్రహ్మమునకు జీవాత్మలోనుండు పరమాత్మకు జటాజూటముగల కపర్దికి మాయనధిష్ఠించు మహేశ్వరునకు దివ్యాంతరిక్షమునందు వెలుగొందు మహాజ్యోతిర్లింగమునకు నమస్కారము.

విశ్వమును సృజించు చతుర్ముఖాదులను పుట్టించినవాడవు నీవేను; జగద్రక్షకుడవు గావున ప్రపితామహుండనఁబఱగుదువు; సత్వ రజస్తమోగుణాత్మకుడవై గుణముల నతిక్రమించువాడవు; ప్రకృతిపురుషులను మించినవాడవు; సముద్రమథనమునఁ బుట్టిన హాలహలవిషమును పార్వతీవిష్ణువుల యభ్యర్థనము ననుసరించి లోనికి మ్రింగనివాడవై బయటనుంచనివాడవై కంఠమున నిలుపుటచే నీలకంఠుడవైతివి. విశ్వేశ్వరుఁడవు; జగములోని ప్రాణులు ఆనందించుటకు కారకుఁడవు; ఓంకారంబును వషట్కారంబును నీవేను, సమస్త శుభకార్యములను ప్రారంభింపఁజేయువాడవు; స్వాహాకారము స్వధాకారంబును నీవై హవ్యకవ్యముల ననుభవింతువు. ఇట్టి నీవు యజ్ఞభంగమునెట్లు గావింపఁజేసితివి? గోబ్రాహ్మణులను ధర్మమును కాపాడువాడవు; ప్రాణులందరికిని శరణ్యుండవు; సూర్యకోటిసమానకాంతి గల పరమేశ్వరా! భూజలతేజోవాయ్వాకాశ సూర్యచంద్రయజమాన స్వరూపములఁ ధరించి అష్టమూర్తి యనంబఱగితివి. భవరుద్ర ఈశ పశుపతి భీమ మహాదేవ ఉగ్ర శర్వ ముఖ్యనామధేయముల నొప్పారువాడవును; శివుఁడవు, శంకరుఁడవు, ప్రాణులందరిని నియమించువాడవు, భక్తుల సంకటములను నివారించువాడవు, అంబికయనఁబడు నుమాదేవికి ప్రాణవల్లభుడవ; సర్వాత్మకుడవు; పురుషుండవు; సత్తు అసత్తు అనువాని వివేకమును కలిగించువాడవు; స్థూలప్రపంచ కారణంబగు మహత్తు నేర్పరచినవాడవు; లోకమున ననేక రూపములతో నావిర్భవించు వాడవు. రాక్షసులను సంహరించువాడవు, శివపంచాక్షరీ స్వరూపుడవు, నిన్ను శివపంచాక్షరినుపాసించువారిని తరింపఁజేయువాడవు, నిత్యయౌవన విరాజితుడవు, మంచి ప్రభావము కలవాడవు, దేవతలకు మేలునొనగూర్చువాడవు, ఆకాశమువలె నంతట వ్యాపించువాడవు, హిరణ్యస్వరూపుడవు, భక్తులుకానివారికి భయముఁగొలుపు పనులఁజేయువాడవు, విభూతిఁదాల్చినవాడవు, రుద్రాక్షల నలంకరించిన వాడవు, ధనుర్ధారివి, త్రిశూలధరుడవు, గదను నాగలిని పలు ఆయుధములను ధరించి దుష్టులను దునుమాడువాడవు, సద్యోజాత వామదేవ అఘోర తత్పురుష ఈశాన ముఖపంచకముతో విరాజిల్లుచు ధర్మార్థకామ మోక్షములను ప్రసాదించు సదాశివుండవు; వీరభద్ర స్వరూపుండవు నీవేను; శ్రీకంఠుఁడవు, పినాకివి, అనంతుడవు, సూక్ష్ముడవు,



శ్లో॥ నమో విష్ణుకళత్రాయ - విష్ణుక్షేత్రాయ భానవే ।
భైరవాయ శరణ్యాయ - త్ర్యంబకాయ విహారిణే ॥ ౪౦

మోహినీ అవతారమున విష్ణువును భార్యగా పరిగ్రహించి సూర్యుఁడు తన కిరణములను కమలములయందు ప్రసరింపజేయునట్లు శాస్తయను భైరవుని పుట్టించువాడవు, మృత్యుంజయుడవై యపమృత్యువు గల వారందరికి శరణ్యుడవైతివి; సూర్యచంద్రాగ్ని నేత్రుడవు; కారణములకు కారణములగువాని నవధి నతిక్రమింపఁజేయనివాడవు; స్వకీయ ప్రతిభ తోడనే జగమునంతయు వ్యాపించినవాడవు; బ్రహ్మవిష్ణువులు ఇంద్రచంద్రాదిదేవతలు సనక సనందనాది మహర్షులును నీవలననే జనన్మించినవారు. ఎనిమిది స్వరూపములతో ప్రపంచమును భరించువాడవు, అద్వయుడవు, కరుణామయుండవు, వాయువు వీచుటయు, అగ్ని దహించుటయు సూర్యుఁడు తపించుటయు మృత్యువు పరుగిడుటయు నీ భయమువలననే సంభవించుచున్నవి. దయాసముద్రుడవైన మహేశ్వరా! ప్రసన్నుడవు కమ్ము! దక్షయజ్ఞములో పలుబాధలననుభవించిన మమ్ము! రక్షింపుము! ఇంతకు మున్ను అనేకపర్యాయములు నానా సంకటములనుండి కాపాడితివి. అటులే సాంప్రతము మమ్ము రక్షించుము! దక్షప్రజాపతి ప్రారంభించిన యజ్ఞమును పూర్తిగా కొనసాగింపఁజేయుము! భగుఁడను సూర్యుఁడు నేత్రములను పొందుగాక! యజమానుడైన దక్షుఁడు జీవించుగాక! పూషుఁడను సూర్యునకు దంతములు సంభవించుగాక! భృగుమహర్షికి కనుబొమలు నేర్పడుగాక! ఆయుధములచే నవయవములను పోగొట్టుకొనిన దేవతలందరును నీ యనుగ్రహమున ఆరోగ్యవంతులై పూర్వస్వరూపములు కలవారగుదురు గాక! యజ్ఞకర్మలయందు అవశిష్టమంతయు నీకు పూర్ణభాగముగా సమర్పింపఁబడుగాక!

ఇట్లు నారాయణుఁడు బ్రహ్మదేవుఁడును కృతాంజలులరై శంకరుని మ్రోలనిలువఁబడి క్షమించుమని సాష్టాంగప్రణామముల నాచరించినవారు.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున ముప్పదితొమ్మిదవ యధ్యాయము.**

## చత్వారింశాధ్యాయము

### (దక్షుని దుఃఖమును తొలగించుట)

అవ్విధము బ్రహ్మవిష్ణు నారదాదులచే ప్రార్థితుడైన శంకరుఁడు ప్రసన్నుడై మందస్మితవదనార విందుండగుచు "సురోత్తములారా! నామాట వినుడు! మిమ్ము గురించి క్రోధము నణచితిని. మూఢుల భేదాభిప్రాయమును పరిహరింప నుద్యుక్తుడనగువాడను. నా మాయచే తిరస్కరింపఁబడినవారిని శిక్షించుట యనివార్యంబగునుగదా! దక్షుని యజ్ఞమును నేను భంగపఱచలేదు. కాని లోకమున నొరులకు తానెట్టి కీడు తలపెట్టునో అట్టి సంకటము తనకే సంభవించును. కావున పరులకు నపకారము నెన్నటికిని గావింపఁ గూడదు. దక్షుఁడు మేషముఖముగలవాడై జీవించుగాక! భగుఁడు మిత్రుని నేత్రములతో చూచుగాక! పూషుఁడు యజమానుని దంతములతో హవిర్భాగము ననుభవించుగాక! నా విరోధియగు భృగుమహర్షి





మేకదగు వెంట్రుకలతో కనుబొమలు కలవాడగుగాక! గోలుపోయిన అవయవములను దేవతలు పొందుదురుగాక! అశ్వినీదేవతలు పూషుని హస్తములతో భుజములు గలవారై హవిస్సులను మోయుదురుగాక! ఇతరులైన అధ్వర్యులు స్వస్థులగుదురు గాక! మీ యుభయులపై నుండు స్నేహమున నిట్లు ననుగ్రహించితి" నని వక్కాణించెను.

వేదమార్గ ప్రవర్తకుఁడు చరాచరపతియు దేవతాసార్వభౌముఁడునగు పరమేశ్వరుఁడు దయామయుడై సంభాషించిన ప్రసంగమును విని దేవతలు బ్రహ్మవిష్ణువులను ప్రశంసించి సంతసించిరి. మరియు నవ్వారి ప్రార్థనము ననుసరించి శంకరుఁడు దక్షుని యజ్ఞవాటికఁదగు కనఖలక్షేత్రమునకు వెళ్ళి వీరభద్రుఁడు గావించిన యజ్ఞధ్వంసమును దేవతల యంగవికలతను గాంచి యాతని సాహసకృత్యములకు ప్రసన్నుడై "వీరభద్రా! ఇంత ఘోరముగానెందుకు ప్రవర్తించితివి?" అని మాత్రము వచించి కనివిని యెరుగనట్టి వింతథోరణిని జన్మమునొనర్చి విపరీతఫలము నొందిన దక్షుని శరీరమును తీసుకొని రమ్ము" అనియాజ్ఞాపించెను.

అంత వీరభద్రుఁడు త్వరలోనే దక్షుని మొండెమును గొనితెచ్చి శంకరుని ముందు నుంచగా నీతని తలకాయ కలదా యని శంకరుఁడు ప్రశ్నింప నప్పుడే అగ్నియందు పడవేసితినని వీరభద్రుఁడు వచించెను. యజ్ఞపశువగు మేషముఁదగు శిరమును తెచ్చి దక్షశరీరమునకు ననుసంధింపుఁడు అని శంకరుఁడాదేశింపగా దేవతలు అవ్విధము గావించిరి. భృగ్వాదులకు భగ్నాంశములు నొనగూర్పఁబడెను. దక్షుఁడవ్విధము మేషశిరస్కుడగునపుడు శంకరుఁడు అమృత వీక్షణములతో చూచినందున నిద్రించినవాడు మేలుకొనునట్లు పునర్జీవితుడై – మున్ను తాను హరుని యందు గొప్ప ద్వేషము కలిగియున్నను ప్రస్తుతము శంకరుని గాంచినంతనే శరచ్చంద్రునిఁబోలు శీతల హృదయము గలవాడయ్యెను. మరియు మహాదేవుని ప్రార్థింపఁదలచియు భక్త్యతిశయమున నోటమాటరానివాడై యోగాగ్ని భస్మీభూతయగు తనకుమార్తెను మదిందలచుచు మిన్నకుండెను. కొంత తడవునకు మనుస్సుఁగుదుటపరచుకొని సిగ్గుచే తలవంచుకొని లోక శంకరుఁడైన పరమేశ్వరునిట్లు ప్రార్థించెను.

(యోగాగ్ని యందు కాలుచున్న సతీదేహమును భుజముపై నెత్తుకొని ప్రపంచమున శంకరుఁడు సంచరించెననియు విష్ణువు ధనుర్బాణములతో సతీశరీరమును ఛేదింపగా తద్భాగములు పడినచోట్లు దేవీపీఠములయ్యె ననియు దేవీభాగవతమునందు చెప్పఁబడినది కాని శంకరుని వర్ణించు పది శివపురాణములలో మూడులక్షల శ్లోకముల వాఙ్మయము నందెచ్చోటను నైవిధము లేనందున నియ్యది శైవులకు పరిగ్రాహ్యము కాకున్నయది. శివక్షేత్రములవలె దేవీపీఠములు ఆ యా భక్తులయభిలషితము ననుసరించి వెలసినవని చెప్పుటలో విరోధమేమియు గానరాదు).

వరదుఁడు వరేణ్యుడు జ్ఞాననిధియు సనాతనుఁడు దేవాధిపతియు జగదేకబాంధవుఁడు ఎల్లకాలము సుఖముతో నొప్పారువాడు నగు మహేశ్వరుని మ్రొక్కుచున్నాను. విశ్వేశ్వరుఁడు విశ్వరూపుఁడు పురాతనుఁడు బ్రహ్మంబు ఆత్మస్వరూపుఁడు సంసారము చక్కగా సాగుటకు కారకుఁడు పరాత్పరుఁడు నగు శంకరునికి నమస్కారమగుగాక!





మహాదేవా! కరుణించుము! నా యపరాధమును క్షమింపుము! నన్నీవిధముగా దండించి ననుగ్రహించితివనియే భావించుచున్నాను. నీచుడను మూఢచిత్తుడను నీతత్త్వమును గుర్తెరుంగజాలకుంటి

శ్లో॥ అద్య జ్ఞాతం మాయాతత్త్వం - సర్వోపరి భవాన్మతః ।
విష్ణుబ్రహ్మాదిభిః సేవ్యో - వేదవేద్యో మహేశ్వరః ॥ ౩౬

శంకరా! పంకజాసన పద్మనాభులు మున్నగు దేవతలచే సేవింపంబడువాడవనియు బ్రహ్మవిష్ణువుల కన్న నధికుండవనియు, నిన్ను తెలుసుకొనవలె నన్న వేదవేదాంతములను పఠించి తదర్థము బాగుగా-గుర్తెరుగవలసియుండుననియు నీవేళ కనుగొంటిని. సజ్జనులకు కల్పవృక్షమువంటివాడవు దుర్జనులను శిక్షించుటలో వెనుకంజ వేయనివాడవు; స్వతంత్రుండవు. భక్తులయభీష్టవరముల నొసగు పరమాత్మవు; విద్యాతపోవ్రతధారులైన బ్రాహ్మణులను మొదట పుట్టించి యవ్వారికి నీముఖోద్గతము వేదముల నాత్మతత్త్వమును గురుతెఱుగుటకై యందించితివి మరియు పశుపాలకుండు పశువులను సంకటములనుండి భక్తులను రక్షించువాడవు; దుర్మార్గులను దండించుచు వేదమర్యాదలను పాలింతువు దుష్టవాక్యములను బాణములతో నిన్ను వేధించితిని. మిక్కిలిదీనులైన దేవతలను మన్నించి రక్షించు భక్తవత్సలా? దీనబంధో! సంతుష్టుడవై నేను గావించిన స్తోత్రముతో ప్రసన్నుడవు కమ్ము!

ఇట్టి దక్షుని ప్రార్థనము తరువాత నారాయణుండు దిగువ విధము శంకరుని నుతించెను.

మహాదేవా! మహేశ్వరా! లోకానుగ్రహమే నీ ముఖ్యకర్తవ్యము గదా! దయానిధివి, పరబ్రహ్మ పరమాత్మవు నీవేను, సర్వవ్యాపివి, స్వేచ్ఛాప్రవర్తనుండవు, నీ కీర్తిని వేదములు గానము చేయుచుండు నీవు అనుగ్రహించుట మా పూర్వసుకృతముల ఫలమని భావింతుము. ఈ నాభక్తుడైన దక్షుడు దుష్టబుద్ధిగలవాడై పూర్వము నిన్ను నిందించినవాడు. నిర్వికారుడవైన నీవు ప్రస్తుతము దక్షుని క్షమించి రక్షించుము! నేనుగూడ దక్షుని పక్షము నుండి నీవాడగు వీరభద్రునితోయుద్ధమునొనర్చి యపరాధినైతి

శ్లో॥ త్వంమే స్వామీ పరబ్రహ్మ - దాసోఽహం తే సదాశివ ।
పోష్యశ్చాపి సదా తేహి - సర్వేషాం త్వం పితాయతః ॥ ౪౮

నీవు నాకు ప్రభుండవు, నేను నీ సేవకుడను, ప్రాణులందరికి తండ్రివి కావున పుత్రకుడనగు ఎల్లకాలముపోషించు భారము నీయదియేను.

పిమ్మట బ్రహ్మదేవుండిట్లు ప్రార్థించెను.

"కరుణా సాగరా! దేవదేవా! శంకరా! అద్వితీయుడవు అనంగా నీతోసమానుడైన రెండవవాడు లేనివాడవు; ఆదిమధ్యాంత రహితుండవు; నా కుమారుండగు దక్షుని కనికరించి నీ యవమానము తృణీకరించియు జన్నము నుద్ధరింపుము! ప్రసన్నుడవు కమ్ము! నిన్ను నిరాకరించి దక్షయజ్ఞము పాలుగొనినవారికి గావింపంబడిన శిక్షణములను మానిపింపుము! సర్వాంతర్యామివై జీవుల శుభాశుభకర్మలయందు ప్రవర్తింపను నివర్తింపను ప్రేరేపించువాడవు నీవేను; విధేయుడనై మ్రొక్కులిడు చున్నాను. కరుణించుము!"

అంత నింద్రాదిలోకపాలురు చేతులుజోడించి ప్రసన్నముఖపంకజుఁడగు శంకరుని యనేకవిధముల గొనియాడిరి. దేవతాజాతులు, నాగములు, సదస్యులైన బ్రాహ్మణులును పరాభక్తితో శంకరునకు నమస్కరించి వేరువేరుగా స్తోత్రములను గావించిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున నలుబదియవ యధ్యాయము.

## ఏకచత్వారింశాధ్యాయము

### (దక్షయజ్ఞము పూనగూర్చుట)

విష్ణుమూర్తి బ్రహ్మదేవుఁడు నింద్రాదిసురలును గావించిన ప్రార్థనమునకు సంతసించి యవ్వారిని కృపాదృష్టితో నవలోకించియు విధికేశవులను సమాధానపరచియు దక్షప్రజాపతి నుద్దేశించి "నేను సర్వకాలము భక్తపరాధీనుడనై యుండువాడను మరియు స్వతంత్రుడనై యఖిలప్రపంచము నవినీతి మార్గమునుండి మరల్పుచు శాసించుచుందును. ఇఁక నీ విషయమై ప్రసన్నుడనైతిని.

శ్లో॥ చతుర్విధా భజంతే మాం - జనాః సుకృతినః సదా ।
ఆర్తోజిజ్ఞాసు రర్థార్థీ - జ్ఞానీచైవ చతుర్థకః ॥ ౫

పుణ్యశీలురైన భక్తులు నాలుగు విధములుగా నన్ను సేవింతురు. ఇడుములపాలైన భక్తుఁడు మొదటివాడు; నా స్వరూపమును తెలియఁగోరువాడు రెండవ వాడు; లోకకల్యాణము నిజశ్రేయస్సు మున్నగు వాంఛితముల నభిలషించువాడు మూడవవాడు; నా స్వరూపము స్థూలముగా కనుగొని సూక్ష్మముగా గుర్తెరుగు యోగ్యత గలిగి నన్నుపాసించువాడు నాలుగవవాడు. ఇందు ప్రథమ ద్వితీయ తృతీయులు సామాన్యులని చెప్పవచ్చును. అనఁగా నిట్టివారు ప్రపంచమున తఱచుగా కనఁబడుచుందురని భావము. నాలుగవవాడైన జ్ఞాని - ముప్వురికన్న నధికుఁడగును. ఉపాసనాత్మక జ్ఞానము గల భక్తవరేణ్యుఁడు శాంభవీదీక్షను పరిగ్రహించి పాశుపత నియమముల నవలంబించియు షట్‌స్థలముల యందు షట్‌కాలములో దశావధాన పురస్సరముగా నన్నుపాసించును గావున నాతడు నాకు మిక్కిలి ప్రియుండగుటయే గాక భస్మరుద్రాక్ష మంత్ర శివలింగములను ధరించియుండుటఁజేశి నా స్వరూపమగు ననియే తెలియవలెను. అతని కంటె ప్రియుడు మరియొకఁడు లేడని భావించుము. ఇది ముమ్మాటికి యధార్థము.

ఆత్మస్వరూపుడను; జ్ఞానగమ్యుడను; ఉపాసనాత్మక జ్ఞానమును నిరాకరించి కేవలము కర్మతో నన్ను కనుగొన నుద్దేశించు వారు అల్పబుద్ధి గలవారని భావించుము! కర్మిష్టులు - వేదములచే గాని యజ్ఞములతో గాని దానములనైనను తపస్సునంజేశియు నన్ను పొందఁజాలరు. దక్షా! కర్మతోడనే సంసార సముద్రమును తరించుటకు కోరుచుంటివి. కావుననే కర్మఫలదాతనగు నన్ను భావింపకుంటివి. అందువలన నీ విషయమై అగ్రహము జెందవలసి వచ్చెను. ఇంకముందు మాత్రము బుద్ధిబలము





గలవాడవై జ్ఞానము నాశ్రయించి సుకృతములంజేయుచు నన్నే సర్వకర్మాధిష్ఠాతగా భావించుము. మరియొక రహస్యమును చెప్పుచున్నాను. నేనే బ్రహ్మదేవుడను, విష్ణుమూర్తిని; సకల జీవులను శాసించువాడను; జగత్కారణుండను ప్రాణులసుకృతదుష్కృతములను గమనించి సుఖదుఃఖముల నొసగూర్చువాడను; స్వయముగా సమస్తమును కనిపెట్టుచుందును. త్రిగుణాత్మకురాలగు మాయ నధిష్ఠించి జగముందగు సృష్టి స్థితి లయములంజేయుచుందును. నా యందు దృఢభావన గల మహాపురుషుండు ప్రపంచమునందగు వ్యక్తులయందు భేదమును పాటింపంజాలడు. సర్వభూతములయందును సమముగా పరమాత్మ నివసించియున్నాడను ఐక్యభావన – కడుంగడు శ్రేయస్కరమైనది.

శ్లో॥ మత్పరః పూజయేద్దేవాన్ - సర్వానపి విచక్షణః ।
స జ్ఞానం లభతే యేన - ముక్తిర్భవతి శాశ్వతీ ॥ ౧౮

నా యందలి నిష్ఠతో బ్రహ్మవిష్ణు ఇంద్రచంద్రాది దేవతలందరిని విద్వాంసుండు పూజింపవలెను. అట్టివానికే మోక్షావహమగు జ్ఞానము – ఉపాసనరూపమున సంభవించును. అట్టి జ్ఞానియే పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యము నొందునని భావము. గత జన్మల యందు బ్రహ్మదేవుని విష్ణుమూర్తి నారాధించినవారికే ఈ జన్మయందు నా విషయమై ఏకాంత భక్తియంకురించును. అట్టివాడు ఇతరదేవతా ద్వేషమును విడనాడి నన్నారాధించుచుండిన తత్త్వజ్ఞానము కలవాడగును అని శంకరుడు వచింపగా నద్దాని నాకర్ణించి సురలు మునులు హర్షధ్వానముల నొనరించిరి. దక్షుండు శివవాక్యమును మేలుకొని గొప్పయనురాగముతో శివభక్తి తత్పరుండయ్యెను. అటులే దేవతలు శివునినే సర్వాధికునిగా సంభావించు చుండిరి. బ్రహ్మవిష్ణ్వాదులలో ఎవరెవరు ఎట్టి ప్రార్థనముల నొనర్చిరో వారివారికి అట్టివరములను శంకరుండు ప్రసాదించెను. మరల నొక పర్యాయము దక్షునిచే ప్రార్థింపంబడిన శివుండు అనుగ్రహించి దక్షుని యజ్ఞమును పూర్తిఁగావింపంజేసెను. అంత దక్షుండు సురలకు యజ్ఞభాగములను శివునకు పూర్ణభాగమును సమర్పించి శివానుగ్రహమును సంపాదించెను. బ్రాహ్మణులకు వివిధ దానముల నొసంగెను. శివ ప్రీత్యర్థమై జన్నమును విధివిధానముగా ముగించెను. దక్షయజ్ఞము భంగము చేయంబడినను మరల సంపూర్ణము చేయంబడుట – శివానుగ్రహము వలననేయని తెలియవలెను. దేవతలు ఋషులును శంకరుని లీలావిశేషముంజెందిన కీర్తిని ప్రశంసించుచు తమతమ నెలవులకు జనిరి. బ్రహ్మదేవుండును నారాయణుండును సర్వమంగళప్రదమైన శంకరుని మహిమను కీర్తించుచు తమలోకములకు వెళ్ళిరి. ఉత్తమవిలాసముగల మహాదేవుండును దక్షప్రజాపతిచే సత్కరింపంబడినవాడై తన గణములతో గూడ కైలాసమునకుంజని కొంతకాలము విశ్రమించి సతీదేవిందగు జీవితవిశేషములను ముఖ్యగణములకు చెప్పుచుండెను. మరియు లోకమున భార్యనుపోగొట్టుకొనిన గృహస్థుని వలె నటించుచు దేవీచరితమును వక్కాణించుటతో కాలమును గడుపుచుండెను.

వాస్తవముగా శంకరుండు లీలావిగ్రహుండు, పరమాత్మయు, సత్పురుషులకు ప్రాప్యుండు కావున నాతనికి భార్యావియోగదుఃఖముగాని పత్నీమోహము గాని యుండంజాలవు. బ్రహ్మవిష్ణువులకే తెలియనలవిగాని శివవిలాసమును మునులుగాని దేవతలుగాని మానవాదులుగాని గుర్తెరుగుదురు? యెట్లుచెప్పనగును? ముఖ్యముగా శంకరుని ప్రాభవము జ్ఞానులకే సుగమము కానట్టిది. కావున





యనంతంబై భక్తునికి మాత్రము ఎట్టి శ్రమ లేకుండా నాతని యనుగ్రహము వలన తెలియునట్టిది; శివునికిఁజెందిన నొక్కవికారమైనను తదితరులకు గుణపాఠమే యగును కాని జుగుప్సాకరము కాజాలదు.

ఈ సతీశివచరితమును సుధీమంతుఁడు చదివినను వినినను జీవిత పర్యంతము సుఖము ననుభవించి దేహాంతమున దివ్యమైన పరమపదము (శివలోకమును పొందువాడగును).

సతీదేవి – యోగాగ్నియందు శరీరమును విడిచినను జీవించియున్నదనియే భావింపవలెను. ఎందుకనఁగా? హిమవంతునికి మేనకాదేవియందు పార్వతియై జన్మించి ఘోరతపంబు నాచరించియు శివునినే భర్తగా బడసెనని వాఙ్మయముచాటుచున్నయది. గౌరీదేవి శంకరుని వామార్ధాంగమై పలువిధముల లీలలను చూపెట్టినది.

ఇట్టి సతీచరితము అద్భుతంబు భుక్తిముక్తిప్రదంబు సర్వకామ్యప్రదాయకంబునై పవిత్రంబునై పావనంబునై స్వర్గసుఖమును కీర్తిని దీర్ఘాయుష్యమును పుత్రపౌత్రఫలము నొసగునదైయున్నది. ఇద్దానిని భక్తిగలవాడై ఆలకించినను సజ్జనులకు వినిపించినను సర్వపుణ్యఫలము నొందువాడగుటయేగాక నుత్తమ గతిగలవాడగును. మరియు నీ చరితమును పఠించువాడు చదివించువాడును సమస్తభోగములననుభవించి యంత్యకాలమున ముక్తుఁడగును.

**ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**

**ప్రవచనమున నలుబది యొకటవ అధ్యాయము.**

**రుద్రసంహితలోని సతీఖండము సర్వంబును సంపూర్ణము.**





# 2. రుద్ర సంహిత

## 3. పార్వతీ ఖండము

## ప్రథమాధ్యాయము

### (హిమవంతుని వివాహము)

నైమిశారణ్యమున శౌనకాది మహర్షులు శివమహాపురాణమును సూతుండు చెప్పగా వినుచు నిట్లు ప్రశ్నించిరి.

జగదంబ - దాక్షాయణియై దక్షుని ముఖమునందు శరీరమును విసర్జించి హిమవంతునికి కుమార్తెగా నావిర్భవించిన వృత్తాంతమును విస్తరించి చెప్పుము! అంత సూతమహర్షి యిట్లు చెప్పఁదొడఁగెను.

తొల్లి బ్రహ్మదేవుఁడు నారదమహర్షికి నిదే శివపురాణమును వక్కాణించి యుండెను. అమ్మవారి చరితమును గురించి మీరు ప్రశ్నించితిరి కావున మిగుల ధన్యులని చెప్పవచ్చును. జగదంబాచరితము పరమపావనంబు నుత్తమంబు సర్వపాపహరంబు నగును.

సతీదేవి శంకరునితో విహరించుచు హిమాలయమున నివసించినపుడు హిమవంతుని భార్యయగు మేనకాదేవి - మాతృప్రేమతో సతీదేవికి వలయు నుపచారముల నొనర్చుచుండెను. తరువాత కొంత కాలమునకు (సతీదేహత్యాగము సంభవించిన వేళ శివలోక నివాసియగు పరాశక్తి నారాధించెను అందువలన సతీదేవి తాను శరీరమును యోగాగ్నియందు పరిత్యజించునపుడు మేనకా హిమవంతులకు పుత్రికనై జనన్మింతును గాక! యని మనస్సునందలపోసినది. అట్లే హిమవంతుని పుత్రికయై పార్వతియను బఱగియు నారదుని యుపదేశము వలన ఘోరతపంబాచరించియు శంకరుని భర్తగా బడసినది.

మేనకాదేవి పుట్టుకను వివాహమును వివరింపుమని శౌనకాదులు కోరగా సూతుఁడు దిగువవిధము ప్రబోధించెను.

భూమిపై నుత్తరదిశయందు హిమాలయంబను పర్వతశ్రేష్ఠము గొప్ప సమృద్ధి కలిగియుండెడిది. స్థిరమైన పర్వతరూపముతోడను చరమైన పురుషరూపముతోడను విరాజిల్లుచు పూర్వపశ్చిమసముద్రముల నంటుకొని భూమిఁదగు కొలతబద్దవలె కన్పట్టుచుండును. హిమాలయముపై నానావిధ రత్నంబులును పలురకములగు వృక్షంబులును అనేకప్రకారంబులైన శిఖరంబులు నొప్పారుచుండినవి. అందు సింహవ్యాఘ్రాది మృగంబులు సుఖముగా నివసించుచుండెను. మంచునకు నెలవైనదై అనేకఅద్భుత వస్తువులతో విచిత్రంబై దేవతలకు ఋషులకు సిద్ధులకును నిలయంబై శివునకు ప్రియంబైన హిమగిరియందు తపస్సు సిద్ధించుటయే గాక గైరికాది ధాతువు లనేకంబులు విలసిల్లుచుండెడివి. హిమవంతుడు సర్వాంగసుందరమైన దివ్యరూపముతో విష్ణువుఁదగు నంశముచే జన్మించియుండెను. సత్పురుషప్రియుండగు నాతడు పితరులకు దేవతలకు హితము నుద్దేశించి ధర్మమును పెంపొందించుటకై వంశస్థితికొరకు వివాహమాడదలచెను. అదే సమయమున సురలు స్వార్థము నాలోచించి పితృదేవతలఁజేరి "పితరులారా! మామాట వినుఁడు! మంగళ స్వరూపురాలు మీ పెద్ద కుమార్తెయు నగు మేనకను హిమవంతునకిచ్చి





వివాహమునుచేయు"డని వచింప నవ్వారు తమ పుత్రికకు సనత్కుమారుఁడొసగినశాపమును స్మరించియు నటులేయని యంగీకరించి హిమవంతునకు మేనకను సమర్పించి విధియుక్తముగా పెండ్లి నొనర్చిరి. అట్టి వివాహమునందు హరిమున్నగు బృందారకులు నిఖిల ఋషులునేతెంచినందున గొప్పవేడుకగా నుండెను. అందరును శంకరుని మదిని స్మరించుచు వివాహకౌతుకమును కనులార గాంచియు తమ నివాసములకు వెళ్ళినవారు హిమవంతుఁడను సంతుష్టాంతరంగుడై మేనకను తోడ్కొని స్వగృహముఁజేరి సుఖముగా నుండెను.

**ఇయ్యది శ్రీ శివ మహాపురాణము నందు రెండవదైన రుద్రసంహితలో మూడవదగు పార్వతీ ఖండమున "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ప్రథమాధ్యాయము.**

## ద్వితీయాధ్యాయము

**(మేనక మొదలగు వారికి సనకాదులవలన శాపము సంభవించుట తత్పరిహారంబును)**

మేనకాదేవి యుదయించుటను గురించియు తచ్ఛాపమును గురించియు చెప్పుమని శౌనకాదులు ప్రశ్నింపగా సూతుఁడు చెప్పఁదొడఁగెను.

బ్రహ్మదేవుని కుమారుఁడైన దక్షప్రజాపతి తనయరువదిమంది పుత్రికలను కశ్యపుఁడు మొదలగు వారికి నిచ్చి వివాహమును చేసిన యుదంతము నీ వరకే చెప్పియుంటిని. ప్రస్తుతమును వక్కాణించుచున్నాను. వినుఁడు!

దక్షతనయులలో స్వధయను నామె పితరులకు పత్నియయ్యెను. ఆమెకు మేనకయనియు ధన్యయనియు కలావతియనియు మువ్వురు కుమార్తెలు పుట్టిరి. ఇవ్వారి నామధేయములను స్మరించువారికి విఘ్నములు దూరమగుటయే గాక శుభములొనగూరును. నిజముగా విచారింప నీ ముప్పురు నయోనిసంభవలనియే చెప్పవచ్చును.

లోకాచారముఁబట్టి స్వధాదేవిఁదగు కుమార్తెలుగా పేర్కొనంబడుచున్నవారు. ఈ ముగ్గురును వందనీయులు; లోకమాతలు; అత్యంతసంతోషము నొదవంజేయువారు. యోగినులు, జ్ఞానముగలవారు, మూడులోకములయందు సంచరించువారున్ను.

ఒకానొక సమయమున పితృకన్యలు ముప్పురును శ్వేతద్వీపమున విష్ణులోకమును చూడగోరి తమ నివాసము నుండి బయలుదేరి వైకుంఠముఁజేరి నారాయణుని దర్శించియు భక్తితో ప్రణామంబుల నాచరించి విష్ణువననుమతిని పీఠములపై కూర్చుండిరి. అప్పుడచట నొక మహోత్సవము జరుగుచుండెను. అందు పాలుగొనుటకు నానాలోకములనుండి పుణ్య పురుషులేతెంచి యుండిరి. అదే సమయమున బ్రహ్మమానసపుత్రులగు సనకసనందనాది మహానుభావులు హరిదర్శనమునకై విచ్చేయగా నవ్వారి నభినందించుటకు సభాసదులందరును లేచి నిలువంబడిరి. కాని మేనకాదులు శివమాయామోహితులై ప్రత్యుత్థానముఁజేయనందున సనకాదులు జ్ఞానపరిపూర్ణులైనను కోపించినవారు. అవ్వారిలో సనత్కుమారుఁడు శివమాయా విష్టుడై మేనకాదులకు శాపం బొసఁగెను.





ఐతే శివమాయాప్రభావము సామాన్యమైనది కాదు. అద్ది సకల ప్రాణులను మోహింపఁజేయున్నట్టి అద్దానికి వశముగాని జంతువెద్దియు లేదనియే చెప్పవచ్చును. అదియే శివేచ్ఛయనియు ప్రారబ్ధంబనియు ఇంక ననేకనామధేయములతో పేర్కొనంబడుచున్నయది.

మీరు ముగ్గురును సద్భావములేనివారై శ్రుతిరహస్యమును కనుగొననివారై పితరుల సుతలై గర్వముతో మాకునభ్యుత్థానమును వందనము నొనర్పకుంటిరి. కావున స్వర్గము నుండి భ్రష్టులై మానవులై జన్మింతురు గాక! మీ యవివేకమునకిదియే ఫలమని భావింపుడు!

అంత నా పితృకన్యలు వినయముతో సనత్కుమారుని పాదములపై సాగిలబడి ..........

"దయాసింధో! ప్రసన్నుడవు కమ్ము! మిమ్ము సత్కరింపకుండుట మా యపరాధంబే యగును. అందుకు తగిన ఫలము ననుభవింపనున్నాము. కాని మరల స్వర్గప్రాప్తి యెట్లగునో కరుణించి చెప్పు" మని ప్రార్థింపగా సనత్కుమారుఁడు శివేచ్ఛా వశమున దిగువ విధము వారికి శాపోద్ధారము ననుగ్రహించెను. "పితృకన్యలారా! మీముగ్గిరికిని శుభము నొసగుమాట చెప్పుచున్నాను. వినుఁడు! ఇందు మేనకాదేవి విష్ణ్వంశసంభూతుడైన హిమవంతునికి పట్టపురాణియై వెలయు గాత! ఆమెయందు ఆదిశక్తి పార్వతియనునామంబున నావిర్భవించును. ఇఁక రెండవదైన ధన్యాదేవి – జనకమహారాజునకు భార్యయై మహాలక్ష్మిఁదగు నంశముతో జన్మించు సీతను పుత్రికగా బడయగలదు. మూడవదైన కళావతి వృషభానుఁ డను వైశ్యునకు పత్నియై రాధను ప్రియమైన కుమార్తెగా పొందుగాక! ఐతే పార్వతీదేవి దగు ప్రభావమున మేనకాదేవి – తన దేహముతోడనే కైలాసమను పరమపదమునఁబ్రవేశించును. సీతాదేవిని పుత్రికగా బడసిన పుణ్యమున జనకుఁడు ధన్యాదేవితో గూడ జీవితాంతమునందు వైకుంఠమునకుఁజనును. ఇఁక కళావతి జీవన్ముక్తురాలై రాధతో గూడ గోలోకమునకు వెళ్ళియుండును. సుకృతము గలవారికి సంకటములు రానిది యవ్వారి మహిమ ప్రఖ్యాపితము కాజాలదు. మరియు నొక విశేషమేమనగా ఇప్పటి వరకు గల మీ సంచితములన్నియు వైకుంఠుని దర్శనమువలన నశించినవి కావున మాకభ్యుదయకాలము సంప్రాప్తమైనదని భావింపుడు!

సనత్కుమారుఁడు – భుక్తి ముక్తిప్రదుఁడైన శివుని స్మరించి "మరియొక మాట చెప్పుచున్నాను. మేనకాదేవిపుత్రికయగు పార్వతీదేవి శంకరుని భర్తగా బడయగలదు. ధన్యాదేవి కుమార్తెయగు సీతాదేవి శ్రీరామచంద్రునకు భార్య యగును. కళావతీసుతయైన రాధాదేవి – ప్రేమోపాసన శ్రీకృష్ణునకు ప్రియురాలగును.

ఇవ్విధము వారిననుగ్రహించి తన సహోదరులతో గూడ నచ్చోటనే యంతర్ధానముఁజెందినవాఁడు. పితరుల మానసపుత్రికలగు మేనకా ధన్యా కళావతులు ముప్పురును గతకల్మషలై నిశ్చితంగా తమ నెలవునకు జనినవారు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ద్వితీయాధ్యాయము.





# తృతీయాధ్యాయము

## (విష్ణ్వాది దేవతలు జగదంబను ప్రార్థించుట)

శంకరుని లీలావిలాసముతో గూడిన పావనచరితమును వినుఁడు! ఇద్దాని నాలకించుటవలన బ్రహ్మహత్య మొదలగు పాపములు నశించుటయేగాక కామ్యములనన్నియు సిద్ధించును.

మేనకను వివాహమాడి హిమవంతుఁడు స్వగృహమున సుఖమునుండగా మూడు లోకములవారికి మిగుల సంతోషముగా నుండెను. హిమవంతుఁడు బ్రాహ్మణులను బంధువర్గమును సత్కరించెను. అందఱు నాతనికి శుభాశీస్సుల నొసగి స్వగృహములకుఁజనిరి. మేనకతో హిమవంతుఁడు నందనవనము మొదలగు రమ్యస్థలములయందు విహరించుచు రతిక్రీడల నాతినోలలాడించెను. అయ్యవసరమున విష్ణ్వాదిసురలు మునులును హిమవంతుని చెంతకు రాగా వారి నాతడు నమస్కరించి “ఈవేళ నాజన్మ సఫలంబైనది. నేజేసిన పుణ్యము ఫలించినది. నా విజ్ఞానము సార్థకంబైనది. ధన్యుడనైతిని. నాప్రదేశ మంతయు పవిత్రంబైనది. నా వంశము కుటుంబము సఫలములైనవి. ఎందుకనఁగా? మీరందరు గుమిగూడి నా యింటికి వచ్చినారు, ఏమికావలెనో నన్ను మీ సేవకునిగా భావించి సెలవీయు” డని విన్నవించెను.

అంత దేవతలు తమ కార్యము సిద్ధించినట్లు భావించుచు “హిమవంతా? మేమెందుకు నేతెంచినవారమో నట్టి యంశమును నుడువుచున్నాము వినుము! జగదంబయగు నుమాదేవి దక్షుని కుమార్తెయై శంకరునికి భార్యయై చాలకాలములోకమున విహరించినది గదా! పిమ్మట తన జనకుని యనాదరణమున శరీరత్యాగము నొనరించి నిజధామము నలంకరించియున్నది. అట్టియాదిశక్తిని నీవారాధింతువేని మాకును నీకును మేలొనఁగూరును” అని నిర్దేశింపగా హిమవంతుఁడు నటులే యొనర్చెదనని యంగీకరించెను. తరువాత బృందారకులటనుండి బయలువెడలి యొకానొక పవిత్రస్థలమున మనఃపూర్వకముగా భక్తివినమ్రిత కంధరులై పరాశక్తి నిట్లు నుతించిరి.

శివలోకము నందు నివసించు దేవీ! ఉమా! జగదంబా! ఎల్లకాలము శివునెడబాయక నుండుదానవు; అట్టి మహేశ్వరివగు నిన్ను నమస్కరించుచున్నాము. శ్రీకరమైన శక్తియు, పావనురాలు, శాంతురాలు, పుష్టియు, అవ్యక్తస్వరూపిణియు, శివయు, శివకరయు, శుద్ధురాలు, స్థూలయు, సూక్ష్మయు, అంతర్విద్యతో సువిద్యతోడను సంతృప్తురాలు నగు పరాశక్తికి మ్రొక్కులిడుచున్నాము. నీవేశ్రద్ధవు; ధృతివి; సర్వగోచరంబగు శోభవునీవేను; సూర్యుని కాంతివై జగమును ప్రకాశింపఁజేయుదువు; బ్రహ్మాండము నందును జీవులలోను నిండిన దానివై బ్రహ్మదేవుఁడు మొదలుకొని గడ్డిపఱకవరకు గల చరాచరమునంతయు శుభాశుభకర్మానుభవములయందు ప్రవర్తింపఁజేయుదానవు; వేదమాతయగు గాయత్రీదేవియు సావిత్రియు సరస్వతియు నీవేను; లోకములలోని శుభవార్త నీవేను; వైదికధర్మములన్నియు నీ యనుగ్రహముననే ప్రవర్తించునట్టివి; ప్రాణులందరిలో నిద్ర ఆకలి తృప్తియు ఆశ ప్రతిభ వర్చస్సు నీవై భక్తులందరి నానందసాగరమున నోలలాడింతువు; పుణ్యాత్ములకు లక్ష్మీ స్వరూపురాలవు; పాపాత్ములకు జేష్ఠాదేవి వగుదువు; వ్యక్తులందరకు కాంతినిచ్చి పరస్పరానురాగముతో మెదలుటకు కారకురాలవై జీవాత్మల





ప్రాణములను కాపాడుదానవగుదువు; శివతత్త్వంబు నీవేను; పంచభూతములసారంబు న్యాయవిదుల నీతియు పరిష్కారంబును నీవేను; సామవేదగానంబును యజుర్వేద గ్రంధియు ఋగ్వేదహుతియు అధర్వణమాత్రయు నీవేను; గీర్వాణగణంబులు శక్తిమంతములై యుండుటకు సత్త్వరజస్తమోగుణ కార్యములు సక్రమముగా సిద్ధించుటకును నిదానంబగు నీ స్వరూపమును కనులారగాంచలేము చెవులార వినలేము.

శ్లో॥ సంసారసాగర కరాళ భవాంగదుఃఖ - నిస్తారకారి తరణించ నివీతిహీనామ్ ।
అష్టాంగయోగ పరిపాలన కేళిదక్షాం - వింధ్యాగవాస నిరతాం ప్రణమామతాంవై॥ 35

భయంకరమైన సంసారసముద్రములో సంభవించు శరీరధారణమువలన కలుగు దుఃఖములను తొలగించుటకు నావవంటిదియు; నివీతియనగా అచ్ఛాదనరూపమైన మాయాసంబంధమగు అవరణము, అట్టిదిలేనిదియు, ఎనిమిదియంగములుగల శివధ్యాన యోగమును రక్షించు విలాసములో నిపుణురాలును వింధ్యాచలనివాసినియు నగు అమ్మవారిని ప్రణమిల్లుచున్నాము.

ముక్కు కన్నులు నోరు భుజములు వక్షస్సు మనుస్సు మొదలగు చోట్ల భక్తులకు ధైర్యముతో సుఖములను కలుగఁజేయుదానవు; లోకమున ప్రాణులకు నిద్రారూపమున విశ్రాంతి నొసగుచున్నావు; అట్టి కరుణామయీ! ప్రపంచము క్షేమముతో నభివృద్ధిఁబొందునట్లు ప్రసన్నురాలువుకమ్ము!

ఇవ్విధము ప్రార్థించి యందరును దేవీదర్శనాకాంక్షతో కుతూహలమున నిలువఁబడియుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో తృతీయాధ్యాయము.

## చతుర్ధాధ్యాయము

### (అమ్మవారు దేవతలను సమాధానపెట్టుట)

అంత సురలు గావించిన స్తోత్రమునకు సంతసించి భక్తుల సంకటములను పోనాడు దుర్గాదేవి ప్రత్యక్షమయ్యెను. రత్నమయము చిరుగంటలుకట్టఁబడినదియు పరమాద్భుతంబు నగు రథమున మృదు అస్తరణముపై నాసీనయై కోటిసూర్యులను మించిన కాంతిగల మనోహరములైన అవయవములతో ప్రకాశించుచు తన తేజస్సుల మధ్య గోచరించునదై సదాశివుని సహధర్మచారిణియు సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించునదియు శివలోకనివాసినియు నిత్యము బ్రహ్మవిష్ణురుద్రులకు జననియు భక్తులందరి యిడుములను నివారించునదియు, ప్రాణులందరికి తల్లియు, స్వోపాసకుల నందరిని తరింపఁ జేయునదియునై యుండెను. అట్టి దుర్గాదేవిని యమరులు కాంతులలో చూచుచు విశదముగా నవలోకింప మరల నొకమారు నుతించిరి. అంత నవ్వారు జగదంబఁదగు యనుగ్రహముఁబడసి యా మహాశక్తిని విశదముగా చూచుచు ఆనందపరవశులై మాటిమాటికి ప్రణమిల్లుచు నిట్లు ప్రార్థించిరి.

శర్వాణీ! కల్యాణీ! మహేశ్వరీ! సర్వార్తినాశినివగు నిన్ను మ్రొక్కులిడుచున్నాము. వేదశాస్త్రము లన్నియు నిన్నుతెలుసుకొనఁజాలవు. నీ మహిమ, ధ్యానంబు నవాఙ్మానసగోచరములు. వేదముగూడ నీ





తత్త్వమును నిరూపింపఁజాలక నితరములనన్నిటిని తొలగించి మిన్నకున్నది. వేదమే నీ స్వరూపమును నిరూపింప నశక్యమగుచుండగా వేదేతరములు నిన్ను సమర్థించునని చెప్పరాదు గదా! ఐనను నీ యందు భక్తిగలవారు మాత్రము నిన్నుపాసించి తత్త్వజ్ఞానము కలవారగుచున్నారు. నిన్నుఁ శరణుబొందినవారికి ఎట్టి భయంబును కలుగదు. నీ దాసులమైన మా విజ్ఞప్తి నాకర్ణింపుము!

పూర్వము దక్షపుత్రికవై శంకరుని చేబట్టితివి. పిమ్మట జనకుఁడు జన్నమున సత్కరింపకుండుటఁ జేసి - పూర్వము శివనిందను వినిన తనువును పరిత్యజింతునని చేసిన శపథము - ననుసరించి శరీరమును యోగాగ్నియందు వేల్చి నిజలోకముఁజనియుంటివి. ఇందువలన శంకరుఁడును వగచియున్నవాడు. అంతమాత్రమున దేవతలు తలపెట్టినకార్యము సిద్ధింపలేదు. కావున మునులము దేవతలము వ్యాకులపడియున్నాము. అందుకే నిన్నాశ్రయించితిమి. ఇప్పటికైనను మా మనోరథముల నీడేర్చుము! సనత్కుమారుఁడు మేనకాదుల కొసగిన శాపమును సార్థకముఁజేయుము! భూమియందవతరించి శంకరునికి భార్యవై లీలావిలాసమును చూపెట్టుము! ఇందువలన దేవతలు సుఖింతురుగాక! కైలాసమున శంకరుఁడు సుఖముగా నుండుగాక! సజ్జనులందరికిని సుఖముకలుగు గాక! దుఃఖము బొత్తుగా తొలగుగాక!

ఇట్లు బ్రహ్మాది సురలు సంభాషించి భక్తిభావమున వినయము కలవారై మౌనముగా వేచియుండిరి. దేవకృత స్తోత్రమునకు సంతసించిన యుమాదేవి - స్వప్రభుండగు శివుని స్మరించి చిరునగవుతో నిట్లు వాక్కుచ్చినది.

ప్రసన్నురాలనై చెప్పుచున్నాను. ఎట్టిభయము వలదు. నా లీలాచరితము మూడు లోకములకు సుఖము నొసగునది. దక్షునికి మోహమును కల్పించునదియు నేనేను, ప్రస్తుతము పూర్ణావతారముఁ జెందుటకు గల కారణముల నాలకింపుడు! పూర్వము సతీదేవిగా నున్నపుడు తల్లిదండ్రులు కుమార్తెకు వలె నాకు ఎన్నియోవిధముల నుపచారములఁ గావించినారు. ఇప్పుడును నన్నే ఆరాధించుచున్నవారు. కావున తప్పక మేనకాహిమవంతులకు పుత్రికనై జన్మింతును. ఇఁక మీ నివాసములకుఁజని నిశ్చింతగా నుండుడు! సతీదేవిగా శరీరమును విడచిన నుండి కాలాగ్నిరుద్రుఁడను పేరుతో పిలువంబడు కైలాసపతి నన్నేచింతించుచు యోగీశ్వరుడై యలౌకిక వేషంబుతో నున్నవాడు. అప్పటి నుండియే శంకరుఁడు శృంగార సుఖమున విరక్తుడై యున్నవాడు.

ఇంకొక విశేషమును తెలుపుచున్నాను. వినుఁడు! మహాప్రభువువైన మహేశ్వరుఁడు లౌకికరీతి ననుసరించి విరహాతురుడై యోగాగ్నిదగ్ధమగు నా శరీరమునందలి బొక్కల నొక మాలికగా మెడఁదాల్చినను శాంతించుఁ లేదు. [illegible] త్రునివలె నంతట తిరుగాడుచు దుఃఖించినవాడు. యోగ్యాయోగ్యవిచారము లేనివాడయ్యెను. కాముకుఁడు ప్రియురాలిని గురించి విలపించునట్లు నన్నుద్దేశించి శంకరుఁడు మిగుల పరితపించినవాడు. ఇఁక నిజము విచారించి చూడగా పరమేశ్వరుఁడు ఎట్టి వికారములు లేనివాడనియు ఇతరులకు లొంగువాడుకాడనియు ఎవరికి నోడిపోవువాడు కాడనియు నిఖిలేశ్వరుండనియు మాయాధీశుండనియు పరిపూర్ణుండనియు సర్వతంత్రస్వతంత్రుఁడనియు బోధపడును. అట్లు కాని యెడల నా మహానుభావునకు మోహమెట్టిది ... వికారములతోడ నెట్టి ప్రయోజనముండును?





కావుననే ప్రభువు మాయాలిప్తుడు కాకుండును. ఐతే లోకకల్యాణార్ధము శంకరుఁడు నా పాణిగ్రహణమును కోరుచున్నందున హిమవంతునింట నవతరించెదను. శంకరునకు భక్తురాలనై ఇతరులకు శక్యముగాని తపంబాచరించి ప్రియురాలనగుదును. దేవకార్యమును సాధింపఁజేయుదును. శంకరుని భార్యనైనందున నన్ను మూడులోకములవారు పూజింతురు నమస్కరింతురు.

ఇట్లు సంభాషించి జగదంబ దేవతలు చూచుచుండగా నంతర్ధానముఁజెందినది. అనఁగా నిజలోకమున కేగినదని భావము. అంత బ్రహ్మాదులును దేవీదిశకు నమస్కరించి తమ నివాసములకు వెళ్ళినవారు.

ఇట్టి దుర్గాచరితమును యధాశక్తి వర్ణించితిని. ఇద్దానిని వినినవారు వినిపించినవారు చదివినవారు చదివించినవారు నభీష్టముల నన్నిటిని బడయుదురని సూతుఁడు శౌనకాదులకు వక్కాణించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో చతుర్ధాధ్యాయము

## పంచమాధ్యాయము

### (మేనకాదేవికి వరము లభించుట)

నారాయణుఁడు మున్నగు సురలు బోధించి వెళ్ళిన పిమ్మట మేనకాహిమవంతులు రేయింబవళ్ళు శక్తిశివులను చింతించుచు తపించుచుండిరి. మరియు భక్తిప్రపూర్ణమైన మనంబుతో లలితాకామేశ్వరులను ప్రార్థించుచుండిరి. శివప్రీత్యర్థమై మాహేశ్వరులకు వివిధదానంబుల నొనర్చిరి. చైత్రమాసము మొదలు కొని యిరువదియేడు వత్సరముల వరకు మేనకాదేవి – సంతానము కొరకు నుమాదేవినారాధించినది. ప్రతియష్టమి నుపవసించుచు నవమినాడు కుడుములను మోదకములను పరమాన్నము మొదలగు మధురపదార్థముల నమ్మవారికి నివేదించి పూజాంతమున సువాసినులకు భోజనంబునిడి తా భుజించుచుండెడిది. పరిమళముగల పుష్పములను నానావిధ సదుపచారములను సమర్పించుచు గంగాతీరమున ఓషధిప్రస్థము నందు మట్టితో మహాదేవిఁదగు మూర్తిని ప్రతిష్ఠించి పై విధము పూజించుచుండెను.

ఒకప్పుడు నిరాహారముగాను మరియొకప్పుడు కఠిననియమములతోడను ఇంకొక తూరి గాలి మాత్రము పీల్చుచును ఇంక నొకప్పుడు జలపానముతోడనే... తపించుచు ఆ శక్తియందు పంచప్రాణములను హృదయమును నిలుపుకొని సప్తవింశతి వత్సరముల కాలమును గడపినది. అంత జగదంబ ప్రత్యక్షమై "మహాసాధ్వీ మేనకా! తపోవ్రత" సమాధులలో నన్నెందుకారాధించితివో ఏమి కావలెనో యాచింపుము! నీ కోర్కెను నెరవేర్తుననఁగా మేనక కాళికాదేవిని కనులార గాంచి మ్రొక్కులిడియు ప్రార్థింప నుద్యుక్తురాలగుచుండెను. ఇంతలో నుమాదేవి ప్రేమాతిశయమున మేనకను కౌగిలించుకొనెను. అందువలన నామె నిండుతెలివిగలదై విహితవాక్యములతో దిగువవిధము వేడుకొనెను.





జగమును నిర్మించు మహామాయను లోకమును పోషించు చండికను సర్వకామ్యార్థముల నొసగు మహాదేవిని నమస్కరించుచున్నాను. శుభప్రదమైన కమలముల మాలికను ధరించి జగన్మాతయగు యోగనిద్రను, నిత్యానందము నొదవఁజేయు నాదిశక్తిని, భక్తురాండ్ర దుఃఖములను తొలగించు నుమాదేవి నభినందించుచున్నాను. ప్రాణులకు బుద్ధిస్వరూపిణియు నీవేను; యమనియమాదులతో నిన్నారాధించు మహానుభావుల సంసారబంధమును త్రెంచివేయుదువు; నావంటివారు నీ ప్రభావమును వర్ణింపఁజాలరు, అథర్వవేదములో చెప్పఁబడిన హింసావిధానంబు నీవేను; నాయభిలషితము నీడేర్పుము! ప్రాణివర్గమునకు నిత్యములు అనిత్యములునగు శరీరముల నొనగూర్చుచుందువు; అవ్వారిశక్తియు నీవై కాలానుసారము యోగములను సిద్ధింపఁజేయుదువు; నీవే సర్వభూతయోనివి; నీవే సర్వాధారవు; మాయకతీతురాలవు నీవేను; నీవు ప్రసన్నురాలవైనచో భక్తులకు పరబ్రహ్మమును ప్రకాశింపఁజేయుదువు; అటులే నాయందు అనుగ్రహముఁజూపుము! అగ్నిహోత్రునికిఁజెందిన ఉగ్రశక్తియు సూర్యునీ ప్రతాప శక్తియు చంద్రుని ఆహ్లాదశక్తియు నగు నీకు వందనంబిడుచున్నాను. పతివ్రతామతల్లులకు నత్యంతప్రియురాలవు; జితేంద్రియులకు నిత్యస్వరూపిణివి; ప్రజల సద్వాంఛితంబును పరమేశ్వరుని మాయయు నీవేను; బ్రహ్మవిష్ణురుద్ర జననీ! అభీష్టరూపములఁదాల్చి సృష్టిస్థితిలయముల నేర్పరతువు; మరియొకతూరి నమస్కరించుచున్నాను. ప్రసన్నురాలవు కమ్ము!

అంత నుమాదేవి "వాంఛితము నడుగుము" అనవుఁడు "వరయోగ్యురాలనగుదునేని మొదట నాకు నూర్గురుకుమారులు - దీర్ఘాయుష్యము సమృద్ధియు సిద్ధియు కలిగి జన్మించునట్లు తరువాత స్వరూపగుణశాలియగు కుమార్తె కలుగునట్లును వరమును ప్రసాదించుము!

అట్టి కుమార్తెయు రెండు వంశముల నానందింపఁజేయునదై మూడు లోకములవారిచే పూజింపఁ బడునదై యుండవలెను. దేవ కార్యార్థము నీవే నా పుత్రికవై జన్మించి శంకరునకు భార్యవునై లీలా విలాసమును చూపెట్టుము!"

అని ప్రార్థింపగా నుమాదేవి చిరునగవుతో మేనకను సంతసింపఁజేయుచు "పరాక్రమవంతులగు నూర్గురు కుమారులు కలుగుదురు గాక! అవ్వారిలో నొక్కఁడు బలవంతుడై మొదట జన్మించును. నీ భక్తికి మెచ్చితిని. సురలుగూడ నన్ను ప్రార్థించిరి కావున నీ కుమార్తెగా నవతరింతును" అని వాక్రుచ్చి యామె చూచుచుండగానే యంతర్ధానముఁ జెందినది. అట్లు మేనకాదేవి యభీష్టవరముఁబడసి తపస్సు వలననైన బడలికను మరచినదై యాదిశక్తి యావిర్భవించిన దిశకు ప్రణమిల్లి సంతుష్టాంతరంగయై నిజ నివాసముఁ బ్రవేశించినది.

పిమ్మట తన తపోవృత్తాంతమునంతయు ముఖవైఖరులను చూపుచు అత్యాదరమున మాటిమాటికి స్వపతియగు హిమవంతునకు విశదముగా వాక్రుచ్చెను. శివ భక్తురాలైన తన భార్య చెప్పగా ఉమా ప్రాదుర్భావాది వర ఫలమునంతయు ఆకళింపు చేసుకొని హిమవంతుఁడు మేనకను ప్రశంసించినవాడు.

ఇట్లు ఆ దంపతులు అన్యోన్యానురాగముతో సురతక్రీడలఁదేలుచు కొంత కాలము గడుపు సరికి నొక కుమారుఁడు దయించెను. ఆతఁడు నాగస్త్రీలు రమించుటకు యోగ్యుడు గాను సముద్రునితో





స్నేహము కలిగియుండు వాడు గాను మైనాకుడను పేరు కలిగియుండెను. దేవేంద్రుఁడు పర్వతముల రెక్కలను వజ్రాయుధముతో తెగ గొట్టునపుడు మైనాకుఁడు క్రుద్ధుఁడై సముద్రములో నివాసము నేర్పరచుకొనువాడు. తన సహోదరులను మించిన పరాక్రమముతో చెలరేగువాడు.

మైనాకుఁడు జన్మించిన వేళ హిమాలయ పట్టణమునందు మహోత్సవముగానుండెను. మేనకా హిమవంతులకు ఆనందము మితిమీరుచుండెను. బ్రాహ్మణులకు బీదలకును దానములు చేయఁబడినవి. శక్తిశివుల పాదకమలములపై భక్తనురాగములు పెంపొందినవి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పంచమాధ్యాయము.

## షష్ఠాధ్యాయము

### (పార్వతీదేవి జన్మించుట)

మేనకా హిమవంతులు జగదంబను స్మరించుచు దేవకార్యమును సాధింపనెంచి తమకు కుమార్తెగా జనన్మించుమని ప్రార్థించుచుండిరి. అంత చండికాదేవి హిమవంతునివల్ల మేనక యందు నుద్భవింతునని గావించిన ప్రతిజ్ఞను సార్థకముఁజేయుటకై పూర్ణాంశముతో హిమవంతుని యంతఃకరణమునందు ప్రవేశించినందున హిమవంతుఁడు నపూర్వకాంతి గలవాడై అగ్నివలె తేజోరాశియై ప్రకాశించుచుండెను. అటు పిమ్మట నొకనాడు మేనకయందు స్వవాంచితంబను తేజస్సును నెలకొలుపగా నామె గర్భవతియై తేజస్సుల మధ్య నున్నదానివలె విరాజిల్లుచుండెను. మరియు శరీరము కృశించుటవలన కొన్ని సొమ్ములు తీసినదై కించిన్నక్షత్రముల ప్రకాశము గల అమావాస్య నాటి రాత్రివలె కన్పట్టుచుండెను. అప్పుడామె ముఖము దినదినము నవీనముగా శోభించుచు మట్టివలె పరిమళించుచున్నందున హిమవంతుఁడు ఏకాంతమున నాఘ్రాణించి మురియుచుండెను. తన సతీమణి గర్భవశమున మనోవాంఛితమును తెలుపుట లేదెందులకని మది విచారించి చెలికత్తెలద్వారా నామె కోర్కెఁదెలుసుకొని లోకత్రయమున లభింప నసాధ్యంబైన నట్టి వస్తువు నందఁజేయుచుండెను.

హిమవంతుడు-మేనకా సంసక్తమనస్కు డగుటచేతను ద్రవిణము స్వార్జితమగుటఁజేసియు శ్రుతి ధర్మము సమాదరణీయ మగుటవలనను శాస్త్రోక్తములైన సీమంతాది సంస్కారములను విధివిధానముగా నొనరింపఁజేసినవాడు. నొనరింపఁజేసినవాడు. మరియు మేనకాదేవి వైడ్యూరాంద్రుగల గర్భగృహమునందు ప్రసవోన్ముఖురాలై యున్నట్లు గాంచుచు ప్రసవశుభవార్తకై వేచియుండెను.

అట్టి తతి ఆకసము మేఘాచ్ఛాదితమై యుండెను. గిరీశ్వరుఁడు తన భార్య గర్భములో జగదంబ కలదని గుర్తెరిగి ఆనంద పరవశుడగుచుండెను. అంత బ్రహ్మ మొదలగు దేవతలు మునులచ్చోటి కేతెంచి యుమాదేవినిట్లు ప్రార్థించిరి.

మహేశ్వరీ! వృద్ధిఁబొందుము! సత్యమే వ్రతముగా కలదానవు; సత్యము నందాసక్తి కలిగియుందువు. భూతభవిష్యద్వర్తమాన కాలత్రయమునందును సత్య స్వరూపురాలవు, శివప్రియురాలవు, దేవతల





దుఃఖములను పోగొట్టుదానవు, శర్వాణీ! త్రిలోకీమాతా! జగమునంతయు వ్యాపించుదానవు, భక్తులయందు వాత్సల్యము గలదానవు, ప్రస్తుతము మేనకా గర్భమునుండి జన్మించి లోక కల్యాణము నొనఁగూర్పుము! నీ యనుగ్రహము నవలంబించియే మేమందరము సనాథులమైతిమి. నీవు లేనిదిమూడు లోకములయం దెద్దియు పెంపొందఁజాలదు.

ఇవ్విధము సురలు గర్భస్థురాలైన జగదంబను కొనియాడి తమ తమ నెలవులకుఁజనిరి. అంత నక్షత్రములు రాశులు గ్రహములు సమస్తఖేచరంబులును ప్రసన్నములైయుండగా ఆకాశము సర్వదిశలును ప్రకాశించుచుండగా వనములతో గ్రామములతో సముద్రములతోడను భూప్రదేశము మంగళ భూయిష్ట మగుచుండగాను కొలనులయందు నదులయందు నడభావులయందును కమలములు వికసించియుండ గాను వాయువులు సుఖ స్పర్శములై వీచుచుండగాను సత్పురుషుల మనంబులు సంతుష్టములై యుండగాను దుర్మార్గులకు దుఃఖ మొదవు చుండగాను మేనకాదేవి యందు అమ్మవారు నిజరూపమున సాక్షాత్కరించినది. అట్టి తఱి బృందారకులు ఆకాశమున దుందుభులను మ్రోగించుచుండిరి. పుష్పములు కురిపింపఁ బడినవి. గంధర్వులు సంగీతములను విద్యాధర స్త్రీలు నప్సరసలును నాట్యంబు నాచరించిరి. ఎటు జూచినను గొప్ప వేడుకగా నుండెను. దేవి సాక్షాత్కరించిన సమయము - వసంతఋతువు చైత్రమాసము నవమీ తిథియు మృగశీర్ష నక్షత్రంబు నర్ధరాత్రియు నైయుండినది.

శ్లో॥ వసంతర్తౌ మధౌమాసే - నవమ్యాం మృగధిష్ణ్యకే ।
అర్ధరాత్రే సముత్పన్నా - గంగేవ శశిమండలాత్ ॥ 32

చంద్రమండలమునుండి గంగానదివలెను సముద్రమునుండి లక్ష్మీదేవివలెను మేనకా గర్భమునుండి నిజరూపముఁబోలిన శిశువై జన్మించిన పార్వతీదేవిని గురించి మరల నొక తూఱి సుగంధ మంద వాయువు ప్రసరించెను. శంకరుఁడు సమాహిత మనస్కుండయ్యెను. మధురోదకములు కురియుటయేగాక పుష్ప వృష్టియు సంభవించెను. అగ్నులు శాంతముగా మండుచుండెను. మేఘములు గంభీరముగా నుఱుముచుండినవి. మరియు నమ్మవారు పుట్టినపుడు శుభమంతయు నొనఁగూరినది. ఓషధీ ప్రస్థ నగరంబున సర్వంబును సుఖమయముగా నుండినది. అట్టి అపూర్వ సంతోష సమయమున నారాయణుఁడు మొదలగు దివిషదులేతెంచి హిమవంతుని పుత్రికయగు జగదంబను దర్శించి "సర్వకార్యములను సిద్ధింపఁజేయు మహేశ్వరీ! భక్తవత్సలురాల వగుటచే దేవకార్యమునకై మేనకాదేవిఁ దగు మనోరథమును పరిపూర్ణ మొనర్చునట్లు హరుని కామితంబు నీడేర్చుము!" అని నుతించియు ప్రణామంబులిడి నిజనివాసముల కేగినవారు.

మేనకాదేవి శ్యామవర్ణముతోడను నల్లనికలువఁదగు దళముల వంటి కాంతి తోడ నావిర్భవించిన దేవి నవలోకించి లోలోన మురియుచుండినది. మరియు నామె దివ్య స్వరూపమును గాంచి సంతోషాతిశయమున "మహేశానీ! స్వయంప్రకాశమాన రూపమున కనబడి నాయందు కరుణ కలదాన వైతివి, శివ శక్తులలో మొదటి దానిని త్రిలోకజననివి, శివప్రియురాలవు, నిర్జరులందరు నిన్ను పొగడుచున్నవారు, ఇంక ముందు నా ధ్యానములో గోచరింతువుగాక! ఐతే కుమార్తెగా నాకడ ప్రవర్తింపుమని నా విజ్ఞప్తి" యని ప్రార్థించెను.





అంత నా మహాదేవి "మేనకా! నీవు మున్ను నన్నారాధించినకతంబున ప్రత్యక్షమై యొసగిన వరము ననుసరించి నీ పుత్రికగా జన్మించుటకు ముందు నాయందు దివ్యభావన యేర్పడుటకై నిజరూపమును ప్రదర్శించితిని.

దంపతులు మీరు నన్ను పుత్రికాభావముతో పరికించిన నెప్పుడైన నొకపర్యాయము ధ్యానించి పరమపదము నొందుటకీ నిజరూపము - నుపయుక్తంబగును. ఐతే ఈ వరకు చెప్పినట్లు లోక కల్యాణము నొనగూర్చుటకు గాను పరమేశ్వరుని యర్ధాంగిగా నవతరించి నాననిమాత్రము విస్మరింపకుండు" అని వక్కాణించి మేనక చూచుచుండగానే చంటిపిల్లయయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో షష్ఠాధ్యాయము.

## సప్తమాధ్యాయము

### (పార్వతీదేవి బాల్యము)

అవ్విధము శిశువై లోకరీతి ననుసరించి రోదనముఁజేయుచుండిన అమ్మవారి శరీరకాంతులతో శయ్యాగారమునందు గల దీపములన్నియు శోభావిహీనములగుచుండెను. బాలిక యేడ్పు విని యింటిలోని ఆడవారందరు పరుగున నేతెంచిరి. అంతఃపుర భటుడొకఁడు పార్వతీజన్మ వృత్తాంతమును హిమవంతున కెఱిగింపగా నాతఁడు ఆనందాబ్ధినోలలాడుచు తన రాజలాంఛనమగు శ్వేతచ్ఛత్రము దక్క నితరము నంతయు సజ్జనులకు సమర్పింతు నను సముత్సాహము గలవాడై పురోహితుని సద్బ్రాహ్మణులను వెంట నిడుకొని యంతఃపురములోనికి వెళ్ళి మేలివస్త్రముతో శోభించుచున్న తనయను గాంచి మిగుల హర్షించినవాడు. మరియు పురప్రముఖులు స్త్రీలును సంతసించిరి. ఆ సంతోషసమయమున మంగళవాద్య ఘట్టనము, వారస్త్రీల నాట్యంబును శుభసంగీతగానంబును నెరవేర్పఁబడినవి. హిమవంతుఁడు పార్వతీదేవికి జాతకర్మసంస్కారముఁ గావించి అన్నగోభూదానాదికములను బ్రాహ్మణులకు సమర్పించెను. మరియు మహాద్వారము చెంత కరుదెంచి భిక్షుకులకు వారివారి యభీష్ట వస్తువులని నిచ్చుటయే గాక ధనమును గూడ నొసఁగెను. తరువాత మునుల సమ్మతి నొకానొక సుముహూర్తమున కుమార్తెకు "కాళి" యను నామకరణము గావించెను. నామకరణావసరంబున గూడ సద్బ్రాహ్మణులకు వివిధదానముల నొనర్చినవాడు.

హిమవంతుఁడు బహుపుత్రుండైనను తన యనుఁగు కుమార్తెయగు కాళిని పదేపదే గాంచుచు మురియుచుండెను. అంత నా దేవి - వర్షకాలములో గంగానది వలెను, శరత్కాలమున వెన్నెలవలెను గిరీశ్వరుని యింట దినదినప్రవర్ధమాన యగుచు శుక్లపక్షమున చంద్రకళవలె మనోహరమైన స్వరూపము గలదిగా కన్పట్టుచుండెను. జనకుని కులమునకుఁదగునట్టు పార్వతి యని కాళిని బంధువర్గము పిలచుచుండెను. పెద్దదై తపస్సునకు వెళ్ళునపుడు తల్లి వారించినది గావున "ఉమ" యనియు పేర్కొనంబడు నామె సర్వసౌభాగ్యములకు నిలయమగుటఁజేసి హిమవంతుఁడు పుత్రికను మాటిమాటికి గాంచుచు తృప్తిఁజెందకుండెను.





వసంత కాలమున పుష్పములు పెక్కున్నను చూతము (మామిడి పువ్వు) నందే తుమ్మెదలు వాలి సంతృప్తిపడినట్లును హిమవంతుఁడు పార్వతియందే ముదితుండగుచు నామెచే సంభూషితుడైనట్లు పవిత్రముగా నగుపడుచుండెను. మరియు సంస్కారముగల వాక్కుచే బుద్ధిమంతునివలెఁ బ్రకాశించుచుండెను. మరియు గొప్ప కాంతితో దీపమువలెను గంగానదితో సన్మార్గమువలెను గిరిజతో గిరి యలరారుచుండెను.

పార్వతీదేవి - చెలికత్తెల నడుమ బంతులాటతోడను బొమ్మలాటతోడను గంగానది యిసుక తిన్నెలయందు శివలింగముల నిర్మించుట మున్నగువాని తోడను బాల్యక్రీడలను సలుపుచుండెను.

పిమ్మట సద్గురువు నాశ్రయించి యాతఁడు చెప్పునపుడే సమస్తవిద్యల నవలీలగా చదువుచుండెను. శరత్కాలమున రాజహంసలు ఆకాశగంగనువలె రాత్రి సమయమున నిజకాంతులు ఓషధులను వలె ప్రాక్తనవిద్యలన్నియు నామెను వరించినవి.

ఇట్లు అమ్మవారు చిన్నతనపు ఆటలను వర్ణించితిని. ఇఁక నితరములైన లీలల నభివర్ణించెదనని సూతుఁడు శౌనకాది మహర్షులకు వక్కాణించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో సప్తమాధ్యాయము.

## అష్టమాధ్యాయము

### (నారద హిమాలయ సంవాదము)

ఒకప్పుడు నారదమహర్షి - శివప్రేరితుడై హిమవంతుని చెంతకు వెళ్ళగా నాతడు ప్రణమిల్లి పూజించియు తన కుమార్తెను నారదుని పాదములకు నమస్కరింపఁజేసియు "మహర్షీ? బ్రహ్మమానస పుత్రులలో శ్రేష్ఠుడవు; పరోపకారపారీణుఁడవు; నాయందు దయఁదలచి పుత్రికఁదగు జాతకమున గల గుణదోషములను వివరింపుమనియు భాగ్యవంతురాలై ఏమహానుభావునికి భార్య కాగలదో చెప్పు" మనియు ప్రార్థించెను. అంత నారదుఁడు పార్వతీదేవి ఁదగు హస్తమును పరీక్షించి "మేనకా హిమవంతులారా? చంద్రుని పదునారవకళవలె శోభించు మీ కుమార్తెను గారాబముగా పెంచితిరి. ఈమె తలిదండ్రుల కీర్తి నినుమడింపఁజేయునదై తన భర్తకు మిక్కిలి యానందము నొనగూర్చును. మహాసాధ్వియై చిరకాలము సుఖించును. ఈ కన్యకాహస్తమున రేఖలన్నియు సులక్షణములు కలిగియే యున్నవి. కాని యొక్క రేఖ మాత్రము విలక్షణముగా కన్పట్టుచున్నయది. అట్టి రేఖవలన కలుగు ఫలమేమనఁగా? యోగియు దిగంబరుఁడును కామమోహము లేనివాడును మాతాపితరులు లేనివాడును ఆత్మాభిమానవర్జితుండునగు భర్త యీమెకులభించును" అని పలుకగా మేనకాహిమవంతులు నారదుని జోస్యమును నిజముగా విశ్వసించి విచారపడిరి. పార్వతీదేవి మాత్రము నారదవాక్యమున బోధపడువాడు శంకరుఁడేయని మదిని భావించి సంతసించినది. మరియు మునిభాషితము యదార్థంబని శివుని పాదపద్మయుగమునందు మనస్సు నెలకొలిపినది. హిమవంతుఁడు దుఃఖితుడై పార్వతికి పతి - తాము చెప్పిన వాడుగాక మంచివాడు లభించునుపాయమును వివరింపుమని నారదునడుగగా నారదుడిట్లు చెప్పదొడంగెను.

గిరీశ్వరా! నామాట నిజమని నమ్ముము! హస్తరేఖ బ్రహ్మలిపియే యగును. కావున వ్యర్థము కాజాలదు. నే చెప్పినట్టివాడే పార్వతికి భర్త లభించును. కాని యందుకు నొక నుపాయము కలదు. శంకరుఁడు నే చెప్పిన లక్షణములు కలవాడగుటయే గాక సులక్షణములును కలిగియుండును.

శ్లో॥ ప్రభౌదోషే న దుఃఖాయ - దుఃఖదో௨త్య ప్రభౌపిసః ।
రవి పావక గంగానాం - తత్రజ్ఞేయా నిదర్శనా ॥ ౨౦

విశ్వనాధుడగు శంకరుని యందు నవగుణ మెద్దియేని స్ఫురించినదో నద్ది దుఃఖము నొసగఁ జాలదు. ప్రభువుకానివాని యందు గల దోషముమాత్రము దుఃఖము నొదవఁజేయును. సూర్యుఁడు అగ్నియు గంగానదియు పరమపావనంబులైనకతన నవ్వాని యందలి దోషములును శ్రేయస్కరములగునట్లు శివుని యందు గల లక్షణములన్నియు భక్తులకు శుభప్రదంబులగునని భావము.

అందువలన నీ కన్యకయగు పార్వతిని శివునికి సమర్పించుము! శివుఁడు భిక్షుకుఁడుగా కనంబడినను సర్వేశ్వరుఁడును నిర్వికారుఁడును నవ్యయుండునై శీఘ్రప్రసాదము గలవాడగుటఁజేసి యీ నీ కుమార్తెను తప్పక పరిగ్రహించును. అందుకు గిరిజ తపంబాచరించునెడ ప్రసన్నుడగును. ఐతే శివుని నురసామాన్యునిగా భావింపకుము. వేదవేదాంత వేద్యుఁడనియు లోకకల్యాణము నొనగూర్చువాడనియు అన్నిట సంపూర్ణమైన సామర్థ్యము గలవాడనియు చరాచరమునంతయు నియమించువాడనియు ఆతని యాజ్ఞయే సూర్యచంద్రాదులను వజ్రాయుధమువలె భయపెట్టుచు కర్తవ్యముల యందు బాగుగా ప్రవర్తింపఁజేయుచున్నదనియు గుర్తెరుగుము!

మరియు నో హిమవంతా! ఈమె శంకరుని యర్ధాంగియగుటయే గాక జననీ జనకులకు నానంద మొదవునట్లు మహాసాధ్వియై సువ్రతయై పరమేశ్వరుని చిత్తమును తన తపఃప్రభావమున స్వాధీనముఁ జేసుకొనును. ఆతడు నీమెదక్క నితరవనితను పరిగ్రహింపఁడు. పార్వతీ శంకరుల యన్యోన్యానురాగము ప్రపంచమున నేరికినియుండ జాలదు. ఈ వరకు ఇప్పుడు ఇఁకముందు నిట్టి దాంపత్య స్నేహమును గాంచజాలము. మాటుపడిన దేవతాకార్యములన్నియు వీరి వలన సాధింపఁబడును. నీ పుత్రిక శంకరుని శరీరమున వామభాగమై దినముతో సంతోషము కలియునట్లు ప్రవర్తించును. ఐతే శివుని వామార్ధాంగము పార్వతికి తపంబుఁదగు మహిమవలననే లభించును. ప్రస్తుతము నీ కుమార్తె కాళిగానున్నను శివానుగ్రహము వలన మెరుపువలె ప్రకాశించు ధవళవర్ణముగలదై సువర్ణదేహకాంతితో స్వర్ణగౌరియనఁ బఱగును. హరిబ్రహ్మాదిదేవతలును సనకాది సిద్ధులు నీమెను పూజింతురు. శివునికి గాక నితరునకు నీ కుమార్తె నీయకుము! ఇద్ది రహస్యము గావున దేవతలకేరికిని తెలియనీయవలదు.

ఇట్టి నారద సంభాషితమును హిమవంతుఁడాకర్ణించి యిట్లు వచించెను. మహర్షీ! మహాదేవుఁడు జితేంద్రియుఁడనియు రాగద్వేషాధిరహితుండనియు అమరులకుగూడ నగోచరుఁడై నిత్యము తపంబాచరించుచుండుననియు వినియున్నాను. కావున పరశివార్పితంబగు తన మనస్సును ప్రాకృత భోగమునకై ఎట్లు మరలించును? అని నా సందేహము. మరియు ప్రదీపశిఖవలె తనలో వెలుగొందుచున్న సదాశివ పరబ్రహ్మము నిజరూపంబనియు నిర్వికారంబనియు బ్రహ్మవిష్ణ్వాద్యతీతంబనియు నిర్గుణంబనియు





సగుణంబనియు నిరపేక్షంబనియు నిరంతరము శంకరుఁడు ధ్యానించువాడు కావున బాహ్యమును గమనింపఁడని కిన్నరలు చెప్పగా వినియుంటిని. సంసారబంధమును హరించువాడగుటచే హరుఁడను విశిష్టనామం బతనికి కలదు గదా!

మరియు "పూర్వము దాక్షాయణిని పరిగ్రహించునపుడు నిన్నుదక్క నితర స్త్రీని పరిణయ మాడనని శంకరుఁడు ప్రతిజ్ఞఁజేసియున్నాడు. ప్రస్తుతము దాక్షాయణి మరణించినది కావున మరియొక రమణి నెట్లు పరిగ్రహించును?

అంత నారదుడు "పర్వతరాజా? ఇవ్విషయమై చింతింప నవసరము లేదు. దక్షప్రజాపతి పుత్రికయగు సతీదేవి – దక్ష యజ్ఞమున శరీరమును పరిత్యజించి నీ కుమార్తెగా జన్మించినది" అని వచించుటయే గాక పూర్వ వృత్తాంతము నంతయు వివరించినవాడు. పార్వతియు నారదుని ప్రసంగము నంత యాలకించి సిగ్గుచే తలవంచుకొనినదయ్యెను. హిమవంతుఁడు సంతుష్టాంతరంగుడై పార్వతిని చేయితో పుణుకుచు శిరంబున నాఘ్రాణించి తన పీఠము పై కూర్చుండఁజేసినవాడు. మరల నారదుడు "అయ్యా! ఈమె ప్రస్తుతము నీ పీఠము నధిష్ఠించినది కాని మున్ముందు శంకరుని తొడపైన నాసీనురాలై అన్యముపై మానసమునుగాని చూపును గాని పోనీయదు" అని వచించి నిజనివాసమునకు చనినవాడు.

హిమవఁతుడును ప్రమోదభరితుండై భార్యాపుత్రికలతో నంతఃపురమున కేగినవాడు.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో అష్టమాధ్యాయము.**

## నవమాధ్యాయము

**(మేనకా హిమవంతులు పార్వతికి శివునారాధించుమని చెప్పుటయు స్వప్నమున శివుని రూపాంతరమును గాంచుటయు శివుఁడు హిమాలయమున కరుదెంచుటయు)**

అంత నొకనాడు హిమవంతుని చెంతకు మేనకాదేవి వెళ్ళి నమస్కరించియు "ఆర్యపుత్రా! మనపుత్రిక విషయమై నారదమహర్షి వక్కాణించినయంశము నాకేమి యవగతము కానులేదు. కావున ప్రస్తుతము సుందరుడైన వరునితో వివాహము ఏర్పడుటకు ప్రయత్నించుము! సులక్షణములు గల కులమునందు పుట్టినవానికి మన కుమార్తె నిత్తుమేని యపూర్వసుఖంబొందవును. ప్రాణప్రియురాలైన పార్వతి నిరంతరము తన భర్తతో సుఖముగా కాలముఁ గడుపు నుపాయము నాలోచించుము!" అని ప్రార్థించుచు నాతని పాదములపై పడినది. హిమవంతుఁడు మేనకను లేపినవాడై "ప్రాణేశ్వరీ! నారదుని సంభాషితము ననుమానింప వలసిన యవసరము లేదు నిష్కారణముగా భ్రాంతిఁజెందకుము! ఒకవేళ కుమార్తె యందు నీకు గాఢానురాగము కలదేని శంకరుని గూర్చి తపంబొనర్పుమని యామెకు బోధింపుము! పార్వతీదేవిఁ దగు తపంబున శివుఁడు ప్రసన్నుడైనచో తప్పక పాణిగ్రహణముఁజేయును. శివప్రాప్తితో నమంగళములన్నియు తొలగును. అందువలన పార్వతి శివునిఁజేరునట్లు హితవచనములఁ జెప్పుడు!" అని వక్కాణించెను.

అంత మేనకాదేవి సంతసించి కుమార్తె చెంతకు వెళ్ళి పార్వతీదేవిఁదగు సుకుమార శరీరమును గాంచి లోలోన గుందుచు "ఇంతటి యపురూపసుందరికి తపంబొనర్పనెట్లు చెప్ప సాహసింతు" నని విచారపడుచుండెను. కాళికాదేవి తల్లి మనోగతమును గుర్తెరిగి "అమ్మా! నేటితెల్లవారునపుడొక స్వప్నముఁ గాంచితిని. ఒకానొక బ్రాహ్మణుఁడు శివుని గురించి తపించుటకు మహామంత్రము నుపదేశించినవాఁడు" అని నంతనే మేనక హిమవంతుని రప్పించి స్వప్నవృత్తాంతమును తెలుపగా నాతడు "నేను గూడ - నారదుఁడు చెప్పిన లక్షణము గల నొకానొక మహానుభావుఁడు మన పట్టణసమీపమున తపంబొనర్ప నరుదెంచగా పార్వతిని వెంటనిడుకొని యాతని చెంతకు వెళ్ళినట్లును అతడే శంకరుఁడనియును తమరి సేవకై నా కన్యకను చెంతనుంచుదుననఁగా శంభుడందుల కంగీకరింపఁలేదనియు అప్పుడు పార్వతీ శంకరులకు సాంఖ్య వేదాంత వివాదము సంభవింప నెట్టకేలకు శివుఁడంగీకరించినందున పార్వతి శివునినే భర్తగా బడయుదునను కోర్కెను మనస్సునందిడుకొని యాతని చెంత నుండెననియు" కలగంటి ననియు స్వప్నఫలము ప్రాప్తించుటకు సమయమును నిరీక్షింపవలె ననియు వక్కాణించి మేనకతో గూడ తత్కాలము నెదిరుచూచుచుండెను.

ఇట్లు కొన్నాళ్లుగడువగా సత్పురుషప్రాప్యుండైన శంకరుఁడు లోకరీతిని నటించుచు సతీవిరహవ్యాకులుడై సర్వత్ర సంచరించుచు కొన్ని గణములతో హిమాలయమున కరుదెంచగా పార్వతీదేవి యిరువురు చెలికత్తెలతో శివసన్నిధానమున నుపచారములను కల్పించుచుండెను. శంకరుఁడు పార్వతి నవలోకించునపుడు మనస్సు చంచలమగుచున్నను ధైర్యముతో వికారముఁ జెందకుండెను. అంత దేవతలు శంకరుని మోహింపఁజేయు మన్మథు నంపగా శివుఁడు ఫాలాగ్నిచే మన్మథుని దహింపఁజేసినవాఁడు. అందువలన గిరిజాదేవి తన సౌందర్యము వ్యర్థంబైనదని మదిఁదలచి ఘోరతపంబొనర్పగా శంకరుఁడు విష్ణుప్రసాదితుడై లౌకికాచారము ననుసరించి పార్వతిని పరిణయంబాడెను.

శౌనకాదిమహర్షులారా? ప్రభువుఁడగు విలాసమును సంగ్రహముగా ప్రతిపాదించితిని. ఇంక నెద్ది విందురో ప్రశ్నించుడనని సూతమహర్షి వక్కాణించెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నవమాధ్యాయము.**

## దశమాధ్యాయము

### (కుజుఁడు ఉదయించి శివానుగ్రహమువలన గ్రహత్వమునొందుట)

శివలీలను సవిస్తరముగా వినిపింపుమని శౌనకాదులు వేడగా సూతుఁడు చెప్పఁదొడఁగెను.

సతీదేవి నెడబాసి, కైలాసమునకు వచ్చినతరువాత శంకరుఁడు ప్రాణములకన్న మిన్నయగు సతీదేవిని స్మరించుచు గణములకు నామెగుణములను వక్కాణించుచు దుఃఖించుచుండెను. గృహస్థధర్మమును విడనాడి దిగంబరుడై లోకములయందు తిరుగాడుచు నొకచో భక్తులకు దర్శనమునిచ్చుచు కైలాసమునకు మధ్యమధ్య నరుదెంచుచుండినవాడు. మరియు ప్రయత్నబలమున మనుస్సు నేకాగ్రముఁగావించి సమాధిలో

నవ్యయంబగు నిజరూపము నవలోకించుచుండెను. ఇవ్విధము గుణత్రయమును వశపఱచుకొని మాయాధీశ్వరుఁడైన శంకరుఁడు చిరకాలమును గడువగా నొకనాడు ప్రభుని నొసటినుండి చెమటఁ బిందువు భూమిపైపడినందున తత్కాలముననే శిశువునుద్భవించెను. ఆశిశువు నాలుగుచేతులు అరుణకాంతియు రమణీయస్వరూపంబును లోకాతీతప్రతిభయు ఇతరులకు గమ్యముకాని ప్రభావంబును కలిగి పరమేశ్వరునిముందు రోదనముఁజేయగా భూమాత శంకరునకు వెఱచి స్త్రీరూపముఁదాల్చి యనురాగమున బాలునకు చనుబాలు త్రాగించి ముద్దునిడి కుమారునాడించెను. అంత శంకరుఁడు చిరునగవుతో "ధరణీ! ధన్యురాలవు నాశ్రమజలమువలన నీయందు నుదయించిన బాలుని బాగుగా కాపాడుము. అధ్యాత్మిక అధిభౌతిక అధిదైవిక తాపత్రయము లేనట్టి యీపిల్లవాడు నీపేరుతో ప్రసిద్ధుండగును. నాకును వీనిని చూచినకొలదియానంద మొదవుచున్నయది" అని సంభాషించి విరమింపగా భూదేవి యాబాలుని చంకనిడుకొని శివాజ్ఞావశమున స్వస్థానముఁజేరి సుఖముగా నుండెను.

బాలుఁడు భౌముండను నామదేయమునఁబఱగుచు వయసువాడై కాశీక్షేత్రమున విశ్వనాథునుద్దేశించి తపంబాచరించి శివానుగ్రహమువలన నవగ్రహములలో నొక్కగ్రహంబై శుక్రలోకముపైనుండు శ్రేష్ఠమైన దివ్యలోకము నధివసించి యున్నవాడు.

శౌనకాదిమహర్షులారా? సతీవిరహవ్యాకులుడైయున్నపుడును శంకరుని లీలావిలాసము అద్భుతంబుగాను లోకకల్యాణకరంబుగాను పరిణమించినది. ఇఁక నాతని తపోవిధానము నాలకింపుడు!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదియవయధ్యాయము.

## ఏకాదశాధ్యాయము

### (శివునియొక్కయు హిమవంతునియొక్కయు సమావేశము)

శ్లో॥ వర్ధమానా గిరేఃపుత్రీ - సాశక్తిర్లోకపూజితా ।
అష్టవర్షాయదాజాతా - హిమాలయ గృహేసతీ ॥ ౧

లోకపూజ్యురాలైన గిరిజాదేవి హిమవంతుని యింట దినదినము పెరుగుచు నెనిమిది వత్సరముల బాలిక కాగా శంకరుఁడీ సమాచారమును కనుగొని పార్వతినే మనస్సునందిడుకొని లోలోన సంతసించుచుండెను. మరియు నదే సమయమున లౌకికగతి నాశ్రయించి మనస్సును సమాధాన పెట్టుటకు తపింపఁదలచి నందికేశ్వరాది గణములవెంటనిడుకొని హిమవంతముపై గంగావతార స్థలమునకు నరుదెంచెను. పూర్వము బ్రహ్మలోకమునుండి బయలుదేరిన గంగానది భక్తుల పాపపుంజములను నశింపఁజేయు పరమపావనియై యిచ్చోటనే వెలసినది. ఇట్టిస్థలమున శంకరుఁడు ఎట్టి భ్రమప్రమాదములు లేని పరమాత్మయగుటచే నేకాగ్రముగా తపంబును ప్రారంభించి

శ్లో॥ చేతోజ్ఞానభవం నిత్యం - జ్యోతీరూపం నిరామయం ।
జగన్మయం చిదానందం - ద్వైతహీనం నిరాశ్రయమ్ ॥ ౨



జగన్మయము చిదానందమయము ద్వైతవర్జితంబు నిరాశ్రయంబు జ్యోతిర్మయంబు నగు నిజరూపమును ధ్యానించుచుండెను. భగవానుఁడు ధ్యానపరుఁడుకాగా నంది భృంగీశ్వరాది గణములు కొందరు శివధ్యానమును చేయుచుండిరి. మరికొందరు గణములు శంకరునకు వలయు నుపచారములను కల్పించుచుండిరి. ఇంక కొందరు మౌనముగా పరమేశ్వరుని దివ్య రమణీయ తపోవిగ్రహము నవలోకించుచుండిరి. ఇంతలో శంకరుఁడు నోషధీప్రస్థమున కరుదెంచినవాడని చారులవలన హిమవంతుఁడు తెలుసుకొని యచ్చోటికి సపరివారముగా వెళ్ళి ప్రభువునకు నమస్కరించి దిగువవిధము నుతించెను.

దేవదేవా! మహాదేవా! శంకరా! మూడులోకములను రక్షించువాడవు నీవేను; యోగిరూపధరుండవు, నిర్గుణుండవు, సగుణుండవు, కైలాసమున నివసించియు సర్వలోకముల విహరించుచు లీలావిలాసములను చూపెట్టుచుందువు, పరిపూర్ణస్వరూపుడవు, నిర్వికారుడవు, నిరపేక్షుఁడవు, ధీరుఁడవు, బహిర్భోగములను తృణీకరించువాడవు, భక్తవత్సలుఁడవు, విష్ణుబ్రహ్మాదులతో సేవింపఁబడువాడవు, విష్ణుబ్రహ్మాదిపదముల నొసగువాడవు, సమంజసమైన తపంబుఁదగు ఫలమును ప్రసాదించువాడవు, లోకవ్యవహారములను పాటించువాడవు.

సజ్జనులకు సుఖప్రదమైన నీ లీల నెవరును కనుగొనఁజాలరు. భక్తుల మనోభీష్టముల నీడేర్చుచు నవ్వారి వశంవదుడవగుదువు; నీవిచ్చోటికేతెంచుట నాభాగ్యోదయమనియే భావింతును. నన్ను సనాధునిగా నొనర్పుము! దీనులపాలిటి కల్పతరువగు నిన్నుదర్శించి ప్రార్థించుటవలన నాజన్మ ధన్యంబైనది. జీవనము సార్థకంబైనది. నన్ను నీ యాజ్ఞాపరిపాలకునిగా భావించి నీ సేవనమున నియోగించుము! అనన్యభావనతో సేవింతును.

అంత శంకరుఁడు కొద్దిగా నేత్రములఁదెఱచి పరివారముతో కూడిన హిమవంతు నవలోకించి స్మితముఖుండై "గిరీశ్వరా! నేనిచ్చోటికి రహస్యముగా తపంబొనర్ప నేతెంచితిని. కావున నెవరును నా తపఃస్థానమునకు రాకుండునట్లు ఏర్పాటు చేయుము. నీవైతేనో తపో నిలయమగువాడవు; మునులు దేవతలు రాక్షసులు మహాత్ములందరును నీయందు నివసింతురు. బ్రాహ్మణుల కాశ్రయ మిచ్చువాడవు; ఎల్లకాలము గంగా నదీప్రవాహమున పవిత్రుడవగుచుందువు; పరోపకారపారాయణుఁడవు; నాతపస్సు నిర్విఘ్నముగా కొనసాగుటకు వలయు దృఢ ప్రయత్నమును చేయుచుండుము! ఇదియే నా పరమసేవనంబగును. ఇఁక నీవు స్వగృహమునకు వెళ్ళవచ్చు" నని హిమవంతుననుగ్రహింపగా నాతఁడు పరమేశ్వరా! దేవాదులు నెంతయో ప్రయత్నించినను కనుపడని నీవు నాస్థలమునకు స్వయముగా వేంచేయుట వలన నాతో సమానుడైన పుణ్యాత్ముడు లేడనియు దేవేంద్రుని మించిన భాగ్యము నాకు దాపురించినదనియు తృప్తిపడుచున్నాను. మరియు నీ తపస్సు కొనసాగుటకు యధాశక్తి యత్నింతును. అని మాత్రము వక్కాణించి స్వగృహమునకు వచ్చినవాడై నిజభటులనందరిని రప్పించియు "భటులారా! మీలో నొక్కరుగూడ గంగావతరణ స్థలమునకు నీవేళటినుండి వెళ్ళవలదు. ఒకవేళ నా శాసనము నుల్లంఘించి వెళ్లుదురేని అట్టివారిని కఠినముగా శిక్షింతు" ననియాజ్ఞాపించి భవిష్యత్కార్యమునకై కడంగెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏకాదశాధ్యాయము.**





# ద్వాదశాధ్యాయము

## (శివ హిమవంతుల సంవాదము)

గిరీశ్వరుఁడొక్కనాడు తన కుమార్తెను వెంటనిడుకొని పుష్పములను ఫలములను గైకొనియు శంకరుని చెంతకు నరుదెంచి ధ్యానతత్పరుండైన జగన్నాథునకు ప్రణమిల్లి "నా పుత్రిక యీమహామహుని సొమ్మే" యని మదినర్థించుచు ఫలపుష్పాదికమునంతయు సమర్పించి పార్వతిని ముందు నునిచి దిగువవిధము విన్నవించెను.

భగవన్? చంద్రశేఖరుడవైన నిన్ను సేవించుటకు నా బిడ్డ నిచటికి గొనితెచ్చితిని. ఇరువురు చెలికత్తెలతోగూడ నిచ్చోట నిన్ను సేవించును కావున నాయందనుగ్రహము కలదేని యీ నా విజ్ఞప్తి నంగీకరించుము!

అనఁగానే శంకరుఁడు పార్వతి నవలోకించెను. పార్వతికి అప్పుడప్పుడే యౌవనము పరిపుష్టమై యుండెను. మరియు నామె పూర్ణచంద్రునితో సమానమగు ముఖముతోడను విలాసముల కన్నిటికి నెలవైన శుభవేషముతోడను శంఖమువంటి కంఠముతోడను విశాలములైన కన్నులతోడను మనోహర కర్ణయుగముతోడను తామరమొగ్గలఁబోలిన పీనస్తనములతోడను కృశించిన నడుముతోడను కడుపుమీది ముడుముడుతలతోడను స్థలపద్మములఁబోలిన పాదములతోడను విరాజిల్లుచుండెను. ఇంతియేగాక ధ్యానసంజరములో బంధింపఁబడిన మునిమానసమునైన మోహింపఁజేయు లావణ్యము గలిగి వనితాగణ శిరోమణిగానుండెను. తంత్రమంత్రముల ప్రయోజనములను పెంపొందించునదియు కామరూపిణియునగు పార్వతి నొకపరి చూచి వెంటనే శంకరుఁడు నిమీలితాక్షుండై (కన్నులుమూసి) స్వరూపమును చింతించు చుండెను.

అంత హిమవంతుఁడు సందిగ్ధచిత్తుడై వేదాంతవేద్యుఁడు చంద్రకళా విభూషణుఁడు జటాజూట విరాజితుండు నగు శంకరునికి మరలనొకసారి యభివాదించి జగదేకబంధువును గురించి యిట్లు సంభాషించెను.

మహాదేవా! నిన్ను శరణుఁబొందిన నన్నొకమారు కన్నులుతెఱచిచూడుము! భక్తుల సంకటముల నన్నిటిని పోనాడుచు జగమున కానందమును కలుగఁజేయుదువు. వేదములు శాస్త్రంబులును కనుగొనఁ జాలని నీ మహిమ యవాఙ్మానసగోచరంబు; శ్రుతియే త్వదితరమునంతయు బ్రహ్మముకాదని నిషేధించి నిన్ను వివరించుటకై సాహసించి పూర్తిగా చెప్పఁజాలక చకితయగుచుండగా నితరప్రమాణములు ప్రబోధకములు కావని వేరుగా చెప్పనవసరములేదు. కాని నీ యనుగ్రహముఁబడసిన భక్తులనేకులు మాత్రము నిన్ను తెలుసుకుందురు. శరణాగత భక్తుల కెప్పుడును భ్రమప్రమాదాదులు సంభవింపఁ జాలవు.

శ్లో॥ జానంతి బహవోభక్తా - స్త్వత్కృపాంప్రాప్య భక్తితః।
శరణాగత భక్తానాం - నకుత్రాఽపి భ్రమాదికమ్ ॥ ౧౯





దీనుడనైన నావిజ్ఞప్తి యేమనగా? నన్ను నీ దాసునిగా భావించి కృతార్థుఁజేయుము! ప్రభో! శంకరా! ఈ నా కుమార్తెను వెంట నిడుకొని నిత్యము నీ దర్శనార్థమై వచ్చుచుందును.

అట్టితఱి శంకరుఁడు ధ్యానమును విరమించి కొంత తడవాలోచించియు "నీకుమార్తె నింటియందు నునిచి నీవుమాత్రము నన్ను దర్శించుటకు రావచ్చు" ననఁగా హిమవంతుఁడు "స్వామీ! ఎందుకు నాపుత్రికను తీసుకొనిరాకూడదు! నిన్నుసేవింప నీమె యోగ్యురాలు కాకుండునా? సెలవీయుము" అని ప్రార్థింప శంకరుఁడు కుత్సితయోగులగతిఁబ్రదర్శించు నుద్దేశముతో నిట్లు హిమవంతునకు వాక్రుచ్చెను.

చంద్రవదనయు సుశ్రోణియు నగు నీ కుమారిని తీసుకొనిరావలదు. ఎందుకనగా స్త్రీ మాయారూపిణి యనియు అందు తరుణ తాపసులకు విఘ్నముల నొదవఁజేయుననియు వేదవిదులు చెప్పుచుందురు. మాయాసంబంధము లేనట్టి యోగియు తపస్వియు నైన నాకు నాడు దానితో ప్రయోజనము లేదు. వేదధర్మమును తెలిసిన వారిలో మిన్నయగు నీవిట్లుమాటలాడకూడదు పర్వతరాజా! యోగులకు స్త్రీసాహచర్యమున నింద్రియసుఖములపై ననురాగముదయించును. అందువలన వైరాగ్యము కుంటుపడుటయే గాక తపోబలము క్షీణించును. కావున తాపసుఁడు స్త్రీలయందను రక్తుఁడు కారాదు.

ఇట్లు శంకరుని భాషితము నాకర్ణించి హిమవంతుఁడు చకితుడై నిరుత్తరుండయ్యెను. అంత పార్వతీదేవి - సందర్భము నంతయు గమనించి దిగువవిధము సంభాషించెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పంద్రెండ్రవయధ్యాయము.**

## త్రయోదశాధ్యాయము

### (శివపార్వతీ సంవాదము)

పార్వతి - జ్ఞానవిశారదుడవగు మహేశ్వరా! నీవు చెప్పినయంశమునకు సదుత్తరమును చెప్పుచున్నాను. వినుము! శక్తితో కూడినవాడవయ్యే విపులమైనతపంబు నొనర్చుచున్నావు. వస్తుతః తపించవలె నను బుద్ధియే శక్తి యనియు ప్రకృతి యనియు పేర్కొనంబడును. సమస్త పుణ్యకర్మలకును శక్తియే మూలకందముగదా! మరియు శక్తి నూతగాఁగొనియే నీవు సృష్టిస్థితిలయములను గావించుచున్నావు. నీవు ఎవరో సూక్ష్మమైన శక్తి యెవరో విమర్శింపవలెను. శక్తి లేనిది మహేశ్వరుఁడు లింగస్వరూపుఁ డెట్లయ్యెను? నీవు లింగస్వరూపముననే పూజింపఁబడుచున్నావు. నమస్కరింపఁబడుచున్నావు. ధ్యానింపఁ బడుచున్నావు అనఁగా నిరంతరము శక్తి విశిష్టుడవై విరాజిల్లుచుందువని భావము.

శివుఁడు - పరమోత్కృష్టమగు తపస్సుచేతనే ప్రకృతిబంధమును దూరమొనర్చుకొనువాడను. కావుననే అప్రాకృతుడ నగుచున్నాను. సత్పురుషులు - ఇంద్రియ వికారములను తెగటార్చి లోకాచారముల జోలికిఁబోక ప్రకృతిసంబంధములగు స్రక్చందనవనీతాదులను దరిఁజేరనీయరుగదా!





పార్వతి - శంకరా! నీవు చెప్పునదియు ప్రకృతికాదా? ఇట్టిప్రకృతి నతిక్రమించినాడవెట్లు? సర్వంబు ప్రకృతిబద్ధమైయుండునది. ఒకవేళ నీవు ప్రకృత్యతీతుండ వగుదువేని మాటలాడకూడదు. జగమును రచింపకూడదు. ఎద్దియుచేయరాదు.

శ్లో॥ యచ్ఛృణోసి యదశ్నాసి - యత్పశ్యసి కరోషియత్ ।
తత్సర్వం ప్రకృతేఃకార్యం - మిథ్యావాదో నిరర్థకః ॥ ౧౩

దేనిని వినుచున్నావో దేని ననుభవించుచున్నావో దేనిని చూచుచున్నావో దేనిని చేయుచున్నావో అది యంతయు అనఁగా శ్రవణభోదర్శన క్రియాదికమంతయు ప్రకృతిఁదగు కార్యమగును. ప్రకృతి మిథ్యయను వాదమునకు నాస్కారములేదు. ఒకవేళ నీవుప్రకృతిని తిరస్కరించిన వాడవైనచో ఈ హిమాలయముపై తపంబునెందులకు చేయుచున్నావు? అందువలననే ప్రకృతిని విడనాడనివాడవని తేటపడుచున్నయది. నిజంబగు సచ్చిదానంద మయస్వరూపమును మఱుగుపఱచి ప్రాకృతునిఁబోలిన నీ ప్రవర్తనముఁజూడగా ప్రకృతి బద్ధుడవనియే బోధపడును. ప్రత్యక్షముగా నీవిట్లు గోచరించుచుండగా ప్రకృతికందని వాడవని తర్కించుటయనుచితముగాదా? దేహధారులు నింద్రియములతో గాంచుచున్నదంతయు ప్రాకృతంబగును. వేయేల? అట్టి ప్రకృతియే నేను; పురుషుండవు నీవు; నాచేయూతఁగైకొనియే సమస్తంబు నాచరించుచున్నావు; నీవు చెప్పినట్లే ప్రకృతిబద్ధుడవు కాకుందువేని నేనుచెంత నుండుటఁజేశి భయమెందులకు?

శివుఁడు - పార్వతీ! ఇంతవరకు నీ మనోదార్ఢ్యమును గుర్తింప నిట్లు ముచ్చటించితిని. ఒకవేళ నాపరిచర్యయందు నీకు దృఢారాగము కలదేని ప్రతిదినము విహితమైన సేవ నొనర్పుము! వేదాంతవేద్యుడనై నిర్లిప్తుడనైయుండు నాకు నీసామీప్యంబేమియు చేయఁజాలదు.

భక్తానురంజనపరుఁడగు శంకరుండిట్లు పార్వతీదేవికి ననుజ్ఞనొసగి "పర్వతరాజా! నీప్రదేశమున తపంబొనర్చుటకు ననుమతినీయు" మని ప్రశ్నింప హిమవంతుఁడు విని వినయ పరిపూర్ణుఁడై "శంకరా! ఈ జగమంతయు నీదేయైయుండ నేనా నీకు ననుజ్ఞనిచ్చువాడను? నీ విభూతిలో హిమాలయ మఱుమాత్రముగాదే" అని విన్నవింప సదాశివుడు చిరునగవుతో నిజనివాసమునకుఁజనుమని వక్కాణించెను.

అంత హిమవంతుఁడు పార్వతిని వెంటనిడుకొని యింటికి వెళ్ళినవాడు. ప్రతిదినము శివదర్శనార్థము వచ్చుచుండెడివాడు. ఇఁక పార్వతీదేవి - ఇరువురు సఖురాండ్రను తోడ్కొని శంకరుని సేవించుటకు వచ్చుచుండెను. ఇఁక పార్వతీదేవి - ఇరువురు సఖురాండ్రను తోడ్కొని శంకరుని సేవించుటకు వచ్చుచుండెను. మహేశ్వరుని శాసనమున నందీశ్వరులాదురెవరు నామెను వారింపకుండిరి.

నిజము విచారించిచూడగా నెప్పుడు నెడబాటు లేనట్టి శక్తిశివులు సాంఖ్య వేదాంత మతముల ననుసరించి వాదించుకొనిన సందర్భము భక్తులకు సుఖము నొదవంజేయునది. హిమవంతునియందలి గౌరవముచే హైమవతిని తన సేవలో చెంతనుండ నంగీకరించిన శంకరుఁడు "నిత్యము నన్ను సేవించి వెళ్లుటకు పార్వతి యెట్టిభయముఁజెందకుండుగాక" అనిస్పుటముగా వచించెను. విఘ్నములు సంభవించుచున్నను అట్టి ఆటంకములను గణింపక నుండుటయే ధీరులైన తాపసుల లక్షణంబగును.

హరుఁడెట్టి వికారము నొందక నిజరూపధ్యాన తత్పరుడైయుండెను. కాళియనఁబడు పార్వతీదేవి నిత్యము శంకరుని సేవింప నేతెంచుచు నాతని దివ్యచరణముల నభిషేకించి పాదతీర్థమును పరిగ్రహించుచుండెను. శుభ్రమైన వస్త్రముతో శంకరుని పాదకమలములను తుడుచుచుండెను. విధివిధానముగా పదునారు నుపచారములతో శివునిఁబూజించుచు పునఃపునః మ్రొక్కులిడుచు జనకునింటికి వెళ్ళుచుండెడిది. ఇట్లు పార్వతీశంకరులు ప్రవర్తించుచుండగా చాలాకాలము గడచినది. అంత నొకప్పుడు పార్వతి - చెలికత్తెలతోకూడి శంకరుని సన్నిధానమున మనోహర సంగీతము నాలాపించుచుండెను. మరియొకప్పుడు కుశలను పుష్పములను స్వయముగా తెచ్చుచుండెడిది. ఇంకనొకప్పుడు చెలికత్తెలనూతగా గొని స్థలసమ్మార్జనముతో ముంగిట చాన్పు చల్లుచుండెడిది. మరియొకతూరి శంకరుని కెదురుగా కూర్చొని యా దివ్యసుందరవిగ్రహమును కనులారగాంచుచు విస్మితురాలగుచుండెను. నవయౌవనపరిపూర్ణవయో విలాసినియగు పార్వతి - తన చెంతనున్నను మన్మథవికారము లేనిదగుటను గమనించుచు శంకరుఁడు - ఈమె పూర్వదేహంబునను నాయర్ధాంగియగు సతీ దేవియే గదా - యని మదిఁదలచుచుండెను.

మునులనుగూడ మోహింపఁజేయు లావణ్యముగల కాళికాదేవి తనసన్నిధిని మెలఁగుచున్న నామెను భార్యగా మహేశ్వరుఁడు పరిగ్రహింపలేదు. క్రమమును తప్పకుండా తన్ను సేవించుచున్న పార్వతిపై శంకరుఁడు దయగలవాడై "ఈమె యొకవేళ తపశ్చర్యావ్రతము నాచరించినచో గర్వకారణ మిసుమంతయు నుండదు కావున నప్పుడు పరిగ్రహింతు" ననిలోలోన నిశ్చయించుకొని ధ్యానపరుండయ్యెను. అట్టితతి నా మహామహుని హృదయమున నెట్టిచింతయు లేకుండెడిది. పార్వతీదేవి శివరూపమునే చింతించుచు నిత్యము సేవించుచుండెడిది. హరుఁడు ధ్యానమును చాలించినవేళ తన ముందున్న పార్వతిని చూచుచు చూడనట్లుండెను.

ఇంతలో నింద్రాదిదేవతలు తారకాసురుని బాధలఁబడలేక బ్రహ్మదేవుని యనుమతిని మన్మథుని శంకరునిచెంతకు పంపగా నాతడు శంకరునకు మోహమును కలిగించుటకు సర్వవిధ ప్రయత్నముల నాచరించినను శివుఁడు చలింపకుండుటయేగాక మన్మథుని ఫాలాగ్నిజ్వాలలతో భస్మముఁగావించెను. అప్పుడు పార్వతీదేవి "నేనే సౌందర్యవంతురాల" ననుగర్వమును దూరమొనర్చుకొని నారదునియుపదేశమున తపంబొనర్చి శంకరునిఁబడసినది. పరోపకారపారీణులగు నుమామహేశ్వరులు ఆదర్శదంపతులై పరస్పరానురాగముతో మెదలుచు దేవకార్యమును సాధించుటద్వారా లోక కల్యాణము నొనఁగూర్చినవారు.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో పదిమూడవ యధ్యాయము.**

# చతుర్దశాధ్యాయము

## (వజ్రాంగుడు నుదయించి తపంబాచరించుట)

తారాకాసురుఁడెవని కుమారుఁడు? దేవతల నవ్వాడెందులకు పీడించెను? శంకరుఁడు మన్మథునెట్లు దహించెను? పార్వతీదేవి యత్యుగ్రతపంబెట్లాచరించినది? శంకరుని పతిగా నెట్లు పడసినది? శ్రద్ధాసక్తులతో విననిచ్ఛగించు మాకు నీ వృత్తాంతము నంతయు విస్తరించి చెప్పుమని శౌనకాదులు ప్రశ్నింపగా సూతుఁడు వక్కాణించెను.

శంకరునిఁ బ్రార్థించి యాతని యనుజ్ఞ నొందియే చెప్పుచున్నాను. మొదట తారకాసురుని యుదంతమును వినుఁడు!

బ్రహ్మదేవుని కుమారుఁడగు మరీచిఁదగు పుత్రుడైన కశ్యపప్రజాపతి - దక్షుని పుత్రికలను పదుమూగ్గురిని వివాహమాడెను. అవ్వారిలో దితీదేవి పెద్దదైయుండెను. హిరణ్యక శివుడు హిరణ్యాక్షుఁడు అను నిరువురు కుమారులు దితియందు జన్మించి పెద్దవారై లోకకంటకులైనందున మహావిష్ణువు వరాహరూపమున నరసింహరూపమున నవతరించి యవ్వారిని దునుమాడెను. అందువలన దితీదేవి దుఃఖించి కశ్యపుని సేవించి గర్భవతియై యుండగా నింద్రుఁడది గమనించి యవకాశమును దొరికించుకొని దితి గర్భములో వజ్రాయుధముతో ప్రవేశించి గర్భమున ఛేదింపఁజూడగా నామెగావించిన శివ వ్రతముఁదగు ప్రభావము వలన గర్భము నశింపనందున దైవయోగమున నేడు విభాగములై నందుననేడుగురు కుమారులు జన్మించిరి. అవ్వారే సప్తమరుత్తులై స్వర్గమునకుఁజని దేవేంద్రుని పరివారములో చేరినవారైరి.

మరల నొకతూరి దితీదేవి కశ్యపుని సమీపించి ప్రార్థింపగా నాతడు "పదివేల వత్సరంబులు తపంబొనర్పు" మని యాదేశించినందున నామె యవ్విధము తపంబాచరించి శివానుగ్రహపాత్రురాలై పతినిసేవించి యొకానొక పుత్రుని కనఁగా నాబాలుడు వజ్రాంగుడనఁబఱగుచు వజ్రముతో సమానమగు దృఢశరీరము గలవాడైపరాక్రమ సంపన్నుడై బలవంతుడై యుండెను. తల్లియానతి ననుసరించి వజ్రాంగుఁడు - దేవాధిపతిని బలవంతముగా బంధించి సురలనందరిని శిక్షించెను. దితీదేవి సుతుని ప్రతిభకు లోలోన సంతసించుచుండెను. శుక్రాద్యమరులు గుందుచుండిరి. అట్టితఱి చతురాననుఁడు కశ్యపుని తోడ్కొని వజ్రాంగుని చెంతకుఁజని యింద్రుడు మున్నగు వేల్పులను విడిపించెను. అంత శివ భక్తుఁడైన వజ్రాంగుఁడు - "దేవేంద్రుఁడు దుష్టస్వభావముగలవాడు, స్వార్థమును సాధించుకొనువాడు, గర్భములను ఛేదించువా[illegible] కావున తత్ఫలము ననుభవింపఁజేసితిని. ఇఁక మీయందలి గౌరవముతో నిప్పుడు విడుదలఁజేయుచున్నాను. స్వర్గరాజ్యము ననుభవించుగాత! జననిఁదగుశాసనము ననుసరించి యిట్లు నింద్రాదిపీడనమును గావించితిని కాని నాకు నేలోకమునందలి భోగాపేక్షయులేదు. కావున నోబ్రహ్మదేవా! తత్వజ్ఞానము నుపదేశింపుమని ప్రార్థించుచున్నాను. అది విని సాత్విక స్వభావమే తత్వసారంబని యుపదేశించి బ్రహ్మదేవుఁడొక వరాంగిని సృష్టించి వజ్రాంగునకు సమర్పించి సత్యలోకమున కేగినవాడు. కశ్యపుండును స్వనివాసమునకు వెళ్ళినవాడు. అంత వజ్రాంగుఁడు సత్వగుణ సంపన్నుడై:





అసురభావమును విసర్జించి వైరభావరహితుడై సుఖముగానుండెను. వజ్రాంగుని భార్యయగు వరాంగికిమాత్రము సాత్త్వికస్వభావము కలుగనందున నామె కామభావనతో పతిని సేవింపగా నాతడు సంతసించి "ఏమికావలె" ననియడుగగా "హరికి దుఃఖము నొదవఁజేయువాడు మూడులోకములను జయించువాడు గొప్పబలము కలవాడు నగు కుమారుని ప్రసాదించు" మని వరాంగి ప్రార్థించెను.

అంత వజ్రాంగుఁడు – నాభార్య దేవతలతో విరోధమును కోరుచున్నది. అట్టి విరోధము నాకు రుచింపదు. ఏమిచేయుదును? ఎక్కడికి పోవుదును? నాశపథమెవ్విధము భంగపడకుండును? ప్రియురాలి మనోరథము ఫలించునెడల మూడులోకములలోని దేవముని మానవాదులు బాధపడుదురు. ప్రాణేశ్వరి కోరికను నెరవేర్ప కుండినచో నరకము చేకూరును. రెండువిధములను ధర్మహానియే కనుపడుచున్నయదని" అని కొంతకాలముడోలాయ మానమానసుడై శివేచ్ఛాబలమున వరాంగీవాక్యము నామోదించి యట్టి కుమారునిఁబడయుటకై బ్రహ్మదేవునిగూర్చి దుష్కరతపంబు నొనర్పగా నాతడు ప్రత్యక్షమై వరమడుగుమని వక్కాణించెను.

వజ్రాంగుఁడు అకసమున విరాజిల్లు చతురాననుఁగాంచి నమస్కరించియు మహాబలశాలియు గొప్ప పరాక్రమము గలవాడు సమర్థుఁడు తపోనిధియు నగు కుమారుని ప్రసాదించుమని యాచింపగా బ్రహ్మదేవుఁడు మదిని మిగుల చింతించి సదాశివుని స్మరించుచు నీవుకోరిన యట్టి కుమారుఁడు తప్పక జన్మించి వర్ధిల్లునని వజ్రాంగునకు వరంబొసఁగి నిజలోకమునకుఁజనినవాడు.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదునాలుగవ యధ్యాయము.**

## పంచదశాధ్యాయము

### (తారకాసురుఁడు జన్మించి తపంబొనర్చుట)

అవ్విధము వజ్రాంగుఁడు బ్రహ్మదేవుని వరమునొంది స్వనివాసములో వరాంగితో కొంతకాలము సుఖమునుండగా నామె గర్భవతియయ్యెను. పెక్కు వత్సరములు గడచిన తరువాత వరాంగి ప్రసూతయై కుమారుని కనినది. అతడు దశదిశలను వెలిగించువాడై గొప్ప పరాక్రమముగల మహాకాయుడుగానుండెను. వజ్రాంగుని కుమారుఁడు పుట్టినపుడు జగత్పీడాకరములైన పెద్దనుత్పాతములు ఆకసమున నేలపైన నుప్పతిల్లినవి. కొరవిలతో గూడిన వజ్రాయుధములు గొప్పధ్వనిఁజేయుచు భయముగొలుపునవిగా పడుచుండెను. ఉత్కృష్టములైన కేతువులు ఆకాశమున నుదయించెను. భూమి సముద్రములతో కూడ చలించెను. దిశలన్నియు మండుచుండెను. నదులన్నియు కల్లోలితములగుచుండెను. వాయువు తీక్ష్ణమై వీచుచు హూత్కారములను పలుకుచు పెద్దపెద్దచెట్లను పెఱికివేయుచుండెను. ధూళియంతటను ప్రసరించుచుండెను. సూర్యచంద్రులు రాహువుతో కూడినందున నవ్వారిచుట్టు పరివేషములు కన్పట్టుచు మహాభయమును సూచించుచుండెను. కొండలలోనుండి గాలివానలు బయలుదేరి రథధ్వనులవలె మ్రోగుచు ప్రజలకు భయంకరములుగా నుండెను. శునకములు నులూకములు నక్కలు నఱచుచు నెత్తురు





గ్రుక్కుచుండెను. గ్రామశ్వానములు మెడలను పైకి నెత్తుచు సంగీతమునువలె రోదనముఁజేయుచుండెను. గార్దభములు తమడెక్కలతో భూమిఁగీచుచు గుంపులు గుంపులుగా ఇటునటు పరుగెత్తుచు నఱచుచుండెను. పక్షులు నీడములనుండి వెడలి భయంకరముగా కూయుచు చంచలచిత్తముగలవై తిరుగాడుచుండెను. పశువులు గ్రామములయందు నరణ్యమున నెవరో కొట్టినట్లుబాధపడుచు మలమూత్రములను విసర్జించు చుండెను. గోవులు కన్నీళ్లుగార్చుచు భయపడుచుండెను. అవ్వానిపొదుగులపై రక్తము పారియుండెను. మేఘములు నుఱుముచు చీముఁగురిపించుచుండెను. దేవతామూర్తులు కదలుచు దుఃఖించుచుండెను. వృక్షములు వాయుప్రసారములేనిది క్రిందపడుచుండెను. ఆకసమున గ్రహములు పోరాడుచుండెను. ఇత్యాది విప్లవమునుచూచి పామరజనులు జగత్ప్రళయమును భావించుచుండిరి.

అట్టితఱి కశ్యపప్రజాపతి యేతెంచి వజ్రాంగకుమారునకు "తారకు" డనునామధేయము నేర్పరచెను. తారకుఁడు తనపౌరుషము ప్రకటితమగుచుండగా పాషాణముఁ బోలిన కఠినమగు శరీరముతో పర్వతమువలె పెంపొందుచుండెను. అంతనొకప్పుడు తారకాసురుఁడు – జననియగు వరాంగిని తపస్సునకై యనుజ్ఞ నర్థించి దేవతలందరిని జయింపఁగోరి మధువనమున గురువుగారి యుపదేశముననుసరించి బ్రహ్మదేవునుద్దేశించి యూర్ధ్వబాహువై యొక్కపాదముపై సుదారుణతపంబు నాచరించెను. మరినూరు వత్సరములు నిలువంబడి సూర్యునవలోకించుచు దృఢచిత్తముతో నూరువత్సరములు జలముమాత్రము పరిగ్రహించుచు ఇంక నూరేడులు వాయువునుపీల్చుచు శతవర్షంబులు నీటియందు నిలువంబడి నూరు హయనంబులు భూమిపైనను, శతవర్షంబులు నగ్నియందును వందవత్సరములు నధోముఖుడుగాను మరినూరువత్సరములు కరతలముతోడనే భూమిని స్పృశించుచు శతవర్షంబులు పాదములతో వృక్షశాఖనవలంబించి పొగఁద్రాగుచును తపించెను. ఇట్లు వినువారికిని సహింపనలవిగాని తపంబు నాచరించిన తారకాసురుని శిరములోనుండి తేజస్సునుదయించి దేవలోకములను కాల్చుచుండెను. దేవతలు ఋషులును బాధపడుచుండిరి.

"తారకాసురుఁడు నాఇంద్రపదవిని స్వీకరించునేమో" యని దేవేంద్రుఁడు లోలోన వెఱగందు చుండెను. "ఈతఁడు నకాలప్రళయమునొదవంజేయు" నని ప్రజలు సందేహించుచుండిరి. అట్టితఱి దేవర్షులందరును భయగ్రస్తులై సత్యలోకమునకువెళ్ళి బ్రహ్మదేవునికి శరణాగతులై తారకాసురునివలన తమకు కలిగిన కష్టములను నివేదింపగా పంకజాననుఁడు సరాసరి తారకాసురుని చెంతకు వెళ్ళి వరమడుగు మనియెను. అంత తారకాసురుఁడు విధికి ప్రణమిల్లి "దేవా నీవు ప్రసన్నుడవైతివేని లభింపనిదేదియు నుండదు. నీవు నిర్మించిన నీ బ్రహ్మాండమున నాతోసమానుడైన బలవంతుడు లేకుండుగాక! శంకరుఁని వీర్యమున కుమారుఁడు జన్మించి దేవసేనాపతియై నాపైశస్త్రమును ప్రయోగించునెడ మరణము సంభవించుకాక!" అను రెండు వరముల నర్థింపగా నాతఁడు "తథాఽస్తు" అని వరంబులనొసగి స్వలోకమునకు వెళ్ళినవాడు దైత్యుఁడును సంతసించి శోణితపురముఁజనినవాడాయెను. శోణితపురంబున శుక్రాచార్యుఁడు రాక్షసప్రముఖులమ్రోల తారకాసురుని త్రిలోకాధిపతిగా పట్టాభిషిక్తునొనర్చెను. అప్పుఁడు తారకుఁడు చరాచరమునంతయు పీడించుచు దేవతలను బాధించుచు రాజ్యము నేలుచుండెను. దేవేంద్రుఁడు నైరావతమును కుబేరుడు నవనిధులను వరుణుడు నశ్వములను ఋషులు కామధేనువును





సూర్యుఁడు నుచ్చైఃశ్రవమను గుఱ్ఱమును తారకాసురునకు భయపడి సమర్పించిరి. ఎచ్చటెచ్చట శ్రేష్ఠమైనవస్తువుండునో అచ్చటచ్చటికి తారకుఁడు వెళ్ళి ఆయావస్తువులను పరిగ్రహించెను. సముద్రములు రత్నముల నర్పించెను. భూమి సేద్యము లేకుండానే సస్యములను ఫలింపఁజేయుచుండెను. సూర్యుఁడు తారకునకు బాధకాకుండునట్లు తపించుచుండెను. చంద్రుఁడు వెన్నెలతోడనే రాత్రులయందు ప్రకాశించుచుండెను. వాయువు – తారకునిప్రజలకు సుఖజనకముగా వీచుచుండెను. దేవతలయొక్కయు పితరులయొక్కయు ద్రవ్యమునంతయు తారకుఁడపహరించుటయేగాక స్వర్గరాజ్యము నాక్రమించి తానే ఇంద్రుడై దేవతలనందరిని పారద్రోలి యవ్వారి స్థానములయందు రాక్షసులను నియమించెను. అంత తారకాసురుని బాధలఁబడలేక నమరులందరు మిక్కిలిదీనులై బ్రహ్మదేవుని శరణుఁబొందిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున పదునైదవ యధ్యాయము.

## షోడశాధ్యాయము

### (తారకాసురునివలన భయపడిన సురలకు శివుఁడు నభయము నొసగుట)

అవ్విధము దేవతలు బ్రహ్మదేవుని సమీపించి యభివాదనము నొనర్చియు పరాభక్తితో ప్రార్థింపగా నాతడు ప్రసన్నుడై "దేవతలారా? మీకు స్వాగతంబగుగాక! ఎందుకు వచ్చితిరో చెప్పుడు!" అని వాక్రుచ్చెను.

తారకాసురుఁడు వరగర్వితుడై మమ్మందరను నిజస్థానములనుండి తొలగించి యహర్నిశము బాధించుచున్నవాడు. వానికిఁజడిసి పరుగెత్తుచు వెళ్ళిన ప్రతిచోటను తారకుడే కనుపించుచున్నవాడు. మాదుఃఖము నీకు తెలియకుండునా? దిక్పాలకులందరును వాని యధీనములోనున్నవారు. మానవులవలె పరతంత్రులమై తారకుని సేవించుచున్నాము. అప్సరసలు మొదలగు దేవతాస్త్రీలను చెఱఁబట్టినవాడు. యజ్ఞములుగాని అనుష్ఠానములుగాని దానధర్మాదులుగాని లోకమున నెరవేరుటలేదు. తారకుని సేనాపతియగు క్రౌంచాసురుఁడు పాతాళమువరకువెళ్ళి యచటిప్రజలనుగూడ బాధించుచున్నాడు. కావున మేము స్వర్గమున నుండఁజాలము. ఇఁక మీద నీవు నిర్దేశించు స్థలమున నుండువారము.

శ్లో॥ యత్రాస్మాకం జయాశాహి - హరిచక్రే మదర్శనే ।
తత్కుంఠిత మభూత్తస్య - కంఠే పుష్ప మివార్పితమ్ ॥ ౧౯

నారాయణుడు ధరించు సుదర్శనచక్రముపై నింతవరకు మాకు విజయము లభించునను ఆశ యుండెడిది. అట్టిచక్రము తారకుని కంఠమునందు నుంపఁబడిన పుష్పమువలె పరిణమించినది అని యమరులు వేడుకొనగా విరించి "నావరముతోడనే తారకుఁడు పెంపొందినవాడు. తాను పెట్టిన విషవృక్షమైన నద్దానిని ఛేదింపరాదు. కావున నేను వానిని వధించుట యోగ్యముకాదు. అతడే శంకరుఁడే మీకార్యమునంతయు సాధింప సమర్థుండని తెలియుఁడు! కాని యిప్పుడే యాతనిని మీరు ప్రేరేపించినచో కార్యసిద్ధి కాజాలదు.





తారకాసురుఁడే తన పాపమున స్వయముగా వినాశమును పొందును. తారకుఁడు నశించు నుపాయమును చెప్పుచున్నాను. వినుఁడు! శివవీర్యసంజాతుఁడైన కుమారుఁడే వానిని వధింపఁజాలును. మహాదేవుని యనుగ్రహమున నే చెప్పఁబోవు నుపాయము సిద్ధించును. పూర్వము దాక్షాయణిగా నుండు శక్తియే ప్రస్తుతము హిమవంతునివలన మేనకాదేవియందు జన్మించి వర్ధిల్లుచున్నయది. శంకరుఁడు పార్వతీదేవిఁదగు పాణిగ్రహణము నవశ్యమాచరించును. ఐతే తదర్థము మీరుప్రయత్నింపవలసి యున్నది. ఊర్ధ్వరేతస్కుఁడగు శంకరుని వీర్యమును స్ఖలింపఁజేయుటకు పార్వతియే సమర్థురాలు కాని మరియొక వనిత కాజాలదు. అట్టి పార్వతీదేవి హిమగిరియందు తపించుచున్న శంకరుని ప్రస్తుతము సేవించుచున్నది. పరమేశ్వరుఁడు ధ్యాననిమగ్నుడైన కతన సమీపమున తనను సేవించుచున్న పార్వతినవలోకించుచును చలించుటలేదు. కాని శంకరుఁడు పార్వతిని భార్యగా పరిగ్రహించునట్లు నుపాయమునాలోచించి గావింపుడు! నేనును తారకాసురుని చెంతకు వెళ్ళి యీదురాక్రమణము నుండి నివారింతును. మీరు మీనెలవులకు వెళ్ళుడు!" అని పలికి వెనువెంటనే తారకుని నిలయమునకుఁజని "రాక్షసరాజా! నీవడిగిన వరమునకన్న నధికముగా ననుభవించు నుద్దేశముతో దేవతల సర్వస్వమగు స్వర్గరాజ్యమును పాలించుట నీకు తగదు. కావున స్వర్గమునువిడనాడి భూతలమునకు వెళ్ళి యచ్చోట రాజ్యమునేలుము! నేలపైననే దేవభోగ్యములన్నియు నీకు సమకూరును" అని వాక్రుచ్చి సాంబశివుని స్మరించుచు నంతర్ధానముఁ జెందినవాడు.

అంత తారకుఁడు బ్రహ్మవాక్యమును పాటించి స్వర్గమునుండి భూలోకమునకేగి శోణితంబను పట్టణమును రాజధానిగా నేర్పరచుకొని జగమును శాసించుచుండెను. ఇంద్రాది దేవతలును విరించిఁ దగు వాక్యము నాకర్ణించి యాతనికి నమస్కరించి స్వర్గమునకువెళ్ళినవారు. తరువాత నొకప్పుడు "శంకరునకు పార్వతీదేవియందు ఆసక్తి కలుగునట్లు త్వరలో ప్రయత్నించుము!" అని దేవేంద్రునకు నమరులు నివేదించి తమతమ నివాసములకుఁజనిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదునారవ యధ్యాయము.

## సప్తదశాధ్యాయము

### (ఇంద్ర కామ సంవాదము)

దురాత్ముడగు తారకాసురుని బాధలను మదిలో తలచుచు దేవేంద్రుఁడు మన్మథుని స్మరింపగా నాతడు క్షణకాలములో వసంతుని తోడ్కొని రతీదేవిని వెంటనిడుకొనియు గర్వము నుట్టిపడుచుండగా నమస్కరించి యింద్రునిముందు నొకానొక సమున్నత పీఠముపై నాసీనుడై గంభీరధోరణిని సాంజలియై యిట్లు సంభాషించెను.

"దేవరాజా? ఎందుకు నన్ను స్మరించితివో చెప్పుము! నీవు నిర్దేశించిన కార్యము నాచరించుటకు నేతెంచితిని".

అంత నమరాధిపతి బాగుబాగని ప్రశంసించుచు "కందర్పా! నీవు సర్వంబు నొనర్పఁజాలుదువు. ప్రస్తుతకార్యమునే నుడువుచున్నాను. వినుము, నాకార్యమునే నీ కార్యముగా భావింపుము. మిత్రులెందరో కలరు కాని నీవంటి సన్మిత్రుఁడెచ్చోటను గానరాడు. ఎవనివలన హితము ప్రియంబును సమకూరునో నట్టివానిని మించిన ప్రియుఁడు లేడని చెప్పవచ్చును. కాలదోషమున నసాధ్యమగు దుఃఖమొండు సంభవించినది. నీవుదక్క నితరుఁడెవడును నా దుఃఖమును తొలగింపఁజాలడు.

శ్లో॥ దాతుః పరీక్షా దుర్భిక్షే - రణే శూరస్య జాయతే ।
ఆపత్కాలేతు మిత్రస్యా - శక్తౌ స్త్రీణాం కులస్యహా ॥ ౧౨

కరువుపడినపుడు దాతయొక్క యౌదార్యంబును యుద్ధరంగమున శూరుని పరాక్రమంబును ఆపత్కాలమునందు మిత్రుని సహకారబుద్ధియు బలహీనస్థితిని భార్యాది వనితల సానుభూతియు పరీక్షింపఁ బడును. అనఁగా నాయాసమయములలో వారివారి నిజలక్షణములు బయటపడునని భావము.

సంకటము సంభవించినపుడు మంచి స్నేహము గలవారు వినయముతో సహకరింతురు. కావున నిప్పుడు నీకు పరీక్షాసమయమని భావించుము! కేవలము నాకు హితమును చేకూర్చుమని కోరుటలేదు. కాని సురలందరికిని క్షేమంకరమైన కార్యమును నిర్దేశించుచున్నాను అని యమరాధిపతి వచించినంత మన్మథుఁడు "దేవా! ఇట్లేందుకు మాటలాడుచున్నావు? బదులు చెప్పజాలను. ఉపకరించువాడు లోకమున నొక వ్యక్తిగా మాత్రము కనఁబడును కాని కృత్రిమములగు ప్రశంసల నాశింపడు. సంకటము చేకూరినపుడు నెక్కువగా బీరములు పలుకువాడు సహకరింపఁజాలడు. ఐనను నా తోచినకొలది మాటలాడుచున్నాను వినుము! నీపదవిని లాగుకొనుటకు నెవడేని తపించుచున్నయెడల నట్టివానిని భ్రష్టుఁజేయుదును. దేవతలుగాని ఋషులుగాని దానవులుగాని యింద్రపదవి నాశించి దారుణతపంబు నొనర్చుచున్నచో నవ్వారిని సుందరనారీమణుల కటాక్షములను ప్రసరింపఁజేసి క్షణకాలములో భగ్నవ్రతులను గావింతును. ఇవ్విషయమున మానవులను గణింపవలసిన యవసరములేదు. మీరుధరించు వజ్రాయుధము తదితర శస్త్రాస్త్రములన్నియు నుండుగాక! మిత్రుడను నేనుండగా నీకెట్టిభయంబును సంభవింపదు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులను గూడ మోహితుల నొనర్చు నాకు తదితరులను పాటింపవలసిన యవసరములేదు.

మృదువైన నైదు పుష్పబాణములు, భ్రమరముల యల్లెత్రాడులో కూడిన చాపము, మనోహర లావణ్యము గల వనితలు, మంత్రియగు వసంతుఁడు, చెలికాడగు చంద్రుఁడు నను నైదు బలములు నాకు సమకూరియున్నవి. శృంగారరసము సేనాధిపతిగాను హావభావములు సైనికులుగాను కలిగియున్న నా పరికరములన్నియు సుకుమారములగునవి. నేనుగూడ నట్టివాడనే; దేనివలన నేకార్యము సిద్ధించునో నట్టిదానినే బుద్ధిమంతుఁడు నియోగింపవలసియుండును. కావున నో ఇంద్రా! నాకు సరిపడు కార్య మెద్దియో త్వరలో నిర్దేశింపుము!" అని వక్కాణించెను.

అంత శతక్రతువు సంతసించి మన్మథునభినందించుచు యిట్లు సంభాషించెను.

కామదేవా! నేనుద్దేశించిన కార్యమును సాధింప నీవే సమర్థుఁడవు! ఎందుకు నిన్నాశించితినో చెప్పుచున్నాను. సావధానముగావినుము! తారకుఁడను రాక్షసుఁడు బ్రహ్మదేవుఁడొసగిన వరమునఁజేసి





దేవదానవాది సమస్తప్రాణులకు నజేయుండై సజ్జనులను బాధించుచున్నందున నింద్రాదులవ్వానితో పోరాడి పరాజితులై వజ్రము మొదలగు తమతమ ఆయుధములను కుంఠితములుగా నొనర్చుకొనిరి. చివరకు హరి ధరించు సుదర్శనచక్రంబును రిత్తయయ్యెను. ఐతే మహాయోగీశ్వరుండైన శంకరుని వీర్యమువలన సంభవించు కుమారునివలననే తనకు మరణము వచ్చునట్లు తారకాసురుఁడు బ్రహ్మదేవునివలన వరమును పొందినవాడు. ఇట్టితతి మిత్రమా నీవేమిచేయవలెనో నేను వేరుగా చెప్పనవసరము లేదని భావింతును. సర్వలోకసుఖ ప్రదంబగునట్లు కార్యమును సాధింపుము. శంకరుఁడు హిమాలయముపై నిజానందసంప్రాప్తికై తంపిచుచున్నవాడు. కాని యాతని కెట్టి కోరికయులేదు. పార్వతీదేవియు సఖురాండ్రతో కూడినదై శంకరునికి పరిచర్యలఁజేయుచున్నది.

పార్వతీదేవియందు శంకరున కభిరుచి కలుగునట్లు నుపాయమును గావింపుము! ఇప్పిదమాచరింతువేని కృతార్థుడ వగుటయేగాక లోకమున శాశ్వతకీర్తి cబడయుదువు! మరియు నీ పౌరుషము చిరస్థాయి కాగలదు, అంత మనోభవుఁడు వికసించిన ముఖకమలము గలవాడై నిండు సహర్షతో నటులే చేయుదునని వ్రాక్రుచ్చుటయేగాక శివమాయామోహితుడగుటcజేసి దేవేంద్రుని వాక్యమును మనఃపూర్వకముగా నంగీకరించియు శంకరుఁడు తపించు హిమాలయమునకు భార్యతోడను వసంతునితోడను నిండు నుత్సాహముతో బయలుదేరి వెళ్ళినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద

ప్రవచనముతో పదునేడవ యధ్యాయము.

## అష్టాదశాధ్యాయము

### (కామవికార వర్ణనము)

మన్మథుఁడు గర్వపరిపూరితుడై హిమాలయమునకువెళ్ళి మొదట వసంతుని ధర్మమును ప్రసరింపఁ జేసెను. ఓషధిప్రస్థమునగల మహేశ్వరుని తపఃస్థానమునందు వృక్షములు వికసించినవి. అశోకవనముల యందు తియ్యమామిడి పుష్పములు పరిమళముగలవై కామోద్దీపకములగుచు ప్రకాశించుచుండెను. కలువలపైతుమ్మెదలువాలుచు నింపుఁగొలుపుచుండెను. భృంగములు కోకిలలు మధురముగా కూయు చుండెను. ఝుంకారధ్వని మనోహరముగా వినంబడుచుండెను. చంద్రుని విశదమైన వెన్నెల కామినీ కాముకులకు దూతికవలె నుండినది. విరహముగలవారి కప్రియముఁగొలుపు వాయువు సుఖస్పర్శముగా వీచుచుండెను. ఇట్టి వసంతుని విహారము - వనములో నివసించు మునులకుగూడ సహింప నలవి గాకుండెను. ఈసమయమున అచేతనములకు గూడ కామవికారము కలుగుచుండగా చేతనులైన ప్రాణులకు చంచలభావము ఏర్పడనని వేరుగా చెప్పనవసరములేదు. తన లీలావిలాసముగా పరిగ్రహింపఁబడిన శరీరముగల శంకరుఁడు - అకాలనిర్మితంబగు వసంతవిలాసమును గాంచి ఆశ్చర్య చకితుడగుచు సామాన్యులకు నశక్యంబగు తపంబునాచరించుచుండెను. కాముఁడు రతీదేవితో కూడినవాడై వసంతుఁడు వ్యాపించినతతి వామపార్శ్వమున చూతబాణము నాకర్షించి తత్రత్యులనందరిని మోహింపఁజేయుచు తనప్రభావమును చూపెట్టుచుండెను. శృంగారరసంబును హావభావములతో శంకరుని





సన్నిధానమునఁ బ్రవేశించెను. ఇట్లు మదనుఁడు నచ్చోట మూర్తీభవించినట్లున్నను గుప్తముగా చిత్తముఁ జెందినవాడై యవకాశమును నిరీక్షించుచుండెను. ఐనను శంకరుని మోహింపఁజేయు నసమర్థుండగుచుండెను.

శ్లో॥ జ్వలజ్వాలాగ్ని సంకాశ - ఫాలనేత్రసమన్వితమ్ ।
ధ్యానస్థం శంకరం కోవా - సమాసాదయితుం క్షమః ॥ ౨౦

మండుచున్న నగ్నిహోత్రముఁబోలిన ఫాలనేత్రము గలిగి ధ్యాననిమగ్నుడైన శంకరుని చలింపఁజేయుటకు నెంతటివాడైనను సమర్థుఁడు కాజాలడు. ఇంతలో పార్వతీదేవి – సఖురాండ్రను వెంటనిడుకొని నానావిధ పుష్పములు మున్నగు నుపచారములఁదీసికొనియు శివుని సన్నిధానమునకు నేతెంచెను. లోకమునగల సౌందర్యమంతయు నామెయందు మూర్తీభవించియుండెను. వసంతకాలమున నుదయించిన సుగంధపుష్పములను తలఁదాల్చియుండు పార్వతిఁదగులావణ్యమును నూరువత్సరములకాలంబైనను వర్ణింప నలవికాదు. పార్వతీదేవి – శివునిసమీపించినవేళనే శంకరుఁడుధ్యానమునుచాలించి క్షణకాలము బాహ్యదృష్టికలవాడయ్యెను. ఆయదనుఁగనుగొని మదనుఁడు హర్షణంబను బాణమును ప్రయోగింపఁ నదేసమయమున గిరిజాదేవి – సుగంధద్రవ్యములనలఁదుకొని శృంగారహావభావములతో శంకరుని ముందునకు వెళ్ళినది. అప్పుడేమన్మధుఁడు ధనుస్సునినుసంధించి పుష్పబాణమును ప్రయోగించెను. నిత్యంబువలె పార్వతీదేవి యానాడును శివునకు నమస్కరించి పూజించియు శివునిముందు నిలువంబడెను. అట్టితఱి శంకరుఁడు పార్వతిని ప్రేమతో చూడగా నామె స్వావయవముల నాచ్ఛాదించుకొని స్త్రీస్వభావముఁ జేసి సిగ్గుఁజెందుచుండెను. శంకరుఁడు పార్వతికి దైవకల్పితంబగు విధానమును గమనించి యామెఁ దగు మనోహరములైన సంగములనిట్లు వర్ణించుచుండెను.

ముఖమా? చంద్రుఁడా? నేత్రములా? కలువలా? కనుబొమ్మలా? మన్మధుని ధనుస్సులా? అధరోష్టమా? దొండపండా? నాసికయా? చిలుకముక్కా? కంఠస్వరమా? కోయిల పక్షియాలాపమా? నడుమా? యజ్ఞవేదికయా? ఈమె నడకనేమనివర్ణింతును? రూపమునేమని పొగడుదును? ఈపెధరించిన పుష్పములను వస్త్రములనేమని ప్రశంసింతును? సృష్టిలోగల లలితభావమంతయు నీమెయందే కన్పట్టుచున్నయది. వేయేల? ఈమె తనువునందలి యవయవములన్నియు సర్వా రమణీయంబులైనవి. అద్భుతస్వరూపురాలైన నీపార్వతి మిక్కిలి ధన్యురాలు; త్రైలోక్యమున నీమెతో సరిపడు చక్కనిది మరియొకతె లేదని చెప్పవచ్చును. గొప్ప సుఖమును పెంపొందించునదై మునులనుగూడ మోహింపఁజేయు పార్వతిని గురించి చెప్పుటకు నేరికిని సాధ్యము కాజాలదు.

ఇట్లు శంకరుఁడు పార్వతిని వర్ణించుచు నామె యవయవములను తాకనుండ గిరిజాదేవి యద్దాని గమనించి సిగ్గుఁజెందినదై నిజాఁగములను కప్పిపుచ్చుచు సుందరవీక్షణములతో పరమేశ్వరునవలోకించుచుండెను. శంకరుఁడు లీలావిగ్రహుఁడగుటఁజేశి లోకికరీతిని మోహము నొంది యిట్లుచింతించెను. ఈమెను చూచినతోడనే గొప్పయానంద మొదవుచుండ నాలింగనము వలన నెట్టి సుఖమొనగూడునో చెప్పనలవికాదు.

క్షణకాల మిప్విధము విచారించి పార్వతీదేవిని బహూకరించియు ప్రబుద్ధుండై విరాగముఁజెంది ఏమిచిత్రము? నేనిట్లెందుకు మోహముఁజెందితిని? ప్రభువునైనను కామవికారము కలవాడనైతి

ఈశ్వరుడనై ఇతరుల శరీరమును స్పృశింపఁదలచునపుడు సామాన్యుఁడు ఇవ్విషయమునచలించు నని వేరుగా చెప్పనవసరములేదు.

అని చింతించి పరమేశ్వరుఁడు దృఢమైన విరాగభావము కలవాడై పార్వతీదేవితో నేకాంతసుఖముఁ దగు లాలననుండి మనంబును మరల్చినవాడై పరిశీలనపరుండయ్యెను.

"పరేశః కింపతేదిహ" "ప్రపంచమున భగవానుఁడు నిజధర్మమును గోలుపోవునా?"

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వము" అను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదునెనిమిదవ యధ్యాయము.**

## ఏకోనవింశాధ్యాయము

### (శివుఁడు కామదేవుని వశింపఁజేయుట)

ఉత్తమమైన తపంబు నాచరించుచున్న నాకు విఘ్నము లెందుకు సంభవించుచున్నవి? ఎవఁడట్లు నా చిత్తమును చలింపఁజేసినవాడు? పరకాంతనుగాంచి కుత్సితవర్తనముఁ గావించితిని. ధర్మవిరోధము దాపురించినది. వేదమర్యాదనతిక్రమించితిని అని పరమేశ్వరుఁడు విచారించి శంకితహృదయముతో దిశలంతటను పరికించెను.

కాముఁడు బాణముననుసంధించి గర్వితుడై యవివేకముతో తనబాణమును ప్రయోగింప సమకట్టియుండుటను గమనించి శంకరుఁడు కోపోద్రిక్తుడగుచుండెను. మన్మథుఁడు నంతరిక్షమున నిలచి యమోఘాస్త్రమును శంకరునందు ప్రయోగింపగా నద్ది పరమేశ్వరుని యందు విఫలంబయ్యెను. అంత కాముఁడు గడగడవణకుచు తన ప్రయత్నమువ్యర్థంబైనక తన నింద్రాదిదేవతలను స్మరించుచుండెను. అమరులందరు నేతెంచి శంకరునకు నమస్కరించి స్తోత్రపాఠములను చేయుచుండగా పరమేశ్వరుని తృతీయనేత్రమునుండి యగ్నిజ్వాలప్రళయాగ్నితో సమానముగ నావిర్భవించి యాకసమునకెగసి నేలపైపడుచు గిరగిర తిరుగుచు క్షణములో మన్మథుని భస్మము గావించెను. శంకరా! క్షమించుమని దేవతలు ప్రార్థించుచు మన్మథునికై వగచుచు ఇదియేమిటని దుఃఖించుచుండిరి.

ఇట్టిపరిస్థితిని పార్వతీదేవి ఖిన్నహృదయయై సఖీజనమును వెంటనిడుకొని తన నివాసమునకయుఁ జనియెను. మన్మథునిభార్యయగు రతీదేవి క్షణకాలము తెలివిదప్పినదై పతివియోగమునకు మదిఁగుందుచు మృతురాలివలె కొంతకాలము నేలపైపరుండి తెలివిరాగానే అనేక వాక్యముల నుచ్చరించుచు నిట్లువిలపించెను.

ఏమిచేయవలెను? ఎక్కడికివెళ్ళవలెను? నాప్రభువును దేవతలు పిలచినశింపఁజేసిరి. హానాథా! మన్మథా? ప్రాణమువలె ప్రియుండవు; నాకు సుఖమునొసగువాడవు;

ఇఁట సంభవించిన దేమిటి? ప్రియుడా? ఎక్కడికి వెళ్లితివి? రతీదేవి యివ్విధము వగచుచు కాళ్ళుచేతులు చఱచుచు వెండ్రుకలను విరబోసుకొని యేడ్చుచుండెను. అచ్చోట నుండుమృగములు





వృక్షలతాదులును రతీవిలాపము నాలకించుచు దుఃఖితులగుచుండిరి. ఇంతలో నింద్రాదిదేవతలు నేతెంచి మహేశ్వరుని స్మరించుచు రతీదేవి నూరడింప నిట్లువక్కాణించిరి.

రతీ! కాముని భస్మను కొద్దిగా కాపాడి యుంచుము! ప్రభువైనశంకరుఁడు మరల కామునిజీవింపఁ జేయును.

శ్లో॥ సుఖదాతా నకో౽ప్యస్తి - దుఃఖదాతా నకశ్చన ।
సర్వో౽పి స్వకృతం భుంక్తే - దేవాన్ శో చసి నైవృథా ॥

ప్రపంచమున నొకరికి మరియొకఁడు సుఖము నొసగువాడు కాడు. అటులే దుఃఖప్రదాతయులేడు. ప్రతివాడును తాజేసినకర్మంఁదగు ఫలము ననుభవించును. కావున దేవతలను వ్యర్ధముగా తూలనాడుచున్నావు. ఇట్లు సంభాషించి శివుఁజేరి వినమ్రులై "శరణాగతవత్సలా? మహేశ్వరా? మాప్రార్థన నాకర్ణింపుము! కాముని చేష్టితము స్వార్ధముకాదని గ్రహింపుము! దుష్టుండగు తారకాసురుని బాధలఁ బడఁజాలక నమరులు మన్మధునితో నేతత్కార్యమును గావింపఁజేసినవారు. రతీదేవి యొంటరిదై విలపించుచున్నయది. ఆమె నూరడింపుడు! క్రోధముతో దేవమానవాది జగము నంతయు సంహరింపఁ జాలుదువు. రతీదేవిఁదగు దుఃఖమునఁజేసి మేమందరము ఖిన్నవదనుల మగుచుంటిమి. అందువలన తాము రతీదుఃఖము నుపశమింపఁజేయుఁడు! అని ప్రార్థించిరి.

ఇట్టి దేవతావాక్యమును శివుఁడు విని ప్రసన్నుడై "దేవతలారా? ఋషులారా? నా సుభాషితము నందరును వినుడు! నా క్రోధమున నెరవేరినది మార్పుఁజెందఁజాలదు. విష్ణువు భూలోకమున కృష్ణుఁడుగా నవతరించి రుక్మిణియందు కుమారుని కనువరకు కాముఁడు / అనంగుడుగా నేయుండును. రుక్మిణీ కుమారుఁడు ప్రద్యుమ్నుడనఁబఱగును. ప్రద్యుమ్నుడు జన్మించుటతోడనే శంబరాసురునిచే నపహరింపఁబడును. అట్టితతి శంబరుఁడు బాలుని మృతునిగా భావించి సముద్రమున పడవేసి తన పట్టణమునకు వెళ్ళును. రతీ! అంతవరకు నీవు శంబరుని నగరమున నివసింపుము! అచ్చోటనే నీ భర్త (పునరుజ్జీవితుడై) లభించును. అచ్చోట ప్రద్యుమ్నుడు పెద్దవాడై శంబరాసురుని యుద్ధమున దునుమాడి తన ప్రియురాలైన రతీదేవిని వెంట నిడుకొని శంబరుని ద్రవ్యమునంతయు పరిగ్రహించియు ద్వారకానగరముఁ బ్రవేశించును. అంత వరకు వేచియుండుడు!" అని శంకరుఁడు చెప్పినంత నమరులు విని ప్రణమిల్లి యంతరంగమున నూఱటఁజెందినవారై చేతులు జోడించి "మహాదేవా! కరుణాసాగరా! కాముని త్వరలో బ్రతికించి రతిప్రాణములను కాపాడు" మని మరల విన్నవించిరి. శంకరుఁడది యాలకించి ప్రసన్నుడై "దేవతల్రారా? మన్మధు నీలోపుగానే జీవింపఁజేయుదును. అంతవరకు కైలాసమున నా గణములలో చేరినవాడై నిత్యము విహరించుచుండును. ఇవ్విషయము నెవరికిని చెప్పకుఁడు! మీమీ నివాసములకుఁజనుఁడు! మీ దుఃఖమునంతయు నివారింపఁగలను" అని వాక్రుచ్చి బృందారకులు పొగడుచుండగా నంతర్థానముఁజెందెను. తరువాత నమరులు భయములేనివారై రతీదేవి నూరడించి యామెకు శివుఁడు చెప్పినదంతయు విశదీకరించి తమ తమ నెలవులకు వెళ్ళినవారు. శంకరునిచే చెప్పఁబడిన సమయమును నిరీక్షించుచు రతీదేవి శంబరుని నగరమునకు వెళ్ళి నివసించియుండెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో పదితొమ్మిదవ యధ్యాయము.**





## వింశాధ్యాయము

### (బడబానల చరితము)

శంకరుని ఫాలనేత్రమునుండి యుద్భవించిన వహ్నిజ్వాల యెచటికి వెళ్ళినదో చెప్పుమని శౌనకాదులు ప్రశ్నింప సూతుఁడు చెప్పఁదొడఁగెను.

శివుని ఫాలాగ్నిజ్వాల – మన్మథుని భస్మముఁజేసి ప్రపంచమున తిరుగాడుచుండగా లోకత్రయము నందు హాహాకారముప్పతిల్లెను. కావున దేవతలు ఋషులును బ్రహ్మదేవుని శరణుఁబొంది వినమ్రవదనులై తమ దుఃఖమును వెలిబుచ్చిరి. అంత బ్రహ్మదేవుఁడు శివుని స్మరించి తత్కారణమును గమనించి లోకత్రయమును రక్షింపఁదలచి యచ్చోటికి వెళ్ళి చూడగా నా వహ్నిజ్వాల జగంబును దహింప సమకట్టు చుండె పరమేశ్వరుని యనుగ్రహబలమున నద్దాని నరికట్టి (వహ్నిజ్వాలకు) బడబారూపము నేర్పరచెను. అంత నయ్యది సౌమ్యజ్వాలాముఖియై శివేచ్ఛావశమున బ్రహ్మదేవునిచే సముద్రమునకు గొంపోబడెను. అట్టితఱి సముద్రుఁడు పురుష రూపముతో నేతెంచి సాంజలియై బ్రహ్మదేవునకు నమస్కరించి "నిఖిలేశ్వరా! నన్ను నీ సేవకునిగా భావించి యిచ్చోటి కెందుకు వచ్చితిరో సెలవిం" దని ప్రార్థింపగా నాతడు "సాగరా! శివేచ్ఛాప్రేరితుడనై నేను చెప్పు హితవాక్యము నా కర్ణింపుము! శంకరుని క్రోధాగ్ని బడబా రూపమును ధరించి నీలో నివసింపవచ్చినది. ఇద్దానిని ప్రళయకాలమువరకు నీవు ధరింపవలెను. మరల నేనేతెంచి యిట నివసించినప్పుడు నీవీ బడబాగ్నిని విసర్జింపవచ్చును. నీలో నుండు నుదకమే యీ బడబాగ్నికి నాహారమగును. అంతవరకు నీలోనుండి వెళ్ళుటకు నవకాశము చిక్కకుండునట్లు నిద్దానిని జాగ్రతగా రక్షింపుము!" అని వచింప సముద్రుఁడు – ఇతరులకు ధరింప నలవికానిదియు భయంకరంబునగు బడబానలమును ధరింప నంగీకరించెను. అంత బడబాగ్ని సముద్రమునఁగల నుదకములను పీడించుచు మంటలతో చెలరేగుచు లోనఁబ్రవేశించెను. ఇందువలన బ్రహ్మదేవుఁడు సంతసించి సత్యలోకమునకు వెళ్ళుచుండగా సాగరుడు విధికి మ్రొక్కులిడి యంతర్ధానముఁజెందినవాడు, అట్టితఱి జగము స్వస్థంబయ్యెను. మరియు బడబానలభయము లోకమున నంతరించినది. అమరులు మునులును సుఖముగా నుండిరి.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఇరువదియవ యధ్యాయము.

## ఏకవింశాధ్యాయము

### (పార్వతీదేవికి నారదమహర్షి యుపదేశించుట)

మహనీయుడగు శంకరుని లీలావిలాసము అద్భుతంబైనది. అవ్విధము శంకరుని ఫాలనేత్రజ్వాల మన్మథుని దహించినపుడు సంభవించిన గొప్ప ధ్వనిని విని భీతయై పార్వతీదేవి తన చెలికత్తెలతో గూడ హిమవంతునింటికి వెళ్ళెను. హిమవంతుడు నా శబ్దమునకు వెఱగంది భయపడుచున్న పార్వతిని సమీపించి యామె రెండు కన్నులను తుడుచుచు "పార్వతీ! భీతిల్లకుము! ఎందుకు దుఃఖించుచున్నావు?



అని యూరడించి కరమునందుకొని లోనికి తీసుకొని వెళ్లెను. ఐనను పార్వతి ఆ గృహమునందెచ్చటను విశ్రాంతిఁజెందనిదై తల్లిఁజేరి యప్పుడు తాను మరల పుట్టినట్లు భావించెను. మరియు "హా! హతురాలనైతి" నని తన రూపమును నిందించుకొనెను. నిద్రించునపుడు త్రాగుచున్నపుడు స్నానమాడునపుడు నడచుచున్నపుడు నిలచియున్నవేళను సఖురాండ్రమధ్య నున్నపుడు నెట్టి సంతృప్తిఁబడయకుండినది. "నా చక్కదనము మున్నగునవి నిరర్థకంబులైన" వని లోలోన గుందుచు శివుని చేష్టితమును స్మరించుచుండెను. శంకరుని వియోగమును సహింపఁజాలనిదై శివ శివ నా మోచ్చారణముఁజేయుచు శంకరునియందే తన యంతః కరణమును నెలకొలిపి తండ్రియింట నివసించుచుండెను. మాటిమాటికి తెలివిఁదప్పుచు జాగరూకురాలు నగుచుండెను.

మేనకాహిమవంతులు మైనాకుఁడు మొదలగు సోదరులు నెన్నియో సాంత్వన వచనములఁబలికిన నామె యూరటఁజెందలేదు.

అంత నొక్కనాడు దేవేంద్రునిచే ప్రార్థింపఁబడిన నారదుఁడు - స్వేచ్ఛావిలాసముగ హిమాలయమునకుఁజని హిమవంతునిచే సత్కరింపఁబడి సముచిత పీఠమునందాసీనుడై కుశలప్రశ్నఁ గావించిన పిమ్మట హిమవంతుఁడు తన కుమార్తెఁదగు చరితమును హరుని కామదహనమువరకు నారదునకు వక్కాణించెను. నారదుఁడది విని శివుని స్మరింపుమని మాత్రము హిమవంతు నాదేశించి పార్వతీదేవి నేకాంతమునఁజేరి లోకకల్యాణార్థియై క్రిందివిధము సంభాషించెను.

కాళీ! దయాధర్మము నవలంబించి సత్యముఁజెప్పుచున్నాను. విని యవధరింపుము! తపస్సులేనిది శంకరుఁడు ప్రసన్నుడు కాజాలడు. నేనే సౌందర్యవతి నను గర్వమును మనుస్సునందిడుకొని మహాదేవుని సేవించితివి కావున విజయము నందకుంటివి. దీనుల ననుగ్రహించు స్వభావముగల పరమాత్మ మహాయోగి యగుటచే ప్రస్తుతము విరక్తుడైయున్నవాడు. అందువలననే మన్మథుని దహించి నిన్ను విడచినవాడు. ఐతే సాంప్రతము తపస్సు తోడనే శివు నారాధింతువేని యాతడు ప్రసన్నుడై నిన్ను భార్యగా పరిగ్రహించును. నీవును శంకరుఁడు దక్క మరియొకనిని భర్తగా నంగీకరింపవని నాకు బాగుగా తెలియును.

అనినంత పార్వతీదేవి "మహర్షే! శంకరు నారాధించుటకు మహామంత్రమవసరము గదా! అట్టి మంత్రరాజంబగు శివపంచాక్షరి నుపదేశింపుమనియు

శ్లో॥ న సిద్ధ్యతి క్రియాక్వాపి - సర్వేషాం సద్గురుం వినా ।
మయా శ్రుతే పురా సత్యం - శ్రుతిరేషా సనాతనీ ॥ 39

సద్గురువు నాశ్రయించి యుపదేశము నొందనిది యెట్టి పుణ్యంబును సిద్ధింపదని సనాతనశ్రుతి చెప్పుచున్నట్లు వినియున్నాననియు నారదుని ప్రార్థించెను.

అంత నారదుఁడు విధిపూర్వకముగా పార్వతికి శివపంచాక్షరీ మహామంత్రము నుపదేశించి దిగువవిధము మంత్రప్రభావమును వర్ణించెను. శివపంచాక్షరీ మహామంత్ర మహిమను విన్నంతమాత్రమున శంకరుఁడు ప్రసన్నుండగును.





శ్లో॥ మంత్రోఽయం సర్వమంత్రాణా - మధిరాజశ్చ కామదః ।
భుక్తి ముక్తి ప్రదోఽత్యంతం - శంకరస్య మహాప్రియః ॥ 3౬

మహామంత్రములన్నిటిలో శివపంచాక్షరీ మహామంత్రము ప్రభువువలె విరాజిల్లునది. విహితకామ్యముల నొసగునదై జీవితసుఖమును ప్రసాదించును మరియు శంకరునకు మిక్కిలి ప్రియంబు నగుటఁజేసి యుపాసకులకు శివానందప్రాప్తి యనఁబడు మోక్షము నొదవఁజేయును.

గిరిజా! విధియుక్తముగా నీ మహామంత్రమును జపించుచు శంకరు నారాధింతువేని యాతడు తప్పక దర్శన మిచ్చును. ఉపవాసాది నియమముల నవలంబించి శివస్వరూపమును చింతించుచు పంచాక్షరీ మంత్రమును జపించుము. అందువలన శివుఁడు సంతసించును. ఇవ్విధము తపించునెడల మహేశ్వరుఁడు ప్రసన్నుండగును. నీవే కాదు. ఎట్టి దురితాత్ములైనను తపంబువలననే అభీష్టఫలము నొందుదురు. కాని మరియొక సాధనముతో కృతార్థులు కాజాలరు.

దేవహితముఁగోరు నారదుఁడిట్లు పార్వతికి నుపదేశించి స్వేచ్ఛావిలసితముగా స్వర్గమునకుఁ జనినవాడు.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏకవింశాధ్యాయము.

## ద్వావింశాధ్యాయము

### (పార్వతీతపోవర్ణనము)

దేవమునియగు నారదుఁడు బోధించిన విధముగా "శంకరుఁడు తపః ప్రాప్యం"డని నిర్ణయించుకొని తపించుటకై సన్నాహపడు నుద్దేశముతో జయ విజయ అను చెలికత్తెలతో కూడ హిమవంతుఁజేరి యిట్లు ప్రశ్నించెను.

నగాధిరాజా! నా శరీరమును రూపమును హిమవత్కులమును సఫలముఁజేయుటకై శివుని తపంబుతో నారాధింపఁదలచితిని. అందుకు వనమునకు వెళ్లుటకై యనుజ్ఞ నీయము!

అంత హిమవంతుఁడు "పార్వతీ తపోవిధానము నాకైతే అంగీకార్యంబేను. మేనకాదేవి కియ్యది రుచించునెడ నింతకంటె శ్రేష్ఠము శ్రేయస్కరంబు నగునది మరి యొండేమి కలదు?" అని చెప్పినందున నప్పారు మేనకాదేవిని సమీపించి "అమ్మా! శివునికొరకై తపమాచరింపఁదలచితిని. ఇందుకు జనకుడు సమ్మతించినవాడు. నీవుగూడ ననుమోదింప గల" వని విన్నవించెను. మేనకాదేవి - పార్వతీ సముద్దేశము నాకర్ణించి తపంబుకై యంగీకరింపనందున నామె బద్ధాంజలియై "అమ్మా! మహేశ్వరు నారాధింప ననుమతించు" మని పదే పదే ప్రార్థింప మేనక "పార్వతీ! పూర్వము నిత్యము శంకరునికి నుపచరింప వెళ్లి యలసియున్నావు. కావున ప్రస్తుతము ఇంటియందే తపంబు నాచరింపుము! బయటికి వెళ్లవలదు. తపస్సునకై మరియొక స్థలమునకు వెళ్లవలసిన యవసరములేదు. మన యింటిలోనే సమస్త దేవతలు





సకల పుణ్యతీర్థంబులును కలవు. హఠాత్కారము నొనర్పకుము! ఈవరకేమి సాధించితివి? ఇప్పుడేమి సాధింతువు? నీ శరీరమైతే సుకుమారమైనది. తపంబు కఠోరము గదా! స్త్రీలు కామ్యసిద్ధికై వనము తపంబాచరించుట సముచితము కాజాలదు. గాన తపోగమనేచ్ఛను విడనాడు" మని ప్రవచించెను.

"ఉ – ఓ పార్వతీ! మా – తపస్సునకై యరణ్యమునకు పోవలదని నిషేధించుటచే ఉమయను పేరఁబ్రసిద్ధురాలైన పార్వతి – మిగుల వ్యధపడుచుండగా మేనకాదేవి యది గాంచి యెట్టకేలకు సమ్మతించినందున పార్వతీదేవి యొక్కసారి మహేశ్వరుని స్మరించి సంతుష్టాంతరంగయై తల్లి దండ్రులకు మ్రొక్కులిడి సఖురాండ్రిద్దరిని వెంట నిడుకొని తపస్సునకై బయలుదేరుచుండెను.

అట్టి తఱి గిరిజాదేవి యనేక దేవతోపాసనలను విడనాడి మేలిచీరెలను పరిహరించి కేవలము శాంభవదీక్షోపయోగియగు భస్మ రుద్రాక్ష జటావల్కలాదికమును ధరించి నూలు త్రాడును మొలఁదాల్చియు ముక్తాహారమును విసర్జించియు మృగచర్మను కేల నిడుకొని హిమాలయమునఁగల గంగావతరణ స్థలమునకు తపంబునకై వెళ్ళినది. అచ్చోటనే శంకరుఁడు తపించువేళ మన్మథుని దహించి యున్నవాడు. ఆ స్థలముఁజేరగానే పార్వతి – గతమును స్మరించి విరహాకులయై "హా హరా! శివా! యని యాక్రందించుచు విలపించియు కొంత తడవునకు ధైర్యముతో చిత్తమును స్థిరపరచి శాంభవదీక్షా నియమములతో తపస్సు నారంభించెను. మరియు మనోహరములైన ఫల పుష్ప వృక్షములను తపః పరీక్షకై యామె తపోభూమిని నాటినది. మొదట భూశుద్ధిఁగావించి యొక వేదికను నిర్మించి మునులకు గూడ నలవిగాని రీతి అమ్మవారు మనుస్సుతో నింద్రియములను నిగ్రహించి వేదికపై తపించుచుండెను.

మరియు వేసవి కాలమున రేయింబవళ్లు మండుచున్న నగ్ని హోత్రములమధ్య నాసీనయై వర్ష కాలమున నేలపై కూర్చుండి జల ధారలఁ దడుచుచును. శీతకాలమున నీటిలో నిలువంబడి నిరాహారయై భక్తి శ్రద్ధలతో శివపంచాక్షరీ మహా మంత్రమును జపించుచుండెను. ఇవ్విధము జగదంబ – సర్వకామ ఫల ప్రదుఁడగు మహేశ్వరుని చింతించుచు తాను నాటిన ఫల పుష్ప వృక్షములకు సఖురాండ్ర నుదకమును పోయించుచు అవకాశము ననుసరించి యతిధులను సత్కరించుచు శీతవాతాతపదుఃఖము సహించుచు శివుని యందే యంతరంగమును నెలకొలిపియుండెను.

పార్వతీ దేవి తపః ప్రారంభ దినములలో ఫలములను మాత్రము స్వీకరించుచు తరువాత ఆకుల దినుచు కొన్ని వత్సరములఁగడిపినది. పిమ్మట పర్ణములను గూడ మానినందున నామెను నరుల నపర్ణయని పిలువందొడిగిరి. ఎల్లవేళలందు శివుని స్మరించుచు ఒంటికాలుపై నిలువంబడి పంచాక్షరీ మహా మంత్రమును జపించు చుండెడిది. నారచీరెఁ గట్టుకొని జడలఁ దాల్చినదై శివుని ధ్యానించు పార్వతిఁదగు తపము–తాపసులందరి నోడించుచుండెను. ఇట్లు కాళికాదేవి తపించుచుండగా మూడు వేల వత్సరముల కాలము గడిచినది. ఐతే నచ్చోటనే పూర్వము శంకరుఁడు నరువది వేల వత్సరములు సచ్చిదానందమయమైన నిజరూపమును ధ్యానించి యుండెను.

అట్టి తఱి యొక్కనాడు హైమవతీదేవి – తన తపః ఫలము గానరానందున ప్రసన్నురాలై యిట్లు ప్రార్థించెను.





"మహాదేవా! కఠిన నియమముల నవలంబించి నీ కొరకై తపించుచున్న నన్ను గుర్తింపకున్నావు; శంకరుడ వనియు సర్వజ్ఞుడవనియు సమస్తంబును ప్రత్యక్షముగా గాంచువాడవనియు భక్తులకు నైశ్వర్యము నభీష్టములను త్వరలో నొసగు వాడవనియు జీవకారుణ్య పరుడవగుటచే నవ్వారి యిడుములను పోగొట్టు వాడవనియు వేదము నలోకమునందును కీర్తింపఁబడుచున్నావు.

ఇతర కామ్యములను విసర్జించి నందివాహను నందు మాత్రము అనురక్తురాలనై యుండినచో శంకరుడు ప్రసన్నుడగుగాక! నారద మహర్షిగారిచే యుపదేశింపఁబడిన శివపంచాక్షరీ మహా మంత్రమును భక్తి శ్రద్ధలతో జపించి యుండినచో పరమేశ్వరుఁడనుగ్రహించుగాక! ఎట్టి వ్యభిచారములేని పరాభక్తి "శివ ఏకోధ్యేయః శివం కరః సర్వమన్యత్ పరిత్యజ్య" అను శ్రుతి ప్రమాణము ననుసరించి శివునియందు నాకు కలదేని మహేశ్వరుఁడు దర్శనమిచ్చుగాక!"

ఇవ్విధము మధ్య మధ్య చింతించుచు నధోముఖియై కామక్రోధాది వికారములను దరికి రానీయక మునులకు గూడ శక్యముకాని తపంబును పార్వతీదేవి యాచరించుచుండగా తత్పరిసర ప్రదేశనివాసులు ముల్లోకవాసులు నగు పురుషులు విస్మితులగుచుండిరి. ఇట్టి యపూర్వానుష్ఠానమును కనులార గాంచి తమను తాము ధన్యుల మనుకొనుచుండిరి. ధర్మ వృద్ధుల విషయమై వయస్సు పాటింపఁబడదు గావున వయోవృద్ధులందరును పార్వతీతపశ్చర్యను "నభూతో నభవిష్యతి" యని ప్రశంసించుచు తమ తమ నివాసములకు చనుచుండిరి.

పార్వతీ తపోవనాశ్రమమున పరస్పర విరోధముగల జంతువులుగూడ స్వభావసిద్ధ వైరమును విడనాడి ప్రేమానురాగములతో మనుచుండినవి. గోవులు వ్యాఘ్రములు మార్జారములు మూషకములు తదితర విరుద్ధ ప్రాణులును పార్వతీ తపోమహిమఁజే కూడి యుండెడివి. అట-వృక్షములు నిరంతరము ఫలించుటయేగాక నానావిధతృణములు గూడ నవనవలాడుచుండెను. చిత్ర విచిత్ర సుగంధ పుష్పములు వికసించియుండెడివి. ఆ తపోవనమంతయు కైలాసోద్యానముతో సమానముగా విరాజిల్లు చున్నందున పార్వతీ దేవిఁదగు తపస్సు సిద్ధించు సమయ మాసన్నమైనదని చెప్పవచ్చును.

**ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ద్వావింశాధ్యాయము.**

## త్రయోవింశాధ్యాయము

### (పార్వతీదేవి నూరడించుట)

ఇట్లు శివప్రాప్తికై చిరకాలము పార్వతి తపించినను శంకరుఁడు ప్రత్యక్షము కానందున హిమవంతుఁడు మేనకాదేవితో గూడ నచ్చోటికి నేతెంచి "అమ్మాయీ! గిరిజా? ఇంకెన్నాళ్లు తపింతువు? శివుఁడు విరాగము గల వాడగుటచే నిన్ను స్వీకరింప నిచ్చగించుట లేదు. నీవైతేనో సూక్ష్మ శరీరము సుకుమారములగు నవయవములును గలదానవై కఠినమగు తపంబున నీశ్వరుని సాధింతునను మోహముఁ జెందితివి. కావున నిప్పటికైనను తపంబు విరమించి స్వగృహమునకు రమ్ము! మన్మథుని దహించిన

రుద్రుఁడు నీకు దక్కునా? హరుఁడు నిర్వికారుఁడు కావున నిన్ను పరిగ్రహింప నెన్నటికిని రాడనియే తోచెడిని. ఆకాశమునఁగల చంద్రునివలె మహేశ్వరుఁడు సులభప్రాప్యుఁడు కాజాలడు" అని పార్వతినూరడించెను. అటులే మేనకాదేవియు సహ్యాద్రియు మేరుపర్వతంబును మందరనగంబును మైనాకాచలంబును దివ్యరూపములతో నేగి యనేక సాంత్వనవచనములఁబలికిరి. మరియు క్రౌంచాదులు నానావిధ హితవచనములఁబార్వతీదేవిని బుజ్జగించిరి.

అంత గిరిజాదేవి "అమ్మా! నాయనా! బంధువులారా! పూర్వము నేను చెప్పినదంతయు మరిచితిరా? ఇప్పటికైనను నా ప్రతిజ్ఞనువినుఁడు! మహాదేవుఁడు విరక్తుండైనను భక్తవత్సలుడగుటచే నాతనిని తపంబుచే సంతసింపఁజేయగలను. మీరందరును నా విషయమై బెంగపెట్టుకొనకుండా సంతోషముతో మీమీ నివాసములకు చనుఁడు! శంకరుఁడు తప్పక ప్రసన్నుండగు నను నమ్మకము నాకు గలదు. మన్మథుని దహించినను తపోవనమును కాల్చిన నాతడు నన్ను పరిగ్రహింపడేమో యను సంశయములేదు. కావున కేవలము తపంబుననే శంకరునిటకు వచ్చునట్లుగావింతును. గొప్పతపోబలమునఁజేసి సదాశివుని సేవింపవచ్చును. ఇదిముమ్మాటికి సత్యము;" ఇవ్విధము పర్వతరాజపుత్రిక సంభాషించి మిన్నకుండెను. హిమవంతుఁడు మున్నగువారు గిరిజాదేవిఁదగు ప్రతిజ్ఞను విని యామెను ప్రశంసించుచు తమతమ నివాసములకు వెళ్ళగా పార్వతీదేవి సఖురాండ్రఁగూడుకొని పూర్వాధికరీతిని తపింపనారంభించెను. అందువలన దేవతలు రాక్షసులు మానవులు మొదలగు చరాచరమంతయు తపించుచుండెను. అట్టితఱి సురాసురులు యక్షులు కిన్నరులు చారణులు సిద్ధులు సాధ్యులు మునులు విద్యాధరులు నాగులు ప్రజాపతులు గుహ్యకులు తదితరులందరును మిగుల బాధపడుచు తాపమునకుగల కారణమును తెలియకుండిరి. ఆ సమయమున నింద్రాదిదేవతలు బృహస్పతి నామంత్రించి మేరుపర్వతో పరిభాగమునకుఁజని విధికి సాష్టాంగములనిడి "పంకజాసనా! నీవు శివేచ్ఛాబలమున చరాచరప్రపంచమును పుట్టించితివి; ఐతే ప్రస్తుతమిద్ది తపించుచున్నందున మేమందరము కాలుచున్నశరీరములతో బాధపడుచున్నాము. కావున ఇందుకు గల కారణ మెద్దియో వివరింపు" మని ప్రార్థించిరి.

అంత బ్రహ్మదేవుఁడు మదిని శివుని స్మరించి ఇదియంతయు పార్వతీదేవిఁదగు తపోబలమని భావించి యిట్టిపరిస్థితిని నారాయణున కెరిగింపఁగోరి క్షీరసముద్రమునకుఁజని యచట సుఖాసనమున విరాజిల్లు హరికి ప్రణమిల్లి సాంజలియై "మహావిష్ణో! ఘోరముగా తపించుచున్న పార్వతీదేవిఁదగు తపోజ్వాలలచే దగ్ధులమగుచున్న మమ్ము రక్షింపుము!" అని ప్రార్థింప విష్ణుదేవుఁడు వారి మొఱనాలకించి యిట్లు సంభాషించెను.

బ్రహ్మాద్యమరులారా? మిమ్ము వెంటనిడుకొని కైలాసమునకువెళ్ళి "పార్వతీదేవి మీకొరకు తపించుచున్నదనియు ఆపెను పాణిగ్రహణ విధానమునఁ బరిగ్రహించుటకు సాక్షాత్కరించి వరము నొసగుడనియు" శంకరునిఁబ్రార్థించి శంకరుడెట్లాగైనను పార్వతీదేవి ననుగ్రహించునట్లు ప్రయత్నింతును.

నారాయణుని వచనము నాలకించి దేవతలు ప్రళయంకరుఁడగు మహాదేవుని వలన భయపడుచు "దేవా! శంకరుఁడు శుద్ధసత్త్వగుణోపేతుడైనను ప్రస్తుతము ప్రళయాగ్నివలె మండిపడుచున్న నాతని ముందు మేము నిలువఁజాలము. పూర్వము మన్మథుని దహించినట్లు మమ్ముగూడ భస్మము చేయునేమో,

యని విన్నవింప మహావిష్ణువు - మందస్మిత వదనారవిందుండగుచు "బృందారకులారా! నామాటను పాటింపుడు! శంకరుఁడు నిజముగా నమరులు మున్నగు సాత్త్వికభక్తులను కాపాడువాడుకాని దహించువాడు కాడు. కావున నాపరమాత్మ శరణాగతులను తప్పక రక్షించు దయాంతరంగుడని విశ్వసించి మీరందరు నాతో రండు.

శ్లో॥ శివం పురాణం పురుషం హ్యధీశం
వరేణ్యరూపం హి పరంపరాణామ్ ।
తపోజుషాణం పరమాత్మరూపం
పరాత్పరం తం శరణం వ్రజామః ॥ ౪౧

పరమేశ్వరుఁడు - పూర్వకాలంబునను క్రొత్తవాడనియు ఆదిపురుషుఁడనియు ప్రపంచము నధిష్ఠించియుండువాడనియు సకలతేజోనిధియై బ్రహ్మవిష్ణుసూర్యచంద్రాది శ్రేష్ఠులలో శ్రేష్ఠుండనియు సూర్యమండలాంతర్వర్తి యగు సూర్యదేవుని మించిన స్వరూపము గలవాడనియు నిజరూపానుసంధాన రూపమైన తపంబు నాచరించువాడనియు పరాత్పరుండనియు భావించి యా పరమాత్మయగు శివుని శరణు బొందుదుము గాక!

అని వచింప నమరులు భయరహితులై మహావిష్ణువును ముందునిడుకొని శంకరుని దర్శింపఁ గోరి మేరువృష్ఠమునుండి బయలుదేరిరి. మొదట మార్గవశమున పార్వతీదేవిఁదగు తపంబు నవలోకింప నేగి యాపె తపంబును గమనించి తపోతేజంబును సహింప నలవి గాని వారై జగదంబకు మ్రొక్కులిడుచు వృషభధ్వజుఁడు నివసించు స్థానమునకు వెళ్ళికాముని భస్మమొనర్చిన శంకరుని సమీపింప వెఱగందు ముందు నారదుని పంపగా నాతఁడు పరమేశ్వరుని సన్నిధానమునకుఁ జని యాతడు ప్రసన్నుడుగా నున్నవాడని కనుగొని బ్రహ్మవిష్ణ్వాదులను శివునిముందుకు గొంపోయెను. భక్తవత్సలుఁడగు శంకరుని త్రిదశులు దర్శించుచుండిరి. అట్టితఱి భగవానుఁడు సుఖముగా యోగాసనమున నాసీనుడై యుండెను. ప్రమథ గణములు పరివేష్టించియుండిరి. సాక్షాత్ తపోమూర్తియై కన్పట్టుచుండెను. అంత నారాయణుఁడు విధియు జంభారి ప్రముఖ సురలును వినమ్రులై వేదోపనిషద్గర్భిత ప్రవచనములతో శంకరుని నుతింపఁ దొడగిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నిరువదిమూడవ యధ్యాయము.



# చతుర్వింశాధ్యాయము

## (పార్వతిని వివాహమాడుదునని శివుఁడంగీకరించుట)

శ్లో॥ నమో రుద్రాయ దేవాయ - మదనాంతకరాయ చ
స్తుత్యాయ భూరిభాసాయ - త్రినేత్రాయ నమో నమః ॥

సంసార దుఃఖమును పోగొట్టువాడును స్వయంప్రకాశమానుఁడును సర్వానర్ధ మూలంబగు కామము నుపసంహరించినవాడును వర్ణనీయుఁడును సర్వాతీతమగు ప్రతిభ గలవాడును త్రినేత్రుండునగు శంకరునకు నమస్కారము.

శిపివిష్టుఁడును భీముఁడును భయంకరమైన నేత్రముగలవాడును సర్వవ్యాపకుఁడును మహాస్వర్గమనఁదగు కైలాసమున కధిపతియు నగు మహాదేవునికి వందనము నీవే లోకముల కన్నిటికి నధికారివి; తల్లివి తండ్రివి; నీవేను; నీవలననే ప్రాణులందరు సుఖింతురు. సమస్త జగమును శాసించువాడవు. భక్తులకు మేలునొనగూర్చువాడవు; విశేషించి కరుణామయుండవు; జీవులను పోషించువాడవు; మహేశ్వరా! మా దుఃఖములను పోగొట్టు సమర్థుఁడు నీవుదక్క నితరుఁడెవ్వడును గానరాడు.

ఇట్టి స్తోత్రము నాలకించి సురలపై దయ గలవాడై నందికేశ్వరుఁడు శంకరున కిట్లు విజ్ఞప్తి గావించెను.

"నారాయణుఁడు మున్నగు దేవతలు మునులు సిద్ధులును తమను దర్శింప తహతహ పడుచు ప్రార్థించుచున్నవారు కార్యార్థులై యున్నవారు రాక్షసులచే బాధింపబడి పరాభవమును పొందియున్నవారు ప్రత్యేకముగా దీనబాంధవుడవు భక్తవత్సలుడవు నగుటచే వీరిని తప్పక ననుగ్రహింపవలసినదిగా మిమ్మువేడుచున్నా" నని నందికేశ్వరుఁడు వచింప దయాంతరంగుడైన మహేశ్వరుఁడు ధ్యానమును మెల్లమెల్లగా చాలించుచు కన్నులఁదెఱచి "హరిబ్రహ్మాదులారా? మీరందరు నా సన్నిధికెందుకు నేతెంచితిరో వివరింపు" డని సెలవిచ్చెను.

అంత నింద్రాదులు సంతసించి శంకరునకు స్వవృత్తాంతమును నివేదించుటకు మహావిష్ణువు దగు ముఖము నవలోకింప దేవహితము నొదవఁజేయు నారాయణుఁడు "దేవా! తారాకాసురుఁడు దేవతలను తన్మూలముగా లోకములను బాధించుచున్నయంశము తమకు తెలియనిది కాదు. అట్టి సంకటము దూరముకావలె నన్నచో తమ ఔరసపుత్రుఁడు నుద్భవించి తారకాసురుని సంహరింపవలెను. అందువలన ననుగ్రహించి యీ కష్టమునుండి దేవతలను కాపాడుమనియు పార్వతీదేవిఁదగు పాణిగ్రహణము నవశ్యము గావింపుమనియు హిమవంతుఁడు తమకు తన కుమార్తెను సమర్పించుననియు" విన్నవింపగా యోగేశ్వరుఁడగు పరమాత్మ హరిభాషితమును విని యమరులకు సన్మార్గమును బోధించు వాక్యము నుచ్చరించెను. "అమరులారా? సర్వోత్తమ సౌందర్యముగల గిరిజాదేవిని నేను పరిగ్రహింతును కాని యాపె పాణిగ్రహణ సమయమున మన్మధుని జీవింపఁజేయును కావున సురలు ఋషులును లోకులందరును కామాత్ములగుదురు నివృత్తి మార్గమున నెవరు నుండజాలరు. ఇందువలన నింద్రా!





సుధీమంతుడవగుటచే కార్యాకార్య పరిస్థితిని బాగుగా విచారించి హఠాత్కారము నొనర్పకుము! లోకశ్రేయమును మనుస్సునందిడుకొనియే మన్మథుని దహింతిని. నారాయణా! కామదహనము దేవతాకార్యమును సిద్ధింపజేసినదని భావించుము! అందువలన మీరందరును నిష్కాములై శివధ్యానమగ్నులై యుండుడు! నేనెటుల తపంబు నొనర్చుచున్నానో మీరు నటులే తపించుడు! కామవికారముల నణచుకొని శివానంద సాగర నిమగ్నులై యుండుడు! పూర్వము మన్మథుఁడు గావించిన దుండగమును పరిశీలింపుడు! మదనుఁడు మహాధనుర్ధారియై ఎట్టి ధ్యానపరులనైనను భ్రష్టులఁజేయుచుండెడివాడు.

శ్లో॥ కామోహి నరకాయైవ - తస్మాత్ క్రోధోఽభిజాయతే ।
క్రోధా ద్భవతి సంమోహో - మోహాచ్చ భ్రంశతే తపః ॥ ౨౩

కామము నరకమునకు దారితీయును. అద్ది ప్రతిహతమైనచో క్రోధము కలుగును. అద్దానివలన యుక్తాయుక్త వివేకజ్ఞానము నపహరించు మోహమంకురించును. అద్ది పెంపొందు నెడల సుకృతము క్షీణించును. సురసత్తములారా? నా మాటను మహోపదేశముగా భావించి కామక్రోధములను పరిహరింపుడు! నిశ్చింతగా కాలమును గడుపుడు!

ఇట్లు భగవానుఁడు విధివిష్ణ్వాదిదేవతలకు నుపదేశించి స్థాణువై నిజధ్యానపరుండయ్యెను. అట్టితఱి సురులు "ఇప్పుడేమి చేయుదుము; శంకరుఁడు ప్రస్తుతము వైరాగ్యములో నున్నవాడు. నీవైతే అపరశంకరుఁడవు; శంకరునకు మిక్కిలి ప్రియుండవు; సర్వంబును గుర్తెరిగినవాడవు; నిరంతరము శివుని సేవించువాడవు; ఎట్టి యుపాయముతో శంకరుఁడు ప్రసన్నుండగునో అట్టి యుపాయమును బోధింపుము! నిన్ను శరణుఁబొందుచున్నాము" అని నందికేశ్వరుని ప్రార్థింప నాతడు హరిబ్రహ్మాదులను గురించి "శివ సంతోషకరమైన వచనముఁజెప్పుచున్నాను. శివుఁడు భార్యను పరిగ్రహింపవలెనని మీ యందరికి దృఢాపేక్షయున్నచో మిగుల దీనులై స్తోత్రపాఠములతో ప్రార్థింపుడు! మహాదేవుఁడు భక్తికి వశుండగును. అనన్యభక్తిని హరుఁడు వశుడగును కాని సాధారణ భక్తితో ప్రసన్నుఁడు కాజాలడు. పరమేశ్వరుఁడు దయాళువు కావున సద్భక్తి సంతుష్టుడై స్వసమ్మతము కాని కార్యమునైనను గావించునని గుర్తెరుగుడు! ఒకవేళ నేచెప్పినట్లు నంగీకరింపకుండినచో వచ్చిన త్రోవనే హతాశులై వెళ్ళవలసివచ్చును" అని విశదపఱచెను.

అంత బ్రహ్మవిష్ణ్వాదులు "మహాదేవా! శంభో! శరణాగతులమగు మమ్ము మహాసంకటమునుండి రక్షింపుము!" అనుచు మిక్కిలి దీనులై భక్తిసంభరితహృదయులై సుస్వరముగా రోదనను ఁజేయుచుండిరి. ప్రత్యేకించి హరియు విధిని పురస్కరించుకొని దైన్యముతో పరాభక్తిసంపన్నుడై శంకరుని పలువిధములఁ బ్రార్థించెను.

అట్టితఱి శంకరుఁడు ధ్యానమును చాలించి "మీరందరు గుమిగూడి యొకేపర్యాయమెందులకు వచ్చితి" రని ప్రశ్నింప నారాయణుఁడు "మహేశ్వరా! సర్వజ్ఞుడవు, నీకు తెలియని దేమియులేదు. జీవాత్మలందరిలో నంతర్యామిగా నుండువాడవు; నిఖిలమును శాసించువాడవు, మనోగతమును గుర్తెరుగఁ జాలవా? ఐనను నీ శాసనము ననుసరించి ప్రస్తుత సందర్భమును విన్నవించు చున్నాను. తారకాసురుఁడు "హిమవత్పుత్రికయందు తమవలన జన్మించు కుమారునిచేతనే తాను వధింపబడవలె" నని బ్రహ్మదేవుని వలన వరము నొంది గర్వితుడై యితరులవలన తనకు మృత్యువు సంభవింపదు కావున సురకిన్నర

గంధర్వాది సమస్త ప్రపంచమును బాధించుచున్నవాడు. ఆదిశక్తియగు త్రిపురసుందరి హిమవంతునింట నవతరించి నారదుని యుపదేశమునఁజేసి కఠినతపము నాచరించుచున్నయది. అట్టి తపంబుఁదగు తేజస్సుచే చరాచరమంతయు తపించుచున్నయది. అందువలన నీవు ప్రసన్నుడవై పార్వతీదేవికెంతకు వరము నొసగుటకు వెళ్ళుమనియు ఇందుమూలముగా దేవతల దుఃఖములను పరిహరింపుమనియు మా యందరికి సుఖము నొనగూర్పు మనియు ప్రార్థించుచున్నాను. మరియు మీ వివాహమంగళము నవలోకింపవలెనని నాకును బ్రహ్మాదులకును వేడుక పూర్తిగా కలదు. రతీదేవికి ప్రసాదించిన వరమునకు సమయమాసన్నమైనది. ఇది యంతయు సఫలముఁజేయుము!" అని వచించెను.

బ్రహ్మాదిదేవతలు నీశ్వరవచోఽమృతముఁగ్రోల నిరీక్షించుచుండిరి. భక్తపరాధీనుఁడైన శంకరుఁడు "బ్రహ్మవిష్ణువులారా? నిఖిలబృందారకులారా? నే చెప్పునది – వివేకముతో గూడిన సత్ప్రబోధమని భావింపుడు! మానవులకుగాని దేవతలకుగాని వివాహము సముచితము కాదు మరియు దృఢబంధనము పగిది వివాహము పురుషుని కట్టివేయును. లోకమున కుత్సితములైన బంధములు పెక్కులుగలవు. అవ్వానిలో స్త్రీబంధము శ్రేష్ఠమైనది. పురుషుఁడు బంధముల నన్నటిని తప్పించుకొనఁజాలును కాని తరుణీ బంధమునుండి విడిబడకుండును.

ఇనుపత్రాళ్ళతో కట్టఁబడినవాడుగూడ ప్రయత్నించినచో ముక్తుఁడు కావచ్చును. స్త్రీమోహ పాశములతో బంధింపఁబడినవాడు మాత్రము ఎప్పుడును వ్యథపడుచుండును. ఇంద్రియ సుఖముల మఱగినవానికి మోక్షము స్వప్నమునగూడ దుర్లభంబగును. బుద్ధిమంతుఁడగువాడు విషయములను పరిహరించి శివానందము ననుభవింపవలెను. విషయములు విషముపంటివి. ఇంద్రియసుఖలంపటునితో సహవాసముఁజేయునెడ క్షణములో పతితుండగును. విషయము అమృతముపూయఁబడిన మద్యమువంటిది. ఏవమాది విజ్ఞాన పరిపూర్ణుడనైనను భక్తినమ్రులై మీరుచేసిన విజ్ఞప్తిని సఫలముఁ జేయుదును. భక్తాధీనుడనగుటచే భక్తివశమున సర్వవిధకార్యముల నొనర్చువాడను. కామరూపుడను మహారాజు – భీమాసురుని బంధములో చిక్కుకొని తన భార్యయగు సుధక్షిణాదేవితో గూడ నఖండభక్తిని శివలింగార్చనఁజేయగా ప్రసన్నుడనై కామరూపుని రక్షించితిని. భీమాసురుని సంహరించితిని. గౌతమమహర్షిఁదగు నిడుములఁబోనాడి త్ర్యంబకేశ్వరుడనై గౌతమునికి నపకారముఁజేసినవారిని శిక్షించితిని. భక్తవత్సలుడ నగుటచే దేవమానవాది లోకకల్యాణార్థమై విషముఁద్రాగితిని. నిరంతరము దేవతలకు నుపకరించుచున్నాను. విశ్వానరముని పుత్రార్థియై తపించినపుడు వానికి ప్రత్యక్షమై గృహపతిగా నవతరించితిని వేయేల? భక్తుల సంకటములను పారద్రోలుటకు నెల్లకాలము సంసిద్ధుడను. ఇదియే నా శపథము. మీ యందరికిని తారకాసురునివలన కీడేర్పడినదని గుర్తెరిగియున్నాను. అట్టి ఆపదనుండి మిమ్ముర‌క్షింతును. నిజముగా విచారించినచో కాంతాసుఖముపై నాకెట్టి యనురాగము లేకున్నను పుత్రప్రాప్తికై పార్వతీదేవితో వివాహము నంగీకరించుచున్నాను. మీమీ నివాసములకుఁజని నిర్భయముగా నుండుడు! మీ కార్యమును సాధింతును. ఇందెంత మాత్రము సందేహము లేదు. అని ప్రబోధించి మౌనము నవలంబించి హరుఁడు సమాధి స్థుండయ్యెను.

బ్రహ్మవిష్ణ్వాదులును తమలోకములకు నేగిన వారు.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఇరువదినాలుగవ యధ్యాయము.**





# పంచవింశాధ్యాయము

బ్రహ్మదేవుఁడు మొదలగువారు తమ నిలయములకు వెళ్ళిన పిదప శంకరుఁడు యోగసమాధిలో నిజరూపము నవలోకించుచుండెను. అద్ది పరాత్పరంబై మాయామోహరహితమై నిర్వికారమై జ్యోతిర్లింగముగా కన్పట్టుచుండెను. ఆలోనివస్తువుతో తాదాత్మ్యమును (ఏకీభావమును) పొంది వృషధ్వజుఁడు వాఙ్మానసముల నతిక్రమించు స్థితిలో నుండినవాడు. అట్టి సమయముననే హిమగిరిశిఖరమున గిరిజాదేవి ఘోరముగా తపించుచుండినది. అందువలన రుద్రుఁడు విస్మితుఁడగుచుండెను. భక్తులకు లొంగువాడగుటచే సమాధియోగమును విరమించి వసిష్ఠాది సప్తర్షులను స్మరింపగా వారు "మాయదృష్టము ఫలించిన" దని మురియుచు ప్రసన్నవదనులై శివసన్నిధానమున కేతెంచి సాష్టాంగము నిడి గద్గదస్వరమున "కరుణాసాగరా! మహాదేవా! మమ్ము నీవు స్మరించినందున ధన్యులమైతిమి. కర్తవ్యమెద్దియో శాసింపుము! మేమందరము నీ దాసులము" అని విన్నవింపగా శంకరుఁడు చిరునగవుతో వికసితపుండరీకాక్షుడై యిట్లు వక్కాణించెను.

"నాయనలారా? నా మాట వినుఁడు! వివిధ విజ్ఞానము కలవారు గావున మా హితము నాలోచించి ప్రవర్తింపుడు! గౌరీశిఖరమున దృఢచిత్తముతో నన్నుగురించి పార్వతీదేవి తపించుచున్నది. ఇతర కామనలను విసర్జించి నన్నే భర్తగా పొందఁగోరియున్నది. మీరు స్నేహభావమును మనస్సునందిడుకొని యాపె చెంతకు వెళ్ళి తత్తపంబును తన్మనోదృఢతను పరీక్షిఁపుడు! కపటముగా మాటలాడుడు! ఇద్ది నాశాసనము. ఇందెంత మాత్రము సంశయింపకూడదు."

ఇవ్విధము సప్తర్షులు శివాజ్ఞను శిరసావహించి జగన్మాత తపించు ప్రదేశమునకు శీఘ్రమే వెళ్ళి యచటి తపోమూర్తి నవలోకించి హృదయమున మ్రొక్కులిడి దేవీ! తపంబు నెందులకు చేయుచుంటివి? ఏదేవుని కోరుచున్నావు? అని ప్రశ్నింప పార్వతీదేవి "ఋషులారా? నా హృద్గతమును చెప్పుచున్నాను. వినుడు నామాటలు అసంభవములని మీ రపహాస్యమును చేయుదురో ఏమో: నా యంతఃకరణము నిశ్చయముగా లోకాతీతము నపేక్షించుచు నుదకముపై పెద్దగోడను నిర్మించునట్లు గొంతెమ్మకోరికతో నున్నయది. నారదమహర్షిగారి యుపదేశమునఁజేసి సుదృఢమైన తపంబు నాచరించుచున్నాను. శంకరుఁడు భర్త కావలెనని నా మనోరథము. రెక్కలులేని నామనఃపక్షి – హఠాత్కారమున ఆకాశమున కెగయవలెనని యువ్విళ్లూరుచున్నది. అట్టి నాలాలనను కరుణానిధియగు పరమేశ్వరుఁడు ఫలింపఁజేయుగాక!" అని వాక్రుచ్చెను.

అంత నవ్వారు "నారదుని లక్షణమునెఱుగకుంటివా? పార్వతీ? ఆతఁడు పండితమ్మన్యుఁడు, క్రూరస్వభావుడు, అనృతవాదియు, పరుల మనంబులను నొప్పించువాడు, నారదుని చరితమును విన్నంతమాత్రమున నొక విధమైన కీడు సంభవించును. అతని చరితమును మరికొంత వినిపింతుము!

దక్షప్రజాపతి బ్రహ్మదేవుననుమతిని స్వపత్నియందు పదివేల కుమారులను కనఁగా నవ్వారు తపంబునకై పశ్చిమదిశయందు గల నారాయణసరోవరమునకు వెళ్ళియుండిరి. అట్టితఱి నారదుఁడు వారి చెంతకుఁజని కూటోపదేశమును గావించినందున దక్షపుత్రులు నచ్చోటనేయుండిరి. మరల జనకుని

సన్నిధానమునకు రాకుండిరి. అందువలన దక్షుండు క్రుద్ధుడై జనకునిచే నాశ్వాసింపఁబడినందున శాంతించి మరల వేయిమంది కుమారుల నుద్భవింపఁజేయగా నవ్వారును తండ్రియాజ్ఞఁబడసి తపంబునకు వెళ్ళిరి. అప్పుడును నారదుఁడు దక్షపుత్రులకు తత్త్వోపదేశమును చేసినందున నవ్వారును నివృత్తి మార్గావలంబకులై యింటికి రాకుండిరి. అమ్మా! పార్వతీ! నారదుని చేష్టితము ఇట్టిది; ఇంకను చెప్పెద మవధరింపుము! చిత్రకేతువను విద్యాధరునకు నారదుఁడు జ్ఞానమునుపదేశించి యవ్వాని గృహమును శూన్యముఁగావించెను. మరియు ప్రహ్లాదునకు విష్ణుతత్త్వము నుపదేశించి హిరణ్యకశిపునకు కీడు నొనఁగూర్చినవాడు. కేవల విద్య - చెవులకింపైనను ఎవరిచే గ్రహింపఁబడునో అట్టి వారిని భిక్షకులుగా నొనర్చును. నారదుఁడైతేనో మలినాత్ముఁడు. ఎల్లప్పుడు పరులను పీడించువాడని వాని సహవాసులమైన మేము బాగుగా గుర్తెరుగుదుము. బకము సాధువైనను మత్స్యములను భక్షించునని సహవాసులకు మాత్రము తెలియును. అట్టి నారదుని యుపదేశమునొందిన నీవు ప్రాజ్ఞురాలవైనను పొరపడితివని చెప్పవచ్చును. ఎవనికోసమునీవు తపించుచుంటివో వాడు మాత్రము ఎట్టి వికారము లేనివాడు. మన్మథుని సంహరించినవాడు అని తెలియుము! ఆతని వేషము మంగళప్రదమగునా? యని కొందరు శంకించుచుందురు. దిసమొల గలవాడు, ఆతనికి ప్రత్యేకమైన నివాసము లేదు ఒకానొక కులమునకు చెందినవాడుకాడు భూతప్రేతము లాతని వెంటాడుచుండును.

శూలముఁదాల్చువాడు. ధూర్తుఁడును; ఆతడే నీ తెలివి నంతయు తన మాయా బలమున నపహరించి నిన్ను మోహింపఁజేసియు నీచే తపంబు చేయించుచున్నవాడు. పార్వతీ! ఇట్టి వరునిఁ బడసి ఎట్టి సుఖము ననుభవింపగలనని యొక్క పర్యాయము విచారించుకొనుము! పూర్వము దాక్షాయణిని వివాహమాడి కొంతకాల మాపెతో నుదాసీనముగ నుండియు చివరకు ఏదేనొక నెపమున సతీదేవిని విడనాడి యేకాకియై అవిభాగము శోకవర్జితము అమరంబు నగు నిజరూపమును ధ్యానించుచున్నవాడు. పరిపూర్ణ శివానందమయుఁడు సంగరహితుఁడు ద్వంద్వాతీతుఁడు నగుటచే నట్టివాడు వనితతో నెట్లుకాపురము చేయును? ఇప్పటికైననుమించినదిలేదు. మా మాటను పాటించి గృహమునకు రమ్ము! సద్గుణసంపన్నుడైన నారాయణునితో నీకు వివాహమును జరిపింతుము. హఠాత్కారమును విడువుము! సుఖం బొనగూరును" అని వచించిరి.

సప్తర్షుల సంభాషితమును విని పార్వతీదేవి చిరునగవుఁజెంది జ్ఞానవిశారదులగు నవ్వారితో "మునీశ్వరులారా? మీ విజ్ఞానముఁబట్టి మీరుచెప్పిన విషయము యథార్థంబని భావింపవచ్చును. కాని నా హఠము భంగపడునదికాదు నా శరీరము పర్వతము నుండి పుట్టినది కావున కఠినత్వము సహజమే నని భావించి నన్నీ పట్టుదలనుండి కదలింపకుందురు గాక! నారదమహర్షి గారి యుపదేశము హితకరమగుటచే నాతని సద్వాక్యమును పరిహరింపఁజాలను. గురువుల "ప్రబోధములు పథ్యములగునని వేదవిదులు వక్కాణించుచుందురు. గురువాక్యము యథార్థంబని దృఢముగా విశ్వసించువారికి ఇహసుఖము పరమ సుఖంబును సమకూరును. యథార్థముకాదని సందేహించువారు నిహపరలోకముల యందు నిడుములఁబడయుదురు.

అందువలన గురువాక్యము నెప్పుడు నుల్లంఘింపరాదు. మీ ప్రబోధము ననుసరించి యింటికి వెళ్లుదునేని అద్ది శూన్యంబగును. నా హఠము మాత్రము సుఖప్రదమనియే భావింపుడు! ఇక

పీహితవాక్యములో గల పరమార్థమును గ్రహించితిని. విష్ణువు గుణవంతుఁడనియు విహారప్రియుఁడనియు, నేను నంగీకరింతును. సదాశివుఁడు గుణాతీతుడనుటకు కారణమును వివరింతును. నిజముగా శివుఁడు నిరాకారుఁడైనను భక్తులకొరకై యొకానొక దివ్యసుందర మంగళ విగ్రహము కలవాడగును. లౌకికరీతిని వైభవమును చూపెట్టువాడు. అవధూతవలె పరమహంసఁబోలినవాడై పరానందపరిపూర్ణుడగుటనే భూషణాదులయందాసక్తి లేకుండును. మాయాలిప్తులు భూషణాదికమును ప్రేమింతురు. శివుఁడు - జనన మరణాదివర్జితుడనియు మాయాధీశ్వరుఁడనియు భక్తిలేనివారి కర్థముగాని గమనము గలవాడనియు పరబ్రహ్మంబనియు జాతిధర్మమును వయోధర్మమును పాటించువాడు కాడనియు తెలియుడు! "గురోరనుగ్రహేణైవ శివంజానామి తత్త్వతః" సద్గురువుఁడగు కటాక్షవీక్షణమునాయందు కలదు. గావుననే శివుని బాగుగా గుర్తెరిగి యున్నాను. ఒకవేళ ధూర్జటి ప్రసన్నుడై నన్ను పెండ్లియాడ కున్నచో నవివాహితగా నెల్లకాలముందును ఇది ముమ్మాటికి నిజమని భావింపుడు! సూర్యుఁడు పశ్చిమమున నుదయించినను మేరుపర్వతము కదలినను అగ్నిచల్లఁబడినను పర్వతాగ్రముపైనను పాషాణముపైనను కమలము వికసించినను నాహతము చలింపదు." ఇవ్విధము పలికి యెట్టి వికారములేని మనంబున శివుని స్మరించుచుండెను. సప్తర్షులును మదిని సంతసించి జయశబ్దము నుచ్చరించుచు శుభాశీర్వాదము నందఁజేయుచును పార్వతీదేవికి మ్రొక్కులిడుచు కైలాసమునకు త్వరలోవెళ్ళి శివునకు వృత్తాంతమునంతయు నివేదించి శివాజ్ఞఁబడసి స్వర్గమునకుఁ జనిరి.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పంచవింశాధ్యాయము.**

## షడ్వింశాధ్యాయము

### (పార్వతీ జటిల సంవాదము)

సప్తర్షులు తమ లోకమునకు వెళ్ళిన పిదప శంకరుఁడు స్వయముగా పార్వతీదేవిఁదగు తపమును పరీక్షింప నుద్యుక్తుడై జడదారి ముదుసలి రూపమున తపోవనమున కేతెంచి సంతుష్టాంతరంగుడై దండమును ఛత్రమును కేలఁబూని వేదికపై చంద్రకళవలెఁ బ్రకాశించు పార్వతి నవలోకించెను. భక్తవత్సలుఁడు బ్రహ్మచారిగా పార్వతిని సమీపింపగా నర్ఘ్యపాద్యాదులతో నాతనిని పూజించి "వేదవిదగ్రగణ్యా? బ్రహ్మచారి స్వరూపముతో వేంచేసిన నీవెవరు? ఈ పని నంతయు వెలుగొందఁజేయుచున్నావు" అని దేవి యడుగగా నా కపటబ్రహ్మచారి యిట్లుచెప్పఁదొడగెను.

బ్రాహ్మణ శరీరముతో వృద్ధుడనై స్వేచ్ఛగా సంచరించుచుండువాడను, తాపసుడను ఇతరులకు సుఖము నొదవఁజేయువాడను మరియు నుపకారము నొనర్తును. నీవెవరు? ఎవరి కుమార్తెవు? నిర్జనప్రదేశమున మునులకు గూడ నలవిగాని తపంబు నొనర్చుచున్నావు! పిల్లవుకాదు. పెద్దదానవుకాదు. తరుణిగా శోభించుచున్నావు. భర్తలేనిది తీక్షమైన తపంబు గావించుట యెట్లు? ఎవని యర్ధాంగివి? నీ పతియగువాడు తాపసి కావచ్చును. అందువలననే నిన్నిట్లు పోషింపలేక నొంటరిగా విడచి యుండును.





ఏ వంశంబున జన్మించితివి? తండ్రియెవరు? నీరూపము గొప్ప సౌభాగ్యము కలదిగా కన్పట్టుచున్నయది. నీ తపంబు చూడగా నిష్ఫలమనియేతోచెడిని. గాయత్రీదేవివి కాదు గదా? లక్ష్మీదేవివో సరస్వతీదేవివో పొడగట్టలేకున్నాను.

అంత పార్వతీదేవి "బ్రాహ్మణా! నేను వేదమాతను కాను; లక్ష్మీదేవినికాను, సరస్వతినికాను, హిమవంతుని కుమార్తెను. నాపేరు పార్వతి; పూర్వము దక్షపుత్రికనై యోగమున దేహమును విసర్జించితిని. ఈ జన్మమున దైవవశమున చూడఁబడిన శంకరుఁడు మన్మథుని దహించి నన్ను విడనాడి వెళ్ళినవాడు. అనంతరము నేను మథనపడినదాననై యరణ్యమున కఠోరతపంబొనర్చినను కైలాసపతి ప్రసన్నుడు కానందున నిప్పుడే అగ్నిప్రవేశము నొనర్పఁబూనుచుండగా నీవేతెంచినందున క్షణకాలమాగితిని. ఇక నీవు వెళ్లవచ్చును. అగ్నియందు చొఱఁబడి యసువులఁ బాయుదును. ముందు వచ్చు ప్రతి జన్మయందును శంకరుడే భర్తకావలెనని కోరుచు ఆతనిని ప్రార్థించుదానను" అని వక్కాణించి బ్రాహ్మణుఁడు నివారించుచున్నను అగ్నిలో ప్రవేశించినది. కాని శివానుగ్రహము వలన నగ్నిహోత్రము అదే క్షణమున శ్రీ గంధమువలె శీతలంబైనకతన నచ్చోటు నుండి కదలుచున్న పార్వతి నుద్దేశించి జటిలుడిట్లు సంభాషించెను.

"భద్రాత్మకురాలా? నీ తపంబెందులకో విశదము కానులేదు. అగ్నినిన్ను కాల్పలేదు గదా! మనోరథం బీడేరను లేదు. ప్రాణికోటి నానందపఱచు నాకు నీ తపః కారణమును చెప్పవచ్చును. సప్తపదసంభాషణమున మన యిరువురికి సంభవించిన మైత్రి ననుసరించి నేను నీకు పరుడను కాను. మిత్రుడనని భావించుము! నాతో రహస్యమునైనను వెలుబఱచవచ్చును. తపఃఫలమంతయు నీయందే మూర్తీభవించియుండ నింకనెందుకు తపించుచున్నావో ఏమో; ఒకవేళ నితరుల కొంకైనచో అట్టి తపము చాలింపుము! చేతిలో రత్నము నుంచుకొని గాజుకోసము ప్రాకులాడినట్లు తోచెడిని. అనుపమంబగు నీ సౌందర్యమును వ్యర్థముఁ జేయుచుంటివి. మేలి వస్త్రములను విడనాడి నారచీరెలఁ గట్టుకుంటివి."

అంత నంబిక చెలికత్తెను ప్రేరేపింపగా నాపె (విజయ) పార్వతికి ప్రాణప్రియురాలగుటచే వృద్ధ బ్రాహ్మణునకు తానే సమాధానమును దిగువ విధంబొసంగెను.

ఈ నా సఖురాలు ఎవరిని వివాహమాడలేదింకను; . శివుని కంటె నితరదైవము నీమె కోరుట లేదు. మూడువేల వత్సరంబులు శివునికొరకే తపించియున్నది. దేవేంద్రాది సురలను బ్రహ్మదేవుని నారాయణుని విడచి శంకరునే పతిగా బడయఁగోరుట యీపె తపస్సునకు గల కారణంబని యెఱుఁగుము! తపః ప్రారంభమున నాటిన వృక్షములన్నియు పుష్పించుటయు ఫలించుటయు నీమెచేయు తపంబు ఫలించుననుటకు నిదర్శనములు. జనక వంశమును తరింపఁజేయుటకు తన రూపమును సార్థక మొనర్చుకొనుటకు కాము ననుగ్రహించుటకును మహేశ్వరు నుద్దేశించి నిండు ఆదరమున గావింపఁ బడు తపంబెందులకు ఫలింపదు?

అంత నా జటిలు డిదియంతయు విని పరిహసించుచు "విజయ వక్కాణించిన యంశము చమత్కార గర్భితమనియే భావింతును. యథార్థంబగునేని దేవి స్వయముగా నుడువుగాక!" అని వాక్రుచ్చెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వము" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఇరువదియారవ యధ్యాయము.





## సప్తత్రింశాధ్యాయము

### (బ్రహ్మచారి రూపమున శంకరుఁడు పార్వతిని మోసగించు సంభాషణ చేయుట)

అంత పార్వతీదేవి తన ముఖోద్గతముగా "జడదారి బ్రాహ్మణా! నా సఖురాలు విజయ చెప్పినదంతయు ముమ్మాటికి నిజమేను? మనోవాక్కాయములతో శంకరునే పతిగా బడయఁగోరుచున్నాను. అందరాని వస్తువెట్లు లభించునా యని యిప్పటికిని మదింగుందుచున్నను మిక్కిలి యుత్సాహమునఁజేసి యిట్లు తపించుచుంటి" నని వక్కాణింపగా హరుఁడు దిగువ విధము మాటలాడెను.

మహత్తర వస్తువు నెద్దానినో కాంక్షించి తపించుచున్నావేయో నని యింతవరకు భావించితిని. ఇప్పుడు తెలిసినది కావున "కానున్నది కాక మానదు" అను నుడికారము ననుసరించి యిక చెప్పవలసినది లేదనితోచెడిని. అందువలన నేను వెళ్లుచున్నానని జటిలుడు బయలుదేరుచుండగా పార్వతీదేవి నివారించి యాతనికినమస్కరించి "విప్రేంద్రా! వెళ్ళుచుంటివెందులకు? హితముఁ బలుకు" మని ప్రార్థింప నా జడదారి మరల నిట్లు సంభాషించెను.

దేవీ! నాయందు భక్తి గల దానవైవినఁదలతువేని శ్రేయస్కరమగు యథార్థమును చెప్పుచున్నాను. మహదేవు డెట్టివాడో నేనును బాగుగా గుర్తెరుగుదును. శంకరుఁడు – నందిని ధ్వజముపై నమర్చుకొనిభస్మ నలఁదుకొనియు జడలఁదాల్చియుండును. పులి తోలుఁగట్టుకొనును. గజ చర్మ నాచ్ఛాదించుకొనును. కపాలమాలికయు సర్పంబులు నాతని యలంకారములు. విషకంఠుఁడు, విరూపాక్షుఁడు, భయంకరుడు నగు నాతని జన్మము అవ్యక్తము గదా! సంసారికి వలయు భోగ మిసుమంతయు లేనివాడు. దిసమొలతో శ్మశానములయందు భూత ప్రేతములతో తిరుగాడుచుండును. పది చేతులు ఐదు ముఖములును కలవాడు. ఇట్టి బైరాగిని నీవేకారణమున భర్తగా నపేక్షించుచున్నావు? నీ ప్రజ్ఞా బలమంతయు క్షీణించినదెట్లు? బాగుగా విచారించుకొనుము! పూర్వ మొకప్పుడు మహా దేవుఁడు దక్షపుత్రికను పరిగ్రహించినపిమ్మట నాపె కపాలమాలికాధరుని భార్యయని దక్షుఁడేవగించుకొని శంకరునకు యజ్ఞభాగము నొసగకుండుటయే గాక దాక్షాయణి నవమానించినందున నాపె వ్యాకుల మానసయై అత్యంత ప్రియములైన ప్రాణములను పరిహరించి పరమేశ్వరునికి దూరమైన సందర్భము నీకు తెలియదా? ఇక నీవేమో స్త్రీ రత్నఁబవు, నీ జనకుడు పర్వతముల యధిపతి, ఇట్టి అభిజాత్యమును గణింపక భిక్షుకుని బడయుటకు ఘోర తపఁ బొనర్చు చుఁటివి గదా! లోకమున నెవడైన సువర్ణముద్రిక నొసగి గాజు పెంకును తీసుకొనునా? శ్రీ చందనమును పరిహరించి బురదను పూసుకొనుచుంటివి. సూర్యప్రకాశమును విడనాడి మిణుత పురుగు నాశించుచుంటివి. పట్టు బట్టను వలదని తోలు నిచ్చగించుచుంటివి! సుందర మనోహర దివ్య భవనములో నుండుటకు నిష్టపడక నడవిని వసింపఁగోరుచుంటివి! ధననిధిని విసర్జించి యినుము కావలెననుచుంటివి! మహా వైభవముగల దేవేంద్రాది లోక పాలురుండగా శంకరు నపేక్షించుట లోక విరుద్ధంబగును గదా!

కమల దళములఁబోలిన కన్నులు గల నీవెక్కడ? బేసికన్నులు గలవాడెక్కడ? నీవు చంద్ర బింబ సమ వదనవు. శివుఁడు పంచముఖుఁడు, నీ శిరమునందలిజడ నాగినివలె నందముగా వ్రేలాడుచుండును.





ఆతనికి జటాజూటమే కన్పట్టు చుండును. నీ యొడలిపై శ్రీ గంధము, ఆతని యొంటిపై చితాభస్మము, పట్టు చీరెను నీవు కట్టుకొందువు. ఏనుగ తోలు నాతడు కప్పుకొనును; దివ్య భూషణములను ధరించు దానవు నీవు, ఆతడు సర్పాలంకారుడై యుండును. దేవతలందరు నీ దర్శనము నపేక్షింతురు. భూతములలో నాతడు తిరుగాడుచుండును. మృదంగనాదము నీకు కావలెను. డమరుకము నతడు మ్రోగించును. దుందుభినాదమెక్కడ? కొమ్ము నూదుట యెక్కడ? ఢక్కానాదమును నీవు కోరుదువు. ఎలుగెత్తి యఱచుట నాతఁడపేక్షించును. ఏ విధముగా చూచినను నీకు శంకరునకును సరిపడుట లేదు. ఐతే ఇంక నొకటి విచారింతము. ఆతడు శ్రీమంతుడే యైనచో దిగంబరుఁడుగా నెందుకుండును? ముసలి యెద్దు నెక్కుటెట్లు? ఎట్టి వైభవము లేదు కావుననే భిక్షకుడై సంచరించుచున్నవాడు. వరునకుండవలసిన గుణములలో నొక్కటియు నాతనియందు గానరాదు. దాంపత్య సుఖ కారకుడగు మన్మథునే దహించెను. మరియు నీయందపేక్ష లేనివాడు కావుననే నిన్ను విడనాడి వెళ్లెను. జాతి విద్యా జ్ఞానములు లేనివాడై విసమును మెడలో నుంచుకొని దయ్యములను వెంటాడుచుండును. బైరాగియై ఒంటరిగా నుండును. నీ కంఠమున ముక్తాహారము విరాజిల్లుచుండును. ఆతని కంఠమున నరమండమాలిక యొప్పారుచుండును. సమస్తంబు నీకు నాతనికి విరుద్ధముగానే యున్నది. ఇట్టి తఱి నీవు శంకరుని పతిగా పొందఁగోరుట నాకైతే రుచింపదు - ఇఁక మీద నీ యిష్టము."

అంత పార్వతీదేవి విప్ర ప్రలాపమునంతయు విని శివనిందను విననొల్లనిదై యాగ్రహావేశమున నిట్లు ప్రత్యుత్తరించెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున ఇరువది యేడవ యధ్యాయము.**

## అష్టావింశాధ్యాయము

### (పార్వతి శివుని దర్శించుట)

ఇప్పుడు తెలిసినది. ఈతడెవరో సామాన్యుఁడు కావచ్చును. శివనిందను చేసినందువలన వీనిని వధింపవలసినదే కాని బ్రాహ్మణుడు కావున మిన్నకుండవలసివచ్చెను. మహాశయా! తమరు చెప్పినది ఒకప్పుడు నిజము కావచ్చును. మహేశ్వరుఁడు దిగంబరుడుగాను శ్మశానవాసిగా నుండునని నేనును గుర్తెరుగుదును. పరబ్రహ్మము భక్తానురాగవశమున నొకానొక దివ్య మంగళ విగ్రహము కలదగునని తెలియదా? నీవైతే కపట బ్రహ్మచారివై ధూర్త వాక్యములఁబలుకుచుంటివి. శివతత్త్వమును ప్రతిపాదించుచున్నాను. వినుము! గుణాతీతుఁడగు పరమాత్మకు జాతిప్రబంధ మెక్కడిది? అష్టాదశ విద్యాధిపతికి విద్య లేదనుట నీ బోంట్లకే చెల్లును. పూర్వము నారాయణునకు వేదముల నుచ్ఛ్వాసరూపమున కల్పాదియందు నొసగినవాడగుటఁజేసి శంకరునితో సమానుఁడు మరియొక్కడు లేడని గుర్తెరుగుము! బ్రహ్మవిష్ణ్వాది సమస్త చేతనులకన్న ముందున్నవాడు గావున నాతని ప్రాయంబెవరికి తెలియును? ప్రకృతియే ఆతనివలన నావిర్భవించినపుడు శంకరునకు కారణంబొండు కలదని చెప్పనగునా? శక్తి విశిష్టుడైన శివుని భజించువారికి శక్తులన్నియు నొనఁగూరును.





శ్లో॥ తస్యైవ భజనా జ్జీవో - మృత్యుం జయతి నిర్భయః ।
తస్మా న్మృత్యుంజయం నామ - ప్రసిద్ధం భువనత్రయే ॥ ౧౧

జీవుండనేక జన్మలందిరుగాడుచు నొకానొక ప్రశస్త జన్మయందు నిండు భక్తిని శంకరుని సేవించునెడ నట్టివాడు నెట్టి భయము లేనివాడై మృత్యువును జయించును. అందు వలననే శివునకు మృత్యుంజయుండను నామధేయము ముల్లోకములయందు ప్రఖ్యాతిఁగాంచినది.

విష్ణువు వైకుంఠాధిపతి యగుటకు కమలాసనుండు స్రష్టయగుటకు ఇంద్రాదులు నమరులగుటకును శివానుగ్రహమే నిదానంబని తెలియుము! దేవేంద్రుండు శివ దర్శనార్థమై కైలాసమునకు వెళ్లుచుండుట మనము గమనింపందగినది. భూతము లాతని ద్వారపాలకులు. ఆ మహా ప్రభువు నన్ననుగ్రహించువాడని విశ్వసించియే యున్నాను. కల్యాణ స్వరూపుడగు నాతని సేవించినచో దుర్లభంబగునది లేదని చెప్పవచ్చును.

శ్లో॥ సప్త జన్మ దరిద్రః స్యా - సేవే న్నో యది శంకరం ।
తస్యైత త్సేవనా ల్లోకే - లక్ష్మీః స్యా దనపాయినీ ॥ ౧౬

శంకరు నారాధింపనివాడు నేడు జన్మలవరకు దరిద్రుండగును. శివునిఁద్రికరణ శుద్ధిగా పూజించిన వారిని నిహపరలోకములయందు లక్ష్మీదేవి యెడబాయకుండును. అష్టసిద్ధులు నమ్రవదనములై శివుని ముందు శివానుగ్రహమునకై నాట్యమాడుచుండును. అట్టి దేవుండు భక్తులకు మేలు నొనఁ గూర్పకుండునా? మంగళ ద్రవ్యముల నాతడు సేవింపకున్నను తనను స్మరించునంత మాత్రమున శుభము నొదవఁజేయును. శివారాధనమువలన నభీష్టములన్నియు సిద్ధించును. మరియు నాపరమాత్మ యెట్టివికారము లేనివాడని తెలియుము!

శ్లో॥ శివేతి మంగళంనామ - ముఖే యస్య నిరంతరం ।
తస్యైవ దర్శనా దన్యే - పవిత్రాః సంతి సర్వదా ॥ ౨౦

మంగళప్రదమగు శివనామము నెల్లకాలము నుచ్చరించువారిని గాంచినంత మాత్రమున పవిత్రులగుదురు. లోకములను పుట్టించి కాపాడుచు చివరకు గిట్టించు శివుండు సులభముగా తెలియువాడు కాడు. ప్రాకృతగుణరహితము సర్వజ్ఞత్వాది దివ్యగుణవిశిష్టము నగు శివస్వరూపమును బహిర్ముఖులగు నీయట్టి వారెట్లు తెలుసుకొనఁజాలుదురు? చెడు నడతకలవారు పాపబుద్ధి కలవారున్ను దైవీసంపదఁ గోలుపోవుదురు. షడ్గుణైశ్వర్యసంపన్నుడగు శివుని తత్త్వము నట్టివారు కనుగొనఁజాలరు.

శ్లో॥ శివనిందాం కరోతీహ - తత్త్వమజ్ఞాయ యః పుమాన్ ।
అజన్మ సంచితం పుణ్యం - భస్మీభవతి తస్యతత్ ॥ 25

ఎవరైతే శివతత్త్వజ్ఞానము లేనివాడై శివుని నిందించునో అట్టివాడు జన్మించినది మొదలుకొని యొనర్చిన పుణ్యమంతయు నశించును. నీవు శివనిందఁజేసితివి గాన నిన్ను పూజించినందువలన నాకు పాపమొనఁగూరినది. శివద్వేషము గలవానిని చూచినచో సచైల స్నానమును చేయవలెను. మరియు ప్రాయశ్చిత్తము నొనర్చుకొనవలెను. అని శాస్త్రము నిర్దేశించినది. నేను శంకరుని గుర్తెరుగుదునని

బీరములాడితివి. నీవు నిజముగా శివజ్ఞానము లేనివాడవని చెప్పవచ్చును. రుద్రుఁడే యే రూపము గలవాడగునో ఆ యా రూపంబు నా కభీష్టంబేను;

శ్లో॥ విష్ణుర్బ్రహ్మాఽపి న సమ - స్తస్య క్వాపి మహాత్మనః ।
కుతోఽన్యే నిర్జరాద్యాశ్చ - కాలాధీనాః సదైవ తే ॥ 30

ఏస్థితిలో నైనను విష్ణుమూర్తిగాని బ్రహ్మదేఁవుడుగాని శంకరునితో సమానులు కానప్పుడు నింద్రాదిదేవతలను పరిగణింపవలసిన యవసరముండదు. ఎందుకనగా? బ్రహ్మాదులందరును కాలమునకు కట్టుబడియుండువారు. శంకరుఁడొక్కడే కాలాతీతుడైకాలకాలుఁడన బఱగుచునన్నవాడు.

ఇత్యాది శివమహిమను సద్బుద్ధితో గ్రహించియే విపులతపంబునకు కడంగితిని. సర్వేశ్వరుఁడగు శంకరుఁడే భక్తవత్సలుఁడు దీనులననుగ్రహించువాడు కావున నాతనిఁబడయఁగోరుచుంటిని.

ఇట్లుపార్వతీదేవి తన సంభాషణమును విరమించి నాకపటబ్రహ్మచారి యింక నేమో చెప్పఁబూనుటను గమనించియు శివాసక్తమానసయగుట కతన శివనిందను విననొల్లనిదై "సఖీ! మరల నీ బ్రాహ్మణబ్రువుఁడు శివుని నిందింపఁబూనియున్నవాడు ఈతనిని నివారించుము! కేవలము శివుని నిందించువానికే పాపమొనఁగూరదనియు, వినువాడును పాపఫలము ననుభవింపవలసి వచ్చుననియు శివభక్తులు శివనిందఁజేయువారినివధింపవలెననియు, శివనిందకుఁడు బ్రాహ్మణుఁడైనచో నట్టివానినివిడచి మరియొక చోటునకు వెళ్ళవలెననియు ధర్మశాస్త్రము చెప్పుచున్నది. కావున నీదుష్టతాపసుఁడు శివనిందావాక్యములఁబలుకువాడగుటచే వీనిని దూరీకరించి స్థలాంతరమునకు వెళ్ళుద" మని పాదమునులేపునంతలో శివుఁడు సాక్షాత్కరించెను.

అంత గిరిజాదేవి తాను ధ్యానించిన రూపము గల శంకరుని దర్శించి సిగ్గుచే తలవంచినదై నిలువంబడగా శివుఁడు "నన్నువిడచి యెక్కడికినేగుదువు? ఒకవేళ నీవు నన్ను దూరమొనర్చినను నేను మాత్రము నిన్నువిడచి యుండజాలను. ప్రసన్నుడనైతిని. వరము నడుగుము! నీకీయరాని దెద్దియు లేదని భావింపుము! ఈవేళటినుండి నీకు విధేయుండనైతిని. తపోమూల్యమున నన్నుకొనియున్నావు. ఇప్పటినుండి నీముగ్ధమోహన సౌందర్యమునకు వశుడ నగుటఁజేసి యొక్క క్షణమే యుగంబుగా తోచెడిని. కావున పార్వతీ! సిగ్గు విడువుము! సనాతన కాలమునుండియే నీవు నాకు పత్నివి; ఈ యంశమును నీవే బాగుగా విచారించుకొనుము! నీ మనోదార్ఢ్యమును పరీక్షింప నిట్లు నాటకమాడితిని. నాయపరాధమును క్షమించుము! లోకత్రయమునందును నీతో సమానురాలైన ప్రణయినిని చూడఁజాలను. సర్వవిధంబులను నీ యధీనుడనైతిని. ఇఁక నీ యభీష్ట మెద్దియో విశదీకరించుము! ఐనను నీ కోరికను గ్రహించితిని. నీవు నా భార్యవుకమ్ము! నిన్ను తోడ్కొని కైలాసమునకు వెళ్ళుదును" అని వచింపగా పార్వతీదేవి తపంబువలననైన ఆయాసమును విస్మరించి యానందాంబుధి నోలలాడుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నిరువదియెనిమిదవ యధ్యాయము.

# ఏకోనత్రింశాధ్యాయము

## (పార్వతీ శివుల సంవాదము)

హరుని మనోహరరూపము నవలోకించుచు మిక్కిలి సంతృప్తిపడుచుండు పార్వతీదేవి శంకరునితో నిట్లు వక్కాణించెను.

దేవదేవా! నీవు నా ప్రభువువు; పూర్వము నాకొరకే దక్షయజ్ఞమును ధ్వంస మొనర్చిన యంశమును మరిచితివా? లోకకల్యాణార్థము ప్రస్తుతము మేనకాహిమవంతులకు కుమార్తెనైతిని. ప్రసన్నుడవైతివేని కరుణతో నాకు పతివి కమ్ము! ఇందువలన తారకాసురునిచే బాధింపబడు సురలకు సుఖము చేకూరును. ఇప్పుడు నీయనుజ్ఞఁబడసి హిమవంతు నింటి కేగుదును. భిక్షుకుడవై నాజనకుని యాచింపుము. ఇట్టి ప్రథ-లోకమున వెలుగొందుగాక! ఇట్లు నీవొనర్చినయెడల నాతండ్రిఁదగు గృహస్థాశ్రమము సఫలంబగును. తరువాత ఋషుల ప్రబోధము ననుసరించి హిమవంతుడు తనబంధువులను పరామర్శించి నీ వాక్యమును సార్థకంబొనర్చును.

పూర్వము దక్షపుత్రికనై జన్మించినపుడు నన్ను దక్షుఁడు నీకు సమర్పించెను. కాని యా సమయమున కల్పోక్తప్రకారము వివాహము నిర్వర్తింపఁబడలేదు. నా జనకుఁడట్టితతి నవగ్రహములను పూజింపలేదు. ప్రస్తుత మట్లుగాక శాస్త్రవిధానమున మన కల్యాణము జరుగవలెను. హిమవంతుఁడు యథావిధి మన వివాహమును గావించి తన పుత్రిక – తపంబును మంగళప్రదముగా నొనర్చినదని గుర్తించుగాక!

అంత శంకరుఁడిట్లనుచున్నాడు – మహేశానీ! నామాట పాటింపుము! ఈ స్థావరజంగమ మంతయు శాశ్వతముకాదు. ఒక్కడనే అనేకముగాభాసించువాడను, స్వతంత్రుడను, స్వప్రకాశుడను. కాని నీకు పరతంత్రుడనైతిని. ఇఁక నీవెవరో బాగుగా గుర్తించుము! సర్వంబు నిర్మించుటకు వలయు సామగ్రి నీవలననే నాకు లభించుచున్నది. మహామాయవు నీవేను; జగమంతయు మాయామయము; నిందుధైర్యముతో దీనిని పోషించుచున్నాను. శివుడే పరమాత్మయను దృఢబుద్ధి గలవారందరును నన్నుపాసించుచునేయున్నవారు. సర్వనియామకుఁడనగు నాకు పరుల నారాధించుట యెందులకు? గ్రహములు ఋతువులు తదితరములన్నియు నావిభూతిలో చేరినవే గదా! గుణకార్యభేదముఁబట్టి మనయిరువురిప్రాదుర్భావ మేర్పడినదై భక్తవాత్సల్యమున లోకకల్యాణముల నొనగూర్చుచుండును.

రజఃసత్త్వతమోరూపిణియగు సూక్ష్మప్రకృతియే నీవు; జగముఁదగు వ్యాపారమున సమర్థురాలవు;

శ్లో॥ సర్వేషామపి భూతానా - మహమాత్మా సుమధ్యమే
నిర్వికారీ నిరీహశ్చ - భక్తేచ్ఛాపాత్త విగ్రహః

ప్రాణులందరిలో నంతరాత్మగా నుండువాడను నేనే; ఐనను వికారముఁజెందనివాడనై నిరపేక్షుడనై యుందును. ఇఁక నాహృద్గతమును చెప్పుచున్నాను. వినుము! హిమాలయమునకు భిక్షుకుడనై వెళ్ళి నిన్ను యాచింపను. గొప్ప గుణవంతుడైనను ఎట్టిమహనీయుఁడైనను "దేహి" అని యాచించునెడ చులకదనమును పొందును. ఇట్లు నేను భావించుచున్నను. నీ యభిప్రాయము నెఱిఁగి ప్రవర్తించుటకు సంసిద్ధుడను. నీ యిష్టమెద్దియో వివరింపుము!





అంత గిరిజాదేవి మహేశ్వరా! నీ వంతరాత్మయనియు జగదుపాదాన రూపిణియగు ప్రకృతిని నేననియు, ఉభయులము స్వతంత్రులమైనను భక్తపరాధీనుల మనియు నేను నంగీకరింతును. ఇందెంతమాత్రము సందియము లేదు. కాని నా ప్రార్థనమును మన్నించి నన్ను యాచింపుము. ఇందువలన హిమవంతునకు సౌభాగ్యము చేకూరును. భక్తురాలనై ప్రతిజన్మయందును నీ యర్ధాంగినగుదానను. మహాదేవా! నీ వెట్టి ప్రభావముగలవాడవో నీయనుగ్రహము వలన గుర్తెరుగుదానను. భక్తులనుద్ధరించు స్వభావము గలవాడవై స్వేచ్ఛగా విహరించువాడవు; నిజరూపము నవలోకించుచు తన్మయుడ వగుచుందువు; శంకరా! వేయేల? కరుణించి వివాహలీలఁజూపి భక్తులను భవసాగరమునుండి తరింపఁజేయుము!" అని సంభాషించి కృతాంజలియై ప్రణమిల్లి యూరకుండెను.

మహేశ్వరుఁడు చిరునగవుగలవాడై లోకరీతి ననుసరించు నుదేశముతో పార్వతీ సంభాషితము నంగీకరించి కైలాసమున కంతర్ధానముఁజెందెను. కాళీవియోగమును భరింపఁజాలకుండెను. పరమానంద నిర్భరుడై జరిగిన వృత్తాంతము నంతయు నందికేశ్వరుఁడు మొదలగు గణములకు చెప్పుచుండెను. భైరవుఁడు మొదలగుప్రమథగణములు శంకరుని సంతోషవచనముల నాలకించుచు సంతృప్తిగలవారై మహోత్సవము నొనర్చుచుండిరి. కైలాసమున నంతయు మంగళప్రదముగానుండెను. ప్రాణులందరికిని దుఃఖముదూరంబయ్యెను. శంకరుఁడును సంతోషస్వాంతుఁడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున నిరువది తొమ్మిదవ యధ్యాయము.

## త్రింశాధ్యాయము

### (పార్వతీదేవి - తపః స్థానమునుండి యింటికి వచ్చుట)

సఖురాలితో కూడి గిరిజాదేవి బయలుదేరి తన రూపము సార్థకంబైనదని లోలోన మురియుచు మహాదేవుని స్మరించుచును జనకగృహమునకుఁజనుచుండెను, మేనకాహిమవంతులు పార్వతి రాకను గుర్తెరిగి పురోహితులు పౌరులు చెలికత్తెలు మైనాకాది బంధువులు తదితరులందరును గొప్ప సంతసమున జయజయధ్వానములఁజేయుచు వెంటరాగా పార్వతి నెదుర్కొనుటకు సంసిద్ధులై శ్రీ చందన కస్తూరీ ప్రభృతిక మంగళద్రవ్యములతో కూడిన మహాకలశమును రాజమార్గమునందు స్థాపించిరి. అట్టితతి పురోహిత బ్రాహ్మణులు వేదమంత్రములఁబఠించుచుండిరి. రమణులు నాట్యమాడుచుండిరి. గజేంద్రములు మున్నగునవి పరివేష్టించియుండెను. సంతానవతులగు ముత్తైదువలు హారతి పళ్ళెరములఁ బట్టుకొనిరి. మంగళవాద్యములు మ్రోగుచుండినవి. ఇంతలో నమ్మవారు హిమవన్నగరమును సమీపించి జననీ జనకులను మొదట గాంచినది. అప్పుడువారు పార్వతీదేవికి నెదురుగా పరుగెత్తుచు వచ్చుచుండిరి. సమీపింపగానే తల్లిదండ్రులకు ప్రణామంబాచరించి సఖురాండ్రతో నమస్కరింపఁజేసినది. మేనకాహిమవంతులు పార్వతిని దరిఁజేర్చుకొని నిండుమనంబున నాశీర్వదించుచు "అమ్మా" అని మాత్రముచ్చరించి యానందబాష్పములను విడువఁజొచ్చిరి. బంధు వనితలందరును కాళి నాలింగనముఁ జేసికొనిరి. "వంశోద్ధారకమైన కార్యమును సాధించితివి. ఇందువలన మేమందరమును ధన్యులమైతి

మని మెచ్చుకొనుచు శ్రీగంధముతో కూడిన పుష్పముల నామెపై వెదఁజల్లిరి. దేవతలు పైనుండి పుష్పవర్షములను కురిపించిరి. ఆ ఆనందసమయమున నారదమహర్షిని రథమున కూర్చుండఁజేసి ప్రముఖులు పట్టణమునఁబ్రవేశింపఁజేసిరి మరియు వేదవిదులగు విప్రోత్తములు హైమవతిని హిమవంతుని గృహములోనికి గొంపోయిరి. సువాసినులు మంగళద్రవ్యముల నామెకు సమర్పించిరి. బ్రాహ్మణులు శుభాశీస్సుల నొసగుచుండిరి. మేనకాహిమవంతుల సంతోషమునకు మేఁఅయేలేకుండెను. హిమవంతుఁడు తన గృహస్థాశ్రమము సఫలంబైనదని "కుపుత్రాత్ పుత్రికా వరా" "దుర్మార్గుడైన కుమారునికన్న యోగ్యురాలైన కుమార్తె యొక్కతే మేలు" అనుసూక్తిని స్మరించుచు నారదమహర్షిని సాధుసాధువని ప్రశంసించి బ్రాహ్మణులకు వందిమాగధులకు ధనము నొసగుటయే గాక మంగళవాక్యముల నుచ్చరింపఁజేసెను. ఇవ్విధము తల్లిదండ్రులు సోదరులు కులకాంతలును సంతసమున ముంగిటఁ గుమిగూడి యుండగా హిమవంతుఁడు వారి నందరిని సత్కరించి స్నానమునకై గంగానదికి వెళ్ళినవాడు.

ఇంతలో శంకరుఁడు భక్తవత్సలుడగుటఁజేసి లీలావినోదమును చూపెట్టఁదలచి నర్తకవేషమున మేనకాదేవి చెంత కరుదెంచెను.

శ్లో॥ శృంగం వామే కరే ధృత్వా - దక్షిణే డమరుం తథా ।
పృష్ఠే కంథాం రక్తవాసా - నృత్యగాన విశారదః ॥ ౨౬

ఎడమచేతిని కొమ్ము, కుడిచేతిని డమరుకము, వీపుపై బొంతయు కలిగి రక్త వస్త్రధారియై నృత్యమునందును సంగీతమునందును నిపుణుడుగా కన్పట్టుచుండెను. మేనకాదేవిఁదగు ప్రాంగణమున నాడుచు పాడుచుండెను. కొమ్ము పూరించుచు డమరుకమును మ్రోగించుచుండెను.

అట్టితతి నర్తకుఁడు తన కంఠమాధుర్యమున శ్రోతలను ముగ్ధులఁజేయుచుండెను. శృంగడమరుధ్వనియు వినసొంపుగా నుండెను. వీణను మనోహరముగా వాయించుచుండెను. ఇట్టి నర్తకుని గాంచుటకు నగరప్రముఖులు స్త్రీలు పురుషులు బాలురు వృద్ధులును వచ్చుచుండిరి. ఆతని నాట్యమును చూచుచు గీతము నా కర్ణించుచు నా కస్మికముగా పరవశులగుచుండిరి. మేనకాదేవియు ముగ్ధురాలయ్యెను. పార్వతీదేవియు మిక్కిలి సుందరము త్రిశూలాది చిహ్నసంపన్నము నగు శంకరుని స్వరూపమును నర్తకునిలో గాంచి మూర్ఛితురాలయ్యెను. మరియు నాతడు విభూతిని నొసటఁదాల్చి ఫాలనేత్రముతో ప్రకాశించు ముఖముతోడ నందగాడై కనుపించుచుండెను. దీనబంధువు దయాసింధువు సర్వహృదయనివాసియు నగు శంకరుఁడు వరము నడుగుమనినట్లును నీవు నాకు పతివి కావలెనని పార్వతి మానసికముగా వరించినట్లును సందర్భము కలిసివచ్చెను. ఇంతలో నంతర్ధానముఁజెంది మరల నర్తకరూపమున ప్రత్యక్షమై నాట్యమాడుచుండెను.

అంత మేనకాదేవి బంగారు పళ్ళెరమున రత్నముల నునిచి నర్తకుని చాతుర్యమున కచ్చెరువు నొందుచు నాతనికొసగ నుద్యుక్తురాలుకాగా నర్తకుఁడు రత్నములను స్వీకరింపక పార్వతిని యాచించుచు మరల నద్భుతముగా నాట్యగీతముల నొనర్ప నున్నతతి మేనకాదేవి ఆశ్చర్యపడుచు క్రుద్ధురాలై భిక్షకుని తూలనాడుచు వెడలఁజేయుచుండెను. ఇంతలో హిమవంతుఁడు గంగాస్నానమును ముగించుకొని యచటి



కరుదెంచి మానవాకృతిని కనుపట్టు నర్తకుని గాంచి యాతని చరితమునంతయు మేనకాదేవివలనఁ దెలిసికొని కోపావేశమున "వీనిని వెడలగొట్టు" డని భటుల నాజ్ఞాపింపగా నవ్వారిలో నెవరు నాతనిని బహిష్కరింపఁజాలకుండిరి. అప్పుడు భిక్షకుడు హిమవంతునకు తన ప్రభావమును ప్రదర్శింపఁదలచి మొదట విష్ణురూపమును చూపెట్టెను. నర్తకుఁడు - కిరీటకుండలధారియు పీతాంబరుఁడును చతుర్భుజుఁడు నగు నారాయణుఁడయ్యెను. హిమవంతుఁడు విష్ణుపర్వములలో నారాయణుని విగ్రహమున శిరముపైనను సమర్పించిన పుష్పాదికమంతయు నర్తకుని శరీరమున కన్పట్టుచుండెను. తరువాత జగత్స్రష్టయు చతుర్ముఖుఁడు రక్తవర్ణుఁడు శ్రుతిసూక్తములను పఠించువాడు నగు బ్రహ్మదేవుఁడుగా నర్తకుఁ డయ్యెను. పిమ్మట జగచ్చక్షువగు సూర్యుడుగా నుండినవాడు. అనంతరము రుద్రాణీసహితుడు స్వయంప్రకాశమానుఁడు మందస్మితవదనారవిందుఁడు నగు శంకరుని నర్తకునిలో హిమవంతుఁడు చూచుచుండెను. ఆ పిమ్మట చతుర్థపురుషుఁడు సచ్చిదానందమయుఁడు పరాశక్తి విశిష్టుఁడు తేజోమయుఁడు నగు శివుఁడుగా నర్తకుఁడు కనుపడినందున పర్వతాధిపతి విస్మితుఁడయ్యెను. ఇంక నింద్రచంద్రాద్యనేక రూపములను ప్రదర్శించి గిరిజను యాచించినను హిమవంతుఁడు శివమాయా మోహితుడై పార్వతీప్రదానము నంగీకరింపనందున నర్తకుఁడు మాయమయ్యెను. అప్పుడు "శంకరుఁ డే మనను మోసగించి స్వస్థానమునకు వెళ్ళినవాడ" ని మేనకాహిమవంతులు కనుగొని చింతించుచుండిరి. మరియు శంకరునిపై నవ్వారికి నకుంఠితమైన పరాభక్తి యుదయించెను. ఇట్టి యనన్యభావనతో మేనకాహిమవంతులు శంకరునకు కన్యాదానము నొనర్చి ముక్తులు కానుండిరి.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో ముప్పదియవ యధ్యాయము.**

## ఏకత్రింశాధ్యాయము

### (శివమాయా వర్ణనము)

మేనకాహిమవంతులకు శివునియందు నిండుభక్తి కలిగినదని యమరులు దిగువ విధము చింతింపఁ దొడఁగిరి.

హిమవంతుఁ డేకాంతభక్తితో శంకరునకు కన్యాదానముఁజేయు నెడ నవశ్యము మోక్షము నొందును. అనఁగా శివసాయుజ్యము కలవాడగును. ఒకవేళ ముక్తుడైనచో మనకేమి యిబ్బంది యనుకొనినచో నాతడు ననంతరత్నములకు నాధారమగుటచే నట్టివాడే భారతదేశమున లేకుండినయెడల - పృథివి రత్నగర్భ యను నానుడి వ్యర్థంబగును. త్రిశూలధరునకు తన కుమార్తెను యధార్థబుద్ధిని సమర్పించు హిమవంతుఁడు పునరావృత్తిరహిత శాశ్వత శివపదముఁజెంది బ్రహ్మానందము ననుభవించును.

ఇట్లు ఇంద్రాది బృందారకులాలోచించి స్వార్థసాధనోద్దేశముతో దేవగురువగు బృహస్పతిని సమీపించి ప్రణమిల్లియు "గురుదేవా! మాదొకవిన్నపము కలదు. నీవు హిమవంతుఁజేరి వాని మనంబేకాగ్రము కాకుండునట్లు శివుని నిందింపుము! అట్లు నిందించినయెడల కార్యభంగమగునని భావింపరాదు. పార్వతీదేవి శివుని దక్క వేరొకని వరింపదు. కావున హిమవంతుఁడిష్టము లేకున్నను శంకరునకు

కన్యాదానమును చేయవలసివచ్చును. అట్లైన నాతఁడు ముక్తుడగును కాని ప్రస్తుతము పర్వతరూపముననే కొంతకాలముండును. అదియే మా యపేక్షితంబు; అనేక రత్నముల కాధారమగు నాతడు జీవించుటయే లోక శ్రేయస్సుకు నిదానముగదా! అని విన్నవింప సురాచార్యుఁడు చెవులు మూసుకొని శివనామమును స్మరింపుచు ధిక్కారముఁజేయుచు నిట్లనియెను.

దేవతలారా? మీ యంత స్వార్థపరుల నెందును గానలేదు. పరార్థమును చెడగొట్టుటలో మీకు మీరేసాటి యగుదురు. మా మాటను పాటించి శంకరుని నిందింతునేని శాశ్వతముగా నరకముల నొందుదును. ఇందుకు మీలో నొకరు హిమవంతుని చెంతకు వెళ్ళి శివుని నిందింతురుగాక! మీరుద్దేశించినట్లే శంకరునకు హిమవంతుఁడు నిందు భక్తితో తన కుమార్తె నొసగునెడ ముక్తుండగును. ఇష్టము లేక పార్వతి నిచ్చినచో భారతమున యథాపూర్వము నిలచియుండును. శివనిందచే హిమవంతుని నిష్ఠభంగపడినను తరువాత సప్తర్షులు వెళ్ళి ప్రబోధింతురు. అథవా సత్యలోకమునకు వెడలి బ్రహ్మదేవునకీ సమాచారమును నివేదించినచో నాతడు మీ కార్యమును సాధింపఁజేయును.

అంత నమరులు బ్రహ్మలోకముఁ జేరి చతుర్ముఖునకు మ్రొక్కులిడి తమ యుదంతమును విన్నవింపగా నాతడు "త్రిదశులారా? శివనింద నొనర్చుటకు నేను సమర్థుడను కాను. శివనింద యేరికిని శ్రేయస్కరము కాదు. శివుని నిందించువారికి సంపదలు తొలగును. ఆపదలు నుప్పతిల్లును. ఇట్టి కార్యమును శివునకే నివేదింపుడు! ఆతడే మీ విజ్ఞప్తినంగీకరించి హిమవంతుఁజేరి యాత్మను నిందించుకొనును. "పరనిందా వినాశాయ – స్వనిందా యశసే మతా" అను సూక్తి ననుసరించి తనను తాను నిందించుకొనుట శుభప్రదమగును.

బ్రహ్మవాక్యము ననుసరించి సురలు కైలాసముఁజేరి శంకరునకు ప్రణమిల్లి "దేవదేవా! కరుణాసాగరా! నిన్ను శరణముఁబొందితిమి. మా యందు దయఁజేయుము! భక్తవత్సలుడవై భక్తుల సంకటములను దూర మొనర్చువాడవు; అని నుతించియు స్వకార్యమును విన్నవింపగా శంకరుఁడు చిరునగవుఁజెంది నమరుల చికీర్షితము నంగీకరించి యవ్వారిని నిజస్థానముల కనిపెను.

అంత నమరులు స్వకార్యసిద్ధిని తలచుచు సదాశివుని ప్రశంసించును. తమనెలవులకు వెళ్లగా హరుఁడు ప్రసన్నుడై హిమవంతునింటికి వైష్ణవవేషమున బయలుదేరి వెళ్ళినవాడు. అట్టితతి నగాధిరాజు నిండు పేరోలగంబున సంతుష్టాంతరంగుడై బంధువులు పార్వతియు చుట్టుముట్టి యుండ సుఖాసీనుడై యుండెను.

ఛత్రమును దండమును కేలఁదాల్చి పీతాంబరధారియై నొసట తిలకముఁబెట్టుకొని సాలగ్రామమును కంఠమున నెలకొలిపియు హరినామమును స్మరించుచు సాధువేషధారియై దిగంబరుఁడు రాగా హిమవంతుడు సపరివారముగా లేచి సాష్టాంగముగ నమస్కరించెను. పార్వతీదేవి యాకపటవైష్ణవుఁడు తన ప్రాణేశ్వరుఁడేయని గుర్తెరిగి మానసికముగా ప్రణామము నాచరించి ప్రార్థించినది. శంకరుఁడు వారందరికి శుభాశీర్వాదముల నొసగి ప్రత్యేకముగా "మనోవాంఛాఫలసిద్ధిరస్తు" అని పార్వతి నాశీర్వదించిన వాడు. అంత నా సాధువు హిమవంతుఁడు సమర్పించిన మధుపర్కాదికమును పరిగ్రహించి కుశలప్రశ్న పూర్వకముగా హిమవంతుఁడు "అయ్యా! తామెవరు!" అని యడిగినందున నిట్లు చెప్పఁదొడఁగెను.



పర్వతరాజా! బ్రాహ్మణుడను, విష్ణువల్లభుడను; పండితుడను, ఘటికావృత్తి నవలంబించి భూమండలమున సంచరించువాడను. మనోవేగమున ప్రపంచమునంతట నుండువాడను గురుకటాక్షమున జేసి సర్వంబును గుర్తెరుగువాడను. పరోపకారపరాయణుడను, శుద్ధాత్ముడను, దయాసముద్రుడను, ఇతరుల కామ క్రోధాధి వికారములం బోగొట్టువాడను, కమలమువలె సుకుమారియు, దివ్యరూపవతియు శోభనలక్షణసంపన్నయు నగు నీ కుమార్తె శంకరునకొసగుదువని తెలిసినది కావున చెప్పుచున్నాను. వినుము! శంకరుండెట్టివాడో నవధరింపుము! అతనికి నెట్టి యాశ్రయములేదు. ఎవరితోడను స్నేహములేదు. సౌందర్యాది గుణములు కానరావు. శ్మశానమున నివాసము, పాములవానిరూపంబు, దిగంబరతయు సర్పభూషణతయు కులగోత్ర రాహిత్యము, శృంగారవిహారము లేమియు బూదినిండిన యొడలును, ఎల్లకాలము క్రుద్ధ స్వభావము, ప్రాయము తెలియకుండుటయు, జడలందాల్చుటయు, ప్రాణులందరికి నాశ్రయము నొసగుటయు భిక్షాటనంబును, వేదమార్గాతీతత్వంబును, ఇత్యాదిలక్షణము లాతని చెంత మూర్తీభవించియుండును. నగరాజా! నారాయణుని వంశమున పుట్టినవాడవు; వివేకవంతులలో నగ్రగణ్యుడవు, బాగుగా విచారించి పార్వతి నాతనికి సమర్పింపవలెనో లేదో నిర్ణయించుకొనుము! ఇట్టి నీ యుద్దేశమును బుద్ధిమంతులెవరు నభినందింపరు. శైలాధిపతియగు నీకుమెండుగా బంధుజనము కలదు. గొప్పరత్నము లెన్నియో నీయందు కలవు. శంకరునకొక్క చుట్టమైననులేదు. అతని చెంత నిసుమంతయు కాసులేదు. ఇప్పటికైనను మించినదిలేదు. మేనకాదేవిని బంధువులను పండితులను పరామర్శించి కార్యమునకు కడంగుము! రోగికి ఔషధము రుచింపనట్లు నా వాక్యము నీకు బహుశః రుచింపకుండునేమో;

ఇవ్విధము బ్రాహ్మణుండు సంభాషించి యాతిథ్యము స్వీకరించియు నిజస్థానమున కరిగినవాడు.

**ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పదియొకటవ యధ్యాయము.**

## ద్వాత్రింశాధ్యాయము

### (సప్తర్షులు హిమవంతుని చెంత నరుదెంచుట)

మేనకాదేవి బ్రాహ్మణుని ప్రసంగము నాలకించి దుఃఖముతో కన్నీళ్ళు కార్చుచు సంతప్త హృదయయై హిమవంతునితో "పర్వత రాజా! నే చెప్పునది పరిణామమున సుఖప్రదంబగునని భావించి యంగీకరించుము. పర్వతశ్రేష్ఠుల నందరిని విచారించుము! వైష్ణవుండాచరించిన శివనిందను వినినందు వలన నా మనంబంతయు బాధపడుచున్నయది. కురూపము దుఃశీలంబును గల నా భూతపతికి సులక్షణ సంపన్నయగు నా పుత్రిక నీయంజాలను. ఒకవేళ నా మాటను పాటింపక పార్వతిని శంకరున కిత్తువేని వెంటనే విషమును త్రాగి మరణింతును. ఇంటినుండి బయలు వెడలుదును. అంబికను మెడకుంగట్టుకొని గహనారణ్యముం బ్రవేశింతును. సముద్రమునంబడుదును కాని యాతనికీ సుత నిచ్చుట కంగీకరింపను" అని సంభాషించి కంఠహారమును విసర్జించి యేడ్చుచున్నదై కోపమందిరమునకు వేగమే వెళ్ళియుండినది.





కైలాసమున పార్వతీవియోగవ్యాకులమానసవశంబున శంకరుఁడు స్మరింపగా కల్పవృక్షములఁ బోలిన సప్తర్షులు ప్రత్యక్షసిద్ధిఁబోలిన నరుంధతీదేవియు నేతెంచిరి. అవ్వారిఁగాంచి నిజధ్యానమును హరుఁడు విరమించెను. సప్తర్షులు శివునిముందు నిలువంబడి యంజలిఁఘటించియు లోకారాధ్యుండగు శంకరుని గూర్చి యిట్లు ప్రార్థించిరి.

సకలదేవతాసార్వభౌమా! సర్వోత్తమంబగు మా భాగ్యమునేమని వర్ణింతుము? మనోవాక్కాయములఁ గావించిన తపస్సు, వేదాధ్యయనంబు ఫలించినవి. అగ్నులు బాగుగా హవనముఁజేయబడినవి. పుణ్యతీర్థములన్నియు సేవింపబడినవి.

వాఙ్మనః కాయంబుల నార్జించిన సుకృతము - తమరు స్మరించియనుగ్రహించుట వలన సఫలంబైనదనియే భావించుచున్నాము.

శ్లో॥ **యోవై భజతి నిత్యం త్వాం - కృతకృత్యో భవేన్నరః ।**
**కిం పుణ్యం వర్ణ్యతే తేషాం - యేషాంచ స్మరణం తవ ॥** ౧౬

నిన్ను భజించు మానవుఁడు నన్నిటఁ గృతార్థుండగును. ఇఁక నిన్ను స్మరించు వారి పుణ్య మింతింతయని చెప్పరాదు. సదాశివా! నీవు స్మరించుటవలన మేము సర్వోత్కృష్టులమైతిమి. మనోరథమార్గము నతిక్రమించినవాడవు; పొట్టివానికి చెట్టుపండ్లుదొరికినట్లు పుట్టుగ్రుడ్డివానికి కన్నులువచ్చినట్లును మూగవానికి మాటలు సంభవించినట్లు దరిద్రునకు నిధి చేకూరినట్లును కుంటివాడు కొండనెక్కినట్లును గొడ్రాలు ప్రసవించినట్లును దుర్లభంబగు నీదర్శనమునుపొంది ధన్యులమైతిమి. నీదర్శనమువలననే లోకములలో నీవేళటినుండి మాన్యులమైతిమి. వేయేల? అన్నివిధముల పూజ్యులమైతిమి. పరిపూర్ణుడవగు నీకు కర్తవ్య మెద్దియో స్ఫురించుటలేదు. సేవకులమగు మమ్మాజ్ఞాపింపుము!

సప్తర్షుల వాక్యము నాలకించి మహేశ్వరుఁడు లౌకికరీతిని రమ్యముగా నవ్వారితో "ఒకానొక కారణమున మిమ్ము స్మరించితిని. లోకకల్యాణార్థము నేజేయు లీలలన్నియు భవద్విదితంబులే గదా! నా యష్టమూర్తులన్నియు లోకమున కుపకరించునట్టివి. ఋషులకు గూడ సాధ్యము కాని తపంబును పార్వతీదేవి యొనర్చినందున స్వీకరింతునని వరము నొసఁగితిని. ఇద్దియే నా భక్తానందకరమగు వ్రతము పార్వతియభిలషితము ననుసరించి భిక్షుకుడనై యాచించితిని. మేనకాహిమవంతులు నన్ను పరమాత్మగా భావించి నిండు మనంబున పార్వతిని నాకు సమర్పింప నున్నతఱి దేవతలు హిమవంతుని చంచలమనస్కుని గావింప నన్ను ప్రార్థించినందున వైష్ణవవేషమున నవ్వారిముందు స్వనిందఁజేసికుంటిని.

అందువలన గిరిదంపతులు నిర్విణ్ణులై పార్వతిని నాకునీయగూడదని తలచుచున్నారు. కావున మీరు వెళ్ళి మేనకాహిమవంతులకు వేదవిహితమైన ప్రబోధమును చేయుఁడు! కార్యసిద్ధియగునట్లు సంభాషింపుడు! ఎటులైనను గిరిజతో నాకు వివాహమగునట్లు మాటలాడుడు! ఈ వరకే పార్వతీ పరిగ్రహణము నంగీకరించితిని కావున హిమవంతునకు మేనకాదేవికిని నచ్చఁజెప్పుట తప్పనిసరి యని భావింపుడు: మీరు దైవవిధానమును సమర్థించువారు. గౌరీశంకర కల్యాణము మీ కార్యమనియు నందువలన నమరులకు హితంబగుననియు గ్రహింపుడు!"

అని సంభాషింపగా నవ్వారు ప్రభువుచే ననుగ్రహింపఁబడినందున పరమానంద నిర్భరులై బ్రహ్మవిష్ణువులచే సత్కరింపఁబడు మహేశ్వరుఁడు మమ్ము స్వకార్యమునందు నియోగించుచున్నవాడని లోలోన సంతృప్తిఁజెందుచు జగత్పితయు లోకమాతయు నగు గౌరీ శంకరులకు వివాహసంబంధము సముచితంబైనదనియు ఇయ్యది శుక్లపక్ష చంద్రునివలె పెంపొందుగాక యనియు భావించి శివుని నమస్కరించియు ఆకాశమార్గముగా హిమాలయమున కేగి యందలి రాజధానీనగరముఁగాంచుచు విస్మితులై తమ యదృష్టములను ప్రశంసించుకొనుచుండిరి.

అహో! ఈ పత్తనము అలకానగరమును భోగవతిని అమరావతిని మించియున్నది. ఇందలి భవనములు స్ఫటికమణిమయములై విశాల ప్రాంగణములతో విరాజిల్లు చున్నవి. సూర్యకాంత చంద్రకాంతమణులతో ప్రదేశమంతయు నిండియున్నది. స్వర్గసముద్భవములగు కల్పవృక్షాదులు నింటింట వెలసియున్నవి. గృహద్వారములయందు తోరణములు శోభించుచున్నవి. చిత్రవిచిత్ర వితానములు స్వచ్ఛజలాశయములు వివిధ దీర్ఘికలు (నడబావులు) మనోహరోద్యానంబులు, దేవసన్నిభులగు మానవులు, అప్సరసలఁబోలిన నారీమణులు నిండున్నవారు.

స్వర్గకామనతో కర్మభూమియందు యజ్ఞములొనర్చి వృథాశ్రమపడుచున్న వారు కాని యీఓషధిప్రస్థమును చూచినచో నెవరును స్వర్గము నభిలషింపరు. ఇట్లువారు హిమవత్పురమును వర్ణించుచు హిమవంతునింటఁ బ్రవేశించుచుండగా నాతడు దూరమునుండియే సూర్యసంకాశులగు సప్తర్షులేతెంచుచున్నారని కనుగొని ధన్యుడనైతినని భావించుచు సప్తర్షుల కెదురేగి నమస్కరించియు నా గృహస్థాశ్రమము సఫలంబైనదని యవ్వారిని సముచిత పీఠముల నాసీనులఁజేసియు నిట్లు సంభాషించెను.

మహాశయులారా? నా జీవితము ఫలించినది. బహుపుణ్యతీర్థములవలె దర్శనీయుడనైతిని. విష్ణుస్వరూపులగు మీరు నాయింటి కేతెంచుట భాగ్యమనియే తలతును. పరిపూర్ణులగు మీకు నావంటి యకించనులతో నెట్టి ప్రయోజనంబుండదు కాని సేవకుడనైన నన్ను యత్కించిత్కార్యమున నియమించినయెడల నా జననము సార్థకంబగును.

**ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పదిరెండవ యధ్యాయము.**

## ముప్పది మూడవ యధ్యాయము

### (హిమవంతు వోదార్చుట)

సప్తర్షులిటుల మాటలాడిరి. "శివుఁడు జగజ్జనకుఁడు, దేవి – జగజ్జననియగును కావున నీవ శంకరునకు కుమార్తె నొసగి ధన్యుడవుకమ్ము! ఇందువలన నీ జన్మసార్థకంబగును.

అంత హిమవంతుఁడు సంజలిఁఘటించి "మహాభాగులారా! తమచే నిర్దేశింపఁబడిన విషయము నీ వరకే నిశ్చయించుకుంటిమి. కాని యింతకుముందొక వైష్ణవుఁడు శివునుద్దేశించి విపరీతముగా సంభాషించి వెళ్ళినందున మేనకాదేవి శంకరునకు పార్వతి నిచ్చుటకెంతమాత్రము సమ్మతించుటలేదు.





మలిన వస్త్రములను ధరించి కోపమందిరమున నివసించుచు ఎంత చెప్పినను వినుటలేదు. నేనును తెలివిఁదప్పితిని. శంకరుఁడు వివాహయోగ్యుడు కాడని భావించుచున్నందున నాతనికి కన్యాదానము నొనర్ప నిచ్చగించుచు లేను" అని వాక్రుచ్చి శివమాయామోహితుడై మిన్నకుండెను.

సప్తర్షులు శివమాయా ప్రభావమును ప్రశంసించుచు మేనకాదేవిచెంత నరుంధతీ దేవిని పంపగా నా మహాసాధ్వి యామె నవలోకించి మధురముగా సంభాషింపనున్న తఱి మేనక శీఘ్రమే లేచినదై లక్ష్మీదేవివలె ప్రకాశించు నరుంధతికి మ్రొక్కులిడి మహనీయుఁడగు వసిష్ఠమహర్షిదగు భార్యయైన నరుంధతి మాయింటి కరుదెంచుట యెంత భాగ్యంబనియు మురియుచు "అమ్మా! ఎందుకు నేతెంచితివో సెలవీయుము! నీ సేవకురాలనని భావించుము" అని విన్నవించెను. సప్తర్షులచ్చోట శివుని పాదారవిందములను స్మరించుచు పర్వతేంద్రున కివ్విధము ప్రబోధింపసాగిరి.

పర్వతరాజా! మా మాటను పాటింపుము! జగత్సంహారకుఁడగు శంకరునకు మామవు కమ్ము. వస్తుతః శంకరుఁ డెవరిని యాచించువాడు కాకున్నను తారకాసురుని సంహరించు కుమారుఁడు కావలెనని బ్రహ్మదేవుఁడు ప్రార్థింపగా నాతడు నీ కుమార్తెను పరిగ్రహింపఁదలచెను. నిజముగా విచారించి చూచినయెడల పత్నీ స్వీకరాము నందెంతమాత్ర మపేక్షలేనివాడని విదితమగును. శంకరుఁడే పతికావలెనని పార్వతీదేవి తపంబొనర్చుటయు సుప్రసిద్ధముగదా! బ్రహ్మప్రార్థనయు పార్వతీతపంబు కారణములుగా యోగీశ్వరుఁడగు నా మహేశ్వరుడు వివాహము నిచ్చగించుచున్నవాడు.

హిమవంతుఁడు సప్తర్షుల సుభాషితము నాకర్ణించి సంతుష్టుడై కొద్దిగా భయపడుచు వినయముతో "శివునకు రాజోచితములగు వస్తువు లేవియు గానరావు." నివసించు ప్రదేశంబు అప్తబాంధవుఁడును లేవు. అట్టి నిర్లిప్తయోగికి నా పుత్రిక నెట్లొసగవలెనో మీరే చెప్పుడు! రూపవయోగుణాదుల ననుకూలింపని వరునకు కన్యను సమర్పించువాడు భ్రష్టుడై నరకము నొందును గావున కైలాసపతికి నిష్టపూర్వకముగా గౌరి నిచ్చువాడను కాను. ఇకమీద తగు రీతిని మీరే యేర్పాటుచేయవలసి యుండు" నని సంభాషింపగా వసిష్ఠమహర్షి యిట్లు చెప్పఁదొడఁగెను.

శైలేశ్వరా! నేను చెప్పునది హితావహమైనదియు ధర్మబద్ధమైనదియు యథార్థంబైనదియు ఇహపరముల నానందమును కలుగఁజేయునదియును;

వేదమునందును లోకమునను వచనము మూడు విధంబులని శాస్త్రజ్ఞులు నిర్మలమైన జ్ఞాననేత్రముతో నెఱుఁగుదురు. బుద్ధిమంతుఁడైన శత్రువు - చెప్పెడు వాక్యము - ప్రస్తుతము చెవుల కింపుగా నున్నను సత్యము హితంబు కాజాలదు. మొదట నసంతృప్తిని కలుగఁజేసి పరిణామమున సుఖప్రదంబగు వాక్యమును ధర్మశీలుడైన దయాళువు బోధించును. వినుటతోడనే అమృతముఁ బోలినదియు ఆదిమధ్యాంతములయందు సుఖమును చేకూర్చునదియు సత్యంబు శ్రుతిస్మృత్యాదిసారంబు హితకరంబునగు వచనము ముప్విధములలో శ్రేష్ఠంబైనదని భావింపుము! నీతిశాస్త్రప్రోక్తములగు నివ్వానిలో నెట్టివాక్యమును చెప్పవలెనో తెలుపుము!

నీవనినట్లు శంకరుఁడు - స్రక్చందనవనితాది బాహ్యసంపదలు లేనివాడు. ఐనను నిజతత్త్వజ్ఞన మనెడు సాగరమున నిమగ్నమగు మానసము గలవాడు. ఐతే సామాన్య లోకమున గృహస్థుడు -





సంపన్నుడైన వరునకు తన పుత్రిక నొసగుననియు దరిద్రున కిచ్చినచో కన్యాఘాతకుండగుననియు మేము నంగీకరింతుము.

"కోవేద శంకరోదుఃఖీ । కుబేరో యస్య కింకరః"

కుబేరుండు కింకరుడుగా గల శంకరుండు దరిద్రుండని యెవరైన నిరూపింతురా? ప్రాకృతగుణరహితుండు ప్రకృతినతిక్రమించినవాడునగు మహాదేవుడు - కనుబొమల ముడితోడనే సృష్టిస్థితిలయమున నొనర్చువాడని గుర్తెరుగుము! బ్రహ్మవిష్ణురుద్రులు సదాశివుని విభూతులగుదురు. శివునివలన ప్రాదుర్భవించిన శక్తియు నిట్టిదేను: వాగధిష్ఠాత్రియగు సరస్వతి పరాశక్తి ముఖమునుండియు, సర్వసంపత్స్వరూపిణియగు లక్ష్మి - వక్షస్థలమునుండియు, దేవతాతేజఃపుంజీభూతయగు కాళికాదేవి హృదయమునుండియు నావిర్భవించిరి. ఇందు కాత్యాయని యసురులఁ ద్రుంచి యమరులకు స్వర్గసంపదను ప్రసాదించినది. ఈమెయే కల్పాంతరమున దక్షపుత్రికయై పతినిందను విననొల్లక దేహమును విసర్జించుటయేగాక ప్రతి కల్పమునందును శివపత్నిగా విలసిల్లునది. మరియు నీమె జ్ఞానులకు బుద్ధిస్వరూపిణిగా నుండునది. భక్తుల మనోరథములను సిద్ధింపఁచేయునదై విజయము నొందునది.

కావున నో నగాధిపతీ! శివునకు పార్వతిని మనఃపూర్వకముగా సమర్పించుము! ఒకవేళ నీవు శఠబుద్ధితో నిరాకరింతువేని యామెయే స్వయముగా నాతనిఁజేరును. శంకరుండు నటవేషమున మిమ్ము యాచించినప్పుడు మీరు పార్వతినిత్తుమని శివభక్తి సంభరితమనస్కులై యంగీకరించితిరి. ప్రస్తుత మెందులకు విపరీతముగా మాటలాడుచుంటిరో బోధపడుటలేదు. మిమ్ము యాచించి నిజస్థానమున కేగిన పిదప స్మరించి మాచే పొగడ్తల నొందియు పార్వతీదేవి ననుసంధించుటకై పరాత్పరుండిటుల మమ్ము నంపినవాడు. పార్వతిని శంకరునకు సమర్పించుమను మా శాసనమును పాలింతువేని సుఖింతువు. భవితవ్యబలమున గౌరీశంకరుల కల్యాణము తప్పదని భావింపుము! పార్వతిని పరిగ్రహించునని యీశ్వరుండు గావించిన ప్రతిజ్ఞ - రిత్తయగునా? పరమేశ్వరునుపాసించు మహేశ్వరుల ప్రతిజ్ఞయే సిద్ధించునపుడు సాక్షాత్ శంకరుని శపథము సిద్ధించునని వేరుగా చెప్పనవసరములేదు. ఒక్క మహేంద్రుడే పర్వతముల రెక్కలను తెగగొట్టినవాడు. ఒక్క మహేశ్వరియే మేరుశిఖరము నవలీలగా పడఁగొట్టినది. బుద్ధిమంతుడు నొక్క వస్తువు మూలముగా సంపదలన్నిటిని చెడగొట్టుకొనరాదు. కులము పెంపొందుటకై యొక్కని విడువవలెనని శ్రుతి వక్కాణించినది.

ఒకప్పుడు అనరణ్యుడను మహారాజు బ్రాహ్మణునకు తన పుత్రిక నొసగి రాజ్యమును రక్షించుకొనెను. అట్టితతి బ్రహ్మశాపమునకు వెఱఁగంది పెద్దలు నీతిశాస్త్రకోవిదులు మహారాజున కనేకవిధముల బోధింపవలసివచ్చెను.

హిమవంతుఁడిది యంతయు విని యనరణ్యుని చరిత మెట్టిదో విశదీకరింపుమని ప్రశ్నింప వసిష్ఠుఁడు చెప్పఁదొడఁగెను.

**ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో త్రయస్త్రింశాధ్యాయము.**

# చతుస్త్రింశాధ్యాయము

## (అనరణ్యచరితము)

ఇంద్రసావర్ణియనఁబడు పదునాలుగవ మనువుఁదగు వంశమున ననరణ్యుఁడు జన్మించెను. మంగళారణ్యుని కుమారుడగు నాతడు సప్తద్వీపాధిపతియై విశేషించి శివభక్తుడుగా నుండెను. భృగుమహర్షిగారి పౌరోహిత్యమున నూరు యజ్ఞముల నాచరించినందున నమరులచే ప్రార్థింపబడిన నింద్రత్వమును స్వీకరింపకుండెను. అనరణ్య మహారాజునకు నూర్గురు కుమారులు, శ్రీదేవిఁబోలు పద్మయనఁబడు కుమార్తెయు జన్మించి వర్ధిల్లుచుండిరి. నగరాజా! నీకేమని చెప్పవలెను! శతపుత్రులకన్న పుత్రికయందే మహారాజునకు స్నేహమధికముగా నుండెడిది. సౌభాగ్యసంపన్నులగు నైదుగురు భార్యలు నైదుగురు ప్రాణములను మించిన యనురాగమునకు పాత్రులైయుండిరి. పద్మాదేవి యువతి యైనందున తగిన వరునికై దేశదేశములకు శ్రీముఖములను వ్రాసి భటుల నంపినవాడు.

ఇది యిట్లుండగా నొక్కనాడు పిప్పలాదుడను మహర్షి – స్వకీయాశ్రమమునకుఁ బోవుచు నిర్జనంబగు తపోవనమున తరుణులతో శృంగారరససాగరమున మునిగితేలుచు కామశాస్త్రవిశారదుడై విహరించుచున్న గంధర్వుని గాంచి కామమోహము గలవాడయ్యెను. తాపసుఁడైనను పత్నీపరిగ్రహణమును వాంఛించుచుండెను. మన్మధవికారముతో మధనపడుచున్న మనంబు నెటులో కొంతకాలం బణచఁ గలిగెను.

తరువాత దైవవశమున నొక్కనాడు పుష్పభద్రానదిలో స్నానమునకై వెళ్లుచు నతిలోకసుందరియగుపద్మ నవలోకించి "ఈమె యెవరని సమీపస్థుల నడుగగా నవ్వారు శాపభీతిచే" అనరణ్యుని కుమార్తె, పద్మయందురు. గొప్ప గొప్ప రాజు లీమెను కోరుచున్నవారని నుడువగా పిప్పలాదుఁడు లోలోన పద్మ నపేక్షించుచున్నందున పుష్పభద్రయందు గ్రుంకులిడి సంధ్యావందనాది నిత్యకృత్యానంతరము స్వాభీష్టదైవంబగు పరశివుని పార్థివలింగమునందారాధించి యనరణ్యుని సభాస్థలికి నరుగగా రాజు వేగమే యాతని కెదురుగా వెళ్లిభీతిల్లుచు వందనము నాచరించియు మధుపర్కాధికముతో నాతనిని పూజించి యున్నకుండగా మహర్షి కాముకుఁడగుటచే రాజప్రదత్తము నంతయు పరిగ్రహించి చివరకు నాతని కన్యక నొసగుమని యాచించెను. అందుకు భూపాలుడు నిర్విణ్ణుడై యేమియు బదులు చెప్పజాలక యున్నకుండెను. "రాజా! నీవు పద్మను నా కొసగనియెడల నీ రాజ్యాదిసంపద నంతయు నశింపఁజేయుదు" నని శాసింపగా రాజపరివారమంతయు మహర్షి ప్రభావమున నేమియు పలుకఁజాలకుండెను. రాజు మిగుల దుఃఖించుచుండెను. పిప్పలాదుఁడు ఆశ్రమనివాసియైనను యువకుడుకాడని దేవేరులు విలపించుచుండిరి. అట్టితఱి వారందరికి కర్తవ్యజ్ఞానము లోపించినది. మరియు పద్మామాత-మూర్ఛితురాలయ్యెను. రాజపుత్రులందరును మిగుల వగచుండిరి.

ఇంతలో రాజగురువు, రాజపురోహితుఁడు నేతెంచగా నవ్వారిని సత్కరించి కర్తవ్యమును గురించి రాజు ప్రశ్నించెను. శాస్త్రమర్యాదలను కనుగొనిన వారిరువురును దిగువ విధము రాజునకు కుటుంబమునకును బోధించిరి.




మహారాజా! దుఃఖింపకుము! శాస్త్రీయమైన విచారము నవలంబింపుము! ఈ వేళనో సంవత్సరమునకో ఒకానొక యోగ్యవిప్రునకు నీ కుమార్తెను సమర్పింపవలసియుండునుగదా! సద్బ్రాహ్మణుని మించిన సత్పాత్రము మరియొకటి లోకత్రయమునందును లేదు కావున పిప్పలాదమునికి పద్మను సమర్పించి నిజసంపదను కాపాడుకొనుము! ఒక్క వస్తువు నిమిత్తముగా సర్వస్వమును గోలుపోవుట పాడికాదు. కావున నట్టిదానిని విసర్జించి స్వకీయమునంతయు రక్షించుకొనవలసియున్నది.

ప్రాజ్ఞులైన గురుపురోహితుల ప్రబోధము నంగీకరించి రాజు తన పుత్రిక నమూల్య వస్త్రాలంకారములతో నలంకరించియు పిప్పలాదునకు వివాహవిధిని సమర్పించెను. మహర్షి ప్రసన్నుడై పద్మను వెంట నిడుకొని తన యాశ్రమమునకుఁ జనినవాడు.

అనరణ్యుడు వృద్ధునకు కన్యక నొసగినందున వ్యథితచిత్తుడై అరణ్యమునకు తపంబునకై వెడలినందున నాతని పట్టమహిషిపతి పుత్రికా వియోగమును భరింపఁజాలక నసువులఁ బాసినది. ఇక రాజ నగరునందలి పెద్దలు రాజకుమారులును మంత్రులు మున్నగు వారును రాజు నెడఁబాసినందున నిట్టూర్పులను విడుచుచు మిగుల దుఃఖించుచుండిరి. రాజు నడవిని తపోనియమస్థుడై శంకరు నారాధించి పునరావృత్తిరహితశాశ్వత పందబగు శివలోకముఁజెంది శివానందానుభవపాత్రుండయ్యెను.

అనరణ్యుని జ్యేష్ఠకుమారుఁడగు కీర్తిమంతుఁడు ధర్మతత్పరుడై ప్రజలను కుమారులవలె పాలించుచు రాజ్యము నేలినవాడు. ఐతే హిమవంతా! ఇంతవరకు చెప్పిన సందర్భమున – అనరణ్యుఁడు తన ఏకైక పుత్రికను తాపసునకు సమర్పించి స్వవంశమును రాజ్యమును కాపాడుకొనె నను నంశమును ముఖ్యముగా గమనించి శంకరునకు పార్వతిని సమర్పించియు నీ వంశమును రక్షించుకొనుము. అమరుల నందరిని స్వాధీనపఱచుకొనుము!

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పదినాలుగవ యధ్యాయము.**

## పంచత్రింశాధ్యాయము

### (పద్మాపిప్పలాదుల చరితము)

అనరణ్యుని కథావృత్తాంతమును విని గిరీశ్వరుఁడు సాంజలియై "పద్మాదేవి పిప్పలాదుని భర్తగా బడసిన యనంతర మెవ్విధము ప్రవర్తించినదో" వివరింపుమని ప్రశ్నింపగా వసిష్ఠమహర్షి దిగువ విధముగా వక్కాణించెను.

ముదుసలియగు పిప్పలాదుఁడు తన భార్యను తోడ్కొని నిజాశ్రమమునకుఁజని మిక్కిలి సంసారలంపటుఁడుగాక సహజానురాగమున నరణ్యమునందు పర్వతముపై నిజవర్ణాశ్రమోచిత ధర్మము నాచరించుచు నివసించుచుండగా లక్ష్మీదేవి నారాయణునివలె పద్మాదేవి పిప్పలాదమహర్షిని మనో వాక్కాయములతో సేవించుచుండినది.





ఒకప్పుడు పద్మాదేవి మందస్మితవదనారవిందముతో నాకాశగంగయందు స్నానమాడుటకు వెళ్లుతతి ధర్మదేవత మనోహర రాజరూపమున సమీపించి "సుందరీ! నిండు యౌవనమున నున్న తరుణివి; ముదుసలితనమున బాధపడుచున్న పిప్పలాదునిచెంత నుండుటకు తగనిదానవు; తపోనిరతుడు మరణము సమీపించివాడునగు విప్రుని విసర్జించి రతిశూరుడను కామాతురుడను రాజేంద్రుడనగు నన్ను వరింపుము! లోకములో పూర్వపుణ్యమున సౌందర్యవతిగా జన్మించిన వనిత - తన లావణ్యమును సార్థకముం జేసుకొనుటకు రసికపురుషు నాశ్రయింపవలసియుండును.

ఇంకను చెప్పుచున్నాను వినుము! వేలకొలది యువతుల మనంబుల నాకర్షించినవాడను, కామశాస్త్రమున నైపుణ్యమును సంపాదించినవాడను, ఇట్టి నన్ను నీ కింకరునిగా నొనర్చుకొనుము! పూర్వపతిని విడనాడుము!

రమ్యంబగు నిర్జనప్రదేశమున కొండలపైనను నదీతీరములయందును నాతో విహరించి జన్మసాఫల్యము నాపాదించుకొనుము" అని సంభాషించి తేరుడిగ్గి యామెను తాకనున్నతతి సాధ్వీమణి యిట్లు ప్రత్యుత్తరించెను. "పాపాత్ముడా! నరాధమా! దూరము తొలగుము! కామదృష్టితో నన్నుగాంచితివేని తత్కాలముననే నశింతువు! తపంబున పావనంబగు శరీరముగలిగి మునులలో మిన్నయగు పిప్పలాదుని పరిహరించి స్త్రీజితుడవై రతిలంపటుడవగు నిన్నెట్లు పొందుదును? స్త్రీజితుని తాకినంత మాత్రమున సుకృతంబంతయు నశించును. ఆడదానికి లొంగిన మగవాడు పాపులలో శ్రేష్ఠుండనంబఱగును. అట్టివానిని చూచుటయు పాపహేతువు, స్త్రీజితుండు ఎట్టి సదాచరణము గలవాడైనను పవిత్రుండు కాజాలడు. పితరులు దేవతలు మానవులు ప్రాణులందరును స్త్రీజితుని నిందింతురు. తరుణులచే నెవరి చిత్తము నపహరింపం బడునో అట్టివాని జ్ఞానము, అనుష్ఠానము, జపము, హోమము, దేవతార్చనంబు, విద్యయు దానంబును నిరర్థకంబులగును. తల్లివంటి నన్ను సామాన్యతరుణిగాభావించి దుష్టభావము నొందినందులకు కొంతకామునకు క్షీణింతువు గాక!"

పద్మాశాపమును వినిన తరువాత ధర్ముండు వడకుచు రాజస్వరూపమును విడనాడి నిజరూపము గలవాడై "అమ్మా! నేను ధర్మదేవతను. జ్ఞానులకు గురువుగా నుండువాడను. పరస్త్రీయందు మాతృబుద్ధిం గనబఱచువాడను. నీ యాశయమును గుర్తెరిగియు నిన్ను పరీక్షింపవలెనని దైవచోదితుడనై వచ్చితిని. నన్ను నీవు శపించుట సముచితంబేయని తోచెడిని. ఎందుకనగా? సన్మార్గము నతిక్రమించువారి నీశ్వరుండు శిక్షించియే తీరును.

శ్లో॥ స్వయం ప్రదాతా సర్వేభ్యః - సుఖదుఃఖవరాన్ క్షమః
సంపదం విపదం యోహి - నమస్తస్మై శివాయ హి ॥ 30

సుఖమునుగాని దుఃఖమునుగాని సంపదనుగాని ఆపదనుగాని ప్రాణులందరికిని స్వయముగా కలుగంజేయు శివునకు నమస్కార మగుగాక! శత్రువునుగాని మిత్రునిగాని, లభింపంజేయువాడు, స్నేహమునుగాని ద్వేషమును గాని యొనంగూర్చువాడు, సృష్టిస్థితిలయముల నొనర్చువాడునగు శివునకు నమస్కారమగుగాక!

శివుఁడే పాలను తెలుపుగాను నీటిని చల్లనివానిగాను అగ్నిని కాల్చువానిగా నొనర్చినవాడు. ప్రకృతి నావిర్భవింపఁజేసి మహత్తు మున్నగు తత్త్వముల నేర్పరచియు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మున్నగువారిని నియమించు శివునకు నమస్కారమగుగాక!

అని వాక్రుచ్చి పద్మాదేవిఁదగు పతివ్రతాధర్మమునఁజేసి సంతసించినవాడై జగద్గురువగు ధర్ముడు నామెముందు నిలిచియుండెను. అంత పద్మాదేవి విస్మయమును జెందుచు "ధర్మదైవమా? నీవేగదా సమస్త కర్మలకు సాక్షివి! ఇఁక నామనంబు పరీక్షింపఁబూనితివెందులకు? ఇప్పుడు జరిగిన దానిలో నాయపరాధ మేమియు లేదని భావించెదను. కాని స్త్రీ స్వభావమువలనను అవివేకమువలనను నిన్ను వ్యర్థముగా శపించితిని. ఐతే నాశాపము ఎట్లు నుపయోగించునో ఆలోచించుచున్నాను. ఆకాశము, దిశలు వాయువు నశించినను సాధ్వీశాపము రిత్తపోదు. కావున నా శాపముఁదగు విధానమును తెలుపుచున్నాను వినుము!

పున్నమ చంద్రునివలె కృతయుగమున నాలుగుపాదములతో విరాజిల్లుచుందువు! ఇఁక త్రేతాయుగమున మూడు పాదములతోడను ద్వాపరయుగమున రెండు పాదముల తోడను కలియుగమున నొక్కపాదము తోడను మనుచుందువు; నీవు పూర్తిగా నశించినచో ప్రపంచము నశించును. ఐతే కలియుగము కొద్దిగా శేషించియున్నపుడు నీ నాలుగు పాదములును ఛేదింపఁబడును. మరల కృతయుగ ప్రారంభమున పాదచతుష్టయముతో పరిపూర్ణుడవై విలసిల్లుదువు.

నిన్ను శపించినందున నేమియు తోచనిదాననై యిట్లు చెప్పవలసి వచ్చెను. నే చెప్పినదంతయు యధార్థంబై నీకు సుఖము నొసగుగాక! నా పతిని సేవింప వెళ్లుచున్నాను. నీ నివాసమునకుఁ జనుము!'

అని వచించినంత ధర్ముడు పద్మను గురించి "అమ్మా! ధన్యురాలవు; పతివ్రతాశిరోమణివి వరములనొసఁగుచున్నాను. పరిగ్రహింపుము! నీ భర్త వయసువాడై రతిశూరుఁడగుగాక. సుందరుఁడు గుణవంతుడు సమయోచిత సంభాషణము గలవాడు సంతానమును బడయుటకు వలయు స్థిరయౌవనముగలవాడు ధార్మికుఁడును మార్కండేయునివలె చిరంజీవియు కుబేరుని మించిన ధనము గలవాడు, దేవేంద్రునికంటె నధికమగు నైశ్వర్యము గలవాడును శివభక్తుడై నారాయణునితో సమానుఁడును కపిలుని మించిన సిద్ధుడును బుద్ధిబలమున బృహస్పతిఁ బోలినవాడును సర్వసమానతను చూచుటలో చతుర్ముఖ బ్రహ్మతో సరిదూగువాడు నగుగాక! ఇక నీవుబ్రతికియున్నంతవరకు సువాసినివై స్థిరమైన తారుణ్యము గలదానవై చిరంజీవులు గుణవంతులు నీ పతిని మించిన వారునగు పదుగురు కుమారులకు జనని వగుదువుగాక!

సర్వవిధ సంపదలతో తులదూగు భవనములు కుబేరుని నివాసమును మించినవై ఎల్లకాలము ప్రకాశించునవిగా నుండుగాక!

అని వచింపగా పద్మాదేవి ధర్మదేవతకు ప్రదక్షిణముల నొనర్చి మ్రొక్కులిడియు నిజాశ్రమమునకుఁ జనినది. ధర్మదేవతయు పద్మనభినందించుచు తన లోకమునకు వెళ్లి సజ్జనసమావేశముల యందామెను ప్రశంసించుచుండెను.





పద్మాదేవి యువకుడు సుందరుడు సంపన్నుడునగు పిప్పలాదునితో సుఖించి గుణవంతులైన దశపుత్రులను కనినది. ధర్ముని వరము ననుసరించి దంపతులు అన్యోన్యానురాగసంపన్నులై ఇహపర సుఖావహంబగు ప్రవర్తమున నివసించుచుండిరి.

పర్వతరాజా! పద్మాపిప్పలాదుల చరిత మిట్టిది. ఇప్పటికైన నవధరించి పరమేశ్వరునకు పార్వతిని సమర్పించుము! మొండితనమును విడనాడుము! మేనకయు సుముఖురాలగుగాక!

ఇప్పటినుండి యేడు దినములు గడచిన తరువాత మిగుల శుభప్రదంబగు ముహూర్తము కలదు. అట్టితతి వివాహలగ్నాధిపతి - లగ్నము నందుండును. చంద్రుఁడు తనకుమారుడైన బుధునితో కూడియుండుటయేగాక రోహిణిఁ గలసియున్నందున సంతుష్టుడై యుండును. తారాచంద్రబలములు అనుకూలించును. మార్గశిరమాస సోమవారంబున సమస్తదోషవర్జితంబు శుభగ్రహదృష్టి సమన్వితమును పాపగ్రహ దృష్టిరహితంబునగు ముహూర్తమున శాశ్వత సౌభాగ్యము నొసగు బృహస్పతి యోగ్యసంతాన ప్రదుడుగా నుండును. ఇట్టి శుభసుముహూర్తమున జగదంబయు మూలప్రకృతియునగు పార్వతీదేవిని జగత్పతియగు శంకరునకు సమర్పించి కృతార్థుడవు కమ్ము!

ఇట్లు జ్ఞానిసత్తముఁడగు వసిష్ఠుఁడు వచించి నానాలీలాకరుండగు శివుని స్మరించియు మిన్నకుండెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పదియైదవ యధ్యాయము.**

## ముప్పదియారవ యధ్యాయము

### (సప్తర్షులు పార్వతికి ఫలపుష్పములను సమర్పించుట)

హిమవంతుఁడు వసిష్ఠమహర్షిదగు సత్ప్రసంగము నాకర్ణించి మేనకాదేవితో గూడ విస్మయముఁ జెందుచు మేరువు మున్నగు పర్వతములతో నిట్లు ముచ్చటించెను.

మేరు సహ్య గంధమాదన మందరమైనాక వింధ్యాది శైలేంద్రములారా! నా మాటనందరును గమనింపుడు! వసిష్ఠమహర్షిగారు చెప్పినట్లు చేయవలెనా? మరియొకవిధముననా? బాగుగా? విచారించి కర్తవ్యమును నిర్ణయింపుడు!

అంత గిరివరులు "మహాభాగుడా! ఇప్పుడు విమర్శించుట యెందులకు? సప్తర్షులు నుడివిన విధముగా నీ యంబిక దేవకార్యార్థము జన్మించినదని గుర్తెరుగుము! శివున కీమెను సమర్పించుము! ఎందుకనఁగా? ఆతడే పతికావలెనని పార్వతి తపించుటయు శంకరుఁడీమెను పరిగ్రహింతునని వరము నొసగుటయు సువిదతములై యున్నవి" అని వచింపగా హిమవంతుఁడు సమాహితమనస్కుఁడయ్యెను. పార్వతీదేవియు మనంబున సంతసించుచుండెను.

వసిష్ఠపత్నియగు నరుంధతీదేవి - యనేక హితవాక్యములతోడను వివిధములగు నితిహాసముల తోడను మేనకాదేవికి ప్రబోధము నొనర్చినందున నామెయు ప్రసన్నురాలై సప్తర్షులకు నరుంధతికి హిమవంతునకును షడ్రసోపేత భోజనంబు నిడి తానును భుజించునది.





అట్టితఱి హిమవంతుఁడు తన భ్రాంతినంతయు తొలగించుకొని యంజలిఁఘటించి "సప్తర్షులారా? పార్వతీశంకరుల మహిమనాలకించి సంశయమును పోగొట్టుకున్నాను. ఇఁక నా శరీరము భార్యయు పుత్రికాపుత్రులును స్థిరచరసంపదయు సమస్తంబును శివునివే యని భావించుచున్నాను. ఈ పుత్రికయను నొకానొక ద్రవ్యమును శివునకు సమర్పింతునని నిశ్చయించుకుంటిని" అని విన్నవించి పార్వతిని వస్త్రభూషణాదులతో నలంకరించియు సప్తర్షుల సన్నిధిని కూర్చుండఁజేసినవాడు.

శంకరుఁడు బిక్షుకుడై స్వయముగా యాచించినందున నీవు కుమార్తె నొసగి ధన్యుడవు కానున్నావనియు పర్వతాధిపత్యమునకు సరియగునట్లు ప్రవర్తించుచున్నావనియు సప్తర్షులు వచించి "సుఖప్రదురాల వగుదువు గాక" అని గిరిజ నాశీర్వదించియు తమ కోమల హస్తముల నామెను స్పృశించియు "శీఘ్రమేవ కల్యాణప్రాప్తిరస్తు" అని మరియొక తడవ దీవించియు శుక్లపక్షమునందలి చంద్రునివలె నీ మంచి గుణములన్నియు పెంపొందుగాక యని సంభాషించి పుష్పములను ఫలములను పార్వతీదేవికి సమర్పించి నిశ్చయతాంబూలము నొనర్చిరి. మరియొకదెస నరుంధతి - శివుని ఔదార్యాదిసద్గుణముల నభివర్ణించుచు మేనకాదేవిని మెప్పించినదయ్యెను. మరియు పసుపుకుంకుమ నొసగినది.

అంత సప్తర్షులు సంతుష్టాంతరంగులై యటనుండి బయలుదేరి కైలాసమునకుఁజని శివుని దర్శించి నమస్కరించియు నానావిధస్తోత్రములఁ బ్రార్థించియు "మహాదేవా! పరమేశ్వరా! మేనకాహిమవంతులకు ననేకవిధముల నుపదేశింపగా నవ్వారు గత సంశయులై పార్వతీదేవిని తమ కిత్తుమని వాగ్దానముఁ గావించినారు. ఇఁక ప్రమథగణములతోడను బృందారకుల తోడను వివాహమునకై వెళ్ళుము! విధివిహితముగా పార్వతిని పరిగ్రహింపుము!" అని వచింప మహేశ్వరుఁడు సంతసించి "ఋషులారా? వివాహవిధానమెట్టిదో మీరే నిర్దేశింపవలె" నని నుడువగా నవ్వారు "దేవదేవా! నారాయణుని హిరణ్యగర్భుని మహేంద్రుని సమస్త దేవతలను రప్పించుము! సిద్ధులు, విద్యాధరులు, నప్సరోగణములు యక్షులు గంధర్వులు కిన్నరులు నందరు నేతెంచి నీ వివాహకార్యమును సాధింతురు" అని వచించి శంకరుని యానతిఁ బడసియు శివుని ప్రభావమును ప్రశంసించుచు తమనివాసములకు నేగినవారు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో షట్త్రింశాధ్యాయము.





# సప్తత్రింశాధ్యాయము

## (లగ్నపత్రికను పంపుట, సామాగ్రీసంగ్రహాదికములున్ను)

సప్తర్షుల నరుంధతితో గూడ వెళ్ళిన తరువాత హిమవంతుఁడు జ్యేష్ఠులగు మేర్వాదులతో సంప్రదించి గాంభీర్యముగలవాడైనను మిగుల సంతసించుచుండెను. మరియు నవ్వారి యనుమతిని తన పురోహితుఁడగు గర్గాచార్యునితో లగ్నపత్రికను వ్రాయించి పలురకములగు పెండ్లి సామానులతో గూడ నంపగా వారియులు శివసన్నిధానమునకు వెడలి శుభపత్రికను సామగ్రితో సమర్పించి శంకరునకు తిలకమునిడిరి. అంత సర్వేశ్వరుఁడు వారిని యథోచితముగా సత్కరించిన పిదప సంతసించినవారై హిమవద్గృహమునకు నేతెంచిరి. శివసంభావితమై తన పరిజనమును గాంచి హిమవంతుఁడు మిగుల సంతృప్తి ఁజెంది నానావిధ ప్రదేశములనుండు తన బంధువులకు నాహ్వానము పంపుచుండెను. వివాహమునకు వలయు ధాన్యములను వస్తువులను సేకరింపఁజేయుచుండినవాడు. బియ్యపురాసులనేకములుగను, పృథుకములు (అటుకులు) మెండుగాను, బెల్లము, పంచదార, లవణము, పాలు, నెయ్యి, పెరుగు అను వానిని భావుల నిండుగాను, గోధుమపిండియు, లడ్డుకములు, చక్కిలములు, చదుకములు, చక్కెరవస్తువులు అమృతముఁబోలు చెరుకురసంబు ననువాని కూపములను గావించెను.

సద్యస్కాలఘృతములను వివిధమధురపానీయములను నానావిధపక్వాన్నములను మిక్కిలి రుచిగల పలురకములగు వ్యంజనములను గణములకు నమరులకును ప్రియములగు వస్త్రాభరణములను మణిరత్నములను సువర్ణరజతమయ పాత్రములను తదితర ఆవశ్యక వస్తువుల నన్నిటిని సమకూర్చి యొకానొక శుభదినమున పర్వతాంగనలచే నలంకరింపఁబడిన పార్వతీదేవికి మంగళముఁదగు సంస్కారమును (అనఁగా పెండ్లికూతురుఁదగు ప్రబంధమును) గావింపఁజేసెను.

పట్టణము నందలి విప్రసువాసినులు తామలంకరించుకొని గిరి కన్యక ననేక భూషణములతో నలంకరించిరి.

అనూచానమగు లోకాచారము ననుసరించి పర్వతేంద్రుఁడు కౌతుకము నంతయు నొనర్చి సంతుష్టుడగుచుండెను. బాంధవుల రాకకై నిరీక్షించుచుండగా నొక్కొక్కరు వచ్చుచుండిరి.

దేవాలయమను పర్వతము అనఁగా మేరువు దివ్యరూపముఁదాల్చి రత్నాలంకృతమగు పరిజనము తోడను కళత్రపుత్రాదికముతోడను నానావిధమణి మహారత్నసారంబులఁగైకొని హిమాలయమున కేతెంచెను. ఇటులే మందరగిరియు అస్తాచలంబును ఉదయాద్రియు మలయపర్వతంబు దర్దురాద్రియు నిషధ పర్వతంబును గంధమాదనంబును కరవీరంబును మహేంద్రపర్వతంబును పారియాత్రంబును క్రౌంచ పర్వతంబును పురుషోత్తమశైలంబును నీలాద్రియు త్రికూటచిత్రకూటవెంకట శ్రీ గిరులును గోకాముఖంబును నారదపర్వతంబును వింధ్యనగంబును కాలంజరంబును కైలాసమను పర్వతరాజంబు తదితర ద్వీపములందుండెడు నగంబులును దివ్యరూపధారులై తమ తమ కళత్రపుత్రాది పరివారముతోడను మణిరత్న సువర్ణాద్యుపహారములతోడను హిమవంతుని దివ్యభవనమునకు రాజొచ్చిరి.

గౌరీశంకరుల వివాహమంగళమునకై సమాహుతులందరు నేతెంచుచుండిరి. శోణము భద్రము మున్నగు నదంబులును గోదావరి, యమున, సరస్వతి, వేణిక, గంగ, నర్మద, ఇత్యాది మహానదులును దివ్యరూపలావణ్యములతో వివిధోపాయనముల వెంటనిడుకొని హిమవత్సన్నిధి నరుదెంచిరి.

ఆగత బాంధవులతో హిమాలయము అందలిరాజధానియు క్రిక్కిరిసి యుండెను. పురము నందెచ్చోటఁ గాంచినను మహోత్సవముగా నుండెను. రాజవీధియందు తోరణములు ధ్వజములు నమర్పఁ బడియుండెను. మధ్య మధ్య మంటపములకు మేలికట్టులు కట్టఁబడియుండెను.

హిమవంతుఁడును బంధువులందరికిని వలయు వసతుల నేర్పరచి సముచిత సత్కారము నొనర్చుచు వారివారికి వలయు ఆహారపానీయముల నొసగి సంతసింపఁజేయుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ముప్పదియేడవ యధ్యాయము.

## అష్టత్రింశాధ్యాయము

### (వివాహ మంటప రచనము వర్ణించుట)

పర్వతాధిపతియగు హిమవంతుఁడు ఆనందపరిపూర్ణుడై తన నగరమునంతయు శోభాయమాన మొనర్చెను. ఘంటాపథములన్నియు పన్నీరుతో చల్లఁబడినవి. ప్రతిద్వారము నందును అరటిస్తంభములు కట్టఁబడియుండెను. ముంగిళ్లయందు పట్టుదారములకు మామిడి యిగురులు తగిలింపఁబడినవి. నలుదిశలయందు జాజిపువ్వులమాలికల తోరణము లమర్పఁబడియుండెను. గర్గమహాముని యనుమతిని పురమును ప్రస్తావయోగ్యముగా మంగళమయంబొనర్చెను.

విశ్వకర్మను రప్పించి పదివేలయోజనముల వెడల్పునునిడివియుగల మండపమును రచింపఁజేసెను. అందు సుఖోపవేశమునకై స్ఫటికమయములగు వేదికలును పలుతెఱఁగుల నాశ్చర్యదృశ్యములను స్థిరములు చరములు నగు మనోహర వస్తువులును నిర్మింపఁబడియుండెను. మరియు నందు స్థలమెద్దియో తెలియరాకుండెను. ఒకానొకచో కృత్రిమ సింహములు ప్రత్యక్షసింహములవలె కన్పట్టుచుండెను.

మరియొకచో బెగ్గురు పక్షుల వరుసలును ఇంకొకదెస నెమిళ్ళును. అన్యత్ర పురుషులతో సరసముగా నాట్యమాడుచున్న రమణులును మరియొకచో మనోహరరూపముగల ద్వారపాలురు ధనుర్ధారులుగను నెలకొలుపఁబడియుండెను. కృత్రిమ విగ్రహముగల మహాలక్ష్మీదేవి - ప్రత్యక్షలక్ష్మివలె సర్వలక్షణసంపన్నయై ద్వారమున విరాజిల్లుచుండెను. అలంకరింపఁబడిన మత్తగజంబులుమావటివారితో నొకవంకను, మంచి గుఱ్ఱములు మరియొకవంకను, సారథులతో కూడిన రథంబులును నానావిధవాహనంబు లొకవంక నమర్పఁబడియుండెను. మరియొకవంకను సైనికభటులు కాలినడకగలవారిఁబోలినవారై యుద్ధసన్నద్ధుల వలె కన్పట్టుచుండిరి. వివాహమండపమునఁ బ్రవేశించు నమరులను మునులను మోహింపఁజేయుటకే విధముగా నిండు వేడుకతో విశ్వకర్మ - తన నైపుణ్యము నంతయు ప్రదర్శించుచుండెను. మహాద్వారమున





నందికేశ్వరుఁడు శుద్ధస్ఫటికవిగ్రహముతో విరాజిల్లుచుండెను. రత్నాలంకృతము చామరములు పల్లవములు అనువానితో ప్రకాశించునదియు నగు విమానము (గోపురము) మహాద్వారముపై నిర్మింపఁబడి యుండెను.

మహాద్వారపునెడమభాగమున నాలుగుదంతములు కలిగినట్టియు అరువదివత్సరముల ప్రాయము కలిగినట్టియు సంతోషముతో విఱ్ఱవీగు గజములు రెండు నమర్పఁబడియుండెను. కుడిభాగమున సూర్యకాంతివంటి కాంతిగల నశ్వరాజములు రెండు నిర్మింపఁబడియుండెను. అట్టి మండపమున నభేద్యకవచములు రత్నాలంకారములును గల బృందారకులను యథార్థరూపులుగా విశ్వకర్మ నెలకొలిపెను. భృగుమహర్షి మొదలగు తపోధనులును సిద్ధులు నుపదేవతలును స్థాపింపఁబడియుండిరి. నారాయణుఁడు శంఖచక్రగదాదులతోడను పార్షదుల తోడను సాక్షాత్ వైకుంఠనివాసివలె నమర్పఁబడినవాడు. సనకసనందనాది మానసపుత్రులతోడను ఋగాది వేదములతోడను బ్రహ్మదేవుఁడు వేదసూక్తములను పఠించునట్లు నగుపడుచుండెను. దేవేంద్రుడు ఐరావతగజము నధిష్ఠించి పరిపూర్ణచంద్రుని వలె ప్రకాశించు స్వరూపముతో నుండినవాడు. వేయేల? హిమవంతుఁడు చెప్పినవిధముగా విశ్వకర్మ - స్వర్గమర్త్య పాతాళాత్మక బ్రహ్మాండములోని ముఖ్యమనోహర దృశ్యములనన్నిటి నా మండపమున రచించిన వాడని చెప్పవచ్చును.

ఇంక నమరులు మున్నగువారు నివసింప వలయు లోకములను భవనములను నిర్మించెను. అటులే వివాహసమయమున ప్రేక్షకు లాసీనులగుటకు గొప్ప విలువగల సమున్నత పీఠములను బ్రహ్మదేవుఁడు నివసింప యోగ్యమగు స్థానమును విష్ణుమూర్తి విశ్రమింపఁదగు నానావిధ ఆశ్చర్యములతో కూడిన నిలయమును సర్వ విధ ఐశ్వర్యముల నిండియుండు దేవేంద్రుని యాస్థానమును సుందరములైన లోక పాలుర భవనములను మరియు తదితర అద్భుతముల నన్నిటిని విశ్వకర్మ శివానుగ్రహ సంపన్నుడై శివ ప్రీత్యర్థము కల్పించినవాడు.

అటులే చిత్ర విచిత్రంబును గొప్ప ప్రకాశము గలదియు దేవ దానవ మానవులచే పూజింపఁబడునదియు శంకరుఁడు నివసించునదియు శివలోక మధ్య వర్తియునగు శివ సదనమును మనోహరముగా కల్పించెను.

ఇవ్విధము అపూర్వ అద్భుత దృశ్యములతో పెండ్లి పందిరిని విశ్వకర్మ రచింపగా పర్వతరాజు పరిశీలించి మహేశ్వరుని రాకకై నిరీక్షించుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ముప్పది యెనిమిదవ యధ్యాయము.

# ఏకోన చత్వారింశాధ్యాయము

## (వివాహమునకు నమరుల నాహ్వానించి శివుఁడు చవ్వారితో బయలుదేరుట)

సూతుఁడు చెప్పఁదొడఁగెను.

చంద్రశేఖరుని కల్యాణ వృత్తాంతము భక్తుల పాపపుంజములఁబోనాడు నదై సౌమంగళ్యము నొదవఁ జేయును.

హిమవంతుఁడు పంపిన శుభ పత్రికను స్వీకరించి పత్రికఁ దెచ్చిన వారిని సత్కరించియు మహాదేవుఁడు నిండు సంతసమున నట్టహాసముఁజేసియు పెండ్లి పత్రికను బాగుగా చదువుకొనెను.

అట్టి తఱి మునులు తాము సమర్పించిన పత్రికను పరాత్పరుఁడు పరిగ్రహించి వివాహము నంగీకరించినందున తమ భాగ్యమును మెచ్చుకొనుచు నిజనివాసములకుఁ జనినవారు.

అంత శివుఁడు స్మరింపగా నారదుఁడేతెంచి ప్రణమిల్లి కర్తవ్యము నాదేశింపుమని ప్రార్థింపగా శంకరుఁడిట్లు మాటలాడెను.

నారదా! నా భక్తులలో శ్రేష్ఠుడవని భావించి చెప్పుచున్నాను. వినుము! పార్వతీదేవి నీయుపదేశమును పొంది నన్ను భర్తగా బడయవలెనని తపించిన యంశము నీకు తెలిసినదే గదా! ఆమెకు నేను ప్రసన్నుడనై వరమొసగితిని. భక్తికి వశుడనై సప్తర్షులచే లగ్న సుముహూర్తమును కూడ నిర్ణయింపఁజేసితిని. లౌకిక రీతి ననుసరించి వివాహమహోత్సవము నాచరింపఁజేయుదును. ఈవేళటి నుండి యేడవదినముననే సుముహూర్తము.

పరమాత్మా! శంకరా! భక్తులకు వశుడ వగుటయే నీ వ్రతముగదా! పార్వతీదేవిఁదగు మనోఽభీష్టమును నెరవేర్చుట కడుంగడు ప్రశంసింపఁదగినది. నన్ను సేవకునిగా భావించి యీ కార్యమునందు నియమించుము! అని నారదుఁడు ప్రార్థింప భక్తవత్సలుడు "నారాయణుఁడు మున్నగు నమరులను మునులను సిద్ధుల నందరిని వివాహమునకై నామాటగా నాహ్వానింపుము! ఆహూతులందరును సముత్సాహ సంపన్నులై కళత్రపుత్రాది పరివారముతో కూడినవారై వత్తురుగాత! నా వివాహమునకు రానివారు దేవతలైనను తదితరులైనను నావారు కారని భావింతును" అని సంభాషింపగా నారదమహర్షి - వైకుంఠాది లోకములకు నరిగి సర్వజనుల నాహ్వానించెను. తరువాత శివ సన్నిధి నేతెంచి స్వకృతమును నివేదించియు మిన్నకుండెను.

అట్టి తఱి ప్రమథగణము లానంద తాండవము నొనర్చుచుండ విష్ణ్వాదిదేవతల యాగమనమును నిరీక్షించుచు భగవానుఁడు నుత్కంఠతో నుండినవాడు.

ఇంతలో వైకుంఠుడు అనేక భూషణభూషితుడై లక్ష్మీదేవి సమేతుడై పరివారము తోడ కైలాసమునకు నరుదెంచి సద్భక్తిని సర్వేశ్వరునకు మ్రొక్కులిడి శివానుమతిని యొకానొక సమున్నత స్థానమున నుపవిష్టుండయ్యెను. బ్రహ్మదేవుఁడును సరస్వత్యాది స్వజనమును వెంట నిడుకొని సంతసమున నేతెంచి





నమస్కరించియు సముచిత స్థలమున నుండెను. దేవేంద్రాద్యమరులును కళత్ర పుత్రాది పరివార సమేతముగా కైలాసమునకు వచ్చినవారు. మునులు నాగ దేవతలు సిద్ధులు తదితరులును శివ కల్యాణ దర్శన కుతూహలమున రజతాద్రిఁ జేరినవారు.

ఆ సంతోష సమయమున భవుఁడు వచ్చిన వారందరికిని వేరువేరుగా వసతులను చూపెట్టి యథోచితముగా సత్కరింపఁజేయుచుండెను. కైలాసము నందెచ్చోటఁ గాంచినను గొప్ప వేడుకగా నుండెను. అప్సరసలు నాట్యమాడుచుండిరి. కిన్నర కింపురుష గంధర్వాదులు దివ్యమధుర శివయశోగానముఁ జేయుచుండిరి. అట్టి తతి శివుని వివాహ ప్రయాణ సన్నాహములను చేయించుటకు విష్ణ్వాదిదేవతలు సిద్ధపడుచుండిరి. శివాజ్ఞ ననుసరించి యందరును స్వకార్యముగా భావించి శివుని పరిచర్యలో నిమగ్నులగుచుండిరి. సప్త మాతృకలు సంతోషస్వాంతమున శివు నలంకరింపఁబూనగా నాతడు స్వాభావికముగానే విభూషితుండయ్యెను. కిరీటమున దేవేంద్ర సంపదయంతయు తారసిల్లెను. మూడవ కన్ను లలాటమున సుందరమైన తిలకమయ్యెను. పూర్వము చెవులఁదాల్చిన సర్పములే మణిరత్న ఖచితములగు కుండలములయ్యెను. తదితర అవయవములపై గల సర్పములు ఆ యా ఆభరణములయ్యెను. విభూతి పరిమళముగల అంగలేపనముగాను ఏనుగతోలు దివ్యమైన పట్టు ధోవతిగాను మారినవి. ఇవ్విధము పరమేశ్వరునకు నతిలోక సుందరమగు స్వరూప మేర్పడగా దేవర్షులు సురలు దానవులు నాగులు నప్పరసలు మహర్షులు, నేతెంచి శివసన్నిధానమున నుత్సాహ మతిశయింప "మహాదేవా! పార్వతీపాణిగ్రహణమునకై బయలుదేరుము!" యని యొక్కుమ్మడిగా ప్రార్థించిరి మరియు విజ్ఞానఘనుడగు నారాయణుఁడు ముందుకువచ్చి ప్రణమిల్లి ప్రస్తావ సదృశంబగు వాక్యము నుచ్చరించెను.

శరణాగతవత్సలా! శంకరా! భక్తుల కార్యముల నొనఁగూర్చువాడవు. నా మనవి నాలకింపుము! నీ వివాహమును వైదిక విధానమున చేయించుకొనుము! వైదిక విధానమును నీవు నవలంబించినచో లోకమున నద్దియే ప్రచారితంబగును. మండప స్థాపనము నాందీముఖము మొదలగు పద్ధతిని మాయందలి కరుణతో గావింపఁజేసి గౌరీశంకర కల్యాణముఁ దగు ప్రఖ్యాతిని కలుగఁజేయుము!

శంకరుఁడటులే విష్ణువాక్యము నంగీకరించి వైదిక లౌకికాచార పరుండయ్యెను. అప్పుడు బ్రహ్మదేవుఁడు నభ్యుదయ కర్మనంతయు చేయించుచుండెను.

కశ్యపుఁడు, అత్రి, వసిష్ఠుఁడు, గౌతముఁడు, భాగురి, గురువు, కణ్వుఁడు, బృహస్పతి, శక్తియు, జమదగ్ని, పరాశరుఁడు, మార్కండేయుఁడు, శిలాపాకుఁడు, అరుణపాలుడు, అగస్త్యుడు, చ్యవనుడు, గర్గుడు, శిలాదుఁడు, దధీచి, ఉపమన్యుడు, భరద్వాజుఁడు, పిప్పలాదుఁడు, కుశికుఁడు, కౌత్సుఁడు, వేదవ్యాసుఁడు మున్నగు మహర్షులు తమ తమ శిష్యాది పరివారముతో గూడ నేతెంచి చతుర్ముఖుని నిర్దేశానుసారముగా వివాహారంభప్రక్రియను ప్రవర్తింపఁజేయుచుండిరి.

వేదవేదాంగ పారగులగు నవ్వారు, వివాహ కౌతుకముఁదగు రక్షను మహేశ్వరునకు వేదోక్త విధానముగా గావించిరి. ఋగ్యజుః సామవేదములందలి మంగళసూక్తములను పఠించుచుండిరి. నవగ్రహములను మండలదేవతలను విఘ్నశాంతికై పూజింపఁజేసిరి. ఆ సమయమున శివుఁడు లౌకికాచారమును పాటించుచు వేదమూర్తులకు కృతజ్ఞతా సూచకంబగు ప్రణామం బొనర్పవలసివచ్చెను.





బ్రాహ్మణులను దేవతలను ముందు నిడుకొని శంకరుఁడు కైలాసమునుండి బయలుదేరినవాఁడు, కైలాసమునుండి యవతరించి సంతోషస్వాంతుఁడై యటకొంతతడవు విశ్రమించి లోకత్రయ నివాసులు సమర్పించు కానుకలను స్వీకరించెను. అట్టి తఱి శివసంతోషార్థము నానావిధ మంగళ వాద్యములు మ్రోగింపఁబడుచుండెను. శివయశో గర్భితములగు సంగీతములు పాడఁబడుచుండెను. మనోహర నాట్యములు చేయఁబడుచుండెను.

శివానందమునకు సురల సముత్సాహమునకు మహర్షుల సమాధానమునకు దైత్యుల కోలాహలమునకు కిన్నరకింపురుషాదుల సందడికి అప్సరసల కుతూహలమునకు ప్రమథుల విచిత్ర తాండవమునకు నందిభృంగ్యాది భక్తుల సంతోషాతిశయమునకు మేరలేకుండెను. ఆ దృశ్యము వర్ణనాతీతముగా నుండెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ముప్పది తొమ్మిదవ యధ్యాయము.**

## చత్వారింశాధ్యాయము

### (శివుని వివాహ ప్రయాణమును వర్ణించుట)

అటుపిమ్మట పరమేశ్వరుఁడు – నందికేశ్వరుఁడు మున్నగు ప్రమథ గణములను పిలిచి బయలుదేర నాజ్ఞాపించెను. మరియు గణములలో కొందరిని కైలాసము నుండుడని యాదేశింపగా మరికొందరు తమ తమ పరివారమును వెంట నిడుకొని బయలుదేరుచుండిరి.

శంఖకర్ణుఁడు కోటి గణములతోడను, కేకరాక్షుఁడు పదికోట్ల గణములతోడను, వికృతుఁడు నెనిమిది కోట్ల గణములతోడను విశాఖుఁడు నాలుగుకోట్ల గణములతోడను, పారిజాతుఁడు తొమ్మిదికోట్ల గణములతోడను సర్వాంతకుఁడు వికృతాననుఁడును నరువదినరువది కోట్లగణములతోడను దుందుభుఁడు అష్టకోటి గణములతోడను కపాలుఁడు నైదుకోట్ల గణములతోడను సందారకుడు ఆరుకోట్ల గణములతోడను కందుకుఁడు కుండకుఁడును కోటి కోటి గణములతోడను విష్టంభుఁడు నెనిమిది కోట్ల గణములతోడను పిప్పలుఁడు సనాదకుడును వేయి వేయికోట్ల గణములతోడను అవేశనుఁడు నెనిమిదికోట్ల గణములతోడను మహాకేశుఁడు వేయికోట్ల గణములతోడను కుండుడు పర్వతకుఁడును పండ్రెండు పండ్రెండు కోట్ల గణములతోడను చంద్రతాపనుఁడు నెనిమిదికోట్ల గణములతోడను కాలుడు, కాలకుఁడు, మహాకాలుఁడు, అగ్నికుఁడును నూరు నూరు కోట్ల గణములతోడను అగ్నిముఖుడు ఆదిత్య మూర్ధుఁడు ధనావహుఁడును కోటికోటి గణములతోడను సన్నాహుఁడు కుముదుఁడు ఆమోఘుఁడు కోకిలుఁడును వంద వంద కోట్ల గణములతోడను సుమంత్రుఁడు కోటి గణములతోడను కాకపాదోదరుఁ డు సంతానకుఁడు నరువది యరువదికోట్ల గణములతోడను మహాబలుఁడు మధుపింగుఁడు కోకిలుఁ డును తొమ్మిది తొమ్మిది కోట్ల గణములతోడను నీలుఁడు పూర్ణభద్రుఁడును తొంబది తొంబది కోట్ల గణములతోడను చతుర్వక్త్రుఁడు నేడుకోట్ల గణములతోడను కరణుడు నిరువదికోట్ల గణములతోడను





అహిరోమకుఁడు యజ్వాక్షుఁడు శతమన్యువు మేఘమన్యువు తొంబది తొంబదికోట్ల గణములతోడను కాష్ఠగూడుఁడు విరూపాక్షుఁడు సుకేశుఁడు వృషభుఁడు సనాతనుఁడు తాలకేతువు షడాస్యుఁడు చంచ్వాస్యుఁడు సంవర్తకుఁడు చైత్రుఁడు, స్వయంప్రభువు, లకులీశుఁడు, లోకాంతకుఁడు, దీప్తాత్మ్యుఁడు, దైత్యాంతకుఁడు, భృంగిరిటియు, దేవదేవప్రియుఁడు, అశనియు భానుకుఁడుననువారునొక్కొక్కరు నరువదినాలుగు కోట్ల గణములతోడను తదితర ప్రమథులు మూడుమూడుకోట్ల గణములతోడను వీరభద్రుఁడు నరువది నాలుగుకోట్ల గణములతోడను గౌరీశంకరుల వివాహమునకై హిమాలయమునకు పయనమగుచుండిరి.

ఇవ్విధము నిరువదిలక్షలకోట్ల ప్రమథగణములతో నందికేశ్వరాదులు ప్రయాణపరులైనారని తెలియవలెను.

క్షేత్రపాలుఁడు భైరవుఁడును తమ తమ గణములతో నరుదెంచి శివవివాహ యానములో పాలుగొనిరి. వీరు నితరులు నగు నసంఖ్యాకులైన గణేశ్వరులు నేతెంచినవారు.

అందరును వేయిచేతులుగలవారై జటామకుటధారులుగను చంద్రశేఖరులుగను నీలకంఠులుగను త్రిలోచనులుగను రుద్రాక్ష భస్మధారులుగను హారకుండలా ద్యలంకారములు గలవారుగను బ్రహ్మవిష్ణుదేవేంద్ర సమానులుగను అణిమాదిసంపన్నులుగను సూర్యకోటి ప్రకాశము గలవారుగను కన్పట్టుచుండిరి. కొందరు భూమిపై సంచరించువారు, మరికొందరు పాతాళమున వసించువారు, ఇంక కొందరు ఆకాశమున విహరించువారు, మరి కొందరు సప్తస్వర్గములఁదిరుగాడు వారునైయుండిరి. వేయేల? శంకరుని కింకరులందరును లోకములన్నిటినుండి శివ వివాహమునకై వచ్చినారని చెప్పవచ్చును.

శంకరుఁడివ్విధము బృందారకాది గణముల వెంటనిడుకొని తన వివాహమునకై హిమవంతునింటికి బయలుదేరునపుడు నాతని తోబుట్టువగు చండికాదేవి ప్రేతాసనముతోడను సర్పాలంకారములతోడ నరుదెంచెను. అమె తన శిరముపై బంగారుచెంబు నుంచినదై యట్టహాసమున నొరులకు భయముఁ గొలుపుచు కోట్లకొలది భూతగణములు వెంటాడుచుండ రుద్రగణముల ముందుకు నేగి ప్రకాశించుచుండెను.

అట్టితఱి డమరునాదములతో ముల్లోకములు నిండుటయే గాక భేరీఝంకారములును శంఖధ్వానంబులును దుందుభినిర్ఘోషంబులు నశుభములను పారద్రోలుచు జగన్మంగళము నొనఁ గూర్చుచుండెను. ప్రమథగణముల వెనుక నమరులు లోకపాలురు సిద్ధులును సముత్సుకులై చనుచుండిరి.

లక్ష్మీపతి యవ్వారినడుమ గరుడవాహనముపై నధిష్ఠించి శోభించుచుండెను. అతనికి నిరువైపుల చామరములను పైన ఛత్రమును పార్షదులు పట్టియుండిరి. అటులే పంకజాసనుఁడును వేదములు పురాణములును మూర్తిమంతములై గొలుచుచుండ సనకాది మహామునులతో బయలుదేరి విరాజిల్లు చుండెను. దేవేంద్రుఁడు నైరావత గజము నధిష్ఠించి నానావిధభూషణములఁదాల్చి మార్గమున వెళ్లుచుండెను. ఋషులు పెక్కురు శివకల్యాణార్థమైకడు వేడుకతో చనుచుండిరి. శాకినీశక్తులు, యాతుధానులు, వేతాళులు బ్రహ్మరాక్షసులు, భూతప్రేత పిశాచంబులును నడచుచుండెను. తుంబురువు, నారదుఁడును హాహా హూహూ మున్నగు గంధర్వులును కిన్నరులును తమ తమ మంగళవాద్యములను మ్రోగించుచు పోవుచుండిరి.

జగన్మాతలందరును, దేవతాకన్యలు, గాయత్రీ సావిత్రీ దేవులు, లక్ష్మీదేవియు, తదితర సురనారీ మణులును శంకరుని వివాహమున పాలుగొనఁజనుచుండిరి. ఆ పిమ్మట శంకరుఁడు - దేవర్షులు సేవించుచుండగా వేదశాస్త్రములచే ధర్మముగా చెప్పఁబడు శుద్ధస్ఫటిక సన్నిభమైన వృషభముపై నెక్కి బయలుదేరుచు నలరారుచుండెను.

ఇట్టి యపూర్వదృశ్యముతో శివుఁడు గిరిజాపాణిగ్రహణమునకై హిమాలయమునకు వెళ్లుచుండగా లోకమంతయు పరమానందమయంబుగా నుండెను.

*ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నలుబదియవ యధ్యాయము.*

## ఏకచత్వారింశాధ్యాయము

### (వివాహమంటపమును గురించి చర్చించుట)

అట్టితతి శంకరు ననుమతిని నారాయణుఁడు మొదట నారదమహర్షిని పంపగా నాతడు శివప్రణామ పూర్వకముగా బయలుదేరి హిమవంతుని నగరమునకు చేరగానే పెండ్లి పందిరిని కృత్రిమముగా రచింపఁబడిన తన మూర్తిఁజూచినవాడై చకితుఁడయ్యెను. విశ్వకర్మ గావించిన రచనాచాతుర్యమును మాటిమాటికి గాంచుచు నివ్వెరపోవుచు నిట్లు ప్రశ్నించెను.

నగాధిరాజా! విష్ణు ప్రభృతులైన దేవతలు నుపదేవతలు సిద్ధులును నందికేశ్వరు నధిష్ఠించి ప్రమథగణముల వెంటనిడుకొని శంకరుఁడును నీ వివాహమంటపమునకు వచ్చినారా?

అంత హిమవంతుఁడు "నారదా! శివుఁడు నమరులు ప్రమథులు నింకను రానులేదు. ఇది యంతయు విశ్వకర్మ నిర్మాణంబని గ్రహించి విస్మయమును విసర్జించుము! స్వస్థచిత్తుడవై శివుని స్మరింపుము! భుజించి కొంతతడవు విశ్రమించియు మైనాకుఁడు మొదలగువారిని వెంటనిడుకొని శంకరు నెదుర్కొనుటకు వెళ్లుము! సురాసురులచే పూజింపఁబడు పాదపద్మములుగల మహాదేవుని సపరివారముగా తోడ్కొని రమ్ము!"

అని హిమవంతుఁడు వచింప నారదుఁడటులే బయలుదేరి శంకరుని చెంతకేగి తన పరివారముతో గూడ నమస్కరింపగా బ్రహ్మాదులు "నారదా! ఆశ్చర్యము నందుచున్నట్లు కనఁబడుచున్నావు! కారణంబేమి" యని యడుగగా నారదుఁడు నారాయణుఁడు బ్రహ్మదేవుఁడు దేవేంద్రుఁడు నను ముగ్గురి నేకాంతమున పిలుచుకొని యిట్లు వక్కాణించెను.

విశ్వకర్మ - హిమవన్నగరమున వివాహమండపమునందు నమరులను మోహింపఁజేయుటకై విచిత్రమగు నిర్మాణమును చేసినవాడు. దేవేంద్రా! పూర్వము విశ్వకర్మను మోహింపఁజేయుటకు నీవు గావించిన యేర్పాటునకు బదులుగా నిన్ను జయింపవలెనని యా విధము నిర్మించియుండును.





నా రూపమును నేను చూచియే విస్మితుడనైతిని. అటులే నారాయణుని బ్రహ్మదేవుని దేవేంద్రుని విగ్రహములనుగాంచి మీరేనాకన్న ముందచ్చోటనున్నారని భావించితిని. విశ్వకర్మ – తన మాయాబలము నంతయు బృందారకుల నవమానించుటకే యొనర్చినవాడని తోచెడిని.

అంత శచీపతి భయగ్రస్తుడై నారాయణునితో "విశ్వకర్మ – పుత్రశోక సంతప్తుడై యున్నవాడు గావున నీ సమయమున నేదేనొక నిమిత్తమున నన్ను సంహరించు" నని వచింపగా విష్ణువు మందస్మితముఁ జేయుచు ఇంద్రు నూఱడించుచు "ఇంద్రా! నివాతకవచులు అను రాక్షసులు నిన్ను పూర్వము మోహింపఁ జేసియుండిరి. అదియునుఁగాక పర్వతముల రెక్కలను వజ్రాయుధముతో ద్రుంచితివి గదా! అందువలన పర్వతములన్నియు నీ పైన పగ సాధించునో ఏమో; ఐనను వెఱగందవలసిన యవసరములేదు.

భక్తవత్సలుఁడగు శంకరుఁడు మనను కాపాడువాడు" అని వక్కాణించుచుండగా శంకరుఁడు సమీపించినందున "నారాయణా! దేవేంద్రా! మీలో మీరేమేమో మాటలాడుచున్నవారు; ఏమిటి" అని ప్రశ్నింపగా కమలాక్షుఁడు జరిగిన యుదంతమును నిటలాక్షునకు విన్నవింపగా నాతఁడు "నారదా! హిమవంతుఁడు పలుకుచున్న దేమిటి? వృత్తాంతమునంతయు దాచకుండా వివరింపు" మని యాదేశించెను. అంత నారదుఁడు శంకరునకు రహస్యముగా నంతయు విశ్వకర్మ నైపుణ్యమును వివరించుచు వివాహమునకు ఎట్టి విఘ్నము లేదనియు హిమవంతుఁడు కన్యాదానమును తమకు త్రికరణశుద్ధిగా గావింప సమకట్టి మైనాకాదులను మిమ్మెదుర్కొనుటకు పంపినాడనియు హిమవంతునిచే ప్రేరేపింపఁబడి విశ్వకర్మ – బ్రహ్మవిష్ణుదేవేంద్రాది సమూహమునంతయు ప్రతిరూపములతో నిర్మించినందున నేనును విమోహితుడనైతిననియు అందుకే వీరందరు పర్యాలోచన పరులగుచున్నారనియు" నివేదింపగా శంకరుఁడు నొక్కతడవ చిరునగవుఁజెంది కేశవాదులను గురించి యిట్లు వాక్రుచ్చెను.

హిమవంతుఁడు యథార్థముగా నాకు పార్వతిని సమర్పించునెడ తదితర మాయాకృత్యములను పరిశీలింప నవసరమెందులకు? నారాయణా? ఈ నా యాశయము సమంజసమేనా? చెప్పుము! ఏదేనొక యుపాయమున కార్యమును సాధింపవలెనని న్యాయవిదులు చెప్పుదురు గావున మీరందరు నించుకయు సంశయింపక రావలయును.

ఇవ్విధము శంకరుఁడు వచింపగానే విష్ణ్వాదిసురలు తమ భ్రాంతిని తొలగించుకొని హిమవన్నగర ప్రాంతమునకు విచ్చేయగా శివుఁడును వృషభారూఢుడై సముత్సాహ సంభరితుడై శ్వశురగృహము చేరువనుండు ప్రదేశమున కరుదెంచినవాడు.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నలుబదియొకటవ యధ్యాయము.**





# ద్విచత్వారింశాధ్యాయము

## (దేవతలు హిమవంతుఁడు మున్నగువారితో కలియుట)

తన పట్టణము చేరువ నీశ్వరుఁడరుదెంచినాడని విని హిమవంతుఁడు మిగుల సంతసించుచు శంకరుని సత్కరించుటకై వలయు వస్తువుల నిచ్చి బ్రాహ్మణులను శైలముల కొన్నిటి నంపెను. మరియు తన ప్రారబ్ధమును ప్రశంసించుకొనుచు స్వయముగా వెళ్ళినవాడు శంకరుని సన్నిధానమునకుఁజని యచటి యమరుల సమూహమును గాంచి యచ్చెరువు నొందుచుండెను. దేవతలును హిమాచలుని పరివారము నవలోకించి చకితులగుచుండిరి. పర్వతప్రమథ సైన్యములు రెండును పూర్వపశ్చిమ సముద్రములవలె గంభీర దృశ్యములుగా కన్పట్టుచుండెను.

ఇఁక హిమవంతుఁడు ముందున్న పరమేశ్వరుని గాంచి నమస్కరింపగా పర్వతములన్నియు బ్రాహ్మణులును మ్రొక్కులిడిరి. ఆ సమయమున శంకరుఁడు వృషభము నధిష్ఠించియుండెను. ప్రసన్నమైన ముఖము గలిగి యనేకవిధ ఆభరణములఁ దాల్చియుండెను. దివ్యమగు తన శరీరముఁదగు లావణ్యమున దిగంతములను ప్రకాశింపఁజేయుచుండెను. మేలిమి పట్టుధోవతిని ధరించినవాడై రత్నములతో నలరారు కిరీటము గలిగి చిరునగవుతో నగ్నివంటి కాంతిగలవాడై యుండెను. సర్పములాతనికి భూషణములయ్యెను. ఆతని స్వరూపముఁదగు నవయవముల కాంతి యద్భుతముగా నుండెను. దేవేంద్రాద్యష్టదిక్పాలురు శంకరునకు చామరములతో వీచుచుండిరి.

మరియు నప్పుడు నారాయణుఁడు శంకరుని వామభాగము నందును, కమలాసనుఁడు దక్షిణ భాగమునందును దేవేంద్రుఁడు మున్నగువారు పృష్ఠభాగమునందును శివాజ్ఞానిరీక్షకులైయుండిరి.

నిజముగా విచారించినచో పరమేశ్వరునకు గల నిజానందాతిశయమున నీవివాహ సంతోషము లవలేశముగూడ కాదని చెప్పవచ్చును. ఎందుకనగా? శివుఁడు ప్రాకృత గుణములు లేనివాడై సర్వజ్ఞత్వాది దివ్యగుణములు కలవాడనియు భక్తులను కరుణతో నుద్ధరించువానియు ప్రకృతిని పురుషునిగూడ నతిక్రమించి యుండువాడనియు సచ్చిదానంద విగ్రహుఁడనియు శ్రుతిస్మృతీతిహాస పురాణాదులు వేనోళ్ళ చాటుచున్నయవి.

అందువలనపరమాత్మ - తనయానందములో నిద్ది తృటిమాత్రమని గ్రహించియు లౌకికరీతి ననుసరించి యమితోత్సాహ సంతోషములను ప్రదర్శించుచుండెనని మనము గమనింపవలసి యున్నది.

హిమవంతుఁడు బ్రహ్మవిష్ణువులకు నమరులకును వందనములనాచరించి శివునాజ్ఞతో తానుముందు పురమునఁబ్రవేశించినవాడు. అటులే శివుని వెంటాడుచు దేవఋషిముని దానవాదులందరు నోషధిప్రస్థపురములో చొఁబడుచు నగరవైభవమును కనులార గాంచుచు హిమవంతుని సన్నాహములను ప్రశంసించుచుండిరి.

ఒకానొక సమున్నత ప్రదేశమున పెండ్లివారి నందరినునిచి హిమవంతుఁడు వివాహవేదికా మండపము జొచ్చి మరలనొకమారు తనకుమారులను శివునిచెంతకు నంపెను. వారందరును





శివునాహ్వనించి వచ్చి శంకరుడు తదితర అనుయాయులును వచ్చుచున్నారని తెలిపిరి. అంత విష్ణ్వాదులు వేషముల నలంకరించుకొని నగరాజు గృహమువైపు నడచుచుండిరి.

అట్టిసమయమున వరుని చూడదలచి మేనకాదేవి నారదమహర్షిని పిలిపించగా నాతడు శివేచ్ఛావశమున వడిగా మేనకను సమీపింప నామె శంకరుని చూడగోరుచున్నాననియు అతడెట్టివాడో చూపుమనియు నారదుని ప్రార్థించి చంద్రశాలయందు వేచియుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నలుబది రెండవ యధ్యాయము.

## త్రిచత్వారింశాధ్యాయము

### (శివుని యద్భుత లీలావిలాసమును వర్ణించుట)

మేనక యజ్ఞానవశమున శివుడెట్టివాడో యవలోకింపవలెనని యెంచి మదిని గర్వమును పూనియుండెను. అట్టియహంకారమును శివుడు గుర్తెరిగి "మీరుఒక్కొక్కరు వెళ్ళుడు తరువాత నేనువచ్చెద" నని బ్రహ్మావిష్ణ్వాదులకు తెలిపినందున నవ్వారు నటులే యొక్కొక్కరు వివాహస్థలమున కరుదెంచుచుండిరి.

మొదట దేవతాసైన్యమును గాంచి మేనక సంతసించుచుండెను. గంధర్వులు సుందరవేషములతో శుభ్రవస్త్రములను నానావిధ అలంకారములను ధరించిరాగా గంధర్వ పతియగు వసువును చూచి యీతడే శివుడు కావచ్చునని పలికెను. శివుని పరివారము వీరు కాని శివుడు కాదని నారదుడు చెప్పగా వీరిని మించినవాడు ఎట్టివాడో యని మేనక తలపోయుచుండెను.

ఇంతలో యక్షులు తత్పతియగు మణిగ్రీవుడు రాగా నీతడే నాపార్వతికి కాబోవు భర్త కావచ్చుననగా నారదుడు "ఈతడు గూడ శంకరుని కింకరుడే యని వాక్రుచ్చెను.

తరువాత నగ్నిదేవుడు పూర్వాధికశోభతో నరుదెంచగా నీతడే గిరిజాపతి కావచ్చునని మేనక పలుకగా నారదుడు కాదని నుడివెను. పిమ్మట యమధర్మరాజునుగాంచి తన యల్లుడని భావింపగా నారదుడు కాదని తెలిపెను. నిర్ఋతియు వరుణుడును వాయువు కుబేరుడును ఈశానుఁడును దేవేంద్రుడును రాగా వీరందరు పార్వతీపతులు కారనియు శంకరుని సేవకులనియు నారదుడు నివేదించెను.

ఆ తరువాత చంద్రుడు, సూర్యుడు, భృగ్వాది ముని గణంబును బృహస్పతియు రాగా వీరెవరును పేయల్లుండ్రుకారని దేవర్షి విశదీకరించెను. పిమ్మట బ్రహ్మదేవుడు నారాయణుడును వేంచేయగా వీరిలో నొకరు నాకూతురునకు మగడు కావచ్చునని మేనకాదేవినుడువగా "అమ్మా! ఇందు బ్రహ్మదేవుడు సృష్టికర్తయైనను శంకరుని శాసనము నతిక్రమింపకుండువాడు. ఇక నారాయణుడు శివునకు సన్నిహితుడై శివకార్యముల నన్నిటిని నెరవేర్చువాడు కావున వీరుకారనియు శంకరుడు వీరిద్దరినిమించిన సామర్థ్యముగలవాడై నిఖిలబ్రహ్మాండాధి పతియై విరాజిల్లువాడనియు అతని రూపలావణ్యములను వర్ణింప నా తరము కాదనియు నారదుడు పలికెను.

అంత మేనకాదేవి లోలోన మురియుచు తన యల్లుడు లోకోత్తరసుందరుడని మది భావించి తన కూతురుఁదగు సౌభాగ్యమును తమ యదృష్టమును మెచ్చుకొనుచు సంతోషాతిశయమున నుండగా శంకరుడు – నిర్లిప్తుడుగాను, నిర్వికారుడుగాను కనపడుచుండెను.

అంత నారదుడు మేనకను సమీపించి యీతడే గిరిజాపతి యనియు ఈ మహానుభావుని పొందుటకే నీ పుత్రిక ఘోరముగా తపించిన దనియు వచింపగా మేనకాదేవి శంకరునిపై వీక్షణమును ప్రసరింపజేయుచుండెను.

ఇంతలో రుద్రగణములు భూతప్రేతపిశాచములును వికృతవేషములతోడ నరుదెంచగా నారదు డొక్కొక్కరిని వ్రేలితో చూపుచు ఇట్టిపరివారము గలవాడే నీ యల్లుడని శంకరునిగూర్చి ప్రబోధించెను.

ఇట్టి గణములమధ్య పరమేశ్వరుడు – ఐదుముఖముల తోడను మూడుకన్నుల తోడను భస్మత్రిపుండ్రములతోడను జడలు, చంద్రరేఖ, కపాలము, వ్యాఘ్రచర్మము, పినాకము మున్నగువాని తోడను త్రిశూలముతోడను వికృతముగా కన్పట్టుచుండెను. ఈతడే శివుండని నారదుడు వచింపగానే పెనుగాలితో కదిలిఁపబడిన తీగవలె మేనకాదేవి దుఃఖభరమున నేలపై పడి మూర్ఛితురాలయ్యెను.

తరువాత సఖీజనము శీతలోపచారములను చేయగా మేలుకొనినదై దిగువవిధము విలపింపదొడగెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో నలుబది మూడవ యధ్యాయము.**

## చతుశ్చత్వారింశాధ్యాయము

### (మేనకాదేవిని ప్రబోధించుట)

మేనకాదేవి కొంతతడవు విలపించి తన కుమారులను నిందించి కుమార్తె మొదలగువారిని గురించి దురుక్తములను పలుకుచుండెను. నారదా? పార్వతి శివుని వరించునని నీవు మొదట జోస్యముఁ జెప్పితివి. తరువాత శంకరుఁడిటకు వచ్చియున్నపుడు నాతని నారాధింప హిమవంతుఁడు పార్వతిని నియోగించెను. అందుకు నిప్పుడు విపరీతఫలమును గాంచుచుంటిని. ముఖ్యముగా దురభిప్రాయముతో మోసగించితివి కావున నధమురాలనైతిని. పార్వతియు నీ వికృతాకారునికొరకే మునులకు నలవి గాని తపంబొనర్చి చూచువారికిగూడ పరితాపమును కలిగించు ఫలమును పొందవలసివచ్చెను. ఏమి చేయుదును? ఎక్కడికి వెళ్లుదును? ఎవఁడు నా దుఃఖమును బోకార్చును? నా కులము జీవితంబును వ్యర్థములైనవి. సప్తర్షులెటకు నేగిరి వారి మీసములను లేక గడ్డముల నూడఁబెఱుకుదును. అరుంధతియు ధూర్తురాలై స్వయముగా నన్నుఁజేరి యేమేమో బోధించినది. ఇట్లు వీరందరు పొరఁబడుటచే నా సర్వస్వము నశించు సమయ మాసన్నమైనది. మరియు మేనకాదేవి కుమార్తెఁజూచుచు "దుర్మార్గురాలా? మిగుల విరుద్ధంబగు కార్యము నొనర్చితివి. బంగారమునొసగి గాజునుకొనితెచ్చుకుంటివి. శ్రీగంధమును విడనాడి బురదను పూసుకుంటివి. రాజహంసను పరిహరించి కాకిని చేతఁ దాల్చితివి. బ్రహ్మనదము నందలి యుదకమును గ్రోలక కూపజలముఁద్రావితివి. సూర్యభగవానునుపేక్షించి మిడుగురు పురుగును





చేబట్టితివి. బియ్యమునకు బదులు నుముకను గైకొంటివి. సద్యోఘృతమును తొలగించి యాముదమును పరిగ్రహించితివి. సింహమును విడిచి నక్కను దరిఁజేర్చుకుంటివి.

బ్రహ్మవిద్య నాదరింపక కుత్సితవిద్య నవలంబించితివి. గృహమునందలి పవిత్రమైన యజ్ఞభస్మమును స్వీకరింపక నపవిత్రంబగు శ్మశానవిభూతిని పరిగ్రహించితివి.

దేవతాశ్రేష్ఠులైన నారాయణుఁడు మున్నగువారిని వరింపక శివునపేక్షించుటయే గాక అందుకు తపంబుగూడ నొనర్చితివి. నీవు నీ బుద్ధియు, రూపము, చరితంబును వ్యర్థములైనవి. ఇట్టి పనిఁ గడంగుటకై నీకు నుపదేశమును చేసినవాడు నీ సఖురాంఁడును నిన్ను కనిన మేమిరువురము నిందార్హులమైతిమి. కులాచారములనన్నియు మంటఁగలసినవి. కుటుంబము శూన్యప్రాయమైనది. ఇట్టితతి నాకు మరణమే శ్రేయస్కరమని తోచెడిని. గొడ్రాలునైనను గర్భస్రావమైనను బాగుగా నుండెడిది. ఈ వరకే నేను మరణింపలేదెందులకు? పార్వతియైనను జీవింపకుండినచో ఇట్టి సంకటము రాకుండెడిది. అకసమున రాక్షసులు నా పుత్రికను భక్షింపలేదెందులకు? పార్వతీ! నీ తలకాయ ద్రుంచుదునా? హాహా నిన్ను విడచి వెళ్ళుటకు మనస్సొప్పుటలేదు. ఇందువలన నా జీవితము హత మయ్యెనని భావింతును.

ఇవ్విధము మేనకాదేవి తలపోయుచు రోషము దుఃఖము మున్నగు వికారములు నుప్పతిలుచున్నందున భర్తయగుహిమవంతుని సన్నిధినేగక మూర్ఛితురాలయ్యెను. అందువలన వివాహస్థలమున జనులలో హాహాకారము చెలరేగెను. అందరును క్రమముగా మేనకాదేవి చెంత కరుదెంచుచుండిరి. ముందు బ్రహ్మదేవుఁడు రాగా నతనిని నారదుఁడు చూచి మేనకను గూర్చి యిట్లు పలికెను. శివుని సహజ రూపమును గుర్తెరుగకుంటివి. ప్రస్తుతము నీకు కనుపడిన రూపమును శంకరుఁడు వినోదమునకై ధరించినవాడు. కావున నో సాధ్వీ! ఆక్రోశమును హఠాత్కారమును విడనాడి కర్తవ్యతత్పరురాలవై శివునకు సమర్పించుము!

అనవుడు మేనక "దుష్టతాపసా! ఇటనుండి దూరము పొమ్ము!" అని నారదుని గద్దించెను.

ఇట్లుకాగా ఇంద్రాదిదేవతలు సమీపించి "పితృదేవతల మనాసపుత్రి వగు మేనకా! వాస్తవమును చెప్పుచున్నాము. వినుము! ఇతరులకు సుఖము నొదవఁజేయు నీ పరమశివుఁడు నీ పుత్రిక గావించిన యనుష్ఠానమున దయగలవాడై మీకు దర్శనము నిచ్చినవాడు. గాన నీ తరుణమును వృధాగానీయక పార్వతీశంకరుల వివాహమును జరిపించుము! అని ప్రబోధింపగా మేనక మిగుల వగచుచు "అమరులారా! మీరందరు నెందులకిట్లు మాటాడుచున్నారు. ఈ నా కూతురుఁదగురూపమును నామమును వమ్ముఁ జేయవలెననియా మీ యుద్దేశము?" అని బదులు పలికెను.

అంత వసిష్ఠాదిమహర్షులరుదెంచి "గిరిరాజపత్నీ! శుభకార్యమును సాధింప సమకట్టితిమి. ఇట్టి సముచిత కల్యాణకృత్యమున విరోధము ఏర్పడునని యెట్లు శంకింపవలెను? శంకరుని దర్శనమే మహాలాభమని భావింపుము. నీ కన్యను పరిగ్రహించుటకు దానపాత్రుడై యిచ్చోటికి వేంచేసియున్నవాడు." అని వచింపగా ముని వాక్యమును త్రోసిరాజని యత్యంతావేశమున "నా పుత్రికను శస్త్రాదులతో ఛేదింతును గాని శంకరున కీయను. మీరందరును దవ్వునకు (జనుఁడు) నా యొద్దకు రాకుడు" అని మేనక హెచ్చరించెను.

అంత పూర్వాధికముగా జనులలో కోలాహలము చెలరేగుచుండ హిమవంతుఁడు విభ్రాంతుడై మేనకఁజేరి "ప్రియురాలా? నీవిట్లు విలపించుటకు గతంబేమి? మన యింటికి నెంతటివారు వచ్చినారో గమనించకుండా వారినందరిని ధిక్కరించుచున్నావు. అనేక రూపములఁదాల్చు శంకరుని ప్రస్తుతరూపమును గాంచి క్షోభించుచున్నావు. అతడు నిగ్రహానుగ్రహసమర్థుండనియు పూజనీయులకు పూజ్యుండనియు భక్తులను కాపాడువాడనియు గుర్తెరుగుము! నీవు నాకు ప్రాణమువలె నిష్టమైనదానవు; హఠాత్కారమును మానుకొని పరితాపమును దూర మొనర్చుకొనుము! కర్తవ్యమును నెరవేర్చుటకు త్వరగా నుద్యుక్తురాలవు కమ్ము:

ఈ వరకు నొకప్పుడు పరమేశ్వరుఁడు మన యింటి ద్వారము చెంత కరుదెంచి పలురకముల లీలారూపములను చూపెట్టిన యంశమును మరచితివా? ఆ సమయమున శంకరుఁడు మహామహిమఁ గలవాడని తెలుసుకొని మనమిరువురము మన కుమార్తెయగు పార్వతి నొసగుటకు నంగీకరించితిమి. అట్టి యంగీకారమును సార్థకముఁజేయుము!" అని వచింప మేనక "ప్రాణేశ్వరా! ఇప్పుడు నే చెప్పినట్లు చేయగలవని ప్రార్థించుచున్నాను. పార్వతిని త్రాడుతోకట్టి క్రింద పడద్రోయుము! అథవా నిర్దయుడవై సముద్రమున పారవేయుము! ఇందుకైన నొప్పుకుందును కాని శంకరునకిచ్చుట కియ్యకొనను. ఒకవేళ వికట స్వరూపుడగు శంకరునకే నీవు నన్ను త్రోసిరాజని పార్వతిని సమర్పింతువేని ప్రాణత్యాగమును చేయుదును. ఇది ముమ్మాటికి నిశ్చయము" అని ప్రత్యుత్తరించెను.

ఇంతలో పార్వతీదేవి వచ్చి "అమ్మా! సహజముగా నీ బుద్ధి సమంజసమైనదే కాని యెందుకో విపరీతముగా ప్రస్తుతము కనుపడుచున్నది. ధర్మాత్మురాలవైనను ధర్మమును విడిచి మాటలాడుచున్నా వెందులకు? మహేశ్వరుఁడు సాక్షాత్పరమాత్మయనియు సమస్త జగత్కారణుఁడనియు సుఖమునకు ఆశ్రయమనియు మనోహర లావణ్యముగల సువర్ణకాంతులు వెదఁజల్లు రూపము గలవాడనియు స్వోపాసకులకు నిఃశ్రేయసము నొనగూర్చువాడనియు దేవతా సార్వభౌముఁడనియు స్వయంప్రకాశ మానుడనియు నానావిధ రూపములతో విలసిల్లువాడనియు హరిబ్రహ్మాదులచే సేవింపఁబడువాడనియు చేతనాచేతనముల నన్నిటి నాక్రమించుకొనియుండు వాడనియు కర్తయు హర్తయు నాతడేయైన నెట్టి వికారము లేనివాడై బ్రహ్మ విష్ణురుద్రుల నతిక్రమించి యుండువాడనియు వినాశరహితుఁడనియు సనాతనుఁ డనియు గుర్తెరుగుము! ఇట్టి మహానుభావుని దర్శించుటకే ఇంద్రాదిదేవతలందరు నేతెంచి కల్యాణద్వారమున వేచియున్నవారు. ఇంతకంటె మించినవైభమ మెవరికుండును? కావున నిటనుండి లేచి నన్ను ఆ భవునకు సమర్పించి జీవితమును నాపరిశ్రమను సార్థకముఁజేయుము! ఈ నా విన్నపము నంగీకరించుము! ఒకవేళ శంకరునకు నన్ను ఈయకుండిన యెడల నింకొక వరుని మాత్రము వరింపను. ఇతర ప్రాణులను మోసగించు నక్క సింహశరీరము ననుభవింపఁ జాలునా? హరుని నేను మనోవాక్కాయములతో వరించితిని. ఇఁక మీద నీ యిష్టము" అనియు గట్టిగా వక్కాణించినది.

పార్వతీ దృఢనిశ్చయమును వినినంతనే మిగుల నలిచుచు కుమార్తెందగు దేహమును పట్టుకొని పిడికిళ్లతో గ్రుద్దుచు మోచేతులతో పొడచుచు దంతములతో కొఱుకుచు వివశురాలై కొట్టుచుండెను. అప్పుడా ఘోరమును చూడలేక నారదాది మహర్షులు పార్వతిని మేనకాబిర్భంధమునుండి విడిపించి దూరము





తీసుకొని వెళ్ళగా వారందరిని తీక్ష్ణముగా చూచుచు మేనక "దీని నేమిచేయవలెనో తోచుటలేదు. ఎన్నిచెప్పినను మొండి పట్టుదలతో నామాట వినుటలేదు. విషమును త్రాగింతును. లేక బావిలో పడవేయుదును, కత్తులతో నరకివేయుదును. సముద్రమున ముంచుదును. లేక నేనే గుణ్ణముల గుంపుక్రింద పడి చత్తునుగాక! కాని వికారరూపియగు రుద్రునకు మాత్రము నాదుర్గ నీయఁజాలను. భయంకరస్వరూపుని వరించి యీ నాదుష్ట పుత్రిక నాకు నవమానమును హిమవత్కులమునకు తలవంపును తెచ్చిపెట్టినది. ఎట్టేలకంగీకరించి యీశ్వరునకు సుత నిత్తునన్నను ఆతనికి తల్లిదండ్రులుగాని అన్నదమ్ములుగాని బంధువులు గాని గోత్రికులుగాని లేరు. అట్లైననొప్పుకొని కన్యాదానము నియ్యకున్నను చక్కదనముగాని నేర్పుగాని ఇల్లుగాని వస్త్రాలంకారములు గాని కనబడుటలేదు. మరియు నీతనికి సహకరించువారును లేకున్నవారు. వాహనమైనను సమంజసమైనది కాదు. ప్రాయమా! అంతకులేదు ధనమా శూన్యము; పవిత్రతగాని పాండిత్యము గాని మృగ్యములై యున్నవి. మరియు నాతని శరీరంబును మలినముగా కన్పట్టును. ఆతని యొద్ద యేదేనొక విశేషము లేదు కావున పార్వతి నీయ" నని పెద్దగాపలుకుచు నెలుగెత్తి యేడ్చుచుండెను.

ఆ సమయమున బ్రహ్మదేవుఁడు వడిగా మేనకను సమీపించి విపరీతబుద్ధిని పోనాడు నుపదేశము నిట్లు చేసెను. మేనకా! నామాట నాలకించి నీ దురాలోచనమును విడనాడుము! శంకరుఁడు సామాన్యుడని భావింపకుము! జగమును నిర్మించువాడు. రక్షించువాడు హరించువాడు నాతడేను, పలురూపములు నానావిధ నామధేయంబులును కలిగి యనేక లీలలను చూపెట్టుచుండును. సర్వస్వతంత్రుఁడై చేయు నాతని చేష్టితముల నెవరును తెలుసుకొనఁజాలరు. మాయను లోబఱచుకొనినవాడై యెట్టి వికారముఁ జెందకుండు. పరమేశ్వరుని స్వరూపమును గుర్తెరుగఁజాలక దుఃఖించుచున్నావు. సర్వకార్యములను చెడగొట్టు మొండితనమును దూర మొనర్చుకొని పార్వతిని శంకరునకు సమర్పింపుము!

అంత మేనక – స్త్రీ సహజమగు సిగ్గును కొద్దిగా విడనాడి "దేవా! నీ కొక నమస్కారము. ఈ నా కుమార్తెఁదగు సౌందర్యము నెందులకు వ్యర్థముఁ జేయఁజూచుచున్నావు? దీని నొకేమారు చంపిన బాగుండును. దీనినా భూతపతి కీయుమని చెప్పవలదు. ప్రాణములకంటె మిన్నయగు నాపుత్రిక నాతనికీయఁజాలను" అని వచింపగా సనకసనందనాది సిద్ధులేతెంచి "అమ్మా! మేనకా! పరమ సుఖమును ప్రసాదించు శంకరుఁడు మీ భాగ్యవశమున పార్వతీదేవికి సాక్షాత్కరించి పరిగ్రహింప నున్నవాడు. శంకింపవల" దని ప్రార్థించిరి.

అంత వారికిని మేనక "మీరందరు గూడి నా కుమార్తె జీవితమును గంగపాలు చేయఁదలచితిరా? మీరెన్నిచెప్పినను భయంకరస్వరూపుడగు నా పశుపతికి పార్వతి నీయఁజాల" నని నుడువగా బ్రహ్మయు నమరులు సిద్ధులు ఋషులును మనస్సులో వెఱగందు నాశ్చర్యముగా విచారపడుచుండిరి.

మేనకాదేవి యివ్విధము నందరిని తిరస్కరించుచు తన హఠాత్కారమును సడలింపని యంశమును కనుగొని శివప్రియుఁడైన నారాయణుఁడు వేగమే నరుదెంచి దిగువవిధము వాక్రుచ్చెను.

మేనకా! పితృదేవతల మానసపుత్రికవు, గుణవంతురాలవు, హిమవంతుని పట్టమహిషివి, నీ వంశమునకు బ్రహ్మదేవుఁడు ముఖ్యుఁడు గావున పవిత్రకులీనురాలవని చెప్పవచ్చును. నీ బంధువులును



లోకములో నెన్నఁదగినవారు. ధన్యురాలవు. ఇట్టి నీకేమని చెప్పవలెను? ధర్మమున కాశ్రయమగుదాననై ధర్మమును నిరాకరించుచున్నా వెందులకు? దేవతలుగాని ఋషులుగాని బ్రహ్మదేవుఁడు గాని నేను గాని నీకు విరుద్ధముగ చెప్పువారమా? బాగుగా విచారింపుము! శివుని తత్త్వమును తెలియకున్నావు అతఁడు ప్రాకృతగుణములు లేనివాడై సర్వజ్ఞత మున్నగు దివ్యగుణములు గలవాడు. కరచరణాదులులేని జ్యోతిర్లింగ స్వరూపము కలవాడైనను గంగాధర చంద్రశేఖర నీలకంఠాది విశేషములు గల దివ్యరూపము గలిగియుండును. సత్పురుషులందరు నాతనినే సేవింతురు. మూలప్రకృతిని ఆదిపూరుషుని అనఁగా పురుషోత్తము నాతడే పుట్టించెను. ఆ ప్రకృతిపురుషులు నన్ను చతర్ముఖుని జనింపఁజేయగా మా యుభయులకు బాసటగా నుండుటకు రుద్రుడై యవతరించినవాడు శివుఁడు; ఆ పిమ్మట వేదములు, దేవతలు చరాచరమంత యాతని వలననే యావిర్భవించినది. పరమేశ్వరుని మహిమను పూర్తిగా వర్ణింప నెవరితరము గాదు. ఒకప్పుడు నేను బ్రహ్మదేవుఁడు నాతని జ్యోతిర్లింగ స్వరూపముఁదగు నాద్యంతములను కనుగొనకుంటిమి.

శ్లో॥ ఆ బ్రహ్మస్తంబ పర్యంతం - యత్కించి ద్దృశ్యతే జగత్,

తత్సర్వంచ శివం విద్ధి - నాత్రకార్యా విచారణా ॥ ౯౫

బ్రహ్మదేవుఁడు మొదలుకొని గడ్డిపఱకవరకు గల జగమునంతటి నంతర్యామిగా శివుఁడు నుండువాడు గావున సమస్తంబును శివమయంబని భావింపుము! అట్టివాడే నీ పుత్రిక గావించిన తపంబున ప్రసన్నుఁడై మా యందరిని వెంటనిడుకొని నీ గృహద్వారమునకు వేంచేసి యున్నవాడు. అందువలన నోమేనకా! పరితాపమును బోకార్చి శివు నభినందింతువేని యిడుములన్నియు దూరమగును. అమితమైన ఆనందము నొనఁగూరును.

అంత మేనకాదేవి విష్ణువాక్యశ్రవణమున కొద్దిగా మనుస్సు మార్చుకొనినను శివమాయా మోహవశమున పార్వతిని శంకరునకు సమర్పించుటను మాత్ర మంగీకరింపనిదై "ఒకవేళ మహేశ్వరుఁడు మనోహరము సుందరము నగు రూపముగల వాడయ్యేనేని నా కుమార్తె నాతని కొసగుదును. లేనిచో కోట్లకొలది నుపాయములకు నొప్పుకొనుదానను కాను. నా దృఢ నిశ్చయ మియ్యదియే. నా కంఠములో ప్రాణములుండగా నీ నిశ్చయమునకు మార్పుండఁజాలదు" అని పలికి యూరకుండెను.

ఈ సందర్భమున కంతకు శివేచ్ఛయే కారణము; శివమాయాప్రభావము ఎంతటివారినైన మోహింపఁ జేయును గదా!

అని సూతుఁడు శౌనకాది మహర్షులకు వచించెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నలుబదినాలుగవ యధ్యాయము.**





# పంచచత్వారింశాధ్యాయము

## (శివుఁడు సుందరస్వరూపుఁడగుట, పురవాసుల సముత్సాహము)

తరువాత నారదమహర్షి – పుండరీకాక్షునిచే ప్రేరేపింపఁబడి శంకరుని యనేక స్తోత్రములతో ప్రసన్నుని జేయగా పరమేశ్వరుఁడు సంతసించి దయఁగలవాడై అద్భుతము లోకోత్తరంబు నగు దివ్యసుందర రూపముఁదాల్చి కనుపడుచుండెను. అట్టి మన్మథాతీత శివరూపము నపూర్వముగా గాంచుచు నారదుఁడు "ఆహా! ఏమి లావణ్య మిదియని మురియుచు మరల నొకమారు నానావిధముల శివుని ప్రార్థించి వడివడిగా మేనకాదేవిచెంత కరుదెంచి యచటి వారందరు వినుచుండగా నిట్లు వక్కాణించెను.

"విశాలనేత్రములు గలదానా! మేనకా! ఉత్తమోత్తమంబగు శివుని రూపము నిపుడు చూడుము! దయాళువై శంకరుఁడు మన నందరి ననుగ్రహించినవాడు."

అంత మేనక నారదవాక్యము నాకర్ణించి విస్మయముఁజెందుచు పరమానందము నొదవఁజేయు శివరూపమును కనులార గాంచుచుండెను. అప్పుడా శివరూపము కోటిసూర్యులతో సమానముగా వెలుగందుచు నవయవములన్నియు సుందరములుగా కలిగియుండెను. విచిత్రమైన పట్టుధోవతిని మేలిమి నుత్తరీయము నుపయోగించి పలురకముల సొమ్ములఁదాల్చియుండెను. ప్రసన్నముఖముతో చిరునగవుతోడను శుద్ధస్ఫటిక వర్ణముతోడను చంద్రరేఖతోడను విరాజిల్లుచుండెను.

అట్టితతి విష్ణుమూర్తి మున్నగు దివిషదులు పరివేష్టింపగా సూర్యుఁడు గొడుగుగాను చంద్రుఁడు ఛత్రముఁదగు దండముగా నమరియుండెను. వేయేల? అన్ని విధములుగా శంకరుని రూపము రమణీయముగా నుండెను. ఇఁక నాతని వాహనముఁదగు శోభను వర్ణింప నలవి గాదు. గంగాయమునలు శివుని యిరుపార్శ్వములందు చామరములఁబట్టుకొనిరి. అష్టసిద్ధులాతని ముందు నాట్యమాడుచుండెను. బ్రహ్మవిష్ణువులు ఇంద్రాద్యమరులును తమతమ వేషముల నలంకరించుకొని శివునిచెంత నలరారుచుండిరి.

ప్రమథులనఁబడు శివభక్తుల సమూహము (గణము) లు నలంకరించుకొని సౌమ్య రూపములతో జయజయ ధ్వానము జేయుచు శంకరునిముందు పచారుచేయుచుండిరి. సిద్ధులు నుపదేవతలు మునులును తదితరులందరును సంతోషాతిశయమున పరమాత్మయగు శంకరుని కొనియాడుచు తమతమ భార్యలతోముందు నడచుచుండిరి. విశ్వావసువు మున్నగు గంధర్వులు నప్సరసలును శంకరుని దివ్యకీర్తిని గానముఁజేయు చుండిరి.

ఇట్టి సమయమున హిమవంతుని యాస్థానమునకు నీశ్వరుఁడు వెళ్లుచుండ నాతని కరచరణాది సుగ్రరూపముఁదగు లావణ్యకాంతి నెంతటివారికైనను వర్ణింపనలవి గాకుండెను. అట్టి యద్భుత మనోహర లోకోత్తర శివరూపము నవలోకించి మేనక – క్షణకాలము చిత్తరువువలె నిశ్చేష్టురాలై కొంత తడవునకు నిట్లు మాటలాడెను.

"మహేశ్వరా! నా సుత ధన్యురాలు. గొప్ప తపస్సు నాచరించినది. గావుననే నీవీ విధము నా యింటి కరుదెంచితివి. నేనింతకుముందు చేసిన నీ తిరస్కారమును క్షమింపుము. సుప్రసన్నుడవు కమ్ము!"





మరియు నామేనక దోసిలొగ్గినదై శివునకు ప్రణామంబాచరించి తనయపచారమునకు తానేసిగ్గు జెందుచుండెను. అప్పుడు పట్టణావాసులైన తరుణులు తమతమ గృహకార్యములను విసర్జించి శివుని సుందరరూపమును గాంచుటకు వచ్చుచుండిరి. ఒకర్తు - స్నానమాడుచు సుగంధ లేపనముతోడనే యరుదెంచెను. మరియొకర్తు - తన భర్తను సేవించుటను మఱచి చెలికత్తెను వెంటనిడుకొని తన హస్తమున చామరముండగానే వచ్చెను. ఇంక నొకనామె - చనుబాలు త్రాగుచున్న కుమారునికి పూర్తిగా స్తన్యము నీయకయే నేగుదెంచెను. ఒక తరుణి మొలనూలు కట్టుకొనుచునే తారసిల్లినది. మరియొక వనిత చీరె నొడిదుడుకులుగా కట్టుకొని వచ్చినది. ఇంక నొక కాంత భోజనమునకు కూర్చుండియున్న తన కాంతుని పరిహరించి వడిగా నేగుదెంచినది.

ఒకానొక రమణి కాటుకపుడుకను చేతఁబట్టుకొనియే ఒక కన్నునకు మాత్రము కాటుకనలంది సంప్రాప్తురాలయ్యెను. మరియొక కామిని పావురాణిని పాదములకు పూయుచు నద్ది ముగియకముందే పరుగిడుచు వచ్చెను. ఇవ్విధము వనితలందరు నేతెంచి శంకరుని సుందర స్వరూపమును కనులారా గాంచుచు మోహితురాండ్రగుచుండిరి మరియు నా శివరూపమును మనుస్సునందిడుకొని వేడుక యుబికిరాగా దిగువవిధము వాక్రుచ్చుచుండిరి.

హిమవంతుని పట్టణమున నివసించువారిలో నెవరెవరీ శివరూపమును చూచుచున్నారో వారివారి నేత్రములు సార్థకము లగుచున్నవి. పాపముల నన్నిటిని బోకార్చు శంకరుని గాంచు వారి జన్మము సఫలంబైనది. ఇట్టి యపూర్వసుందరుడగు శివునికై తపించిన పార్వతి కడుంగడు ధన్యురాలు, కృతార్థురాలునై యున్నది. ఒకవేళ బ్రహ్మదేవుఁడీ జంట నొనఁగూర్ప కుండినచో నాతని సృష్టికార్యమంతయు నిరర్థకం బనియే చెప్పవచ్చును. ఇందువలన దేవమానవాదులందరి సదభీష్టము లన్నియు సిద్ధించును. తాపసులకే నలవిగాని యీశ్వరదర్శనము నొందు భాగ్యము మాకే సమకూరినది. పూర్వము లక్ష్మీదేవి నారాయణునిపొందినట్లు నీ పార్వతీదేవి శంకరుని పొంది విరాజిల్లుచున్నయది. మనమే గాక పురుషులు నీ శంకరరూపమును గాంచుచు మరియుచున్నవారు కావున మిగుల ధన్యులమైతిమి.

ఇట్లు మాటలాడి పురంధ్రీలందరును చందనాక్షతలను లాజలను శివునిపై చల్లి మేనకాహిమవంతుల సుదైవమును కొనియాడుచు నచట నుండిరి మరియు వారు చెప్పు ఆ యా వినోద వృత్తాంతములను వినుచు శివుఁడు విష్ణ్వాదుల గూడి సంతసించుచుండెను.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో నలుబదియైదవ యధ్యాయము.**





# షట్ చత్వారింశాధ్యాయము

## (వరాగమనాది వర్ణనము)

అటుపిమ్మట శంకరుఁడు ప్రసన్నుడై తన గణముల తోడను నిఖిల బృందారకుల తోడను కుతూహలముతో హిమవంతుని యాస్థానమునకు బయలుదేరెను. మేనకాదేవియు నటనుండి లేచి యంతఃపురములోనికి వెళ్ళినదై శంకరునకు మంగళహారతి నిచ్చుటకు దీపపాత్రను కరమునందిడుకొని ద్వారము చెంత కరుదెంచియు సురలందరు సేవించుచుండగా వేంచేసియున్న శంకరుని దివ్య మనోహర రూపమును కనులార గాంచుచుండెను.

శ్లో॥ చారుచంపకవర్ణాభ - మేకవక్త్రం త్రిలోచనం ।
ఈషద్ధాస్య ప్రసన్నాస్యం - రత్న స్వర్ణాది భూషితమ్ ॥ ౫

మాలతీ మాల సంయుక్తం - సద్రత్నముకుటోజ్జ్వలం ।
సత్కంఠాభరణం చారు - వలయాంగద భూషితమ్ ॥ ౬

వహ్నిశౌచే నాకులేన - త్వతిసూక్ష్మేణ చారుణా ।
అమూల్యవస్త్ర యుగ్మేన - విచిత్రేణాతిరాజితమ్ ॥ ౭

చందనాగరుకస్తూరీ - చారుకుంకుమ భూషితం ।
రత్నదర్పణ హస్తంచ - కజ్జలోజ్జ్వల లోచనం ॥ ౮

సర్వస్వప్రభయాఽఽచ్ఛన్న - మతీవ సుమనోహరం ।
అతీవ తరుణం రమ్యం - భూషితాంగైశ్చ భూషితమ్ ॥ ౯

కామినీకాంత మవ్యగ్రం - కోటిచంద్రాననాంబుజం ।
కోటి స్మరాధికతను - చ్ఛవిం సర్వాంగసుందరమ్ ॥ ౧౦

ఇంపైన చంపక పుష్పముఁదగు వన్నెగలవాడు నొక్కముఖము మూడుకన్నులు (రెండు వికసించిన కమలములఁబోలినవియు మూడవది ముకుళించిన పుండరీకము వంటిదియు) గలవాడును చిరునగవుతో ప్రశాంతమైన వదనము గలవాడును రత్నములతో గూడిన సువర్ణాలంకారములు గలవాడును జాజిపూదండను మెడఁదాల్చినవాడును మేలిమిమణులతో చెక్కఁబడిన కిరీటముతో ప్రకాశించువాడును మనోహరమగు కంఠహారముతోడను కడియముల తోడను సందికడియముల (అంగదముల) తోడ నలంకరింపఁబడినవాడును అగ్నిపూతము నద్వితీయము మిగుల సూక్ష్మము మనోహరమునగు కౌశేయవస్త్రద్వయము (పట్టుధోవతి పట్టుత్తరీయము) తో మిక్కిలి విరాజిల్లువాడును శ్రీ గంధము, అగరు కస్తూరితో కూడిన కుంకుమతిలకముఁ బెట్టుకొనినవాడును రత్నదర్పణము (అద్దము) ను కేలఁ బట్టుకొనినవాడును కాటుకతో వెలుగొందు కన్నులుగలవాడును ప్రపంచముఁజెందిన సూర్యచంద్రాది తేజోమయ వస్తువుల నతిక్రమించు కాంతి గలవాడు నత్యంతము మనంబు నాకర్షించు యౌవనము





గలవాడును సింగారింపబడిన యవయవములతో శోభించువాడును తరుణుల చిత్తములను రంజిలఁజేయువాడును స్థిరగంభీరహృదయుఁడును కోటిచంద్రులతో సమానమగు ముఖకమలము గలవాడును కోటిమన్మథులను మించిన శరీరకాంతి గలవాడును సర్వాంగసుందరుఁడు నగు మహాదేవుని తన ముందు చూచి మేనక - పూర్వపరితాపమును విడనాడి మిగుల ముఱియుచుండెను. మరియు తన పూర్వసుకృతవిశేషమును (తన) యనుఁగుకూతురును (తన) పతిని కులమును ప్రశంసించుకొనుచు తనను కృతార్థురాలుగా భావించుచు మాటిమాటికి యానందపడుచుండెను. ముఖమును విప్పారుకొని యల్లుని చూచుచు నీరాజనము నొసగుచుండెను. పూర్వము పార్వతి చెప్పినదంతయు నిజమని భావించుచు లోలోన విస్మితురాలగుచుండెను. పార్వతి నుడివినదాని కన్న నెక్కుడు రూపలావణ్యములను శంకరుని యందు గాంచుచుండెను. "అహా! మహేశ్వరుని సౌందర్యము వర్ణనాతీతము గదా" అని మేనక చింతించుచు స్వగృహములోనికేతెంచినది. "గిరిజాదేవి ధన్యురాలు ధన్యురాలు" అనియు "ఈమెయే సాక్షాద్భగవతి దుర్గ యనియు ఇట్టివరు నెప్పుడును చూడలేద" నియు యువతులు కన్యలును నుడువుచుండిరి.

గంధర్వశ్రేష్ఠులు గానముఁజేయుచుండిరి. అప్సరసాంగనలు నాడుచుండిరి. అమరులందరును శంకరుని లోకోత్తర సుందరరూపమునుగాంచి సంతసించుచుండిరి. మంగళవాదకులు పలురకముల వాద్యములను మధురాక్షరములు వినబడునట్లు అనేక వివిధ భంగిమలతో ప్రయోగించుచుండిరి.

అట్టితతి నగాధిరాజు - ముదితాంతరంగుడై గృహద్వారముచెంత చేయఁదగు వేడుకను గావింప మేనకాదేవియు నిండుమనంబున గృహిణులనందరిని మర్యాదగా పలుకరించి లోనికేగియుండెను.

శంకరుఁడును హిమవంతునిచే నివేదింపఁబడిన స్థానమునకు తన యనుచరులతో వెళ్ళియున్నవాడు.

ఇంతలో కులదేవతను పూజింప పరిచారికలు పార్వతీదేవి నంతఃపురము నుండి తీసుకొనిరాగా దేవతలు రెప్పపాటు లేకుండ నామెను చూచుచుండిరి. ఆ దివ్యమోహనరూపమును వర్ణింప నలవిగాకుండెను.

నల్లని కాటుకవన్నె గలదియు తన శరీరముఁదగు నవయవములతో భూషణములను మెఱుగుపఱచునదియు శంకరునిచేమాత్రము గారవింపఁబడు కనుకొనలుగలదియు ఇతరులచూపులను తొలగించు నేత్రములుగలదియు ఇసుమంత చిరునగవుతో ప్రసన్నంబగు ముఖముగలదియు క్రీగంటిచూపులు గలదియు ప్రేక్షకుల మనంబులను రంజిలఁజేయునదియు మిక్కిలి మనోహరంబగు కేశపాశము (సిగముడి) కలదియు అందమైన పత్రముల నలంకరించుకొనినదియు కస్తూరితో గూడిన సింధూరతిలకముఁ దాలల్చినదియు వక్షఃస్థలమున విరాజిల్లు రత్నహారము గలదియు మణులతో కూడిన భుజకీర్తులు కడియములును కలదియు రత్న కంకణములను ధరించినదియు రత్నకుండములఁదగు కాంతులతో ప్రకాశించు నింపైన చెక్కిళులు గలదియు మణిరత్నములఁదగు కాంతుల పుంజములఁ బోలిన పలువరుసతో శోభించునదియు తియ్యని దొండపండువంటి యధరోష్ఠము (క్రిందిపెదవి) గలదియు రత్నకాంతిని వెదజల్లు పావురాణిఁ బూసుకొనినదియు రత్నములతో కూడిన దర్పణము (అద్దము) ను కరమునఁ బట్టుకొనినదియు క్రీడాకమలములను కేలఁదాల్చినదియు శ్రీగంధము, అగరు, కస్తూరి, కుంకుమ,





మొదలగు సుగంధద్రవ్యముల లేపనముఁజేసుకొనినదియు ధ్వనించు నందెలను పాదములఁదాల్చినదియు ఎఱ్ఱనైన నతికాళ్ళు గలదియు జగమునకు మూలమైనదియు ప్రపంచము నావిర్భవింపఁజేయునదియు మేనకాదేవితో కూడియుండునదియు నగు అమ్మవారిని బృందారకులు నవలోకించుచు భక్తిప్రపత్తులతో మ్రొక్కులిడుచుండిరి.

శంకరుఁడు సంతోషసముత్సాహము లుప్పతిలగా గిరిజాదేవిని ప్రక్కనుండి చూచుచు విరహ తాపమును విడనాడుచుండెను. మరియు నామెయందే తనచూపు నిలిపినవాడై గగుర్పాటులొందుచు సమస్తంబును మఱచుచుండెను.

అంత కాళికాదేవి నగరము వెలుపలి ప్రదేశమున కులదేవతను పూజించి బ్రాహ్మణ స్త్రీలు వెంటరాగా తండ్రిగారియిల్లుఁ బ్రవేశించినది. శంకరుఁడును తనకొరకై ఏర్పరుపఁబడిన స్వస్థానమునకు బ్రహ్మవిష్ణ్వాదులతోఁ గూడి వెళ్ళియుండగా సురల నందరిని హిమవంతుఁడు యథోచితముగా సత్కరించి వసతుల యందు సౌకర్యమును కల్పించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వము" అను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నలుబది యారవయధ్యాయము.

## సప్తచత్వారింశాధ్యాయము

### (హిమవంతుని యింటిలోనికి శంకరుఁడు వెళ్లు మహోత్సవము)

తరువాత హిమవంతుఁడు గిరిజాదేవికి శంకరునకును వేద మంత్రములతోస్వస్తి వాచనములఁ జేయించి ప్రార్థింపగా శంకరుఁడు బ్రహ్మవిష్ణ్వాదులను లోనికి నరుదెంచుచుండిరి. వైదిక లౌకికాచారముల ననుసరించి మహేశ్వరుఁడొసఁగిన సువర్ణాభరణములతో మహేశ్వరి నలంకరించి విప్రవనితలు సఖురాండ్రును మంగళహారతుల నిచ్చుచుండిరి. అలంకారమునకు ముందు మంగళస్నానమును చేయించిరి. చీరఁగట్టుకొని వల్లెవాటువేసుకొని నానావిధరత్నములతో కూడిన రవికెను తొడుగుకొనియు కంఠహారము మున్నగు నాభరణములను ధరించియు మనస్సులో శివునినే స్మరించుచును త్రిజగన్మాతయగు పార్వతి యలరారుచుండెను.

ఆ సంతోష సమయమున వధూవర పక్షముల వారిద్దరును బ్రాహ్మణులకు అనేక దానముల నొసర్చుచుండిరి. బ్రాహ్మణేతరులకును పలురకముల పారితోషికము లొసగఁబడుచుండెను. గీతవాద్య వినోదంబు సంఘటించుచుండెను.

అట్టితతి విధివిష్ణుమహేంద్రాది దేవతలు వసిష్ఠాదిమహర్షులును తదితర ప్రేక్షకులును హిమవంతునిచే నిర్దేశింపఁబడిన స్థలములయందు నాసీనులగుచు గౌరీశంకరులకు వందనమును సమర్పించిరి.

అంత దైవజ్ఞశిఖామణియగు గర్గాచార్యులు "పాణిగ్రహణమునకై శంకరుని యిచ్చోటికి గొనిరమ్ము" అని హిమవంతునకు చెప్పగా సంతసము మీఱ భూధరులను విప్రులను తదితరప్రముఖులను శివుని తోడ్కొని

వచ్చుటకు పంపినవాడు. అంత నవ్వారు మంగళ ద్రవ్యములను హస్తములయందిడుకొని మహేశ్వరుని నివాసమునకుఁజని మంగళవాద్యములు మ్రోగుచుండగా వేదఘోషము గీతనృత్యకాలాహలంబును వినఁబడు చుండగాను శంకరుని సన్నిధికి నేగుచుండిరి.

ఇఁక శివగణంబులు దేవర్షులును వధూపక్షమువారి రాకను గుర్తించి సంబరముట్టి పడుచుండగా పాణిగ్రహణకాలము సమీపించినదని యువ్విళ్లూరు చుండిరి. లోకములకు మంగళము నొదవఁజేయు శివకల్యాణమును కనులార చూడగలుగుచున్నందులకు ధన్యులమైతిమని లోలోన మురియుచుండిరి.

ఇంతలో పర్వతులు సమీపించి శంకరుని విష్ణ్వాదులను "కన్యాదాన సమయమాసన్నమైనది కావున నచ్చోటికి రండ" ని ప్రార్థింపగా నమరులందరు నుత్సాహమతిశయింప జయజయధ్వానములఁ జేయుచుండిరి. శంకరుఁడును పార్వతీదర్శనలాలసుఁడై లోనుండి యుబికి వచ్చుచున్న సంబరమును మఱుగుపఱచుచు బయలుదేర నుద్యుక్తుడగుచుండెను.

లోకానుగ్రహతత్పరుఁడగు పరమాత్మ – మంగళస్నానము నాచరించి మేలివస్త్రములఁదాల్చియు లోకపాలురు సేవించుచుండగా వృషభముఁదగు మూపుపై నెక్కి మంగళ వాద్యములతో సురలందరును వెంటరాగా హిమవంతుని గృహముఁజేరుచుండెను. హిమవంతుఁడంపిన విప్రులు పర్వత శ్రేష్ఠులును కుతూహలముతో శంకరుని ముందు నడచుచుండిరి.

అట్టితతి మహేశ్వరుఁడు – శ్వేతచ్ఛత్రము క్రింద నలరారుచు చామరములతో వీవఁబడుచుండెను. బ్రహ్మదేవుఁడు విష్ణుమూర్తియు దేవేంద్రుఁడును లోకపాలురు నగ్రేసరులై మిగుల రాణించుచుండిరి. శంఖములు, దుందుభులు, తప్పెటలు, మద్దెలలు, గోముఖములును మాటిమాటికి మ్రోగింపబడుచుండెను. గాయకులు మధురసంగీతములను పాడుచుండిరి. అప్సరసలు నాట్యమాడుచుండిరి.

జగదేక బాంధవుఁడగు నా భగవానుఁడు లోకాతీతమగు వర్చస్సుతో శోభించుచు దివ్యమందార పుష్పములు వర్షించుచుండగా భక్తులు నానావిధస్తోత్రములతో ప్రార్థించుచుండగాను కల్యాణమంటపమునఁ బ్రవేశించినవాడు.

ఆ సమయమున హిమవంతుని పార్షదులు శంకరుని వృషభముపై నుండి దింపి లోనికి గొంపోవగా హిమవంతుఁడు సమీపించి ప్రణమిల్లియు మంగళహారతి నిప్పించెను.

అటులే దేవతలందరిని సత్కరించుచు తనదైవమును ప్రశంసించుకొనుచుండెను. మరియు నర్ఘ్యపాద్యముల నొసగి శంకరుని బ్రహ్మవిష్ణ్వాదులతో గూడ లోనికి గొనిపోయి సమున్నత రత్నపీఠముపై నాసీనులఁజేసినవాడు.

మేనకాదేవియు బ్రాహ్మణస్త్రీలును తదితరవనితలును నీరాజనముల నొసగుచుండిరి. పురోహితుఁడు శంకరునకు మధుపర్కాదికమును సమర్పించెను. శంకరుని వివాహ వేదిక యందు కూర్చుండఁజేసి పార్వతి నచ్చోటికి గొనితేగా ముహూర్తము సమీపించుచుండగా ప్రణవము నుచ్చరించుచు గర్గాచార్యులు పుణ్యాహవాచనము నొనర్చెను.





అప్పుడు పార్వతీదేవి శంకరునిపై మంగళాక్షతలను వర్షించుచు సంతుష్టముఖియై అతనని ప్రసన్నముఖమును వీక్షించుచుండెను. శంకరుఁడును లౌకికాచారము ననుసరించి పార్వతిపై మంగళాక్షతలఁజల్లుచు కృపావీక్షణములఁ బఱపుచుండెను.

ఇట్లు పార్వతీపరమేశ్వరులు ఒండొరులను గారవించుచు పరస్పరము చూచుకొనుచుండగా లక్ష్మీదేవి మున్నగువారు నవ్వారికి హారతుల నిచ్చుచుండిరి. అటులే వివాహమున కరుదెంచిన సువాసినులందరును గౌరీశంకరులను కనులార గాంచుచు నీరాజనముల నొసగుచుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నలుబదియేడవ యధ్యాయము.

## అష్టచత్వారింశాధ్యాయము

### (కన్యాదాన వర్ణనము)

గర్గాచార్యులు ప్రేరేపింపగా హిమవంతుఁడు మేనకతోకూడి కన్యాదానము నొనర్ప బంగారుచెంబు పట్టుకొని వస్త్రాభరణముల నలంకరించుకొని వరుని వస్త్రచందనాదులతోడను పాద్యము మున్నగువానితోడను సత్కరించెను. దైవజ్ఞులైన బ్రాహ్మణులు తిధివారనక్షత్రాదుల నుగ్గడించుచుండిరి. శివేచ్ఛావశమున హిమవంతుఁడు గోత్రప్రవరలను కులమును నామధేయమును వేదమును శాఖను త్వరగా చెప్పుమని శంకరు నడుగగా నాతడు సుముఖుడైనను విముఖుడై విచారపరుండయ్యెను.

అట్టితఱి నమరులు మునులు గంధర్వులు యక్షులు సిద్ధులును శంకరుని ముఖమును చూచుచుండగా భగవానుఁడు నిరుత్తరుఁడగుచున్న సందర్భమును నారదుఁడు కనుగొని పెద్దగ్గా నవ్వుచు శివప్రేరితుడై వీణను మీటుచుండెను.

ఎడతెఱిపిలేకుండా వాయింపఁబడుచున్న వీణనాపుమని నారాయణుఁడు, పంకజాసనుఁడు, దేవతలు మునులును చెప్పినను విననందున హిమవంతుఁడు బలాత్కారముగా నివారింపగా నారదుఁడు మహేశ్వరుని స్మరించి యిట్లు వచించెను.

గిరీంద్రా! మూఢుడవై బహిర్ముఖదృష్టితో మహేశ్వరుని గురుతెఱగకున్నావు. ప్రస్తుతము కులగోత్రాదులను విచారించుట పాడిగాదు.

శ్లో॥ అస్యగోత్రం కులం నామ - నైవజానంతి పర్వత ।
విష్ణు బ్రహ్మదయోఽపిహ - పరేషాం కా కథా స్మృతాం ॥ 16
యస్యైకదివసే శైల! - బ్రహ్మకోటి ర్లయం గతా ।
సఏవ శంకరస్తేఽద్య - దృష్టః కాళీతపో బలాత్ ॥ 17

శంకరుని కుల మెద్దియో గోత్రమేదో పేరేమిటో బ్రహ్మదేవుఁడు విష్ణుమూర్తి మున్నగువారే తెలుసుకొనఁజాలరు. తదితరులకు తెలియదని వేరుగా చెప్పనవసరములేదు.

అతని యొక్కదినముననే కోటిబ్రహ్మలు గతింతురు. అట్టి కాలాతీతుఁడగు మహేశ్వరుఁడు - పార్వతీదేవిఁదగు తపోబలమున నిప్పుడిట్లు కనబడుచున్నవాడు.

పరబ్రహ్మము, నిరాకారుఁడు, నిర్గుణుఁడు, ప్రకృతినిమించినవాడు, నిర్వికారుడు, మాయాధీశుడు, పరాత్పరుడు, గోత్రకులనామములు లేనివాడు, స్వతంత్రుడు, భక్తవత్సలుడు నగు శంకరుడు స్వేచ్ఛావిలాసమున దివ్యశరీరముగలవాడై యనేక నామధేయములతో విరాజిల్లుచుండును. నీకుమార్తెగావించిన సుకృతమునఁజేసి నీకు నల్లుడు కాబోవుచున్నవాడు.

ఈతడు తన లీలావిహారముతో చరాచరము నంతయు మోహింప జేయును. ప్రాజ్ఞుడైనను శివుని పూర్తిగా తెలుసుకొనఁజాలడు. పూర్వకాలమున శంకరుడు లింగాకారమున నావిర్భవింపగా బ్రహ్మదేవుడు అంతరిక్షమున పైపైకివెళ్ళియు లింగోపరిభాగమును, విష్ణుదేవుఁడు పాతాళమునకు వెళ్ళియు లింగము దగు చివరిభాగమును కనుగొనఁజాలకుండిరి.

వేయేల? పర్వతరాజా! శివమాయా ప్రభావము అమోఘమైనది. హరిబ్రహ్మాదులు నద్దానికి లొంగియుండవలసినదేను; కావున నిట్టి మహామహుని విషయమై కులగోత్రాదులను పరామర్శించుట యోగ్యముకాదు.

వెండియు నారదమహర్షి - లీలారూపధారియగు సదాశివుని కులము గోత్రంబును నాదమనియే గ్రహింపుము!

శ్లో॥ శివో నాదమయః సత్యం - నాదః శివమయస్తథా ।
ఉభయో రంతరంనాస్తి - నాదస్యచ శివస్యచ ॥ 28

శివుడు నాదము అనగా ధ్వని స్వరూపుఁడు. నాదము శివాత్మకము; శివునికిని నాదమునకును భేద మిసుమంతయులేదు. లీలావిలాసచతురుఁడగు శివునినుండి సృష్టియందు ప్రప్రథమముగా నాదము పుట్టుటచే నాదమే యన్నిటికన్న మిన్నయైనది. కావున సర్వేశ్వరుడు మానసికముగా ప్రేరేపించినందున వీణానాదము ఁజేసితిని - అని వచించెను.

అంత హిమవంతుడు సంతసించి సంశయమును పోగొట్టుకొనెను. హరిబ్రహ్మాదులును నారదుని "సాధు, సాధు" అని మెచ్చుకొనిరి. బుద్ధిమంతులు మహేశ్వరుని గాంభీర్యమును పరికించుచు విస్మయముతో పరస్పరము దిగువవిధము సంభాషించుకొనుచుండిరి.

పరాత్పరుడు నిజబోధస్వరూపుఁడునగు శంకరుని యానతివలన విశ్వము విశాలముగా నేర్పడినది. స్వతంత్రగతికలవాడు ఏకాంత భక్తిగమ్యుడు. బ్రహ్మాండాధిపతియు నగు మహేశ్వరుని మా భాగ్యవశమున ప్రస్తుతము చూడగలుగుచున్నాము. తరువాత మేరువు మున్నగు పర్వత శ్రేష్ఠములు నిండు వేడుకతో నొక్కుమ్మడిగా "శైలరాజా! ప్రస్తుత మెట్టి విమర్శలకు నవకాశము లేదు. పార్వతిని ప్రభువునకు నిఃశంకముగా నొసగవలెననియే మా యభిప్రాయ" మని నివేదింపగా హిమవంతుడు సమ్మతించి హర్షపూర్వకముగా శివునకు యథావిధిని "తస్మైరుద్రాయ మహతే" అను మంత్రమును దిగువ శ్లోకంబు నుచ్చరించుచు కన్యాదానము నొనర్చెను.





శ్లో॥ ఇమాం కన్యాం తుభ్య మహం - దదామి పరమేశ్వర ।
భార్యార్థం పరిగృహ్ణీష్వ - ప్రసీద! సకలేశ్వర ॥ 38

శ్లోకార్థము – పరమేశ్వరా! ఈ నా కూతురును నీకు సమర్పించుచున్నాను. భార్యగా పరిగ్రహింపుము! ప్రసన్నుడవగుము!

ఇట్లు పార్వతీదేవిదగు హస్తమును శంకరుని కరము నందునిచి హిమవంతుడు కామ్యముల సముద్రమును దాటినట్లు సంతుష్టాంతరంగుడయ్యెను.

శంకరుడును లోకరీతిబట్టి "కోఽదాత్" ఇత్యాది మంత్రములను పఠించుచు భూమినిస్పృశించి గిరిజాపాణిగ్రహణము నొనర్చినవాడు.

స్వర్గ మర్త్యలోకములలో ఆకసమునందును శివకల్యాణవశమున గొప్పయుత్సవముగానుండెను. జయశబ్దమును నమఃపదమనంతట నుచ్చరించుచుండిరి. గంధర్వులగానము అప్సరసల నాట్యంబు ప్రవర్తించుచుండెను. ఓషధీప్రస్థపురంబున నాగరికులందరును మిగుల సంబరపడుచుండిరి. ఎటుజూచినను వాతావరణము శభమయముగా నుండెను. హరిబ్రహ్మ దేవేంద్రాదులు కడుంగడు హర్షించుచుండిరి.

ఇక శైలరాజు – వివాహోచితముగా శివునకు పారితోషికములను సమర్పించెను. బంధువులు పార్వతీ శంకరులను పూజించి నానావిధములగు కనకరత్నమణిమయవస్తువుల నొసగుచుండిరి. గౌరీశంకరుల ప్రీత్యర్థము హిమవంతుడు పలురకములైన రత్నములను మనోహర రత్నపాత్రలను సమర్పించెను. ఇంకను లక్ష ఆవులను నూరు మంచి గుఱ్ఱములను లక్ష దాసీలను కోటి యేనుగులను సువర్ణరత్న నిర్మితములగు కోటి రథములనొసగి కృతార్థుండయ్యెను. పిమ్మట కొండలరాయడు మధ్యాహ్నసమయోచితములైన స్తోత్రములతో శివునిc బ్రార్థింపగా మునులందరును పార్వతీదేవికి గర్గాచార్యానుమతిని వేదమంత్రములతో నభిషేకమును గావించిరి. మరియు

దేవాభిధానము నుచ్చరించి పర్యుక్షణవిధి నాచరించిరి. ఇత్యాది సందర్భమునcజేసి వివాహస్థలమంతయు ఆనందమయముగా నుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నలుబది యెనిమిదవ యధ్యాయము.

## ఏకోనపంచాశత్తమోధ్యాయము

### (బ్రహ్మదేవుని మోహము)

బ్రహ్మదేవుcడు చెప్పుటcబట్టి పరమేశ్వరుcడు – బ్రాహ్మణులచే రగులుకొలుపcబడిన నగ్నిని తన తొడపై పార్వతిని కూర్చుండపెట్టుకొని ఋగ్యజుఃసామమంత్రముల నాహుతుల నొసగుచుండెను. పార్వతీదేవికి నగ్రజుcడగు మైనాకుcడు పేలాలదోసిలిcబట్టుచుండెను. లోకాచారము నమస్కరించి గౌరీశంకరులు వహ్నిప్రదక్షిణమును చేయుచుండిరి.

అట్టితఱి చంద్రశేఖరుని లీలావిలాస మెవ్విధము పరిణమించినదో చెప్పెదను. వినుcడు!

బ్రహ్మదేవుఁడు శివమాయామోహితుడై అగ్నిప్రదక్షిణమును చేయుచున్న పార్వతీదేవిఁదగు చరణము నందలి చంద్రునివంటి గోరుకాంతిని పరికించినందున కామవికారముఁజెంది మాటిమాటికి నామె శరీరమునంతయు గాంచుచు స్ఖలితవీర్యుండయ్యెను. అట్లు తననుండి రేతస్సు పడుచుండగా బ్రహ్మ - మిగుల సిగ్గుఁజెంది స్వవీర్యమును నేలపైన రాచుచుండెను. మహాదేవుఁడద్దానిని కనుగొని క్రుద్ధుడై కామమోహితుఁడగు బ్రహ్మను వధింప నుద్యుక్తుడై నందున జనులలో హాహాకారము ఉప్పతిల్లెను. విధియు భయపడుచుండెను. అందువలన తేజస్సుతో ప్రజ్వలించుచున్న శంకరుని విష్ణ్వాద్యమరులు దిగువ విధమును స్తుతింపదొఁడగిరి.

దేవదేవా! పరమేశ్వరా! జగన్మయా! జగదీశ్వరా! కరుణింపుము! సర్వాంతర్యామివగుటచే భావముల కన్నిటికిని కారుకుఁడవు నీవేయని భావింతుము. నిర్వికారుఁడవు; అవ్యయుడవు; నిత్యుడవు; నిర్వికల్పుడవు; అక్షరుఁడవు; పరుఁడవు; నీ స్వరూపముఁదగు నాద్యంతములు అగమ్యములై యున్నవి. కనఁబడుచున్న విశ్వమంతయు నీ స్వరూపమున మధ్య భాగంబగునని తోచెడిని, అహంపదాభిమానియగు జీవుఁడు మాత్రము నీ రూపమును కనుగొనఁజాలక బహిర్భూతునివలె సతమతమగుచుండును. పృధివ్యాది తత్త్వములు నీవు కావని వేదములు నిరూపించుచున్నందున నవ్వానిని మించిన సత్యము నీవై పృధివ్యాదులను వ్యాపించి బ్రహ్మ మనఁబఱగుచున్నావు. పూర్ణబ్రహ్మంబు అమృతంబు శోకరహితంబు ఆనంద మాత్రంబునగు వస్తువు నీవేయని మా దృఢ నిశ్చయము.

ప్రపంచముఁజెందిన సృష్టిస్థితిలయములను చేయుచుందువుగాన నవ్వానిసంబంధము కలవానివలె కనుపడుచుందువు. నిజముగా విచారించినచో ఎట్టి ప్రమేయము లేనివాడవనియే చెప్పవచ్చును. నీవొక్కడవే సత్తుగా నసత్తుగా పరిణమించితివి. ఐనను అద్వయుడవనియే చెప్పుదురు. సువర్ణమొక్కటియే అద్దాని వికారములు భిన్నములగునట్లు నీ వొక్కడవే నీ శక్తులవలన భిన్న భిన్న రూపములు కలవాడ వగుచున్నావు.

శ్లో॥ తవైవ చరణాంభోజం - ముక్తికామా దృఢవ్రతాః
విసృజ్యోభయతః సంగం - మునయః సముపాసతే ॥ ౧౫

మౌనము అనఁగా మునిధర్మముగల మహానుభావులు శాంభవ మనఁబడు దృఢమైన వ్రతము గలవారై రాగద్వేషాది ద్వంద్వవికారములులేనివారై మోక్షము (పునరావృత్తి రహిత శాశ్వత శివసాయుజ్యము) కొరకు నీ పాదకమలమునే ఆరాధించుచున్నవారు. నీవే పూర్ణస్వరూపుడవు : అమృతుఁడవు, శోకమోహాది ప్రాకృత గుణములేనివాడవు. ఆనంద మాత్రుడవు; జీవాత్మభిన్నుడవై విశ్వము దగు సృష్టిస్థితి సంహారములఁ జేయుటకు జీవాత్మలో ప్రవేశించువాడవు; వాస్తవముగా ఎట్టి అపేక్షలేనివాడవనియే చెప్పవచ్చును. సదసత్తుల నతిక్రమించి యుండువాడవు గాన వస్తువులోని భేదమేగాని వస్తుభేదము లేదు. జీవులు అజ్ఞానవశమున నిన్ను గురుతెఱుగక నానావిధ వికల్పములఁజెంది భ్రమ ప్రమాదములకు లోనగుచున్నారు. జన్మపరంపరా సంబంధమును విడగొట్టుకొనువారికి ఎట్టి బాధలుండజాలవు. శంకరా! నిన్ను ప్రత్యక్షముగా చూడగలిగినందులకు మేము ధన్యులము. ఏకాంతభక్తితో సేవించువారికి బ్రహ్మానందమును కలుగఁ జేయువాడవు; గాన కరుణించుము!

జగమునకు మొదటివాడవు. నీకు మాత్ర మాద్యంతములు లేవు. ప్రకృతిని మించిన పురుషోత్తముఁడవు : విశ్వేశ్వరుఁడవు పరాత్పరుఁడవు; బ్రహ్మదేవుఁడు రజోగుణసంబంధము కలిగి





సృష్టిఁజేయుటయు నారాయణుఁడు సత్త్వగుణమును పరిగ్రహించి రక్షించుటయు నీ యనుగ్రహము వలననే యని భావించుచున్నాము. తమోగుణమును పరికరముగా చేబట్టి కాలాగ్నిరుద్రుఁడవై సంహారమును చేయుచున్నావు; సర్వవ్యాపివి, సదాశివుడవు; మహత్తత్త్వము పంచతన్మాత్రలు, పంచభూతములు, జ్ఞానకర్మేంద్రియములును నీచే నధిష్ఠింపఁబడియే వ్యక్తములగుచున్నవి. అనగా ఉపయోగముఁ జెందుచున్నవి. మహాదేవా! పరమేశ్వరా! అనుగ్రహింపుము! పురుషోత్తమా! కనికరింపుము! సప్తసముద్రములు వస్త్రములుగాను దశదిశలు భుజములుగాను స్వర్గము శిరస్సుగాను అంతరిక్షము నాభిగాను వాయువు ముక్కుగాను సూర్యచంద్రాగ్నులు మూడు నేత్రములుగాను మేఘములు వెంట్రుకలుగాను నక్షత్రములు గ్రహములు మున్నగు ఖేచరములన్నియు అలంకారములుగాను విశ్వరూపుడవై విరాజిల్లు నిన్ను ప్రార్థించుటకు నెవరి తరంబగును? మనోవాచామ గోచరుఁరుడవు;

**శ్లో॥ పంచస్యాయ చ రుద్రాయ - పంచాశత్ కోటి మూర్తయే ।**
**త్ర్యధిపాయ వరిష్ఠాయ - విద్యాతత్త్వాయ తే నమః ॥**

సద్యోజాత వామదేవ అఘోర తత్పురుష ఈశానము లనబఁడు ఐదు ముఖములు గలవాడును భక్తుల సంసారదుఃఖమును పోగొట్టువాడును ఏబదికోట్ల స్వరూపములు గలవాడును బ్రహ్మవిష్ణురుద్రులకు మించినవాడును శ్రేష్ఠుఁడును జ్ఞానాత్మకుఁడు నగు శివునకు నమస్కారము.

ఇదమిత్థమని నిర్దేశింపవలనుగాని నిత్యస్వరూపము గలవాడును మెఱుపువంటి ప్రకాశము అగ్నిఁ బోలిన వన్నెయుగల శంకరునకు నమస్కారము.

ఇట్టి స్తోత్రము నాకర్ణించి ప్రసన్నుడై శివుఁడు బ్రహ్మదేవునకు నభయము నొసగెను. అంతకేశవాది బృందారకులు మిగుల సంతృప్తిఁజెంది సంబరపడుచుండరి.

బ్రహ్మదేవుఁడు తన వీర్యమును నేలపై బాగుగా రాచినందున నేర్పడిన కణముల వలన వేలకొలది వాలఖిల్య ఋషులు జన్మించి "జనకా! జనకా!" యని యనురాగమున పలుకుచు బ్రహ్మను సమీపింపగా శివేఛ్ఛావశమున నారద మహర్షి – మీరందరుకూడి గంధమాదనపర్వతమునకుఁజని తపంబు గావింపుడు! సూర్యునకు శిష్యులగుదురు! ఇట నుండినచో మీ కేమియు ప్రయోజన ముండఁజాలదు" అని వక్కాణించెను.

అంత నవ్వారు శంకరునకు నమస్కరించి గంధమాదనమునకు వెళ్లగా నమరులు పంకజాసనుని పలువిధముల నూఱడింప నాతఁడు "దుర్మార్గుల గర్వము నణచు భక్తవత్సలుడు సర్వకార్యకర్తయు శంకరుడే యని మది నిశ్చయించుకొని,

దేవదేవా! మహాదేవా! కరుణాసాగరా! ప్రభో! సమస్తమునకు కర్తవు భర్తవు హర్తవు నీవేను; చరాచరమంతయు నీ యిష్టము ననుసరించియే ప్రవర్తించునది.

అని ప్రార్థించి కరముల ననుసంధించి శివునకు మ్రొక్కులిడగా విష్ణ్వాదులును మరల నొకతడవ వేడుకొనిరి. అంత శంకరుఁడు ప్రసన్నుడై యభయ మొసగినందున బ్రహ్మాదిదేవతలు సంతుష్టాంతరంగులై యున్నవారు.

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములో నలుబది తొమ్మిదవ యధ్యాయము.**

# పంచాశత్తమాధ్యాయము

## (పరిహాసమును వర్ణించుట)

అటుపిమ్మట బ్రహ్మదేవుఁడు – గౌరీశంకర వివాహ సందర్భమున నగ్నిహోత్రమునకుఁ జెందిన శేషకృత్యమును దంపతులకు శిరః స్నానమును ధ్రువదర్శనమును హృదయాలంభనమను కర్మను స్వస్తిపాఠమును మునిగణములతో గావింపఁజేసెను. తరువాత శంకరుఁడు బ్రాహ్మణానుమతిని పార్వతీదేవి శిరముపై సింధూరము నలఁదెను. అట్టితతీ యామె యద్భుతమైన శరీరముఖకాంతులు గలదిగా కన్పట్టుచుండుటయేగాక దంపతులు నొకే పీఠముపై నాసీనులైనందున భక్తులకు సుఖము నొదవఁజేయు పరమ శోభతో రాణించుచుండిరి. ఇట్లు వివాహయజ్ఞము ముగియగా శంకరుఁడు బ్రహ్మదేవునకు పూర్ణపాత్రమును గోదానమును మంగళప్రదములైన మహాదానములను సమర్పించుటయేగాక బ్రాహ్మణులకు నూరు సువర్ణ ముద్రికలను కోట్లకొలది రత్నములను నానావిధ వస్తువులను దానము నొనర్చెను. ఆ సమయమున దేవతలు నిఖిల ప్రాణులును జయ శబ్దము నుచ్చరించుచు సంతోషించుచుండిరి. మంగళవాద్యములు మ్రోగింపఁబడుచుండెను. సంగీతములు శ్రవణపేయము లగుచుండెను. విష్ణుబ్రహ్మలు ఇంద్రాద్యమరులు మునులు తదితరులందరును హిమవంతుని సంప్రదించి తమ తమ నివాసస్థలములకు వెళ్ళియుండిరి.

అంత పర్వతరాజు పట్టణమునందలి ముఖ్య సువాసినులు పార్వతీపరమేశ్వరులను శయనాగారమునకు గొంపోయి లౌకికాచారముల నన్నిటి నొనర్చుచుండిరి. తాంబూలదానాది మంగళ కార్యముల నెరవేర్చి లోనికి ప్రవేశింపఁజేసి యందరును చిరునగవుతో క్రేగంటి చూపులతోడను దంపతుల నవలోకించుచు గగ్గుర్పాటులఁజెందుచు తమ పరమేశ్వర సందర్శన భాగ్యమును ప్రశంసించుకొనుచుండిరి.

అట్టితతీ సుందర తమ వేషముతో సర్వవిధ లావణ్యముతోడను నవయౌవనము తోడను కామినీ మనంబులను మోహింపఁజేయువాడై ఇంచుక నగవుతో ప్రసన్నమైన ముఖకమలముతో కటాక్షవీక్షణములతో నలరారుచు సూక్ష్మమైన పట్టుధోవతిఁ గట్టుకొని యున్న శంకరుని కనులార చూచుటకు పదునాఱుగురు నమరనారీమణులు గొప్ప వేడుకతో నరుదెంచినవారు. సరస్వతీదేవియు లక్ష్మీదేవియు సావిత్రియు జాహ్నవియు అదితియు శచీదేవియు లోపాముద్రయు అరుంధతియు అహల్యయు తులసీదేవియు స్వాహాదేవియు రోహిణియు వసుంధరయు శతరూపయు సంజ్ఞాదేవియు రతీదేవియు దేవకన్యలు నాగకన్యకలు మునికన్యలు నెందరెందరో లెక్కింపనలవిగానివారు నచటికి నేతెంచిరి.

ఆ ముత్తైదువలు – రత్నపీఠముపై కూర్చున్న శంకరు నుద్దేశించి మధురమైన పరిహాసముతో కూడిన వినోద వాక్యములను దిగువ విధము పలుకుచుండిరి.

సరస్వతీదేవి – మహాదేవా! ప్రాణప్రియురాలైన మా కాళిని పరిగ్రహించితివి. చంద్రునిఁబోలిన ప్రియురాలి ముఖమును గాంచుచు సతీవియోగదుఃఖమును తొలగించుకొనుము! కాలకాలుడా! పార్వతిని కౌగలించుకొని యామెను సుఖపెట్టుచు కాలముఁ గడుపుము! మీ దంపతులకు నెల్లకాలము వియోగము కలుగకుండుగాక!





లక్ష్మీదేవి – దేవదేవా! గౌరిని విడనాడి క్షణకాలము గూడ నుండఁజాలవుగదా! ఇఁక సిగ్గెందులకు? దరిఁజేర్చుకొని సుఖింపుము!

సావిత్రీదేవి – శంభో! గిరిజాదేవికి ఫలాదికమును తినిపించి వడిగా నీవు భక్షించుము! వెనువెంటనే ఆచమనముఁజేసి కర్పూర తాంబూలమును పార్వతి కీయుము! విచారపడెద వెందులకు?

జాహ్నవిదేవి – బంగారు దువ్వెనతో ప్రియురాలి వెంట్రుకలను దూయుము! సాధ్వికి పతియనురాగము ఁబడయుటకన్న నెక్కువ సౌభాగ్యం బెద్దికలదు.

అదితీదేవి – శంకరా! దంపతులు మీరు కూడ భుజించునప్పుడు భోజనాంతమున ముఖశుద్ధి కొరకు పార్వతికి జలమునొసగుము! లోకమున దంపతుల పరస్పరానురాగమే మిన్నయైనది.

శచీదేవి – సతీదేవిని విడనాడజాలక నామెను భుజముపై మోయుచు ప్రపంచమున పరిభ్రమించిన నీకు పార్వతిని సమీపించుటకై బిడియ మెందులకు?

లోపాముద్రాదేవి – అంతః పురమున క్షీరముఁద్రావి ఫలములను మధురపదార్థములను తాను తిని ప్రియురాలికి తినిపించియు తాంబూలము నొసగుట లోకాచారమై యున్నది. అట్లు గావించి రతిసుఖములఁ బడయుము!

అరుంధతీదేవి – పార్వతి నొసగుట కియ్యకొనిన మేనకాదేవిని పలువిధముల మెప్పించి నీ కిప్పించితిని గాన నీమెన బుజ్జగించి సురతము నొనర్పుము!

అహల్యాదేవి – పరమేశ్వరా! సనాతనుడ నని యిప్పుడు గూడ ముదుసలివి కావలదు. మేనకాదేవికి మురిపెముఁగొలిపిన యౌవనము తోడనే ఏకాంత సుఖములఁ దేలుము!

తులసీదేవి – మహేశ్వరా! సతీదేవిని విడనాడితివి. మన్మథుని కాల్చితివి. ఐన నీ పార్వతీదేవిఁ బడయుటకై హిమవంతునిసన్నిధికి వసిష్ఠమహర్షి నేల పంపితివి?

స్వాహాదేవి – తరుణుల నర్మవాక్యములకు తబ్బిబ్బుగాకుము! వివాహమున వనితలు ప్రగల్భముగా మాటలాడుట – లోకాచారముగా నున్నయది.

రోహిణీదేవి – కామశాస్త్రవిశారదుడవు; పార్వతీదేవిఁదగు కోరిక నెరవేర్చుము! కామినుల కామము సముద్రమువంటిది; అట్టి సముద్రముఁదగు తీరమును చేర్చుము!

వసుంధరాదేవి – కామార్తులగు తరుణుల మనోభావమును కనిపెట్టువాడవు; సర్వవిధభావములు నీవేయైనను ఇట్టి శృంగార సమయమున రతిభావము నిన్నుగూడ విడువఁజాలదు.

శతరూపాదేవి – ఆకలిఁగొన్నవాడు కడుపునిండ రుచికరపదార్థములను తిననిది తృప్తిఁబొందఁ జాలడు. అటులే నీ సుఖసమయమున ప్రియురాలికి సంతసమొదవునట్లు ప్రవర్తించుము!

సంజ్ఞాదేవి – సువాసినులారా! ఏకాంతస్థలమున పడకనమర్చి రత్నదీపమును తాంబూలాదికమును నెలకొలిపియు పార్వతీదేవితోగూడ శంకరుని వడిగా పంపుడు!





యోగీశ్వరులకు నాచార్యుఁడు నిర్వికారుఁడునగు భగవానుఁడు సురనారీమణుల విలాసవచస్సులను మనసార నాలకించి "అమ్మలారా! మీరందరు జగన్మాతలు; కుమారునిఁ బోలు నాయెడ నిట్టి మాటలాడుట యెందులకు?" అని వక్కాణింప నవ్వారు సిగ్గుఁజెంది చిత్తరులవలె నిశ్చేష్టురాండ్రగుచుండిరి. అంత మహేశ్వరుఁడు సంబరపడుచు మిష్టాన్నములను పార్వతీదేవితో గూడభుజించి కర్పూరవిడియమును పరిగ్రహించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నేబదియవ యధ్యాయము.

## ఏక పంచాశాధ్యాయము

### (మన్మథుని బ్రతికించుట)

అట్టి అనుకూల సమయమున దీనవత్సలుఁడగు శంకరుని రతీదేవి ఇట్లు ప్రార్థించెను.

భక్తవశంకరా! పార్వతిని పరిగ్రహించి మిక్కిలి దుర్లభంబగు సౌభాగ్యమును లోకమునకు నొసఁగూర్చితివి కావున నా పతియగు కాముని దహించుట నిరర్థకంబని తోచెడిని. ఇప్పుడు నాపతిని బ్రతికించియే పార్వతిదేవితో సరసముగా విహరించుమని ప్రార్థించుచున్నాను. యువతీయువకుల యెడఁబాటు వలన కలుగు సంతాపమును తొలగింపుము! ఈ నీ వివాహసమయమున జనులందరును సుఖసంతోషములఁ జెందుచుండగా నేనొక్కతెనే దుఃఖింపవలెనా? దీనబాంధవా! శంకరా! నన్ను నాథునితో కూడియుండ దానిగా నొనర్పుము! చరాచరప్రపంచమున నాదుఃఖమును నివారించుటకు నీవు దక్క మరియొకడు సమర్థుఁడుకాడు. నాభర్తను జీవింపఁజేసితివేని పార్వతీదేవితో నీవు పరిపూర్ణముగా సుఖింపఁజాలుదువు సమస్తంబు చేయుటకు సమర్థుడవు నీవేను; వేయేల? నా పతిని త్వరలో బ్రతికించుమని ముమ్మారు వేడుచున్నాను.

ఇంతమాత్రము వచించి రతీదేవి తన కొంగున ముడిచియున్న భస్మను నాథా! నాథా! అని వగచుచు శంకరుని ముందు నునిచెను. రతీదేవిదగురోదనమును సరస్వతీదేవి మున్నగువారు విని దుఃఖించుచు దీనవదనలై "పరమేశ్వరా! భక్తవత్సలుఁడను పేరు నీకు ప్రసిద్ధమైయున్నది. కావున కరుణించి మన్మథుని జీవింపఁజేసి రతీదేవిని సనాథగా గావింపుము అని ప్రార్థింప శంకరుఁడు నవ్వారి విన్నపము నాలకించి భస్మపై యమృతవీక్షణములను ప్రసరింపఁజేయగా నా విభూతినుండి మన్మథుడు - పూర్వరూప సౌందర్యములతో బయలు వెడలి కనుపడగా రతీదేవి తనభర్తనుగాంచి మహేశ్వరునకుభర్తకును ప్రణామమునాచరించెను.

మరియు నంజలిఁఘటించి తన పతితోకూడ శంకరుని నానావిధ స్తోత్రములతో ప్రార్థింప శంకరుడు "మన్మథా! నీవు చేసిన స్తోత్రమున మిగుల సంతసించుచున్నాను. వరముఁగోరుకొనుము ఇచ్చెద" నని సెలవిచ్చెను. అంత మన్మథుఁడు - మహాదేవా! కరుణాసాగరా! నీ మహిమఁదెలియక నేను మున్నొనర్చిన యపరాధమును సైరింపుము! నీభక్తుల యెడ ననురాగమును నీ చరణకమలములయందు భక్తిని





ప్రసాదింపుము! నన్నెల్లకాలము కృపాదృష్టితో ననుగ్రహింపుము! అని యాచింప శంకరుడు వల్లెయని "మన్మధా! ఇకముందు నీకు ఎట్టి భయంబు నుండజాలదు. వెళ్ళుము! విష్ణుమూర్తి మున్నగువారి చెంత నుండుము!" అని వక్కాణింపగా మన్మధుడు శంకరునకు ప్రదక్షిణ నమస్కారములను సమర్పించి వెలుపలికి వచ్చినవాడై నారాయణుడు మొదలగు వారికి మ్రొక్కులిడి యుండగా నమరులు మన్మధుని పలుకరించి శుభాశీర్వాదముల నొసగుటయేగాక "మన్మధా! శంకరుడు - సహజ సత్త్వాంశముదగు కరుణాదృష్టితో నిన్ను జీవింపజేసినవాడు! ఇకముందు స్వార్థపరులమాటలను నమ్మి మోసపోకుము! జాగ్రత్తగా లోకోపకారమును చేయుచు సుఖముగా జీవించుము! నిజముగా విచారించి చూచినచో సుఖమునుగాని దుఃఖమునుగాని కలుగజేయువాడు తానేయని భావింపుము! ప్రతిజీవియు తాజేసిన కర్మదగు ఫలము ననుభవించునుగదా!

శ్లో|| కాలే రక్షా వివాహశ్చ - నిషేకః కేన వార్యతే

సమయాను సారముగా ప్రతిప్రాణిని కాపాడుటను వివాహమును ఏకాంతసుఖమును ఎంతటివారైన నాపజాలరు" అని సంభాషించి మిన్నకుండిరి. మన్మధుడును దేవతలచెంత నిశ్చింతగానుండెను.

అట్టితతి గౌరీనాధుడు లోకాచారము ననుసరించి మేనకాదేవి ననుమతిని జనావాసమునకు మరల నొకసారి వెళ్ళగా వేదధ్వనియు మంగళవాద్యధ్వనియు చెలరేగుచుండెను. జయశబ్దము నుచ్చరించుచు విష్ణుబ్రహ్మాదులు దిగువవిధము శంకరుని నుతించుచుండిరి.

శంభో! అఖిలాధారా! మహేశ్వరా! మహాదేవా! రుద్రా! విశ్వంభరా! వృద్ధి నొందుము! కాశీపతే! త్ర్యంబకేశ్వరా! మాయాధీశ్వరా! ఆనందమయా! మాకానందము నొనగూర్చుము. నిర్గుణుడవు; నిష్కాముండవు; సర్వవ్యాపకుఁడవు. అఖిలాధారుడ వయ్యును లీలారూపమును ధరించియుండువాడవు; ఇట్టినీకు నమస్కారము. భక్తుల మనోరధంబుల నీడేర్చుటకై కొన్ని ప్రదేశములయందు జ్యోతిర్లింగరూపమున నివసించు కరుణాసముద్రుడవు; సర్వాంతర్యామివై దీనులనుకాపాడుచుందువు; అవాఙ్మానసగోచరంబగు సచ్చిదానంద విగ్రహము కలవాడవు; మమ్ము సర్వదా రక్షించుము!

అంత శంకరుఁడు నవ్వారి నుతుల నభినందించి యధోచితము సత్కరింపగా నమరులు మిగుల కృతార్థులమని భావించుచు తమతమ నివాసములకుఁజని విశ్రాంతిఁజెందుచుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏబదియొకటవ యధ్యాయము.





# ద్విపంచాశాధ్యాయము

## (వరవర్గభోజనము, శివుని శయనమున్ను)

భాగ్యవంతుడైన హిమవానుఁడు వియ్యాలవారి విందునకై విశాలప్రదేశము నేర్పఱచి యందు చాన్పు చల్లించి అలికించియు ముగ్గులు వేయించియు పరిమళముగల పలువస్తువుల నమర్చెను. అమరులను తదితరులందరిని కుమారులతోడను తనవారితోడను భోజనార్థము పిలిపించెను. శంకరుఁడు కేశవుఁడు పద్మజుఁడు దేవేంద్రుడు సురలును హిమవంతుని పిలుపు ననుసరించి భోజనశాలకు వెళ్ళుచుండిరి. అట ప్రభువును బృందారకులనందరిని నగరాజు యథోచితముగా సత్కరించి మంచిపీటలపై కూర్చుండఁజేసెను. అనేకవిధములైన రుచికర మధురపదార్థములను పిండివంటలను పాత్రలయందు వడ్డింపఁజేసి భుజింపుడని విన్నవింపగా విష్ణుమూర్తిమున్నగు నమరులు సదాశివుని పురస్కరించుకొని మిగుల సంబరమున పంక్తిభోజనమును చేయుచుండిరి. నంది భృంగి వీరభద్రాది గణాధిపతులు ప్రమథగణంబులును నిండువేడుకతో మిష్టాన్నములను మెక్కుచుండిరి. భృగువుమొదలగు ఋషులు మునులు సిద్ధులు సాధ్యులు కిన్నరకింపురుష యక్షగంధర్వాదులును వేరు వేరు వరుసలలో ప్రేమాను రాగములు ఉట్టిపడుచుండగా కుడుచుచుండిరి. చండీగణంబులును బహువిధములైన చమత్కార వాక్యములఁబలుకుచు కుతూహలములను వెదఁజల్లుచు కడుపునిండ తినుచుండిరి. భక్ష్యములు అప్పడములు కూరగాయలు వివిధమధురసపానీయములు వ్యంజనములు (పచ్చడలు) మొదలగు నపూర్వమైన అద్వితీయమగు గట్టురేడు విందును పసందుగా నారగించి విష్ణ్వాది దేవతలు తమ తమ నెలవులకుఁజని విశ్రమించుచుండిరి.

పతివ్రతామతల్లులందరును మేనకాదేవి యనుమతిని శంకరుని సుఖవాసమనఁబఱగు మనోహర భవనములోనికి గొంపోవగా నట రత్నసింహాసనము నందాసీనుఁడై వాసమందిరమును శివుఁడు గాంచుచుండెను. అందు వందలకొలది రత్నదీపములు వెలుగుచుండినవి. అటనట రత్నకలశము లమర్పఁబడియుండెను. ముక్తామణులతోడను రత్నదర్పణములతోడను శ్వేత చామరములతోడను నానావిధ చిత్ర విచిత్ర నిర్మాణములతోడను విరాజిల్లు నా మందిరము శివలోకమనఁబఱగినదై శంకరుని ప్రభావమే యిట్లు పరిణమించినదా యన్నట్లు గోచరించుచుండెను.

మఱియు నచట పలురకములగు పరిమళద్రవ్యములు, పువ్వుల పాన్పు, మొదలగునవి చిత్తమును రంజిలఁజేయుచుండెను. ఒకచో వైకుంఠము మరియొకచో బ్రహ్మలోకము ఇంక నొకచో దిక్పాలుర నివాసంబులును మరియొకచో స్వర్గంబును ఒకానొక సముచిత స్థలమున కైలాసంబును మరియొక మహోన్నత ప్రదేశమున సర్వోపరి విరాజితంబగు శివలోకంబును విశ్వకర్మచే నేర్పరుపఁబడియుండెను.

ఇట్టి యద్భుతదృశ్యములు గల విశ్రాంతిమందిరమును శంకరుఁడు కనులార గాంచి హిమవంతుని లోలోన కొనియాడుచు రత్నపర్యంకము (పాన్పు) నందు లీలగా శయనించినవాడు. హిమవంతుడును తన వారికి తదితరులకును భోజనంబునిడి ఆనాటి కార్యమునంతయు ముగించుకొనినవాడు.





మిక్కిలి ప్రియమైన శయనాగారమునందు భగవానుఁడు నిద్రించియుండగా రాత్రి యంతయు గడచి ప్రాతఃకాలంబయ్యెను. అట్టితఱి జనులు వేడుకతో నానావిధ మంగళవాద్యములను మ్రోగించుచుండిరి. నారాయణుఁడు మున్నగు నమరులు మేలుకొని తమ యిష్టదైవమగు శంకరుని స్మరించి కాలకృత్యములఁదీర్చుకొని కైలాసమున కేగుటకు తమతమ వాహనముల నాయత్త పఱచు కొనుచుండిరి.

అప్పుడు ధర్మదేవత – కేశవుని యానతిని శంకరుని నివాస గృహమునకుఁజని యిట్లు ప్రార్థించెను.

శ్లో॥ **ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రంతే - భవ! నః ప్రమథాధిప ।**
**జనావాసం సమాగచ్ఛ - కృతార్థాన్ కురు తత్ర తాన్ ॥**

శంకరా! లెమ్ము! నీకు శుభమగు గాక! ప్రమథాధిపతీ! మాకును మంగళము నొనఁగూర్పుము! జనావాసమునకు అనఁగా విడిదిచోటునకు నేతెంచి యచటివారందరిని ధన్యుల జేయుము!

మహేశ్వరుఁడు ధర్ముని ప్రార్థనము నాలకించి చిరునగవుతో మేలుకొని కృపాదృష్టి నవలోకించియు సొన్పుడిగ్గియు ధర్మా! నీవు మొదట వెళ్లుము! తరువాత నే వేగమే వచ్చెదనని వచింపగా ధర్మదేవత ముందు వెళ్ళెను. పిమ్మట నాతడు బయలుదేరుచుండగా నాడవారు గొప్ప వేడుకతో మంగళగీతములను పాడుచు శంకరుని పాదకమలములను చూచుచుండిరి.

అట్లు నా మహానుభావుఁడు వారిచే సత్కరింపఁబడి ప్రాతఃకృత్యమును ముగించుకొని మేనకా హిమవంతులను సంప్రదించియు జనావాసమునకుఁజనినవాడు. అట వేదనాదంబును చతుర్విధ వాద్యఘట్టనంబును చెలరేగగా శంకరుఁడు హరిబ్రహ్మాదుల వందనముల నందుకొని సుఖాసీనుండయ్యెను. అట్టి మహోత్సవము వర్ణనాతీతము గదా!

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద**
**ప్రవచనముతో ఏబదిరెండవ యధ్యాయము.**

## త్రిపంచాశాధ్యాయము

### (శంకరుని ప్రయాణమును వర్ణించుట)

అటుపిమ్మట హరిబ్రహ్మాది బృందారకులు తపోధనులైన మునులును కాలకృత్యములఁదీర్చుకొని హిమాలయమునుండి బయలుదేర నుద్యుక్తులగుచుండగా హిమవంతుఁడు ప్రాతఃస్నానము నాచరించి సంధ్యావందన శివారాధనములను నెరవేర్చుకొనియు, పురప్రముఖులతోడను సన్నిహితబంధువులతోడను జనావాసమునకు వెళ్ళి శంకరుని దర్శించి ప్రణమిల్లియు "దేవా! కొన్ని దినములు నా గృహమున వీరందరితో గూడ నివసింపుమనియు నీ దర్శనము చేతనే కృతార్థుడ నగుదుననియు దేవతలందరిని వెంటనిడుకొని వేంచేసిన నీ యనుగ్రహమునకు పాత్రుడనై ధన్యుడనైతి ననియు" విన్నవించి యంజలిఁ ఘటించి నారాయణుఁడు మున్నగువారి నాహ్వానించెను. అంత నవ్వారు శంకరుఁడు హిమవంతుని ప్రార్థనము నంగీకరించినట్లు కనుగొని సంతుష్టాంతరంగులై "నగరాజా! ధన్యుడవు. నీ కీర్తి మిగుల

విశాలమైనది. పరమాత్మయు సత్పురుషప్రాప్యుఁడు నగు శంకరుఁడు తన యనుచరులతో నీ యింట నుండుటఁజేసి నీతో సరిఁదూగు పుణ్యాత్ముఁడు ముల్లోకములయందు లేడని చెప్పవచ్చును. విడిదియిల్లు మిక్కిలి మనోరంజకముగా సమర్చితివి. సత్కారమును బాగుగా చేసితివి. నీ విడిన భోజనములు నపూర్వములై వర్ణింపనలవిఁగానివి. జగదంబయగు పరాశక్తి పార్వతీరూపమున నీ యింట నివసించినది కావున నీ సమృద్ధియంతయు చిత్రముకాదు. ఇట్టి గౌరీశంకర కల్యాణమునకు వచ్చినందున మేము ధన్యులమైతిమి" అని వచింపగా హిమవంతుఁడును తదీయులును మునిదేవతాగంధర్వాదులను ప్రశంసించిరి.

ఇట్లు వారు నొండొరులను బాగుగా మందలించుకొనుచుండగా గొప్ప వేడుకయు వేదధ్వనియు జయధ్వానంబును చెలరేగినవి. మరియు మంగళగానము నృత్యంబు వందిమాగధ స్తోత్రంబులును బ్రాహ్మణులకు వివిధ దానంబులును నెరవేర్పఁబడుచుండెను.

అంత గిరిరాజు మహాదేవు ననుమతిని స్వనివాసమునకుఁజని నానావిధములగు ఏర్పాట్లతో భోజనప్రబంధమును చేయుచుండెను. తదర్థము సర్వేశ్వరుఁడు తన వారందరితో వేంచేయగా మొదట శంకరుని పాదములను కడిగి తరువాత హరిబ్రహ్మల యొక్కయు ఇంద్రాద్యమరుల యొక్కయు మునుల యొక్కయు చరణములను ప్రక్షాళించియు నందరిని భోజనమండపమున వారి వారికిఁదగిన పీఠములయందు నాసీనులఁజేసినవాడు.

పలురకముల పక్వాన్నములను వడ్డింపఁజేయగా మహేశ్వరుఁడు విష్ణుబ్రహ్మాదులును సంబరమున మెక్కుచుండిరి. అట్టితఱి సువాసినులు భుజించుచున్నవారి నవలోకించుచు మృదుమధుర సరసవాక్యములతో చమత్కరించుచుండిరి. అట్లు వారు కడుపునిండ తిని తాంబూలముఁగైకొనియు హిమవంతుని పలుకరించి తమతమ నెలవులకేగి విశ్రమించియుండిరి.

ఇట్లు మూడవనాడు నాలుగవనాడును యథావిధిగా గట్టురేడు వివాహోచిత కృత్యములను నెరవేర్చించి యనేక దానముల నొనర్చినవాడు. వివాహము నాలుగవ దినముతోడనే పూర్తియగును గదా! ఐదవనాడు వెళ్ళుదుమని యమరులనఁగా ఇంక కొన్నిదినములు నివసింపుడని హిమవంతుఁడు కోరినందున నవ్వారటులే సముచిత మర్యాదల నందుకొనుచు బహుదినములఁగడిపి సప్తర్షులను హిమవంతుని చెంతనంపగా నవ్వారు మేనకాహిమవంతులకు శివతత్త్వమును ప్రశంసించి సమయోచితముగా శంకరుని ప్రయాణమును గురించి సంభాషించిరి. అంత హిమవంతుఁడంగీకరింపగా శంకరుఁడు సపరివారముగా కైలాసమునకు బయలుదేర నుద్యుక్తుడయ్యెను.

అట్టితఱి మేనకాదేవి మిగుల దుఃఖించుచు దిగువవిధము విన్నవించినది. దేవా! దయగలవాడవై పార్వతి నేలుకొనుము! వేయితప్పులైనను క్షమింపుము! ఆశుతోషుడవు గదా! నాయనుఁగుకుమార్తె యీ జన్మలోనే గాక ప్రతిజన్మయందును నీ పాదాంబుజములను సేవించినదై మహాదేవుని దక్క నితరుని స్వప్నమున జాగరూకతయందును స్మరింపజాలదు. మరియు నీ గొప్పదనమును విన్నంతమాత్రమున గగుర్పాటుఁజెందును. నీ నింద నాకర్ణించు నెడ చచ్చిన దానివలె మాటలాడకుండును.





ఇంతమాత్రము వచించి పార్వతిని శంకరున కొప్పగించి హెచ్చుగా రోదనము జేయుచు నవ్వారిముందు మూర్ఛితురాలయ్యెను. అంత హిమవంతుడు మేనకాదేవి నూఱడించి దేవతలందరితో గూడ శంకరుని పయనమునకై వలయు సన్నాహములజేయుచుండెను. అమరులును గిరిరాజునకు శుభమును చింతించి బయలుదేరి హిమాచలముదగు బాహ్యోద్యానమునకుజని శంకరుని రాకకై నిరీక్షించుచుండిరి.

సప్తర్షులు - ప్రస్తుతమునకుదగు ప్రయాణమును పార్వతీదేవిచే చేయించుమని హిమవంతునకు చెప్పగా నాతడు పార్వతి యెడబాటు నోర్వలేక కొంతకాలము బాధపడి యెట్టకేలకు నూఱటజెందియు పార్వతిని సాగనంపుమని మేనకాదేవికి చెప్పిపంపెను. అంత నామె విరహబాధ ననుభవించుచు నొకవంక సంబరపడుచున్నదై శ్రుతిస్మృతి సమ్మతమగు కులాచారము నాచరించియు పంద్రెండ్రు విధములగు శృంగార అభరణములతో పార్వతీదేవి నలంకరించెను.

మునులారా! శంకరుని కల్యాణప్రయాణమును సంగ్రహముగా వివరించితిని. ఇక తల్లిదండ్రుల నెడబాసి బయలుదేరు పార్వతీదేవిదగు ప్రయాణమును చెప్పెదను. వినుడు! అని సూతమహర్షి శౌనకాదులకు వచించినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏబదిమూడవ యధ్యాయము.

## చతుఃపంచాశాధ్యాయము

### (పతివ్రతాధర్మ వర్ణనము)

మఱియు సూతుడు చెప్పఁదొడగెను.

సప్తర్షులు - ప్రస్తుతమునకుఁదగు ప్రయాణమును పార్వతీదేవిచే చేయించుమని హిమవంతునకు చెప్పగా నాతడు పార్వతియెడబాటు నోర్వలేక కొంతకాలము బాధబడి యెట్టకేలకు నూఱటఁజెందియు పార్వతిని సాగనంపుమని మేనకాదేవికి చెప్పిపంపెను. అంత నామె విరహబాధ ననుభవించుచు నొకవంక సంబరబడుచున్నదై శ్రుతిస్మృతి సమ్మతమగు కులాచారము నాచరించియు పంద్రెండ్రు విధములగు శృంగార అభరణములతో పార్వతీదేవి నలంకరించెను.

అట్టితఱి నొక బ్రాహ్మణసువాసినీవనిత - మేనకాదేవి ఁదగు హృద్గతమును గుర్తెరిగి పార్వతీదేవికి పతివ్రతాధర్మముల నిట్లు నుపదేశించెను.

పార్వతీ! ధర్మమును పెంపొందించు నా మాటలు వినుము! ఈ నా ప్రబోధము ఇహపర లోకములయందు ఆనందము నొనఁగూర్చును. నీకేగాక నిద్దానిని వినువారికిని మేలు నొదవఁజేయును.

లోకమున పతివ్రతయే ధన్యురాలు, మరియొకర్తునెంతటి యోగ్యతకలదైనను గౌరవింపఁదగినది కాదు. పతివ్రత - లోకముల నన్నిటిని పవిత్రములఁ జేయుటేగాక భక్తితో తనను చూచువారి కల్మషముల నన్నిటిని పోగొట్టును.





శ్లో॥ సేవతే యా పతిం ప్రేమ్ణా - పరమేశ్వర వచ్ఛివే ।
ఇహ భుక్త్వాఽఖిలాన్ భోగా - నంతే పత్యాశివం వ్రజేత్ ॥ ౧౦

భర్తను భగవంతునివలె ననురాగముచే సేవించు సాధ్వీమణి - జీవితమును సమస్త సంసార విహిత సుఖముఁ ననుభవించి జీవితాంతమునందు భర్తతో గూడ జన్మరాహిత్యమును పొందును. అనఁగా శివసాయుజ్యముఁ జెందునని భావము.

సావిత్రి, లోపాముద్ర, అరుంధతి, శాండిల్య, శతరూప, అనసూయ, లక్ష్మీదేవి, స్వధ, సతి, సంజ్ఞ, సుమతి, శ్రద్ధ, మేనక, స్వాహాదేవి, ఇత్యాది సాధ్వీమణులందరును పాతివ్రత్యము వలననే అనఁగా పతిసేవనమే వ్రతముగా గలిగియుండుటచేతనే లోకమున సత్పురుషులచే పూజింపఁబడుచున్నవారు. ఇంతియేగాక బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నవ్వారి నాదరింతురు.

ఇఁక నీ భర్త యన్ననో సామాన్యుఁడుగాడు. దీనులపాలిటి పెన్నిధియు భక్తులచే సేవింపఁ బడువాడును సత్పురుషులకు ప్రాప్యుఁడునై యున్నవాడు. మఱియు భక్తులకుసుఖమును ఆనందమును కలుగఁజేయువాడును పరమాత్మయు నగు శంకరుని నిరంతర మారాధింపుము!

శృతిస్మృతులయందు పతివ్రతాధర్మము శ్రేష్ఠంబని వర్ణింపఁబడినది. అదెట్లనఁగా? పతివ్రత - భర్త భుజించిన తరువాతనే భుజింపవలెను. అతఁడు నిలచియున్నచో తానును నిలుపఁబడవలెను. భర్త నిద్రించిన పిమ్మట తాను శయనింపవలెను. అతఁడు మేలుకొనక ముందు తాను నిద్రనుండిలేవవలెను. ఎట్టి దావరికము లేనిదై ఎల్లకాలము భర్తకు హితము నాచరింపవలెను. సాధ్వీవనిత - తానలంకరించుకొనియే భర్తకు కనుబడవలెను. అతఁడు గ్రామాంతరము వెళ్ళినపుడు మాత్రము కుంకుమ మొదలగు మంగళద్రవ్యముల నుపయోగించి యలంకారమును మానవలెను. భర్త పేరు తానెప్పుడు నుచ్చరింపరాదు. ఒకవేళ నాతడు తీక్ష్ణముగా మాటలాడినను శిక్షించినను తాను మరల నాక్రోశముఁ జెందరాదు. భర్తపిలచినపుడు ఇంటిపనులను విడచి వెళ్ళి నమస్కరించి స్వామీ! ఏమిటి! అని వినయముతో ప్రశ్నించి యాతఁడు చెప్పినకార్యమును ప్రసన్నమనంబున గావింపవలెను.

ఇంటివాకిలిని చాలకాలము తాను నిలువఁబడరాదు. పరగృహమునకు భర్తయనుమతి లేనిది పోకూడదు. భర్త నుడివిన రహస్యవృత్తాంతము నితరులకు చెప్పవలదు. భర్త దేవుని పూజించుటకు వలయు పత్రపుష్పాదులను చెప్పకమునుపే సమర్చియుంచవలెను.

భర్తకు ఎప్పుడెప్పుడు ఏమేమి కావలెనో అట్టి అవసరములఁ దీర్చుటకై పతివ్రత - సంసిద్ధురాలై యుండవలెను. పతి - యభిమతము లేనిది కాశీరామేశ్వరాది తీర్థక్షేత్రములకు వెళ్ళకూడదు. ఊరేగింపులు సమాజములు మున్నగు వానిలో పాలుగొనరాదు. ఒకవేళ పుణ్యతీర్థములందు గ్రుంకులిడవలెనని కోర్కెగలిగినచో భర్తగారి పాదోదకమును చల్లుకొని పుచ్చుకొనవలెను. ఎందుకనఁగా? గంగాది పుణ్యతీర్థములు కాశ్యాదిపుణ్యక్షేత్రములును పతిచరణోదకమునందు కలవని పతివ్రతాధర్మశాస్త్రము చెప్పుచున్నది. కావున సంశయింపరాదు. భర్త తినఁగా మిగిలినది ప్రసాదమని భావించి సాధ్వీమణి పరిగ్రహింపవలెను. దేవతానివేదనమును చేయకుండా పితృదినమునాడు పెద్దలకు సమర్పింపకను అతిథులకు పరిచారకులకు పశువులకు బిచ్చగాండ్రకు నొసగకుండను. తాను ఆహారమును స్వీకరింపరాదు.





గృహమున పరికరముల నన్నిటి నెప్పటికప్పుడు సరిఁజూచుకొనవలెను. విసుగు లేనిదై సంభ్రమున నుంటూ అనవసర వ్యయములఁజేయనిదై అనఁగా పొదుపు గలిగి యుండవలెను.

భర్త యాజ్ఞలేనిది యుపవాసమును చేయరాదు. ఒకవేళ స్వేచ్ఛగా నుపవాసము నాచరించినచో అట్టి వనితకు ఉపవాసఫలము సమకూరుకుండుటయే గాక నరకంబు నొనఁగూరును.

ప్రాణనాధుడు సుఖముగా నిశ్చింతగా నున్నపుడు యధేష్టము విహరించు నపుడు ఆటంకములను కల్పించరాదు. భర్తబలహీనుడైనను కష్టాలపాలైనను రోగగ్రస్తుడైనను ముదుసలియైనను సంతోష స్వాంతుడైనను మిడుకువాడైనను ఆతనిని తిరస్కరింపరాదు. రజస్వలగా నున్నతతి మూడుదినములు భర్తకు కనుపడనిదై తనమాటను వినుపింపఁగూడదు. నాలుగవనాడు సుస్నాతయై మొట్టమొదట భర్త ముఖమునుచూడవలెను. వీలులేనిచో పతిని మదిని తలచుకొని సూర్యునవలోకింపవలెను.

శ్లో॥ హరిద్రాకుంకుమంచైవ - సింధూరం కజ్జతాదికం
కుర్పాసకంచ తాంబూలం - మాంగల్యాభరణాధికమ్ ॥ ౩౪
కేశసంస్కారకబరీ - కర కర్ణాది భూషణం
భర్తు రాయుష్య మిచ్ఛంతీ - దూరయే న్న పతివ్రతా ॥ ౩౫

పసుపు, కుంకుమలు, సింధూరము, కాటుక, రవిక, తాంబూలము, మంగళసూత్రము, మెట్టెలు, గాజులు, కమ్మలు, మొదలగు మాంగల్యవస్తువులను పతివ్రతయగు వనిత దూరము చేయరాదు. అనఁగా ఎల్లకాలము ధరించియుండవలెనని భావము మరియు తలవెంట్రుకలను దూసుకొని కొప్పునమర్చుట నేమఱరాదు. వీని నన్నిటిని విడువకుండు సువాసిని - తన భర్త చిరకాలము జీవింపవలెనని యపేక్షించు సాధ్విగా గుర్తింపఁబడునని సారాంశము.

చాకలిదానితోడను అంకులాడితోడను సన్యాసురాలితోడను నిర్నిమిత్తముగా ద్వేషించుదానితోడను ఒకప్పుడైనను చెలిమిఁజేయరాదు. భర్తను బాధించు నామెతో మాటలాడఁగూడదు. ఒంటరిగా నుండకూడదు. దిసమొలతో జలక మాడరాదు (చిన్న వస్త్రమునైన ధరించి స్నానముఁజేయవలెనని భావము).

రోలుపైనను రోకలిపైననుమూకుడుపైనను బండపైననుకడపపైనను తిరుగలి (విసుర్రాయిపైనను కూర్చుండరాదు. ఏకాంతమున భర్తతో సుఖించునపుడుదక్క నితరసమయములలో స్వతంత్రించి సంభాషింపకూడదు. భర్తకు నిష్టమైన వస్తువుల యందు పనుల యందు తాను గూడ ప్రేమ గలిగియుండవలెను.

భర్త సంతోషముతో నున్నతతి (పతివ్రత) తాను సంబరముతో నుండవలెను. ఏదేనొక సంకటమున భర్త బాధపడుచు విచారపడుచుండినచో తానును ఖిన్నురాలుగ నుండవలెను. సంపదలయందు ఆపదలయందు నొకేవిధముగా నుంటూ ధైర్యముగలదై సంతోషాతిశయమును గాని దుఃఖాడంబరమును గాని చూపరాదు. ఇంటియందు నెయ్యి లవణము (ఉప్పు) మంచినూనె మున్నగునవి లేనపుడు భర్తకు నెమ్మదిగా తెలుపవలెను గాని హఠాత్తుగా చెప్పియాతనిని బాధింపకూడదు.





శ్లో॥ విధే ర్విష్ణోర్హరా ద్వాపి - పతిరేకోऽధికో మతః ।
పతివ్రతాయా దేవేశి - స్వపతిః శివ ఏవచ ॥ ౪౩

పార్వతీదేవీ! నిజముగా విచారింప పతివ్రతకు భర్త – బ్రహ్మవిష్ణు మహేశ్వరుల కన్న నధికుడని తేటపడును. అనఁగా ప్రతి సాధ్వీమణి – తన పతి సాక్షాత్ శివుడనియే భావింపవలెనని సారాంశము.

వ్రతములను ఉపవాసములను భర్తను నిరాకరించి చేయునామె పతిఁదగు ఆయుష్యమును హరించును. మరియు మరణించిన తరువాత నరకదుఃఖము ననుభవించును.

భర్త యెద్దియేని కఠినముగా చెప్పినపుడు తాను క్రోధముతో సమాధానము నిచ్చునెడ గ్రామమున అడుకుక్కయైగాని అరణ్యమున అడునక్కయైగాని జన్మించును. భర్తకూర్చుండు దానికన్న నెత్తైన పీఠమునందు తాను కూర్చుండరాదు. దుర్మార్గుల చెంతకు వెళ్ళకూడదు. భర్త నుద్దేశించి నిందావాక్యములుగాని భీతిఁ గొలుపుమాటలను గాని యాడరాదు. ఒకరిని నిందింపఁ గూడదు. పోట్లాటను దూరమొనర్పవలెను. అనఁగా తానెప్పుడును కలహింపరాదని భావము. పెద్దలముందు హెచ్చుగా మాటలాడరాదు. హెచ్చుగా నవ్వకూడదు.

భర్త బయటనుండి వచ్చుటను గమనించి మందస్మితముతో నెదుర్కొని ఆహార పానీయములను తాంబూలాదుల నొసగి పాదసేవఁజేయుచు మార్గాయాసమును పోగొట్టు సంతోష మనోహర వచనములఁ బలుకుచు నాతని రంజిలఁజేయుసాధ్వీమణి – ముల్లోకములను సంతసింపఁజేసినదగును.

శ్లో॥ మితం దదాతి జనకో - మితం భ్రాతా మితం సుతః ।
అమితస్యహి దాతారం - భర్తారం పూజయే త్సదా ॥ ౫౦

తండ్రిగాని అన్నదమ్ములుగాని కుమారుఁడు గాని కలుగఁజేయు సుఖము లేక ఆదరము పరిమితమైయుండును. భర్తవలననేర్పడు శరీరసుఖముగాని మానసిక ఆనందముగాని యపరిమితమై ఇహపరముల రెంటికిని సాధనమగును. కావున నట్టి భర్త నెల్లకాలము గౌరవింపవలెను. ఎప్పుడు నవమానింపరాదు. తన మాంగళ్యజీవనమునకు కీర్తిప్రతిష్ఠలకును భర్తయే కారణమగుటచే నాతనిని దైవముగాభావింపవలెను. భర్తయే దేవుఁడు భర్తయే గురువు. పతియే ధర్మము పుణ్యతీర్థములు వ్రతములు నగువాడు. అందువలన వ్రతోపవాసాది నియమములను విడనాడి భర్తనే సేవింపవలెను. భర్తను నిరాకరించి రహస్యముగా ప్రవర్తించు వనిత – చెట్టు తొఱ్ఱయందు నివసించు పెద్ద పిట్టయై పుట్టును. భర్త దండింపగా తాను నాతనిని కొట్టఁదలచిన యామె – అడుపెద్దపులిగా జన్మించును. పరపురుషుని కడకంటిచూపులతో గాంచునది – మెల్లకన్నుగలదగును. భర్తకు పెట్టకుండా తాను మిష్టాన్నమును భుజించునెడ ఊరపంధియై గాని అడుమేకయై గాని జన్మించును. ప్రియుని నీవు అని పలుకరించునది మూగదై పుట్టును. సవతినెల్ల కాలము ద్వేషించు వనిత – ప్రతిజన్మయందును దౌర్భాగ్యురాలగును.

భర్త చూపు తప్పించి పరపురుషుని మోహముతో గాంచు భార్య – ఒకకన్ను గ్రుడ్డిదై పెడముఖముతో కురూపిగా జన్మించును.





శ్లో॥ జీవహీనో యథా దేహః - క్షణా దశుచితాం వ్రజేత్ ।
భర్తృ హీనా తథా యోషిత్ - సుస్నాతాஉప్యశుచిః సదా ॥ ౫౭

జీవాత్మ అనఁగా ప్రాణము లేని శరీరము క్షణకాలములో నపవిత్ర మైనట్లు పెనిమిటి లేని తరుణి బాగుగా స్నానముఁజేశి యలంకరించుకొనినను పరిశుద్ధురాలు కాకుండును. పతివ్రతను కనిన తలిదండ్రులు ధన్యులు; పతివ్రతను పరిగ్రహించిన పురుషుఁడును పుణ్యాత్ముఁడని చెప్పవచ్చును. పతివ్రతఁ దగు సత్ప్రవర్తనమునఁజేశి తండ్రివంశము వారు ముగ్గురు, తల్లివంశమువారు ముగ్గురు, భర్తృవంశమువారు ముగ్గురును స్వర్గమున దివ్యసుఖముల ననుభవింతురు, స్త్రీలు దుర్మార్గమున నడచినచో మాతాపితృపతి కులత్రయమును పుణ్యలోకములనుండి పడద్రోయుదురు.

పతివ్రతయొక్క పాదము స్పృశించు ప్రదేశము పవిత్రమై సంచరించువారి పాపములను పోగొట్టును.

సూర్యభగవానుఁడు చంద్రుఁడు వాయుదేవుఁడును సాధ్విఁదగు చరణమును స్పృశించి తమకు పావనత్వము నొదవఁజేసుకొందురు. ఉదకములు పతివ్రతను తాకి "ఇప్పుడుగదా మా కల్మషమును తొలగించుకొంటి" మని భావించును.

ఐతే భర్తయే పరమదైవమని భావించి ప్రవర్తించు సాధ్వీమణులను పురుషులు చులకన జేయరాదని దిగువ సందర్భమున గాననగును.

శ్లో॥ భార్యామూలం గృహస్థస్య - భార్యామూలం సుఖస్యచ
భార్యా ధర్మఫలావాప్త్యై - భార్యా సంతానవృద్ధయే ॥ ౬౫

గృహస్థుని సంసారము చక్కగా సాగుటకు ఇల్లాలే మూలము; శారీరక వాచిక మానసిక సుఖములఁ బడయుటకు ధర్మపత్నియే నిదానము; ధర్మార్థకామ మోక్షఫలముల నొందుటకును భార్యయే భర్తకు సహకరించును. మంచి సంతానమును బడసి వంశవృద్ధి గలుగఁజేయుటకును సతియే కావలెను.

సౌందర్యము అంగసౌష్టవముగల తరుణీమణులు సర్వసాధారణముగా గృహముల యందు నుండువారు కాని పూర్వజన్మమున గావింపఁబడిన శివారాధనము వలనను ఈజన్మ యందలి శివభక్తిచేతను పురుషునకు పతివ్రతయగు భార్యలభించును. సాధ్విని పత్నిగా పొందినవాడు ఇహపరలోకముల రెంటిని జయింపఁజాలును. భార్యలేనివాడు దేవతాకార్యమును పితృకర్మను అతిథి సత్కారమును యజ్ఞయాగవ్రతములను చేయుటకు తగినవాడుకాడు. పతివ్రత యగుభార్య తనయింట గల భర్తయే సద్గృహస్థుడని చెప్పవచ్చును. అట్లుకానిచో ముదుసలి తనము శరీరమును క్షీణింపఁజేయునట్లు రాక్షసి తన యెదుటనున్నవారిని మ్రింగునట్లును దుర్మార్గురాలగుభార్య - భర్తను పీడించుచు క్రుంగదీయును.

గంగాస్నానముతో దేహము పవిత్రమగునట్లు పతివ్రతాదర్శనమువలన సమస్త చరాచరము పావనంబగును. గంగానదికిని పతివ్రతకు నెట్టి భేదములేదు. అందువలన పతివ్రతయు తత్పతియు గౌరీశంకరులనియే భావింపవలెను. ప్రణవము పతిగాను శ్రుతి భార్యగాను; క్షమ భార్యగాను తపస్సు భర్తగాను; విహితమైన మంచిపని - భార్యగాను ఆపనికిఁదగిన ఫలము భర్తగా నుండును కావున నట్టిపుణ్యదంపతులు ధన్యులని తెలియవలెను.

అమ్మా! గిరిజాదేవీ; పతివ్రతాధర్మము నిట్లు వర్ణించితిని. ఇఁక నాధర్మముఁదగు భేదములను నుడువుచున్నాను. సావధానముగా వినుము!

పతివ్రతలు – ఉత్తమురాలు మధ్యమురాలు కనిష్ఠురాలు మిక్కిలి నికృష్టురాలునని నాలుగు తెఱఁగులుందురు.

స్వప్నమునఁగూడ తన యంతఃకరణమున భర్తనే గాంచుచు పరపురుషుని కలలోనైన భావింపని వనిత – ఉత్తమపతివ్రత యనఁబడుగును.

పరపురుషుని తండ్రివలెగాని సహోదరునివలెగాని కుమారునివలెగాని చూచెడు బుద్ధిమంతురాలు మధ్యమ పతివ్రత యనబడును.

స్వధర్మము కాదని గుర్తెరిగి వ్యభిచరింపని మగువ – కనిష్ఠ పతివ్రత యగును. భర్తకుభయపడిగాని తనవారికి వెఱచిగాని భ్రష్టురాలుకానట్టి తరుణి – అతినికృష్టయగు పతివ్రతయని గ్రహింపనగును.

ఈనాలుగువిధములవారును పాపములను పోగొట్టు పతివ్రతలనియే చెప్పవచ్చును. మరియు వీరు నిహపరలోకములయందును సంతృప్తిఁజెందువారై లోకములను పవిత్రముఁ జేయుదురు.

పూర్వము అత్రిమహర్షిభార్యయగు అనసూయాదేవి – బ్రహ్మావిష్ణుమహేశ్వరుల కోర్కె ననుసరించి శాపవశమున మరణించిన బ్రాహ్మణుని పాతివ్రత్యప్రభావముచే జీవింపజేసినది.

హైమవతీదేవీ! పతివ్రతాధర్మమును నే చెప్పినట్లు గ్రహించి సర్వకామప్రదుడైన నీ పతిని సేవింపుము!

నీవేమో జగదంబవు; సాక్షాత్ శివుడే నీభర్తగదా! నిన్ను స్మరించు నారీమణులే పతివ్రతలగుదురు. ఇట్టి నీకు పతివ్రతాధర్మమును బోధించుటలో ప్రయోజనము లేదు. ఐనను లోకాచారము ననుసరించి చెప్పవలసివచ్చినది.

ఇవ్విధ మా బ్రాహ్మణసువాసిని చెప్పి పార్వతీదేవికి ప్రణామంబు లిడి తన సంభాషణమును చాలింపగా నా దేవి మిగుల సంతసించిన దయ్యెను.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏబదినాలుగవ యధ్యాయము.

## పంచ పంచాశాధ్యాయము

### (శంకరుఁడు హిమాలయమునుండి కైలాసమునకు వెళ్ళుట)

సూతుఁడు చెప్పఁదొడగెను.

అంత నా విప్రవనిత పార్వతిదేవికి పతివ్రతమును గురించి పైవిధము వక్కాణించి "ఇఁక నీమెను సాగనంపు" మని మేనకాదేవికి నివేదింపగా నామె కూతురు నెడబాటును సహింపఁజాలనిదై కొంతతడవునకు నూఱటఁజెంది పార్వతిని దరిఁజేర్చుకొని లోనిదుఃఖము నాపుకొనఁజాలక మిగుల హెచ్చుగా నేడ్చుచు మాటిమాటికి పార్వతిని కౌగలించుకొనుచుండెను.





పార్వతియు కరుణారసభరితములైన వాక్యముల నుచ్చరించుచు దుఃఖించుచుండగా నామె రోదనమును వినుచు మేనకయు దేవతాస్త్రీలును మూర్ఛనొందిరి. తదితరవనితలందరును రోదనముఁ జేరి అట్టితఱి నా ప్రదేశమంతయు పార్వతీవియోగ దుఃఖమయముగా నుండెను.

యోగీశ్వరుఁడగు శంకరుఁడును పయనించుచు నత్తవారిదుఃఖమును చూడలేక నించుక విచారపడెను. ఐతే నిట ప్రభువు సర్వసమర్థుండునగు సదాశివుడే విచారపడుచుండగా నితరులైన సామాన్యులను గురించి చెప్పవలసిన యవసరములేదు.

ఇంతలో హిమవంతుఁడు – కుమారులతోడను మంత్రులతోడను బ్రాహ్మణులతోడ నచ్చటికరుదెంచి సందర్భమునుగాంచి పార్వతిని సమీపించి "అమ్మా! ఎక్కడికివెళ్ళుచున్నా" వని హెచ్చుగాపలుకుచు రోదనముఁజేయగా పురోహితుఁడు నచటివారందరికి వివేకము కలుగుటకై ఆధ్యాత్మవిద్యను ప్రబోధించి నందున నందరును దుఃఖమునుండి తేరుకొనిరి.

అంత పార్వతీదేవి – లోకాచారము ననుసరించి జననీజనకులకు గురువునకు నమస్కరించెను. కాని దుఃఖము పొఱలి పొఱలి వచ్చుచున్నందున మరల హెచ్చుగా నేడ్చుచుండెను. అట్టిరోదనమునఁ జేసి బంధుస్త్రీలును సోదరులును తల్లిదండ్రులును మరల దుఃఖించుచుండిరి.

అట్టితఱి "ప్రయాణసుముహూర్తము సమీపించిన" దని బ్రాహ్మణులు చెప్పగా హిమవంతుఁడు మేనకను మందలించి పల్లకిని తెప్పించెను. విప్రసువాసినులు పార్వతీదేవిని పల్లకియందు నెక్కింపగా మేనకాహిమవంతులు తదితరులు నాశీర్వదించిరి. మరియు రాజోపచారముల నొసగిరి. ఇతరులకు లభింపని వస్తువులను ద్రవ్యరాశులను సమర్పించిరి. అంత నా పార్వతీదేవి – పెద్దలకు తల్లిదండ్రులకు బ్రాహ్మణులకు కులస్త్రీలకు పురోహితునకు ఇతర వృద్ధసువాసినులకును మఱల నొకమారు నమస్కరించి బయలుదేరినది. హిమవంతుఁడును తన కుమారులను వెంటనిడుకొని స్నేహవశమున పార్వతి ననుసరించుచు శంకరుఁడు దేవతలతో గూడ నుండు స్థలమున కరుదెంచెను. అచట నందరును గుమిగూడి తమ యుత్సాహమును ప్రదర్శించుచు మహాదేవునకు సాష్టాంగము నిడుచుండిరి.

అంత నవకాశమును దొరికించుకొని శంకరుఁడు "పార్వతీ! నీ పూర్వజన్మను గుర్తుకు తెచ్చుకొనుము! లీలావినోదముఁజూపుటకై ఇట నవతరించితివి గదా! ఏల బాధపడుచున్నా" వని ప్రశ్నింపగా పార్వతీదేవి చిరునగవుతో "ప్రాణేశ్వరా! అంతయు తెలిసియున్నాను. ప్రస్తుతము మాత్రము మౌనము వహింపుము! సమయోచిత ప్రయత్నమును గావింపుము! నీకు నమస్కారము". అని ప్రార్థింపగా అమృతధారాశతంబునుఁబోలు పార్వతీ వాక్యము నాలకించి శంకరుఁడు మిగుల నానందపరవశుండయ్యెను.

అంత శంకరుఁడు కైలాసముఁజేరి యచట మణిమయ సౌధంబున నమరులకు వివాహమునకై వచ్చిన వారందరికిని షడ్రసోపేతములగు రుచికర పదార్థములతో భోజనము పెట్టింపగా నందరును సుఖముగా భుజించి నానావిధరత్నాలంకారములఁదాల్చియు తమ కళత్ర పుత్రాది పరివారముతో గూడ చంద్రశేఖరునకు సాగిలఁబడుచుండిరి. మరియు వైదిక లౌకిక స్తోత్రములతో ప్రార్థించుచు పార్వతీపరమేశ్వర కల్యాణమును ప్రశంసించుచు తమ తమ లోకములకుఁ జనుచుండిరి.





అట్టి ఆనంద సమయమున హరిబ్రహ్మలు సమీపించి పార్వతీశంకరులను భక్త్యానురాగములు నుప్పతిలగా సంభాషించి శంకరు ననుమతిని వైకుంఠ సత్యలోకములకు సపరివారముగా వెళ్ళినవారు. మహేశ్వరుఁడును కైలాసనిజధామమున పార్వతిదేవితో విహరించుచు నానందసాగరడోలికలఁ దేలుచుండెను.

నందీశ్వరాది ప్రమథగణంబులు పార్వతీపరమేశ్వరులను యథావకాశము సేవించుచు సుఖముగా నుండిరి.

"మంగళప్రదమైన పార్వతీకల్యాణము నిట్లు చెప్పితిని. ఇద్ది వినువారికి దుఃఖమును పోగొట్టును. సంతోషము నొదవఁజేయును. ఆయుష్యమును పెంపొందించును. సంపదను ప్రసాదించును. ఇక నీశుభచరిత్రమును పరిశుభ్రులై భక్తి పారవశ్యమున నియమముగా వినువారికి వినుపించు వారికి నిహలోక సుఖము చేకూరుటయే గాక దేహాంతమున శివలోక శాశ్వత నివాసంబును సమకూరును. మరియు శౌనకాది మహర్షులారా? ఈ గౌరీశంకర వివాహ చరితము సామాన్యముగా లభించునది కాదు. విఘ్నములను పారద్రోలి శుభములను కలుఁగ జేయునట్టిది ఇంతియే గాక గొప్పవ్యాధులను గూడ నివారించి కీర్తిప్రతిష్ఠల నినుమడింపఁజేయును. స్వర్గాది పుణ్యలోక సుఖముల ననుగ్రహించును. పుత్రపౌత్రాది వంశవృద్ధి నొసగును. వేయేల? జీవితమున కోరికల నన్నిటిని ఫలింపఁజేయుచు భుక్తి ముక్తులను ప్రసాదించును. మరియు నపమృత్యువును శమింపఁజేయును. గొప్ప శాంతి విధానమనియే ఇద్దానిని గురించి చెప్పవచ్చును. సర్వవిధ దుఃస్వప్నదోషములను పరిహరించి బుద్ధిబలమును కలుగఁ జేయును.

శుభముఁగోరువారు శివప్రీత్యర్థము శివునికి చెందిన మహాకార్యములయందు నీ చరిత్రమును తప్పక పఠింపవలెను. దేవతలను ప్రతిష్ఠించు సమయమునను శివకార్యములను ప్రారంభించునపుడు నీ కల్యాణమును ప్రత్యేకించి చదువవలెను.

స్వయముగా చదివి యర్థముఁజేసుకొనినవారు ఇద్దానిని భక్తిశ్రద్ధలతో నాకర్ణించు నెడల వారి మనోరథములన్నియు సిద్ధించును. ఇద్దిముమ్మాటికి నిజంబనియు ఇందెంతమాత్రము సంశయింపనక్కఱ లేదనియు" సూతమహర్షి వక్కాణించెను.

**ఇయ్యది శివ మహాపురాణంబున రుద్రసంహితయందు మూడవదగు**
**పార్వతీఖండమున "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ**
**ఆంధ్రానువాద ప్రవచనముతో ఏబదియైదవ యధ్యాయము**
**పార్వతీఖండము సర్వంబు సమాప్తము.**





శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ శివమహాపురాణమున రుద్రసంహిత యందలి

## కుమార ఖండము ప్రారంభము

## ప్రథమాధ్యాయము

### (శివవివాహానంతరకృత్యవర్ణనము)

శ్లో॥ వందే వందనతుష్ట మానస మతిప్రేమప్రియం ప్రేమదం
పూర్ణం పూర్ణకరం ప్రపూర్ణనిఖిలైశ్వర్యైకవాసం శివమ్ ।
సత్యం సత్యమయం త్రిసత్యవిభవం సత్యప్రియం సత్యదం
విష్ణుబ్రహ్మనుతం స్వకీయకృపయోపాత్తాకృతిం శంకరమ్ ॥ ౧

నమస్కారముచే సంతసించు స్వభావము గలవాడును "శివుఁడే పరమదైవ" మని దృఢముగా భావించి నిరంతర సాహచర్యముతో తన్నారాధించువారి ననుగ్రహించు వాడును సామాన్య భక్తిగలవారికి విశేషభక్తిని కలిగించువాడును పరిపూర్ణస్వరూపుఁడును తన నుపాసించువారికి పరిపూర్ణత నొసగువాడును సృష్టి స్థితిలయ తిరోధాన అనుగ్రహాత్మకమగు సమస్త పరిపూర్ణ ఐశ్వర్యమునకు నిలయమగువాడును నిఖిలమాంగళ్య గుణరత్నా కరుఁడును సత్యస్వరూపుఁడును జీవాంతర్యామియు భూతభవిష్యద్వర్తమాన కాలత్రయమున బాధింపఁబడని యథార్థమైన వైభవముగలవాడును సత్యవాక్యసంభాషణ పరులకు సన్నిహితుఁడును హరిబ్రహ్మలచే కీర్తింపఁబడు వాడును నిజభక్తులనుద్ధరించు కరుణతో నొకానొక దివ్య స్వరూపముఁదాల్చినవాడు నగు శంకరుని నమస్కరించుచున్నాను.

ఇట్లు భగవానుని ప్రార్థించి సూతుఁగు శౌనకాదులకు దిగువ విధము చెప్పఁదొడఁగెను.

శంకరుఁడు పార్వతిని వివాహమాడి కైలాసముఁజేరిన పిదప జరిగిన సమాచారమును చెప్పుచున్నాను.

కుమారస్వామి జన్మించి తారకాసురుని సంహరించుట యీ కుమారఖండమున ముఖ్యముగా వర్ణింపఁబడినది. ఈ కథావృత్తాంతము - వినువారి పాపములను బోకార్చును. ఇద్ది పవిత్రమైనదియు రహస్యమైనదియు అద్భుతమైనదియు సంతాపమును హరించునదియు విఘ్నములనన్నిటిని పారద్రోలు నదియు సమస్త శుభములను కలుగఁజేయునదియు వినసొంపైనదియు కర్మమూలమును తీసివేయునదియు భుక్తిముక్తులనొసగునదియునైయుండును.

శంకరుఁడు పార్వతీదేవితో కూడ కైలాసములోని నిజధామమునకు వేంచేసి యమరులను తారకాసురుఁడు బాధించుటను గురించి విచారించుచు పాణిగ్రహణమువలన నగు శోభతో నలరారు చుండినవాడు. అట్టితతి ప్రమథగణములు మిగుల సంబరముతో పలురకముల వేడుకలను చూపుచుండిరి. అంత మహాదేవుఁడు గిరిజాదేవిని తోడ్కొని మనోహరమైన ఏకాంతస్థలమునకు వెళ్ళి యచట సుగంధ పుష్పముల నిండియుండునదియు శ్రీగంధము చల్లినదియు నానావిధభోగవస్తువులతో కూడినదియు రతిసుఖమున కనువైనదియు నగు శయ్యాఫలకము నేర్పరుపఁజేసెను.

అద్దానిపై పార్వతీశంకరులు దేవతాప్రమాణమున వేయివత్సరములు రతి. సుఖంబులఁ బడయు చుండిరి. శివుఁడు శక్తిశరీరమును తాకినంతమాత్రమున మూర్ఛితుడగుచుండెను. అమ్మవారు మహేశ్వరుని స్పృశించినంతనే తెలివిఁదప్పుచుండెను. అట్టి ఆనంద భోగసమయమున ఆది దంపతులు - ఇది పగలని రాత్రియని గుర్తింపకుండిరి. ఇవ్విధము గౌరీశంకరుల విహారమున చాలకాలము గడచినను వారి కయ్యది క్షణము వలె తోచుచుండెను.

ఇఁక నింద్రాదిదేవతలు మేరు నగరమున సమావేశమై "ఈశ్వరుఁడు మన కార్యమును సాధించుటకే వివాహము నొనర్చుకొనెను. అతడు నిజముగా యోగీశ్వరుడై ఎట్టి వికారముఁజెందక పుణ్యపాపలేప రహితుడై తనయందు తాను తృప్తిఁజెందువాడునై యుండును. ఇట్టి పరమేశ్వరుఁడు పార్వతీదేవియందు మోహముఁజెంది కుమారుని కనునో లేదో; ఒకవేళ ముగ్ధుడై రతి సుఖము ననుభవించునెడ కుమారజననమునకు ఆలస్యమగుచున్న దెందులకు?" అని విచారించి నారద మహర్షిని పురస్కరించుకొని బ్రహ్మదేవునితో కూడ నారాయణుని సమీపించి నమస్కరింపగా బ్రహ్మదేవుఁడు "దేవా! శంకరుఁడు - వేయివత్సరములు గడచిన నేకాంతసుఖమును విరమించుటలేదు. కావున కుమారుని యుత్పత్తి యెప్పుడగునో యని గుందుచున్నాము" అని విన్నవించెను.

అంత భగవానుఁడు దిగువవిధము బ్రహ్మాదిదేవతలకు సమాధానము నొసగెను.

పంకజాసనా! చింతింపకుము! అంతయు శుభంబేను; మహాప్రభువగు శంకరుని శరణము నొందుము!

శ్లో॥ మహేశశరణాపన్నా - యే జనా మనసా ముదా ।
తేషాం ప్రజేశ ! భక్తానాం - న కుతశ్చి ద్భయం క్వచిత్ ॥ ౨౮

శంకరునికి మనఃపూర్వకముగా శరణాగతులగు భక్తులకు ఎప్పుడును ఎట్టి భయంబును సంభవింపదు. ప్రస్తుతము పార్వతీశంకరుల శృంగారవిహారము భంగపడుసమయము కాదు. కాలక్రమమున మీ కార్యము సిద్ధించును. శంకరుని శృంగారభోగమును విరమింపఁజేయ నెవరికిని తఱము కాదు. సహస్రవర్షములు నిండగానే ఆపరాత్పరుఁడే రతిసుఖమును చాలించును.

పూర్వము దుర్వాసమహర్షి - రంభతో కూడియుండు దేవేంద్రుని విడిపించినందున భార్యను పోగొట్టుకొని కొంతకాలమునకు మరియొక రమణిని పరిగ్రహించి తన విరహతాపమును చల్లార్చుకొనెను. ఇంకను చెప్పెదను వినుఁడు !

శ్లో॥ స్త్రీపుంసో రతివిచ్ఛేద - ముపాయేన కరోతి యః ।
తస్య స్త్రీపుత్రయో ర్భేదో - భవేజ్జన్మని జన్మని ॥ 29
భ్రష్టజ్ఞానో నష్టకీర్తి - రలక్ష్మీకో భవే దిహ ।
ప్రత్యాప్యతే కాలసూత్రం - వర్షలక్షం స పాతకీ ॥ 30

భార్యాభర్తల రతి సుఖమునకు నుపాయముతో భంగమునొదవఁజేయువాడు - ప్రతిజన్మయందును భార్యావియోగమును కుమారులతో నెడబాటును పొందును. మరియు నట్టివాడు లోకజ్ఞానము శాస్త్రజ్ఞానంబు





లేనివాడై అపకీర్తిపాలగుటయే గాక దరిద్రుండగును మరియు కాలసూత్రమను నరకమున లక్షవత్సరముల కాలము దుఃఖించును.

ఘృతాచితో సుఖించు మన్మథుని బృహస్పతి తొలగించినందున తనభార్య యగు తారాదేవిని చంద్రుఁడపహరింపవలసివచ్చెను. అందువలన బృహస్పతి శంకరుని పూజించి యాతని యనుగ్రహమునఁ జేసి మరల భార్యా సుఖమును పొందఁగలిగెను.

మోహినీదేవితో రమించు చంద్రుని గౌతముఁడు నివారించినందున అహల్యాదేవి నెడఁబాసెను. హరిశ్చంద్రుఁడు - తన భార్యతో విహరించు నొకానొక హాలికు (పొలము దున్నువాని) ని భయపెట్టి దూరమొనర్చినందున విశ్వామిత్రునిచే బాధింపఁబడి స్త్రీపుత్రులను రాజ్యమును పోగొట్టుకొనినవాడు - మరల నవ్వారిని పొందుటకు శంకరు నారాధించి విగత కల్మషుండయ్యెను. అజామిళుఁడను బ్రాహ్మణుడు శూద్రవనితతోసంభోగించుచున్నను దేవతలు నివారింపఁజాలకుండిరి.

శ్లో॥ సర్వం నిషేకసాధ్యంచ - నిషేకో బలవాన్ విధే ।
నిషేక ఫలదో వైస - నిషేకః కేన వార్యతే ॥ 36

బ్రహ్మదేవా ! ప్రపంచమున ప్రతిప్రాణియు స్త్రీపురుషసంగమముతోడనే అవిర్భవించునని నీకును తెలిసియే యుండును. స్త్రీయోనియందు పురుషుఁడు తన రేతస్సును విడనాడుట బలవత్తరమైన విధానంబని తెలియుము ! పరమేశ్వరుఁడును దంపతుల సమాగమము వలననే సంతానఫలము నిచ్చువాడు అట్టి స్త్రీ పురుషసాంగత్యమును భంగపరుపనెవరికి నలవిఁ గాదు. కావున వేయి వత్సరముల తరువాత మీరందరు కూడి కైలాసమునకుఁజని యా మహామహుని రేతస్సు క్రిందపడునట్లు చేయుఁడు! అట్టివీర్యము నుండి స్కందుఁడను కుమారుఁడు ఉదయించును. కావున నిప్పుడు చేయునదేమియు లేదు.

ఇట్లు నారాయణుఁడు నుడువగానే బ్రహ్మాదులు మిన్నకొని తమతమ నివాసములకుఁ జనిరి. అట కైలాసశిఖర దివ్యమణిమయ సౌధాంతఃపురహంసతూలికాతల్పమున శక్తి శివులు శృంగార సుఖముఁ బడయుచుండగా సమస్త లోకములు తల్లడిల్లుటయే గాక భూమి - ఆది శేషునితోడ భారముచే క్రుంగుచు కంపించుచుండెను. కూర్మమునకు గూడ భారమగుటచే సర్వాధారమగు వాయువును స్తంభించెను.

అంత నింద్రాద్యమరులు బ్రహ్మదేవుని పురస్కరించుకొని హరిని శరణము నొంది దీనమానసులై

శ్లో॥ దేవదేవ రమానాథ - సర్వావనకర ప్రభో
రక్ష నః శరణాపన్నాన్ - భయవ్యాకులమానసాన్ ॥ 47

ప్రభో లక్ష్మీపతే! దేవతలలో ప్రకాశించువాడవు, సర్వరక్షకుడవు; అకాల ప్రళయ భయముచే తబ్బిబ్బుపడుచు శరణాగతులమైతిమి. మమ్ము కాపాడుము! బ్రహ్మాండములో ఆయా లోకముల నాయాస్థానములయందు నిలుపునట్టి వాయువు గూడ స్తంభించుటకు గతంబేమి? చరాచరమున సప్తర్షులు మున్నగువారందరును కళవళపడుచున్నవారు" అని నివేదించి భగవానుని ముందు మౌనముగా నిలువఁ బడియుండిరి.





అంత నారాయణుఁడు వైకుంఠము నుండి బ్రహ్మాదులను వెంటనిడుకొని వేగమే బయలుదేరి శివప్రియంబగు కైలాసమున శంకరుని దివ్య స్థానమునకుఁజని యట మహాదేవుఁడు లేనందున విస్మితుడై శివగణముల నిట్లు వినయముతో ప్రశ్నించెను.

ప్రమథగణములారా? సర్వేశ్వరుఁడైన శంకరుఁడెచ్చోట నున్ననాడు? దుఃఖితుల మగు మాయందు దయగలవారై త్వరగా చెప్పుడు!

అంత నందికేశ్వరుఁడు మున్నగువారు "దేవా! శంకరుఁడు మమ్మందరి నిచ్చోట నుండుడని శాసించి పార్వతీదేవిఁదగు నంతఃపురమున కేగినవాడు. ఇప్పటికిని పెక్కు వత్సరములు గడచినవి. ఆ లీలా విశారదుని కృత్యమును మేమెరుంగము" అని వాక్రుచ్చిరి.

తరువాత భగవానుఁడు దేవతలనందరిని తోడ్కొని శివాంతఃపురద్వారము కడకుఁ జని ఆర్త నాదమున హెచ్చుకంఠముతో శంకరుని ప్రార్థించుచు బిగ్గఱగా శంభో! మహాదేవ! ఇత్యాది నామముల నుచ్చరించుచు తారకాసురుని బాధలఁ గుందుచున్న నమరులను కాపాడునుద్దేశముతో మిగుల నేడ్చుచున్నందున బృందారకులందరును శివస్తుతిఁజేయుచు రోదనముఁ గావించుచుండిరి.

అంత నా రోదనధ్వని కోలాహలము నొక్కుమ్మడిగా మిన్నుముట్టి సుదీర్ఘప్రదేశమునకు గూడ వినఁబడుచుండెను.

ఇత్యాది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ప్రథమాధ్యాయము.

## ద్వితీయాధ్యాయము

### (కుమారస్వామి జన్మించుట)

మహాదేవుఁడు సురల యార్తనాదమును విని యేకాంత సుఖమును విరమింపఁదలచిన వాడైనను పార్వతీదేవి సమ్మతించునో లేదో యను సందేహమున సంభోగమును చాలింపకుండెను. ఐనను భక్తవత్సలుడగుటచే "అమరులు తారకాసురునిచే పీడింపఁబడుచున్నార"ని దయగలవాడై యంతః పురద్వారముకడకు నేతెంచి కనుపడగా హరిబ్రహ్మాదులు నూఱటఁజెంది మిగుల భక్తి శ్రద్ధలతో ప్రణమిల్లి "దేవదేవా! కరుణాసాగరా! శంకరా! ప్రభో! ప్రాణులనంతర్యామివై సర్వంబును గుర్తెరుగు వాడవు; తారకాసురుఁడు మున్నగు రాక్షసులను వధింపఁజేసి మమ్ము కాపాడుము!" అని ప్రార్థించిరి.

అంత శంకరుఁడు నవ్వారి విన్నపము నాలకించి విచారహృదయముతో "హరి బ్రహ్మలారా? అమరులారా? త్వరపడి యిట్లు కలవరపెట్టఁదగునా? మరికొంత కాలము మిన్నకుండినచో నంతయు సమంజసముగా జరిగియుండెడిది. ఐతే కానున్న దాని నెవరును నివారింపఁజాలరు గదా! ఐనదానికి విచారింపక ప్రకృతమును చెప్పుచున్నాను వినుఁడు! ఇప్పుడు నా రేతస్సు స్ఖలితమైనది. ఇద్దాని నెవ్వరైనను స్వీకరింపవలసి యుండును" అని నుడువగా నిర్జరులఁదరిచే ప్రేరేపింపఁబడిన అగ్నిదేవుఁడు – పావురమై తన ముక్కుతో శివవీర్యము నంతయు భక్షించెను.





ఇంతలో పార్వతీదేవి - యంతఃపురమునుండి యేతెంచి "శివుఁడు మరల వేగమే లోనికి రాకుండుటకు గల కారణంబఱయఁగోరి యమరులను గాంచి జరిగినదంతయు తెలిసికొని నిండు క్రోధమున హరిబ్రహ్మాదిదేవతలను గురించి యిట్లు పలికెను.

"దేవతలారా? మీరు దుర్బుద్ధితో స్వార్థమును సాధించుకొనువారు, ఇతరులకు దుఃఖము నొదవఁజేయువారు; మీ పనిని సాధించుటకే శంకరునారాధించితిరి; కాని నా శృంగార సుఖమును భంగపఱచితిరి; ఇందుమూలముగా గౌద్రాలనైతిని. అమరులారా? ఒక్కమాట చెప్పుచున్నాను. వినుఁడు! నన్ను విరోధించువారి కెప్పుడును సుఖము చేకూరదు. కావున మీకు ప్రస్తుతము దుఃఖమే సంభవించును. మరియు నీవేళటినుండి మీభార్యలు సంతానము లేనివారగుదురు గాత! అగ్నే? నిత్యము ఇడుములఁబడుచు సర్వభక్షివి కమ్ము! మూర్ఖుడవై శివమహిమను కనుగొనఁజాలకుఁడుటయేగాక శివరేతస్సును మ్రింగి శివాపచారము నొనర్చితివి".

ఇవ్విధము సురలను అగ్నిని శపించి పార్వతీదేవి శంకరుని తోడ్కొని లోనికి వెళ్ళి తన యసంతృప్తిని వెలిబఱచి యాత్మశాంతికై మరియొక కుమారుని (గణపతిని) పుట్టించెను. ఇక్కథను ముందు వర్ణించెను. ఇప్పుడీ కుమారస్వామి జననమును వినుఁడు! అని సూతమహర్షి చెప్పఁదొడఁగెను.

ఐతే శౌనకాదులారా? అగ్నిహోత్రుడు స్వీకరించిన ఆహారమునంతయు దేవతలు భుజింతురని మీరు విని యుందురు. వేదంబు నట్లు శాసించుచున్నది. కావున నమరులందరును నగ్ని శివరేతస్సును భక్షించిన కారణముగా క్షణకాలములోనే గర్భముగలవారైరి. అందువలన విష్ణ్వాదులును శివతేజంబును భరింపఁజాలనివారై శివాపచారవశమున తెలివిఁదప్పియు శీఘ్రముగా శంకరునకు శరణాగతులై శివాలయద్వారముచెంతకుఁజని నమ్రులై చేతులుజోడించి యిట్లు మరలఁబ్రార్థించిరి.

మహాదేవా! ఏమిటిది? నీమాయ నేరికిని తెలియఁదరముకాదు. నీ ఇంద్రియ తేజస్సు మమ్ముదహించుచున్నది. కరుణించి మా బాధను దూర మొనర్పుము!

శంకరుఁడది విని దేవతలుండు చోటునకు విచ్చేసినంత నమరులు మరల నొకమారు నుతించి మమ్ముకాపాడుమని వేడుకొనఁగా నాతడు మందస్మితమున "దేవతలారా? నా వీర్యమును మీ మీ కడుపులలోనుండి వమనముఁజేయుఁడు! అప్పుడుగాని మీకు సుఖము చేకూరదు. ఇది నా శాసనంబని నుడువగా నవ్వారు శివాజ్ఞను శిరసావహించి శివవీర్యము నంతయు వెడలఁగ్రక్కిరి. అంత నయ్యది బంగారువన్నెకలదై పర్వతాకారముగా పరిణమించి మిన్నుముట్టుచుండెను. శివవీర్యత్యాగము వలన నమరులు నూఱటఁజెంది భక్తవత్సలుడగు పరమేశ్వరుని పలువిధములఁ బ్రార్థించుచుండిరి. అగ్ని మాత్రము స్వయముగా శివవీర్యమును భక్షించినందున నద్దానిని విడువఁజాలక శివాజ్ఞకై వేచియుండెను. మరియు శంకరుని పదేపదే వేడుకొనుచు "మహేశ్వరా! మూఢుడనై శివాపచారము నొనర్చితిని. భక్తుడనైన నాయపరాధమును మన్నించి యీ వేడిని చల్లార్చుము! దీనులయందు దయగలవాడవు గదా!" అని విన్నవింపగా శంకరుఁడు ప్రసన్నుడై "వైశ్వానరా! నా రేతస్సును భక్షించినందున మిగుల పాపమునొడిఁగట్టుకుంటివి. అందువలన నీ దాహము శమింపకున్నది. శరణాగతుడవైతివి గావున నుపాయమును చెప్పుచున్నాను. ఒకానొక రమణిఁదగు గర్భమునందీరేతస్సును నెలకొలుపుము. అప్పుడు నీకు ప్రశాంతి





చేకూరును" అని యాదేశింపగా అగ్ని - దేవా నీ తేజస్సును భరింప ముల్లోకములలో నే వనితకును శక్యము కాదు - అని మిన్నకుండునంత నారదమహర్షి - శివాజ్ఞావశమున దిగువవిధము వాక్రుచ్చెను.

వీతిహోత్రా! నీ మంటఁజల్లార్చుకొను నుపాయమును తెలుపుచున్నాను. శీతకాలమున వేకువఁ జామున స్నానముఁజేయు వనితలకు నీ శివరేతస్సును చెందఁజేయుము!

అంత నారదుని వాక్యము ననుసరించి యగ్ని - సప్తర్షుల భార్యలు ప్రతిదిన నియమప్రకారము ఆనాడును ప్రాతఃస్నానార్థము నరుదెంచి గంగయందు జలకమాడి మిగుల శీతము బాధించుటచే తనను సమీపింపగా నరుంధతీదేవి వలదని నిషేధించుచున్నను మిగత నారుగురు ఋషుల పత్నులు శివమాయామోహితలై అగ్నిజ్వాలలను కాపుకొనుచుండిరి. అంత నగ్నిదేవుఁడు తనమంటలద్వారా నవ్వారిరోమకూపముల గుండా రేతఃకణములను ప్రవేశింపఁజేసి తన దాహమునంతయు తీర్చుకొని శంకరుని స్మరించుచు నిజలోకమున కేగినవాడు.

అంత నా కృత్తికలు సద్యోగర్భవతులై గృహములకుఁ జనినపిదప నవ్వారిని భర్తలు శంకించి దూరమొనర్చిరి. అందువలన వారు భర్తల నెడబాసి శివరేతస్సును భరింపఁజాలనివారై హిమాలయముపై తమ గర్భములను విడనాడిరి. హిమవంతుఁడు నద్దానిని మోయఁజాలనివాడై గడగడ వడకుచు గంగానదియందు పడవేయగా గంగాదేవియు శివ వీర్యమును భరింప శక్యము కానిదై తన తరంగముల ద్వారా రేలుగడ్డియందు నెలకొలిపెను.

మొదట నగ్ని తరువాత షట్కృత్తికలు, అనంతరము హిమవంతుఁడు, పిదప గంగానది, ఆవెనుక శరస్తంబము; ఇట్లు పంచస్థానములయందు పరిపక్వమైన శివవీర్యము - రేలుగడ్డియందు సుందరుఁడు సుభగుఁడు తేజఃశాలియు సమస్త ప్రాణిప్రేమవర్ధనుఁడు నగు బాలుడుగా పరిణమించెను.

**శ్లో॥ మార్గమాసే సితేపక్షే - తిథౌ షష్ఠ్యాం మునీశ్వర !**
**ప్రాదుర్భావోఽభవత్తస్య - శివపుత్రస్య భూతలే ॥**

మార్గశీర్షమాసమున శుక్లపక్షమున షష్ఠీతిథియందు శివకుమారుఁడు భూలోకమున జన్మించెను. ఆ సమయమున కైలాసముపై గిరిజాశంకరులు తలవనితలంపుగా సుఖవిశ్రాంతులు గలవారగుచుండిరి. పార్వతీదేవిఁదగు స్తనములనుండి ఆనందామృతరసముఁబోలిన పాలు కారుచుండెను. చరాచరమందంతటను సత్పురుషులకు నమితానంద మొదవుచుండెను. దుర్మార్గులైన రాక్షసులకు గొప్పభయము వాటిల్లెను. ఆకసమున దేవదుందుభులు ఆకస్మికముగా మ్రోగుచుండినవి. పిల్లవానిపై పుష్పవృష్టి కురియుచుండెను. హరి బ్రహ్మాదిదేవతలకు హఠాత్తుగా పరమానందము సమకూరుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనములో ద్వితీయాధ్యాయము.





# తృతీయాధ్యాయము

## (కుమారస్వామి బాల్యక్రీడలు)

ఆ పిమ్మట నచ్చోటికి విశ్వామిత్రమహర్షి – దైవప్రేరితుడై యేతెంచి లోకోత్తర తేజోవిరాజితుండైన బాలుని గాంచి నిండు ఆనందమున మ్రొక్కులిడెను. మరియు నానావిధ స్తోత్రములతో ప్రార్థించెను.

అట్టితతి కుమారుఁడు ప్రసన్నుడై చిరునగవున "మహర్షే శివేచ్ఛావశమున నరుదెంచితివి. కావున నాకు వైదిక సంస్కారములను గావింపుము! ఇప్పటినుండి నీవు నాకు పురోహితుడవై లోకపూజ్యత నొందుము!" అని యాదేశింపగా విశ్వామిత్రుడు "నేను బ్రాహ్మణుడను కాను, గాధియను క్షత్రియుని కుమారుఁడను నీవెవరో వివరింపుము! నిన్ను చూచిననుండి నాకాశ్చర్యము పొడముచున్నది." అని పలికెను.

అంత కార్తికేయుఁడు "విశ్వామిత్రా! నా యనుగ్రహమున నీవు బ్రహ్మర్షివైతివి వసిష్ఠాదిమహర్షులు నిన్నిప్పటినుండి గౌరవింతురు. ఇఁక నా పుట్టుకను గురించి తరువాత నీకే తెలియును. ప్రస్తుతము మాత్రము నా చరితమును రహస్యముగా కాపాడుచుండుము! ఏరికిని చెప్పరాదు" అని నుడువగా విశ్వామిత్రుఁడు వేదోక్తవిధిని జాతకర్మ మొదలగు సంస్కారముల నొనర్చెను. అప్పటినుండి యా మహర్షి - కుమారస్వామికి పురోహితుడై లోకమున తన మహిమలను చాటుచుండెను. మరియు స్వామి యనుగ్రహమున దివ్యజ్ఞానముఁబడసెను.

ఇట్లు శివకుమారుఁడు గావించిన బాల్యలీలలు అనేకములు కలవు. కొన్నిటిని మాత్ర మిట నుదహరించుచున్నాను.

ఆ తరువాత నగ్నిదేవుఁడరుదెంచి కుమారుని కౌగలించుకొని ముద్దిడుకొని పుత్రా! అని పలుకుచు తన శక్తి అను ఆయుధము నొసఁగెను. అట్టి శక్తిని పరిగ్రహించి కుమారుఁడు పర్వతముపై నెక్కి యద్దాని శిఖరమును కొట్టగా నద్ది క్రిందఁబడెను. కుమారుని సంహరించుటకు తారకాసురునిచే పంపఁ బడిన పదిపద్మముల రాక్షసులు ఆ శిఖరము క్రిందపడి నలిగి జచ్చినవారు. ఇందువలన హాహాకారము చెలరేగుటయే గాక భూమి – పర్వతములతో గూడ కంపించినందున నట్టి కలవరమును గమనించి దేవేంద్రుఁడు నచ్చోటి కరుదెంచి వజ్రాయుధముతో కుమారుని కుడిభాగమున కొట్టఁగా శాఖుఁడను పురుషుఁడుదయించెను. మఱల నింద్రుఁడు కుమారుని యెడమవైపున వజ్రాయుధమున ప్రహరింపగా విశాఖుఁడను మరియొక బలవంతుఁడు జన్మించెను తరువాత నమరేశ్వరుఁడు కుమారుని హృదయమును వేధింపగా నైగముఁడనఁబడు మహాపురుషుడావిర్భవించెను.

అట్టితతి స్కందుఁడు మున్నగు నలుగురు మహావీరులు దేవేంద్రునిఁబట్టి వధింప నుంకించుచుండగా బ్రహ్మదేవుడు కుమారుని శాంతింపుమని ప్రార్థించెను. ఇంద్రుఁడును వెఱగంది స్వర్గలోకమునకు వెళ్లెను కాని బాలుని స్వరూపమును యథారముగా కనుగొనఁజాలకుండెను.





కుమారస్వామి మాత్రము తన యనుచరులతో నచ్చోటనే పలురకముల బాల్యక్రీడలఁజూపుచు నానందముగా నివసించెను. ఆ సమయమున ఆరుగురు మునిపత్నులు గంగాస్నానమున కరుదెంచి మహాప్రభువగు కుమారుని దరిఁజేర్చుకొనుటకు "నేను ముందు నేను ముందు" అని వివాదముఁ జేయుచుండిరి. అట్టి వివాదమును శాంతింపఁజేయుటకు కుమారుఁడు నారు ముఖములుగలవాఁడై యారుగురి పాలు త్రాగినందున నవ్వారు మిగుల సంతృప్తిఁజెందిరి. మరియు కుమారుని యభిప్రాయమును కనిపెట్టి తమ లోకమునకు గొంపోయిరి. సూర్యుని మించిన తేజస్సు గల బాలుని తమ చనుబాలతో పోషించుచుండిరి. ప్రాణములకన్న నధికముగా కాపాడుచు కుమారుని యెల్లకాలము గమనించుచుండిరి. మూడులోకములయందును పొందనలవిఁ గాని వస్త్రములను భూషణములను సంపాదించి ప్రేమానురాగమున బాలున కొసగుచుండిరి. స్వచ్ఛములు రుచికరములు నగు ఆహారములను తినిపించుచుండిరి.

ఇట్లుండగా నొకనాడు కుమారస్వామి స్వర్గమున నమరావతిని దేవసభకుఁజని తన దివ్యరూపవిలాసములను హరి బ్రహ్మేంద్రాది దేవతలకు ప్రదర్శించియు "నీవెవరని' వారు ప్రశ్నించినను బదులుఁజెప్పక నిజనివాసమున కరుదెంచి గుప్తముగా నుండెను.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో తృతీయాధ్యాయము.

## చతుర్థాధ్యాయము

### (కుమారస్వామిని వెదకుట - వంటికేశ్వరుని సంభాషణము)

తరువాతి వృత్తాంతమును వివరింపుమని శౌనకాదులు ప్రశ్నింపగా సూతుఁడు చెప్పఁదొడఁగెను. అవ్విధము కృత్తికలు కుమారస్వామిని గొంపోయి తమ చెంత పోషించుచుండగా నాతని జాడ తెలియనందున పార్వతీదేవి యొకనాఁడు మందస్మితమున శంకరునిట్లు ప్రశ్నించెను.

మహాదేవా! నా పూర్వపుణ్యములందగు బలమున నిన్ను పతిగా బడయఁగలిగితిని. యోగీశ్వరుఁడవైనను నాయందలి కరుణచే నాతో శృంగారసుఖముఁబడయునపుడు స్ఖలితంబగు నీ వీర్యము ఎట్టి పరిణామముఁజెందినది? అద్దానివలన శిశువు జన్మించినాడా? అని విన్నవింప భగవానుఁడు చిరునగవుఁ జెంది విష్ణ్వాదిదేవతలను పిలిపించి "అమరులారా? అమోఘంబగు నా వీర్యమేమైనది? ఎవరెవే విధముగా నద్దానిని వహించినవారు? త్వరగా సమాధానముఁజెప్పు నెడ ఎట్టిభయంబు మీకు వాటిల్లదు. లేనియెడల శిక్షార్హులగుదురు; సమర్థుడైన ప్రభువు అపరాధులను దండింపకుండునెడ ప్రజలచే బాధింపబడి ఇడుములఁ బడయును కావున శీఘ్రమే నేనడిగిన విషయమును వివరింపుడు" అని శాసించెను. అంత నమరులు శంకరుని శాసనము నాకర్ణించి గడగడ వడఁకుచు నొక్కొక్కరు దిగువవిధము విన్నవించుకొనినవారు.

విష్ణుమూర్తి - శంకరా! నీ వీర్యము నపహరించినవారు - అనృతసంభాషకులై పెద్దలను తూలనాడుచు భారతదేశమున గురుదారాగమనదోషము ననుభవింతురు గాక!





బ్రహ్మదేవుడు - పరమేశ్వరా! నీ తేజస్సును దొంగిలించినవారు భారతమున పుణ్యక్షేత్రముల యందు నిన్ను పూజించుటకు సేవించుటకు నర్హులు కాకుందురు గాక!

లోకపాలురు - మహాదేవా! నీ రేతస్సును లోపింపఁజేయువారి ప్రతికార్యంబు సంతాపజనకమై దుఃఖమయంబగుగాక!

దేవతలు - పరాత్పరా! నీ ఇంద్రియమును వ్యర్థపరచినవారికి "ఒకానొక ప్రతిజ్ఞ నొనర్చి యద్దానిని పూర్తిఁజేయ ని" దోషము సంభవించుగాక!

దేవతావనితలు - పశుపతే? నీసప్తమధాతువును పోగొట్టినవారికి "భర్తను తిరస్కరించి పరపురుషుని పొందు దోషంబును తల్లి బంధువులును లేనట్టి దుఃస్థితియు నొనఁగూరుగాక!

అంత శంకరుఁడు కర్మసాక్షిదేవతలను గురించి "మీరు సర్వకర్మసాక్షులు కావున నా వీర్యము ఏమైనదో? అద్దానినెవరపహరించిరో చెప్పు' డని గర్జించుచు విచారింపగా బ్రహ్మాదులు వినయముతో భయ సంభ్రమములు కలుగుచుండ నిట్లు విజ్ఞాపించుకొనిరి.

బ్రహ్మదేవుఁడు - శంకరుఁడు రతిసుఖముఁబడయునపుడు విఘాతము సంభవించి నందున నాతని వీర్యము నేలపైపడుటఁజూచితిని.

భూదేవి - అట్టి వీర్యమును నేను భరింపఁజాలనిదాననై అగ్నియందు పడవేసితిని కావున ప్రభో! నాయపరాధమును మన్నింపుము!

అగ్ని - నేనుగూడ తమరేతస్సును కపోతమునై త్రాగినను మోయఁజాలనివాడ నై కైలాసపర్వతముపై పడవేసితిని.

కైలాసపర్వతము - దుఃసహంబగు తమ ఇంద్రియమును గంగానదియందు పడవేసితిని.

గంగాదేవి - శంకరా! నీ వీర్యము నాకును వహింప నలవి గానందున మిగుల తత్తఱపాటుఁ జెంది రేలుగడ్డియందు పడవేసితిని.

వాయువు - రేలుగడ్డియందు పడిన నీ వీర్యము - సుందరుడైన బాలుడుగా పరిణమించినది.

సూర్యుఁడు - ప్రభో! ఏడ్చుచున్న నా బాలుని చూచి - కాలచక్రముఁదగు ప్రేరణ ననుసరించి యస్తమించితిని.

చంద్రుఁడు - కృత్తికలు బాలుని తీసికొని బదరికాశ్రమమునకు వెళ్ళినవారు.

సంధ్యాదేవి - అట్లు పెంచఁబడుచున్న బాలునికి కృత్తికలు కార్తికేయుఁడను నామధేయము నేర్పరచిరి.

రాత్రిదేవి - కృత్తికలు నిరంతరము కుమారుని కనులారఁజూచుచునేయున్నవారు. లోకమున తన నెవడు పోషించునో నటన్టివానికే తాను కుమారుఁడగును గదా!

దివసము - షట్కృత్తికలు పిల్లవానిని పోషించుచు గొప్పగొప్ప వస్త్రముల నలంకారముల నొసగుచు రుచికరపదార్థములను తినిపించుచున్నారు.





ఇవ్విధము బ్రహ్మాదుల భాషితము నాలకించి సంతసించినవాడై శంకరుఁడు దేవర్షులను రప్పించి యవ్వారికి పెక్కు దక్షిణల నొసగుటయే గాక పార్వతీదేవియు కుమారోదయ పరిజ్ఞానవశమున సంతుష్టాంతరంగయై విప్రులకు కోటిరత్నములను బహుధనములను సమర్పించెను.

ఈ శుభవార్తను వినిన లక్ష్మీనారాయణులు సరస్వతీదేవియు మేనకాదేవియు సావిత్రీదేవియు దేవతా వనితలందరును దేవతలున్ను బ్రాహ్మణులకు సువర్ణ దక్షిణలను సమర్పించిరి.

అంత నమరులు మునులు పర్వతములును ప్రార్థింపగా శంకరుఁడు కుమారునికొరకు త్వరగా వెళ్లమని వీరభద్రుని విశాలాక్షుని శంకుకర్ణుని పరాక్రముని నందీశ్వరుని మహాకాలుని వజ్రదంష్ట్రుని మహోన్మదుని గోకర్ణాస్యుని దధిముఖుని మరియు లక్షక్షేత్రపాలురను మూడు లక్షల భూతములను శివతుల్య పరాక్రమము గల రుద్రులను భైరవులను తదితర అసంఖ్యాక వీరులను పంపెను. అంత నా శివదూతలు నానావిధములైన శస్త్రాస్త్రములను పట్టుకొని కృత్తికలు నివసించు స్థానమున కరుదెంచగా నవ్వారు వెఱగంది బ్రహ్మతేజస్సుతో ప్రకాశించు కుమారునికి "నాయనా కుమారా! గొప్పసైన్యములు మనయింటిని ముట్టడించినవి. మాకు భయమొదవుచున్నది. కర్తవ్యమేమిటో ఎక్కడికివెళ్ళవలెనో తోచుటలేదని" విన్నవింపగా కార్తికేయుఁడు - తల్లులారా! నేను మీ చెంత నుండగా ఎట్టి భయంబు సంభవింపదు. నన్ను ఓడించువాడీ ముల్లోకముల యందును లేదని భావింపుడు! అని వాక్రుచ్చెను.

ఇంతలో శివగణములకు నధిపతియగు నందికేశ్వరుఁడు - కార్తి కేయుని మ్రోల నేతెంచి నొక్కచో కూర్చుండి దిగువవిధము సంభాషించెను.

సోదరా! కార్తికేయా! తల్లులారా? శంకరునిచే పంపఁబడితిని. నే చెప్పునది గమనింపుడు! కైలాసమున శంకరు నాస్థానమునందు హరిబ్రహ్మాద్యమరులు నిండియుండు సమావేశమున గొప్పవేడుకగా నుండు సమయమున పార్వతీదేవి నిన్ను గురించి ప్రస్తావింపగా శంకరుఁడు - బ్రహ్మాదులను విచారించెను. అంత నవ్వారు క్రమముగా నీ యుత్పత్తిఁదగు పరిస్థితి నొక్కొక్కరు వివరించి కృత్తికల చెంత నీవున్నట్లు విన్నవించిరి.

ఐతే నీవు నిజముగా కృత్తికల కుమారుడవు కావు. పార్వతీశంకరుల యనుఁగు తనయుడవు; కృత్తికలు దైవికముగా నిన్నుపొంది పోషించుచున్నవారు. కావున కైలాసమునకు రమ్ము! అచ్చోట దేవతలు చూచుచుండ నీకు పట్టాభిషేకము చేయఁబడును. శస్త్రముల నన్నిటిని బడయగలవు; తారకాసురుని సంహరింప వలసియున్నది. శంకరునికుమారుడవై వీరిచెంత నుండరాదు. శుష్క (ఎండిన) వృక్షము - తనలో నగ్నిఁదాచు కొనఁజాలనట్లు ఈ కృత్తికలు నిన్ను కాపాడఁజాలరు. పక్షిరాజు - ఆకసమున శోభించును గాని బావిలో పడినచో తబ్బిబ్బు కావలసినదే గదా! అటులే వీరి గృహముల యందు నివసింప నర్హుడవు కావు; సూర్యుడు - తన తేజః ప్రసారమున లోకమును ప్రకాశింపఁ జేయునట్లును జగములను వ్యాపించు ఆకాశమువలెను నీవిప్పుఁడు ప్రపంచమున కుపకరింపవలసియున్నది. పుణ్యపాపముల సంబంధము లేనట్టి యోగీంద్రునివలెను జీవులాచరించు కర్మయోగముల యందు బద్ధుఁడుగాని శుద్ధాత్మవలెను ప్రవర్తించువాడవు; నిజముగా విచారింప విశముఁదగు నభివృద్ధి నీపై ఆధారపడియున్నది. గుణములకు తేజస్సులకును నిలయమగువాడవు





సోదరా! కప్పలు కమలములను గుర్తింపనట్లు పామరులు నిన్ను కనుగొనఁజాలరు.

అంత కుమారస్వామి "అగ్రజా! త్రికాలజ్ఞానము గల నీకు తెలియనిదేమియు లేదు. మృత్యుంజయు నాశ్రయించియున్న నిన్ను మిగుల వర్ణించుట యెందులకు? ఏ యే యోనుల యందు జననము కావలెనో ఆయా స్థానములయందు జీవులు తమకర్మ ననుసరించి విశ్రాంతిఁ జెందుదురు. ఐతే ఈ కృత్తికలు - వివేకము గలవారు యోగినులు, ప్రకృతిఁదగు కళలునని భావింపుము! వీరి పాలతో నేను పెరిగితిని. ప్రకృతి నధిష్ఠించియుండు పరమాత్మ యొక్క యంశవలనఁబుట్టితినని నాకును తెలియును.

పార్వతీదేవికి ధర్మపుత్రుడను, కృత్తికలకు పోష్యపుత్రుడను, పుత్రసముడవగు నిన్ను నాకొరకు శంకరుఁడు పంపినవాడు. కావున నీతో వచ్చెదను. అచ్చోటున పార్వతీ శంకరులను హరిబ్రహ్మాదిదేవతలను చూడగలను" అని వక్కాణించి షట్కృత్తికలకు తన ప్రయాణమును గురించి తెలిపినవాడై శివగణముల వెంట బయలుదేర నుద్యుక్తుడగుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞానసర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువార
ప్రవచనముతో నాలుగవ అధ్యాయము.

## పంచమాధ్యాయము

### (కుమారస్వామికి పట్టాభిషేకము)

ఇంతలో విశ్వకర్మ నిర్మించిన నద్భుతంబగు రథమును పార్వతీదేవి - ప్రమథ గణములతో నచ్చోటికి పంపెను. అద్దానికి నూరుచక్రములు నమర్పఁబడియుండెను. మనోవేగము గలదై మనోహరముగా నుండు రథముపై - తల్లులనెడబాయవలసివచ్చినదని లోలోన గుందుచు కార్తికేయుఁడు సమాసీ నుండయ్యెను.

అట్టితతి కృత్తికలు వెంట్రుకలు విఱబోసుకొని రోదనముఁజేయుచు పిచ్చివారి వలె నిట్లు మాటలాడిరి.

కరుణాసముద్రా! కుమారా! మాయందు దయలేనివాడవై మమ్ము విడచివెళ్ళఁదగునా? పోషించిన తల్లులను విడనాడుట కుమారునకు ధర్మము కాదు. నిన్ను స్నేహముతో పెంచితిమి. ధర్మమునుబట్టి నీవు మాకు పుత్రుడవైతివి. ఇప్పుడు నీకు దూరమై మేమేమి చేయవలెను? ఎక్కడికి వెళ్లవలెను?

అంత నా కృత్తికలు కుమారుని దరిఁజేర్చుకొని పుత్రవియోగకారణమున మూర్ఛఁజెంది కొంత తడవునకు మేలుకొనఁగా నవ్వారిని జ్ఞానవైరాగ్య వచనములతో సంబోధించి శివపార్షదులు వెంటరాగా శతచక్రరథముపై నధిష్ఠించి శుభమంగళ శకునములు తారసిల్లు చుండగా కైలాసముఁజేరినవాడయ్యెను.

కైలాసమున నొకానొక దివ్యప్రదేశమున విరాజిల్లు వటవృక్షముచెంత కుమారుఁడు నివసింపగా సమరులు మునులు సిద్ధులు నవలోకించి కుమారుని రాకను పార్వతీశంకరులకు నివేదించిరి.

అంత గంగాధరుఁడు నారాయణుని పరమేష్ఠిని ఇంద్రాదిదేవతలను వెంటనిడుకొని సంతోష ప్రాంతమున కుమారునెదుర్కొనుటకు బయలుదేరగా శంఖములు పూరింపబడుచుండెను. భేరి మొదలగు





వాద్యములు మ్రోగింపఁబడుచుండెను. అమరులు గొప్పవేడుకతో చెలరేగుచుండిరి. మరియు వీరభద్రస్వామి మొదలగు గణాధీశ్వరులు పలురకముల ధ్వనులఁ జేయుచు బృందారకులననుసరించిరి. శంకరుని లీలావైభవమును కొనియాడుచు కార్తికేయుని ప్రశంసించుచుండిరి. జయశబ్దము నుచ్చరించుచు నమస్కారములతో కుమారుని గాంచుటకు కుతూహలపడుచుండిరి. పార్వతీదేవియు మంగళప్రదములైన ఆచారముల నన్నిటినొనరింపఁజేయుచు శంకరుని సహచారిణి యయ్యెను. రాజమార్గమంతయు పద్మరాగాది మణులతో నలంకరింపఁబడెను. కైలాసమునఁగల శివపురమంతయు సంస్కరింపఁబడియుండెను. లక్ష్మీదేవి మొదలగు ముప్పదుగురు దేవతారమణులు పతిపుత్రవంతురాండ్రగు సాధ్వీమణులతో కూడి కుమారానయన మహోత్సవమున పాలుగొనిరి. రంభ మున్నగు నప్సరసలు సింగారించుకొని మందస్మితవదనారవిందలై సంగీత నృత్యములను సలుపుచుండిరి. గాంగేయుని చూచిన వారందరికి లోకాతీతమైన తేజస్సు గోచరించుచుండెను. అట్టి ప్రతిభతో నలరారు బాలుఁడు - అగ్నితప్తమగు కాంచనముఁబోలిన వన్నెయు సూర్యవర్చస్సును గలిగి కన్నుల పండువుగా నుండెను. కుమారుని వామదక్షిణభాగములందు హరి బ్రహ్మాద్యమరులు గుమిగూడి తలలువంచి సాష్టాంగముగా మ్రొక్కులిడుచుండిరి. ఇంతలో గిరిజాశంకరులు మహోత్సవమున ముందు కేతెంచి తనయు నవలోకించుచుండిరి. జగదేకబంధువగు పరాత్పరుఁడు భవానితో గూడ పరమానందభరితుడై నిండు స్నేహమున కార్తికేయుని కనులార చూచుచుండగా ప్రమథగణములు శంకరుని ముట్టడించి వేడుకఁ జూపుచుండిరి.

శ్లో॥ అథ శక్తిధరః స్కందో - దృష్ట్వా తౌ పార్వతీశివౌ ।
అవరుహ్య రథాత్తూర్ణం - శిరసా ప్రణనామ హ ॥ ౨౭

శక్తిని కేలఁదాల్చు కుమారస్వామి – పార్వతీశంకరులను దర్శించి రథమునుండి డిగ్గి శీఘ్రముగా నభివాదముఁజేసెను. శంకరుఁడు కుమారునక్కునఁజేర్చుకొని యత్యంతాను రాగము ఉట్టిపడునట్లు శిరముపై నాఘ్రాణించెను. పార్వతియు కుమారుని చంకలో నిడుకొని మిక్కిలి స్నేహముగలదై స్తనములనుండి స్రవించుచున్న సరసమధుర క్షీరములను త్రాగించుచుండెను.

అంత దేవతలు – అమరనారీమణులతో కుమారునకు మంగళనీరాజనములను సమర్పించుచుండగా జయశబ్దము మిన్నుముట్టుచుండెను. ఋషులొకవంక వేదమంత్రముల నుచ్చరించుచుండిరి. గంధర్వులు మరియొకవంక సంగీతముల నాలపించుచుండిరి. తదితరులు నానావిధవాద్యములను మ్రోగించుచుండిరి.

మహేశ్వరుఁడు – కాంతిపుంజమో యనునట్లు ప్రకాశించు కుమారుని తన తొడపై నెక్కించుకొని మిగుల శోభించుచు పుత్రవంతులలో శ్రేష్ఠుఁడనఁబఱగుచుండెను.

అంత కుమారస్వామి – శివాజ్ఞననుసరించి గొప్పయుత్సాహముగల పరివారముతో గూడ శివపురమునఁబ్రవేశించెను. అట్టితతి పురాణదంపతులు – మునులచేతను బృందారకుల చేతను నమస్కరింపఁబడుచు కుమారుని పొందిన కారణముగా ఏకకాలమున విరాజిల్లుచుండిరి.

కుమారస్వామి – శివాంకమునందాసీనుఁడై శంకరుని మెడఁజుట్టుకొని యున్న వాసుకిని చేతులతో నొత్తిపట్టగా నట్టి విషయమును గమనించి శంకరుఁడు సంతసించుచు పార్వతీదేవికి చెప్పుచుండెను.





భువనముల నేకైకకర్తృకముగా పాలించువాడును జగదేకబంధువునగు సదాశివుఁడు - గిరిజాసమేతముగా పరమనిర్వృతినొందుచు మందస్మితముగలవాడై గద్గదస్వరమున మిన్నకుండెను.

తరువాత శంకరుఁడు - లౌకికవ్యాపారము ననుసరించి యొకానొక రత్న సింహాసనమున కార్తికేయుని కూర్చుండఁజేసి వైదికమంత్రపూతములు సర్వపుణ్యతీర్థమయములునగు నుదకములను రత్న కలశములయందు నింపించి యవ్వానితో నభిషేకమును చేయించినవాడు.

కుమారునకు రత్నములమర్పఁబడిన కిరీటమును వైజయంతి యనఁబడు కంఠహారమును నారాయణుఁ డొసగెను. శివుఁడు - త్రిశూలమును పినాకధనుస్సును గొడ్డలిని శక్త్యాయుధమును పాశుపత మనఁబడు సంహారాస్త్రమును శాంభవీవిద్య ననుగ్రహించెను. బ్రహ్మదేవుడు - యజ్ఞోపవీతమును గాయత్రీమంత్రమును వేదములను కమండలమును బ్రహ్మాస్త్రమును సమర్పించెను. దేవేంద్రుఁడు - ఐరావతమును వజ్రాయుధమును; వరుణదేవుఁడు - శ్వేతచ్ఛత్రమును రత్నమాలికను; సూర్యుడు - మనోవేగముగల రథమును కవచమును; యమధర్మరాజు - యమదండమును; చంద్రుఁడు - అమృత కలశమును; అగ్నిదేవుఁడు - మహాశక్తిని; నిర్వతి - స్వకీయాయుధమును; వాయువు - వాయవ్యాస్త్రమును; కుబేరుఁడు - గదను; ఈశానుఁడు - త్రిశూలమును; తదితర దేవతలు - నానావిధశస్త్రాస్త్రములను; మన్మథుఁడు - కామాస్త్రమును కామవిద్యను; పాలసముద్రము - అమూల్యరత్నములను ఎన్నఁదగిన రత్నపుఅందెలను; హిమవంతుఁడు - దివ్యభూషణమును పట్టు వస్త్రములను సమర్పించిరి. గరుత్మంతుఁడు - చిత్రబర్హణుఁడను తన కుమారునొసగెను. అరుణుఁడు - తామ్రచూడుడను కోడి నిచ్చెను. పార్వతీదేవి చిరునగవుఁజెందుచు గొప్పఐశ్వర్యమును చిరంజీవిత్వమును ప్రసాదించెను.

లక్ష్మీదేవి తఱగని సంపదను మనోహర కంఠహారమును; సావిత్రీదేవి - సమస్త సిద్ధవిద్యను సమర్పించిరి. తదితర దేవతారమణులు - తమతమ యభీష్ట వస్తువుల నొసగిరి. అట్టి మహామహోత్సవమున హరిబ్రహ్మాదులు సంతృప్తిఁజెందుచుండిరి. ముఖ్యముగా పార్వతీ పరమేశ్వరులు పరమానంద భరితులగుచుండిరి.

అంత శంకరుఁడు ప్రసన్నుడై హరిబ్రహ్మాదులఁగూర్చి "మీ మీ యభీష్టవరముల నర్థించుడు! ప్రసాదించెదను" అని సెలవీయగా నవ్వారు "ప్రభో! శంకరా! ఈ నీ కుమారునిచే తారకాసురుఁడు వధింపబడుగాక! అందుకొరకే నీ లీలాచరిత్రము సాగుచున్నయది. కావున తారకుని సంహరింప కుమారుని యాజ్ఞాపింపుము! మేము కుమారు ననుసరింతుము" అని ప్రార్థింప మహాదేవుఁడు వల్లెయని కుమారుని హరిబ్రహ్మాదులకు నొప్పఁజెప్పెను.

అట్టితతి నమరులు కుమారస్వామిని తోడ్కొని కైలాసము నుండి బయలుదేరి క్రిందికి రాగా నారాయణు ననుమతిని విశ్వకర్మ - కైలాసగిరి చేరువ నొక రమ్యమైన పట్టణమును నిర్మించెను. అందు కుమారుఁడు నివసించుటకు ఒకానొక దివ్య అద్భుత భవనమును అందు రత్నపీఠమును కల్పింపగా వైకుంఠుఁడు - కుమారస్వామి నా పీఠముపై నాసీనుఁజేసి భక్తి శ్రద్ధలతో మంగళధ్వాన పూర్వకముగా సకల పుణ్యతీర్థజలములనభిషేకమును చేయించెను. మరియు నివాసగృహమున సర్వవిధవస్తువులను చేకూర్చింపఁజేసి "కుమారా! ఈ వేళటినుండి బ్రహ్మాండాధిపతివి నీవే" యని సర్వాధికారము నొసఁగెను.

మరియు కుమారుని నొసట కస్తూరీతిలకము నలంది యమరులతో గూడ విధివిధానముగ పూజించుటయే గాక ప్రణమిల్లినవాడై సనాతన శివరూప మిద్దియేయని ప్రశంసించెను.

కార్తికేయుఁడు - బ్రహ్మాండాధిపతియై సురలు మునులు చూచుచు ధన్యులగుచుండగా నిజరూపమహిమనొంది వరసింహాసనమున మిగుల రాణించుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆర్ధానువాద ప్రవచనముతో ఐదవ యధ్యాయము.

## షష్ఠాధ్యాయము

### (కుమారస్వామి - తన ప్రభావమును చూపుట)

సూతుఁడు చెప్పఁదొడగెను.

శౌనకాది మహర్షులారా? బ్రహ్మదేవుఁడు నారదమహర్షికి ప్రబోధించిన విధముగా వేదవ్యాసులవారు నాకు నుపదేశించినట్లు నేను మీకు కుమారచరిత ప్రభావములను వివరించుచున్నాను.

నారదుఁడను బ్రాహ్మణుఁడు కుమారుని చెంత కరుదెంచి తాను చేయుచున్న యజ్ఞమును రక్షించుమని యనేక స్తోత్రములతో ప్రార్థించి నమస్కరించెను. మరియు నిట్లు విన్నవించుకొనెను.

స్వామీ! నామాట నాలకించి ప్రస్తుతము సంభవించిన ఇబ్బందిని తొలగించుము! సమస్త బ్రహ్మాండమున కధిపతివి గావున నిన్ను శరణుఁబొందితిని. అజమేధమను యజ్ఞమును ప్రారంభించితిని. అందలి మేషము (మేక) తనుగుఁ ద్రెంచుకొని నాయింటినుండి పారిపోయినది. ఎంతవెదికినను దొరుకుటలేదు. ఇకముందు గూడ మేషము దొరుకనియెడల నా యజ్ఞభంగమగును. నీవుబ్రహ్మాండ నాథుడవై యుండగా యజ్ఞము భంగపడరాదు. కావున గమనించి నా యభ్యర్థనమును ఫలింపఁ జేయుము!

నిన్ను విడిచి యితరులను వేడుకొనఁజాలను. దీన బాంధవుడవు; దయాసముద్రుడవు; హరి బ్రహ్మాదులచే సేవింపఁబడువాడవు; పార్వతీనందనుడవు: స్కందుఁడను పేరు నీకే చెల్లును. శరణాగతులగు సత్పురుషుల కాశ్రయమిచ్చువాడవు; అనాథనాథుడవు: శంకరుని ప్రియతనయుడవు; మాయను వశపఱచుకొనినవాడవు; విప్రులను కాపాడువాడవు; నమ్రులైన వారి మనోగతములను గుర్తెరుగువాడవు; నీ భక్తుల కెల్లకాలము సుఖమునొనగూర్చువాడవు; మరియు భక్తోత్తముల ప్రాణములను రక్షించుచు నవ్వారి సద్గుణములను పెంపొందించువాడవు; సత్త్వరజస్తమోగుణములచే భిన్నభిన్నస్వరూపములఁ దాల్చువాడవు; సర్వదా ప్రసన్నుడవై సచ్చిదానందమయుడవై యుందువు;

సర్వజ్ఞా! త్రిపురములను దహించిన పరమేశ్వరుని కుమారా! సద్భక్తిచే స్వాధీన మగువాడా! ఆరుముఖములతో విరాజిల్లు సర్వేశ్వరా! సజ్జనులకు ప్రియము చేకూర్చువాడా! దుర్జనుల శిక్షించువాడా! శంకరుఁడే పరమాచార్యుడుగా కలవాడా! ఇంద్రాదిబృందారక వందిత పదారవిందా! నన్ను రక్షింపుము!





శత్రువులను భయపెట్టు నీ పాదపద్మములకు మ్రొక్కులిడుచున్నాను. నా విజ్ఞాపనమును చెవి నిడుకొని కర్తవ్యమును గావింపుము! భక్త జనుల మనంబులందు నీ భక్తినతిశయింపఁజేయుము!

సమర్థుడైన ప్రభువు నండ నుండగా పగవాడు బలవంతుడైనను ఏమియు చేయఁజాలడు. తక్షకుడైనను రాక్షసుడైనను నీవు రక్షకుడవై యుండగా భక్తులను బాధింపఁజాలడు గదా!

బృహస్పతియైనను నిన్ను పూర్తిగా పొగడఁజాలడు; నేనైతే మందబుద్ధిగలవాడను; పవిత్రుడనో అపవిత్రుడనో ఎట్టివాడనైనను నీ చరణకమలముఁదగు పరాగమును (పుప్పొడిని) ప్రార్థించుచున్నాను.

భక్తవత్సలా! నీవాడను; నీ సేవకుఁడు నూరుతప్పులు చేసినను మన్నించువాడవు; ఏకొద్ది భక్తిని నీయందు నేను చూపియుండిన నట్టి భక్తిని కనుగొనియే యుండువాడవు; నిన్నుమించిన రక్షకుఁడు గాని నావంటి పామరుఁడు గాని ప్రపంచమున లేరనియే చెప్పవచ్చును.

కలికల్మమును పోగొట్టువాడా? కల్యాణప్రదా! కుబేరుని చెలికాడా! కరుణారసముచే మృదువైన అంతఃకరణము గలవాడా! అష్టాదశ నేత్రములతో ఆరుముఖములతో విరాజిల్లు దివ్యస్వరూపము గలవాడా! నా యజ్ఞమును సంపూర్ణ మొనరింపుము!

శరణాగతవత్సలా! యజ్ఞమును చేయించువాడవు నీవేను; యజ్ఞమునకు విఘ్నముఁ జేయువారిని హరించి కాపాడువాడవు నీవేను; సామగానముల సంతోషించువాడవు; వేదమంత్ర స్వాహాకారములచే ప్రసన్నుడగువాడవు; దేవదేవుడవు; జ్ఞానస్వరూపుడవు; స్వప్రకాశుడవు; ధ్యానింపఁదగినవాడవు; ధ్యానస్వరూపుడవు; పితరులకు పితయగువాడవు; జీవాత్మలందరి ప్రాదుర్భావమునకు కారకుఁడవు;

ఇట్టి నీకు నభివాదముఁజేయుచున్నాను. పాహిమమ యజ్ఞమ్, అని యా నారదుఁడు ప్రార్థింప కుమారస్వామి సంతుష్టాంతరంగుడై తన వీరబాహువును యజ్ఞరక్షణార్థము ఆజ్ఞాపింపగా నాతఁడు యజ్ఞ పశువును వెదకుటకై వడివడిగా బయలుదేరెను.

అట్లు వీరబాహుఁడు వెదకుచు బ్రహ్మాండమునందెచ్చటను గానక వైకుంఠమున కేగి చూడగా నా యజ్ఞమేషము మెడకువ్రేలాడుచున్న యూపస్తంభముతో గొప్పబలము గలదిగా కన్పట్టెను. గొప్ప వికారధ్వనిఁ జేయుచున్న నామేకను వీరబాహుడు కొమ్ములయందు పట్టి లాగుచు వేగముగా స్వామిసన్నిధిఁ దెచ్చినవాడాయెను.

అట్టి మేషమును గాంచి కార్తికేయుఁడు అద్దానిపై నెక్కికూర్చుండగా నద్ది ముహూర్తకాలముననే బ్రహ్మాండమునంతయు సంచరించి మరల కుమారుని నివాసస్థానమున కరుదెంచెను. అంత నా మేషమునుండి డిగ్గి స్కందుఁడు నిజ సింహాసనము నందాసీనుడు కాగా నదియు నచ్చోట నిలువఁ బడియుండెను.

అట్టితతి నారదుఁడు – స్వామీ! నా మేషమును నాకు ప్రసాదింపుము! సంతోషమున నిద్దానితో యజ్ఞమును పూర్తిఁజేయుదును. ఇప్పటినుండి నన్ను సఖునిగా నొనర్చుకొనుము! నీకు నమస్కారమగు గాక! – అని ప్రార్థింప నా ప్రభువు కరుణించి "బ్రాహ్మణా! ఈ మేషమును చంపవలదు! అట్టి హింస లేకయే నా యనుగ్రహమువలన నీ యజమేధ యజ్ఞము పరిపూర్ణంబగుగాక!" అని సెలవీయగా





నారదుఁడు సంతసించి మేషమును వెంట నిడుకొని కుమారస్వామికి శుభాభినందనములఁ బలుకుచు నిజస్థానమునకు వెళ్ళినవాడు.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఆరవ యధ్యాయము.

## సప్తమాధ్యాయము

### (యుద్ధారంభమును వర్ణించుట)

అంత హరిబ్రహ్మాది దేవతలు కుమారుని ప్రభావమును గమనించి "ఈతడు తప్పక తారకాసురుని సంహరించు" నను దృఢవిశ్వాసము గలవారై శివానుగ్రహమును మది విశ్వసించి కుమారస్వామిని ముందిడుకొని తారకాసురునితో పోరాడుటకు బయలుదేరినవారు.

తారకాసురుఁడు నమరుల యుద్ధోద్యమమును కనుగొని గొప్పసైన్యముతో నరుదెంచి యవ్వారితో పోరు సలుప నుద్యుక్తుఁడగుచుండగా దేవతలు తారకుని గాంచి సింహనాదములఁజేయుచుండిరి.

అట్టితరి ఆకాశవాణి – శంకరునిచే ప్రేరేపింపఁబడి "అమరులారా? మీరు కార్తికేయు నాశ్రయించి యుద్ధమునకు సన్నద్ధులైతిరి గావున రాక్షసులనోడించి విజయమును పొందగలరని" వక్కాణింపగా దేవతలు నిండు వేడుకతో వీరశబ్దముల నుచ్చరించుచు ఎట్టి భయములేక ధైర్యము గలిగియుండిరి. మరియు మహీసాగర సంగమమను స్థలమునకు పోరుసలుపనేగిరి.

అట్టితరి ప్రళయకాలమేఘములఁ బోలిన రణదుందుభులు తదితరవాద్యములన్నియు మ్రోగింపఁ బడుచుండెను. తారాకాసురునివెంట నేతెంచిన రాక్షసయోధులందరు నడుగుల పూనికతో నేలఁగదిలించుచు భయంకరముగా నఱచుచుండిరి. అట్టి ధ్వని నాలకించిన సురలు నొక్కుమ్మడిగా యుద్ధమునకు తలపడుచుండిరి.

అంత దేవేంద్రుఁడు కుమారస్వామి నైరావత గజముపై నెక్కించి లోకపాలురను వెంటనిడుకొని ముందు నడచుచుండెను. అమరులును యుద్ధభేరీలను మ్రోగించుటయే గాక గంధర్వులు వీణావేణు మృదంగనాదములఁజేయుచుండిరి. కార్తికేయుఁడు గజమునిం(దున కొనఁగి పలువిధముల నాశ్చర్యములతోకూడియుండునదియు నానాప్రకారములైన రత్నముల నలరారుచున్నదియు నగు విమానము పై నధిష్ఠించి గొప్పవిలువగల చామరములతో వీవఁబడుచు శోభించుచుండెను. ఆతనిపై వరుణదేవుని ఛత్రము దేవదూతలచే పట్టుకొనఁబడెను.

అవ్విధము నమరులు తమ తమ పరివారములతో యుద్ధసన్నద్ధులై యుండగా దేవరాక్షససైన్యములు – ఒండొరులను సంహరించు నుద్దేశముతో గర్జించుచు శత్రువులకు భయముఁగొలుపునవియై చూపరులకు వినోదము నొదవఁజేయుచుండెను. ఇంతలో దేవతలు రాక్షసులు నొకరినొకరు తలపడి క్రోధమున పోరుచుండిరి. ఆ భయంకరయుద్ధమున మొండెములు తలకాయలు పడుటయే గాక క్షణకాలములో యుద్ధరంగము రక్తమాంస పరిపూర్ణంబయ్యెను.

తీక్ష్ణములైన ఖడ్గధారలతో కొందరి భుజములు ఛేదింపఁబడుచుండెను. మరికొందరు తొడలు నరుకఁబడుచుండెను. గదలతోడను ముద్గరములచేత నింకకొందరు మర్దింపఁబడుచుండిరి. మరి కొందరు పాశములతో బల్లెములతోడను కొట్టఁబడుచుండిరి. కత్తులచే పొడవబడుచుండిరి. కొన్ని మొండెములు ప్రాణముపోవునపుడు గట్టిగా అరచుచు నేలఁబడుచుండెను. రక్తమునదులుగా ప్రవహించుచున్నందున నద్దానిగ్రోలుటకు భూత ప్రేతపిశాచములు వేలకొలది తారసిల్లుచుండినవి. నక్కలు, గద్దలు, డేగలు, కాకులున్ను క్రిందపడి మరణించినవారి మాంసములను తినుచుండెను.

ఇంతలో గొప్పబలము కలిగిన తారకాసురుఁడు దేవతలతో యుద్ధమునొనర్చుటకు ముందున కేతెంచగా ఇంద్రాదులును సన్నద్ధులై యుండిరి. అట్టితతి సైన్యముల రెంటియందును గొప్ప కలకల ముప్పతిల్లెను. జంటజంటగా దేవాసురురలు పోరుచుండగా వీరులు సంతసించుచుండిరి. పిరికివారు భయపడుచుండిరి.

తారకునితో దేవేంద్రుఁడును సంహ్రాదునితో నగ్నిదేవుఁడును జంభునితో యమధర్మరాజు, మహాప్రభువుతో నైఋతుఁడును బలునితో వరుణుఁడును సువీరునితో వాయువు, పవమానునితో కుబేరుఁడను శంభునితో ఈశానుఁడును శుంభునితో శేషుఁడును, కుంభునితో చంద్రుఁడును కుంజరునితో సూర్యుడును తలపడి తమతమ బలపరాక్రమములఁజూపుచు నొండొరులను బాధించుచు గెలువనలవి గాకుండిరి.

ఇవ్విధము సురాసురుల యుద్ధము మహాభయంకరమై ఖేచరులకు వినోదముఁగొలుపుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఏడవ యధ్యాయము.

## అష్టమాధ్యాయము

### (దేవరాక్షసాధిప యుద్ధమును వర్ణించుట)

సూతుఁడు చెప్పదొడఁగెను.

దేవదానవసైన్యముల ఘోరయుద్ధమును వర్ణించితిని. ఇఁక నా ప్రభువుల పోరాటమును వాక్రుచ్చెదను.

ఇట్లు పోరు జరుగుచుండగా తారకాసురుఁడు శక్తి యను ఆయుధముతో కొట్టినందున దేవేంద్రుఁడు తెలివిఁదప్పి ఐరావతగజముపైనుండి క్రిందపడినవాడు. అటులే లోకపాలురును రణమున గొప్పనేర్పు గల రాక్షసులచే పరాజయమును పొందుచుండిరి. ఇతర దేవతలును తారాకాసురుని పరాక్రమమునందు వెనుకఁబడసాగిరి. అసురులు విజయోత్సాహమున కలవరముఁజేయుచు సింహనాదముల నొనర్చుచుండిరి.

ఇంతలో వీరభద్రుఁడు వీరులైన గణములతో నమరులను కాపాడఁదలచి తారకుని ముందునకు రాగా ప్రమథగణములన్నియు యుద్ధమునకు తలపడినందున రాక్షసులు నవ్వారితో పోరుచుండిరి.





అంత తారకుని వీరభద్రస్వామి క్రోధమున త్రిశూలముతో పొడువగా నాతఁడు క్షణకాలములో మూర్ఛితుడై నేలఁబడెను. వెంటనే తెలివిగలవాడై శక్తితో వీరభద్రుని వేధింపగా వీరభద్రుఁడు తారకుని త్రిశూలముతో కొట్టెను. తారకుఁడు మరల వీరభద్రుని శక్త్యాయుధముతో ప్రహరించెను. ఇట్లు నవ్వారు నానావిధశస్త్రాస్త్రముల కొంతతడవు ద్వంద్వ యుద్ధమును చేయుచుండగా చూచువారికి పులకాంకురము లొదవుచుండెను, అట్టితఱి మద్దెలలు తప్పెటలు గోముఖములును భయంకరములుగా మ్రోగింపఁ బడుచుండినవి.

తారక వీరభద్రులు – బుధాంగారకులవలె శోభించుచు నొకరినొకరు కొట్టుకొనుచు మల్లయుద్ధముఁ జేయుచుండగా నారదమహర్షి – శివప్రేరితుడై "స్వామీ! వీరభద్రా! ప్రస్తుతము యుద్ధమును విరమింపుము! తారాకాసురుని నీవు వధింపగూడదు" అని ప్రార్థించెను.

అంత వీరభద్రస్వామి మిగుల నలుకఁజెంది "నారదమునీంద్రా! నేనే తారకుని సంహరించెదను. రణరంగమున ప్రభువును రప్పించి తాము వెనుకాడినచో నట్టివారు పిరికివారగుటయే గాక దుర్గతి పాలగుదురు. ఈ వీరభద్రుని గురించి శంకింప నవసరము లేదు. శస్త్రాస్త్రములచే కొట్టఁబడినను భయపడక పోరాడువారు ఇహపరలోకములయందు ప్రశంసింపఁ బడుటయేగాక నుత్తమ సుఖము ననుభవింతురు. విష్ణ్వాద్యమరులారా? నామాటలను గమనింపుడు! కుమారస్వామి రణరంగమునకు రానవసరములేకయే లోకమును తారాకాసురుఁడు లేనిదిగా లేనిదనిగా నొనర్తును" అని వచించి త్రిశూలమును కేలఁదాల్చి శంకరుని స్మరించియు తారాకాసురునితో ఘోరముగా పోరాడుచుండెను. అట్టియదనున గణాధిపతుల వృషభములపై నధిరోహించి త్రిశూలములను ధరించి కోలాహలముఁజేయుచు యుద్ధము నొనర్చుచుండగా నసురులును తారకుని పురస్కరించుకొని గణములను బాధించుచుండిరి. గణములును మహాపరాక్రమమున రాక్షసులను వేధింపగా నవ్వారు గణముల తాకిడికి తాళలేక పరుగెత్తుచుండిరి. ఇట్లు తన పరివారము పరాజయముఁజెందుటను గాంచి తారాకాసురుఁడు క్రుద్ధుడై పదివేలచేతులఁదెచ్చుకొని సింహముపై నెక్కి దేవతలను పడగొట్టుచున్నందున వీరభద్రుఁడు మిగుల క్రోధమున తారకుని మరణమునకై శివపాదపంకజములను ప్రార్థించి త్రిశూలమును చేతఁబట్టగా దశదిశలు అంతరిక్షంబు నాతని తేజస్సుతో వెలుగొందుచుండెను. ఇంతలో కార్తికేయుఁడు గొప్పవేడుకతో యుద్ధరంగమధ్యమునకేతెంచి వారింపగా వీరభద్రస్వామి యుద్ధమును చాలించెను. అంత తారకాసురుఁడు దేవతలపై శరవర్షమును కురిపించుచు నందరిని భయపెట్టుచున్నందున నారాయణుఁడు సుదర్శనచక్రమును శార్ఙమను ధనుస్సును గ్రహించి తారకునితో తలపడగా నవ్వారికి ఘోరమైన పోరాటము సంభవించెను.

హరి గదతో తారకుని కొట్టగా తారకాసురుఁడద్దానిని త్రిశూలముతో ఖండించెను. అంత విష్ణుదేవుఁడు తారకునిపై శార్ఙబాణములను పెక్కిటిని పడవేయగా తారుకుఁడు తన బాణములతో నవ్వానిని ఛేదించెను. తరువాత తారకాసురుఁడు శక్తితో మురారిని వేధింపగా నాతఁడు మూర్ఛితుడై నేలఁబడి క్షణములో తెలివిఁదెచ్చుకొని సింహనాదము నొనర్చుచు మంటలతో చెలరేగుచున్న సుదర్శనచక్రమును ప్రయోగింపగా నట్టిదెబ్బకు తాళలేక తారకుడు క్రిందపడి మరల లేచియు స్వకీయశక్త్యాయుధమును





చక్రమును ఖండించెను. అంత నచ్యుతుఁడు నందకమను ఖడ్గముతో తారకుని కొట్టగా తారకుఁడు మరల విష్ణువును వేధించుటయు విష్ణువు తారకుని బాధించుటయు ఇవ్విధము వారిరువురును సమానబలవిక్రమములతో పోరాడుచుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వము" అను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఎనిమిదవ యధ్యాయము.

## నవమాధ్యాయము

### (తారకాసురుని వాక్యము, వానితో ఇంద్రవిష్ణు వీరభద్ర యుద్ధము)

అంత బ్రహ్మదేవుఁడు "దేవదేవా! పార్వతీసుతా! విష్ణువునకు తారాకాసురునకును జరుగుచున్న యుద్ధము సముచితము కాదు. తారకుఁడు మిక్కిలి బలవంతుడగుటచే విష్ణుమూర్తిచే వధింపఁదగినవాడు కాడని నేను వరమిచ్చితిని. నీవుదక్కనితరుఁడు వానిని చంపఁజాలరు. కావున నా వరమును సార్థకముఁ జేయుము! తారకుని వధింపుము! శంకరుని కుమారుడవై ఇందుకే జన్మించితివి. ఇంతవరకు యుద్ధమున నలసియున్న దేవతలను కాపాడుము! నిజముగా విచారించి చూచినచో నీవు పిల్లవాడవు కావు. యువకుడవు కావు, సర్వేశ్వరుడవని చెప్పవచ్చును.

ఇంద్రుడు, నారాయణుఁడు, అమరులు నేవిధముగా రణమున బాధపడుచున్నారో గమనించి యిప్పటికైనను కరుణఁబూని తారకాసురుని వధించి ముల్లోకములకు సుఖము నొసఁగూర్పుము! ఈ దైత్యుడు తపోబలమున దేవేంద్రుని లోకపాలురను నారాయణుని సయితము ఈవరకెన్నియో పర్యాయములు ఓడించినవాడు. మరియు లోకత్రయమును స్వాధీనముఁజేసుకొనినవాడు. మరల నిప్పుడు నీ చేరువనుండుటఁబట్టి యమరులు యుద్ధమునకు పాల్పడినవారు. కావున దేవా! పాపాత్ముఁడగు తారకుని నీవే సంహరింపవలెను. ఇతరులకు వధ్యుండు కాడీతడు" అని ప్రార్థింప కుమారస్వామి ప్రసన్నుడై చిరునగవుఁజెంది "తథాస్తు" అని యంగీకరించెను.

అంత నా ప్రభువు విమానమునుండి డిగ్గి కాలినడకతో నుఱుకుచు మండుచున్న కొఱ్ఱాయివలె గొప్పకాంతి గల శక్తిని కేలఁదాల్చి విరాజిల్లుచుండెను.

అప్రమేయుఁడు అతిప్రచండుడు ధైర్యవీర్యాదిసద్గుణసంపన్నుఁడు నగు షణ్ముఖుని తారకాసురుఁ డవలోకించి తన రాక్షసులను గురించి "ఈతడే శత్రువులఁబరిమార్చు కుమారుఁడనియు, ఈతనితో నేనొకడనే పోరాడి వీరులందరిని గణములను హరిదేవేంద్రాదులను వధింతు" ననియు వచించి శక్తియను ఆయుధముఁబట్టుకొని కుమారస్వామితో తలపడుచు నమరులను గురించి యిట్లు వక్కాణించెను.

సురలారా? నాముందొక పిల్లవానిని నిలువంబెట్టితిరి. ఇవ్విషయమున మీరును విశేషించి అమరాధిపతియు నారాయణుఁడును సిగ్గులేనివారని చెప్పవచ్చును. ఈయిరువురుమున్ను చేసిన దోసములను వెల్లడింతును. వినుఁడు! వీరుగావించిన దంతయు వేదవిరుద్ధము; వీరిలో విష్ణువు - కపటస్వభావము గలిగి వివేకముఁగోలుపోయినవాడు. బలిచక్రవర్తిని మోసగించి పాతాళమున బంధించెను.

తత్పూర్వము మధుకైటభుల నుపాయమున వధించెను. దేవాసురులు అమృతమును త్రాగునప్పుడు మోహినీరూపముఁదాల్చి పంక్తిభేధము నొనర్చెను. రామావతారమున స్త్రీ వధను గావించుటయేగాక వాలిని మోసమున సంహరించెను. మరియు రావణుఁడు బ్రాహ్మణుఁడని తెలిసి యవ్వానిని వధించి బ్రహ్మహత్యాపాపము నొడిగట్టుకొనుటయే గాక తన భార్యయగు సీతను నిష్కారణముగా విడనాడెను.

పరశురాముడై తల్లిఁజంపెను. గురుపుత్రునవమానించెను. కృష్ణస్వరూపమున పరస్త్రీలను మోహించి యవ్వారితో రమించెను. బుద్ధావతారమున వేదమార్గమును నిందించుచు నాస్తికమతమును నెలకొలిపెను. ఇట్లు నానావిధ పాపములచే కలుషితుడై యున్న కేశవునకు విజయంబెట్లు చేకూరును? ఇఁక నీతని జ్యేష్ఠభ్రాతయగు నింద్రుఁడు స్వార్థమునకై పలుదురితముల నొనర్చిన వాడు దితీదేవిఁదగు గర్భమును ఛేదించినవాడు. గౌతముని భార్యయగు అహల్యను పొందెను. వృత్రాసురుని సంహరించి బ్రహ్మహత్యాపాత్రుడయ్యెను. విశ్వరూపుఁడను బ్రాహ్మణుని శిరంబుల ఖండించినవాడు.

హరీంద్రులు ఇట్టి పాపములనేకములనొనర్చి తమ ప్రభావమును పోగొట్టుకొనినవారు గాన వీరిని విశ్వసించి మీరు సంగరమున విజయము నెట్లు బడయుదురు? మూఢులై ఎందులకు ప్రాణములను విసర్జింతురు? వీరు స్వార్థపరులై ధర్మమును గుర్తెరుగకున్నవారు. ధర్మమునవలంబింపనిది కార్యసిద్ధి కానేరదు. గొప్పధూర్తులగు వీరు శిశువును ముందునిడినవారు. అందువలన బాలుని వధించి వీరిని గూడ సంహరింతును. కాని కుమారా! ప్రాణములను కాపాడుకొనఁదలచితివేని రణరంగమునుండి తొలగుము!

ఇఁక వీరభద్రా! దక్షయజ్ఞమున బ్రాహ్మణులను వధించిన పాపమునకు ఫలము నిప్పుడు చూపెట్టుదును.

ఇవ్విధము హరీంద్రవీరభద్రులను తూలనాడి తన పుణ్యమును క్షీణింపఁజేసుకొని తారకాసురుఁడు కుమారునిపైకి వచ్చుచుండగా దేవేంద్రుఁడు (కుమారుని) ముందున కేతెంచి వజ్రాయుధముతో కొట్టినందున తారకుఁడు క్రిందపడి లేచినవాడై శక్త్యాయుధమున నింద్రుని ఐరావత గజముపైనుండి పడగొట్టెను. అందువలన నమరులు హాహాకారముల నొనర్చిరి. తారకాసురుఁడింకను ధర్మవిరుద్ధమగు కార్యమును గావించి స్వవినాశమును సమీపింపఁజేసుకొనెను. పతితుడైన దేవేంద్రుని కాలితో త్రొక్కుచు వజ్రాయుధమున వేధింపగా విష్ణుభగవానుఁడు సుదర్శనచక్రముతో తారకుని వేధించెను.

అంత నసురుఁడు క్రిందఁబడి లేచియు శక్తితో విష్ణువును కొట్టగా నాతఁడు నేలఁబడినందున నిర్జరులు హాహాకారముఁజేయుచు నఱచుచుండిరి. నిమేషమాత్రమున విష్ణుమూర్తి లేచి సన్నద్ధుడగునంతలో వీరభద్రస్వామి త్రిశూలమును కేలఁదాల్చి తారకుని ప్రహరింపగా నాతడు నేలకొరిగి మరల నుత్థితుడై మహాక్రోధమున శక్త్యాయుధమున వీరభద్రుని కొట్టినందున నా స్వామి క్షణకాలము తెలివిఁదప్పినవాడు. అందువలన ప్రమథగణములు గంధర్వోరగరాక్షసులు ఆర్తనాదములఁజేయుచుండిరి.

అంత వీరభద్రస్వామి – రెప్పపాటుకాలమున జాగరూకుఁడై త్రిశూలమును చేతఁబట్టినవాడు. ఆ సమయమున నా త్రిశూలము – మెరుపువలె మెఱయుచు మంటలతో వెలుగొందుచు దిగంతములను





తన కాంతితో ప్రకాశింపఁజేయుచు సూర్యచంద్రాగ్ని మండలములతో సమానముగా విరాజిల్లుచు వీరులకు భయంకరమై మృత్యుస్వరూపమై కన్పట్టుచుండినది.

ఇట్లు అప్రతిహతంబగు త్రిశూలమున తారకాసురుని సంహరింపఁదలచిన వీరభద్ర స్వామిని కుమారస్వామి నివారించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో తొమ్మిదవ యధ్యాయము.

## దశమోధ్యాయము

## (కుమారస్వామి తారకాసురుని సంహరించుట)

## (అమరుల యుత్సాహము)

పగవారి పొగరు నణచు కార్తికేయుఁడు శంకరుని పాదకమలములను తలచుకొని తారకాసురుని తప్పక వధింతునని నిశ్చయించి పెక్కు సైన్యము వెంటరాగా గొప్ప ప్రభావముతో సింహనాదముఁ జేయుచుండెను.

అట్టితఱి బృందారకులు జయజయధ్వానముల నొనర్చుచుండిరి. దేవర్షులు వైదిక లౌకికస్తోత్రములతో కుమారస్వామిని ప్రార్థించుచుండిరి. తారకకుమారుల యుద్ధము - సామాన్యులకు సహింపనలవిగానిదై సర్వప్రాణిభయంకరముగా కన్పట్టుచుండెను. ఇరువురును శక్తిని కేలఁదాల్చి పోరాడుచు ఒండొరుల నొడలులను కొట్టుచుండిరి. వనమున గొప్ప బలముగల రెండు సింహములవలె నొకరి నొకరు మోసగించుచుండిరి. వైతాలిక ఖేచరాది యుద్ధరీతులను పోరాడుచు పరస్పరము సంహరించు నుద్దేశముతో శిరస్సు, కంఠము, తొడలు, మోకాలులు, నడుము, వక్షఃస్థలము, వెన్ను, అనువానిపై ప్రహారముఁజేయుచుండిరి.

ఈ ద్వంద్వయుద్ధమున విజయమును పొందువారెవరని ప్రేక్షకులైన దేవగంధర్వకిన్నరులు తమలోతాము చింతించుచుండిరి. ఇంతలో నాకాశవాణి "అమరులారా! కుమారస్వామి తారకాసురుని తప్పక సంహరించును. ఇవ్విషయమున మీరెంతమాత్రము సందేహింపకుడు! నిశ్చింతగా నుండుడు! ఇప్పట్టున మీ కొరకు శంకరుఁడే కుమారరూపమున నావిర్భవించిన వాడని తెలియుఁడు!" అని వక్కాణింపగా నద్దానిని షణ్ముఖుఁడు విని రెట్టింపు నుత్సాహము గలవాడై తారకుని ఛాతిని శక్త్యాయుధముతో కొట్టెను. అంత తారకుఁడు నట్టి శక్తిప్రహారమును సరకుసేయక కుమారుని తన శక్తితో వేధించెను. అందువలన నాతఁడు ముహూర్త కాలము మూర్ఛితుడై మహర్షులు నుతించుచుండగా నుత్థితుడై మదించిన సింహమువలె నాక్రోశముఁజెంది తారకాసురుని శక్త్యాయుధమున ప్రహరించెను. ఇట్లు వారు తమ యుద్ధ నైపుణ్యమును ప్రదర్శించుచు ఒకరినొకరు గెలువవలెనని నేలపై మల్లయుద్ధమును గూడ చేయుచుండిరి. దేవగంధర్వ కిన్నరులు మొదలగు ప్రేక్షకులందరు ఆశ్చర్యమానసులై యేమియు మాటలాడకుండిరి.

ఆ సమయమున గాలి వీచుట లేకుండెను. సూర్యుడు క్రాంతిఁ గోలుపోయెను. భూమి - కొండలతో అడవులతోడను కదలుచుండినది. ఇంతలో హిమవంతుఁడు మున్నగు పర్వతపురుషులు స్నేహవశమున కుమారుని గాంచుటకు నచ్చోటికి వచ్చి జడియుచుండగా నవ్వారిని గురించి కార్తికేయుఁడు "మహాభాగులారా? చింతింపకుడు! మీరందరు చూచుచుండగా నీ పాపాత్ముని చంపుదు" నని యూరడించి గిరిజాశంకరుల నొకమారు నమస్కరించి శక్తిని హస్తమునందు ధరించి విరాజిల్లుచు తారకాసురుని యొక్క వ్రేటున కొట్టగా నాతఁడు నేలఁగూలి ప్రాణములను విడనాడెను. అట్లు క్రిందనున్న తారకుని యుద్ధధర్మము ననుసరించి కుమారుఁడు మరల కొట్టకుండెను. అది యదనుగా నమరులు రాక్షసులను దునుముచుండిరి. అవ్వారిలో కొందరసురులు నంజలిఁ ఘటించిరి. మరికొందరు వేలకొలది మరణించిరి. ఇంక కొందరు స్వామిని శరణువేడుకొనిరి. మరికొందరు పారిపోయిరి. తదితరులు కొందరు పరుగెత్తుచుండగా దేవతలచే వధింపఁబడిరి. మరికొందరు పాతాళముఁ జొచ్చిరి.

ఇట్లు కుమారుని తారకవిజయమును గాంచి హరిబ్రహ్మాదిసురలు లోకత్రయవాసులందరు నేకకాలముననే సంతుష్టాంతరంగులైనవారు. ఇట్టి కుమారుని విజయమును గమనించి మహాదేవుఁడు జగదంబతో కూడ సపరివారముగా నచ్చోటికి వేంచేసి యాత్మజుని సాంకమున కూర్చుండఁజేసి గారవించెను. పార్వతీదేవియు మిగుల నభినందించెను.

హిమవంతుఁడును తన కుమారులను వెంటనిడుకొని యేతెంచి కుమారస్వామిని పార్వతీ పరమేశ్వరులను కొనియాడుచుండెను. దేవగణములు మునులు సిద్ధులు చారణులు మిగుల సంతృప్తిఁ జెంది కుమారుని ప్రశంసించుచుండిరి.

ఉపదేవతలు కుమారునిపై పుష్పవృష్టిఁగురిపించిరి. గంధర్వులు పాటలుపాడిరి. అప్సరసలు ఆటలాడిరి. నానావిధ మంగళవాద్యములు మ్రోగింపఁబడెను. ఎటుజూచినను జయశబ్దము నమః శబ్దంబు వినఁబడుచుండెను.

అట్టితతి నారాయణుడు బ్రహ్మదేవుఁడును సంతసించి పార్వతీదేవిని శంకరుని కుమారస్వామిని ప్రార్థించుచు నొకానొక పీఠముపై నవ్వారి నాసీనులఁజేసి నీరాజనముల నొసగుచుండిరి. సంగీతములు వాద్యములు వేదధ్వనియు మారుమ్రోగుచుండెను. గొప్ప పండగవలె నుండెను.

ఇట్లు హరిబ్రహ్మాదుల పొగడ్తల నందుకొని ప్రసన్నుడై శంకరుఁడు పార్వతి తోడను పరివారము తోడను బయలుదేరి తన కైలాసమును చేరుకొనిన వాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదియవ యధ్యాయము.





## ఏకాశాధ్యాయము

### (కుమారస్వామి బాణప్రలంబాసురులను వధించుట)

తరువాత క్రౌంచమను పర్వతుఁడు బాణాసురునిచే బాధింపఁబడి కుమార స్వామి సన్నిధికేతెంచి శరణమును వేడినవాడు. తత్పూర్వము బాణాసురుఁడు పదివేలకోట్ల పరివారముతో కూడుకొని క్రౌంచాచలుని వేధించియుండెను. క్రౌంచుఁడు భక్తిచే కుమారుని చరణకమలమునకు నమ్రుడై మిగుల యాసక్తితో నిట్లు ప్రార్థించెను.

శ్లో॥ కుమార స్కంద దేవేశ - తారకాసురనాశక ।
పాహిమాం శరణాపన్నం - బాణాసురనిపీడితమ్ ॥ ౪

నిఖిలలోకకలంటకుఁడగు తారకాసురుని సంహరించిన స్వామీ! కుమారా! నన్ను రక్షించుము! బాణరాక్షసుని బాధకు తాళలేక నిన్ను శరణము నొందితిని. నీ యుద్ధమున నిలువఁజాలక పరుగెత్తివచ్చి నన్ను పీడించుచున్ననాడు. అందువలన దయఁదలచి నన్ను కాపాడుము! బాణాసురుని సంహరించి దేవమానవాది ప్రపంచమునకు సుఖము నొనఁగూర్పుము!

అంత కుమారస్వామి ప్రసన్నుఁడై తన శక్త్యాయుధమును చేతఁబట్టి మనమున శివుని స్మరించి బాణాసురు నుద్దేశించి ప్రయోగింపగా నద్ది మంటలతో పది దిశలను వెలిగింపఁజేయుచు నా రాక్షసుని పరివారముతో గూడ భస్మముఁజేసి మరల కార్తికేయుని చెంత కరుదెంచెను.

పిదప కుమారుఁడు "నీవు నిర్భయముగా గృహముఁజేరియుండు" మని క్రౌంచునాదేశింపగా నాతఁడు మిగుల సంతసించి గుహు ననేకవిధముల కొనియాడియు తన నివాసమున కేగినవాడు.

అట్టి సమయమున నచ్చోట మూడు శివలింగములను కుమారస్వామి ప్రతిష్ఠించెను.

శ్లో॥ ప్రతిజ్ఞేశ్వర నామాదౌ - కపాలేశ్వర మాదరాత్ ।
కుమారేశ్వర మేవాథ - సర్వసిద్ధిప్రదం త్రయమ్ ॥ ౧౪

ప్రతిజ్ఞేశ్వరుఁడు కపాలేశ్వరుఁడు, కుమారేశ్వరుఁడు నను లింగత్రయము – భక్తుల పాపములను బోకార్చునదియై మనోరథములను ఫలింపఁజేయునదియునై యున్నయది.

తారకబాణాద్యసురవిజయచిహ్నముగా జయస్తంభము నొకదానిని నెలకొలిపి యద్దాని చేరువను స్తంభేశ్వరుఁడను పేరుగల శివలింగమును కార్తికేయుఁడు స్థాపించెను.

శ్లో॥ తతః సర్వేసురా స్తత్ర - విష్ణుప్రభృతయో ముదా ।
లింగం స్థాపితవంత స్తే - దేవదేవస్య శూలినః ॥ ౧౬

అంత హరిబ్రహ్మాది బృందారకులందరు నచ్చోట నొక్కొక్క శివలింగమును ప్రతిష్ఠించుటచే నా స్థలమంతయు శివలింగములతో నిండినదై గొప్ప మహిమగల క్షేత్రంబునై చూపరుల కోర్కెల నీడేర్చునదయ్యెను.





అట్టితతి హరిబ్రహ్మాదులు కుమారుని తోడ్కొని కైలాసమునకు వెళ్లనుంకించు చుండగా ఆదిశేషుని కుమారుడైన కుముదుఁడు - రాక్షసులచే పీడింపఁబడియున్నందున నచటి కేతెంచి స్వామిని శరణము వేడినవాడు తారకకుమారయుద్ధమున భయముచే పారిపోయిన ప్రలంబాసురుఁడు పాతాళముఁజొచ్చి యచటివారిని బాధించుచుండెను. అందువలన కుముదుఁడు - దేవ దేవా! మహాదేవాత్మజా! ప్రలంబునిచే వెతలఁజెందితిని. రక్షించుము! దీనబాంధవుడవు; కరుణాసముద్రుఁడవు; శరణాగతులను కాపాడువాడవు; దుష్టులను శిక్షించువాడవు; - అని ప్రార్థింప కుమారుఁడు శంకరుని పాదకమలములను తలచుకొని శక్తిని కేలఁబూని ప్రలంబాసురు నుద్దేశించి ప్రయోగింపగా నది గొప్పధ్వనిఁజేయుచు రగులుచున్నదై యా రాక్షసుననుచరులతో గూడ దహించి మరల కుమారుఁ జేరియుండెను.

"ఇఁక నీవు ఎట్టి వెఱఁగందక నీ నివాసమున కేగియుండుము! ప్రలంబాసురుఁడు సపరివారముగా నశించినవాడు" అని స్వామి వచింపగా కుముదుఁడు విని కుమారుని పలువిధముల ప్రశంసించి సంబరమున పాతాళముఁబ్రవేశించి నిజనివాసము నందుండెను.

సూతుఁడు చెప్పఁదొడగెను.

శౌనకాది మహర్షులారా? తారకాసురుని సంహరించుట మున్నగు కుమారవిజయము గల నీ చరిత్రము - సర్వపాపహరము, సర్వకామప్రదంబు, ధన్యంబు, కీర్తికరము, దీర్ఘాయుః కారకము, భుక్తిముక్తి ప్రదంబునై యున్నది.

ఇద్దానిని పఠించువారు వినువారును గొప్ప పలుకుబడితో నధికభాగ్యముతోడను జీవించి యవసానమున శివలోకముఁ జెందుదురు. గాన నియ్యది పరమ పావనంబైనది.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదునొకండవ యధ్యాయము.

## ద్వాదశాధ్యాయము

### (కుమారస్వామి - దేవతల ప్రశంసల నందుకొని కైలాసముఁజేరుట)

తారకాసురుని కుమారుఁడు సంహరించుటతోడనే విష్ణుబ్రహ్మాదిసురలు తదితరులును మిగుల సంతసించి దిగువవిధము నుతించిరి.

కల్యాణస్వరూపుడు, విశ్వమునకు శుభమొనఁగూర్చువాడును, జగద్బాంధవుఁడు, నిఖిలచరాచర ప్రాణులు పెంపొందవలెనని భావించువాడునగు కుమారునకు నమస్కారము.

తారకబాణప్రలంభాసురులను పరివారముతో గూడ వధించి ధర్మమును నెలకొల్పిన వాడును జగమునకు కర్తయు రక్షకుఁడును హరించువాడును, ప్రపంచము తన విశాల రూపముగా గలవాడును దేవతలను ఆపదలనుండి కాపాడువాడు నగుదేవునకు మ్రొక్కులిడుచున్నాము.





ఇట్లు నమరులు గావించిన స్తోత్రమునకు సుబ్రహ్మణ్యుఁడు ప్రసన్నుఁడై యవ్వారికి ననేకవరములను ప్రసాదించి తన్ను పొగడుచున్న పర్వతములను గాంచి "అచలములారా! కర్మిష్ఠులు జ్ఞానులు తాపసులును మిమ్మెల్లకాలము సేవింతురు. నా వాక్యము ననుసరించి మీరు (పర్వతములు) శంకరుని విశిష్టములైన లింగస్వరూపములు కాగలరు! ఇఁక పర్వతశ్రేష్ఠుఁడు నా మాతామహుఁడునగు హిమవంతుఁడు - తన ప్రదేశమున తపించువారికి త్వరలో ఫలము నొసగువాడు కాగలడు" అని వరముల నొసగినంత నమరులు స్వామీ! తారకవధాది ప్రస్తుత కర్తవ్యము పూర్తియైనది. ఇఁక నీవు కైలాసమునకేగి పార్వతీశంకరులను దర్శింపవలెనని ప్రార్థించి నిండువేడుకతో కుమారస్వామిని వెంటనిడుకొని కైలాసమునకు వెళ్లుచుండగా జయశబ్దము నమస్కారంబు నొనర్పఁబడుచుండెను. ఎటఁజూచినను మహోత్సవముగా కన్పట్టుచుండెను. అట్టితఱి కార్తికేయుడు - బాగుగా నలంకరింపబడినదియు మహోన్నతంబు గొప్ప సమృద్ధికలదియునగు విమానము నధిష్ఠింపగా బ్రహ్మవిష్ణువులు నిరుపార్శ్వములయందు చామరములఁదాల్చి నిలువఁబడిరి. ఇంద్రాది సురలందరును నలుదిసలయందు కుమారు ననుసరించుచుండిరి. మరియు "శంకరునకు జయ మగుగాక!" అని యుచ్చరించుచు కైలాసగిరిఁజేరి గౌరీశంకరులను దర్శించి యంజలిఁ ఘటించియు నమస్కరించిరి.

కుమారస్వామియు విమానమునుండి డిగ్గి సింహాసనముపై వేంచేసియున్న పార్వతీ పరమేశ్వరులకు నభివాదము నొనర్పగా నా పురాణదంపతులు కుమారు నేకాగ్రముగా ముదమునఁ జూచుచుండిరి. అంత మహాదేవుఁడు - స్నేహపరిపూర్ణుఁడై కుమారుని తన తొడపై కూర్చుండఁజేసి యమృతహస్తమున పునుకుచు నిండు ననురాగమున ముద్దిడు కొనఁగా అమ్మవారును ప్రేమనిర్భరమానసయై కుమారుని దరిఁజేర్చుకొని శిరము నాఘ్రాణించి కమలము వంటి నాతని ముఖమును ముద్దిడుకొనెను. అట్లు వారు కుమారస్వామిని లాలనముఁజేయుచుండగా నాప్రదేశమున గొప్ప యానందము నుప్పతిల్లుచుండెను. గౌరీశంకరుల సంబరమునకు మేఱయే లేకుండెడిది. మఱియు జయ నమస్కారములతో కైలాసము మారుమ్రోగుచుండెను. అట్టి నిరతిశయానందసమయమున నారాయణుఁడు మున్నగు ప్రముఖులు నిట్లు శంభుదేవుని కొనియాడిరి.

మహాదేవా! భక్తులకు నభయము నొసగువాడవు; కృపాసాగరుఁడవు; నీ లీలలు సత్పురుషులకు గూడ నద్భుతములుగా గోచరించును. మూఢులము కావున నిన్నారాధింప నావాహనమున్నగు క్రమమును గుర్తెరుగకున్నాము.

శ్లో॥ గంగా సలిలధారాయ - హ్యాధారాయ గుణాత్మనే ।
నమస్తే త్రిదశేశాయ - శంకరాయ నమోనమః ॥

గంగాజలము నీపైనుండి ప్రవహించుచుండును. (అనఁగా హిమాలయమున జన్మించిన గంగాజలమును శంకరుఁడు భగీరథుని ప్రార్థన ననుసరించి తన శిరమునఁ దాల్చెననియు విషపానతాప హరణార్థము కాదనియు వామనావతారమున బ్రహ్మదేవుఁడు తన కమండలువు నందలి యుదకముచే విష్ణుపాదమును కడిగినపుడు బయలుదేరిన ప్రవాహము స్వర్గమువరకే పర్యాప్తమయ్యెననియు తత్పూర్వమే విష్ణుపదము అనఁబడు ఆకాశమునందు త్రిపథగయైన గంగానది యుండెననియు శ్రీమదప్పయదీక్షితేంద్రులు నిరూపించిరి గావున చదువరులు యిట్టివల్లప్రచారము చేయఁబడిన మాటలు నమ్మ వలదనియు వివేకము.)





సమస్తప్రపంచమునకు ఆధారమగువాడవు, సర్వజ్ఞత మున్నగు దివ్యగుణముల నిండియుండువాడవు; దేవమానవాది చరాచరమును శాసించువాడవునగు నోశంకరా! నమస్కరించుచున్నాము.

వృషభమును ధ్వజముపై నిలిపినవాడును, ప్రమథగణముల కధిపతియు, సర్వేశ్వరుఁడును బ్రహ్మాండమును ప్రళయమున సంహరించువాడును సృష్టికాలమున రక్షించువాడును సత్త్వ రజస్తమో గుణముల నధిష్ఠించువాడును సంగరహితుఁడును శుద్ధ సత్త్వ గుణ సంపన్నుఁడును పరమాత్మయు నగు శివునకు నమస్కారము.

పాశదండములను కేలఁదాల్చిన కాలస్వరూపుఁడును వేదమంత్ర ప్రతిపాద్యుఁడును భూతభవిష్య ద్వర్తమాన జగమునంతయు తన దేహమునుండి యుద్భవింపఁజేయువాడునగు పరమాత్మకు నభివాదము.

ప్రభో! మమ్ము సర్వదాకాపాడుము! శరణాగతులమగు మాపై ప్రసన్నతను ప్రదర్శించుము! నీలకంఠా! ప్రాకృతరూపములేనివాడవై దివ్యరూపము కలిగియుందువు; ప్రాకృతమైన విశ్వంబు నొకప్పుడు నీ రూపమనియే చెప్పవచ్చును.

మహాప్రళయమున ప్రపంచమును ఫాలాగ్నిచే దహించి యట్టిభస్మను ధరించువాడవు; విషపాన సమయమున విష్ణువు త్వరపెట్టుటయు పార్వతి వలదనుటయు అను రెంటి మధ్య నొక్కింత నాలోచించి నపుడు సంభవించిన శోభ కంఠమునందుండుటచే శ్రీకంఠుఁడనబఱగితివి; భక్తులందరును నీ దివ్యలింగ స్వరూపమునకు నిఃస్వార్థబుద్ధిని మ్రొక్కుచుందురు. మరియు నదే లింగస్వరూపమును కరచరణాది విశిష్టమూర్తులకన్న నుత్కృష్టముగా భావించి పూజించుచుందురు. కర్మజ్ఞానేంద్రియములను నియమించి యాత్మావలోకనముఁ జేయువారును తమలో నిన్ను గాంచుటకు ప్రార్థించుచుందురు.

శ్లో॥ త్వంబ్రహ్మ సర్వదేవానాం - రుద్రాణాం నీలలోహితః
ఆత్మాచ సర్వభూతానాం - సాంఖ్యైః పురుష ఉచ్యసే ॥ ౪౨

దేవతలందరిలో బ్రహ్మదేవుడవు నీవేను, రుద్రులలో కైలాసవాసియగు నీలలోహిత రుద్రుడవు; ప్రాణులలో జీవాత్మవు; సాంఖ్యులు నిన్ను పురుషుఁడందురు. పర్వతములలో మేరువవు; నక్షత్రములలో చంద్రుఁడవు; ఋషులలో వసిష్ఠుఁడవు; అమరులలో నింద్రుఁడవు; వేదములలో నోంకారమవు; లోకహితమునకై ప్రాణులను రంజిలఁజేయుదువు. జీవులాచరించు పుణ్యపాపములకు సాక్షిమాత్రుడవై యుందువు. సర్వదా నీ యానతిఁబాటించు మమ్ము కటాక్షించుము!

కోటి సహస్రంబులు కోటి శతంబులునగు నీరూపముల మేఱను కనుగొనఁజాలము కావున మమ్మనుగ్రహింపుమనియే ప్రార్థించువారము.

ఇవ్విధము దివిషదులు ప్రశంసించి కుమారస్వామిని పురస్కరించుకొని శంకరుని ముందు వినమ్రులై నిలువఁబడియుండగా ఈశానుఁడు ప్రసన్నుడై "విధికేశవులారా? ఇంద్రాద్యమరులారా? నావాక్యము నాకర్ణింపుడు! మిమ్ము మరియు పుణ్యాత్ముల నన్నివిధముల రక్షించువాడనని తెలియుఁడు! ఎప్పుడెప్పుడు మీకు సంకటము తారసిల్లునో అప్పుడప్పుడు నన్ను ప్రార్థించుడు!" అని వచింపగా నమరులు గిరిజా శంకరులకు మరల నొకతడవ నమస్కరించి కుమారవిజయముతో కూడిన పార్వతీపరమేశ్వరులు కీర్తిని గానముఁజేయుచు పరమానంద భరితులై తమ లోకములకు చనినవారు.





ఇఁక శంకరుఁడు - పార్వతీదేవితోడను కుమార వీరభద్ర గణేశులతోడను నందీశ్వరాది ప్రమథ గణాధిపతులతోడను వెండికొండపై దివ్యమణిమయ సౌధమున వారివారికి తగు ప్రదేశములను కర్తవ్యములను నిర్దేశించి సంతోషసముత్సాహములు విలసిల్లుచుండ నివసించెను.

శివసంబంధమగుకుమారచరితము నిట్లు వర్ణించితిని. వినువారికి నిత్యనూత్నముగా సంతృప్తిని కలుఁగజేయు నీ సందర్భము యథార్థంబనియు ఇంక నెద్దానిని వినఁగోరుదురో నద్దానిని వక్కాణింతుననియు సూతమహర్షి-శౌనకాది మహర్షులకు నైమిషార్ణమున ప్రబోధించి విశ్రాంతుడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పంద్రెండవ యధ్యాయము.

## త్రయోదశాధ్యాయము

### (గణపతి ప్రాదుర్భావము)

కార్తికేయుని సచ్చరిత్రమును విని యమృతముఁ గ్రోలుటకన్న నెక్కువ సంతృప్తిఁజెందితిమి. ఇఁక గణేశుని యుత్పత్తిని గురించి తెలుసుకొన కుతూహలము కలుగుచున్నయది. సర్వమంగళాస్పదంబగు నాచరిత్రమును వినిపింపుమని శౌనకాదులు ప్రశ్నింపగా

సూతమహర్షి - చెప్పఁదొడఁగెను

కల్పముల భేదము ననుసరించి గణపతి యుదయించుట మరియొక విధముగా చెప్పబడినది. గణపతి పుట్టగానే శని చూచినందున నాతని శిరస్సు తెగిపడుటచే గజముఖము తగిలింపఁబడెనవి పూర్వ కల్పవృత్తాంతము కలదు. ప్రస్తుతము శ్వేతకల్పమునందు జరిగిన సమాచారమును చెప్పెదను.

దయామయుఁడైన శంకరుఁడు - గణేశుని శిరంబు ఖండించెననునంశమున సందేహ మిసుమంతయులేదు. పరాత్పరుఁడు నిర్వికారుడైనను సర్వంబు శాసించువాడగుటచే నవ్విధము చేయవలసి వచ్చెను. సృష్టి స్థితిలయములు మూడు నాతని లీలావిలాసములని తెలియుఁడు!

ఇఁక ప్రకృతము నవధరింపుడు! శంకరుఁడు పార్వతీదేవిని వివాహమాడి కైలాసముఁజేరి సుఖముగా నున్నపిదప కొంతకాలమునకు గణపతి యుదయించినవాడు.

కైలాసమున ఒకానొకసమయమున జయ, విజయ అను చెలికత్తెలు - పార్వతీ దేవితో "అమ్మా! నంది భృంగీశ్వరాది ప్రమథగణములు మనవారైనను శంకరుని యాదేశమును ముఖ్యముగా పాటించుచుందురు. ద్వారమున పరమేశ్వరుని యాజ్ఞకై వేచియుందురు. మన శాసనమునే ప్రధానముగా భావించువాడు ఒక్కడైనను గానరాడు. అందువలన నట్టివాని నొకనిని పుట్టించుము!" అని విన్నవింపగా నవ్వారి వచనమును హితముగా భావించి యట్టి పురుషుని జన్మింపఁజేయుదుననిపార్వతీదేవి మది నిశ్చయించియుండెను. 

అంత నొక్కనాడు పార్వతీదేవి స్నానముఁజేయుచుండగా శంకరుఁడు ద్వారపాలకుఁడైన నందికేశ్వరుని తిరస్కరించి లోనికి వెళ్లెను. అట్టితఱి దేవి శంకరునిగాంచి సిగ్గుఁజెంది తన స్నానమును విరమించి వస్త్రమును ధరించి జయవిజయులు చెప్పినమాట తన కనుకూలించునని భావించెను. ఇట్లుండగా నొక్కనాడు – నాయాజ్ఞఁదక్క నితరులవాక్యము నాదరింపని వానినిప్పుడే నిర్మింతునని దృఢముగా సంకల్పించి తనమేనుఁదగు మైలనొకచో ముద్దగాజేసి సర్వలక్షణసంపన్నుడైన యొకానొక పురుషుని పుట్టించెను.

ఆ పురుషుడు – అన్ని యవయవముల నెట్టి లోటు లేనివాడై సర్వాంగసుందరుడై విశాలఫాలముతోడను మహాబలపరాక్రమముల తోడను గొప్ప కాంతితోడను కన్పట్టుచుండెను. అట్టి పురుషునకు వివిధములైన మేలివస్త్రములను పలురకములైన అలంకారముల నొసగి పార్వతీదేవి యనేక శుభాశీస్సుల ననుగ్రహించెను. మరియు నా కుమారుడవు. నీయంతటి ప్రేమపాత్రుడు మరియొకడిచ్చోటలేడు అని వచింపగా నాతడు ప్రణమిల్లి యమ్మవారిని "దేవీ! నేను చేయవలసిన పనియేమిటో నిర్దేశింపు" మని ప్రశ్నింప నామె నాయనా! నాగృహముఁదగు ద్వారమునుండుము!" నా వాడవుగాన చెప్పుచున్నాను. నా యనుమతి లేనిది లోనికి ఎట్టివాడైనను ఎవడైనను హఠాత్తుగా రాకూడదు" అని వక్కాణించి మిగుల గట్టిదైన బెత్తపు కఱ్ఱనొకదాని నొసగి యాతని మనోహరమగు చక్కని రూపమును గాంచి సంబరపడినదయ్యెను. మరియు నాబాలుని ముద్దిడి యనురాగవశమున కౌగిలించుకొనియు తన యంతఃపురద్వారమున నియమింప నాతడు దేవికి మేలుఁజేయఁగోరినవాడై దండమును కేలఁదాల్చి గృహద్వారముచెంత నుండెను. అంత నమ్మవారు నిశ్చింతగా సఖురాండ్రతోగూడి జలకమాడుచుండ శంకరుఁడు – తన లీలావిలాసమును చూపఁదలచినవాడై వేడుకతో ద్వారముచెంతకు రాగా నాతఁడు శివుఁడని తెలియనట్టి బాలుఁడు "మాతల్లి యాజ్ఞలేనిది లోనికి నీవు వెళ్ళగూడదు. ప్రస్తుతము దేవి స్నానముఁ జేయుచున్నది గానపొమ్ము!" అని ద్వారమునకు నడ్డముగా తన దండమును పెట్టెను. అంత మహాదేవుఁడు "బాలుడా! మూర్ఖుడవై నన్ను గుర్తెరుగకున్నావు; గిరిజాపతియగు శివుఁడను. స్వగృహములోనికే వెళ్ళుచున్నాను. ఎందుకు నన్నిట్లు వారించెదవు?" అని వక్కాణించి లోనికేగుట కుద్యుక్తుండగుచుండగా మరలనొకసారి యా బాలుడు దండము నవరోధించెను.

అందువలన శివుఁడు క్రుద్ధుడై "గణములారా? ఎవడోవీడు విపరీతముగా ప్రవర్తించుచున్నవాడు వీనిని చూడుడు!" అని ప్రమథులను శాసించి యచ్చోటనకు చేరువగా లోకాచారరీతి నుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదిమూడవ యధ్యాయము.





# చతుర్దశాధ్యాయము

## (ప్రమథగణములతో గణపతికి వివాదము)

శివాజ్ఞావశమున ప్రమథగణములు-పార్వతీదేవి కుమారుఁడైన గణపతిని "నీవెవడవు? ఎక్కడినుండి వచ్చినాడవు; చేయదలచి దెద్ది! ఒకవేళ బ్రతుకదలచితివేని యిక్కడి నుండి దూరము వెళ్లుము!" అని వచింపగా నా బాలుఁడు ఎట్టి భయములేనివాడై "మీరెవరు! ఎక్కడినుండి వచ్చినారు? విరోధభావముతో ఎందుకిచ్చోట నున్నారు?" అని వాక్రుచ్చెను.

అంత వారు పరిహసించుచు "మేము ద్వారపాలురమగు శివగణులము; శంకరుని యానతి ననుసరించి నిన్ను తొలగించుటకు వచ్చినవారము. నీవు గణములలో చేరినవాడవని సంహరింపకున్నాము. కానిచో నిప్పటికే వధించుచుంటిమి. దూరముండుము! మరణము నెందులకు తెచ్చుకొనెదవు? అని వచించినను బాలుఁడు నవ్వారిని తిరస్కరించి ద్వారమును విడువకుండెను.

అట్టితతి ప్రమథులు చేయునదేమియు లేనందున శివునిఁజేరి బాలుని చేష్టితమును విన్నవింపగా శంకరుఁడు "పగవానివలె గర్వితుడై ప్రలపించు నీ బాలుఁడు తన మృత్యువు సమీపించినదని తెలియకున్నవాడు. కావున బలాత్కారముగ నైనను వీనిని తొలగింపుడు! పిరికివారివలె మాటలాడు చున్నారెందులకు!" అని శాసించెను.

చూచువారికి వినువారికి నాశ్చర్యముగా నుండు లీలను చూపెట్టు భగవానుఁడిట్లు నుడివినంత ప్రమథగణములు మరల నొక్కపర్యాయము బాలుని సమీపించి "అరేద్వారపాలుడా? ఎవరు నిన్నిక్కడ నియమించినారు? మమ్ము గమనించుట లేదు కావున నీవు జీవింతువెట్లు? జంబుకము సింహాసనముపై నధిష్ఠించి గౌరవము నపేక్షించుటవలె నీ వైఖరి కనబడుచున్నది. మా పరాక్రమమును ప్రదర్శించువరకే నీ ప్రతాపము ఉపయోగించును, అని వచించిరి.

అంత నా బాలుఁడు కోపము జెంది రెండు చేతులతో కఱ్ఱఁబట్టుకొని యవ్వారిని బలముగా కొట్టుచు నిర్భయుఁడై "ఇటనుండి దూరము కండు! లేనిచో నా తాకిడికి తాళలేక పరిహాసపాత్రులగుదురు!" అని వాక్రుచ్చెను.

అంత నా శివగణములు "చేయవలయునదేమిటి! ఎక్కడికి వెళ్లవలెను? ఈ బాలుఁడెద్దియైన చేయఁజాలును. ఐనను వీని మర్యాదను కాపాడుచున్నాము. లేనిచో వీని గతి యేమయ్యేడిదో" అని చింతించి కైలాసమునుండి క్రోశమాత్రము వెళ్లియుండు. శంకరుని చెంతఁజని జరిగిన సమాచారమును నివేదింపగా నా మహాదేవుఁడు నవ్వినవాడై "గణములారా! మీరందరు వీరులని భావించితిని కాని, పిరికిపందలని చెప్పవచ్చును. నాముందు నిలచుటకుఁగూడ దగినవారుకారు; వెళ్లుడు! బాలుని శిక్షింపుడు! అన్ని విధముల యత్నించి వాని నచ్చోటునుండి తొలగింపుడు!" అని శాసించెను.

శివగణములు మరల నొకసారి వెళ్ళి "అరే! బాలకా! హఠాత్కారముఁ జెందకుము! అనవసర సంభాషణమును విరమించి యిక్కడినుండి దూరముగా నుండుము! లేని యెడల మరణము తప్పదు" అని పలుకగా పార్వతీపుత్రుఁడు విని ఇంచుక విచారపరుఁడయ్యెను.





ఇంతలో నమ్మవారు-ద్వారముకడ నెద్దియో కలవరము జరుగుచున్నట్లు కనుగొని చెలికత్తెను చూడుమనఁగా నామె నచ్చోటికేతెంచి సమాచారము నంతయు తెలుసుకొని లోలోన మురియుచు దేవిఁ జేరి సమస్తంబును విన్నవించెను. ఇంక నిట్లు వచించెను. "అమ్మా! మన బాలుడుఁ ద్వారమునందుండి యెవరిని లోనికి రానీయనందున శివగణములు వానిని తిరస్కరించుచున్నవి. నాకు నిద్ది యన్యాయమని తోచెడిని. అవసరములేనిది శంకరుఁడుగాని గణములు గాని లోనికిప్రవేశింతురెట్లు? ఇంతవరకు నెవరిని రానీయని బాలుని చేష్టితము బాగుగా కనుపడుచున్నది. ఐనను బాలునకు నవ్వారివలన పెక్కు బాధ్లు కలిగినవి. ఇకముందు బాలుని మాటలతో భయపెట్టి లోన నవ్వారు ప్రవేశించకుండునట్లు చూడుము! ఒకవేళ వారు రాదలచినచో బాలు నోడించియే మన గృహములోనికి వత్తురుగాక! ప్రస్తుతము నీ పట్టుదలను సడలింపకుము!"

అంత పార్వతీదేవి క్షణకాలము మిన్నకొని "ఇప్పట్టున విధేయురాలనై వినయము!జూపుదునా? పంతమును సాగింతునా? కానున్నది కాకమానదు. ప్రియురాలి మాటను పాటింతునుగాక!" అని మది నిశ్చయించి తన యభీష్టమును తెలుపుటకు సఖిని పంపగా నామె బాలునిఁజేరి "నీవు చేసినదంతయు సమంజసంబేను; బలాత్కారముగా నెవరును లోనఁప్రవేశింపకుందురుగాక!. నీ ముందీ గణము లెంతటివారు? నీయట్టివారిని వీరు జయింపఁజాలరు. ఒకవేళ యుద్ధము నొనర్పవలసివచ్చినచో జడియకుము! ఓడినవారు మరల వైరముఁబూనఁజాలరు గాన జాగరూకుడవై మెలఁగుము!" అని వచింప నాతఁడు తల్లి మాటల నాలకించి గొప్పయానందమును సమున్నతి నొందినవాడై చంకలు కొట్టుకొనుచు తలపాగఁ జుట్టుకొని పిక్కలను తొడలఁదాకుచు ఎట్టి వెఱగందక నిల్లు పలికెను.

నేను పార్వతీదేవి కుమారుడను; మీరు శివుని గణములు; ద్వారపాలురు, నేనును ద్వారపాలుడను; శివాజ్ఞాపరిపాలనము మీకవశ్య కర్తవ్యమైనట్లు నాకు నమ్మవారి యానతిని పాలించుట తప్పనిసరియైనది. కావున నో శివగణములారా? బలాత్కారముగానైనను నమ్రతతోనైనను నా తల్లియింటిలోనికి రాకూడదు.

అంత నవ్వారు బాలుని మాటలకు సిగ్గుఁజెంది శంకరునిచేరువను నమ్రులై చేతులు జోడించి వర్తమానము నంతయు నివేదింపగా పరాత్పరుఁడు – పామరలోకపు రీతిని నటించుచు "గణములారా? నేను విచారపూర్వకముగా చెప్పెడుమాటను పాటింపుడు! ఇప్పట్టున యుద్ధము యోగ్యముగా కనఁ బడుటలేదు. మీరందరు మాగణములు; ఆ బాలుడైతేనో పార్వతీదేవిఁదగు భృత్యుడుగా నున్నవాడు కావున వినయముతో ప్రవర్తించిన యెడల "శంకరుఁడు దేవికి విధేయుఁడు" అను నపకీర్తిపాలు కావలసి వచ్చును. అందువలన నా నిశ్చయమును గమనింపుడు! "కృతే కర్తవ్యమ్" అను న్యాయముననుసరించి యెంతటి ఆత్మీయులైనను తనతో విరోధముఁ బెట్టుకొనునెడ నట్టివారికి విరోధభావమునే చూపవలెను కావున నీ ఏకాకియైన బాలునితో పోరాటము నొనర్చుటయే సమంజసంబని తోచెడిని. మీరందరు సమరమున నారి తేరినవారుగదా! అందువలన యుద్ధముఁ జేయకుండినచో లోకమున గౌరవమును గోలుపోవుదురు! "సర్వలోకాధిపతియగు స్వప్రాణనాథునితో వైరముఁబూనుట విహితముకాదు"ని పార్వతీదేవియు గుర్తెరుగకున్నందున నిట్టి యపచారమునకు ప్రతిఫలము నొందగలదు. అందువలన మీరందరు యుద్ధసన్నద్ధులై బాలు నోడింపుడు! కానున్నది కాకమానదు" అని వచించి యూఱకుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదునాలుగవ యధ్యాయము.





## పంచదశాధ్యాయము

### (గణపతితో ప్రమథగణములు మున్నగువారు తలపడి పరాజితులగుట)

అవ్విధము శివాజ్ఞాబలము గలవారై ప్రమథులు దేవీమందిరము కడకుఁజనియుండగా నవ్వారి నవలోకించి గణేశుఁడు "మీరు పెక్కు సంఖ్యలో నున్నారు, నేనొంటరివాడను. ఐన నమ్మవారి దయఁ జేసి నా బలపరాక్రమములను మీరు నా శంకరుఁడును చూఱగొందురుగాక! పూర్వ మెన్నియో రణములయందు పాలుగొనిన మీకు నీ యుద్ధము అద్భుతముగా నగుపడును. నేనైతే నింతకు మున్నెప్పుడు నెవరితోడను పోరాడలేదు. బాలుడనైనను ధైర్యముతో పోరాడెదను. "అసంఖ్యాకులైన శైవులు నొక్క శక్తేయునిపై దండెత్తినవారు" అని లోకమున నవమాన పాత్రులగుదురు! ఇందు నపజయము నొందినను నాకెట్టి యపఖ్యాతి యుండఁజాలదు. దేవీ పక్షమున నేను శివుని వంక మీరును పోరాడుదుము కావున జయాపజయములు పార్వతీశంకరులవనియే భావింపవచ్చును. నే చెప్పినదంతయు బాగుగా పరిశీలించి యుద్ధమునకు సన్నద్ధులగుదురుగాక! ఐన నిప్పట్టున విచారమున కవకాశము లేదు. భవితవ్యము తప్పక నగును కావున నద్దాని నెవరును ముల్లోకములయందు నాపఁజాలరు." అని వక్కాణింపగా శివగణములు క్రుద్ధులై పండ్లుకొఱకుచు హుంకారములఁజేయుచు "చూడుము! చూడుము! అని భయపెట్టుచు ముందునకు నేతెంచిరి. అంతలో నందికేశ్వరుఁడు భృంగీశ్వరుఁడును గణేశుని పాదములను చెరియొకటిఁబట్టి లాగుచుండగా గణేశుఁడు తన చేతితో వారి హస్తములయందు కొట్టి తన పాదములను విడిపించుకొనెను. తరువాత నా వీరుఁడు బెత్తపు కఱ్ఱను కేలఁదాల్చి దేవీ మందిర ద్వారములో నున్నవాడై తనను సమీపించిన వారి నందరిని గట్టిగా కొట్టుచుండెను.

అందువలన కొందరి చేతులు విరుగుచుండెను. మరికొందరి వీపులు బ్రద్దలగుచుండెను. ఇంకకొందరి తలకాయలు పగులుచుండెను. మరికొందరి మోకాలులు భిన్నములగుచుండెను. కొందరి భుజములు ఖండింపఁబడుచుండెను. ఎదుటికి వచ్చినవారు హృదయస్థలమున వేధింపఁబడుచుండిరి. కొందరు నేలఁ గూలుచుండిరి. మరికొందరు పారిపోవుచుండిరి. కొందరి పాదములు తెగుచుండినవి. మరికొందరు శంకరు నాశ్రయించిరి. సింహముఁజూచి మృగములన్నియు పరుగెత్తునట్లు నా శివగణములలో నొక్కడు నాతని ముందు నిలువఁజాలకుండెను.

ఇట్లు వారి నందరిని పాఱగొట్టి గణేశుఁడు ద్వారమును కాచుచు ప్రళయకాలరుద్రునివలె చూపరులకు భయముఁ గొలుపుచుండెను. ఇంతలో నారదునిచే ప్రేరేపింపఁబడినవారై నారాయణదేవేంద్రాది సురలు నచ్చోటికేతెంచి శివునకు నమస్కరించి "భగవానుడవైన నీకు మేము కింకరులము! సృష్టి స్థితిలయములను గొప్ప లీలలను నెరవేర్చుట చాలక నీ యవాంతర లీలలను చూపెట్టదలచితివా? రజస్సత్వతమోగుణములు నీ మాయాప్రభావములు గదా!" అని ప్రార్థింపగా గిరిజాపతి యించుక చిరునగవుఁజెంది గణముల పరిస్థితి మున్నగు వృత్తాంతమును బ్రహ్మదేవునితో నిట్లు వచించెను.

పంకజాసనా! బలవంతుడైన నొక్కబాలుఁడు నా గృహద్వారముచెంత దండపాణియై ఎవరిని లోనికి పోనీయకున్నవాడు. అంతియేగాక నా గణములను పలువిధములుగా బాధించుచున్నవాడు.

వాని తాకిడికి తాళలేక గణులందరు వెతలఁజెందియున్నవారు. కావున నీవు వెళ్ళి పిల్లవానిని బుజ్జగించి ప్రసన్నుఁజేయుము!"

అంత బ్రహ్మదేవుఁడు-తత్త్వజ్ఞానము లేనివాడై మోహావశమున ఋషులందరు వెంటరాగా నా బాలుని సమీపింపగా నాతఁడు నావేశపూరితుడై సురజ్యేష్ఠుని గడ్డమును మీసము నూడఁబెఱికెను. "అయ్యా! క్షమింపుము! నేనుయుద్ధమునకు రాలేదు. బ్రాహ్మణుడను, యుద్ధశాంతిని కోరి వచ్చినవాడ"నని బ్రహ్మప్రార్థించినను వినక నా బాలుడు దండముఁబట్టుకొని పైపైకి రాగా నాతడు వెఱగంది పరుగెత్తెను. ఋషులందరు దండితులై పాఱఁజొచ్చిరి. ఇదియంతయు గమనించి శంకరుఁడు మిగుల నలుకఁజెంది ఇంద్రాది లోకపాలురను కార్తికేయుఁడు మొదలగు ఆత్మీయులను భూతప్రేతపిశాచాదుల నాదేశించి యుద్ధమునకు పంపగా నవ్వారు తమతమ అయుధములను బాలునిపై ప్రయోగించినందున ముల్లోకములలో అకాలప్రళయ మగునని జనులు శంకించుచుండిరి. భయోత్పాతము లధికమగుచుండెను. ఇంకను "బ్రహ్మదేవుని ఆయుష్యము ముగియును. బ్రహ్మాండము క్షీణించునేమో" అని చింతించుచుండిరి.

కుమారస్వామి మున్నగువారు తమ అయుధములు రిత్తఁబోయినవని యాశ్చర్యచకితులగుచుండిరి. ఇంతలో నమ్మవారు జరిగినదంతయు కనుగొని యపారక్రోధముతో తన బాలుని సహాయమునకై రెండు శక్తులను పుట్టించెను. అందు నొక్కతె ప్రచండభయంకర రూపముగలదై శ్యామవర్ణముతో నోరుఁ దెఱచియుండెను. మరియొకర్తు-పెక్కు చేతులు గలదై మెరుపురూపముతో శోభించుచుండెను.

అట్టితతి నమరులు నా శక్తిద్వయముపై ఆయుధములను ప్రయోగింపగా నవ్వానిని స్వీకరించి శక్తులు మ్రింగుచుండినవి. ఇట్లు సురల పరికరములు మాయమగుచున్నను బాలుని దండము మాత్రము వారి చుట్టు తిరుగుచుండెను.

పర్వతము సాగరమును కళవళపడఁజేయునట్లు బాలుడొక్కడే దేవసైన్యము నంతటిని బాధించు చున్నందున నందరును గుమిగూడి "కర్తవ్యము తోచుటలేదు. దిశలు తెలియుటలేదు. ఈతఁడు త్రిప్పుచున్నదండము భయంకరముగా నున్నయది" అని విచారపడుచుండిరి.

ఇంతలో కదనముఁజూడ నుత్సుకత నప్సరసలు - పుష్పచందనములను హస్తములందిడుకొని యాకసమున వేచియుండిరి. అటులే నారదాది మహర్షులరుదెంచి యంతరిక్షమున నిండియుండిరి. వారందరు గణేశప్రమథుల యుద్ధముఁగాంచుచు ఇట్టిదాని నెప్పుడును గననైతి మని యచ్చెరువు నందుచుండిరి.

అట్టితతి సముద్రములతో గూడ - భూమి కంపించినది. పర్వతములు నేలఁగూలు చుండినవి. ఆకాశమున నక్షత్రగణములు తబ్బిబ్బులగుచుండెను. అమరులు శంకరకింకరులును భయగ్రస్తులై పాఱఁ జొచ్చిరి. ఒక్కషణ్ముఖుఁడు మాత్రము యుద్ధరంగమున ధైర్యముతో నిలువఁబడియుండెను. అమ్మవారు పుట్టించిన రెండు శక్తుల ముందు నందరి పరాక్రమము వ్యర్థంబగుచుండెను. అమరుల దివ్యాస్త్రములన్నియు నిరుపయోగములగుచుండెను. అట్లు యుద్ధమున పరాజితులైన సురలు గణములును శివునిఁజేరి ప్రణమిల్లియు "దేవా! ఈ గణుఁడు సామాన్యుఁడుకాడు. ఇట్టియుద్ధమును మేమెప్పుడునుచూడలేదు.





వినలేదు. బ్రహ్మాండమును రక్షించువాడవు నీవే కావున నిప్పట్టున నెద్దియోగ్యమో బాగుగా విచారించుము!" అని విన్నవింపగా శంకరుఁడు మిగుల కోపముఁజెంది తనగణములతో నచ్చోటికేగగా దేవతలు విష్ణుమూర్తిని పురస్కరించుకొని గొప్పవేడుకతో శంకరుననుసరించిరి.

ఇంతలో నారదమహర్షి – భక్తినమ్రుఁడై యంజలిఁఘటించి "మహాదేవా! నానాలీలా విశారదుడవు; సర్వవ్యాపివి; సర్వాధీశ్వరుఁడవు; ప్రస్తుతమొకానొక లీలావిలాసముతో ప్రమథగణముల గర్వము నణచితివి; ఈ బాలునకు బలము నొసగి యమరుల యహంకారముఁ బాఱద్రోలితివి! స్వతంత్రుడవై నీ యిష్టానుసారము ప్రవర్తించువాడవు; ఇఁక నట్టి లీలా విలాసముఁజూపక నీ గణముల నమరుల నభినందించి బాలునాడింపక జయించుము!" అని ప్రార్థించి యటనుండి వెళ్లినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములో పదునైదవ యధ్యాయము.

## షోడశాధ్యాయము

## (యుద్ధమున గణేశుని శిరశ్ఛేదనము)

ఇట్టి నారదుని వాక్యము నాలకించి శంకరుఁడు భక్తానుగ్రహబుద్ధి గలవాడై బాలునితో యుద్ధముఁ జేయదలచి నారాయణునితో సంప్రదించియు గొప్ప దేవతాగణసైన్య బలముతో కూడుకొని (బాలుని) ముందునకేతెంచెను. అమరులును శివుని కటాక్షమున నధికోత్సాహము గలవారై శంకరుని పద పంకజములను స్మరించుచు పోరాటమునకు సిద్ధముగా నుండిరి.

అంత కేశవుఁడు మిగుల ధైర్యముతో ముందునకు రాగా రెండవ శివుఁడనఁదగు నాబాలుడు శక్తిప్రదత్త మహాబలుడగుటఁజేసి తన దండముతో నాతనిని కొట్టుటయే గాక నమరులను గూడ దండించెను అట్టి యుష్టిప్రహారమును సహింపఁజాలక నందరును యుద్ధపరాఙ్ముఖులు కాఁజొచ్చిరి.

శంకరుఁడును చాలకాలము బాలునితో పోరాడిన నాతడు పరాజితుఁడు కానందున నత్యంతాశ్చర్యము నొందుచు "వీనిని కపటముగానే సంహరింపవలె" నను తలంపుతో రణరంగమున నట్టి యవకాశమునకై నిరీక్షించుచుండెను. అంత విష్ణువు గణేశుని మోహింపఁ జేయు నుద్దేశముతో తన మాయా ప్రభావమును ప్రసరింపఁజేయగా అమ్మవారు కల్పించిన శక్తిద్వయము తమ బలమును బాలునకొసగి యంతర్ధానముఁజెందెను.

అంత నా బాలుడు రెట్టింపు బలము గలవాడై పరిఘమను ఆయుధమును త్రిప్పుచు దేవతలను బాధింపగా నవ్వారు వెఱఁగంది దశదిశలకు పరుగెత్తిరి. "ఈతఁడు ధన్యుఁడు, గొప్పబలముకలవాడు, మహావీరుఁడు శూరపుంగవుఁడును, యుద్ధోత్సాహము కలవాడును; ఈ వరకు శూరులనెందరనో చూచితినికాని యిట్టి పురుషశిఖామణితో సరిదూగువాడు దేవదానవ దైత్య యక్ష గంధర్వ రాక్షసులలో ముల్లోకముల యందును లేడని చెప్పవచ్చును." అని ప్రశంసించు హరిపై బాలుఁడు పరిఘను ప్రయోగింపగా నాతడు శివస్మరణపూర్వకముగా చక్రమునుపయోగించి యద్దానిని ఖండించెను.





ఇవ్విధము మహావీరులగు విష్ణుగణేశులు ఘోరముగా పోరాడుచుండగా గణేశుఁడు జగదంబను స్మరించి మరల నొక్కపర్యాయము కేశవుని దండముతో కొట్టినందున నాతఁడు నేలఁగూలి క్షణకాలముననే లేచినవాడై పార్వతీకుమారునితో కదనముఁజేయుచుండెను.

ఇంతలో శంకరుఁడు నుత్తరమువైపునుండి త్రిశూలమును వేయగా నద్ది గణేశుని తలకాయను ద్రుంచి క్రిందఁబడవైచెను. అంత నమరులు ప్రమథులు నట్టి దృశ్యమును గాంచి యేమియు చేయఁ జాలక మిన్నకుండిరి. తరువాత నారదమహర్షి దేవికడకుఁజని జరిగిన దంతయు నివేదించియు "అమ్మా! ఇప్పట్టున నీ పంతమును సడలింపరాదు" అని మాత్రము చెప్పి వెళ్లెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదునారవ యధ్యాయము.

## సప్తదశాధ్యాయము

### (గణపతిని మరలఁ బ్రతికించుట)

సూతుఁడు శౌనకాది మహర్షులకు బ్రహ్మానారద సంవాదముగా వ్యాసప్రోక్తమైన అనంతరవృత్తాంతము నిట్లు చెప్పఁదొడఁగెను.

జగదంబాదేవిఁదగు చిద్విలాసమును వినుఁడు!

బాలుడు మరణించుట తోడనే ప్రమథగణములు మిగుల సంబరమున మద్దెలలు తప్పెటలును మ్రోగింపఁజొచ్చిరి. శంకరుఁడు గణేశుని శిరస్సును ఛేదించినను తద్వియోగమునకు వగచుచుండగా నమ్మవారు లోనినుండి యేతెంచి మండిపడుచు "ఏమిచేయుదును? ఎక్కడికి వెళ్లుదును? హాహా! ఈ దుఃఖము భరింపరానిది! నా ప్రియ కుమారు నమరులు గణములు కూడి సంహరింపఁజేసిరి కావున వీరినందరిని నశింపఁజేయుదును. అకాలప్రళయమును చేయుదును" అని చింతించి వేలకొలది శక్తులను పుట్టించి యవ్వారిని దిగువ విధము శాసించెను.

శక్తులారా! దేవతలను ఋషులను యక్షులను రాక్షసులను మనవారు ఇతరులు అని విచారింపకయే నందరిని భక్షించుడు! అకాల ప్రళయమును గావింపుడు!

అంత దేవీశక్తులు – అమ్మవారి యానతిని తలఁదాల్చి "అగ్ని – గడ్డిపఱకల నవలీలగా కాల్చునట్లు కనుపడు వారి నందరిని మ్రింగుచుండినవి.

కరాళి, కుబ్జక, ఖంజ, లంబశీర్ష , మొదలగు శక్తులు నొక్కక్కరిని పట్టుకొని నోటఁబడవేయు చుండినవి. ఇట్టి సంహారమును బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఇంద్రాది దేవతలు నందీశ్వరాది గణములు సనకసనందనాది మహర్షులును గాంచుచు "అమ్మవారు ఇకముందేమిచేయునో" యని సందేహించుచుండిరి. బ్రహ్మాండమున జీవించు నుద్దేశము ఏరికిని లేనిదయ్యెను.





క్రొంత తడవునకు నందరు గుమిగూడి "దేవిప్రసన్నురాలైచో నీ సంకటము నివారించును." అని నిర్ణయించిరి. శివుఁడును లోకరీతిని నటించుచు మిగుల విచారపడుచుండెను. తనవాడైనను పరాయివాడైనను అమ్మవారి ముందునకెవరును పోజాలకుండిరి. అప్పుడు నామె ముఖముఁదగు తేజస్సు ప్రజ్వలించుచు దశదిశలను దహించునట్లుండెను.

ఇంతలో నారదుఁడు నచ్చోటికేతెంచి త్రిమూర్తులకు నమస్కరించి యుండగా "అమ్మవారిని శాంతింపఁజేయుటకు నీవు మొదలగు మునులందరు వెళ్ళి స్తోత్రములఁజేయుడు!" అని సురలు నివేదింప నవ్వారు జగదంబను సమీపించి యిట్లు ప్రార్థించిరి.

శ్లో॥ జగదంబ నమస్తుభ్యం - శివాయై చ నమోఽస్తుతే ।
చండికాయై నమస్తుభ్యం - కల్యాణ్యైచ నమోఽస్తుతే ॥ 32

అమ్మా! చండికా! జగత్కల్యాణము నొనగూర్చుదానవగుటచే కల్యాణి యనఁబఱగుచున్నావు; అట్టి నీకు నమస్కారములను సమర్పించుచున్నాము. ఆదిశక్తివి నీవేను, సృష్టిస్థితి సంహారములు మూడును నీమూలముననే గదా ప్రవర్తించును; ప్రసన్నురాలవు కమ్ము! నీ క్రోధమున ముల్లోకములు తల్లడిల్లుచున్నవి కావున తల్లీ శాంతించుము!

ఇవ్విధము నారదాదులు వేడుకొనినను క్రోధవశమున పార్వతీదేవి యేమియు మాటలాడకుండెను.

అంత నవ్వారు "మా యపరాధమును క్షమింపుము! నీ ప్రాణనాథుడైనశంకరుఁడు ఖిన్నుడగుచున్నవాడు. హరిబ్రహ్మాద్యమరులు మేమును సకల జీవులును నీవారేగదా! అంజలుల ఘటించి మ్రొక్కులిడుచున్నాము. దీనులమై నిన్నాశ్రయించితిమి" అని నుతింపగా నమ్మవారు దయగలదై "నా కుమారుఁడు జీవించినచో నేనీ సంహారము నుపసంహరింతును. మరియు నా పుత్రుడే మీ యందరికిని పూజ్యుడగుటయే గాక సర్వాధ్యక్షుఁడును కావలెను" అని యాదేశించెను.

అంత వారు శంకరునకు దేవీ మనోరథమును తెలుపగా నామహాదేవుఁడు "ఉత్తర దిశకు మొదట లభించిన జంతువు తలకాయను తీసుకొని రండు" అని యాజ్ఞాపింప కొందరు గణేశుని మొండెమును బాగుగా కడిగి పూజించి యొకచో పెట్టి యుత్తరదిశనుండి యొకానొక నేనుఁగు శిరస్సును కొని తెచ్చి మొండెమునకు తగిలించిరి.

పిదప హరిబ్రహ్మాదులు శంకరుని గురించి "ఏ నీ తేజస్సువలన మేమందరము జన్మించితిమో అట్టి తేజస్సు ఈ బాలుని శరీరములో ప్రవేశించుగాక!" అని ప్రార్థించి జలము నభిమంత్రించి చల్లగా నా బాలుఁడు జీవకళతో కూడిన వాడయ్యెను.

అట్టితతి బాలుని రూపము సర్వాంగ సుందరమై మనోహరముగా నుండెను. గజవదనముతోడను రక్తవర్ణముతోడను శోభించుచుండెను. అట్టి బాలునిచూచి సురముని గంధర్వాదులు సంతసించి యమ్మవారికి చూపగా నా జగదంబ తనయునుఁగు కొమరు నవలోకించి యానందపరవశురాలయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములో పదునేడవ యధ్యాయము.

# అష్టాదశాధ్యాయము

## (విఘ్నేశ్వరునకు గణాధిపతిత్వము నొసగుట)

తరువాత జరిగిన వృత్తాంతమును వివరింపుమని శౌనకాదులు ప్రశ్నింపగా సూతుఁడు చెప్పఁదొడఁగెను.

పార్వతీనందనుఁడు జీవించినపిమ్మట గొప్పవేడుకతో ప్రమథగణములు దేవతలును గణాధిపతిగా నాతనికి పట్టాభిషేకమును గావింపఁదలచిరి. అమ్మవారు బాలుని చేతులతో పరిగ్రహించి కౌగలించుకొనెను. మఱియు పలురకముల వస్త్రముల నలంకారముల నొసగుటయే గాక తన యమృతహస్తముతో దీవించి నానావిధసిద్ధుల నొదవఁజేసెను. "నాయనా? నీవు పుట్టుటతోడనే దుఃఖము ననుభవించితివి" అనుచు బాలుని ముఖమును ముద్దిడుకొనెను. మరల జీవించి ధన్యుడవైతివి. అమరులందరిలో మొదట పూజనీయుడవై ఎట్టి భయము లేకుందువు గాక! ప్రస్తుతము నీముఖమున సిందూరము కనఁబడుచున్నది కావున సిందూరముతో పూజింపబడుదువుగాక! శ్రీగంధము పుష్పములు మంచిపక్వాన్నములు తాంబూలము నీరాజనము ప్రదక్షిణములు నమస్కారములు అనువానితో నిన్ను పూజించువారికి విఘ్నములన్నియు దూరమగుటయేగాక సిద్ధులన్నియు నొనగూరుగాక!" అని వరములను ప్రసాదించి మరల నొకమారు మేలివస్తువులతో బాలు నభినందించెను.

అట్టితఱి జగదంబ ప్రసన్నురాలై కనుపడినందున దేవమానవాది జగమంతయు ఎట్టి దిగులు లేనిదయ్యెను. ఇంతలోనింద్రాదిదేవతలు శంకరుని ప్రార్థించి బాలుని తోడ్కొని శివుని తొడపై కూర్చుండఁ జేయగా నా కరుణామయుఁడు బాలుని శిరముపై తన కరకమలము నునిచి "ఈతఁడు నా కుమారుఁడు" అని వాక్రుచ్చెను. అంత బాలుఁడు లేచి శంకరునకు పార్వతీదేవికి హరిబ్రహ్మలకు నారదుఁడు మున్నగు మహర్షులకును నమస్కరించి జీవులకుగల యభిమానము ఇట్టిదేగదా! నా యపరాధమును మన్నింపుడు!" అని ప్రార్థింప బ్రహ్మవిష్ణుమహేశ్వరులు "మావలె నీవును సర్వత్ర పూజ్యుడవగుదువు; మమ్ముపూజించి నిన్ను పూజింప కుండినచో మమ్ము పూజించినపుణ్యము వ్యర్థమగును. మొదట నిన్ను పూజించినయెడల విఘ్నము లన్నియు తొలగును." అని వరముల నొసగి బాలు ననుగ్రహించిరి. తరువాత నమరులు గణేశుని నానావిధ ఉపచారములతో నారాధించిరి. అంత శంకరుఁడు ప్రసన్నుఁడై "గిరిజా కుమారా! నీవిషయమున సంతసించితిని. నేను సంతసించినచో జగమంతయు సంతసించును. పిల్లతనముననే గొప్ప పరాక్రమమును చూపితివి కావున ముమ్ముందెట్టి యుపద్రవము నీకుండఁజాలదు. నీనామమును స్మరించువారికి సంకటములు నివారించును. నా గణములకు నధ్యక్షుడవగుదువుగాక!" అని యాశీర్వదించెను.

అట్టితఱి దేవతలు గీతవాద్యనృత్యముల నొనరింపఁజేసిరి. మరల శంకరుఁడు "కుమారా! భాద్రపదమాసమున కృష్ణపక్షమున చతుర్థినాడు చంద్రోదయసమయమున మొదటి జామున నుదయించితివి కావున ఆనాటినుండి ప్రతి కృష్ణచతుర్థి నొక్కసంవత్సరమువరకు నిన్ను పూజించువారికి సంసారసుఖము సర్వంబు నొనఁగూరును." అని వక్కాణించెను.





మార్గశిరమాసమున వచ్చు చవితి - రమాచతుర్థియనఁబడును. ఆనాడు ప్రాతఃస్నానముఁజేసి గణేశుని గతికలతో పూజించి యట్టివ్రతమును బ్రాహ్మణులకు నివేదింపవలెను. ఉపవాసము నొనర్పవలెను. మరియు నా రాత్రిని మొదటిజామున స్నాతుడై చంద్రోదయ సమయమున గణేశు నారాధింపవలెను.

ఇత్తడిరాగిమున్నగు ధాతువులతో చేయఁబడినమూర్తినిగాని పగడములఁగావింపబడిన విగ్రహము నుగాని తెల్లజిల్లేడుఁదగు మూర్తినికాని మట్టిబొమ్మనుగాని నిర్మించి ప్రాణప్రతిష్ఠతో నెలకొలిపి నానావిధసుగంధద్రవ్యములతో పుష్పములతోడను విఘ్నేశ్వరుని పూజింపవలెను.

గతిక - పంద్రెండ్రునంగుళముల పొడవుతో మూడుదళములుగా మొదలుత్రెంపినదిగా నుండవలెను. ఇట్టిగతికలను నూటనొక్కసంఖ్యనుగాని ఇరువదియొకసంఖ్యనుగాని సమర్పింపవలెను. ధూపదీపనైవేద్యము లను తాంబూలము మున్నగువానిని సమర్పించి బాలచంద్రుని వేరుగా పూజింపవలెను. తరువాత బ్రాహ్మణులను పూజించి మధురపదార్థములతో నవ్వారికి భోజనంబిడియు తాను లవణము లేకుండా తియ్యని వంటకములను తినవలెనుఁపిమ్మట గణేశుని విసర్జించి వ్రతము సంపూర్ణమగుగాక! అని భావించి ముగింపవలెను.

ఇట్లు నొక్క సంవత్సరము పూర్తికాగానే వ్రత సంపూర్ణఫలప్రాప్తికై ఉద్యాపనను గావింపవలెను.

ఒకానొక కలశముపై గణపతిని నెలకొలిపి పూజించియు నేలపైనలుచదరముగా స్థండిలముఁ గావించి యద్దాని నష్టదళపద్మమునువ్రాశి గణేశమంత్రముతో హవనముఁజేయవలెను. ఇందు లోభగుణము కూడదు.

ఇద్దరు ముత్తైదువలను బ్రహ్మచారులిద్దరిని గణేశునిముందు పూజించి యవ్వారికి భోజనంబు నొసగి దక్షిణాతాంబూలములను సమర్పింపవలెను. ఆనాడురాత్రి జాగరణముఁ జేసి మరునాడు ఉదయము స్నానసంధ్యానంతరము గణేశుని పూజించి విసర్జనము నొనర్పవలెను. మరియు నుద్యాపనదినమున పంద్రెండ్రుగురు బ్రాహ్మణులకు మధుర స్వాదు భోజనపానీయములను దక్షిణాతాంబూలములను సమర్పింప వలెను.

బాలునివలన నాశీర్వాదములఁబడసి స్వస్తివాచనములమధ్య పుష్పాంజలినొసగవలెను. నమస్కారములను సమర్పించి భజనగీతాదికము నొనరింపఁజేయవలెను.

ఇవ్విధము గణేశుని పూజించువారికి మనోభీష్టములు తప్పక సిద్ధించుటయేగాక నరిష్టములన్నియు తొలగుచుండును. ప్రతిదినము భక్తిశ్రద్ధలతో గణపతిని పూజించుటయు శ్రేయస్కరమగును. అన్నివర్ణముల వారు స్త్రీలును గణపతిని పూజింపవచ్చును. అభివృద్ధినికోరురాజులును గజాననుని తప్పక నారాధింపవలసియుండును.

ఇట్లు శంకరుని యనుశాసనము నాలకించి యమరులు మునులును శివప్రీత్యర్థము గణేశుని పలువిధముల నర్చింపగా ప్రమథగణంబులును శివాజ్ఞను శిరసావహించి నానా ప్రకారక దివ్య సదుపచారములతో పూజించిరి. అట్టి సమయమున పార్వతీదేవికి కలుగు సంబరమును బ్రహ్మదేవుఁడు గూడ నాలుగు ముఖములనైనను చెప్పజాలకుండెను.





దేవతలు దుందుభులను మ్రోగించిరి. అప్సరసలు నాట్యమాడిరి. గంధర్వులుగానముఁజేసిరి. పుష్పవర్షము కురియుచుండెను.

పార్వతీనందనుఁడు గణములకధిపతిగా నెన్నుకొనఁబడినపుడు చరాచరప్రపంచ మంతయు స్వాస్థ్యము నంది గొప్ప వేడుక గలదయ్యెను. దుఃఖమంతయు నివారించెను. విశేషించి పార్వతీ శంకరులు మురియుచుండిరి. జీవకోటికంతయు సుఖం బొదవుచుండెను.

అంత నమరులు ఋషులును శంకరు ననుమతిని తమ తమ నివాసములకుఁ జనుచు పార్వతీ శంకరులను గణపతిని ప్రశంసించుచుండిరి.

పార్వతీదేవి శాంతించిన యంశమును కనుగొని పరమేశ్వరుఁడు పూర్వము వలె నామెను పలువిధముల సుఖింపఁజేసినవాడు. వస్తుతః భగవానుఁడు తనయందు తానే క్రీడించుచు రెండవ వస్తువు నపేక్షించువాడు కాకున్నను భక్తుల కార్యములను సాధించుటకు లోకకల్యాణమునకును నానావిధ లీలావిహారముల ఁజేయుచుండును.

హరిబ్రహ్మలును పార్వతీ శంకరులను సేవించి వారియనుమతిఁబడసియు వైకుంఠసత్యలోకములకు నేతెంచిరి. నారదమహర్షియు శివాజ్ఞ నొంది తన నివాసమునకుఁ జనినవాడు.

శౌనకాది మహర్షులారా? మీరడిగిన విఘ్నేశ్వర జననముతో కూడిన పార్వతీ పరమేశ్వర మహిమను వివరించితిని ఇక్కథను భక్తిశ్రద్ధలతో నాకర్ణించినయెడల శుభములన్నియు సమకూరును. పుత్రసంతానంబు సంప్రాప్తమగును. దరిద్రుఁడు సంపన్నుఁడగును. అపత్నీకుడు యోగ్యురాలైన భార్యను బడయును. నిస్సంతానునకు సంతానము సంభవించును. రోగి ఆరోగ్యము నందును. అదృష్టహీనుఁడు సౌభాగ్యము కలవాడగును. పుత్రులఁగోలుపోయిన వనిత సత్పుత్రవతియగును. సంపాదించిన డబ్బు నష్టమైనవాడు ధనవనంతుఁడగును. ప్రవాసమునగల భర్త శీఘ్రముగా భార్యకడకు వచ్చును. దుఃఖముల పాలైనవాడు బొత్తుగా దుఃఖము లేనివాడగును.

ఈ విఘ్నేశ్వర కథాప్రబంధముగల గృహము మంగళముల కన్నిటికి నిలయంబగునని తెలియుఁడు! ప్రయాణ సమయమున పుణ్యదినమున నీ యుపాఖ్యానమును వినినచో విఘ్నములన్నియు దూరమగుటయేగాక నభీష్టంబును సిద్ధించును. అని సూతుఁడు చెప్పి విరమించినవాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదునెనిమిదవ యధ్యాయము.





# ఏకోనవింశాధ్యాయము

## (గణపతి వివాహ నిర్ణయము)

శౌనకాదు లిట్లనిరి.

సూతమహర్షి చంద్రమా! దివ్యము ఉత్తమంబు పరాక్రమసహితంబునగు గణపతిఁదగు జన్మాది వృత్తాంతమును వినిపించితివి. తరువాత నేమి జరిగినదో అట్టి శక్తిశివుల యశశ్చంద్రికలతో కూడిన యథార్థశుభ సమాచారమును వక్కాణింపుము! విని మహానందసంభరితుల మయ్యెదము.

సూతుఁడు చెప్పఁదొడఁగెను.

కరుణాళువులై మీరు ప్రశ్నించినదానికి సమాధానమును చెప్పుచున్నాను. . సావధానముగా నాలకింపుడు !

పార్వతీపరమేశ్వరులు – కుమార గణపతు లిరువురి యాటపాటల నవలోకించుచు తమ యనురాగమును దినదినప్రవర్ధమాన మొనర్చిరి. తల్లిదండ్రుల గారాబమును పాటించుచు వారు మిగుల సంతృప్తిని పెద్దవారగుచుండిరి. తమయందు గొప్ప పూజ్యభావముగల వారిరువురిపై పున్నమ చంద్రునివలె పార్వతీశంకరుల యనుగ్రహము పరిపూర్ణంబయ్యెను.

ఒకనాడు గౌరీశంకరులు ఏకాంతమున “కుమారులిరువురును వివాహమునకు తగిన ప్రాయము గల వారైనారు. ఇద్దరును ప్రియతములేను; ఎవరికి ముందు? ఎవరికి తరువాత?” అని విచారించుకొని మిన్నకుండిరి. అంత శివేచ్ఛావశమున కుమార గణపతులు మాతాపితారుల యభిమతమును గుర్తెరిగి “నాకు ముందు పెండ్లి, నాకు మొదట వివాహము” అని యిరువురును గోలపెట్టిరి.

అందువలన వారు కొంతతడవు విచారించి యొక నుపాయమును కనిపెట్టి మరల నొకప్పుడు నిరువురిని పిలచి “పూర్వము మేమొక నియమము నేర్పరచుకుంటిమి. మీ రిద్దరును సమానప్రేమపాత్రులే గదా! ఇందెంతమాత్రము తారతమ్యము లేదు. భూమినంతయు ప్రదక్షిణము చేసి ముందు వచ్చినవానికి మొదట వివాహమును చేయవలసియున్నది.” అని వక్కాణించిరి.

అంత నవ్వారి మాట వినుటతోడనే మహాబలశాలియగు కార్తికేయుఁడు పృథివీప్రదక్షిణమునకై కైలాసమునుండి వడిగా బయలుదేరెను. గణేశుఁడుమాత్రము అచ్చోటనే విచారించుచు తన బుద్ధికౌశలము నుపయోగించెను. మరియు “ఇప్పట్టున నేమిచేయవలెను? ఎక్కడికి వెళ్ళవలెను? స్థూలకాయుడ నగుటచే క్రోశమాత్రమైనను త్రోవ నడువఁజాలను. ఒకవేళ సాహసించి పృథివిఁజుట్టి రాగల ననుకున్న నద్ది కష్టసాధ్యముగా కనఁబడుచున్నది.” అని చింతించి యాకాశగంగయందు స్నానమాడి లోనికేతెంచి “జననీజనకులారా? మీ కొరకు నొక పీఠమును నెలకొలిపితిని. అందు మీ రిరువురు ఆసీనులై నా మనోరథమును ఫలింపఁజేయుఁడు!” అని ప్రార్థించెను.

అంత నా పార్వతీపరమేశ్వరులు – గణేశుని ప్రార్థనము నంగీకరించి పీఠముపై కూర్చుండగా నవ్వారిని గణేశుఁడు షోడశోపచారములతో పూజించి యేడు తడవలు ప్రదక్షిణములఁజేసి బుద్ధి





సాగరుడైనందున నంజటింఘటించి యనేకవిధముల నుతించి "శీఘ్రముగా నా వివాహమును చేయుండు!" అని నుడివెను.

అంత నా యాదిదంపతులు "పర్వతారణ్యములతో కూడిన భూమిని ప్రదక్షిణముఁ జేసిరమ్ము! కుమారుఁడు వెళ్ళినాడుగదా! నీవుగూడ వెళ్ళుము!" అని వచింపగా గణపతి ఖిన్నుఁడై "తల్లిదండ్రులారా! ధర్మస్వరూపులైన మీరు సర్వజ్ఞులు; నా వినయముతో కూడిన ధర్మవాక్యము నాలకింపుడు! నేను పృథివి నొక్కసారికాదు. ఏడు పర్యాయములు ప్రదక్షిణము చేసితిని" అని నివేదించెను.

అందుకు వారు లౌకికరీతి నాశ్రయించి "నాయనా! గణపతీ! భూమియన సామాన్యమైన దనుకుంటివా? ఏడు ద్వీపములతో నాలుగు సముద్రములు పొలిమేఅగా కలిగియుండుటయే గాక గహనములైన పర్వతములతో నరణ్యములతోడను కూడియుండును. ఇట్టి నేలఁజుట్టి వత్తువేని నీకె ముందు పెండ్లిఁజేయగలము" అని వచించిరి.

అంత గణేశుఁడు "మిమ్ము పూజించి నేను భూప్రదక్షిణఫలము నొందితిని. తల్లి దండ్రుల నారాధించుట భూప్రదక్షిణఫలప్రదంబని వేదశాస్త్రములయందు చెప్పఁబడిన వాక్యము నిజమగునా? కాదా?

శ్లో॥ పిత్రోశ్చ పూజనం కృత్వా - ప్రక్రాంతించ కరోతి యః ।
తస్య వై పృథివీజన్యం - ఫలం భవతి నిశ్చితమ్ ॥ ౩౯

పుత్రుఁడు మాతాపితరులను పూజించి ప్రదక్షిణముఁజేసిన యెడల భూప్రదక్షిణమును గావించిన సుకృతముఁదగు ఫలమును పొందును. ఇద్ది ముమ్మాటికి నిశ్చయము.

శ్లో॥ అపహాయ గృహే యోవై - పితరౌ తీర్థ మావ్రజేత్ ।
తస్య పాపం తథా ప్రోక్తం - హననేచ తయో ర్యథా ॥ ౪౦

ఎవఁడు స్వగృహమందు గల తల్లిదండ్రులను తిరస్కరించి పుణ్యక్షేత్రమునకు వెళ్ళునో నట్టివానికి పుణ్యక్షేత్రఫలము రాకుండటయేగాక నవ్వారిఁజంపినపాపము సమకూరును.

కుమారునకు జననీజనకుల చరణపంకజములే గొప్ప తీర్థంబని భావింపవలెను. ఇతర తీర్థములు దూరము నందుండునవి. సులభముగా ధర్మమును సాధించుటకు సమీప తీర్థము మాతాపితృసేవనంబగును. అటులే భార్యకు భర్తయే పరమతీర్థము. మరియు అత్తమామల నుపచరించుటయు గృహిణికి ముఖ్యధర్మము.

ఇట్లు చెప్పుచున్న వేదములను శాస్త్రముల నసత్యములఁగావింపుడు! అయ్యవి యథార్థములు గాకుండినచో అందు ప్రతిపాదింపఁబడిన మీ యీ దివ్యరూపంబులును సత్యములు కాకుండును. అందువలన నేను విన్నవించునదేమనఁగా? నా వివాహమును త్వరలో గావింపుఁడు! లేకున్న వేదాదివాఙ్మయమును రిత్తఁజేయుడు! ఈ రెంటిలో నెద్ది యుక్తమో సమంజసమో అద్దానిని వడిగా నొనర్పుఁడు!"

అని వక్కాణింపగా సర్వసమర్థులగు పార్వతీపరమేశ్వరులు విస్మయముఁజెందుచు గణపతి యుద్దేశమును మెచ్చుకొని "గణపతీ! నీకు సమయమున మంచిబుద్ధి కలిగినందులకు సంతసించు చున్నాము. కుశాగ్రబుద్ధిశాలివి; నీవు ప్రతిపాదించిన వేదశాస్త్రసమ్మత విషయము నంగీకరించితిమి.





శ్లో॥ సముత్పన్నేచ దుఃఖేచ - యజ్ఞ్య బుద్ధి ర్వ్యశిష్యతే ।
తస్య దుఃఖం వినశ్యేత - సూర్యే దృష్టే యథా తమా ॥ ౫౧

సంకట సమయమున బుద్ధిబలము నుపయోగించువానికి సూర్యుడు నుదయించినచో చీకటి నమ్మగునట్లు దుఃఖము తప్పక నివారించును.

ఎవనికి బుద్ధి యుపయోగించునో వానికే బలము చేకూరును. బుద్ధిహీనునకు శరీర బలము పరివారాది బలంబు నిరర్థకములగును. మదఘుతో నున్మాదముఁజెందిన సింహమును కుందేలు బావిలో పడవేయునుగదా! బాలుడవైనను వేదశాస్త్ర సమ్మతంబు శిష్టజనగ్రాహ్యంబునగు నుపాయము నాలోచించితివి. బాగుగా బుద్ధివిశాలత నుపయోగించితివి. మేమిరువురము నీ మాట పాటించుచున్నాము. ఇందుకు వ్యతిరేకము ఎంతమాత్రము జరుగఁజాలదు."

అని సంభాషించి గణేశు నూఱడించి యాతని వివాహమును చేయవలెనని యమ్మవారు నయ్యవారును సంకల్పించిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదితొమ్మిదవ యధ్యాయము.

## వింశాధ్యాయము

### (గణపతికి వివాహముఁజేయుట)

ఇంతలో విశ్వరూప ప్రజాపతి - పార్వతీపరమేశ్వరుల నిశ్చయమును విని యచ్చోటునకేతెంచి వినయమున "శంకరా! నాకు సిద్ధిబుద్ధియును నిరువురు కుమార్తెలు కలరు. అవ్వారిని తమగణేశునకు సమర్పించి వివాహమును జరిపింతు" నని ప్రార్థింపగా నాజగన్మాతా పితరులంగీకరించినందున సర్వాంగ సుందరులగు నా కన్యకలను విశ్వరూపుఁడు యథోక్త విధానమున గణపతికి ఇచ్చి పెండ్లి నొనరింపఁ జేసినవాడు.

పార్వతీశంకరుల మనోభీష్టము ననుసరించి యమరులు మునులును వివాహమహోత్సవమున కేతెంచి యందు పాలుగొని సంబరమున తమతమ నివాసములకుఁజనిరి. గణపతి సిద్ధిబుద్ధులతో గడిపిన సమయమున ఆనందమునకు మేఱయే లేకుండెను. కొంతకాలమున వారిరువురియందు నిరువురు కుమారులు జన్మించిరి.

గణపతికి సిద్ధియందు క్షేముఁడను కుమారుఁడును, బుద్ధియందు లాభుఁడను కుమారుఁడును కలిగిరి.

ఇట్లు చెప్పనలవిగాని సుఖమును గణేశుఁడనుభవించుచుండగా కుమారస్వామి భూప్రదక్షిణముఁ జేసి కైలాసమందలి తన నివాసముఁజేరుకొనెను. అంత నారదమహర్షి కుమారుఁజేరి "నాయనా! కార్తికేయా! యథార్థమును చెప్పుచున్నాను. కపటమున గాని ఈర్ష్యవలనఁగాని చెప్పుటలేదు. నీ

తలిదండ్రులు చేసిన పని నితరులెవరును చేయఁజాలరు. భూప్రదక్షిణమను మిషతో నిన్ను దూరముపంపి గణపతికి వివాహము నొనర్చినవారు. గణేశుఁడు భార్యల నిద్దరిఁబడసి పుత్రద్వయము కలవాడైనాడు. నీవేమో సముద్రములు నరణ్యములు ననువానితో కూడియున్న భూమిని చుట్టివచ్చితివి. అందుకు ఫల మీ విధముగా సంభవించినది.

జననీజనకు లెక్కడైన నివ్విధము చేయుదురా? మాతాపితరులే మోసముఁగావించినచో పరుఁడేమేమి చేయకుండును? నీ తల్లిదండ్రు లొనర్చిన కృత్యము నాకైతే బాగుగా కనుపసించుటలేదు. నీవుఁగూడ పదిలముగా విచారించుకొనుము!

శ్లో॥ దద్యా ద్యది గరం మాతా - విక్రీణీయాత్ పితా యది ।
రాజా హరతి సర్వస్వం - కస్మై కించ బ్రవీతు వై ॥ ౧౯

తల్లి విషము పెట్టునెడ, తండ్రి కుమారుని విక్రయించినచో, రాజు తన ఆస్తినంత యపహరించునెడల నట్టితతీ నేరికి నేమని చెప్పుకొనవలెను? అనఁగా తనను రక్షించువారు ప్రపంచమున నుండరని భావము.

శ్లో॥ యేనైవేదం కృతం స్యాద్వై - కర్మానర్థకరం పరమ్ ।
శాంతికామః సుధీ స్తాత - తన్ముఖం నవ్యలోకయేత్ ॥ ౨౦

"ఎవఁడు మనకు నపకారముఁజేయునో బుద్ధిమంతుఁడైనవాడు శాంతిఁగోరి యట్టివాని ముఖమును చూడఁగూడదు. అని వేదశాస్త్రములయందు నీతి చెప్పఁబడినది. అట్టి న్యాయమును నీకు తెలిపితిని. నీ యిష్టప్రకారము నడచుకొనుము!"

ఇవ్విధము నారదుఁడు – మహేశ్వరుని సంకల్పమున కనుకూలముగా సంభాషించి మిన్నకుండెను.

అంత స్కందుఁడు కోపాగ్నిజ్వలితమానసుడై జననీజనకులకు నమస్కరించి వారు వలదనుచున్నను "మీవద్ద క్షణకాలము గూడ నుండజాలను. నాయందు ప్రేమలేనివారై కపటము నాచరించితిరి!" అని మాత్రము వచించి కైలాసమునుండి క్రౌంచపర్వతమునకుఁజని యిప్పటికి నచ్చోటనే నివసించుచు తనను దర్శించు భక్తుల పాపములఁ బోగొట్టుచున్నవాడు. ఆ దినమునుండి కార్తికేయునకు కుమారభావమే శాశ్వతముగా నేర్పడెను. కార్తికేయుని శుభనామము ముల్లోకములయందుప్రసిద్ధమై సమస్త దురితములఁ బోకార్చుచు పావనంబై బ్రహ్మచర్య ప్రదంబునై యున్నయది.

కార్తికమాసమున దేవతలు ఋషులు పుణ్యతీర్థములును కుమారస్వామిని దర్శించుటకు క్రౌంచపర్వతమునకు వెళ్లుచుందురు.

శ్లో॥ కార్తిక్యాం కృత్తికాసంగే - కుర్యా ద్యః స్వామిదర్శనమ్ ।
తస్య పాపం దహే త్సర్వం - చిత్తేప్సిత ఫలం లభేత్ ॥ 30

కార్తికమాసమున కృత్తికా నక్షత్రముగల పున్నమనాడు కుమారస్వామి నవలోకించు వాని పాపమంతయు నశించుటేగాక కోరినఫలంబు సమకూరును. ఇట్లుండగా పార్వతీదేవి కుమారుని యెడబాటు సహింపలేనిదై యాతనిని చూచుటకు వెళ్లుదమని దీనముగా వేడుకొననట్లేయని శంకరుఁడు





పార్వతితో గూడ కుమారుని చెంతకుఁజని తనయంశమున మల్లికార్జునుడను పేరుతో జ్యోతిర్లింగముగా వెలసెను. ఇరువురు నచ్చోటనే కుమారానురాగవశమున నివసించిరి. ఇప్పటికిని సత్పురుషప్రాప్యుండగు శంకరుఁడు నమ్మువారితో గూడ శ్రీశైలమున నిజ భక్తుల మనోరథముల నీడేర్చుచున్నవాడు.

అట్టి సాంబశివుని విడనాడి యెంతోదూరము పోవనుద్యుక్తుడగుచున్న కుమారునమరులు మునులు ప్రార్థింప నిరువదినాలుగు మైళ్ళదూరము మాత్రము వెళ్ళి కుమారస్వామి నివసించెను. ఐనను పుత్రస్నేహవశమున అమావాస్యనాడు శంకరుఁడు, పున్నమనాడు పార్వతియు కుమారుని చూచుటకు శ్రీశైలమునుండి క్రౌంచ పర్వతమునకు వెళ్ళుచుందురు.

శౌనకాదిమహర్షులారా? మీరు కోరినదంతయు చెప్పితిని. కుమారస్వామిచరితమును గణేశుని వృత్తాంతమును వింటిరిగదా! ఇద్దానిని విను మానవుడు పాపవిముక్తుడగుటయేగాక విహితములైన మనోరథములను పొందఁజాలును.

ఇద్దానిని చదువువారు చదివించువారు వినువారు వినిపించువారును కామ్యముల నన్నిటిఁ జెందుదురు. బ్రాహ్మణుఁడు బ్రహ్మవర్చస్వియగును. క్షత్రియునకు విజయము లభించును. వైశ్యుఁడు శ్రీమంతుడగును. శూద్రుడు సత్ప్రవర్తనము గలవాడగును. రోగి ఆరోగ్యముగలవాడగును. భయపడువాడు నిర్భయుండగును. భూతప్రేతపిశాచాది బాధలకు గురియైనవారు అట్టి బాధలను తొలగించుకుందురు.

**శ్లో॥ ఏతదాఖ్యాన మనఘం - యశస్యం సుఖవర్ధనం ।**
**ఆయుష్యం స్వర్గ్య మతులం - పుత్రపౌత్రాదికారకమ్ ॥** 43

**శ్లో॥ అపవర్గప్రదం చాపి - శివజ్ఞాన ప్రదం పరం ।**
**శివాశివప్రీతికరం - శివభక్తివివర్ధనమ్ ॥** 44

**శ్లో॥ శ్రవణీయం సదాభక్తైః - నిష్కామైశ్చ ముముక్షుభిః ।**
**శివాద్వైత ప్రదంచైత - త్సదాశివమయం శివమ్ ॥** 45

కుమార ఖండమునందలి చరితము పావనంబై కీర్తిని సుఖమును పెంపొందించు నట్టిది; మరియు నిద్ది పూర్ణాయుష్యము నొసగును. స్వర్గమును అపవర్గమును ప్రసాదించును. పుత్రపౌత్రాది వంశవృద్ధిని వర్ధిలఁజేయును. శివజ్ఞానమును కలుగఁజేయును. శక్తివిశిష్ట శివానుగ్రహమునకు నిదానంబగును సామాన్యులకు శివభక్తి నొదవఁజేయును. మోక్షాపేక్షగల భక్తులు నిష్కామబుద్ధి నెల్లకాలము నిద్దానిని వినుచుండవలెను. ఏతచ్ఛ్రవణములవలన ద్వైతమునందు నద్వైతమునందును భావము కలుగక శక్తివిశిష్ట శివాద్వైత సిద్ధాంతము నందభిరుచియు దృఢవిశ్వాసంబు సంభవించును. ఇయ్యది సదాశివ స్వరూపమై సకల శ్రేయస్సులకు నాటపట్టగునది యని భావింపుడు!

ఇవ్విధము శివమహాపురాణములోని రెండవదైన రుద్రసంహిత యందలి నాలుగవదైన కుమారఖండమును సూతుఁడు ప్రబోధించి విరమించినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనభూషతో ఇరువదియవ యధ్యాయము. సర్వంబు కుమార ఖండంబు సమాప్తము.





శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ శివమహాపురాణమున రుద్రసంహిత యందలి

## యుద్ధ ఖండము ప్రారంభము

## ప్రథమాధ్యాయము

### (త్రిపురాసుర తపోవర్ణనము)

శంకరుడు గృహస్థుడై గణేశకుమారులంబడసిన చరితము ఉత్తమంబైనదనియు ఆనందదాయకం బనియు భావించుచున్నాము. ఇక నా పరాత్పరుండు లోకమున విహరించువాడై దుర్మార్గులను శిక్షించిన విధమును వివరింపుము! త్రిపురాసురుల మూడుపట్టణముల నొకే బాణము నొకేమారు నెట్లు దహించెను?

మాయావిహారము గలదియు దేవర్షిసుఖప్రదంబునగు త్రిపురసంహారాది శివచరితమును బాగుగా ప్రతిపాదించుము! అని శౌనకాదులు ప్రశ్నింపగా సూతమహాముని చెప్పందొడంగెను.

ఇవ్విషయమునే పూర్వము వ్యాసుండు నడుగగా సనత్కుమారుండు నుడివినట్లే నేను మీకు వివరించెదను.

శివకుమారుండైన కార్తికేయుండు తారకాసురుని సంహరింప నవ్వాని ముగ్గురు తనయులు మిగుల పరితపించిరి. వారిలో పెద్దవాడు తారకుండనియు రెండవవాడు విద్యున్మాలియనియు చిన్నవాడు కమలాక్షుం డనియు పేర్కొనంబడుచు ముప్పురును సమానబలపరాక్రమములు కలిగియుండుటయేగాక జితేంద్రియులై సత్యవ్రతులై దృఢచిత్తముగల మహావీరులుగానుండిరి.

కాని వారి మనంబున దేవద్వేషము రగుల్కొనియుండుటంజేశి మేరుపర్వతగుహానాశ్రయించి మనోహరభోగములను విడనాడనియు తపమును ప్రారంభించిరి.

తారకాసురుని కుమారులు వసంతకాలమున సంగీతములను మంగళవాద్యధ్వనులను విననొల్లక గొప్ప వేడుకతో తపించుచుండిరి. గ్రీష్మకాలమున సూర్యకాంతి నవనలోకించుచు నలుదిశలయందు నాలుగు నగ్నుల రగుల్కొలిపి యవ్వాని నడుమ నిలువంబడి హవనముం జేయుచుండిరి. ఆ యగ్నుల వేడిమికి నప్పుడప్పుడు వారికి తెలివిందప్పుచున్నను కఠినదీక్షతో తపస్సు సాగించుచుండిరి.

ఇంక వర్షకాలమున నేలపై పరుండి వర్షధారలం దడియుచుండిరి. శరత్కాలమున సంభవించు కందమూలఫల పానీయముల నాకలిదప్పుల నోర్చుకొని యితరుల కొసగుచు నిశ్చల పాషాణములవలె నుండిరి. అట్టితతి నవ్వారికి నలుదిశల యందు నెట్టియాలంబనము లేకుండెడిది. హేమంతకాలమున కొండపై మంచుధారలందడియుచును శిశిరకాలమున తడిసిన పట్టువస్త్రములను ధరించి నీటినడుమ నివసించుచునుతపించుచుండిరి. ఇట్లు ఘోరముగాతపించుచున్నను వారు ఎట్టి నిరాశను చెందక క్రమముగా తపమును పెంపొందించుచుండిరి. వారి యనుష్ఠానము బ్రహ్మదేవు నుద్దేశించి ప్రవర్తించు చుండెను. కఠోరనియమములతో తమ దేహములను కృశింపంజేయుచుండిరి.

ఒక్క నూరువత్సరములు నేలపై నొంటికాలుపై నిలువఁబడియు మరి వేయేండ్లు గాలిమాత్రము పీల్చుచును ఇంక వేయి వత్సరములు తలకాయను క్రింద నునిచియు మరి నొక్క వంద వత్సరములు పైన చేతులెత్తియు తపించుచు రేయింబవళ్ళు విశ్రాంతిలేకనుండిరి.

ఇవ్విధము తారకతనయులు ధర్మముఁదప్పక తపించుచుండగా చాలాకాలము గడచినది.

అప్పుడు సురాసురగురువగు బ్రహ్మదేవుఁడు సాక్షాత్కరించి వారి తపస్సునకు ప్రసన్నుడై "అసురులారా? మీరుకోరిన వరంబుల నిచ్చెదను. సృష్టికర్తనగుటచే తాపసులందరి మనోఽభీష్టముల నీడేర్చువాడను నేనేయని తెలియుడు!" అని వచింప నా దైత్యులు పితామహునకు ప్రణమిల్లి యంజలిఁ ఘటించి తమమనసునందున్న కోర్కెలనిట్లువెలిబుచ్చిరి.

దేవా! నీవు ప్రసన్నుడవైనచో మేము వరయోగ్యుల మగదుమేని ప్రాణులలో ఎవరి చేతను మాకు మృత్యువు కలుగకుండుగాక! మమ్ము శాశ్వతముగా నుండఁజేయుము! శతృవులను నశింపఁజేయుము! ముసలితనము గాని రోగములు గాని మృత్యువు గాని మమ్ము చేరకుండుగాక! జరామరణములు లేనివారమై చిరకాలము జీవించుచు ముల్లోకములయందు గల వ్యక్తుల నందరిని మృత్యువునకు గురిఁ జేయుదుముగాక!

కొద్దికాలము జీవించువారికి నెడతెగని సంపద యెందులకు? మహానగరము లుండినను ప్రయోజనము లేదు. నానావిధ సుఖభోగములును నిరుపయోగములే గదా! ఒకానొక లోకమునకు దేశమునకు రాష్ట్రమునకు నాధిపత్యమున్నను వ్యర్థంబగును.

కావున మేమడిగిన వరముల ననుగ్రహించి మమ్ము కృతార్థులఁజేయుము! ఇట్లు వారి యభ్యర్థనమును బ్రహ్మదేవుఁడాలకించి తన ప్రభువగు మహేశ్వరుని స్మరించి "తారకాత్మజులారా? సర్వదా మరణము లేకుండుట యేరికిని సంభవింపదు. మరియొక వరముఁగోరుకొనుడు! ప్రతిప్రాణి పుట్టుటయు గిట్టుటయు సృష్టిధర్మములు. జరామరణరహితుఁడై ప్రపంచమున నెవడు నుండఁజాలడు. కాలకాలుడైన మహేశ్వరుఁడు మహేశ్వర సంపూర్ణానుగ్రహపాత్రుడైన హరియు దక్క నందరును మరణధర్మము గలవారే; వారిరువురు మాత్రము ధర్మాధర్మముల నేర్పరచుచు నవ్యక్తులైనను వ్యక్తిత్వమును పొందుచుందురు.

మీ తపంబు జగమును పీడించుటకై పరిణమించునని తోచెడిని. కావునబుద్ధిబలముచే బాగుగావిచారించుకొని మృత్యువు దుఃసాధ్యమగునట్లు యాచింపుఁడు!" అని వచింపగా నా మువ్వురు రాక్షసులు నించుక నాలోచించుకొని పితామహు నిట్లు యాచించిరి.

దేవా! మేము పరాక్రమవంతులమైనను పగతుఱకు చొఱనలవిఁగాని నివాసము లేకనున్నాము. అద్భుతములైన మూడు పట్టణములను నిర్మింపజేసి యొసగుము! అయ్యవి సర్వసంపదలతో తులఁ దూగుచు నమరులకు స్వాధీనములు గాకుండ నుండవలెను. అట్టి పట్టణము లందుండియే బ్రహ్మాండమున సంచరింతుము గాక!

అవ్వారిలో తారకాక్షుఁడు - విశ్వకర్మ నిర్మించు సువర్ణమయ నగరము కావలెననియు కమలాక్షుఁడు - రజతమయనగరము కావలెననియు విద్యున్మాలి - వజ్రమువలె సుదృఢంబగు నినుముచే నిర్మింపఁబడు పట్టణము కావలెననియు కోరిరి.





మరియు నిట్లు బ్రహ్మదేవుని త్రిపురాసురులు నభ్యర్థించిరి.

మూడు పట్టణములు - మధ్యాహ్నసమయమున అభిజిన్ముహూర్తమునందు చంద్రుఁడు పుష్యనక్షత్రము నందుండగా నీలాకాశమునందు పుష్కక ఆ వర్త నామధేయములు గల కాలమేఘములు ఘోరముగా వర్షించుచుండ నంతరిక్షముపై నుండు నక్షత్రాదులు నదృశ్యములగుచుండగా సహస్రదివ్యవర్షముల కాలము గడచిన తరువాత నొక్కచోటునకు వచ్చి యున్నపుడు సర్వదేవతా సార్వభౌముడైనవాడు పూర్వము లేనట్టి రథము నధిష్ఠించి సర్వ విధములగు నుపకరణములతో కూడుకొని యపూర్వబాణము నొక్కదానితోడనే మమ్ము వధించుగాక!

"శంకరుఁడైతే దేవమానవాది ప్రపంచమును సమానముగా చూచువాడు. అతనినే నమస్కరించువారము, పూజించువారము, ధ్యానించువారము.

అట్టి మహనీయుఁడు మమ్మెట్లు దహించును? ఇఁక నితరుఁడా? అట్టివాడీ లోకమున నుండఁ జాలడు" అనియు త్రిపురాసురులు మది నిశ్చయించుకొనిరి.

సృష్టికర్తయగు పంకజాసనుఁడు మదిని శివుని స్మరించుచు "అసురులారా? మీరు కోరిన వరముల నొసగితిని. అట్లే యగుగాక!" అని వక్కాణించి మయుని రప్పించి కాంచన రజత అయస నగరములను నిర్మించి యొసగుమని యాజ్ఞాపించియు వారు చూచుచుండగానే నిజధామమునకుఁజనియెను.

అంత మయుఁడు (విశ్వకర్మ) తపోబలమున పట్టణత్రయమును కల్పించి తారకాక్షకమలాక్ష విద్యున్మాలులకు నిచ్చినవాడు. కాంచన నగరము - స్వర్గ ప్రదేశమునందును రజత నగరము - ఆకాశమునందును అయసనగరము - భూమిపైన నుండునట్లు గావించి మయుఁడు త్రిపురాసురుల హితముఁగోరినవాడై ఆ పట్టణములలో తానును నివసించెను.

తారకతనయు లిట్లు పట్టణత్రయమును బడసి తమ బలపరాక్రమములు సార్థకము లగుచుండగా సర్వవిధభోగముల ననుభవించుచుండిరి.

ఆ నగరములలో వీధివీధులలో కల్పవృక్షములును గజాశ్వసముదాయంబులును సమున్నత సౌధములును మణితోరణమండిత ద్వారములు గల గృహంబులును సూర్యప్రకాశము చంద్రప్రసన్నతయు గల పద్మరాగమణిమయ గోపురంబులును దివ్యతరుణీలలామలును గంధర్వులును సిద్ధులును చారణులు నుండుటయే గాక దివ్యశోభానమన్విత శివాలయములు నెలకొనియుండెను. ప్రతియింట నగ్నిహోత్రములు వెలుగుచుండెడివి. శాస్త్రవేత్తలు శివభక్తులు నగు బ్రాహ్మణోత్తములు నివసించుచుండిరి.

నడబావులు, చేదబావులు, కోనేఱులు నందందు రుచిరమధురపానీయ జలములు కలిగియుండెను. స్వర్గమునందు గల గుణములతో రాణించు ఉద్యానవనంబులును నదీనదంబులును సర్వవిధ ఫలంబుల నొసగు వృక్షరాజంబులు నొప్పారుచుండెడివి. మదపుటేనుఁగులతోడను జవనాశ్వములతోడను చిత్రవిచిత్ర రథములతోడను పల్లకులతోడను విహారప్రదేశములతోడను వేదశాస్త్రాధ్యయనము గల పాఠశాలలతోడను విరాజిల్లు నా నగరత్రయము పాపాత్ములకు మనోవాచా మగోచరంబై సత్ప్రవర్తనము గల పుణ్యాత్ములకు వీక్షణీయంబై కుత్సితధర్మమును విడనాడి పతియే దైవమని భావించు సాధ్వీమతల్లులకు నిలయంబై యుండెడిది.





అందు శూరులైన దైత్యులు స్వధర్మము నాచరించుచు శ్రౌతస్మార్తకర్మలఁదగు యథార్థరూపమును కనుగొనినవారై కళత్రపుత్రాది కుటుంబములతో కూడి నివసించుచుండిరి.

పురుషులు విశాల వక్షఃస్థలము వృషభముఁదగు మూపువంటి భుజాగ్రములును గలవారై శాంతి పూర్వకముగా యుద్ధమునకు కడంగువారును ఎల్లకాలము ప్రసన్నమైన మనస్సు గలవారును సకారణముగా కోపమును చూపువారును మఱుగుజ్జువారును పొట్టివారును నల్లకలువరేకులఁబోలిన వన్నెగలవారును నీలములు వంకరలునగు వెంట్రుకలుగలవారును మయునిచే యుద్ధవిద్య నేర్పఁబడినవారును యుద్ధలాలసులునై యుండిరి.

మరియు నిత్యము శివునారాధించుటఁజేసి పరిశుద్ధమైన మనోబలము గలవారును సూర్యునివలె ప్రకాశించువారును వాయువువలె దృఢకాయులును మహేంద్రునివలె వైభవము గలవారునై దేవతలను పీడించు సామర్థ్యముకలిగి యుండిరి. వేదశాస్త్ర పురాణములయందు బాగుగా నిరూపింపఁబడిన సోమవారవ్రతాది శివధర్మములను చక్కగా నడచుచు శివభక్తుడైన మయు నాశ్రయించి ముల్లోకవాసులను పీడించుచు తమ పట్టణములఁ బ్రవేశించుచుండిరి.

ఇట్లు వారు పుణ్యముల నాచరించుచు సుఖముగ రాజ్యముఁజేయుచుండ చాల కాలము గడచెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ప్రథమాధ్యాయము.

## ద్వితీయాధ్యాయము

### (దేవతలు శంకరుని ప్రార్థించుట)

అట్టితతి నింద్రాదిదేవతలు త్రిపురాసురుల తాకిడిని సహింపఁజాలనివారై ఒకచోట సమావేశమై బ్రహ్మదేవుని శరణముగా వేడుచు సమీపించి నమస్కరించియు కొంత తడవు మిన్నకుండిరి. తరువాత నవకాశముఁ బడిసి యిట్లు విన్నవించిరి.

దేవా! త్రిపురములను నిర్మించిన మయుఁడు తారకాసురుని కుమారుల బలమున మమ్మందరిని బాధించుచున్నవాడు. కావున నవ్వారిని వధింప నుపాయము ననుగ్రహింపుము!

అంత బ్రహ్మదేవుఁడు "సురలారా? త్రిపురదానవులవలన భయపడవలసిన సమయము ముగియుచున్నది. వారిని సంహరించుటకు శంకరుఁడే సమర్థుఁడు. కావున నా పరాత్పరుని ప్రార్థింపుడు! నేను వారిని వరములతో పెంపొందించితిని. అందువలన నేను సంహరింపఁజేయఁగూడదు. ఐనను త్రిపురాసురులు పుణ్యముల నాచరించుచు పుణ్యముల నాచరించుచు తమ శక్తిని పెంచుకొనినవారు. శంకరుఁడు ప్రసన్నుడగునేని మీ యభీష్టము నీడేర్చును" అని వచింపగా ఇంద్రుఁడు మున్నగువారు మిగుల వగచుచు శంకరుని సన్నిధానమునకు వెళ్లి చేతులు జోడించి తలలు వంచియు దిగువవిధము కొనియాడిరి.





ప్రపంచమునంతయు సృజించు హిరణ్యగర్భుడవు నీవేను, సమస్త జగమును రక్షించు నారాయణుడవు నీవేను; ప్రాణులందరిని సంహరించు రుద్రస్వరూపంబు నీయదియే; ఆకలిదప్పి మొదలగు ప్రాకృత గుణములు లేనివాడవై అపరిమిత తేజంబున ప్రకాశించువాడవు; బాల్యకౌమారాది అవస్థలు నిన్నంటవు; రాగద్వేషాదివికారముల నతిక్రమించువాడవు; పృథివ్యాది పంచమహాభూతముల నంతర్యామివై పుణ్యపాపలేపరహితుడవుగా నుందువు; భూతప్రేతపిశాచాది దుష్టశక్తులు నీకు లొంగియుండును. బ్రహ్మాండమను మహాభారమును మోయువాడవు. దురాశను పోగొట్టువాడవు; ఎవరియందు నెట్టి వైరము లేనివాడవు; లోకకంటకులైన రాక్షసులనెడు మహారణ్యమును దహించువాడవు; పార్వతీపతివి నీవేను; పాశుపతము మున్నగు సర్వాస్త్రములను ధరించువాడవు; భక్తులు కాని వారికి భయంకర స్వరూపముతో కనఁబడువాడవు; దేవదానవుల సముద్రమథనమున సంభవించిన హాలాహల విషమును మ్రింగిలోనికి పోనీయక కంఠమునందే నిలిపితివి కావున నీలకంఠుఁడవైతివి. నిన్ను గుర్తెరుగుటకు వేదవేదాంతముల నభ్యసింపవలెను. సత్త్వరజస్తమోగుణములకు నతీతుడవై శుద్ధసత్త్వగుణము కలిగియుండువాడవు.

మహాదేవా! ముల్లోకములు నీవలననే సంతృప్తిఁజెందుచుండును. ప్రద్యుమ్న అనిరుద్ధ వాసుదేవ సంకర్షణ కంసారి చాణూరమర్దన దామోదర హృషీకేశ అచ్యుత అధోక్షజ నారాయణాది నామధేయముల పర్యవసితార్థము నీయందే పరిణమించును.

గజాసురుని సంహరించితివి; మన్మథుని దహించితివి; నారాయణుని నీ వామాంగమునుండి యుదయింపఁజేసితివి; సర్వాంతర్యామివి; పాపభోగనిలయములగు మహానరకములను హరించువాడవు; నందికేశ్వరునిపై నధిష్ఠించి భక్తుల యోగక్షేమములను పాటించుటకు సంచరించువాడవు; క్షణము ముహూర్తము మున్నగు కాలనిర్దేశములు నీవలన నేర్పడినవియే, నీ భక్తులకు శరీర వాఙ్మనోబలములను ప్రసాదించువాడవు; అనేక లీలారూపములను ధరించి దుష్టులను శిక్షించుచుందువు; వేదశాస్త్రరక్షకుఁడవై గోబ్రాహ్మణులద్వారా ధర్మమును కాపాడుచుందువు.

నీ మూర్తులసంఖ్యాకములు. సహస్రశీర్షుడవై సహస్రనయనములతో విరాజిల్లు వాడవు; ధర్మము నీదగు రూపంబు; వేదములను నిట్టూర్పుతో వెలువడఁజేసినవాడవు సదాచారము గలవారి సన్నిహితుఁడవు; సత్యస్వరూపుడవు; సత్యప్రియుడవు సత్యముఁదప్పక నడచువారిచే పొందఁదగినవాడవు, మాయను నీ యధీనమునందుంచుకొనువాడవు; వేదధర్మమునను సరించుచు వేదవేద్యుడవగువాడవు, తపోరూపుడవై తపః ఫలంబుల నొసగు చుందువు; నుతింపఁదగినవాడవై స్తుతిచే సంతసించుచుందువు; వైదికాచారప్రియుడవై స్మార్తాచారపరాయణుల ననుగ్రహించుచుందువు.

జలమునఁబుట్టు రూపములు స్థలమున నావిర్భవించు రూపములు స్వేదమున జన్మించు రూపములు అండమునుండి బయలువెడలు రూపంబులు నీయవియే.

శ్లో॥ దేవానా మింద్రరూపోఽసి గ్రహాణాం త్వం రవి ర్మతః ।
సత్యలోకోఽసి లోకానాం - సరితాం ద్యుసరిద్భవాన్ ॥ 37

అమరులలో దేవేంద్రుడవు; గ్రహములలో సూర్యుడవు; పదునాలుగు లోకములలో సత్యలోకమవు; రంగులలో తెలుపు రంగువాడవు; సరోవరములలో మానససరోవరము నీవే. పర్వతములలో





హిమవంతుడవు; ధేనువులలో కామధేనువు నీవేను, సముద్రములలో క్షీర సముద్రమవు; ధాతువులలో సువర్ణమవు; వర్ణములలో బ్రాహ్మణుడవు; మానవులలో క్షత్రియుడవు; ముక్తిక్షేత్రములలో కాశీక్షేత్రమువు; తీర్థములలో ప్రయాగత్రివేణీ తీర్థమవు; నదులలో గంగానదివి; మణులన్నిటిలో స్ఫటికమునీవే; పుష్పములలో కమలమవు; వ్యవహారములలో వాక్కువు; కవులలో శుక్రాచార్యుడవు; పక్షులలో శరభపక్షివి; క్రూర మృగములలో సింహమువు; పాషాణములలో శాలగ్రామశిలవు; పూజింపదగిన లింగరూపములలో నర్మదా బాణమువు; చతుష్పాత్ పశువులలో నందికేశ్వరుఁడవు; వేదములలో నుపనిషద్రూపుడవు; యజమానులలో చంద్రుడవు; ప్రతాపము గలవారిలో నగ్నిహోత్రుడవు; శైవులలో విష్ణుమూర్తివి; పురాణములలో భారత స్వరూపుడవు; అక్షరములలో మకారమవు; బీజమంత్రములలో ప్రణవమవు; భయంకరములలో విషమవు! వ్యాపించు వానిలో ఆకాశమవు; జీవాత్మలలో పరమాత్మవు; ఇంద్రియములలో మనంబవు; దానములలో నభయదానమవు; పావన వస్తువులలో జలంబగుదువు.

లాభములలో పుత్రలాభమవు, వేగము గలవానిలో వాయువగుదువు; నిత్యకర్మలలో సంధ్యావందన స్వరూపుడవు; క్రతువులలో అశ్వమేధ యాగంబగుదువు. యుగములలో కృతయుగమవు; నక్షత్రములలో పుష్యనక్షత్రమగుదువు; తిథులలో నమావాస్యవు; ఋతువులలో వసంత ఋతువువు; పర్వకాలములలో సంక్రాంతివి; తృణములలో దర్భవు; పెద్దచెట్లలో వటవృక్ష మగుదువు; యోగములలో వ్యతీపాతవు; తీగెలలో సోమలతవు; బుద్ధులలో ధర్మబుద్ధివి, స్నేహితులలో భార్యవంటివాడవు; విహిత సాధనములలో ప్రాణాయామం బగుదువు; జ్యోతిర్లింగములలో విశ్వేశ్వరుఁడవు; బంధువులలో ధర్మంబవు; ఆశ్రమములలో గృహస్థాశ్రమంబవు, పురుషార్థములలో మోక్షమవు; రుద్రులలో నీలలోహితుడవు; ఆదిత్యులలో వాసుదేవుఁడవు; వానరములలో హనుమంతుడవు. యజ్ఞములలో జపయజ్ఞమవు. శస్త్రధారులలో శ్రీరాముడవు; గంధర్వులలో చిత్రరథుడవు, వసువులలో పావకుఁడవు; మాసములలో అధికమాసంబవు; వ్రతములలో చతుర్దశీవ్రతమవు; గజేంద్రములలో ఐరావతమవు; సిద్ధులలో కపిలుడవు; నాగులలో అనంతుడవు; పితరులలో అర్యముఁడవు; జగమును ప్రవర్తింపఁజేయువానిలో కాలమగుదువు; దైత్యులలో బలిచక్రవర్తివి.

వేయేల! నీదగు నొక్క నంశముతో సమస్త జగమును వ్యాపించియు జగము నతిక్రమించి యుందువు; మహాదేవా! మా మొఱాలకింపుము! అని ప్రార్థించి "తారకాసురుని కుమారులైన త్రిపురాసురులు పెట్టు బాధలను సహింపఁజాలకున్నాము. మూడు లోకములను వారు స్వాధీనపఱచుకొని సిద్ధులను మునులను ధర్మాత్ములను పీడించుచున్నవారు. ఆ ముప్పురిలో పెద్దయగు తారకాసురుఁడు యజ్ఞభాగములను స్వయముగా స్వీకరింపుచు ఋషులు ఆచరించు ధర్మమును నిరాకరించి బ్రహ్మాండము నంతయు కలవర పఱచుచున్నవాడు.

త్రిపురాసురులను సంహరింప నేరికిని శక్యముగాదు. వారియభీష్టము ననుసరించియే మానవులు కర్మల నాచరించుచున్నవారు. కావున త్రిపురాసురులు ఏ విధముగా మరణింతురో అట్టి యుపాయమును కల్పింపుము!"

అని విన్నవింపగా శంకరుఁడు ఆలకించి యమరులకు దిగువవిధము సమాధానము నొసగెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద

ప్రథమఖండములో రెండవ యధ్యాయము.

# తృతీయాధ్యాయము

## (త్రిపురాసురుల ధర్మ ప్రవర్తనము)

దేవతలారా! నా మాట వినుండు!

ఈ త్రిపురాసురులు ప్రస్తుతము పుణ్యము నాచరించుచున్నవారు. కావున నట్టివారిని వధింపఁ గూడదు. మీ కష్టంబును నాకు తెలియును. వారేమో బలాఢ్యులై సురాసురులకు సంహరింప నలవిగానివారు; తారకాసురుని కుమారులు మయునితో కూడి సుకృతాత్ములై యున్నవారు. అట్టివారిని వధించుట సులభము కాజాలదు. నాకు వారు సుహృత్తులై యున్నవారు కావున వారిని చంపుటకు నా మనస్సొప్పుట లేదు. భక్తులను వధించుట న్యాయముకాదు. మీరు గూడ ధర్మజ్ఞులు కావున బాగుగా విచారింపుడు! నా యందు భక్తి కలిగియుండు వరకు వారిని సంహరింపరాదు. ఒకవేళ త్రిపురాసురు లెటులైన మడియవలె నందురేని యిందుకు తగిన సందర్భమును కల్పించుమని విష్ణుమూర్తికి నివేదింపుడు!"

అంత నమరులు మొదట బ్రహ్మదేవుని చెంతకుఁజని యాతనికి ఈశ్వర భాషితమును తెలిపి యాతనిని పురస్కరించుకొని వైకుంఠమునకు వెడలి యచ్చోట హరి నవలోకించి కృతాంజలిపుటులై పలువిధముల ప్రార్థింప నా భగవానుఁడు త్రిపురాసురుల త్రికాలసంధ్యావందన శివారాధనాది పుణ్యసంచయమును గమనించి "అమరులారా! సనాతన ధర్మముగల స్థలమున దుఃఖము సూర్యుఁ డున్నచో చీకటివలె సంభవింపదు" అని సంభాషించెను.

అంత నవ్వారు దీనవదనులై "ఇప్పుడేమి చేయవలెను! ఎట్లు మా కష్టము నివారించును? ఎట్లు సుఖపడుదుము? ఏ విధముగా మేమీ జగమున నుండవలెను! త్రిపురాసురులు బ్రతికియుండగా ధర్మములెట్లు ప్రవర్తించును? త్రిపురములలో నివసించు దైత్యులందరును దేవతలనుబాధించువారేగదా! ఐతే త్రిపురాసురులను వధించుటకై శంకరుని ప్రేరేపించుము! లేదా దేవతల నకాలమున సంహరించుము!" అని మరల విన్నవించి మిగుల దుఃఖించుచు నారాయణుని ముందు నిలువలేకయు అటనుండి వెళ్లలేకయు నుండిరి.

అట్లు వినయముతో వగచుచున్న ఇంద్రాదులను గాంచి నారాయణుఁడు మనంబున "దేవతలను రక్షించు భారము నాదే. ఐనను త్రిపురాసురులు అఖండశివపూజాధురంధరులై యజేయులై యున్నవారు" అని విచారించి పురాణ పురుషోత్తముఁడగు యజ్ఞేశ్వరుని స్మరింపగా యజ్ఞములన్నియు మూర్తిమంతములై యేతెంచి యంజలి ఘటించియు నారాయణుని ప్రార్థించెను. యజ్ఞేశ్వరుఁడును విధేయుఁడై నిలువఁ బడెను.

అంత విష్ణువు ఇంద్రాదిదేవతలను కటాక్షించుచు నిట్లు పలికెను.

శ్లో॥ అనేనైవ సదా దేవా - యజధ్వం పరమేశ్వరమ్ ।
పురత్రయ వినాశాయ - జగత్రయవిభూతయే ॥ ౨౫





ఈ యజ్ఞేశ్వరుని పురస్కరించుకొని నానావిధ యజ్ఞములతో పరమేశ్వరు నారాధింపుడు! అందువలన త్రిపురాసురులు మడియుటయేగాక ముల్లోకములకు సుఖంబౌనఁగూరును.

అంత నమరులు నారాయణునకు మ్రొక్కులిడి యజ్ఞేశ్వరుని ప్రసన్నుఁజేసుకొని యథోక్తవిధానమున యజ్ఞముల నాచరింపగా యజ్ఞకుండమునుండి వేలకొలది భూతసంఘములు శూలశక్తిగదలను దండచాప శిలలను ధరించి బయలు వెడలి నమస్కరించియు ముందు నిలచెను.

శివాజ్ఞాపరిపాలకుఁడగు యజ్ఞేశ్వరుఁడు నవ్వారిని గాంచి "భూతములారా? మీరు త్రిపురములఁ బ్రవేశించి యచటివారిని దహింపుడు! ఛేదింపుడు! పురత్రయమును పాడుచేసిరండు అని వచింపగా నాభూతగణములువెళ్ళి పురత్రయమున ప్రవేశించినంతమాత్రమున త్రిపురాసురుల తేజస్సునందు "అగ్నియందుమిడుతలవలె" భస్మముకాజొచ్చిరి. మరణింపగామిగిలిన భూతములు భయముచే పరుగెత్తి హరిని సమీపింపగా విష్ణువు వారివలన జరిగినదంతయు తెలుసుకొని యిట్లు విచారించెను.

త్రిపురాసురులను సంహరించుటయెట్లు? ఇంద్రాద్యమరులను రక్షించుటయెట్లు?

శ్లో॥ **నాశోఽభిచారతో నాస్తి - ధర్మిష్ఠానాం న సంశయః ।**
**ఇతిప్రాహ స్వయం చేశః - శ్రుత్యాచార ప్రమాణకృత్ ॥** ౪౦

మంత్రప్రయోగము ధర్మాత్ములను నశింపఁజేయఁజాలదు. ఇందెంతమాత్రము సంశయములేదు. ఇట్లు వైదికాచారమును నెలకొలిపిన పరమేశ్వరుఁడు స్వయముగా వక్కాణించినవాడు.
అమరులారా? త్రిపురాసురులు ధర్మాత్ములగుటఁజేసి యవధ్యులైయున్నవారు.

శ్లో॥ **కృత్వా తు సుమహత్పాపం - రుద్ర మభ్యర్చయంతియే ।**
**ముచ్యంతే పాతకైః సర్వైః - పద్మపత్రమివాంభసా ॥** ౪౨

గతజన్మలయందు నీజన్మయందును గొప్ప గొప్ప పాపములఁజేసి పశ్చాత్తప్తులై శంకరుని పూజించువారిని పాపములన్నియు తామరాకును నీటిచుక్కవలె నంటకుండును.

శ్లో॥ **రుద్రాభ్యర్చనతో దేవాః - సర్వేకామా భవంతిహి ।**
**నానోపభోగసంపత్తిః - వశ్యతాం యాతి వైభువి ॥** ౪౩

శివారాధనమువలన కోరికలన్నియు నెరవేరుటయేగాక స్వర్గాదిపుణ్యలోకసుఖానుభవము లౌనఁగూరును. మరియు ప్రపంచము స్వాధీనంబగును.

త్రిపురదైత్యులు శివలింగము నర్చించుచు ననేకభోగముల ననుభవించుచున్నవారు. మరియు ధర్మార్థకామములకేగాక మోక్షమునకుగూడ నర్హులైయున్నవారు. కావున నవ్వారి ధర్మమునకు విఘ్నమును నిజమాయాబలమున కల్పించి క్రమముగా వారిని ధర్మభ్రష్టుల నొనర్చి దేవతలకు విజయమును చేకూర్చుదునుగాక!

ఇవ్విధము భగవానుఁడు తనలో విచారించి త్రిపురాసురుల పుణ్యమును క్షీణింపఁజేయ నిశ్చయించుకొనెను.

శ్లో॥ యావచ్చ వేదధర్మాస్తు - యావద్వై శంకరార్చనమ్ ।
యావచ్ఛుచికృత్యాది - తావన్నాశో భవే న్నహి ॥ ౪౩

వేదోక్తధర్మప్రవర్తన ముండువరకు శివారాధనము నెరవేరుచున్నంతవరకు పరిశుభ్రత అనఁగా శౌచదంతధావనస్నానపాదప్రక్షాళన ఆచమనాదులు పాటింపఁబడుచున్నంత వరకును దేవమానవాది వ్యక్తులకు వినాశము సంభవింపదు. అందువలన వారికి పెడబుద్ధిని కల్పింతునేని వేదధర్మమును శివారాధనమును విడనాడి భ్రష్టులగుదురు. అప్పుడు వారిని జయించుట సుకరంబగును." అనియు నారాయణుఁడు చింతించి "దేవతలారా? మీ కార్యమును సాధింతును. వారిని శివభక్తి హీనులుగా నొనర్తును. ఇఁక మీ నివాసములకు నిశ్చింతగా వెళ్లుడు!" అని వక్కాణింపగా నమరులు బ్రహ్మదేవుఁడును సంతసించి తమ నెలవులకుఁజనిరి. తరువాత దేవహితముఁగోరి నారాయణుఁడు గావించిన వృత్తమును వినిపింతునని సూతుఁడు విరమించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో మూడవయధ్యాయము.

## చతుర్థాధ్యాయము

### (త్రిపురాసురులు బౌద్ధదీక్షను పరిగ్రహించుట)

త్రిపురాసురులు ధర్మభ్రష్టులగుటకు మహావిష్ణువు - మాయామయుండైన నొక పురుషుని తన శరీరము నుండి యావిర్భవింపఁజేసెను.

అతడు బోడితలవాడుగాను మాసిన బట్టలు కట్టుకొనిన వాడుగాను భుజములఁగట్టఁబడిన పానపాత్ర గలవాడుగాను హస్తమున పుస్తకమును పట్టుకొని మాటిమాటికి గదలించువాడుగాను ముఖముపై వస్త్రముతో కూడ హస్తము నునిచి ధర్మము ధర్మము అని యుచ్చరించువాడుగా నుండెను.

అట్టి పురుషుఁడు నారాయణుని ముందు ప్రాంజలియై నిలువఁబడి "దేవా! నేను చేయవలసిన కార్యము నాదేశింపుము! నా నామధేయములను నివసించు స్థానమును నిర్దేశింపుము!" అని ప్రార్థింప భగవానుఁడు "నా యంగమునుండి యుద్భవించితివి, నేను చెప్పు కార్యమును చేయవలెను. నా వాడవై ఎల్లకాలము లోకమున పూజింపఁబడుదువు : "అరిహన్" అనుపేరు ముఖ్యముగా వెలయుగాక! ఇతర నామధేయములను నివాసస్థలమును తరువాత చెప్పెదను. ప్రకృత మెద్ది యనఁగా? పదునారువేల శ్లోకములతో మాయాశాస్త్రమును శ్రౌతస్మార్త విరుద్ధముగను వర్ణాశ్రమ వర్జితంబుగను అపశబ్దములతో నిండియుండునదిగను ప్రయత్నమే ముఖ్యమైనదని చెప్పునదిగను నిర్మించుము! తరువాత క్రమముగా నద్ది విస్తరించును. ఇట్టి శాస్త్రమును నిర్మించుటకు వలయు సామర్థ్యము నొసగుచున్నాను. అనేక విధములుగా నుండు మాయ-నీ యధీనమగును."

అని సంభాషించెను.





అంత నా పురుషుఁడు "భవదాజ్ఞాప్రకారము మాయాశాస్త్రమును నిర్మించి ప్రస్తుతము చేయవలసిన కార్యమును తెలుపు" మని విన్నవింపగా విష్ణువు శివుని పాదకమలములను స్మరించి "త్రిపురములయందు నివసించు నసురులను మోహింపఁజేయుము! నీ మతదీక్షను వారి కొసగి నీ శాస్త్రమునంతయు చదివించుము! నేనాజ్ఞాపించుచుంటిని కావున నిందెట్టిదోషంబు నీకు సంఘటిల్లదు. ఇప్పుడు వారికడ ప్రకాశించుచున్న శ్రౌతస్మార్త ధర్మములను నీవిద్యతో భంగపఱచుము! తమోగుణధర్మములను వారికి బోధింపుము! తరువాత కలియుగము వచ్చు వరకు నిర్జనస్థలమున నివసింపుము! కలియుగమున నీ ధర్మమును వ్యాపింపఁజేయుము! అట్టి తఱి శిష్యులు ప్రశిష్యులు లభింతురు. నా యనుజ్ఞవలన నీ విట్టి యసద్ధర్మమును ప్రచారము చేసినను చివరకు నా సన్నిధానమునకు రాగలుగుదువు!" అని శాసించి యంతర్ధానముఁజెందెను.

అంత నాతఁడు విష్ణ్వాజ్ఞను శిరసావహించి నలుగురు శిష్యులను తనవంటివారిని పుట్టించి యవ్వారికి మాయాశాస్త్రమును బోధించెను. ఈ లోకముననే స్వర్గనరకములు గలవు. పరలోకమనునది లేదు. ఇత్యాది విషయములతో మనోహరముగా నుండు మాయాశాస్త్రమును వారు బాగుగా నేర్చుకొనిరి. అప్పుడు హరి వారిని గాంచి శివస్మరణ పూర్వకముగా నిట్లు నుడివెను.

మీ గురువుగారివలె మీరును సమర్థులై పాషండ మతమును ప్రచారము చేయుఁడు! ఇందు దోష మిసమంతయు మిమ్మంటకుండును. హస్తమునందు పాత్రమునునిచి నోటిపై బట్టకప్పుకొని మలిన వస్త్రములను ధరించి మౌనమును వహించి మిగుల సంబరమున ధర్మమే మహాలాభమని వక్కాణించుచు పేలికలతో కట్టఁబడిన చీపిరిని చంకఁదాల్చి జీవహింస యగునను భయమును నటించుచు మెల్లమెల్లగా నేలపై యడుగుల నిడుచు సంచరింపుడు!

ఇత్యాది ప్రబోధము నాకర్ణించి యవ్వారు హరికి నమస్కరింపగా హరి యా నలుగురిని అరిహన్ అను నాతనికి నొప్పఁజెప్పెను. మరియు "అరిహన్! నీవలె వీరును నా వారని భావింపుము! ఇందు మొదటివాడు పూజ్యుడనియు రెండవవాడు ఋషియనియు మూడవవాడు యతియనియు నాలుగవవాడు ఉపాధ్యాయుడనియు పేర్కొనఁబడుచు ప్రసిద్ధులగుదురు గాక! వీరు నెల్లకాలము నా రూపాంతరమగు నీ పేరును తలచుచుందురుగాక! లోకకల్యాణము నాశించి మీరు చేయు అధర్మ ప్రచారము మీకెంత మాత్రము అధోగతికి కారణముకాదు." అని కేశవుఁడు చెప్పగా అరిహన్-భగవానుని యనుమతిఁబడసి త్రిపురంబుల కేగినవాడు.

తరువాత త్రిపురములలో బాహ్యోద్యానమున నివసించి తన మాయా శాస్త్రమును ప్రజలకు ప్రబోధింపగా శివారాధన ప్రభావమువలన నా ప్రబోధము జనులలో ఫలింపకుండెను. అందువలన నాతడు నిర్విణ్ణుడై విష్ణువును స్మరింపగా విష్ణువు శివుని స్మరించి నారదుని జ్ఞాపకము చేయగా నారదుఁ డేతెంచి ప్రాంజలియై నిలచెను. అంత నారాయణుఁడు "నారదా! త్రిపురాసురులను మోహింపఁ జేయుటకు అరిహన్‌ఋషి వెళ్ళినాడు. నీ వచ్చోటునకు వెళ్ళి యాతనికి సహకరింపుము!" అని నుడువగా నారదుఁడు త్రిపురంబులకుఁ జని అరిహన్ అను నాతని శిష్యుఁడై త్రిపురాధీశ్వరుని చెంతఁజని కుశలప్రశ్నముఁజేసి యిట్లు ప్రబోధించెను.





దానవేంద్రా! విద్యలన్నిటియందు నేర్పుగలవాడు వేదపారంగతుఁడనగు ఒకానొక యతి మీ పట్టణప్రాంతమునకు వచ్చియున్నవాడు. ఈ వరకు ఎన్నియో ధర్మములను వింటిమి కాని ఈతనికడ నుండు సనాతన ధర్మము సర్వోత్తరమైనదని భావించి నేనుగూడ దీక్షఁబరి గ్రహించితిని. ఒకవేళ నీకు రుచించునెడల యట్టి దీక్షను స్వీకరింపవచ్చును.

అట్టితతి దైత్యరాజు మోహితుడై విస్మయముఁజెందుచు నారదుఁడంతటివాడే ఆ యతికి శిష్యుఁడగుచుండగా మాబోంట్లు ఆతనికి విధేయులమగుట వింత కాదని మనంబున నిశ్చయించుకొని "అరిహన్"ను సమీపించి యాతని యద్భుత రూపమున కచ్చెరువొంది ప్రణమిల్లియు "మహాశయా! నాకు గూడ దీక్ష నొసగుము! శిష్యుడ నగుదును. నిజముగా విన్నవించుచున్నాను, అని ప్రార్థింప నాతఁడు "నా యానతిని పాటించునెడల దీక్ష నిచ్చెద" ననఁగా రాజు నంజటిఁ ఘలించి "నీవు చెప్పినట్లు ప్రవర్తింతునని" యంగీకరించెను.

అంత నా ఋషివర్యుఁడు తన ముఖవస్త్రమును జరుపుకొని "దైత్యాధిపా! నీకు సర్వోత్తమమైన దీక్ష నిచ్చెదను. దానిఁబరిగ్రహించి కృతార్థుడ వగుదువు!" అని వచించి తన శాస్త్రముఁదగు విధానమున త్రిపురాధీశ్వరునకు దీక్ష నొసగగా నవ్వాని సోదరులును ప్రజలును క్రమముగా దీక్షను పరిగ్రహించుచుండిరి. త్రిపురవాసులందరును అరిహన్ అను నాతనికి శిష్యులైనవారు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నాలుగవ యధ్యాయము.

## పంచమాధ్యాయము

### (త్రిపురాసురులను మోహింపఁజేయుట)

అరిహన్ అను నాతడు త్రిపురాసురులకు బౌద్ధదీక్ష నొసగి నారదుఁడు మొదలగు శిష్యులచే సేవింపఁబడుచుండెను. మరియు నవ్వారి కిట్లు బోధించెను.

జ్ఞానముచే నిండియుండునదియు వేదాంతముల సారమిమిడియుండునదియు ఉత్తమ ప్రబోధంబులలో శ్రేష్ఠంబునగు రహస్య విషయమును చెప్పెదను.

ఈ సంసారము అనాదికాలమునుండి యేర్పడినది కావున నిద్దానికి కర్తయను వాడొకఁడు లేడు. కర్మయనునదియు లేదని భావింపుడు! ఇద్ది స్వయముగానే ప్రాదుర్భవించును. స్వయముగానే అంతరించును. దీనిని తొలగింప నేరికిన వలనుగాదు. బ్రహ్మమొదలుకొని గడ్డిపఱక వరకు దేహమున బంధింపఁబడియుందురు. జీవాత్మయే సర్వాధీశ్వరుఁడు; ఆతనిని శాసించువాడు లేడు.

బ్రహ్మవిష్ణురుద్రులనునవి శరీరధారుల నామధేయంబులగును. మనకు నట్టి నామరూపములే యొప్పారును గదా!మనదేహము లెట్లు కాలవశమున నశించునో బ్రహ్మాదుల శరీరము లట్లే కాలము సమీపించినపుడు అనంతవిశ్వమున లీనంబనగును. బాగుగా విచారించి చూడగా ఆహారనిద్రాభయ మైథునము లందరికిని సమానములని తేటపడును కావున సంతృప్తియు సమానంబే యగును.





దప్పి గొనినవారికి పానీయమును త్రాగుటవలన సమానముగానే సంతృప్తియేర్పడుచున్నది. లోకమున రూపలావణ్య గర్వితలగు వనితలు వేలకొలది యున్నను సంభోగకాలమున నొక్కతయే యనుభవింపఁబడును. గుడ్డములు పెక్కుయున్న నొక్కదానిపైననే యెక్కుదురుగదా!

మెత్తని పాన్పునందు పడుకొనినను, నేలపై పరుండినను నిద్రాసుఖ మొక్క విధముగానే యనుభవింపఁబడును. మనకు బ్రహ్మాదులకును మరణభీతి యనివార్యంబగును. బాగుగా విమర్శించినచో శరీరధారులందరును సమానులే యని విదితమగును కావున ప్రాణిమాత్రమును హింసింపరాదు. జీవకారుణ్యముతో సరిదూగు ధర్మము మరియొండులేదు. ఒకానొక ప్రాణిని రక్షించునెడ ముల్లోకములనుకాపాడిన ఫలఁబొనగూరును. అహింసయేపరమధర్మము. హింసయే పాపము. పరాధీనుఁడు కాకుండుటయే ముక్తియగును. అభీష్టము ననుభవించుటయే స్వర్గము. ఇట్లు మునుపటి పెద్దలు చెప్పిరి. కావున నరకభీరువులగు వారు ప్రాణులను హింసింపరాదు. ముల్లోకములలో హింసతో సమానమగు పాపములలేదని తెలియుఁడు! హింసించువాడు నరకము నొందును భూతదయ గలవాడు స్వర్గసుఖము ననుభవించును. లోకమున దానములనేకములు కలవు. కాని యభయదానముతో సమానంబైనది లేదు. మరియు భయపడినవారికి నభయమొసగుటయు రోగులకు మందుల నిచ్చుటయు విద్యార్థులకు విద్యఁగఱపుటయు, ఆకలిగొన్న వారికి అన్నంబిడుటయు అను నాలుగు దానములే ముఖ్యములై ఇహపరసుఖములను ప్రసాదించునట్టివి. ఇట్లు మహర్షులు శాస్త్రములనన్నిటిని శోధించి నిర్ణయించిరి.

మణిమంత్రౌషధవిద్యలను శ్రమతో సంపాదించినవారును ధనము నార్జించుటకే యవ్వాని నుపయోగించుచున్నవారు. మానవుఁడు పురుషార్థములను గడించి కర్మ జ్ఞానేంద్రియముల పదిటిని మనోబుద్ధుల రెంటిని మాత్రము పూజింపవలెను. స్వర్గనరకములీ లోకముననే కలవు. సుఖము ననుభవించుండగా ప్రాణము నిష్క్రమించుటయే మోక్షమనఁబడును. వాసనాసహిత దేహమునకు గల క్లేశములు శమించి యజ్ఞానము తొలగుటయే మోక్షంబని తత్త్వచింతకుల యభిప్రాయము.

"న హింస్యాత్సర్వా భూతాని" అను శ్రుతివాక్యమే సజ్జనులచే ప్రమాణముగా నంగీకరింపఁదగినది. "అగ్నిష్టోమీయంపశుమాలభేత" ఇత్యాది వాక్యములు ప్రమాణములు కానివై పశుహింసను ప్రవర్తింపఁ జేయునవగుటచే దుర్జనులవ్వానిని కల్పించిరనియు గ్రహింపుడు!

శ్లో॥ వృక్షాంశ్ఛిత్వా పశూన్ హత్వా - కృత్వా రుధిరకర్దమమ్,
దగ్ధ్వా వహ్నౌ తిలాజ్యాది - చిత్రం స్వర్గోఽభిలష్యతే ॥ 33

చెట్లు తీగెలు నఱికి పశువులఁ జంపి నెత్తురు - బుఱదఁగావించియు నువ్వులు నెయ్యి మున్నగు విలువగల పదార్థముల నగ్నిఁగాల్చియు స్వర్గమునపేక్షించుట చిత్రముగా నున్నయది.

ఇవ్విధము త్రిపురాసురులకు ప్రబోధించి పురవాసులను గురించి ప్రత్యక్షగోచరములును శరీరసుఖమాత్ర సాధనంబులు బౌద్ధశాస్త్రవిహితంబులునగు ధర్మములనువిశదీకరించెను.

పరమాత్మఁదగు రూపము ఆనందము మాత్రమగుననియు భగవానుఁడు నానా రూపములు కలిగియుండుననుట మిథ్యయనియు, శరీర పోషణముండు వరకు నింద్రియములు పటుత్వము





కలిగియుండువరకు ముసలితనము రాకుండునంతవరకును సుఖము ననుభవింపవలెననియు ఇంద్రియములు శిథిలములై ముదుసలితనము వచ్చినపుడు సుఖమెక్కడిదనియు ఇహపరసుఖమును కోరువారు యాచకులకు తమ శరీరమును గూడ నర్పింపవలెననియు యాచకుల మనోఽభీష్టముల నీడేర్చనివారు భూమికి భారమగుదురనియు దేహము సత్త్వరము నశించునది కావున గృహదారద్రవ్యాది సంగ్రహములు అపాయముతో కూడినవి కావునను బుద్ధిమంతుఁడు శరీరసౌఖ్యమునే ముఖ్యముగా సాధింపవలసియుండుననియు ప్రాణము గతించిన పిమ్మట నీ శరీరము శునకములకు కాకులకు పురుగులకును భోజ్యమగుటఁజేశియు దహింపఁబడినచో భస్మాంత మగుననియు తెలియుడు!

బ్రాహ్మణాది వర్ణములు కల్పితములు. మానవత్వమందరికిని సమానమగుచుండ నొకరు నుత్తములనియు మరియొకరు నధములనియెంచుట నవివేకంబగును. ఈ సృష్టి - బ్రహ్మదేవుఁడు మొదలుకొని ప్రవర్తించినదని పెద్దలు చెప్పుదురు. అట్టిబ్రహ్మకు దక్షుఁడు మరీచి యను నిరువురు కుమారులు కలిగిరి. మరీచి కుమారుఁడగు కశ్యపుడు దక్షుని కుమార్తెలను పదముగ్గురిని వివాహమాడెను. ఇట్లుండగా ఆధునికులైన అల్పబుద్ధులు ఈ వనిత పొందతగినదనియు ఈమె యగమ్యురాలనియు చెప్పుట సమంజసమేనా? బ్రహ్మదేవుని ముఖబాహూరు పాదములనుండి బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులు జన్మించిరనుట నమ్మఁదగినది కాదు. ఒకే శరీరము నుండి పుట్టినవారు వేరువేరు వర్ణముల వారగుదురా? కావున పౌరులారా? మానవజాతి యంతయు నొక్కటేయని భావించి భేదము నిసుమంతయు పాటింపకుడు!

ఇట్లు త్రిపురవాసులందరి ప్రబోధించి యివ్వారి వైదికధర్మముల నరిహన్ అలను బుద్ధ సన్న్యాసి నిరాకరించినవాడు. అందువలన స్త్రీలు పాతివ్రత్యధర్మమును గోలుపోయిరి. పురుషులు నింద్రియ చాపల్యము గలవారైరి. దేవతారాధనములు కుంటుపడినవి శ్రాద్ధములు లోపించినవి. యజ్ఞయాగాది సత్కార్యములంతరించినవి. తీర్థములయందు పుణ్య క్షేత్రములయందును తర్పణ పిండ ప్రదానాది పుణ్యములు శూన్యములైనవి.

శివలింగము నర్చించుటయు విష్ణుసూర్యగణేశాది ముఖ్యదేవతలను పూజించుటయు పర్వ కాలములలో ప్రాతఃస్నానాది సుకృతముల నాచరించుటయు గృహిణులు తమ పతులను సేవించుటయు విడువఁబడినవి. పురుషులు సమ్మోహన విద్య నభ్యసించి పరాంగనల ననుభవించుచుండిరి.

బౌద్ధులు - అంతఃపురవనితలను రాజకుమారులను పౌరులను పురాంగనల నందరినిమోహింపఁ జేసి ధర్మభ్రష్టుల నొనర్చినందున దుష్కృతము తాండవించుచుండెను.

దేవదేవుఁడైన నారాయణుని మాయామహిమ కారణముగా దరిద్రదేవత త్రిపురములలో ప్రవేశించి నందున త్రిపురాసురులు పూర్వము తపస్సుచే సంపాదించిన సుకృతమంతయు నశించెను. బుద్ధగురువు వలె నారదుడుఁను ప్రజలను మోహింపఁజేసినను శివానుగ్రహవశమున నెట్టి వికారము లేనివాడుగా నుండెను.

అట్టితఱి త్రిపురాసురులు మయునితో కూడ తమ సామర్థ్యమును పోగొట్టుకొనిన వారైరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఐదవ యధ్యాయము.





# షష్ఠాధ్యాయము

## (అమరులు అభవుని నుతించుట)

అవ్విధము త్రిపురాసురులు తమ శివారాధనాది నిత్యకృత్యములు నైమిత్తిక శ్రాద్ధాదులను విడనాడుటయు స్త్రీలు వ్యభిచరించుటయు దురాచారము ప్రజలలో వ్యాపించుటయు కారణములుగా లక్ష్మీపతి "కృతార్థుడనైతి" నని భావించుచు నమరులను వెంటనిడుకొని కైలాసముఁజని శంకరు నేకాగ్రచిత్తమున నిట్లు ప్రార్థించెను.

శ్లో॥ మహేశ్వరాయ దేవాయ - నమస్తే పరమాత్మనే ।
నారాయణాయ రుద్రాయ - బ్రహ్మణే బ్రహ్మరూపిణే ॥

మాయను స్వాధీనఁజేసుకొనిన మహేశ్వరా! దేవా! నీకు నమస్కారము. సృష్టికి మున్ను రుద్రస్వరూపముతో నావిర్భవించి యుదకములయందు పరుండియున్న నారాయణుని నాభియందు నీ సంకల్పమును వీర్యమును విడచుటచే నాతని నాభిలోనుండి కమలము జనించుటయు అందునుండి బ్రహ్మదేవుఁడావిర్భవించి జగమును సృజించుటయు చూడగా బ్రహ్మవిష్ణురుద్ర స్వరూపములు నీవేయని బోధపడుచున్నయది. ఇంతియే గాక "చతుర్థం పురుషం మన్యంతే శివమద్వైతమ్" అను శ్రుతి ప్రమాణము ననుసరించి త్రిమూర్తుల నతిక్రమించిన నాలుగవ పురుషుఁడగు పరమాత్మయు నీవే యని భావించుచున్నాము.

మరియు కేశవుఁడు సాష్టాంగప్రణామంబిడి దక్షిణామూర్తి మంత్రమును బుద్ధమతోపదేశమున త్రిపురాసురులను ధర్మభ్రష్టుల నొనర్చిన దోషము శమించుటకై నీటియందు నిలువఁబడి యొక్కకోటి యేబదిలక్షల సంఖ్యఁజపించి మనంబు నీశ్వరుని స్మరించుచుండెను.

అంత నమరులును

"సర్వాంతర్యామివై భక్తుల కష్టములను తొలగించు శంకరునకు సంసారరోగమును శమింపఁజేసి జ్ఞానమును ప్రసాదించు నీలకంఠునకు నమస్కారము.

అసురులఁద్రుంచుచు మా సంకటములను పోగొట్టు నీవే మాకు శరణ్యుడవు; నిన్నే ఎల్లకాలము మ్రొక్కుచుందుము. చరాచరప్రపంచమున విష్ణుబ్రహ్మలకన్న మొదటివాడవు నీవేను; ఇక నీకు మాత్రము ఆదియే లేదు. నీ యందు నీవే ఆనందపడుచుందువు; అనంతుడవు; హరిబ్రహ్మాదులను కూడ శాసించువాడవు; ప్రకృతిని పురుషుని నీవే పుట్టించితివి; బ్రహ్మవిష్ణుమహేశ్వర రూపములతో సృష్టిస్థితి లయముల నొనర్చుచుందువు; జగమునంతటను ప్రాణులను తరింపఁజేయువాడవు; వరదుఁడవు; శుభవాక్యములన్నియు నీ స్వరూపములగును. నిఖిలమంత్రములచే చెప్పఁబడువాడవు నీవేను; భక్తులు ముక్తికొరకు నిన్ను యాచించుచుందురు. శివయోగము నభ్యసించు లింగాంగసంగులగు వారి హృదయకమలములయందు ఇష్టప్రాణభావలింగరూపమున నివసించువాడవు;

దివ్యతేజస్సుల నిండియుండు నిన్ను పరమాత్మయని నిగమములు ప్రశంసించుచున్నవి. చూడబడునదియు వినఁబడునదియు నుతింపఁబడునదియు తెలియఁబడునదనియు అణువు కంటె నణువైనదియు మహత్తుకంటె గొప్పదియు నగు తత్త్వము నీవే యని ప్రాజ్ఞులు వక్కాణించుచుందురు.

అంతట చేతులు కాళ్ళు గలవాడవు; సర్వత్ర కన్నులు తలకాయ ముఖముకలవాడవు; అంతట చెవులు ముక్కు కలవాడవు; సర్వజ్ఞుడవై సర్వవ్యాపివై సర్వేశ్వరుడవై ఎట్టి యావరణము లేనివాడవై విరూపాక్షుడవగు నీకు నమస్కారము.

బ్రహ్మాండమున కధ్యక్షుడవై కోటిసూర్యప్రకాశమానుడవై ఆద్యంతరహితుడవై జీవులనందరిని కర్మలయందు ప్రవర్తింపఁజేయువాడవు; ముప్పదియారవతత్త్వము నీవే యని కోవిదుల యభిప్రాయము. ప్రకృతిని ప్రేరేపించుచు జగమున జీవులకు ప్రపితామహుడ వగుచున్నావు, పూజ్యవిగ్రహములన్నియు నీవేయనియు స్వయంభువనియు వేదముల సారమును గుర్తెరుగువాడవనియు శ్రుతులు వేదవేత్తలును పేర్కొనుచున్నవారు.

లోకమున నీవు గాంచిన కృత్యమును మాబోంట్లెవరును తెలుసుకొనఁజాలరు. దేవతలు రాక్షసులు ఋషులును చరాచరప్రాణులును సర్వాత్మనా నిన్నే సేవించుచున్నవారు. అనన్య భావనతో నిన్ను శరణము నొందితిమి. త్రిపురాసురులను క్షణములో సంహరించి మమ్ము రక్షించుము! నీ మాయాబలమున విష్ణువుఁదగు యుక్తిబలమున నవ్వారు తమ వివేకమును గోలుపోయి బౌద్ధాగమము ననుసరించి ధర్మభ్రష్టులైనవారు ఇదియు మా భాగ్యమనియే భావింతుము. శరణాగతులమగు మాపై కరుణఁజూపుము! ఇఁకమీద నీ యిష్టము!"

అని కృతాఁజలులరై నుతించి నిలువంబడిరి. అంత మహేశ్వరుఁడు సంతసించి నందివాహనముపై నచ్చోటికేతెంచి నందికేశ్వరుని హస్తము నవలంబముగా పట్టుకొని నందిపై నుండి డిగ్గియు మున్ముందు విష్ణుమూర్తిని తరువాత నమరుల నవలోకించి యిట్లు సంభాషించెను.

"నారాయణా! దేవతలకు ప్రస్తుతము కావలసిన కార్యమును తెలుసుకుంటిని, అధర్మవరులగు త్రిపురాసురులను సంహరింపవచ్చును. కాని నా యందు భక్తి కలిగి నన్నారాధించు నవ్వారు కపటమున ధర్మభ్రష్టులుగా చేయఁబడిరి కావున వారిని నేనెట్లు చంపవలెను? నీవుగాని యితరుఁడు కాని త్రిపురాసురులను సంహరించుగాక!"

ఇట్టి శంభువాక్యమును విని యమరులు విష్ణువును ఖిన్నులైరి. అంత బ్రహ్మదేవుఁడు "దేవా! నీ భక్తులైనను త్రిపురాసురులు లోకకంటకు లగుటయే నవ్వారిని చంపుట యన్యాయము కాదు. ఇఁక నీవైతే సామాన్యదేవతవు కాదు. యోగేశ్వరుడవై నిరంతరము దేవతలను ఋషులను కాపాడు పరమాత్మవు; నీ శాసనము ననుసరించియే త్రిపురాసురులు మోహితులై స్వధర్మమును విడనాడి నీ యారాధనమును చేయుటలేదు. నీవు దక్క నితరుఁడెవడు నవ్వారిని సంహరింపఁజాలడు.

లోకమున రాష్ట్రమును పాలించు రాజు - సాధువులను భక్తులను కాపాడు నుద్దేశమున ధర్మధ్వంసకులగు క్రూరులను సంహరింపవలెనని రాజ ధర్మశాస్త్రము నుడువుచున్నది.

వేదప్రవర్తకులైన మునులు వేదోదితములగు యజ్ఞములు, వేదములు, శాస్త్రములు సమస్తచరాచర నివాసులును నేను హరియు అందరము నీవారమే గదా!

శ్లో॥ దేవతాసార్వభౌమస్త్వం - సమ్రాట్ సర్వేశ్వరః ప్రభో ।
పరివార స్తవైవేష - హర్యాది సకలం జగత్ ॥

౪౬

నీవు దివిషదులలో సార్వభౌముడవు, సమస్త బ్రహ్మాండమున కధిపతివి; చరాచరమునంతయు శాసించువాడవు; విష్ణువు మొదలగు జగము నీ పరివారములో చేరినదే గదా! నీవు చక్రవర్తివైతే నారాయణుఁడు యువరాజుగా ప్రవర్తించును. నేను పురోహితుడను; శుక్రాచార్యుఁడు ప్రపంచరాజకీయ కార్యములను పరిశీలించువాడు; ఇంద్రాదిదేవతలు మేమును నీ శాసనము ననుసరించియే మా మా కర్తవ్యములను నెరవేర్చుచున్నవారము."

అని విన్నవింపగా మహాదేవుఁడు ప్రసన్నుడై "చతుర్ముఖా! నేను సమ్రాట్టునైనచో అందుకు వలయు రథము సారథియు ధనుర్బాణంబులును లేవు గదా! రథాదిపరికరములున్నచో సంగ్రామమున బలవంతులైన దైత్యులను మడియఁజేయనగును." అని వచించెను.

అంత బ్రహ్మాదులు సంతోషస్వాంతులై "దేవా! రథము మొదలగు పరికరములన్నియు మేమగుదుము." అని నివేదింపగా భక్తవత్సలుఁడంగీకరించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఆరవ యధ్యాయము.

## సప్తమాధ్యాయము

### (దేవతలు మరల శివునుపాసించుట)

ఇంతలో నమ్మవారు గణేశకుమారు లిరువురితో కూడ నచ్చోటికి నేతెంచి శివుని ముందు నిలువగా హరిబ్రహ్మాదులు జగన్మాతకు మిక్కిలివినయముతో వందనంబులనిడిరి. మరియు జయశబ్దము నుచ్చరించుచు నమ్మవారి రాకకు కారణ మెఱయక విస్మయముఁ జెందుచు ననేకవిధ స్తోత్రములతో ప్రార్థింపగా పార్వతీదేవి – నానాలీలావిశారదుఁడగు శంకరుని గురించి "స్వామీ! సొమ్ములఁదాల్చి సూర్యునితో సమానముగా వెలుగొందు మన షణ్ముఖకుమారుఁడు వినోదముగా నాడుచున్నవాడు అవ్వానిని గాంచుము!" అని విన్నవించెను.

అంత నా మహాదేవుఁడు – స్కందుని ముఖముఁదగు నమృతముఁగ్రోలుచు సంతృప్తిఁజెందకుండెను. నిజభక్తిఁగోలుపోయి స్వేచ్ఛావిహారముఁజేయుచున్న త్రిపురాసురులను సంహరింపవలెనని మనస్సు నందిడుకొనియే కార్తికేయుని కౌగలించుకొని తలపై వాసనఁజూచియు మిగుల సంబరపడుచు దేవి నవలోకించి యమ్మవారితోడను కుమారస్వామితోడను నందికేశ్వరునితోడను వేల్పులు మ్రొక్కుచుండగా నంతఃపురములోనికి వెళ్ళినవాడు.

సురలు నంతఃపురద్వారముందగు నిరుపార్శ్వములందు నిలువఁబడి ఖిన్నులై "ప్రస్తుతము కర్తవ్య మెద్ది? ఎక్కడికి వెళ్ళవలెను? ఇప్పట్టున మాకు మేలు చేయువాడెవడు? అనుకున్నదొకటి, ఐనదొకటి, అహో! దైవము బలవత్తరమైనది. మేమందరము దౌర్భాగ్యులము; పాపాత్ములము, త్రిపురాసురులే సౌభాగ్యము గల వారని తోచెడిని." అని విలపించుచు పెద్దగా నఱచుచుండ నవ్వారిని కుంభోదరుండు కఱ్ఱతో కొట్టినందున దేవతలు వెఱగంది మునులతో గూడ నేలంబడినవారు. దేవేంద్రుండైతేనో మోకాళ్ళపై నిలువఁబడి మిగుల వగచుచుండెను.

అంత నమరులు కశ్యంపుడు మొదలగు మునులును కూడి హరిబ్రహ్మలంజేరి "విధిబలము గొప్పదిగదా! ఇప్పుడిట్టి విఘ్నమెందుకు సంభవించినదో బోధపడుటలేదు. మా దౌర్భాగ్యవశమున త్రిపురాసురులను మడియంజేయుట సాధ్యమగుటలేదు. అని విన్నవింప నారాయణుండు సురలను మునులను బుజ్జగించుచు "అమరులారా? దుఃఖింతురెందులకు? గొప్పవారి నారాధించుట సుసాధ్యము కానట్టిది; మహనీయులను పూజించుటలో మొదట నిబ్బందులు కలుగుచుండును. ఇంక పరాత్పరుం డగు శివుండు - భక్తి దృఢముగా నున్న సంగతిని కనిపెట్టియే ప్రసన్నుడగువాడు. కావున నా భగవానుండు కరుణించు విధానమును చెప్పుచున్నాను. వినుండు!

"ఓం నమఃశివాయ, శుభం శుభం కురు కురు! శివాయ నమ ఓమ్" "వింశత్యక్షరములుగల నీ మహామంత్రమును కోటిసంఖ్యంజపించుడు! అందువలన శివుండు ప్రసన్నుడై మన కార్యమును సాధించును" అని వివరింపగా బ్రహ్మాదులు శంకరుని మంత్రము నుపాసించుచుండిరి. హరియు శివునియందు అనన్యమనంబునిడి దేవకార్యము సిద్ధించుటకై శివషడక్షరీసహిత మహామంత్రమును కోటిసంఖ్యంజపించెను. మరియు నింద్రాదులు నొక్కొక్కరు కోటిమంత్రజపము నొనర్చిరి.

అంత మహాదేవుండు ప్రసన్నుడై చంద్రశేఖర నీలకంఠాది లక్షణములతో కూడిన రూపమున సాక్షాత్కరించి "హరిబ్రహ్మాదులారా! మీకేమి కావలెనో నభ్యర్థింపుడు!" అని వచించెను.

"జగదీశ్వరా! శంకరా! మమ్ము దుఃఖితులుగా గుర్తెరిగి త్రిపురాసురులను సంహరింపుము! ఇదియే మా కోరిన వరంబగును." అని యవ్వారు నివేదింప శంకరుండు చిరునగవుఁజెంది "హరి బ్రహ్మలారా? త్రిపురములు నశించినవనియే విశ్వసించి నామాట నాలకింపుడు! రథము సారథి ధనుస్సు మొదలగు పరికరములను కల్పింతుమని పూర్వమంగీకరించియుంటిరి. అదే విధముగా సాధనములను సిద్ధపఱచుడు! అమరులకు నుపకరింప నెల్లకాలము సంసిద్ధుడనని భావింపుడు! దేవతాసార్వభౌముని వైభవమును సృష్టికిని రక్షణమునకు నధికారము కలిగియున్న మీరిరువురు నింద్రాదుల తోడ్పాటున నేర్పరచుడు!

ఇంక మీరు జపించిన మహామంత్రము శివప్రీతిని కలుగంజేయునదై శైవులచే ముఖ్యముగా జపింపం దగినదై జపించువారికి భుక్తిముక్తుల నొసగుటయే గాక కామితముల నన్నిటిని ప్రసాదించునట్టిది. మరియు దీర్ఘాయురారోగ్య భాగ్యముల నొదవఁజేయును. కామ్యోపాసకులకు స్వర్గాదిభోగముల నొసగును. నిష్కామచిత్తులకు శివసాయుజ్యప్రదంబగును.





ఈ మంత్రము నొక్కసారియైనను శుచియై స్మరించువాడు వినువాడు వినుపించువాడను కృతార్థులగుదురు. అని వక్కాణింపగా సురలు శివభాషితమునాలకించి సంతసించిరి. హరిబ్రహ్మలు విశేషించి సంతుష్టులైనవారు.

అట్టితతి విశ్వకర్మ - శివాజ్ఞావశమున హరిబ్రహ్మాదులామోదింపగా చతుర్దశ భువనాత్మక రథమొండు కల్పించి శివునకు సమర్పించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏడవ యధ్యాయము.

## అష్టమాధ్యాయము

**(శివుఁడు త్రిపురాసురులను సంహరింప రథము మున్నగు యుద్ధ పరికరములు ఏర్పడుట)**

సూతమహర్షి శౌనకాదులకు సనత్కుమారుఁడు వ్యాసభగవానునకు చెప్పినట్లు వక్కాణింపఁదొడఁగెను.

శివుని చరణకమలములను స్మరించి చెప్పుచున్నాను. శివలీలావైభవమును చెవులార నాలకింపుడు!

విశ్వకర్మ శివునికై నిర్మించిన రథము సర్వలోకసారంబై దివ్యంబై సర్వప్రాణిమయంబై సువర్ణప్రచురంబై విరాజిల్లుచుండెను. అట్టి రథమునకు సూర్యుఁడు దక్షిణ చక్రముగాను చంద్రుడు వామచక్రముగాను దక్షిణచక్రమునకు పండ్రెండు ఆదిత్యులు ఆకులుగాను వామచక్రమునకు పదునారు చంద్రకళలు ఆకులుగాను నక్షత్రములు అలంకారములుగాను వామదక్షిణ చక్రములరెంటికి నారుఋతువులు కమ్ములుగాను ఆకాశము అవకాశముగాను మందరపర్వతము రథముఁదగు చోటుగాను ఉదయాచలము అస్తాచలంబును నొగలుగాను మేరుపర్వతము అధిష్ఠానముగాను కేసరపర్వతములు ఆశ్రయములుగాను సంవత్సరములు రథవేగముగాను దక్షిణోత్తరాయణములు రథచక్రముల కూర్పులుగాను ముహూర్తములు రథచక్రనేముల క్రిందనుండు కఱ్ఱలుగాను కళలు రథచక్రముల చీలలుగాను కాష్ఠలు (పదునెనిమిది రెప్పపాట్ల కాలములు) ఘోణములుగాను క్షణములు రథముఁదగు కఱ్ఱలుగాను నిమేషములు నొగలక్రింద నెత్తుగా సంతనపఱచియుండు ప్రమానితుండులుగాను అనులవములు నేడికోలలుగాను స్వర్గమోక్షములు ధ్వజములుగాను అవ్యక్తము ఏడికోలల దండముగాను అవ్యక్తము అనగా ప్రకృతిఁదగు పెరుగు దల-రథసంచార ప్రదేశముగాను అహంకారము రథకోణములు (మూలలు) గాను పంచభూతములు రథముఁదగు సత్తువగాను కర్మజ్ఞానేంద్రియములు రథాలంకారములుగాను శ్రద్ధ-రథగమనముగాను ఆరువేదాంగములు పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రములు సప్రధాన భూషణములగాను మంత్రములు రథఘంటలుగాను వర్ణములు ఆశ్రమములును తదితర పరికరములుగాను దిశలు ఉపదిశలును పాదములు గాను చతుఃసముద్రములు రథమునాకర్షించు సాధనములుగా నమరియుండినవి. మరియు గంగాది మహానదులు దివ్య స్త్రీరూపముఁదాల్చి సర్వాభరణాలంకృతలై చామరములను కేలఁదాల్చి రథము పై పార్శ్వప్రదేశముల యందు నిలుపఁబడియుండెను. లోకాలోకపర్వతములు మున్నగునవి సువర్ణ





సోపానములుగాను వర్షాచలములు రథపాశములుగను పాతాళ నివాసులు రథముఁదగు క్రింది భాగములుగను వేయిపడగలుగల అనంతుఁడు రథము క్రింది బంధముగ నేర్పడియుండిరి.

భగవానుడైన బ్రహ్మదేవుఁడు – రథసారధిగను; అమరులు – పగ్గములఁబట్టు వారుగను; ప్రణవము – సారధి పట్టుకొను ప్రతోదము (కొరడా)గను; ఆకారము – శ్వేతచ్ఛత్రముగను; మందరము ఛత్రదండముగను; మేరుగిరీంద్రము ధనుస్సుగను; ఆదిశేషుఁడు – అల్లెత్రాడుగను; సరస్వతీదేవి - రథముఖ్యఘంటగాను; అద్వితీయ మహిమగల మహావిష్ణువు – బాణముగాను; అగ్నిదేవుఁడు బాణాగ్రము గాను, నాలుగు వేదములు – రథాశ్వములుగాను; ఆకాశగతజ్యోతిస్సులు – అశ్వాలంకారములు గాను; వేదవ్యాసాది మహర్షులు – రథముముందు నడచువారుగాను సిద్ధపడియుండిరి. వేయేల? బ్రహ్మాండమున గల సర్వస్వంబును రథము నందు సమకూర్చఁబడియుండెను.

ఇవ్విధము విశ్వకర్మ – బ్రహ్మవిష్ణువుల యనుమతిని శివరథమును తత్పరికరములను కల్పించినవాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఎనిమిదవ యధ్యాయము.

## నవమాధ్యాయము

### (శంకరుఁడు త్రిపురాసురసంహారార్థము బయలుదేరుట)

నానావిధ అద్భుతదృశ్యములతో నమరియుండు దివ్యరథమునకు వేదాశ్వముల ననుసంధించి హరిబ్రహ్మాదులు శివుననేకవిధములఁబ్రార్థింపగా రథముపై సర్వదేవమయుండు దేవతాసార్వభౌముఁడు తగు మహాదేవుఁడు ఆసీనుండాయెను.

అట్టితతి నారదాది మహర్షులు ఇంద్రాది దేవతలు గంధర్వులు మున్నగువారు శంకరుని ప్రశంసించుచు స్తోత్రములఁజేయుచుండిరి. అప్సరసలు తమ మధురసంగీతముల నాలపించుచుండిరి.

రథము సమస్తలోకాత్మకమైనను మహాదేవుఁడద్దాని నారోహింపగానే గుఱ్ఱములు పరాత్పరుని భారమును వహింపఁజాలక నేలఁగూలుచుండెను. భూమి కదలుచుండెను. పర్వతములన్నియు చలించుచుండినవి. ఆదిశేషుఁడును హఠాత్తుగా వణకుచుండెను. ఐతే ఆసమయమున విష్ణు భగవానుఁడు శివానుగ్రహబలమున వృషభస్వరూపముఁదాల్చి క్రుంగుచున్న రథమును మోయుచు లేవనెత్తినను

శ్లో॥ క్షణాంతరే వృషేంద్రోఽపి – జానుభ్యా మగమద్ధరామ్ ;
రథారూఢమహేశస్య – సుతేజః సోఢు మక్షమః ॥

వృషభరూపియగు హరియు రథారూఢుడైన మహేశ్వరుని తేజఃస్వరూప ప్రభావమును సహింప నలవిగానివాడై మోకాళ్ళతో నేలనంటుచుండెను. అప్పుడు పరమేశ్వరుఁడే పగ్గములఁబట్టుకొని





యశ్వములను పైకి లాగి రథమును క్రుంగకుండునట్లు నెలకొలుపగా బ్రహ్మదేవుఁడు రథముముందు కూర్చుని మనోవేగము గల వేదాశ్వములను తోలుచుండెను.

ఆ రథము త్రిపురాసురుల మూడుపట్టణములఁజేరుటకు నడచుచుండెను. అట్టితతి భగవానుఁడు నమరుల నుద్దేశించి యిట్లు వక్కాణించెను.

మీరందరు తదితర జీవులును పశువులగుదురు. పశుపతిని నేను; ఇవ్విషయమును మీ రంగీకరించినచో దైత్యులను సంహరింతును. పశువులనఁగానే వగవకుఁడు! సంసారపాశము గల ప్రతిజీవియు పశువనఁబడును. పాశము తగిలియుండువరకు పశుత్వము తొలగనట్టిది. కావున ప్రతి ప్రాణియు పశుత్వమును పోగొట్టుకొనుటకు ప్రయత్నించి శివసమాన రూపము కలవాడు కావలెను.

శ్లో॥ **యోవై పాశుపతం దివ్యం - చరిష్యతి స మోక్ష్యతి ।**
**పశుత్వా దితి సత్యం వః - ప్రతిజ్ఞాతం సమాహితాః ॥**

"వ్రతమేతత్ పాశుపతం, తత్సమాచరే న్ముముక్షు రపునర్భవాయ" అను శ్రుతి వాక్యము ననుసరించి మోక్షాపేక్ష గలవాడు జన్మరాహిత్యమునకై పాశుపతవ్రతము నాచరింపవలెను. పాశుపతవ్రతము-భస్మరుద్రాక్ష శివలింగ ధారణాత్మక మనియు భస్మరుద్రాక్ష ధారణాత్మకమనియు భస్మధారణాత్మకమనియు ముప్విధములు కలిగియుండును. ఇవ్వానిలో నేదేని తమ ఉత్తమ మధ్యమ అధమ అధికారములఁబట్టి యవలంబింపవలెను. మీరేగాకనితరులెవరైన నీ వ్రతము నాచరించినచో తప్పక ముక్తులగుదురు. ఇందెంత మాత్రము సందేహము లేదు.

ఈ వ్రతము నా జాన్మంతము చేయుట సమంజసము. అట్లు శక్తి చాలనివారు పంద్రెండు వత్సరములుగాని ఆరు వత్సరములుగాని వర్షత్రయముగాని పాశుపతవ్రతము నాచరింపవచ్చును. లింగధారణతో కూడిన పాశుపతమును జీవితాంతమువరకు నవలంబింపవలెనని శివాగమములు ఉపనిషత్తులును చాటుచున్నయవి.

అందువలన నమరులారా? ముక్తి సాధనములలో శ్రేష్ఠంబు పునరావృత్తి రహిత శాశ్వత శివసాయుజ్య మునొదవఁజేయునదియునగు పాశుపత వ్రతము నాచరించి ముక్తులు కండు!

ఇట్టి శివవాక్యము నాకర్ణించి హరిబ్రహ్మాది దేవతలు పాశుపతవ్రతమును స్వీకరింతుమని యంగీకరించినవారైరి.

శ్లో॥ **తస్మాద్వై పశవః సర్వే - దేవాసురవరాః ప్రభోః ।**
**రుద్రః పశుపతిశ్చైవ - పశుపాశవిమోచకః ॥** ౨౩

కావున జగదీశ్వరుఁడగు శంకరుఁడు సంసారరోగమును పోగొట్టువాడగుటచే రుద్రుడనఁబఱగుచు పశువులగు జీవులు తన నుపాసించినయెడల సంసారపాశమును తొలగించువాడగుటఁజేసి పశుపతియని పేర్కొనఁబడుననియు దేవతలు రాక్షసులు గంధర్వాదులు మానవులు తిర్యక్ జంతువులు నందరును జనన మరణ ప్రవాహ సంబంధ రూపమగు పాశము (తనుగు) వంటి సంసారము గలవారగుటచే పశువులనంబడుదురనియు తెలియవలెను.





అప్పటినుండి "పశుపతి" యను నామధేయము మహేశ్వరునకు ప్రసిద్ధంబయ్యెను. దేవతలు ఋషులును మహాదేవుని శాసనమునకు నొడంబడి జయజయ ధ్వానములఁ జేయుచుండిరి. హరిబ్రహ్మలు మిగుల సంతసించిరి. ఆ సమయమున మహేశ్వరుని ప్రకాశమాన దివ్యరూపమును వర్ణింప నూరు వత్సరములకైనను శక్యము కాకుండెను.

ఇట్టి అసమాన తేజోబల పరాక్రమములు గలవాడై శంకరుఁడు త్రిపురములను దహింప సంసిద్ధుడై యుండగా హరిబ్రహ్మేంద్రాది దేవతలు గజ సింహ అశ్వరథాది వాహనముల నధిష్ఠించి నానావిధ ఆయుధములను ధరించియు శివుని రథముముందు నడచుచుండిరి. అంతరిక్షమున సంచరించు సిద్ధచారణులు పుష్పములను కురిపించుచుండిరి. వీరభద్ర కుమార గణేశులు నందిభృంగాది గణాధిపతులును యుద్ధ సన్నద్ధులై బయలుదేరిరి.

ఒక్కొక్క గణాధిపతియే జగమునంతయు సంహరింపఁజాలువాడై యుండగా నిఁక శంకరుఁడు త్రిపురముల నవలీలగా దహించునని వేరుగా చెప్పనవసరము లేదు.

సంకల్ప మాత్రమున సృష్టిస్థితిలయములఁ జేయఁజాలు మహేశ్వరుఁడు త్రిపురాసురులను సంహరింప నింతటి సన్నాహ మెందుకు చేసినాడనఁగా? లోకమున తన కీర్తిని వ్యాపింపఁజేయవలెననియు తాను సర్వాధికుఁడని విశ్వసింపని దుర్మార్గులకు విశ్వాసమును కలుగఁజేయవలెననియు త్రిపురాసురులు కోరిన విధముగా అపూర్వ సాధనములను సంపాదించుకొని బ్రహ్మవరమును సార్థకము నొనర్చినవాడనియు గ్రహింతురు గాక!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో తొమ్మిదవ యధ్యాయము.

## దశమాధ్యాయము

### (త్రిపురదాహవర్ణనము)

దైత్యుల పట్టణత్రయమును కాల్చివేయుటకు ముక్కంటిదేవుఁడు ధనుస్సుఁదగు అల్లెత్రాడును తలకాయవరకు లాగి బాణమును తగిలించియు గట్టి పిడికిలితో పట్టుకొనియు చూపులోచూపు నిలిపి రథముపై పదునొకఁడు నూర్ల వత్సరముల కాలము కదలకుండ నిలచెను.

అట్టితఱి విఘ్నేశ్వరుఁడు – తొల్లి తనకు శంకరుఁ డొసఁగిన అధికారమును సార్థకముఁ జేయుటకో యన్నట్లు పరాత్పరుని బొటనవ్రేలుపై నధిష్టించి బాధించుచుండుటఁజేసి త్రిపురములపై పరమేశ్వరుని గురి కుదురదయ్యెను.

"భగవానుడా? త్రిపురాసుర సంహారమనఁ బడు లోకకల్యాణ మహాకార్యము నొనర్చుటకు ముందు వినాయకు నాదరింపుము!" అని యాకాశవాణి వినిపింపగా అంధకాసురుఁడు మున్నగు మహారాక్షసుల మదము నవలీలగా నణచిన మహాదేవుఁడు లోకమర్యాదను పాటించుచు విఘ్నేశ్వరుని పూజించినందున మూడుపట్టణములు నొకచోటికి చేరినవనియు అందువలననే శంకరుఁడు త్రిపురాసురులను చంపఁ





గలిగినాడనియు కొందరు పామరులు చెప్పుదురుకాని యది సమంజసము కాదని దిగువ శ్లోకములు చాటుచున్నవి.

శ్లో॥ పరబ్రహ్మణీ దేవేశే - సర్వోపాస్యే మహేశ్వరే ।
అన్య ప్రసాదతః కార్య - సిద్ధి ర్ఘటతి నే తిహి ॥ ౧౧

శ్లో॥ న స్వతంత్రః పరంబ్రహ్మ - సగుణో నిర్గుణో ఒపి హ ।
అలక్ష్యః సకలైః స్వామీ - పరమాత్మా నిరంజనః ॥ ౧౧

బ్రహ్మ విష్ణు గణేశకుమార వీరభద్రాది సకల దేవతలచే నుపాసింపఁదగిన మహేశ్వరునికి ఇతరుని యనుగ్రహమున కార్యసిద్ధి యగునని చెప్పుట యుక్తముకాదు. శివుఁడు సర్వాధికుఁడై సర్వతంత్ర స్వతంత్రుడుగ నుండువాడు; ఆకలిదప్పి మున్నగు ప్రాకృత గుణములు లేనివాడై సర్వజ్ఞత మొదలగు దివ్యగుణములు కలిగియుండువాడు.

ప్రాణిమాత్రులు చూడవలెనన్న కనఁబడువాడు కాడు. ఎట్టి పుణ్యపాప లేపము లేనివాడై "ఉత్తమః పురుషస్త్వన్యః – పరమాత్మేత్యుదాహృతః" అని శ్రీకృష్ణ భగవానుఁడు గీతలలో వాక్రుచ్చినట్లు హరిబ్రహ్మాది ప్రాకృతప్రపంచమును మించు ఉత్తమ పురుషుఁడనియు పరమాత్మయనియు పేర్కొనఁబడువాడు. మరియు సూర్యదేవీ విష్ణు గణపతి రుద్రులనఁబడు పంచమూర్తులు గలవాడై ఈ ఐదుగురి చేత నుపాసింపఁబడు సదాశివుండగును.

శ్లో॥ తస్యోపాస్యో నకో ఒప్యస్తి - స ఏవో పాస్య ఆ లయమ్ ॥ ౧౨

ఆతడుపాసింపఁదగిన వ్యక్తిలేడు కావున నా శంకరుఁడే ఎల్లరచే నారాధింపఁదగినవాడు ప్రాప్యుఁడునై యుండును.

ఇంతియేగాక మున్ను తాను గణపతికి ప్రసాదించిన వరము కారణముగా మహేశ్వరుఁడు లీలామాత్రముగా తన కుమారుఁడైన విఘ్నేశ్వరుని గౌరవించుట సంఘటితంబగునని చెప్పువచ్చును.

అవ్విధము త్రిపురము లొక్కచోటికిరాగా దేవాదులు హర్షించుచు నష్టమూర్తిని ప్రశంసించుచును జయజయ ధ్యానములఁ జేయుచుండిరి.

ఆ విజయ సూచక శుభసమయమున హరిబ్రహ్మలు తదితర ప్రముఖులును "శంకరా! భక్తవత్సలా! లోకకంటకులైన త్రిపురాసురుల నొక్కుమ్మడిగా సంహరించి మమ్ము రక్షించుము! మూడు పట్టణములు విడిపోనంతలోనే బాణమును ప్రయోగింపుము!" అని మిన్నుముట్ట నఱచుచు వేడుచుండగా కరుణామయుఁడు పాశుపతాస్త్రమును పూజించి వేయుచు కొద్దిగా సందేహించుచున్నందున నమరులు పునఃపునః సాష్టాంగ నమస్కారముల నిడుచుండిరి.

అంత మహాదేవుఁడు ప్రసన్నుడై అభిజిన్ముహూర్తమున ధనుస్సునువంచి యల్లెత్రాడు లాగుచుండగా బ్రహ్మాండమును భేదించు భయంకర ధ్వని వ్యాపించుచుండెను. అట్టి తఱి శంకరుఁడు తన పశుపతియను దివ్యనామధేయము నుచ్చరించుచు త్రిపురాసురుల పేరు లఁబేర్కొనుచు కోటిసూర్యప్రకాశమానంబగు బాణమును విడిచినవాడు. 

విష్ణుమయంబు అగ్నిచే వ్యాపింపఁబడిన అగ్రము గలదియునగు నా శివనిర్ముక్త బాణము క్షణములో త్రిపురంబుల భస్మముఁ గావించెను.

బాణమునందలి అగ్నిహోత్రము నూర్లకొలది రాక్షసులను కాల్చివేసెను, శివారాధన నియమమును విడనాడినందున నసురుల కిట్టి గతి సంభవించెను. తారకాక్షుడు సహోదరులిరువురితో కూడ నేలఁ గూలి భక్తవత్సలుడగు శంకరు నంత్యకాలమున స్మరించుచు పలువిధముల విలపించుచు "మహాదేవా! నీ వెట్టివాడవో తెలుసుకుంటిమి. బంధువులతో గూడ మమ్ము నీవు దహించుట యొక విధముగా అనుగ్రహించుటయే యని భావింతుము. నీ యారాధనమును మానుకున్నను అట్టి యపచారమును క్షమించి మేము కోరిన వరమును సార్థకముఁజేయ కరుణించితివి.

శ్లో॥ త్వద్భావభావితా బుద్ధి - ర్జాతే జాతే భవత్వితి ॥ 33

శంకరుఁడే సర్వాధికుఁడు సర్వోపాస్యుడు ముక్తిప్రదాతయను అనన్యభావనతో దృఢంబగు శివోపాసనాబుద్ధి ప్రతిజన్మయందుండుగాక!" అని ప్రార్థించియు శంకరుని బాణాగ్ని జ్వాలలయందు నసువులఁబాసి భస్మమైనవారు.

బాలురు వృద్ధులు నగు రాక్షసులందరును శివాజ్ఞావశమున భస్మీభూతులగుటయే గాక స్త్రీలు పురుషులు వాహనములు అన్నియు అంతరించినవి. అప్పటిదృశ్యము ప్రళయకాలమున జగత్సంహారమువలె కన్పట్టుచుండెను.

కొందరు గృహిణులు తమ పతులను కౌగలించుకొనియుండగానే మరణించిరి. మరి కొందరు వనితలు నిద్రించియే కాలధర్మముఁజెందిరి. ఇంక కొందరు సాధ్వీమణులు రతిసుఖముఁబడసి యలసియుండగానే గతించిరి. మరికొందరు నారీమణులు సగము కాల్పఁబడి మేలుకొని యిటునటు పరుగిడుచు చనిపోయిరి. వేయేల? ఘోరంబగు శంకరుని బాణాగ్నిజ్వాలలు విశ్వకర్మ నొక్కని విడచి వృక్షలతాదిస్థావరమును సంచరించు ప్రాణులను దహించినవి.

యమరులకు కీడుఁజేయని విశ్వకర్మను శంకరుని తేజస్సు రక్షించినదియ్యెను. ఎందుకనఁగా? మహేశ్వరుని శరణముగా నాశ్రయించిన సద్భక్తునికి సంకటకాలమునందును ముప్పు వాటిల్లదు గావున బుద్ధిమంతుఁడు మంచివారితో నెల్లకాలము సహవాసము కలిగియుండవలెను. సత్పురుషులను తిరస్కరించుటవలన లోకము క్షీణించును. అందువలన అట్టి కార్యమును చేయరాదు.

త్రిపురాసురులు – మా పట్టణములు ఒకచోటికి రాజాలవని భావించిరి కాని దైవము సహరింపలేదని తెలియవలెను.

ఐనను త్రిపురములలో శంకరు నారాధించిన దైత్యులందరును కైలాసమున నుత్తమపదవులను పొంది యానందించినవారైరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదియవ యధ్యాయము.





# ఏకాదశోధ్యాయము

## (బ్రహ్మాదులు శివుని నుతించుట)

సనత్కుమారుఁడు వ్యాసునికి చెప్పినట్లు సూతుఁడు శౌనకాదులకు చెప్పఁదొడఁగెను.

లోకరీతిననుసరించు మహేశ్వరుని చరితము భక్తుల పాపము లన్నిటిని పరిహరించు నట్టిది, అవ్విధము శంకరుఁడు త్రిపురములను దైత్యుల నవలీలఁదహింపగా ఉపేంద్రదేవేంద్రాదులు గొప్ప ప్రభావము గల మహేశ్వరుని గాంచుచు నిర్విణ్ణులగుచుండిరి.

త్రిపురదాహసమయమున మహేశ్వరుని రూపము దశదిశలను దహించు ప్రళయాగ్నిఁబోలినదై కోటిసూర్యప్రతీకాశముగా కన్పట్టుచుండెను. అట్టి పార్వతీపరమేశ్వరుల ఘోరరూపములను చూడలేక భయపడుచున్న దేవతలు తలలువంచియుండిరి. ఋషులునేమియు మాటలాడక మిన్నకుండిరి. ఆ పురాణదంపతుల తేజస్సు సర్వత్ర వ్యాపించియుండగా చూచుచు మ్రొక్కులిడుచుండిరి.

ఇఁక బ్రహ్మదేవుఁడు నా శంకరరూపము నవలోకించి యిట్లు ప్రస్తుతించెను.

అమరులందరికి మేలుఁజేయు మహాదేవ! దేవదేవా! భక్తులను కరుణించు పరమేశ్వరా! ప్రసన్నుడవుకమ్ము! చరాచరప్రపంచమున కానందము నొనఁగూర్చుము! ప్రణవస్వరూపుడవు; ఓంకారము నతిక్రమించి యద్దాని కర్థమగువాడవు; వాఙ్మయమంతయు నిన్ను ప్రతిపాదించును. శరణాగతులను రక్షించువాడవు; ప్రకృతిని పురుషుని మించినవాడవు; ప్రాకృతగుణములు లేనివాడవు; ఎట్టి వికారములేనివాడవై నిత్యుడవై ఎల్లకాలము తృప్తిపడియుండువాడవు; స్వయంప్రకాశమానుడవై పుణ్యపాపలేపరహితుడవై సత్త్వరజస్తమోగుణములను వశపఱచుకొనియుండు నీకు నమస్కారము. సర్వము నొకేమారు తెలుసుకొను సామర్థ్యము కలిగి స్వర్గాదిలోకములను పుణ్యభోగభూములుగా నిర్మించియుండు సదాశివుఁడవు;

సద్యోజాత వామదేవ అఘోర తత్పురుష ఈశాన పంచముఖములతో నొప్పారుచు గాయత్రీమంత్రగతుండైన సూర్యుని మించిన తేజస్సు గలిగి భక్తుల కానంద మొదవఁజేయువాడవు;

ఇందుకు ప్రమాణము

శ్లో॥ దేవస్య సవితుర్మధ్యే - యో భర్గో నో ధియః స్వయమ్ ।
ప్రచోదయా త్తద్వరేణ్యం - శరణ్యం సముపాస్మహే ॥

సూర్యదేవునిలో నివసించుచు మా బుద్ధులను మంచివైపునకు మరల్చువాడు సర్వశ్రేష్ఠుఁడు శరణాగతరక్షకుఁడు నగు మహేశ్వరు నుపాసించుచున్నామని గాయత్రీమంత్రార్థము.

త్రిపురాసురులకు భయపడియున్న మమ్ము కృతార్థుల నొనర్చితివి; అటులే త్రిపుర దైత్యులను దహించితివి. ప్రస్తుతముఁగూడ మమ్ము రక్షించుము!

ఇవ్విధము బ్రహ్మాదిదేవతలు వినమ్రులై నుతించుటయే గాక "మహాదేవా! నీ యందెల్లకాలము నాకు నవిచ్ఛిన్నభక్తి యుండుగాక" అని విధి ప్రత్యేకముగా ప్రార్థించెను.

అంత నారాయణుఁడును "దీనబంధో! కృపాసముద్రా! పరమేశ్వరా! అనుగ్రహింపుము!

శ్లో॥ భక్తి ప్రియాయ శాంతాయ - శివాయ పరమాత్మనే ।
సదాశివాయ రుద్రాయ - జగతాం పతయే నమః ॥

భక్తిప్రియుఁడువు; శాంతస్వభావుడవు; సాయుజ్యప్రదాతగా శివుఁడవై అనుగ్రహకారకుఁడుగా సదాశివుఁడవై నిగ్రహనిదానముగా రుద్రుడవై విరాజిల్లు పరమాత్మవు;

జగమును శాసించు మహేశ్వరా! మ్రొక్కులిడుచున్నాను. నీయందు నాకు భక్తి దృఢమై దినదిన ప్రవర్ధమాన మగు గాక!" అని విన్నవించెను.

పిదప నమరులును భయభీతులై "పరమేశ్వరా! మేమందరము నిన్నెల్లపుడు సేవించుచు భక్తులమై యుందుము గాక! ప్రసన్నుడవుకమ్ము!" అని వేడుకొనిరి.

అంత నా దేవదేవుఁడు ప్రసన్నవదనాంబుజముతో మందస్మితముఁజేయుచు "ఏమి కావలెనో అడుగుడ"ని వక్కాణింపగా నవ్వారు "మహాదేవా! ఇకముందిట్టి సంకటములు సంభవించిన ప్రతిసమయమందును సాక్షాత్కరించి మా దుఃఖమును నివారించు"మని యాచించిరి.

భగవానుఁడు వారి ప్రార్థన నాలకించి "తథాస్తు" అని యభయ మొసఁగుటయే గాక మీరు చేసిన స్తోత్రమును చదువువారికి వినువారికి నభీష్టములు సిద్ధించునని వచించెను. మరియు వారివారికి ప్రియములైన వరముల ననుగ్రహించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ"మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదునొకండవ యధ్యాయము.

## ద్వాదశాధ్యాయము

### (దేవతలు తమతమ నిలయములకుఁజనుట)

శంకరుని యనుగ్రహమునఁజేసి బాణాగ్నియందు దహింపని మయుఁడను రాక్షసుఁడచ్చోటికేతెంచి శివునకు భక్తితో ప్రణామంబు లాచరించి హరిబ్రహ్మాదులకును నమస్కారముల సమర్పించి యిట్లు ప్రార్థించెను.

"భక్తవత్సలా! మహాదేవా! ఎట్టి పక్షపాతములేనివాడవై కల్పవృక్షమువంటి స్వరూపము గలిగియుండువాడువని భావించుచున్నాను. నిన్ను సేవించువారి యిడుములను పోగొట్టు వాడవు; యోగ్యములగు కోర్కెల నీడేర్చువాడవు; పార్వతీప్రాణనాథా! నిన్ను నుతించుటకు నే నెంతటివాడను; శరణాగతుడ నగు నన్ను ప్రసన్నుడవై రక్షించుము!

"మయా! అపేక్షితము నడుగుము! ఇచ్చెద"నని శంకరుఁడు వక్కాణింపగా "దేవా! శాశ్వతమైన భక్తి నీ యందుండునట్లు, నీ భక్తులతో చెలిమియు నిన్ను ద్వేషించు దుర్మార్గుల యందు నుపేక్షాభావమును ఆసురీ సంపద యెన్నటికిని కలుగకుండునట్లు" ననుగ్రహింపుమని మయుఁడు ప్రార్థించెను.





అంత శంకరుఁడు – మయా! నా భక్తుడవై ఎట్టి భయంబు లేక నుండుము! నీ కోరిన వరముల నన్నిటి నొసగితిని. స్వర్గమున కంటెను రమ్యంబగు వితలలోకంబునకుఁ జని యచ్చోట నిజపరివారముతో గూడ నివసింపుము! అని వక్కాణించెను.

త్రిపురాసురులకు బౌద్ధమతము నుపదేశించిన బోడితలల సాధువులు నచటికేతెంచి హరిబ్రహ్మాదులకు వందనముల నిడియు నిట్లు విన్నవించిరి. "దేవతలారా! మేమెక్కడికి వెళ్ళవలెను? ఎట్టి పనిఁజేయవలెను? ఈ వరకు శివభక్తులైన త్రిపురాసురుల సన్మార్గమును చెడగొట్టి పాపము నొడిగట్టుకుంటిమి. ఇందుకు కోటికల్పములవరకు మాకు నరకనివాసము కావచ్చును. శివభక్తిని విరోధించువారి యుద్ధారము కాజాలదని తోచెడిని. కాని మీ యభిప్రాయము ననుసరించియే మేమీ దుష్టప్రచారమును చేసితిమి. అందువలన నా దోషము శమించు విధానమును బోధింపుడు!

అంత విష్ణుబ్రహ్మాద్యమరు లవ్వారి మాటల నాలకించి "సాధువులారా! భయపడవలదు! శివాజ్ఞావశముననే కర్తవ్యమును నెరవేర్చితిరి కావున మీకు నరకదుర్గతులు సంభవింపవు. దేవతలకు ఋషులకును హితముఁజేయు శివభక్తులగుటచే మీ కెన్నటికిని కీడు కలుగనేరదు. కాని యొక శాసనముఁ జేయుచున్నారము.

శ్లో॥ అద్యతో మత మేతం హి - ప్రవిష్టానాం నృణానం కలౌ ।
కుగతి ర్భవితా బ్రూమః - సత్యం నైవాత్ర సంశయః ॥ ౩౦

ఇకముందు కలియుగమున బౌద్ధమతమును పొందు మానవులు దుర్గతుల పాలగుదురు. ఇద్ది యథార్థము. ఇందెంతమాత్రము సంశయము లేదు. కలియుగము వచ్చువరకు మీరందరు పర్వతముపై నివాసము నేర్పరచుకొనుడు! కలియుగ ప్రారంభముకాగానే ప్రజలు మోహితులై మీ మతమును స్వీకరింతురు." అని వచింపగా నవ్వారు హరిబ్రహ్మాదులకు ప్రణమిల్లి తమ నివాసమునకుఁజనిరి.

అంత మహాదేవుఁడు బ్రహ్మాదులు ప్రశంసించుచుండగా తన గణములతోడను పార్వతీదేవితోడను వీరభద్ర కుమార గణపతులతోడ నంతర్ధానముఁజెందినవాడు. అనఁగా కైలాసము నలంకరించెనని భావము. తరువాత ధనుర్బాణ రథాది పరికరములన్నియు మాయమయ్యెను.

శంకరుఁడు కరుణాళువై త్రిపురములను దహించి లోకకల్యాణము నొనఁగూర్చినాడని హరిబ్రహ్మాలు దేవ గంధర్వ కిన్నరులు నాగజాతివారు సర్పములు నప్సరసలు మానవులును సంతసించినవారై శంకరుని కీర్తిని గానముఁజేయుచు తమ తమ నివాసములకుఁజని మిగుల సంతృప్తిఁజెందియుండిరి.

గొప్ప లీలావైభవముతో కూడిన నీ త్రిపురాసుర సంహార చరితమును చెప్పినాడను. ఇది వినువారిని ధన్యులఁజేయునదేగాక కీర్తికరంబై దీర్ఘాయుఃప్రదంబై ధనధాన్య సమృద్ధిఁ గలుగఁజేయును. స్వర్గమును మోక్షమును గూడ నొసగును.

ఈ యాఖ్యానమును చదువువారు వినువారు నీ లోకమున సమస్తసుఖముల ననుభవించి యంత్యకాలమున మోక్షము నొందుదురు అని సూతుఁడు విరమించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములో పండ్రెండవ యధ్యాయము.





## త్రయోదశాధ్యాయము

### (జలంధరుని సంహరించు కథా సందర్భమున దేవేంద్రుని బ్రతికించుట)

సూతమహర్షి శౌనకాదిమునులను గురించి పూర్వము సనత్కుమారుఁడు వ్యాసులకు చెప్పినట్లు వక్కాణింపఁదొడఁగెను.

ఒకప్పుడు దేవేంద్రుఁడు బృహస్పతియు మిగుల భక్తిగలవారై శంకరుని దర్శింపఁగోరి కైలాసమునకుఁ జనినవారు. అట్టితతీ వారిరువురి విజ్ఞానశక్తిని పరీక్షింపఁదలచి శంకరుఁడు ఒకానొక దిగంబర రూపముతో శిరస్సునిండ జడలుగలవాడై కైలాసోపరిమార్గము నడ్డగించియుండెను. మార్గమధ్యమున అద్భుత స్వరూపముగల యా మహాపురుషుని గాంచిన ఇంద్ర బృహస్పతులకు గొప్ప తేజస్సుగల శాంతవదనము, శుద్ధస్ఫటిక శరీరకాంతియు, దీర్ఘములైన భుజములు, విశాలవక్షః స్థలంబును గల యాకారము అచ్చెరువు నొదవఁజేయుచుండెను.

అంత పురందరుఁడు స్వాధికారమదమున "నీ వెవడవు? ఎక్కడినుండి వచ్చియున్నావు? పేరేమిటి? నిజమైన సమాధానముఁ జెప్పుము! శంకరుఁడు తన నివాసమునందే యున్నవాడా? ఎచ్చోటికైన వెళ్ళినాడా?" అని ప్రశ్నింపగా నా భేతాళుఁడు ఎట్టి సమాధానము నొసగకుండెను. ఇంద్రుఁడు మరల మరల ప్రశ్నించిన నవ్వాని విజ్ఞానమును పరీక్షింపఁదలచి దిగంబరుఁడు ప్రత్యుత్తరము నీయనందున కోపోద్రిక్తుడై తాపసుని సంహరింప వజ్రాయుధమును లేవనెత్తెను. శంకరుఁడు ఇంద్రుని వజ్రాయుధముఁ దగు ప్రయోగమును హస్తముతో కూడ స్తంభింపఁజేయగా పాకశాసనుఁడు లోలోన క్రోధమున మండిపడుచు మంత్రప్రయోగముచే మరుగుపడిన పరాక్రమముగల సర్పరాజమువలె బాధపడుచుండెను.

అంత రుద్రుఁడును క్రోధావిష్టుడై భయంకర నేత్రములతో ప్రజ్వరిల్లుచుండెను. బృహస్పతి యట్టి పురుషుని శంకరునిగా గుర్తెరిగి రెండు చేతులు జోడించియు సాష్టాంగ నమస్కారము నిడి యిట్లు ప్రస్తుతించెను.

శ్లో॥ నమో దేవాధిదేవాయ - మహాదేవాయ చాత్మనే ।
మహేశ్వరాయ ప్రభవే - త్ర్యంబకాయ కపర్దినే ॥ ౨౨

అమరులను శాసించు మహాదేవునకు పిపీలికాదిబ్రహ్మపర్యంతము జీవాత్మలలో నంతర్యామిగా నుండు మహేశ్వరునకు చరాచర ప్రాణులను రక్షించు ప్రభువునకు మూడు గుణములు మూడు లోకములు మూడు కృత్యములు మూడు మూర్తులు ఇత్యాది త్రిసంఖ్యాకముల ప్రతీకములుగా మూడు కన్నులుగల జటజూటునకు నమస్కారము.

అగ్ని వాయువు ఆకాశము ఉదకము భూమి సూర్యచంద్రులు నక్షత్రములు సమస్త జ్యోతిశ్చక్రంబును నీ స్వరూపములేగదా! విష్ణుబ్రహ్మరుద్రాది రూపములఁదాల్చి జగత్కార్యములను నెరవేర్చువాడవని సనకాదిమునులు నారద మహర్షియు ప్రశంసించుచుందురు. సూర్యుఁడు తపించుటయు చంద్రుఁడు





అమృతమును వర్షించుటయు వాయువు వీచుటయు మేఘములు జలమును కురిపించుటయు ఇంద్రుఁడు ముల్లోకములను రక్షించుటయు నిన్ను ధ్యానించుట వలనను నీ భయము వలనను కొనసాగుచున్నవి.

శ్లో॥ త్వత్పాదకమలస్యైవ - సేవనా ద్భుని మానవాః ।
నాద్రియంతే సురా న్రుద్ర - లోకైశ్వర్యం చ భుంజతే ॥ 36

మానవులు నీ చరణకమలమును సేవించుటవలననే అనఁగా లింగస్వరూపము నారాధించుటవలననే హరిబ్రహ్మాది దేవతలను పూజించుటలేదు. ఐనను భూలోకమున తమ జీవితమున్నంతవరకు ఇంద్రాది లోకపాలురతో సమానముగా వైభవముతో ధనధాన్య పుత్ర కళత్రాది సమృద్ధితోడను జీవించి చివరన నీ సన్నిధి నేతెంచుచున్నారు. మరియు నిన్నారాధించుటవలన యోగులకును పొంద నలవిగాని పరమ (శివ) పదము నొందుచున్నారు.

ఇవ్విధము ప్రార్థించి బృహస్పతి–శంకరుని పాదములపై ఇంద్రుని పడవేసి "దీననాథా! దేవేంద్రుని కాపాడుము! నీ ఫాలనేత్రమునుండి బయలుపడు క్రోధాగ్నిని శాంతింపఁజేయుము!" అని వేడుకొనఁగా కరుణామయుఁడు ప్రసన్నుఁడై "బృహస్పతీ! పాము తాను విడచిన కుబుసమును మరల ధరింపనట్లు నా ఫాలనేత్రాగ్నిని ప్రశమింపఁజేయఁజాలను." అని వక్కాణించెను.

అంత బృహస్పతి దీనుఁడై మహాదేవా! భక్తవత్సలుడవు కావున నీ ఫాలాగ్నిని మరియొకచో పడవేసి ఇంద్రుని రక్షించు" మని ప్రార్థింపగా శంకరుఁడు ప్రసన్నుఁడై "నీ చేసిన స్తోత్రమునకు సంతసించితిని. ఇంద్రునికి జీవము నిప్పించినాడవు కావున నిప్పటినుండి "జీవు"డను పేరు నీకు ప్రసిద్ధంబగుగాక! ఈ యగ్ని యింద్రుని బాధింపకుండునట్లు పారవేయుదు" నని చెప్పి ఫాలనేత్రమునుండి యగ్నిఁదీసి తన చేతిలో పట్టుకొని లవణసముద్రము నందు పడవేసి యంతర్ధానముఁ జెందినవాడు.

ఇంద్ర బృహస్పతులు భయము వీడి యూఱటఁజెందియు "ఏ భగవానుని దర్శనమునకై మన మిచ్చోటి కేతెంచితిమో అట్టి పరాత్పరుఁడు సాక్షాత్కరించెను కావున ధన్యులమైతి" మని భావించుచు తమ స్వర్గలోకమునకుఁజని సుఖముగా నుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదిమూడవ యధ్యాయము.





# చతుర్దశాధ్యాయము

## (జలంధరుఁడు జన్మించుట, వాని వివాహమున్ను)

తరువాత జరిగిన వృత్తాంతమును తెలుపుమని శౌనకాదులు ప్రశ్నింపగా సూతుఁడు చెప్పఁదొడఁగెను.

శివుని లీలావిలాసము అద్భుతంబైనది. ఇద్దానిని శ్రద్ధాభక్తులతో వినువారు యోగులు పొందెడి పరమ పదము నొందుదురు.

శంకరునిచే పడవేయఁబడిన ఫాలనేత్రాగ్నిహోత్రము లవణసముద్రమున తత్కాలముననే బాలుఁడాయెను. గంగాసాగర సంగమమున నా బాలుఁడు హెచ్చుగా నేడ్చుచుండ భూనభోంతరములనిండ రోదనధ్వని వినఁబడుచుండెను. అందువలన భూమి కంపించుటయు స్వర్గసత్యలోకనివాసులు చెవిటివారగుటయు లోకపాలురు భయపడుటయు ప్రాణులందరును జడియుటయు చరాచరమంతయు కదలుటయు కారణములుగా అమరులు మునులును లోకగురువు పితామహుండునగు బ్రహ్మదేవునిఁ జేరి ప్రణమిల్లియు "దేవా! గొప్ప భయము తటస్థించినది. అద్దానిని దూర మొనర్పుము!" అని ప్రార్థించిరి.

అంత బ్రహ్మదేవుఁడు ఇదేమిటని యాశ్చర్యపడుచు సత్యలోకమునుండి భూలోకమునకు నవతరించి బాలుడు నివసించు సముద్రముఁజేరియు బాలుని సముద్రుని తొడపై నవలోకింపగా సముద్రుఁడు నమస్కరించి బాలుని బ్రహ్మయొడిలో కూర్చుండఁజేసెను.

అంత బ్రహ్మ "సముద్రా! ఈ బాలుఁడెవనివాడో త్వరగా చెప్పు" మని యడుగగా సముద్రుఁడు వినమ్రుడై యంజలిఁ ఘటించి "దేవా! సింధు గంగాసంగమమున నీ బాలుని హఠాత్తుగా చూచితిని. వీడెవడో ఎక్కడివాడో తెలియకున్నాను. ఐనను వీనికి జాతకర్మాది సంస్కారములను విధియుక్తముగా నొనర్చి జాతకఫల విశేషములను పేర్కొనుము!" అని విన్నవించెను.

ఇంతలో నా బాలుడు బ్రహ్మదేవుని మెడను గట్టిగా పట్టుకొని పీడించినందున యాతని కన్నులనిండ నీరుఁ గ్రమ్మినది. ఎట్టకేలకు వాని పట్టు విడిపించుకొని బ్రహ్మదేవుఁడు "వీని కారణముగా నేను కన్నులలో నీరు నిలుపుకుంటిని గావున "జలంధరు" డను పేరు వెలయుగాక! ఇప్పుడే వీడు యువకుడై సర్వశాస్త్రముల సారమును గుర్తెరిగి గొప్ప పరాక్రమము కలిగియుండుటేగాక యుద్ధమున నేరికిని గెలువనలవిగానివాడగును. నీవలె గంభీర స్వభావుఁడును కుమారస్వామివలె యుద్ధనిపుణుఁడును సకలసంపదలతో తులదూగువాడును రాక్షసులందరికి ప్రభువుగా నుండును. ఒకప్పుడు విష్ణుమూర్తిని గూడ పోరు నోడించును. శంకరుఁడు దక్క నితరులెవరును వీనిని వధింపజాలరు. వీనికి కాబోవు భార్య – సర్వాంగసుందరియై సౌభాగ్యమును పెంపొందించునదై ప్రియవాక్య శీలములు గలదై పతివ్రతగా నుండును అని వచించి శుక్రాచార్యుని రప్పించి జలంధరుని దైత్యాధిపతిగా పట్టాభిషేకమును చేయించియు సముద్రుని మందలించి యంతర్ధానముఁ జెందినవాడు.





అంత సముద్రుఁడు జలంధరుని చూచుటను కన్నుల పండువుగా భావించుచు వానిని తన యింటికి తోడ్కొని యనేక విధములుగా పోషించుచుండెను. తరువాత నొక్కనాడు కాలనేమియను రాక్షసరాజును పిలిపించి యాతని కుమార్తెయగు బృందను జలంధరున కొసగుమని సముద్రుఁడు యాచింపగా కాలనేమి సముద్రవాక్యము నుచితముగా తలచియు ప్రాణముల కన్న మిన్నయగు తన కుమార్తెను వీరుడైన జలంధరునకు యథావిధి సమర్పించెను.

సముద్రుఁడు తనకు పుత్రతుల్యుడైన జలంధరుఁడు వివాహితుడై భార్యతో కూడియున్న సందర్భమువలన మిగుల సంబరపడుచు సద్బ్రాహ్మణులకు ఇతరులకు ననేకవిధ ధనకనకాది దానముల నొసగెను. అట్టి సమయమున గొప్పవేడుకగా నుండెను. నదీనదములన్నియు సుఖముగా తృప్తిఁ జెందుచుండెను.

పూర్వము దేవతలచే నోడింపఁబడిన దైత్యులందరును పాతాళమునుండి నిర్భయముగా భూమండలమున కేతెంచి జలంధరు నాశ్రయించిరి. కాలనేమి మున్నగు మహారాక్షసులు జలంధరుని యండగా నమరులనోడింపవచ్చునని మిగులనుత్సాహముతో నుండిరి. జలంధరుఁడును మహావీరుఁ డగుటచే శుక్రాచార్యుని యనుగ్రహమున రాజ్యమును చేయుచుండుటేగాక నతిలోక సుందరియగు బృందాదేవితో సుఖముగా నుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదునాలుగవ యధ్యాయము.

## పంచదశాధ్యాయము

### (దేవతలతో జలంధరుఁడు పోరాడుట)

ఒకప్పుడు జలంధరుఁడు తన కొలువు కూటమున భార్యతోడను పరివారముతోడ నుండగా తేజోరాశియనఁదగిన శుక్రాచార్యుఁడు అచ్చోటికేతెంచగా నతనికి జలంధరుఁడు తదితరదైత్యులందరును మ్రొక్కులిడిరి. శుక్రాచార్యుఁడు వారందరి నాశీర్వదించి రమ్యమైన పీఠముపై నాసీనుఁడుకాగా జలంధరుఁడు సభ నంతయు పరికించుచు తలకాయలేని రాహువును గాంచి "ఆచార్యా! ఈతని శిరస్సు నెవరు ఖండించినారో సమాచారము నంతయు వడిగా చెప్పు" మని శుక్రాచార్యుని ప్రశ్నించెను.

అంత శుక్రాచార్యుఁడు "మహావీరా! జలంధరా! జరిగినదిజరిగినట్లుగా పూర్వవృత్తాంతమును చెప్పెదను. వినుము! హిరణ్యకశిపుని మునిమనుమడును విరోచనుని కుమారుఁడునగు బలిచక్రవర్తి దేవతల నోడింపగా వారు రమానాథు నాశ్రయించిరి. నారాయణుఁడు బలిచక్రవర్తితో సంధిఁజేసుకొనుడని చెప్పినందున నమరులు బలి మొదలగు దైత్యులతో సంప్రదించి యమృతమునకై సముద్రమును మథించిరి. అంత నా సముద్రము నుండి యుద్భవించిన కల్పవృక్షకామధేన్వాదుల నమరులు పరిగ్రహించుటయే గాక అమృతమునుగూడ కపటమార్గమున గ్రోలినవారు. అప్పుడుదేవతల వరుసలోచేరి యమృతమును త్రాగు రాహువుఁదగు శిరస్సును దేవపక్షపాతియగు హరి ఖండించెను." అని వక్కాణించెను.





జలంధరుఁడు - రాహుశిరశ్ఛేదమును గురించియు తన జనకుఁడగు సముద్రుని మథించుటఁ గూర్చియు మిగుల యాక్రోశముఁజెంది ఘస్మరుఁడను దూతను పిలిపించి దేవేంద్రుని కడకు నంపగా ఘస్మరుఁడు స్వర్గముఁజేరి యింద్రుని సమీపించి యిట్లు వచించెను.

సర్వరాక్షసాధిపతియు సముద్రతనయుఁడు నగు జలంధరప్రభువు - శుక్రాచార్యుననుమతిని రాజ్యమును చేయుచున్నవాడు. నే నాతని దూతనై నీకడకేతెంచితిని. జలంధరుని శాసనమును ముల్లోకములయందలి ప్రజలు శిరసా వహించుచున్నవారు. దైత్యుల శత్రువులగు దేవతల నోడింప సమకట్టి చెప్పిపంపిన సందేశము నాకర్ణింపుము!

నా తండ్రియగు సముద్రుని పర్వతముతో తఱచి యందలి రత్నములనన్నిటి నెందుకు పరిగ్రహించితివి; ఇద్ది యనుచితముగదా! ఐన నారత్నములను మాకు సమర్పించి దేవతలందరితో కూడ శరణాగతుడవగుము! లేకున్నచో నీ రాజ్యమును కైవసము జేసుకొని గొప్ప బాధను కలిగించెదను. నే చెప్పినదంతయు ముమ్మాటికి నిజమని భావింపుము!

అంత దేవేంద్రుఁడు ఘస్మరుని మాటలకు విస్మయముఁజెందుచు భయము క్రోధంబు గలవాడై జలంధరుని పరాక్రమమును మనంబునఁ దలచుచు నిట్లు ప్రత్యుత్తరము నొసఁగెను.

పర్వతములు నాకు జడిసినపుడు సముద్రుఁడు తనలో నవ్వానిని దాచుకొనుటయే గాక నా శత్రువులైన దైత్యులనెందరినో కాపాడినవాడు. అందువలన సముద్రములోని రత్నముల నన్నిటిని పరిగ్రహించితిని. నన్ను ద్వేషించువాడు జగమున సుఖముగా నుండఁజాలడని గ్రహింపుము! పూర్వము శంఖుడను రాక్షసుఁడు సముద్రమున నుదయించి నాతో వైరముఁబూనియు మూర్ఖస్వభావము గలవాడై సత్సహవాసమును విడనాడినందున నా తమ్ముడగు హరి వానిని వధించెను.

కావున ఘస్మరా! యీ సమాచారమునంతనయు జలంధరునకు నివేదింపుము!

అంత ఘస్మరుఁడు వడిగా వెళ్ళి జలంధరుఁ జేరి దేవేంద్రుని సమాధానమును నివేదింపగా జలంధరుఁ డదియంతయు విని క్రోధవశమున పెదవిఁగొఱుకుచు దేవతల నందరి నోడింప నుద్యుక్తుఁడయ్యెను.

అట్టితఱి పాతాళమునుండి యితర ప్రాంతముల నుండియు కోట్లకొలది దైత్యులరుదెంచగా జలంధరుఁడు శుంభనిశుంభాది మహావీరులను వెంటనిడుకొని దైత్యులందరితోడ స్వర్గముపై దండెత్తఁ జనుచుండెను.

స్వర్గప్రాంగణమున నందనవనమునందు విడిసి శంఖమును పూరింపగా వీరులందరు సింహనాదములఁజేయుచుండిరి. శత్రువుల యాటోపమును గమనించి యమరులు నమరావతి నుండి యుద్ధోద్యుక్తులై బయలువెడలుచుండిరి.

రోకండ్రతో లాటీ కఱ్ఱలతోడను బాణములతో గొడ్డండ్రతో గుదియలతో శక్తుల తోడను దేవదానవులు ఘోరమైన పోరాటమును చేయుచుండగా నుభయసైన్యములును నెత్తురుఁదగు ప్రవాహము గలవయ్యెను. గజములు అశ్వములును క్రిందపడుచుండినవి. రథములు నేలఁగూలుచుండినవి. పాదచారులు





సొమ్మసిల్లుచుండిరి. రణప్రదేశమంతయు సంధ్యాకాలమున మేఘసమూహాముతో వ్యాపింపఁబడిన ఆకసమువలె విరాజిల్లుచుండెను.

రణరంగమృతులగు దైత్యులను శుక్రాచార్యుఁడు బ్రతికించుచున్నందున బృహస్పతియు ద్రోణపర్వతమునుండి దివ్య ఓషధులను తెప్పించి దివిషదులను జీవింపఁజేయుచుండెను. ఇది యంతయు గమనించి జలంధరుఁడు ఆవేశపడుచు "అచార్యా! సంజీవినీవిద్య తమ వద్దనే కలదనియు ఇతరులచెంత లేదనియు వింటిని. కావున దేవతలు హతులై మరల జీవించుచున్నారెట్లు?" అని ప్రశ్నింపగా శుక్రాచార్యుఁడు బృహస్పతి ద్రోణాద్రినుండి యోషధులను తెప్పించి యవ్వానితో త్రిదశులను బ్రతికించుచున్నాడు. కావున నోదైత్యరాజా! నీవు వేగమే ద్రోణాద్రిని పడవేయుము" అని వచించెను.

అంత జలంధరుఁడు వడిగా పయనించి తన బాహువులతో నా కొండను పెకిలించి సముద్రమున పారవేసినవాడు. ఇట్టి కార్యము హరుని తేజస్సునఁ బుట్టిన వారికి సాధ్యమే కావున మనము ఆశ్చర్యపడవలసిన యవసరము లేదు.

జలంధరాసురుఁడు మరల రణరంగమున కేతెంచి యమరులను నానావిధ అస్త్రశస్త్రములతో కొట్టుచుండగా నవ్వారు నేలఁగూలుచున్నందున సురాచార్యుఁడు నోషధులకై ద్రోణాద్రిఁజేర నద్ది నదృశ్య మగుటను గమనించి త్వరగా సురలఁజేరి భయవ్యాకులమానసమున "దేవతలారా! పారిపొండు! ద్రోణాచలము సముద్రముపాలైనది. ఇట్టి విపత్సమయమున బలవంతుడైన జలంధరు నోడింప వలను కాదు." అని వక్కాణించుచు లోగా దేవేంద్రుఁడు గావించిన శివాపచారమును తలచుకొనుచుండెను.

అంత నింద్రాదులు జడియుచు దశదిశలకు పాఱఁజొచ్చిరి. జలంధరుఁడిది యంతయు గమనించి పురుహూతుని రాజధానియగు నమరావతీ పట్టణమునఁ బ్రవేశించినందున నమరులు మేరుగుహయందు నివసింపఁజనినవారు.

జలంధరుఁడు స్వర్గమున నాయా పదవులయందు శుంభనిశుంభాది మహావీరులను నెలకొలిపి యమరులు దాగియున్న మేరుపర్వతగుహను సమీపించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదునైదవ యధ్యాయము.

## షోడశాధ్యాయము

## (విష్ణుమూర్తి జలంధరునితో పోరాడుట)

జలంధరాసురుఁడు మరల తమను చేరుటఁజేసి ఇంద్రాది దేవతలు భయపడుచు నటనుండి వేగమే వైకుంఠమునకు వెళ్ళి నారాయణు నిట్లు ప్రార్థించిరి.

దేవా! మత్స్యావతారమున వేదముల నుద్ధరించితివి. దేవదానవులు సముద్రమథనముఁ జేయుచున్నపుడు మందరపర్వతమును కూర్మావతారమున మోసితివి. వరాహావతారమున ప్రజల

కాధారమగు భూమిని శిరంబున ధరించితివి. ఉపేంద్రుండను పేరుగలవాడవై వామనావతారమున బలి చక్రవర్తిని మోసగించి మమ్ము రక్షించితివి. పరశురాముడవై దురహంకారులైన క్షత్రియులం దునుమాడి మాతాపితరులను సేవించితివి. మర్యాదాపురుషోత్తముడైన శ్రీరాముడవై సీతాపాణిగ్రహణము నొనర్చి రావణాసురుని సంహరించితివి. శ్రీకృష్ణుడవై శివజ్ఞానమును మనసునందు నింపుకొని రాధాదేవితో విహరించుచు పలురకములైన లీలా విలాసములను చూపెట్టితివి. బుద్ధావతారమున లోకకల్యాణార్థమై వేదశాస్త్రతిరస్కార గర్భితంబగు మతమును దుష్టుల కుపదేశించితివి. కల్కియవతారమున మ్లేంఛులను ఖండించి ధర్మమును నెలకొలిపితివి. కపిలాచార్యుడవై దేవహూతికి సాంఖ్యయోగమును బోధించితివి. పరమహంస స్వరూపుడవై హృదయము ప్రసన్నమగునట్లు జ్ఞానప్రభోదమును కలిగించువాడవు; ప్రాణు లందరి హితమునకై వేదవ్యాస రూపమున వేదములను విభజించి పురాణములను రచించితివి; నీ భక్తుల యిడుములను తొలగించి సుఖము నొనంగూర్చువాడవు;

శ్లో॥ పీతాంబరాయ హరయే - తార్క్ష్యయానాయతే నమః ।
సర్వక్రియాయైకకర్త్రే - శరణ్యాయ నమోనమః ॥ ౧౭

పచ్చని పట్టుధోవతిం గట్టుకొని శంఖచక్రగదా ఖడ్గములను ధరించి గరుత్మంతునిపై నధిష్ఠించియు లోకకళ్యాణ కార్యక్రమముల నన్నిటిని సాధించు ఏకైక కర్తకు శరణాగత రక్షణ బిరుదాంకితుండగు హరికి ప్రణామంబులాచరించుచున్నాము. దైత్యులచే బాధింపబడు దేవతల దుఃఖమును నివారించువాడవు. ఆదిశేషుని పడకగా జేసుకొని యుండువాడవు; జగచ్చక్షువులగు సూర్యచంద్రులే నేత్రములుగా కలవాడవు; కృపాసముద్రా! లక్ష్మీపతే! శరణాగతులమైన మమ్ము రక్షించుము! జలంధరుండు మమ్ము స్వర్గమునుండి వెడలగొట్టినాడు; సూర్యచంద్రులను అగ్నిని పారంద్రోలినవాడు. పాతాళమునుండి నాగరాజును సంయమినీ నగరమునుండి యమధర్మరాజును తొలగించినవాడు. భూలోకమున మానవులవలె దేవతలు ఇటునటు సంచరించుచున్నవారు. ఇట్టితతి యా రాక్షసుని సంహరించి మమ్ము కాపాడవలసిన భారము నీదేయని విన్నవించుచున్నాము.

అంత మహావిష్ణువు - అమరులారా? భీతిల్లకుడు! రణరంగమునకుంజని జలంధరునితో యుద్ధము నొనర్తును" అని వక్కాణించి కుందుచున్న మనంబున వేగమే గరుడారూఢుడై పయనింపనుండగా లక్ష్మీదేవి కన్నీరుకారుచుండ నంజలింఘటించి "నాథా! నేను నీ ప్రియురాలను భక్తురాలనుగదా! ఇట్టి నా సోదరుండగు జలంధరుని వధింపవలదని ప్రార్థించెను.

"అమరులు శరణాతులై ప్రార్థించినందున జలంధరునికి యుద్ధమున నా పరాక్రమును మాత్రము చూపెట్టుదును. శివాంశసంభూతుడగుటను బ్రహ్మదేవుని వాక్యముంబట్టియు నీయందలి యనురాగ వశమునను జలంధరుని నేను సంహరింపంజాలను." అని లక్ష్మీదేవికి సమాధానముంజెప్పి దేవేంద్రాదుల వెంటనిడుకొని జలంధరుని సమీపించి సింహనాదముంజేయుచుండెను. ఆ సమయమున గరుత్మంతుని రెక్కల గాలికి ఆకసమున మేఘములంబోలె రాక్షసులు కొట్టుకొనిపోవుచుండిరి.

ఇంతలో జలంధరుండు క్రుద్ధుడై విష్ణువునకెదురురాగా నారాయణుని ప్రభావముం దగు బలమున దేవతలు నూతనోత్సాహబలసంపన్నులై దైత్యులతో పోరుచుండిరి. అంత జలంధరుండు తన సైనికుల





నాజ్ఞాపింపగా కోట్లకొలది మహావీరులుశుంభనిశుంభులును గజాశ్వరథపదాతిబలములతో కూడుకొని గదలతో ఖడ్గములతో బాణములతోడను త్రిశూలములతో పట్టిశములతో చిల్లకోలలతోడను గొడ్డండ్రతోడను యుద్ధమున పాలుగొన నుభయులు నొకరి నొకరు నానావిధ ఆయుధములతో కొట్టుకొనుచుండిరి. అట్టి ఘోర సంగ్రామమును గాంచి మునులు సిద్ధులును వెఱగందుచు విజయంబమరులకే నగు గాక యని కోరుచుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదునారవ యధ్యాయము.

## సప్తదశాధ్యాయము

### (విష్ణుమూర్తి జలంధరునితో యుద్ధముఁజేయుట)

భయముతో వెఱగందుచున్న దేవతలను దైత్యులు శూలములతో గొడ్డండ్రతోడను తదితర ఆయుధములతోడను కొట్టుచున్నందున నమరులు రణరంగమునుండి పారిపోవుచుండిరి. అట్టితఱి విష్ణుమూర్తి గరుత్మంతునెక్కి ముందునకేతెంచి ప్రకాశించుచున్న చేతిని సుదర్శన చక్రమును పట్టుకొనియు శార్ఙధనుస్సు నల్లెత్రాడు కదిలించుచు గొప్పగా అఱచి నందున నా ధ్వని ముల్లోకముల నిండియుండెను. మఱియు బాణములతో కోట్లకొలది రాక్షసుల శిరంబుల ఖండించుచుండగా కొందరు గరుత్మంతుని రెక్కలందగు గాలితో ఆకసమున మబ్బులఁబోలె గిరగిర తిరుగుచుండిరి.

జలంధరుఁడిదియంతయు గాంచి కోపమున మండిపడుచు హరితో తలపడుటకేతెంచి సింహనాదముఁజేయుచుండెను. అప్పుడు విష్ణు జలంధరులకు ఘోరమైన పోరాటము జరుగుచుండుటఁ జేసి ఆకాశము బాణములతో కప్పఁబడెను. ఋషులు సిద్ధులు నేమగునోయని భయపడుచుండిరి. విష్ణుమూర్తి జలంధరుని ధ్వజమును ఛత్రమును ధనుర్బాణములను పడగొట్టి వాని ఛాతిపై బాణముతో కొట్టగా జలంధరుఁడు పట్టరానియావేశమున గుదియ (గద)తో గరుత్మంతుని తలపై కొట్టి క్రిందఁ బడవేయుటయేగాక త్రిశూలముతో విష్ణువుఁదగు వక్షస్సుపై ప్రహరించెను.

ఇవ్విధము వారిరువురును పరస్పరము ఆయుధములతో కొంతకాలము పోరాడిన పిదప నారాయణుఁడు ప్రసన్నుడై "జలంధరా! నా ఆయుధములతో నీవరకెందరో రాక్షసులు మడసిరి కాని నీవెట్టి ఆయుధమునకైనను చలింపకుంటివి. అందువలన నీవు సాటిలేని మహావీరుడవని సంతసమొదవు చున్నది. నీకేమికావలయునో అడుగుము ఇచ్చెద"నని సంభాషింపగా జలంధరుఁడు "బావా! నీవు ప్రసన్నుడవైతివి కావున నా తోబుట్టువగు లక్ష్మీదేవితో గూడ నాయింట నివసింపుము! ఇదియే నాకు వలయు వరం"బని ప్రార్థించెను.

అంత కేశవుఁడు "వీడు కోరిన వరము క్లిష్టతరమైనది" అని మననంబున విచారపడుచు అటులే నీయింటనుందునని యంగీకరించి దేవతా గణంబులతో లక్ష్మీదేవితోడను జలంధరుని పురమునకేతెంచి నివసించుచుండెను. ఆ తరువాత–

జలంధరుఁడు దైత్యుల నాదితేయుల పదవులయందు నియోగించి మరల భూలోకమున కేతెంచి దేవగంధర్వసిద్ధులచెంత వేరుచోట్లను గల రత్నము (శ్రేష్ఠవస్తువు)లను తెప్పించి స్వాధీనములఁజేసుకొనెను. పాతాళమునుండి ఆదిశేషుని భూతలమునకు రప్పించి యచ్చోట నిశుంభాసురుని నియమించెను.

అమరులను గంధర్వులను సిద్ధులను సర్పములను రాక్షసులను మానవులను తన రాజధానియందు పౌరులనొనర్చి ముల్లోకములను శాసించు జలంధరుఁడు ప్రజలను కన్నకొడుకులవలె రక్షించుచు ధర్మముఁ దప్పక ప్రవర్తించుచున్నందున నాతని రాజ్యమున వ్యాధిగ్రస్తుఁడుకాని దీనుఁడుగాని లేకుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదునేడవ యధ్యాయము.

## అష్టదశాధ్యాయము

## (దేవర్షితో జలంధరునకు సంవాదము)

ఇవ్విధము జలంధరుఁడు ధర్మముగా రాజ్యముఁజేయుచుండ నమరులు మాత్రము వాలితనము కారణముతా కొంతకాలము దుఃఖించి కర్తవ్యమూఢులై భక్తవత్సలుడైన శంకరుని మానసికముగా పలువిధములఁ బ్రార్థించుచుండిరి.

సర్వాంతర్యామియగు మహాదేవుఁడు అవ్వారి మొఱ నాలకించి నారదుని రప్పించి జలంధరుని నగరముకంపగా నారదుఁడు వేగమే యమరుల చెంతకుఁ జనుచుండెను. అంత నింద్రాదులు నారదుని రాకను కనిపెట్టి లేచినవారై ఆతఁడు రాగానే ఆసనంబునిడి నమస్కరించియు "మునివరా! శివభక్తుడవు; మా ఇడుములను పాటించువాడవు; జలంధరుఁడు మా పదవుల నపహరించి మమ్మీవిధము సామాన్యుల నొనర్చినందున మిగుల దుఃఖించుచుంటిమి. సూర్యచంద్రాగ్నులనుగూడ స్వస్థానములనుండి తొలగించినవాడు. మరియు హృషీకేశుని కదనమున మెప్పించి తనవశమునందుంచుకొనినవాడు. అందువలన మేము నిన్ను శరణము నొందుచున్నాము. దైవవశమున నిటకేతెంచినాడవు; సర్వార్థసాధకుడవగు నీవు ఇప్పట్టున జలంధరుఁడు నశించు నుపాయము నాలోచించి ప్రయత్నించు" మని విన్నవించిరి.

అంత నారదమహర్షి యిట్లు వచించెను.

అమరులారా! రాక్షసులచే పరాభవింపఁబడితిరని నాకును తెలియును. నా సాధ్యామగువరకు మిమ్ములఁగురించి ప్రయత్నింతును.

ఇట్లు దేవతలనూఱడించి జలంధరుని యాస్థానమునకుఁజనగా నారదునిరాకఁదెలిసి కొని పీఠమునుండి లేచియు మహర్షిని సముచితాసనమునఁ గూర్చుండఁజేసి మిగుల విస్మయము (ఆశ్చర్యము) నందుచు జలంధరుఁడు "బ్రాహ్మణోత్తమా! ఎక్కడినుండి ఎందుకేతెంచినదియు లోకమున నెద్దియేని మేలిమివస్తువుఁ జూచినదియు తెలుపవలయునని" ప్రశ్నించెను.





అంత నారదుఁడు "దానవేంద్రా! ధన్యుడవు; రత్నముల నన్నిటిని ననుభవించువాడవు నీవేను; నేనిచ్చోటికి వచ్చుటకు గల కారణమును తెలుపుచున్నాను.

సహజముగా కైలాస శిఖరమునకు వెళ్ళితిని. అయ్యది పదివేల యోజనముల వైశాల్యముతో కల్పవృక్ష మహావనము తోడను నూర్లకొలది కామధేనువులతోడను చింతామణుల కాంతులతోడను విరాజిల్లుచుండెను. అచ్చోటంతయు సువర్ణప్రచురముగానుండెను. ఎటఁజూచిన నద్భుతములు పొడగట్టుచుండినవి.

అట్టి శిఖరముపై ఒకానొక స్ఫటికమణిమయ భవనమున శంకరుఁడు సర్వాంగ సుందరము త్రినేత్రంబు ధవళంబు చంద్రశేఖర సంపన్నంబునగు స్వరూపముఁగలిగి పార్వతీదేవితో విలసిల్లుచుండెను. అట్టి వైభవముగల మహాదేవుని కనులారగాంచి "ఇంతటి సమృద్ధి ముల్లోకములలో నేరికైన నుండునా లేదా?" అని మదిని తర్కించుచుండగా నీ వైభవమును గూడ చూడవలెనని జ్ఞాపకముకలిగినందున నిచటికేతెంచితిని." అని వాక్రుచ్చెను.

అంత జలంధరుఁడు తనచెంతనున్న ప్రాభవమునంతయు నారదునకు చూపఁగా శివప్రేరణము ననుసరించి నారదుఁడు దివిషదుల కార్యమును మనంబునిడుకొని "నీవు ముల్లోకములనేలుచుంటివిగాన మణులు రత్నములు గజాశ్వములు తదితర రత్నంబులన్నియు నీచెంత నుండుట చిత్రము గాదని తోచెడిని. గజరత్నంబగు ఐరావతమును అశ్వరత్నంబగు ఉచ్చైఃశ్రవమును కల్పవృక్షమును నవనిధులను ఇంద్ర సూర్య కుబేరులనుండి తీసికొంటివి. అటులే బ్రహ్మదేవుని హంసయుక్త విమానంబును పరిగ్రహించితివి. ఐనను స్త్రీ రత్నము నీదెస గానంబడుటలేదు.

ఎవని యింట నితరరత్నములన్నియున్నను స్త్రీరత్నము లేనియెడల నయ్యవి వానికి రాణింపవుగదా!" అని వక్కాణింపగా స్త్రీరత్న మెచ్చోటనుండు? నని జలంధరుఁడు ప్రశ్నించెను.

అంత నారద మహర్షి "సర్వసమృద్ధులతో కూడినదియు అతిరమ్యంబునగు కైలాసమున శంకరుఁడు దిగంబరుడై బైరాగిగానుండును. ఆతని భార్య సర్వలక్షణములు కలదై సర్వాంగసుందరియై పార్వతియను పేరుతో విరాజిల్లుచుండును. ఆమెరూపము యోగులను గూడ మోహింపఁజేయునదియై సుదర్శనీయముగా నున్నందున శివునికన్న వేరొకఁడు తాదృశస్త్రీరత్నసమృద్ధి గలవాడు లేడని నాయభిప్రాయము. అమె సౌందర్యమును గాంచి చతురాననుఁడు గూడ ముగ్ధుండయ్యెను. శంకరుఁడు విరక్తుఁడైనను స్వతంత్రుఁడైనను పార్వతీదేవికి వశుండై సకలభోగముల ననుభవించుచున్నవాడు" అని వక్కాణించి ఆకాశమార్గమున నటనుండి బయలుదేరెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో పదునెనిమిదవ యధ్యాయము.





## ఏకోనవింశాధ్యాయము

### (జలంధరుని రాయబారి కైలాసమునకు వెళ్ళి మాటలాడుట)

నారదమహర్షిగారి మాట వినినంతనే జలంధరుఁడు కామమోహితుడై కాలవశమున బుద్ధిబలముఁ గొలుపోయి రాహువను దూతను పిలిచి "సర్వకార్యములను సాధించు రాహో! ప్రస్తుతము కైలాసమునకుఁ జనుము! అంట ఒకానొక జడదారి శంకరుఁడు విభూతిని పూసుకొని బైరాగివలె నుండును. అతనిఁ జేరి నిర్భయముగా నిట్లు మాటలాడుము! దయాసింధో! యోగీశ్వరా! భూతప్రేతపిశాచపరివేష్టితుడ వగు నీకు భార్యతో నవసర మేముండును? నా పరిపాలనయందిట్టి భార్యా నిరాదరణ కూడదు. కావున నీ భార్యారత్నమును సర్వరత్న భోక్తయగు నాకు సమర్పించుము! చరాచరమంతయు నాయధీనములో నున్నయది" అని యాజ్ఞాపించెను.

అంత రాహువు వేగమే కైలాసమున కేగి నందికేశ్వరుని యనుమతిని లోనఁప్రవేశించి పరమేశ్వరుని యాస్థానముఁజేరెను. అచ్చోట శంకరుఁడు తన దివ్యకాంతులచే చీకటిఁ బారద్రోలి సర్వాంగ సుందరుఁడై హారకేయూరకంకణాది దివ్యభూషణములను ధరించి మహారాజోపచారములతో సేవింపఁబడుచుండెను. అట్టి దివ్యమూర్తిని రాహువుగాంచి విస్మితుఁడై స్వాభిమానమున ప్రణమిల్లియు శంకరుని ముందు కూర్చుండి భగవానుని కనుసన్నల ననుజ్ఞఁబడసి యివ్విధము వక్కాణించెను.

దైత్యులకు పన్నగులకు ప్రభువు త్రిలోకాధిపతియు నగు జలంధరునిచే పంపఁబడి నీ చెంత కరుదెంచితిని. ఆతని వద్ద సమృద్ధులన్నియు కలవు మరియు నాతడు దేవతలకు యమునివంటివాడు. నీవైతే శ్మశానమున నివసించువాడవు; బొక్కలమాలికను మెడఁదాల్చి దిసమెలగా నుండు నీకు హిమవంతుని కుమార్తెయగు సుందరి-భార్యగా నెట్లు లభించెను? జలంధరుఁడు రత్నముల నన్నిటి ననుభవించు నధికారము కలిగియున్నవాడు. పార్వతి స్త్రీ రత్నమనఁదగును.

అందువలన నీమె యాతనినే చెంది యుండవలెను. యజ్ఞభాగములను గూడ జలంధరుఁడే స్వీకరించుచున్నవాడు. కావున నీ భార్య నాతనికి సమర్పించి సుఖముగా నుండుము!

ఇవ్విధము రాహువు వచింపుచుండగా శంకరుని కనుబొమల మధ్యనుండి యొక పురుషుఁడు ఉదయించెను. ఆతడు తీవ్రమైన వజ్రాఘాతముఁబోలిన కంఠస్వరము సింహము వంటి ముఖము కదలుచున్న నాలుకయు మండుచున్న నేత్రములు పైకినెగబారిన వెంట్రుకలును కలవాడై నృసింహామూర్తివలె కన్పట్టుచుండెను. మరియు పెద్ద శరీరముతో పొడవైన చేతుల తోడను తాటిచెట్లఁబోలు పిక్కలతోడను భయముఁగొలుపు నా పురుషుఁడు రాహువును చేబట్టి భక్షింప నుద్యుక్తుడగుచుండగా రాహువు దీనుడై "మహాదేవా! శరణాగతుడనగు నన్ను రక్షించుము! సురాసురులు నీకు మ్రొక్కుచుందురు. గొప్ప ఐశ్వర్యముగలవాడవు; బ్రాహ్మణుడనైన నన్ను తినుటకు నీ సేవకుఁడు తలపడినవాడు. ఇట్టి యాపదనుండి కాపాడుము!" అని ప్రార్థించినందున శంకరుఁడు దయగలవాడై "శరణ్యులను రక్షించుట మా విధి గావున నీతని నివిడువు" మని వక్కాణించినందునను బ్రాహ్మణుడను శబ్దము చెవిఁబడినందునను పురుషుఁడు రాహువును విడువలసివచ్చెను. తరువాత నా పురుషుడు మహాదేవునిఁజేరి "కరుణాసాగరా! నా ఆహారమును తొలగించితివి. ఆకలి మిక్కుటముగా బాధించుచున్నది. ఇప్పుడు భక్షింపవలసిన





దెద్దియో సెలవీయుము" అనివేడుకొనగా పరమాత్మ లీలా చతురుఁడగుటఁజేసి "ఆకలియెక్కువ వేయుచున్నయెడల నీ కాలుచేతులయందలి మాంసమును తిను" మని యాజ్ఞాపించెను.

అంత నా పురుషుఁడు శివాజ్ఞావశమున తన మేను నందలి మాంసమునంతయు పెకిలించి యంతయు భక్షించి తలకాయమాత్రము మిగిలినవాడయ్యెను. అందువలన శంకరుఁడు ప్రసన్నుడై "కీర్తిముఖుఁడను పేరు గలవాడవై దుర్మార్గులను శిక్షించుచు నా ద్వారము నందుండుము! నాకు మిగుల ప్రియుడవగుటఁజేసి నన్ను పూజించు వారు నిన్ను తప్పక పూజింపవలెను. ఒకవేళ నిన్ను పూజింపకున్నచో అట్టివారు మత్ప్రియులు కాజాలరు" అని వరం బొసగినందున పురుషుఁడు మిగుల ముదియుచుండెను. అప్పటినుండి కీర్తిముఖుఁడు శివాలయ ద్వారముపై నివసించుచున్నవాడు కావున శివారాధనమున కీర్తిముఖుని విశేషించి పూజింపవలెను. శివారాధనమునకు ముందు కీర్తిముఖుని పూజింపక చేయఁబడు శివపూజనము నిష్ఫలంబగునని సూతుఁడు శౌనకాదులకు వచించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పందొమ్మిదవ యధ్యాయము.

## వింశాధ్యాయము

### (ప్రమథగణములతో దైత్యుల సాధారణమగు పోరాటము)

రాహువు కీర్తిముఖునిచే బర్బరదేశమున విడువఁబడినందున నాతనికి బర్బరుఁడను పేరు ప్రసిద్ధంబయ్యెను.

అవ్విధము రాహువు కైలాసమునుండి బయలుదేరి మరల పుట్టినట్లు లోలోన భావించుచు గర్వమును పోగొట్టుకొని జలంధరుఁజేరి యాతనికి ఈశ్వరుని చేష్టితము నంతయు సవిస్తరముగా నివేదింప జలంధరుఁడు రాహువు చెప్పినదంతయు విని మిగుల కినుకఁజెంది యుద్ధమునకై తన సైనికుల నాదేశించెను.

కాలనేమి, శుంభనిశంభులు మొదలగు దైత్యవీరులతో కోట్లకొలది సైన్యముతోడను జలంధరుఁడు బయలువెడలినపుడు ఆతనిముందు శుక్రాచార్యుఁడు, తలకాయలేని రాహువు నెదురగుటయే గాక కిరీటము వడిగా జారి క్రిందఁబడెను. ఆకాశము మేఘావృతమైనదానివలె నల్లనిదయ్యెను.

మరణసూచకములగు అపశకునము లెన్నియో తారసిల్లుచుండినవి. ఇట్టి జలంధరుని యుద్ధ ప్రయత్నము నాఱసి ఇంద్రాది దేవతలు గుప్తరూపమున కైలాసమునకుఁజని శంకరునికి ప్రణామంబు లర్పించి వినమ్రులై యంజలిఘటించియు "దేవదేవా! మహాదేవా! శరణాగతులమగు మమ్ము రక్షించుము! జలంధరుని వలన మిక్కిలి బాధపడుచున్నవారము! మా యిడుములఁ గుర్తెరిగి సముద్రతనయుండైన జలంధరుని సంహరించుము! మమ్ముకాపాడుటకై నీవు నియోగించిన విష్ణువు ప్రస్తుతము తన సామర్థ్యమును గోలుపోయి జలంధరుని యింట నివసించుచున్నవాడు. మేమును జలంధరుని వశవర్తులమై వాని యేలుబడిలో కాలముఁగడుపుచుంటిమి. ఇప్పుడాదైత్యుఁడు తన సైన్యములను వెంటనిడుకొని

నీతో పోరాడుటకై వచ్చుచున్నవాడు. కావున వాని నీ తరుణమున సత్వరము వధింపుము!" అని విన్నవించి శంకరుని చరణములను దర్శించి నిలువఁబడియుండిరి.

అంత పరమేశ్వరుఁడు నారాయణుని రప్పించి "సంగరమున జలంధరునెందుకు సంహరింప కుంటివి. వైకుంఠమును విడనాడి వాని యింట నెట్లు నివసించుచున్నా" వని ప్రశ్నింపగా హరి నతశిరస్కుఁడై వినయమున నిట్లు వచించెను.

శంకరా! జలంధరుఁడు నీ యంశచే జనించినవాడగుటఁజేశియు లక్ష్మీదేవిఁదగు సోదరుండగుటను నేను వానిని వధింపఁజాలకుంటిని. కావున నీవే జలంధరుని సంహరింపుము! కదనమున వాని పరాక్రమమునకు సంతుష్టుడనై వరము నడుగు మనఁగా వాడు "లక్ష్మీదేవితో గూడ నీవు నా గృహమున నివసించు"మని కోరినందున నట్లే యంగీకరించితిని."

అంత శంకరుఁడు విష్ణువాక్యము నాకర్ణించి చిరునగవుఁజెందుచు "నారాయణా! సురలారా! నేనే ఆ దైత్యుని మడియంజేయుదును. మీరందరు ఎట్టి వెఱఁగు లేనివారై స్వస్థానములకు వెళ్ళి నిశ్చింతగా నుండుడు!" అని వాక్రుచ్చెను.

ఇంతలో జలంధరాసురుఁడు సర్వవిధసైన్యములతో కైలాసప్రాంతమును సమీపించి కాలునివలె భయంకరుఁడై సింహనాదముఁజేయగా మహేశ్వరుఁడు కోపోద్రిక్తుడై నంది మొదలగు మహావీరులను యుద్ధసన్నాహమునకై శాసించెను. గణేశుఁడు కుమారస్వామి మొదలగు గణాధిపతులు త్వరపడుచు కైలాసమునుండి దిగుచు గొప్పధ్వనులఁజేయుచుండిరి.

కైలాసపర్వతముఁదగు చేరువనేలలయందు ప్రమథగణములకు దైత్యగణములకు ఘోరమైన పోరాటము జరుగుచుండగా మరణించిన రాక్షసులను శుక్రాచార్యుఁడు సంజీవినీ విద్యాప్రభావమున జీవింపఁజేయుచుండెను.

గణము లీ సమాచారమును శంకరునకు నివేదింప నా పరాత్పరుని క్రోధమతిశయించినందున నోటినుండి గొప్పభయముఁగొలుపు "కృత్య" యను శక్తి యుద్భవించి రణరంగమున వీరవిహారముఁ జేయుచు దైత్యులఁబట్టి నమిలిమ్రింగుచు శుక్రాచార్యుని చేబట్టి తన యోనియందు భద్రపఱచి ఆకసమున కెగసినది.

అది గాంచి దైతేయులందరు జడియుచు యుద్ధరంగమునుండి పారిపోవుచుండిరి. ఉపస్థితులగు వారిని గణములు హింసించుచుండెను. అందువలన కాలనేమి, శుంభనిశుంభులు నుద్రేకపూరితులై గణములపై బాణములను వేయుచు వారి యాటోపమును కొంతవరకు తగ్గించిరి. గణములు ఖిన్నులై దిశలఁగానక మిన్నకుండిరి.

అట్టితతి నందికేశ్వరుఁడు నగజానందనుఁడు కార్తికేయుఁడను యుద్ధసన్నద్ధులై దైత్యవరుల యుద్వేగమును తొలగించి గణములకు ధైర్యమును కలుగఁజేసినవారు.

ఇయ్యది "శివవిజ్ఞాన పర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఇరువదియవ యధ్యాయము.





## ఏకవింశాధ్యాయము

### (విశేషయుద్ధ వర్ణనము)

కాలనేమి శుంభనిశుంభ దానవులు నంది గణేశ కుమారులతో ద్వంద్వయుద్ధమునకు తలపడినందున వారుభయులు నొకరినొకరు తీక్ష్ణ బాణములతో ఆయుధములతోడను అస్త్రములతోడను కొట్టుకొనుచుండిరి.

అట్టితతి వీరభద్రుఁడు కోటి భూతగణములను వెంట నిడుకొని గణేశునికి సహాయముగా రణరంగమున కేతెంచినందున భూతములు ఎగఁబడి దైత్యులను భక్షించుచుండెను. మరియు వారి నెగురవేయుచు నాట్యమాడుచుండినవి. నిశుంభశుంభకాలనేములు కొంతవరకు పోరాడి పరాజితులైనందున జలంధరుఁడు మండిపడుచు యుద్ధసన్నద్ధుడగుచున్న సందర్భమును కనుగొని రాక్షసులు మరల నిండు ధైర్యోత్సాహము గలవారగుచుండిరి. రుద్రగణంబులు నమిత ప్రోత్సాహసంపన్నులు కాగా గజాశ్వముల ఘీంకారములు శంఖభేరీనాదంబులు సైన్యముల రెంటియందును మిన్నుముట్టుచుండెను.

ఆ సమయమున జలంధరుఁడు ప్రయోగించిన బాణములచే భూమ్యాకాశములు కప్పబడినందున సమస్త ప్రదేశంబు మంచుతో నావరింపఁబడినట్లుండెను. మరియు నాతఁడు గణేశకుమారులను వీరభద్రస్వామినిగూడ నోడించినందున గణములు దీనులై శంకరునిచెంత కఱిగి సమాచారమునంతయు నివేదింప నా పరాత్పరుడు వారికభయమొసఁగి రణభూమిఁజనసుద్యుక్తుడయ్యెను.

ఇయ్యది "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నిరువదియొకటవ యధ్యాయము.

## ద్వావింశాధ్యాయము

### (జలంధరునితో శంకరుఁడు యుద్ధముచేయుట)

శంకరుఁడు రౌద్రరూపముతో వృషభారూఢుడై కదనమున కేతెంచినందున వెనుకంజవేసిన రుద్రగణములన్నియు మరలి వీరశబ్దము నుచ్చరించుచు బాణములతో దైత్యులను కొట్టుచుండిరి. జలంధరుఁడు తన సైనికుల దుఃస్థితిని గమనించి శంకరునితో తలపడనుండగా శుంభనిశుంభాదులు పెదవులఁ గొఱకుచు వడిగా బాణములనను సంధించి రుద్రగణములను బాధించుచుండిరి.

అవ్వారి బాణములతో కప్పఁబడిన రుద్రగణములను గాంచి హరుఁడు దైత్యబాణములనుఛేదించి తాను బాణములతో నాకసమును కప్పివేయుటయేగాక రాక్షసులనేకులను నేలపై పడగొట్టుచుండెను. మరియు ఖడ్గరోముని తలకాయను గొడ్డలితో నరికెను. బలాహకుని శిరంబు మంచపుకోడితో రెండుతునకలఁగావించెను. ఘస్మరుని తనుగుతోకట్టి నేలపై పరుండఁజేసెను. మహావీరుని ప్రచండుని త్రిశూలముతో పొడిచెను. ఇంతియేగాక వృషభము కొందరిని సంహరించుచుండెను. మరికొందరు బాణముల తాకిడికి మడియుచుండిరి. సింహముచే బాధింపఁబడుగజములవలె రణరంగమున నసురులు నిలువలేక పారుచుండగా జలంధరుఁడు క్రోధవశమున శుంభనిశుంభాదుల నిట్లు ప్రబోధించెను.

తల్లికడుపు చెరువంబుట్టిన మీరివ్విధము పలాయితులగుట భావ్యముకాదు. యుద్ధమున నభిరుచి కలదేని క్షుల్లకములైన సంసారసుఖములపై నాసక్తిని విడనాడి ముందునకు రండు! ఒకవేళ రణరంగమున మరణము సంభవించునెడ నయ్యది కోరికలనన్నింటిని ఫలింపజేయునదియై కీర్తినాపాదించుటయేగాక మోక్షము నొదవంజేయును.

శివజ్ఞానముగల యోగీశ్వరుండు, యుద్ధమున శత్రువునకెదురుగా పోరాడి మరణించువాడు నీయిరువురు సూర్యమండలమును భేదించి అనంగా సూర్యమండలముద్వారా పరమపదముంజెంది శివసాయుజ్యము నొందుదురని శాస్త్రము పెద్దలు చెప్పుచున్నారు. కావున ధీరులు మరణమునకు భీతిల్లకూడదు. ఒకవేళ యుద్ధమరణమును తప్పించుకొనినచో మరణమనునది సర్వవిధ ఉపాయములతోనైనను నివారింపనలవిగానిదని తెలియుడు!

జన్మించువారికి శరీరమువెనువెంటనే మృత్యువు ఏర్పడియుండును. ఈవేళనో పది సంవత్సరముల తరువాతనో నూరేండ్లకైనను మరణము తప్పదుగదా! అందువలన మరణభయమును విడనాడి యుద్ధమునకు సన్నద్ధులు కండు!

ఇవ్విధము జలంధరుండు బోధించినను దైత్యవీరులు తమ భయమును పోగొట్టు కొనక పారిపోవుచుండిరి.

అట్టితతి జలంధరుండు శంకరుని డెబ్బది బాణములతో ప్రహరింపగా నవ్వానిని మహాదేవుడు నిజబాణములతో ఛేదించెను. ఆ తరువాత రథాశ్వములను ధ్వజమును ఛత్రమును ధనుస్సు నేడు బాణములతో పడగొట్టినవాడు. ఈమాత్రము శత్రుపీడనము శంకరుని విషయమై ఆశ్చర్యకరముకాదు. అట్లు అన్నిటిని పోగొట్టుకొని జలంధరుండు క్రోధోద్దీపితుడై గదను పట్టుకొని శంకరునిపై నుఱికెను. అంత నాగుదియను ప్రభువు బాణముతో ఖండించెను. పిదప జలంధరుండు పిడికిలితో కొట్టనుండగా మహేశ్వరుండు వానిని క్రోశదూరము బాణములతో పంపించెను.

ఆ సమయమున నీశ్వరుని బలాఢ్యునిగా భావించి జలంధరుండు గంధర్వ మాయను పుట్టించినందున గంధర్వులు నప్సరసలును పెక్కురుదయించి గానమును నాట్యమును చేయుచుండిరి. వీణామృదంగాది వాద్యములు శ్రుతిమధురముగా మ్రోగింపంబడుచుండెను.

ఈ దృశ్యమును గాంచుచు శంకరుండు నిశ్చేష్టుడైయుండగా జలంధరుండు యుద్ధరంగమున శుంభనిశుంభులను నెలకొలిపి గౌరీదేవికొరకు కామమోహితుడై శంకరుని రూపముందాల్చి నందివాహనముపై వెళ్ళగా అమ్మవారు చెలికత్తెలమధ్యనుండి వెడలి మాయశంకరుని చూచుచుండెను.

దనుజనాథుండు పార్వతీదేవిని చూచుటతోడనే వీర్యమును విడనాడి మొద్దుపారిన శరీరము గలవాడైనందున నమ్మవారు వానిని రాక్షసునిగా తెలుసుకొని వేగముగా ఉత్తరమానస సరోవరమువైపునకు నంతర్హితురాలయ్యెను. జలంధరుండిక చేయునదిలేక మహేశ్వరుని గురించి రణరంగమునకు బయలుదేరిన వాడయ్యెను.

తరువాత దేవి నారాయణుని జ్ఞాపకము చేసుకొనగా నాతడు సమీపించి కృతాంజలియై నమస్కరించి కర్తవ్యమునాదేశింపుమని విన్నవించెను. అప్పుడు జగదంబ "కేశవా! జలంధరుఁడు అవలంబించిన మార్గము ననుసరించుము! వాని భార్యఁదగు శీలమును భంగపఱచుము! ఒకవేళ జలంధరునిపత్నిఁదగు పాతివ్రత్యమును చెడగొట్టకున్నచో జలంధరుడు మరణింపడు. లోకమున పతివ్రతాధర్మముతో సమానమైనధర్మము లేదుగదా! లోకకల్యాణార్థమై నీవిట్టి పనిచేయుట దోషావహము కాజాలదు. ఇది నా శాసనం"బని వక్కాణించెను.

ఇట్టి దేవీశాసనమును శిరసావహించి కపటముగా జలంధురుని భార్యను వంచించుటకు నచ్చోటునకు విష్ణువు వెళ్ళినవాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఇరువదిరెండవ యధ్యాయము.

## త్రయోవింశాధ్యాయము

### (బృందాదేవిఁదగు పాతివ్రత్యము భంగపడుట)

అంత విష్ణుమూర్తి జలంధరుని నగరమునకుఁజని యచటి యుద్యానవనమున నివసించి బృందాదేవికి స్వప్నమును తన మాయా ప్రభావమున దిగువ విధముఁగనఁబఱచెను.

జలంధరుఁడు మహిషముపైనెక్కి దిగంబరుడుగాను తైలమునంటుకొని నల్లని పువ్వులఁదాల్చి మాంసముఁదిను జంతువులచే చుట్టబఁడి దక్షిణదిశకు తలకాయను పడగొట్టుకొని యుండువాడుగాను తదితర దుష్టదృశ్యములతో బృందాదేవి తెల్లవారునపుడు దుఃస్వప్నమును గాంచి మేలుకొని సూర్యబింబమును కాంతిహీనముగా ఛిద్రముతో కూడినదిగా నవలోకించి యియ్యది యశుభసూచకమని మదిఁదలబోయుచు కోట బురుజులపై గోపురప్రదేశములయందు నుద్యానవనములయందు నెచ్చోటను విశ్రాంతిఁగానకుండినది.

మరియు నామె చెలికత్తె లిరువురిని వెంటనిడుకొని పలుచోట్ల తిరుగాడుచుండగా భయంకర స్వరూపము సింహముఖంబును గల నిరువురు రాక్షసులు కనుపడినందున వెఱగందినదై పరుగిడి యొకచో శిష్యునితోకూడిన తాపసునిచూచి "మునే! నన్ను రక్షించు"మని యాతని కంఠముపై వ్రాలినది.

అంత నా మునివరుఁడు బృందను కాపాడఁదలచి హుంకారముతోడనే రాక్షసులను తొలగింపగా బృందాదేవి భయము విడనాడి దోసిలొగ్గి నమస్కరించియు "మహాత్మా! రాక్షసభయమును నాకు తప్పించితివి సర్వసమర్థుడవు, నా విన్నపము నాలింపుము! నా భర్త జలంధరుఁడు ప్రస్తుతము రణరంగమున నెట్లున్నవాడో సెలవీయుము!" అని ప్రార్థింప నాతడు కపటముగా మౌనమును నటించుచు నాకసమువైపు చూడగా రెండుకోతులరుదెంచి మునివరుని కనుబొమల సజ్ఞఁబడసియు జలంధరుని శిరంబు మొండెమును చేతులను వేరువేరుగా చూపినందున బృందాదేవి–పతివియోగమును భావించుచు మూర్ఛితురాలయ్యెను. మరియు కొంత తడవునకు తెలివిగలదై యిట్లు విలపించెను.





నాథా! మున్ను సుఖవినోదములతో నన్ను సంతోషపెట్టిననీవు ఇప్పుడెందులకు మాటాడవు? దేవగంధర్వాదుల నోడించి చివరకు విష్ణుదేవునిఁగూడ పరాజితునొనర్చిననిన్ను నొక తాపసుఁడు వధించెనా? శివుఁడు పరమాత్మయనియు అతనితో వైరము పనికిరాదనియు చెప్పిన నామాటలు పాటింపకుంటివి. దుర్మార్గుల చెలిమికతన గర్వితుడవై నీ యోగ్యతను గోలుపోయినవి."

ఇవ్విధము తన హృదయము బాధపడుచుండగా దుఃఖించి ధైర్యము నవలంభించియు "మునివరా! కరుణాలుడవై నాపతిని బ్రతికించు" మని వేడుకొనుచు నిట్టూర్పులను విడచుచు నాతని చరణములపై వ్రాలగా మునివరుఁడు – ఈతఁడు శంకరునిచే వధింపఁబడెను గాన నీతని జీవింపఁజేయరాదు. ఐనను శరణాగతరక్షణమను సనాతన ధర్మమును పాటించి వీనిఁబ్రతికించెదనని వక్కాణించి జలంధరుని బ్రతికించి యంతర్హితుఁడయ్యెను.

అంత బృందాదేవి పతిఁజేరి యనురాగవశమున నుండగా నాతఁడు నామెముఖమును ముద్దిడుకొనుచున్నందున తన దుఃఖమునంతయు పోగొట్టుకొని యదేయుద్యానమున బహుదినములు నాతనితో విహరించుచు సుఖంబునుండెను. అంతనొక్కనాడు రతిసుఖాంతమున విష్ణువును గాంచి యలుకఁజెంది "పరస్త్రీలను పరామర్శించు నారాయణుని శీలమునకు ధిక్కారమగుగాక! మాయావశమున కపటతాపసుడవై మాయావశమున కపటతాపసుడవై నన్ను వంచించితివి. ఇందుకు తగిన ఫలము ననుభవింతువు.

పాతివ్రత్య ధర్మమును కలుషితమొనర్చు నికృష్టబుద్ధి కలవాడవు; నీవు చూపెట్టిన మాయారాక్షసులే నిజముగా రాక్షసులై జన్మించి నీ భార్య నపహరింతురుగాక! నీవుగూడ భార్యావియోగదుఃఖమున క్రుంగుచు నడవిఁదిరుగాడుచు వానరుల సహవాసము నొందుదువు గాక! ఇంతకుమున్ను నీ శిష్యుఁడుగా నుండిన యాదిశేషుఁడు నీ సహచరుఁడగు గాక!" అని బృందాదేవి విష్ణువును శపించి యాతఁడు వలదనుచున్నను చితిఁజేర్చుకొని యగ్నిఁబ్రవేశించినది.

అట్టితతి నా సాధ్వీమణిఁదగు సద్గతి నవలోకించుటకు నంతరిక్షమున బ్రహ్మాది దేవతలరు దెంచియుండిరి. బృందాశరీరమునుండి బయల్పడిన ఆత్మజ్యోతి – అమ్మవారి దేహమునందు లీనము కాగా ఖేచరులు జయజయ ధ్వానములఁజేయుచుండిరి.

కాలనేమి రాక్షసుని పుత్రికయగు బృందాదేవి–తన పతివ్రతా ధర్మప్రభావమున శాశ్వతముగా ముక్తిని పొందగా నారాయణుఁడు బృందను తలచుచు నామె కాష్ఠమునందలి బూడిదయందు పొర్లాడుచు సురలు సిద్ధులు ప్రబోధించుచున్నను పెడచెవిఁబెట్టియు మనఃశాంతి నొందకుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఇరువది మూడవ యధ్యాయము.





# చతుర్వింశాధ్యాయము

## (జలంధరుని శంకరుఁడు సంహరించుట)

జలంధరుఁడు కైలాసమున పార్వతీదేవినిఁ గానక యుద్ధరంగమున కఱుదెంచగా శంకరుఁడు జాగరూకుఁడై లోకరీతి ననుసరించి శత్రువును వధింప మిగుల కోపించి సన్నద్ధుడగుచుండగా జలంధరుఁ డదిఁగాంచి శంకరుని కెదురుగా నిలచి బాణములను వేసెను. అట్టి బాణములను శంకరుఁ డవలీలగా తన బాణములతో ఛేదింపగా జలంధరుఁడు తన మాయా బలమున పార్వతిని పుట్టించి శుంభనిశుంభులచే రథమున కట్టించి కొట్టించుచున్న దృశ్యమును శంకరుఁడు గాంచి పామరునివలె దీనమానసుఁడై తన సామర్థ్యము నంతయు మఱచి శిరస్సు వంచి విచారపడుచుండ జలంధరుఁ డిదే సమయమని తీక్ష్ణములైన మూడు బాణములతో శంకరుని వేధించెను.

అంత నా పరాత్పరుఁడు రౌద్రాకారముఁ దాల్చగా రాక్షసులు శుంభనిశుంభులును యుద్ధమున నిలువఁజాలక పాఱుచుండ శంకరుఁడు దుర్మార్గులైన శుంభనిశుంభులారా! పార్వతీ దేవిని బంధించినందున మీరిరువురును మిగుల నపచారము నొనర్చితిరి. ఇప్పుడు రణరంగము నుండి పారిపోవుచున్నారుగాన మిమ్ము వధింపగూడదు. అందువలన మీరు పార్వతీదేవిచే కదనమున మడియుదురు గాక!" అని శపించెను.

ఇవ్విధము శంకరుడు ప్రవర్తించుచుండ జలంధరుఁడు కోపోద్రిక్తుడై తీక్ష్ణములగు బాణములను శంకరునిపై వేయగా రణరంగమంతయు బాణములచే కప్పఁబడినందున చీకటిగా నుండెను. అంత నా పరాత్పరుఁడు జలంధరుని బాణములను ఛేదించునంతలో నవ్వాడు పరిఘముతో వృషభమును కొట్టెను. ఆ దెబ్బకు తాళఁజాలక వృషభము – కదనమునుండి పరుగిడుచుండినదై శంకరుఁడు అపుచున్నను నిలువదయ్యెను. అటుపిమ్మట మహేశ్వరుఁడు తన ఉగ్రరూపముఁదాల్చి ప్రళయాగ్నివలె మండిపడుచు ఇతరులకు వధింప శక్యము కానందున తానే జలంధరుని సంహరింపవలెనని మదిని నిశ్చయించుకొని "వీనిని శంకరుఁడే సంహరింపజాలు" నను బ్రహ్మదేవుని వాక్యమును స్మరించుచు లోన దయఁబూనియు తన కాలి బొటనవ్రేలు నుదకమున రాచి అద్భుతంబగు నొక చక్రమును పుట్టించెను.

ఇద్ది ముల్లోకములను సంహరింపఁజాలునని తీర్మానించి "జలంధరా! బలవంతుడవైనచో నిప్పుడు నీ బలముఁ జూపుచు యుద్ధమునకు సంసిద్ధుడవు కమ్ము!" అని పరమేశ్వరుఁడు వక్కాణింపగా,

అంత జలంధరుఁడు కోపోద్రేకమున కన్నులనుండి నిప్పులను రాల్చుచు దహించునో యన్నట్లు గాంచుచు "మహేశ్వరా! చక్రమునకై నీవు జలమున వ్రాసిన రేఖను క్షణములో తుడిచివేసి నిన్ను గణములతో కూడ వధింతును. గరుత్మంతుఁడు నాగములను వలె ప్రాణుల నమరులతో కూడ నొకే కాలమున నశింపఁజేయుదును. చిన్నతనముననే నారాయణునోడించితిని. బలవంతుఁడైన బ్రహ్మదేవుని మునులతో గూడ నా యాస్థానమున నుండఁజేసితిని నా ముందు నీ సామర్థ్య మెంతటిది?

గరుడుని ముందు సర్పములవలె నా ముందు దేవేంద్ర అగ్ని యమ కుబేర వాయు వరుణాది సురపుంగవులు నిలువఁజాలకుండిరి.

భూమ్యాకాశములయం దెచ్చటను నన్ను మోయు వాహనము లభింపలేదు. మేరు మందరాది పర్వతములను ఢీకొని నా మేని దురదc బోకార్చుకుంటిని. ఒకప్పుడు హిమాలయమునకు వెడలి గంగాప్రవాహము నవలీలగా నడ్డగించితిని.

నా పగతుఱ నందరిని నా భటులే కదనమున నోడించిరి. సముద్రములోని బడబయను గుఱ్ఱముc దగు నోరు కట్టివేసితిని గావున ప్రపంచమంతయు జలమయం బయ్యెను. ఐరావతాది గజములను సముద్రమునc బడవేసితిని. గరుత్మంతుని విష్ణుమూర్తితోసహ నాగపాశముతో బంధించితిని. ఊర్వశి మున్నగు నప్సరసలను కారాగృహమున నుంచితిని. దేవేంద్రుని రథముతో గూడ శతయోజన దూరమునకు విసరి పాఱవేసితిని. నన్ను సింధు పుత్రునిగా మహాబలశాలిగా ముల్లోకములను గెలచినవానిగాను గుర్తెరుగకుంటివి." అని ప్రగల్భములcబలికి కదలకుండుటయే గాక మరణించిన దైత్యులను గూడ తలపకుండెను.

దుర్మదుండగు జలంధరుcడు ఇట్లు విలపించి భుజములcజఱచుచు కఠినముగా మందలించినందున మహాదేవుcడు అట్టహాసముcజేసి మితిమీరిన ఆగ్రహముc జెందినవాడై తన పాదాంగుష్ఠమునుండి పుట్టించిన చక్రమును కేలcబూని వానిపై ప్రయోగింపనద్ది కోటిసూర్య ప్రతీకాశమై ప్రళయాగ్నిc బోలె మండుచు నేలను నింగిని కాల్చునో యన్నట్లు కనcబడుచు వేగముగా జలంధరునిc దాకి యవ్వాని శిరముc ద్రుంచివేసెను.

అంత నాతని శరీరము రెండు భాగములుగా అంజన పర్వతమువలె క్రింద పడగా నద్దానినుండి బయలుపడిన నెత్తురుతో నేలయంతయు వికృతం బయ్యెను. మహాదేవుని యాజ్ఞావశమున జలంధరుని రక్తమంతయు మహారౌరవ నరకముcజెంది రక్తకుండముగా పరిణమించెను.

అట్టితతి జలంధరుని ఆత్మజ్యోతి–బృందాదేవిcదగు జీవము పార్వతీదేవియందు వలెను శంకరునిలో లీనంబయ్యెను.

అవ్విధము లోకకంటకుcడైన జలంధరాసురుని శంకరుcడు చంపినందున దేవతలు గంధర్వులు నాగజాతివారు సిద్ధులు మునులును మహాదేవుని ప్రశంసించుచు పుష్పములc గురిపించుటయే గాక నప్సరసలును కిన్నరస్త్రీలును శివకీర్తిని గానముc జేయుచు నాట్యమాడుచుండిరి. దశదిశలును ప్రసన్నములయ్యెను. వాయువులు చల్లగా మెల్లగా వీచుచుండెను. చంద్రుcడు శీతల ప్రకాశముతో వెలుగొందుచుండెను. సూర్యుcడు ఉష్ణరశ్మియై ఆకసమున సంచరించుచుండెను. అగ్నులు ప్రశాంతముగా మండుచుండినవి. అంతరిక్షము ఎట్టి వికారము లేనిదిగా కన్పట్టుచుండెను. అనంత స్వరూపములుగల హరుcడు జలంధరుని సంహరించినందున బ్రహ్మాండమున ప్రాణులందరును స్వస్థచిత్తులై తమ కర్తవ్యములను నెరవేర్చుచు శివానుగ్రహమున సుఖముగా నివసించుచుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఇరువదినాలుగవ యధ్యాయము.





# పంచ వింశాధ్యాయము

## (అమరులు శంకరుని నుతించుట)

అంత చతుర్ముఖుండు మొదలగు నమరులు మునులందరును వేదశాస్త్ర సమ్మతములగు వాక్కులతో శంకరుని దిగువ విధము స్తుతించిరి.

మహాదేవా! శరణాగతవత్సలా? భక్తుల దుఃఖములను పోగొట్టువాడవై సజ్జనులకు సుఖముల గూర్చుచుందువు, నీ లీలావిలాసములు అద్భుతములై భక్తులు కానివారికి రుచింపవు, దుర్మార్గులు నిన్నారాధించినను సత్ఫలితమును పొందజాలరు. వేదము గూడ నీ మహిమను యథార్థముగా వర్ణింపఁ జాలదు. మహానుభావులు-తమ బుద్ధిబలముకొలది నిన్ను గురించి గానముఁజేయుచుందురు. సహస్ర ముఖములుగల ఆదిశేషుఁడు మున్నగువారు నిన్ను ప్రశంసించుచు తమ వాక్కును పవిత్రముఁ జేసుకొనుచున్నారు. నీ యనుగ్రహము ప్రసరించినచో మూగవాడైనను బ్రహ్మమును గురించి ధారాళముగా మాటలాడును. నీవు భక్తిచే మాత్రము తెలియఁబడుదువని వేదశాస్త్రములు ఘోషించుచున్నవి. దీనులపై దయగలవాడవనియు సర్వవ్యాపకుడవనియు ఏకాగ్రభక్తిగలవారికి దర్శనము నిత్తువనియు ఎట్టి వికారము లేనివాడవనియు భావించుచున్నాము.

పూర్వము పలువురు నిన్ను పూజించినందువలననే ఇహసుఖములఁ బడయుటయే గాక మోక్షము పొందినవారు. ఎట్లనఁగా? దాశార్హుడను రాజు, అతని భార్యయగు కళావతియు శివు నారాధించియే కైవల్యమును పొందినవారు. మిత్రసహుఁడు మదయంతియను దంపతులు పార్వతీపతి నర్చించి సిద్ధిఁ బొందిరి.

కైకయరాజపుత్రికయగు సౌమినీదేవి - మహాదేవుని భక్తివలననే యోగులకు గూడ దుర్లభంబగు శాశ్వతసుఖముఁబడసినది. విమర్షణుఁడను నృపుఁడు ఏడుజన్మలయందు పరమేశ్వరు నారాధించి ఐహికసుఖముల ననుభవించుటయే గాక సద్గతి నొందినవాడయ్యెను. చంద్రసేనుఁడను మహారాజు శివు నుపాసించియే సంసారదుఃఖమునుండి నిర్ముక్తుఁడయ్యెను. గొల్లదాని కుమరుఁడగు శ్రీకరుఁడు - ఆంజనేయుని యుపదేశముఁబడసి శివభక్తుఁడై ప్రపంచసుఖము ననుభవించి చివరకు శాశ్వతస్థానమగు కైలాసముఁజెందినవాడు. సత్యరథుఁడను భూపతి, ధర్మగుప్తమహారాజు, శుచివ్రతుఁడను బ్రాహ్మణుఁ డను చిత్రవర్మయను రాజు, శివుని పూజించియే తరించినవారు. చిత్రాంగద మహారాజు సీమంతినీదేవితో కూడ సోమవారవ్రతమున శంకరు నారాధించియే సంసారసాగరము నతిక్రమించి కృతార్థుండయ్యెను. మందరుఁడను బ్రాహ్మణుఁడు స్వధర్మమును విడనాడి వేశ్యాలంపటుఁడైనను భక్తిశ్రద్ధలతో మహేశ్వరునర్చించినందున వేశ్యతోకూడ పరమధామమగు శివలోకమును చెందెను. భద్రాయువను రాజకుమారుఁడు - తన తల్లితోకూడ శంకరుని సేవించి రాజ్యసుఖములఁబడసియు ముక్తుఁడయ్యెను. అన్ని జాతులస్త్రీలననుభవించుచు మాంసభక్షణముఁజేయు దురాత్ముండైనను శివుని పూజించినచో పాపభోగములను విడగొట్టుకొని జన్మరాహిత్యము నొందును.

ఎఱుకవాడొక్కఁడు - తనభార్యతోకూడ నిత్యము గంగాధరుని కొలుచుచు భస్మధారణనియమ వశమున శివానుగ్రహపాత్రుఁడయ్యెను.

భద్రసేనుని కుమారుఁడు, మంత్రితనయుడు నిరువురు - నిత్యము భస్మరుద్రాక్షధారులై శంకరుని పూజించి సంసారసుఖముల ననుభవించి యంత్యకాలమున శివలోకముఁ జెందినవారైరి. పింగళ మహానంద యను వేశ్యలు - మహేశ్వరునియందు భక్తిగలవారై సద్గతి నొందినవారు. శారద యను బ్రాహ్మణ వనిత - వితంతువైనను ఉమామహేశ్వరు వ్రతరూపమున శివునారాధించి సంసారబంధమును విడగొట్టుకొనెను. బందుగుఁడను నామమాత్ర బ్రాహ్మణుఁడు భ్రష్టుడైనను శివచరితము నాలకించినందున కృతార్థుండయ్యెను. అటులే బిందుగుని భార్యయగు చంచుకయు శంకరుని మహిమను మనసార విని విజ్ఞానవంతురాలయ్యెను.

దీనబాంధవా! శంకరా! వీరేకాదు. లెక్కింపనలవిఁగాని భక్తులెందరో నిన్నారాధించి నీ యనుగ్రహమునకు పాత్రులైనవారు.

శ్లో॥ త్వం పరః ప్రకృతే ర్బ్రహ్మ - పురుషాత్ పరమేశ్వరా ।
నిర్గుణ స్త్రిగుణాధారో - బ్రహ్మవిష్ణుహరాత్మకః ॥ 29

ప్రకృతిని పురుషుని మించినవాడవై ఆకలి దప్పి మున్నగు ప్రాకృతగుణములు లేనివాడవై బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపమున రజః సత్త్వతమోగుణములకు ఆశ్రయము నొసగితివి.

నిరాకారుఁడవైనను అనేక లీలారూపములను ధరించి లోకకల్యాణము నొనఁగూర్చుచుందువు. ఇట్టి నీకు మేమందరము దాసులమగుదుము. ప్రసన్నుడవై మమ్ము సర్వదా రక్షించుము! నిన్ను శరణముగా వేడుచుంటిమి.

ఇవ్విధము బ్రహ్మాదిదేవతలు ఋషులును ప్రార్థింపగా శంకరుఁడు ప్రసన్నుడై యమరులకు అనేక వరంబుల నొసగి యంతర్ధానముఁజెందెను.

అంత బ్రహ్మాదులును శివుని వైభవమును కీర్తించుచు తమ తమ నివాసములకుఁ జనినవారు.

జలంధరుని సంహారము గల ఈ మహేశచరితము మహాపాపములను నివారించును. దేవతలు గావించిన నీ శివస్తోత్రంబు మహేశ్వరునికి సంతసమొదవఁజేసి భక్తులకు సర్వసుఖముల నొనఁగూర్చును.

ఇద్దానిఁజదువువారు చదివించువారును ఈ లోకమున గొప్ప సుఖము ననుభవించి కైలాసమున దివ్యరూపము గలవారై నివసింతురు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఇరువదియైదవ యధ్యాయము.





## షడ్వింశాధ్యాయము

### (విష్ణువుఁదగు మోహమును తీసివేయుట)

అమరులు వెళ్ళుటకు ముందు కొంత తడవు మౌనముతో నిలువఁబడియుండగా శంకరుఁడు వారిని గాంచి "బ్రహ్మాదులారా! జలంధరుఁడు నా యంశతో పుట్టినందున కుమారునితో సమానుడైనను వానిని మీ క్షేమమునకై సంహరించితిని. ఇందువలన మీరు సుఖముగా నుండుడు! నిర్వికారుడనైన నా లీలావిశేషము దేవతలకొరకు లోకకల్యాణము కొరకున్ను ప్రవర్తించుచుండు" నని వక్కాణించెను.

అంత నవ్వారు వినమ్రులై శంకరునికి మ్రొక్కులిడి నారాయణుని ప్రవర్తనను గురించి యిట్లు విన్నవించిరి.

దేవా! శతృభయమును నివారించితిరి. కాని మరియొక నద్భుతము తారసిల్లినది. ఇప్పట్టున మేమేమి చేయవలెనో తోచుటలేదు. విష్ణువు బృందను మోహింపఁజేశినందున నామె జలంధరుని కాష్ఠముఁదగు నగ్నియందు భస్మంబయ్యెను. కాని విష్ణువు బృందాదేవియందలి మోహమునఁజేశి భ్రాంతుడై నీ మాయాప్రభావమున చితాభస్మఁదాల్చి సిద్ధులు మునులు ప్రార్థించుచున్నను పెడచెవిఁబెట్టి మేలుకొనుటలేదు. కావున విష్ణువునకు పూర్వస్మృతికలుగునట్లు బోధింపుము! చరాచరమంతయు నీ యధీనము గదా!"

శంకరుఁడవ్వారి మొఱ నాలకించి "అమరులారా! నా మాట పాటింపుడు! నా మాయ యేరికి నుల్లంఘింప నలవిగానిదై ప్రాణులందరిని మోహింపఁజేయుచుండును. అట్టి మాయకు లొంగినవాడై విష్ణువు కాముకుఁడయ్యెను. కావున జగన్మాతయగు ఆదిశక్తిని ప్రార్థింపుడు! ఆ యమ – ప్రసన్నురాలై మీ కార్యమును సాధించు"నని సెలవీయగా భక్తవత్సలురాలైన మూలప్రకృతిని దిగువవిధము ప్రస్తుతించిరి.

సత్త్వరజస్తమోగుణములకు నిలయమగు మూలప్రకృతిని సృష్టి లయ కారిణి యగు పరాశక్తిని ప్రార్థించువారము. నీ రూపమును నీ కార్యమును పూర్తిగా గుర్తెరుగువారు ముల్లోకముల యందెవరును గానరారు. నీ యెడఁదు భక్తిగలవారికి దరిద్రము మోహము జనన మరణాదులును సంభవింపవు. దుర్గా! భవానీ! విష్ణుమోహమును తొలగించి దేవతలకు మేలొనఁగూర్చుము! జలంధరుఁడు – శంకరునితో పోరాడుచుండగా పార్వతీదేవి ప్రేరేపించినందున విష్ణువు బృందను మోహింపజేసి యామెను పాతివ్రత్యభ్రష్టురాలుగా నొనర్చినందున బృందాదేవి పతితో సహగమనముఁజేసి పునీతురాలయ్యెనుకాని విష్ణువునకు బృందామోహము విడలేదు. పరమేశ్వరుఁడు నీవు నుభయులు – భక్తుల నుద్ధరించువారై కృపాపూర్ణహృదయులగువారు గదా! విష్ణువు పూర్వమువలె జాగరూకుడై వైకుంఠమునకు వెళ్లునట్లు అనుగ్రహింపుము!

అంత నాకాశమండలమున దివ్యజ్యోతిస్సునుండి దివ్యవాణి దిగువ విధము దివిషదులకు వినఁబడెను.

గౌరీ లక్ష్మీ సరస్వతీ రూపములతో విలసిల్లుదానను నేనే, కావున నా ముగ్గురి నాశ్రయించి మీ కార్యమును సాధించుకొనుఁడు!

అమరులు ఆకాశవాణి నాలకించుచు విస్మయంబందుచుండగా దివ్యజ్యోతి యంతరించెను. అంత సురలు - ముగ్గురు దేవుల సన్నిధిఁజేరి శిరంబులు వంచినవారై అనేక విధస్తోత్రములతో కొనియాడగా నా దేవీత్రయము ప్రసన్నముఖ పంకజములతో దశదిశలను తమ కాంతులతో వెలుగొందఁజేయుచు ప్రత్యక్షమైరి. అమరులు సమాచారము నంతయు నివేదింపగా నవ్వారు మూడు విత్తనములనిడి "విష్ణువు మోహించిన చోట నీ విత్తనములను నాటుడు! మీ పని నెరవేరు"నని వక్కాణించి యంతర్ధానముఁ జెందిరి.

అంత నమరులు శక్తివిశిష్ట శివాంశ సంజాతలగు నా మూడు శక్తులను మదిఁ దలచుచు బృందాదేవిఁ దగు చితాభస్మయందు నాటగా నా విత్తనములనుండి ఉసిరిక, జాజి, తులసి యను మూడు చెట్లు పుట్టినవి. (సరస్వతీదేవి విత్తనమునుండి ఉసిరికచెట్టు, లక్ష్మీదేవి విత్తనమునుండి జాజిచెట్టు, గౌరీదేవి విత్తనమునుండి తులసీవృక్షంబు నుద్భవించెను.)

అవ్విధము వనస్పతులు - స్త్రీరూపములదాల్చి కనుపడగా నవ్వారియందు అనురాగము కలవాడై మోహించినందున తులసీధాత్రీదేవులు విష్ణువును ప్రేమించినందున పూజనీయురాండ్రుగా నుండిరి. లక్ష్మీబీజ సంభూతురాలైన మాలతీదేవి మాత్రము అసూయతో దూరమున్నందున బర్బరయనఁబఱగి పూజనీయ కాకుండెను.

అట్టితతి విష్ణువు మోహమును విడనాడి ధాత్రీతులసీదేవులను తోడ్కొని యమరులు నమస్కరించు చుండగా వైకుంఠమునకు వెళ్ళినవాడయ్యెను. ధాత్రీవృక్షముగాని తులసీ వృక్షముగాని కార్తికమాసమున పూజింపఁబడినచో దేవతలందరు సంతసింతురు. ముఖ్యముగా విష్ణువు ప్రీతిఁజెందును. ఆ రెంటిఁ గూడ తులసి శ్రేష్ఠంబైనది.

శ్లో॥ త్య క్త్వా గణేశం సర్వేషాం - ప్రీతిదా సర్వకామదా ॥ 74

గణపతికి మాత్రము తులసి - ప్రియము కాదు. తదితర దేవతలకు ప్రియంబై కొలుచువారి కోరికల నన్నిటిని ప్రసాదించునట్టిది.

వైకుంఠమున గతమోహుడై నివసించు నారాయణు నమరులు ప్రార్థించి తమ నివాసములకుఁ జనగా విష్ణువు పూర్వమువలె శివుని స్మరించుచు సుఖముగా నుండెను. ఈ యాఖ్యానముఁ జదివి యుద్ధరంగమున పాలుగొనువారు తప్పక శత్రువుల నోడింతురు. నాలుగు వర్ణముల వారికి నియ్యది శ్రేయస్సు నొనఁగూర్చును.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఇరువదియారవ యధ్యాయము.





# సప్త వింశాధ్యాయము

## (శంఖచూడుడు జన్మించుట)

సూతుఁడు చెప్పఁదొడఁగెను.

శౌనకాది మహర్షులారా? శివభక్తిని పెంపొందించు మరియొక చరితమును ప్రేమతో వినుఁడు! శంఖచూడు డనఁబడు దానవుని రణరంగమున శివుఁడు వధించిన వృత్తాంత మిందు ముఖ్యంబైనది.

మరీచి ప్రజాపతి యనుఁగు కుమారుడైన కశ్యపునకు దక్షప్రజాపతి తన కుమార్తెల పదముగ్గురి నొసగి వివాహముఁజేయగా నవ్వారిలో దను వనఁబడు భార్య - పతిసౌభాగ్య వృద్ధి గలదై రూపసిగా నుండెను. ఆ దనుదేవికి పెక్కురు కొమరులు పుట్టిరి. వారిలో విప్రచిత్తి యనువానికి దంభుఁడను కుమారుఁడు విష్ణుభక్తుఁడై జన్మించెను. దంభుఁడు చిరకాలము వరకు సంతానములేనివాడై శుక్రాచార్యుని యుపదేశమున పుష్కరక్షేత్రమున పద్మాసనస్థుడై లక్షవత్సరములు శ్రీకృష్ణమంత్రమును జపించుచుండగా వాని శిరమునుండి తపోజ్వాల బయలుదేరి జగమున వ్యాపించినందున అట్టి వేడిమి నోర్వలేక సురలు మునులు దేవేంద్రుని ముందిడుకొని బ్రహ్మదేవుని శరణము నొందినవారై ప్రణమిల్లి నుతించియు తమ వేదనను చెప్పుకొనిరి.

అంత పంకజాసనుఁడు గమనించి యవ్వారి నందరిని వెంటనిడుకొని వైకుంఠమున కేగి యంజలిఁ ఘటించియు దిగువ విధము విన్నవించెను.

రమానాథా! రక్షింపుము! ఈ తాప మెందులకు కలుగుచున్నదో తెలియకున్నాము. నిన్నాశ్రయించు వారిని కాపాడు. కరుణ గలవాడవు; దీనబాంధవుడవు; శరణాగతులమై ప్రార్థించుచుంటిమి. అంత నారాయణుఁడు అవధరించి చిరునగవుతో "అమరులారా! భయపడకుఁడు! ప్రళయము గాని ఈతిబాధలు గాని వచ్చు సమయ మిదికాదు. దంభదానవుఁడను నా భక్తుఁడు - పుత్రార్థియై తపించుచున్నవాడు. కావున వానికి వరము నొసగి యనుగ్రహించెదను" అను వక్కాణింపగా సురమునులు స్వస్థచిత్తులై తమ తమ నెలవులకుఁజనిరి.

అంత పద్మనాభుఁడు పుష్కరక్షేత్రమునకు వడిగా వెళ్ళి "దంభా! వర మొసగెదనడుగు" మని మృధుమధురముగ పలుకగా దంభుఁడు నారాయణుని గాంచి కడు భక్తిని మ్రొక్కులిడి "పుండరీకాక్షా! లక్ష్మీపతే! నాయందు అనుగ్రహము కలదేని - దేవతలను జయించువాడు మహాబలపరాక్రమ సంపన్నుఁడు నీ యందు భక్తిగలవాడు నగు కుమారుని ప్రసాదింపుము!" అని ప్రార్థింపగా విష్ణువట్లే యగుగాక! అని వచించి వైకుంఠమునకుఁ జనినవాడయ్యెను.

దంభుఁడు హరి యంతరించిన దిశను నమస్కరించి పూర్ణమనోరథుఁడైనందున మిగుల సంతసముతో స్వగృహమున కేతెంచి కొద్దికాలము సుఖంబు నుండగా దంభుని భార్య గర్భవతియై ప్రకాశించుచుండెను.





గోలోకమున రాధాదేవిచే శపింపఁబడిన సుదామ యను గోపాలుఁడు దంభుని భార్యఁదగు గర్భమున ప్రవేశించి పెంపొందుచుండెను. అంత కొంత కాలమునకు దంభపత్ని ప్రసవించి కుమారుని కనఁగా దంభుఁడు మునులను రప్పించి జాతకర్మ సంస్కారమును చేయునపుడు గొప్ప వేడుకగా నుండెను. శంఖచూడుడను పేరుతో నా బాలుడు శుక్లచంద్రుని వలె దినదిన ప్రవర్ధమానుఁడై చిన్నతనముననే సమస్త విద్యల నభ్యసించి విరాజిల్లుచు తల్లిదండ్రులకు ముదము నొనఁగూర్చుచు తన వంశమువారందరికి ప్రియుండయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఇరువదియేడవ యధ్యాయము.

## అష్టా వింశాధ్యాయము

## (శంఖచూడుడు తపంబొనరించుట వాని వివాహంబును)

శంఖచూడుడు పెద్దవాడై జైగీషవ్యుని యుపదేశముఁ బడసి పుష్కరక్షేత్రమున బ్రహ్మదేవు నుద్దేశించి యేకాగ్రమానసుడై తంపిచుచుండగా పంకజాసనుఁడు ప్రత్యక్షమై వరమును కోరుకొనుమని వక్కాణించెను.

అంత నా దానవుఁడు బ్రహ్మదేవుని దర్శించి ప్రణమిల్లియు "అమరులు తనను జయింపఁగూడదు" అని వరమడుగగా స్వయంభు వట్లే యగుగాక యని వరంబొసగి జగన్మంగళప్రదంబగు శ్రీకృష్ణకవచమును ప్రసాదించియు "ధర్మధ్వజుని కుమార్తెయగు తులసీదేవి బదరికాశ్రమమున తపించుచున్నయది. కావున నీ వచ్చోటునకు వెళ్ళి తులసిని వివాహమాడు" మని యాదేశించి యంతర్ధానముఁజెందినవాడు.

పిమ్మట శంఖచూడుడు సంతుష్టాంతరంగుడై శ్రీకృష్ణకవచమును కంఠమున ధరించి పుష్కరము నుండి బదరికాక్షేత్రమున కఱుదెంచి యవలోకింపగా తాపసి రూపసియు నగు తులసి యనురాగముతో తనను చూచున్నందున సమీపించి మధురముగా దిగువవిధము సంభాషించెను.

"నీ వెవరు? ఎవరి కుమార్తెవు? ఇచ్చోట నేమి చేయుచున్నావు? మాటలాడవెందులకు? నన్ను నీ కింకరునిగా భావింపుము!

అంత నా తరుణి శంఖచూడుని విలాసవాక్యముల నాలకించి కామమోహా ముట్టిపడుచుండగా "ధర్మధ్వజ పుత్రికను తపోవనమున తపించుచున్నాను. నీవెవరో సుఖముగా వెళ్లుము! స్త్రీలు సామాన్యులు కారు. విషముతో సమానముగా నపకరించువారై బ్రహ్మాదులఁగూడ విషయలోలురఁజేయుదురు. నీ వంటి సజ్జనులు స్త్రీలను సమీపింపరాదు." అని వక్కాణింపగా నాతఁడు "దేవీ నీవు చెప్పినది పూర్తిగా నిజము గాదు పతివ్రతలలో నీ వగ్రగణ్యురాలవు; నేను గూడ యథేచ్ఛముగా స్త్రీలను ప్రేమించువాడను కాను. బ్రహ్మదేవుని యనుమతిని నీ చెంతఁజేరితిని. గాంధర్వవిధానముగా నిన్ను పరిగ్రహింతును. దనుదేవివంశమున జన్మించిన దంభునకు కుమారుడనైతిని.





గోలోకమున శ్రీకృష్ణుని సేవకుడనై యుండగా రాధాదేవి నన్ను శపించినందున దానవుడనై జన్మింపవలసివచ్చినది. శ్రీకృష్ణుని యనుగ్రహమునంజేసి పూర్వజన్మను స్మరించు శక్తి గలవాడను." అని యథార్థమును పలికెను.

అంత తులసీదేవి సంతసించి చిరునగవుతో "మహానుభావా! నీదగు సత్త్వగుణమున విధేయురాల నగుచున్నాను.

శ్లో॥ న ధన్యః పురుషో లోకే - న స్త్రియా యః పరాజితః ॥ 26

వనిత చేత నోడింపఁబడని పురుషుఁడే లోకమున ధన్యుఁడగును. సత్కర్మలఁజేయు వాడైనను తరుణికి లొంగినచో నపవిత్రుండగుటయే గాక నట్టివానిని పితరులు అమరులు మానవులు ప్రాణులందరును నిందింతురు. జననమున మరణముననను బ్రాహ్మణుఁడు పది దినములలో శుద్ధుండగును. క్షత్రియుఁడు పండ్రెండ్రు దినములలోను వైశ్యుఁడు పదునైదు దినములలోను శూద్రుఁడు ముప్పదిదినములలోను పరిశుద్ధులగుదురు.

శ్లో॥ న శుచిః స్త్రీజితః క్వాపి - చితాదాహం వినా పుమాన్ । 29

ఆడదానిచే పరాభవింపఁబడు పురుషుఁడు మాత్రము జీవితకాలమందెప్పుడును శ్మశాన కాష్ఠమున కాల్పఁబడువరకు పరిశుద్ధుఁడు కాజాలడు. స్త్రీజితుండగు పురుషుఁడు చేయు తర్పణమును పిండప్రదానమును పితరులు గ్రహింపరు. ఇంతియే గాక తరుణీలోలుడు సమర్పించు పుష్పఫలాధికమును గూడ దేవతలు స్వీకరింపరు. అట్టివాడు గావించు ఉపాసనగాని తపంబుగాని జపహోమపూజనములు గాని సార్థకములు కావు. మరియు కామినీకాముకుఁడు అభ్యసించిన విద్యయు, చేయు దానంబు, వ్యర్థంబులగును.

ఆర్యా! నీ విజ్ఞానమును గుర్తించుటకు నిన్నిట్లు పరీక్షించితిని. కామిని - కాంతుని పరీక్షించియే పరిగ్రహింపవలెను కాదా!" అని వక్కాణించుచుండగా బ్రహ్మదేవుఁడచ్చోటున కేతెంచి "శంఖచూడా! ఈ తులసితో వివాదమెందులకు? గాంధర్వ వివాహవిధి నీమెను స్వీకరింపుము! నీవు పురుషశ్రేష్ఠుఁడవు. ఈమె స్త్రీరత్నంబునైయున్నది. నిపుణురాలితో నేర్పరియగువాడు చెలిమిఁజేయుట శ్రేయస్కరంబగును. ఎట్టివిరోధములేని సుఖము నెవఁడనుభవింపకుండును? ఒకవేళ నట్టి సుఖమును పరిహరించినచో నట్టివానిని పశువనవలసియుండును. ఐనను తులసీ? దేవతలను దానవులను వశపఱచుకొనువాడు సద్గుణములు కలవాడు నగు నీకాంతు నెందుకు పరీక్షించెదవు? వీనితో లోకములన్నిటియందును యథేచ్ఛముగా విహరింపుము! అంత్యకాలమున గోలోకమునకుఁజని శ్రీకృష్ణు నాశ్రయించు వీనిని నీవనుసరింతువు!" అని వచించి నిజనివాసమునకు వెళ్ళగా శంఖచూడుఁడు తులసిని గంధర్వ విధానముగా పరిగ్రహించి జనకుని నివాసమునకుఁజనియు భార్యతో సుఖముగా నుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఇరువది యెనిమిదవయధ్యాయము.

# ఏకోనత్రింశాధ్యాయము

## (శంఖచూడుని రాజ్యాభిషేకము, దిగ్విజయము పూర్వజన్మ వృత్తాంతంబును)

శంఖచూడుడు తపంబాచరించి వరముఁబడసియు స్వగృహమునకురాగా దానవులు దైత్యులును మిగుల సంతసించిరి. ఇంద్రాదిదేవతలు తమ గురువైన బృహస్పతితోకూడ నేతెంచి శంఖచూడునకు వినయముతో మ్రొక్కులిడియు మాకన్న నెక్కుడు ప్రభావము గలవాడని భావించుచు నుండిరి.

దంభపుత్రుడైన శంఖచూడుఁడు – తన కులగురువగు శుక్రాచార్యునికి సాష్టాంగ నమస్కారమును నిండుభక్తిని సమర్పింపగా శుక్రాచార్యుఁడు శుభాశీస్సుల నొసగి దేవదానవులకు గల సహజ వైర వృత్తాంతమును దేవతలచే దానవులు పరాజితులగుచున్న విషయము నంతయు నివేదించి అసురుల నందరిని సమ్మతింపఁజేసియు నాతని దానవ ప్రభువుగా నెన్ను కొనినవాడు.

అట్టితతి దైత్యదానవులు సంబరపడుచు పలురకములగు కానుకలను శంఖచూడున కొసగుచుండిరి. అంత నాతఁడు రాక్షసాధిపతిగా పట్టాభిషిక్తుడై మిగుల ప్రకాశించుచుండెను. కొంతకాలమునకు శంఖచూడుఁడు దానవుల సైన్యమును వెంటనిడుకొని స్వర్గములోని యమరావతిపై దండెత్తెను. అవ్విధము పయనించునపుడు నక్షత్రములలో చంద్రునిఁబోలె దానవులలో శంఖచూడుఁడు విరాజిల్లుచుండెను.

ఇట్టి వృత్తాంతమును విని దేవేంద్రుఁడు నమరులనందరిని రప్పించి యుద్ధమునకై సన్నద్ధుడగు చుండెను.

ఆ సమయమున దేవదానవులు తలపడి ఘోరముగా పోరాడుచుండగా వీరుల జయధ్వనులు మిన్నుమిట్టుచుండెను. ఇరుసేనల కలవరంబు చెలరేగుచుండెను. అమరులు తమ బలపరాక్రమములను పెంచుకొని కొట్టుచుండగా అసురులు తాళలేక నలుదిశలఁ బారుచుండిరి.

అట్టి పరిస్థితి గమనించి శంఖచూడుఁడు సింహనాదము జేయుచుఁ స్వయముగా దేవతలతో పోరాడుచున్నందున నమరులు వాని తాకిడిని సహింపఁజాలక నలువైపుల కేగుచు పర్వతగుహలలో, వేరుచోట్లను నివసించుచుండిరి.

అంత దానవేంద్రుడు – దేవతల యధికారములనన్నిటిని తన వశముఁజేసుకొని స్వయముగా ఇంద్రుఁడై ముల్లోకములను శాసించుచు యజ్ఞభాగములను పరిగ్రహించుచుండెను. మరియు- సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని యముఁడు వాయువు వరుణుఁడు కుబేరుఁడు మున్నగు వారి యధికారములను స్వీకరించి స్వర్గమర్త్య పాతాళ లోకములను పాలించుచు రాజరాజేశ్వరుడై త్రైలోక్యసుఖమునంత యనుభవించుచుండినవాడు.

శంఖచూడుని రాజ్యమున కరువుగాని మారీరోగముగాని అశుభయోగములుగాని ఆధివ్యాధులుగాని లేనందున ప్రజలందరు నిశ్చింతగా సుఖించుచుండిరి. మరియు భూమి దున్నకయే సస్యములు





పండుచుండెడివి. ఓషధులు నిరంతరము రసవత్తరములుగా ఫలించుచుండెడివి. సముద్రములు రత్నములను మణుల నొసగుచుండెడివి. నేల యెల్లకాలము పుష్పఫలవంతముగా నుండెడిది.

అమరులు దక్క నితరజనులందరు – తమ వర్ణాశ్రమ ధర్మముల నాచరించుచు నప్రమత్తులై ఎట్టి యుపద్రవములు లేనివారై మనుచుండిరి. శంఖచూడుఁడు – పూర్వజ్ఞానమున లోకాధిపతియగు కృష్ణునియందు భక్తిగలవాడై శాపవశమున దానవుఁడై జన్మించినను క్రూరస్వభావము లేకుండెను. కేవలము భ్రాతృవైరమును మాత్రము దేవతలపై చూపుచుండెను.

అంత నమరులు బ్రహ్మదేవుఁజేరి ప్రణమిల్లియు శంఖచూడుని సమాచారమును నివేదింపగా నాతఁడు సురలను మునుల నూఱడించి సజ్జనులకు సుఖము నొదవఁజేయు వైకుంఠమునకు వారిని తోడ్కొనివెళ్లి వనమాలావిభూషితుఁడు కిరీటియుకుండలములఁ దాల్చినవాడునగు లక్ష్మీపతి నవలోకించియు శంఖచక్ర గదా పద్మధరుఁడగు నారాయణునికి మ్రొక్కులిడి సనకసనందనాది మహర్షులచే సేవింపఁ బడు పీతాంబరునకు వినమ్రుఁడై దేవతలతోకూడ నిలువఁబడి "శరణాగతులము, మమ్ము రక్షించు"మని ప్రార్థించెను.

అంత కేశవుఁడు ప్రసన్నుడై "వైకుంఠమునకేతెంచితివెందులకు?" అని ప్రశ్నింపగా చతుర్ముఖుఁడు – అంజలిఘటించి శంఖచూడుని ప్రభావమును దేవతల పరాభవమును విన్నవించుకొనగా శ్రీహరి – చిరునగవుతో "పంకజాసనా! శంఖచూడుఁడెట్టివాడో చెప్పెదను. ఇందెంతమాత్రము సంశయము లేదు సర్వసమర్థుడైన శంకరుఁడు నెల్లరకు మేలు నొనఁగూర్చువాడు. లోకములన్నిటిపైగల శివలోకమున పరాత్పరుఁడు పరబ్రహ్మంబునగు శివుడు – ప్రకృతి పురుషుల నతిక్రమించినవాడై ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులను తన యధీనమునందుంచుకొని ప్రాకృత గుణరహితుఁడై సర్వజ్ఞత మున్నగు సద్గుణములుగలవాడై పరజ్యోతిః స్వరూపమున నివసించుచుండును.

సృష్టిస్థితి లయకారులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు – శివస్వరూపమునుండి యావిర్భవించినవారు.

శ్లో॥ స ఏవ పరమాత్మాహి – విహర త్యుమయా సహ ।
యత్ర మాయావినిర్ముక్తో – నిత్యానిత్య ప్రకల్పకః ॥ ౨౦

పరమాత్మయగు శివుడే – శివలోకమున విద్యాస్వరూపిణియగు ఉమాదేవితో విహరించుచుండును మరియు అవిద్యాసంబంధము లేనివాడై జీవునకు దేహయోగము అనిత్యమనియు జీవుఁడు జగంబు నిత్యములనియు భక్తులకు వివేకమును కలిగించును.

అట్టి శివలోకముచెంత గల గోలోకమున శంకరుని గోవులను కాపాడుటకు మద్రూపుఁడగు కృష్ణుని శివుఁడు నియమించినవాడు. కృష్ణుడు శివానుగ్రహవశమున గోలోకమునందు – ప్రకృతిఁదగు ఐదవమూర్తియగు రాధాదేవితో విహరించుచుండును. గోపాలకులు గోపికలును పెక్కురు – రాధాకృష్ణులను సేవించుచుందురు. అట్టి గోపాలకులలో నొకడు– శివమాయా ప్రభావమున మోహితుఁడుకాగా రాధాదేవి యాతని శపించినందున దానవుఁడై జన్మించినవాడు. "శంకరుని త్రిశూలమున మరణింతు"వని శ్రీకృష్ణుఁడు గోపునకు శాపపరిహారము నొసగెను. కావున బ్రహ్మదేవా! భీతిల్లకుము మనమిరువురము

శంకరుని ప్రార్థింప శివలోకమున కేగుదము. అమరులందరు నీ వైకుంఠమున నుందురుగాక!" అని వక్కాణించి పద్మజుని వెంటనిడుకొని పద్మనాభుఁడు - భక్తవత్సలుడైన శంకరుని స్మరించుచు శివలోకమునకు బయలుదేరెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఇరువదితొమ్మిదవ యధ్యాయము.

## త్రింశాధ్యాయము

### (బ్రహ్మవిష్ణువులు సదాశివుని దర్శించి నుతించుట)

హరిబ్రహ్మలు శివలోకములో ప్రవేశించుచుండిరి.

శివలోకము - గొప్ప దివ్యప్రకాశముగలదై ఎట్టి యాధారములేనిదగుటయేగాక పంచభూత నిర్మితము గాకుండెను. అటనట రత్నప్రదేశములతో మిగుల వెలుగందుచున్న శివలోకముఁదగు మొదటిద్వారముఁ జేరగా నచ్చోట గణములు కాపలా కాయుచుండుటయేగాక మోక్ష లక్ష్మీదేవి సాక్షాత్కరించుచుండెను. అద్ది (ద్వారము) మహోన్నతమై అతి సుందరముగా నుండినది. శ్వేతవస్త్రములను రత్నాలంకారములను ధరించి రత్నసింహాసనముపై నాసీనులైన ద్వారపాలకులు - ఐదుముఖములు మూడుకన్నులు త్రిశూలాది ఆయుధధారణము భస్మ రుద్రాదారణంబు గల ధవళసుందరవిగ్రహము కలిగియుండిరి.

పంకజాసనపద్మనాభులు - అట్టి ద్వారపుల యనుజ్ఞఁబడసి రెండవ ద్వారముఁజేరి తత్రత్య ద్వారపాలకుల సమ్మతిని తృతీయాద్వారముఁబ్రవేశించిరి. ఇట్లు పదునైదు (15) ద్వారముల దాటినవారై పదునారవ మహాద్వారములో వేచియుండు నందికేశ్వరునికి ప్రణమిల్లి యాతని యనుమోదమున లోనికివెళ్ళి సదాశివుని కొలువుకూటమును చూచుచుండిరి.

ఆ సభాఉ ఉ స్థానము - పంచవక్త్రులు త్రినయనులు నీలకంఠులు శుభశుభ్రకాంతులు దశభుజులు మేలిమిమణులసొమ్ములతోకూడ భస్మత్రిపుండ్రములను రుద్రాక్షమాలికలను ధరించినవారును మహేశ్వరసమానులు నగు పార్షదులతో ప్రకాశించుచుండెను.

నూతన చంద్రమండలముఁబోలినదై నలుచదరంబునగు సదాశివుని యాస్థానము మణిహారముల తోడను రత్నములతోడను సువర్ణకమలములతోడను పద్మరాగమణులతోడను నిండినదై అద్భుతముగా కన్పట్టుచుండెను.

స్యమంతక మణులతో నిర్మింపఁబడిన సోపానములు (మెట్లు) వందలకొలదిగల శివుని కొలువుకూటమున ఇంద్రనీల మణిస్తంభములకు బంగారు దారపు ముడులతో కూడిన మనోహర చందన పల్లవములు అమర్పబడి యున్నందున చూపరులకు మిగుల నింపుగా నుండెను.

శంకరకింకరులు పెక్కురు నిండియున్న సహస్ర యోజనముల వైశాల్యము గల శివసభలో విధివిష్ణువులు సాంబశివుని దర్శించిరి.





నక్షత్రములలో చంద్రునివలె ప్రకాశించు సదాశివుఁడు – అమూల్యరత్నములతో నిర్మింపఁబడిన విచిత్ర సింహాసనముపై సభామధ్యమున కూర్చునియుండెను. కిరీటకుండలములఁదాల్చి రత్నమాలాధారియై భస్మోద్ధూళిత సర్వాంగుడై విలాసకమలమును కేలఁబూనియుండు సదాశివుఁడు – మందస్మిత వదనారవిందుడై తనముందు కైలాసరుద్రునిచే చేయఁబడుచున్న నృత్యమును గాంచుచుండెను. ఆ దివ్యతాండవమున సరస్వతి వీణ మీటుచుండెను. దేవేంద్రుఁడు పిల్లనగ్రోవి మ్రోగించుచుండెను. చతుర్ముఖుడు తాళములను కొట్టుచుండెను. గేయముల రీతులను లక్ష్మీదేవి పాడుచుండెను. నారాయణుఁడు మద్దెలను వాయించుచుండెను. అమరులు వినమ్రులై దివ్యతాండవము నవలోకించు చుండిరి.

శ్లో॥ **శాంతం ప్రసన్నమనస - ముమాకాంతం మహోల్లసం ।**

**దేవ్యా ప్రదత్త తాంబూలం - భుక్తవంతం సువాసితమ్ ॥** 22

శమదమాది సంపత్తితో గొప్పవేడుక కలిగియుండు ఉమాకాంతునకు తాండవము విరమింపఁబడిన పిదప నమ్మవారు తాంబూలము నొసగుచుండెను. ఆత్మశక్తియను అమృతముఁగ్రోలిన సదాశివుఁడు – తాంబూలమును పరిగ్రహించి ప్రమథగణములు శ్వేతచామరములతో వీచుచుండ సిద్ధులు భక్తిచే తలలువంచి ప్రార్థించుచుండగా నవ్వారి సేవల నందుకొనుచుండెను.

మరియు

శ్లో॥ **గుణాతీతం పరేశానం - త్రిదేవజనకం విభుం ।**

**నిర్వికల్పం నిరాకారం - సాకారం స్వేచ్ఛయా శివమ్ ॥** 24

**అమాయ మజ మాద్యంచ - మాయాధీశం పరాత్పరం ।**

**ప్రకృతేః పురుషస్యాపి - పరమం స్వప్రభుం సదా ॥** 25

సత్త్వరజస్తమోగుణములను మించిన శుద్ధసత్త్వగుణము కలిగి బ్రహ్మవిష్ణు మహేశ్వరులను పుట్టించు పరాత్పరుఁడు, సర్వవ్యాపకుఁడు, ఎట్టివికారము ఆకారంబు లేనివాడు తన యిష్టమున విశిష్టఆకారముతో కూడియుండువాడు, మాయాబంధము లేనివాడు, జనన మరణరహితుఁడు, మొదటివాడు, మాయను లొంగఁదీయువాడు, ప్రకృతిని పురుషుని మించిన స్వతంత్రప్రభువునగు సదాశివుని సర్వసముని పరిపూర్ణస్వరూపుని బ్రహ్మవిష్ణువులు దర్శించి బద్ధాంజులరై దిగువ విధము నుతించిరి.

దేవదేవా! మహాదేవా! శంఖచూడునిచే బాధింపఁబడుచున్నందున శరణాగతులమగుచుంటిమి. తమ శివలోకము చెంత నీ గోలోకమున విరాజిల్లు గోపాలకృష్ణుని యనుచరుండగు సుదాముఁడు – రాధాదేవిచే శపింపఁబడి శంఖచూడదానవుడై జన్మించి బ్రహ్మవరప్రభావమున నమరులను స్వర్గమునుండి వెడలగొట్టినందున తమయధికారములఁగోలుపోయి నిలువనీడలేని వారై భూతలమున సంచరించు చున్నవారు. నీవు దక్క నితరదేవతలు వానిని వధింపఁజాలరు గాన వేగమే శంఖచూడుని సంహరించి లోకకల్యాణము నొనఁగూర్పుము! నీవే సర్వసమర్థుడవై బ్రహ్మవిష్ణు రుద్రరూపములతో సృష్టి స్థితిలయముల నొనర్చుచు నాలుగవమూర్తిగా జ్యోతిఃస్వరూపమున శివుఁడనఁబఱగుచున్నావు.

ఇందుకు శ్రుతిప్రమాణము – "చతుర్థ పురుషం మన్యంతే శివ మద్వైతమ్"

శ్లో॥ త్వద్వీక్షయాచ గోలోకే - తవగాః పరిపాలయన్ ।
త్వద్గోశాలామధ్యగశ్ప - కృష్ణః క్రీడత్యహర్నిశమ్ ॥ 36

గోలోకమున నీ యనుగ్రహవీక్షణబలమునంజేసి నీ గోశాలయందు నడుమ నుండు గోపాల కృష్ణుండు నీ యావులను కాపాడుచు సుఖముగా నున్నవాడు. సర్వకారణుండవై నిర్వికారి యగువాడవు; పరమాత్మగా సర్వసాక్షి వగుదువు; దీనులను దిక్కులేనివారిని రక్షించువాడవు; శరణాగతవత్సలుడవు; మమ్ము నుద్ధరించుము! నీ యధీనుల మైతిమి గాన నీ యిష్ట ప్రకారము చేయుము!

ఇవ్విధము హరిబ్రహ్మలు ప్రార్థించి వినయముతో కరంబుల మోడ్చి శివునకు మోకరిల్లియు మౌనముగా నుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములో ముప్పదియవ యధ్యాయము.

## ఏకత్రింశాధ్యాయము

### (శివుండు విధివిష్ణువులకు ప్రబోధముఁజేయుట)

మేఘగంభీరస్వరమున శివుండు - దీనులగు హరిబ్రహ్మల నుద్దేశించి యిట్లు వచించెను.

విధివిష్ణువులారా! భయముఁజెందకుడు! శంఖచూడుని వృత్తాంతము నంతయు నెరుగుదును. నా యనుమతాంజేశియే హృషీకేశుండు (నారాయణుండు) శ్రీకృష్ణరూపమున గోలోకమున నివసించుచు యథేచ్ఛగా విహరించుచుండగా నా మాయావశమున శ్రీకృష్ణుండు తదనుచరుండగు సుదాముండు తదితర ముఖ్యులును మోహితులైన సందర్భమున సుదామునకు శాపము సంభవించినది తరువాత మాయామోహము విడిపోయినందున వారందరును శివజ్ఞానము కలవారై తమ కర్తవ్యములను నెరవేర్పందలచి నన్ను సమీపించి వినమ్రులై రక్ష! రక్ష! అని వేడుకొనినవారు. అప్పుడు నేను కృష్ణా! ఇనదానికి జడియవలసిన యవసరము లేదు. నా సంకల్పము ననుసరించియే సమస్తంబు జరుగుచుండును. రాధాదేవితోడను సుదాముని తోడను గోలోకమునకు వెళ్ళిసుఖముగానుండుము! ఈ సుదాముండు భారతదేశమున దానవుండై జన్మించును. మీ శాపముందగు విమోచనమును సమయము ననుసరించి చేయగలను." అని చెప్పగానే శ్రీకృష్ణుండు రాధాదేవియు తమ నివాసమునకుంజని సర్వంబు శివాధీనంబని మదింభావించుచు అప్రమత్తులైయున్నవారు. రాధాదేవి యొసగిన శాపమువలన సుదాముండు - శంఖచూడుడై దేవద్రోహిగాను నా మాయామోహమున దుర్మార్గులగు మంత్రులమాటల నాలకించి యమరులను బాధించువాడుగా నున్నవాడు కావున నట్టి భయమును విడనాడుడు"!

ఇవ్విధము శంకరుండు వాక్రుచ్చుచుండగా శ్రీకృష్ణుండు - రాధాదేవిని పార్షదులను వెంటనిడుకొని యేతెంచి శివునకు ప్రణమిల్లియు శ్రీహరిని సంప్రదించియు బ్రహ్మదేవునిచే సత్కరింపంబడినవాడై దోసిలొగ్గియు శివునికి దిగువవిధము విన్నవించెను.





మహాదేవా! నా యపరాధమును మన్నించుము! నీ వలననే సమస్తంబు నుద్భవించి నీయందే లీనమగును. నీవే పరంజ్యోతివై సర్వమును వ్యాపించు సనాతనుఁడవు; నీవు జగన్నాథుడవు కావుననే మేమందరము అనాథులము కాకున్నాము. నేను సర్వాధికుడనని భావించి విచ్చల విడిగా ప్రవర్తించినందున రాధాదేవితో కూడ శాపము నొందితిని. రాధాశాపముచే సుదాముఁడు - దానవుఁడై జన్మించినాడుగదా! ఆదిశక్తితో అమృతానందము ననుభవించు సదాశివా! శాపము నుద్ధరించి శరణాగతులమగు మమ్ము రక్షించుము!

ఇట్టి శ్రీకృష్ణుని ప్రార్థన నాలకించి పరమేశ్వరుఁడు ప్రసన్నుడై గోపికానాథా శ్రీకృష్ణా! చింతిపకుము! అనుగ్రహపరుడనగు నేనే ఇదియంతయు గావించితిని. నిజనివాసమునకుఁజని సావధానుడవై రాధాదేవితోడను అనుచరులతోడను కర్తవ్యములను నెరవేర్చుచుండుము! నన్ను పరాత్పరునిగా నిరంతరము భావించుము!

శ్లో॥ **వారాహే ప్రవరే కల్పే - తరుణ్యా రాధయా సహ ।**
**శాపప్రభావం భుక్త్వావై - పున రాయాస్యతి స్వకమ్ ॥** 32

శ్వేతవరాహకల్పమున నీవు రాధాదేవియు భూమిపై నవతరించి శాప ఫలము ననుభవించియు మరల గోలోకమునకు రాగలరు. శంఖచూడుని బాధలను సహింపఁజాలక హరిబ్రహ్మలు నాకు నివేదింపవచ్చియున్నవారు." అని వక్కాణించి మరల నిట్లు వచించెను.

హరిబ్రహ్మలారా! అమరుల నానందింపఁజేయుటకు త్వరగావెళ్ళి నే చెప్పినట్లు చేయుఁడు! నా సంపూర్ణాంశమున నావిర్భవించిన కైలాసవాసి రుద్రుని దర్శించి ప్రార్థింపుడు!

శ్లో॥ **మత్త స్తత్తో నభేదోఽస్తి - యువయోః సేవ్య ఏవ సః ।**
**అవయో ర్భేదకార్త యః - స నరో నరకం వ్రజేత్ ॥** 42

ఆ రుద్రునకు నాకును భేదము లేదు చరాచరప్రాణులకేగాక మీయిరువురిచేతను రుద్రుఁడు సేవింపఁ దగినవాడు. నాకు రుద్రునకును భేదమును పాటించువాడు నరకము నొందుటయేగాక నీ జన్మయందును పుత్రపౌత్రాదిరహితుడై కష్టపడుచుండును.

ఇట్టి శివభాషితము నాకర్ణించి రాధాకృష్ణులు హరిబ్రహ్మలును నమస్కరించి తమ లోకములకు జేగినవారు.

పిదప హరిబ్రహ్మలు వైకుంఠమున నింద్రాదిదేవతలకు వృత్తాంతమును తెలియఁబఱచి వారిని వెంటనిడుకొని కైలాసమునకుఁజనిరి. అట దేవదేవుఁడు పార్వతీవల్లభుఁడు దీనులను కాపాడుటకు దివ్యవిగ్రహముఁ దాల్చినవాడు నగు శంకరుని దర్శించి గద్గదస్వరమున వినయము భక్తియు వెల్లిపడుచుండగా "శంఖచూడుని భయమువలన నిన్ను శరణము నొందితిమి. మహేశ్వరా! శంఖచూడుని వధించి మమ్ము కాపాడుము! దేవతలకు స్వర్గము నిప్పించుము! దేవేంద్రుని స్వర్గరాజ్యాధిపతిగా నొనర్పుము!" అని ప్రార్థింప శంకరుఁడు దయఁగలవాడై గంభీర స్వరమున "అమరులారా? భయపడకుడు! శంఖచూడుని పరివారముతో గూడ వధింతును. శివుని యాదేశంబునెనది" అని వచించెను.

అమృతప్రవాహపతనముఁ బోలిన శంకరవాక్యమును విని హరిబ్రహ్మాదులు అప్పుడే దానవుఁడు మడిసినట్లు భావించుచు తమ తమ నివాసములకు వెళ్ళినవారై సుఖముగా నుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనములో ముప్పదియొకటవ యధ్యాయము.

## ద్వాత్రింశాధ్యాయము

### (శంకరుఁడు శంఖచూడుని యొద్దకు దూతను పంపుట)

దుష్టులను శిక్షించు శిష్టులను రక్షించు శంకరుఁడు అమరుల ప్రార్థనము ననుసరించి శంఖచూడుని సంహరింపవలెనని మనంబున నిశ్చయించుకొని తన భక్తుడైన చిత్రరథుఁడను గంధర్వరాజును దూతగా శంఖచూడుని చెంతకు పంపెను.

మహేంద్రుని అమరావతీ నగరమును కుబేరుని యలకానగరమును మించిన శంఖచూడుని నివాసమునకు చిత్రరథుఁడు వెళ్ళినవాడై పంద్రెండ్రు ద్వారములతో ద్వారపాలకుల తోడను రాణించు భవనమునఁ బ్రవేశించి ద్వారపాలకుల యనుమతిఁబడసియు దనుజాధిరాజగు శంఖచూడుని దర్శించెను. అట్టితతి శంఖచూడుఁడు - రత్నసింహాసనముపై నధిష్ఠించి మూడు కోట్ల దానవేంద్రులు సేవించుచుండగా నూరుకోట్ల దైత్యులు ఆయుధములఁదాల్చి కాపలాకాయుచుండగా నలరారుచుండెను.

అట్టి శంఖచూడుని వైభవమును కనులార గాంచుచు చిత్రరథుఁడు - విస్మయముఁ జెందుచు దిగువ విధము శంకరుని సందేశమును వినిపించెను.

దైత్యరాజా! శంకరుని దూతనై పుష్పదంతుడనుగా వచ్చితిని. కావున శంకరుఁడు చెప్పిన మాటల నాలకింపుమని కోరుచున్నాను.

దేవతలకు స్వర్గరాజ్యము నొసగుము! లేదేని సజ్జనరక్షకుఁడ నగు నాతో యుద్ధము నొనర్పుము! అమరులు శరణాగతులై నన్ను ప్రార్థించినవారు అందువలన నాకు ఆగ్రహమును తెప్పించకుము! ఒకవేళ నేను నీ యందు క్రోధము గలవాడ నగుదునెడ నిన్ను వధింతును. ఇందెంతమాత్రము సంశయములేదు. శరణాగతులను తప్పక కాపాడువాడనై నీవంటి లోకకంటకులను దునుమువాడను. అమరులకు స్వర్గరాజ్యము నిప్పింతునని యభయము నొసఁగితిని. కావున దేవతలకు రాజ్యము నిత్తువో నాతో పోరాడుదువో బాగుగా విచారించుకొని సమాధానము నీయుము!

ఇవ్విధము శంకరుఁడు వక్కాణించినవాడు. దీని కేమి చెప్పుదువో అట్టి నీ యభిప్రాయమును ప్రభువును కెఱిగింతును.

అని పుష్పదంతుఁడు పలుకగా శంఖచూడుఁడు - అమరులకు రాజ్యము నొసగను. ఈ లోకత్రయాధిపత్యము నావంటి వీరునకే యుండవలెనుగదా! నిన్ను మొదట యుద్ధమున నోడింప నుదయమే వచ్చుచున్నానని చెప్పుమని శంఖచూడుఁడు గర్వముతో మాటలాడినందున పుష్పదంతుఁడు చిరునగవుఁ జెంది మరల నిట్లు సంభాషించినవాడు.





దానవాధిపా! శంకరునిమాట యెందులకు? అతనిగణముల ముందే నిలువఁజాలవు. కావున నా వాక్యమును పాటించి దేవతలకు రాజ్యము నొసగి పాతాళలోకమున సుఖముగా నివసింపుము! శంకరుని సామాన్య దేవతగా భావింపకుము! అతఁడే భగవానుఁడు పరమాత్మయనగువాడు; బ్రహ్మాదులకు నధిపతి కావుననే ఇంద్రాది లోకపాలకులు కశ్యపాదిప్రజాపతులు సనకసనందనాది సిద్ధులు నారదాది మునులు ఆదిశేషుఁడు మున్నగు నాగరాజులు నాతని శాసనము ననుసరించి వర్తించుచుందురు. శ్రీహరి గూడ నాతని వశవర్తి యగువాడు. శంకరుని కనుబొమఁదగు ముడిచేతనే ప్రపంచ ప్రళయము సంభవించును. సచ్చిదానందమయుండగు శివుని పూర్ణరూపంబగు మహేశ్వరుని ఆజ్ఞను హరిబ్రహ్మలే శిరసా వహింతురు. అట్టి మహాదేవుని యానతిని ధిక్కరింపకుము! పెక్కు మాటలేల! దనుజరాజా! శంకరుఁడే పరబ్రహ్మంబని భావించి దేవేంద్రునకు రాజ్యము నొసగి సుఖముగా జీవించుము! లేనిచో మరణభయముతప్పదు.

అంత శంఖచూడుఁడు-గంధర్వుని హితోపదేశమును పాటించియు "నాయంతట నేను-యుద్ధము లేకుండా దేవతలకు రాజ్యము నీయఁజాలను. సమస్తంబు కాలాధీనముగదా! అంతయు కాలము అనుకూలించినపుడు ఉదయించును. కాలము ప్రతికూలించినచో నశించును. నీవు పెక్కు మాటలాడక శంకరునికి నా యభిప్రాయమును నివేదింపుము! పిదప ఏది యోగ్యమో దానినే యాతడాచరించును."

అని చెప్పగానే చిత్రరథుఁడు (పుష్పదంతుఁడు) బయలుదేరి వడిగా కైలాసముఁజేరి శంకరునకు శంఖచూడుని సంభాషణము నంతయు నివేదించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ముప్పదిరెండవ యధ్యాయము.

## త్రయస్త్రింశాధ్యాయము

### (శంకరుని యుద్ధ ప్రయాణమును వర్ణించుట)

మహాదేవుఁడు శంఖచూడుని యభిప్రాయమును చిత్రరథుని ద్వారా గుర్తెరిగి కోపమున వీరభద్రుఁడు మున్నగు గణాధిపతులను నందికేశ్వరుని అష్టభైరవులను కుమార గణపతులను యుద్ధమునకై బయలుదేరుఁడని యాదేశింపగా నందరును శంఖచూడునితో పోరాడుటకు కైలాసమునుండి వెడలుచుండిరి.

మహాకాలుఁడు సుభద్రకుఁడు, విశాలాక్షుఁడు, బాణుఁడు, పింగళాక్షుఁడు, వికంపనుఁడు, విరూపుఁడు, వికృతియు, మణిభద్రుఁడు, బాష్కలుఁడు, కపిలుఁడు, దీర్ఘదంష్ట్రుఁడు, వికరుఁడు, తామ్రలోచనుఁడు, కాలంకరుఁడు, బలీభద్రుఁడు, కాలజిహ్వుఁడు, కుటీచరుఁడు, బలోన్మత్తుఁడు, దుర్జయుఁడు, దుర్గముఁడు మొదలగు సైన్యాధిపతులు తమ తమ సైన్యములను వెంట నిడుకొని శంకరు ననుసరించుచుండిరి.

వేయి చేతులతో జటామకుటముతో చంద్రరేఖ తోడను శోభించు రుద్రగణములు-నీలకంఠులుగాను త్రిలోచనులుగాను భస్మరుద్రాక్షధారులుగాను హారకుండల కేయూరాది భూషణములఁ దాల్చినవారుగాను ప్రేక్షకులకు కనుపడుచుండిరి.

నేలపై నడుచువారు పాతాళమున నుండువారు ఆకాశమున సంచరించువారు స్వర్గాది పుణ్యలోకముల యందు నివసించువారు తదితర ప్రదేశముల నెలకొనియుండువారు నగు శివ గణము లందరును దానవులతో పోరు సలుపుటకై వేంచేసియుండిరి.

ఏకాదశరుద్రులు, అష్టవసువులు, ద్వాదశ ఆదిత్యులు, అగ్నిదేవుఁడు, చంద్రుఁడు, విశ్వకర్మ, అశ్వినీదేవతలును, కుబేరుఁడు యముఁడు, నిర్ఋతియు, నలకూబరుఁడు, వాయుదేవుఁడు, వరుణుఁడు, బుధుఁడు, మంగళుఁడు. ఇతరగ్రహములు, కామదేవుఁడును యుద్ధ సన్నద్ధులై నడచుచుండిరి.

శతభుజయగు భద్రకాళీదేవి రక్తవస్త్రమును ధరించి ఎరుపు పుష్పమాలికను మెడలో వేసుకొని నాట్యమాడుచు నవ్వుచు సుస్వరముగా పాడుచు తనవారికి నభయము నొసగుచు పగతురకు భయముఁ గొలుపుచుండెను. ఎనిమిదిమైళ్ల నిడివిగల నాలుకగలదై శంఖచక్రములు గదాపద్మములు, ఖడ్గము తోలు ధనుర్బాణములు, ఉన్నతమైన త్రిశూలము, శక్తియు, ఇనుప గుదియ, రోకలి, వజ్రాయుధము, ఖడ్గము, డాలు అనువానిని మరియు వైష్ణవ వారుణ వాయవ్య నాగపాశ నారాయణ గాంధర్వ బ్రహ్మ గారుడ పార్జన్య పాశుపత జృంభణ పార్వత మాహేశ్వర సమ్మోహనాది మహాస్త్రములను కరములఁ దాల్చినదై మూడుకోట్ల యోగినులతో మూడుకోట్ల ఢాకినులతోడను భద్రకాళీదేవి యరుదెంచిన దయ్యెను.

ఇంకను భూతప్రేత పిశాచ బ్రహ్మరాక్షస సంఘములు, యక్షులు, కిన్నరులు, భేతాళులును రాగా కుమారస్వామి ముందుకేగి చంద్రశేఖరునకు ప్రణమిల్లి సహాయుఁడై యుండెను.

ఇవ్విధము శంకరుఁడు కైలాసమునుండి భూలోకమునకు వేంచేసినవాడై చంద్రభాగా నదీతీరమున వటవృక్షము క్రింద బసచేసియుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ముప్పదిమూడవ యధ్యాయము.

## చతుస్త్రింశాధ్యాయము

### (శంఖచూడుని యుద్ధాగమనము)

శంకరుఁడు పంపిన దూత శంఖచూడుని వద్దకు వెళ్ళి శివుని సందేశమును చెప్పగా శంఖచూడుఁడు అంతఃపురములోనికిఁజని తన భార్యయగు తులసీదేవికి "శంకరునితో పోరాడుటకు వెళ్లుదును. నా నిశ్చయమునకు తిరుగు చెప్పవలదని వక్కాణించి ఆ రాత్రి ఆమెతో సుఖముగా రతిక్రీడలఁ దేలినవాడై బ్రాహ్మముహూర్తమున మేలుకొని స్నానసంధ్యావందనాది నిత్యకృత్యములఁ దీర్చుకొని బ్రాహ్మణులకు అపరిమితముగా దానమొసగెను. మరియు నాతఁడు దానవ మంత్రుల సమక్షమున తన కుమారుని రాజ్యసింహాసనముపై నధిష్ఠింపఁజేసియు దుఃఖించుచు యుద్ధము వలదనుచున్న తులసీదేవిని పలువిధములుగా నూఱడించి యామెను కుమారునకు బాగుగా రక్షించుమని చెప్పియు వీరుఁడను సేనాధికారిని పిలిచి యిట్లు ఆదేశించెను.





సేనాధిపతులందరు యుద్ధసన్నద్ధులై చతురంగ బలముతో బయలుదేరుఁడు! దైత్యులు దానవులు కంకులు అసురులు ధౌమ్రులు కాలకేయులు మౌర్యులు కాలకులు నందరును శంకరునితో పోరాడుటకు వెడలుడు!

శంఖచూడుఁడు పై విధము తన సైనికుల నాజ్ఞాపించి వారందరిని వెంటనిడుకొని ప్రయాణము చేయునపుడు యుద్ధశాస్త్రవిశారదుఁడగు మహావీరుఁడు ముందు నడచుచుండెను. రత్నశ్రేష్ఠములచే నిర్మితంబగు రథమునందు శంఖచూడుఁడు ఆసీనుఁడై గురువులను ముందిడుకొని పుష్పభద్రా (చంద్రభాగా) నదీ తీరమున అక్షయవటము చెంతనుండు సిద్ధాశ్రమమున కరుదెంచెను.

సిద్ధాశ్రమము–భారతదేశమున కపిలమహర్షి తపించిన పుణ్యక్షేత్రముగాను పశ్చిమసముద్రమునకు తూర్పుగాను మలయ పర్వతమునకు పడమఱగాను శ్రీశైలమున కుత్తరముగాను గంధమాదనమునకు దక్షిణముగాను విరాజిల్లుచు ఐదు యోజనముల వెడల్పుతో ఐదువందల యోజనముల పొడవుతోడ నుండునది.

పుష్పభద్రానది – శుద్ధస్ఫటికముఁబోలిన నుదకముగలదై సరస్వతీనదితో కూడుకొని యెల్లకాలము సౌభాగ్యము నొసగునదై హిమాలయమునుండి బయలుదేరి లవణసముద్రమునఁగలియునది. మరియు పుష్పభద్ర – సముద్రమున కలియు ప్రదేశమునకు గోమంత పర్వతము – ఎడమవైపున కనుపడును.

శంఖచూడుఁడు – అచ్చోటునకు వెళ్లి శివుని సైన్యమును గాంచెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనములో ముప్పదినాలుగవ యధ్యాయము.

## పంచత్రింశాధ్యాయము

### (శివునితో శంఖచూడుని దూత సంభాషించుట)

పశ్చిమ సముద్రతీరమున విడిది చేసి శంఖచూడుఁడు గొప్ప తెలివిగల దానవుని శంకరుని చెంతకు పంపగా దానవుఁడు చంద్రశేఖరుని గాంచి రెండుచేతులు జోడించి మోకరిల్లియు వినయముతో మాటలాడెను.

సూర్యకోటి సమానకాంతి గలిగి యోగాసనముపై జ్ఞానముద్రఁదాల్చి చిరునగవుతో విరాజిల్లువాడు, శుద్ధస్ఫటికముఁబోలిన శరీరవర్ణము గలవాడై బ్రహ్మతేజమున వెలుగందువాడు, త్రిశూలమును గండగొడ్డలిని కరములఁదాల్చి పెద్దపులితోలుఁగట్టుకొని యుండువాడు, భక్తుల మృత్యువును హరించువాడు, శాంతస్వభావుఁడు, గౌరీకాంతుఁడు, త్రిలోచనుఁడు, తపంబుల ఫలింపఁజేయువాడు, సర్వవిధ సంపదల నొసఁగూర్చువాడు వడిగా సంతసించువాడు, భక్తుల ననుగ్రహించుటకు త్వరపడువాడు, ప్రసన్నముఖ పంకజము గలవాడు, విశ్వనాథుఁడు, ప్రపంచ స్వరూపుఁడు జగమును పుట్టించువాడు, జగద్రక్షకుఁడు, బ్రహ్మాండమును సంహరించువాడు, జగత్కారణములగు ప్రకృతి పురుషులకు కారణమగువాడు,

నరకసముద్రమునుండి తరింపఁజేయువాడు, నిష్కామభక్తిగలవారికి శివజ్ఞానమును ప్రసాదించువాడు, సనాతనుఁడు, సచ్చిదానందమయుఁడు నగు శంకరుని మఱ్ఱిచెట్టుఁక్రింద దానవదూత చూచి నమస్కరించియు భద్రకాళీదేవికి కార్తికేయస్వామికిని మ్రొక్కులిడగా వారు దానవదూతకు శుభాశీస్సులనొసగి యభినందించిరి. పిదప దానవదూత ప్రత్యేకముగా శంకరు నుద్దేశించి "నేను శంఖచూడుని యనుచరుఁడను, నీ వద్దకు వచ్చితిని మహేశ్వరా! నీ యభీష్ట మెద్దియో వివరింపు" మని విన్నవించెను.

శంఖచూడుని దూతఁదగు వాక్యమును విని శంకరుఁడు ప్రసన్నమనంబున దిగువ విధము సమాధానము నొసగెను.

దానవశేఖరా! నా మాట పాటించి శంఖచూడున కెఱిగింపుము! లోకములను సృజించు బ్రహ్మదేవుని కుమారుఁడగు మరీచికి కశ్యపుఁడను తనయుఁడు జన్మించెను. దక్షప్రజాపతి - తన కుమార్తెలను పదముగ్గురిని కశ్యపప్రజాపతికి సమర్పించి వివాహముఁ జేయగా నవ్వారిలో మహాసాధ్వియగు దనుదేవి పతిఁదగు సౌభాగ్యమును పెంచు నుద్దేశముతో పరాక్రమవంతులగు నలుగురు కుమారులను కనియున్నది. వారిలో విప్రచిత్తి యనువాడు గొప్పబలము గలవాడైయుండెను. విప్రచిత్తికి ధార్మికుఁడగు దంభుఁడు జన్మింపగా నాతనికి కుమారుడవై నీవు నుదయించితివి.

పూర్వము నీవు గోలోకమున గోపాలకృష్ణుని పార్షదుడవై రాధాదేవి యొసగిన శాపమున దానవుఁడవై జన్మించితివి కాని నిజముగా దైవీసంపద గలవాడవు. ఇట్టి నిజవృత్తాంతమును బాగుగా తెలుసుకొని యమరులతో వైరముఁజేయకుము! దేవద్రోహము సమంజసము కాదు గావున వారి పదవులను వారి కొసగి నీ పదవియందు సుఖముగా జీవించుచు నా యనుగ్రహమునకు పాత్రుడవు కమ్ము! దేవతలు తమతమ యధికారములతో లోకకల్యాణము నొనఁగూర్తురుగాక!

శ్లో॥ యాని కానిచ పాపాని - బ్రహ్మ హత్యాదికానిచ ।
జ్ఞాతిద్రోహజ పాపస్య - కలాం నార్హంతి షోడశీమ్ ॥ ౨౩

బ్రహ్మహత్య మొదలగు గొప్ప గొప్ప పాతకములన్నియు పాలివారికి ద్రోహముఁజేయుట యను పాపములో పదియారవ భాగము కాజాలవు. అనఁగా జ్ఞాతిద్రోహపాపము దుష్కృతములన్నిటిని మించినదని భావము.

ఇవ్విధము శంకరుని శ్రుతిస్మృతి విహితంబగు విజ్ఞానముతో కూడిన ప్రబోధమును దానవదూత యాకర్ణించి కానున్న యనుభవముఁదగు కారణమున నవివేకముతో "పరమేశ్వరా! జ్ఞాతిద్రోహమువలన కలుగు దోషము దానవులకే గాక దేవతలకును సంభవించును గదా!

ప్రళయకాలమున మధుకైటభుల శిరంబులను శ్రీహరి యెందుకు ఖండించెను? నీవు గూడ సురపక్షపాతివై త్రిపురాసురులను వధించితి వెందులకు? వామనుఁడు బలిచక్రవర్తిఁదగు సర్వస్వమును పరిగ్రహించి పాతాళమున కెందుకు పంపెను? హిరణ్యకశ్యప హిరణ్యాక్షులను శుంభ నిశుంభాదుల నమరులెందుకు మడియఁజేసిరి?

పూర్వము సముద్రమును తఱిచినపుడు దేవతలకు మాత్రము అమృతము లభించునట్లు చేసినదెవరు?





శ్లో॥ క్రీడాఖాండ మిదం విశ్వం - కాలస్య పరమాత్మనః ।
న దదాతి యదా యస్మై - తస్యైశ్వర్యంభవేత్తదా ॥ 34

కాలస్వరూపుడగు పరమాత్మకు ఈ ప్రపంచము విహారభూమి యగునట్టిది. ఎవనికి పరమాత్మ యెప్పుడు అనుకూలించునో వానికి ఆ సమయమున సర్వాధికామము చేకూరును.

మరియు దేవదానవులకు ఏదే నొక నిమిత్తమున వైరము కలుగుచుండుట నెల్ల కాలము చూచుచున్నాముగదా! జయ పరాజయములు కాలాధీనములు కావున దేవదానవుల మధ్య సమదృష్టిగల నీవు వచ్చుట పాడికాదు. సురాసురులకు ప్రభువగు నీకు మాతో తగవులాడుట లజ్జాస్పదము కాదా? ఒకవేళ నీవు గెలచినచో గొప్ప కీర్తి సమకూరును. ఓడినచో నగుపాటు పాలగుదువు! ఇది యంతయు బాగుగా విచారించుకొని కర్తవ్యమును విశదీకరింపుము!"

అని విన్నవింపగా శంకరుఁడు - సంతసించి యిట్లు వక్కాణించెను. భక్తపరాధీనులమై భక్తుల ప్రార్థన ననుసరించి ప్రవర్తించువారము గాన నెవరియందును పక్షపాతము మాకు లేదని తెలియుము!

ప్రళయసముద్రమున బ్రహ్మ చేసిన ప్రార్థనము నాలకించి శ్రీహరి – మధుకైటభులను సంహరించెను. మరియు అమరుల విజ్ఞప్తిఁజేసి నృసింహస్వామి ప్రహ్లాదుని రక్షించుటకు హిరణ్యకశ్యపుని వధింపవలసివచ్చెను. లోకకంటకులైన త్రిపురాసురులను బ్రహ్మాదుల మొఱల నాకర్ణించి భస్మమొనరించితిని. ఇంద్రాదులు ప్రార్థించుటచే జగన్మాత - శుంభనిశుంబాదులను చంపినదయ్యెను.

ఇప్పుడును సురలు బ్రహ్మదేవుని ప్రార్థింపగా నాతఁడు శ్రీహరిఁదోడ్కొనివచ్చి నన్నువేడినందున సురాసురసమానుడనైనను యుద్ధమునకు రావలసినవాడనైతిని. శంఖచూడుఁడు ఇతరదానవులవలె సామాన్యుఁడుకాడు. శ్రీకృష్ణుని యనుచరుఁడు మహానుభావుఁడు కావున నాతనితో పోరాడుట లోకకల్యాణకాముడనగు నాకు లజ్జాస్పదము కాజాలదు.

అందువలన నీవు వెళ్ళి శంఖచూడునకు నా యభిప్రాయమును నివేదింపుమని పరమేశ్వరుఁడు విరమింపగా దానవదూత యటనుండి శంఖచూడుని సన్నిధానముఁజేరినవాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ముప్పదియైదవ యధ్యాయము.

## షట్త్రింశాధ్యాయము

### (శివగణములకు రాక్షస సైన్యములకు పోరాటము)

దానవదూత - శంఖచూడునకు శివుని భాషణము నంతయు వివరింపగా దానవేంద్రుఁడు (శంఖచూడుఁడు) ఆసక్తితో యుద్ధమునే నిశ్చయించెను. మరియు మంత్రులను వెంటనిడుకొని రథముపై నధిష్ఠించి యుద్ధమునకు సిద్ధ పడగా శంకరుఁడు నమరులను ప్రమథగణములను ప్రేరేపించి పోరాటమునకై ముందు కేతెంచెను.

యుద్ధ ప్రారంభమున వాద్యములు మ్రోగింపఁబడుచుండెను. వీరులందరు కలకల ధ్వనిఁ జేయుచుండిరి. దేవదానవ సైన్యములు – పరస్పరము ధర్మయుద్ధము నొనర్చుచుండిరి.

మహేంద్రుఁడు – వృషపర్వునితోడను, సూర్యుఁడు – విప్రచిత్తితోడను, విష్ణుమూర్తి – దంభునితోడను, కాలుఁడు – కాలాసురునితోడను అగ్నిదేవుఁడు – గోకర్ణునితోడను కుబేరుఁడు – కాలకేయునితోడను, విశ్వకర్మ – మయునితోడను మృత్యుదేవత – భయంకరునితోడను, యమధర్మరాజు – సంహారునితోడను, వరుణదేవుఁడు – కాలాంబికునితోడను, వాయుదేవుఁడు – చంచలునితోడను, బుధుఁడు – ఘటపృష్ఠునితోడను, శనైశ్చరుఁడు – రక్తాక్షుని తోడను, జయంతుఁడు – రత్నసారునితోడను, వసువులు – వర్చస్సుల సముదాయముల తోడను, అశ్వినీదేవతలు – దీప్తిమంతులతోడను, నలకూబరుఁడు – ధూమ్రాసురునితోడను, ధర్మదేవత – ధురంధరునితోడను, మంగళుఁడు (అంగారకుఁడు) – గణకాక్షునితోడను, వైశానరుఁడు – శోభాకారునితోడను, మన్మథుఁడు – పిపిటునితోడను, ద్వాదశాదిత్యులు – గోకాముఖ చూర్ణ ఖడ్గ ధూమ్ర సంహల విశ్వ ప్రతాపి పలాశులు మొదలగు నసురులతోడను పోరాడుచుండిరి. ఏకాదశరుద్రులు – మహాబలపరాక్రమములు గలిగి భయంకరులగు రాక్షసుల తోడను, మహామణిదేవుఁడు – ఉగ్రచండాది దానవులతోడను, చంద్రుఁడు – రాహువు తోడను, బృహస్పతి – శుక్రాచార్యుననినతోడను, నందీశ్వరుఁడు మొదలగు గణాధిపతులు – దానవప్రవరులతోడను తలపడియుండిరి.

శంకరుఁడు – పార్వతీదేవితోడను కుమారస్వామితోడను వటవృక్షముఁదగు మూలమున కూర్చునియుండగా శంఖచూడుఁడు – తన శిబిరమున రత్నసింహాసనముపై కోట్లకొలది దానవులు తనను సేవించుచుండగా ఆసీనుఁడైయుండెను.

అట్టితఱి దేవదానవుల అస్త్రశస్త్రములు ఇటునటు ఘోరముగా పరుగిడుచుండెను. ఇరుసైన్యములు కోలాహలముఁజేయుచుండగా తలకాయలు – తెగిపడుచుండెను. గజతురగములు భటులును ప్రాణములఁ గోలుపోవుటయే గాక రథములు విరిగిపడుచుండెను. నేలపై ఎటుచూచినను తలకాయలు మొండెములు, కిరీట కుండలాదులును కనఁబడుచుండెను.

వీరులు – అఱచుచు శస్త్రాస్త్రములను తీక్ష్ణబాణములను ప్రయోగించుచు గొప్ప నినాదములఁ జేయుచుండిరి. సారథులను పడగొట్టుచుండిరి. శంఖములను పూరించుచుండిరి.

ఇట్టి యుద్ధము – చాలాకాలమువరకు నెరవేరినదయ్యెను.

ఇద్దియు – మహాప్రభువగు శంకరుని లీలావిలాసమే యని తెలియవలెను. శివలీల – దేవదానవాది ప్రపంచమునంతయు మోహింపఁజేయుము గదా!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువద ప్రవచనముతో ముప్పదియారవ యధ్యాయము.





# సప్తత్రింశాధ్యాయము

## (శంఖచూడుఁడు - తన సైన్యముతోకూడి యుద్ధముఁజేయుట)

దానవుల ప్రతాపమునకు దేవతలు తాళలేనివారై పరుగిడుచు "రక్షించుము! రక్షించుము!" అని శంకరుని శరణము నొందిరి. అమరుల మొఱ విని శంకరుఁడు కోపముఁ జెంది యవ్వారిని దయతో గాంచి అమరులారా! భయపడకుడు! అని యభయము నొసగియు తన గణముల సమరోత్సాహము నినుమడింపఁజేసి కుమారస్వామి నాజ్ఞాపించినందున యాతఁడు సన్నద్ధుడై దానవులతో ఎట్టి భయముఁ జెందక ఘోరముగా పోరాటముఁ జేయుచుండెను. కార్తికేయుఁడు శివాజ్ఞానవశమున వీరశబ్దము నుచ్చరించుచు నూరక్షోహిణుల దానవసైన్యమును దునుమాడెను. కాళికాదేవి – దైత్యులఁజంపుచు రక్తమును ప్రవహింపఁజేయుచు వారి శిరంబుల ఖండించి భక్షించుచు నెత్తురుఁద్రాగుచుండెను మఱియు కోటియేనుగులను కోటిభటుల నొకే హస్తముతో పరిగ్రహించి నోటఁబడవేసెను. వేలకొలది మొండెములు - రణరంగమున నెగిరి పడుచుండగా పిరికివారు జడియుచుండిరి. కుమారస్వామి – మరల నొక పర్యాయము ఉగ్రుఁడై బాణముల నసురులపై కురిపించుచు కోట్లకొలది దానవులను సంహరించుచుండెను. మిగిలినవారు భయపడి పారిపోవుచుండిరి. వృషపర్వుఁడు, విప్రచిత్తి, దండుఁడు, వికంపనుఁడును క్రమముగా స్కందునితో పోరుచుండిరి. మహామారీదేవి మిగుల ధైర్యముతో స్వామికి సహకరించుచుండినది. కుమారుని శక్తిచే బాధింపఁబడినవారై యసురులు పరాజయముఁ బొందుటయు మహామారీదేవి, కార్తికస్వామియు విజయము నొందుటయు గమనించి ఖేచరులు దుందుభులను మ్రోగించుటయే గాక పుష్పవృష్టిఁగురిపించుచుండిరి.

అట్టి మహామారీస్కందుల పరాక్రమము నవధరించి శంఖచూడుఁడు కోపోద్రిక్తుడై రథముపై నధిష్ఠించి ధనుర్బాణముల కేలఁబూనియు దేవతలపై శరములను కురిపించుచుండగా రణరంగమున చీకటులు క్రమ్ముకొనుచుండెను. పర్వతములను సర్పములను గజములను వృక్షములను దేవతలపై శంఖచూడుఁడు పడవేయుచున్నందున స్కందుడు సూర్యచంద్రులు మంచుతో కప్పఁబడినట్లు వానిక్రింద మఱుగుపడియుండిరి. మయునిచే నేర్పఁబడిన మాయను పలురకములుగా శంఖచూడుఁడు చూపుచున్నందున సురలు అట్టి మాయాప్రభావమును గుర్తెరుగకుండిరి. మరియు శంఖచూడుఁడు కుమారుని ధనుస్సు నొకబాణముతో ఛేదించి రథమును విరగగొట్టి రథాశ్వములను పడగొట్టెను. నెమలిని వేధించెను. సూర్యునిఁబోలిన శక్త్యాయుధమును ఛాతిపై వేయఁగా కుమారస్వామి హఠాత్తుగా మూర్ఛితుడయ్యెను. కొంత తడవునకు మేలుకొని రత్ననిర్మితమగు స్యందనము నధిరోహించి సాంబశివుని చరణములను స్మరించియు కార్తికేయుఁడు శస్త్రాస్త్రములను పరిగ్రహించి ఘోరమైన పోరు సలుపుచు సర్పములను పర్వతములను వృక్షములను పాషాణములను క్రిందపడగొట్టుచుండెను.

పర్జన్యాస్త్రముతో మంటలు చల్లార్చెను. శంఖచూడుని ధనుర్బాణములను గూడ తెగగొట్టెను. అశ్వములను పడగొట్టి కిరీటమును పడవైచి శక్తి అను ఆయుధమును శంఖచూడుని ఛాతిపై వేయఁగా వాడు తెలివిఁదప్పి క్షణకాలముననే మేలుకొని మరల శక్తితో కొట్టగా కుమారస్వామి – బ్రహ్మదేవుఁ డొసగిన శంఖచూడుని శక్తిని వ్యర్థముచేయరాదని భావించి నేలఁగూలినవాడయ్యెను.

తోడనే కాళికాదేవి - కుమారుని చంక నిడుకొని శివునిచెంతకు తీసికొని పోగా శంకరుఁడు కృపాదృష్టితో నవలోకించినందున కుమారస్వామి జాగరూకుడై మరల యుద్ధమునకై వెళ్ళనుద్దేశించుతతి వీరభద్రుఁడు సన్నద్ధుడై శంఖచూడునితో పోరాడుచు వాడు వేయుచున్న శస్త్రాస్త్రములను నవలీలగా ఛేదించుచుండెను. శంఖచూడుఁడును వీరభద్ర స్వామి ప్రయోగించు బాణములను ఆయుధములను పడగొట్టుచుండెను. ఇట్లు నిరువురికి పోరాటము ఘోరముగా జరుగుచుండగా కాళికాదేవి - ఉగ్రురాలై తనవారిని రక్షించుటకు పగవారిని భక్షించుటకును ముందుకు రాగా నందికేశ్వరుఁడు మున్నగు ప్రమథవీరులు, అమరులు, గంధర్వులు, యక్షులు, పన్నగులు నందరును యుద్ధమునకై తలపడియుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ముప్పదియేడవయధ్యాయము.

## అష్టత్రింశాధ్యాయము

### (కాళీ యుద్ధము)

కాళికాదేవి - రణరంగమున సింహనాదముఁజేయగా అట్టి భయంకర ధ్వనిని వినలేక దానవులు మూర్ఛఁజెందుచుండిరి. మరియు నాదేవి-మధుపానమునొనర్చి యట్టహాసముఁజేయుచుండగా ఉగ్రదంష్ట్ర ఉగ్రదండ, కొటవి మొదలగు దేవీమూర్తులు. అచ్చోటునకేతెంచి మధువుఁద్రాగుచుండిరి. శివగణములలో దేవసముదాయములయందును గొప్ప కలకలము చెలరేగెను.

అట్టితతి దానవులు భయపడుచుండుటను గమనించి శంఖచూడుఁడు వేగమే పోరునకురాగా కాళీదేవి ప్రళయ జ్వాలలతో నిండియుండు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించిన నద్దానిని దానవేశ్వరుఁడు వైష్ణవాస్త్రమున శమింపఁజేసెను. తరువాత దేవివేసిన నారాయణాస్త్రమునకు శంఖచూడుఁడు మోకరిల్లినందున నయ్యది శాంతింపగా నమ్మవారు మంత్రపూతమైన బ్రహ్మాస్త్రమును ప్రయోగింప శంఖచూడుఁడు నామెపై బ్రహ్మాస్త్రమును వేసెను.

మరియు దానవేంద్రుఁడు క్రుద్ధుడై వేసిన దివ్య ఆయుధముల నన్నిటిని కాళికాదేవి నోరుఁదెఱచి మ్రింగుచున్నందున రక్కసులు వెఱఁగందుచుండిరి. ఇవ్విధము కొంతకాలము వారిరువురికి నెరవేరని పోరాటమును దేవతలు దానవులును చూచుచుండిరి.

చివరకు దేవి పాశుపతాస్త్రము నుపయోగింప నుద్యుక్తురాలగుచున్నపుఁడు "దేవీ పాశుపతముతో వీనికి మరణము సంభవింపదు గాన నిద్దానిని వ్యర్థముచేయరాదు" అని యాకాశవాణి వక్కాణింపగా నమ్మవారు పాశుపతము నుపసంహరించి రణరంగమున వీరతాండవముఁ జేయుచు కోటి రక్కసులను భక్షించెను. అటులే శంఖచూడునిఁగూడ భక్షింపఁబోగా వాడు రౌద్రాస్త్రముతో నామెను నివారించెను.

తరువాత కాళికాదేవి - మిగుల కోపమున శంఖచూడుని పిడికిలితో కొట్టగా నాదెబ్బకు తాళలేక దానవేంద్రుఁడు గిరగిరతిరుగుచు క్షణకాలము తెలివిఁదప్పినవాడై వెంటనే మేలుకొని మాతృభావనతో దేవితో బాహుయుద్ధముఁ జేయకుండెను.

పిమ్మట దివ్యవాణి నుడివినందున శంఖచూడుని నేను వధింపరాదని గుర్తించి కాళికాదేవి శంకరుని సన్నిధానమునకుఁజని యుద్ధసమాచారమునంతయు నివేదించి మిన్నకుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ముప్పది ఎనిమిదవ యధ్యాయము.

## ఏకోన చత్వారింశాధ్యాయము

### (శంఖచూడుని సైన్యమును వధించుట)

శంకరుఁడు - ఆకాశవాణీ ప్రవచనమును సార్థకముఁజేయతలచి వీరభద్రభైరవ క్షేత్రపాలాది మహావీరులు వెంటరాగా వృషభమునధిష్ఠించి యుద్ధమునకు సన్నద్ధుడై వీరరూపముఁదాల్చి విరాజిల్లుచుండగా శంఖచూడుడు - రథమునుండి డిగ్గి భక్తితో శంకరునకు సాష్టాంగము ప్రణమిల్లి రథముపై నెక్కినవాడై ధనుర్బాణములను పరిగ్రహించెను.

ప్రళయ మేఘములు వర్షించునట్లు శంకర శంఖచూడులు ఒకరిపై నొకరు బాణములను వేయుచు నూరుసంవత్సరములు భయంకరముగా పోరాటముఁ జేసినవారైరి. భైరవుడు, క్షేత్రపాలుఁడు, వీరభద్రుడు, నందికేశ్వరుఁడును విచ్చలవిడిగ చెలరేగుచు దానవవీరులను పడగొట్టుచుండిరి.

అట్టి సమయమున భూమి - సముద్రములతో నరణ్యములతోడను కంపించెను.

అంత శంఖచూడుఁడు - పదివేల చేతులతో పదివేల చక్రములను ధరించి శంకరుని కప్పివేయగా నా భగవానుడు - తన నిశిత బాణములతో చక్రములనన్నిటిని పడగొట్టెను. ఇట్టి ఘోరయుద్ధమున దానవులు పెక్కురు మరణింపగా మిగిలినవారు వెఱగంది పరుగిడినవారైరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ముప్పది తొమ్మిదవ యధ్యాయము.

## చత్వారింశాధ్యాయము

### (శంఖచూడుని సంహరించుట)

ప్రాణసమానులైన వీరులు సైన్యంబును మడియుటఁజూచి శంఖచూడుఁడు మిగుల కోపముఁ జెందినవాడై "శంకరా! వీరందరిని సంహరించుట వింతకాదు. ధైర్యముగలవాడవేని కదనమున నన్నోడింపుము!" అని నుడువుచు శివుని మ్రోల నిలచి దివ్యములైన అస్త్రములను బాణములను మేఘము జలధారలవలె శంకరునిపై వేయుచు నానావిధములగు మాయా ప్రభావములను చూపుచుండెను.

అట్టి మాయాదృశ్యములను గాంచుచు సురలు చకితులగుచుండిరి. అంత శంకరుఁడు మాహేశ్వరాస్త్రమును ప్రయోగించి శంఖచూడుని మాయాజాలమునంతయు తొలగించుటయేగాక వాని శస్త్రాస్త్రములను కుంటుపడఁగొట్టెను.





పిమ్మట మహాదేవుండు - శంఖచూడుని వధింప నిశ్చయించి త్రిశూలమును పట్టుకొనఁగా అశరీరవాణి "శంకరా! త్రిశూలమునిప్పుడే ప్రయోగింపకుము! నాప్రార్థనమునాలింపుము! బ్రహ్మాండము నంతయు నొకేమారు నశింపఁజేయ సమర్థుడవగు నీకీ శంఖచూడుడు గణనీయుడగునా! ఐనను వేదమర్యాదను నీవు ధిక్కరింపరాదు. ఆ మర్యాద ఎట్టిదనగా? "శంఖచూడుని హస్తమున శ్రీకృష్ణకవచ ముండునంతవరకు ఈతని భార్యఁదగు శీలము సురక్షితముగ నుండువరకును వీనికి ముసలితనముగాని మృత్యువుగాని సంభవింపవు అను బ్రహ్మవాక్యమును సార్థకముఁజేయుము!" అని వక్కాణింపగా శంకరుఁడు అట్టి ఆకాశవాణిని పాటించి మిన్నకుండెను.

అంత శివేచ్ఛావశమున నారాయణుఁడు అదేసమయమున వృద్ధ బ్రాహ్మణవేషము దాల్చి శంఖచూడునిఁజేరినవాడై "దానవేశ్వరా! భిక్షనొసగుదునని యభయము నొసగుము. తరువాత ఈయవలసినది చెప్పుదు"నని యాచింపగా శంఖచూడుఁడు - అందులకుప్రసన్నుడై యంగీకరించెను.

అంత దైత్యారి - నీ కవచము కావలెనవి విశదముగా నడిగెను. అందుకు దైత్యుఁడెంతమాత్రము వగవక సత్యవాక్య పరిపాలనబుద్ధిని వృద్ధబ్రాహ్మణునకు ప్రాణముతో సమానంబగు కవచమును సమర్పింపగా శ్రీహరి పరిగ్రహించి శంఖచూడుని రూపముతో తులసీదేవిని సమీపించి యామెతో శృంగారసరస సంభాషణములఁజేయుచు రతిక్రీడలఁదేలించి తులసీదేవిఁదగు శీలమును భంగపఱచెను.

అప్పుడు వెనువెంటనే శంకరుఁడు - త్రిశూలమును ప్రయోగింప నుద్యుక్తుడైన తఱి విజయమును పేరుగల నాత్రిశూలము దశదిశలయందు ప్రకాశించుచు కోటిమధ్యాహ్నసూర్యులఁబోలినదియై ప్రళయాగ్నిజ్వాలవలె మండిపడుచుండెను. అద్దానిని వారింప నెవరితరము గాకుండెను. మరియు నెట్టి శత్రువులనైన సంహరింపఁజాలినదై తేజంబులరాశియై శస్త్రాస్త్రములన్నిటి నేలికయై సురాసురుల కందరికి భయంకరంబునై సమస్త బ్రహ్మాండము నవలీలగా నశింపఁజేయ సమర్థంబై నూరుమూరల వెడల్పుతోడను వేయి ధనుస్సుల పొడవుతోడను విరాజిల్లుచు నిత్యరూపమై పరశివ స్వరూపము గలదై ఆకసమున తిరుగుచున్న త్రిశూలము క్షణకాలముననే శంఖచూడుని వడిగా దహించి భస్మమొనర్చెను.

తరువాత త్రిశూలము వేగమే శంకరునిఁజేరి యంతరిక్ష మార్గమున వెడలిపోయెను.

ఆ సమయమున స్వర్గమునందు నమరులు దుందుభులను మ్రోగించుచుండిరి. గంధర్వులు కిన్నరులును గానముఁజేయుచుండిరి. మునులు - స్తోత్రములు నొనర్చుచుండిరి. అప్సరసలు - ఆడుచుండిరి. ఇంతియేగాక శివునిపై పుష్పవృష్టి గురియుచుండెను. హరిబ్రహ్మలు ఇంద్రాది దేవతలును శివుని లీలావిలాసమును ప్రశంసించుచుండిరి.

శివానుగ్రహమువలన దానవేంద్రుఁడు - శాపవిముక్తుడై పూర్వరూపము కలవాడయ్యెను. శంఖచూడుని యస్థుల (బొక్కల)తో శంఖములు సంభవించెను. కాని శంఖోదకము శంకరునకభిషేకింప నుపయుక్తము కాదనియు విశేషించి శ్రీహరికి లక్ష్మీదేవికి శంఖజలము మిక్కిలి ప్రియంబనియు, విష్ణువునకు సంబంధించిన వారికి ప్రియంబనియు, శంకరునకు మాత్రము ప్రియము కాదనియు, తెలియవలెను.

ఇవ్విధము శంఖచూడుని శంకరుఁడు సంహరించి ప్రసన్నహృదయుఁడై పార్వతీదేవితోడను కుమారస్వామితోడను వీరభద్రనందీశ్వరాదిగణేశులతోడను వృషారూఢుడై కైలాసమునకుఁ జనిన





వాడయ్యెను. నారాయణుఁడు వైకుంఠమునకు వెళ్లగా శ్రీకృష్ణుడు గోలోకమున నెమ్మదిగలవాడయ్యెను. సురలు మిగుల యానందముఁజెందుచు తమ నివాసమున కేగిరి. జగమంతయు సురక్షితము కాగా సుకృతము నిర్విఘ్నముగా కొనసాగుచుండెను. ఆకాశము నిర్మలంబయ్యెను. భూమి అంతయు మంగళమయంబయ్యెను.

ఇట్టి మహేశ్వరచరితమును పఠించువారికి వినువారికిని ముదంబొనఁగూర్చునదై దుఃఖముల నన్నిటిని హరించునదై సంపద నొదవఁజేయునదై కోర్కెలనన్నిటి నొసగునదగుచున్నయది.

ధన్యము కీర్తికరము. ఆయుఃప్రదంబు సంకటనివారకంబు భుక్తిముక్తిప్రదంబు నగు నీ చరితమును స్మరించువారు - ధనధాన్యసంపన్నులై పుత్రవంతులై సుఖభోగముల ననుభవింతురు. అభీష్టముల నీడేర్చుకొనుటయే గాక శివభక్తి గలవారగుదురు.

వేయేల? శంఖచూడ సంహారముతో కూడిన నీ శివచరితము - అసమానంబై పరమ జ్ఞానమును ప్రసాదించి శివునియందు అనన్యభక్తిని పెంపొందించును. ఇద్దానిని పఠించినను వినినను బ్రాహ్మణుడు బ్రహ్మ వర్చసును, క్షత్రియుఁడు విజయమును, వైశ్యుఁడు - ధనసమృద్ధిని, శూద్రుఁడు - ఉత్తమత్వమును పొందువారగుదురు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నలుబదియవ యధ్యాయము.

## ఏకచత్వారింశాధ్యాయము

### (తులసీదేవి-విష్ణుమూర్తికి శాపం బొసగుట)

అమరుల కార్యమును సాధించువాడు సజ్జనులను రక్షించువాడునగు నారాయణుఁడు శంఖచూడుని వేషముతో తులసీదేవిని పొందినాడని యీవరకే తెలిపితిని గదా యని సూతమహర్షి - తరువాతి వృత్తాంతమును శౌనకాదులకు చెప్పఁదొడఁగెను.

శివశాసనము నొనర్చువాడు లోకములను జననివలె కాపాడువాడునగు కేశవుని లీలావిలాసము-ఆనంద ప్రదాయక మగును. అట్టి చరితమును బాగుగా వినుఁడు!

శ్రీహరి - ఆకాశవాణి నవధరించిన శివునిచే ప్రేరేపింపఁబడినవాడై బ్రాహ్మణ రూపమున శంఖచూడుని కవచమును స్వీకరించి శంఖచూడునిఁ బోలిన రూపము గలవాడై తులసీదేవిఁదగు గృహమునకు వెడలి గృహద్వారమున విజయమును సూచించు దుందుభిని మ్రోగించి మంగళవాక్యముల నుచ్చరింపగా తులసీదేవి-పరమ సంతోషమున నిజముగా నా భర్త వచ్చినాడని భావించి గవాక్షము (కిటికీ) నుండి రాజమార్గమును చూచి బ్రాహ్మణులకు విరివిగా ధనము నొసగి నిజపతిని రంజింపఁ జేయు నుద్దేశమున తన నలంకరించుకొనెను.

నారాయణుఁడు - రథమునుండి డిగ్గి లోనికేగగా తులసీదేవి యాతని పాదములను కడిగి నమస్కరించియు రోదనముఁజేసెను. మాయాశంఖచూడుని తన భర్తగా భావించుచున్నందున నాతని





రత్న సింహాసనముపై కూర్చుండఁజేసి శుభసూచకమగు తిలకము నలంకరించినదై కర్పూరతాంబూలము నొసగి "ఈవేళ నా జన్మ-సఫలంబైనది. యుద్ధమునకు వెళ్ళిన ప్రాణేశ్వరుని మరల చూడగలుగుచున్నందున నేను పునర్జీవనము నొందితినని భావించుచున్నాను." అని ప్రార్థించి చిరునగవుతో క్రేగంటఁ జూచుచు రణవృత్తాంతమును వివరింపుమని భర్తను ప్రశ్నించెను.

మరియు నిట్లు సంభాషించెను.

హరిబ్రహ్మాది దేవతలు – ఎవని శాసనమును పాలింతురో అట్టి దేవదేవుఁడును, బ్రహ్మ విష్ణుమహేశ్వర జనకుఁడును, గుణముల నతిక్రమించిన వాడును భక్తుల కోరిక ననుసరించి దివ్యమైన ఆకారము గలవాడును, కుబేరుని ప్రార్థనమున కైలాసమునందు నివసించు వాడును పరమాత్మయు సత్పురుషప్రాప్యుఁడు నగు శంకరుని తోడను,

**శ్లో॥ యస్యైక పలమాత్రేణ – కోటి బ్రహ్మాండ సంక్షయః ।**
**విష్ణుబ్రహ్మాదయోఽతీతా – బహవః క్షణమాత్రతః ॥** ౧౬

ఒక్క విఘడియ అనఁగా ఇరువది సెకండ్ల కాలమున కోటి బ్రహ్మాండములు ఉదయించి నశించుటయు ఒక్క క్షణము-అనఁగా రెప్పపాటులో నాలుగవ వంతు కాలమున పెక్కురు హరిబ్రహ్మాది దేవతలు గడచుటయు అను వైభవముగల పరమేశ్వరునితోడను యుద్ధము నెట్లు గావించితివి? అట్టి అద్వితీయ సామర్థ్యముగల పరాత్పరు నోడించితి వెట్లు?

అంత లక్ష్మీనాథుఁడు తులసీదేవికి అమృతముఁ బోలిన సమాధానము నిట్లు వాక్రుచ్చెను.

యుద్ధప్రియుడ నగు నేను కదనరంగమునకు వెళ్లునరికి గొప్పకలకలము చెలరేగినది. దేవదానవులకు ఘోరమైన పోరు జరుగుచుండగా బలగర్వితులైన దేవతలు రాక్షసుల నోడించి నందున నేను పోరాటము ఁజేసితిని. అంత నమరులు నా ధాటికి తాళలేక పరుగిడుచు శంకరుని శరణము వేడిరి.

అందువలన నా దేవదేవుఁడు ముందున కేతెంచి నాతో నొక్క సంవత్సరమువరకు పోరాటము నొనర్చినవేళ నసురులందరు మడిసిరి కావున బ్రహ్మదేవుఁడు నాకును శంకరునికి మైత్రిని కల్పించి స్వర్గరాజ్యమును దేవతల కిప్పించెను.

ఆ కారణమున శివుఁడు కైలాసమునకు వెళ్లగా నేను నిజ నివాసమున కేతెంచితిని. ప్రపంచమంతయు కుదుటపడినది. ఉపద్రవము శాంతించినది.

పిదప రమానాథుఁడు – శంఖచూడరూపమున తులసీదేవితో నేకాంతమున రతిసుఖములఁ దేలుచుండగా తన భర్తతో సుఖించిన అనుభవమునకు భిన్నమైనరీతి కనుపడినందున తులసీదేవి కనుగొని "నీ వెవడవ"ని ప్రశ్నించి నా పాతివ్రత్యమును భంగపఱచితివి గాన నిన్ను శపించెద ననఁగా విష్ణుమూర్తి వెఱగందినవాడై నిజరూపమును చూపెట్టెను.

అందువలన తులసీదేవి – క్రోధముఁజెంది "విష్ణో! నీకు దయలేదు. నీ మనస్సు రాయివలె గట్టిది కావున పాషాణమగుదువుగాక! నిన్ను దయగలవాడని చెప్పువారు భ్రమపడువారని తెలియవలెను.

నీ యందు భక్తిగల నా పతిని చనిపోవునట్లు చేసితి వెందులకు? అని వచించి మిగుల విలపించుచు నేడ్చుచుండగా విష్ణు వేమియు తోచనివాడై చరాచరమును తన మాయచే మోహింపఁజేయు శంకరుని స్మరించినవాడాయెను.

అంత భక్తవత్సలుఁడు ప్రత్యక్షము కాగా కేశవుఁడు వినయముతో మ్రొక్కులిడి దుఃఖించుచుండెను. అట్టి తులసీ నారయణులను గమనించి శంకరుఁడు కరుణతో "తులసీ! దుఃఖింపకుము! ప్రతిప్రాణియు తాఁజేసిన కర్మఁదగు ఫలము ననుభవించుట తప్పదు గదా! సంసారసాగరమున సుఖదుఃఖముల నొసగువాడు మరియొకడులేడు. ప్రకృతము నీకు మంచి మాట చెప్పెదను. పూర్వము నీవు చేసిన పుణ్యమునకు ఫలముగా శ్రీహరి లభించినవాడు. ఈ మానవ శరీరమును విసర్జించి దివ్యదేహము గలదానవై లక్ష్మీదేవితో సమానముగా శ్రీహరితో రమించుము! నీవు విడచిన తనువు నదీరూపమున ప్రవహించి భారతదేశమున గండకి యను పేరుతో ప్రసిద్ధంబగును. ఇఁక నీ పేరుతో తులసీవృక్షము భూమియందంకురించును. అద్దాని దళములతో నారాయణుని పూజించుట యెంతో కాలము ముఖ్యముగా నుండును. స్వర్గమర్త్య పాతాళలోకములయందు శ్రీహరిసన్నిధి నుండుము! వైకుంఠమున దేవతారూపమున నారాయణునితో నేకాంతమున సుఖింతువుగాక! విష్ణ్వంశసంభూతుఁడగు సముద్రునికి గండకీనదీ రూపముతో భార్యవగుదువు; గండకీనదీ తీరమున శ్రీహరి - పాషాణరూపమున నివసించును. అట్టి పాషాణములను కోట్లకొలది కీటములు తమ కోరలతో తొలచి చేసిన ఛిద్రములయందు చక్రచిహ్నము లేర్పడును. కీటములచే తొలుచబడిన పాషాణము-శాలగ్రామ యనఁబడుచు లక్ష్మీనారాయణము మొదలగు పేరులతో వ్యవహరింపఁబడును. శాలగ్రామశిలను తులసీదళంబుల నర్చించుట-బహుపుణ్యప్రదమై విష్ణుసాదృశ్యము నొనఁగూర్చును. శాలగ్రామ శిలపై తులసీదళమును త్రెంచువాడు - రెండవ జన్మమున భార్యావియోగము నొందును. శంఖమును విడచి తలసీదళములను కోయువాడు నేడు జన్మలయందు పత్ని నెడబాయుటయేగాక రోగముచే బాధపడుచుండును.

శాలగ్రామ శిలను శంఖమును తలసీవృక్షమును రక్షించుచు తులసీదళములతో శాలగ్రామను పూజించు నుత్తముఁడు మహాజ్ఞానియై కైవల్యముఁజెందును. ఒక్క మన్వంతరమువరకు శంఖచూడునకు ప్రియురాలవవై యుంటివి కావున తులసితో శంఖమును వేరుచేయుట పాడిగాదు." అని వచించి యింకను శాలగ్రామశిలా తలసీ మహిమను ప్రశంసించియు సజ్జనులకు సుఖమును ప్రసాదించు శంకరుఁడు శ్రీహరిని తులసిని పైవిధము మెప్పించియు నిజనివాసమగు పరమపదము (కైలాసము)నకు వెళ్ళినవాడయ్యెను.

ఇట్టి శంకరవాక్యము నాకర్ణించి తులసీదేవి - తన శరీరమును పరిహరించి దేవతాస్త్రీ రూపముఁ దాల్చిన వెనువెంటనే యామెఁదోడ్కొని శ్రీహరి - వైకుంఠమున కేగినవాడు.

అంత తులసీ దేహమునుండి గండకీనది యుద్భవింపగా నద్దానిచెంత నారాయణుడు శిలారూపమున పరిణమించినందున కీటములు ఇప్పటికిని సాలగ్రామశిలలను తొలుచుచుండును. నేలపైనుండు శాలగ్రామ శిలలు తెలుపు పసుపు వన్నెగలవై తాపమును కలిగించును కావున వానిని పరిగ్రహింపఁ గూడదు. నీటిలో పడియుండు శాలగ్రామలు మిగుల పవిత్రములై పుణ్యములను ఫలింపఁజేయును....

శౌనకాదిమహర్షులారా! ఈ విధముగా శంకరుని లీలాచరితమును నుడివితిని. ఇది వినువారికి చదువువారికిని కోరికల నిచ్చునదై మోక్షము నొదవంజేయునదియని భావింపుడు!

ఇంక నేమి వినెదరో ప్రశ్నిపుడని సూతుండు మధ్యాహ్న కృత్యములను నెరవేర్చుటకై శివపురాణగత రుద్రసంహిత యందలి యుద్ధఖండమున నింతవరకు వక్కాణించి విరమించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో నలుబది యొకటవ యధ్యాయము.

## నలుబదింరెండవ యధ్యాయము

### (హిరణ్యాక్షుని వృత్తాంతము)

శంఖచూడుని వృత్తాంతమును విని శౌనకాది మహర్షులు – ఇంకను శివమహిమతో కూడిన ఇతర కథలను వినంగోరినవారై అమృతముంగ్రోలువారు తృప్తింజెందునట్లు శివలీలా విలాసమనందగు అంధకాసురుని సమాచారమును వివరించి చెప్పుమని సూతుని ప్రశ్నించిరి.

అప్పుడు సూత మహర్షి చెప్పందొడంగెను.

పూర్వము శంకరుండు పార్వతీదేవితోడను ప్రమథగణములతోడను కైలాసము నుండి కాశీక్షేత్రమున కరుదెంచి భైరవుని క్షేత్రపాలకునిగా నొనిర్చియు తన రాజధానియగు వారాణసీ నగరమునందు పెక్కువత్సరములు విహరించుచుండగా మందరపర్వతము ప్రార్థించి నందున నచ్చోటునకు వెళ్ళినవాడై అమ్మవారితో బహుకాలము లీలావిలాసములం దేలుచుండెను.

అట్టితఱి నొక చమత్కారము తారసిల్లినది. చెప్పెదను. వినుండు!

మందర పర్వతముపై పూర్వదిశకు హరుండానందమగ్నుడైయుండగా గిరిజాదేవి – వెనుకనుండి యేతెంచి శంకరుని కన్నులు మూసినది. అప్పుడు సువర్ణకమలములంబోలిన అమ్మవారి హస్తముల చెమటవలన దేవదేవుని నేత్రములు మూడును ముడుచుకొని నందున కలిగిన కటిక చీకటిని ఒకానొక వికృతాకారముగల అంధుడైన బాలుండు ఉద్భవించెను. ఆ బాలుండు పాడుచు ఆడుచు ఏడ్చుచు నాలుకందెఱచుచు ప్రళయకాల మేఘమువలె భయంకరముగా ఘోషించుటయేగాక జడలుగలవాడై యుండగా అద్భుతలీలావిలాస చతురుండగు మహాదేవుండు – పార్వతీ! నా కన్నులు మూసి యపూర్వసంఘటనమును కలుగం జేసితివి. అని నుడివినందున దేవి చకితురాలై హరనేత్రములపై గల తన చేతులను తీసి వేసెను.

అందువలన నలుదిశలంగ్రమ్ముకొనిన కారుచీకటులు పటాపంచలై ప్రపంచమంతయు ప్రకాశమానం బయ్యెను. ఐన నంధకారమునం బుట్టినందున బాలుండు నేత్రహీనుడై కనుపడగా "దేవా! ఈ బాలుండు ఇవ్విధము ఎందుకు ఎవరికోసము జన్మించినాడో సెలవీయుండు!" అని యమ్మవారు ప్రార్థించెను.





త్రిలోకీమాత యగు తన ప్రియురాలి మాటను పాటించి ముక్కంటిదేవర – చిరునగవుతో "అంబికా! వినుము! నా నేత్రములను నీవు ఆచ్ఛాదించినందున నేర్పడిన అంధకారము నందు పుట్టుటచే వీనికి అంధకుఁడను పేరు పెట్టుచున్నాను. నీవేగాక నీ పరిచారికలు నా గణములు నీ బాలుని యన్ని విధముల కాపాడవలసియుండును. మరియు చేసిన పనిఁగురించి చింతిపక విశాల హృదయము గలదానివై వీనిని బాగుగా రక్షింపుము!" అని యాదేశించెను.

అంత పార్వతీదేవి శంకరుని మాట పాటించి కరుణగలదై యంధకుని చెలికత్తెల ద్వారా నన్నివిధముల కాపాడుచుండెను.

ఇట్లు కొంతకాలము గడువగా శిశిరరుతువునందు అనఁగా మాఘ ఫాల్గునములలో హిరణ్యాక్షుఁడు – తన యన్నగారికి కుమారుఁడు జన్మించి వర్ధిల్లుటను గమనించి స్వధర్మపత్ని ప్రేరేపించినందున పుత్రకాముఁడై యరణ్యమునఁ బ్రవేశించి మహేశ్వరు నుద్దేశించి మ్రానువలె స్థిరముగా నొకచో నాసీనుఁడై తపంబొనర్పగా శంకరుఁడు ప్రసన్నుఁడై హరిణ్యాక్షుని సమీపించి "వత్సా! హిరణ్యాక్షా! శరీరమును ఇంద్రియములను తపింపఁజేయు వ్రతమును చాలించి ఏమికావలెనో యడుగుము! వరదుడనై యేతెంచితిని" అని నుడువగా హిరణ్యాక్షుఁడు – సంతసించి యంజలిఁ ఘటించి నమ్రుడై వివిధరీతుల నుతించి యిట్లు ప్రార్థించెను.

చంద్రశేఖరా! కుమారుఁడు కావలెను. దైత్యకులము నుద్ధరించువాడు పరాక్రమము గలవాడు నగు పుత్రుని ప్రసాదింపుము! ఎందుకనఁగా? నా జ్యేష్ఠసోదరుఁడగు హిరణ్యకశిపునికి ప్రహ్లాదుఁడు మున్నగు ఐదుగురు పరాక్రమవంతులైన కుమారులు కలవారు. నాకు పుత్రసంతానము సహజముగా కలుగనందున రాజ్యము నెవఁడనుభవించునను ఆందోళనఁ జెందియున్నాను.

పుత్రుఁడు జన్మించినచో తండ్రి సంపాదించిన రాజ్యము నేలుటయే గాక నితరుల రాజ్యమునుగూడ బలపరాక్రమములతో కైవసముఁ జేసుకొనియుండవలెను. అట్టివాడే నిజమైన పుత్రుండగును. ఇట్టి పుత్రునితోడనే తండ్రి – పుత్రవంతుఁడని చెప్పఁబడును. పుత్రవంతులకు పుణ్యలోకములు సమకూరునని ధర్మాత్ములగు పండితులు చెప్పుచుందురు.

అందుకొరకే భగవానుఁడు – స్త్రీ పురుషులకు కామవాసనను కలిగించి తన సంకల్పముఁదగు ఫలముగా సృష్టిక్రమమును సాగించుచున్నవాడు. సంతానములేనివారికి నుత్తమలోకములు లభింపనివగుటచే యవ్వానికొరకు మానవులు దేవాసురులును దేవదేవుని పాదపంకజములను పూజించి చివరకు నొక్క కొమరునైన యొసగునని నావలె ప్రార్థించుచుందురుగదా!"

ఇట్టి హిరణ్యాక్షవాక్యము నాలకించి శంకరుఁడు "దైత్యపుంగవా! నీ వీర్యమువలన జన్మించు పుత్రుఁడు లేకున్నను కుమారుని ప్రసాదింతును. నీతో సమానమగు పరాక్రమము గలవాడు, ఏరికిని లొంగనివాడును, అంధకుఁడను పేరు గలవాడునగు నా కుమారుని పరిగ్రహింపుము! సంతానము లేదని వెతఁజెందకుము!" అని వచించి హిరణ్యాక్షునకు పుత్రునొసఁగగా దైత్యుఁడు – భూతనాథుఁడు త్రిపురారియు గౌరీపతియునగు శంకరునికి మ్రొక్కులిడి కుమారుని స్వీకరించియు తన రాజధాని జేరినవాడై పాతాళమును భూలోకమును జయించి యమరులను గూడ స్వాజ్ఞావశవర్తుల నొనర్చుకొనెను.

అంత నమరులు మునులు సిద్ధులును సర్వాత్మకంబు యజ్ఞమయంబు భయంకరంబునగు వరాహరూపముఁదాల్చియుండు నారాయణుని వేడుకొనఁగా నా మహామహుఁడు తన ముక్కుతో నేలఁ జెకిలించి పాతాళముఁ బ్రవేశించియు నచటిదైత్యులను కోఱలతో పొడచుచు పిడుగుదెబ్బలఁబోలిన పాద ప్రహారములతో నసురసైన్యములను దునుమాడుచు కోటిసూర్యప్రతీకాశంబు ఐశ్వరంబు నగు సుదర్శనచక్రముతో హిరణ్యాక్షుని తలఁద్రుంచినవాఁడై దుర్మార్గులైన రాక్షసులను కాల్చివేసెను.

అందువలన నమరేంద్రుఁడు సంతుష్టుఁడై యంధకాసురుని హిరణ్యాక్షుని రాజ్యమున కధినేతగా పట్టాభిషిక్తుని గావించి నిజస్థానమునకేతెంచియు వరాహదంష్ట్రాంకురమున నుద్ధరింపఁబడిన భూలోకము మున్నగు లోకముల యందు వారివారి హవిర్భాగముల నేర్పరచియు సుఖముగా నుండెను.

ఇప్పట్టుననే పద్మసంభవాది దేవతలు ఋషులును ప్రశంసించుచుండగా ఉగ్రవరాహరూపముగల శ్రీహరి ప్రసన్నుఁడై వైకుంఠముఁ జనినవాడు. జీవులందరును సుఖముగా నుండిరి.

ఇయ్యది శివమహాపురాణము నందలి రుద్రసంహితలో
యుద్ధ ఖండమున "శివ విజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ద్విచత్వారింశాధ్యాయము.

## నలుబదిమూడవ యధ్యాయము

### (హిరణ్యకశిపుని సంహారము)

హిరణ్యాక్షుని శ్రీహరి సంహరించిన పిదప నవ్వాని జ్యేష్ఠభ్రాత యగు హిరణ్యకశిపుఁడేమి చేశినాడో అట్టి వృత్తాంతమును విన కుతూహల మొదవుచున్నది. గాన వివరింపుడని శౌనకాది మహర్షులు ప్రశ్నింపగా సూతుఁడు చెప్పఁదొడఁగెను.

శ్రీహరి క్రోధమూర్తియై తన తమ్ముడగు హిరణ్యాక్షుని చంపినందున హిరణ్యకశిపుఁడు మిగుల రోసముఁజెంది తమ్ముని యెడబాటునకు వగచినవాఁడై వైరముఁబూనుకొనెను.

అంత నసురేంద్రుఁడు మహావీరులగు సైనికులందరిని యుద్ధమునకై ఆజ్ఞాపించినందున నవ్వారు స్వర్గము నాక్రమించి కదనమున నమరుల నోడించిరి. దేవతలందరును భూలోకమున నివసింపవలసి వచ్చెను. ప్రపంచప్రజలు పలునిడుములఁ బడయుచుండిరి.

హిరణ్యకశిపుఁడు తన తమ్మునికి పితృకర్మను నెరవేర్చి యవ్వాని కుటుంబము నోదార్చినవాఁడై రాజ్యమును పరిపాలించుచు "జరామరణములు లేనివాడనై ఎట్టి బలము గల వారికైనను పరాజితుఁడను కాగూడ"దని భావించి మందర పర్వతముపై పాదాంగుష్ఠముతో మాత్రము నేలఁదాకుచు పైనెత్తఁబడిన చేతులు గలవాడునై ఆకసమువైపునకే చూచుచు దారుణమైన తపంబు గావించుచుండెను.

అట్టితతి నమరులు రాక్షసుల నోడించి తమ తమ పదవులఁజెంది యుండిరి.

ఇఁక హిరణ్యకశిపుఁడు తపించుచుండగా నవ్వాని శిరమునుండి తపోజ్వాల - పొగతో కూడినదై బయలువెడలి యంతట వ్యాపించినదై పైలోకములను క్రింది లోకములను కాల్చునట్లుండెను.





అట్టి ఘోరమును సహింపఁజాలని సురలు స్వర్గమును వీడి సత్యలోకమున కేగినవారై బ్రహ్మదేవుని ప్రార్థించినందున నా దేవుఁడు భృగుదక్షాదులను వెంటనిడుకొని హిరణ్యకశిపుని చెంతకుఁజని వర మొసగుదునని వక్కాణించెను.

విధాత పలికిన మధురవాక్యము నాకర్ణించి యిట్లు వరముఁగోరుకొనెను. "దేవా! ఎల్లకాలము మృత్యుభయము నాకు ఉండకూడదు. శస్త్రములతో గాని అస్త్రములతో గాని పాశములతో గాని వజ్రాయుధముతో గాని ఎండిన చెట్లతోగాని పర్వతములతో గాని పాషాణములతోగాని నీటితో కాని అగ్నితో కాని శత్రువుల దెబ్బలతో గాని మరణము రాకూడదు. మరియు దేవదానవ మునిసిద్ధులతో గాని నీ సృష్టిలో గల జీవులలో ఎవరితోనైనను నేను మరణింపరాదు. వేయేల? స్వర్గమునఁగాని నేలపైగాని పగలు గాని రాత్రి గాని పైన గాని క్రింద గాని మరణము సంభవింపకుండుగాక!"

హిరణ్యకశిపుఁడు ఇవ్విధము అడిగిన వరమును బ్రహ్మదేవుఁడు ఆలకించి మనంబున భగవానుని స్మరించియు "దానవేంద్రా! నీ వడిగినయట్లే యగుగాక! తొంబదియారు వేల వత్సరములు రాజ్యము నేలుచు కామితముల నన్నిటి ననుభవించుము! లెమ్ము!" అని యనుగ్రహించినందున నసురేంద్రుఁడు సుముఖుఁడై పితామహుని వరముఁదగు ప్రభావమున సర్వ ప్రపంచాధికారపదవి నధిష్ఠించి ముల్లోకములను పీడింప నుద్యుక్తుఁడై మొదట స్వర్గమునకుఁజని యమరులను యుద్ధమున నోడించినందున ఇంద్రాదిదేవతలు బ్రహ్మదేవు ననుమతిని క్షీరసముద్రమునకు శ్రీహరిని దర్శింప నేగిరి.

అచ్చోట నారాయణుని పలువిధములఁ బ్రార్థించి తమ దుఃఖమును నివేదించుకొనిరి. లక్ష్మీపతి యమరుల మొఱ నాలకించి ప్రసన్నుడై శేషశయనమునుండి డిగ్గి అనుకూలములు మనోహరంబులు నగు వాక్యములతో దివిజుల నూఱడించి యిట్లు వక్కాణించెను.

"అమరులారా! హిరణ్యకశిపుఁడు మిమ్ము బాధించుచున్నవాడుగదా! అట్టి దురాత్ముని వేగమే సంహరించి మీ యిడుములఁబాపుటయేగాక లోకకల్యాణము నొనఁగూర్తును."

శక్రాదిదేవతలు రమాపతి వాక్యము నాలకించి హిరణ్యకశిపుఁడు మడసినాడనియే భావించి సంతుష్టమనస్కులై తమతమ నివాసములకుఁజనిరి.

అంత భగవానుఁడు – జడదారియు భయంకరంబు కోఱలు ఆయుధములుగా గలదియు, వాడిగానుండు గోళ్ళుకలదియు, పొడవుముక్కు గలదియు, సగము సింహము సగము మానవంబు, తెఱువఁబడిన నోరును గలదియు, కోటిసూర్యప్రతీకాశంబు, ప్రళయాగ్నిప్రభావము గలదియు, జగన్మయంబు నగు రూపముఁదాల్చినవాడై సూర్యుఁడు అస్తమించియుండగా రాక్షసనగరమున చొఱఁబడి యచ్చోట బలవంతులైన రక్కసులతో పోరాడి అట్టివారందరిని చేబట్టి గిరగిరఁద్రిప్పుచు గొప్ప పరాక్రమమున నసురులఁ దునుమాడుచుండెను.

దైత్యులందరు నా నృసింహమూర్తి నమితప్రభావముఁగలవానిగా నెంచుచు చకితులగుచుండిరి.

అట్టితతి ప్రహ్లాదుఁడు–శ్రీహరియే నృసింహస్వరూపమున నేతెంచినాడని గుర్తెరిగి దిగువవిధము తన జనకుఁడైన హిరణ్యకశిపునితో వక్కాణించెను.





"రాజా! నరసింహస్వరూపమున నీ నగరములో నీ చెంతకు వచ్చినవాడు నారాయణుఁడే యని భావించి యుద్ధము నొనర్పక శరణము నొందుము! ఎందుకనఁగా? భయముఁ గొలుపు నీ మూర్తితో పోరాడి గెలుపొందువాడు ముల్లోకములయందు గానరాడు. కావున నీతనికి నమ్రుడవై చిరకాలము రాజ్యము నేలుము!"

ఇట్లు తన కుమారుఁడైన ప్రహ్లాదుని మాటలు విని "నాయనా! జడియుదు వెందులకు? ఈ మృగముతో నేమగును?" అని వచించి హిరణ్యకశిపుఁడు - వీరులారా? భయంకరములగు చూపులు గల నీ సింహమును బంధింపుడు!" అని తన రాక్షసపుంగవుల నాజ్ఞాపింప నవ్వారు మృగేంద్రమును బంధింప నుద్యుక్తులై "అగ్నియందు మిడుతలఁబోలె" నా మహామహుని తేజోజ్వాలయందు కాలిపోయిరి.

అవ్విధము తనవారందరును మడిసినందున దైత్యాధిపతి స్వయముగా నరసింహస్వామితో పోరాటమునకు తలపడగా వారిరువురు శస్త్రములతో అస్త్రములతోడను ఒకరి నొకరు కొట్టుకొనుచుండిరి.

అ సమయమున వారికి నొక కల్పము (బ్రహ్మదేవుని దినము) వరకు ఘోరమగు పోరాటము జరిగెను. చివరకు నరసింహస్వామి - తన చేతులతో మోకాళ్ళపై హిరణ్యకశిపుని పడగొట్టి మర్మచ్ఛేదకములగు గోళ్ళకొనలతో ఛాతిపై చీల్చి నెత్తురు కారుచుండగా నా దైత్యుని ప్రాణములను తీసి విగతజీవునిఁజేసెను.

అంత ప్రహ్లాదుఁడేతెంచి ప్రణతులఁజేయగా నాతనిని రాజ్యాధికారిగా పట్టాభిషిక్తునొనర్చియు నరసింహుఁడు నిజధామమునకుఁజనుచుండగా బ్రహ్మాదిదేవతలు స్వామికి మ్రొక్కులిడి తమ లోకములకు వెళ్ళిరి.

శౌనకాది మహర్షులారా! శంకరునివలన నంధకాసురుఁడు పుట్టుటయు వరాహావతారముచే హిరణ్యాక్షుఁడు చంపఁబడుటయు నరసింహస్వామి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునికి రాజ్యము నొసగుటయు అంధకుని వృత్తాంతవశమున వక్కాణించితిని. ఇఁక ప్రస్తుతంబగు అంధకాసుర ప్రభావము వర్ణింపగలను. మరియు అంధకుఁడు శంకరుని యుద్ధమున మెప్పించి గణాధిపత్యము నొందినదియు వివరింతును.

అని సూతమహర్షి విరమించెను.

ఇయ్యది శివమహాపురాణము నందలి రుద్రసంహితలో
యుద్ధఖండమున "శివవిజ్ఞాన పర్వప్ప" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున త్రిచత్వారింశాధ్యాయము.





# నలుబదినాలుగవ యధ్యాయము

## (అంధకాసురునికి గణాధిపతిపదవి లభించుట)

ఒకప్పుడు హిరణ్యాక్షుని కుమారుఁడగు అంధకాసురుని దాయాదులు (పాలివారు) సమీపించి "అంధకా! నీవు గ్రుడ్డివాడవుగదా! రాజ్యము నెట్లు చేయుదువు? నీ జనకుఁడు హిరణ్యాక్షుఁడు మూఢుడై నేత్రములు లేనట్టి నిన్ను పుత్రునిగా బడయుటకు ఘోరతపంబుచే శంకరుని మెప్పించినవాడు. అట్టి నీవు హిరణ్యాక్షుఁడు కన్నవాడవు కావు గావున రాజ్యాధికారము లేనివాడవైతివి. బాగుగా విచారించిన యెడల మేమే రాజ్యాధికారము గలవారమని తేటపడును." అని నుడువగా నంధకాసురుఁడు లోలోన మిగుల బాధపడి యవ్వారిని పలువిధములగు మాటలతో శాంతింపఁజేసియు నరణ్యమునకుఁజని యచ్చోట నేకాంతముగా పదివేల వత్సరములు కఠిన నియమములతో తపించుచుండెను.

తపించువేళ నాహారము మానుకొని భుజముల లేవనెత్తి యొంటికాలుపై నిలువఁబడియు దేవదానవులకు నలవిఁగాని విధముగా నగ్నిని రగుల్కొలిపి యందు తన శరీరముఁదగు మాంసమును రక్తముతో గూడ హవనముఁజేయుచు మంత్రముల నుచ్చరించుచుండెను.

అందువలన నంధకాసురుని దేహమున మాంసము గాని రక్తము గాని లేనివి కాగా బొక్కలు నరములు మాత్రము మిగిలియుండెను. అట్టి శరీరమును గూడ నగ్నియందు సమర్పింపఁదలపెట్టిన నంధకాసురుని సాహసమును దేవతలు గమనించి భీతిల్లినవారై వడిగా సత్యలోకమున కేగి బ్రహ్మదేవుని నతులతో నుతులతో ప్రసన్నునిఁజేసుకొనిరి.

అంత పితామహుఁడు అమరుల నూఱడించి యంధకునిఁజేరినవాడై "దైత్యేయా! తపంబు చాలించి యెరికిని పొందరానట్టి వరముఁగోరుకొనుము! ఇచ్చెదను" అని వక్కాణింపగా అంధకుఁడు దీనుఁడై ప్రణమిల్లి "దేవా! ప్రహ్లాదుఁడు మున్నగు నా పాలివారు అంధుడను కావున రాజ్యాధికారము లేనివాడనని నన్ను నిరాకరించి రాజ్యము నపహరించినవారు. అందు వలన నాకు దివ్యనేత్రమును ప్రసాదించుము! దేవదానవ గంధర్వయక్ష సర్ప మానవాది సకల ప్రాణుల వల్లను నారాయణునివల్లను మహాదేవునివల్లను నాకు మరణము సంభవింపకుండు గాక! ఇంద్రాదిదేవతలు నా యాజ్ఞకు బద్ధులై కప్పమును చెల్లింతురు గాక!" అని ప్రార్థించెను.

ఇట్టి వరమును పితామహుఁడు శంకితుడై "దైత్యేంద్రా! నీ వడిగిన దంతయు సిద్ధించును కాని మరణము అసలే రాకూడదనుట భావ్యము కాదు. ఈశ్వరసృష్టిలో మరణింపని ప్రాణి జన్మింపదని గుర్తెరుగుము! మిగుల దీర్ఘకాలము జీవింపవలెనని నీ వంటి బుద్ధిమంతులు అపేక్షింపరు గదా! మరణమునకు ఏదేని కారణము నభ్యర్థించుము!" అని వాక్రుచ్చి నందున నంధకుఁడు దిగువవిధము చతుర్ముఖుని యాచించెను.

భూతభవిష్యత్ వర్తమాన కాలములయందు వర్తించు ఉత్తమ మధ్యమ కనిష్ఠ జాతివారగు నారీమణులలో శ్రేష్ఠురాలును, తల్లివంటిదియు శరీరముచేతను వాక్కుచేతను మనస్సుచేతను పొంద

నలవిఁగానిదియు దేవమానవాదులను మించిన శక్తిసామర్థ్యములుఁగలదియు నగు వనితారత్నమును మోహించినపుడు నాకు మరణము కలుగుగాక!

ఇట్టి అంధకుని మాటలు విని పద్మసంభవుడు సువిసిత్ముఁడై శంకరుని పాదకమలములను స్మరించి శివాజ్ఞఁబడసియు "దైతేయా! నీవు కోరినదంతయు ఫలించును. అటులే కోరరాని కోరిక కలిగినపుడు మరణింతువుగాక! అంతవరకు సుఖముగాజీవించుము! లెమ్ము! తపస్సు చాలించుము! వీరులనందరిని నోడించుము!" అని సెలవీయగా అంధకాసురుఁడు మిగుల భక్తితో విధాతకు ప్రణమిల్లి "దేవా! మాంస రక్తములు లేనట్టి యీ శరీరముతో ఎట్లుపోరాడుదును? పవిత్రంబగు నీ హస్తముతో నన్ను స్పృశించి దృఢకాయు నొనర్పుము!"

అంత బ్రహ్మదేవుఁడు తన చేతితో నంధకుని పునికి సురముని సిద్ధులు కొనియాడుచుండగా స్వధామమునకు వెళ్ళినవాడయ్యెను.

చతుర్ముఖుని హస్తస్పర్శమాత్రమున నంధకుఁడు సర్వాంగపరిపుష్టంబగు శరీరముగలవాడై నేత్రములు భవ్యమైనచూపుగలిగియుండ సంతుష్టమానసుడై తన నగరమునకుఁబోయెను.

అంత ప్రహ్లాదుడు మున్నగు మహాదైత్యులు – అంధకుని ప్రభావమును గుర్తించి భృత్యులఁబోలె ఆజ్ఞావశవర్తులై రాజ్యము నొప్పగించిరి. పిదప నంధకాసురుఁడు – సైన్యమును వెంటనిడుకొని మొదట స్వర్గమునకుఁజని యుద్ధమున నమరుల నోడించి దేవేంద్రుని కప్పము నిచ్చువానిగా చేయుటయేగాక నాగులను గరుడజాతివారిని రాక్షసులను గంధర్వులను యక్షులను మానవులను పర్వతములను వృక్షములను సింహవ్యాఘ్రాది జంతువులను వేయేల! ముల్లోకములను కైవసముఁజేసుకొని శాసించుచుండెను. అట్టితటి ప్రపంచమంతయు అంధకుని కనుసన్నలతో మెదలుచుండగా తనకు నెదురు లేదని భావించి యా దైతేయుఁడు సుందర స్వరూపముగల నారీమణులను స్వర్గమర్త్య పాతాళములయందు నివసించువారి ననుభవించుచు అప్పుడప్పుడు మనోహర పర్వతప్రాంతములయందు నదీతీరములయందు నవ్వారితో క్రీడావిహారముఁజేయుచు రమించుటయేగాక తన ప్రియురాండ్రు త్రాగగా మిగిలిన రసవత్తర పానీయములను త్రాగుచు రుచికరములైన ఫలములఁదినుచు పరిమళముగల పుష్పముల నాఘ్రాణించుచుండెను.

మఱియు మయుఁడు నిర్మించిన భవనములలో విహరించుచు దివ్య విమానముల యందు వనితారత్నములతో కూడి పర్యటించుచుండెను. సురుచిర పక్వాన్న భోజనముతోడను సుగంధద్రవ్యముల నుపయోగించుటచేతను లోకమున నద్భుతదృశ్యములఁజూచుటతోడ నందకునికి పదివేల వత్సరముల కాలము గడచెను.

ఇట్లు నంధకాసురుఁడు – వరమదాంధుడై పరమున తనకు మేలు నొనగూర్చు సుకృతమును గుర్తింపఁజాలక దుష్టములైన భోగములయందు లాలసను పెంచుకొనుచు మంత్రులను కుమారులను కుతర్కములతో ధిక్కరించి వైదిక ధర్మములను సాగనీయక ధనరాజ్య గర్వపూరితుఁడై ఆరాధ్యదేవతలను పూజనీయ గురువులను వేదశాస్త్ర విదులగు బ్రాహ్మణులను గౌరవింపనివాడై కామభోగమే పరమావధిగా నెంచి జీవితమునంతయు వ్యర్థముఁజేసుకొనుచుండెను.





పిదప నొకప్పుడు భూలోకమున సైన్యముతోకూడ సంచరించుచు ననేక వత్సరముల కాలముఁ గడిపినవాడై దైవవశమున మందరపర్వతమునకుఁజని యచటి మనోహర దృశ్యములను రమణీయ ప్రదేశములఁగాంచి ముగ్ధుఁడై యట కొన్నాళ్ళు నివసింపఁదలచి యంధకుఁడు నొక పట్టణము నత్యద్భుతముగా నిర్మింపఁజేసుకొని యుండగా దుర్యోధనుఁడు వైధళుఁడు హస్తి యను పేరుగల మంత్రులు మందర పర్వతముపై ఒకానొక ప్రదేశమున చక్కఁదనముగల వనిత నవలోకించి తమ ప్రభువగు నంధకుని సమీపించియు దిగువ విధము విన్నవించిరి.

దైత్యాధిపా! ఇదే కొండయందు నొక్క గుహలో నొకానొక మునీశ్వరుఁడు – జడదారియై చంద్రరేఖఁ దాల్చి గజచర్మను కట్టుకొనియు నాగేంద్రములను హారములుగా ధరించి కపాలమాలాధారియై త్రిశూలమును కేలఁబూని అమ్ములపొదయు ధనుస్సు జపమాలయు ఖడ్గము దండము మున్నగువానిని ధరించినవాడై భస్మ నలఁదుకొని దివ్యముఖ కాంతితో విరాజిల్లుచు స్వచ్ఛధవళ వర్ణముగల శరీరమున నద్భుత వేషముతో నలరారుచున్నవాడు.

అతని సమీపమున (వానరముఁబోలిన) తెల్లని వృషభము – ఆయుధములనన్నిటిని ధరించి పరిసర ప్రదేశమును కాపాడుచుండును. మరియు మనోహర సుందరరూపముగల నొక వనితారత్నము ఆ మునీశ్వరు నాశ్రయించియున్నది. ఆమె చక్కదనము వర్ణింపనలవిఁగానిది. పగడములు ముత్యాలు మణులు రత్నములతోకూడిన సువర్ణాభరణములఁదాల్చి చీరఁ గట్టుకొనియు సుగంధపుష్పములకొప్పుఁ బెట్టుకొనియున్నది.

ఆమెఁజూచు కన్నులే కన్నులు; మరియొకరిఁజూడ నవసరములేదు. పుణ్యముల పంటయో యనఁబఱగు నా త్రిభువన సుందరి మహేశ్వరుని అర్ధాంగి యగునది. ముల్లోకముల యందు గల రత్నముల (శ్రేష్ఠవస్తువుల) ననుభవించు నధికారముగల నీవు ఆమెను తప్పక నవలోకింతువుగాక!"

అంత నంధకాసురుఁడు మంత్రుల మాటలు పాటించి కామాతురుఁడై శరీరమంతయు గగుర్పాటుఁ జెందుచుండగా దుర్యోధనుఁడు మున్నగువారిని మునీశ్వరుని (శంకరుని) చెంతకు పంపినందున నవ్వారు వేగమే యా జడదారిఁజేరి మోకరిల్లియు రాజనీతి ననుసరించి దిగువ విధము రక్కసుం రేడు యానతిని విన్నవించిరి.

దేవా! హిరణ్యాక్షుని కుమరుఁడును, ముల్లోకముల నేలువాడునగు అంధకాసురుఁడు బ్రహ్మదేవుని వరముఁదగు ప్రభావమున ఈ గట్టునందు విహరింప నేతెంచియున్నవాడు. మేము అతని మంత్రులము, నీ సన్నిధిలో ఆ దైత్యాధిపుని సందేశమును వినుపింతుము! ఆలకింపుము!

నీవు ఎవరి తనయుడవు? మునివృత్తి నిచ్చోట నెందులకు నివసించుచున్నావు? ఈసుందరి యెవరిది? నీవు మునివగుటచే నారీమణుల చెలిమిఁజేయరాదు. కావున నీ చక్కని దానిని నాకు సమర్పించుము! భస్మనలంఁదుకొని కపాలమాలికఁదాల్చియు ధనుర్బాణములను ఖడ్గ త్రిశూలాదులను ధరించినవాడవై పుణ్యతమ గంగానదీప్రవాహమును జడలనతికట్టి విషపూరిత సర్పములను హారములుగా వేసుకొనిన నీ వేషము విచిత్రముగా కన్పట్టుచున్నది. ఇట్టి వికృతాకారముగల నీకు నీ లావణ్యవతితో నవసరమేముండును! ఒప్పునా నీవు ముదుసలి యెద్దునెక్కుట పాడికాదు. నీ ఆహారము విషమగుటచే

। పరివారము నెట్లు పోషింతువు? తరుణితోకూడి తపించుట మూర్ఖత్వము కాదా? లోకత్రయమునం ల రత్నముల ననుభవించునధికారము గలవాడను నేనే; శస్త్రాస్త్రములను విడనాడి యొంటరిగా సపంబొనర్పుము;

ఒకవేళ నా శాసనమును ధిక్కరింతువేని నీ శరీరముతోకూడ ప్రాణములంగోలు పోవుదువు!

ఇట్టి దూతపలుకులనువిని "అంధకుండు చెడుబుద్ధి కలవాడైనాడని భావించి మహేశ్వరుడు - చిరునగవుతో "దైత్యాధిపా! నేను రుద్రుండను; నాతో నీకేమి ప్రయోజనము? ఎందుకిట్లు నబద్ధము లాడుచున్నావు? నా ప్రభావమును గమనించితివో లేదో; ఇట్టి సందేశము నంపుట నీకు న్యాయము కాదు. నేను సామాన్యునివలె గృహములో నివసించి తలిదండ్రులను స్మరించువాడను కాను. "ఏతద్వ్రతం పాశుపతం చరామి" నేను ఎందుకో ఏమో కావలెనని తపించుట లేదు. ఆత్మానందము ననుభవించువాడను. ఇద్దియే తపంబని అనభిజ్ఞులు భావింతురు.

మూలము లేనిదియు విడువ నలవింగానిదియు లోక వేద ప్రసిద్ధంబునగు నీ చరాచరమంతయు నా యదియేను; రూపవతియు సమస్తమును వహించునదియు ప్రాణులందరి మనోభీష్టముల నీడేర్చు నదియు నగు నీ తరుణి నా యర్ధాంగి యగునది.

నా చెంత నుండు వస్తువులలో నీకు నచ్చినదానిని తీసుకొనవచ్చును. ఇంతమాత్రము వచించి విరమింపగా నంధకుని భటులు శివవాక్యము నాకర్ణించి శిరమునంజలింఘటించి - ముల్లోకములను నశింపంజేయ తలపెట్టిన నంధకుంజేరియు ప్రణమిల్లి శంకరుండు మందస్మితమున చెప్పిన యంశమును దిగువ విధము విన్నవించిరి.

శౌర్యము గాని ధైర్యముగాని స్థిరముగా లేనివాడు, దుర్బలుండు, దీనుండు, క్రూరుండు, కృతఘ్నుండు, పాపియు యమునివలన వెఱగందువాడునగు దానవుడెక్కడ? దారుణములైన ఆయుధములం దాల్చినవాడనై మృత్యువునుంగూడ భయపెట్టు యుద్ధము నొనర్చు నేనెక్కడ? ముసలితనముచే జీర్ణించిన శరీరముగల రాక్షసుండు నాతో పోరాడుటకు సమర్థుండగునేని శీఘ్రమే వచ్చుగాక! రాక్షసాధిపునివంటి వారిని మడియంజేయు నాయుధము-వజ్రాయుధముంబోలినది నావద్ద కలదు. దానవుని శరీరము సుకుమార మగుటంజేసి యుద్ధమునకు తాళునోలేదో బాగుగా విచారించుకొనుడు!

ఇవ్విధము మంత్రులు నుడివినదంతయు మందబుద్ధి యగు నంధకుండు విని కోపోద్రిక్తుండై ఖడ్గమునుచేతంబూని అమ్మవారియందలి మోహము పెరుగుచుండగా బ్రహ్మావరదానమదమున సుడిగాలివలె ఇటునటుందిరుగాడుచు శంకరునింజేరుటకు ప్రయాణసన్నాహముం జేయుచుండెను.

ఇయ్యది శివమహాపురాణమున - రుద్రసంహితలో యుద్ధ ఖండమున
"శివ విజ్ఞానసర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమువ చతుశ్చత్వారింశాధ్యాయము.





# నలుబదియైదవ యధ్యాయము

## (యుద్ధప్రారంభము)

అంధకాసురుఁడు గొప్పవీరులను వెంట నిడుకొని మద్యపానమత్తుడై శంకరుఁడు నివసించు గుహఁజేరెను. ఆ గుహాముఖమున వీరకుఁడు కాపలా కాయుచుండెను. మిడుతపురుగు నిప్పుమంటలో వలె దానవప్రభువు గుహలో ప్రవేశించుచుండ వీరకుఁడు పాషాణములతోడను వృక్షములతోడను అగ్నిజ్వాలలతోడను వజ్రాయుధముతోడను బాధించి "ఎవడవు? ఎందులకేతెంచితివి?" అని యడుగగా నంధకుఁడు తన యుద్దేశమును తెలిపి వీరకునితో పోరాడుచుండెను.

ముహూర్తకాలము మాత్రము పోరాడి వీరకుని గెలువఁజాలక ఆకలి దప్పులచే శుష్కించిన కంఠము గలవాడై తన కరవాలము తుత్తినియలు కాగా అంధకుఁడు పాఱిపోవుచుండెను.

అట్టితఱి ప్రహ్లాదుఁడు, విరోచనుఁడు, బలిచక్రవర్తి, బాణాసురుఁడు, శంబరుఁడు, వృత్రాసురుఁడు, మున్నగువారు వీరకునితో ఘోరముగా పోరాడుచున్న సమయమున ప్రదేశమంతయు రక్తసిక్తమై మాంసపూరిత మగుచుండెను.

వీరకునికి దైత్యులకును జరుగుచున్న కోలాహలమును గమనించి శంకరుఁడు పార్వతితో నిట్లు వక్కాణించెను.

దేవీ! నీ మూలమున నా వ్రతము సాగుటలేదు. వ్రతము సంపూర్ణము కానిది ఇతరములను చూచువాడనుకాను. గాన నిచ్చోటునుండి మరియొక దుర్గమ ప్రదేశమునకుఁజని ఏకాగ్రనిష్ఠతో పాశుపతవ్రతము నాచరింతును. నీ విచ్చోటనే నిర్భయముగా నివసింపుము!

శంకరుఁడు అవ్విధము పార్వతి నూఱడించి దూరముగా నుండు పుణ్యతమవనంబుఁ జేరి యచ్చోట వేయివత్సరముల వరకు తపించుచుండెను. ఆ తపోవనము – సురాసురుల కేరికిని చొఱనలవిఁ గాకుండెను.

ఇఁక పార్వతీదేవి – చేయునది లేక మందర పర్వతమునందే శంకరునిరాక నెదిరిచూచుచు తన శీలమును కాపాడుకొనుటకు భయపడుచున్నందున బ్రహ్మాదిదేవతలు మునులును సిద్ధులును ఇట్టి పరిస్థితిని గమనించి యచ్చోటునకు స్త్రీ రూపధారులై యేతెంచుచుండిరి. అంధకుఁడు ఆహారనిద్రలు మాని కామ మోహితుడై వీరకునితో ఐదువందలనైదు వత్సరములు పోరాడుచుండెను.

ఆ సమయమున అమ్మవారి పక్షమున విజయసూచకములగు వాద్యములు మ్రోగింపఁబడుచుండెను. శంఖములు పూరింపఁబడుచుండెను. తత్పూర్వము దైత్యుల శస్త్రాస్త్రముల తాకిడికి మూర్ఛఁజెందిన వీరకుఁడు నొక్కక్షణములోనే మేలుకొని ముందు నిలువఁబడి రాక్షసుల ఆయుధములను లాగినవాడై అవ్వానితో నంధకుని కొట్టుచుండెను.

బ్రహ్మదేవుని స్త్రీరూపము బ్రాహ్మీశక్తియై దండమును కేలంబూనియుండెను. పార్వతీదేవి క్రోధమున మండిపడుచుండెను. నారాయణుని స్త్రీరూపము - శంఖ చక్ర గదా ధనుస్సులను ధరించినదై యుద్ధ సన్నద్ధురాలగుచుండెను.

దేవేంద్రుని స్త్రీరూపము - వేయి అంచులుగల వజ్రాయుధమును ధరించి సహస్ర నేత్రములతో విరాజిల్లుచుండెను. అగ్నిదేవుని శక్తి భయంకరముఖము గలదయ్యెను. యముని శక్తి దండమును చేతఁబూనియుండెను. నిఋతిదేవుని స్త్రీరూపము తీక్ష్ణంబగు ఖడ్గముఁదాల్చి యుండెను. వరుణుని శక్తి - పాశముఁదాల్చి పోరుటకు సిద్ధముగా నుండెను. వాయుదేవుని శక్తి అంకుశముఁదాల్చియుండగా కుబేరునిశక్తిగదను కరమున ధరించియుండెను. ఈశానుని శక్తి భయముఁగొలుపు నోరు గలదై యుండెను.

ఇట్లు నూర్లకొలది శక్తులు గుమిగూడి యసురుల దండుఁగాంచి కొంతతడవు విచారించి చివరకు మానసమును కుదుటపఱచుకొని రాక్షసులతో ఘోరముగా పోరాడుచుండిరి. అట్టితఱి అమ్మవారు వీరకుని సేనాధిపతిగా నియమించి యద్భుతముగా దైత్యులతో యుద్ధము నొనర్చుచుండెను.

అంత నంధకాసురుఁడు బ్రహ్మవరప్రభావమున నోరు పెద్దగా తెఱచి యందరిని మ్రింగ నుండగా భగవానుఁడు తన వ్రతము వేయివత్సరములకాలము వరకు సాగించుకొని యచ్చోటున కేతెంచెను. పార్వతీదేవి శంకరునకు మ్రొక్కులిడి యుద్ధమున తన పరాక్రమమును చూపుచుండెను. అట్టి సమయమున మహేశ్వరుఁడు - శక్తిస్వరూపములను సాగనంపి గౌరీదేవిని మెడపై వేసుకొని గుహలో ప్రవేశించి వీరకుని ద్వారము చెంత కాపలా యుండెను.

అంత నంధకుఁడు పార్వతీపరమేశ్వరులను గాంచనివాడై విఘసుఁడనుదూతను లోనికి పంపగా విఘసుఁడు గుహలోనికి పోవుచు సురగణముల దెబ్బల నోర్చుకొనుచు నతికష్టముగా శంకరుని సమీపించి శిరము వంచి ప్రణతుల నొనర్చియు - దేవా! తాపసుడవు కావున నీ భార్యను విడిచి యేకాంతమున నివసింపుము! మునివృత్తిలో నున్నవానితో విరోధము కూడదని గుర్తించియు నిన్ను పగవానిగా భావించుచున్నాను. గాన నీవు బయటపడి నాతో పోరాడుము! నిన్నువేగమే యమలోకమునకు పంపుదును" అని అంధకుని సందేశమును విన్నవించెను.

అంత సత్పురుషులను రక్షించువాడు దుష్టులను శిక్షించువాడు నగు పరమాత్మ - కోపముఁ దెచ్చుకొని - దైత్యాధమా! నీ యభిప్రాయము విదితమైనది. చేతనైతే వడిగా వచ్చి పోరాడుము! అశక్తునకు భార్య గృహము ధనము మున్నగువానితో నవసరముండునా! మరియు బలహీనుఁడు తన శరీరమును గూడ పోషించుకొనఁజాలడు. అందువలన నీవు నీ పరివారము చేయదలచిన దంతయు చేయుఁడు! నా కర్తవ్యమును నేను నెరవేర్తును" అని విఘసునిద్వారా తన యభిప్రాయము నంధకునకు వ్యక్తపఱచెను.

ఇయ్యది "శివవిజ్ఞాన పర్వప్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున పంచచత్వారింశాధ్యాయము.





# నలుబదియారవ యధ్యాయము

## (అంధకాసురునియుద్ధము)

అంత విఘసుఁడు విశదీకరించిన శివాభిప్రాయమును గుర్తెరిగి యంధకాసురుఁడు గిలుఁడనువాని ముందిడుకొని శంకరుని గుహఁజేరినవాడై అనేకశస్త్రాస్త్రములతో గుహాద్వారమును భేదించుటయేగాక ద్వారపాలకుఁడగు వీరకుని బాణములతో కొట్టుచుండెను. అంధకుని సైనికులు ఇంపైన పుష్పములు ఆకులు గల వృక్షములను విఱచుచుండిరి. ఫలములఁబాడు చేయుచుండిరి. తియ్యని నీటిని కలుషిత మొనర్చుచు పూదోటలఁజెఱచుచుండిరి. కొండ శిఖరము లఁబడఁగొట్టుచుండిరి.

అట్టితఱి శంకరుఁడు త్రిశూలమును కేలఁబూని కోపమున మండిపడుచు భూతసముదాయమును విష్ణుమూర్తి మున్నగుదేవతలను ప్రమథగణములను స్మరింపగా నవ్వారందరును వేగ నరుదెంచి తమతమ పరివారములతో శంకరుని మ్రోల నిలువఁబడి వీరకుని సేనాధిపతిగా నొనర్చియుండగా నవ్వారందరిని పోరుటకై శంకరుఁడు పంపుచుండెను.

అవ్విధము దేవదానవులకు ఘోరయుద్ధము జరుగుచుండ గిలుఁడు నమరులందరిని మ్రింగు చున్నందున వీరకుఁడు తప్పించుకొని స్వామికి దిగువవిధము విన్నవించెను.

"దేవా! విఘసుఁడు (గిలుఁడు) – నారాయణుఁడు బ్రహ్మదేవుఁడు, దేవేంద్రుఁడు, సూర్యచంద్రులు మొదలగు త్రిదశులందరిని మ్రింగినాడు. నేనొక్కడనెట్లో వాని నోటఁబడక తమ సన్నిధిఁజేరితిని. శ్రీహరి - నరసింహమూర్తియై హిరణ్యకశిపుని గోళ్లతో చీల్చి చంపిన పిదపఁగూడ నోరుఁదెఱచుకొని ముల్లోకములను మ్రింగనుండగా వసిష్ఠుఁడు మున్నగు సప్తర్షులు క్రుద్ధులై – విఘసుఁడు నీవలె నోరుఁదెఱచుకొని నిన్ను మ్రింగుగాక! అని శపించినందున సప్తర్షుల శాపకారణముగా విఘసుఁడు విజృంభించి నారాయణుని మ్రింగఁగలిగెను. జగంబు వెలుగొందఁజేయు సూర్యచంద్రులు లేనందున ప్రపంచము అంధకారముతో నిండియున్నది. శుక్రాచార్యుఁడు – అమరులచే సంహరింపఁబడిన దైత్యులను సంజీవనీ విద్యాప్రభావమున మరలఁ బ్రతికించుచున్నవాడు. తమ కొరకు నేను ప్రాణముల నర్పింప సంసిద్ధుడను. కాని యా దురాత్ము నోడించు నుపాయము నాలోచింపుడు!"

ఇట్లు వీరకుఁడు నుడువగానే ప్రమథపతి (శంకరుఁడు) మిగుల రోసముఁజెంది కొంతతడవు విచారించుకొని యాత్మశక్తివలన సూర్యస్వరూపుడైనందున చీకటి పటాపంచలయ్యెను. అందువలన వీరకుఁడు మరల నసురులతో పోరాడుచుండెను. యోధులలో ముఖ్యుఁడును, శమదమాది సంపన్నుఁ డును, సమస్తవిద్యలకు నిలయంబునగు నందికేశ్వరునిఁగూడ విఘసుఁడు మ్రింగినందున శంకరుఁడు వృషభము పైనెక్కి శివపంచాక్షరీ మహామంత్రమును జపించుచు తీక్ష్ణములగు బాణములతో విఘసుని కొట్టినవాడయ్యెను.





అందువలన విఘసుని నోటిలోనుండి వీరకుఁడు విష్ణుప్రముఖులగు దేవతలను తదితరుల నందరిని బయటికి తీసిన పిదప నవ్వారందరును దైత్యులతో ఘోరముగా పోరాడుచుండగా శుక్రుఁడు - మరణించిన రాక్షసులను జీవింపఁజేయుచుండెను.

ఆ కారణముగా శంకరుఁడు శుక్రాచార్యుని పశువువలె గణములతో పట్టి తెప్పించినవాడై అతనిని మ్రింగివేసెను.

అంత దివిజులు ధీరులై దైత్యులను కొట్టుచున్నందున నవ్వారు కొందరు పాతాళముఁబ్రవేశించు చుండిరి. మరికొందరు గిరిగుహలలో చొఁఱఁబడుచుండిరి. అదేయదనుగా శ్రీహరి యంధకాసురుని గదతోకొట్టుచు వాని బలహీనునిగా నొనర్చుచుండెను. వీరకుఁడును ఇంద్రాది లోకపాలురు నసురుల మదము నణచుచుండిరి.

అట్టితతి నివ్వెఱబోయిన ముఖముగల యంధకాసురుని శంకరుఁడు త్రిశూలముతో లేవనెత్తి యగ్రభాగమున నిలిపెను. అప్పుడు శివేచ్ఛావశమున శంకరుని చెవినుండి యొకానొక శక్తిస్వరూపము బయలువెడలి ఆకలిచే నసురులను భక్షించుచు అవ్వారి రక్తమును త్రాగుచుండెను.

త్రిశూలాగ్రమున నుండు నంధకుఁడు - క్షాత్రధర్మమును పాటించుచు చేతులతోడను నిశిత నఖములతోడను కొంతవరకు శంకరుని బాధించి చివరకు వేసారి క్రిందికి వ్రేలాడుచు సూర్యకిరణముల నెండుచు గాలితో కూడిన మేఘముల వర్షధారలచే తడియుచును ప్రాణములను విడువఁజాలక సామవేదసూక్తులతో ప్రార్థించినందున శంకరుఁడు ప్రసన్నుడై యంధకాసురునికి గణాధిపతి పదవి ననుగ్రహించెను.

అట్టి శుభసమయమున భువనాధీశ్వరులగు విష్ణ్వాద్యమరులు యక్షగంధర్వాదులందరును రమణీ యార్థవంతములగు స్తోత్రములతో శంకరుని ప్రార్థించుచు నమ్రులై జయజయ ధ్వానముల నొనర్చుచుండిరి. అంత మహాదేవుఁడు - పర్వతగుహయందు విష్ణ్వాదుల నభినందించి సాగనంపియు సంతోషస్వాంతుఁ డై పార్వతీదేవితోడను వీరకుఁడు మున్నగువారితోడను సుఖముగా నుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన పర్వస్య" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచవముతో షట్ చత్వారింశాధ్యాయము.

## నలుబదియేడవ యధ్యాయము

### (శుక్రాచార్యుని వేడుకొనుట)

ఇదే శివపురాణమును సనత్కుమారుఁడు వ్యాసునకు చెప్పినట్లును బ్రహ్మదేవుఁడు నారదమహర్షికి వక్కాణించినట్లును సూతుఁడు శౌనకాదులకు నుడువుచుండగా శౌనకాదు లిట్లు ప్రశ్నించిరి.

శుక్రాచార్యుఁడు శంకరుని కడుపులో చొరఁబడియు జఠరాగ్నిచే దహింపఁబడనివాడై ఎట్లుండెను? అతఁడు సంజీవనీవిద్యనెట్లు సంపాదించెను?





సూతుఁడు చెప్పఁదొడఁగెను.

ప్రమథగణములు సురలును దైత్యులను బాధించుచు వధించుచుండ నంధకుఁడు శుక్రాచార్యుని సమీపించి వినయముతో నంజలిఁ ఘటించినవాడై "ఆచార్యా! మా దితిజులందరికిని కులగురువుగా పూజనీయుడ వగుచున్నావు. ఇప్పట్టున శంకరుని గణములు తుహుండహుండాది మహావీరులను గూడ సంహరించినందున నద్ధైర్యము కలుగుచున్నయది. వేయి వత్సరములు పొగఁద్రాగుచు తపించి సంపాదించిన సంజీవనీ విద్య నుపయోగించి మమ్ము కాపాడు" మని ప్రార్థించెను.

అంత శుక్రాచార్యుఁడు కొంతతడవు లోలోన పరితపించి "ప్రస్తుతము కర్తవ్యమెద్ది? జీవులు జననమరణములు కలిగియుండువారు కావున మరణించినవారిని బ్రతికించుట, ధర్మముకాదు.

శంకరుని యనుగ్రహముననే సంజీవినీవిద్యఁ బడసితినిగదా! అట్టి విద్యను మహేశ్వరునికి విరుద్ధముగా నుపయోగించుట యన్యాయ మగును. ఐనను శరణాగతరక్షణము పరమధర్మమగుటచే ఈ యంధకుని కోరిక నంగీకరింపవలసివచ్చినది" అని మదిని నిశ్చయించుకొని "దైత్యరాజా! నీ యిష్టమును నెరవేర్తు" నని యభయము నొసఁగినవాడై రణరంగమున కేతెంచి సంజీవినీ విద్యాప్రభావమున మృతదైత్యులను జీవింపజేయుచుండెను.

అట్టితతి – బాల్యమున గురుకులవాసముతో వినయమున నేర్చుకొనిన వేదశాస్త్రములు సమయ సందర్భములలో నుపయోగించునట్లు, సంకట సమయములలో బ్రాహ్మణులకు సమర్పించిన ద్రవ్యములు – దాతకు పరలోక సుఖము నొసగుటకు సంసిద్ధములుగా నుండునట్లును దైత్యులు జీవితులై జలపూర్ణ మేఘములఁబోలె గర్జించుచు ప్రమథగణములతో పోరుటకు తలపడఁగా నందికేశ్వరుఁడు వడిగా శంకరునిఁజేరి ప్రణమిల్లియు "దేవా! శుక్రాచార్యుఁడు – మరణించిన వారిని జీవింపఁజేయుచున్నవాడు కావున మనకు విజయము సమకూరదని తోచెడిని" అని ప్రార్థించెను.

అంత శంకరుఁడు "రాక్షసుల మధ్యనుండి శుక్రాచార్యు నవలీలగా తీసుకొని రమ్మని"యాజ్ఞాపింపగా నందికేశ్వరుఁడు వేగమే యసురులఁదెసఁజని శరభము గజమును వలె శుక్రాచార్యుని పట్టుకొని తెచ్చుచుండగా రక్కసులు శూలములతోడను కత్తులతోడను చక్రములతోడను గొడ్డండ్రతోడను తనను బాధించుచున్నందున నా యపరరుద్రుఁడు నిజప్రభావమున నోటినుండి మంటలను వెలుఁబఱచి యవ్వారి యాయుధములను దహించినవాడై శంకరుని మ్రోల శుక్రాచార్యుని నెలకొలిపెను.

అంత మృత్యుంజయుఁడు శుక్రాచార్యుని – విశుద్ధభక్తుఁడు సమర్పించిన మధురఫలమునువలె నేమియు మాటలాడకయే తన నోటిలో వేసుకొనెను. అందువలన నసురులుహాహాకారములతో వగచుండిరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున సప్తచత్వారింశాధ్యాయము.

# నలుబదియెనిమిదవ యధ్యాయము

## (శుక్రుఁడు శంకర గర్భమున నివసించుట)

అవ్విధము శుక్రాచార్యుని శంకరుఁడు మ్రింగినందున దైత్యులు విజయముపై ఆశనొదులుకొని – తొండములు లేని యేనుగులవలెను, కొమ్ములు లేని యెద్దులవలెను, తలకాయలు లేని మొండెములవలెను, వేదశాస్త్రవిద్య నభ్యసింపని బ్రాహ్మణులవలెను, ఉద్యోగములేని మానవుల వలెను, భాగ్యము లేని ప్రయత్నములవలెను, భర్తలేని తరుణులవలెను, పుణ్యము లేని జీవితములవలెను; వ్రతములులేని విద్యాభ్యాసము వలెను, వైభవము లేని మహాకార్యముల వలెను, శౌర్యములేని క్షత్రియుల వలెను, సత్యములేని ధర్మప్రవర్తనము వలెను, క్షీణదశనొందినవారై మిగుల వగచుచుండిరి.

మా శౌర్యధైర్యములు, పరాక్రమము, బలము, సమస్తంబు వ్యర్థమయ్యెను. ఒక్కశుక్రాచార్యుని రక్షించుకొనఁజాల మైతిమని యంధకుఁడు పరితపించుచు గురుపాద కమలములను స్మరించి ప్రమథులతో పోరాడుడు! అనిసైనికుల నాదేశింపగా నవ్వారు స్వామిద్రోహము నరకప్రదమని భావించి మరణమువరకు పోరుదుమని నిశ్చయించుకొనినవారై యుద్ధసన్నద్ధులగుచుండిరి.

అంత రణవాద్యములు మ్రోగుచుండగా దైత్యులు ప్రమథులతో పోరుచు నోడుచున్నందున నంధకుఁడు ముందుకువచ్చి బాణములతో కొట్టుచు ప్రమథగణములను పరాజితముల నొనర్చుచుండెను.

అట్టితఱి కుమారస్వామి వినాయకుఁడు నందియు సోమనందియు తదితరులును తమ తమ ఆయుధములతో అంధకాసురుని కొట్టుచుండగా సురాసురసైనికుల కోలాహలము మిన్నుముట్టుచున్నందున శంకరుని యుదరమునఁగల శుక్రాచార్యుఁడు జాగరూకుడై – ఒకానొకచోటు దొరకని గాలివలె మహేశ్వర గర్భమునఁ దిరుగాడుచుటు ఛిద్రముఁగానక నట్టిసమయమున సత్యలోక వైకుంఠ స్వర్గములను సూర్యచంద్రాది లోకములను పాతాళాది సమస్త ప్రపంచమును శంకరుని దివ్యశరీరమున గాంచుటయేగాక ప్రస్తుతము జరుగుచున్న దేవాసుర సంగ్రామము నవలోకించుచు ననేక సంవత్సరములు శివునిలో సంచరించుచు – దుర్మార్గుఁడు సన్మార్గుని చెంత ధర్మలోపమును కనుగొనఁజాలనట్లు – శంకరుని గర్భమునుండి బయటపడుటకు మార్గముఁగానక దిగువ మంత్రమును భక్తితో జపించినందున శంకరుని మూత్రద్వారము గుండా వీర్యమువలె సూక్ష్మరూపమున బయటఁబడి శంకరునికి ప్రణతుల నొనర్చి నిలువఁబడగా నాతనిని – విఘ్నేశ్వరునివలె – నమ్మవారు పుత్రునిగా స్వీకరించెను.

అంత శంకరుఁడు మందస్మిత వదనారవిందుఁడై – నా మూత్రస్థానమునుండి శుక్రము (రేతస్సు) వలె వెడలినందున శుక్రుఁడను పేరుగలవాడవై నా పుత్రుఁడవై యుండుమని యనుగ్రహింపగా శుక్రాచార్యుఁడు – అంజలిఘటించి "శంకరా! నీ స్వరూపము అనంతమైనది. అష్టమూర్తులతో జగమును వ్యాపించినవాడవు; సురలను అసురులను కాపాడువాడవు; దుర్మార్గులను శిక్షించువాడవు; ఇట్టి నిన్ను నుతింపఁజాలను" అని ప్రార్థించినవాడై శంకరుని యనుమతిఁబడసియు మేఘములలో చంద్రుఁడువలె నసురుల గుంపులో చొఱఁబడినవాడయ్యెను.





ఇంక శుక్రాచార్యుడు శివగర్భమున పఠించిన మహామంత్రమును నిర్దేశింతునని సూతుండు నీ యధ్యాయమును విరమించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున అష్టచత్వారింశాధ్యాయము.

## నలుబది తొమ్మిదవ యధ్యాయము

### (శుక్రాచార్యకృత శివస్తోత్రము)

ఓం నమస్తే దేవేశాయ సురాసుర నమస్కృతాయ భూతభవ్యమహాదేవాయ హరితపింగళలోచనాయ బలాయ బుద్ధిరూపిణే వైయాఘ్రవసనచ్ఛదాయ అరణేమాయ త్రైలోక్యప్రభవే ఈశ్వరాయ హరాయ హరినేత్రాయ యుగాంతకరణాయానలాయ గణేశాయ లోకపాలాయ మహాభుజాయ మహాహస్తాయ శూలినే మహాదంష్ట్రిణే కాలాయ మహేశ్వరాయ అవ్యయాయ కాలరూపిణే నీలగ్రీవాయ మహోదరాయ గణాధ్యక్షాయ సర్వాత్మనే సర్వభావనాయ సర్వగాయ మృత్యుహంత్రే పారియాత్రసువ్రతాయ బ్రహ్మచారిణే వేదాంతగాయ తపో ఽంతగాయ పశుపతయే వ్యంగాయ శూలపాణయే వృషకేతవే హరయేజటినేశిఖండినేలకుటినే మహాయశసే భూతేశ్వరాయ గుహావాసినే వీణాపణవతాలవతే అమరాయ దర్శనీయాయ బాలసూర్యనిభాయ శ్మశానవాసినే భగవతే ఉమాపతయే అరిందమాయ భగస్యాక్షిపాతినే పూష్ణోదశననాశనాయ క్రూరకర్తకాయ పాశహస్తాయ ప్రళయకాలాయ ఉల్కాముఖాయాగ్నికేతవేమునయే దీప్తాయ విశాంపతయే ఉన్నయతే జనకాయ చతుర్థకాయ లోకసత్తమాయ వామదేవాయ వాక్ దాక్షిణ్యాయ వామతోభిక్షవే భిక్షురూపిణే జటినే స్వయంజటిలాయ శక్రహస్తప్రతిస్తంభకాయ వసూనాంస్తంభకాయ క్రతవే క్రతుకరాయ కాలాయ మేధావినే మధుకరాయ చలాయ వానస్పత్యాయ వాజసనేతి సమాశ్రమ పూజితాయ జగద్ధాత్రే జగత్కర్త్రే పురుషాయ శాశ్వతాయ ధ్రువాయ ధర్మాధ్యక్షాయ త్రివర్త్మనే భూతభావనాయ త్రినేత్రాయ బహురూపాయ సూర్యాయుతసమప్రభాయ దేవాయ సర్వతూర్యనినాదినే సర్వబాధావిమోచనాయ బంధనాయ సర్వధారిణే ధర్మోత్తమాయ పుష్పదంతయాపి భాగాయ ముఖాయ సర్వహరాయ హిరణ్యశ్రవసే ద్వారిణే భీమాయ భీమపరాక్రమాయ ఓం నమోనమః ॥

ఇట్టి మహామంత్రమును శుక్రాచార్యుండు శంకరుని గర్భమున నున్నతఱి జపించి నందున మూత్రద్వారముగుండా బయటపడఁగలిగెను.

శుక్రుఁడు శివగర్భమున నివసించుటకు శివునిఁ బ్రార్థించుటకును మూడువేల వత్సరముల కాలము గడచియుండెను. త్రిశూలాగ్రమున నంధకాసురుఁడు చిక్కుకొని శంకరుని నూటయెనిమిది మూర్తులను ధ్యానించినందున పరమాత్మ ప్రసన్నుడై యనేక వరములను ప్రసాదించెను.

అంత నంధకుఁడు తన జన్మ వృత్తాంతమును తలచుకొని ప్రశాంత మనస్కుఁడై పార్వతీదేవిని తల్లిగాను శంకరుని తండ్రిగాను భావించి గణాధిపతియై కృతార్థుండయ్యెను.





అమ్మవారు అయ్యవారును తనను చేరఁదీసి శిరమున వాసనఁజూచి యనుగ్రహించి నందున నంధకుఁడు పూర్ణమనోరథుఁడై కైలాసమున సుఖముగా నుండెను.

**శంకరుని యష్టోత్తర మూర్తులు-**

(1) మహాదేవుఁడు (2) విరూపాక్షుఁడు (బేసికన్నులుఁగలవాడు) (3) చంద్రశేఖరుఁడు (4) అమృతుఁడు (5) శాశ్వతుఁడు (6) స్థాణువు (7) నీలకంఠుఁడు (8) పినాకి (9) వృషభాక్షుఁడు (వృషభముపై చూపుగలవాడు) (10) మహాజ్ఞేయుడు (పురుష శ్రేష్ఠుడగు నారాయణునిచే నుపాసింపఁబడువాడు) (11)పురుషుడు (12) సర్వకామదుడు (13) కామారి (14) కామదహనుడు (15) కామరూపుడు (16) కపర్ది (జటాజటముగలవాడు) (17) విరూపుడు (18) గిరీశుఁడు (కొండపై పడుకొనువాడు) (19) భీముడు (20) సృక్కి (మంచి పిక్కలు గలవాడు)(21) రక్తవస్త్రుడు (22) యోగి (23) కామదహనుడు (24) త్రిపురఘ్నుఁడు (25) కపాలి (26) గూఢవ్రతుడు (27) గుప్తమంత్రుడు (28) గంభీరుఁడు (29) భావగోచరుఁడు (30) అణిమాదిగుణాధారుఁడు (31) త్రిలోకైశ్వర్య దాయకుఁడు (32) వీరుఁడు (33) వీరహణుఁడు (34) ఘోరుఁడు (35) విరూపుఁడు (వివిధ రూపములుఁ గలవాడు) (36) మాంసలుఁడు (37) పటువు (38) మహామాంసాదుఁడు (39) ఉన్మత్తుఁడు (40) భైరవుఁడు(41) మహేశ్వరుఁడు(42) త్రైలోక్యద్రావణుఁడు (43) లుబ్ధుఁడు (44) లుబ్ధకుఁడు (ఎఱుకువాడు) (45) యజ్ఞసూదనుఁడు (46) అరుగురు కృత్తికలచే పోషింపఁబడిన కుమారుడు గలవాడు (47) ఉన్మత్తుడు (అధికమైన ఆనంద పారవశ్యముఁ గలవాడు) (48) కృత్తివాసుఁడు (49) గజకృత్తిపరిధానుడు (ఏనుగుతోలు ధోవతిగా కలవాడు) (50) క్షుబ్ధుడు (భక్తులు కానివారిని కలతఁబెట్టువాడు) (51) భుజఁగభూషణుడు (52) దత్తాలంబుడు (భక్తులకు చేయూత నొసగువాడు) (53) వేతాళుఁడు (54) వీరుడు (55) శాకినీపూజితుడు (56)అఘోరుడు (57) ఘోరదైత్యఘ్నుడు (58) ఘోరఘోషుడు (59) వనస్పతిరూపుఁడు (60) భస్మాంగుడు (61) జటిలుడు (62) శుద్ధుడు (63) భేరుండశతసేవితుడు (భయంకరములైన గణములచే సేవింపబడువాడు) (64) భూతేశ్వరుడు (65) భూతనాథుడు (భూతములకు దిక్కగువాడు) '(66) పంచభూతాశ్రితుడు (67) ఖగుడు (ఆకాశమునందు సంచరించువాడు) (68) క్రోధితుడు (69) నిష్ఠురుడు (70) చండుఁడు (71) చండీశుడు (72) చండికాప్రియుఁడు (73) చండుఁడు (74) తుంగుడు (75) గరుత్మంతుడు (76) ఆసవభోజనుడు (అమృతముఁద్రాగువాడు) (77) లేలిహానుడు (సర్పస్వరూపుడు) (78) మహారౌద్రుడు (79) మృత్యువు (80) మృత్యుఅగోచరుఁడు (81) మృత్యుమృత్యువు (82) మహాసేనుడు (83) శ్మశానవాసియు (84) అరణ్యవాసియు (85) రాగస్వరూపుఁడు (86) విరాగస్వరూపుఁడు (87) రాగాంధుఁడు (భక్తానురాగముచే పరవశుఁడగువాడు) (88) వీతరాగశతార్చితుఁడు (89) సత్త్వగుణుఁడు (90) రజోగుణుఁడు (91) తమోగుణుఁడు (92) అధర్ముఁడు (ధర్మము నడువనివారి నధర్మముగా శిక్షించువాడు) (93) వాసవానుజుఁడు (ఉపేంద్రరూపమున స్వర్గమున నివసించువాడు) (94) సత్యుఁడు (95) అసత్యుఁడు (దేవుఁడు లేడనువారికి నిజరూపమును చూపెట్టనివాడు)(96) సద్రూపుఁడు (97) అసద్రూపుఁడు (అవిద్యాస్వరూపుఁడు) (98) అహేతుకుడు





(99) అర్ధనారీశ్వరుఁడు (100) భానువు (101) భానుకోటి శతప్రభుఁడు (102) యజ్ఞస్వరూపుఁడు (103) యజ్ఞపతియు (104) రుద్రుఁడు (105) ఈశానుఁడు (106) వరదుఁడు (107) నిత్యుఁడు (108) శివుఁడును.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏకోనపంచాశత్తమ (౪౯) అధ్యాయము.

## ఏబదియవ యధ్యాయము

### (శుక్రాచార్యుఁడు మృత సంజీవినీ విద్యను సంపాదించుట)

భార్గవుఁడు (శుక్రుడు) కాశీక్షేత్రమున విశ్వేశ్వరుని ధ్యానించుచు నొక్క శివలింగమును స్థాపించి యద్దానిముందు నొక్క కూపముఁ ద్రవ్వియు శివపంచాక్షరీ మహామంత్రముఁ జపించుచుండెను మరియు పంచామృతములతోడను శుద్ధజలముతోడను గంధోదకముతోడను శివలింగమును ప్రతిదినము వేయిమారులు నభిషేకించుచు శ్రీగంధమును సమర్పించుచు సంపెంగలు ఉమ్మెత్తలు గన్నేరులు తామరలు కొండగోగులు జాజులు కడిమెలు పొగడలు కలువలు మల్లెలు నూరుదళముల కమలములు వావిలులు పొదుగులు సురపొన్నలు తెల్లకలువలు మొల్లలు జిల్లేడులు తుమ్మి నందివర్ధనములు అగిసెలు దేవదారువులు కాంచనములు గోరింటలు పచ్చగోరింటలు మున్నగు కుసుమములతోడను మారేడు దళములతోడను మరువముల తోడను దవనములతోడను తులసీదళములతోడను మాచిపత్రములతోడను వాకుఁడు దళములతోడను దర్భాగ్రములతోడను దూర్వాంకురములతడోను మామిడి చిగురులతోడను సహస్రసంఖ్యగా సహస్రనామములతో పూజించుచుండుటయేగాక భక్త్యతిశయమున నాట్యముఁజేయుచుస్తోత్రములఁ జదువుచు నైదువేల వత్సరములు తపించెను.

ఐనను శంకరుఁడు ప్రసన్నుఁడు కానందున శుక్రాచార్యుఁడు కఠిన నియమములతో తపించు చుండెను.

చిత్తమునకుఁగల చంచల భావము అను మైలను సద్భావములు అను నుదకములతో కడిగి యింద్రియములఁగూడ శుభ్రపఱచినవాడై అట్టి చిత్తరత్నమును పరమేశ్వరునకు సమర్పించి యగ్నికణముల పొగఁద్రాగుచు వేయివత్సరములు తపింపగా శుక్రునిపై దయఁగలవాడై విరూపాక్షుఁడు (శంకరుఁడు) సహస్రసూర్యులను మించిన ప్రకాశముతో శుక్రస్థాపితలింగమునుండి ప్రత్యక్షమై వరము నడుగు మనెను. నీ తపంబునకు సంతసించితిననియు నుడివెను.

అంత శుక్రుఁడు శంకరుని దివ్యసుందర విగ్రహమును తన కమలములవంటి కన్నులతో గాంచినవాడై శిరంబు నంజలిఁ ఘటించి జయజయ ధ్వనిఁజేయుచు దిగువవిధము స్తోత్రముతో ప్రార్థించెను.

శ్లో॥ త్వం భాభి రాభి రభిభూయ తమః సమస్త - మస్తం నయ స్యభిమతాని నిశాచరాణామ్ ।
దేదీప్యసే దివ (దిన) మణి గగనే హితాయ - లోకత్రయస్య జగదీశ్వర తన్నమస్తే ॥ ౧





జగదీశ్వరా! ఆకసమున స్వర్గాదిలోకముల మణివంటి సూర్యుని రూపమున ఈ కనఁబడు కాంతులతో నీవే వెలుగొందుచు రాత్రిళ్లు సంచరించు భూతప్రేతపిశాచబ్రహ్మారాక్షసుల దురాశలను పోగొట్టుటయే గాక ముల్లోకముల మేలునకై పాటుపడుచుందువు కావున నీకు నమస్కారముఁ జేయుచున్నాను.

శ్లో॥ లోకేఽతివేలమతివేల మహామహోభి-ర్నిర్మాసి కౌచగగనేఽఖిలలోకనేత్రః ।
విద్రావితాఖిలతమాః సుతమో హిమాంశో-పీయూషపూరపరిపూరిత తన్నమస్తే ॥ ౨

ప్రాణులందరికి కన్నువంటివాడవై ఆకాశమున చంద్రుని రూపమున మిగుల మించిన కాంతులతో నేలను రాణింపఁజేయుచు చీకటినంతయు పారఁద్రోలుచు అమృతముతో నిండిన కిరణములతో చరాచరజీవుల నానందింపఁజేయుచున్నావు. అందువలన నీకు నభివాదము నొనర్చుచున్నాను.

శ్లో॥ త్వం పావనే పథి సదాగతి రప్యుపాస్యః - కస్త్వాం వినా భువనజీవన జీవతీహ ।
స్తబ్ధప్రభంజన వివర్ధిత సర్వజంతో -- సంతోషితాహికుల సర్వగ (వై) తన్న (వ) మస్తే ॥

లోకులను జీవింపఁజేయు వాయుదేవుని రూపమున నిరంతరము వీచుచున్నవాడవై పవిత్రమగు సదాచార మార్గమున నుపాసింపఁదగినవాడ వగుచున్నావు. నీవు లేనిది యెవఁడీ బ్రహ్మాండమున జీవింపఁ గలుగును? సర్వవ్యాపకమగు వాయువును శరీరములో నెలకొలిపి ప్రాణులందరిని పెంచుచుందువు. నిట్టూర్పుతో వారిని బ్రతికించుచుందువని భావము. వాయు స్వరూపమున ప్రపంచమున నంతయు వ్యాపించు శంకరా! గాలిఁబీల్చు పాములఁగూడ బ్రతికించువాడవు. ఆ కారణమున నీకు మ్రొక్కులిడుచున్నాను.

శ్లో॥ విశ్వైక పావక నతాపక పావకైక - శక్తే ఋతే మృతవతా మృతదివ్య కార్యమ్ ।
ప్రాణిష్యదో జగదహో జగదంతరాత్మం - స్త్వం పావకః ప్రతివదం శమదో నమస్తే ॥ ౪

ప్రాణులందరి నంతర్యామివై విశ్వమును నీ వొకఁడవే పవిత్రముఁజేయుఁగలుగువాడవు; శరణాగతులను రక్షించువాడవు; అగ్నిదేవుని ఏకైక రూపమున నీవు లేనిచో మరణించినవారికి నుత్తమగతి నొందించు పవిత్ర దహన సంస్కార మెట్లు చేకూరును? నీ యగ్ని రూపమునే ప్రాణులు జఠరాగ్నిగా లోన నుంచుకొని యాహారమును జీర్ణింపఁజేసుకొనుచు జీవించుచున్నవారు. మరియు నగ్నిదేవుఁడవై ప్రతిక్షణమున ప్రపంచమునకు చెందిన మాలిన్యమును పోగొట్టుచు పరిశుభ్రతను కలిగించుచున్నావు. ఆ నిమిత్తముగా నీకు వందనము నిడుచుంటిని.

శ్లో॥ పానీయరూప పరమేశ జగత్పవిత్రం - చిత్రం విచిత్రసుచరిత్ర కరోఽసి నూనమ్ ।
విశ్వం పవిత్ర మమలం కిల విశ్వనాథ - పానీయగాహనత ఏత దతో నతోఽస్మి ॥ ౫

జలస్వరూపుడవగు నో పరమేశ్వరా! నీ లీలావిగ్రహ ప్రవర్తనము విచిత్రమైనది. నానావిధ రూపములతో నుండు బ్రహ్మాండమును అందుగల చరాచరప్రాణుల నుదకమునఁ గ్రుంకులిడుటచే మైలలేనివానిగాను పవిత్రులుగాను చేయుచున్నావు! అందువలన నో విశ్వనాథా! నీకు ప్రణతుడ నగుచుంటిని.





శ్లో॥ అతాశరూప బహి రంత రుతావకాశ - దానా ద్వికస్వర మహేశ్వర విశ్వ మేతత్ ।
త్వత్తః సదా సదయ సంశ్వసితి స్వభావా - త్సంకోచ మేతి భవతోస్మిఽనత స్తత స్త్వామ్॥ ౬

ఆకాశ స్వరూపుడవగు నీశ్వరా! ఈ ప్రపంచము నీవు వెలుపల లోపల నవకాశమును కలిగించుటం జేసి వికాసమును పొందుచున్నది. నీ కరుణవలననే ప్రాణులందరు నిట్టూర్పులను విడచుచు జీవించుచున్నవారు. విశ్వము సహజముగా సంకోచము (ఒక్కచో ముడుచుకొనుట)ను పొందునదైనను. నీవు ఆకాశరూపమున నవకాశమును కల్పించుటచే గమనాది క్రియలను చేయగలుగుచున్నది. అటులే ప్రళయకాలమున నీ వలననే సంకోచము నొందుచున్నది. తస్మాత్ నిన్ను మ్రొక్కుచున్నాను.

శ్లో॥ విశ్వంభరాత్మక బిభర్షి విభోఽత్ర విశ్వం - కో విశ్వనాథ భవతోఽన్యతమ స్తమోఽరిః ।
సత్వం వినాశాయ తమో మమ చాహిభూష - స్తవ్యాత్పరః పరపరం ప్రణత స్తతస్త్వామ్ ॥ ౭

సర్వవ్యాపకుడవగు విశ్వనాథా! భూమి రూపమున నీవు సృష్టికాలమున ప్రపంచమును మోయుచున్నావు. అజ్ఞానమును తీసివేయు నీవు దక్క నితరుండెవడు నీ విశ్వమును భరింపంజాలడు.

నాగభూషణా! అట్టి నీవు నా యవివేకమును పోగొట్టుమనియు నుతింపందగిన దేవతలను మించినవాడవై హరిబ్రహ్మాదుల నతిక్రమించియుండువాడవనియు నిన్ను ప్రార్థించుచున్నాను.

శ్లో॥ ఆత్మస్వరూప తవ రూపపరంపరాభి - రాభి స్తతం హర చరాచర రూప మేతత్ ।
సర్వాంతరాత్మనిలయ ప్రతిరూప రూప - నిత్యం నతోఽస్మి పరమాత్మజనోఽష్టమూర్తే ॥ ౮

సూర్యచంద్ర వాయు అగ్నిజల ఆకాశ భూమి స్వరూపములను ధరించుటయేగాక జీవాత్మరూపమున నుండువాడవై యష్టమూర్తి యనంబఅగుచున్నావు. మరియు జీవాత్మద్వారా అనేక రూపములందాల్చి చరాచరమును వ్యాపించువాడవు. ప్రాణుల హృదయములలో నివసించుచు నిత్యత్వ చేతనత్వాదులతో నిన్ను బోలిన జీవులకు మూలాధారముగా నిజరూపమును ప్రసాదించుటచే నీవాడనగు నేను నిన్ను శరణాగతుడనై వేడుచున్నాను.

ఇట్టి యెనిమిది రూపములతో విశ్వజనమునకు మేలు చేయుచున్నావు. మరియు దీనబాంధవుడవై విహితములైన భక్తుల కోరికలను ఫలింపంజేయువాడవు. దేవదానవ మానవాదులందరును నిన్ను ప్రార్థించుచున్నవారు నన్ను కాపాడుము!

ఇవ్విధము శుక్రాచార్యుండు నుతించి శిరంబున నేలందాకుచు పునః పునః (మాటిమాటికి) ప్రణామంబులంజేయుచుండ భగవానుండు తన మృదుహస్తమున నాతనిని లేపినవాడై మేఘగంభీర మధురస్వరమున చిరునగవుతో నిట్లు పలికెను.

విప్రవర్యా! కాశీక్షేత్రమున సదాచార సంపన్నుడవై శివలింగమును స్థాపించి పూజించుచు నుగ్రతపంబు గావించితివి. అందువలన నిన్ను నా కుమారులతో సమానునిగా భావించుచున్నాను మరియు మున్ముందు నా కడుపున నివసించి వెళ్ళగలవు గాన పుత్రుడవనియే చెప్పవచ్చును. నీ యభీష్టము ఎట్టిదైనను నెరవేర్తును.

శ్రీహరికిని విధాతకును చెప్పకుండ దాచియుంచినట్టి మృతసంజీవినీవిద్య నొసంగుచున్నాను. స్వీకరింపుము! ఎవరిని గురించి యీ మహామంత్రము నుపయోగింతువో వారిని బ్రతికింపఁగలవు!

ఆకాశమున సూర్యుని అగ్నిని నక్షత్రములను మించిన తేజముగలవాడవై రాణింప గలవు! నిన్ను నిరాకరించి ప్రయాణముఁజేయు స్త్రీపురుషుల కార్యములు నెరవేరఁజాలవు. ఆకసమున నీవు ఉదయించిన వేళ వివాహాది శుభకార్యములు ధర్మకార్యములును ఫలప్రదములగును. నీ యందు భక్తిగలవారికి రేతస్సు నిండుగా నుండుటయే గాక సత్పుత్రపుత్రికా సంతానము కలుగును. వారాణసియందు నీవు నెలకొలిపిన శివలింగము - శుక్రేశ్వరుఁడనంబఱఁగి భక్తులకు కార్యసిద్ధిఁబ్రసాదించును.

ప్రతిశుక్రవారము నక్తవ్రతముఁజేయుచు నీ కుండమునందలి యుదకముతో స్నాన సంధ్యాతర్పణాదుల నొనర్చుచు నొక్కవత్సరము శుక్రేశ్వరుని పూజించువారు నిండురేతస్సు గలవారై తమ ఇంద్రియము సార్థకము కాగా పుత్రసంతానముఁ బడసి పుంస్త్వసౌభాగ్యమున చిరకాలము సుఖింతురు. మరియు నట్టివారు సకలవిద్యాపారంగతులుగా లోకమున విరాజిల్లుచుందురు.

ఇట్లు శంకరుఁడు వరముల నొసఁగి యంతర్ధానముఁజెందగా శుక్రాచార్యుఁడు సంతోషస్వాంతుఁడై నిజధామమునకుఁ జనినవాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున పంచాశత్తమాధ్యాయము.

## ఏకపంచాశత్తమాధ్యాయము

### (ఉషా చరితము)

సూతుఁడు - సనత్కుమార వ్యాస సంవాదముగా - శౌనకాది మహర్షులకు చెప్పఁ దొడఁగెను.

పరమాత్మయగు శంకరుఁడు - భక్తుడైన బాణాసురు ననుగ్రహించి కృష్ణునితో పోరాడిన లీలావిలాసము నవధరింపుడు!

బ్రహ్మమానస పుత్రులలో శ్రేష్ఠుండైన మరీచికి కశ్యపుఁడను కుమారుఁడు కలుగగా నతనికి దక్ష ప్రజాపతి - తన పదముగ్గురు కుమార్తెల నొసఁగెను. అవ్వారిలో పెద్దభార్య యగు దితియందు పుట్టినవారు - దైత్యులనఁబఱఁగుచుండిరి. మిగత పత్నులయందు జన్మించినవారు - దేవతలు మున్నగు చరాచరప్రాణులుగా నుండిరి.

ఇఁక దితిదేవి కుమారులలో హిరణ్యకశిపుఁడు హిరణ్యాక్షుఁడును మొదటజన్మించినవారు. హిరణ్యకశిపుని నలుగురు కుమారులలో ప్రహ్లాదుఁడు చిన్నవాడై విష్ణుభక్తుఁడుగా నుండెను. ప్రహ్లాదునకు విరోచనుఁడను గొప్ప ఔదార్యము గల కొమరుఁడు జన్మించి బ్రాహ్మణ రూపమున వచ్చి యాచించిన దేవేంద్రునకు తన తలకాయ నొసఁగెను. విరోచనుని కుమారుఁడగు బలిచక్రవర్తి - వామన రూపమున తనను యాచించిన విష్ణువునకు భూమిని మొత్తము సమర్పించినవాడు. అట్టి బలిచక్రవర్తి గారి





యౌరసపుత్రుఁడే బాణాసురుఁడు; ఈతఁడు మాన్యుఁడై దాతయై బుద్ధిమంతుడై సత్యవర్తనము కలిగినవాడై శివునారాధించి ముల్లోకములను వశపఱచుకొని లోకపాలురను తన కింకరులుగా నొనర్చుకొనెను.

బాణాసురుఁడు వేయిచేతులతో వాద్యములను మ్రోగించుచు తాండవనృత్యముతో మహేశ్వరుని సంతసింపఁజేసినందున భక్తవత్సలుఁడు ప్రత్యక్షమై వరములను ప్రసాదింతునని సెలవీయఁగా "దేవదేవా! నన్ను సపరివారముగా రక్షించుటకు నా శోణితపురమునందు నివసింపుమని ప్రార్థించెను.

మహేశ్వరుఁడు ముక్తి ప్రదుఁడనియు స్వల్పభక్తిగలవారికి ప్రసన్నుఁడు కాడనియు బాణాసురుఁడు శివమాయామోహవశమున గుర్తింపకుండెను.

అందువలన భక్తపరాధీనుఁడగు శంకరుఁడట్లేయగుగాక యని తన గణములతోడను వీరభద్రకుమార గణేశాదులతోడను బాణుని శోణితపురమున నివసించుచు నొక్కనాడు నదీతీరమునందు నమరుల తోడ విహరించుచుండగా - గంధర్వుల గానము, అప్సరసల నృత్యంబును, మునుల స్తోత్రజపపూజా నమస్కారంబులును, ప్రమథుల యార్భాటము, ఋషుల శివ మంత్రస్వాహాకారంబులును ప్రవర్తించుచుండెను.

అట్టితఱి సిద్ధులు సాధ్యులు భక్తులందరును శంకరుని వేడుకను గాంచుచుండిరి. దేవుఁడులేడనియు ఉన్నను విగ్రహము లేనివాడనియు పరలోకములు పుణ్యపాపములు హుళక్కియనియు వాదించు కుతర్కప్రియులు మడయఁజొచ్చిరి. సప్తమాతృకలు అభిముఖలగుచుండిరి. భయముఁగొలుపుదృశ్యములన్ని యంతరించుచుండెను. శంకరుఁడే పరదైవమని భావించి యనన్యభక్తి నారాధించువారికి సంసారసంకటములు తొలగుచుండెను.

ప్రజలందరును సంతృప్తులగుచుండిరి. స్త్రీల శృంగారవికారములఁజూచి మునులుఁ గూడ మోహించుచుండిరి. ఋతువులన్నియు పుష్పఫల సంపన్నములగుచుండినవి. పుప్పొడితో కూడిన పరిమళముఁగల గాలులు వీచుటయు, కొమ్మలపై కోకిల మున్నగు పక్షులు మధురముగ కూయుటయు కారణములుగా వనములలో కామశృంగారము ఉట్టిపడుచుండగా బాలేందుశేఖరుఁడు "కైలాసము నుండి పార్వతీదేవిని తీసుకొని రమ్మ"ని నందికేశ్వరు నాజ్ఞాపించెను.

అంత నంది కైలాసమున కేగి యమ్మవారికి రహస్యముగా శంకరుని మనోగతమును నివేదింప నా దేవి - పతియే పరమదైవమని భావించునదగుటచే యలంకరించుకొనుచు నందికేశ్వరుని ముందు పంపగా నాతఁడు శంకరునిఁజేరి దేవి వచ్చుచున్నదని విన్నవించెను.

త్వరగా తీసుకొని రమ్మని మరల నందికేశ్వరుని శంకరుఁడు పంపగా నాతడు వడివడిగా చని అమ్మా నిన్ను ఇప్పుడే చూడఁగోరుచున్నవాడు పరమేశ్వరుండని వక్కాణించెను.

ఆ సమయమున శంకరుఁడు - శృంగారలీలాపరిపూర్ణత నొందియున్నందున నాతని రతిక్రీడల ననుభవింప నే వనితయైనను సిద్ధపడినచో నామెయే త్రిలోకేశ్వరి యగును గదా!

పార్వతీదేవి వచ్చుటకు తడవగుచున్నందున కూష్మాండుఁడను మంత్రియొక్క కుమార్తె చిత్రలేఖ యనునది బాణాసురపుత్రికయగు ఉషను పార్వతిగా శంకరునిఁజేరుమని ప్రేరేపించెను.

పూర్వము విష్ణుమూర్తి – యోగశక్తిచే మోహినీరూపమును ధరించెను. కావున ప్రస్తుతము నూర్వశికూడ మరియొక రూపము గలదయ్యెను. ఘృతాచియను నప్సరస కాళీ రూపముఁదాల్చెను. విశ్వాచి యనునది – చండికారూపము గలదయ్యెను. రంభ – సావిత్రియయ్యెను. మేనక – గాయత్రీదేవిగా మారెను. సహజ్య యనునది – జయారూపధరురాలైనది. పుంజికస్థలియనునది – విజయాస్వరూపమును ధరించినది.

ఇందువలన నీవు గూడ పార్వతీదేవిగా పరివర్తనఁజెందుమని చిత్రలేఖ ప్రేరేపించినందున సుందరమనోహరమగు దేవీరూపముఁదాల్చి యుష – శంకరునిఁ జేరనుండగా పార్వతీదేవి కైలాసమునుండి యేతెంచి ఉషతో నిట్లనియెను.

నేను కామించి శంకరుని సీమపించుతటి "నీవు నా వేషముఁదాల్చితిని గాన నీ కార్తికశుక్లద్వాదశి నర్ధరాత్రివేళ నుపవాసముతో నుండు నిన్ను ఒకానొకపురుషుఁడు రమింపఁజేయును. అట్టివాడే నీ పతియగును. ఇద్ది దైవనిర్ణయము. బాల్యమునుండి విష్ణుభక్తి కలిగియున్న నీకు ఇట్టి లోకోత్తర పురుషుఁడు లభింపవలసినదే గదా!" అని యమ్మవారు శాసించి నందున నుషాదేవి యంగీకరించి సిగ్గుచే తలవంచుకొనెను.

పిదప శృంగార వేషమున నమ్మవారు శంకరునిఁజేరగా నా లీలావిలాస చతురుఁడు పార్వతిని వెంటనిడుకొని గణములతో నంతర్ధానముఁజెందెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఏబదియొకటవ యధ్యాయము.

## ద్విత్రిపంచాశత్తమాధ్యాయములు

### (బాణాసురుఁడు గర్వించుట, అనిరుద్ధుఁ డేతెంచుటయు)

భక్తవాత్సల్యముతో నిండియుండు శివచరితము మరియు మరియు వినదగినది గదా!

ఒక్కనాడు శంకరుఁడు శోణితపురమున ప్రసన్నుడై యుండగా బాణాసురుఁడు దైవవశమున గర్వితుఁడై యాతనిముందు తాండవముఁజేసినందున పార్వతీవల్లభుఁడు సంతసించెను.

అట్టితటి బాణదైత్యుఁడు దోసిలొగ్గి తలవంచియు "మహాదేవా! నీ యనుగ్రహమున గొప్పబలముఁ గలవాడనైతిని. నీవొసఁగిన వేయిచేతులతో పోరాడుటకు తగిన ప్రతియోధుఁడు ముల్లోకములయందు గానఁబడుటలేదు. కావున నందుకు నీవే తగియున్నావని భావించెదను. నా వేయిచేతుల మదము నణచుటకు దిగ్గజములను నగరములను కొండలను ఢీకొంటిని. అందుకు దిగ్గజములు తాళలేక పారినవి. ఇంద్రాది దిక్పాలుర నీ భుజములతోడనే ఓడించి కప్పము చెల్లించువారిగా చేసితిని. ఇఁకముందు నా వేయిచేతుల దురదపోవుటకు అవ్వానిని పడవేయు యోధుఁడు లభించునట్లు అనుగ్రహింపుము!" అని నుడువగా దేవదేవుఁడు కోపముఁజెంది యట్టహాసముఁజేయుచు నిట్లు వచించెను.





బాణాసురా! గర్వించితివిగాన దైత్య కులాధముడవైతివని చెప్పవచ్చును. బలిచక్రవర్తి కుమారుడవు నాభక్తుడవు నగు నీకు ఇట్టికోరిక ఉచితమైనదికాదు. ఇట్టి గర్వమునకు పరిహారమును వేగమే పొందుదువుగాక! నా ప్రియభక్తులలో శ్రేష్ఠుడగువాడు నీతో పోరాడి కొండలతో పోల్చఁదగిన నీ కరములను కట్టెలవలె నేలపై పడగొట్టును. మానవ శిరముగల మయూరధ్వజము - గాలి లేకున్నను పడిపోయి నపుడు ఘోర యుద్ధము సంభవించునని గుర్తించుము! ఇప్పుడు అట్టి సమయమును నిరీక్షించుచుండుము! వెళ్లుము!

అంత బాణాసురుఁడు దివ్య కుసుమముల శంకరు నర్చించి స్వగృహముఁజేరినవాడై సంబరమున కుంభాండునకు జరిగిన సమాచారమును తెలిపియు వేచియుండగా మయూర ధ్వజము దైవికముగా విరిగిపడినందున యుద్ధసన్నద్ధుడై దిశలన్నిటిని శుభశకునములఁ గాంచియు మిగుల నుత్సాహముతో నుండెను.

బాణపుత్రికయగు ఉషాదేవి అలంకరించుకొని వసంతకాలమున మాధవు నారాధించి రాత్రివేళ పరుండియుండగా - శివేచ్ఛావశమున శ్రీకృష్ణుని మనుమడగు అనిరుద్ధుఁడు గుప్తముగా నేతెంచి రతిక్రీడను సలిపినందున నామె డిగ్గున లేచినదై మది సంతసమొదవుచున్నను పెండ్లికిమున్ను పురుషసంబంధముఁ జేసి మిగుల వగచుచు ప్రాణత్యాగమునకై సిద్ధపడుచుండెను.

అట్టితఱి కుంభాండతనయయగు చిత్రరేఖ దరిఁజేరి యుషను వారించుచు దేవదానవ మానవులలోగల యువకసుందరులను చిత్రపటముల నుల్లేఖించి చూపుచుండగా ప్రద్యుమ్నుని తనయుఁ డగు అనిరుద్ధునిగాంచి సిగ్గుఁజెందిన బాణాసుర పుత్రిక - ఈ మహాపురుషుఁడు ఎట్టివాడని చిత్రలేఖను ప్రశ్నించెను.

అంత నామె - ఉషను రమింపఁజేసినవాడు ప్రద్యుమ్నుఁడేయని గుర్తించి ఉషనూఱడించినదై యోగశక్తిని క్షణమాత్రమున ద్వారకానగరమునఁబ్రవేశించి యంతఃపురమునకు చెందిన నుద్యానవనమున తరుణులతో విహరించి విశ్రమించిన సర్వాంగసుందరుఁడగు అనిరుద్ధుని గాంచెను.

తరువాత చిత్రలేఖ - తన మాయాబలమున నచ్చోటున చీకటినింపి మంచముతో గూడ నా మహాపురుషుని లేవనెత్తి తలపై మోయుచు బాణనందినియగు నుష నంతఃపురములోనికి గొనితెచ్చి నిలుపగా నామె నతని నవలోకించి వెఱగందుచు నేకాంతమున ననిరుద్ధునితో క్రీడించుచున్న సందర్భమును ద్వారపాలకులు కనిపెట్టి దైత్యపుంగవునకు విన్నవించిరి.

అంత బాణాసురుడు అచ్చోటునకువెళ్ళి దివ్యసుందర విగ్రహుఁడగు పురుషునిగాంచి ఈ దుర్మార్గుని బంధింపుగని భటుల నాజ్ఞాపించుచుండెను.

అంత పదివేల సైనికులు - అంతఃపురమున సొచ్చి కలవరపెట్టుచుండగా అనిరుద్ధుఁడు - ద్వారముఁ దగు పరిఘము (గడియమ్రాను తో నవ్వారిని వధించి లోనికఱుదెంచెను. శివుని తేజస్సు నిండిన నాపురుషుఁడు - తనమీదికి వచ్చిన సైనికులను లక్షమందిని చంపగా బాణాసురుఁడు క్రోధోద్రిక్తుడై కుంభాండుని పోరునకై పురికొలుపుచుండెను. పదివేల గుఱ్ఱములు రథములును అనిరుద్ధుని ఖడ్గప్రయోగము నకు బలియయ్యెను.





అందువలన బాణుఁడు స్వయముగా నరుదెంచి శక్త్యాయుధములను ప్రయోగింప ననిరుద్ధుఁ డద్దానిని పట్టుకొని వేసినందున బాణాసురుఁడు దాగియుండెను.

ఆ సమయమున బాణుని చూడలేక ననిరుద్ధుఁడు పర్వతమువలె కదలకనుండగా, నసురుఁడు ప్రచ్ఛన్నముగా బాణములతో కొట్టుచు నాగపాశములతో నాతనిని బంధించెను. మరియు నీతనిని ముక్కలుగా నఱికి పారవేయుడు! నా వంశ గౌరవమును భంగపరచిన నీ దుర్మార్గుని శిక్షింపుడు! అని శాసించుచుండగా కుంభాండుఁడు దిగువ విధము విన్నవించెను.

దేవా! ఈతనిని చంపినచో తనను తాను చంపుకొన్నట్లగును. చంద్రశేఖరుని యనుగ్రహము నొంది విష్ణువుతో సమానుఁడుగా కనుపడుచున్న నీతనిని నాగసర్పములు కఱచుచున్నను మనను గడ్డిపఱకలుగా నెంచుచున్నవాడు.

పిదప ననిరుద్ధుని కుంభాడుఁడు అయ్యా! నీవెవరు? ఎవరికుమారుఁడవు? ఎవరు నిన్ను గొనితెచ్చిరి? దైత్యాధిపుని ప్రార్థించి "జితోఽస్మి" అని నుడువుము! లేకున్న నీ ప్రాణములు దక్కవు - అని వచించెను.

అంత ననిరుద్ధుఁడు - అరే కుంభాండా? అధమా? బాణాసురుఁడు ఒసగుచున్న అన్నపిండముతో జీవించువాడవుగాన యుద్ధనీతిని తెలియకున్నావు. శూరుఁడు శత్రువునకు లొంగుటకన్న మరణించుట మేలుగదా! అని వీరవాక్యములను పలుకుచుండ బాణాసురుఁడు విస్మితుఁడగుచుండెను.

అట్టితఱి ఆకాశవాణి-

బాణాసురా! క్రోధముచే వివేకముఁ గోలుపోవకుము! సర్వేశ్వరుఁడు సర్వకర్మసాక్షియునగు పరమేశ్వరుని యధీనులు చరాచర ప్రాణులని గుర్తించుము! బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపములఁదాల్చి సృష్టి స్థితి లయముల నొనర్చువాడు శివుఁడని తెలియకుంటివా? నీ మదాహంకారము నిపుడే మహాదేవుఁడు నివారించును. అంతవరకు స్వస్థుడవై యుండుము!

అని వక్కాణించినందున బాణాసురుఁడు అనిరుద్ధుని సంహరింపకుండెను. అంత ననిరుద్ధుడు నాగుల విషజ్వాలలకు తాళలేక "శరణ్యురాలివగు నోచండికా! నన్ను రక్షింపుము! నీవు దక్క నెవరును నన్నుకాపాడువారులేరు" అని దుర్గాదేవిని ప్రార్థింపగా నా మహాశక్తి యర్ధరాత్రివేళ జ్యేష్ఠకృష్ణ చతుర్దశినాడు ప్రత్యక్షమై పెద్ద పెద్ద పిడికిలి దెబ్బలతో నాగబంధమును త్రెంచివేసి నాగములను సంహరించియు అనిరుద్ధుని లోనికి పంపనదై యదృశ్యురాలయ్యెను.

ఆ తరువాత అనిరుద్ధుఁడు అంతఃపురమున రుచికర పానీయములఁద్రావుచు మత్తుడై ఉషాదేవితో స్వేచ్ఛగా సుఖించుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏబదిరెండవ ఏబది మూడవ యధ్యాయములు.





# ఏబదినాలుగవ యధ్యాయము

## (బాణాసుర శ్రీకృష్ణ యుద్ధము)

కుంభాండుని కుమార్తెయగు చిత్రలేఖ - తన పౌత్రునపహరించిన పిమ్మట శ్రీకృష్ణుఁడేమిజేసెనను శౌనకాదుల ప్రశ్నకు సమాధానముగా సూతుఁడు చెప్పఁదొడఁగెను.

అనిరుద్ధుఁడు శోణితపురమునకు వెళ్ళిన పిదప ద్వారకలో నంతఃపురమున వనితల దుఃఖస్వరములను శ్రీకృష్ణుడు విని మిగుల చింతించుచుండగా నాలుగు నెలలు గడచియుండెను. పిదప నొక్కనాడు నారద మహర్షి యేతెంచి అనిరుద్ధుఁడు నాగపాశబద్ధుఁడగుటను బాణుని శోణితపురమున దుర్గాదేవి యను గ్రహమున బంధవిముక్తుడైలోన నుషతో రమించుచుండుటను తెలిపినందున శ్రీకృష్ణుడు గరుత్మంతుని పై శోణిత పురమునకు నదే క్షణమున బయలుదేరెను. ప్రద్యుమ్న సాంబ బలరామాది యాదవ ప్రముఖులందరును పండ్రెండ్రు అక్షోహిణుల సైన్యమును వెంటనిడుకొని శ్రీకృష్ణుని వెనువెంటఁజనుచుండిరి.

బాణాసురుఁడు తన పురమును యాదవులు ఆక్రమించుటను గమనించి సైన్యములతో యుద్ధ సన్నద్ధుఁడగుచుండగా శంకరుఁడును వీరభద్రాదులతోడను ప్రమథగణములతోడను బయలుదేరి పోరాడ నుండెను.

అట్టితతి ఘోరయుద్ధము ఇరుపక్షములవారికి జరుగుచుండెను. శంకరకృష్ణులు - తమ గొప్పయస్త్రములను నొండరులపై వేయుచుండ శంకరుని ప్రభావమునకు తాళలేక యాదవ సైనికులు పాఱఁజొచ్చిరి. శ్రీకృష్ణుడు శంకరునిపై ప్రయోగించిన శీతల జ్వరమును శమింపఁజేయుటకు శంకరుఁడు ఉష్ణజ్వరమును ప్రయోగింప వైష్ణవజ్వరము ఆశ్రయముఁగానక శంకరుని పలువిధములఁ బ్రార్థించినందున ప్రసన్నుఁడై "వైష్ణవజ్వరమా! భయపడకుము! నా జ్వరము నిన్ను బాధింపదు. ఈ మా సంవాదమును స్మరించువారి నెట్టి జ్వరముఁగూడ పీడింపకుండుగాక!" అని శంకరుఁడనుగ్రహించినందున వైష్ణవజ్వరము అటనుండి వెడలి నిర్భయముగా నుండెను.

అంత గరుత్మంతుఁడు వేయి ముఖములతో సముద్రజలముఁద్రావి వర్షధారపాతముల నసుర సైన్యములను తబ్బిబ్బుచేయుచుండగా నందికేశ్వరుఁడు వృషభరూపమున కొమ్ములతో పొడచినందున గరుత్మంతుఁడు - సంధులువిడిన నొడలుఁగలవాడై శ్రీకృష్ణుని విడనాడి రణరంగమునుండి వడిగా పారిపోయెను.

అందువలన శ్రీకృష్ణుఁడు వెఱగందుచు శంకరుని సమీపించి "శరణాగతవత్సలా! మహాదేవా! సర్వాంతర్యామివి, అనంత శక్తిసంపన్నుడవు, ప్రపంచ సృష్టి స్థితిలయకారుడఁవు సచ్చిదానందమయుడవు; శాంతస్వభావుడవు; కాలము దైవము కర్మస్వభావము ద్రవ్యము క్షేత్రము ప్రాణము ఆత్మ ఇత్యాది స్వరూపములఁదాల్చి నానావిధ లీలారూపములు గలవాడవై దేవ మానవాది సజ్జనులను కాపాడుచు దుర్జనులను శిక్షించువాడవు. పరబ్రహ్మము నీవైయున్నావని వేదవేదాంత వాఙ్మయమునందు దాగియున్నావనియు విమలహృదయులు - తమ చిదాకాశమునందు నీ జ్యోతిర్లింగ స్వరూపమును గాంచుచు భావించుచున్నవారు.

సూర్యుడు ఛాయారూపముల నతిక్రమించి ప్రకాశించునట్లు నీవు దివ్యకాంతుల నంతట విరాజిల్లుచుందువు.

శ్లో॥ త్వన్మాయా మోహితధియః - పుత్రదారగృహాదిషు ।
ఉన్మజ్జంతి నిమజ్జంతి - ప్రసక్తా వృజినార్ణవే ॥ ౭౩

శ్లో॥ దైవదత్త మిమం లబ్ధ్వా - నృలోక మజితేంద్రియా ।
యో నాద్రియేత త్వత్పాదౌ - స శోచ్యో హ్యాత్మవంచకః ॥ ౭౪

జీవులు - నీ మాయాపాశములచే బంధింపఁబడినవారై భార్యపుత్ర గృహాదుల యందు ఆసక్తిని పెంచుకొని పాపసముద్రమునందు మునుగుచు తేలుచుందురు.

ఈ మానవలోకమునందలి భోగ్యములు దైవదత్తములని భావించి నీ చరణకమలములను సేవింపని చపలచిత్తుఁడు - తనను తాను మోసగించుకొనువాడగును. అట్టివానిని గుఱించి బుద్ధిమంతులు విచారపడుచుందురు.

గర్వితుడైన బాణాసురుని నీవే శపించిన కారణముగా నేనీతని భుజసహస్రమును పడవేయ నఱుదెంచితిని గాన రణరంగమునుండి తొలగిపొమ్ము! నీ శాపమును సార్థకముఁ జేయుము!" అని వేడుకొనగా శంకరుఁడు - శ్రీహరీ! భక్తపరాధీనుడనై పోరాడుచుంటిని. నేనీ యుద్ధరంగమున చూచుచుండగా బాణుని హస్తములఁద్రెంచుట సాధ్యము కాజాలదు. కావున జృంభణాస్త్రమును ప్రయోగించి కర్తవ్యమును నెరవేర్చుకొను" మని వక్కాణించెను.

అంత శ్రీకృష్ణభగవానుడు - శివాజ్ఞావశమున కొంతదూరము వెళ్ళి రణరంగము నుండి ప్రయోగించిన జృంభణాస్త్రమును కరుణించి శంకరుఁడు స్తబ్ధుఁడైనందున శ్రీకృష్ణుఁడు బాణాసురుని సేనయందు చొఱఁబడి కత్తులతోడను బాణములతోడను కొట్టుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో చతుఃపంచాశత్తమాధ్యాయము.

## ఏబదియైదవ అధ్యాయము

### (బాణాసురుని భుజములను శ్రీకృష్ణుఁడు ఛేదించుట)

చంద్రశేఖరుని యనుగ్రహమునఁజేసి రెట్టింపు బలముఁగలిగిన శ్రీకృష్ణుడు బాణాసురుని తృణముతో సమానునిగా నెంచుచు నాతనిపై శార్ఙ్గధనుస్సు నుండి విడిఁబడు నమ్ములను వేయుచు గర్జించుచుండెను. దైత్యాధిపుఁడును శ్రీకృష్ణుని బాణములను ఆయుధములను తనపై రాకమున్నే ఛేదించుచుండుటయేగాక శివస్మరణ పూర్వకముగా శ్రీకృష్ణునిపై నిశిత శరములను వేయుచుండెను. శ్రీకృష్ణుడును శంకరుని మదిఁదలచుచు బాణుని బాణములను తనపై పడకుండ నేలపై పడగొట్టుచుండెను. యాదవవీరులు మొదట భీతిల్లి తరువాత తమ పౌరుషముఁ జూపుచుండిరి. గరుత్మంతుఁడు తన రెక్కల గాలిచే బాణాసురుని





భటులను చిందర వందరఁజేయుచుండెను. ఇవ్విధము కొంతకాలము ఉభయపక్షములవారు పరస్పరము కొట్టుకొనుచు ఘోరముగా పోరుచుండిరి. శ్రీకృష్ణుడు - శివుని రెండవ రూపముఁగలవాడగుటచే తను బాణుఁడు శివభక్తాగ్రణియగుటను ఉభయులు సమానముగా పోరుచుండిరి.

అట్టితతి నిక లాభము లేదని భావించి శ్రీకృష్ణభగవానుడు శివప్రదత్తమైన సుదర్శన చక్రమును ప్రయోగించియు బాణాసురుని సహస్ర భుజములలో నాలుగుమాత్రమునిచి మిగత వానిని ఛేదించినందున నసురరాజు ఎట్టిబాధ లేనివాడై శోభించుచుండెను.

అప్పుడు - శ్రీకృష్ణుడు కోపోద్రేకమున వివేకము లేనివాడై బాణుని తలకాయను నఱుకబోఁగా శంకరుఁడు ప్రత్యక్షమై "శ్రీకృష్ణా నా యానతి ననుసరించి నీ సుదర్శనము నా భక్తులయందు ఉపయోగింపదు. కావున వీని శిరశ్ఛేదము నొనర్పకుము!

ఇంతియేగాక నీ సుదర్శనచక్రము యుద్ధమున ప్రతిహతము కాదనియు విజయమును చేకూర్చుననియు పూర్వము నీకొసగితిని. కాని దధీచి రావణుఁడు తారకాసురుఁడు త్రిపురాసురులు మున్నగు భక్తులపై నిద్దానిని ప్రయోగింపఁజాలకుంటివి. ఇందుకు నా శాసనమే కారణమని గుర్తించియుందువు. మృత్యుభయము లేదని బాణాసురున కొసగిన నా వరమును విస్మరించితివా?" అని వ్రాక్కుచ్చినవాడై శ్రీకృష్ణ బాణాసురులకు మైత్రి నొనగూర్చియు తన నివాసమునకు సపరివారముగా వెళ్ళినవాడయ్యెను.

అంత శ్రీకృష్ణుడును నగరాంతఃపురములోనికి నేగి యనిరుద్ధు నూఱడించి బాణుడు సమర్పించిన నుషాదేవిని రత్నమణిసువర్ణాదులతో పరిగ్రహించియు మహాదేవునకు ప్రణతుల 'నొనర్చి బాణునితో సంప్రదించియు తనపరివారమును వెంటనిడుకొని ద్వారకానగరమునకు వెళ్లుచుండెను. మరియు మార్గమున వరుణు నోడించినవాడై కర్తవ్యమును నెరవేర్చి గొప్ప వేడుకతో నిజనివాసముఁజేరినవాడై గరుత్మంతుని వీడ్కొలిపి ఆప్తులతో సంబరముగా నుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పంచపంచాశత్తమా ధ్యాయము.

# షట్ పంచాశత్తమో ధ్యాయము

## (బాణాసురునకు శివగణస్వరూపము చేకూరుట)

శ్రీకృష్ణుడు ద్వారకఁజేరి యుషాఽనిరుద్ధులతోగూడ నివసించిన పిమ్మట బాణాసురుఁడు తన ప్రమాదమును తలచుకొనుచు దుఃఖించుచుండగా నందికేశ్వరుఁడు నిట్లు పలికెను.

బాణాసురా! వగవకుము! శంకరుఁడు భక్తవత్సలుడని తెలియుము! నీభుజ కృంతనము శివసంకల్పమువలననే జరిగినది. ఏకాగ్రభక్తి గలవాడవై శంకరునారాధించుచు నిత్యోత్సవమును నెరవేర్పుము!

అంత నసురుఁడు నందివాక్యమును పాటించినవాడై శంకరుని సమీపించి వినయ విధేయతలు ఉట్టిపడుచుండ ప్రణమిల్లి ప్రార్థించుచు దుఃఖించుచుండెను. మరియు ననేక శివస్తోత్రములఁజదువుచు పాదములను నేలపై కొట్టుచు కరములఁద్రిప్పుచు కనుబొమల ముడులతో ముఖవాద్యములను మ్రోగించుచు పలుతడవలు తలకాయ నూపుచును పెక్కు రకముల మాటలాడుచును తన చేతులు తెగినందువలన నచ్చోటునుండి కారుచున్న రక్తధారలతో నేలఁదడుపుచును తనను తాను మఱచినవాడై నాట్యమాడుచు శంకరుని సంతసింపఁజేసెను.

నృత్యగీత ప్రియుఁడగు హరుఁడు తానును తాండవించి ప్రసన్నుడై బాణా! కావలసినది అడుగుము! ఇచ్చెద" ననఁగా దైత్యాధిపతి దిగువ విధము ప్రార్థించెను.

మహాదేవా! భుజస్థానగత వ్రణములు శమింపవలెను. నీ లోకమున శివగణత్వము సంభవింపవలెను. ఉషాదేవి కుమారునకు నా రాజ్యము లభింపవలెను. నారాయణుఁడు మున్నగు నమరులతో స్నేహ మొదవవలెను. రజస్తమోగుణసంపన్నమగు నీ రాక్షసజన్మ – మరల నేనాటికైనను నాకు రాకుండుగాక! ఎట్టి వికారములేని సాత్త్విక శివభక్తి నిండుగా నుండుగాక. శివభక్తులయందు అనురాగము సర్వభూతదయయు చేకూరుగాక!

ఇంకను బాణాసురుఁడు మహాదేవుని నుతించిన విధంబెట్టిదనగా?

శరణాగతవత్సలా! దీనబంధో! మహాదేవా! నీకు మ్రొక్కులిడుచున్నాను. నా యందు దయఁ గలవాడవై నా చేతులను పడఁగొట్టించితివి. బ్రహ్మాండమే స్వరూపముగా గల విరాట్పురుషుడవు;

ఆకాశము – నాభిగాను, అగ్ని – ముఖముగాను, ఉదకము – రేతస్సుగాను, దిశలు – చెవులుగాను, స్వర్గము – శిరముగాను, భూమి – పాదములుగాను, చంద్రుఁడు – మనస్సుగాను, సూర్యుడు – నేత్రములుగాను, సముద్రము – కడుపుగాను, దేవంద్రుఁడు – భుజములగాను, బ్రహ్మదేవుఁడు – బుద్ధిగాను, ప్రజాపతియనుబ్రహ్మ – దేహోవిసర్గముగాను, ధర్మదేవత – హృదయముగాను, ఓషధులు – వెంట్రుకలుగాను, మేఘములు – తలవెంట్రుకలుగాను, సత్త్వరజస్తమోగుణములు – నేత్రములుగాను, బ్రాహ్మణులు – ముఖముగాను, క్షత్రియులు – భుజములుగాను, వైశ్యులు – తొడలుగాను, శూద్రులు – చరణములుగాను వెలయుచు జీవులందరిచే నెల్లకాలము ఉపాసింపఁబడుచుందువు;





నిన్ను ఆరాధింపక నితర దేవతలను పూజించువాడు విపరీత ప్రవృత్తిఁగలవాడై అమృతమును విసర్జించి విషముఁద్రాగినవాడగును.

సర్వప్రియుడవు పరమేశ్వరుఁడవు నగు నిన్ను విష్ణుబ్రహ్మాది దేవతలు సర్వాత్మనాశరణముగా నాశ్రయించి ధ్యానించుచున్నవారు.

ఇవ్విధము నుతించుచు పులకితగాత్రుఁడైన బాణాసురునకు పరమాత్మ సంతసించి నీ వడిగినదంతయు సిద్ధించునని వరంబొసఁగి యంతర్ధానముఁజెందెను.

అంత బాణాసురుఁడు శంకరుని యనుగ్రహమున మహాకాలుఁడను గణాధిపతియై కైలాసమున సుఖముగా నుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఏబదియారవ యధ్యాయము.

## సప్తపంచాశత్తమాధ్యాయము

### (గజాసుర సంహారము)

చంద్రశేఖరుఁడు గజాసురునిఁజంపిన యుదంతమును చెప్పెదను వినుమని సనత్కుమారుఁడు వేదవ్యాసునకు చెప్పినట్లును చతుర్ముఖుఁడు నారదునకు బోధించినట్లును సూతుఁడు శౌనకాదులకు చెప్పఁదొడఁగెను.

అమ్మవారు మహిషాసురుని సంహరించిన సమాచారమును వాని కుమారుఁడగు గజాసురుఁడు విని "నా జనకుని మరణమునకు దేవతలే కారకు"లని గుర్తించియు అమరులపై వైరముఁబూనినవాడై బ్రహ్మాదేవుని గురించి తపంబొనర్ప నడవికిఁజని హిమవత్పర్వతముఁదగు పల్లపు చోటునందు రెండుచేతులు లేవనెత్తి యాకసముఁజూచుచు కాలి బొటనవ్రేలుపై మాత్రము నిలువఁబడి జడలఁదాల్చినవాడై తపించుచు ప్రళయకాలసూర్యునిఁబోలె మండుచుండెను.

అట్టితతి గజాసురుని తలలోనుండి మంట పొగతోకూడ బయలువెడలి పైలోకములను క్రింది లోకములను కాల్చుచున్నందున నదులు సముద్రములు నుప్పొంగుటయే గాక నక్షత్రములు గ్రహములు నంతరిక్షమునుండి రాలి పడుచుండెను. దశదిశలును వెలుగందుచుండెను. భూమి కంపించుచుండెను.

ఇందువలన సురలు పీడింపఁబడినవారై స్వర్గమును వీడి సత్యలోకముఁజేరియు "దేవా! గజదైత్యుని తపోజ్వాలవలన కలుగు వేడిని భరింపలేకున్నాము. స్వర్గమునందు నివసింప నలవి గాకున్నయది. కావున నిన్ను ప్రార్థించుచుంటిమి. నీవు వేగమే చని గజాసురుని తపస్సును చాలింపఁజేయుము!" అని విన్నవింపగా పరమేష్ఠి – భృగుదక్షాదులను వెంట నిడుకొని యచ్చోటునకు వెళ్ళియు ముల్లోకములు మబ్బుపడియుండుటను గాంచి యచ్చెరువు నొందుచు నిట్లువక్కాణించెను.

మహిషాసురపుత్రా! లెమ్ము! నీ యనుష్ఠానము సిద్ధించినది. వరము నొసగుదును.





అంత గజాసురుఁడు కనులఁదెఱచి బ్రహ్మదేవుని దివ్యమూర్తిఁగాంచుచు కంఠస్వరము తడబడుచుండ మ్రొక్కులిడియు "దేవదేవా! నా యందు ప్రసన్నుఁడ వగునెడల కామ మోహితులగు స్త్రీపురుషుల చేత నమరులు మున్నగు వారిచేతను వధింపఁబడకుండునట్లు దిక్పాలకుల వైభవము నంతయు నేనే యనుభవించునట్లును వరమును ప్రసాదింపు" మని ప్రార్థించెను.

అందుకు పితామహుఁడు సంతసించి గజాసురుఁడు కోరినదంతయు నొసఁగినందున దైత్యుఁడు స్వనివాసముఁజేరి ముల్లోకములను తన కైవసముఁజేసుకొనియు ఇంద్రాదిలోకపాలుర యధికారములను తానే వహించుచు స్వర్గమున నమరావతియందు వేల్పులతేడు – గద్దెపై కూర్చుని దేవతలచే నూడిగములఁ జేయించుచు నింద్రియసుఖములను యథేచ్ఛగా ననుభవించుచుండియు తృప్తిఁజెందకుండెను.

ఇవ్విధము గజాసురుఁడు ఐశ్వర్యమదమున గర్వితుడై పాపబుద్ధిని తాపసులను సద్బ్రాహ్మణులను దేవదానవులను బాధించుచు నొకప్పుఁడు శంకరుని రాజధానియగు కాశీక్షేత్రముఁజేరినవాడై ప్రమథ గణములను భక్తులను హింసించుచున్నందున నవ్వారందరు శంకరా! పాహి! పాహి! అని వేడుకొనుచు నిట్లు విన్నవించిరి.

మహాదేవా! గజాసురుఁడు కాలిడిన చోటంతయు కదలుచున్నయది. వాడు భుజముల నూపుటచే పెద్ద పెద్ద చెట్లు కూలుటయే గాక కొండలును పిండియగుచున్నవి. వీని వెంట్రుకలు తగిలినందున మేఘములు తల్లడిల్లుచు నల్లఁబడుచున్నవి. మరియు వాని నిట్టూర్పుల వలన సాగరములు ఉప్పొంగుచున్నందున నందలి తిమింగిలములు తబ్బిబ్బుపడుచున్నవి.

ఇంతియేగాక నీ గజాసురుఁడు – తొమ్మిదివేల యోజనముల యెత్తు నంతియే వెడల్పును గల శరీరముతో భయముఁగొలుపుచున్నవాడు. నేత్రములయందలి పింగళ (గోరోజనము వంటి) వర్ణమును చంచలభావంబును మెఱుపులు మోయఁజాలక నిప్పటికిని వడివడిగా పరుగిడుచున్నవి.

అంత నా భగవానుఁడు (శంకరుఁడు) భక్తులను రక్షింపఁదలచి గజాసురుని సంహరింపఁదలచియు త్రిశూలమును కేలఁబూని యచ్చోటునకు రాగా నా రక్కసుఁడును వెఱగందక శంకరునితో పోరాడ నుండెను.

అనేక శస్త్రాస్త్రముతోడను బాణములతోడ నుభయులు ఘోరముగా పోరుచుండిరి.

అంత గజాసురుఁడు మిగుల రోసముఁజెంది ఖడ్గమును ధరించి తనపై వేయనుండగా మహేశ్వరుఁడు దైత్యాధిపుని త్రిశూలముతో పొడిచి తదగ్రమున నిలిపినందున గజాసురుఁడు తనను గొడుగుగా చేసుకొనిన మహాదేవుని దిగువవిధముగా నుతించెను.

దేవదేవా! నీ భక్తుడను. మన్మథుని జయించిన నీ చేత నేను చంపఁబడుట కడుంగడు శ్రేయము నొనఁగూర్చును గదా! కాని నా మనవి నాలకింపుము! దేవదానవ మానవులందరిచేతను నీ వొకడవే పరమాత్మగా ఆరాధింపఁబడువాడవు. ఇట్టి నీ వలన మరణము రావలెనని భక్తులు కోరుచుందురు.

అంత శంకరుఁడు ప్రసన్నుఁడై దానవోత్తమా! కరుణించితిని. కావలసిన వరము నడుగుము! ఇచ్చెదను. అని వచింపగా నాతఁడు దిగువవిధము కోరుకొనెను.





శంకరా! నీ త్రిశూలాగ్నిచే పవిత్రమైనదియు సుఖస్పర్శఁగలదియు చూడముచ్చటగా నుండునదియు నగు నా మేనితోలును దిసమొలతో నుండు నీవు ధరింతువు గాక! ఇద్ది పరిమళించునదై నీకు నలంకారమగు గాక!

పూర్వము తపోజ్వాలకు గుఱియైన నిద్ది దహింపనిదై నీవు తాకుటఁజేసి పావనంబయ్యెను. ఇద్దానిఁ దాల్చుటవలన కృత్తివాసుఁడనఁబఱగుదువు గాక!

అంత శంకరుఁడు కృపాళువై దానవుని భక్తిప్రపత్తులకు సంతసించి అట్లే యగుగాక! అని వరంబొసఁగియు వెండియు నిట్లనియెను.

నీ శరీర మీ మహాక్షేత్రమున లింగస్వరూపమై కృత్తివాసేశ్వరుఁడను పేరుతో తదితర లింగములకన్న ముఖ్యంబునై వెలయుఁగాక!

తరువాత శంకరుఁడు దైత్యుని శరీరముఁదగు తోలుఁదీసికొని కట్టుకొనినవాడైయున్న వేళ కాశీనివాసులగు ప్రమథగణములు ప్రజలందరును భయము వీడినవారై యుండ హరిబ్రహ్మాది దేవతలు సంబరపడుచు దోసిలొగ్గియు మహేశ్వరుని పలువిధముల కొనియాడిరి. ప్రపంచమంతయు సుఖముగా నుండెను.

భక్తవాత్సల్యమును తెలుపు శంకరుని – చరితము – ధనధాన్యచిరాయురారోగ్య భాగ్యముల నొసగునదై వినువారికి చెప్పువారికిని భుక్తిముక్తుల నొదవఁజేయునది గాదే!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఏబదియేడవ (57) అధ్యాయము.

## అష్టపంచాశత్తమాధ్యాయము

## (దుందుభినిర్హ్రాదుని వధించుట)

హిరణ్యాక్షుని శ్రీహరి వధించినందున మిగుల దుఃఖించుచున్న దితిదేవిని – ప్రహ్లాదుని మేనమామయగు దుందుభి – నిర్హ్రాదుఁడు పలువిధముల నూఱడించెను. మరియు హిరణ్యాక్షునే గాక హిరణ్యకశిపునిఁగూడ కేశవుఁడు వధించుటకు దేవతలే కారకులని మదిని నిశ్చయించుకొని యమరులు ఇట్టి బలముఁగలిగియుండుటకు వలయు అమృతాహారము భూసురుల వలన లభించుచున్నదని భావించియు బ్రాహ్మణులను హింసింపఁదలచినవాడు. వేదాధ్యయన సంపన్నులు తపోబలవంతులునగు సద్బ్రాహ్మణులు కాశీ నగరమునందు పెక్కురు నివసింతురని యచ్చోటునకు వెళ్ళినవాడై సమిధలకై దర్భలకై యడవికి వెళ్ళు బ్రాహ్మణులను గుప్తరూపమున వధించుచుండెను. మరియు నీటియందు జలజంతువైవారిని పట్టుకొనుచుండెను.

ఇంతియేగాక నాదైత్యుఁడు – పగలు మునులలో మునివలె ధ్యాన నిమగ్నుడై రాత్రి వేళలయందు పెద్దపులియై బ్రాహ్మణులననేకులను భక్షించుచుండెను.

ఒకప్పుడు మహాశివరాత్రి నొకానొకశివభక్తుడు - తనయాశ్రమమున మహాదేవు నఖండభక్తి నారాధించుచుండగా దుందుభినిర్హ్రాదుఁడు ఆతనిని తినుటకు వ్యాఘ్రరూపమున సమీపించునంతలో దయామయుండగు శంకరుఁడు ప్రత్యక్షమయ్యెను.

అట్టితఱి దైత్యుఁడు తన వ్యాఘ్రరూపమును పెంచినవాడై శంకరునిమీదికి వచ్చుచుండెను. అంత శంకరుఁడు వానిని దొరికించుకొని చంక నిరికించి వజ్రాయుధముకన్నగట్టిదగు తన పిడికిలితో దైత్యుని శిరమున గుద్దినందున నవ్వాఁడు భూనభోఽంతరములు నిండునట్లు అఱచుచు క్రిందఁబడినవాడై అసువులఁబాసెను. (మరణించెను.)

ఆ యర్ధరాత్రిసమయమున సంభవించిన దైత్యుని నాదమువలన తపోధనులు గడ గడ వణకుచు నచ్చోటి కరుదెంచి మహాదేవుని గాంచుటయే గాక వ్యాఘ్రరూపమున చచ్చిపడియున్న దైత్యునవలోకించియు మిగులసంబరమున మ్రొక్కులిడుచు జయధ్వనులతో నిట్లు నుతించిరి.

పరమేశ్వరా! దారుణంబగు నీ సంకటమును పోగొట్టి మమ్ము రక్షించితివి. ఇదే రూపమున నిట నివసించి జ్యేష్ఠస్థానమనఁబడు నీ ప్రదేశమున మమ్మందరి నెల్లకాలము ఎట్టి యుపద్రవములు రాకుండ కాపాడుము!

అమరులు నిటులే ప్రార్థించినందున నా కరుణాంతరంగుఁడు అంగీకరించి వ్యాఘ్రేశ్వర లింగము నందు దాగియుండగా సురలు ద్విజులును చకితులై ప్రణమిల్లుచు తమతమ నెలవులకుఁ జనిరి.

ఈ లింగమును మదిఁదలచుకొని పోరాటమున పాలుగొనువాడు పగతుఱఁగెలుచునని శంకరుఁడు అనుగ్రహించెను గావున నీ చరితమును వినినను వినిపించినను సకలశుభములు చేకూరుటయే గాక శివప్రీతియు సమకూరునని తెలియవలెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఏబదియెనిమిదవ (58) యధ్యాయము.

## ఏకోనషష్టితమాధ్యాయము

### (విదల ఉత్పలులను సంహరించుట)

విదఁలుడు ఉత్పలుఁడను దైత్యులిద్దరు పురుషులచే వధింపఁబడని వరమును బ్రహ్మదేవునివలన పొందినవారై ముల్లోకములను తృణీకరించుచు బాధించుచున్నందున నమరులు వెతలఁజెందుచు విధిఁ బ్రార్థింప నా పితామహుఁడు వారిని బుజ్జగించుచు దేవీవధ్యులు వారని చెప్పెను. అందువలన సురలు శివస్మరణముఁజేయుచు తమ నివాసములఁజేరి నిశ్చింతగా నుండిరి. అంత నారదమహర్షి - శివేచ్ఛావశమున దైత్యులఁజేరి పార్వతీసౌందర్యమును వర్ణించినందున నవ్వారు కామమోహితులై శివపత్ని యెట్లు లభించునని ఆకాశమున సంచరించుచు నిరీక్షించుచుండిరి.

అటుపిమ్మట నొక్కనాడు శంకరుఁడు శృంగారవేషమున నుండగా జగదంబిక వేడుకతో నరుదెంచి చెలికత్తెలఁగూడి దేవునిమ్రోల బంతి నాడుచుండెను.





ఆ సమయమున అమ్మవారి చక్కదనము లెక్కింపనలవిఁగాకుండెను. మేని యవయవముల చుఱుకుదనముఁజూపెట్టుచు నిట్టూర్పుఁదగు పరిమళముచే తుమ్మెదలను సంతోషపెట్టుచు చంచలములైన చూపులు గలిగియుండెను. వెంట్రుకల కొప్పునుండి మల్లెపూలదండ జారిపడుచుండగా చెంపలపై చిగుర్చుచున్న చెమటచుక్కలచే తడియుచు అవికకోకయు గాలికి కదలుచున్నందున స్తనములయొక్కయు పాదములయొక్కయు లావణ్యమును కనఁబఱచుచుండెను.

రాణించుచున్న బంతి తాకుటచే కమలములవంటి కరముల నెఱ్ఱబాఱఁజేయుచు నెంతయో సొగసుతో నున్న అమ్మవారి నా దురాత్ములు చూచి మన్మథబాణప్రపీడితులై శంబరమాయాబలమున ప్రమథగణవేషమున సమీపించిరి.

అంత విదలోత్పలుల వెఱ్ఱిచూపులను శంకరుఁడు కనిపెట్టుచుండగా పార్వతీదేవి వారిని గురించి కనుసైగతో పరమేశ్వరునకు నివేదించెను. తరువాత నమ్మవారు శివాజ్ఞావశమున తానాడుచున్న బంతితోడనే వారిని కొట్టగా దైత్యులు – తాటిచెట్టునుండి పండు రాలునట్లు నేలపై గిరగిరఁదిరుగుచు క్రిందఁబడి మరణించిరి.

అప్పుడా కందుకము (బంతి) శివలింగరూపమున కాశీక్షేత్రమమున జ్యేష్ఠేశ్వరుని సమీపమున కందుకేశ్వరుఁడను పేరుతో ప్రసిద్ధంబయ్యెను. అట్టి శుభసమయమున హరిబ్రహ్మాది దివిషదులు ఏతెంచి పలువిధములఁబ్రార్థించి తమ తమ నెలవులకుఁజనిరి. కాశీని వాసులందరును భయమువీడి విశ్వనాథుని సేవించుచుండిరి.

కందుకేశ్వరలింగము కాశీక్షేత్రమున భుక్తిముక్తిప్రదమగునట్టిది. ఇద్దానిఁజదువువారు వినువారు వినిపించువారును కృతార్థులగుదురు. ఇట్లు సనత్కుమారుఁడు వేదవ్యాసునకు వక్కాణించి వారాణసిఁ జేరనేగెను. రుద్రసంహితలోని యుద్ధఖండము సర్వకామప్రదంబైనది. శివమహాపురాణమున రుద్రసంహితయు శివప్రియమై నిత్యము పఠించువారి శత్రుబాధలను తొలగించునదై భుక్తిముక్తిప్రదమునై రాణించునది. ఇట్టి శివచరితమును బ్రహ్మదేవుఁడు చెప్పగా నారఁదుడాలకించి శివభక్తిమెండు కాగా శివనామమును స్మరించుచు కృతార్థుండయ్యెను.

శివుఁడు దేవతాసార్వభౌముఁడని నిరూపించు రుద్రసంహితలోని బ్రహ్మనారద సంవాదమును యథాశక్తి వర్ణించితిని. ఇఁక నెట్టి శివమహిమను వినగోరుదురో ప్రశ్నింపుడని శౌనకాదులకు నివేదించి సూతమహర్షి విరమించినవాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో శివమహాపురాణమున రెండవ రుద్రసంహిత ముగింపుగా
ఏబదితొమ్మిదవ (59) అధ్యాయము.

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాం నమః

# శ్రీ శివమహాపురాణములో మూడవదగు

## శతరుద్ర సంహిత - ప్రారంభము

## ప్రథమాధ్యాయము

(పంచ బ్రహ్మావతారములు)

ప్రార్థన-

శ్లో॥ వందే మహానంద మనంతలీలం - మహేశ్వరం సర్వవిభుం మహాంతమ్ ।
గౌరీప్రియం కార్తికవిఘ్నరాజ - సముద్భవం శంకర మాదిదేవమ్ ॥

అర్థము -

"సఏకో బ్రాహ్మణ ఆనందః" అన్ని ఆనందములను మించినదై బ్రహ్మానందము ముఖ్యమైనది" అను శ్రుతి ననుసరించి యవధిలేని ఆనందము గలవాడును అమితములైన లీలా విగ్రహములు గలవాడును చరాచరమునంతయు సూక్ష్మరూపమున వ్యాపించువాడును స్థూలరూపమున గొప్ప ప్రభువైయుండువాడును పార్వతీదేవిని వివాహమాడినవాడును కుమారగణపతుల జనకుఁడును భక్తులకు ఇహపరసుఖముల నొసఁగువాడునగు మహాదేవుని నమస్కరించుచున్నాను.

శంకరుని యవతారములఁ గూర్చి వివరించి బోధింపమని శౌనకాది మహర్షులు ప్రశ్నింపగా సూతమహర్షి చెప్పఁదొడఁగెను.

ఇదే విషయమును నందీశ్వరుఁడు శివుని స్మరించుచు సనత్కుమారునకు వక్కాణించెను.

సర్వేశ్వరుఁడగు శంకరదేవుని యవతారములు ఆ యా కల్పములలో లెక్కింప నలవిఁగానివిగా సంభవించినవి. ఐనను యథాశక్తి కొన్నిటిని మాత్ర మిట నుదహరింతును.

పదితొమ్మిదవ శ్వేతలోహిత కల్పమునందు సద్యోజాత అవతారము ప్రథమముగా నావిర్భవించెను.

ఆ సమయమున బ్రహ్మదేవుఁడు పరమాత్మను ధ్యానించుచుండగా ఒకానొక కుమారుఁడు - తెలుపు ఎరుపు వన్నెలు గల శరీరముతో జన్మింపగా అట్టి పురుషుని భగవానునిగా భావించి దోసిలిగ్గియు విధాత - మాటిమాటికి ప్రణతుల నొనర్చుచుండ - సునందుఁడు నందనుఁడు విశ్వనందుఁడు ఉపనందనుఁడు అను నలుగురుశిష్యులు శ్వేతవర్ణము గల రూపములతో నావిర్భవించిరి.

తరువాత సద్యోజాతమూర్తి - బ్రహ్మదేవునకు సృష్టిఁజేయు తెలివినంతయు బోధించి నలుగురు శిష్యులతోఁగూడి శివజ్ఞానప్రచారము నొనర్చెను.

ఇద్ది సద్యోజాతావతారము - మొదటిది

ఆ పిమ్మట నిరువదియవ రక్త కల్పమునందు బ్రహ్మదేవుఁడు ఎరుపువన్నె గలవాడై పరశివుని ప్రార్థించుచుండగా రక్త వస్త్రములఁదాల్చిన వాడును ఎఱ్ఱని పువ్వుల మాలికలను వేసుకొనినవాడును రక్తాక్షుఁడును రక్తవర్ణముగల భూషణములను ధరించినవాడు నగు దివ్య పురుషుఁడు సాక్షాత్కరించెను.





అట్టి పురుషుని వామదేవునిగా భావించి కృతాంజలియై నమస్కరింపగా విరజుఁడు వివాహుఁడు విశోకుఁడు విశ్వభావనుఁడు అను నలుగురు రక్తాంబరధారులు అవిర్భవించిరి. అట్టితఱి బ్రహ్మ వేడుకొనినందున వామదేవుఁడు అతనికి ప్రపంచమును పుట్టించు శక్తిని ప్రసాదించి తన శిష్యులతో కూడి శివజ్ఞానమును భక్తులకు బోధించెను.

## ఇద్ది రెండవదగు వామదేవావతారము

పీతవాసం ఐను పేరుగల యిరువదియొకటవ కల్పము నందు బ్రహ్మదేవుఁడు – పచ్చని బట్టలఁ దాల్చినవాడై ధ్యానించుచుండగా నొక పురుషుఁడు పీతాంబరధారియై ప్రత్యక్షమయ్యెను. అట్టి మహనీయుని తత్పురుషునిగా భావించి తత్పురుషగాయత్రీ మంత్రమును జపించుచు శక్తి స్వరూపమును ప్రార్థించినందున మహాదేవుఁడు ప్రసన్నుఁడై సృష్టిసామర్థ్యమును బ్రహ్మదేవునకు ప్రసాదించెను.

తత్పురుషుని సేవింప నలుగురు శిష్యులు అవిర్భవించి పీతాంబరధారులై తమ గురువుగారితో సహ శివయోగ ప్రచారముఁ గావించిరి.

## ఇద్ది మూడవదైన తత్పురుషావతారము

శివమను కల్పమునందు బ్రహ్మదేవుఁడు జగమును పుట్టింపఁదలచి చింతించుచుండగా నొక కుమారుఁడు ప్రత్యక్షమయ్యెను. అతఁడు – నలుపువన్నెగల శరీరముతో ప్రకాశించుచు నల్లనివస్త్రములను ధరించినవాడై కృష్ణయజ్ఞోపవీతియై నల్లని కిరీటము తలపాగయు గలిగి నలుపు రంగుగల సుగంధ ద్రవ్యములను పూసుకొనియుండెను.

అట్టి మహాపురుషుని అఘోరునిగా భావించి ప్రార్థింపగా నాతని చెంత నుండి నలుగురు నలుపు వన్నెగల కుమారులు ఉద్భవించిరి. కృష్ణుఁడు కృష్ణశిఖుఁడు కృష్ణాస్యుఁడు కృష్ణకంఠధరుఁడు అని వారి నామధేయములు; వీరు అఘోరబ్రహ్మయాదేశము ననుసరించి లోకమున శివయోగ ప్రబోధము నాచరించిరి. బ్రహ్మకు సృష్టిసామర్థ్యంబు చేకూరినది.

## ఇద్ది నాలుగవదైన అఘోరావతారము

ఆ పిమ్మట విశ్వరూప మనఁబడు కల్పమునందు బ్రహ్మదేవుఁడు సృష్టికారకపురుషుని పొందఁ గోరినవాడై శివధ్యానముఁజేయుచుండ మహానదము అవిర్భవించెను. అందునుండి యొక పురుషుఁడు - శుద్ధస్ఫటిక వర్ణముతో ఆభరణములఁదాల్చి సాక్షాత్కరింపగా నాతనిని బ్రహ్మ ఈశానునిగా భావించి మ్రొక్కులిడెను.

అంత నీశానుఁడు విధికి సృష్టిక్రమమును బోధించి నలుగురు శిష్యులను "జటి, ముండి, శిఖండి, అర్ధముండి" అను వారిని పుట్టించి వారితో శివధర్మ ప్రచారమును చేయించెను.

## ఇద్ది ఐదవదగు ఈశానావతారము

సద్యోజాత వామదేవ తత్పురుష అఘోర ఈశానులు పంచబ్రహ్మలుగా పేర్కొనఁబడుచుందురు. ఈ శివస్వరూపములను భక్తులు నమస్కరింపవలెను. అట్టి వారికి సకల శుభములు చేకూరుటయే గాక మోక్షంబు సంభవించును.





ఇందు ఈశానుఁడు ముఖ్యుఁడై ప్రకృతి ననుభవించు క్షేత్రజ్ఞుని (జీవుని) అధిష్ఠించియుండును. తత్పురుషుఁడు - సత్త్వరజస్తమోగుణములు మున్నగు భోగ్యముల నాశ్రయించియుండును. అఘోరుఁడు - బుద్ధితత్త్వముపై నిలచియుండును. వామదేవుఁడు - అహంకారమును అవహించును. సద్యోజాతమూర్తి - మనస్సును పొందియుండును.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో శివమహాపురాణగత శతరుద్ర సంహితయందు ప్రథమాధ్యాయము.

## ద్వితీయాధ్యాయము

### (శివుని అష్టమూర్త్యవతారములు)

శర్వ భవ రుద్ర ఉగ్ర భీమ పశుపతి ఈశాన మహాదేవులనఁబడు వారు - శివుని అష్టమూర్తులుగా పరిగణింపఁబడుదురు. వీనిలో

శ ర్వు ఁడు - విశ్వమును మోయుచున్న భూమి నధిష్ఠించియుండును.
భ వుఁ డు - జగమును జీవింపఁజేయు నుదకముల నాశ్రయించియుండును.
రు ద్రుఁ డు - ప్రపంచమును ప్రకాశింపఁజేయు అగ్నిపై నిలచియుండును.
ఉ గ్రుఁ డు - లోన బయటను కదిలించు వాయువుఁజెందియుండును.
భీ ముఁ డు - జీవులందరికి నవకాశమును కల్పించు నాకాశమును పొందువాడు.
ప శు ప తి - క్షేత్రజ్ఞుఁడైన జీవాత్మలో నివసించువాడు.
ఈశానుఁడు - జగమునకు నేత్రమువంటి సూర్యునిలో ప్రకాశించును.
మహాదేవుఁడు - అమృత కిరణములతో చరాచర ప్రాణులను పెంపొందించు చంద్రునిపై యధికారము కలిగి యుండును.

ఇఁక నీ ఎనిమిది రూపములేగాక సచ్చిదానందమయ స్వరూపమున జగమునంతయు వ్యాపించి లోకోత్తర విలక్షణస్థానమున శివుఁడు విరాజిల్లుచుండును.

చెట్టుమొదట నీరు పోసినచో కొమ్మలు బ్రతుకునట్లు శివుని మాత్రము పూజించినయెడల శివ శరీరమగు ప్రపంచమంతయు తృప్తిఁజెందును. అట్లు భావించి ప్రపంచమును ద్వేషింపరాదు. పుత్రులు పౌత్రులుమున్నగువారిని ప్రేమించినచో తండ్రి సంతసించునట్లు ప్రాణులందరిని సత్కరించుటచే శివుఁడు సంప్రీతుడగును కావున నేరికిని ఎట్టి యపకారమును చేయకూడదు. యెనిమిది రూపములతో విశ్వమును వ్యాపించు శివుడు - సర్వకారణుఁడని భావించి సర్వాత్మనా ఆతనినే సేవింపవలెను.

అందువలననే ఈ అష్టనామధేయములు గల రూపములను భక్తులు శివపూజా సమయమున భావించుచున్నవారు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో రెండవ యధ్యాయము.





# తృతీయోధ్యాయము

## (అర్ధనారీశ్వరావతారము పదునాలుగవది)

బ్రహ్మదేవుని సృష్టికార్యమును సాధించునదియు శివస్వరూపంబు నగు అర్ధనారీశ్వరావతారముఁ గూర్చి చెప్పెదను. వినుము!

పూర్వము ప్రజలను పుట్టించినను అవ్వారు పెరుగనందున బ్రహ్మదేవుఁడు చింతాక్రాంతుఁడై మిగుల విచారపడుచుండ "స్త్రీ పురుషుల జంటలను కల్పించి యవ్వారితో జగమును విస్తరిల్లఁజేయుము!" అని యాకాశవాణి చెప్పగా స్త్రీలను పుట్టింప నలవిగానందున శంకరునిఁ గూర్చి తపించుచు శక్తితో కూడిన పరశివునిఁ బ్రార్థించుచుండెను.

అవ్విధము తపించుచున్న బ్రహ్మపై పరమేశ్వరుఁడు కరుణఁగలవాడై సగము ఆడుదిగా సగము మగవాడుగాను ప్రత్యక్షము కాగా పద్మజుఁడు సాష్టాంగములనిడి దోసి లొగ్గియు వేడుకొనెను.

అప్పుడు మహేశ్వరుఁడు – మేఘగంభీరస్వరమున "పంకజాసనా! నీ తపంబు మెచ్చితిని" అని పలికినవాడై స్వరూపమునుండి శక్తిరూపమును విడదీయగా "అమ్మా! నీ భర్తయగు శివుఁడు మొదట నన్ను పుట్టించి ప్రజాసృష్టిఁజేయుమని యాదేశించినందున మానసికముగా దేవతలు మున్నగువారిని కల్పించితిని కాని వారు పెంపొందకున్నవారు. గాన నాకు స్త్రీలను పుట్టించు శక్తిని ప్రసాదింపుము! నీవు గూడ శంకరునికి తోడుగా నుండుటకు నా కుమారుడైన దక్షప్రజాపతికి కుమార్తెగా నవతరింపుము! అట్లైయినచో నా సృష్టిక్రమము సాగుచుండును" అని బ్రహ్మదేవుఁడు ప్రార్థించెను.

అంత యా చిచ్ఛక్తి – తనతో సమానురాలైన శక్తిని కనుబొమల నడుమనుండి పుట్టింపగా నామెఁ జూచుచు మహేశ్వరుఁడు "దేవీ! బ్రహ్మదేవుడు తపించి నిన్ను ఆరాధించినవాడు గాన నాతనివరములను సార్థకముల నొనర్పుము!" అని వాక్రుచ్చెను.

తరువాత నాదిశక్తి తన యంశమును దక్షపుత్రికయై జన్మించినందున సురజ్యేష్ఠుఁడు – స్త్రీ పురుషుల సంయోగము ద్వారా నిరంతరము సృష్టిని చక్కగా నెరవేర్తు – నని భావించి సంతృప్తిఁజెందెను. ఆదిశక్తి – శివునిలో లీనమైనంనదున శివుఁడు శక్తి విశిష్టుఁడై యంతర్ధానముఁ జెందెను.

ఇద్ది అర్ధనారీశ్వరావతారము

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో మూడవ యధ్యాయము.

విశేష గమనిక-
మొదట పురుషులే పుట్టిరి కాని స్త్రీలు పుట్టలేదనియు స్త్రీయాకారము ఎట్లుండునో గమనించుటకై ఆదిశక్తిదాక్షాయణిగా జన్మింపవలసివచ్చెననియు లక్ష్మీసరస్వతులకన్న దాక్షాయణియే ముందు అవిర్భవించి శంకరుని చేపట్టినందున శక్తిశివులే గాక దాక్షాయణీ మహేశ్వరులును ఆదిదంపతులుగ వ్యవహరింపఁబడుచున్నారనియు లక్ష్మీసహితుఁడగు నారాయణుని యుపమానము నొసగుట – రెండవసారి యవతరించిన పార్వతీదేవిని పరిగ్రహించిన పరమేశ్వరునకే సరిపడుననియు దాక్షాయణీపతికి సరిపడదనియు చదువరులు బాగుగా నీ సందర్భమున గమనింపవలెను.

## చతుర్థాధ్యాయము

### (శ్వేతుఁడు మొదలుకొని ఋషభుని వరకు గల తొమ్మిది యవతారముల కథనము)

వారాహకల్పమున ఏడవదగు వైవస్వత మన్వంతరమున సంభవించు ద్వాపర యుగాంతము నందు భగవానుఁడు వేదవ్యాసరూపమున భువి నవతరించినపుఁడు అతని జ్ఞాన ప్రచారమును సమర్థించుటకు శంకరుఁడు – శ్వేతాచార్యరూపమున నవతరించును. శ్వేతాచార్యుఁడు – శిఖాయజ్ఞోపవీతములను ధరించి నలుగురు శిష్యులతో కూడియుండును. శ్వేతుఁడు, శ్వేతశిఖుఁడు, శ్వేతాశ్వుఁడు, శ్వేతలోహితుఁడునని వారి పేరులొప్పును. శ్వేతాచార్యుని ప్రబోధమున జనులు శివుని పరమాత్మగా భావించి శివధ్యానమున ముక్తులగుదురు.

రెండవ ద్వాపరాంతమున వేదవ్యాసునికి సహకరించుటకు సుతారుఁడను యోగియై శంకరుఁడవతరించును. దుందుభి, శతరూపుఁడు, హృషీకుఁడు, కేతుమంతుఁడను నలుగురు శిష్యులు సుతారుని సేవించుచు శివధర్మప్రచారము, నొనర్తురు.

మూడవ ద్వాపరమున వేదవ్యాసునికి తోడుగా దమనుఁడను పేరుతో శంకరుడవతరించి నపుఁడు విశోకుఁడు విశేషుఁడు విపాపుఁడు పాపనాశనుఁడు నను నలుగురు శిష్యులు జన్మించి శివధర్మ ప్రచారముఁ జేయువారు.

నాలుగవ ద్వాపరమున వ్యాసమహర్షిగారి సనాతనధర్మమును పెంపొందింప శంకరుఁడు సుహోత్రుఁడను యోగీశ్వరుఁడుగా నవతరించును. సుముఖుఁడనియు దుర్ముఖుఁడనియు దుర్ధర్షుఁడనియు దురత్రికముఁడనియు సుహోత్రుని నలుగురు శిష్యులు జన్మించి శివధర్మప్రచారముఁ గావించి ముక్తులగుదురు.

ఐదవ ద్వాపరమున వేదవ్యాసునికి సహకరించునుద్దేశమున కంకుఁడను యోగిగా మహాదేవుఁడవతరించినతతి సనకుఁడు, సనాతనుఁడు, సనందనుఁడు, సనత్కుమారుఁడు, నను నలుగురు శిష్యులతో శివధర్మ ప్రచారము చేయబడును.

ఆరవ ద్వాపరమున వ్యాసు ననుగ్రహింప పరమేశ్వరుఁడు లోకాక్షియను యోగియై సుధాముఁడు విరజుఁడు సంజయుఁడు విజయుఁడు నను శిష్యచతుష్టయముతో పాశుపతధర్మమును బోధించును.





ఏడవ ద్వాపరమున వేదవ్యాసు ననుగ్రహించుటకు శివుఁడు జైగీషవ్యుఁడను పేరనావిర్భవించి సారస్వత యోగీశ మేఘవాహ సువాహనులను శిష్యులద్వారా శాంభవధర్మ ప్రచారము నొనర్చును.

ఎనిమిదవ ద్వాపరమున వ్యాసమహర్షికి సహకరించుటకు శంకరుఁడు దధివాహనుఁడను యోగియై కపిలుఁడు, ఆసురియు, పంచశిఖుఁడు, శాల్వలుఁడు నను నలుగురు శిష్యులచే సేవింపఁబడుచు శివధర్మమును ప్రబోధించును. నవమ ద్వాపరాంతమున వేదవ్యాసుఁడు జన్మించినపుడు ఈశ్వరుఁడు ఋషభుఁడను యోగీశ్వరుఁడై యవతరించును. పరాశరుఁడు, గర్గుఁడు, భార్గవుఁడు గిరిశుఁడు నను శిష్యచతుష్టయము పశుపాశపతిజ్ఞానమును ప్రబోధింతురు. మరియు ఋషభయోగీశ్వరుఁడు – భద్రాయువను రాజకుమారుఁడు విషప్రయోగమున మరణించినపుడు అవ్వానిని జీవింపజేసి పదునారవ ప్రాయము గల భద్రాయువునకు రాజధర్మముల నుపదేశించియు శివకవచమును దివ్యములగు శంఖ ఖడ్గముల నొసగినవాడై శివ కవచమంత్రితంబగు భస్మతో రాజకుమారుని స్పృశించియు పండ్రెండ్రుయేనుఁగుల బలమును ప్రసాదించెను. ఇట్లు భద్రాయువును వాని తల్లి ననుగ్రహించి ఋషభయోగి యధేచ్ఛఁ జనియ్యెను. తరువాత భద్రాయువు శతృవుల నోడించి కీర్తిమాలిని యను రాజకన్యను వివాహమాడినవాడై ధర్మముగా రాజ్యమును పరిపాలించియు జన్మాంతమున శివసాయుజ్యము నొందెను. శ్వేతాచార్యుఁడు మొదలుకొని సంభవించిన తొమ్మిది యవతారములలో ఋషభావతారము పరమపావనంబై వినువారికి శ్రేయఃప్రదంబునై దీర్ఘాయురారోగ్యభాగ్యముల నొసగునది కాదే!

ఇయ్యది ఇరువది మూడవ యవతారము.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున నాలుగవ యధ్యాయము.

## పంచమాధ్యాయము

### (తపోధనుఁడు మొదలుకొని లకులీశుని వరకు గల పందొమ్మిది యవతారముల కథనము)

పదియవ ద్వాపరమున వ్యాసుననుగ్రహింప మహేశ్వరుఁడు – తపోధన యోగిగా నవతరించును. అప్పుడు భృంగుడు బలబంధువు, నరామిత్రుఁడు, కేతుశృంగుఁడు నను నలుగురు శిష్యులు – శివధర్మప్రచారముఁజేయుదురు.

పదునొకఁడవ ద్వాపరమున వేదవ్యాసుని ప్రచారమును పెంపొందింప శంకరుఁడు తపుఁడను యోగీశ్వరుఁడు కాగా లంబోదరుఁడు లంబాక్షుఁడు కేశలంబుఁడు ప్రలంబకుఁడునను నలుగురు శిష్యులు సంభవించి గురుమార్గమున ప్రబోధింతురు.

పండ్రెండ్రవ ద్వాపరమున వేదవ్యాసుని నివృత్తి మార్గమున సమర్థింప శివుఁడు అత్రి యను పేరుతో నవతరించును. సర్వజ్ఞుడు, సమబుద్ధి, సాధ్యుఁడు, శర్వుఁడు, నను నలుగురు అత్రియోగిశిష్యులుగా శ్రౌతశైవ సిద్ధాంతమును ప్రబోధింతురు.





పదమూడవ ద్వాపరమున వేదవ్యాసు ననుగ్రహింప శంకరుఁడు బలియను యోగీశ్వరుఁడు కాగా సుధాముఁడు కాశ్యపుఁడు వశిష్ఠుఁడు విరజుఁడు నను నలుగురు శిష్యులు శివధర్మమును బోధింతురు.

పదునాలుగవ ద్వాపరమున వ్యాసునికి సహకరింప పశుపతి గౌతముఁడను పేరుతో నవతరించి అత్రి దవశుఁడు శ్రవణుఁడు శ్రవిష్కటుఁడు నను నలుగురితో శివాద్వైతమును లోకమున ప్రచారముఁ జేయును.

పదునైదవ ద్వాపరమున వేదవ్యాసుని ప్రచారమును సమర్థింప శంకరుఁడు వేదశిరుఁడను యోగియై కుణి, కుణిబాహుఁడు, కుశరీరుఁడు, కునేత్రకుఁడు నను నలుగురు శిష్యులతో శివధర్మమును ప్రబోధించును.

పదునారవ ద్వాపరమున వ్యాసమహర్షి ననుగ్రహించుటకు మహాదేవుఁడు గోకర్ణుఁడను పేరుతో నవతరించును. కాశ్యపుఁడు ఉశనుఁడు చ్యవనుఁడు బృహస్పతియు నను నలుగురు శిష్యులతో శివధర్మప్రచారముఁజేసి కైలాసమున నివసించును.

పదునేడవ ద్వాపరమున వేదవ్యాసునికి తోడుగా శంకరుఁడు గుహావాసి యనుయోగియై ఉతథ్యుఁడు వామదేవుఁడు మహాయోగుఁడు మహాబలుఁడు నను నలుగురితో శైవమత ధర్మములను ప్రబోధించును.

పదునెనిమిదవ ద్వాపరమున వ్యాసునికి సహకరించుటకు శిఖండియను యోగిగా శంకరుఁ డవతరింప వాచఃశ్రవుఁడు రుచీకుఁడు స్యావాస్యుఁడు యతీశ్వరుఁడు నను నలుగురు శివయోగులు - తపోదాన శివారాధనాది ధర్మములను ప్రజలకు ప్రబోధింతురు.

పందొమ్మిదవ ద్వాపరమున వేదవ్యాసుఁడొనర్చు ధర్మప్రచారమునఁగల సారముఁదెలుపుటకు శంకరుఁడు మాలి యను పేరుతో శివయోగిగా నవతరించును. హిరణ్యుఁడు కౌశల్యుఁడు లోకాక్షి ప్రధిముఁడు నను నలుగురు శిష్యులు మాలీశ్వరుని ప్రబోధమును ప్రచారముఁ జేయుదురు.

ఇరువదియవ ద్వాపరమునవ్యాసమహర్షి ననుగ్రహింప శంభుఁడు అట్టహాసుఁడను శివయోగిగా నవతరించును. అట్టితతి సుమంతుఁడు, బర్బరి, కబంధుఁడు, కుక్షికంధరుఁడు నను నలుగురు శిష్యులు సంభవించి జన్మోద్ధారమార్గము నుపదేశింతురు.

ఇరువదియొకటవ ద్వాపరమున పారాశరుని (వ్యాసుని) ధర్మప్రచారమును సమర్థించుటకు పార్వతీపతి దారుకుఁడను యోగి కాగా నలుగురు శిష్యులు ప్లక్షుఁడు దార్భాయణి కేతుమంతుఁడు గౌతముఁడు ననువారు జన్మించి దైవభక్తి ప్రచారము నొనర్తురు.

ఇరువదిరెండవ ద్వాపరమున శుకజనకు (వ్యాసు) ననుగ్రహించుటకు శంకరుఁడు లాంగలీశుఁ డను యోగి కాగా భల్లవుఁడు, మధువు, పింగుఁడు, శ్వేతకేతువు నను నలుగురు లాంగలీశుని శిష్యులై వైదికములగు భస్మరుద్రాక్ష పంచాక్షరీమహామంత్ర శివలింగధారణములను ప్రజలచే నాచరింపఁజేయుదురు.

ఇరువదిమూడవ ద్వాపరమున వ్యాససహాయకుఁడుగా శివుఁడు శ్వేతయోగిరూపమున నవతరించును. ఉశికుఁడు, బృహదశ్వుఁడు, దేవలుఁడు, కవియు నను నలుగురు మహానుభావులు జన్మించి శివధర్మములను బ్రాహ్మణాది జనులకు ప్రబోధింతురు.





ఇరువదినాలుగవ ద్వాపరమున శక్తిపౌత్రు (వ్యాసు) ననుగ్రహించుటకు శూలియను పేరుతో శంకరుఁ డవతరింప నలుగురు శిష్యులు – శాలిహోత్రుఁడు, అగ్నివేశుఁడు, యువనాశ్వుఁడు, శరద్వసువు నను నామధేయములతో విలసిల్లినవారై భువిని శైవము, సర్వోత్తమమని యుపన్యసింపఁగలరు.

ఇరువదియైదవ ద్వాపరమున వ్యాసమహర్షిప్రబోధమును బలపఱచుటకు శంకరుఁడు దండియను పేరుతో నవతరించును. ఆ సమయమున ఛగలుఁడు, కుండకర్ణుఁడు, కుంభాండుడు ప్రవాహకుఁడు నను నలుగురు శిష్యులు – దండియోగిఁదగు శివదీక్షాధర్మప్రచారమునకు సహకరింతురు.

ఇరువదియారవ ద్వాపరమున వేదవ్యాసుని ధర్మప్రచారమును సమర్థించుటకు మహేశ్వరుఁడు సహిష్ణువను పేరుతో యోగావతారముఁజెందగా ఉలూకుఁడు, విద్యుతుఁడు, శంబూకుఁడు, అశ్వలాయనుఁడు నను నలుగురు శిష్యులు – సహిష్ణు యోగీశ్వరుని సదుపదేశములను సజ్జనులకు నిర్వచింపఁగలరు.

ఇరువదియేడవ ద్వాపరమున పరాశరకుమారుని (వ్యాసుని) సమర్థించుటకు ఈశ్వరుఁడు సోమశర్మయను యోగిగా నవతరించును. అక్షపాదుఁడు కుమారుఁడు ఉలూకుఁడు వత్సుడు నను యోగపురుషులు సోమశర్మశిష్యులై శివధర్మప్రచారముఁజేయుదురు.

ఇరువదియెనిమిదవ మహాయుగమున నేర్పడు ద్వాపరయుగముఁదగు చివరి సమయమున వేదవ్యాసుఁడు ద్వైపాయనుఁడను పేరుతో బ్రహ్మధర్మప్రచారమును చేయుచుండగా మహేశ్వరుఁడు – లకులీశుఁడను పేరుతో శివయోగిగా నవతరించును. అప్పుడే శ్రీహరి – తన యారవ యంశమున వసుదేవుని కుమారుఁడై శ్రీకృష్ణనామధేయమున నవతరించును. కుశికుఁడు, గర్గుఁడు, మిత్రుఁడు, తౌరుష్యుఁడు నను నలుగురు యోగపురుషులు – లకులీశుని శిష్యులై శివలింగోపాసనాత్మకంబగు ఉత్తమధర్మమును ప్రబోధింతురు.

ఈ నూటపండ్రెండుగురు శిష్యులతో కూడిన ఇరువదియెనిమిదుగురు యోగాచార్యులు ప్రతి కలియుగము ప్రారంభమగునపుడు నవతరింతురు. ప్రతి ద్వాపరయుగము ముగియుతఱి వ్యాసుఁడు సంభవించును. వీరందరును మహాశైవులై భస్మోద్ధూళిత విగ్రహులుగాను రుద్రాక్షమాలాభరణులుగాను త్రిపుండ్రాంకితమస్తకులుగాను వేదవేదాంగ పారగులుగాను బాహ్యాభ్యంతర శివలింగధారులుగాను జితేంద్రియులై శివధ్యానముఁజేయుచు శ్రౌతశైవప్రచారముచే లోకుల నుద్ధరించియు శివసాయుజ్యము నొందుదురు.

ఇవ్విధము సదాశివుఁడు బ్రహ్మదేవు ననుగ్రహించు నుద్దేశమున ప్రతి మహాయుగమున వ్యాసరూపమున శివయోగిరూపమున నవతరించి భూలోకమున మోక్షధర్మము నుపదేశించియు భక్తులను ముక్తులఁజేయువాడు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో ఐదవ యధ్యాయము.

# షష్ఠాధ్యాయము

## (నందీశ్వరావతారము)

సూతుఁడు చెప్పఁదొడఁగెను.

శౌనకాది మహర్షులారా!

పూర్వము శిలాదుఁడను మహర్షి - పితృదేవతలచే ప్రేరేపింపఁబడినవాడై వారి నుద్ధరించు నుద్దేశముతో పుత్రసంతానముఁబడయఁగోరి మునివృత్తి నవలంబించియు దేవేంద్రు నుద్దేశించి బహుకాలము తపించుచుండెను.

అంత నమరేంద్రుఁడు ప్రసన్నుఁడై "మునిప్రవరా! వరముఁగోరుకొనుము!" అని నుడువగా శిలాదుఁడు దోసిలొగ్గి మ్రొక్కులిడియు "అయోనిసంభవుఁడు మృత్యురహితుఁడునగు కుమారు నొసగు" మని ప్రార్థించెను.

"శిలాదా! యోనిసంభవుఁడు మరణధర్మముగలవాడు నగు పుత్రుని ప్రసాదింతును కాని మరణము లేనట్టి అయోనిసంభవుఁడగు కుమారుని నేనుగాని నారాయణుఁడు గాని బ్రహ్మదేవుఁడు గాని ఈయఁ జాలము. ఇతరదేవతలు అట్టి కుమారు నొసఁగఁజాలరని వేరుగా చెప్పనవసరము లేదు గదా!

శ్లో॥ తా వపి త్రిపురార్యంగ - సంభవౌ మరణాన్వితౌ ।
తయో రప్యాయుషాం మానం - కథితం నిగమే పృథక్ ॥ ౧౨

హరిబ్రహ్మలు గూడ శంకరుని శరీరమునుండి పుట్టినవారై ఏనాటికైనను మరణించువారనియు అవ్వారి ఆయుష్యముఁదగు ప్రమాణము శాస్త్రమునందు ప్రత్యేకించి చెప్పఁబడినదనియు తెలియుము! అందువలన మృత్యువులేని పుత్రుని ఆశింపక సాధారణమానవలక్షణము గల కుమారు నపేక్షింపుము! ఒకవేళ అట్టి కుమారుఁడే కావలయునెడ

శ్లో॥ ఆరాధయ మహాదేవం - తత్పుత్రవినికామ్యయా ।
సర్వేశ్వరో మహాశక్తః - స తే పుత్రం ప్రదాస్యతి ॥ ౧౮

మహాదేవు నారాధింపుము! ఆ సర్వేశ్వరుఁడు ఒక్కఁడే మృత్యువును జయించు గొప్ప సామర్థ్యముఁ గలవాడు గాన పుట్టుచావులులేని చిరంజీవి పుత్రుని ప్రసాదించును" అని యమరాధిపతి వచించి యమరులతో కూడి స్వర్గమునకుఁజనినవాడు.

అంత శిలాదమహర్షి మహాదేవు నారాధించుచు దివ్యములైన వేయివత్సరముల కాలమును క్షణమువలె గడపెను. అప్పట్టున నాతనిపై పుట్ట పెరుగగా వజ్రపు ముఖములు గల పురుగులు నెత్తురుఁద్రాగుచుండెను. మాంసము రక్తంబు లేనివాడై తోలు బొక్కలు మాత్రము మిగిలిన శరీరముఁగలవాడై శిలాదుఁడు పుట్టలో నలుగుచుండగా దేవతాసార్వభౌముఁడగు శంకరుఁడు - వక్రబుద్ధిఁగలవారికి చూడనలవిఁగాని స్వరూపమును చూపెట్టి "వరదుఁడనై ప్రత్యక్షమైతి" నని సంభాషింపగా శిలాదుఁడు శివధ్యాననిమగ్నుడైన కతన శంకరుని మాటను వినకుండెను.





అంత నా కరుణామయుఁడు తన అమృతహస్తముతో తాకినందున శిలాదుఁడుసమాధి నిష్ఠనుండి మేలుకొని కన్నులఁదెఱచియు పరమేశ్వరు నవనలోకించుచు ప్రణమిల్లినవాడై చరణముల వ్రాలి తడఁబడుచున్న కంఠస్వరమున కృతాంజలియై నుతింపగా పార్వతీపతి ప్రసన్నుఁడై "అపే క్షితమును ప్రార్థింపు" మని యాదేశించెను.

అంత శిలాదుఁడు "మహేశ్వరా! నా యందు కరుణఁగలవాడవై మృత్యురహితుడు అయోని సంభవుఁడు నీతో సమానుఁడు నగు కుమారుని ప్రసాదింపు" మని ప్రార్థింపగా చంద్రశేఖరుఁడు "బ్రాహ్మణపుంగవా! బ్రహ్మదేవుఁడు సురలు మునులును నన్నవతరింపవలసినదిగా మున్ను కోరినందున నీవరము ననుసరించియు నీకు కుమారుఁడ నగుదును. సర్వ జగత్పితనగు నాకు తండ్రివి కాగలవు" అని యనుగ్రహించి యంతర్ధానముఁ జెందెను.

పిదప శిలాదుఁడు తన యాశ్రమమునకుఁజని మునులకు తపోవిధానఫలమగు పుత్ర వరప్రాప్తిని వక్కాణించియు కొంతకాలమునకు యజ్ఞముఁజేయఁదలచినవాడై యజ్ఞభూమిఁ దున్నించి కుండమున రుద్రస్వాహాకారముఁజేయుచుండగా యజ్ఞాగ్నినుండి - ప్రళయాగ్నివలె వెలుగొందుచున్న బాలుఁడు శివాజ్ఞావశమున జన్మించెను.

ఆ దివ్య శుభసమయమున పుష్కలము అవర్తకము మున్నగు మేఘములు దివ్యామృత జలములను కురిపించుటయే గాక నమరులు దివ్యపుష్పములను వర్షించిరి మరియు హరిబ్రహ్మాదిదేవతలు గౌరీశంకరులు నరుదెంచి బాలునాశీర్వదించి శిలాదు నభినందించియు అప్సరసల నాట్యముతో గంధర్వుల గానముతోడను మహోత్సవము చెలరేగగా తమ నివాసములకు నేగియుండిరి.

బాలుఁడు - మూడు కన్నులు నాలుగు చేతులు జటామకుటము త్రిశూలము మున్నగు ఆయుధములును గలిగి శంకర రూపముతో కనుపడుచుండగా శిలాదుఁడు "కుమారా! చూడగానే నన్ను సంతసింపఁజేసితివి గాన నంది యను పేరుపెట్టుచున్నాను. శివాంశసంభూతుడవగు నీకు మ్రొక్కులిడుచున్నాను" అని పుత్రు నభినందించినవాడై స్వకీయాశ్రమమున సుఖముగా నివసించెను.

అంత నందికేశ్వరుఁడు నిజరూపమును విడనాడి సామాన్య మానవబాలుడు కాగా శిలాదుఁడు పుత్రస్నేహాతురుఁడై జాతకర్మ మొదలగు సంస్కారముల నొనర్చుటయే గాక నైదవ యేడునుండి బాలునకు సాంగోపాంగములగు వేదములను శాస్త్రములను నేర్పించెను.

నందికేశ్వరునకు నేడవయేడు నిండగా మిత్రావరుణ ఋషులు శివాజ్ఞఁజేసి శిలాదాశ్రమమున కేతెంచి శిలాదునిచే సత్కరింపఁబడినవారై సుఖాసీనులై బాలుని చూచుచు "నందికేశ్వరా! సర్వ శాస్త్రార్థపారగుడవైతివి కాని యింక నొక సంవత్సరమే జీవింతువు" అని నుడివి యటనుండి వెళ్ళిరి.

అంత శిలాదుఁడు పుత్రవియోగమునకు మిగుల వగచుచుండగా నందికేశ్వరుడు "నాయనా! ఎందుకింతగా దుఃఖించుచున్నా"వని యడిగినందున "కుమారా! నీ యల్పాయుస్సునకు నేడ్చుచుంటిని. ఇట్టి దుఃఖమును నివారించు నెవఁడో అట్టి దేవదేవుని శరణముగా భావింతును" అని శిలాదుఁడు వాక్రుచ్చెను.

"అమరులుగాని అసురులుగాని మృత్యువుగాని యముడుగాని నన్ను చంపలేరు. ఎట్టి అపమృత్యువు నన్ను చెందకుండును. ఇవ్విషయమై శపథముఁజేయుచున్నాను అని శిలాదునకు నందికేశ్వరుడు తన ధైర్యమును తెలుపగా "నీ విజ్ఞానము ఎట్టిది? దైవ నిష్ఠ యెట్టిది? యోగశక్తి ఎట్టిది? నిన్ను కాపాడు ప్రభువెవడు? ఈ భయంకర సంకటము నెట్లు తప్పించుకొనగలవు?" అని శిలాదుడు ప్రశ్నించెను.

శ్లో॥ హే తాత తపసా మృత్యుం - వంచయిష్యే న విద్యయా ।
మహాదేవస్య భజనాత్ - మృత్యుం జేష్యామి నాన్యథా ॥ ౬౧

"నాయనా! శివారాధన మనఁబడు తపంబు నాచరించి మృత్యువును వంచించి చిరంజీవి నగదు" నని నందికేశ్వరుడు వక్కాణించి శిలాదునకు ప్రదక్షిణముఁజేసి నమస్కారముల నర్పించియు వనమునకు వెళ్ళినవాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున ఆరవ యధ్యాయము.

## సప్తమాధ్యాయము

### (నందికేశ్వరుని పట్టాభిషేకము)

అడవిలో నేకాంతమున మునులకు నలవిగాని తపముఁజేయుచు హృదయమున శివుని - మూడుకన్నులు గలవానిగాను పదిచేతులు గలవానిగాను శాంతస్వభావునిగను ఐదు ముఖములు గలవానిగాను ధ్యానించుచు రుద్రాధ్యాయమును పఠించుచు నదీతీరమునందు నందికేశ్వరుడు నుండగా చంద్రశేఖరుడు ప్రత్యక్షమై "వత్సా! వరదుడనై వచ్చితిని. నీ తపంబునకు ప్రసన్నుడనైతిని. అపేక్షితమును ప్రార్థింపుము!" అని సంభాషించెను.

అంత నందికేశ్వరుఁడు శంకరుని చరణ కమలములపై వ్రాలి పట్టరాని సంబరమున కన్నీరు రాల్చుచుండ నా శిలాదతనయుని పరమేశ్వరుడు తన యమృత హస్తములఁదాకి లేపినవాడై యొక పర్యాయము హైమవతీదేవిని గణాధిపతుల నవలోకించి యిట్లు వాక్రుచ్చెను.

"నందీ! నిన్ను పరీక్షింప మిత్రావరుణులను నేనే పంపితిని. ఇక మృత్యుభయము నెంతమాత్రముఁ జెందకుము! నాతో సమానుడవగుదువుగాక! జరామరణములు లేనివాడవై రోగాది వికారములఁ జెందక గణాధిపతివై నా లోకమున నీ తండ్రితోడను బంధువులతోడను నివసింపుము! నా యనుగ్రహ పాత్రుడవై యెల్లకాలము నాచెంత నుండగల"వని మహాదేవుఁడు వక్కాణించి తన కమల పుష్పమాలికను నంది కంఠమున వేయగా నాతడు తత్కాలముననే త్రిలోచనుడుగాను దశభుజుడుగాను రెండవ శంకరుఁ డయ్యెను.

పిదప భగవానుఁడు స్వహస్తమున నందికేశ్వరునిపై తన జడలలోని గంగోదకమును చల్లుచు "నంది" యను పేరుగలవాడవై వర్ధిల్లుమని యనుగ్రహించెను.





అట్టితతి నాజలము భూలోకమున ప్రవహింపగా – సుతోయ యనియ జటోదకయనియు త్రిస్రోతయనియు వృషధ్వని యనియు జంబువనియు ఐదు నదులు విలసిల్లినవి. ఈ ఐదునదుల మూలస్థానము పంచనద మనఁబఱగుచు జపేశ్వరుని సమీపమున పరమ పావనమై యొప్పారు చుండును.

పంచనదక్షేత్రమునకుఁజని యచటి కుండమున స్నానమాడి జపేశ్వరుని పూజించు భక్తుఁడు శివసాయుజ్యము నొందును.

అంత శంకరుడు – నందిని గణాధిపతిగా నభిషేకింపఁజేయుదును. ఇందుకు నీవే మందువు? అని పార్వతీదేవి నడుగ నాయమ్మ – పరమేశ్వరా! నీ ప్రియ భక్తుడైన నంది నాకును కుమారునితో సమానుఁడు కావున గణాధిపత్యము నొసగగల–వనియనుమతించెను.

ఆ సమయమున శివునిచే స్మరింపబడినందున గణాధిపులందరు నపరశంకరులుగా నేతెంచి గౌరీశంకరులకు ప్రణతుల నొనర్చియు ప్రార్థింపగా పరాత్పరుఁడు నిట్లు వచించెను.

పుత్రతుల్యుడగు నీ నందిని గణాధిపతిగా నియమించితిని. మీరందరును నామాట పాటించి వీనిన సత్కరింపుడు!

అంత నా మహోత్సవమున హరిబ్రహ్మేంద్రాది దేవతలు దేవర్షులు నచ్చోటి కరుదెంచిరి. పితామహుఁడు శంకరాజ్ఞావశమున నందికేశ్వరుని దివ్య గంగాజలముతో నభిషేకించుచుండగా నమరులు దోసిలొగ్గినవారై పరమేశ్వరునిఁ బ్రార్థించుచుండిరి. నారాయణుడు జయ శబ్దము నుచ్చరించుచుండెను.

అదే శుభసమయమున సప్తమరుత్తుల కుమార్తెయగు సుయశను నంది వివాహమాడి యామెతో సింహాసనముపై నాసీనుడుకాగా శ్వేతచ్ఛత్రముఁబట్టి వింజామరలతో దేవకన్యలు వీచుచుండిరి. గొప్ప సొమ్ములతో నాదంపతుల నలంకరించిరి. అమ్మవారు తన కంఠహారము నొసఁగెను. నందికేశ్వరుని ముందు తెల్లని వృషభము ఏనుగ సింగంబును నిలువఁబడి యుండినవి. బంగారు హారములచే నలంకరింపబడినట్టి చంద్రసన్నిభంబు నగు రథము తదితర రాజోపచారములును లభించెను.

ఇట్లు నందికేశ్వరుడు సపత్నీకముగ పట్టాభిషిక్తుడై పార్వతీపరమేశ్వరులకు శ్రీహరికి పితామహునకును నమస్కారముల నర్పించిన తతి మహేశ్వరుడు సుప్రసన్నుడై "వత్సా! ఎట్టివారును నిన్ను జయింపజాలరు. అందరిని నీవే పరాజితులఁజేయుదువు. నేను నివసించు ప్రతి స్థలమునందు నభిముఖముగా నీవుందువుగాక! నాయనుగ్రహమున నీ పూర్వికులందరును కైలాసమున నివసింతురు" అని యాశీర్వదించెను.

అమ్మవారును నిండుదయతో వరమునడుగుమని యాదేశింప "దేవీ! నీపాదపద్మములయందు నిరంతరము భక్తియుండుగాక!" అని నందికేశ్వరుడు కోరగా పార్వతీదేవి అటులే యగుగాక – అని యనుగ్రహించినదై "నీవును నాతో సమనురాలవై పతిభక్తి సంపన్నురాలవై మమ్ము సేవింతు"వని నందిపత్నియగు సుయశ నాశీర్వదించెను.

అంత హరిబ్రహ్మాద్యమరులు తమతమ సామర్థ్యముననుసరించి నందికేశ్వరునకు నానావిధ వరములను ప్రసాదింపగా నాతఁడు ప్రేమతో నట్టివరములను స్వీకరించెను.

పిదప శంకరుడు పార్వతీ దేవితో వృషభారూఢుడై గణాధిపతులు ముందునడచుచుండ నందికేశ్వరుని అతని బంధువులను వెంటనిడుకొనియు హరి బ్రహ్మాదిసురలు శివలీలా విలాసమును కొనియాడుచు తమ నివాసములకు వెళ్లుచుండగా కైలాసమునకుఁ జనినవాడు.

శివభక్తిని పెంపొందించు నందికేశ్వరావతారచరితము చదువువారికి చదివించువారికి వినువారికి వినిపించువారికిని ఈ లోకమున సర్వసుఖముల నిచ్చునదియే గాక పరలోకమున శాశ్వత శివానందము నొదవఁజేయునది గాదే!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో నేడవ యధ్యాయము.

ఇద్ది నలుబదిమూడవ (43) యవతారము.

## అష్టమాధ్యాయము

### (భైరవావతారము)

నందికేశ్వరుఁడు సనత్కుమారునికిని, బ్రహ్మదేవుఁడు నారదమహర్షికిని, వేదవ్యాసుఁడు సూతమునికిని చెప్పినవిధముగా శౌనకాది మహర్షులకు సూతుఁడు వక్కాణింపఁదొడఁగెను.

భైరవావతార కథను విన్నంతమాత్రమున శివుని యందు భక్తి పెంపొందును. శంకరుని రెండవ రూపమే భైరవుఁడని శివమాయామోహితులగు మూఢులు భావింపరు. శంఖచక్ర గదాపద్మములను నాలుగు చేతులఁదాల్చిన మహావిష్ణువు, నాలుగు వేదములను నాలుగు ముఖములఁ జదువు బ్రహ్మదేవుఁడును మహాదేవుని మహిమను కనుగొనఁజాలరు. ఇవ్విషయము నాశ్చర్యపడవలసిన యవసరము లేదు. శంకరుని మాయాప్రభావము ఏరికిని తెలియరానిది; అద్దానిచే నందరును మోహముఁజెందుచు నాతనిని పరమాత్మగా నారాధింపఁజాలరు.

ఎవరు తమ హృదయమునఁగల చిదాకాశమున పరమాత్మ నుపాసించుచున్నవారో అట్టివారు ధ్యానించు తత్త్వమే శివుఁడని తెలియవలెను. శివానుగ్రహమువలననే శివజ్ఞానము కలుగును కాని తర్కవితర్కములతో పరమాత్మను తెలుసుకొన నలవిఁగాదు.

శ్లో॥ సర్వగో ఒ పి మహేశానో - నేక్ష్యతే మూఢబుద్ధిభిః।
దేవవత్ బుధ్యతే లోకే - యో ఒ తీతో మనసోగిరామ్ ॥ ౬

సర్వవ్యాపకుడైన మహేశ్వరుని విజ్ఞానహీనులు పరమాత్మగా భావింపక సామాన్య దేవతయని తలచుచుందురు.

ఇట్లు భావించుట వారి యవివేకమే యగును. కావున శివతత్త్వము - వాక్కులకు మనస్సునకు నందరానిదియని భావించి శివుని సాక్షాత్కారమునకై శివునినే పలువిధములఁ బ్రార్థించుచుండవలెనని సారాంశము.





ఇవ్విషయమై యొక నితిహాసమును చెప్పెదను. శ్రద్ధగా వినుఁడు!

మేరుశిఖరముపై సత్యలోకమున నివసించు బ్రహ్మదేవుని చెంతకు దేవర్షులు వెళ్లినవారై శిరముల వంచియు చేతులు జోడించియు ప్రణమిల్లి "దేవదేవా! ప్రజానాథా! పరమాత్మ యెవర యథార్థముగా తెలుపు" మని ప్రార్థించిరి.

అంత పద్మసంభవుఁడు శివమాయామోహితుఁడై "నేనే జగత్కర్తను కావున నన్ను పరమాత్మగా భావింపుము! అనాదికాలము నుండి ప్రవర్తించుచు సృష్టిఁజేయుటేగాక రక్షణమును ప్రళయమును నేనే గావించుచున్నాను" అని వచించెను.

అంత నారాయణుఁడు ఆ సమయమున నచ్చోట నుండుటఁజేసి బ్రహ్మవాక్యమున రోసముఁ జెందినవాడై శివమాయాప్రభావమువలన "నేనేపరమాత్మను పరమపురుషుఁడను యజ్ఞనారాయణుఁడను, నీవు నా యానతివలననే జగమును పుట్టించుచున్నావు! నన్ను నిరాకరించినచో ప్రాణులు జీవింపఁ జాలరు" అని వక్కాణించెను.

ఇట్లు హరిబ్రహ్మలు వాదించుకొని పరమాత్మయెవరో నిర్ణయించు విషయమై వేదములు ప్రమాణములు కావున నయ్యవి మూర్తీభవించి యిటనున్నవి గదా! వాని నడుగుదమని నిశ్చయించుకొనిరి.

"వేదములారా! అన్ని యంశముల పరిష్కారమున మీరే ప్రమాణములని యంగీకరింతుము. పరమాత్మ యెవరో వివరింపు" డని హరిబ్రహ్మలు ప్రశ్నించిరి.

అట్టితతి ఋగ్వేదము–

శ్లో॥ **యదంతఃస్థాని భూతాని - యతః సర్వం ప్రవర్తతే ।**
**యదాహుః పరమం తత్త్వం - స రుద్ర స్త్వేక ఏవహి ॥** ౨౫

ప్రాణులందరును ప్రళయకాలమున ఎవని గర్భములో నుందురో; ఎవనివలన చరాచరమంతయు నావిర్భవించునో ఎవనిని పరమాత్మగా నిగమాగమములు సత్పురుషులును చెప్పుచున్నారో అట్టి భగవానుఁడు రుద్రుఁడొక్కఁడేను; అనియు

యజుర్వేదము–

శ్లో॥ **యో యజ్ఞై రఖిలై రీశో - యోగేన చ సమిజ్యతే ।**
**యేన ప్రమాణం ఖలు నః - స ఏకః సర్వదృక్ శివః ॥** ౨౬

జ్యోతిష్టోమఅశ్వమేధాదియాగములన్నిటిచే ఆరాధింపఁబడువాడును భక్తి యోగముచే పూజింపఁ బడువాడును అస్మదాదులకు తన మూలముగా శబ్దాదిప్రమాణములను సార్థకముఁజేయువాడును సర్వదర్శియు నగు శివుఁడొక్కడే పరమాత్మయగువాడు. అనియు

సామవేదము–

శ్లో॥ **యేనేదం భ్రామ్యతే విశ్వం - యోగిభి ర్యో విచింత్యతే ।**
**యద్భాసా భాసతే విశ్వం - స ఏక స్త్ర్యంబకః పరః ॥** ౨౭

ఎవఁడు ప్రపంచమును ప్రవాహముగా నడిపించునో యోగు లెవనిని ధ్యానింతురో ఎవని కాంతిచే విశ్వమంతయు ప్రకాశించుచున్నదో అట్టి త్రిలోచనుఁడొక్కఁడే పరాత్పరుఁడగువాడు అనియు

అధర్వణవేదము-

శ్లో॥ యం ప్రపశ్యంతి దేవేశం - భక్త్యనుగ్రాహిణో జనాః ।
తమాహు రేకం కైవల్యం - శంకరం దుఃఖతః పరమ్ ॥ ౨౧

పరాభక్తిగల మహానుభావులు ఎవని దివ్యదర్శనముఁజెందుదురో సంసారదుఃఖము బొత్తుగా లేనట్టి యా పరమపురుషుని శంకరునిగా కోవిదులు భావించుచున్నవారు. అనియు సంభాషింపగా విధికేశవులు చిరునగవుతో నిట్లు నాక్షేపించిరి.

శ్రుతులారా? ఏమిటి మీరు చెప్పునది? మీ జ్ఞానమంతయు నశించినది కాబోలు!

దిగంబరుఁడు, ప్రమథగణములను వెంటాడువాడును అమ్మవారితో ఆడుకొనువాడును జడదారియు ఎద్దు నెక్కువాడును సర్పభూషణుఁడు నగు శంకరుఁడు పరమాత్మ యెట్లగును?

అంత ప్రణవము మూర్తీభవించి యిట్లు నుడివెను.

తనకంటె వేరైన శక్తితో రమించువాడు కాడీశ్వరుఁడు; మహాదేవుఁడు స్వయంజ్యోతియై సనాతనుఁ డగువాడు. ఆతని యానందమే శక్తిగా పరిణమించినది. గుణమును గుణము గల వానిని విడదీయరానట్లు శక్తిశివులు కూడియుండునదియే పరతత్త్వముగా చెప్పఁబడుచున్నది ఇట్టి ప్రణవోపదేశమును గూడ హరిబ్రహ్మలు పాటింపక గర్వితులై యుండు సమయమున ఇరువురి మధ్య నొక జ్యోతిస్సు భూమ్యాకాశముల నడిమిచోటు నంతయు ప్రకాశింపఁజేయుచుండెను. అట్టి వెలుగులో నొక పురుషుఁడు అద్భుత శరీరముతో కనుపడుచుండగా మా యిరువురి మధ్య నగుపడు నీ పురుషుఁడెవఁడని బ్రహ్మదేవుని ఐదవ తలమండుచుండెను. అంతలోనే నీలలోహితరుద్రుఁడు త్రిశూలపాణియై సాక్షాత్కరింప పద్మజుఁడు పరిహసించుచు “చంద్రశేఖరా! నా నొసటినుండి పుట్టిన రుద్రుఁడవు గదా! పుట్టగానే ఏడ్చినందున రుద్రుఁడను పేరు పెట్టితిని. ఇప్పటికిని మించినదేమియు లేదు. బుద్ధిగలవాడవై నన్ను ప్రార్థింపుము! నిన్ను రక్షింతును” అని గర్వముతో పలికెను.

అంత పరమేశ్వరుఁడు బ్రహ్మదేవుని యహంకారవాక్యమును విని కోపోద్రిక్తుడై ప్రళయముఁ జేయుమాడి యొకానొక పురుషుని భైరవాకారుని పుట్టించి దయతో నిట్లు వక్కాణించెను.

కాలభైరవా! ముందు బ్రహ్మదేవుని శిక్షింపుము! కాలమువలె ప్రకాశించుచున్నావు గాన నిన్ను కాలరాజు అని పిలుతురు గాక! విశ్వమునంతయు మోయుటకు సమర్థుడవగుదువు; పుట్టుటతోడనే భయపెట్టితివిగాన భైరవుఁడనఁబఱగుదువు; కుపితుఁడవై దుర్మార్గులను మర్దింతువు గాన అమర్దకుఁ డను పేరు నీకు చెల్లుగాక! భక్తులపాపములను భక్షింతువు గాన పాపభక్షణుఁడని ప్రసిద్ధుడ వగుదువు గాక! ముక్తిక్షేత్రములలో మిన్నయగు కాశీక్షేత్రమున కధిపతివైయుందువుగాక! కాశీక్షేత్రమున పాపముఁ జేయువారిని శిక్షించు నధికారము నీకే యుండును. కాశీ నివాసుల పుణ్యపాపకర్మలను చిత్రగుప్తుడు వ్రాసి నీకు తెలుపుగాక!





కాలభైరవుఁడు శంకరుని వరములఁబొందినవాడై తన యెడమ చేతి వ్రేలిగోటికొనతోడనే బ్రహ్మదేవుని యైదవ తలకాయఁ ద్రెంచివేసెను.

ఏ యవయము తప్పుచేయునో అట్టి యంగమునే శిక్షింపవలె నను న్యాయము ననుసరించి శివుని నిందించిన పంచమశిరము ఛేదింపఁబడెను.

విధి శిరోభంగముఁ గాంచి శ్రీహరి భీతిల్లినవాడై శతరుద్రీయ మంత్రములతో శంకరునిఁ బ్రార్థించెను. హిరణ్యగర్భుండును భయపడి రుద్రాధ్యాయముతో మహేశ్వరుని నుతించెను. తత్క్షణముననే హరిబ్రహ్మలు మేమే శ్రేష్ఠులమను గర్వమును పోగొట్టుకొని "గుణాతీతమైన పరబ్రహ్మము శివుఁడే" అను నిశ్చయజ్ఞానము గలవారైరి.

సనత్కుమారా! ఏమని చెప్పుదును. జీవునకు దేహేంద్రియాదులే నేననియు ఇట్టి నేనే గొప్పవాడననియు గర్వమున్నంతవరకు శివజ్ఞానము మరుగుపడియుండును.

శ్లో॥ త్యక్త్వాஉభిమానం పురుషో - జానాతి పరమేశ్వరమ్ ।
గర్విణం హంతి విశ్వేశో - జాతో గర్వాపహారకః ॥ ౫౮

స్త్రీ పురుషులెవరైనను దురభిమానమును విడచినచో సదాశివుని చూడఁగలుగుదురు. అట్లుగాక గర్వమును విడనాడనియెడల గర్వాపహారకుఁడుగా ప్రఖ్యాతిఁబొందిన విశ్వనాథుఁడు గర్వముఁగలవానిని తప్పక శిక్షించును.

అంత శంకరుఁడు ప్రసన్నుడై విధివిష్ణువుల ప్రపత్తిఁగాంచియు నవ్వారి నూఱడించియు కాలభైరవునితో నిట్లనియెను.

భైరావా! నీవు శ్రీహరిని పద్మజుని సత్కరించుచుండుము! బ్రహ్మదేవునికపాలమును చేతఁబూని లోకములయందు సంచరించుచు జనమునకు బ్రహ్మహత్యాపాతకమును పోగొట్టుకపాలవ్రతమును బోధించుము!

తరువాత బ్రహ్మహత్య యను కన్యను పుట్టించి "కాశీక్షేత్రమును ప్రవేశించువరకు భైరవుని వెంటాడు" మని శాసించినవాడై శంకరుఁడు నంతర్ధానముఁజెందెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ఎనిమిదవ యధ్యాయము.





# నవమాధ్యాయము

## (భైరవుని యవతారలీలను వర్ణించుట)

మహాదోషములను పరిహరించునదియు శివభక్తిని పెంపొందించునదియునగు కాలభైరవ లీలావిలాసము నింకను వర్ణించెదనని సూతుఁడు చెప్పఁదొడఁగెను.

బ్రహ్మహత్య వెంట రాగా కాలభైరవుఁడు బ్రహ్మకపాలమును ధరించి ముల్లోకముల యందు సంచరింపఁబయలుదేరి మున్ముందు వైకుంఠమున కేగుచుండగా ప్రమథగణములు ప్రార్థించుచుండిరి. ఇట్టి వైభవము గలవానినైనను బ్రహ్మహత్య విడువకుండుట – మహేశ్వరుని మహిమవలననే యని ప్రతివారును గమనింపవలసియున్నది.

సర్పకుండలుఁడు త్రినేత్రుఁడు మహాదేవాంశసంభూతుఁడు నగు భైరవునకు నారాయణుఁడు ఎదురేగి సాష్టాంగముగ నమస్కరింపగా దేవతలు దేవతాస్త్రీలును మునులును వైకుంఠవాసులందరును ప్రణమిల్లుచుండిరి మరియు శ్రీహరి యంజలిని శిరముపై ఘటించి యనేక స్తోత్రములతో కాలభైరవునిఁ బ్రార్థించి యానందపరవశతఁజేసి – పాలసముద్రము నుండి పుట్టిన లక్ష్మీదేవికి నిట్లు చెప్పఁదొడఁగెను.

లక్ష్మీ! కమలములవంటి కన్నులు గల మనము ఈ జగదీశ్వరుని చూచుచున్నందులకు ధన్యులమైతిమి.

ఈతఁడే సృష్టికర్తయై రక్షకుఁడునై ప్రాణులను శాసించు పరమేశ్వరుఁడు; మరియు నాదిమధ్యాంతములు లేనివాడై సర్వలోకశరణ్యుఁడై శాంతస్వభావుఁడగువాడు; పృథివి మొదలగు నిరువదియైదు తత్త్వములను మించిన నిరువది యారవతత్త్వంబు నీతఁడేను; సర్వభూతాంతర్యామియై భక్తుల కోర్కెల నీడేర్చువాడును, యోగులచే హృదయకమలమున వీక్షింపఁబడువాడును వేదవిదులచే నుపాసింపఁబడువాడును తన సాక్షాత్కారముచే జన్మరాహిత్యము నొనఁగూర్చువాడునగు మహేశ్వరుని కనులార గాంచుదము.

దేవతల పదవులు లభించినను శంకరదర్శనము సంభవింపదుగాన సర్వవిధ సంసార దుఃఖములను పరిహరించి సాయుజ్యము నొసగుశివచరణసేవనమునే జీవులు కోరుచుండవలెను. దేవతలమైయుండుట కన్న నశుభము మరియొకటి లేదు ఎందుకనఁగా! ఈ దేవతా శరీరములో నున్నతటి శివదర్శనము లభించినను మోక్షము చేకూరదుగదా!

పిదప నారాయణుఁడు ప్రణమిల్లి "దేవదేవా! సర్వజ్ఞుడవై విహరించువాడవు; భిక్షాటనము నెందుకు చేయుచుంటివి!" అని ప్రశ్నింపగా "బ్రహ్మశిరముఁ ద్రుంచితిని గాన నీ కపాలవ్రతము నాచరించుచుంటి" నని భైరవుఁడు వక్కాణించెను.

అంత నారాయణుఁడు తలవంచిదోసిలొగ్గియు "మహాదేవా! నీ యిష్టప్రకారము విహరించుము! కాని నీ మాయచే నన్ను ఆవరింపఁజేయకుము! ప్రతికల్పమునందు నా నాభికమలము నుండి పుట్టిన





బ్రహ్మలు కోట్లకొలది కాగా యవ్వారిని సంహరించి తత్కపాలములను ధరించు నీకు బ్రహ్మహత్య యెక్కడిది? ప్రళయకాలమున దేవాసురమానవాదుల నందరిని సంహరింతువుగదా! అప్పుడు ఎందరు బ్రాహ్మణులు చనుదురో ఎన్ని బ్రహ్మహత్యలు దాపురించునో; తత్పరిహారమునకై ఎన్ని వ్రతములఁ జేయుదువు!

శ్లో॥ కృత్వాఽపి సుమహత్ పాపం - యస్త్వాం స్మరతి మానవః ।
అధారం జగతామీశం - తస్య పాపం విలీయతే ॥ ౩౪

గొప్ప పాతకముఁజేసియు జగదాధారుఁడవు విశ్వనాథుఁడవు నగు నిను స్మరించిన యెడల మానవుఁడు పాపనిర్ముక్తుఁడగును గదా! సూర్యుని ముందు చీకటి యుండనట్లు నీ భక్తుని పాపములు పటాపంచలగుచుండును. నీ పాదాంబుజములఁ గొలుచు పుణ్యాత్మునకు బ్రహ్మహత్యాపాతకముఁగూడ నశించును. నీ నామమును ఎవని వాక్కు స్మరించునో అట్టివానికి పాప మెక్కడిది? ఇట్లు లోకములయందు సంచరించుట నీ వేడుకయే గాని మరియొండు కాదు. యోగులు గూడ దర్శింప నలవిగాని నిన్ను నేను చూచుచుంటినిగాన నీవేళ ధన్యుడనైతిని. నిన్ను గాంచువానికి స్వర్గము అపవర్గంబును తృణప్రాయము లగును" అని విన్నవించుచుండగా లక్ష్మీదేవి - కాలభైరవుని కపాలపాత్రయందు "మనోరథవతి" యను భిక్షను రత్నమణి సువర్ణములతో నిండియుండుదానిని సమర్పించెను.

అంత నా పరాత్పరుఁడు వైకుంఠమునుండి బయలుదేరుచుండగా "ఈ మహానుభావుని విడువు"మని శ్రీహరి ప్రార్థింపగా బ్రహ్మహత్య "ఈ నిమిత్తముగ నీ పరాత్పరుని సేవించి జన్మరాహిత్యము నొదవఁ జేసుకుందు"నని బదులుఁజెప్పినదై కాలభైరవుని విడువకుండెను!

"లక్ష్మీవల్లభా! నీయట్టి సత్పురుషులు అతిథులను తమ మధురవాక్యామృతములతో సంతృప్తులఁ జేయుచుందురు. నా భక్తులలో శ్రేష్ఠుడవుగాన వరము నొసఁగెదను. అడుగుము!" అని కాలభైరవుఁడు సంభాషింప శ్రీహరి సుప్రసన్నుఁడై "నీ చరణకమలములపై నాకు నెల్లకాలము భక్తియుండునట్లు వరముఁ గోరుచున్నా"నని ప్రార్థించెను.

అంత భైరవుఁడు అటులే యగుగాక! అని యనుగ్రహించి "మానవులకే గాక నమరులకును వరదుడ వగుదువు గాక!" అని యాశీర్వదించెను.

ఇట్లు కాలభైరవుఁడు లోకసంచారమును ముగించి వారాణసీ క్షేత్రమునకుఁజనఁగా బ్రహ్మహత్య- హాహాకారముఁజేయుచు పాతాళమునఁ బ్రవేశించెను. భైరవుని కరము నుండి బ్రహ్మకపాలము విడిబడెను. అచ్చోట కపాలమోచనమను తీర్థము వెలసెను. కాశీక్షేత్రమున కాలభైరవుఁడు - భక్తుల పాపములను పరిహరించుచు నివసించుచుండెను.

మార్గశీర్షకృష్ణాష్టమీతిథియందు కాలభైరవుఁడు జన్మించెను. కావున అనాడు నుపవసించి కాలభైరవ సన్నిధానమునఁ జాగరణము నొనర్చువారు పాపములఁ బోగొట్టుకొనినవారై సద్గతి నొందుదురని తెలియవలెను. ఇతర స్థలములయందు నీ వ్రతముఁజేయువారును కృతార్థులగుటయేగాక కాశీక్షేత్రమున కాలభైరవుని దర్శించినచో జన్మజన్మాంతర కృతపాపముల నన్నిటిని దూరీకరింతురు.

కాలభైరవునియందు భక్తిగలవారికి కీడుఁజేయువాడు మూఢుఁడై దుఃఖముల పాలగుటయేగాక దుర్గతి నొందును. కాశీవిశ్వనాథుని యందు భక్తియున్నను కాలభైరవునియందు భక్తిలేనివారు మిగుల కష్టపడుదురు. కాశీనివాసులు కాలభైరవుని సేవింపనిచో అట్టి వారి పాపములు శుక్లపక్షచంద్రునివలె పెరుగుచుండును.

ప్రతి చతుర్దశిని ప్రతి అష్టమిని ప్రతి మంగళవారమునను కాశీ నివాసులు కాలభైరవుని తప్పక దర్శింపవలెను. అట్లు చేయనివారి పుణ్యము కృష్ణపక్షచంద్రునివలె తరుగుచుండును.

కారాగారములో నున్నను గొప్ప ఆపదలయందు చిక్కుకొనినను భైరవుని ప్రాదుర్భావమును భిక్షాటనమును కాశీనివాసమును వినినచో అట్టి సంకటములనుండి విడిఁబడుటయే గాక జన్మసార్థకతయు చేకూరును. బ్రహ్మాహత్యా పాతకంబును తొలగును.

అని సూతమహర్షి చెప్పగా శౌనకాదులు విని సంతసించినవారైరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున తొమ్మిదవ యధ్యాయము.
ఇద్ది నలుబదినాలుగవ యవతారము (44)

# దశమాధ్యాయము

## (నృశింహస్వామి ననుగ్రహించుట)

దక్షయజ్ఞధ్వంసమునకై శంకరుఁడు వీరభద్రావతారముఁ దాల్చిన యంశము సతీఖండమున వివరింపబడినదిగాన నిచ్చోట నద్దానిని గ్రంథవిస్తరభీతిచే చెప్పకుంటినని సూతుఁడు శౌనకాదులకు సమనంతర శివావతార విలాసమును వక్కాణించుచుండెను.

శంకరుఁడు శార్దూల (శరభ) అవతారమును పొందిన సందర్భమును వినిపింతును.

శరభావతారము మండుచున్న జ్వాలలతో కూడినదై యద్భుత రూపముతో నొప్పుచు నమరుల మేలునకై సంభవించినట్టిది.

నిజముగా విచారించినచో శివుని యవతారములను "ఆకాశమున చుక్కలను వర్షధారలను నేలయందలి మట్టిపూసలను బహుకల్పజీవియైనను లెక్కింపరానట్లు" పరిగణింపనలవిగాదు. ఐనను నా జ్ఞాపకముకొలది విన్నకొలదియు పరమ ఐశ్వర్యమును సూచించు శరభావతారముఁగూర్చి వివరింతును.

జయుఁడు విజయుఁడునను వైకుంఠద్వారపాలుర నిరువురిని సనకసనందనాదులు శపించిన కారణముగా నవ్వారు కశ్యపునికి దితియందు కుమారులై హిరణ్యకశిపుఁడు హిరణ్యాక్షుఁడు ననువారై జన్మించిరి. హిరణ్యాక్షుఁడు భూమిని చాపవలె చుట్టి పాతాళమునకుఁ గొంపోయినందున నట్టి పృథివి నుద్ధరించుమని బ్రహ్మదేవునిచే ప్రార్థింపఁబడిన శ్రీహరి-వరాహరూపమున హిరణ్యాక్షుని వధించి వసుంధరను పూర్వస్థలమున నెలకొలిపెను.





ప్రాణముఁబోలిన తమ్ముని మరణమును కనుగొని హిరణ్యకశిపుఁడు మిగుల కోపముఁజెందినవాడై బ్రహ్మదేవునిఁగూర్చి పదివేలవత్సరములు తపించి దేవమానవాదులలో నెవడును తనను చంపకుండునట్లు వరముఁబడసియు శోణితనగరమున రాజ్యపరిపాలనముఁ జేయుచు ముల్లోకములను వశపఱచుకొని యుండెను.

మరియు నా యసురేంద్రుఁడు నమరులను మునులను పీడించుచు ధర్మకార్యములను సాగనీయకుండుటయే గాక బ్రాహ్మణులను బాధించుచు తన కుమారుఁడగు ప్రహ్లాదుని ద్వేషించి నారాయణునియందు నసూయగలవాడు కాగా శ్రీహరి స్తంభమునుండి నరసింహరూపముతో సంధ్యాకాలమున నుదయించి హిరణ్యకశిపుని సంహరించుటయే గాక నవ్వాని పరివారమును గూడ వధించెను. అప్పుడు దేవతలు దుందుభులను మ్రోగించిరి. కాని నృసింహుని ఘోరమైన క్రోధజ్వాల శమింపనందున ప్రహ్లాదుఁడు విస్మయముఁజెందుచుండెను. లక్ష్మీదేవియు వైకుంఠమునుండి యరుదెంచి చకితురాలగుచుండెను. దేవతలు భయపడుచుండిరి.

అట్టితతి యందరిచే ప్రేరేపింపఁబడి ప్రహ్లాదుఁడు స్వామిని సమీపించి ప్రార్థించి నందున నృసింహస్వామి ప్రహ్లాదుని చేరఁదీసి కౌగలించుకొనఁగా నా దేవుని హృదయము చల్లారినది. కాని రోసముఁజెందిన మంట చల్లారనందున బ్రహ్మేంద్రాదులు వెఱఁగందినవారై కైలాసమునకుఁజని శంకరు నిట్లు వేడుకొనిరి.

శరణాగతవత్సలా! మహాదేవా! శరణాగతుల మగు మమ్ము లోకములనున్ను కాపాడుము! నీకు మ్రొక్కులిడుచున్నాము. మున్ను మాకు దుఃఖము సంభవించినవేళ రక్షించినవాడవు; సముద్రమును తఱచినపుడు పుట్టిన కామధేను కల్పవృక్షాది రత్నముల నమరులు పరిగ్రహింపగా హాలాహలవిషముఁ ద్రాగి ప్రాణులను రక్షించియు నీలకంఠుడవైతివి. ఒకవేళ నీవే విషపానమును చేయనిచో మేమందరము విషజ్వాలలయందు భస్మమగుచుంటిమి. దుఃఖసమయమున నీ నామమును స్మరించినంతమాత్రమున ఎట్టి సంకటమైనను దూరమగును.

అందువలన నీ సమయమున నృసింహస్వామిఁదగు కోపానలజ్వాలచే బాధపడు మమ్ము రక్షించుటకు నట్టి జ్వాలను శాంతింపఁజేయుమని విన్నవించుచున్నాము.

భక్తవత్సలుఁడగు శంకరుఁడు దేవతల మొఱలాలించి సుప్రసన్నుఁడై యభయము నొసఁగియు "అమరులారా! మీ దుఃఖమును నివారింతును. నన్ను శరణము నొందినవాడు నా ప్రాణములకన్న మిన్నయగువాడు. అట్టివానికి ఎట్టి అపదయు నుండఁజాలదు" అని యాదేశింపగా సురలు మిగుల నూఱటఁజెందినవారై శంకరుని స్మరించుచు నిజనివాసములకుఁజనినవారైరి.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదియవ యధ్యాయము.

# ఏకాదశాధ్యాయము

## (శరభావతార వర్ణనము)

పరమేశ్వరుఁడు నృసింహుని కోపానలమును శాంతింపఁజేయఁదలచినవాడై వీరభద్రుని స్మరింపగా నా మహావీరుఁడు అట్టహాసముతో ప్రమథగణములు కోట్లకొలది వెంటాడుచుండ నరుదెంచెను.

అట్టితతి వీరభద్రస్వామి - ప్రళయాగ్నిజ్వాలలను వెడలఁగ్రక్కుచుండెను. ఆతని మూడు కన్నులు ప్రకాశించుచుండెను. ఆయుధములను ధరింపక జటాజూటముతో బాలచంద్రుని శిరమునఁదాల్చియుండెను. ఆతని నిశితములైన రెండుకోఱలు చంద్రమండలముఁబోలినవై కనుబొమలు ఇంద్రధనుస్సుఁదగు విభాగములతో సరిఁదూగుచుండెను. వీరభద్రస్వామి గొప్పగా హుంకరించుచు దిగంతములను ధ్వనింపఁజేయుచుండెను. నీలమేఘముఁబోలిన వన్నెగలవాడై పొడుగాటి మీసములతో భయముగొలుపుచు త్రిశూలముఁద్రిప్పుచుండెను.

ఇట్టి భద్రకాళీపతి - "స్వామీ! నన్ను స్మరించిన కారణమును సెలవీయుడు" అని విన్నవింపగా మహాదేవుడు వీక్షించి "వీరభద్రా! దేవతలకు నకాలభయము నృసింహ కోపాగ్ని జ్వాలవలన సంభవించినది. అద్దానిని శమింపజేయుము! మొదట శాంతముగా మాటలాడినను విననియెడల (తరువాత) నుగ్రభావమును చూపుము!

ఆత్మశక్తిచే సూక్ష్మశరీరమును విడదీసి స్థూలశరీరమును యుద్ధమున ఛేదించి నృసింహుని ముఖమును తోలును తీసుకొని రమ్ము!" అని యాజ్ఞాపించెను.

అంత నా వీరభద్రుడు సౌమ్యవేషధారియై నృసింహస్వామిని సమీపించి తండ్రి కొమరునివలె వాత్సల్యమున నిట్లు వచించెను.

మాధవా! లోకకల్యాణమునకై నృసింహరూపమున నవతరించితివి. పరమేశ్వరుఁడు నిన్ను జగద్రక్షణమునకై నియోగించినవాడు.

పూర్వము జలమయ ప్రదేశమున మత్స్యరూపుడవై సంచరించుచు లోకపై జీవులను మోసియుంటివి. కూర్మరూపమున ప్రపంచమును భరించుచున్నావు. వరాహావతారమున వసుంధరను లేవదీసితివి. ఈ నరసింహరూపముతో హిరణ్యకశిపుని వధించితివి. వామనావతారమున త్రివిక్రముడవై బలిచక్రవర్తి నణగద్రొక్కువాడవు;

ఎప్పుడెప్పుఁడు ప్రజలకు దుఃఖము వాటిల్లుచుండునో అప్పుడప్పుడు అవతరించినవాడవై లోకక్షేమము నొనఁగూర్చుచుందువు; శివధ్యాననిష్ఠాగరిష్ఠులలో నీతో సమానుఁడుగాని నిన్ను మించినవాడు గాని లేరని చెప్పవచ్చును. నీవే వేదములను వేదోక్త ధర్మములను సన్మార్గమున నిలుపువాడవు; ఈ నీ యవతార ప్రయోజనము ముగిసినది కావున భయంకరరూపమును చాలించి నా యెదుట ప్రశాంతుడవు కమ్ము!





ఇట్టి వీరభద్రవాక్యము నాకర్ణించి నృసింహస్వామి కోఱలతో భయపెట్టుచు కఠినముగా నిట్లు పలికెను.

వీరభద్రా! వచ్చినచోటునకు పదిలముగా వెళ్లుము! ఇప్పుడే చరాచరము నంతయు సంహరింతును. జగమును సంహరించువాని నెవరును శిక్షింపఁజాలరు. నా శాసనమే సర్వత్ర చెల్లును. నన్ను శాసించువాడెవఁడును లేడు. నా యనుగ్రహమువలననే జగమంతయు భద్రముగా నుండును. సర్వవిధ శక్తులను నేనే ప్రవర్తింపఁజేయుచు నివారించుచుందును.

అభివృద్ధి నొందునదియు సంపన్నంబు అధికారయుతము నగు ప్రతి వస్తువు నా ప్రభావముతో కూడియుండునని గుర్తెరుగుము! నన్నే పరమాత్మగా బుధులు భావింతురు. బ్రహ్మేంద్రాదులందరును నా వలననే పుట్టుచున్నవారు. సర్వాధికుఁడనై స్వతంత్రుడనై సర్వేశ్వరుఁడనై విహరించువాడను. ఇద్ది నా లక్షణము; ఇఁక నెట్టి యంశమును వినఁగోరుదువు? కావున నన్ను శరణ్యునిగా భావించి నిశ్చింతగా వెళ్లుము! దేవాసురమానవాది ప్రపంచమంతయు నా యధీనంబని తెలియుము!

లోకవినాశమునకు కారణంబగు కాలమును నేనే; ప్రజలను సంహరింప నిట కఱుదెంచినవాడను. మృత్యువునకు మృత్యువునై యుండువాడను. నా కటాక్షమువలననే ఈ దేవతలు జీవించుచున్నవారు.

ఇవ్విధము నృసింహస్వామి గర్వముతో సంభాషింప వీరభద్రస్వామి పరిహసించుచు నించుక నలుకఁ జెంది పెదవులఁగదల్చుచు "విశ్వనాథుఁడు సర్వసంహర్త యని తెలియకుంటివా? తానే శ్రేష్ఠుడ నను వాదము నీకు శ్రేయస్కరము కాదు. నీ యవతారములన్నియు కథాశేషములైనవి. అనఁగా? ప్రతి యవతారరూపమునఁగల యుద్రేకము నణచిన శంకరుని మఱచుచున్నావని భావము. ఇట్టి తామసదశను పొందుటకు ఎట్టి శివాపచారముఁజేసితివి? సంహార దక్షుండగు శివుని యాహారములో నీవును కలియువాడవు గాదా?

శ్లో॥ ప్రకృతి స్త్వం పుమాన్ రుద్ర - స్త్వయి వీర్యం సమాహితమ్ ।
త్వ న్నాభిపంకజా జ్జాతః - పంచవక్త్రః పితామహః ॥ ౪౦

ప్రకృతివి నీవు; పురుషుఁడు రుద్రుఁడు; అట్టి రుద్రుడు నీ యందు తన సంకల్పమును వీర్యమును నెలకొలిపినందున నీ నాభికమలమునుండి ఐదుముఖముల బ్రహ్మదేవుడు జన్మించెను. అట్టి బ్రహ్మయే ముల్లోకములను పుట్టించుటకు లలాటము నుండి యావిర్భవించుమని ప్రార్థింపగా శంకరుడు మరల నావిర్భవించెను.

అట్టి [illegible]భువే నిన[illegible] మంచితనమున విననిచో శిక్షింప నన్ను పంపెను. పరమేశ్వరుని శక్తిదగు నంశముఁజెందియుం[illegible]చేసి యీ రాక్షసేంద్రుని సంహరించి యహంకారముఁజెందియు ప్రగల్భములఁ బలుకుచుంటివి. ఉత్తములకునుపకారముఁజేయునెడ సుఖప్రదమగును. దుర్జనులకునొనర్చిన యుపకారము దుఃఖముగా పరిణమించును. మహేశ్వరుని పుట్టినవానిగా భావించు నీవు - అవివేకము గలవాడవైతివని చెప్పవచ్చును. సృష్టిస్థితిలయములు ఈశ్వరాధీనములు; పరతంత్రుడవైనను స్వతంత్రుడనని భావించు నీ యజ్ఞానము నేమనవలెను?





శంకరుడు ప్రేరేపించినట్లు అవతారముల నెత్తుచు కులాలచక్రమునందువలె సంసారమున పరిభ్రమించుచు శివపరాధీనుడ వగువాడవు; కూర్మరూపమును ఛేదించి యద్దాని కపాలమును హరుడు హారమునఁజేర్చుకొనెను. దక్షయజ్ఞమున యజ్ఞరూపముగల నీ శిరమును ఖండించితిని గదా! నీ కుమారుడగు బ్రహ్మదేవుని పంచమ శిరమును కాలభైరవుడు త్రుంపగా అట్టి తలకాయను మరల నిప్పటికిని నెలకొలుపకుంటివి. మున్ను దధీచిమహర్షి రణరంగమున దేవతాగణములతో నేతెంచిన నిన్ను ఓడించిన యంశమును మఱచితివా? పగతుఱను చెండాడు సుదర్శనచక్రము నీశ్వరుడు ప్రసాదించిన సందర్భమును తలచుకొనుము! పరమేశ్వరుఁడు ప్రళయ కాలమున లోకములను నిగ్రహించి జలమయములఁజేయగా నట్టి యుదకములయందు నిద్రాపరవశుడవై పరుండియుంటివి. అట్టి నీవు సాత్త్వికుడ వెట్లగుదువు? నీవు మొదలుకొని గడ్డిపఱక వరకు గల ప్రపంచమంతయు శంకరుని శక్తిచే నావిర్భవించినది కావున నీవును నాతని యనుగ్రహముచే శక్తిమంతుడవైతివి. ఆ పరాత్పరుని తేజస్సు నర్థముఁజేసుకొనజాలనివాడవై మోహితుడ వగుచున్నావు; సదాశివుని స్వరూపమును సామర్థ్యమును సామాన్యులు కనుగొనఁజాలరు. స్థూలబుద్ధి లేనివారు మాత్రము శివునిఁజూడజాలుదురు. "తద్విష్ణోఃపరమంపదమ్" అట్టి శివస్వరూపము విష్ణువుకన్న నుత్కృష్టమగునది'' యని వేదాంతములు చాటుచున్నవి. పరమేశ్వరుడు - భూమ్యాకాశములయందును ఇంద్రాగ్ని యను వరుణ సూర్య చంద్రాది శ్రేష్ఠహృదయములలోను నివసించువాడు; నీవు కాలమగుదువు; కాలకాలుడు మహేశ్వరుడు; ఉగ్రుడైన శివుని కళఁ జెందియుండువాడవు గాన మృత్యువునకు మృత్యువైతివి;

స్థిరుఁడు అక్షరుఁడు విశ్వరక్షకుఁడు వీరుఁడు, ప్రభువు, సంహర్తయు, భయంకరుఁడు, జగమునంతయు శాసించువాడును పరమేశ్వరుఁడే కాని నీవు బ్రహ్మయు కాజాలరు. ఇది యంతయు బాగుగా విచారించుకొని నీ యుగ్రరూపము నుపసంహరింపుము! లేనిచో వృక్షముపై పిడుగువలె మహాభైరవుఁడగు పరమేశ్వరుని క్రోధము మృత్యువుగా నీయందు ప్రసరించును" అని యుత్తరించి యెట్టి భయము లేనివాడై తన ప్రసంగమును విరమించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదునొకండవ యధ్యాయము.





# ద్వాదశాధ్యాయము

## (మరియు శరభావతారమును వర్ణించుట)

తరువాతి వృత్తాంతమును దయచేసి వివరింపుమని యడుగగా సూతుఁడు శౌనకాదులకు చెప్పఁ దొడఁగెను.

నృసింహస్వామి క్రోధవశమున పలికిన మాటల నాలకించి వీరభద్రస్వామి నృసింహస్వామిని పట్టుకొనఁదలచినవాడై యద్భుతరూపముఁదాల్చెను.

అయ్యది మహాభయంకరమై ఆకాశమును వ్యాపించుచు శివతేజోమయముగా నుండుటయే గాక హిరణ్మయంబునై యుండెను. మఱియు నద్ది సూర్యచంద్రాగ్ని తేజములను మించిన వెలుతురు గలదై మెరుపుఁబోలినదై యుండ నట్టి వీరభద్రుని తేజోరూపమున తేజస్సులన్నియు లీన మగుచుండెను.

అమరులందరు జయశబ్దములతో మంగళధ్వనులఁ జేయుచుండ సంహారరుద్రునిఁ బోలిన పరమేశ్వరుఁడు – వేయి చేతులుఁగలవాడై జడదారియై చంద్రరేఖఁదాల్చియు రెక్కలతో పొడవుముక్కుతోడను పెద్ద కోఱలతోడను వజ్రములఁబోలిన గోరులతోడను మెడపైన నలుపు తోడను నాలుగు కాళ్లను గలిగి ప్రళయకాలమేఘములవలె నుఱుముచు కృత్యాశక్తిఁదగు మంటలవలె మండుచున్న మూడు కన్నులు గలవాడై పెదవిఁగొఱుకుచు హుంకారముఁజేయుచు నుగ్రరూపముతో గోచరించెను.

శ్రీహరి యట్టి శరభరూపమును చూచుటతోడనే తనబలమును సామర్థ్యమును పోగొట్టుకొని సూర్యునిక్రింద మిడుఁగుఱు పురువువలె శరభముముందు తిరుగుచుండగా వీరభద్రుఁడు నృసింహుని కరములఁ బట్టుకొని రెక్కలతో నాభిని పాదములను కొట్టుచు తోకతో బంధించెను.

ఱొమ్ముపై కొట్టుచు దేవతలు మహర్షులును వెంటరాగా "డేగ పామునువలె" నృసింహుని లేపుకొని పడవేయుచు రెక్కలచే దెబ్బలాడుచుండగా నట్టి వీరభద్రస్వామిలో ఆదిమధ్యాంతములు లేని పరశివుఁడు ప్రవేశించినందున నట్టితఱి బ్రహ్మాదిదేవతలందరును ప్రణమిల్లుచు నుతించుచుండిరి.

శ్లో॥ హరిం హరంతం వృషభం - వివేశానంత ఈశ్వరః ॥ ౮౬

అనుయాంతం సురాః సర్వే - నమోవాక్యేన తుష్టువుః ।

ప్రణేముః సాదరం ప్రీత్యా - బ్రహ్మాద్యాశ్చ మునీశ్వరాః ॥ ౮౭

ఇఁట వృషభుడనఁగా? దేవతాశ్రేష్ఠుఁడని యర్థము. అట్టి వీరభద్రుని పరమేశ్వరుఁడావహించె నని భావము. అథవా వృషభశబ్దమునకు శరభమృగమని యర్థముఁజేయవచ్చును.

అవ్విధము శరభావతారముచే గొంపోబడుచుండగా శ్రీహరి దీనుఁడై యంజలిఁ ఘటించియు మనోహరపదములు గల స్తోత్రములతో నూటయెనిమిది శివనామములతోడను ప్రార్థించుచు "ఎప్పుడెప్పుఁడు నాబుద్ధి గర్వముతో కూడినో అప్పుడప్పుడు నన్ను శిక్షించు" మని వేడుకొనెను.

అట్టి విష్ణుమూర్తి మొండెమును తలకాయను విడదీసి యున్న శరభేశ్వరుని దిగువ విధముగా నమరులు కీర్తించుచుండిరి.





మహేశ్వరా! హరిబ్రహ్మదేవేంద్రాదులు మహర్షులు దైత్యులు తదితర ప్రాణికోటియు నీ వలననే పుట్టుచు జీవించుచు మడియుచుందురు.

శ్లో॥ యతో హరసి సంసారం - హర ఇత్యుచ్యతే బుధైః ।
నిగృహీతో హరి ర్యస్మా - ద్ధర ఇత్యుచ్యతే బుధైః ॥ ౨౯

సంసారమును హరించువాడవుగావునను శ్రీహరిని శిక్షించుటఁజేశియు హరుఁడవని బుధులు వక్కాణించుచున్నవారు. ఎనిమది విధములుగా స్వరూపములఁదాల్చి ప్రపంచమును మోయుచుండుటయేగాక అమృతప్రదానము మున్నగు వరములతో మమ్ము కాపాడుచున్నావు!

పురుషోత్తముడవు; సర్వేశ్వరుడవు; నిర్వికారుఁడవు; దీనబాంధవుఁడవు; కరుణాసముద్రుఁడవు; అద్భుతలీలావిలాసచతురుడవు; సచ్చిదానందమయపరమాత్మవు; ముముక్షుప్రాప్యుఁడవును నీవే; ఇట్టి ప్రార్థనమును శివుఁడువిని ప్రసన్నుఁడై "జలము జలములో వలెను పాలు పాలయందు వలెను నా రెండవరూపమగు శ్రీహరి నాలో లీనమయ్యెను. కావున నీ మహనీయుని నా భక్తులందరు నారాధింపవలెను. ఈతఁడు నా భక్తులలో శ్రేష్ఠుఁడై నా భక్తులకుఁ గూడ వరముల నొసఁగువాడు" అని యనుగ్రహించి యమరులు చూచుచుండగా మాయమయ్యెను.

అంత వీరభద్రుఁడు నృసింహశరీరముఁదగు చర్మఁగైకొని కైలాసమునకు వెళ్ళి సమర్పింపగా నద్దానిని శంకరుఁడు కట్టుకొని యాతని ముఖమును తన ముండమాలికలో నాయకమణిగా చేర్చుకొనియెను.

అట్టితతి నమరులు నీ వృత్తాంతమును తలచుకొనుచు విస్మితులునై నిజ నివాసములకుఁజనిరి.

వేదవిహితంబగు నీ చరితమును చదువువారు వినువారును కామితములఁబడయుటే గాక చిరాయురారోగ్యబలములను పొందుదురు.

విఘ్నములు వ్యాధులు దుఃఖములు అపమృత్యువును శమించుటయే గాక శత్రువులు నశింతురు.

శంకరుని యందు భక్తిగల సత్పురుషులకు శరభావతారము బఠింపఁదగినదై శివభక్తులచేతనే పఠింపఁదగియున్నది. నవవిధభక్తిభేదములను పెంపొందించునదై చిత్తశుద్ధి నొదవఁజేయును.

సమస్త శివోత్సవములయందు చతుర్దశిని అష్టమిని శివప్రతిష్ఠాకాలమునను చోరవ్యాఘ్రభయమున రాజపీడనమునందును భూకంపము మున్నగు నుత్పాతములయందును అతివృష్టి అనావృష్టులయందును శివభక్తుఁడగు పండితుఁడు నియమబద్ధుఁడై చదివినయెడల లోకకల్యాణము ఆత్మశ్రేయస్సు నొసఁగూరును.

నిష్కామబుద్ధితో పఠించువారు శివానుగ్రహపాత్రులై కైలాసమున కొంతకాలము శివగణరూపమున నివసించి పిదప శివసాయుజ్యము నొందుదురు గాదే!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున పంద్రెండ్రవ యధ్యాయము.

ఇద్ది 45వ యవతారము.





# త్రయోదశాధ్యాయము

## (గృహపతి యవతారమును వర్ణించుట)

శంకరుఁడు విశ్వానరమహర్షిగృహమున నవతరించి గృహపతి యనఁబఱఁగుచు నగ్నిలోకమునకు ప్రభువైన వృత్తాంతమును వర్ణించెదను.

నర్మదానదీ తీరమున ధర్మపుర మను పట్టణమున విశ్వానరుఁడను పుణ్యాత్ముఁడు నివసించుచుండెను. అతఁడు బ్రహ్మచర్యమును చక్కగా నాచరించుచు వేదములను పఠించినవాడై సదాచారసంపన్నుడుగ నుండెను. మరియు శైవమతసంప్రదాయమును బాగుగా గుర్తెరిగి లోకాచారములను పాటించుచుండెను.

ఇట్లుండ నొక్కనాడు గృహస్థాశ్రమమునఁగల గుణములను పరిశీలించి శాండిల్య గోత్రుఁడగు విశ్వానరుఁడు సద్వంశమున జన్మించిన నొకకన్యకను వివాహవిధిని పరిగ్రహించెను.

అగ్నిహోత్ర పరాయణుఁడై పంచయజ్ఞములను చేయుచు గృహస్థ ధర్మమును నిర్వహించుచుండగా నాతని భార్యయగు శుచిష్మతీదేవి యిట్లు ప్రార్థించెను.

నాథా! స్త్రీలకు వలయు సుఖముల నన్నిటిని నీ యనుగ్రహమున పొందితిని కాని యొక్క మనోరథము సిద్ధింపలేదు నీ వరముఁబడయు యోగ్యత నాకు కలదేని మహేశ్వరునితో సమానుఁడగు పుత్రుని ప్రసాదింపుము!

అంత విశ్వానరుఁడు కొంత తడవు మనంబున దుర్లభంబగు వస్తువు నీమె కోరుచున్నది. శంకరుఁడే నీమె ముఖమున వాగ్రూపముగా ప్రవేశించి యిట్లు పలికించె నని నిశ్చయించుకొనినవాడై ఏకపత్నీవ్రతస్థుఁడగుటచే రెండవ భార్యను సంతానము కొఱకు చేపట్ట నొల్లనివాడై "తరుణీ! సామాన్యులకు నలవిగాని కామితముఁగోరితివి. ఐనను మహేశ్వరు నారాధించి నీ కోరికను నెరవేర్తును" అని భార్యకు నచ్చఁజెప్పియు తపంబునకై విశ్వేశ్వరుఁడధిష్ఠించు కాశీక్షేత్రమునకుఁజని యచ్చోట మణికర్ణిక నవలోకించియు జన్మశతంబులఁదెచ్చి పెట్టుకొనిన తాపత్రయమును పోగొట్టుకొనెను.

విశ్వానరుడు వారణసియందు విశ్వేశ్వరుఁడు మున్నగు శివలింగములను దర్శించుటయేగాక మణికర్ణిక మున్నగు కుండలములయందు స్నానమాడియు వినాయకులను అన్నపూర్ణాదేవిని నమస్కరించి కాలభైరవుని పూజించియు దండపాణి మొదలగు గణనాయకులఁబ్రార్థించి ఆదికేశవుని నుతించియు లోలార్కుఁడు మున్నగువారికి ప్రణతులనుసమర్పించి పిండప్రదానము నొనర్చియు సహస్రభోజనము మొదలగు విధానములతో బ్రాహ్మణులను తాపసులను సంతృప్తిపఱచి మహావైభవముగ శివలింగములనన్నిటి నారాధించియు పుత్రకామనతో చేయఁబడు తపంబు కొనసాగించునదియు శీఘ్ర ఫలప్రదంబునగు లింగమెద్దియని యనేకపర్యాయములు విచారించియు "వీరేశ్వరలింగము సిద్ధలింగమనఁబఱఁగుచు వేలకొలది భక్తులకు కామితములను ప్రసాదించునది" యని నిశ్చయించుకొనెను.

శ్లో॥ వీరేశ్వర మహాలింగ - మబ్ద మభ్యర్చ్య భక్తితః ।
అపు ర్మనోరథం సర్వం - పుత్రాదిక మనేకశః ॥

పలువురు భక్తులు వీరేశ్వరలింగమును కాశీక్షేత్రమున నొక్కవత్సరము పూజించి సత్పుత్రుడు మొదలగు కోరికల నన్నిటిని పొందినవారు.

గాన నేనును ప్రతిదినము ప్రాతర్మధ్యాహ్నసాయంకాలములయందు వీరేశ్వరుని సేవించి నా మనోరథముఁబడయగలనని తపంబునకు సంసిద్ధుడై చంద్రకుండమునందు గ్రుంకులిడి నియమములతో శివారాధనమును ప్రారంభించెను.

విశ్వానరమహర్షి మొదటి నెల నేకభుక్తమును రెండవనెల నక్తభోజనమును మూడవ నెల నయాచిత భోజనమును నాలుగవనెల నుపవాసము నవలంబించెను.

ఐదవ నెల పాలుమాత్రముఁద్రాగుచు ఆరవ నెల శాకములను ఫలములను పరిగ్రహించుచు ఏడవ నెల పిడికెడు నువ్వులఁదినుచు ఎనిమిదవ నెల నుదకము మాత్రము త్రాగుచుండెను.

తొమ్మిదవ నెల పంచగవ్యములను తీసుకొనుచు పదియవ నెల చాంద్రాయణ వ్రతము నవలంబించియు పదునొకండవ నెల దర్భకొసపైని నీటిచుక్క మాత్రమనుభవించుచు పండెండ్రవ నెల నూపిరి పీల్చుచుండెను.

ఇట్లు వీరేశ్వరుని త్రికాలములయందు నిత్యము పూజించి పదిమూడవ నెల మొదటి దినమున నుదయము గంగాస్నానముఁజేసి శివుని సమీపించునంతలో వీరేశ్వరలింగ మధ్యమున నెనిమిది వత్సరముల బాలుఁడు కనుపట్టుచుండెను.

ఆ కుఱ్ఱవాడు విభూతిభూషణుఁడై విశాలనేత్రములతోడను ఎఱ్ఱని పెదవులతోడను ఇంపైన జడలకొప్పుతోడను చిరునగవుతోడను రాణించుచు వేదమంత్రములను చదువుచుండెను.

అట్టి యనుపమాన లావణ్య సీమయగు మనోహరమూర్తిని చూచుట తోడనే విశ్వానరుఁడు హృదయములో నుండి పెకలించుకొని బిగ్గఱగా "నమోఽస్తు" అని యఱచినవాడై దిగువ శ్లోకములతో పరమేశ్వరుని నుతించెను.

శ్లో॥ ఏకం బ్రహ్మైవాద్వితీయం సమస్తం
సత్యం సత్యం నేహ నానాఽస్తి కించిత్ ।
ఏకో రుద్రో న ద్వితీయోఽవతస్థే-
తస్మా దేకం త్వాం ప్రపద్యే మహేశమ్ ॥ ౪౯

సమస్త ప్రపంచము బ్రహ్మాత్మకంబేను. బ్రహ్మమును నిరాకరించి రెండవ వస్తువు కలదని చెప్పుటకు వీలులేదు. అట్టి బ్రహ్మమునకు రుద్రుఁడను నిజరూపము కలదు గాన రుద్రునితో సమానుఁడైన రెండవవాడు లేడు. ఇద్ది ముమ్మాటికి నిజము. అందువలన నిన్ను మహేశ్వరు నొక్కనినే ఆశ్రయించుచున్నాను.

శ్లో॥ తోయే శైత్యం దాహకత్వంచ వహ్నౌ -
తాపో భానౌ శీతభానౌ ప్రసాదః ।
పుష్పే గంధో దుగ్ధమధ్యేఽపి సర్పిః -
యత్త చ్ఛంభో త్వం తతస్త్వాం ప్రపద్యే॥ ౫౦





నీటిలో చలువ, నిప్పునందు కాల్చుటయు, సూర్యునియందు వేడిమి, చంద్రునిలో సౌమ్యత, పుష్పమునఁ బరిమళము, పాలలో నెయ్యియు నీవై యున్నావుగాన సర్వాంతర్యామి వగు నిన్ను వేడుచున్నాను.

శ్లో॥ శబ్దం గృహ్ణాస్య శ్రవా స్త్వంహి జిఘ్ర
స్య ఘ్రాణస్త్వం వ్యంఘ్రి రాయాసి దూరాత్ ।
వ్యక్షః పశ్యే స్త్వం రసజ్ఞోఽ ప్యజిహ్వః -
కస్త్వాం సమ్యక్ వేత్త్యత స్త్వాం ప్రపద్యే ॥ ౪౧

చెవులు లేనివాడవై విందువు; ముక్కులేకున్నను వాసనఁజూచువాడవు; పాదములు లేకున్నను దూరమునుండి వచ్చువాడవు; కన్నులులేకున్నను చూడగలుఁగుదువు; నాలుక లేకున్నను రుచిని కనిపెట్టుదువు; అప్రాకృత దివ్యరూపము గల వాడవో రూపము లేనివాడవో ఎవరును నిన్ను బాగుగా గుర్తెరుగఁజాలరు. ఐనను నిన్నే శరణ్యునిగా భావించుచున్నాను.

శ్లో॥ కర్తా హర్తా త్వం హి సర్వస్య శంభో !
నానారూపేష్వేకరూపో ప్యరూపః ।
యద్వత్ ప్రత్యక్ ధర్మ ఏకోప్యనేక -
స్తస్మా న్నాన్యం త్వాం వినేశం ప్రపద్యే ॥ ౪౨

ప్రపంచము నంతయు పుట్టించు వాడవు; గిట్టించువాడవు నీవేను; అనేక రూపములలో ఏకరూపమున దాగియున్నావు. ఐనను రూపములేకుండ నుండఁగలుగుదువు. ధర్మమొక్కటే యైనను ఇహపర భేదమున ననేకమై యుండును. కావున సర్వాధారుఁడవగు నిన్నుదక్క నితరదేవు నాశ్రయింపఁ జాలను.

శ్లో॥ రజ్జౌ సర్పః శుక్తికాయాంచ రౌప్యం
నైరఃపూర స్తన్మృగాఖ్యే మరీచౌ ।
యద్వత్తద్వత్ విష్వ గేవప్రపంచో -
యస్మిన్ జ్ఞాతే తం ప్రపద్యే మహేశమ్ ॥ ౪౩

త్రాడునందుసర్పము, ముత్తెపుచిప్పయందు వెండి, ఎండమావులపై జలప్రవాహము, భాసించునటుల నీవులేని జగంబు శూన్యప్రాయమగును. ఎప్పుడు నీవు సాక్షాత్కరింతువో అప్పుడు ప్రపంచమంతయు నీ రూపముగా గానంబడును. కావున నంతయు నీ విభాగమే యగునని భావించి నిన్నే శరణము నొందుచున్నాను.

ఇఁట రజ్జు సర్పాదిదృష్టాంతములు జగన్మిథ్యాత్మమును సాధించుటకు చూపఁబడలేదు. ప్రపంచమే కలదు. గాని పరమేశ్వరుఁడు లేడని వాదించు నాస్తికులకు గుణపాఠముగా నీ దృష్టాంతములతో ప్రపంచము రాగద్వేషజనకంబగునని యుపదేశింపఁబడినది.





శ్లో॥ నో వేద త్వా మీశ సాక్షాద్ధి వేదో
నో వా విష్ణు ర్నో విధాతాఽఖిలస్య ।
నో యోగీంద్రా నేంద్రముఖ్యాశ్చ దేవా
భక్తో వేద త్వా మత స్త్వాం ప్రపద్యే ॥ ౪౯

వేదము నీ నిట్టూర్పుగా బయలుపడినదైనను నిన్ను ప్రత్యక్షముగా చూడజాలదు. వేదముల యాధారముగా సృష్టిఁజేయు బ్రహ్మదేవుని నాభికమలములనుండి పుట్టించిన నారాయణుఁడును నిన్ను పూర్తిగా తెలుసుకొనఁజాలడు. చరాచరమును పుట్టించు శక్తి గలవాడైనను బ్రహ్మదేవుఁడు నిన్ను దర్శింపఁ జాలడు. యోగులలో నగ్రగణ్యులైన మహానుభావులును ఇంద్రాదిదేవతలు నిన్ను సమీక్షింపఁజాలరు. ప్రణవఘటిత శివపంచాక్షరితో నుపాసించు భక్తుడు మాత్రము నిన్ను సాక్షాత్కరించుకొనఁజాలును. అందువలన నేనును భక్తుడనై నీదరిఁజేరితిని.

శ్లో॥ నో తే గోత్రం నో సజన్మాఽపి నాశో
నో వా రూపం నైవ శీలం న దేశః ॥
ఇత్థం భూతోఽపీశ్వర స్త్వం త్రిలోక్యాః
సర్వాన్ కామ్యాన్ పూరయే స్త్వంభజే త్వామ్ ॥ ౫౦

నీకన్న ముందున్నవాడు లేడు గాన నీకు గోత్రములేదు. ప్రళయకాలమున నీ వొంటరిగా నుందువుగాన నీతో సమానముగా నుండువాడునులేడు. అనేక రూపములు కలిగియుందువు గాన నీకు ప్రత్యేకరూప మొక్కటే యని చెప్పరాదు. విధి నిషేధముల నతిక్రమించు శక్తి గలవాడవుగాన శీలము లేదు. సర్వ వ్యాపకుడవు గాన నొక్కచోటనే యున్నావని నిరూపింపరాదు. ఇట్టివాడవైనను ముల్లోకముల నేలికవై భక్తుల మనోఽభీష్టములను నెరవేర్చుచుందువు కావున నిన్నారాధించుచున్నాను.

శ్లో॥ త్వత్తః సర్వం త్వం హి సర్వం స్మరారే -
త్వం గౌరీశ స్త్వంచ నగ్నోఽ తిశాంతః ।
త్వం వై వృద్ధ స్త్వం యువా త్వంచ బాల -
స్తత్త్వం యత్కిం నాన్యత స్త్వాం నతోఽహమ్ ॥ ౫౧

చరాచరమంతయు నీవలననే యావిర్భవించుచున్నది. జగము నీ స్థూలరూపమనియే భావింతును. పార్వతీపతివి నీవేను; దిసమొలనుండువాడవైన నెట్టివికారము లేక శాంతుడవై యుందువు; ముదుసలివాడవు యువకుఁడవు పిల్లవాడవు నీవేను. నీవుదక్క నితర వస్తువెట్లుండునో ఎరుగను గాన నీకు మ్రొక్కులిడుచున్నాను.

ఇవ్విధము విశ్వానరముని శంకరుని ప్రార్థించి సాష్టాంగము నిఁడునంతలో వృద్ధులందరికన్న వృద్ధుండగు నా బాలుడు మిగుల సంతసించి యిట్లు నుడివెను.

విశ్వానరా! నీ తపంబు మెచ్చి ప్రసన్నుడనైతిని. వరము నడుగుము! అంత నా మహర్షి లేచి నిలువఁబడి దోసిలొగ్గియు "మహేశ్వరా! జీవులందరి హృదయములలో నుండు నీకు నా హృద్గతము





తెలియకుండునా? నాచేత నడిగింతువా? నీ యిష్ట ప్రకారమనుగ్రహింపు"మని విన్నవించెను. తరువాత బాలుఁడు మందస్మితవదనారవిందుడై "ఋషీంద్రా! నీకోరిక సిద్ధించును. నీవలన నీ భార్యయగు శుచిష్మతియందు కుమారుడనై జన్మించి గృహపతియను పేరుతో పెంపొందగలను. నీవు రచించిన స్తోత్రము అభిలాషాష్టక మనఁబడును. శివసన్నిధానమున నొక్కవత్సరము ప్రతిదినము మూడువేళలు పఠించుటవలన నభీష్టము సిద్ధించును. మరియు నీస్తోత్రము పుత్రపౌత్రులను ధనము నిచ్చునదై అరిష్టములను శాంతింపఁజేయునదియేగాక సంకటములను నివారించును. స్వర్గమును అపవర్గమును ప్రసాదించును. స్తోత్రములన్నిటితో సమానంబగునదీ స్తోత్రము; ఉదయమున లేచి స్నానమాడియు శివలింగమును పూజించి యొక్క సంవత్సరమువరకు ప్రతిదినము తప్పక పఠించినచో పుత్రులులేనివాడు పుత్రవంతుఁడగును. ఈ యభిలాషాష్టకమును ఎవరికంటె వారికి చెప్పఁగూడదు. రహస్యంబగు నీ స్తుతి గొడ్రాలికి గూడ కొమరునొసగును. స్త్రీలుగాని పురుషులుగాని నియమముతో శివలింగసన్నిధానమున నిద్దానిని చదివినయెడల సత్పుత్రుని త్వరలో ప్రసాదించును. ఇందెంతమాత్రము సంశయము లేదు.

ఇవ్విధము సత్పురుషధ్యేయుండగు శంకరుఁడు బాలరూపుడై వక్కాణించి వీరేశ్వరలింగమున సంతర్ధానముఁజెందగా విశ్వానరమహర్షి సంతసించినవాడై స్వగృహమునకుఁజనినవాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున పదిమూడవ యధ్యాయము.

## చతుర్దశాధ్యాయము

### (శంకరుఁడు గృహపతిగా నవతరిరంచుట)

విశ్వానరుఁడు తన యింటి కేతెంచి జరిగిన వృత్తాంతము నంతయు భార్యకెరిగింపగా నామె సంతసించి తన యదృష్టమును మెచ్చుకొనుచు పుత్రప్రాప్తికై నిరీక్షించుచుండెను.

కొంతకాలమునకు విశ్వానరపత్ని గర్భవతి కాగా విహిత కాలమున గర్భమునకు పురుషత్వము పెంపొందుటకై పుంసవనసంస్కారమును చేయించి యెనిమిదవనెల గర్భరూపము సమృద్ధమగుటకు సీమంతమును గావింపఁజేసియు సుఖప్రసవమును విశ్వానరుఁడు నిరీక్షించుచుండెను.

శ్లో॥ **అథాతః శుభతారాసు - తారాధిపవరాననః ।**
**కేంద్రే గురౌ శుభేలగ్నే - సుగ్రహేషు యుగేషుచ ॥** 6
**అరిష్ట దీప నిర్వాణః - సర్వారిష్టవినాశకృత్ ।**
**తనయో నామ తస్యాంతు - శుచిష్మత్యాం బభూవ హ ॥** 7

సీమంతము తరువాత తొమ్మిదవ మాసమున శుభనక్షత్రగ్రహములుండు శుభముహూర్తమున బృహస్పతి కేంద్రస్థానమునను శుభగ్రహములు ఇరువురు ఇరువురుగా శుభరాసులయందు నుండగా శుచిష్మతీదేవియందు చంద్రునిబోలు ముఖముగల కుమారుడు జన్మించెను.





ముల్లోకములయందలి ప్రాణులకు సుఖము నొదవఁజేయు మహేశ్వరుఁడే విశ్వానర కుమారుఁడుగా నవతరించినపుడు మేఘములు సుగంధవాయువుతో కూడినవై దిగ్ధ్వధూముఖములకు వస్త్రములఁ బోలినవై దివ్యపుష్పములను కురిపించినవి. మరియు నదులన్నియు సత్పురుషుల మనంబులును నిర్మలములగుచుండినవి. దేవతలు దుందుభులను మ్రోగించిరి. దిశలన్నియు స్వచ్ఛములయ్యెను. తమోగుణము పటాపంచలయ్యెను. రజోగుణము సత్త్వగుణమువంక మొగ్గుచుండెను. వ్యక్తులందరును సత్త్వగుణసంపన్నులై విరాజిల్లుచుండిరి. అమృతము వర్షించుచుండెను. అంతటను శుభవాక్యము వినఁబడుచు ప్రాణుల మనంబుల రంజిలఁజేయుచుండినది. రంభ మున్నగు నప్సరసలు విద్యాధరస్త్రీలును కిన్నరరమణులు గంధర్వవనితలు నాగకన్యలు యక్షపత్నులు నమర నారీమణులందరును మంగళద్రవ్యములను చేతఁబూనినవారై మంగళగీతములను పాడుచు నచ్చోటి కేతెంచిరి.

మరీచి, అత్రి, పులహుండు, పులస్త్యుఁడు, క్రతువు, అంగిరుఁడు, వసిష్ఠ కశ్యప అగస్త్య భరద్వాజ గౌతమ భృగు గర్గ పరాశర ఆపస్తంబ యాజ్ఞవల్క్య దక్ష వాల్మీకి శిలాద జమదగ్ని మతంగ భరత వ్యాస శౌనక శుక ఋష్యశృంగులు దూర్వాసమహర్షియు నారద తుంబురులు వామదేవుఁడును విశ్వామిత్ర మార్కండేయ ఉపమన్యులు మునికన్యకలును విశ్వానరపుత్రు నభినందింప నేతెంచుటయే గాక హర హరి బ్రహ్మేంద్రాదిదేవతలు పార్వతీ దేవియు నాగజాతివారును మూర్తీభవించిన సముద్రములు మహానదులతో నరుదెంచెను.

అట్టితతి మహోత్సవము చెలరేగుటచే అకాలపువెన్నెల మొలకెత్తుచుండెను. బ్రహ్మదేవుఁడు శంకరవిధేయుఁడై శిశువునకు "గృహపతి" యను నామకరణము నొనర్చి హంస వాహనముపై నిజలోకమునకేగగా హరిహరులును తమ నివాసములకుఁజనుచు వైశ్వానరునాశీర్వదించిరి. అమరులును తదితరులును "ఆహా! ఈ బాలుని రూపము సర్వలక్షణ సంపన్నము గదా! మహేశ్వరుఁడే ఈ రూపమున విశ్వానరునియందు కరుణగలవాఁడై యాతని యారాధనమును మెచ్చి యవతరించె"నని ప్రశంసించుచు నిజలోకములకు వెళ్ళినవారైరి.

ఇందువలననే గృహస్థులు సత్పుత్రుఁబడయఁజూచుచుందురు. "పుత్రేణ లోకాన్ జయతి" "మంచి కుమారునితో జనకుఁడు పుణ్యలోకములను జయించును". అని శ్రుతి - సనాతన కాలమునుండి ఘోషించుచున్నయది. పుత్రుఁడు లేని వాని గృహము శూన్యప్రాయమగుటచే నాతని సంపాదనయు నిరుపయోగమగునది. అపుత్రుఁడు చేయు పుణ్యములును శీఘ్రముగ ఫలింపకుండును.

శ్లో॥ న పుత్రాత్ పరమో లాభో - న పుత్రాత్ పరమం సుఖమ్ ।
న పుత్రాత్ పరమం మిత్రం - పరత్రేహ చ కుత్రచిత్ ॥ 33

పుత్రుని మించిన లాభముగాని సుఖముగాని మిత్రుఁడుగాని యీ లోకమున పరలోకమునను లభింపవు.

విశ్వానరమహర్షి - నాలుగవ నెల యింటినుండి పిల్లవానిని తీసుకొని శివదర్శనము చేయించి యన్నప్రాశనమును కర్ణవేధను గావింపఁజేసియు బ్రహ్మతేజము పెంపొందుటకై ఐదవయేట నుపనయన





సంస్కారము నొనర్చెను. ఉపాకర్మ నెరవేర్చియు వేదములఁ జదివించుచుండగా వైశ్వానరుఁడు (గృహపతి) వినయాది సద్గుణ సంపన్నుఁడై అధ్యాపకుని సాక్షిమాత్రునిగ నుంచుకొని సమస్త విద్యలను నేర్చుకొనిన వాడయ్యెను.

ఇట్లు ఎనిమిది వత్సరములు నిండిన పిదప తొమ్మిదవ వత్సరమున గృహపతి నవలోకింప నారదమహర్షి యేతెంచి విశ్వానరునిచే సత్కరింపఁబడియు పీఠమునందాసీనుఁడై కుశలము నడిగి శివుని చరణారవిందముల నొకపరి స్మరించియు గృహపతిభవిష్యత్తు మహోజ్వలమైనదని వచించెను.

విశ్వానరా! నీ కొమరుఁడు అవయవములన్నిటియందును లాంఛనములు కలిగి యుండుటచే గొప్పవాడగును. కాని దైవము చంద్రుని కళంకితుని చేసినట్లు నీ పుత్రునకు ఇప్పటినుండి పండ్రెండవ మాసమున పిడుగు గండము నాపాదించియున్నవాడు గాన జాగ్రత్తగా కాపాడుకొను మని నారదుఁడు స్వర్గమునకుఁ జనినవాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున పదునాలుగవ యధ్యాయము.

## పంచదశాధ్యాయము

### (గృహపతి చరితమును వర్ణించుట)

నారదుని మాటను వజ్రాయుధమువలె దారుణముగా భావించి "హా! హతోఽస్మి" అని విశ్వానరుఁడు విలపించుచు పుత్రశోకాతురుఁడై వక్షమున కొట్టుకొని మూర్ఛితుఁడు కాగా తత్పత్నియగు శుచిష్మతీదేవి మిగుల దుఃఖించుచుండెను.

నా గృహపతి యెక్కడ? నా బహిఃప్రాణము కనుపడకుండునా! అని తల్లిదండ్రులు ఏడ్చుచుండగా గృహపతి సమీపించి "అమ్మా! నాయనా! ఎందుకిట్లు విలపించెదరు? మీ చరణరేణువులచే రక్షింపఁబడు నన్ను మృత్యువు చేరజాలదు. నేను మీ కుమారుడనైనచో మృత్యుంజయు నారాధించి యపమృత్యువును పోగొట్టుకొనఁజాలుదును" అని విన్నవించెను.

అంత నా వృద్ధదంపతులు సంతసించి "గృహపతీ! నీ ప్రతిజ్ఞ ప్రశంసనీయమైనది. కరుణా సముద్రుఁడగు శంకరుఁడు పూర్వము శ్వేతకేతువును కాలపాశమునుండి తప్పించి రక్షించెను. మరియు శిలాదుని కుమారుఁడగు నందికేశ్వరుఁడు ఎనిమిదవ వత్సరమున ప్రార్థింపగా ప్రత్యక్షమై వానిని నిజగణాధిపతిగా నొనర్చెను.

పాలసంద్రమునుండి ప్రళయాగ్నిగా నావిర్భవించిన హాలాహలవిషమును మ్రింగి లోకత్రయమును రక్షించిన దయామయుఁడు శంకరుండని తెలియుము! ముల్లోకములయందలి రత్నముల నపహరించి మదోద్ధతుఁడైన జలంధరుని మనోహరంబగు అంగుష్ఠరేఖనుండి సుదర్శన చక్రమును పుట్టించి సంహరించుటయే గాక నొకే బాణముతో త్రిపురాసురులను మడియఁజేసినవాడు. మరియు మహాదేవుఁడు – హరి బ్రహ్మాదులు చూచుచుండగా మన్మథుని నిజఫాలాగ్నిచే భస్మ మొనర్చెను.

శ్లో॥ తం బ్రహ్మాద్యైకకర్తారం - మేఘవాహన మచ్యుతం ।
ప్రయాహి పుత్ర శరణం - విశ్వరక్షామణిం శివమ్ ॥ ౨౦

బ్రహ్మాది స్తంబపర్యంతమగు ప్రపంచమునకు ఏకైక కర్తయు మేఘవాహనుఁడును భ్రమప్రమాదములు బొత్తుగా లేనివాడును జగమును కాపాడుటలో చింతామణివంటివాడు నగు శివుని శరణముగా ఆశ్రయింపుము కుమారా!" అని ప్రబోధింపగా నా బాలుఁడు జననీజనకులకు మ్రొక్కులిడి పలువిధముల వారి నూఱడించియు ప్రదక్షిణము సేసియు బయలువెడలి హరిబ్రహ్మాదులకును పొందనలవిగానట్టి కాశీక్షేత్రమునకుఁజనియుండెను.

కాశీక్షేత్రము – మహాప్రళయకాలమున జీవులకు సంభవించు సంతాపమును పోగొట్టునదై కంఠహారముఁ బోలిన గంగానదితో విరాజిల్లుచుండుటయేగాక అన్నపూర్ణా విశ్వేశ్వరులు పూర్ణాంశమున నివసించు రాజధానియై యుండునది.

అచ్చోట మణికర్ణికాకుండమున గ్రుంకులిడి విశ్వనాథు నారాధించి నమస్కరించెను. మరియు విశ్వేశ్వర లింగమును మాటిమాటికి చూచుచు తాకుచును బ్రహ్మానందకందముగా నొప్పారునదీ శివలింగమని లోలోన భావించుచు మురియుచుండెను.

చరాచర ప్రపంచమున నాకంటె ధన్యుఁడు మరియొకఁడు లేకుండుటకు కారణము విశ్వేశ్వర దర్శనమే యని మదిని దృఢముగా విశ్వసించి నా యదృష్టము ఈ రూపమున ఫలించుటకే కాబోలు నారదమహర్షి యేతెంచి ప్రబోధించెనని భావించి పొంగిపొఱలుచున్న ఆనందామృత రసముచే పారణముఁ గావించి శుభదిన ముహూర్తమున నొక్క శివలింగమును ప్రతిష్ఠించి జితేంద్రియులుకానివారికి నలవిగానట్టి ఘోరనియమముల నవలంబించిన గృహపతి–ప్రతిదినము శుద్ధవస్త్రమున వడఁబోయఁబడిన గంగాజలము నష్టోత్తర శతకలశముల నింపి యభిషేకించుచు వేయినెనిమిది కమలముల మాలికను సమర్పించుచుండెను. ఆరు నెలలు కందమూలఫలములు మాత్రము తినుచు మరి యారునెలలు పండుటాకులను పరిగ్రహించుచు ఇంక నారునెలలయందు గాలిమాత్రము పీల్చుచును మరి యారు నెలలు నీటిచుక్క నొక్కటిఁ దీసికొనుచు తపించుచుండగా పండ్రెండవయేట మొదటివేళ నారదవాక్యమును సార్థకమొనర్ప నింద్రుఁడు వజ్రాయుధమును కేలఁబూని యరుదెంచి "వత్సా! నేను దేవేంద్రుఁడను. నీ కోరిక నెరవేర్తును, ప్రసన్నుడనైతిని వరము నడుగుము!" అని వక్కాణించెను.

అంత గృహపతి – దేవేంద్రా! నీవు వరము నొసగవలదు. సర్వేశ్వరుండగు శంకరుఁడే నాకు వరదుఁడు కావలె" నని వచింపగా నమరేంద్రుఁడు – శంకరుఁడు నాకంటె వేఱుకాదు. దేవదేవుఁడను నేనే! మూర్ఖత్వమును విడనాడి మనోభీష్టమును విన్నవించుకొనుమని నుడివెను.

తరువాత బాలుఁడు జంకనివాడై "గౌతమపత్నియగు అహల్యను చేబట్టిన జారుఁడవు. పర్వతములను పడగొట్టినవాడవు; ఇట్టి నీవు వరము నొసగుటకుఁ దగినవాడవు కావుగాన పశుపతినే యాచింతు"నని కఠినముగా మాటలాడినందున పాకశాసనుఁడు క్రుద్ధుఁడై బాలునికి వజ్రాయుధమును చూపగా నద్దానినిఁ ...చినంత మాత్రమున తెలివిఁదప్పుచు నారద వాక్యమును స్మరించెను.





అంత గౌరీపతి సాక్షాత్కరించి బాలునిఁదాకుచు వత్సా! లెమ్మని వచింపగా నిదురించినవాడు మేలుకొనినట్లు జాగరూకుఁడై సూర్యశతమానప్రకాశుఁడగు మహేశ్వరునిఁ జూచుచుండెను.

ఫాలనేత్రము కంఠనైల్యము వృషభధ్వజము వామాంగమున గౌరీదేవియు చంద్రుఁడు శిరోభూషణముగ నుఁడుటయు జటాజూటము త్రిశూలము అజగవంబను ధనుస్సు, కర్పూర ధవళాంగము, గజచర్మపరీధానంబు నిత్యాది లక్షణములు శంకరునివేయని ప్రమాణములవలన ఆప్తవాక్యములవలనను గమనించినవాడై ఆనందాతిశయమున కంఠస్వరము తడఁబడుచుండ గగుర్పాటుఁజెందుచు చిత్తరువువలె కదలనివాడై క్షణకాలముఁగడిపి తన్ను తాను మఱచుచు స్తుతించుటకును నమస్కరించుటకును చాలనివాడైయుండ శంకరుఁడు చిరునగవున నాయనా! గృహపతీ! శక్రవజ్రమునకు వెఱగందితివి కాబోలు; నా భక్తుని దేవేంద్రుఁడు యముఁడును బాధింపఁజాలరు. నేనే ఇంద్రరూపమున నిన్ను పరీక్షించితిని. వరము నిచ్చుచున్నాను. దేవతాస్థానములలో శ్రేష్ఠమనఁదగు నగ్నిపదవి నధిష్ఠింపుము! ప్రాణులందరి హృదయములలో జఠరాగ్నివై యుందువుగాక! యమదేవేంద్రుల మధ్య నాగ్నేయదిక్పతివై రాజ్యము నేలుము! నీ ప్రతిష్ఠితలింగము నీపేరుతో అగ్నీశ్వరుడనఁబఱగును అగ్నీశ్వరుని సేవించు వారిని వజ్రాయుధముగాని అగ్నిగాని భాధింపఁజాలవు. మరియు నవ్వారికి అగ్నిమాంద్యము చేకూరకుండుటయేగాక అకాల మరణంబు సంభవింపదు. కాశీక్షేత్రమున అగ్నీశ్వర లింగమును పూజించి మరియొకచో చనిపోయినవారును అగ్నిలోకమున దివ్యరూపముతో నివసింతురు అని సంభాషించి గృహపతి బంధువులు తలిదండ్రులును చూచుచుండగా నవ్వానిని అగ్నేయదిశాధిపతిగా నభిషేకింపఁజేసి అగ్నీశ్వర లింగమునందు నంతర్ధానముఁజెందెను.

ఇవ్విధము శంకరుఁడు అగ్నిరూపమున నవతరించిన సందర్భమును వర్ణించితిని. అగ్నిదేవుని నివాసస్థానము అర్చిష్మతీ నగర మనఁబఱగును. అగ్నియందు భక్తిగలవారు- అంత్యకాలమున నగ్నిలోకమున నివసింతురు. శరీరబలము కలిగి యింద్రియములఁజయించియు నగ్నిప్రవేశముఁ జేయువారు-స్త్రీలైనను పురుషులైనను అగ్నిఁబోలిన వర్చస్సు గలవారై యుందురు. ప్రతిదినము అగ్నియందు హవనముఁజేయు బ్రాహ్మణులు, ఏకాగ్రనిష్ఠతో బ్రహ్మచర్యమును పాలించినవారును పంచాగ్నులమధ్య తపించినవారును చలికాలమున కఱ్ఱలమోపుల నిచ్చువారును యజ్ఞములఁజేయువారును దిక్కుమాలిన శవమునకు అగ్నిసంస్కారము నొనర్చువారును అనాథ శరీరమును దహింపఁజేయుటకు నితరులను పురికొల్పువారు నగ్నిలోకమున గొప్పవారై నివసింతురు.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు అగ్నియే ముఖ్యదైవము గురువు, వ్రతము, పుణ్య తీర్థంబు సమస్తంబునని శాస్త్రములయందు పెద్దలు నిర్ణయించిరి.

అపవిత్రముల నన్నిటిని పవిత్రములఁజేయు అగ్నిదేవుఁడు - పావకుఁడనఁబడుచు నందరి హృదయముల నంతరాత్మయై మాంసకబళములఁగూడ జీర్ణింపఁజేయును. కాని తరుణుల గర్భకోశమును కాపాడును.

శంకరుని యెనిమిది మూర్తులలో నియ్యది ప్రత్యక్షమూర్తియై ఆహారవచనము ద్వారా సృష్టికి మూలమై ఆరోగ్యప్రదానముతో రక్షకంబునై దహనముతో ప్రళయంకరంబునై యొప్పారునదగుటచే నీ యగ్ని స్వరూపము లేనిది యెద్దియు గానఁబడదని తెలియవలెను.

మరియు త్రిలోకేశ్వరుని మూడవకన్నుగా పరిగణింపఁబడు అగ్నిదేవుఁడు అనుభవించిన తరువాతనే ధూపదీప నైవేద్యములను క్షీరదధి ఘృతములను హరిబ్రహ్మాది దేవతలు అనుభవించుచున్నవారు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున పదియైదవ యధ్యాయము.

ఇద్ది 46వ యవతారము.

## షోడశాధ్యాయము

### (యక్షేశ్వరావతార ఘట్టము)

గర్విష్ఠుల గర్వమును పోగొట్టువాడును, సత్పురుషుల శివభక్తిని పెంపొందించువాడు నగు శంకరుని యక్షేశ్వరావతారమును వర్ణింతును.

పూర్వము అమరులు అసురులును స్వార్థపరులై ఏకీభవించి క్షీరసముద్రమును తఱచుచుండగా ప్రళయాగ్నిఁబోలిన మహావిషము ఆవిర్భవించెను. అట్టి విషజ్వాలలకు తాళలేక దేవతలు దైత్యులును పరుగిడినవారై శంకరుని సమీపించి ప్రణమిల్లియు కాపాడుమని కొనియాడిరి. ఇప్పట్టున మహావిష్ణువుగూడ వెఱగంది శంకరుని వేడుకొనెనని "ప్రణమ్యతుష్టువు ర్భక్త్యా–సాచ్యుతానతమస్తకాః" అను వాక్యము విశదీకరించుచున్నయది.

అంత భక్తవత్సలుఁడు ప్రసన్నుఁడై హాలహల విషముఁద్రావి సురాసుర ప్రపంచమును రక్షించినందున నవ్వారు జాగరూకులై మరల సముద్రమథనముఁజేయగా – కల్పవృక్ష కామధేన్వాది రత్నములు అమృతంబు బయలువెడలినవి. అట్టితఱి నమరులు రత్నములను పరిగ్రహించి యమృతముఁ గ్రోలినవారైరి. శ్రీహరి మోహినీరూపముఁదాల్చి మోసగించినందున నసురు లమృతముఁ ద్రాగఁజాలకుండిరి.

ఈ కారణముగా దేవదానవులకు ఘోరమైన పోరాటము జరుగుచుండ రాహువు వలన భయపడి చంద్రుఁడు శంకరుని నమస్కరించి "పాహి" యని ప్రార్థించినందున మహాదేవుఁడు కరుణించినవాడై చంద్రుని తన శిరంబున ధరించి చంద్రశేఖరుఁడయ్యెను.

అంత రాహువు నేతెంచి ప్రార్థింపగా శ్రీహరిచే ఖండింపఁబడినట్టి కేతువులనఁబడు నట్టియు రాహుశిరంబులను కంఠమాలగా శంకరుఁడు ధరించెను.

ఆ సమయమున అమృతమును త్రాగియుండుటచే హరిబ్రహ్మాది దేవతలు బలముఁగలవారై యుద్ధమున రాక్షసుల నోడించి "విజయమును సాధించితి" మని గర్వితులై తమ తమ శక్తిసామర్థ్యములను లోలోన తలపోయుచుండిరి.

అమరుల యహంకారము నణపఁదలచి శంకరుఁడు యక్షుఁడై యచ్చోట కరుదెంచి "మీరందరు గుమిగూడియున్నారెందుల"కని ప్రశ్నించెను.





అయ్యా! ఇచ్చోట నసురులకు మాకును గొప్ప పోరు జరిగినది. అందు పెక్కురు రక్కసులను స్రుక్కఁజేసితిమి. మిగిలినవారు పారిపోయిరి. కావున మహావీరులమగు మా ముందు దైత్యులెంతటివారు?

అని యమరులు నుడువగా మహాదేవుఁ డిట్లనియెను. సురలారా! యథార్థము వచింతును. గర్వముఁజెందకుఁడు! కర్తయు హర్తయు నగువాడు మహేశ్వరుఁడని తెలియుఁడు! ఒకవేళ మీరు నా మాట పాటింపని యెడల నొక్కపని చేయుఁడు! గడ్డిపఱక నొక్కదానిని పడవేయుదును. అద్దానిని మీ మీ శస్త్రాస్త్రములతో ఛేదింపుఁడు!

అంత విష్ణ్వాదులు మహాదేవుని గడ్డిపఱకను సుదర్శనచక్రాది ఆయుధములచే నఱకఁజూచిరి.

కాని శివ ప్రభావమునఁజేసి యవ్వారి ఆయుధములన్నియు వ్యర్థములయ్యెను.

అట్టితఱి నాకాశవాణి – ఈ యక్షుఁడు సాక్షాత్ పరమాత్మయగువాడు. ఈతడే కర్తయు భర్తయు హర్తయు నగును. ఈతని వలననే జీవాత్మలందరును బలవంతులగుదురు. జ్ఞాన స్వరూపుఁడగు మహేశ్వరుని – మాయాప్రభావమువలననే మీరు మోహితులై – కనుగొనఁ జాలకుంటిరి – అని వక్కాణించెను.

దివ్యవాణీప్రబోధితులైన యమరులు యక్షరూపుఁడగు శంకరుని నమస్కరించినవారై "మహాదేవా! యక్షేశ్వరా! నీ ప్రభావమును గుర్తింపక గర్వముతో నీముందు మాటలాడితిమి. ఇప్పుఁడు నీ కృపచే తెలివిఁగలవారమై నీవే సమస్తంబని తెలుసుకుంటిమి. శక్తులన్నియు నీ యధీనములగునవి–యక్షరూపముతో మా మదము నణచితివి. కాని ఇద్ది నీయనుగ్రహమనియే భావించుచున్నాము"అని విన్నవించిరి.

అంతనా సర్వేశ్వరుఁడు సురల నందరి ననుగ్రహించి యనేక వాక్యములతో వివేకముఁగఱపినవాడై యచ్చోటనే అంతర్ధానముఁజెందెను.

మంచివారిని కాపాడునట్టి చెడువారిని శిక్షించునట్టియు యక్షేశ్వరావతారమును వింటిరిగదా! ఇయ్యది భక్తుల గర్వమును పోగొట్టునదై సత్పురుషులకు శాంతి నొనగూర్చునదై భుక్తిముక్తుల నొసగునదగును.

ఇద్దానిని వినువారు వినుపించువారు నభీష్టముల ననుభవించి యుత్తమగతి నొందుదురు అని సూతుఁడు విరమించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనముతో పదియారవ యధ్యాయము.

ఇద్ది 47వ యవతారము.





# సప్తదశాధ్యాయము

## (శంకరుని పది యవతారములను వర్ణించుట)

సజ్జనులు భక్తిచేతను జ్ఞానవైరాగ్యములచేత నారాధించునట్టి శంకరుని మొదటి యవతారములను గురించి చెప్పెదను.

అవ్వానిలో మహాకాలుఁడు ప్రథమావతారము: మహాకాళి ఆతని సహచారిణియగు శక్తియగును. తారుఁడు రెండవ యవతారము; తారాశక్తి తారుని ధర్మపత్నియగునది; తారా తారేశ్వరులివరువురును భక్తులకు భుక్తిముక్తుల నొసగువారు. బాలభువనేశ్వరుఁడు మూడవ యవతారము; బాలభువనేశ్వరి యాతని శక్తి యగునది. షోడశశ్రీవిద్యేశ్వరుఁడు నాలుగవ యవతారము, షోడశీశ్రీవిద్యేశ్వరి యాతని సహచారిణియగును. భక్తవాంఛితఫలప్రదుఁడగు భైరవుడు భైరవ శక్తియు ఐదవ యవతారములగును. ఛిన్నమస్తకేశ్వరుఁడు ఛిన్న మస్తకాదేవియు ఆరవ యవతార దంపతులు; ధూమవదీశ్వరుఁడు ధూమవతియు ఏడవ స్వరూపములు; బగళాముఖేశ్వరుడు బగళాముఖియు ఎనిమిదవ పురాణదంపతులు; మాతంగేశ్వరుఁడు మాతంగీదేవియు తొమ్మిదవ శివావతారములగును. కమలేశ్వరుఁడు కమలాదేవియు భక్తుల మనోరథముల నీడేర్చు దశమ శివావతారములనఁబఱఁగుచున్నవి.

ఈ పది యవతారములును పూజ్యములై తమను సేవించు వారికి ఇహపరసుఖముల నొసగునవియునై యలరారుచున్నవి. ఇట్టి పదియవతారముల శక్తిస్వరూపములను పూజించువారికి శత్రువినాశంబు దుష్టసంహారంబునై బ్రహ్మతేజోఽభివృద్ధియు నొనఁగూరును.

శంకరుని పర్వకాలములయందు నీ పదియవతారముల యుపాఖ్యానమును చదివినవారు వినినవారు వినిపించినవారు శివప్రియులగుదురు. బ్రాహ్మణునకు బ్రహ్మవర్చస్సు సంభవించును. క్షత్రియునకు శత్రువిజయంబు చేకూరును. వైశ్యునకు శ్రీమంతయు తారసిల్లును. శూద్రునకు సద్భావన కలుగును.

స్వధర్మము నాచరించు శివభక్తులు ఈ చరితమును వినినచో కృతార్థులగుదురు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున పదియేడవ యధ్యాయము.

**ఇవ్వానితో 57 శివావతారములు పూర్తియైనవి.**





# అష్టాదశాధ్యాయము

## (ఏకాదశ రుద్రావతారములు)

అసత్యదోషము అపనింద అపకీర్తి మున్నగు బాధలను వినినంతమాత్రమున తీసివేయు ఏకాదశ రుద్రావతారములను గురించి సూతుఁడు శౌనకాదులకు చెప్పఁదొడఁగెను.

పూర్వకాలము దేవతలు రాక్షసుల బాధలఁబడలేక నిజరాజధానియగు అమరావతీ నగరమును విడనాడి నలుదిశలఁబరిగెత్తినవారై కశ్యపునిఁజేరి తలలు వంచి మ్రొక్కులిడియు తమ పరాజయ దుఃఖమును నివేదించుకొనిరి.

కశ్యప ప్రజాపతి యమరుల మొఱనాలకించి యవ్వారి నూఱడించియు విశ్వేశ్వర రాజధానియగు కాశీక్షేత్రమునకుఁజనినవాడై గంగయందు గ్రుంకులిడియు సర్వేశ్వరుఁడగు సాంబశివుని విధివిధానముగ భక్తి శ్రద్ధల నర్చించెను. దేవతల మేలుఁగోరి యొక్క శివలింగమును స్థాపించి శివపంచాక్షరీ మహామంత్రానుసంధానమున తపించుచుండగా చాలకాలమునకు విశ్వనాథుఁడు ప్రసన్నుఁడై వరము నడుగుమని కశ్యపు ననుగ్రహించెను.

అంత కశ్యపుఁడు కన్నులఁదెఱచి కృతాంజలియై-దేవదేవా! శరణాగతవత్సలా! ధ్యాన గమ్యుఁడవు; బలవంతులను నిగ్రహించువాడవు; దీనబాంధవుఁడవు; దయాసముద్రుఁడవు భక్తులను కాపాడువాడవు; దైత్యులచే దేవతలు బాధింపఁబడుచున్నవారు.

**శ్లో॥ అసమర్థో రమేశోఽపి - దుఃఖదాఽస్తే ముహుర్ముహుః।**
**అతః సురా మచ్ఛరణా - దేవయంతోఽ సుఖంచ తత్ ॥** ౧౮

ఇట్టి స్థితిలో నమరులఁగాపాడుటకు లక్ష్మీపతియు సమర్థుఁడు కాకున్నవాడు. దైత్యులు మాటిమాటికి నిడుములఁబెట్టుచున్నవారు. ఇందువలన సురలు నన్ను శరణము నొందినవారై తమ దుఃఖమును పోగొట్టుకొనఁదలచినవారు కావున నేను నిన్నారాధించితిని. నా యభీష్టమును నెరవేర్చుము! పుత్రదుఃఖముతో వెతఁబడుచుంటిని. ఇఁక ముందు ఎట్టి దైత్యబాధలు లేకుండ నమరులను రక్షించుము!

అని ప్రార్థింప శంకరుఁడు అటులేయగుగాక! అని యచ్చోటనే అంతర్ధానముఁజెందెను.

కశ్యపుఁడును నిజనివాసమునకుఁజని జరిగిన సమాచారమును సురలకుఁదెలిపెను. తరువాత మహేశ్వరుడు కశ్యపునివలన సురభియందు పదునొకఁడు స్వరూపములతో నావిర్భవించెను.

కపాలి, పింగళుడు, భీముఁడు, విరూపాక్షుఁడు, విలోహితుఁడు, శాస్త, అజపాత్, అహిర్బుధ్న్యుఁడు, శంభువు, చండుఁడు, భవుఁడు నని యవ్వారి నామధేయములు. వీరే ఏకాదశరుద్రుల నఁబఱగుదురు. వీరు దేవతలకు తోడై కదనమున నసురుల నోడించినందున సురలు నిర్భయముగా తమ స్వర్గరాజ్యమును పాలించుచు సుఖముగా నుండిరి. ఇట్టి యమరుల యానందజీవనమునకు శివుని ఏకాదశ రుద్రావతారానుగ్రహమే నిదానమయ్యెను.





ఏకాదశరుద్రులు భక్తవత్సలురుగాన ఈశానదిశయందు రాజధాని నేర్పరచుకొని నానావిధ లీలావిలాసపరులై నివసించుచుండిరి. ఇవ్వారి యనుచరులగు కోట్లకొలది రుద్రులు ముల్లోకములయందు సంచరించుచు భక్తులను రక్షించుచున్నవారు.

ఇట్టివారినే రుద్రాధ్యాయము "నమోరుద్రేభ్యః" ఇత్యాది మంత్రమున ప్రశంసించుచున్నయది.

ఈ అఖ్యానము సర్వపాపపరిహారకమై ఆయుఃకీర్తికరంబునై సత్కామ్యముల నొసగునదై యొప్పారునది. ఇద్దానిని వినువారు వినిపించువారును భుక్తిముక్తుల రెంటిని సాధింపజాలుదురు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున పదునెనిమిదవ యధ్యాయము.

**68 అవతారములు.**

## పందొమ్మిదవయధ్యాయము

## (దుర్వాసమహర్షి చరితము)

మరియొక శివావతారమును వర్ణింతును. శంకరుఁడు ధర్మస్థాపనార్థము దూర్వాసుఁడై విలసిల్లెను.

తపోనిష్ఠాగరిష్ఠుఁడును బ్రహ్మవిదుఁడును బ్రహ్మమానసపుత్రుఁడు నగు అత్రిమహర్షి – బ్రహ్మదేవుని యాదేశము ననుసరించి తనభార్యయగు అనసూయాదేవితో కూడ త్ర్యక్షకుల మనఁబడు పర్వతమునకుఁ జని నిర్వింధ్యానదీతీరమున పుత్రప్రాప్తికై నూరు వత్సరములు తపించెను.

ఎట్టి వికారము లేని పరాత్పరుఁడు నాకు పుత్రవరమును ప్రసాదించుగాక! అని మనంబున నిశ్చయించుకొనెను. అవ్విధము అనసూయాపతి తపించుచుండగా ఎంతోకాలము గడచినందున నాతని శరీరమునుండి బయలుపడిన తపోజ్వాల దేవేంద్రాదిలోకపాలురను స్వర్గాది లోకములను బాధించుచున్నందున నమరులు సత్యలోకమున కేగి పితామహుని దర్శించి ప్రార్థించియు తమ దుఃఖమును విన్నవించిరి.

అంత నాతఁడు చేయునది లేక వైకుంఠమునకుఁజని యత్రితపోజ్వాలాదహనమును గురించి నారాయణునకు నివేదింపగా నా దేవదేవుఁడు అవ్వారినందరిని తోడ్కొని కైలాసముఁ జేరి శంకరునకు ప్రణామపురస్సరంబుగా తమ సంకటముఁదెలిపెను.

అట్టితఱి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నొక్కచో నాసీనులై బాగుగా విచారించుకొని లోకహితముఁ గోరినవారై ముగ్గురును కూడి యత్రిమహర్షి యాశ్రమమునకుఁజని ప్రత్యక్షమైరి.

తమ తమ (త్రిశూల శంఖచక్రాది) చిహ్నములతో నొప్పుచున్న త్రిమూర్తులఁ జూచి అత్రిమహర్షి నమస్కరించినవాడై వైదికసూక్తులతో ప్రార్థించియు "నేనొక్కనినే ధ్యానించితిని కాగా మీరు ముగ్గురెందులకేతెంచినారో సెలవీయుఁడ"ని ప్రశ్నించెను.





అంత నవ్వారు "మునివరా! భగవానుఁడెవడో వాడే వరదుఁడగు గాక!" అని సంకల్పించితివి గాన ముగ్గురము రావలసివచ్చెను. చతుర్థపురుషుడు పరమాత్మయు నగు సదాశివుఁడు కామ్యవరముల నొసగుటకు మమ్ము నియోగించినవాడు. కామ్యవరప్రదానమున మేము ముగ్గురము సమానులమేను; మోక్షప్రదాత శివుఁడొక్కఁడేయని భావించుము! అందు వలన మా యంశలవలన ముగ్గురు కుమారులు జన్మింతురు"అని వక్కాణించి యంతర్ధానముఁజెందిరి.

అత్రిమహర్షి త్రిమూర్తుల వలన వరమునొంది నిజనివాసమునకుఁజని యనసూయాదేవితో సుఖముగా నుండెను. కొంతకాలమునకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు అత్రివలన అనసూయయందు కుమారులుగా జన్మించిరి. విష్ణ్వంశమున దత్తుఁడును బ్రహ్మాంశమున చంద్రుఁడును మహేశ్వరాంశమున దుర్వాసుఁడు నావిర్భవించిరి.

ఇట్టి చంద్రుఁడే దేవతలచే పారవేయఁబడినందున సముద్రమునఁబడి యటనుండి మరలఁ బుట్టినవాడు, దత్తాత్రేయుఁడు లోకమున సన్న్యాసపద్ధతిని ప్రచారమొనర్చెను.

బ్రహ్మతేజోవిరాజితుండగు దుర్వాసుఁడు – కరుణాంతరంగుడై పెక్కురను పరీక్షించి యుద్ధరించెను.

ఒకప్పుఁడు సూర్యవంశీయుఁడగు నంబరీష మహారాజును దుర్వాసుఁడు పరీక్షించిన వృత్తాంతమును సూతుఁడు శౌనకాదులకు చెప్పఁదొడఁగెను.

సప్తద్వీపములభూమికి ఏలికగానుండు నంబరీషుఁడు – ఏకాదశీ వ్రతము నవలంబించి ద్వాదశియందు బ్రాహ్మణులకు భోజనము నిడుచునవ్వారిని దక్షిణా తాంబూలాదులతో సత్కరించుచుండెడివాడు.

ఇట్టి నియమమును కనుగొని దుర్వాసుఁడు పెక్కు శిష్యులను వెంటనిడుకొని యంబరీషుని చెంతకు ద్వాదశీపారణసమయమున వెళ్ళగా నాతఁడు బ్రాహ్మణభక్తుఁడగుటచే దుర్వాసుని మెండు నాదరమున నాహ్వానించెను.

ఆ సమయమున స్నానమునకై శిష్యులను వెంటనిడుకొని దుర్వాసుఁడు నదికి వెళ్ళినవాడై యంబరీషుని పరీక్షించుటకు నాలస్యముఁజేయుచుండెను. ద్వాదశీపారణసమయము దాటునని యంబరీషుఁడు శాస్త్రనియమము ననుసరించి జలముమాత్రము స్వీకరించి దుర్వాసునికై నిరీక్షించుచుండెను.

ఇంతలో దుర్వాసురుఁడరుదెంచి యంబరీషుని జలప్రాశనస్థితిని గమనించినవాడై క్రోధవశమున నుగ్రుఁడై "నృపాధమా! నన్నుపిలచి నేను రాకమున్నే జలముఁ ద్రాగితివి. అందువలన నిన్ను కాల్చివేయగల" నని వచించెను.

అప్పట్టున నంబరీషుని కాపాడుటకు నఁట నున్న చక్రము మేలుకొని – దుర్వాసుఁడు శివాంశసంభూతుఁడని తెలియఁజాలక నాతని దహింప సిద్ధపడుచుండెను.

ఇంతలో ఆకాశవాణి యిట్లు వచించెను.

శ్లో॥ సుదర్శన మిదం చక్రం – హరయే శంభునాఽర్పితమ్ ।
శాంతం కురు ప్రజ్వలితం మన్యు దుర్వాససే నృప ॥

శ్లో॥ దుర్వాసా౽యం శివః సాక్షా - ద్యచ్చక్రం హరయే ౽ర్పితం ।
ఏవం సాధారణమునిం - న జానీహి నృపోత్తమ ॥ 43

శ్లో॥ తవ ధర్మపరీక్షార్థ - మాగతోయం మునీశ్వరః ।
శరణం యాహి తస్యాశు - భవిష్యత్యన్యథా లయః ॥

అంబరీష మహారాజా! నీవద్ద గల చక్రము సుదర్శన మనఁబడును. ఇద్దానినే రాక్షససంహారమునకై శంకరుఁడు శ్రీహరికి ప్రసాదించెను. ఇట్టి చక్రమును శాంతింపఁజేయుము! ఈ దుర్వాసుఁడు సామాన్యుఁడని భావింపకుము! ఈశ్వరుఁడే యని గుర్తించుము! ఇట్టి యసాధారణమునీశ్వరుఁడు నీ వ్రతమును పరీక్షింప నేతెంచినవాడు గాన నీతనికి శరణాగతుఁడవు కమ్ము! లేనిచో ప్రళయంబగును.

అట్టి ఆకాశవాణి నాలకించి యంబరీషుఁడు – దానపుణ్యము యజ్ఞయాగాది సుకృతంబు స్వధర్మాచరణంబు కలదేని మావంశము విప్రులను పూజించునదగు నెడల శ్రీహరిఁదగు నీ చక్రము శాంతించుగాక! భక్తవత్సలుఁడగు భగవానుఁడు నా భక్తిని మెచ్చి ప్రసన్నుడై యుండునెడల నీ సుదర్శనము శమించుగాక! అని దుర్వాసునిముందు ప్రార్థించుచుండగా సుదర్శనచక్రము దుర్వాసుని శివావతారముగా తెలుసుకొని శాంతించెను.

పిదప నంబరీషుఁడు దుర్వాసునికి ప్రణామము నొనరర్చినవాడై క్షమింపుమని వేడుకొనఁగా దుర్వాసుఁడు ప్రసన్నుడై యంబరీషునకు ననేకవరములనొసగి నిజనివాసమునకుఁజనినవాడు.

దుర్వాసుని మరియొక చరితమును వినుఁడు!

శ్రీరాముఁడు దండకారణ్యమున నివసించినవేళ నాతని పరీక్షించి యనుగ్రహించిన సమాచారము సర్వజనవిదితము గాన నిట వివరింపకుంటిని. ఒక సమయమున శ్రీకృష్ణుని బ్రాహ్మణభక్తినియమమును పరీక్షించెను. బ్రహ్మదేవుఁడు ప్రార్థించినందున మహావిష్ణువు – భూభారమును దింపుటకై సజ్జనుల రక్షించుటకును వసుదేవుని కుమారుఁడుగా నవతరించెను.

బ్రహ్మద్రోహులను పాపులను దుర్మార్గులను సంహరించి సద్బ్రాహ్మణులను ధర్మాత్ములను రక్షించిన శ్రీకృష్ణుడు – నిత్యము అనేక బ్రాహ్మణులకు షడ్రసోపేత భోజనము నొసగుదు నను నియమము నవలంబించెను. అందువలన శ్రీకృష్ణుఁడు – బ్రాహ్మణ భక్తుఁడను కీర్తి లోకమున వ్యాపించెను.

ఇట్టి శ్రీకృష్ణభగవానుని పరీక్షించుటకు దుర్వాసుఁడరుదెంచి రథమున కిరువైపుల రుక్మిణీకృష్ణులను నియమించియు రథము నవ్వారితో నడిపించెను. ఐనను శ్రీకృష్ణుఁడు బాధపడనందున దుర్వాసుఁడు ప్రసన్నుఁడై శ్రీకృష్ణునకు వజ్రశరీరత్వమును అజేయత్వమును వరములుగా నొఁసగినవాడు.

మరియొకప్పుడు దుర్వాసుఁడు ఆకాశగంగలో స్నానమాడుచుండ కౌపీనము విడిపోయినందున నగ్నుఁడై సిగ్గుపడుచుండెను. అదే సమయమున ద్రౌపదీదేవి గంగాస్నానము నొనర్పనేతెంచి దుర్వాసుని పరిస్థితిని గమనించినదై తన చీరకొంగు చింపి యాతనికి గంగాజలమున పారవేయగా నద్దానిఁ గైకొని కౌపీనము నమర్చుకొనెను.





అందువలన నాపద యందు వస్త్రములక్షయములగుగాక యని ద్రౌపదికి వరము నొసగినవాడు.

కౌరవసభలో వస్త్రాపహరణ సమయమున దుర్వాసుని వరప్రభావము వలననే ద్రౌపదీదేవి మానభంగమునొందనిదై పాండవులను సంతృప్తిపఱచినదయ్యెను.

మరియొకప్పుడు హంసడింభులు తననవమానింపగా శ్రీకృష్ణుని ప్రేరేపించి యవ్వారిని వధింపఁ జేసినవాడు మరియు బ్రహ్మతేజోబలమున భూలోకమునందు శాస్త్రవిధి ననుసరించి సన్యాసమార్గమును ప్రచారమొనర్చెను. ఇంక ననేకులను తన యుపదేశముచే జాగరూకుఁ జేసెను. పెక్కు శిష్యులకు విజ్ఞానమును బోధించి యవ్వారిని ముక్తపురుషులుగా నొనర్చినవాడు.

దుర్వాసుని చరితము కీర్తికరమై ఆయుఃప్రదంబునై కామ్యముల నన్నిటి నొసఁగునదై ఇహపరసుఖముల నొదవఁజేయునట్టిది కావున నిద్దానిని వినువారు వినిపించువారు వ్రాయువారు వ్రాయించువారును ధన్యులు కారే!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ఏకోనవింశాధ్యాయము.

**69 అవతారములు.**

## వింశాధ్యాయము

### (శంకరుఁడు హనుమంతుఁడుగా నవతరించుట)

నందికేశ్వరుఁడు సనత్కుమారునకు చెప్పినట్లు బ్రహ్మదేవుఁడు నారదునకు వక్కాణించినట్లును సూతమహర్షి - వ్యాసప్రోక్తముగా శౌనకాదులకు వచింపసాగెను.

హరుఁడు హనుమంతుని రూపమున లోకమున చూపెట్టిన లీలావిలాసములద్భుతములు; శ్రీరామచంద్రునకు హనుమద్రూపమున మేలు నొనఁగూర్చిన హరుని మహిమ యపారము గదా!

ఒకప్పుఁడు విష్ణువు ధరించిన మోహినీరూపముఁగాంచి శంకరుఁడు మనోవికారము నొందినవాడై రామకార్యార్థము స్వవీర్యమును విడచెను. అట్టి శివవీర్యమును సప్తర్షులు - శివప్రేరితులై ఒకానొక ఆకులో దాచియుంచి గౌతమపుత్రికయగు అంజనీదేవిఁదగు చెవిలో వేయగా నామె గర్భవతియై ప్రసవముఁ జెందెను.

శ్లో॥ తతశ్చ సమయే తస్మా - ద్ధనూమా నితి నామభాక్ ।
శంభు ర్జజ్ఞే కపితను - ర్మహాబలపరాక్రమః ॥

అటుపిమ్మట సుసమయమునందు శంకరుఁడు - గొప్ప బలపరాక్రమములు గల వానరశరీరముతో హనుమంతుఁడను పేరు గలవాడై అంజనీగర్భమునుండి యుదయించెను.

ఒకప్పుడు వేకువజామున నాంజనేయుఁడు సూర్యబింబమును చిన్న పండుగా తలచి మ్రింగివేసెను. హనుమంతుఁడు శివాంశసంభూతుఁడని భావించి దేవతలు ప్రార్థించినందున రవిబింబమును విడచిపెట్టెను. దేవర్షులు ననేకవరముల నాతనికి నొసఁగిరి. తరువాత హనుమంతుఁడు సంతోషాతి శయమున తన తల్లిఁజేరి సూర్యబింబమును మ్రింగి మరల బయలుపఱచిన వృత్తాంతముఁజెప్పగా అంజనీదేవి సూర్యునివద్ద విద్యలను నేర్చుకొనుమని కుమారునకు సూచించెను.

అటులే హనుమంతుఁడు సూర్యభగవానుని చెంతకు ప్రతిదినము వెళ్లుచు పదునెనిమిది విద్యలను నేర్చుకొనెను. పిమ్మట సూర్యదేవు ననుమతిని మాత యాదేశముఁబొందియు సూర్యాంశసంజాతుఁడగు సుగ్రీవునిఁజేరియుండెను.

సుగ్రీవుఁడు తన యన్నయగు వాలి తన భార్య నపహరించుటచే ఖిన్నుఁడై ఋష్యమూక పర్వతముపై హనుమంతుని తోడుగా జేసుకొని నివసించుచుండెను. అందువలన సుగ్రీవునకు హనుమంతుఁడు నన్నివిధముల మేలు నొనఁగూర్చుచు నచ్చోటునకు దైవవశమున నరుదెంచిన శ్రీరామునితో స్నేహము నేర్పరచి పాపబుద్ధి గల వాలిని శ్రీరామునితో చంపించెను.

తదనంతరము హనుమంతుఁడు వానరులలో గొప్పవాడై సుగ్రీవ సచివుండునై శ్రీరాముని యాదేశము ననుసరించి సీతాదేవిని వెదక నారంభించి లంకానగరముఁజేరినవాడై యటతన బలపరాక్రమములను చూపెట్టియు శ్రీరామచంద్రుఁడొసగిన ఆనవాలును సీతాదేవికి సమర్పించి శ్రీరాముని సమాచారము నంతయు విశదపఱచి యామె నసువులఁగాపాడెను.

మరల సీతాదేవి యొసగిన ఆనవాలుఁగైకొని వచ్చువేళ రావణుని యుద్యానవనముఁ జెఱచియు పెక్కు రక్కసులను చంపుటయే గాక రావణుని కుమారుని వధించెను. నూనెఁ దడుపఁబడిన గుడ్డలు చుట్టి మంటనంటించిన తోకతో నెగిరెగిరిపడుచు లంకానగరమును కాల్చెను. అప్పట్టున విభీషణుని గృహమునుమాత్రము దహింపకుండెను. తరువాత సముద్రమునఁబడి మంటలు చల్లార్చుకొనెను. శ్రీరామసన్నిధిఁజేరి మ్రొక్కులిడియు సీతాప్రదత్త చూడామణిని సమర్పించెను.

శ్రీరామాజ్ఞావశమున వానరులు కొండలను తెచ్చి పడవేయుచుండగా హనుమంతుఁడు ఆత్మశక్తి నినుమడింపఁజేసుకొని వారధిఁగట్టి శ్రీరామలక్ష్మణులను వానరులను లంకానగరముఁ జేర్చియు రాక్షసుల ననేకులను సంహరించి రామసైన్యమును రక్షించుటయే గాక – శక్త్యాయుధముచే కొట్టఁబడి తెలివిఁ దప్పిన – లక్ష్మణుని సంజీవినితో జీవింపఁజేసినవాడు.

శ్రీరామలక్ష్మణులను సర్వథా సుఖపెట్టుచు రావణాసురుని పరివారముతో కూడ సంహరింపఁజేసి యమరుల కుపకరించెను. మరియు మహీరావణుని వధించి శ్రీరామలక్ష్మణులను స్వస్థానముఁగొని తెచ్చుటయే గాక దేవబ్రాహ్మణద్రోహుల ననేకులను దునుమాడి నానావిధ లీలలఁజూపెట్టెను.

సీతారామప్రీత్యర్థము లోకమున రామభక్తి ప్రచారము నొనర్చి యమరుల గర్వమును పోగొట్టియు రామకార్య సాధకుడై రామదూత యనఁబఱఁగుచు భక్తవత్సలుఁడునై విలసిల్లిన హనుమంతుని చరితమును వివరించితిని.





కీర్తికరంబు ఆయుఃప్రదంబు సర్వకామఫలదంబునగు నీ చరితమును వినినవారు వినిపించినవారు నీ లోకమున సుఖముల ననుభవించి పరలోకమున మోక్షము నొందుదురు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ఇరువదియవ యధ్యాయము.

70 యవతారములు.

## ఏకవింశాధ్యాయము

### (మహేశావతారచరితము)

ఒకప్పుఁడు పార్వతీపరమేశ్వరులు విహరించు నుద్దేశముతో కైలాసమున భైరవుని ద్వారపాలకునిగా నియమించివారై లోన పలురకముల నాడుకొని ప్రసన్నులుగ నుండిరి. అంత నమ్మవారు ప్రభు ననుమతిఁ బడసి యున్మత్తురాలిఁబోలినదై ద్వారము చెంతకు రాగా భైరవుఁడు సాధారణస్త్రీగా భావించి ఆమెను నిషేధించెను.

అందువలన పార్వతీదేవి యలుకఁజెంది – ఓరీ పురుషాధమా! నన్ను సామాన్యవనితగా తలచి ద్వారముకడ నడ్డముగ నుంటివి గాన భూలోకమున మానవుఁడుగ జన్మింపుము! – అని భైరవుని శపించెను.

అంత భైరవుఁడు వెతఁజెందుచుండ శంకరుఁడు నాతని ననేక విధముల నూఱడించెను. దేవీశాపవశమున భైరవుఁడు నరయోనియందు వేతాళుఁడుగఁబుట్టెను. శంకరుఁడు భైరవునియందలి యనురాగమున లౌకికగతి ననుసరించి పార్వతీదేవితో కూడ నవతరింపవలసివచ్చెను. శివుఁడు మహేశుఁడుగను దేవి శారదగ నవతరించినవారై భక్తులకు తమ లీలావిలాస మహిమఁజూపెట్టియు జగమును రక్షించిరి.

యశస్యము, ఆయురారోగ్యాది సర్వకామ ఫలప్రదంబు నగు నీ మహేశ చరితమును వినవలెను, వినిపించవలెను.

ఇహమున భోగప్రదంబు పరమున సుఖప్రదంబు గాదే 71వ యవతారమగు మహేశచరితము.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ఇరువదియొకటవ యధ్యాయము.





# ఇరువదిరెండవ యధ్యాయము

## (విష్ణూపద్రవము, వృషావతార చరితము)

సనత్కుమారా! వృషేశ్వరుఁడును యవతారమును గురించి చెప్పెదను. ఇద్ది విష్ణు గర్వమును పరిహరించిన స్వరూపంబని తెలియుము! అని నందికేశ్వరుఁడు ఉవాచ.

పూర్వము దేవతలు నసురులును జరామృత్యుభయమువలన బాధపడుచు నొక్కచో కూడినవారై రత్నములను పరిగ్రహింపఁదలచి క్షీరసముద్రమును మథింపఁజూచుచుండిరి. అంతలో ఆకాశవాణి మందరపర్వతమును కవ్వముగాను వాసుకిని త్రాడుగా నమర్చి సముద్ర మథనముఁజేయుడని వక్కాణించెను.

అటులే దేవాసురులు మందరముఁజేరి ప్రార్థించి యద్దానిని పెఱికి లేవనెత్తగా నా పర్వతము అవ్వారిపై పడినందున తెలివిఁదప్పినవారై మరుక్షణమున జాగరూకులై పరమేశ్వరుని వేడుకొనినందున ధైర్యబలముల నొందియు మరల కొండను లేవనెత్తి పాలసముద్రముఁదగు నుత్తరతీరమున నుదకమునఁ బడవేయఁగలిగిరి.

పిదప నవ్వారు సముద్రమును తఱచగా స్వర్గలోకాధికారిణియగు లక్ష్మీదేవియు ధన్వంతరి, చంద్రుడును, పారిజాతవృక్షము, ఉచ్చైఃశ్రవాశ్వము, ఐరావతగజము, మద్యము, శార్ఙ్గధనుస్సు, శంఖము, కామధేనువులు, కౌస్తుభమణియు, అమృతంబు నుద్భవించినవి.

మరల మథనముజేయగా ప్రళయజ్వాలలతో కాలకూట మహావిషము సముద్రము నుండి పుట్టెను. అమృతము ఆవిర్భవించునపుడు నేలపై పడిన బిందువులనుండి సుందరరమణీమణులు పెక్కురు జన్మించిరి. ఆ వనితలు - శరచ్చంద్రునిఁబోలిన ముఖము గలవారై మెఱపు వలె సూర్యునివలెను అగ్నివలెను ప్రకాశించుచు కంఠహారములు కరకంకణములు మున్నగుదివ్య రత్నాలంకారములఁదాల్చియు లావణ్యమను అమృతమును దశదిశల వెదజల్లుచు ప్రాణిలోకమును మదింపఁజేయువారునై కోట్లకొలదిగ నుండిరి. తరువాత నమృతముబయలుపడెను. కేశవుడు లక్ష్మీదేవిని శంఖమును కౌస్తుభమణిని ఖడ్గమును పరిగ్రహించెను. సూర్యుడు - ఉచ్చైఃశ్రవ మనఁబడు నశ్వమును స్వీకరించెను. దేవేంద్రుడు పారిజాతమహావృక్షమును ఐరావతగజమును నిండు నాదరమున గైకొనెను. భక్తవత్సలుడగు శంకరుడు కాలకూటవిషమును కంఠమున ధరించి చంద్రుని శిరోభూషణముగ నమర్చుకొనినవాడు. దైత్యులు శివమాయా మోహితులై సుర (మద్యము) అను రమణిఁబరిగ్రహించిరి. ప్రజలందరు ధన్వంతరిని తమ ఆరోగ్యరక్షకునిగా నెన్నుకొనిరి. మునులందరును కామధేనువులను స్వీకరించిరి. మోహితులైన అమృతనారీమణులు నటులే యుండిరి అమృతమునకై దేవదానవులు ఘోరమైన పోరాటమును చేయుచుండ బలిచక్రవర్తి మున్నగు బలవంతులగు దైత్యులు దేవతల నోడించి యమృతము నపహరింపగా నమరులు శంకరుని పలువిధములఁబ్రార్థించిరి.

అంత కరుణామయుడు ప్రేరేపింపగా విష్ణువు మోహినీరూపముఁదాల్చి రాక్షసులకు కనుపడగా నవ్వారు మోహినీదేవిఁజేరి మాకు దేవతలకు నమృతమును సమానముగా త్రాగించుమని పచించి యమృత - భాండమును సమర్పించిరి.





శ్రీహరి - అటులేయని యమృతముఁ గైకొని యమరులకు మాత్రము నొసఁగెను. ఇంతలో రమణులు రాక్షసుల కంటఁబడగా నవ్వారిని మోహించియు దేవతల నోడించువరకు నీ వనితలఁ దాక రాదని శపథము నొనర్చిరి. అటుపిమ్మట దేవాసురులకు ఘోరసంగ్రామము జరిగెను. అందు పెక్కురు రాక్షసులు హతులైరి. మిగిలినవారు భీతభీతులై పాతాళముఁ జొచ్చిరి. అవ్వారిని శ్రీహరి వెంటాడుచు పాతాళమునకు పోయి దివ్యభవనములయందు సుందరయువతులఁగాంచి మోహితుఁడై యవ్వారితో రతిక్రీడల సలుపుచు కొంతకాలమునకు ననేకపుత్రులఁబడసెను.

ఆ విష్ణుపుత్రులు - భూమిని కదల్చు శక్తిగలవారుగను నానాయుద్ధ విశారదులుగ నున్నందున స్వర్గమున భూలోకమునను ప్రజలను పీడించుచుండిరి. అట్టితతి నమరులు బ్రహ్మదేవునిఁజేరి ప్రణమిల్లియు లోకోపద్రవమును విన్నవింపగా నానతఁడు నమరులను వెంటనినడుకొని కైలాసమునకేగి ప్రణతుఁడై "జయ! దేవ! మహాదేవ! సర్వేశ్వరా! రక్షింపుము! అమృత సంభూతలగు నారీమణుల యందనురక్తుఁడై విష్ణువు పాతాళమున నున్నవాడు విష్ణుకుమారులు లోకమును బాధించుచున్నవారు" అని నివేదించెను.

అంత శంకరుఁడు ప్రసన్నుఁడై బ్రహ్మాదులకు నభయముఁ బ్రసాదించి వృషభస్వరూపుండయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ద్వావింశాధ్యాయము.

## ఇరువదిమూడవ యధ్యాయము

### (వృషేశ్వరావతారము)

పినాకధారియగు శంకరుఁడు వృషభరూపుఁడై పాతాళమునఁ జొరఁబడి భయంకర నినాదములఁ జేయుచుండెను. అఁట పట్టణములు పల్లెలును కూలుచుండినవి పౌరులందరు గడగడ వణఁకుచుండిరి. శివమాయా మోహితులగు హరికుమారులు గర్జించుచు ధనుర్బాణములఁదాల్చినవారై వృషభరూపమున కెదురుపడిరి. అంత నా వృషేశ్వరుఁడు కోపగించి డెక్కలతో తన్నుచు కొమ్ములతో పొడచుచుండెను. హరికుమారులందరును వృషభముఁదగు ధాటికాగలేక ప్రాణములఁ గోలుపోయిరి. బలవంతులలో మిన్నయగు శ్రీహరి - పుత్రవియోగమునకు వగచుచు వడిగా శంకరునిఁజేరి ప్రణమిల్లియు దివ్యాస్త్రములను ప్రయోగింప నవ్వానిని మహాదేవుఁడు కబళించి ముల్లోకములు వణకునట్లు ధ్వనించెను.

తాను నారాయణుఁడనను విజ్ఞానమును పోగొట్టుకొని ప్రమత్తుడై యుండు శ్రీహరిని వృషేశ్వరుఁడు కొమ్ములతో పొడవగా నాతఁడు శరీరమంతయు నొచ్చుచుండ గర్వమును విసర్జించి "పరమేశ్వరుఁడే వృషభరూపమున వచ్చినవాడ"ని గుర్తించియు తలవంచినవాడై అంజలిఘటించి "దేవదేవా! కరుణాసాగరా! నీ మాయాబలము నన్ను మోహితు నొనర్చినదని తెలుసుకుంటిని. నా ప్రభువగు నీతో పోరాడి నేరముఁజేసితిని. నాయపరాధమును మన్నింపుము!" అని ప్రార్థించెను.

అంత మహాదేవుఁడు రమేశుని దీనవాక్యముల నాలకించి "నారాయణా! బుద్ధి బలముఁ గలవాడవైనను నన్ను మొదట గుర్తింపక పోరాడితివి.

నీ మహిమయంతయు నా యధీనంబని తెలియుము! ఇఁట వ్యభిచారమును విరమించి నిజలోకమునకుఁ జనుము! నిన్ను స్మరించినచో చరాచరప్రాణులు తరించుచుండ నీవిట్టి దుర్మార్గముఁ జేయఁదగదు" అని యుపదేశించెను.

శ్రీహరి శివవాక్యము నాలకించి సిగ్గుపడుచు "మహేశ్వరా! నా చక్రము లోనఁగలదు. అద్దానిఁ దీసికొని వెళ్ళుదు"నని విన్నవింపగా ధర్మరక్షకుఁడగు హరుఁడు – ఆలస్యము వలదు. త్వరగా వెళ్ళుమని శాసించుచున్నాను. చక్ర మిచ్చోట నుండుగాక! పూర్వచక్రమును మించిన మరియొక చక్రము నిచ్చెద – నని వచించి పదివేల సూర్యులతో సమముగా వెలుగొందు చక్రమును దేవఋషి గంధర్వాది రక్షణమునకై విష్ణువునకు ప్రసాదించెను.

బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడగు శ్రీహరి–వేరొండు సుదర్శన చక్రమును స్వీకరించి "అమరులారా! నా వాక్యమును పాటింపుడు! మీలో ఎవరైనను పాతాళమునఁగల నారీమణుల ననుభవింతురుగాక!" అని యాదేశించెను. అంత నమరులు విష్ణువును మరల పాతాళస్త్రీ భోగముల నాశించుచున్నందున శంకరుఁడు దిగువ విధము శాసించినవాడు.

నా యంశమువలనఁ బుట్టినవాడు, శాంతుఁడైన మునియు దానవులునుఁ దక్క నితరులెవరైన నిందు ప్రవేశించినచో క్షణకాలములో మరణింతురు. అట్టి శివశాసనము నాకర్ణించి హరిబ్రహ్మాదిదేవతలు తమ తమ లోకములకు వెళ్లవలసివచ్చెను.

శ్లో॥ ఏవం స్త్రీలః పరో విష్ణుః – శివేన ప్రతిశాసితః ।
స్వర్లోక మగమ ద్వ్యాన – స్వాస్థ్యం ప్రాప జగచ్చ తత్ ॥ 37

ఇవ్విధము పరాత్పరుఁడైన విష్ణువు స్త్రీలోలుఁడై శివునిచే శాసింపఁబడి స్వర్గమునకు లేక స్వకీయలోకమునకు వెళ్ళినవాడు, అందువలన లోకములన్నియు సుఖముగా నుండెను.

శంకరుని వృషేశ్వరావతారము వర్ణింపఁబడినది. విష్ణుమోహనివారకంబగు నీ చరితము ముల్లోకములకు మేలునొనఁగూర్చునదై పవిత్రంబునై శత్రుబాధాహరంబునై భుక్తిముక్తిప్రదంబునై యొప్పారునది.

ఇద్దానిని వినువారు వినిపించువారు చదువువారు చదివించువారును భోగమోక్షముల నొందుదురు.

ఇద్ది 72వ యవతారము.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున ఇరువదిమూడవ యధ్యాయము.





# చతుర్వింశాధ్యాయము

## (పిప్పలాద అవతారమును శివుఁడు ధరించుట)

శివ–భక్తిని పెంపొందించు పిప్పలాదావతారమును గురించి సావధానముగా వినుఁడని శౌనకాదులకు సూతుఁడు చెప్పఁదొడఁగెను.

తొల్లి దధీచిమహర్షి మహాశివభక్తుఁడై అఖండ నిత్య శివారాధనముఁ జేయుచుండెను. అట్టితఱి దేవతలు వృత్రాసురునిచే పరాజితులై వెతలఁజెందుచు తమ శస్త్రాస్త్రములను దధీచిమహర్షిగారి యాశ్రమమున భద్రపరచినవారై బ్రహ్మలోకమునకుఁజని వృత్రాసురుని వలన కలిగిన పరాజయదుఃఖమును నివేదించిరి.

అంత బ్రహ్మదేవుఁడు "సురలారా? మీ సంహారమునకై త్వష్టప్రజాపతి తపించి వృత్రాసురుని పుత్రునిగా బడసినవాడు. అట్టి దైత్యుని వధించుటకు నొక్క నుపాయము గలదు. దధీచిమహర్షి శివునారాధించి వజ్రాస్థిత్వమును సంపాదించెను. అట్టి మహనీయు నాశ్రయించి వజ్రాస్థులను యాచింపుడు! అతఁడు మీకు తన వజ్రపు నెముకల నీయగలఁడు! అవ్వానితో వజ్రదండమును నిర్మించి వృత్రాసురుని వధింపుఁడు! అని వక్కాణించెను.

దేవేంద్రుఁడు బృహస్పతియు దేవతలును బ్రహ్మవాక్యమును పాటించి దధీచిమున్యాశ్రమముఁ జేరినవారై దర్శించి నమస్కరించిరి.

సువర్చాదేవి దధీచి చెంతనే యుండెను. ప్రత్యేకించి యమరేంద్రుఁడు సంభాషింప నుండ నాతని హృద్గతమును గుర్తించి దధీచి తన భార్యయగు సువర్చను మరియొక యాశ్రమమునకు పంపెను.

అటుపిమ్మట శచీపతి వినమ్రుఁడై స్వార్థమును సాధింపఁదలచి యర్థవంతమైన విన్నపము నిట్లు గావించెను.

త్వష్టప్రజాపతి – అస్మదాదులను బాధింప నుద్దేశించి ఇంద్రజేతయగు కుమారుని సంపాదించెను. అట్టి త్వాష్ట్రుఁడు సురలను మునులను పీడించుచున్నవాడు. వానిని వధింప నీ వజ్రాస్థులు కావలెను. అవ్వానితో వజ్రాయుధమును నిర్మించి వృత్రాసురుని సంహరింతును. అందువలన మహాశైవుడవగు నిన్ను శరణము నొందితిమి.

ఇట్లు యాచింపగానే దధీచిముని శివధ్యానము నొనర్చి తన శరీరము నవలీలగా విడనాడి నినిర్ముక్తకర్మ బంధనుఁడై పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యము నొందెను. ఆ సమయమున దివిషదులందరును విస్మితులై పుష్పములఁ గురిపించిరి.

అట్టితఱి దేవేంద్రుఁడు దధీచిముని యస్థులను కామధేనువుచే నాకించి యవ్వానితో నాయుధములను నిర్మించుమని విశ్వకర్మ నాదేశింపగా నాతఁడు శివతేజోబలమున గట్టిపడి యున్న దధీచిఁదగు వజ్రాస్థులను పరిగ్రహించినవాడై వెన్నెముకతో వజ్రాయుధమును బ్రహ్మశిరమనఁబడు బాణంబును వేరు నెముకలతో. నానావిధ అస్త్రములను నిర్మించెను.

ఇంద్రుఁడు వజ్రాయుధముఁ గైకొని శివతేజోవర్ధితుఁడై ప్రళయకాలమున రుద్రుడు యమునివలె వృత్రాసురుఁజేరి పర్వతశిఖరమునువలె నాతని తలఁద్రుంచెను. ఆ సమయమున నమరులకు గొప్ప వేడుకగా నుండెను. దేవేంద్రుని పలువిధములఁ బ్రశంసించి పుష్పవృష్టిఁ గురిపించుచుండిరి.

ఇది యిట్లుండగా సువర్చాదేవి యాశ్రమాంతరమునుండి నిజాశ్రమముఁజేరి లోనఁబ్రవేశించియు తన భర్తను గానకుండెను.

ఇంతలో భర్తగారి మృత శరీరముఁ జూచినదై జరిగిన దంతయు తెలుసుకొని క్రుద్దురాలై యిట్లు శపించెను.

సురలారా! దుష్టబుద్ధిని స్వార్థమును సాధింపనెంచితిరి గాన యిప్పటినుండి మీరందరు పశువులగుదురు గాక!

ఇట్లు ఇంద్రాది దేవతలకు సువర్చాదేవి శాపము నొసఁగి భర్త ననుగమింప పవిత్ర కాష్ఠమును పేర్చుకొనినదై చితాగ్నిఁబడనుండగా – ఆకాశవాణి ప్రాజ్ఞురాలా! దధీచిమునిగారి తేజస్సు నీ కడుపునఁ దాగియున్నది. అద్దానిని ప్రసవించుము! అటుపిమ్మట నీ యిష్టప్రకారము దేహత్యాగమును చేయవచ్చును. గర్భవతి దేహమును కాల్పరాదని ధర్మశాస్త్రము బోధించుచున్నయది. కావున నగ్నిప్రవేశమును విరమింపుము!– అని పలుక నామె చకితురాలై ఆకాశవాణిని పాటించి మరణింపకుండెను.

అంత నా సువర్చాదేవి శీఘ్రమే పతిలోకముఁ జేర గోరినదై తన గర్భమును పాషాణములతో పగలఁగొట్టఁగా నామె కడుపునుండి యొక్కబాలుఁడు గొప్ప దివ్యశరీరముతో దశదిశల వెలుగొందఁ జేయుచు జన్మించెను.

ధధీచివరతేజమున నాతఁడు సాక్షాత్ శంకరుని వలె కన్పట్టుచున్నందున సువర్చాదేవి మిగుల సంతసించుచు నా బాలుని రూపమును మనసునందిడుకొనినదై చిరునగవుతో "నాయనా! రావిచెట్టు చెంత నివసించి భక్తులకు సుఖము నొనఁగూర్చుచుండుము! పతిసన్నిధికిఁజని యచ్చోటు నుండి నిన్ను కనిపెట్టుచుందు"నని వచించి పరమ సమాధి యోగమున ప్రాణములను పరిహరించినదై పతినివసించు శివలోకమునకు వెళ్ళి పతితో గూడ శంకరుని సేవించుచుండెను.

పిప్పలాదుఁడు – అశ్వత్థ వృక్షముచెంత నుండగా హరిబ్రహ్మాదులు తమ పరివారములతో నచ్చోటున కేతెంచి యంజలిఁఘటించియు మునికుమారునిగా వెలసిన శంకరునకు ప్రణమిల్లిరి అట్టితరి – దేవమానవాదులకు గొప్పవేడుకఁగా నుండెను. దుందుభులు మ్రోగింపఁబడుచుండెను. అప్సరసలు ఆడుచుండిరి. గంధర్వులు పాడుచుండిరి. కిన్నరులు మంగళవాద్యములను వాయించుచుండిరి. అమరులు దివ్యకుసుమములను వర్షించుచుండిరి. విష్ణ్వాదులు బాలునకు వైదిక సంస్కారముల నొనర్చిరి "పిప్పలాదుఁ డని" పేరుపెట్టిరి. ప్రసన్నుఁడవు కమ్మని ప్రార్థించిరి. పిదప నవ్వారందరును పిప్పలాదు ననుమతిని తమ తమ నివాసములఁ జేరియుండిరి.

పిప్పలాదుఁడు లోకకల్యాణకాముకుఁడై యశ్వత్థవృక్షమూలమున తపించుచుండ నెంతయో కాలము గడచెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ఇరువది నాలుగవ యధ్యాయము.





# పంచవింశాధ్యాయము

## (పిప్పలాదుని చరితము)

పిప్పలాదుడు లోకమున ధర్మమును నెలకొలుపదలచి యొకానొక లీలావిలాసముఁ జూపెట్టెను.

ఒకప్పుఁడు పిప్పలాద మహర్షి - పుష్పభద్రానది యందు స్నానమాడుటకు వెళ్ళి యచ్చోటున మనోహరరూపము గల పద్మయను యువతిని చూచినవాడై మోహించెను. అందువలన నాతఁడు పద్మతండ్రియగు అనరణ్య మహారాజుకడ కేగగా అనరణ్యుఁడు వెఱఁగంది మ్రొక్కులిడియు మధుపర్కము మున్నగు నుపచారములతో సత్కరించెను.

పిప్పలాదుఁడు రాజసత్కారము నంతయు స్వీకరించి యాతని కుమార్తెను యాచింపఁగా మహారాజు ఏమియు ప్రత్యుత్తరము నీయఁజాలకుండెను. కన్యనీయనిచో నీ సర్వస్వమును నిన్ను భస్మమొనర్తునని శాసించిన పిప్పలాదునిముందు రాజు రాజపరివారంబును నిలువలేకుండిరి. ఎట్టకేలకు అనరణ్యమహారాజు పద్మాదేవిని పిప్పలాదునకు సమర్పింప వలసివచ్చెను. పార్వత్యంశమునఁబుట్టిన పద్మ - నిండుజవ్వనమున నుండుటయు పిప్పలాదుఁడు ముదుసలి యగుటయు రాజునకు రాజపత్నులకును విచారకరముగా నుండెను. పిప్పలాదుఁడు వివాహవిధిని పద్మను పరిగ్రహించి తన యాశ్రమమునకుఁజనియు వృద్ధుఁ డగుటచే తరుణియగు భార్యయందు మిగుల ననురాగముఁజూపకుండెను.

ఐనను పద్మాదేవి పిప్పలాదుని "లక్ష్మీదేవి నారాయణుని వలె" భక్తిశ్రద్ధలతో నుపచరించుచుండెను.

కొంతకాలమునకు నామెచేయు పతిభక్తికి సంతసించి పిప్పలాదుఁడు యువకుఁడై పద్మను సుఖపెట్టగా పదుగురు కుమారులు జన్మించిరి. వారందరును జననీజనకుల నారాధించుచు సద్గుణ భాజనులై వర్ధిల్లుచుండిరి.

పిప్పలాదుఁడు సామాన్యుఁడని భావింపవలదు. లోకమున శనైశ్చరుఁడు ప్రాణులను బాధించుచున్న దుఃస్థితిని గమనించి యిట్లు శాసించెను.

శ్లో॥ షోడశాబ్దావధి నృణాం - జన్మతో న భవేచ్ఛసా ।
తథాచ శివభక్తానాం - సత్యమేతద్ధి మే వచః ॥ ౧౬

శ్లో॥ అథానాదృత్య మద్వాక్యం - కుర్యా త్పీడాం శనిః క్వచిత్ ।
తేషాం నృణాం తదా స స్యాత్ - భస్మసా న్నహి సంశయః ॥ ౧౭

శ్లో॥ ఇతి తచ్ఛ్రుయతస్తాత - వికృతోఽపి శనైశ్చరః ।
తేషాం న కురుతే పీడాం - కదాచిత్ గ్రహసత్తమః ॥

మానవులు (స్త్రీలు పురుషులు) జన్మించినది మొదలుకొని పదునారువత్సరములవరకు శనిపీడను పొందకుందురు గాక ! అటులే శివభక్తులను శనైశ్చరుఁడు నిరంతరము బాధింపకుండును. నా మాట నిజమగును. ఒకవేళ శని - నా మాటను త్రోసిపుచ్చి పదునారు వత్సరములలోపు మానవులను శివభక్తులను బాధించునెడల భస్మమగును, ఇందెంతమాత్రము సందియము లేదు.

ఇట్టి శాసనముచే శనిదేవుఁడు పిప్పలాదుని వలన భయపడుచు విరుద్ధస్థానముల యందున్నను మానవులను బాల్యమున శివభక్తులను ఎప్పుడును బాధింపకుండును.

లీలామానుష విగ్రహుఁడగు పిప్పలాదుని చరితమును వర్ణించితిని. ఇయ్యది సర్వకామఫల ప్రదంబైనది.

శ్లో॥ గాధిశ్చ కౌశిక శ్చైవ - పిప్పలాదో మహామునిః ।
శనైశ్చరకృతాం పీడాం - నాశయంతి స్మృతాస్త్రయః ॥ ౨౦

గాధిమహారాజును విశ్వామిత్ర మహర్షిని పిప్పలాదమహామునిని స్మరించునెడ శనిపీడానివృత్తి యగును.

పద్మాదేవితో కూడిన పిప్పలాదుని చరితమును చదివినవారును వినినవారును శనిపీడను పోగొట్టుకొనఁజాలుదురు. మహాశైవుఁడు జ్ఞానియు సత్పురుషప్రియుండునగు దధీచి మహర్షిగారి కుమారుఁడగు పిప్పలాదుఁడు మహనీయుఁడు ఆత్మశక్తి గలవాడునై లోకమున విలసిల్లెను.

ఈ అఖ్యానము దుష్టగ్రహచారమును తొలగించి శివభక్తిని పెంపొందించునట్టిది యని సూతుఁడు విరమించెను.

ఇద్ది 73వ యవతారము.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున ఇరువదియైదవ యధ్యాయము.

## ఇరువదియారవ యధ్యాయము

### (వైశ్యనాథావతారము)

శివుని వైశ్యనాథావతారము భక్తులకు నానందము నొసఁగునది.

నందిగ్రామమున మహానంద యను నొక వారాంగన నివసించుచుండెను. ఆమె చక్కనిదే గాక గొప్ప శ్రీమంతమున వైభవముగా జీవించుచు భక్తిశ్రద్ధలతో శంకరు నారాధించుచుండెను. అనేక రత్నాలంకారములఁదాల్చి శృంగారరసము ఉట్టిపడునట్లు ప్రవర్తించుచు నిత్యము విహిత సమయముల యందు భస్మరుద్రాక్షలను ధరించి శివనామమును జపించుచును శివపూజనముఁ జేయుచుండెడిది.

మరియు సంగీతవిద్యానైపుణ్యమున గేయములఁబాడుచు రాజులను రాజపత్నులను సంతసింపఁ జేయుచుండెను. శివపూజనము తరువాత శివకీర్తిని గానముఁజేయుచు భక్త్యతి శయమున నాట్యము నొనర్చుచుండెడిది.

మహానంద యొక కోతి నొక కోడిని పెంచినదై యవ్వానికి రుద్రాక్షలఁగట్టి కరతాళ ధ్వనులచే సంగీతములఁబాడుచు నాడించుచును చెలికత్తెలు చుట్టుకొనియుండ ననురాగముతో హెచ్చుగా నవ్వుచుండెడిది.





ఆమె నేర్పుట వలన మర్కటకకుక్కుటములును రెండును చూపరులకు ముదముఁ గొలుపుచు బాలురవలె నాడుచుండెడివి.

ఇట్లు శివభక్తి సంపన్నురాలై మహానందభరితురాలై సుఖసంతోషములతో నుండగా చాలకాలము గడచియుండెను.

ఒకప్పుఁడు శంకరుఁడు వైశ్యనాథుఁడై మహానందను పరీక్షింప నచ్చోటునకు నేతెంచెను.

భస్మరేఖలు నొసటఁదాల్చి రుద్రాక్షములను వేసుకొనియు జడదారియై శివ మహాదేవ శంభో ఇత్యాది పవిత్ర వైదిక నామధేయముల నుచ్చరించుచు వీరమాహేశ్వర రూపమున ముంజేతి యందు రత్నకంకణముఁ దాల్చి సమీపింపగా వేశ్యారత్నంబగు మహానంద – నిండు సంబరమున నెదురేగి లోనికిఁ దీసికొనివచ్చినదై మహోన్నత పీఠమున నాసీనుఁజేసియు వైశ్యనాథుని కరకంకణము నవలోకించి లోలోనఁ గోరుచు ఇట్లు విన్నవించెను.

అమరనారీమణులు ధరింపఁదగిన నీ కంకణము నా మనంబు నాకర్షించుచున్నది.

అంత నాతఁడు – ఈ నా రత్నకంకణము వలయుదువేని యిచ్చెదను. కాని యిద్దానికి వెల యెంత నిత్తువు? అని ప్రశ్నించెను.

మేము పతివ్రతలము కాము. స్వేచ్ఛావిహారముఁ జేయువారము. మా కులముఁదగు వృత్తి – వ్యభిచారమై యున్నది. నా మనంబీ కంకణమును సర్వదా అపేక్షించుచున్నది గాన మూడు దినములు నీకు భార్యనై యుందును. అని మహానంద నుడువగా వైశ్యనాథుఁడు "అటులైన దినత్రయము నీకు భార్యనగుదు ననుచు నా హృదయముఁదాకుము" అని వ్రాక్కుచ్చెను.

అందువలన నా వేశ్య – ప్రభో ముప్పొద్దులు మూడురాత్రులు నీతో సహధర్మచారిణి నగుదునని ముమ్మారు పలుకుచు సూర్యచంద్రసాక్షిగా ప్రమాణము నొనర్చుచు నాతని రొమ్ము ముట్టుకొనెను.

అంత నా కపటవైశ్యుఁడు రత్నకంకణము నొసఁగి రత్నలింగము నొకదానిని మహానందఁదగు కరమునఁ బెట్టుచు "నా ప్రాణమువలె నతిప్రియమగు నీ రత్నలింగమును భద్రముగా కాపాడుము"! అని నిర్దేశించెను.

అటులేయని యంగీకరించి రత్నలింగముఁగైకొని నాట్యమండప మధ్యమున నెలకొలిపి లోనికేగినదై ఆనాడు రాత్రి యాతనిఁ గూడుకొనినదై మెత్తని పడకపై పరుండెను.

ఆ యర్ధరాత్రిని కపటనాటక సూత్రధారుఁడగు వైశ్యనాథుని మహిమవలన హఠాత్తుగా నాట్యమండపమున మంటలు చెలరేగి గాలిఁగూడుకొని మండుచు కప్పివేయగా నా మండపమంతయు దహించుచుండెను. అందువలన మహానంద తత్తరపడుచు వానరమును కుక్కుటమును నాట్యమండప స్తంభములనుండి విడచిపెట్టెను. అయ్యవి నిప్పునూకలను విదలించుకొని యటనుండి పారిపోవుచుండినవి.

మండపము స్తంభములును కాలి కూలినందున నందలి రత్నలింగము రెండు తునకలయ్యెను. అందువలన వేశ్యాతిలకము వైశ్యనాథుండును మిగుల గుందుచుండిరి. ప్రాణసమానమగు రత్నలింగమునకై

తహతహలాడుచు వైశ్యనాథుఁడు "మహానందా! కాష్ఠములను పేర్పించుము! అందు ప్రాణత్యాగము నొనర్తును. రత్నలింగములేనిది జీవింపఁజాలను. ఇందెంత మాత్రము సందియములేదు. హరిబ్రహ్మాదులరుదెంచి వలదనినను వినువాడను కాను. శివునియందు మనస్సునిలిపి యగ్నిఁ బ్రవేశింతును" అని వక్కాణించెను.

అంత నా మహానంద దుఃఖితురాలై తన సేవకులతో బాహ్యప్రదేశమున చితిని పేర్పించగా వైశ్యనాథుఁడు శివుని మదిని నిలిపినట్లు నటించుచు మండుచున్న నగ్నికి ప్రదక్షిణము సేసి ప్రముఖులు చూచుచుండగా మంటలయందు పడెను. అట్టి పరిస్థితిని గమనించి మహానంద విస్మయముఁజెందుచు పరితపించుచున్నదై సనాతన ధర్మమును తలచుచు బంధువు లందరిని పిలిపించుకొని దీనముగా నిట్లు మాటలాడెను.

రత్నకంకణమును పరిగ్రహించినపుఁడు మూడు దినములు సహధర్మచారిణి నగుదునని ప్రమాణముఁ జేసితిని. నా ప్రమాదవశమున నీతఁడు మరణించుచున్నవాడు కావున నీతనితో నేనును మంటలఁబడి మరణింతును. ఇట్లు ప్రవర్తించినచో సత్యధర్మము నాయందు నిలచియుండును. ధర్మము సత్యము నాశ్రయించియే యుండునట్టిది. సత్యముతో నుత్తమ లోకము స్వర్గాది పుణ్యలోకములును లభించును. సమస్తము సత్యముపై ఆధారపడియున్నది.

ఇవ్విధము పలుకుచున్న మహానంద చుట్టములు వలదనుచున్నను విననిదై ప్రాణములను విడనాడ నుద్దేశించి సర్వస్వమును సద్బ్రాహ్మణులకు సమర్పించి యగ్నిని ముమ్మారు చుట్టినదై యందు పడనుండగా దేవదేవుఁడు తన చరణారవిందములయందే ఈ భక్తురాలు మనంబు నెలకొలిపినదని బాగుగా గుర్తించి నిజరూపమున సాక్షాత్కరించి వారించుచుండెను.

శ్లో॥ సా తం విలోక్యాఖిల దేవదేవం - త్రిలోచనం చంద్రకళావతంసమ్ ।
శశాంకసూర్యానలకోటిభాసం - స్తబ్ధేవ భీతేవ తథైవ తస్థౌ ॥ ౫౨

అమరులందరికి దేవుఁడును ముక్కంటియు చంద్రశేఖరుఁడును కోటిసూర్యకాంతి తోడను కోటిచంద్ర సమాహ్లాదముతోడను అగ్నికోటి ప్రభతోడను విరాజిల్లు మహాదేవుని మహానంద కనులారఁజూచినదై చేష్టారహితురాలివలె జడసినదానివలె నేమియు మాటలాడకుండెను.

శంకరుఁడు కరుణాళుఁడై మహానందను గమనించి యిట్లు వక్కాణించెను. సత్యధర్మమును ధైర్యమును నాయందలి దృఢభక్తిని పరీక్షింప వైశ్యుఁడనై వచ్చితిని. నామాయావశమున నగ్నిఁబుట్టించి నాట్యమండపమును దహింపఁజేసితిని. రత్నలింగమును భగ్నమొనర్చి చిచ్చునందు పడితిని.

ఇట్టి దశయందును ప్రాణప్రీతిని విసర్జించి సత్యధర్మమును రక్షించుచు నాతోసహగమనముఁ జేయ నుంకించితివి. కావున దేవతలకుగూడ లభింపనట్టి భోగముల నొసగుదును. వలయునది కోరుకొనుము! నీ ఏకాగ్రభక్తిచే ప్రసన్నుఁడనైతిని.

అంత మహానంద "శంకరా! స్వర్గమర్త్యపాతాళములయందును భోగములు కావలెనని యాశించుదానను కాను. నీ పాదాంబుజ స్పర్శకన్న వేరొండు నా కవసరములేదు. నా భృత్యులు





దాసీలును బాంధవులును నీ దర్శనముచే నిస్సంగులై యున్నవారు. నాతోపాటు వీరందరిని నిజకైలాసధామముఁజేర్చి పునర్జన్మభయమును లేకుండఁజేయుము! నమస్కరించుచున్నాను" అని ప్రార్థింపగా మహాదేవుఁడు మహానంద విన్నపము నంగీకరించి యామెను తత్పరివారమునంతటిని పరమ పదమునకుఁ దీసికొని వెళ్ళినవాడు.

ఇదియే 74వ శివావతారము, వైశ్యనాథావతారచరితము మహానందకే గాక భక్తులకు బ్రహ్మానందము నొసఁగునట్టిది. మరియు సజ్జనులకు సదభీష్టములను ప్రసాదించునట్టిది.

ఇద్దానిని వినువారు వినిపించువారును స్వధర్మభ్రష్టులు కానివారై దేహాంతమున శివలోకము నొంది యానందింపఁజాలుదురు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున షడ్వింశాధ్యాయము.

## సప్తవింశాధ్యాయము

### (ద్విజేశ్వరావతార చరితము)

సత్పురుషులకు శుభమును సుఖమును ప్రసాదించునట్టి ద్విజేశ్వరావతారమును గురించి వినుఁడు!

భద్రాయువును శివుఁడు ఋషభయోగిరూపమున ననుగ్రహించిన సందర్భమును పూర్వము వివరించితిని. అట్టి భద్రాయువుఁదగు ధర్మప్రవర్తనమును పరీక్షింప ద్విజేశ్వరుఁడై శంకరుఁడవతరించెను. భద్రాయువు–ఋషభయోగి యొసఁగిన ప్రభావమునఁజేసి పగతుఱనోడించి సింహాసనము నధిష్ఠించియు రాజ్యమును చేయుచుండెను.

సీమంతినీ చంద్రాంగదుల కుమార్తెయగు కీర్తిమాలినిని వివాహమాడి యామెతో సుఖముగా విహరించుచు నొక్కనాడు భద్రాయువు తన ప్రియురాలిని తోడ్కొని వసంతకాలమున విహరించుటకు నడవికిఁ బోయెను.

శరణాగతులను రక్షించు స్వభావముగల కీర్తిమాలినితో నరణ్యమున విహరించుచుండగా భద్రాయువుఁదగు ధర్మమును పరీక్షింప పరమేశ్వరుఁడు పార్వతీదేవితో గూడ నచ్చోటున కరుదెంచెను. పిదప గౌరీశంకరులు బ్రాహ్మణదంపతులుగ నవతరింపగా శివమాయాప్రభావమున నొక వ్యాఘ్రము గోచరించెను.

అట్టి పెద్దపులి వెంటాడుచుండ ద్విజదంపత లు వెఱగంది పరుగెత్తుచు దుఃఖించుచుండిరి. అట్టివారిని భద్రాయువుగాంచి శరణ్యుఁడగుటచే రక్షింప నుద్యుక్తుఁడయ్యెను.

ఆ సమయమున ద్విజదంపతులు "మహారాజా! వ్యాఘ్రము మా యిద్దరిని భక్షింపనున్నది. సర్వ ప్రాణిభయంకరమగు నీ వ్యాఘ్రము – మమ్ము సంహరించునంతలోనే వడిగా రక్షించు"మని ప్రార్థించిరి.





అంత నా రాజపుంగవుఁడు దయార్ద్రహృదయుఁడై యవ్వారిని సమీపించి ధనుర్బాణముల ననుసంధించువరకు మాయావ్యాఘ్రము బ్రాహ్మణసతిపై పడి నడుమునఁబట్టుకొనెను. అప్పుఁడు నా సాధ్వీమణి ప్రాణనాథా! శంభో! అని విలపించుచుండ వ్యాఘ్రము ఆమెను విఱిచి తినుచుండెను. అంతలో మహారాజు - తీక్ష్ణబాణములను వ్యాఘ్రముపై వేయగా నయ్యవి "పర్వతముపై వర్షధారలవలె" ఛిత్తపోవుచుండెను. వ్యాఘ్రము బలముగల దగుటచే బ్రాహ్మణతరుణిని లాగుచు త్వరగా దూరము వెళ్లెను. అందువలన బ్రాహ్మణుఁడు-లోకరీతిననుసరించి మిగుల నేడ్చుచు మాటిమాటికి భార్యను తలపోయుచు భద్రాయువును గురించి యిట్లు మాటలాడెను.

రాజా! నీ గొప్ప గొప్ప అస్త్రశస్త్రము లేమైనవి? నీ కవచము ఎట్టిది? పండ్రెండ్రు వేల యేనుగుల బలము నేమి జేసితివి? నీ శంఖముతోడను ఖడ్గముతోడను ప్రయోజనము గానఁబడుటలేదు. నీ యాత్మశక్తియు కుంటుపడినట్లేనా? ఎట్టి బలమైనను నీయొద్ద లేదనియే చెప్పవచ్చును. ఒక్క పులిని చంపఁజాలకుంటివిగదా! కష్టపడువారిని కాపాడుట క్షత్రియుని లక్షణము కావున నీ జన్మకుఁ దగిన ధర్మము నశించినపుఁడు నీవు జీవించుటలో నర్థ మెద్దియు గోచరింపదు. ఆర్తులై శరణాగతులగువారిని రాజులు తమ ప్రాణములను సంపద నడ్డు పెట్టియైనను రక్షింపవలెను గదా! ఆర్తులను కాపాడలేని క్షత్రియులు మరణించుట మేలు, దానము లేని ధనికులు గృహస్థులై యుండుటకన్న సన్న్యాసులగుట సమంజసము; దరిద్రులను దీనులను రక్షింపలేని ప్రభువులు విషముఁద్రాగియైనను అగ్నిఁబడియైనను ప్రాణములను గోలుపోవుట మంచిదని నా యభిప్రాయము.

ఇవ్విధము విలపించుచున్న బ్రాహ్మణుని మాటలలో నిజతిరస్కారము ఇమిడి యున్నదని భద్రాయువు గమనించి "దైవము ప్రతికూలించినందున నా పౌరుషము అడుగంటినది. కీర్తియు లోపించినది. గొప్పదోషంబు సంఘటించుచున్నది. క్షత్రియకులమునకుఁదగిన రక్షణధర్మము నా యందు శూన్యమైనది. కావున నా రాజ్యము ఆయుష్యము ఐశ్వర్యము సమస్తంబు క్షీణించును. ఆలుఁబోగొట్టుకొని కుందుచున్న బాపని నా యసువుల నొసగియైనను సంబరపెట్టుదునని మదిని గట్టిగా నిశ్చయించుకొని భద్రాయువు కపటబ్రాహ్మణుని పాదములపై వ్రాలి యాతని నూఱడించుచు నిట్లు విన్నవించెను.

విప్రోత్తమా! నా యందు దయఁదలచి దుఃఖమును విడనాడుము! నిజప్రభావమును పోగొట్టుకొని బాధపడుచుంటిని. నీ వాంఛిత మెద్దియో సెలవీయుము! సమర్పించెదను.

అంత నా భూసురుఁడు "రాజా! గ్రుడ్డివానికి అద్ద మెందులకు? బిచ్చగానికి ఇల్లెందులకు? మూర్ఖునకు పుస్తక మెందులకు? భార్యలేనివానికి ధన మెందులకు? కావున పత్నీరహితుఁడనైన నేను ఎట్టి రతిసుఖముల ననుభవింపనందున నీ ధర్మపత్ని యగు పట్టపురాణిని కోరుచున్నాను. సమర్పించుము!" అని యాచింపగా భూపతి తన మనంబున "గజాశ్వములను పాతాళాది చతుర్దశలోకములను చివరకు నిజశరీరమునైనను దానముఁజేయుట లోకమునఁగలదు. కాని కళత్రము నొసగుటలేదు" నిచింతించి "స్వామీ పరస్త్రీగమనము వలన కలుగు దోషమును నూర్లకొలది ప్రాయశ్చిత్తములతో గూడ పోగొట్టుకొనరాదు గదా!" అని ప్రార్థించెను.





అంత నా బాడబుఁడు "పార్థివోత్తమా! బ్రహ్మహత్యాపాపమును మద్యపానదోషమును పరిహరింపఁ జేసుకొను తపఃశక్తి నా కడ నుండగా పరదారా గమనదోషము ఎంతటిది? అందువలన మరుమాటాడక నీ యాలు నొసగుము! ఇదియే నా కోరిక. ఒకవేళ నా కోరికను చెల్లింపనిచో నరకము నొందుదువు!" అని సంభాషింప నా భద్రాయువు భయపడుచు లోలోన "ఆర్తత్రాణమును చేయకుండుటకన్న భార్యాదానమే శ్రేయస్కర" మని భావించి "సద్యస్కాలమున భార్య నీతనికి సమర్పించి నిర్దోషనై అగ్నిఁబ్రవేశింతును. ఇందువలన నా కీర్తి లోకమున చిరస్థాయి కాగలదు" అని నిశ్చయించుకొని వీతిహోత్రుని రగుల్కొలిపి బ్రాహ్మణుని పిలచి యుదక విసర్జనముతో పత్నీదాన మొనర్చెను. మరియు వెనువెంటనే భద్రాయువు స్నానముఁజేశి దేవతాముఖ్యులకు మ్రొక్కులిడియు నగ్నికి ముమ్మారు ప్రదక్షిణము నొనర్చి యేకాగ్రచిత్తమున శివుని ధ్యానించుచు మంటలయందు పడుచుండెను.

తన పాదారవిందముల యందే మనంబు నిలిపి యగ్నిప్రవేశముఁజేయుచున్న భద్రాయువును వారింప పరమేశ్వరుఁడు సాక్షాత్కరించెను.

ఆహా! ఆ దివ్యసుందర విగ్రహమును వర్ణింప నెవరు చాలుదురు?

ఐదు ముఖములు, మూడు కన్నులు, చంద్రరేఖయు, వ్రేలాడుచున్న పచ్చని తళలు గల జడల కొప్పును, మధ్యాహ్నసూర్యకోటితేజంబును, తామరతూడువంటి తెలుపువన్నెయు, గజచర్మ వస్త్రంబు, గంగా తరంగములచే తడుపఁబడిన జటాజూటంబును, నాగేంద్రహార వేష్టిత కంఠము, కిరీటము మొలనూలు అంగదములు కంకణములు ఇత్యాది భూషణములును, త్రిశూలము ఖడ్గము మంచపుకోడియు గొడ్డలి జింకతోలు మృగము అభయముద్రయు వరదముద్రయు వజ్రాయుధంబు పినాకంబు నను కరభూషణములును, కలిగి వృషభముపై నీలకంఠ విరాజమానుఁడై కన్పట్టు పరాత్పరుని కీర్తిమాలినీ వరుఁడు (భద్రాయువు) కనులార గాంచెను.

ఆ సమయమున నమరుల పుష్పవర్షము – అంతరిక్షమునుండి భగవానునిపై కురియుచుండుటయే గాక మంగళవాద్యములు మ్రోగింపఁబడుచుండెను. మరియు దేవతాస్త్రీలు నాట్యమాడుచుండిరి. హరిబ్రహ్మాదిసురలు నారదాది మహర్షులు నేతెంచి స్తోత్రములఁజేయుచుండిరి. మహోత్సవము చెలరేగి శివభక్తిని పురిగొలుపుచుండగా భద్రాయువు భక్తిచే తలవంచి దోసిలొగ్గియుండుటయేగాక శివదర్శనమువలన హృదయము ఉప్పొంగుచుండ ఆనంద బాష్పములచే నొడలిఁదడుపుకొనుచు గగుర్పాటుఁజెందుచును. కంఠస్వరము తడఁబడుచుండ విహితవాక్యములతో ననేకవిధముల నుతించెను.

పార్వతీసహచరుండైన పరమేశ్వరుఁడు ప్రసన్నుఁడై "రాజా! వరమునడుగుము! నీ ధర్మప్రవర్తనమును పరీక్షింప ద్విజుడనై వచ్చితిని. పెద్దపులిచే కరువఁబడిన తరుణి పార్వతీదేవి యని తెలుసుకొనుము! వ్యాఘ్రము కల్పితంబు; నీ ధైర్యమును పరిశీలింప వలెనని నీ భార్యనడిగితి" నని సంభాషింప మహారాజు మరల ప్రణమిల్లి వినయవిధేయతలు ఉట్టిపడుచుండ నిట్లు ప్రార్థించెను.

సంసారతాపముచే తపించుచున్న నాకు నీ దర్శనము అబ్బినది. ఇంతకుమించిన వర మెద్ది? ఐన నొక్క వరము నడుగుదును. నాతండ్రియగు వజ్రబాహుమహారాజు తన భార్యతోకూడ

నిన్నారాధించినవాడు. నేనును సపత్నీకముగ నీ భక్తుడనే గదా! పద్మాకరుఁడను వైశ్యుఁడు, అతని కుమారుఁడగు సునయుఁడును నీ యందు అనన్యభక్తిగలవారు. ఇట్టి మమ్మందరిని నీ పరమధామమునందు నీ సేవకులుగా నివసింపఁజేయుము!

అంత కీర్తిమాలినియు "దేవా! నాతల్లిదండ్రులగు సీమంతినీచంద్రాంగదులకు నీ సన్నిధానము ననుగ్రహింపుము!" అని యాచించెను.

నందికేశ్వరుఁడు సనత్కుమారునికి, సనత్కుమారుఁడు వేదవ్యాసునకు, వేదవ్యాసుఁడు సూతునకు, సూతుఁడు శౌనకాదులకును చెప్పిన శివమహాపురాణము భాగవతాదిగ్రంథములకన్న ప్రాచీనమై ప్రమాణమూర్ధన్యమునై విలసిల్లునట్టిది. ఇద్ది ప్రమాణము కాదనియు మందాధికారులకు ఉపయోగించునదనియు ఆలపించువారు అంధులనియే చెప్పవచ్చును.

కీర్తిమాలినీభద్రాయువుల ప్రార్థనమును శంకరుఁడంగీకరించి యవ్వారికందరికి నంత్యకాలమున కైలాసనివాసమును ప్రసాదించి యంతర్హితుఁడయ్యెను.

భద్రాయువు భర్గుని కటాక్షమునకు పాత్రుఁడై చిరకాలము ప్రపంచసుఖముల ననుభవించి తన శాసనము చెల్లునట్లు పదివేలవత్సరములు రాజ్యము సేసియు కుమారునికి పట్టముఁగట్టి కీర్తిమాలినితోగూడ శివసాయుజ్యము నొందెను.

సీమంతినీ చంద్రాంగదులును శివభక్తిప్రభావమున ప్రారబ్ధాంతమున శివలోకమున కేగి శివానందము ననుభవించుచుండిరి.

భద్రాయువును పరీక్షించి రక్షించిన శంకరుని ద్విజేశ్వరావతారమును గురించి చదివినవారు వినినవారు వినిపించినవారును స్వధర్మభ్రష్టులుగాక చిత్తశుద్ధిగలవారై శివజ్ఞాన నిధులగుదురు.

ఇద్ది 75వ యవతారము

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముతో ఇరువదియేడవ యధ్యాయము.

## ఇరువదియెనిమిదవ యధ్యాయము

### (యతినాథ హంసావతారములు)

మేఱలేని యానందము నొదవఁజేయునది యతి నాథావతారము; అర్బుదమనఁబడు పర్వతముచెంత ఆహుకుఁడను బోయవాడు నివసించుచుండెను. అతని భార్య ఆహుక యను పేరుఁగలిగి పతివ్రతగా నుండెను. ఇద్దరును నిండు భక్తిని నిత్యము శివారాధనముఁజేయుచుండెడివారు.

ఇట్లుండగా వీరిని పరీక్షింప శంకరుఁడు సన్న్యాసి రూపమున నచ్చోటున కేతెంచెను. ఆ సమయమున నాహుకుఁడు ఆహారమునకై అడవికిఁబోయి గృహముఁజేరినవాడై యతినాథుని పూజించెను.





అంత యతినాథుఁడు భయపడుచున్న బోయవానిని "ఈ రాత్రి నిద్రించుటకు చోటు నిమ్మ"ని యాచింప భిల్లుఁడు "స్వామీ! స్థలము కొద్దిగా నున్నది ఎట్లు విశ్రమింతువు?" అని విన్నవించెను.

అటులైన వెళ్లెద నని నడచుచున్న యతినాథుని గమనించి ఆహుక ప్రాణనాథా! యతినాథునకు స్థలము నొసగుము! అతిథిని విముఖునిఁజేయకుము! అతిథిని సత్కరింపనిచో గృహస్థ ధర్మము క్షీణించును. నీ వీ యతినాథునితో లోన నుండుము! నేను ఆయుధముల చెంత నుంచుకొని బయట నుందును అని నుడువగా ఆహుకుఁడు "నా భార్యను బయట నుంచి లోన నేనెట్లు నిద్రింపవలెను? యతినాథుని వెళ్లఁ గొట్టుటయు ధర్మము కాదు. కానున్నదగు గాక! నేనే బయట నుందు"నని లోలోన నిశ్చయించుకొనినవాడై యతినాథుని తన పత్నిని మెప్పించి యా రాత్రి యింటిలో నుండఁజేసి తాను ఆయుధములఁగైకొని బయట నుండెను.

క్రూరజంతువులనేకములు భిల్లుని సమీపించి బాధించుచుండ నాతఁడు తన చేతనైనంత యత్నించి చివరకు వేసారినందున నయ్యవి భిల్లుని భక్షించెను.

తెల్లవారునపుడు యతినాథుఁడు మేలుకొని బయటకు వచ్చి జంతువులచే చంపఁబడిన బోయవానిని చూచియు మిగుల దుఃఖించుచుండ బోయది "మహాత్మా! ఈతని మరణము సమంజసమైనదనియే చెప్పవచ్చును. నేనీతని ననుసరింతును. చితాగ్నిని రగుల్కొలుపుము! ఉత్తమ స్త్రీలు భర్తతో సహగమనముఁ జేయుట సనాతనధర్మమై యున్న"దని ప్రార్థించెను. యతినాథుఁడు బోయదాని మాటలు పాటించినట్లు నటించుచు కట్టెలఁబేర్చి యంటించిన నిప్పునందు స్వధర్మపరాయణురాలగు ఆహుక ప్రవేశించెను.

అట్టితతి కరుణాసముద్రుఁడగు శంకరుఁడు ప్రత్యక్షమై "ధన్యురాలా! ధన్యురాలా! నీ భక్తికి స్వధర్మాచరణమునకును ప్రసన్నుడనైతిని. వరమునడుగుము! ఇచ్చెదను" అని యనుగ్రహింప నామె నేమియు పలుకఁజాలనందున (శంకరుఁడు) దిగువవిధము సెలవీయవలసి వచ్చెను.

ఆహుకురాలా! నేనే యతినాథుడనై వచ్చితిని. మీరు పునర్జన్మమును పొందినపుఁడు హంసరూపుఁ డనై మిమ్ము భార్యాభర్తలుగ కలుపుదును. భిల్లుఁడు నైషధనగరమున వీరసేన మహారాజునకు కుమారుఁ డుగ జన్మించి నలుఁడను పేరుతో పెంపొందును. ఇఁక నీవు విదర్భ రాజధానియందు భీమరాజునకు కుమార్తెవై దమయంతి యను పేరఁబఱగుదువు! మీరిరువురును దంపతులై రాజభోగముల ననుభవించి యోగీంద్ర దుర్లభంబగు మోక్షసామ్రాజ్యమున పట్టభద్రులగుదురు!

ఇవ్విధము శంకరుఁడు సంభాషించి లింగస్వరూపుఁడయ్యెను. ఆహుకదంపతుల ధర్మప్రవర్తనమును గమనించి యచ్చోటుఁబాయఁజాలక నుండుటచే నచలేశ్వరుఁడను పేరు ఆ లింగమున కేర్పడినది.

శివానుగ్రహమునఁజేసి భిల్లదంపతులు దమయంతీ నలులుగా జన్మించినందున నవ్వారిని సమకూర్చుటకు శివుఁడు – రాజహంసస్వరూపుఁడై పూర్వజన్మలో చేసిన సత్కారముఁదగు పుణ్యమును సార్థకము నొనర్పవలసివచ్చెను. శంకరుని హంసావతారము దమయంతీనలుల మధ్య రాయబారము సలిపి యవ్వారికి మహానందము నొనఁగూర్చినట్టిది.

యతినాథావతారము హంసావతారంబు గల నీ చరితమునాలకించిన వారు వినిపించినవారు నుత్తమగతిని పొందుదురు. కావున నిట్టి భగవదవతారచరితములను పండితుల వలన పామరు లాకర్ణించి ధన్యులై శివానుగ్రహపాత్రులగుదురు గాక!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ఇరువది యెనిమిదవ యధ్యాయము.

ఇయ్యవి 76వ 77వ యవతారములు.

## ఇరువదితొమ్మిదవ యధ్యాయము

### (శివుని కృష్ణదర్శనావతారము)

శంకరుఁడు నభఁగుఁడనువానికి జ్ఞానము నుపదేశింప కృష్ణదర్శనుఁడను పేరు నవతరించెను.

శ్రాద్ధదేవునకు ఇక్ష్వాకు మొదలగు కుమారులుండిరి. అవ్వారిలో తొమ్మిదవవాడగు నభగుని కొమరుఁడు నాభగుఁడనువాడుండెను. నాభగుని కుమారుఁడే అంబరీషుఁడు; ఈతఁడు విష్ణుభక్తుఁడై చేయు బ్రాహ్మణభక్తిని పరీక్షించి దుర్వాసుఁడు ప్రసన్నుడయ్యెను. అంబరీషుని తాతయగు నభగుని చరితమును చెప్పుచున్నాను. వినుఁడు! నభగుఁడు వేదశాస్త్రముల నభ్యసింప బహుకాలము గురుకులమున నివసించుచుండగా ఇక్ష్వాకుప్రముఖులగు సోదరులు జనకు ననుమతిని విభక్తులై తమ తమ భాగములను పరిగ్రహించి సుఖముగానుండిరి. నభగునకు భాగము నీయకుండిరి. నభగుఁడు వేదములను సాంగోపాంగములఁజదివి గురుకులము నుండి గృహమున కేతెంచి "నాకు భాగము నీయుఁడ"ని సోదరుల నడుగగా నవ్వారు "విభాగ సమయమున నిన్ను మరచితిమి. అందువలన మన జనకుని నీకు భాగముగా నిచ్చుచున్నాము. తీసుకొనుము!" అని చెప్పినందున నభగుఁడు తండ్రిఁజేరి "నాయనా! నేను గురుకులమున నున్నతఱి సోదరులందరు నన్నువిడచి విభాగములఁబరిగ్రహించిరి. తరువాత నేను వచ్చి విభాగము నర్థింపగా నిన్ను నా భాగముగ చూపినారు" అని విన్నవించెను.

అంత శ్రాద్ధదేవుఁడు మిగుల నచ్చెరువు నొంది నభగు నూఱడించి "సోదరుల మాట నిజము కాదు. నిన్ను మోసగించిరి. నేను దాయభాగము నెట్లగుదును! ఐనను నన్ను చూపినందున నీకు జీవనోపాయముఁజెప్పెదను.

అంగీరసులనఁబడు సుమేధస్కులు గావించు యజ్ఞమునకు వెళ్ళి యచ్చోటవారికి వైశ్వదేవసూక్తముల రెంటిని వక్కాణించినయెడల నా జన్మము పరిపూర్ణంబగును. అట్టి యజ్ఞమును ముగించి స్వర్గమునకు వెళ్ళుతఱి నవ్వారు యజ్ఞశేషము నంతయు నీ కొసగుదురు."

అని నుడువగా నభగుఁడు పితృవాక్యమును పాటించి యజ్ఞవాటికఁబ్రవేశించి విశ్వేదేవతాకములగు వేదసూక్తముల నుచ్చరించినందున నాంగీరసులు సంతృప్తిపడినవారై తమ తమ యజ్ఞశేషములను నభగునకు సమర్పించి స్వర్గముఁజేరినవారైరి.





ఆ సమయమున యజ్ఞద్రవ్యమును స్వీకరింప నుద్యుక్తుఁడైన నభగుని పరీక్షించుటకు శంకరుఁడు – సర్వాంగసుందరవేషమున కృష్ణదర్శనుఁడను పేరఁబఱగుచు ప్రత్యక్షమై "ఓయీ! నీవెవడవు? నీ యజ్ఞీయమంతయు నాసొత్తైయున్నది. ఇద్దానిని తీసుకొనుమని నిన్నెవరు పంపినారు? నిజముఁ జెప్పుము!" అని శాసించెను.

అంత నభగుఁడు నమ్రుడై "అయ్యా! అంగీరసఋషులు ఇచ్చినదీ యజ్ఞద్రవ్యము; నీవెట్లు నన్ను వారింతువు? అని ప్రశ్నింప కృష్ణదర్శనుఁడు ఈ మన వివాదమును నీ తండ్రియే పరిష్కరించును. వెళ్ళియడుగుము!" అని సమాధానముఁజెప్పెను.

నభగుఁడు శ్రాద్ధదేవునిఁజేరి కృష్ణదర్శనుని యభిప్రాయముఁదెలుపగా నాతఁడు కుమారునితో నిట్లనియెను.

నాయనా! నభగా! ఆ పురుషుఁడు సామాన్యుఁడు కాడు. శంకరుఁడేను; యజ్ఞద్రవ్యమంతయు శివునిదిగా చెప్పఁబడుచున్నది. ప్రపంచగత వస్తువులన్నిటిపై శంకరునిదే యధికారము. నిన్ననుగ్రహించుటకే కృష్ణదర్శనరూపమున వచ్చినవాడు. అచ్చోటున కేగి యాతనిని ప్రార్థించుము. అపరాధమును క్షమించుమని వేడుకొనుము! శరణాగతుఁడవు కమ్ము! హరిబ్రహ్మాద్యమరుఁలు సిద్ధులును ఋషులందరును శివానుగ్రహమువలననే తమ తమ కర్తవ్యములను నిర్వహించుచున్నవారు. వేయేల? త్వరగా వెళ్ళి మహేశ్వరుని ప్రసన్నునిఁ జేసుకొనుము!

అంత నభగుఁడు కృష్ణదర్శనుని సమీపించి "దేవా! ముల్లోకముల యందలి సర్వస్వంబును నీయదే యని మాతండ్రి నుడివెను. యజ్ఞశేషము నీదే యని వేరుగా చెప్పనవసరములేదు. తెలియక మాటలాడితిని. నా యపచారమును మన్నించుము!" అని ప్రార్థించి దీనుఁడై దోసిలొగ్గియు వివిధముగ నుతించెను.

ఇంతలో శ్రాద్ధదేవుఁడు నచ్చోటునకేతెంచి శంకరునకు ప్రణతుఁడై తన కుమారుని యపరాధమును క్షమింపుమని వేడుకొనెను. హరిబ్రహ్మేంద్రాది దేవతలును సిద్ధులును మునులు నరుదెంచినవారై నమస్కరించి యంజలిఁఘటించియు ప్రణమిల్లి పలువిధముల శంకరునిఁ బ్రార్థించుచుండిరి.

అంత శంకరుఁడు ప్రసన్నుడై యమరులను దయఁగాంచి నభగునితో చిరునగవున నిట్లనియెను.

నీ తండ్రి చెప్పినది యథార్థంబేను; నీవు నంతియే పలికితివి. అందువలన మీ విషయమై ప్రసన్నుడనైతిని. బ్రహ్మజ్ఞానమును ప్రసాదించుచున్నాను. ఈ యజ్ఞద్రవ్యమునంతయు పరిగ్రహింపుము! జీవితకాలము నంతటను నిర్వికారుఁడవై సుఖముల ననుభవించి యంత్యకాలమున శివసాయుజ్యము నొందుదువు!

సత్యము తప్పనివారిని కరుణించు స్వభావము గల మహేశ్వరుఁడు తత్రత్యులందరు చూచుచుండగా నంతర్ధానముఁజెందెను.

నారాయణుఁడు పితామహుఁడును దేవేంద్రుఁడును ఋషిముని గంధర్వాదులును శివుఁడు అంతర్హితుఁడైన దిశకు నమస్కరించి తమ తమ నివాసములకుఁజనిరి.

శ్రాద్ధదేవుండును నభగునితో కూడ స్వగృహముంజేరి యనేకభోగముల ననుభవించి జీవితాంతము నందు పరమపదమును పొందెను.

నభగునకు బ్రహ్మానందము నొసగినట్టి కృష్ణదర్శన శివావతారమును యథామతి వర్ణించితిని. భక్తిముక్తి ప్రదమగు నీ యాఖ్యానమును చదువువారు వినువారును పండితులగుదురు. మంత్రజ్ఞు లగుదురు. చివర నుత్తమగతి వొందుదురు.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ఏకోనత్రింశాధ్యాయము.

ఇయ్యది 78వ యవతారము.

## త్రింశాధ్యాయము

### (శివుండు అవధూతేశ్వరుండగుట)

శంకరుండు దేవేంద్రుని గర్వమును పరిహరింప నవధూతయయ్యెను. ఒకప్పుండు బృహస్పతితోడను ప్రముఖామరులతోడను దేవేంద్రుండు స్వర్గమునుండి బయలుదేరి కైలాసమునకు శివదర్శనమునకై వెడలుచుండెను. అంత శంకరుండు నిజదర్శనము నపేక్షించిన గుర్వింద్రుల రాకను గమనించి తద్భావమును పరీక్షింప నవధూతయై దిగంబరుండుగను మండుచున్నవానింబోలి కైలాసమార్గము నడ్డగించి నడుమునంగట్టంబడిన బట్ట వ్రేలాడుచుండ నిలువంబడియుండెను.

అప్పుండు గుర్వింద్రులు శివసన్నిధానమున కేగుచు మార్గమధ్యమున భయంకర పురుషునిం గాంచి నివ్వెరపడుచుండిరి. దేవేంద్రుండు స్వాధికారమదమత్తుండై శంకరుండని గుర్తింపంజాలక "నీవెవండవు? దిసమొలతో నెక్కడినుండి వచ్చితివి? నీపేరెద్ది? నిజము వడిగా చెప్పుము! శంకరుండు తనచోట నున్నవాడా? వేరుచోటున కేగెనా? వానింజూచుటకు నేను దేవతలను వెంటనిడుకొని బృహస్పతితో కూడ వెళ్లుచున్నాను" అని నుడువగా నా విచిత్రపురుషుండు బదులుం జెప్పుకుండెను. రెండుమూడు తడవలు ప్రశ్నించినను శంకరుండు అవధూతస్వరూపమున నింద్రుని గర్వమును తొలగించు తలంపున నేమియు నుత్తరింపకుండెను.

అందువలన నమరేంద్రుండు క్రుద్ధుడై "మూఢా! ఎన్నితడవలు అడిగినను మాటలాడకుంటివి. కావున నిన్ను వజ్రాయుధముతో కొట్టుదును. ఎవరు నిన్ను రక్షింతురో చూచెదను" అనుచు దిగంబరునిపై వజ్రాయుధమును లేపగా నద్దానిని పరమేశ్వరుండు స్తంభింపంజేసెను. మరియు తేజస్సుచే మండిపడుచుండెను.

మంత్రముచే జడియుచున్న సర్పముంబోలె నింద్రుండు లోలోన బాధపడుచుండెను.

అట్టి యవధూతేశ్వరుని వైఖరింగాంచి బృహస్పతి వినమ్రుండై దోసిలొగ్గియు సాష్టాంగప్రణామము నొనర్చి "దేవదేవా! శరణాగతవత్సలా! ప్రసన్నుడవు కమ్ము! బ్రహ్మావిష్ణ్వాదులుంగూడ నీ మాయా





ప్రభావమును గుర్తెరుగఁజాలరు. నీ యనుగ్రహమునకు పాత్రులగువారు మాత్రము నీ మహిమఁ దెలుసుకొనఁజాలుదురు" అని ప్రార్థించియు దేవేంద్రుని శంకరుని పాదములపై పడవేసినవాడై "మహాదేవా! శరణాగతుఁడైన అమరనాథుని రక్షించుము! శిక్షింపకుము! నీ ఫాలనేత్రమునుండి యావిర్భవించుచున్న అగ్నిజ్వాలను ఇంద్రునిపై పడకుండఁజేయుము!" అనియు విన్నవించెను.

అంత కరుణావరుణాలయుండగు మహాదేవుఁడు మందస్మిత వదనారవిందుఁడై "కోపమున బయలుపడిన వహ్నిజ్వాలను "పాము కుబుసమునువలె" మరల ఫాలనేత్రమున ధరింపజాలను" అని వక్కాణింప వాచస్పతి దీనుఁడై వణకుచు "దేవా! భక్తవత్సలుఁడను పేరు నిలువఁబెట్టుకొనుము! భక్తుడైన దేవేంద్రుని కాపాడుము! నీ ఫాలనేత్రాగ్నిని మరియొకచో పడవేయుము! భక్తులనుద్ధరించువాడవు!" అని ప్రార్థించెను.

అంత శంభుఁడు దయగలవాడై "బృహస్పతే! నీ వినయమునకు విధేయతకును సమయోచిత ప్రార్థనమునకును ప్రసన్నుడనై వరము నొఁగుచున్నాను. ఇంద్రునకు జీవము (ప్రాణము) నిప్పించుటచే "జీవుఁ" డను పేరు గలిగియుందువు! ఈ ఫాలనేత్రాగ్ని జ్వాల ఇంద్రుని బాధింపకుండ దూరమున పడవేయుదును" అని పలికి ఫాలాగ్నిజ్వాలను కరమునిడుకొని లవణసముద్రమున విసరివేసెను.

తరువాత నా ఫాలాగ్నిజ్వాల-సముద్రమున బాలుఁడయ్యెను. ఆ బాలుఁడే జలంధరుఁడను పేరున పెద్దవాడై అసురుల యధిపతిగా లోకకంటకుఁడైనందున శంకరుఁడే యవ్వానిని కదనమున వధించెను.

ఇవ్విధము ఈశ్వరుఁడు అవధూతావతారమున స్వలీలావిలాసమహిమఁ జూపెట్టి మాయ మయ్యెను.

అమరులందరును నిర్భయులగుటయేగాక ఇంద్రబృహస్పతులును భయమువీడి సుఖముగా తమ నివాసములకుఁజనిరి. ఎవనిఁ జూచుటకు వెళ్లుచున్నారో అట్టి పరమపురుషుని నడిత్రోవయందే నవలోకించి కృతార్థులైన గుర్వింద్రులు స్వస్థానమున నిశ్చింతగా నుండిరి.

పరమేశ్వరుని యవధూతావతారము దుష్టశిక్షకంబు శిష్టరక్షకంబునై వెలయునది. ఇయ్యది వినువారిని వినిపించువారిని తరింపఁజేయుటేగాక కీర్తికరంబు సుఖప్రదంబును గాదే!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున ముప్పదియవ యధ్యాయము.

ఇద్ది 79వ యవతారము.

# ఏకత్రింశాధ్యాయము

## (శివుని భిక్షువర్యావతారము)

శంకరుఁడు తన భక్తులయందలి దయతో భిక్షుకుడుగ నవతరించిన వృత్తాంతమును వివరింతునని సూతుఁడు శౌనకాదులకు చెప్పఁదొడఁగెను.

విదర్భదేశమున సత్యరథుఁడను పేరుగల మహారాజు సత్యప్రవర్తనుఁడై ధర్మము తప్పకుండ శివభక్తులను ప్రేమించుచుండెను.

సత్యరథుఁడు భూరాజ్యమును చాలకాలము పరిపాలించుచుండ నొకప్పుడు శాల్వరాజులు సత్యరథుని పురము నాక్రమించి యుద్ధముఁజేయఁగా అందు సత్యరథుఁడు బలవంతులగు శాల్వరాజులతో పోరాడఁ జాలక మరణించెను. సత్యరథుని సైనికులు కొందరు మరణించిరి. మరికొందరు మంత్రులతో కూడ పారిపోయిరి. అట్టి నృపుని ధర్మపత్ని గర్భవతియగుటచే శత్రువులు ముట్టడించిన నెట్లొ నొకవిధముగా అంతఃపురమునుండి వెడలి కొంతదూరము నడచి శివపాదారవిందములను స్మరించుచు దుఃఖించుచు తూర్పుదిశకు పయన మయ్యెను.

అట్టితతి శివానుగ్రహమువలన నిర్జనప్రదేశమున నొక కొలనుఁజూచి సుకుమారి యగుటచే కొలనుగట్టున చెట్టునీడను విశ్రమించుచుండగా దైవవశమున సుముహూర్తమున సర్వలక్షణసంపన్నుఁడగు నొక సత్పుత్రుఁడుదయించెను. ఆ తరువాత నామె దప్పిఁగొనియున్నందున కొలనులోనికి వెళ్ళి మంచినీటిఁ ద్రాగ నుంకించుచుండ మొసలి పట్టుకొనినందున నప్పుడే మరణించెను.

దైవవశమున తలిదండ్రులను పుట్టగానే పోగొట్టుకొనిన బాలుఁడు ఆకలిదప్పులచే బాధపడుచు సరస్తీరమునందు ఏడ్చుచుండెను.

సర్వాంతర్యామియగు సదాశివుఁడు బాలునిపై కరుణఁగలవాడై ఒకానొక భిక్షకురాలిని ప్రేరేపింప నామె నచ్చోటునకు మార్గవశమున నేతెంచి బాలుని చూచుచుండెను. ఒక్క వత్సరపు కొమరుఁడు నామె చంక నుండెను. "మానవ సంచారములేని చోటున నీ బాలుఁడు జన్మించుటెట్లు? ఇది నూహింప నలవిఁగానిది; చెప్పతరముఁగానిదియు: బొడ్డుకోయని పిల్లవాడు నేలపై పరుండియున్నవాడు; బాలుని ముఖము రాణించుచున్నది. ఎవని కుమారుఁడో, వీని వృత్తాంత మఱయనిది వీనిఁబరిగ్రహింతు నెట్లు? కన్నకొడుకును వలె వీనిని పోషింపవలెనని నా మనంబు కోరుచున్నయది" అని యా బ్రాహ్మణవనిత చింతించుచుండ భక్తవత్సలుఁడగు శంకరుఁడు లీలావిలాసచతురుఁడగుటచే బిచ్చగాడై యచ్చోటున సాక్షాత్కరించి చిరునగవుతో నిట్లు సంభాషించెను.

విప్రభామినీ! సందేహింపకుము! ఈ బాలుని పోషింపుము! వీనితో శుభము కలుగును.

అంత నామె విధేయురాలై "నా భాగ్యవశమున తమరు తారసిల్లితిరి. తాము చెప్పినట్లు వీనిని పోషింతును. కాని వీడెవడో, ఎవని కుమారుఁడో తెలిపినచో బాగుండును. నీవెవరో నటులే వక్కాణింపుము! నీవు శివుఁడవే యనియు ఈ బాలుఁడు నీ భక్తుఁడనియు నా యంతరాత్మ నొక్కి చెప్పుచున్నయది. ఎట్టి





కర్మదోషమున నీ స్థితి సంభవించినది? ఐన నీ బాలుఁడు పెద్దవాఁడై నీ యనుగ్రహముఁజెంది భవబంధ నిర్ముక్తుఁడు కాగలడని తోచెడిని. నీ మహిమవలననే నేను దారితప్పి యిచ్చోటున కేతెంచితిని"అని ప్రార్థించి ప్రశ్నింప నా కరుణామయుఁడు దిగువవిధము వాక్రుచ్చెను.

శివభక్తుఁడైన సత్యరథుని కుమారుఁడీతడు; సత్యరథుఁడు సంగరమున శత్రువులచే నిహతుండయ్యెను. సత్యరథుని పట్టపురాణి-గర్భవతి యగుటచే పగవారినుండి తప్పించుకొని బయటపడినదై ఈ కొలనుగట్టున బాలునిఁగని దప్పిచే కొలనునీటిఁ ద్రాగునపుడు మొసలిచే లాగఁబడినదై యసువులఁ బాసినది.

మరల నిట్లు బ్రాహ్మణి ప్రశ్నించెను.

శాల్వరాజులు స్వల్పరాజ్యభోగముల నాశించి సత్యరథుని సుఖభోగసమయమున వధించిరెందులకు? ఈతని జనని మొసలిచే నెందుల కీడ్వఁబడినది? బాలుడు జన్మతః అనాథుఁడెందులకయ్యెను? నా కుమారుఁడు దరిద్రుఁడుగా నెందుకు జన్మించెను? ఈ బాలులిరువురకు సుఖసౌభాగ్యములు చేకూరుటెట్లు?

అంత భిక్షువర్యుఁడు సంతసించుచు నిట్లు బదులుఁజెప్పెను.

విప్రభామినీ! నీ ప్రశ్నల కన్నిటికిని సమాధానము నాలకింపుము! బాలుని జనకుఁడు పూర్వజన్మమున పాండ్యరాజై శివభక్తికలిగి ప్రజలను రంజిలఁజేయుచుండెను. పాండ్యరాజు ప్రతిత్రయోదశియందు నక్తవ్రతము నవలంబించి ప్రదోషకాలమున శివారాధనము నొనర్చుచుండెను. ఇట్లుండ నొక్క త్రయోదశిని ప్రదోషమున పరమేశ్వరుని పూజించుచుండ గొప్ప కలవరము వినఁబడగా పగతురు వచ్చినారని భావించి శివపూజమధ్యనుండి లేచినవాడై బయలువెడలెను.

ఇంతలో నాతని మహామంత్రి శతృరాజుఁబట్టుకొని సమీపింపగా వాని యపరాధమును పరిశీలింపకయే మహాక్రోధవశమున తల నరికించెను. తరువాత నశుచిగా నుండియే శివారాధనమును విస్మరించి రాత్రివేళ భుజించినవాడయ్యెను. అతఁడే విదర్భరాజై జన్మించి పూర్వజన్మయందలి శివాపచార దోషమువలన సుఖభోగ కాలముననే శతృవులచే సంహరింపఁబడినవాడు.

ఈ బాలుఁడే పూర్వజన్మమున పాండ్యరాజకుమారుఁడై జనకుఁ డొనర్చిన శివారాధనమును పూర్తిఁ జేయని కారణమున ప్రస్తుతము సర్వస్వమును పోగొట్టుకొని పుట్టినవాడు.

బాలుని తల్లి-పూర్వజన్మమున సవతిని కపటముగా చంపినందున నిప్పుఁడు మొసలిచే పట్టుకొనఁబడెను. ఇద్ది వీరి ప్రవృత్తి;

శ్లో॥ అనర్చితా శివం భక్త్యా - ప్రాప్నువంతి దరిద్రతామ్ ॥ 58

పూర్వజన్మమున భక్తిచే శివు నారాధింపని వారీ జన్మమున దరిద్రులగుదురు. ఇఁక నీ కుమారుఁడు పూర్వజన్మమున బ్రాహ్మణోత్తముఁడై ప్రతిగ్రహములతోడనే జీవితముఁగడిపి యజ్ఞయాగాది సత్కార్యములను తదితర పుణ్యముల నిసుమంతయు చేయలేదు. ఆ కారణమున పుట్టుదరిద్రుఁడైనవాడు: తద్దోష పరిహారార్థము శంకరునికి శరణాగతురాలవు కమ్ము! ఈ బాలురకు ఉపనయనముఁజేసి వీరితో శివారాధనమును చేయించుము! శివుఁడు మేలొనఁగూర్చును.

ఇట్లు బ్రాహ్మణవనిత కుపదేశించి శంకరుఁడు నిజరూపమును చూపగా ఆతఁడే మహేశ్వరుఁడని గుర్తించి యామె ప్రణతురాలై కంఠము తడబడుచుండ ననేక విధముల నుతించెను. అప్పుడు పరాత్పరుఁడు బ్రాహ్మణి ననుగ్రహించి యంతర్హితుండయ్యెను.

అంత నా విప్రభామిని తన కుమారుని రాజకుమారుని వెంటనిడుకొని ఏకచక్రపురమున గృహము నిర్మించుకొని యందు నివసించుచు మంచి మంచి ఆహారములతో నవ్వారిని పోషించుచుండెను.

ఆ బాలురిరువురు బ్రాహ్మణులచే ఉపనయన సంస్కారముఁజెంది పెంపొందుచు శాండిల్యముని యాదేశమున ప్రదోషకాలమున శంకరునిఁ బూజించుచుండిరి. ఇట్లుండగా నొక్కనాడు బ్రాహ్మణకుమారుఁ డొక్కడే నదియందు స్నానమాడఁబోయి యచ్చోటున సువర్ణభరిత కలశముఁజూచి పరిగ్రహించెను. కుమారులిరువును ప్రదోషశివారాధనముఁ జేయుచుండ నొక్క వత్సరము గడువగా రాజకుమారుఁడు వనమునకేగి గంధర్వకన్యకఁగాంచియు వివాహవిధి నామెను స్వీకరించి నిజరాజ్య సింహాసనము నధిష్ఠించియు శత్రువులు లేని పరిపాలన మొనర్చెను.

బ్రాహ్మణభామినిని జననిగాను బ్రాహ్మణకుమారుని యగ్రజునిగాను సత్కరించుచు ధర్మగుప్తుఁడు (సత్యరథుని కుమారుఁడు) విదర్భరాజధానియందు పట్టంపురాణితో సుఖముగా నుండెను. అంత్యకాలమున శివసాయుజ్యము నొందెను.

ఇయ్యది భిక్షువర్యావతారము. ధర్మగుప్తు నుద్ధరించినట్టిది; ఈ ఆఖ్యానము పరమ పవిత్రమగుటయే గాక ధర్మార్థకామమోక్షసాధనంబై వినువారిని వినిపించువారిని తరింపఁజేయునదియునై విరాజిల్లునది.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ముప్పదియొకటవ యధ్యాయము.
ఇద్ది 80వ యవతారము.

## ద్వాత్రింశాధ్యాయము

### (సురేశ్వరుఁడను శివావతారము)

ధౌమ్యుని యగ్రజుఁడగు ఉపమన్యు ననుగ్రహించిన యవతారము సురేశ్వరుఁడను పేరు గలిగియున్నది.

వ్యాఘ్రపాదుని కుమారుఁడగు ఉపమన్యుఁడు బుద్ధిశాలియై ఉత్తములచే ప్రశంసింపఁబడు స్వభావముఁగలిగి పూర్వజన్మసంసిద్ధుఁడై దైవవశమున దరిద్రుఁడగుటచే తల్లితోకూడ మేనమామ యింటిని నివసించుచు నొక్కనాడు ఆవుపాలు కొద్దిగా త్రాగి తరువాత ఎక్కువ పాలు కావలెనని తల్లిని మాటిమాటికి యాచించెను. అందువలన నామె లోనఁబ్రవేశించి పాలు లేనందున బియ్యపుపిండి నుదకమునఁగలిపి తెచ్చినదై కుమారుని బుజ్జగించుచు నీయఁగా బాలుఁడు త్రాగి ఇవి పాలు కావని రోదనముఁజేయుచుండెను.





కుమారుని కమలములవంటి కన్నులఁదుడుచుచు లోలోన బాధపడుచు నిట్లు తల్లి వచించెను.

అడవినుండు మనకు పాలెక్కడ దొరుకునురా! నాయనా! శంకరుని కరుణాకటాక్షము ప్రసరింపనది కమ్మని పాలు దొరుకఁజాలవు. శివప్రీత్యర్థము పూర్వజన్మలో సమర్పింపఁబడినదియే ఈజన్మలో లభించును. ఇందెంతమాత్రము సందియము లేదు.

అంత బాలుఁడు దుఃఖమువీడి మాత నభినందించుచు "అమ్మా! శంకరుఁడను వాడొకఁడు భక్తుల ననుగ్రహింప కలడేని చింతింపకుము! అతఁడు కరుణామయుఁడగుచో మహాదేవుని వడిగానో చిరకాలమునకో ప్రసన్నునిఁజేసుకొని పాలసముద్రమును సాధింతును" అని వక్కాణించి జనని కభివాదము నొనర్చియు తపంబునకై హిమాలయమునకుఁజని యచ్చోట వాయుభక్షుఁడై నివసించుచు ఎనిమిది యిటుకలతో దేవళముఁగట్టి యందు పార్థివ లింగమును స్థాపించియు శివపంచాక్షరీ మహామంత్రముఁ జపించుచు వనమందలి పత్రపుష్పాదులతో పూజించుచుండెను.

ఇట్లు ఉపమన్యుఁడు శంకరు నుద్దేశించి తపించుచుండగా బహుకాలము గడచినందున నాతని తపోజ్వాలచే చరాచర ప్రాణులు తపించుచుండిరి. అందువలన బ్రహ్మవిష్ణ్వాది దేవతలు ప్రసన్నుడవు కమ్మని ప్రార్థించుటచే పరమేశ్వరుఁడు మునిబాలుని భావమును పరీక్షింప దేవేంద్రరూపముఁదాల్పగా అమ్మవారు - శచీదేవిగను, గణములు - దేవతలుగను, నంది - ఐరావతముగను, పరిణమించిరి. శివపరివార మంతయు అమరేంద్రుని పరివారమయ్యెను.

శివుఁడు ఇంద్రరూపమున నుపమన్యుఁజేరి గంభీర స్వరమున "వత్సా! ప్రసన్నుఁడనైతిని. నీ తపంబు చాలించి వలయున దడుగుము! ప్రసాదింతును" అని నుడువగా ఉపమన్యుఁడు కృతాంజలియై శివునియందు పూర్వాధికభక్తిని కోరుచున్నాను" అని ప్రార్థించెను.

"నేను ఎవరనుకొనుచున్నావు? దేవతాసార్వభౌముడను; ముప్పది మూడుకోట్ల దేవతలు నాకు మ్రొక్కుచుందురు. ముల్లోకముల నేలువాడను; నాయందు భక్తిగలవాడవై నన్ను సర్వకాలములయందు పూజింపుము! నీకు శుభము నొనఁగూర్తును. గుణరహితుఁడైన రుద్రుని విడనాడుము! అట్టివానితో నీకేమియు ప్రయోజన ముండజాలదు. అతఁడు దేవజాతిలో చేరినవాడు కాడు. పెద్ద దయ్యమని భావింపుము!" అని సురేశ్వరశివుఁడు నుడువుచుండ ధౌమ్యాగ్రజుఁడు శివపంచాక్షరీ మహామంత్రాను సంధానము నేమఱక "నీతఁడు తపోభంగము నొనర్ప నేతెంచి" నాడని భావించి యిట్లు వక్కాణించెను.

ఇంద్రా! శివనిందఁజేయుచునే శివుఁడు నిర్గుణుఁడు దేవత్వము లేనివాడునని రెండు మాటలు యథార్థముల నాడితివి. రుద్రుఁడు దేవతాశ్రేష్ఠులగు హరిబ్రహ్మాదులను మించిన వాడనియు బ్రహ్మవిష్ణుమహేశ్వరులను పుట్టించు పరమాత్మ యనియు ప్రకృతి నతిక్రమించినవాడనియు గుర్తింపకుంటివి.

బ్రహ్మవిదులు ఎవని సద్రూపునిగాను వ్యక్తానువ్యక్తస్వరూపునిగాను నిత్యునిగను ఏకరూపునిగను అనేకరూపునిగను నిరూపించుచున్నవారో అట్టి వాని వలననే వరముఁబడయఁగోరువాడను.

తత్త్వవేత్తలచే హేతువాదనిర్ముక్తుఁడు జ్ఞానయోగగమ్యుఁడునని ప్రతిపాదింపఁబడుపరమాత్మయే నాకు వరదుండగుగాక!

శ్లో॥ నాస్తి శంభోః పరం తత్త్వం - సర్వకారణకారణమ్ ।
బ్రహ్మవిష్ణ్వాది దేవానాం - శ్రేష్ఠోగుణపరా ద్విభోః ॥ 33

సమస్త కారణములగు తత్త్వములకు కారణమైన తత్త్వము - శివునికంటె మించినదిలేదు. సచ్చిదానందమయ పరతత్త్వమే శివుఁడు కావున సత్త్వరజస్తమో గుణమయులైన హరిబ్రహ్మరుద్రులతో చేరినవాడు గాక గుణతత్త్వములను మించినవాడై శుద్ధసత్త్వ గుణమయుఁడై విలసిల్లువాడు.

బ్రహ్మదేవుని విష్ణుమూర్తిని తదితరదేవతలను యాచించువాడను కాను. అడుగఁదలచినచో శంకరునే అడుగుదును. వేయేల? శంకరుని దక్క నితరుని గడ్డిపఱకఁగూడ యాచించువాడను కాను. జన్మాంతరమున పాపముఁజేసితినికాబోలు; శివనిందను వినుచున్నాను.

శ్లో॥ శ్రుత్వా నిందాం భవస్యాథ - తత్క్షణాదేవ సంత్యజేత్ ।
స్వదేహం తన్నిహత్యాశు - శివలోకం స గచ్ఛతి ॥ 32

శివనిందను వినినచో అదేక్షణమున తన శరీరమును విడువవలెను. అవ్విధము త్వరలో నసువులఁ బాసినయెడల శివలోకము నొందును. అనఁగా శివనిందను తాను చేయరాదు. ఇతరులు చేయుచున్న శివనిందను తాను వినరాదని భావము.

సురాధమా! క్షీరముఁగూర్చి నేను కోరుటయు అట్లుండుగాక! శివాస్త్రముతో నిన్ను సంహరించి నా శరీరమును విడనాడుదును.

అని యుపమన్యుఁడు తన హృద్గతమును వ్యక్తపఱచి క్షీరవాంఛను పరిహరించియు మరణింప నిశ్చయించుకొనినవాడై మొదట దేవేంద్రుని వధింపవలెనని అఘోర మంత్రమున విభూతిని మంత్రించి వేసినవాడై గర్జించుచు శివపాదకమలదంద్వమును మనసునందిడుకొని యోగాగ్నిచే తన శరీరమును దహింప నుద్యుక్తుఁడయ్యెను.

అట్టితఱి పరమశివుఁడు సాక్షాత్కరించి ఉపమన్యుని యోగాగ్ని ధారణమును సౌమ్యయోగమున నివారించి చంద్రార్ధకృతశేఖరంబగు నిజరూపమును చూపెట్టగా ఉపమన్యుఁడు ప్రయోగించిన అఘోరాస్త్రమును శంకరుని నియోగమున నందికేశ్వరుఁడందుకొని మ్రింగివేసెను.

శ్లో॥ క్షిరార్ణవ సహస్రంచ - దధ్యాదే రర్ణవం తదా ।
భక్ష్యభోజ్యార్ణవం తస్మై - ధర్మయామాస సప్రభుః ॥ 45

సర్వేశ్వరుఁడు వేలకొలది పాలసముద్రములను పెరుగు మున్నగువాని సముద్రములను భక్ష్యభోజ్య సముద్రముల ననేకముల నుపమన్యునకు ప్రసాదింపగా నాతఁడు నవ్వానికి సంతసింపక వృషభముపై పార్వతీదేవితోడ విరాజిల్లునదియు ప్రమథ గణాధిపతులతోడను త్రిశూలము మొదలగు దివ్యాస్త్రముల తోడను కూడియుండునదియు నగు శివరూపముఁగాంచి యానందించుచుండెను.

ఆ శుభతరుణమున నాకసమున దుందుభులు మ్రోగుచుండుటయేగాక పుష్పవర్షము కురియుచుండెను. హరిబ్రహ్మాదిదేవతలు దశదిశలయందు నిండియుండిరి.





అంత నుపమన్యువు - చిత్తము భక్తి సంభరితమగుచుండ సాష్టాంగనమస్కారము నొనర్పఁగా శివుఁడు - రా! రా! అని యనురాగమునఁబిలచుచు బాలుని దరిఁజేర్చుకొని తలపై మూర్కొని (వాసనఁ జూచి) దిగువవిధము వరముల నొసఁగెను.

వత్సా! నీ దృఢ భక్తిని పరీక్షించి ప్రసన్నుడనైతిని. నీ బంధువులతో కూడి భక్ష్యముల ననుభవించుచు సుఖభోగముల నందుచుందువు గాక! ఎల్లకాలము దుఃఖము లేకుండు గాక! ఉపమన్యో! ఇదిగో నీ తల్లి పార్వతీదేవి; మాకు నీవు కుమారుఁడవైతివి. అమరుఁడవై నా లోకమున గణాధిపతివై నివసింతువు; కీర్తిగలవాడవై ప్రభావసంపన్నుడవై దివ్యజ్ఞానముతో మనుదువు గాక!

శంభుఁడు మరియు ప్రసన్నుఁడై ఉపమన్యుమహర్షికి వరములను ప్రసాదించెను. పాశుపతవ్రత స్వీకారము అనఁగా భస్మరుద్రాక్ష లింగధారణాత్మకము, గురుచర భక్తిసమన్వితంబు, శివపంచాక్షరీ మహామంత్రా నుష్ఠానసంపన్నంబు గురుచరేశ్వర తీర్థప్రసాద గ్రహణసహితంబు నగు శాంభవవ్రతము నొసఁగి జీవితాంతమువరకు పాశుపతవ్రతాచరణ సామర్థ్యమును వ్రతాంగపరిజ్ఞానమును పశుపాశపతి తత్త్వత్రయజ్ఞానమును పండిత పామరులను పాశుపతులుఁగా జేయు ప్రవచనశక్తిని శరీరవాఙ్మనో దార్ఢ్యమును ప్రారబ్ధాంతమున శివసాయుజ్యము ననుగ్రహించెను.

పార్వతీదేవియు శంకరుని లాలనమును గమనించి యుపమన్యుని శిరముపై తన అమృతహస్తము నునిచి యాతనికి సదా కుమారత్వ ముండునట్లు వరము నొసఁగినదై పాలసముద్రమును పిండి ముద్దగా కరమునందు పెట్టి యోగశక్తిని బ్రహ్మవిద్యానిష్ఠాతత్వమును సర్వకాలసర్వావస్థలయందు కలిమిని ప్రసాదించెను.

ఉమామహేశ్వరు లిట్లు వరముల నొసఁగగా ఉపమన్యుఁడు సమాహితమనంబున కృతాంజలియై "దేవదేవా! వ్యభిచారము లేనట్టి శివభక్తిని ప్రసాదింపుము! ఒకప్పుడు శివునారాధించుటయు మరియొకప్పుడు ఇతర దేవతలను పూజించుటయు శివుఁడు సర్వదేవతాసముఁడని భావించుటయు శివుఁడు హరిబ్రహ్మాదులను రామకృష్ణాదులను పూజించినాడని చెప్పుటయు వ్యభిచారభక్తి యగును. ఇట్టి వ్యభిచారము లేనిచో అనన్యభక్తియగును ఏకాగ్రనిష్ఠకుదురును. శివభక్తులయందు పరానిష్ఠ నొసగుము! నీ సన్నిధిలో సేవకుడనై నివసించు భాగ్యమును కలుగఁజేయుము!" అని యాచించి మహాదేవుని "జయ శంకర పార్వతీపతే - మృడ శంభో శశిఖండమండన" ఇత్యాది వాక్యములతో నుతించినందున శంకరుఁడు సుప్రసన్నుఁడై అమరసిద్ధగంధర్వ కిన్నర కింపురుషాదులు వినుచుండగా దిగువవిధము సంభాషించెను.

మునికుమారా! అజరత్వ అమరత్వాది సర్వస్వమును నీ కొసఁగితిని; శివభక్తులందరును నిన్ను పూజింతురు. ఎట్టివికారము లేనివాడవై యుందువు; నీ కులగోత్రములు బంధువులు నెడతెగక నుందురుగాక! నా యందు అనన్యభక్తి శాశ్వతముగా నుండును. నీ యాశ్రమమున నెల్లకాలము శివలింగరూపమున నివసింతును. కలకాలము జీవించుము! యథేష్టము సుఖించుము! ప్రతివిషయమునను తోండదరపాటు కూడనిదని గుర్తింపుము!





ఇట్లు ఉపమన్యుని కటాక్షించి శంకరుఁడు పార్వతీదేవితోడను గణములతోడ నంతర్హితుఁడయ్యెను. ఉపమన్యుఁడు శివానుగ్రహపాత్రుఁడై తల్లికడకుఁజని జరిగినదంతయు తెలుపఁగా నామె పరమానంద భరితురాలయ్యెను. శివుఁడు చెప్పినట్లే యాతఁడు సర్వపూజ్యుండై నిజాశ్రమమున సుఖముగా నుండెను.

శివుని సురేశ్వరావతారమును వినినచో వినిపించినచో కోర్కెలు సిద్ధించుటయే గాక స్వర్గాది పుణ్యలోకములు చేకూరును. కీర్తియు ఆయుష్యంబు భుక్తియు ముక్తియు సంభవించును.

ఇద్ది సజ్జనులకు సమాధానము నొసఁగు ఆఖ్యానమని తెలియవలెను.

ఇద్ది 81వ యవతారము.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ముప్పదిరెండవ యధ్యాయము.

## త్రయస్త్రింశాధ్యాయము

### (శివుఁడు బ్రహ్మచారిగా నవతరించుట)

పూర్వకాలము దక్షుని కుమార్తెయగు సతీదేవి - తండ్రి చేయు యజ్ఞమున ఆదరసత్కారముల నందక తన దేహమును విసర్జించి మేనకాహిమవంతుల పుత్రికగా జన్మించి పెద్దదై యడవిని తపించుచు శంకరుఁడే భర్తకావలెనని కోరుచుండెను. పార్వతీదేవి చెంత నిరువురు చెలికత్తెలు కాపలా కాయుచు తపోవిఘ్నములను దూర మొనర్చుచుండిరి.

అట్టితఱి పరమేశ్వరుఁడు పార్వతిఁదగు తపంబు పరీక్షింప సప్తర్షులను పంపగా నవ్వారు శక్తికొలది తమ ప్రభావముఁ జూపినను అమ్మవారు చలింపకుండెను. అందువలన సప్తర్షులు కైలాసమునకుఁజని జరిగినదంతయు శంకరునకు నివేదించియు శివాజ్ఞఁబడసియు తమలోకమున కేగియుండిరి.

ఆ సమయమున శంకరుఁడు స్వయముగా పార్వతిని పరీక్షింపఁదలచి బ్రహ్మచర్యాశ్రమము మూర్తీభవించినట్లు రాణించు జడదారివేషమున ముదుసలిగా నచ్చోటున కేతెంచి సఖురాండ్రతో కూడుకొని చంద్రరేఖఁబోలె వేదికపై విరాజిల్లు పార్వతీదేవిఁగాంచెను. మిగుల నుత్సాహముతో దరిఁజేరియుండగా మృగచర్మ దండము కమండలముఁదాల్చి వెంట్రుకలతో నిండియుండు నవయవములతో శోభిల్లు బ్రహ్మచారిని పీఠముపై నాసీనుఁగావించి షోడశోపచారములతో పార్వతీదేవి పూజించినదై "మహాత్మా! ఈ తపోవనమంతయు తమ రాకచే విరాజిల్లుచున్నది. తామెవరు? ఎక్కడ నుండి వేంచేసితిరి" అని ప్రశ్నించెను.

అంత నా కపటబ్రహ్మచారి - దేవీమనోగతము నెఱయఁగోరుచు "నేను నా యిచ్ఛవచ్చినట్లు సంచరించువాడను. బ్రహ్మచారిని, బ్రాహ్మణుఁడను; తాపసుఁడను, ఇతరుల కుపకరించువాడను," అని బదులుఁజెప్పి నిజరూపమును మఱుగుపఱచుచు సమీపించినవాడై మఱల నిట్లు పలికెను.

దేవీ! ఏమి చెప్పుదును? చెప్పుటకు నోరాడుటలేదు. గొప్ప అనర్థమును సూచించు ప్రవర్తన నీకడ గోచెరించెడిని. సుఖపడుటకుఁదగిన నూతనయౌవనమందుండియు తపించుచున్నావంటే నీ తపము నిష్ప్రయోజనమనిపించుచున్నది. ఇంతకు నీవెవరు? ఎవరి కుమార్తెవు? మనుష్యసంచారము లేనట్టి యరణ్యమున తపించుచుంటి వెందులకు? జితేంద్రియములగు మునులకు నిట్టి ఘోరతపము సాధ్యము కాదు గదా!

అంత నా త్రిలోకజనని జడదారి మాటలు విని చిరునగవుచు నిట్లనియెను.

విప్రోత్తమా! నా చరితమును సావధానముగ వినుము! భారతవర్షమున హిమవంతుని యింటఁ బుట్టితిని. ఇంతకు మున్ను దక్షపుత్రికనై శంకరపత్నిగా దక్షయజ్ఞమున నవమానింపఁబడి యోగశక్తిచే శరీరమును పరిహరించి పార్వతినై పెరుగుచుండగా నొక్కనాడు మన్మథుఁడేతెంచి పుష్పబాణములను వేయనుండ మహాదేవుఁడు వానిని ఫాలాగ్నిచే భస్మమొనర్చెను. నా దైవము ఫలించినదని లోలోన మురియుచు శంకరుని సన్నిధానమున నిదే గిరిశిఖరమున సేవలఁజేయుచున్న నేను నిర్విణ్ణురాలనైయుండ సద్గురువులు సమీపించి యుపదేశించినందున గృహమునుండి వెడలి యడవికి తపంబునకై వచ్చితిని. మనోవాక్కాయములతో శంకరుడే నా పతి కావలెనని యపేక్షించుచున్నాను. కాని శంకరుఁడు భర్తగా లభించుట సాధ్యముకాని పని యని తెలిసియు మనోవేగము నాపుకొనలేక నిట్లు తపించుచుంటిని.

ఇంద్రాది దేవతలను నారాయణుని పంకజాసనునిఁగూడ విడచి పినాకపాణియే భర్త కావలెనని మిక్కుటముగ మక్కువతో నున్నదానను.

పిదప నా బాడబుఁడు నొకపరి హసించి దిగువవిధము వాక్రుచ్చెను.

పర్వతరాజగు హిమవంతుని కుమార్తెవై ఎట్టి బుద్ధి నవలంబించితివి? అమరుల నందరిని తృణీకరించి రుద్రుఁడే భర్త కావలెనను పేరాసతో తపించుచుంటివి. రుద్రుఁడెట్టివాడో నాకు పూర్తిగా తెలియును. అతఁడు ధ్వజమున నెద్దు నిలిపి జడలుఁదాల్చిన వికారస్వరూపమున నుండువాడు. ఒంటరివాడు బైరాగియునైయుండు నాతని నీవపేక్షించుట పాడికాదు. నీ రూపమునకు లావణ్యమునకు సౌకుమర్యాము మున్నగు లక్షణములకన్నిటికిని విరుద్ధముగ నుండు రుద్రునితో చెలిమిఁగోరుట నాకు నచ్చుటలేదు. ఇకపై నీ యిష్టప్రకారము చేయవచ్చును.

అని పలికి యా జడదారి యింకను పలువిధముల తనను నిందించుకొనెను.

శివనిందాపరములగు బ్రహ్మచారిమాటల నాలకించి పార్వతీదేవి మిగుల క్రుద్ధురాలై "నీవు ఎట్టివాడవో తెలుసుకుంటిని. బ్రాహ్మణుడవైనందున వధింప నలవిఁగాదు. బ్రహ్మచారి రూపమున నేతెంచిన మోసగానివి; శివుని నిందించుచుంటివిగాన నీపై పట్టరాని కోపము వచ్చుచున్నది. శివుని గుర్తించు శక్తిలేనివాడవు; శివునుపాసించు నధికారము నీయందు లోపించినదని చెప్పవచ్చును. నిన్ను పూజించినందువలన పాపము నొడిఁగట్టుకుంటిని.

శ్లో॥ శివనిందాం కరోతీహ - తత్త్వ మజ్ఞాయ యః పుమాన్ ।
ఆజన్మసంచితం పుణ్యం తస్య భస్మీభవత్యుత॥ ౪౧





పరమాత్మలక్షణమును గుర్తింపక శివుని నిందించు పురుషుఁడు (స్త్రీ) జన్మించినది మొదలు కొని చేసిన పుణ్యమును పోగొట్టుకొనును. శివద్వేషము గలవారిని చూచినచో తత్క్షణముననే ప్రాయశ్చిత్తమును చేసుకొనవలెను. అరెరే దుర్మార్గుడా! నీవు ఏవేవో బీరములాడితివి. శంకరుఁడెట్టివాడో గుర్తెరిగి యున్నదానను. యథార్థమైన శివజ్ఞానము లేనివాడవు; శివుఁడే పరమాత్మయగువాడు. రుద్రుఁడు మాయారూపముల నెన్నిటినో ధరించును. నా యభీష్టమును తప్పక నేరవేర్చును. సజ్జనులచే సర్వకాలము ఆరాధింపఁబడుచు తనలో తాను ఆనందరసాస్వాదముఁ జేయుచు ఆకలి దప్పి మున్నగు ప్రాకృతగుణములు లేనివాడునై నిత్యసత్య రూపము గలిగియుండువాడు" అని వచింప నా బ్రహ్మచారి మరల శివనిందఁ గావింప నుంకించుచుండ, నట్టి స్థితిని గమనించి యమ్మవారు చెలికత్తెతో నిట్లనియెను.

ఈ ద్విజాధముని నివారించుము! మరల నేమేమో శివుని తూలనాడు నట్లు తోచెడిని.

శ్లో॥ న కేవలం భవేత్ పాపం - నిందాకర్తుః శివస్యహి ।
యో వై శృణోతి తన్నిందాం - పాపభాక్ స భవే దిహ ॥

"శివనిందఁ జేయువానికే గాక శివనిందను విన్నవానికిని పాపము సంభవించును. శివుని నిందించువానిని శివభక్తులు సర్వవిధముల యత్నించి వధింపవలెను. శివనిందకుఁడు బ్రాహ్మణుఁ డైనచో వానిని విసర్జించి వడిగా మరియొకచోటునకు వెళ్లవలెను" అని శాస్త్రము ఉపదేశించినది కావున నీ తెలివితక్కువ వాని నిచ్చోటున విడచి స్థలాంతరమునకు వెళ్ళుదము.

అని వక్కాణించి యడుగు లేపునంతలో బ్రహ్మచారి శివుఁడుగా ప్రత్యక్షమై పార్వతీ దేవిఁదగు చీరకొంగు పట్టుకొనెను. అప్పుడా శివరూపము - తపఃకాలమున పార్వతి ధ్యానించి నట్లు గానే కన్పట్టుచుండెను. తన మనోహరుఁడు ముందగుపడుచున్నందున సిగ్గుచే తలవంచియున్న పార్వతిని పరమేశ్వరుఁడిట్లు పలుకరించెను.

నన్ను విడనాడి యెక్కడికి వెళ్లుదువు? నేను నిన్ను విడచి యొక్క క్షణము గూడ నుండువాడను గాను. నీ భావమును పరీక్షింప బ్రహ్మచారిరూపమున నేతెంచితిని. నా యందు దృఢభక్తి గలదానవని గుర్తించి ప్రసన్నుడనైతిని. వలయునది కోరుకొనుము! నీకు నీయరానిది లేదు. నన్ను ప్రేమాస్పదునిగా నారాధించితివి. గాన నీ పుణ్యములకు వశుఁడనై దాసుఁడనైతిని. ఇప్పుడు నీ సుందరరూపముఁజూచి మోహితుఁడనగుచున్నాను. ఇకముందు మాత్రము నీవులేనిది యొక్కొక్క క్షణము యుగముగా గోచరించును. సిగ్గుపడకుము! సనాతన కాలమునుండి నీవు భిన్న భిన్న రూపములతో నాభార్య వగుచుంటివి. ఇప్పుఁడును నాదానవే కావున కైలాసమునకేగుదుము రమ్ము!

అని దేవదేవుఁడు వచించుచుండ దేవి లోలోన సంబరపడుచు తపించిన ఆయాసమునంతయు మఱచెను. మరియు శివుని దివ్యరూపమును కనులార గాంచి యధోముఖియై "దేవా! ప్రసన్నుడవైనచో దయఁగలవాడవై పతివి కమ్ము! నన్ను నీ యర్ధాంగిగా పరిగ్రహింపుము!" అని ప్రార్థించెను.

అంత మహాదేవుఁడు మేనకాహిమవంతులను మెప్పించి వివాహవిధిని పార్వతీ పాణిగ్రహణము నాచరించియు పార్వతిఁదోడ్కొని కైలాసము నలంకరించి యచ్చోటున సుఖవిహారము నొనర్చియు దేవతాకార్యమును సాధించెను.

పార్వతీ తపోదార్ఢ్యము ప్రకటింప ననుగ్రహించిన యవతారమును వర్ణించితిని.

ఇదియే బ్రహ్మచార్యవతారము; ఇక్కథ-పవిత్రమైనది. ఇద్దానిని వినువారు ఇహపరభోగముల ననుభవించి ముక్తులగుదురు.

సురేశ్వరావతారము తరువాత రెండవతారములు ఎట్టివో ఇందు చెప్పఁబడలేదు. కాలక్రమమున ముద్రణగ్రంధములలో రెండు శివావతారములు స్ఖలితములై లోపించినట్లు తెలియనగును.

ఇద్ది (84)వ యవతారము

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున ముప్పది మూడవ యధ్యాయము.

## చతుస్త్రింశాధ్యాయము

### (సునర్తక నటుఁడుగా శివుఁడవతరించుట)

పార్వతీదేవి శంకరుని భర్తగా బడయుటకు వనమున తపించినపుడు శంకరుఁడు ప్రత్యక్షమై వరము నడుగుమనఁగా నీవే పతివి కావలయునని ప్రార్థించి పార్వతి "నా తండ్రి యింటికి వెళ్లుదును. నీవు నా తండ్రి కడకేతెంచి నన్ను యాచించి హిమవంతుని గృహస్థాశ్రమమును సార్థకముఁజేయుము! శాస్త్రోక్తవిధానమున వివాహమాడి నన్ను పరిగ్రహించి సుఖములఁదేల్చుము! నిర్వికారుఁడవైనను భక్తవత్సలుడవగుటచే భక్తురాలి ననుగ్రహింపుము!" అని వేడుకొనెను.

అటులే యగుగాక! అని శంకరుఁడు వచించి కైలాసమున కేగెను. పార్వతియు చెలికత్తెలతో కూడి పితృగృహమున "ఇప్పుడు నా రూపము సార్థకమైనదని" లోలోన మురియుచుండెను.

పార్వతి తపించి యింటికి రాగా మేనకా హిమవంతులు మహోత్సవము నాచరించి బ్రాహ్మణులకు ధన కనక వస్తు వాహనాదులను సమర్పించి వేదమంత్రముల నాశీర్వదింపఁజేసిరి.

అట్టితతి మేనకాదేవి పార్వతిని చెంతనిడుకొని ముంగిట నుండగా హిమవంతుఁడు గంగానదికి స్నానార్థమై వెళ్ళెను. అదే సమయమున లీలావిలాస చతురుఁడగు మహాదేవుఁడు సునర్తకుఁడను పేరుతో నటుఁడై యచ్చోటున కేతెంచి మేనకాదేవి ముందు నిలువఁబడెను.

సునర్తకుని రూపము నేమని వర్ణింపవలెను? కొమ్ము నెడమచేతిని డమరుకమును కుడిచేతిని బొంతను వీపునఁదాల్చి ఎర్రని బట్టఁగట్టుకొని శోభించుచుండెను.

అతనిఁజూచుటకు స్త్రీలు పురుషులు బాలురు వృద్ధులు పురవాసులందరును హఠాత్తుగా నేతెంచి పాటను వినుచు ఆటఁగాంచుచును చకితులగుచుండిరి. మేనకాదేవియు సంతోషించి బంగారుపళ్లెరమున రత్నముల నునిచి యీయనుండ సునర్తకుఁడు రత్నములు వలదనియునీ కుమార్తె కావలయు ననియు యాచించెను.

అందుకు మేనకాదేవి కోపగించి "ఈ ఆటగాడు అందరానిదానిని కోరుచున్నవాడ"ని యాశ్చర్యపడుచుండ హిమవంతుఁడు మాధ్యాహ్నికము ముగించుకొని గంగానదినుండి వచ్చి మరల మరల నాడుచు పాడుచున్న నటు నవలోకించినవాడై జరిగినదంతయు భార్య చెప్పగా విని క్రుద్ధుఁడై వీనిని వెడలఁగొట్టుడని భటుల నాజ్ఞాపించెను.

కాని రాజపురుషులలో నెవఁడును అగ్నివలె మండుచున్న నటుని చేరఁజాలకుండెను. తరువాత నా కపటనాటకసూత్రధారి యగు మహాపురుషుఁడు - శైలాధిరాజునకు స్వప్రభావమును చూపెట్టఁ దలచినవాడై తాను శంఖచక్రగదాపద్మధారియగు మహావిష్ణువుగను, నాలుగువేదములను చతుర్ముఖముల నుచ్చరించు బ్రహ్మదేవునిగను, ఏకచక్రరథాసంచారియగు సూర్యదేవునిగను, రోహిణీరమణుఁడగు చంద్రునిగను, శచీపతియగు అమరేంద్రునిగను కనుపడి యనేక లీలారూపములను చూపెట్టెను. పిదప పార్వతీదేవితోకూడిన శంకర రూపము గోచరించెను.

ఇట్టి శివుని నానావిధ రూపవిలాసమును హిమవంతుఁడు చూచుచు విస్మితుఁడై ఆనందపరవశుఁ డగుచుండ భిక్షువర్యుఁడు (సునర్తకుఁడు) పార్వతియే కావలెననియు మరియొకటి వలదనియు సంభాషించి అమ్మవారి సంజ్ఞ ననుసరించి యచ్చోటునుండి కైలాసమునకుఁ జనినవాడు.

ఆ తరువాత మేనకా హిమవంతులు "మనలను శివుఁడు మోసగించి వెళ్లినాడ"ని గుర్తించి "శంకరునకే మనకూతురు నీయవలె"నని నిశ్చయించుకొనియు శివునియందు ఏకాగ్రభక్తి కలవారైరి.

భక్తులకు మేలునొనఁగూర్చు మహేశ్వరుఁడు - మేనకాహిమవంతుల ననుగ్రహించి విధివిధానముగ పార్వతీ పాణిగ్రహణము నొనర్చియు కైలాసమున సుఖముగా నుండెను.

ఇద్దియే అమ్మవారి కోరికను మన్నించి నర్తకుని వేషమున మేనకాహిమవంతులను యాచించిన శివావతారము. ఇక్కథ-పాపరహితంబు పరమంబు నగునది ఇద్దానిఁజదువువారు వినువారు వినిపించువారు నిహపర సుఖముల ననుభవింతురు గాదే!

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ముప్పది నాలుగవ యధ్యాయము.

ఇద్ది 85వ యవతారము.

## పంచత్రింశాధ్యాయము

### (సాధుద్విజుఁడుగ శివుఁడు అవతరించుట)

మేనకాహిమవంతులకు శివునియందు కలిగిన ఏకాంతభక్తిని సురలు గమనించి విచారపడుచుండిరి.

శ్లో॥ ఏకాంతభక్త్యా శైలశ్చేత్ - కన్యాం దాస్యతి శంభవే ।
ధ్రువం నిర్వాణతాం సద్యః - సంప్రాప్స్యతి శివస్యవై ॥





హిమవంతుఁడు శంకరునకు ఏకాగ్రభక్తిచే కన్యాదానముఁజేయనెడ - తత్కాలముననే ముక్తిని పొందును. ఇద్ది ముమ్మాటికి నిశ్చయము. అనఁగా శివసాయుజ్యము నొందునని భావము. అవధిలేని రత్నములకు నిలయమగు హిమవంతుఁడు - పార్వతీవివాహానంతరమే ముక్తుఁడగు నెడల రత్నగర్భ యనఁబడు పృథివి నిస్సార యగును. పర్వతరూపమును విడనాడి దివ్య శివరూపముఁదాల్చి కైలాసముఁ జేరి సారూప్యముక్తి నొందియు శివానుగ్రహ పాత్రుఁడై మహాభోగముల ననుభవించి చివరకు కైవల్యముఁ జెందును. అట్లగుచో ప్రపంచమున హిమాలయము లేనిదగును. రత్నములు కొఱవడును. భూలోకమున మనకు నివాసము కఱవగును.

ఇట్లు దేవతలు చింతించి తమ యాచార్యుఁడగు బృహస్పతిఁజేరినవారై "హిమాలయముఁజేరి మహేశ్వరుని తూలనాడి హిమవంతుని దృఢమైన శివభక్తిని సడలింపు" మని వేడుకొనఁగా బృహస్పతి "మీలో నెవరైన హిమవంతుని చెంతఁజేరి శివనిందఁగావించి స్వార్థమును సాధించునట్లు చేయుఁడు! లేక బ్రహ్మలోకమున కేగి ఇంద్రాద్యమరులందరును విధాతను ప్రార్థింపుడు! అతఁడు మీ యభీష్టమును నెరవేర్పవచ్చును" అని వక్కాణించెను.

ఇట్టి గురువాక్యము నాలకించిన దేవతలు సత్యలోకముఁజేరి బ్రహ్మదేవునిముందు నిలువఁబడియు సమాచారము నంతయు నివేదింప నా దేవుఁడు కొంతతడవు ఆలోచించి-పుణ్యములను హరించు శివనిందను చేయఁజాలను గాన కైలాసమునకుఁజని శంకరుని ప్రార్థించి యా దేవదేవుని హిమవంతుని కడకు పంపుడు! అతఁడే ఆత్మనిందను చేసుకొనును. పరనింద కీడు నొనఁగూర్చును కాని తనను తాను నిందించుకొనుట మంచిదని యమరులకు విశదీకరించెను.

అంత సురలు కైలాసమునకువెళ్లి శంకరునకు మ్రొక్కులిడినవారై హిమవంతుని ఏకాంతశివభక్తిని భంగపఱచుమని విన్నవింపగా మహాదేవుఁడందుల కంగీకరించి యవ్వారి నూరడించియు సాగనంపినవాడై లోలోన ఆశ్చర్యపడుచుండెను.

మాయను తన చేతి నుంచుకొని యెట్టి ప్రకృతివికారమునుఁజెందనట్టి భగవానుఁడు భక్తవత్సలుఁ డగుటచే కైలాసమునుండి హిమాలయముఁజేరుటకు నుద్యుక్తుడై దండము ధరించి గొడుగు పట్టుకొని పట్టుధోవతిఁగట్టుకొనియు నొసట తిలకముఁదాల్చియు స్ఫటికమాలికను కేలఁబూనియు సాలగ్రామను కంఠమున ధరించి హరినామజపముఁజేయుచు బంధువులతో కూడియుండు హిమవంతుని కొలువు కూటమున సాధుద్విజుడై ప్రవేశించెను.

సాధుద్విజవేషమున సాక్షాత్కరించిన శంకరుని కెదురేగి హిమవంతుఁడు ప్రణమిల్లి వినయమున "మీరెవర"ని ప్రశ్నింపగా నా యోగీశ్వరుఁడు ఇట్లు వాక్రుచ్చెను.

నన్ను సాధుద్విజుఁడందురు. పరమార్థము నెఱిఁగిన వైష్ణవుఁడను, గురుకృపాబలమున సమస్తమును గుర్తెరుగు శక్తి కలవాడనై ప్రపంచమంతట తిరుగుచు పరోపకారముఁ జేయుచుందును. శైలాధిరాజా! నా యోగమహిమచే నొక సమాచారమును కనుగొంటిని గాన నీకు హితము నుపదేశింప నేతెంచితిని.





లక్ష్మీదేవిఁబోలిన నీ కూతురును కులశీలములు తెలియనట్టి ముక్కంటిదేవరకు నొసగవలెనని నిశ్చయించుకుంటివి. నారాయణుని వంశమున జన్మించి గట్టులరేడువై యున్న నీవు బాగుగా వరుని యోగ్యతను విచారించి కన్యాదానముఁ జేయవలసియుండును. శంకరుఁడు బంధువులు లేనివాడుగదా! అట్టివానికి పార్వతి నిచ్చుట మంచిదో కాదో నీ ధర్మపత్నియగు మేనకాదేవిని మరియు మైనాకుఁడు మున్నగు ఆత్మీయులను విచారించుము! పార్వతిని మాత్రము అడుగకుము! రోగికి ఔషధమువలె నామాట నీకు రుచింపక పోవచ్చును. శంకరునకు పార్వతిని సమర్పించు వార్తను వినిన మహాజనులందరును విచారగ్రస్తులగుచున్నవారు.

ఇల్లు ముంగిలి లేనివాడు, ఎవరితోడను చెలిమిఁజేయనివాడు, వికారరూపముఁ గలిగి గుణము లేనివాడై వల్లకాడునందుండువాడు, పాములను వేసుకొని దిసమొల నుండువాడే గాక బూడిదపూసుకొని తలపై పాముఁజుట్టుకొని బ్రహ్మచర్యాది చతురాశ్రమ వర్జితుఁడై ఎప్పుడు ఎటనుండునో ఎవరికిని తెలియనివాడును;

ఇట్టి వానికి నీ పుత్రిక నీయవలెనో లేదో లెస్సగా విచారించుకొనుము!

సాధుద్విజుఁడు ఇవ్విధము హిమవంతునకు బోధించి నిజనివాసమగు వెండికొండకుఁ జనినవాడయ్యెను.

మేనకాహిమవంతులు సాధుద్విజుని ప్రబోధము నాలకించి తమ మనస్సులోగల శివైకాంతభక్తిని సడలించుకొని - ప్రస్తుతము కర్తవ్యమెద్ది - యని యాందోళన పడుచుండిరి.

తరువాత శంకరుఁడు అరుంధతీదేవిని సప్తర్షులను పంపి మేనకాహిమవంతులను మెప్పించియు పార్వతిని వివాహవిధానమునఁ బరిగ్రహించిన వాడై తన దివ్య లీలావిలాసమును భక్తులకు చాటినవాడయ్యెను.

పర్వతరాజదంపతులు ఏకాగ్రభక్తిని చెఱచుకొనినందున పరమాత్మకు పార్వతి నొసగినను ముక్తిజెందనివారై కలకాలము పూర్వరూపములతోడనే ప్రపంచమున నుండ వలసివచ్చెను. ఐనను కల్పాంతరమున పరమపదముఁజేరి శివసాయుజ్యము నొందుదురు గాన నిక్కల్పమున నమరులకు హిమాలయము శాశ్వతనిలయ మయ్యెను.

ఇద్ది శివుని సాధుద్విజావతారము; దేవతాకార్యమును సాధించిన లీలారూపము, ఈ యాఖ్యానము- దీర్ఘాయుఃప్రదంబు స్వర్గప్రాపకంబునై చదువువారికి వినువారుకిని భోగమోక్షముల నొదవఁజేయునదియు గాదే!

**ఇద్ది 86వ యవతారము.**

**ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున ముప్పదియైదవ యధ్యాయము.**





# షట్త్రింశాధ్యాయము

## (శివుని అశ్వత్థామావతారము)

నందికేశ్వరుఁడు సనత్కుమారునకు, సనత్కుమారుఁడు వేదవ్యాస మహర్షికి, వేదవ్యాసుఁడు సూతునకు, సూతమహర్షి శౌనకాదిమునులకు చెప్పఁదొడఁగెను.

ప్రభువు అశ్వత్థామగ నవతరించిన సందర్భమును గమనింపుడు!

మహాబుద్ధిశాలియగు బృహస్పతియంశమున భరద్వాజమహర్షికి పుత్రుఁడై ద్రోణాచార్యుఁడు అయోనిసంభవుఁడుగ జన్మించెను. ధనుర్ధారులలో నగ్రగణ్యుఁడై శూరుఁడై వేదవేదాంగవిదుఁడునై శస్త్రాస్త్రవిద్యానిష్ణాతుఁడై కురుపాండవులకు నాచార్యుఁడై ఆరుగురు మహారథికులలో మిన్నయునైయుండు ద్రోణుఁడు కౌరవులను రక్షింపవలెనని సంకల్పించి సత్పుత్రునిఁ బడయుటకై శంకరునిఁ గూర్చి ఘోరముగ తపించెను.

అందువలన శంకరుఁడు ప్రసన్నుఁడై సాక్షాత్కరింప ద్రోణుఁడు మోకరిల్లి యంజలిఁ ఘటించి ప్రార్థింపగా వరము నడుగుమని భగవానుఁడు వక్కాణించెను. దేవా! నీయంశము వలన నొక్కకుమారు ననుగ్రహింపుము! వానినెవరు నోడింపకుండునట్లు మహాబలవంతు నొనర్పుము!" అని యాచింప పరాత్పరుఁడట్లేయగుగాక! అని వరముఁ బ్రసాదించి యంతర్హితుఁడయ్యెను.

పిదప ద్రోణాచార్యుడు నిండు సంబరమున నింటికేగి శివానుగ్రహప్రాప్తి సమాచారమును తన భార్య కెఱిగించి సుఖముగా నుండెను.

కొంతకాలమునకు శంకరుఁడు ద్రోణాచార్యునకు పుత్రుడై "అశ్వత్థామ" యను పేరుతో శూరుఁడుగను వీరుఁడుగను శత్రుపక్షభయంకరుఁడుగను కమలముల వంటి కన్నులతో నలరారుచు జనకుని శాసనము ననుసరించి కౌరవపాండవయుద్ధమున కౌరవులకు సహకారి యయ్యెను.

భారత యుద్ధమున భీష్మాది మహావీరులు - అశ్వత్థామ నాశ్రయించియే దేవతలకుఁ గూడ గెలుపు నలవిఁగాకుండిరి. అశ్వత్థామువలన భయపడి పాండవులు కౌరవులను జయింపఁజాలని సందర్భమును శ్రీకృష్ణుఁడు కనుగొని ప్రేరేపించినందున నర్జునుఁడు తపించి శంకరుని వలన పాశుపతాస్త్రముఁ బడసినవాడై కౌరవులను పరాజితుల నొనర్పఁగలిగెను.

కౌరవులు తనను సత్కరించుచున్నందున నవ్వారికి నుపకరింపఁదలచి యశ్వత్థామ పాండవ కుమారులను సంహరించెను. అట్టితఱి శ్రీకృష్ణుఁడు మున్నగు మహావీరులు తమ శక్తి కొలది ఉపపాండవులను రక్షించుచున్నను ఉపయోగము కాకుండెను.

అర్జునుఁడు పుత్రశోకమున యశ్వత్థామతో పోరాడుటకు రథముపై శ్రీకృష్ణునితోడ వెళ్ళగా నాతఁడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. అద్దాని వెలుతురు నంతట వ్యాపింప కౌంతేయుఁడు వెఱఁగందుచు శ్రీకృష్ణుని ప్రార్థింప దేవకీనందనుఁడు స్వయముగ శివుని నుతించి యర్జునిని శివప్రార్థనకై పురిగొలిపినందున పాండవమధ్యముఁడు ఉదకమును స్పృశించి శంకరుని వేడుకొని పాశుపతాస్త్రమును ప్రయోగించెను.

నిజముగ విచారించినచో బ్రహ్మాస్త్రము వ్యర్థమగునది కాకున్నను శివుని పాశుపతము ధాటికి తాళలేక శాంతించెను. ఇట్లు పాశుపతముచే బ్రహ్మాస్త్రము శమించుట - ఆశ్చర్యకరమని భావింపవలదు.

చిత్రవిచిత్ర నిర్మాణ దక్షుఁడగు మహాదేవుఁడు స్వేచ్ఛావిలాసముగ సృష్టిస్థితిలయముల నొనర్చువాడుగదా! అట్టి శైవాస్త్రమును శివమయముగ భావించి యశ్వత్థామ తన బ్రహ్మాస్త్రము నుపసంహరించుకొనవలసివచ్చెను.

అనంతరము అశ్వత్థామ ప్రపంచమును పాండవాంకురరహితముగఁజేయ నుద్దేశించి యుత్తరాదేవి గర్భమునందున్న శిశువును సంహరింప బ్రహ్మాస్త్రమునుత్తరాగర్భమునందు ప్రవేశింపఁజేయగా నామె బాధపడుచు శ్రీకృష్ణునిఁబ్రార్థించెను.

అంత శ్రీకృష్ణుఁడు శివుని స్మరించి - ఉత్తరాగర్భమున నశ్వత్థామఁదగు బ్రహ్మాస్త్రము కలదని గుర్తించి మహేశ్వరుఁడొసగిన సుదర్శనచక్రముతో గర్భమును రక్షించెను. శంకరుని యనుగ్రహముఁదగు బలమున యాదవకులతిలకుఁడిట్లు గావించెనని తెలుసుకొనిన అశ్వత్థామఁదగు చరణములపై శ్రీకృష్ణభగవానుఁడు పాండవులను పడవేయగా నాతఁడు ప్రసన్నుఁడై పాండవులకు శ్రీకృష్ణమూర్తికి ననేకవరముల నొసగి యనుగ్రహించెను.

ఇవ్విధము మహేశ్వరుఁడు ద్రోణపుత్రుఁడుగ నవతరించి భక్తుల ననుగ్రహించియు లీలావిలాసమును చూపెట్టెను. అశ్వత్థామ చిరంజీవియగుటఁజేసి గంగాతీరమున నిప్పటికిని నివసించుచు సత్పురుషులకు కనుపడుచుండును.

అశ్వత్థామావతారము సిద్ధుల నొసగునదై భక్తులను కాపాడునదియునై కీర్తించువారికి వినువారికిని శ్రేయస్కరంబు మోక్షప్రదంబును గాదే!

ఇద్ది 87వ యవతారము.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ముప్పదియారవ యధ్యాయము.

## సప్తత్రింశాధ్యాయము

### (శివుని కిరాతావతారము)

శంకరుఁడు కిరాతరూపముఁదాల్చి మూకాసురుని సంహరించి యర్జుననుకు వరంబొసంగెను.

పాండవులు సుయోధనునిచే జూదమున పరాజితులై రాజ్యము వీడి ద్రౌపదీదేవితో కూడ ద్వైతవనమునందు నివసించుచుండిరి. అచ్చోట సూర్యభగవానుఁడు ప్రసాదించిన అక్షయపాత్రఁబడసి యద్దాని సహాయమున కాలముఁ గడుపుచుండిరి. అట్టితతి సుయోధనుఁడు దుర్వాసమహర్షిని ప్రార్థించి పాండవుల చెంతకు పంపగా దుర్వాసుఁడు పదివేల శిష్యులను వెంటనిడుకొని ద్వైతవనమున పాండవులఁ జేరియు భోజన మర్థింపగా నవ్వారు అందుల కంగీకరించినందున మహర్షి-స్నానార్థమై నదికి వెళ్లెను.





అంత పాండవులు తమవద్ద ఆహారము లేనందున మహర్షి కోపగించునని భీతిల్లి ప్రాణములను పరిహరింప నుద్యుక్తులు కాగా ద్రౌపదీదేవి శ్రీకృష్ణుని స్మరింప నా దేవకీనందనుఁడేతెంచి భాండమునందలి కూరముక్కఁదిని దుర్వాసాదుల ఆకలిఁదీర్చి సంతృప్తి పఱచెను. దుర్వాసుఁడు తానేగాక తన శిష్యులు గూడ తృప్తిపడినందున పాండవుల దరిఁజేరక స్వనివాసమునకుఁ జనినవాడయ్యెను.

ఇవ్విధము శ్రీకృష్ణుని కృపచే పాండవులు తమ ఆపదఁదీర్చుకొనినవారై "దేవా! శత్రువగు సుయోధనుఁడు దినదినము బలవంతుఁడగుచున్నవాడు. అట్టి వానిని గెలచుట యెట్లు?" అని శ్రీకృష్ణభగవానుని ప్రశ్నింపగా నాతడిట్లు వాక్రుచ్చెను.

పాండవులారా! నా మాట పాటింపుఁడు!

పూర్వము నేను ద్వారకానగరమునఁబ్రవేశించిన తరువాత పగతుర నోడించుటెట్లని విచారించి యుపమన్యుమహర్షిగారి యుపదేశముఁబడసినవాడనై పటుక మనఁబడు పర్వత శ్రేష్ఠమున నేడు మాసములు శివారాధనము నొనర్చితిని. అందువలన పరమేశ్వరుఁడు సాక్షాత్కరించి

శ్లో॥ ఇష్టాన్ కామా నదా న్మహ్యం - విశ్వేశశ్చ స్వయం స్థితః ।
తత్ప్రభావా న్మయా సర్వ - సామర్థ్యం లబ్ధ ముత్తమమ్ ॥ ౧౫

కోరిన వరముల నొసఁగెను. అతని మహిమ వలననే నేను సర్వవిధంబగు సామర్థ్యము గలవాడనైతిని.

శ్లో॥ ఇదానీం సేవ్యతే దేవో - భుక్తి ముక్తిఫలప్రదః ।
యూయం సేవత తం శంభు - మపి సర్వసుఖావహమ్ ॥ ౧౬

భోగ మోక్షముల నిచ్చునట్టి మహాదేవు నిప్పటికిని పూజించుచున్నాను. భక్తులందరికిని సుఖము నొదవఁజేయు స్వభావము గల పరమేశ్వరుని మీరు గూడ నావలె నారాధింపుఁడు!

పిదప శ్రీకృష్ణభగవానుఁడు శివపాదాంబుజములను స్మరించుచు వడివడిగా ద్వైతవనమునుండి ద్వారకానగరముఁజేరినవాడయ్యెను. పాండవులు కౌరవుల ప్రజాపరిపాలనములోని విశేషములను కనుగొనుటకు నెఱుకువానిని పంపగా వాడు హస్తినాపురము జేరి దుర్యోధనుని కపటరాజ్యగుణములను గుర్తించి పాండవుల ఁజేరియు సర్వంబు నివేదించెను.

సుయోధనుఁడు ప్రజాపరిపాలనమును చక్కగా చేయుచున్నవాడని పాండవులు కిరాతుని వలన తెలిసికొని "బలవంతుడైన శత్రువును జయించుట దుస్సాధ్య"మని లోలోన గుందుచు "కర్తవ్యమెద్ది? ఎక్కడికి వెళ్లవలెను?" అని విచారపడుచుండిరి.

ఇంతలో వేదవ్యాసుఁడరుదెంచెను. అతఁడు విభూతిరేఖలఁదాల్చి జటాజూటముచే విరాజిల్లుచు రుద్రాక్షమాలికలను ధరించియు నిండు శివభక్తిని శివపంచాక్షరీ మహామంత్రమును జపించుచు తేజః సముదాయముఁ బోలినవాడై ధర్మము మూర్తీభవించినట్లు కనుపడుచుండెను.

పాండవులు వేదవ్యాసున కెదురేగి లోనికి తోడ్కొని యేతెంచి మృగచర్మముతో కూడిన దర్భాసనముపై కూర్చుండఁజేసి పూజించియు ఈవేళ ధన్యులమైతి మనియు మా తపస్సు దానములు ఫలించినవనియు దుఃఖము దూరమైనదనియు మహాత్ముల యాశ్రయము లభించినను సంకటము తొలగని యెడల నందుకు దైవమే ప్రబలకారణ మనియు విన్నవించుకొనిరి. మఱియు

మహదాశ్రయము కల్పవృక్షమువంటిదై దారిద్ర్యమును పోగొట్టును. గొప్పవారిఁ జేరుటతోడనే దీనులకు రక్షణము సంభవించును. మహనీయులు ఆశ్రితుల గుణములను పరిశీలించువారుకారు. దీనులను కాపాడుటయే మహాత్ముల స్వభావమై యున్నది. సజ్జనులను సేవించువారికి మేలు తప్పక చేకూరును. ఇకముందు మా భాగ్యము ఫలించుగాక! దౌర్భాగ్యము తొలగుగాక! తమ రాకచే మా మనస్సులు స్థిరములగుచున్నవి. గాన నో పితామహా! మా దుఃఖము దూరమగు నుపాయము నుపదేశింపుడు! అని ప్రార్థించిరి.

వేదవ్యాసుఁడు పాండవుల దీనవాక్యముల నాలించి ప్రసన్నమనంబున "పాండవులారా! దుఃఖింపకుఁడు! ధన్యులు కృతార్థులును కాగల మీ సత్యధర్మము లోపింపనట్టిది సజ్జనులు ప్రాణసంకట సమయమునందైనను సత్యధర్మమును విడువజాలరు. కౌరవులు మీరును నాకు సమానులైనను ధర్మాత్ములగు మీయందు పక్షపాతము కలవాడను. అంధుఁడైన ధృతరాష్ట్రుడు పుత్రలోభముచే ధర్మమును త్యజించి మీ రాజ్యమునపహరించె. ధృతరాష్ట్రునకు - తండ్రిలేని మీరు కౌరవులును కుమారులుగా కరుణింపఁదగినవారైనను సుయోధనునియందు పక్షపాతమును చూపనిచో ఇట్టి యనర్థము వాటిల్లకుండెడిది. జూదము తరువాత జరుగనున్నది జరిగితీరినది. సుయోధనుఁడు దుర్మార్గుఁడు, మీరు ధర్మాత్ములు సత్యవంతులును, గాన వానికే చివర నశుభము సంఘటించును. సుయోధనుఁడు నాటిన పాపబీజము అంకురించి పెంపొంది యడుగంటు సమయము సమీపించినది. అందువలన మీరు చింతింపవలసిన యవసరములేదు. మీకే శుభము చేకూరును. విచారింపకుఁడు!" అని వక్కాణింప పాండుతనయులు విని సంతృప్తిపడినవారై మరల నిట్లు నుడివిరి.

మహానుభావా! మీరుచెప్పినదంతయు యథార్థమేను; దుర్మార్గులు వనమునందును మమ్ము కష్టపెట్టుచున్నవారు. అట్టి యిడుమును తొలగించు నుపాయమును నిర్దేశింపుడు! శంకరు నారాధింపవలెనను శ్రీకృష్ణవాక్యము నుపేక్షించితిమి. అట్టి దైవమార్గమును తాము ప్రస్తుత ముపదేశింపుడు!

అంత వేదవ్యాసమహర్షి - శివపాదాంబుజములను స్మరించి సంతుష్టస్వాంతుఁడై "ధర్మబుద్ధిగల పాండవులారా! శ్రీకృష్ణభగవానుఁడు చెప్పిన శివారాధనము సఫలంబగును. అతఁడే గాక నేనును శివు నారాధించుచున్నవాడను. మీరుగూడ మహాదేవు నర్చింపుడు! శివారాధనము వలన దుఃఖము దూరమగుటయే గాక సుఖంబును లభించును" అని వచించి పాండవులైదుగురిలో అర్జునుఁడే శివపూజనమునకుఁదగినవాడని నిశ్చయించి తపఃస్థలంబును మదినెన్నుకొనియు వెండియు నిట్లనియెను.

కురువంశప్రదీపకులారా! హితము ప్రియంబు నగు నంశమును చెప్పుచున్నాను. వినుఁడు!

శివుఁడే పరమాత్మయనియు బ్రహ్మవిష్ణురుద్రులను మించినవాడనియు సత్పురుషులకు సాక్షాత్కరించువాడనియు భావింపుడు. బ్రహ్మదేవుఁడు మొదలుకొనియుండు ప్రపంచమంతయు శివునిచే





వ్యాపింపఁబడియున్నది. అట్టి శివరూపమును సచ్చిదానందమయముగాను, అఖండపరిపూర్ణముగను ధ్యానించి పూజింపుడు! దేవమానవాదిజీవులందరిచే సేవింపఁబడుచున్న శంకరుఁడు భక్తుల దుఃఖములను నివారించు కరుణామయుఁడు; మరియు నా పరాత్పరుఁడు భక్తివిధేయుడై త్వరలో ప్రసన్నుఁడై భుక్తి ముక్తులను ప్రసాదించును.

అందువలన దుష్టశిక్షణము శిష్టపరిపాలనము నొనర్చు పురుషోత్తముఁడగు సదాశివు నారాధింపుడు!

కాని మొదట నింద్రమంత్రము నర్జునుఁడు జపించవలెను.

అట్టితఱి దేవేంద్రుఁడు పరీక్షించును. తరువాత ప్రసన్నుడై తపోవిఘ్నములను నివారించి శివుని మహామంత్రము నుపదేశించును.

వేదవ్యాసుఁడు పాండవమధ్యముని చేరఁబిలువగా నాతఁడు స్నానమాడి తూర్పుదిశ కభిముఖుఁడై దేవేంద్రమంత్రమును వ్యాసునివలనఁబరిగ్రహించెను. వ్యాసుఁడర్జునునకు పార్థివలింగపూజావిధానము నంత యుపదేశించి "పార్థా! గంగాతీరమున ఇంద్రకీలపర్వతముఁ గలదు. అచ్చోట నివసించి తపించుము! అదృశ్యవిద్య నుపదేశింతు"నని యేరికిని కనుపడఁజేయని మంత్రముఁగూడ నుపదేశించి "ధర్మము తప్పకుండుడు! తపస్సు సిద్ధించును. ఇందెంత మాత్రము సందేహములేదు" అనియు పాండవులకు వక్కాణించి శివనామము నుచ్చరించుచు నంతర్హితుండయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ముప్పదియేడవ యధ్యాయము.

## అష్టత్రింశాధ్యాయము

### (అర్జునుఁడు తపించు విధానము)

శివస్వరూపిణి యగు దేవేంద్రవిద్య తనలో ప్రవేశించినందున పార్థుఁడు మిగుల రాణించుచు కనుపడుచున్నందున ధర్మరాజు భీమనకులసహదేవులు ద్రౌపదియు "జయము సిద్ధించు" నని భావించుచు నని భావించుచు "వేదవ్యాసుని యాదేశమగు తపోవిధానమును తప్పక సాగించు" మని నుడివినవారై కొంతకాలము ఎడబాసి యుండవలసివచ్చెగదా యని వ్యథపడుచు ఎట్టకేలకు విధివశమున ధనంజయుని సాగనంపిరి.

పతివ్రతాశిరోమణియనఁదగిన ద్రుపదాత్మజ (ద్రౌపదీదేవి) కన్నీరుఁగార్చుచు ప్రయాణమున శుభము పలుకవలెనని యిట్లు వక్కాణించెను.

వేదవ్యాసుని యుపదేశమును సార్థకముఁజేయుము! శంకరుఁడు ప్రసన్నుఁడై వరము నొసఁగు గాక! అని యర్జునుని ద్రౌపది ప్రోత్సాహపరుప ధర్మరాజాదులును శుభము నుచ్చరించిరి. అర్జునుఁడు వెళ్ళిన తరువాత నైదుగురు నొక్కచో కూడి దుఃఖించుచుండిరి.





కష్ట సమయమున ఆప్తులతో కూడియున్నచో దుఃఖము శమించును. కాని యట్టితతినే ప్రియులైన ఆప్తులు దూరమగునెడల దుఃఖము పెంపొందును. ఎంతటి ధీరుఁడైనను ప్రియవియోగమునకు వగచును.

ఇట్లు పాండవులు ద్రౌపదియు అర్జునవియోగముచే బాధపడుచుండ వేదవ్యాసుఁడు మరల నేతెంచెను. ఆతనికి నవ్వారు ప్రణమిల్లి ఉచితాసనమునందాసీనుఁగావించి యంజలిఁ ఘటించియు "మహాత్మా! కొంతకాలము మాచెంత నివసింపుడు! నిత్యము తమను దర్శించుచు అర్జునవియోగదుఃఖమును తగ్గించుకొందుము!" అని ప్రార్థించిరి.

అంత నా పారాశర్యుఁడు పాండవుల నూఱడింప కొన్నిదినములు నవ్వారి చెంత నివసించి నానావిధసచ్చరిత్రము ఁజెప్పుచు దుఃఖము నుపశమింపఁజేయగా ధర్మరాజు నమస్కరించి వినయముతో "మహానుభావా! మా దుఃఖము శమింపవలెనని కోరుచున్నాను. కాని యిట్టి దుఃఖమును పూర్వము ఎవరైన ననుభవించిరా! లేక మేమే ఇంతటి వెతలఁజెందితిమా?" అని ప్రశ్నించెను.

వేదవ్యాస ఉవాచ

నిషధదేశాధిపతియగు నలుఁడు మీకన్న నెక్కువ దుఃఖితుఁడయ్యెను. హరిశ్చంద్రుఁడు అనుభవించిన దుఃఖము చెప్పరానట్టిది. అద్దానిని వినినవారికిని శోకము కలుగును. శ్రీరామచంద్రుని సీతావియోగాది వృత్తాంతము ఎట్టి కఠినాత్ములనైన కఱగించును. శరీరము దుఃఖముల నిలయంబని భావించి మానవుడు దుఃఖమును దూరము జేసికొనవలెను. ఈ జగమును పుట్టించి కాపాడు సదాశివుఁడే సర్వత్ర వ్యాపించియున్నవాడు. మొదట తల్లి కడుపున దుఃఖము; చిన్నతనమున ఆటలాడుచు అనారోగ్యాదిబాధల ననుభవింపవలెను. యౌవనమున దుఃఖసంతానములగు కామభోగముల ననుభవించుచు వెతలఁ జెందవలెను. దినములు రాత్రులు గడచుకొలఁది ఆయుష్యము క్షీణించుచుండును. అట్టి విషయమును జీవుఁడు గుర్తెరుగఁజాలక శరీరము శాశ్వతమని భావించుచు కర్మబంధమును బిగించుకొనును. ప్రారబ్ధాంతమున సంభవించు మరణము అమితదుఃఖము నొదవఁజేయును. అజ్ఞానముచే పాపముల నాచరించినవారు మరణానంతరము నరకములఁబడి దుఃఖము ననుభవింతురు. గాన జననమరణాదులు శరీరము శరీరగతసుఖదుఃఖంబులును నిత్యములు కావని గుర్తెరిగి పరమేశ్వరుఁడు ప్రసన్నుఁడగు సత్యవిధానము నవలంబింపుము!

ఇత్యాది వ్యాస ప్రసంగముల నాలకించుచు పాండవులు కాలముఁ గడుపుచుండిరి. ఇఁక నర్జునుని సమాచారమును వినుఁడు!

కౌంతేయుఁడు దుర్గారణ్యములను పర్వతములను దాటుచు గట్టిపట్టుదలతో నడచుచుండ దైవికముగ నొక యక్షుఁడు తారసిల్లెను. అట్టి యక్షుని సహాయమున భూతప్రేత పిశాచరాక్షసాదులను మార్గమున పారద్రోలుచు అంతరంగము ఆనందపూరితమగుచుండ నింద్రకీలాద్రిఁజేరినవాడై జాహ్నవీగంగాతీరమున నశోకవనములో స్వర్గసమానంబగు మనోహర స్థలమున తపఃప్రారంభము నొనర్చెను.

గంగయందు గ్రుంకులిడి దీక్షాగురువునకు నమస్కారమును సమర్పించి గురువుగారిచే చెప్పబడిన రీతిగా తాపసవేషముఁదాల్చి కర్మజ్ఞానేంద్రియములను వశపఱచుకొనియు ఏకాగ్రమనంబున





పార్థివలింగమును త్రికాలములయందు పూజించుచు శివధ్యానముఁ జేయుచున్న పార్థుని శిరమునుండి బయలుపడిన తపోజ్వాలలకు నటనుండువారు భీతిల్లి "ఈతడెప్పుడిచ్చోటునకు విచ్చేసినా"డని చింతించుచు దేవేంద్రున కెరిగింపవలెనని యుద్దేశించి స్వర్గముఁజేరిరి.

అయ్యా! దేవుఁడో ఋషియో సూర్యుఁడో అగ్నిహోత్రుఁడో ఇంద్రకీలాద్రియందు వనమున తపించుచున్నవాడు. అతడెవరో తెలియక తమకడకు వచ్చి నివేదించితిమి. ఇందు కొరకు ఎద్ది యుచితమో నెరవేర్చుఁడని విన్నవించిన పర్వతరక్షకులను పంపినవాడై దేవేంద్రుఁడు – ఈ తపంబు తన యంశవలనఁ జనించిన యర్జునుని చేష్టితమని గుర్తెరిగి యచ్చోటునకు వృద్ధబ్రాహ్మణ బ్రహ్మచారియై వెళ్ళి నిలువఁ బడగా కౌంతేయుఁడు యుచితాసనమున బ్రాహ్మణుని సత్కరించి "ఎక్కడినుండి వేంచేసినార"ని ప్రశ్నించెను.

అంత ముప్పదిమూడు కోట్లు దేవరల నేలికయగు శచీపతి – పాండవ మధ్యముని పరీక్షింప నిట్లు వాక్రుచ్చెను.

నూతనప్రాయపువాడవై తపించుచుంటి వెందులకు? మోక్షముకొరకా? శత్రువిజయమునకా? అని ప్రశ్నింప నా కపట భూసురునకు విజయుఁడు తన యుద్దేశము నంతయు విశదపఱచెను.

బ్రాహ్మణుఁడు – నీవు చేయు అనుష్ఠానము సుఖము నిచ్చునది కాదు. క్షత్రియ ధర్మమగు యుద్ధము చేతనే శత్రువిజయము చేకూరును. ఒకవేళ ముక్తికై తపించుచున్న యెడల దేవేంద్రుఁడు ముక్తినొసఁగువాడు కాడు. అందువలన నమరాధిపతిఁగూర్చి తపించుట శ్రేయస్కరము కాదు గదా! – అని వచింప నర్జునుఁడాతని మాటను త్రోసిరాజనుచు" రాజ్యము కొరకో మోక్షము కొరకో నే చేయు తపము ఉపయోగించును. వేదవ్యాసుని యుపదేశము ననుసరించి తపించుచుంటిని, కాని స్వబుద్ధితో తపించుటలేదని తెలియుము! నన్ను తపోభ్రష్టుఁజేయనుంటివి. ఇఁటనుండి పొమ్ము! బ్రహ్మచారివగు నీకు నా తపముతో నేమి ప్రయోజనము?" అని వచింప స్వర్గాధిపతి ప్రసన్నుఁడై నిజసుందర మనోహర రూపముఁ జూపుచు ప్రత్యక్షము కాగా కౌంతేయుఁడు తలవంచి సిగ్గుపడుచుండ నాతని నూఱడించి "వరమునడుగు" మని సంభాషించెను.

అంత నర్జునుఁడు "పగవారిచే పలు నిడుములఁబడుచున్న మాకు విజయమును ప్రసాదించుము! అని ప్రార్థింప దేవేంద్రుఁడు దిగువవిధము మాటలాడెను.

ధనంజయా! దుర్యోధనుఁడు మొదలగు శత్రువులు – ద్రోణభీష్మ కర్ణాది మహావీరుల సహకారమున గెలువనలవిఁగానివారై యున్నవారు. శివాంశసంభూతుఁడైన అశ్వత్థామను జయింప నేరికిని తఱము కాదు. నేనును వారిని జయింప వరము నొసగఁజాలను. శివమంత్రమును జపించుచు శివునారాధింపుము! శివారాధనము సామాన్యుల కలవిఁగానిది. చరాచరాధిపతియు తనయందు తాను రమించుచు రాణించువాడును భుక్తిముక్తి ఫలప్రదుఁడు నగు శంకరుఁడు దుర్ఘటములగు వరములను ప్రసాదించు సామర్థ్యము గల వాడనియు బ్రహ్మాండము నేలు దేవతాసార్వభౌముఁడనియు గుర్తెరుగుము!

శ్లో॥ అహ మన్యే చ బ్రహ్మాద్యా – విష్ణుః సర్వవరప్రదః ।
అన్యే జిగీషవో యే చ – తే సర్వే శివపూజకాః ॥ ౫౩

నేనే గాక బ్రహ్మాదిదేవతలు, భక్తులందరికి వరముల నొసఁగు నారాయణుఁడును, కామక్రోధాది అంతఃశత్రువులను బహిఃశత్రువులను గెలువ నిచ్ఛగించు వారందరును శివునిఁ బూజించువారే యని తెలియుము!

ఈవేళటినుండి ప్రణవఘటితంబగు శివపంచాక్షరీమహామంత్రమును జపించుము! ఇంద్ర మంత్రమును విడనాడుము! పార్థివశివలింగమును పూజించుము! శివుని ధ్యానింపుము! గంధ పుష్పబిల్వాద్యుపచారములచే శివుని సేవింపుము! నీ తపము సిద్ధించును. ఇందెంతమాత్రము సందియము లేదు.

దేవేంద్రుఁడిట్లు వక్కాణించి వనపాలురఁబిలిచి యీతనిని రక్షించుటలో అప్రమత్తులై యుండుఁడు! అని శాసించి వాత్సల్యవశమున వెండియు నిట్లనియెను.

అర్జునా! నేను తెలిపిన శివారాధనము మరియు శివపంచాక్షరీ మహామంత్రంబు నీ మేలుకొరకేయని గ్రహింపుము! పొరపాటునైనను నీవు రాజ్యము సేయరాదు. ధర్మజుఁడే రాజు కావలెను. ఒకానొక మంచిపని సాధించువాడు ధైర్యము నవలంబింపవలసియుండును.

శివుఁడే నిన్ను కాపాడుచు సంపదలను తపఃఫలమును ప్రసాదించును.

సురేశ్వరుఁడు కుంతీకుమారునకు హితవాక్యమున నుపదేశించి శంకరుని కమలములవంటి పాదములను తలచుకొనుచు తనలోకమునకుఁజనియెను. పాండవ మధ్యముఁడును దేవేంద్రునకు నమస్కరించి యాతఁడు చెప్పినవిధముగ శంకరు నుద్దేశించి తపము ప్రారంభించెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ముప్పదియెనిమిదవ యధ్యాయము.

## ఏకోనచత్వారింశాధ్యాయము

### (మూకాసురుని సంహారము)

వేదవ్యాసుని యుపదేశము ననుసరించి యర్జునుఁడు నిండు భక్తితో గంగాస్నానము నొనర్చి కరాంగన్యాసముఁగావించి యొంటికాలుమీద నిలువఁబడి మునివరునివలె సూర్యుని యందు చూపు నిలిపి మనంబున శివుని స్మరించుచు శివపంచాక్షరీమహామంత్రమును నోట నుచ్చరించుచుండెను. ఇవ్విధము తపించుచుండగా కొంతకాలము గడచుసరికి కౌంతేయుని తపముఁదగు ప్రభావము వ్యాపింపఁ జొచ్చెను. అందువలన నమరులు నచ్చెరువుఁజెందుచు మరల శివునిఁజేరినవారై "మహాదేవా! ఒకానొక నరుఁడు నీ కొరకై తపించుచున్నవాడు. అతఁడు కోరునది తాము అనుగ్రహింపవలెను" అని విన్నవించి ప్రశంసించియు శివచరణములపై తమ చూపులు నిలిపి మనస్సు వ్యథపడుచుండ తలలు వంచియుండిరి.

కరుణాసముద్రుఁడగు మహాదేవుఁడు సురల మొఱ నాలకించి చిరునగవున "మీరు నిశ్చింతగా మీ నిలయములకు వెళ్ళియుండుడు! మీ విన్నపమును మనసునందిడుకొని కర్తవ్యమును సాధింపగలను" అని యాదేశింప దేవతలు నెమ్మదిగలవారై నిజనివాసముల కేగిరి.





ఇంతలో దుర్మార్గుఁడైన దుర్యోధనునిచే పంపఁబడిన మూకాసురుఁడు పందిరూపముఁదాల్చి యచ్చోటున కేతెంచి పర్వతశిఖరములను వృక్షములఁబడగొట్టుచు వడివడిగా నడచుచు పెద్దగా నఱచుచుండెను.

అర్జునుఁడు అట్టి సూకరముఁగాంచి దిగువవిధము విచారించెను.

ఎవఁడు వీడు? క్రూరునివలె నున్నవాడు నా కపకారమొనర్ప నేతెంచెనని నిశ్చయింపవచ్చును. మున్ను దైత్యదానవుల ననేకులను సంహరించినవాడను. వీడు శత్రువే యని నా యంతరంగము చాటుచున్నయది. దుర్యోధనుఁడు పంపినవాడు కావచ్చును.

"ఎవని జూచుటతోడనే మానసము శాంతించునో వాడు మిత్రుఁడని తెలియవలెను. ఎవనిఁ గాంచుచుండగనే మనస్సు వ్యాకులమగునో వాడు శత్రువనిపించును. సదాచారము సద్వంశమును సూచించును. శరీరము ఆహారసమృద్ధిఁదెలుపును. వాక్యము పాండిత్యమును విశదీకరించును. కంటిచూపు ప్రేమను వ్యక్తపఱచును. ముఖవైఖరితోడను నడకచేతను పనులవలనను మాటలచేతను నేత్రవికారములతోడను లోని భావము గోచరించును.

మిత్రులను కూడినపుడు కన్ను మిగుల వెలుగొందును. కుమారునిఁజూచినపుఁడు కరుణారసముతో నిండియుండును. ప్రియురాలినిఁగలిసినతఱి వంకరగనుండును. పగవాడు కనుపడినపుడు నెఱ్ఱపడును.

కావున వీనిఁజూచుచున్న నా ఇంద్రియములన్నియు కలుషితములగుచున్నవి. వీడు శత్రువగుటచే నవశ్యము వీనిని సంహరింపవలెను. "తపఃకాలమున నీకు కీడు నొనఁగూర్చువానిని సంహరించు" మని గురువాక్యము కలదు గదా! అందువలన నా ఆయుధముల నుపయోగింతును.

ఇవ్విధము విచారించి విజయుఁడు ధనుర్బాణములఁదీసికొనినవాడై బాణమును సూకరముపై వేయనుండునంతలో శంకరుఁడు కౌంతేయుని భక్తిని పరీక్షింప కిరాతరాజ రూపముఁదాల్చి ప్రమథగణములు కిరాతరూపములతో వెంటాడుచుండ నటకేతెంచెను.

కిరాతేశ్వరుఁడు (బోయరాజు) ధోవతికొంగును నడుమున బిగించి శిరమున పాగఁజుట్టుకొని యొడలినిండ తెలుపుచాఱలఁదాల్చియు ధనుర్బాణములతో అమ్ములపొదను వీపుపై వేసుకొని యలరారుచు బోయలగుంపుతో కూడియుండెను.

సూకరము చేయుధ్వని దశదిశలు నిండుచుండెను. మరియొకవంక బోయరాజు దండు చప్పుఁడు భయముఁగొలుపుచుండెను. ఇరువురి ధ్వని యొకచోకూడి పర్వతములయందు ప్రతిధ్వనించు చుండగా కౌంతేయుడు తన మనమున నిట్లు తలపోయుచుండెను.

శివుఁడు భక్తులకు శుభము నొదవఁజేయువాడని వినియుంటిని. శ్రీకృష్ణుఁడు వ్యాసమహర్షి యిటులే చెప్పియుండిరి. దేవతలును శంకరుఁడు శుభప్రదుఁడని భావించుచుందురు. శివుఁడు-భుక్తి ప్రదుఁడే గాక ముక్తినొసగువాడనియు శివనామస్మరణము కల్యాణప్రదమనియు శివుని త్రికరణశుద్ధిగా భావించువారికి స్వప్నమునఁగూడ దుఃఖము సంభవింపదనియు ఒకవేళ కర్మదోషమున దుఃఖము

తారసిల్లినచో నయ్యది శివానుగ్రహమువలన స్వల్పంబగు ననియు శివునారాధించుచున్నను కష్టము కలిగినయెడది నద్ది ప్రారబ్ధకర్మందగుప్రభావమనియు శంకరుఁడు ప్రారబ్ధభోగమును కొద్దిగ ననుభవింపఁ జేసి యట్టి దుఃఖమును దూరమొనర్చుననియు

శ్లో॥ విషంచైవామృతం కుర్యా - దమృతం విష మేవ వా ।
యదిచ్ఛతి కరోత్యేవ - సమర్థః కిన్నిషిధ్యతే ॥ 32

ఈశ్వర సంకల్పమున విషము అమృతముగా పరిణమించును. మరియు నమృతము విషమగును. సర్వసమర్థుఁడగుటచే తాను తలచినది తప్పక నొనర్చును.

ఆతనికి అడ్డు చెప్పువారెవరును లేరు. జీవులు భ్రమప్రమాదములచే గావించుకర్మలు ప్రారబ్ధ భోగములుగ పరిణమించిన నవ్వానిని తొలగించు సామర్థ్యము పరమేశ్వరునకే కలదు. ఇవ్విధము పురాతనులు అధునాతులు నగు భక్తులు విచారించుచు తమ మానసమును స్థిరమొనర్చుకొనుచుందురు. ఇట్టి క్లిష్టపరిస్థితియందు రాజ్యలక్ష్మి దూరమైనను మరణము సమీపించినను సజ్జనులు దౌర్భాగ్యుఁడని నిందించుచున్నను సౌభాగ్యసంపన్నుఁడని ప్రశంసించుచున్నను సాధకుండు దుఃఖనివృత్తినే కోరుచుండవలెను. జీవుఁడు - పుణ్యపాపముల కలయికచే మానవుఁడుగ జన్మించిన నట్టివాడు భక్తుడైనచో వాని నొకప్పుడు పరీక్షింపఁదలచి మొదట దుఃఖము నొనగూర్చువాడు శివుఁడే కదా!

సదాశివుఁడు దయఁగలవాడగుటఁజేసి - నిప్పునందు కాచఁబడిన బంగారము పరిశుద్ధ మగునట్లు భక్తుని దుఃఖమును చివరన తొలగించుననియు ఇట్లు మహాజనులు చెప్పుచుండ వింటిననియు నర్జునుఁడు లోలోన చింతించి భగవానుని స్మరించి ప్రార్థించియు నా యిడుములఁబడ ద్రోయుదునని నిశ్చయించుకొనెను.

ఇంతలో సూకరము (పంది) ముందుకు రాగా శంకరుఁడు కిరాతేశ్వరరూపమున నద్దానిని వెంటాడుచుండెను. ఆ సమయమున నర్జునుఁడు శంకరుఁడు నొక్కుమ్మడిగ సూకరముపై బాణములను వేయఁగా అర్జునుని బాణము ముఖముపై తగులుకొని పృష్ఠభాగమునుండి వెడలినేలఁగూలెను. శంకరుని బాణము పృష్ఠమునఁ గ్రుచ్చుకొని నోటినుండి బయలుపడి మట్టిలో పడినదయ్యెను. ఇరువురి బాణముల తాకిడిచే మూకాసురుఁడు మరణించినందున నమరులు సంతసించి పరమేశ్వరునిఁ బ్రార్థించుచు ప్రణమిల్లు చుండిరి. పుష్పములఁగురిపించుచు జయజయ ధ్వానముల నొనర్చుచుండిరి. అట్టి శుభసమయమున శంకరుఁడు నర్జునుఁడును మూకదైత్యుని క్రూరరూపముఁజూచుచు నచ్చెరువుతో "లోకకంటకుఁడు నశించినాడ"ని లోలోన తృప్తిపడుచుండిరి. అర్జునుఁడు - మూకాసురుఁడు తనను చంపుటకే వచ్చినాడనియు అట్టి మృత్యువును తప్పించి రక్షించినవాడు శంకరుఁడేననియు పరమేశ్వరుఁడీ సమయమున సముచితబుద్ధి నొసగి నందున వీనిపై బాణమును వేయఁగలిగితి ననియు మదిఁదలచి యచ్చోట - శివ! శంకరా! మహాదేవ! అని నుతించుచు మాటిమాటికి ప్రణతులర్పించుచుండెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనమున ముప్పదితొమ్మిదవ యధ్యాయము.





# చత్వారింశాధ్యాయము

## (కిరాతరాజుదూతతో అర్జునుని సంవాదము)

నందికేశ్వరుఁడు సనత్కుమారునకు చెప్పఁదొడఁగెను.

సనత్కుమారా! శంకరుని లీలావిలాసము భక్తవాత్సల్యరసముతో నిండియుండునదని ఈ చెప్పబోవు సందర్భము విశదపఱచును.

కిరాత ప్రభురూపమున నున్న శంకరుఁడు - ఒకానొక కిరాతుని బాణమునకై పంపగా అర్జునుఁడు నచ్చోటున కేతెంచి కిరాతుని నిరాకరించి నేలపై పడియుండు బాణమును పట్టుకొనెను. అంత కిరాతుఁడు "బాణము మాదైయుండ నేల తీసుకొనెదవు? విడువు" మని నుడువగా కౌంతేయుఁడు శివుని స్మరించి యిట్లు బదులుచెప్పెను.

వనేచరుఁడా! మేమెవరో తెలియక మాటలాడుచుంటివి. మూర్ఖుఁడవు; నేను ప్రయోగించిన బాణము నీదెట్లగును? ఈ బాణముఁదగు రేఖలు పిచ్ఛములు (నెమలిపురులు) నా పేరుతో నున్నయవి. అడవియందు నక్రమముగా ప్రవర్తించు స్వభావము నీకు సహజమే గదా!

అర్జునుని మాటలు విని వనేచరుఁడు పరిహసించుచు "తాపసుఁడా! నీవు నిజముగా తపముఁజేయువాడవు కావు. తాపసవేషముమాత్రము ధరించితివి. నీ యట్టి తాపసుఁడు అబద్ధము లాడవచ్చునా? నన్నొంటరివానిగా భావింపకుము! పెక్కురు నడవిబోయలతో కూడి మా బోయరాజు చేరువనే యున్నవాడు. నిగ్రహమును అనుగ్రహమును చూపుటకు సమర్థుఁడును; నీవు గైకొనినబాణము మా ప్రభువుదేను; బలవంతముగ తీసుకొనిన నీ బాణము నీ చెంత నుండఁజాలదని తెలియుము!

దొంగతనము, కపటము, ఆశ్చర్యము, అసత్యము అనువానివలన తపస్సుక్షీణించును. నిన్ను కాపాడుటకు నా స్వామి బాణమును విడచెను. కావున కృతఘ్నుడవు కావలదు. నా ప్రభుబాణమగుటఁజేశియే శత్రువు మడసినాడు. ఒకవేళ బాణము కావలయునెడ నా స్వామిని యాచింపుము! ఇట్టి బాణముల ననేకముల నొసఁగును. ఉపకారము నొనర్చినవారికి నపకారముఁజేయ తలపెట్టితివి. చపలభావము విడనాడి యథార్థమును గుర్తెరుఁగుము!" అని వచింప కపికేతనుఁడు వెండియు నిట్లనియెను.

వేటకాడా! సత్యము చెప్పుచున్నాను. నీ మాటయే సత్యముకాదు. ఎందువలననఁగా? ఆటవికజాతివారు అనృతము లాడుచుండుట పరిపాటియే గదా! నేను రాజును, నీవే దొంగవు. నీతో పోరాడుట సముచితము కాదు. నీ రాజును నీవంటివాడే కావచ్చును. మేము దాతలము. మీరు చోరులు; మిమ్ము నేను యాచించుటెట్లు పొసఁగును? నీవే నన్ను ప్రార్థించినచో నా వద్ద గల పెక్కు నమ్ముల నీయఁగలను. రాజు తీసుకొనఁడు. కాని యిచ్చును. నీ ప్రభువు నా ముందుకు రాడెందులకు? వచ్చి నాతో మాటలాడి పోరాటమున నన్ను గెలచియు బాణముఁగైకొని నిజనివాసమున సుఖముగా నుండుగాక!

మహేశ్వరుని కృపాకటాక్షమునకు పాత్రుఁడైన అర్జునుని మాటలు విని భిల్లుఁడు "తెలివి తక్కువవాడవు; తపసివి కావు; బాణమునొసఁగి సుఖముగనుండుము! లేకున్న మరణక్లేశము ననుభవింతువు!" అని నుడువగా కౌంతేయుఁడు మనమున శివుని స్మరించి యిట్లు ప్రత్యుత్తరించెను.

వనేచరుఁడా! నాయథార్థమగు మాట వినుము! నీ ప్రభు వేతెంచినచో నా శక్తి సామర్థ్యములు బయటపడును. సింహము నక్కతో పోరాడినట్లు నీతో నేను తలపడను. అయ్యది (నీనాయుద్ధము) లోకమున పరిహాసాస్పద మగును. పొమ్ము! నీ స్వామికి నా యాశయమును నివేదించుకొనుము! ఇఁక నీయిష్టము.

కిరాతేశ్వర రూపమున నవతరించిన సర్వేశ్వరుని చెంతకు కిరాతుఁడు వెడలి అర్జున వాక్యము నంతయు విన్నవింపగా నా బోయరాజు సంతసించుచు తన సైన్యముతో నఱుదెంచెను.

అంత విజయుఁడు ధనుర్బాణములఁ గైకొని యుద్ధమునకై సిద్ధపడుచుండ శంకరుని దూత "అర్జునా! ఇప్పటికైనను బాణము నీయుము! స్వగృహమున కేగుము! స్వల్ప కార్యమునకై ప్రాణములఁ బోగొట్టుకొనుట వెందులకు? నీ యన్నదమ్ములు భార్యయు వెతలఁజెందుచుండ నీవు మరణించినచో శత్రువు అపహరించిన రాజ్యము హస్తగతము కాజాలదు" అని పలుకగా నర్జునుఁడు "ఒకవేళ నేను భయపడి బాణము నొసగిన యెడల నా వంశమునకే కళంకము చేకూరును. సోదరులు దుఃఖపడుచున్నను విద్యలు ఫలింపకున్నను నా పట్టు విడువఁజాలను. సింహము జంబుకమునకు వెఱవనట్లు వనేచరునకు భయపడువాడను కాను" అని వచింప నదియంతయు దూతముఖమున నాలించి కిరాతేశ్వరుఁడు పార్థుని సమీపించిన వాడయ్యెను.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద
ప్రవచనము నలుబదియవ యధ్యాయము.

## ఏకచత్వారింశాధ్యాయము

### (కిరాతార్జున సంగ్రామము)

కిరాతేశ్వరుని గాంచి శివధ్యానము నొనర్చియు పాండవ మధ్యముఁడు ధనుస్సు నల్లెత్రాడు బిగించి యమ్ములవేయుచుండ బోయరాజును తన పరివారముతో కూడ తీక్ష్ణబాణములను ప్రయోగించుచున్నందున నర్జునుఁడు శంకరుని మదిఁబ్రార్థించుచు బాణములతో వేధించుచుండెను. అందువలన గణములు అలసి దశదిశలఁబాఱిపోవగా నరుఁడు పరమేశ్వరునితో పోరాడుచుండెను. ఐనను శంకరుఁడు మనమున దయఁదలచుచు నర్జునునిపై ఆయుధములను ప్రయోగించుచుండ నర్జునుఁడు - ఘోరములైన శస్త్రాస్త్రములను శంకరునిపై వేయుచుండెను. అర్జునుని ఆయుధముల నన్నిటిని శివుఁడు ఛేదింప నిరాయుధుఁడను కౌంతేయుఁడు శంకరునితో మల్లయుద్ధముఁజేయుచుండెను.





ఉభయుల సంగ్రామము వలన సముద్రములు ఉప్పొంగుటయే గాక భూమి కంపించుచుండెను. మరియు "ఇకముందేమగునో" యని అంతరిక్షవాసులు భయపడుచుండిరి. ఇంతలో శంకరుఁడు ఆకసమున కెగసి పోరాడుచుండ నర్జునుఁడును పైకి వెడలి పోరుచుండెను. వారిరువురును ఎగిరి యెగిరి కొట్టుకొనుచుండ దేవతలు విస్మితులగుచుండిరి.

అట్టితతి శివధ్యాన బలమున నర్జునుఁడు శివుని చరణములను దొరికించుకొని గిర గిర త్రిప్పుచుండగా భక్తవత్సలుఁడు లీలావిలాస చతురుఁడగుటచే అట్ట హాసముఁ జేయుచుండెను.

అర్జునుఁడు తన దాసుఁడు కావలెననియు తాను భక్తపరాధీనుఁడ నగుదుననియు చాటుటకు నటరాజు నటించిన మాయానాటకమే ఈ కిరాతార్జున సంగ్రామ మని భక్తులైన కోవిదులు గుర్తింపకుందురా?

తరువాత శంకరుఁడు చిరునగవుతో నిజరూపముఁ జూపెట్టగా వేదశాస్త్రపురాణములు వ్యాసమహర్షియు కృష్ణభగవానుఁడును చెప్పినట్లు శంకరుని సుందర మనోహర దివ్యరూపము నర్జునుఁడు గాంచి యాశ్చర్యపడుచు "ఆహా! పరమాత్మతో తలపడి పాపినైతిని గదా" యని సిగ్గుపడుచున్నవాడై "నా ప్రభువుగా నెన్నుకొనిన శివుఁడే ఈతఁడు. శివుఁడేను; శివుని మాయాప్రభావము ఎంతటివారికైన తెలియరానిది; అని మది నిశ్చయించుకొని దోసిలొగ్గి తలవంచియు దిగువవిధము వేడుకొనెను.

దేవదేవా! మహాదేవా! కరుణాకరా! నా యపరాధమును మన్నింపుము! నీతో సమరము నొనర్చి నా జీవితమును వ్యర్థముఁజేసుకుంటిని.

ఇట్లు ప్రార్థించి పార్థుఁడు శంకరుని చరణములపై వ్రాలగా భక్తవత్సలుఁడగు మహేశ్వరుఁడు "నిన్ను పరీక్షించుటకు నీ భక్తిని దృఢపఱచుటకు నివ్విధము గావించితిని" అని పలికి పలువిధముల నూఱడించియు తన చేతులతో నర్జునుని లేపినవాడై "నీ దెబ్బల తోడనే నా యారాధనముఁదగు ఫలముఁ బొందితివి. ప్రసన్నుడనైతిని. వలయున దడుగుము! నా యిష్టముతోడనే నీ యుద్ధము నెరవేరినదని తెలియుము! ఇందు నీ తప్పేమియు లేదు. బలవంతులగు శత్రువులఁగెలచు శక్తి నొసగుటకే నీతో పోరాడితిని. కావున వగవకుము! నీకు ఈయరానిదేమియు లేదు" అని సంభాషింప నర్జునుఁడు వినమ్రుఁడై యిట్లు నుతించెను. దేవదేవా! కైలాసవాసా! నీ కృపావిలాసము నేమని వర్ణింతును. ఐదుముఖములు గల సదాశివ రూపమున పరాశక్తితో కూడి శివలోకమున నివసించుచు జీవుల ననుగ్రహించువాడవు; జటాజూటము నేత్రత్రయము మున్నగువానితో మహేశ్వరుఁడవై ప్రళయానంతరము చేయవలసిన తిరోధానము నొనర్చుచుందువు; (తిరోధానమనఁగా జీవులను దాచియుంచుట) నీలకంఠుడవై గంగాధరుఁడవై రుద్రరూపమున వెండికొండయందు నివసించుచు ప్రళయముఁజేయుచుందువు; విష్ణుబ్రహ్మరూపములతో స్థితిసృష్టికర్త యగువాడవు; వామాంగమున పార్వతి యుండగా డమరుకమును కపాలమును పినాకమును త్రిశూలమును కరములఁబూని ముండమాలికను కంఠమున ధరించువాడవు; పెద్దపులితోలు నుత్తరీయముగ నేనుఁగతోలు ధోవతిగా నుపయోగించుచు నాగసర్పములను హారములుగ దాల్చువాడవు; సహస్రవదనములు గల విరాట్ స్వరూపము లేక వీరభద్రరూపంబు నీయదియేను; నీ

మృదుచరణములను నందీశ్వరాదులు సేవించుచుందురు. విఘ్నేశ్వర కుమార స్వరూపములకు నీవే మూలమగుదువు; భక్తుల భక్తిని పెంపొందించి ముక్తిఁబ్రసాదించియు శాశ్వతనిజశివానందము ననుభవింపఁ జేయువాడవు; ఆకలి దప్పి మున్నగు తుచ్ఛగుణములు లేనివాడవై సర్వజ్ఞత మొదలగు సద్గుణములు కలిగియుందువు; భక్తులకొరకు దివ్యరూపముల దాల్చుచు రూపము లేకుండ నుండు శక్తిఁ గలిగియుండువాడవు; జగమున కనఁబడు శ్రేష్ఠరూపములన్నిటిని జ్యోతిర్లింగస్వరూపమున విరాజిల్లువాడవు; వస్తుతః సచ్చిదానందమయుఁడవై ముల్లోకములయందు లీలారూపములతో విహరించువాడవు; మట్టికణములను లెక్కింప నలవిఁగానట్లు నీ గుణములను గణింప నేరికిని తరముఁ గాదు. ఆకాశమున నక్షత్రములవలెను వర్షధారలవలెను నీ మహిమలు అపారములు గదా! వేదములును నీ ప్రభావమును వర్ణింపజాలవు. మందబుద్ధి నగు నేనెంతటివాడను. ఎవరో ఎంతటివాడవో తెలియఁ జాలక మ్రొక్కులిడుచుంటిని. నేను నీ దాసుఁడను, నీవు నా ప్రభువువు.

ఇట్టి స్తోత్రము నాలకించి మహేశ్వరుఁడు సుప్రసన్నుఁడై వడిగా వరమునడుగుమని యాదేశింప నర్జునుఁడు "దేవా! ఏమి చెప్పుదును? సర్వాంతర్యామివై భక్తుల హృద్గతమును కనుగొనువాడవుగదా! ఐనను నీదర్శనమువలన మా సంకటములన్నియు తొలగినట్లే భావించుచున్నాను. ఈ జన్మయందు సాధింపఁదగిన సిద్ధులను ప్రసాదింపుము!" అని ప్రార్థించి నతస్కంధుఁడై బద్ధాంజలియునై నిలుఁ బడియుండెను.

అంత శంకరుఁడు కరుణించి యర్జునుని చేరఁదీసి పాశుపతమహాస్త్రము నుపదేశించి యిట్లు నుడివెను.

నా యస్త్రమును పరిగ్రహించితివి గాన నిద్దానితో శత్రువులనందరిని దునుమాడుదువు! నీకు సహాయము చేయుమని శ్రీకృష్ణు నాదేశింపగలను. అతఁడు నా భక్తుఁడగుటయే గాక శివభక్తులకు నండగా నుండువాడని తెలియుము! నా యనుగ్రహముచే మీరు భారతదేశమును పరిపాలించుచుందురు! ఆ సమయమున నీయగ్రజునితో నానావిధ ధర్మకార్యములను చేయించుము!

పిదప పరాత్పరుఁడు నిజహస్తమును కౌంతేయుని శిరము నిడి యాతని పూజనము నందుకొనియు నంతర్ధానముఁ జెందెను.

అర్జునుఁడును పాశుపతాస్త్రమును స్వీకరించి లోకగురువగు శంకరుని స్మరించుచు తన యాశ్రమమునకుఁజనఁగా నాతనిని తమ ప్రాణమువలె చూచుచు పాండవులు ద్రౌపదియు మిగుల సంతృప్తిఁజెందినవారైరి.

మూకాసురుని వధించిన కారణముగా పాండవాశ్రమమున నమరులు శ్రీచందనముతో గూడిన పుష్పములఁగురిపించిరి. శంకరుఁడు కరుణామయుఁడు భక్త పరాధీనుఁడునని పాండవులు భావించుచు విజయము మనదే నని సంబరపడుచుండ శ్రీకృష్ణుఁడరుదెంచి యర్జునుని వలన తపఃసమాచారమును వరప్రాప్తిని వినినవాడై సమాధానము నొందియు నిజనివాసమున కేగినవాడయ్యెను.





ఇందువలన శంకరుఁడు భక్తులందరి దుఃఖములను పరిహరించువాడని గట్టిగా చెప్పుచుంటిని. నేనును శివుని సేవించుచున్నాను. మీరందరును నిత్యము శివునారాధించుచు ధన్యులు కండు! శంకరుని కిరాతావతారమును వర్ణించితిని. ఇద్దానిని వినినవారు వినుపించిన వారును కామితములఁబడయుదురు. అని సూతుఁడు శౌనకాదులకుఁజెప్పి విశ్రాంతిఁజెందుచుండెను.

ఇద్ది ఎనుబదియెనిమిదవ (88) యవతారము.

ఇయ్యది "శివవిజ్ఞాన సర్వస్వ" మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున నలుబదియొకటవ యధ్యాయము.

## ద్విచత్వారింశాధ్యాయము

### (ద్వాదశజ్యోతిర్లింగావతారములు)

నందికేశ్వరుఁడు సనత్కుమారునకు నుపదేశించినవిధముగా సనత్కుమారుఁడు వేదవ్యాసునకు వక్కాణించిన తెఱఁగున వేదవ్యాసుఁడు వివరించినట్లును సూతమహర్షి శౌనకాదులకు చెప్పఁదొడఁగెను.

నానావిధ లీలావిలాసములతో నిండియుండు శివుని ద్వాదశజ్యోతిర్లింగావతారములను భక్తిశ్రద్ధలతో నాకర్ణింపుడు!

హిమాలయ శిఖరముపై కేదారక్షేత్రమున కేదారేశ్వరుఁడు, ఢాకినీప్రదేశమున భీమశంకరుఁడు, కాశీక్షేత్రమున విశ్వనాథుఁడు, గోదావరీతీర మూలమున త్ర్యంబకేశ్వరుఁడును, సౌరాష్ట్రదేశమున సోమనాథుఁడును, శ్రీశైలశిఖరమున మల్లికార్జునుఁడును, ఉజ్జయనీ నగరమున మహాకాలుఁడును, ఓంకార క్షేత్రమున అమరేశ్వరుఁడును, చితాభూమియందు వైద్యనాథుఁడును, దారుకావనమున నాగేశుఁడును, సేతుబంధమున రామేశుఁడును, శివాలయక్షేత్రమున ఘుశ్మేశుఁడును వెలసియున్నవారు.

ఈ పండ్రెండు జ్యోతిర్లింగములను చూచినను తాకినను స్త్రీలు పురుషులును ఇహపరానందముల ననుభవింపఁజాలుదురు.

శ్లో॥ తత్రాద్యః సోమనాథో హి - చంద్రదుఃఖక్షయంకరః ।
క్షయకుష్ఠాదిరోగాణానం - నాశకః పూజనా న్మునే ॥

ద్వాదశజ్యోతిర్లింగములలో మొదటిది సోమనాథజ్యోతిర్లింగము; సోమనాథుఁడు చంద్రుని క్షయవ్యాధి దుఃఖమును పోగొట్టుటయేగాక పూజించు శివభక్తులకు క్షయకుష్ఠాదిమహారోగములను నివారించును. సౌరాష్ట్రమనఁబడు పవిత్రదేశమున చంద్రుఁడు ఆరాధించుటఁజేసి శివుఁడు సోమనాథుఁడను పేరుతో జ్యోతిర్లింగముగ విలసిల్లినవాడు. చంద్రుఁడు త్రవ్విన కుండమున జలకములాడి సోమనాథుని ప్రార్థించువారికి దీర్ఘాయురారోగ్యభాగ్యములు సమకూరును. భుక్తి ముక్తులు నొనఁగూరును.

శ్రీగిరియందు మల్లికార్జునుఁడను నామధేయమున జ్యోతిర్లింగముగ వెలసిన శివావతారము రెండవదై దర్శనమువలనను పూజనమువలనను దౌర్భాగ్యమును తొలగించి మోక్షము నొదవఁజేయునది. కైలాసము నుండి శంకరుఁడు కుమారస్వామి నవలోకింప శ్రీశైలమునకు వెడలి యట నివసించినవాడు.

శంకరుఁడు మహాకాలుఁడను పేర నుజ్జయిని యందు జ్యోతిర్లింగముగ నవతరించెను. వేదధర్మమును ధిక్కరించు దూషణాసురుని సంహరించి వేదవిప్రులను రక్షించిన మహాకాలుని దర్శించి పూజించువారు నిహపరభోగముల నంది శివానందము ననుభవింతురు. ఇద్ది మూడవది యగును.

నాలుగవ జ్యోతిర్లింగావతారము ఓంకారేశ్వరుఁడనియు పరమేశ్వరుఁడనియు ద్వివిధరూపములతో వెలయునది. వింధ్యుఁడు తన యభీష్టము నెరవేరుటకై పూజించిన పార్థివలింగమునుండి యావిర్భవించిన పరమేశ్వరుని (అమరేశ్వరుని) భక్తితో చూచినవారు విధి విధానముగా నర్చించువారును ఇహపర కృతార్థులగుదురు.

కేదారేశ్వరజ్యోతిర్లింగము హిమవత్పర్వతముపై విరాజిల్లునది. శ్రీహరి యవతారములగు నరనారాయణులు ప్రార్థించుటచే శివుఁడు నచ్చోట నైదవ జ్యోతిర్లింగముగ నివసింప వలసివచ్చెను. నరనారాయణులు బదరికాశ్రమమున నివసించుచు నిత్యము కేదారేశ్వరుని పూజించుచుందురు. మహేశ్వరుఁడు సర్వాధికారియైనను విశేషించి కేదారఖండమునకు ప్రభువై చూచువారికి నభీష్టములను సిద్ధింపఁజేయును. మరియు నచటి రేతఃకుండమునఁగల యుదకమును మూడుమారులు ఆచమనముఁ జేయువారిని ముక్తులుగ నొనర్చును.

భీమాసురుని సంహరించి కామరూపేశ్వరుఁడను భక్తుని రక్షింప నవతరించిన భీమశంకరుఁడు ఢాకినియందు ఆరవ జ్యోతిర్లింగముగ వెలసినవాడు. ఇద్దానిఁ జూచినను పూజించినను భుక్తి ముక్తులు చేకూరును.

కాశీక్షేత్రమున విశ్వేశ్వరావతారము ఏడవ జ్యోతిర్లింగముగ చెప్పఁబడుచున్నయది. ఇద్ది సకల బ్రహ్మాండరూపమనియు భుక్తిముక్తిప్రదంబుననియు వేదశాస్త్రములు చాటుచున్నవి. బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు, కైలాసవాసియగు శంకరుఁడు భైరవుఁడు నిద్దానిని భక్తిశ్రద్ధలతో పూజించుచుందురు. ద్వాదశ జ్యోతిర్లింగములలో ముఖ్యమగు విశ్వనాథలింగమును అరాధించి కాశీక్షేత్రమును విశ్వేశ్వరుని స్మరించువారు కర్మబంధనిర్ముక్తులై కైవల్యమును అనఁగా శివసాయుజ్యము నొందుదురు.

గౌతమీతీరమున గౌతమమునిప్రార్థనచే వెలసియున్న త్ర్యంబకేశ్వరజ్యోతిర్లింగము ఎనిమిదవదై యున్నది. గంగాదేవి శివాజ్ఞననుసరించి గౌతమీ (గోదావరీ) రూపమున నచ్చోట నుండి ప్రవహించుచున్నది. త్ర్యంబకేశ్వరుని దర్శించి పూజించువారు కామితములఁబడయుటేగాక నంత్యకాలమున శివసారూప్యము నొందుదురు.

రావణాసురుని కొరకు తన లీలావిలాసముఁ జూపెట్టిన వైద్యనాథుఁడు – తొమ్మిదవ జ్యోతిర్లింగముగ చితాభూమియందు వెలసినవాడై భక్తితో దర్శించి యర్చించువారికి భుక్తి ముక్తుల నొసగుచుండును.





దారుకావనమున దారుకుఁడను రాక్షసుని సంహరించి స్వభక్తవరుండగు వైశ్యనాథుని రక్షించిన యవతారమే నాగేశ్వరజ్యోతిర్లింగమయ్యెను. ఇద్దానిని చూచి యారాధించు యవతారమే నాగేశ్వరజ్యోతిర్లింగ మయ్యెను. ఇద్దానిని చూచి యారాధించు వారి మహాపాతకములు నశించును. ఇయ్యది పదియవ జ్యోతిర్లింగము.

ఇఁక పదునొకండవ జ్యోతిర్లింగము రామేశ్వరుఁడు; భక్తవత్సలుఁడగు శంకరుఁడు శ్రీరామచంద్రునిచే పూజింపఁబడి యాతనికి శత్రుజయవరప్రసాదము నొసగుటకు నవతరించి దక్షిణసముద్రతీరమున జ్యోతిర్లింగరూపమున నివసించుచు భక్తులకు భుక్తిముక్తుల నొసఁగుచున్నవాడు.

శ్లో॥ తం చ గంగాజలేనైవ - స్నాపయిష్యతియో నరః ।
రామేశ్వరం చ సద్భక్త్యా - స జీవన్ముక్త ఏవ హి ॥ ౫౦

కాశీగంగాజలముతో రామేశ్వరజ్యోతిర్లింగమునకు అభిషేకము చేసి నిండుభక్తి నారాధించువారు జీవన్ముక్తులనియే చెప్పవచ్చును అనఁగా వారు చివరిజన్మగలవారనియు ఈ జీవితము ముగియుట తోడనే శివస్వరూపులగుదురనియు భావము.

దక్షిణదిశయందు దేవగిరిసమీపమున ఘుశ్మాదేవిచే ఆరాధింపఁబడి శివాలయ మనఁబడు కొలను నందు ఆవిర్భవించిన ఘుశ్మేశ్వరజ్యోతిర్లింగము పండ్రెండవదైయున్నది. ఇద్దానిని చూచి పూజించువారు ఇహపరభోగముల ననుభవింతురు. ముక్తులునగుదురు.

పండ్రెండు జ్యోతిర్లింగముల సంగ్రహసందర్భమును చదువువారును వినువారును కృతార్థులు కాగలరు.

పరమేశ్వరుని శత (100) అవతారములు గల శతరుద్రసంహిత నీ విధముగ వక్కాణించితిని. ఇద్దానిని సక్రమముగ నియమనీతులతో వినువారు పఠించువారును పలుకుబడి గలవారై సంకల్పసిద్ధిని పొందుదురు. కావున శివమహాపురాణములో మూడవదగు శతరుద్ర సంహిత పరమపావనమై భుక్తి ముక్తి ప్రద మగునట్టిది యని సూతుఁడు కాలకృత్యములఁ దీర్చుకొనుటకై ఇంతటితో విరమించినవాడు కాగా శౌనకాదులును తమ కర్తృముల నెరవేర్చుటకు వెడలినవారైరి.

ఇయ్యది శివమహాపురాణములో శతరుద్రసంహితయందు
“శివవిజ్ఞాన సర్వస్వ” మను శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనమున
నలుబదిరెండవ యధ్యాయముగా శతరుద్ర సంహిత - సమాప్తము.

## శ్రీ ద్వాదశ జ్యోతిర్లింగ మహత్మ్యము

భారతావని యందు గల ద్వాదశ జ్యోతిర్లింగముల ఆవిర్భావం. అవి ఏఏ ప్రదేశములయందు తమ తమ విశిష్టతను పొందిన తీరును తెలియపరిచే విధంగా కూర్చబడినది ఈ పుస్తకము. ఈ పుస్తకము మీ చెంతయున్న మీరు ఈ ద్వాదశ జ్యోతిర్లింగములను దర్శించినటువంటి అనుభూతిని పొందగలరు. ఎన్నో విశేషములతో భక్తజనులకు ఉపకరించే విధంగా రూపొందించబడినది.

**పేజీలు : 100 వెల : 16-00**

## శివరాత్రి మహాత్మ్యము

(శ్రీనాధకవి సార్వభౌమ ప్రణీతమునకు వచనము)

ఇసుకపల్లి సంజీవశర్మగారిచే రచించబడిన శివరాత్రి మహాత్మ్యము అనునది ఎంతో విశిష్టతను సంతరించుకున్నది. సదాశివుడు బ్రహ్మకు ఒసగిన వంటి పదునెనుమిది పురాణాలను పుక్కిటబట్టి విష్ణు భగవానుడు వ్యాసభగవానుడుగా సత్యవతీదేవి గర్భమందు నుదయించి పదునెనిమిది పురాణములను విపులీకరించినాడు.

అట్టి పురాణములలోని స్కాందపురాణము నుండి గైకొనబడినటువంటి ఈశాన సంహిత నందలి శివుని మహిమాతిశయమును గూర్చి తెలుపని శౌనకాది మునులు రోమహరుణి పౌత్రుడైనటు వంటి సూత మహాముని ప్రార్థింపగా మునిపుంగవులకు అట్టి భక్తసులభుడు, అశ్రితమందారుడు చూపినటువంటి లీలావిలాసమును తెలియపరుస్తాడు.

అట్టి శివరాత్రిని వర్ణిస్తూ వ్రత మాహాత్మ్యము ఈ పుస్తకమునంధు ఎన్నో రసవత్తరమైనటు వంటి ఘట్టములు సుందర శైలిలో వర్ణిస్తూ రమణీయమైనటువంటి ప్రకృతి వొడిలోకి చదువరులను కొనిపోయి పునీతుల్నిగావిస్తూ శివసాన్నిధ్యాన్ని ఆనందదాయకంగా అనుభవింప జేసే విధంగా రూపొందించబడ్డది. కళ్ళకు కట్టినట్లుగా ఆకట్టుకున్నది. దీనిని చదివి భక్తవర్యులు పురుషార్థులు గాగలరు.

**పేజీలు : 100 వెల : 16-00**

## శ్రీ శివస్తోత్ర రత్నాకరము

కర్తూరి : బ్రహ్మ శ్రీ పాలావర్జుల శ్రీరామశర్మగారు

శ్రీ శివ, గణేశ, సుబ్రహ్మణ్య, వీరభద్ర మొదలగు దేవతలకు సంబంధించిన ఉపాసనా విధానములతో కూడిన స్తోత్ర రత్నములు అనేకములు ఇందు పొందుపరచినాము. అనేక సహస్ర నామములు అష్టోత్తర శతనామములు మొదలగు వానిని కూడా ఇందు పొందు పరచినాము. అనేక ధన, వ్యయ, ప్రయాసల కోర్చి ధార్మికాధ్యాత్మిక సాహిత్య సేవాతత్ప రతతో ఫలము కోరక లాభము నార్జింపవలెనను ఆశతోకాక కేవలము సేవా భావముతో ఈ శివస్తోత్ర రత్నాకమును ప్రచురించినాము. మొత్తము ఈ స్తోత్ర రత్నాకరమున 146 స్తోత్రములు కాక శివపరమైన యితర స్తోత్రములననేకములనిందు పొందు పరచియున్నాము. ఇప్పుడిప్పుడే ఈ గ్రంథము సర్వాంగ సుందరంగా వెలువడినది. ప్రతి స్తోత్ర పారాయణ ఫలితము కూడ ఇవ్వబడినది.

**క్యాలికో బైండు పేజీలు 475**

## శ్రీరుద్రాధ్యాయము

(నమకము, చమకము) స్వరయుక్తముగా, నమకమునందలి పదునొకండు అను వాక్యములను అందులోని ఋక్కులను యజుస్సులను విడదీసి మంత్ర, పదవాక్యములను పఠించుటకు సులువుగా నుండుటకు చేతనైనంతవరకు విభజించి, ప్రతి మంత్రమునకు ధ్యాన శ్లోకము. ఋషీ, దేవత, ఛందస్సు, సాయణాచార్య, భట్ట భాస్కర, అభినవ శంకర భాష్యములకు సంక్షిప్త తాత్పర్యము, నమక మంత్రములకు ప్రయోగ విధానములు తేటతెల్లము తెలుపనైనది. ఇది కాకను, నమకము, చమకము, 11 అనువాకములు పదవిభాగము చేసి స్వరయుక్తముగా నొకచోట నూతనముగా నేర్చుకునేవారి సౌకర్యమునకై ముద్రింప బడినవి. స్వరయుక్తముగా మంత్రము ఉచ్ఛారణ చేయలేని వారికొరకు రుద్రస్తుతి (నమకము) రుద్రమాతృకా మాలికాస్తుతి. మహాదేవ స్తోత్రము, శతరుద్రీయము శివ ప్రాతఃస్మరణ, శివ ద్వాదశనామ స్మరణ మొదలగునవి చేర్చనైనది. ఈ మాదిరిగా యింత వరకు తెలుగులో వెలువడలేదు.

**సుమారు 368 పేజీలు**

## శంకర భాష్య
## శ్రీవిష్ణు సహస్రనామము

శ్రీవిష్ణు సహస్రనామము ఆంధ్ర అనువాదంతో చదువరులకు చాలా తేలికగా అర్థమును తెలియపరిచే విధముగా ముద్రించబడినది. ఈ నామాల్లో శబ్దం, అర్థం, ఇమిడి యుంటాయి గావున ప్రతి మంత్ర నిర్మాణము మన యొక్క షట్చక్రాలపై మరియు సూక్ష్మ గ్రంథులుపై ఎంతగానో ఉంటుంది. అనారోగ్యం నుండి కాపాడుతుంది. ధైర్యాన్నీ, స్థైర్యాన్నీ అందిస్తుంది. (శ్రీ కృష్ణాష్టకము, శ్రీమహాలక్ష్మీష్టకము మరియు శ్రీమధురాష్టకముతో ముద్రించబడినది.

పేజీలు 256 వెల : 72=00

## ఛాందోగ్య కథా మంజూష

శంకర భగవత్పాదుల వారిచే రచించబడినటువంటి 108 ఉపనిషత్తులోనుంచి పది ఉపనిషత్తులను ముఖ్యముగా తీసుకొని ఈ ఛాందోగ్య కథా మంజూష ద్వారా, వెలుగులోకి తీసుకొనిరావాలని దీనిని ముద్రించడమైనది. ఇది సామవేదమునకు చెందిన ఉపనిషత్తు. యజ్ఞయాగముల నిర్వహణకై అవసరమైన సామవేదమును ఎక్కువగా గోదావరీ తీర బ్రాహ్మణులు అధ్యయనము చేస్తూ వుంటారు. ఈ వేదంలోని పూర్వభాగం ఇంద్రసూర్య వరుణకు బేరాది దేవతల స్థితి రూపముగా ఉంటుంది. ఉత్తరభాగము, ఋగ్వేద, యజుర్వేదుల వలెనె పరబ్రహ్మ స్వరూపమును బోధిస్తుంది. ఉద్దాలకుడు కుమారుడైన శ్వేతకేతునకు అనేక దృష్టాంతములతో బోధించెను. అనేక కష్టనష్టముల కోర్చి గురు శుశ్రూష చేసి పరిపక్వస్థితి తెల్సుకొన్నవాడై తానుగా బ్రహ్మస్వరూపుడని తెల్సుకొన్నాడు. అదియే ఆత్మసాక్షాత్కారం. ముముక్షువులు దీనినుపాసించి ముక్తిమార్గాన్ని అనుసరించి మోక్షాన్ని పొందగలరు. ఈ ఉపనిషత్తునందు గల విశేషమేమనగా బ్రహ్మసాక్షాత్కారమునకు ఉపకరించు మంత్రము కూడా గ్రంథాంతమున వ్రాయబడినది.

పేజీలు 80 వెల : 36=00

## శ్రీ దేవీ నవరాత్ర పూజాకల్పము

ప్రాంతములను బట్టి, అభిరుచులను బట్టి, గురు పరంపరల ననుసరించి దేవతా ప్రాధాన్యమును బట్టి పూజా విధానములలో ఎంతో వైవిధ్యము ఏర్పడుతుంది. తెలంగాణా ప్రాంతానికి సంబంధించినటువంటి శ్రీశ్రీశ్రీ చుంచనకోట భువనేశ్వరీమాతను పూజించే పద్ధతిని వివరిస్తూ విపులంగా రచించబడినది. భక్తులు ఆరాధనా సమయమునగానీ, నవరాత్రోత్సవ సమయమునగానీ నిత్యపారాయణ చేసిన శ్రీ భువనేశ్వరీ మాత యొక్క కరుణాకటాక్షములకు కృపాపాత్రులై సుఖమయమైన జీవితాన్ని కొనసాగించి కృతార్థులు కాగలరు.

పేజీలు 232 వెల : 100=00